# శాంతి

ప్రఖ్యాత విద్వత్కవిపోషకులు, మహాదాతలు- శ్రీ ఏకా ఆంజనేయులుగారి ధర్మపత్ని
12-1-'61 తేదీన కీర్తిశేషురాలైన శ్రీమతి ఆదిలక్ష్మమ్మగారి స్మృతిచిహ్నముగా వెలువడు
సాహిత్య సంకలన గ్రంథము

సంధాత

**భార్గవ విద్యాదేవ కులపతి**

నిర్మాత

**ఏకా ఆంజనేయులు**

ప్రథమ ముద్రణము
1000 ప్రతులు
సర్వస్వామ్యములు బండ్లమూడి హనుమాయమ్మ
హిందూబాలికా బహూళార్థసాధక పాఠశాలవి



వెల 25 రూపాయలు



వెల్‌కం ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్
బ్రాడీపేట, గుంటూరు — 2.



గ్రంథములకు :
ప్రధానోపాధ్యాయురాలు
బండ్లమూడి హనుమాయమ్మ హిందూబాలికా
బహూళార్థసాధక పాఠశాల
2/17 బ్రాడిపేట, గుంటూరు-2.

# శాంతి

నా భార్య
**ఆదిలక్ష్మమ్మ**
జ్ఞాపకార్థము
జననము : 1901
మరణము : 1961

ఇట్లు
ఏకా ఆంజనేయులు
గుంటూరు



ఫలములయెడ బ్రహ్మార్పణ
కలనపరుం డగుచు కార్యకర్మము నడుపన్
వలయున్ దత్వజ్ఞానము
దలకొనినన్ కర్మశమము తానై కలుగున్.

శాంతిపర్వము – మహాభారతము
తిక్కన



# కృతజ్ఞత

## ఏకా ఆంజనేయులు



"శాంతి" ఒక అధునాతన సాహిత్యసంకలనం. పద్యగద్యగేయాత్మక మైన రకరకాల రంగురంగుల రచనాప్రసూనాల కూర్చిన కదంబం.

అంతే కాదు. నాకు తోడునీడగా మసలి నా సుఖదుఃఖాలను చిరునవ్వుతో పంచుకొని బ్రతుకుబాటలో నన్ను ఒంటరిగా దిగవిడిచి దూరమైపోయిన నా సహధర్మచారిణి ఆత్మశాంతికోసం నేను సమర్పించే పుష్పాంజలి ఇది. ఆమె పావనస్మృతికి అంకితమైన ఈసంకలనం శాశ్వతమైన స్మారక చిహ్నంగా నిలవగలదని ఆశిస్తున్నాను. నిఖిల జగత్తులో అక్షర రమ్యమైన స్మృతిచిహ్నాలు ఖిలము కాకుండా నిలబడగల వని నా విశ్వాసం.

సాహిత్యామృతం జీవితంలోని వేదనలన్నిటినీ మాధురులుగా మార్చివేయగల మంత్రశక్తిసమన్వితం. రమణీయంగా ప్రియకాంత లాగా కర్తవ్యబోధ చేసి లోకాన్ని లాలించి పాలించగల శక్తి సాహిత్యం. మానవుడిమనస్సులోని చీకటిని పారద్రోలి, కన్నుల ముందు వెలుగుదారులు పరిచి ముందుకి కదిలించే మహితశక్తి విద్య. ఈఉత్తమ ప్రయోజనాన్నే సౌందర్యంద్వారా ఆనందం ద్వారా అనాదినుంచీ మన సాహిత్యం తన లక్ష్యంగా గ్రహించి కృషిచేస్తున్నది. లోకహితనిష్ఠతో, తమభావములను పావనంచేసుకుంటూ ఆం మోదం చేకూర్చిన మన పూర్వకవీశ్వరుల అడుగుజాడలని ఈనాటిరచయితలు అనుసరించాలి. సొంతలాభం కొంతమానుకుని పొరుగువాడికి తోడుపడటానికికావలసిన సానుభూతినీ, సమవేదననీ, కారుణ్యాన్నీ, హృదయాలలో వెల్లివిరిసేట్లు చేయటం సాహితీపరుల ఆశయం కావాలి. ఉత్తేజకరమైన ఉజ్జ్వలసందేశాన్ని రసమార్గంలో అందించగల సాహితీపరులు తాము తరించి ఇతరులను తరింపజేస్తారు. అటువంటి సాహితి ఉత్తరభారతంలో తులసీరామా

యణంలాగా ఆబాలగోపాలాన్నీ అలరిస్తూ నాలుకలమీద నాట్యమాడుతుంది. రచయిత ఆత్మ అనే తూణీరంలోంచి పదునైన బాణంలాగా దూసుకువచ్చి చదువరిగుండెల్లో నాటుకుపోయి లక్ష్యం సాధించగల సాహితి వేడిగా వాడిగా సూటిగా తేటగా నీటుగా రూపొందాలి. ఉన్నతశిఖరాలకోసం, ఉత్తమలక్ష్యాలకోసం అలసిపోని తెరువరియై తరలిపోతున్న నవమానవుని హృదయాన్ని ఆశతో, అంతిమవిజయంపట్ల స్థిరవిశ్వాసంతో స్పందింపజేయగల కళ్యాణకాహళిం.

మా అభ్యర్థనలని మన్నించి తమ అమూల్య పద్య, వ్యాస, గేయ, విమర్శనాది రచనలు పంపిన రచయితలందరికీ కృతజ్ఞతా పూర్వక వందనాలు సమర్పిస్తున్నాను. రచయితల ఉదారమైన సహకారం వల్లనే ఈసంకలనం సమగ్రస్వరూపం ధరించకలిగింది. వీరి సహాయాన్ని నేను ఎన్నటికీ మరువలేను.

అనారోగ్యంతో బాధపడుతూ బహువిధకార్యకలాపనిమగ్నుడనై వున్న నేను ఇంతవిపులమైన సంకలనాన్ని ఎల్లా వెలువరించగలిగాను? భార్గవ విద్యాదేవ కులపతి (శ్రీ) పి. వి. యల్. వి. ప్రసాదరావుగారి నిర్విరామ నిస్వార్థ కృషివిశేషంవల్లనే నావ్యథితహృదయంలో మెదలిన సంకల్పానికి స్వరూపం ఏర్పడింది. ఈసంపుటికి రచనలు సేకరించి, సంపాదకత్వం వహించి రూపురేఖలు తీర్చిదిద్దిన ప్రసాదరావుగారిని అభినందిస్తున్నాను.

"శాంతి" ఆంధ్రసాహిత్యప్రియుల ఆదరాభిమానాలు సంపాదించుకోగలదని సహృదయులకు ఆనందం చేకూర్చగలదని ఆశిస్తున్నాను.

ఈసంకలనంవల్ల వచ్చే విక్రయధనాన్నీ బండ్లమూడి హనుమాయమ్మగారి హిందూబాలికా బహుళార్థసాధక పాఠశాలకు సమర్పిస్తున్నాను. సరస్వతీమూర్తులై విలసిల్లవలసిన స్త్రీలు విద్యారంగంలో ఇంకా పురోగమించవలెనని, విద్యావతియైన వనిత గృహిణిగా జననిగా జాతిని మహోజ్జ్వలంగా రూపొందించగలదనీ విశ్వసిస్తూ, ఆశిస్తూ, ఈసంకలన సర్వస్వామ్యాలను కూడా స్త్రీవిద్యాభివృద్ధికి సేవచేస్తున్న ఆసంస్థకు నివేదిస్తున్నాను.

# సంపాదకీయం

## భార్గవ విద్యాదేవ కులపతి



మానవజీవితం ఒక విచిత్రభావనానిలయం. నిరంతరసంఘర్షణాత్మకమైన మనోగగనంలో అప్పుడప్పుడు ప్రసన్నతారకాసముదయసమున్మీలనం ఒక వినూత్నోత్సాహాన్ని వహింపచేస్తూండటం ఒక సృష్టివైచిత్రి. ఎప్పుడూ చల్లచల్లని చంద్రికలే ఉండవు. లేక భీష్మగ్రీష్మాదిత్యప్రతాపమే నిలువదు. ప్రకృతి మనుష్యజాగృతికి ప్రతీక. సుఖదుఃఖసమ్మేళనం జీవితం. ప్రపంచం కేవలం దుఃఖమయమని నే ననను; నేను విశ్వసింపను. జీవికి విశ్వాసం ఉపజీవిక. అది ఒక మార్గలక్షితుణ్ణి చేయడానికి ఉపయోగించే ఒక దీపకళిక. చీకటి తెన్నులలో పయనించే పథికుడు వెన్నెలవెలుగును వాంఛించటం తప్పు గాదు. కాని లోకంలో తప్పు కానంత మాత్రాన అవసరమైనదల్లా లభించదు. మానవవాంఛకు పరిమితి లేకపోవచ్చు. కాని మానవానుభవానికి పరిమితి ఉంది. మానవుడు ఆశాజీవి. ఆశ లేకపోతే జీవితం ఎందుకు? అంతంలేని ఆశ...అదే కోరిక—బ్రతుకును నిలబెట్టే ఒక కాంతికిరణం—క్రాంతివరణం. ఆశనిరాశలలో—సుఖదుఃఖాలలో ప్రాణికి ధన్యతనిచ్చేది, దీప్తినిచ్చేది నైశ్చల్యం. ఈపదంలో ఒక వింత వెలుగున్నది. ఆ వెలుగు ఒక విశిష్టశక్తికి సంకేతం. లోకంలో కనిపించే ఒక వస్తువుకు బాహ్యారూపం వేరు, అంతస్సంకేతం వేరుగా కొన్ని సారు లుండటం తటస్థిస్తుంది. ఆసంకేతితనైశ్చల్యపరమభావమే శాంతి. తదుదీరితమహాశ్శోభాసమున్మేషకైవల్యానైర్మల్యమే శాంతి.

లోకంలో శాంతి లేదు. ఉన్నది. మానవులు తమమనస్సులకు శాంతి లేక పోవటాన్ని జగత్తునకు శాంతి లేదనుటగా వర్ణిస్తారు; భావిస్తారు. ఆ అనుభావంలో ఒక రమణీయత ఒక సంతృప్తి ఉన్నవి. ప్రకృతికిని శాంతిలేకపోవటం లేకపోలేదు. భూతపంచకవిజృంభణం చేత అశాంతివిజృంభణం చెలరేగుతుంది. సంరంభసమారంభప్రకృతిప్రభావం ప్రాణికోటిహృదయకవాటపాటనం. ఆప్రకృతి ద్వైవీస్వరూపం. నిష్కారణంగా నిష్కరుణం గాదు.

వాంఛాబద్ధుడైన మానవుడు దాన్ని తీర్చుకోవటానికి ప్రయత్నిస్తాడు. తన సహజశారీరకమానసికశక్తులను సమస్తాన్ని వినియోగిస్తాడు. అప్పటికీ సాధ్యం కాదో ఘోరతపస్సుకు పూనుతాడు. ఏది దుష్కరమో సుప్రాపమో—ఏది దుస్తరమో దుర్గమమో అదంతా తపస్సువల్ల సాధింపవచ్చు. తపస్వి తాను తపించి ప్రకృతిని తపింప జేస్తాడు. ఒక వ్యక్తి తపిస్తే

ఆతాపం ఆఒక్క వ్యక్తికి చెందటంతో నిలువదు. తన చుట్టూ తపింప జేసుంది. అనంత జగత్తును సంక్షోభింప జేస్తుంది. అప్పుడు వాని కోరిక తీర్చక తప్పదు. ఇంత జేసి అతడు సాధించింది తన కోరిక తీరటం ద్వారా మనశ్శాంతి. దానిచే ప్రపంచముకూడ శాంతిని పొందుతుంది. కొందరు కోరికలు తీరటం వల్ల శాంతిని పొందుతారు. మరి కొంతమంది కోరికలను జయించటం వల్ల శాంతినిపొందుతారు. ఇంత ఆలోచిస్తే తేలింది ఇది. అవ్యక్తపరిస్ఫురణశబలవృత్తి గల శాంతి ఒక చేతనక్రాంతి. అది ప్రాణి ఎట్టి స్థితిలోనూ వాంఛించేది. పరమమహర్షి భావాంతరసంయమనస్వభావపరిపక్వవివేకవిభూతిరమ్యమైన శాంతిజీవితగమ్యం. కేవలతర్కానభిగమ్యమైన చిచ్ఛక్తిపై పరిశోధనాసక్తిగల తాత్త్వికపాంథుని మనః ప్రబుద్ధమైన ఒక సత్యజ్యోతిర్లేఖ అది. శోకశ్లోకమహోదయసంభావనాపులకితహృదయమహత్వమహితకవిత్వశ్లోకులైన వాల్మీకులూ, పరమసంవిదేకాయనులైన కృష్ణద్వైపాయనులూ, గీతాచార్యకత్వరోచిష్ణులైన శ్రీకృష్ణులూ, ప్రాచీనార్వాచీనదర్శనానుభవులైన కవులూ, సాధించింది, బోధించిందీ, యీపవిత్రసత్యస్వరూప సత్యాన్నే— ప్రవృత్తినివృత్తిభేదసంభుగ్నతత్వకందళితప్రేమవరివస్యాలాలసహృదయోల్లాసలక్షణమైనవీక్షణము క్షణంలో సంధుక్షణం చేసే నైపుణ్యమూ, పుణ్యమూ ఆ సాత్వికశ్రీ కున్నవి. ఆ శ్రీరూపమైన శాంతిని సాధించటానికి సాహిత్య మొక సాధనం. సకలావకాశసమన్వితుడై సార్వభౌముడైన యువకుడు అనుభవించే సుఖావధి యైన మానవానందానికి పది లక్షల కోట్ల కోట్ల రెట్లు ఎక్కువైన బ్రహ్మానందానికి సహోదరమైన రసానందాన్ని సాహిత్యం అందిస్తే ఆసాహిత్యంలో పరాపశ్యంతీమధ్యమావైఖరీవర్ణసరణిప్రవర్తితవాగ్దేవీరహస్యతత్వక్రాంతి—శాంతి. శాంతి—వచోభావనము, అవచోజీవనము. శాంతిమనోరాగము, అమనస్కయోగము. శాంతి—జీవితసాక్ష్యము, అజీవితలక్ష్యము; శక్తివినయం, ప్రణవప్రణయం అయినది శాంతి. అది మహాసౌందర్యం, అది భావదేవత, నీలాంబరాలలో అందాలరాశి, బహుకాలాలలో బహుజను లనుభవించినా తరగని యౌవనం పవిత్రతా ఉన్న సీమంతినీరత్నం. తత్కరుణాకటాక్షవీక్షాంచలం సోకితే చాలు సర్వసర్వంసహాసార్వభౌమపదవి లభించిన దాని కన్న అధికం. తదీయదరహాసచంద్రికాప్రసారం ఒక్కింత సమీపిస్తే చాలు, జీవితమే ఆనాటితో ధన్యత్వాన్ని పొందుతుంది. ఆ భావన ఆ నివేదన, ఆ చిత్రచిత్రణ. ఆ ఊహ; ఆ తపస్సు ఆ దేవత, అదే శాంతి.

* * *

శాశ్వతత్వం కోసం ఒక వ్యక్తి మహాభవనం నిర్మిస్తాడు. మరొక మనీషి మహావనం సృష్టిస్తాడు. మరోకాల విజేత కవనం నిర్మిస్తాడు. దేవాలయాలు, మహా భవనాలు, విచిత్రభౌతికనిర్మాణాలు కాలగర్భంలో కలిసి పోవచ్చు. కవిత కాలానికి ఎదురీదుతుంది. అందుకే కాలప్రభావాన్ని గుర్తించిన మహాచక్రవర్తులు కవిపోషకులైనారు. కవులతో పాటు వారున్నూ శాశ్వతత్వాన్ని సంపాదించుకున్నారు. అట్టి వారిలో

అధునాతనుల్లో గుంటూరుపట్టణసంవాసి శ్రీ ఏకా ఆంజనేయులుగారొకరు. రసహృదయులూ, కవితాప్రియులూ అయిన వారిదానస్రవంతిలో స్నానమాడని ఆంధ్రకవులు లేరంటే అది స్వభావోక్తి. బహుళగ్రంథముద్రణ, బహుళకవి సమ్మానకరణ, బహుళవితరణ సహజగుణమైన శ్రీఆంజనేయులుగారు ఇతరులు ఊహింపలేని అనేకసత్కార్యములు చేసి చూపి ఒక ఆదర్శప్రాయమైన జీవితాన్ని గడపటం ఇప్పటి మన కళ్ళ ముందు కనిపించే దృశ్యం. లోకోపకారదృష్టి, ధార్మిక చింతకల్గిన వీరి హృదయసంస్కృతి ఫలితంగా ఈసీమలో అనేకసత్కార్యాలు జరిగినవి.

దాదాపు డెబ్బై యేండ్ల ప్రాయంలో దుర్భరానారోగ్యపరిస్థితిలో ఈనాడు వీరికి భార్యావియోగం తటస్థించింది. వారి జీవితానికి అర్ధాంగి సహధర్మచారిణి అనే పదాల కర్థంగానూ, అర్థుల కమృతాన్నప్రదాత్రియైన అన్నపూర్ణగానూ వర్తించిన ఆపరమపవిత్రమూర్తికి నిత్యప్రసన్నగా కర్తవ్యనిష్ఠురాలిగా మెలిగిన పుణ్యశీలకు దుర్వారరోగవ్యథలోనూ, జీవబ్రహ్మ సత్యస్వరూపసంధానభావాన్ని మరువని వైరాగ్యసంపన్నురాలికి శ్రీమతి ఆదిలక్ష్మీదేవికి స్మృతిచిహ్నంగా ఈసాహిత్య సంకలనం భావించబడింది. హృదయేశ్వరీసంస్మృతిశాశ్వతత్వవిరచనాభావులైన శ్రీఆంజనేయులుగారి సంకల్పస్వరూపమే యీశాంతి. కీర్తిశేషురాలైన వారి సతీమణికి చిహ్నితపరమలోకవిశ్రాంతి. దుర్వారబాధాతప్తులైన వారి హృదయములకు ఒక అపగతక్లాంతి, నవ్యదివ్యభావనాక్రాంతి. సాహిత్యలోకానికి ఒక వినూత్నవిద్యుత్కాంతి. ఈశాంతి సౌమనసప్రశాంతి.

  

శ్రీ ఆంజనేయులుగారి వ్యక్తిత్వం చాలవిశిష్టమైంది. కొంత చిత్రమైందిన్నీ. ఆయనతో సంభాషణ ఒక విజ్ఞానప్రదాయకమైన గ్రంథాన్ని పఠించటం కన్నా ఎన్నో రెట్లు అధికఫలాన్నిస్తుంది; బహువిషయాలపై వారికున్న సూక్ష్మపరిజ్ఞానం మహాశ్చర్యకరమైంది. పండితులని చెప్పుకొని భావింపని పండితుడా మనీషిశేఖరుడు. మానవమనస్తత్వపరిశీలనంలో ఆయనతో సరి వచ్చేవారు చాల అరుదు. లోకంలో అధికారదర్పితులుకాని వారు నూటికి కోటికి ఎక్కడో ఉంటారు. ఆఎక్కడో ఉంటారు అని చెప్పుకొనే వ్యక్తుల్లో విశిష్టతముణ్ణిగా వారిని నేను దర్శించాను. పలువురున్నూ భావించారు. ధనంవల్ల వినయాన్ని మరువని విజ్ఞానిశేఖరుడు, హృదయతత్వపరిశీలకుడు ఆప్రసన్నభావుకుడు. లోకంలో దాతలు అనేకులున్నారు. కాని వాళ్ళు చేసిందానికన్న వాంఛించే ప్రచారం అధికం. మామూలుగా సన్మానాలనేవి చేయబడ్డప్పుడు కళాకారులు సభాముఖాన పొందే ధనానికంటే చాలఎక్కువ రహస్యంగా గుప్తంగా అనేకులు వారి దగ్గరకు వచ్చి మూయబడ్డ కవర్లు పరిగ్రహించి తర్వాత విప్పి చూచుకొని తమకు తామే ఆశ్చర్యచకితులైన ఘట్టాలున్నూ నే నెరుగకపోలేదు. ఈవిధమైన నిరాడంబరప్రవర్తన సామాన్యుల మార్గం కాదు;

ఈసంకలనగ్రంథం ఇట్లా ప్రకటించబడాలని నిశ్చయించి నపుడు కూడా వారి వైఖరి నాకు ఒక పరమమైన అనుభూతిని కలిగించింది. పుస్తకాని కిన్నిపుట లుండాలని గాని, ఇంత వ్యయ మని గాని భావించలేదు. సర్వం నిర్వహించటానికి నాకధికారమిచ్చి నేను కేవలం ఎంతధనం కావాలంటే అంత ఇవ్వటమే తమ అభీష్టమని వారన్నారు. అట్లే జరిగింది కూడా. కాని ఒక్క నియమం మాత్రం ఉంచారు. గ్రంథం మొత్తం మీద వారిని గూర్చిగాని వారి అర్ధాంగినిగూర్చి గాని, ఒక్క వాక్యమూ ఉండరాదు. ఈనియమం పాటించటంకోసం కొందరి రచనలు కాదనవలసి వచ్చింది. కాని యీవిషయంలో మాత్రం వారి పట్టుదల రవ్వంత కూడా సడలలేదు. వారి అభి ప్రాయ మిది. తమను గూర్చి బహుకవులు వ్రాస్తే దానివల్ల తమకు తమ అభిమానులకూ కొంత ఆనందం కలుగవచ్చు, కొంత సంతృప్తి రావచ్చు, కాని మహాజనులకు ఒక వ్యక్తినిగూర్చిన రచన లందు ఇష్టం లేక పోవచ్చు. సార్వజనీనమైన సార్వకాలికమైన ఒక సాహిత్యనిర్మాణం కావాలి గాని తాత్కాలికప్రయోజనం అనవసరం. దానికై తమదంపతులగూర్చి ఒక్కరచనా ఒక్క వాక్యం కడకొకమాటైనా ఉండరాదట. అహో! ఇది ఎక్కడి ఆలోచనాపద్ధతి! ఇది ఏమి ఊహ! ఈరీతిగా భావించే వారు లోకంలో ఎంతమంది? నాహృదయం పరమపూజ్యభావంతో పులకిత మైంది. అంతతో ఆగలేదు. వారి దంపతులలో ఏ ఒక్కరి ఛాయాచిత్రాన్ని ప్రచురించటానికి అంగీకరించ లేదు.

ఈవిధమైన నడవడి ఒక మహనీయతకు చిహ్నమని నాదృఢమైన విశ్వాసం. వారిని గూర్చి ఎవరైనా స్వభావోక్తులు తమ కావ్యాలలోనో మరోస్థలంలోనో పలికితే అవి అతిశయో క్తులుగా భావించే ప్రవృత్తి వారిది. తన పనికై ఇతరులను యాచించటం ఎప్పుడూ లేదు గాని ఇతరుల పనులకై సత్కార్యనిర్వహణాలకై భిక్షమెత్తి వాటిని మహోద్భుతంగా లోకోపయోగ కరాలుగా చేసిన స్వార్థరహితజీవి శ్రీ ఆంజనేయులుగారు. యాభై సంవత్సరాల నుండీ విరామం లేకుండా రోజుకు పదహారుగంటలు పనిచేసిన ఇప్పటికీ చేస్తున్న కష్టసహిష్ణువు వారు. వారికి తిక్కన కవిత్వం అంటే చాలా యిష్టం. భారతంలో ఆయాపాత్రలను తిక్కన ఎట్లా చిత్రించాడో అప్పుడప్పుడు ఉదాహరణపూర్వకంగా సంభాషిస్తూ ఆరమణీయరచనకు కమనీయకవితకు ఆనందంతో తన్మయులై జగత్పూజ్యుడైన ఆమహాకవికి చేతులు జోడిస్తుంటారు వారు. ఈగ్రంథారంభంలో శాంతిసంభావనాత్మకమైన తిక్కన పద్యం శాంతిపర్వం లోనిది వారి సూచన మేరకే ప్రథమంలో సంభావించటం జరిగింది. తాత్త్వికమైన జ్ఞానదృష్టితో ఫలముల యెడ బ్రహ్మార్పణపరులై తమ కర్తవ్యాన్ని నెరవేర్చే కర్మయోగి—వారు.

  

అట్టి శ్రీ ఆంజనేయులుగారి భావనతో ఈనాడు ఆంధ్రదేశంలోని జీవత్కవుల రచనలు సేకరించి యీసంకలనం నిర్మించబడ్డది. దీనికి ఒక పరిమితిని ఊహించలేదు. వీలైనంత మంది రచ

యితలను ఒక చోట కూర్చటం విభిన్నసాహిత్యసంవిధానాలను ప్రజల కందించటం ఉద్దేశ్యం. ఉద్దేశాలు ఆదర్శాలూ ఎప్పుడూ గొప్పవిగానే ఉంటవి. వాటిని ఆచరణలోనికి తీసుకురావటంలో కొన్ని ఆటంకాలు జరుగవచ్చు, కొన్ని లోపా లనదగ్గవి కన్పడవచ్చు, మానవుడు అసంపూర్ణుడు అతని పనులు అసంపూర్ణాలు. ఈమహాగ్రంథం సర్వసంపూర్ణమని నేనను. సంపూర్ణంగా అసం పూర్ణం అనటానికి అంగీకరించలేను. గుణాగుణనిర్ణయం విజ్ఞులది. నా కందినంత వరకు ఆంధ్ర సాహితీనిర్మాతల జీవన్మూర్తుల రచనాస్ఫూర్తులను పరిగ్రహించటానికి ప్రయత్నించాను. పుష్ప ములు ఇచ్చేదొకరు, మాల గుచ్చే దొకరు, ధరించే వారు వేరొకరు. నేను కేవలం మాలా కారుణ్ణి. ముద్రణవ్యయమంతా శ్రీ ఆంజనేయులుగారిది. రచనలన్నీ రచయితలవి. ఈపుస్తకాల వల్ల వచ్చే క్రయధనమంతా స్త్రీవిద్యాభివృద్ధికోసం గుంటూరులోని బండ్లమూడి హనుమాయమ్మ బహుళార్థసాధకపాఠశాలకు ఇవ్వబడుతుంది. సర్వస్వామ్యములూ ఆసంస్థవే—(ఈవిద్యాలయాభి వృద్ధికై అలనాటి మాలవ్యా పండితునివలె శ్రీ ఆంజనేయులుగారు ధూమపత్రవర్తకులనుండి లక్ష రూప్యములుపైగా సేకరించి మహాభవనం కట్టించారు).

ఇక నేను సంపాదక సామాన్యుణ్ణి. నిజమైన లోపాలను లోపాలు కాదనే అహంకారం నాకు లేదు. ఏమైనా ఉంటే ఉండవచ్చు. సహృదయులు మంచినే గ్రహిస్తారు, అసహృదయుల వాక్కులు లెక్కించ వలసినవి కావు. ఈనిర్వహణలో అనేకు లనేకరీతుల నాకు తోడ్పడ్డవాళ్ళు ఉన్నారు. వారందరికి నాకృతజ్ఞతాభివందనాలు. ప్రధానంగా ఎంతో అభిమానంతో తమ రచన లను పంపిన రచయిత లందరికి నా నమస్సులు. విజ్ఞులకు విధేయుడనైన నేను ఈ'శాంతి'ని వారి కరకమలాలకు—హృదయకమలాలకు అందిస్తున్నాను.

శాంతి స్సాహిత్యవిక్రాంతిః కాంతి స్సాహిత్యచేతనా
రసికైః కవితాభిజ్ఞై ర్గృహణీయా వినూతనా

సౌందర్యభావితా మూర్తిః స్ఫూర్తి స్సౌజన్యజీవితా
ఇయం కృతి రసామాన్యా మాన్యా ధన్యై ర్మహాబుధైః

విశిష్టరససిద్ధాంతా నవసౌమనసాకృతిః
ఆధ్యాత్మికసమున్మేషా సత్యతాత్వికచింతనా

ప్రాచీనసంప్రదాయజ్ఞై ర్నవనాగరకై రపి
సదా భావ్యా సదా సేవ్యా భవ్యా సర్వత్ర పత్రికా

వినిర్మిత మిదం కావ్యం బహుకర్తృక మద్భుతం
విద్యాదేవకులేంద్రేణ భార్గవేణ తపస్వినా

సర్వాంగసౌందర్యసమన్వితస్య శాంతీతి నామ్నా సముదంచితస్య
గ్రంథస్య సాహిత్యసమున్నతస్య సంపాదక స్సత్వయుతః కులేంద్రః.

* *

సతియు అర్ధాంగి సహధర్మచారిణి యయి, జీవితమ్మెల్ల తన పాదసేవలోన
గడపి స్వర్గస్థురాలైన కాంతయందు, నిర్మలప్రేమతో ఆంజనేయబుధుడు.

భార్యాస్మృతిచిహ్నముగా ఆర్యజన మ్మెల్ల మెచ్చునట్టి మహాత్వాం
తర్యమున సుకవితాస కార్యమహాదీక్ష నిటులు తన తల దాల్చెన్.

ఆ మహాదీక్షలో ఆ మహాతపస్సు
లో వెలుంగ గందినది యీ తెలుంగు నేల
దాని ఫలితమె యీ మహాగ్రంథమ్ములోని
కవుల రచనలు శాంతి సంకలన మయ్యె.

సిరి గల వాడు దానమున చిత్తము గల్గిన వాడు పండితా
దరణము గల్గువాడు కవితాగుణమున్ గ్రహియించు శేముషీ
స్ఫురణము వెల్గువా డిపుడు పుట్టెడు దుఃఖముతో కులాంగనా
పరమవియోగభారమును వార్ధకమందు భరించు నెట్టులో.

మాధవుని సేవ కంటెను మనుజసేవ గొప్పదిగ నెంచి కృషి సేయు కోవిదుండు
విధురుడైనాడు నేడహా! వృద్ధవీరు డాతడిక దుఃఖవిస్మృతి నందుగాక!

ఈమహాగ్రంథనిర్మాణహేతువైన ఆమహాసాధ్వి ధన్యురా లగుట నిజము
అంతకును మూలమైన శ్రీఆంజనేయ బుధవరుడు మానసిక శాంతి పొందుగాక!

భౌతికశరీరమును వీడి పరమమైన లోకములలో వెలుంగు సుశ్లోకురాలు
ఆదిలక్ష్మీసతీమణి అమృతమూర్తి కవిరతంబైన శాంతి పెంపందుగాక!

# వి షయ సూ చి క

శాం

శాం

శాం

# భారతీస్తుతి

## శ్రీ కాశీ కృష్ణాచార్య



శ్రీమ ద్భారతి! దేవి! తావకపదాంభోజప్రసూనాసవ
స్రోతఃపూతజగత్త్రయే నిజపదన్యాసై ర్విలాసైః పురా
నర్తం నర్త మహో మహోన్నతిజుషా మార్యాభిధానాం ముఖే
ష్వస్మానద్య విహాయ కాం దిశ మితో యాతాసి మాత ర్వద.

దేవి! శ్రీచతురాననాననచతుశ్శాలాంతసంచారిణి
త్రైలోక్యార్చితపాదపద్మయుగళే! గీర్వాణవాణీశ్వరి!
ప్రాచీనం వరదే! మహోన్నతపదం స్మృత్వా తవార్వాక్తనం
దౌర్గత్యం చ నిరీక్ష్య భిన్నహృదయం ఖిద్యే ఽనవద్యే! న్వహం.

మూర్ఖాః పండితమానినః ప్రబలవిద్వద్ద్వేషిణో నిస్త్రపా
దంభాచారపరాయణాః కతిపయాన్ శబ్దా నపార్థాన్ గృహే
జల్పంతః పురుషోత్తమా నిజవచఃపాశై ర్నృపాలాభిధాన్
బధ్నంతో హరిణాం శ్చరంతి జనని! త్వద్వృత్తివిధ్వంసినః.

అంబ' త్వం కవివీరసూ రితి తత శ్చాశావకాశోల్లస
త్కాశాకాశఝరీ సహోదరయశోరాశిః పురా ఽఽసీరితి
శ్రుత్వా త్వాం మృగయే ఽద్య తావకపదాబ్జాతాతిపూతామృత
స్రోతః పాతుమనాః న వేద్మి గహనే క్వాసీతి హే శారదే!

'అంబ! త్వం క్వ గతాసి మాం క్షుధిత మత్రోత్సృజ్య? కోష్ణం పయః
కిం మే యచ్ఛసివా నవా వద? నచే త్త్రాతాఽయ మాత స్బవే'
ఇ త్యవ్యక్తమనోహరం సముదితం గీర్వాణవాణీమయం
బాలార్తార్భకభాషితం కిము పునః శ్రోష్యా మ్యముష్యాం జనే.

# కవిత

పొలుపులు గుల్కు లేముగుద మొల్కచనుంగవవోలెఁ గుల్కు బె
ళ్కులు గల మేలికైతముఁ దెలుంగునఁ బల్కెడు కల్కి చిల్కప
ల్కులవలె వీనుదోయికిఁ దగుల్కొనగావలెఁ జూలు గోల ము
ద్దుల నునుచెక్కుటద్దముల తోరపులొద్దుగ పూతరంగు ని
గ్గులపస రెమ్మెవాల్గనుల కోపునఁ దారసిలన్ వలెన్ మదిన్
దలఁచిన తుంటవింటి సరదారుని సేతల సోలియాడు ని
మ్ముల చెలికావిమోవివలె ముచ్చటగావలెఁ బంటనంటినన్
వలపులనీను కప్రపుటనంటులబోదెల చాటుచాటునన్
దొలిపొలయల్క మోముపయిఁ దోఁపఁగఁ జూపులవాడితూపులన్
జిలికెడు కుల్కులాడి జిగిఁజిల్కు హొయల్ వెలిజాజు పైటలో
పల వలఁ జిక్కు జక్కవకవన్ బురుడించెడు దబ్బగుబ్బయు
బ్బుల వెలయింపఁగా వలయుఁ బొమ్మ తెలుంగున కైత లిమ్మగన్
విలసదమర్త్యవాఙ్మయకవిత్వము నాన్ భుజగేంద్రభూషణో
జ్జ్వలమణిరుగ్జటాపటలసంవిలుఠద్దివిషత్తరంగిణీ
చలదురువీచికానికరశబ్దధణంధణధంధణార్భటీ
కలన నొసంగఁగావలె నొకానొక యప్పుడు పద్మసంభవ
ప్రళయమహార్ణవోత్పతదభంగురభంగమృదంగనాద సం
కలితకృతాంతరాట్చరణఘాతదళద్ద్రుహిణాండనిస్సరత్
పెళపెళసాధ్వసధ్వనుల బింకము నొక్కయెడన్ ముహుర్ముహు
ర్గలదరవిందబృందమకరందనిరంకుశపానమత్తతుం
దిలితమిళిందఝుంకృతిగతిన్ మఱియొక్కెడ నింక నొక్కెడన్
లలితసరస్వతీచరణలాస్యచలన్నవశింజినీఝుళం
ఝుళులపసందుఁ జూపవలె ఝల్లున రాలెడు పూలతేనెవా
నల నలరారు మాధురిఁ గన న్బరుపన్ వలెఁ గొన్ని వేళలన్.

## వృత్తాంతము

అనవద్యవిద్యాలతాలవాల మనంగఁ
బరగు గుంటూరు కాపురము మాకు
అఖిలసత్కళలు మా కంగముల్ సహతర్క
వేదాంతమభిమానవిద్య మాకు
ధరణినుత్తమధరాధవు లెల్ల మాయింటి
పట మొల్చిన వేల్పుఁజెట్టు మాకు
మహితసద్విద్యాభిమాని యా శ్రీవాజి
వక్త్రిం డభీష్టదైవమ్ము మాకు
అనుపమాష్టావధానశతావధాన
లేఖినీశతపద్యవిలేఖనములు
భాగ్యములు మాకుఁ గాశి మాభవన మగుట
నవని నలరారుఁ గాశి కృష్ణాఖ్య మాకు.

## ఆంధ్రవ్యాసుడు - తిక్కన

భారతాగమదేవగోరుహమ్మును నాంధ్ర
భారతిఁ బెంచె నేధీరవరుఁడు
తనపదాంబుజరజంబున గర్తపురిని బా
వనతనొందించె నే భవ్యకీర్తి
తనజననంబుచేతను గొండపాటూరు
నకుఁ బేరుదెచ్చె నే సుకవిరాజు
తనకవిత్వము వ్రాసికొనుచు నెల్లూరుప
త్తనము భూషించె నే ధన్యమూర్తి
అతని నామంబు సర్వపాపాపహంబు
గాన నాతిక్కనార్యు సత్కవిని సతము
నాత్మలో నిల్పి తచ్చరణాబ్జయుగళి
మ్రొక్కవలెఁ జుండు మన యాంధ్రపూరుషుండు.

## గీర్వాణ భాషామతల్లి

వేదవేదాంగాదివివిధవిద్యాకోశ
రాశి కేతల్లి వజ్రాలవల్లి
వాల్మీకిముఖకవీశ్వరయశఃకుసుమాళిఁ
గల్పింప నేతల్లి కల్పవల్లి
ఆంధ్రభాషాయోష నల్లారుముద్దుగాఁ
గడుపార నేతల్లి కన్నతల్లి
బహువిధాలంకారపదరత్నముఖవస్తు
పాళికే తల్లి పెన్ పాలవెల్లి
లలితకళలను కనుగొన్న లబ్ధవర్ణ
అఖిలపురుషార్థము లొసఁగు నన్నపూర్ణ
అనగ నేతల్లి జగతిఁ బ్రఖ్యాతిఁ గాంచె
నట్టి సురవాణి నే మది నభినుతింతు.

## బాలబోధ

కామాదు లనుపట్టి కలముచే నేపిచ్చి
గీ నెఱుంగని బ్లాంకుషీటులార!
పరవంచనాది దుర్భావంబులను పాడు
కలుపెఱుంగని పంటపొలములార!
సకలవిద్యాంకురసమితిఁ బెంచఁగఁ జాల
ననువైన యుద్యానవనములార!
ఒకచెంపఁ గొట్టఁ బా లొకచెంపఁ గొట్ట నీ
ర్గారుచుండెడు నిర్వికారులార!
పల్కుపల్కున ముద్దుల జిల్క నిక్క
పటుతఁ జూపించుఁ బబ్లికుపటములార!
మాతృభాషాసమాజక్షమారుహమ్ము
పెంచికొని పెద్ద నొనరించి పెంపుఁగనుఁడు.

# అనువాదములు†

భూతలనాథు డాదియుగభూషణ మేగ గుణోత్తరుండు మాం
ధాతయు; రావణాంతకుడు; ధర్మతనూభవముఖ్యు లైన ధా
త్రీతలనాథు లెల్లఁ గడతేఱిరి; యొక్కనితోడ నేని నీ
క్ష్మాతల మేగలే దిది నిజం బిక నీ వెనువెంట వచ్చెడిన్.

పుట్టువు కుండ నిల్లడవి భోజనమన్ననొ కందమూలముల్
గట్టెడుబట్ట భూర్జము మృగంబులు చుట్టము లిట్టి వాని చేఁ
బట్టె సముద్రమంతయు గుబాలునఁ ద్రావెను గార్యసిద్ధిక
న్పట్టును సత్తచేతఁ గరణమ్ములఁగా దది గొప్పవారికిన్.

వేసవివేవెలుంగుదొర వేడిమి మాడి పిపాస నొంది నీ
కోసము చాతక మ్మెపుడుఁ గోరుచు నెట్టులొ దీర్ఘదీర్ఘ మా
వాసరజాలముల్ గడపె వచ్చితి వీవును నూత్నశంబర
గ్రాసద! దప్పివాపు వడిరాలను నువ్వాకు వానకోయిలన్.

*

చెరిసగ మంబికాపతిని శ్రీపతి పార్వతియున్ హరింపఁగా
హరుని యభావ మట్లు జగమందునఁ గల్గఁగ- గంగ యబ్ధి నం
బరముఁ గలాధిపుండు ఫణిభర్త యధోభువనమ్ము నిన్నధీ
శ్వర! సకలజ్ఞతల్, నను గపాలము బిచ్చము చేరె భూవరా!

పరిమళమ్మున గేదంగి ప్రబలియున్నఁ
దొలఁగు మళిరాజ! దానికి దూరముగను
లేదు మధులాభ మచ్చట లేశ మైన
మీదుమిక్కిలి నీమేన బూది నిండు.

† అవధానములం గావించిన శ్లోకాంధ్రానువాదములలోఁ గొన్ని.

# భ్రమరగీతి

శ్రీ పింగళి లక్ష్మీకాంతం



పండ్లరుచులును బూవుల పరిమళములు
తెలియఁగలవార లెందరో కలరుగాక
పూవుఁదేనెల తీపిని బోల్చిచూడ
దక్షు లెవ్వార లొక మిళిందమ్ముగాక.

వికచనళినీమనోరథప్రియతముండు
కుముదినీకేళిలోలుఁ డీభ్రమరరాజు
కాలవశమునఁ బరదేశగతి లభించి
అడవిమల్లెల తేనెకై యాససేయు.

తీపు లూరంగ మాధ్వీక మాస్వాదించి కైపుగొంటివి మధూకమ్మునందు
వికసితదళగళన్మకరందమునఁ జొక్కి శయనించితివి సరోజమునయందు
ప్రసవగుళుచ్ఛసౌరభవాహినీనిమజ్జనము సల్పితివి రసాలమందు
మృదుతరావయవపరిష్వంగపారవశ్యమ్ము నొందితివి వాసంతియందు

నీదు సౌభాగ్య మిట్టిదికాదె భ్రమర
ఎట్లు మరచితి వద్దాని నెట్టు లిచటఁ
గుటజముల ప్రాలి క్రీడింపఁ గోరుచుంటి
వేటి కింత దురావేశ మిపుడు నీకు.

తొలగిచను మోయి! మధుకరా! దూరమునకు
సురభిళం బంచుఁ గేతకీసుమము చొరకు;
అచట లవమేని మధువు లభ్యమ్ము కాదు
అది యటుండఁగ ధూసరం బౌను మేను.

పరిమళమున్ సువర్ణమును పద్మపుభ్రాంతి ఘటింప ముగ్ధబం
భర మొక కేతకీకుసుమమధ్యదళమ్ముల వచ్చి వ్రాలఁగా
హరిహరి! పూదుమారమున నంధము లయ్యెను నేత్రముల్, గఱుల్
చిరిగెను ముండ్లచే, నిలువలేదు, తొలంగను లేదు, నెచ్చెలీ!

భ్రమర మొక్కండు పరిపుల్లపద్మగృహము
చొచ్చి మధులోభమున వెన్క చూపులేక
అక్కటక్కట! యెంత దురంతమయ్యె
మంచుతాకున నది ముకుళించుకొనియె.

రేయి కడచను తెల్లవారెడిని తూర్పు
అరుణు డుదయించు హసియించు నబ్జలక్ష్మి
అనుచుఁ గోరకబద్ధమౌ నళి తలంచు
నంతలో దంతి కమలిని నపహరించె.

ఆకట నలంగి కింశుక మనెడి భ్రాంతి
నావులించిన శుకముఖమందుఁ జొచ్చి
తనదు నవివేకమును దూరుకొనుచు బ్రతికి
బయటఁ బడఁగొట్టుకొనుచుండె భ్రమర మొండు.

పద్మవనమున రాత్రుల బంధనమ్ము
దంతికటదానమునఁ గర్ణతాడనమ్ము
చంపకసుమమ్మునన్ బ్రాణసంశయమ్ము
భ్రమరమున కొక్కయెడను భద్రమ్ము లేదు.

తుమ్మెదా! చూడవా యేమి, తూర్పుదెసను
చదల వెలుఁగుచున్నాఁడు చంద్రముండు;
వారిజ మ్మింతకే నిద్ర గూరియుండు
చనకు మచటకు నిష్ప్రయోజనము తుదకు.

పటగతపద్మరూపమును, వర్ణమునున్ మది మెచ్చుగొల్పు ము
చ్చటపడి వచ్చి వ్రాలె నొక చక్కని భృంగకుమారరత్న; మ
చ్చట రసమున్, మృదుత్వమును సౌరభమున్ గనరామి సిగ్గు మి
క్కుటమయి మోము వంచికొని ఘూర్ణిలుచున్ జనియెన్ యథాగతిన్.

సమదకరీంద్రగండమదసారవివర్ధితసత్త్వముల్, దళత్
కమలరజోఽంగరాగపరికల్పితగాత్రపరీమళమ్ము లీ
భ్రమరము లిప్డు దైవపరిపాకము చాలమిఁ జేసి, నింబవృ
క్షములను. జిల్లెడుం బొదలఁ గాలముపుచ్చుచునుండె దీనతన్.

నందనోద్యానమందారనవగుళుచ్ఛ
సౌరభపరాయణ మ్మైన షట్పదంబు
గడ్డిపూవుల మూర్కొను గతికి వచ్చె
విధివిడంబన యేమి గావింపలేదు?

ఇచట వాసంత హైమంత ఋతుమహోధి
పత్య మేళనద్వైరాజ్యవశత నేమొ
కుందమునఁ గాని మాకంద మందుఁగాని
కాలు మోపదు తుమ్మెద కలతఁజెంది,

కోమలలవంగలతపయి కూర్మిమాని
పూలకొమ్మల లాలించు బుద్ధియుడిగి
విసరెఁ గ్రొంగ్రొత్తమధురకవిత్వగీతి
మావిమొగ్గను జూచిన మధుకరమ్ము.

మంజుగతిగీతి వినిపింప మధుకరమ్ము
మాలతీః తాల్చె దేల కుట్మలపుముద్ర
ఎవ్వరనుకొంటి శిరసా వహించు వితని
దాననిధు లైన నందనోద్యానతరులు.

పారిజాతమ్ము తనకంటఁబడెడువఱకె
ద్రుమము ద్రుమమునఁ దిరుగు మధువ్రతమ్ము;
భారతకవిత్వరుచి పట్టువడెడువరకె
ఇతరకావ్యాలు తడవు సాహిత్యవటువు
(మధురపండితరాజమునుండి)

## శ్రీ చె  పి

ఆంధ్రకవితాజగద్గురుఁ డమరపురికి
తరలిపోయెను శిష్యసంతతిని విడచి
సహజగీర్వాణవాణీప్రసక్తులైన
దేవతలు చెప్పఁగల రింక తెలుగుకవిత.

మరల తిరుపతివేంకటేశ్వరులజంట
కలసె ముప్పదియేండ్లపైకాలమునకు
సాగగల దింక దిక్పాలసభలయందు
అద్భుతావహాశతవధానాంధ్రకవిత.

మాగురుం డిప్డు దిగిన వాఙ్మయపుగద్దె
ఉర్వి ననధిష్ఠితంబయి యుండఁగలదు
అనభిగమ్యము నప్రధృష్యమ్ము నగుచు
విక్రమార్కునిసింహాసనక్రమమున.

*  *

ప్రీణితసద్రసజ్ఞు డగు పింగళికాంతునికావ్యశిల్పని
ర్మాణధురీణబుద్ధిగరిమంబున కిర్వురె సాక్షు లిమ్మహిన్
వాణికి వాణియైన గురువర్యుఁడు చెళ్ళపిళ వేంకటేశుడున్
ప్రాణముప్రాణ మైన గుణరమ్యుడు కాటురి వేంకటేశుడున్

# దేవ్యపరాధ క్షమాపణ స్తోత్రమ్*

శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు

✽

నేరను మంత్రయంత్రములు, నేరను బీజము లంబ! ధ్యానమున్
నేరను ముద్ర లే నెఱుగ, నేరను నిన్ నుతియింప, పిల్వగా
నేరను నిన్ను, ఆర్తిమెయి నే విలపించుటయే నెఱుంగ, నిఁ
జేరినవారి క్లేశములు చేరవటం చొకటే యెఱుంగుదున్.

తెలియక నీపదార్చనవిధిన్, గ్రహియింపగ శ్రద్ధ లేమిచే
అలసత చేత, పేదరిక మబ్బుటచే భవదంఘ్రియుగ్మమున్
గొలువని పాతకిన్, సకలగోపని! తల్లి! శివా! సహింపవా?
కలుగునుబో కుపుత్రకుడు, కల్లదుగాదె కుమాత యెన్నఁడుఁ.

కలరుగదా సుశీలురు జగమ్మున పుత్రులు నీ కనేకు, లే
ఖలమతి చంచలాత్ముడ నొకండ తనూజుడనై, భవత్పదం
బులకు దొలంగినంతటనె పోలునె నీకు ననున్ త్యజించుటల్,
కలుగునుబో కుపుత్రకుడు, కల్లదుగాదె కుమాత యెన్నఁడుఁ.

అలసుడనై మదంబ! జగదంబ! భవత్పదపంకజాతముల్
గొలిచి యెఱుంగ, విత్తములు కొల్లగ నీ కిడుపాటి పున్నెముల్
సలిపి యెఱుంగ; ఇట్టి నను సాకెడి నీకృపపెంపు నారయన్
కలుగునుబో కుపుత్రకుడు, కల్లదుగాదె కుమాత యెన్నఁడుఁ.

వివిధములౌ విధుల్ తెలిసి వేలుపులఁ యజియింపలేక, వా
రివిడిచినాడ నే నెపుడొ; రిత్తగ ప్రాయపుబ్రొద్దు వ్రాలె నో

* శ్రీ శంకర భగవత్పాదాచార్యుల రచన కనువాదము.

భువనవిధాయినీ! ముదిమి ముప్పుతిటిన్ దెసమాలి యిప్పు డే
నెవరి మఱుంగు జొత్తు? జననీ! చెయిచాపవె సుంత తేపవై.

చేకొను నింద్రభోగము కుచేలుడు నీ యనువర్ణముల్ చెవిన్
సోకిన, మాకరందరుచి జొబ్బిల బల్కు శ్వపాకు డేని జ
ల్పాకత నోకదంబవనవాసిని! చారుసుహాసినీ! యథా
స్వీకృతమంత్రజాపవిధి చేపడు ఆ పద మెట్టిదో కదా!

తన కేమున్నది చేదుమేత మెయిపూతల్ బూదియుం గాక, పా
పనగల్ వ్రేల దిగంబరుం డయి జటాభారమ్ముతో బిచ్చపుం
బునుకం దాల్చి చరించు నా పశుపతిన్, భూతేశు విశ్వాధినా
థుని గావించెను నీకరగ్రహణ మెంతో వింత కాత్యాయనీ!

ఏణవిలోచనా! శశిముఖీ! నిను వేడను జ్ఞానభిక్షు, ని
ర్వాణము గోర, పెక్కు విభవమ్ములు గోరను, గోర సౌఖ్యముల్;
ప్రాణము లేగుచో శివశివా! మృడ! శర్వ! భవా! మృడాని శ
ర్వాణి! భవాని! యన్ జపపరాయణతన్ మదినిల్ప వేడెదన్.

ఉపచారమ్ములు నే యథావిధిగ నీ కొక్కప్పుడుం జేయలే
దపచారమ్ములు వాఙ్మనఃక్రియల గృత్యంబయ్యె నిత్యంబు, పా
పపరీతుండను, దిక్కుమాలితి, అకూపారంబునుం బోని నీ
కృప యొక్కించుక చిల్కరించి నను రక్షింపంగ నీకే తగున్.

ఆపదలకోడి నేడు న న్నాశ్రయించె
శఠుడు వీ డంచు దోస మెంచకు మపర్ణ!
ఆకటికి దప్పికిం గాదె అర్భకునకు
ఆదరున్ వచ్చు దల్లి, దయార్ద్రవేశి!

నిండు మనమున నను గరుణించి ప్రోచు
టబ్ర మదికాదుసూ, జగదంబ! నీకు

సుతుని యపరాధములు పరశ్శతములేని
కడుపునం బెట్టుకొనుగాదె కన్నతల్లి.

లేదు ననుబోలు పాపియు, లేదు నిన్ను
బోలు పాపఘ్నియును; పెక్కు లేల పలుక?
అంబ! నీదివ్యచిత్తాన నవధరించి
యోగ్య మెది అది నీవ చేయుము భవాని!

## శివాపరాధ క్షమాపణ స్తోత్రమ్*

శివ శివా! శివ! నీకు చేయెత్తి మ్రొక్కెను
సైపు మపరాధములు శంభూ! మహాదేవ!

తొంటి కర్మఫలమ్ము వెంట నంటగ, తల్లి
కడుపులో విణ్మూత్రకశ్మలమ్మున డుల్లి,
అగ్గిసెకలను మ్రగ్గు ఆనాటి పెనువెతలు
చెప్ప దరమా, భయం బుప్పతిలుఁ దలపోయ ॥శివశివా॥

పొత్తిళ్ల మలమూత్రములమధ్య పొరలాడి
దోమలీగలు మూగ దురవస్థ జెరలాడి
తల్లిచనుబాలకై తపియించి బాల్యమున
రోగాదిబాధలకు లోగి నిను స్మరియింప ॥శివశివా॥

పన్నగములై విషయపంచకము మర్మములఁ
గాటంబుకొన వివేకము దక్కె, సతి యంచు
సుతు లంచు ధన మంచు చొక్కి, గర్వం బెక్కి
శివచింతనము లేక చెల్లె యౌవనమెల్ల ॥శివశివా॥

---

* శ్రీ శంకర భగవత్పాదాచార్యుల రచన కనువాదము

కనవు కన్నులు చెవుల్ వినవు, రోగవియోగ
ముల బడలె నొడలు, బాముల పాపముల క్రుగ్గి
సడలి క్రుంగియు కోర్కె లుడుగ కీ చెడు మనసు
సుడివడుచు ధూర్జటిని తడవ దీముదివేళ ॥శివశివా॥

ద్విజకులోచితశ్రౌతవిధు లెఱుగ, స్మృతివిహిత
కర్మతతివిఘ్నసంగతము నాచేఁ గాదు
ధర్మమర్మము లాత్మతత్త్వమ్ము నే నెఱుగ
శ్రవణమననమ్ములకు జాల, పై మాటేల? ॥శివశివా॥

తెలవారకుండనే జలకమాడితినో, నీ
యభిషేకమునకు గంగాంబువులు దెచ్చితినో,
బిల్వదళములు, వికచబిసరుహమ్ములు దెచ్చి
నీసపర్యావిధులు చేసితినో మనసిచ్చి ? ॥శివశివా॥

పంచామృతములచే భవుని నభిషేకింపఁ
బూజింప బంగారుపూల గంద మ్మలదె,
ధూపమ్ము కప్పూరపుదీపమ్ము నిడనైతి
షడ్రసోపేతభోజన మొసగ లేనైతి ॥శివశివా॥

చిత్తవీథిని శివుని చింతించి, పారులకు
విత్తమ్ము లిడనైతి, బీజమంత్రములచే
వేల్మి నగ్ని కొసంగ, వినువాక దరి రుద్ర
జపము సల్పను వ్రతాచరణ మ్మొనర్పనో ॥శివశివా॥

మూడుగుణములు వాపి. మోహతిమిరము జూపి
తగులముల్ లేక దిక్తతి దాల్చి, నైజ మరచి
భవగుణమ్ములకు దాదవుగ చూపును ముక్కు
తుద నిలిపి, కలిహరుని మది నిలుప శంకరుని ॥శివశివా॥

పద్మాసన మ్మూండి, ప్రణవమయమారుతము
నిలిపి, ఆదారినే నెమ్మనము దుడు కుడిపి,
చిద్గగనవీథిలో శివపరబ్రహ్మమై
వెలుగు నీలింగమ్ము దిలకింప లేనైతి ॥శివశివా॥

ఎదలోని దివ్వెవై, నిదుర కల మెలకువల
కనలిదరి, మానిహృదయాంబుజమ్ముల మెలగి
సత్యమై నిత్యమై శాంతమై నిగమాంత
వేద్యమై హృద్యమై వెలుగు నిన్ను స్మరింప ॥శివశివా॥

# ను గు త ల్లి

సిరిగిరిమల్లన్న సేసజాబిలివంక
చిందువందెడి సుధాబిందులహరి
వారాహగిరిగుహావసదనేకపవైరి
మైపూతగందమ్ము మలయువలపు
పాపరామలకొమ్ముపై వేల్పుబంగారు
పాగ రత్నద్యుతి వ్యతికరమ్ము
ఇంద్రకీలాహార్యశృంగాగ్రగేహ మా
కనకదుర్గాకటాక్షములచలువ

కడలి పట్టపురాణులు గౌతమీ పి
నాకినీ కృష్ణవే ణ్యాదినదుల తరగ
మొత్తముల మంద్రఘోషలు ముసరికొనగ
దక్షిణాకాశవీథివితాన మెక్కి
కలయ బ్రాకిన వాశావకాశములకు,

పరిసర్పితాహార్యపాద కృష్ణానది
వీచీగళ మ్మెత్తి పిలిచినదియొ
పర్వతాగ్రమునుండి భర్మదుర్గాకైశ్య
కలితదివ్యాపగ పలికినదియొ
మంగళాచలసముత్తుంగశృంగాగ్రనృ
సింహదేవుండు గర్జించెనేమొ
ఇంద్రకీలమహీధ్రశృంగమ్ము గోరాడి
వృషరాజు ప్రతిహుంకరించె నేమొ

మురళికాసరళస్వరమ్ములు గభీర
మధురవీణారవమ్ములు మాఱుమసలి
మురజకాహళ లొండొంట బెరసి, సప్త
వాయునిశ్రేణికల వియత్పథము లొరసె.

బౌద్ధజైనమ్ములన్ నిజోభయతటముల
బెంచి, వెల్గించినట్టి దీపికలు కలల
మెఱసెనో కృష్ణవేణ్ణకు తరతరాల
ఆంధ్రశాతవాహనుల రాజ్యాధిరమను
వీచికావీజనముల సేవించుకొన్న
మధురమధురస్మృతులు భావపథములందు.

పులకపూతలు పూచె నేమో, తటమ్ము
లొరయఁ జనుచుండె నిండునిబ్బరపు తీవి
యులివులోన సంగీతవీణలు నదింప
మధువనీసౌరభాలసమలయపవన
వత్సములచేత నేటి మహోత్సవావ
సరశుభాభినందనపరంపరల నంపె
ఆంధ్రహృదయమహాస్థానమందు సుకవి
గాయకస్వస్తిగీతముల్ క్రందుకొనగ.

జనకజారఘురామవనవాస–సంస్మృతి
ప్రియవృత్త దర్శనస్మృతిభరములు
కృతబహుయజ్ఞదీక్షితసదాహుతహవ్య
కవ్యసౌరభధూమగంధిలములు
వేదాధ్యయనశీలవిప్రబాలక సదా
వర్తితస్వరభేదపరిచయములు
చాళుక్యనృపసభాస్థాన పండిత కవి
గోష్ఠివినోదోపగూహనములు

పావనోదారవారిగోదావరీ త
రంగసంఘాతములు తెల్గురాజధాని
నిండుకొలు వున్న వాణికి నిజపురాత
నానుభవసంస్కృతులు కాన్క లంపు నేడు.

మాధవస్వాముల మహిమ వర్ణించిన
కనకధారల నెయ్యమును భజించి
సాయణాచార్యభాష్యార్థచర్చ లొనర్చు
కోవిదులకు జోడుకోడె లగుచు

రసికశేఖరుడైన రాయల ఆస్థాన
సాహిత్యరసముల చవులు గఱచి
జలకేళిసవరించు సత్యావరూధినీ
గిరికల తను రేఖ లొరపి మెఱసి

వాలిసుగ్రీవపృథుభుజాస్ఫాలనలకు
ప్రతిన దించిన తుంగభద్రాతరంగ
చాలన ఘుమంఘుమల కాంధ్రశారదా వి
పంచి పులకించి మము బల్కరించుగాత!

మనుమసిద్ధిమహీవిభుని రాజ్యలక్ష్మికి
శ్రవణకల్హారమ్ము సంతరించి
ఖడ్గతిక్కనవాడికత్తిపోటెత్తు ర
క్తప్రవాహమున నేస్తమ్ము సలిపి
తిక్కన్నకవి తేటతెలుగుక్రొందేనియ
వాకల ముడిగొని పంకమూడ్చి
రంగనాయకపాదరాజీవచిరసమా
రాధనాపుణ్యసారమున మించి

నాగరికముల బాగులు నడుపునీటు
నెఱతనము లున్న పెదపిన్నవరుసపెన్న
తరగ లీయాంధ్రసాహితీసరసగీతి
కాసదమ్మన కుద్బోధకమ్మ లగుత!

వికచపద్మవనమ్ములై వెలుగు వదన
మండలమ్ములతో నాంధ్రమహితనంత
బలికి పాడియు వన్నెచిన్నెలు రచించి
ఇరుగుపొరుగుల దలయెత్తి తిరుగుగాత!

# వరలక్ష్మి

రసపూర్ణహృదయలై రత్నాకరాలింగ
నత్వరమాణలౌనదుల పరుగు
విరియు గ్రొన్ననతావి విశ్వమ్ము నించు గాం
తారాళి యానందతాండవమ్ము
ఉరుము మద్దెలమ్రోత కుచ్చి మొగిత్తెర
దాటు విద్యున్నటి యాట మురువు
నిత్రుపాసమ్ముల నింగి నల్లాడు చా
తకచిరంతీవ్రతోద్యాపనమ్ము.

ఒక్క దెసయౌచు జగముల కుబ్బు పుట్ట
ధాత్రిశాద్వలరోమాంచితమ్ముగాగ
వర్షధారల చల్వదువ్వలువ దాల్చి
ద్వారభూమి శ్రావణశుక్రవారవేళ
నిలిచి తెవరమ్మ! వరలక్ష్మి పొలుపు దోప.

ఎన్నడు రాని తల్లి, జగ
దీశ్వరి, కామితదాత్రి, చేరవ
చ్చె న్నిరుపేదగేహముల
చెంతకు బిల్వనిపేరటమ్ము; సం
పన్నులయాడుబిడ్డ తల
వాకిట నిల్చిన, రిత్తచేతులన్
గన్నులు నప్పగించి విల
గానయితిం గద మందభాగ్యనై.

ఆయన యూర లేరు నెల
లైదు గతించె బ్రవాసి యై; ఎటో
త్రోయుచునుంటి కాల మిసి
రో యొకగవ్వయు జేత లేదు; నీ

కేయుపచారముల్ సలుప
నెట్టుల నేరుచు నీ యభాగ్యురా?
లీ యనురాగభారమున
నెంతయు గుమ్మెలువోయి క్రుంగెడిన్,

అచ్చపు టీయనుగ్రహము
నాత్మ దలంచి, మదీయభాగ్యమున్
మెచ్చి నుతించుకొందునొ?
సమీపగ వౌ నిను గల్గినంతలోఁ
బొచ్చెములేని బత్తిమెయి
బూజ లొనర్పగ నీయకున్న ని
ప్పుచ్చరముం దలంచికొని
పాపము లాడుదునో దయామయీ!

శ్రావణమాసమ్ము సనుదెంచె నని సున్న
మలదినయట్టి కుడ్యములతోడ
పసపున గలపమ్ము వాటించి చెందిర
తిలకమ్ము లిడిన గేహళులతోడ
చివురుదోరణల గైసేసియు దీవ ము
గ్గులు తీర్చినట్టి ముంగిళులతోడ
గమగమధూపధూమముల బూజాద్రవ్య
సమితి నిండిన చత్వరములతోడ

గొలువు చవికెలు నా నీకు గొమరుమిగిలి
శుక్రవారవ్రతమ్ముల సొంపులొలుకు
భాగ్యశాలుర గృహములపజ్జ కరుగ
కీకుటీరమ్ము దరిసితి వేమి తల్లి!

నోములు తొంటిజన్మముల
నోచిన తల్లులు నూతనాంబర
స్తోమము, లంగరాగములు,
దోయపుసొమ్ములు దాల్చి, పూచు లే
మామిడిమ్రోకలో యనగ
మాటికి బేరటముల్ సనంగ, గ
న్నామేతగా గనుంగొనుచె
కాని వ్రతమ్ము లెఱుంగ మెన్నడున్.

విందవైన నిన్ను వెడలనంపను లేను,
వ్రతమొనర్ప సజ్జురాలగాను,
ముందు నోతు నన్న, ముందేమొ నేనేమొ,
కులమువారి బిలుతు నిలుము తల్లి!

రావె కాదంబినీ! క్షణప్రభరో! రమ్ము,
చాతకీ! రమ్ము, కేతకీ! జాగుసేయ
కీవు నీవారు రారె! మాయింట నేడు
విందు వరలక్ష్మి, మీ కెల్ల బేరటమ్ము.

నవవర్షసలిలార్ద్రిమవు మెత్తమెత్తని
మొగలిపూల్ గీల్గంట ముడువరమ్మ
పాపటన్ దురుమరమ్మా! పుప్పొడులు రాలు
కడిమిపూవులు సొంపు గడలుకొనగ
కైసేయరే! మాలికలు గ్రుచ్చి గళము వే
బోక విరిసి రాలు పొగడపూలు
కర్ణరంధ్రము లలంకరణమ్ము సల్పరే
ఫుల్లనీలోత్పలమ్ములను గూర్చి.

జాజిపూవులమొత్తముల్ సంతరించి
భద్రపీఠ మ్మమర్పరే! భక్తవరద,
కారతుల నెత్తరారె! క్షీరాబ్ధి పట్టి
కాగడము మాని శంపాలతాంగులార!

నారికేళాంబుల నవవర్షజలముల
నభిషేక మిదె యబ్ధియాడుబిడ్డ
కగురుగంధమ్మున మొగిలిపూరజమున
జర్చయిదే! జలజాతనిలయ
కంభోజనేత్రు నిల్లాలికి సుమగంధ
వహపృషద్వాహనవ్యజన మిదిగో!
అర్థికల్పద్రుమం బైన మాయమ్మకు
సజలకాదంబినీఛత్ర మిదిగో!

అహరహం బప్సరః కన్యకాళినృత్య
సేవ లంగీకరించెడి దేవి కిదిగో!
ఉఱుము మద్దెళ్ళ లయ తప్పకుండ నాడు
నెమ్మినట్టువ లొనరించు నృత్యసేవ.

నేరిచి నేరకే సలుపు
నేటి సపర్యల నందుమమ్మ! మా
వారు సుఖమ్ముమై మరలి
వచ్చిన, గన్నియపెండ్లి సేసి మా
కూరిమి బిడ్డగూడి నిను
గొల్తుము, శ్రావణశుక్రవారల
క్ష్మీరమణీ! మమున్ మనుపు
మీ! పదపద్మము లంటి మ్రొక్కెదన్.

# మల్లికార్జునస్తుతి

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ



శ్రీనీరధినిషంగ! భక్తజనతతిశ్రేయోఽనుషంగ!
మానాథశరసంగ! ప్రౌఢవృషభరాణ్మాద్యత్తురంగ!
త్ర్యామ్నాతనశతాంగ! సంగతోష్ణీషసారాంబుభంగ!
శూలాభిషంగ! శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

నాలోన శుష్కతృణంబు ముట్టించినావు దృగ్వహ్ని
నీలలోహిత దైన్యభావనామంజులోహిత! నీవు
జ్వాల తా నది వేఱు నిద్ది వేఱుగా సంతరించకువె
శూలాభిషంగ! శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

నాలోన నెంతగాఁ ద్రవ్వుకొన్న పినాకి! కన్పడవు
ఆలోకరమణీయశారదాంభోధరాస్నిగ్ధమూర్తి!
నీలోనఁ ద్రవ్వి నీలోతు తెలియఁగా నేర నిన్నెంచి
సోలిపోఁజాల శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

ఆమానసిక మైనమూర్తి అట్లు నిరంతంబుగాఁగ
స్వామి దీపించుచ నుండి కొంతలాభంబు గావచ్చు,
ఈమేనె శిలగాఁగ నచట నున్నచో నెల్లకాలంబు
సోమకిరీట! శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

నాగుండె తీసి నీపాదమూలంబునం బెట్టుమనుము
మాఁగువారిన శ్రద్ధ సుంత మసలిన మార్చ్వేరఁ బిలుము
ఊగులాడితి నేని వందజన్మ లి టొగ్గకు! నీదు
జోగిని నేను! శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

శాం

నే నెంత నా బ్రదు కెంత సృష్టిలో నిజము నావంటి
మానవుల్ మూఁడుకాలములఁ బుట్టుచు మడియుచున్నారు
కానగా సర్వదేశములయందు జగం బొక పెద్ద
సూనాపణంబు శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

కోరి కబేలాకు మందగాఁ దోలికొని పోవుచుండ
దారిప్రక్కన యున్న పచ్చిగడ్డిపైఁ దారాడు పసుల
తీరుగా నున్నది జనులభోగాశ, తెలివి సర్వమ్ము
చూఱ వుచ్చెదవు శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

మానసం బింతయుఁ గొల్లవోయి నీమహనీయమూర్తి
లోని వెల్లువిసరు తోఁచనీవంత లోకువై పోతి
వీనినిఁ బెట్టెడుబాధ వేనినిఁ బెట్టవు నీవు
సూనాస్త్రవైరి! శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

ఒకరెల్లగా వత్తువో యటంచు నేనొగి నిశీథముల
ముకుళించు కొన్న నెన్నుదురు నడుమ నీమూర్తికై వేతు
నకట! తా నరుదెంచు నంధకుడు వాని హరియింప నంత
సుకరంబుగాదు శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

నాయూహ నాగుండెలోని కదలిక నా బ్రదు కెల్ల
పాయని యీమేనిమీద నాధారపడి యుండె నభవ!
నాయీతనువు చేసినావు రాయిగ నను జోరలేవు
సూయాణముగను శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

పెరిగి బుద్ధులు నేర్చికొను జగము తమపెద్దలవలన
పెరిగిన తరువాత నాప్తవాక్యము విష మయిపోయె
నరయ నీయున్కికి నెల్ల నాప్తవాక్యము ప్రమాణమ్ము
సురలోకవంద్య శ్రీశైలమల్లికార్జునమహాలింగ!

# శ శి దూ త ము

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణ



అమృతము కూఁడుకట్టిన దొరా ! యల దూరపునీలికొండలోఁ
గొమరుమిగుల్ సితాంబుదముకోనల మూసలు పోతు వెన్నెలల్
రమణి యొకింత కోపనపరాఙ్ముఖి యైనది. నాకుఁ జెప్పుకో
నమరినదూత యిప్పు డెవ రందువు నీవువినా నిశాపతీ !

అమృతపు నిండుకాల్వవలె నట్టిటు మోచి విశాఖకృష్ణపా
డ్యమిఁ దొలివంక తోచని విడంబనలోపము లేదు నీదెసన్
రమణి యొకింత కోపనపరాఙ్ముఖి యైనది, దాని కింతకో
పము మఱి నీసమక్షమున వచ్చిన దేమి విచిత్రమో శశీ !

కమలముఖంబునందుఁ జూఱకల్ వలెనై పనిసేయు వెల్గుమొ
త్తములకు నీవొకండు రహదారివి నీవెలుగారు దారులన్
రమణి యొకింత కోపనపరాఙ్ముఖి యైనది, కాక లెక్కవై
చిమిడెనొ నీదువెల్గు తుదిసీమలు చామల బియ్యముం బలెన్.

నీపయి నాకు నమ్మకము నింగినిఁ గ్రొంజూఱకత్తి వెల్గులు
ద్దీపవిభావమైన తెలిదివ్వెవు మవ్వపు నీదు వెల్గులోఁ
గోపనయై పరాఙ్ముఖతఁ గొన్నది నాప్రియురాలు నీవు గా
పాపఁటదోలు మీకఠినభావపుఁ జిన్నిపొలాలలోపలన్,

ననవిలుకానికిన్ మొదలినాళ్ళ వసంతుఁడు కాని, పాదురా
లని తొలిపూవుపై నెలనెలన్ జిగిపున్నమకట్టు లిట్టులన్
నినిచిన రేక లొప్ప హవణించిన నీవొకరుండె మంత్రి వీ
వనిత పరాఙ్ముఖీత్వ మొకబ్రాఁతియఁటే నిను బోటివానికిన్.

రేనయి యిట్టులైతి, బెదరింతునుపో పవలైన, రేయి యో
లే నిలు, కల్వతేఁ డవునులే చనుదెంచునులే యటంచు నీ
వా నిలుచున్నవైఖరిని నాలనపాలనలేక చూతువే
కాని తలంచ వింత చెలికారము నాయభిమానమున్ సఖా!

వితతములైన దంపతులప్రేమలకున్ గొలపాత్ర వొచు ని
ల్చితిపదునాలు రేకలనుజెప్పకచెప్పెడుపోరసార్ద్రిమో
గతులనునేఁడొకండను పెగానికొ అంతయెకానరాదునీ
జతనము నిండియున్నదను సొకున నంతయు నిండుకొన్నదో-

ముగుదలు పూలు నీవు నొకమో స్తరుకోమలజీవులందు బి
ట్టుగ నిది యొక్కపూవులకుటుంబముమీర లొకళ్ళొకళ్ళకున్
మిగులఁగ స్నిగ్ధులౌదురను మీరును మీరును నొక్కడౌటనీ
వగుదువు నాకు దూత్యమున కంగనకున్ మృదుకోపశీలకున్

నీ వల తాకినన్ బ్రణయనిస్పృహులా లగుఁ గల్వచేడె మీ
భావము లచ్చసాత్త్వికపుభావనిధుల్ రససిద్ధివేళ మా
భావపుసీమలెల్ల ననుభావవిభావవిమిశ్రితంబు లౌ
బ్రోవులు గాన మీకు దయపుట్టుక లేవు రసాధిపత్యముల్

కడలిని జిల్కినట్టి తొలికాలమునందున మంథరంబునం
దడుగున రాయిడించి పులకై జలదేవత మూలశైత్యముల్
బుడగలు గాఁగఁ దేలికొని పొందిన చల్లదనాల తెట్టెవీ
వెడరున నేచి తాకితివ యేనిని గోపములంచు నిల్చునే?

నీవు ప్రసన్నతాగుణఖనీ! యల వేదములందు మెచ్చుగొ
న్నా వఖిలాండబీజునిమనస్సుననుండి సముద్భవించితం
చీవఖిలౌషధీశుడవు నీవు మహాత్ముఁడ వాకసంబులో
నీ వొకపూలదీపమవు నీవమృతాకృతివయ్య మత్సఖా!

తెలివినువాఁకతాపులకుఁ దీరము పట్టిన వెల్లకుత్తివై
తొలి వెలుఁగైన సామి తలతోటను జిట్టచిటారుపూవువై
యల ముగురైన మూర్తులకు నాదినిధానము సృష్టిబీజమౌ
సొలపున కిక్క తల్లి కులసుందరిపాపటలోనిభూషవై

కడలిజలంబు నం దిమిడికల్ గను నుప్పులు కాలకూటమై
వెడలినవాఁడు నీరములవెల్లువ చల్లదనంబు నీవు గా
వెడలితి వాదిదేవుగళవీథిక నిల్చిన కాలకూటమం
దుడుకులపొంగు లార్పుటకె యుంటివి శ్రీప్రభుదేవుమౌళిపై

నెలఁతల బాధవెట్టెదవు నీవునువారును నిన్ను నాటగా
బలికెద రొక్కవేళ నొకపట్టున నీవు సతుల్ మమైక్యమై
వెలిఁగెద రింక నీనడిమివెట్టుల కేటికిఁ బ్రేమచోట్ల నే
తెలతురు కోపగింతురు గదే జగమందున నెవ్వ రేనియున్

వెన్నుని కున్న మచ్చ యరవిందము రత్నము భోగిలక్షణం,
బెన్నగ నీదు మచ్చ యది యేయొ కళంకము, నిచ్చకాలనన్
దిన్నగ నిట్ల యుండును గదే గిరికవ్వము దూసిచన్న నీ
యన్నవమచ్చ నెవ్వ రెటు లాడిననున్ మనకేమిలే సఖా !

నిను విరహార్తలౌ సతులు నెవ్వగ నాడిన మున్ను నీవు చే
సిన సుఖశీతలత్వపురుచిన్ స్మరియించుట కాని యాడుటా
వనితలు నీకు సోదరులు వారికి సోదరుఁ డీవు మీకు మీ
కును గల గర్భబంధములకున్ గొనసాగుట నీప్రశాంతియే

నీ వుదయింతు తూర్పుమలనెత్తములందునఁ గుంకుమావృతం
బై వలిపంపురైకబయలాడిన తూరుపుకన్నెతొమ్మగా
నావల యక్షదంపతుల యారని ప్రేమల బావి యూటయై
నీవెలుఁగారుఁ బ్రాగ్గిరివనీతరువల్లిఁ బ్రవాళశోభయై

పున్నమనాఁడు ప్రాచిగిరిమూలము నెఱ్ఱగ ముట్టుకొందుమా
యన్నులు నప్పుడే తిలకమాననసీమల దిద్దుకొంద్రు నీ
వెన్నఁడు నెప్పు డెప్పు డుదయించెదు వారును నప్పు డప్పుడే
చిన్నెలో భర్తృసంగమవశీకృతచిత్తలు తాల్చుచుందురున్.

నాసఖి యన్న యిచ్చిన ననల్ జడలోఁ గయిసేసి మెల్లగా
నాసవిధంబు జేరు వదనంబున హాసము లందగింపఁగా
నా సఖి నీదు వెన్నెలననల్ తనువెల్ల నలంకరింపఁగా
నాసవిధంబు జేరు వదనంబున వెన్నెలలందగింపగా

నిను బలుసార్లు మత్ప్రణయినీమృదుకోపశిఖాపనోదకున్
మునుపటికే నెఱుంగుదును మున్నడి వెన్నడి గాఁకఁ దీర్చి తా
చనవునఁ జేసియే యడుగసాగితి మాటను దీసివేయ కా
మునుపటిసంగడీనితనమున్ నిలబెట్టుము పట్టుకొమ్మవై

యుగములుగాఁగ దూత్యమున కొప్పితివో ప్రణయోపజీవులం
దగణితబుద్ధి నాకు సఖుడైతివి యెన్నియొ కొన్నిసార్లు నీ
వగుపడవేలొ తొంటివలె హాస్యమొకో యెదియైన క్రొత్తయా
వగపు ఘటిల్లెనో తెలుపవా ; మనచెల్మికి నానవెట్టెదన్.

ఇరువన వచ్చి నిన్ను నిడియించెనొ యీవడగాడ్పు లక్కటా ;
మెరమెర లాడిపోయెడు సమీరుని యీ పెనువెచ్చనైన లోఁ
బొరలను జెమ్మతోఁచ దవుపో ! వడగట్టిన యెండుగందపుం
బెరడువిధాన నీవు వినువీథిక నిల్చితివయ్య చంద్రమా !

పెనునెడబాటుటగ్గికి దపించిన నాతులపాలిటన్ సుద
ర్శన మవు వేయియంచులకరాసివి తా కినచోటఁ గోతవె
ట్టినదొర వాప్రభావములు డిందెనొ ! వేసగికాఁక లేమిసే
సినవి పటీరవార్నిలయశీతలమూర్తిని నిన్ను మిత్రమా !

రాతిరి రెండుజాలు చివరల్ సయితమ్మును వెచ్చనూదుచున్
జేతము సొమ్మసిల్లగను జేయుచు వేసఁగిగాలి యేఁచఁగా
నీ తెలివేమి? నీచలువ నేరుపులేమి ప్రపంచమంతయున్
గాతరమయ్యె నిన్నెవడఁగట్టిన నేమనవచ్చు వేసఁగిన్

అవునవు నిన్ను నే నెఱుఁగనా? తెలివెల్గులు జార్లుతీర్చినన్
సివమున గామినీవిరహచేతములందున దాడిపోవు పా
టవమున బొల్చు రాజవికటప్రకటోల్బణవృత్తు లేమి పా
టివి? తొలివెచ్చగాలి వికటింపులు నిన్నిక నేమిసేసెడిన్.

భ్రమితము లైన గాలులకు వాడిన రేల చివుళ్ళవోలికన్
సిమసిమలాడుకొంచు విరిసెన్ నులివెచ్చని చిక్కవెన్నెలల్
శ్రమపడినట్లు మందగొడి సాగియు సాగవు క్రొత్తకాల్వనీ
రములను నెత్తెలం దడుపరాక విలంబన మోర్చుపోలికన్.

పగటను దూసికొంచు లయభాస్కరు డీవినువీథి నేగుచున్
మొగిళుల నారఁబెట్టె నిట భూమిని జెర్వులవోలె నుంతయే
నిగముచరించదా యెచట నేమయిపోయెదొ మిత్రమా! కడున్
బొగలుగఁ దోచు నీవెలుగుపోచలు మిన్నులెయంటుకొన్నటుల్.

తూరుపుకొండపెంజఱియత్రోవల నారని గండుఱాలపై
నూరక తెల్లిగాలులను నుత్తలమందినదేమొ చాల కీ
దారిని బోక తప్ప దగుఁ దాఖము ధారణిదేవి మెల్లగా
నూరుపు కొంచునున్నది జలోదర శీతలగర్భవాయువుల్

ఘనముల బొడ్డులై కడలిగర్భమునం బడి నీకు సంక్రమిం
చినచలువల్ క్రమంబుగను జెమ్మలు పుట్టును నీదు మేన ని
న్నును వరుణాధిదేవతతనూభవశైత్యనిధాను గోరువె
చ్చని యలుపంపుగాలు లివి చాలునె యించుకయైనఁ జేయఁగా

ఒనరఁగ మెట్టదేశములనుండి సముద్రపుఁదీరదేశముల్
చను సమయంబునందు బలె సాగిన గాలులు రానురాను వె
చ్చనివియు గోరువెచ్చనివి చవ్వలునున్ జిలుచల్లనైనవిన్
దనికెను నీప్రభావ మిఁకదాగదు దాచఁగరాదు మిత్రమా!

నీదయకోసమై రసధునీమహితాకృతి! వేచియుంటి నీ
వాదుకొనంగనేవలెనయా! దరసాదరమేదురాకృతీ!
పేదగ నప్పుడే మొదలుపెట్టితి నింతయు దేరుకొంటివో
లేదొ వినూత్నకోపనను లేదుఁ బ్రసన్నను జేయుమంచొగిన్.

నిన్న గఠోరగ్రీష్మపరినిందితశైత్య మహోతపవ్యథా
ఖిన్నని జూచి చూచి విను కేవలమాత్మపరాయణత్వమి
ట్లున్నది నిన్న నే నడుగుచుంటిని కోపన నాలతాంగి నీ
వన్నలినాయతాక్షి నెటులైనఁ బ్రసన్నను జేయుమం చొగిన్

నీ వటువంటివాఁడ వని నే ననుకో ననుకోను వీలు లే
దీవు వొనర్చినట్టి పను లెంచినఁ బూర్వమునందు, నెవ్వఁ డో
కావలుఁ డట్టివాఁడు క్షణకాలపు జీవియుగాలనుండియున్
నీవినువీథి నిల్చుటయె నీగుణశాలితఁ జాటిచెప్పెడున్.

నీదయ నాకు నొక్కనికి నే యిపుడే దయచేసినంతటం
గా దెపుడే దయాశిశిరకాంతులఁ జూడవలెన్ మఱెవ్వఁడే
నీ దయితానవప్రణయనిర్భరకోపపుబాళిఁ గుందుచో
నాదు కొనంగనున్వలె నయా! చలివెన్నెల సోనజల్లుతో.

సామి వికాసిసూనసరసంబులు దంపతిలోకమంజుల
ప్రేమవిలాసయోగ్యపదవీగమనంబులు సాధువుల్ యదృ
చ్ఛామృదువుల్ దయాభరరసంబులు నైన భవన్నవాంశువుల్
గోమహనీయమార్గములకు దలమానికముల్ జయించుతన్.

# క వి త

**శ్రీ "కరుణశ్రీ"**



దోసెడు పారిజాతములతో హృదయేశ్వరి మెల్లమెల్లగా
డాసిన భంగి మేలిమి కడాని వరాల కరాలు వచ్చి క
న్మూసిన భంగి కన్నె నగుమోము పయిన్ నునుసిగ్గు మొగ్గ కై
సేసిన భంగి అందములు చిందెడి నందనవాటి వెన్నెలల్
కాసిన భంగి జానపద కాంతలు రాట్నము మీద దారముల్
తీసిన భంగి క్రొవ్వలపు లేఖ తలోదరి తామరాకుపై
వ్రాసిన భంగి పెండ్లి తలబ్రాల్ జవరాలు రవంత నిక్కి పై
బోసిన భంగి గుండె వడబోసిన భంగి కళావిపంచికల్
మ్రోసిన భంగి పొంగు వలపుల్ తలపుల్ సొలపుల్ ప్రసన్నతల్
భాసురతల్ మనోజ్ఞతలు ప్రౌఢిమముల్ రసభావముల్ గడున్
భాసిల తెల్గుకైత నవభంగుల నొప్పుచు సంస్కృతో సం
వాసితవౌ నెడన్ కలశ వారిధి తీర పురోనిషణ్ణ దే
వాసుర మండలాంతర విహార వికస్వర విశ్వమోహినీ
హాస విలాస విభ్రమ కరాంచల చంచల హేమ కుంభ సం
భాసి సుధా ఝరీ మధురిమమ్ములు వ్యక్తము కావలెన్; శర
న్మాస శుచి ప్రసన్న యమునా తట సైకత సాంద్ర చంద్రికా
రాస కలా కలాప మధుర వ్రజ యావత మధ్య మాధవ
శ్రీ సుషమా ప్రపూర్ణ తులసీదళ సౌరభ సార సంపదల్
రాసులు రాసులై పొరలి రావలె; పొంపిరి పోవలెన్ నవో
ల్లాస వసంత రాగరస లాలిత బాల రసాల పల్లవ
గ్రాస కషాయ కంఠ కలకంఠ వధూ కల కాకలీ ధ్వనుల్.

[ తిమ్మనార్యుని కమ్మని పద పారిజాతాలపై ]

# శాంతిమయి

శ్రీ

[గోమతీ నదీతీరంలో శ్రీరాముడు అశ్వమేధ దీక్షితుడై ఉన్నాడు. కుశలవులు ప్రతిదినమూ యజ్ఞ శాలకు వచ్చి రామాయణం గానంచేస్తున్నారు. ఒకనాడు మహర్షులూ పౌరజానపదులూ కూడి యున్న మహాసభలో నిర్దోషురాలైన జానకిని శ్రీరామునకు సమర్పించుటకు వాల్మీకులవారు సీతతో వస్తున్న దృశ్యం.]

బృందగీతి

శ్రీకారం చుట్టుకున్న
స్త్రీజాతి కథానికవలె
ఆకారం దాల్చిన లో
కైక శోక గీతికవలె
వాల్మీకుల వారి వెంట
వచ్చుచుంటి వెవరమ్మా?
ఎవరమ్మా? ఎవరమ్మా?
అమ్మా! నీవెవరమ్మా?

శ్రీరాముడు

భగీరథుని రథంవెనుక
ప్రవహించే సురనదివలె
అరుంధతీ విభునివెనుక
అరుదెంచే నందినివలె
వాల్మీకి మహర్షివెనుక
వస్తున్నది నా జానకి

కౌసల్య

నా కోడలు నాజానకి
నా భాగ్యము నాప్రాణము
చిక్కి చిక్కి తనూవల్లి
చిట్టితల్లి వస్తున్నది

సౌమిత్రి

వాల్మీకాశ్రమము చెంత
వదలిపెట్టి వచ్చినట్టి
ఇక్ష్వాకుల యశోలక్ష్మి
ఇపుడు తిరిగి వస్తున్నది

భరతుడు

తెల్లనివన్నీ పాలని
నల్లనివన్నీ నీళ్లని
కల్లా కపటము లెరుగని
కన్నతల్లి వస్తున్నది

కైక

లోకులు పలుగాకులుగా
కా కా అని అరచి కరచి
ఏకాకినిగా చేసిన
కోకిలమ్మ వస్తున్నది

సుమిత్ర

బ్రతుకంతా బాష్పంగా
పారిజాత పుష్పంగా
పతిసేవా వ్రతము నడుపు
పరమసాధ్వి వస్తున్నది

**ఊ ర్మి ళ**

మహిస్థలికి దిగివచ్చిన
మహాలక్ష్మి మాదిరిగా
వాల్మీకుల వారివెంట
వస్తున్నది అక్కగారు

**మాం వి**

హిమవద్గిరి వెంటవచ్చు
ఉమాదేవి చందమ్మున
వాల్మీకుల వారివెంట
వస్తున్నది అక్కగారు

**శ్రు త కీ ర్తి**

రసార్ద్రమై ప్రవహించే
రామాయణ రచనరీతి
వాల్మీకుల వారి వెంట
వస్తున్నది అక్కగారు

**శ త్రు ఘ్ను డు**

నీతి నియమ రహితమైన
రాతిగుండె సంఘానికి
బుద్ధి చెప్పి పోవుటకై
పెద్ద వదిన వస్తున్నది

**వ శి ష్ఠు డు**

కుశలవులను గన్నతల్లి
దశరథేశ్వరుని కోడలు
మన రాముని ధర్మపత్ని
జనకపుత్రి వస్తున్నది

**అ రుం ధ తి**

ఆదికవుల గంటములో
అమృతలహరి చిందించిన
వేదమాత మహాసాధ్వి
విశ్వజనని వస్తున్నది

**కు శ ల వు లు**

అదుగోరా అమ్మ అమ్మ
అనురాగపు పూలకొమ్మ
ధర్మముతో దయలాగున
తాతవెంట వస్తున్నది

**హ ను మ**

సీతమ్మ వచ్చింది
సీతమ్మ వచ్చింది
ాతల్లి ాయమ్మ
చ్చింది

**ప్ర జ లు**

మన రాణి వచ్చింది
మన రాణి వచ్చింది
ఇన కులాధీశ్వరుని
యిల్లాలు వచ్చింది

**బృం ద గీ తి**

సీత వచ్చి నిలుచున్నది
శ్రీవాల్మీకులవెంబడి
శ్రీరాముని హృదయంలో
చెలరేగెను పెనుతుపాను

సీత వచ్చి నిలుచున్నది
శ్రీ వాల్మీకులవెంబడి
రామచంద్రు వదనముపయి
క్రమ్ముకొనెను కార్మబ్బులు
సీత వచ్చి నిలుచున్నది
శ్రీ వాల్మీకులవెంబడి
రాముని నయనమ్ములలో
ప్రేమజలధి గట్లుతెగెను

**వా ల్మీ కి**

రఘురామ ! రఘురామ రామ !
రవివంశ జలరాశి సోమ !

అవధారు రాజలలామ !
భువనైక పావననామ !

ఈ సీత లోకైకపూత
ఇక్ష్వాకు వంశ సంజాత !
ఇల్లాలి నంగీకరింపు
చల్లగా జగతి పాలింపు

అటువంటి పుట్టువుపుట్టి
ఇటువంటి ప్రభుని చేపట్టి
ఎటువంటి యిక్కట్లనందె
కటకటా మిధిలేశుపట్టి

ఆనాడు లంకలో బిడ్డ
నగ్నికుండమున నెట్టితివి
ఈనాడు నడికోడి సఖిని
కానకు వెడలగొట్టితివి
దివిసాక్షి ! భువిసాక్షి ! హోమ
గవిసాక్షి ! రవిసాక్షి ! రామా !
వేదాలు సాక్షి ! నాతల్లి
వైదేహి సాధ్వీమతల్లి !

బృందగీతి

అన్నాడు వల్మీకభవుడు
విన్నాడు మేదినీ ధవుడు
తిలకించె పరిషత్తు నపుడు
దీన దీనమ్ముగా నృపుడు

వాల్మీకి

పౌర జానపదులారా !
పరమ ధర్మవిదులారా !
పరిత్యక్త సాధ్వినిపుడు
పరిగ్రహించును రాముడు

ప్రజలు

పరీక్ష కావలె పరీక్ష కావలె
పాతివ్రత్యం పరీక్ష కావలె

వాల్మీకి

జనకజ కగ్నిపరీక్ష
జరిగెను మున్నొకమాటు
జనులార ! వైదేహినిపుడు
శంకించు టిది పౌరపాటు

ప్రజలు

ఎపుడో ఎచటో ఎవరికి తెలియును
ఇపుడే ఇచటే ఇది కావలయును

వశిష్ఠుడు

సాకేత ప్రజలు మీరు
సత్యపరాఙ్ముఖులు కారు
సాధ్వీమణి యీ జానకి
సందేహింతురు దేనికి ?

ప్రజలు

ప్రత్యక్షములో పరోక్షమేటికి
పరీక్ష కోరకే నిరీక్ష నేటికి

బృందగీతి

ప్రాచేతస ముని రాముని
జూచెను సాకాంక్షముగా
చూచి చూడనట్లు శిరము
నూచె రాము డడ్డముగా

వాల్మీకులు దీనముగా
వశిష్ఠులను తిలకించిరి
వశిష్ఠులును మౌనముగా
వారిని గని తలవంచిరి

శ్రీరాముడు

ప్రజారాధనమె రఘుకుల
పార్థివులకు ధర్మపథము
ప్రజలందరు విన జనకజ
పలుకు గాక మరి శపథము

ల్మీ

ముద్దులబిడ్డా ! వింటివె
పెద్దలైన వీరెల్లరు
శపథ మొనర్చిననె గాని
సాధ్విగ వాకొన నొల్లరు

బృందగీతి

సీతవచ్చి నిలుచున్నది
శ్రీ వాల్మీకుల ముందర
శ్రీరాముని పేరులోని
'శ్రీ' సిగ్గున శిరసువంచె

సీతవచ్చి నిలుచున్నది
శ్రీ వాల్మీకుల ముందర
రాతిగుండె రాజనీతి
రఘురాముని కనులుమూసె

సీతవచ్చి నిలుచున్నది
శ్రీ వాల్మీకుల ముందర
గగనము నిర్ఘాంతపోయి
కన్నార్పక చూచుచుండె

సీతవచ్చి నిలుచున్నది
శ్రీ వాల్మీకుల ముందర
గుండెకరిగి కెరటాలై
గోమతి వెక్కెక్కియేడ్చె

సీతవచ్చి నిలుచున్నది
శ్రీ వాల్మీకుల ముందర
కాలం కాలాడక క్షణ
కాలం స్తంభించిపోయె

సీతవచ్చి నిలుచున్నది
శ్రీ వాల్మీకుల ముందర
వియత్పథములో వేల్పుల
విమానాలు క్రిక్కిరిసెను

సీతవచ్చి నిలుచున్నది
శ్రీ వాల్మీకుల ముందర

భూతధాత్రి గుండెలలో
మాతృత్వం పొంగిపొరలె

అరుంధతీ వశిష్ఠులను
అవలోకించెను జానకి
జాలిదూలు ముగురత్తల
ఆలోకించెను జానకి

అన్నగారి మొగముగాంచు
అనుజుల గాంచినది సీత
దిక్కుమొగము చేసిన తన
బిడ్డల గాంచినది సీత

అల్లాడే శెక్లెంద్ర మ
హార్తిని కనుగొనె జానకి
మూర్ఛిల్లిన ఆంజనేయ
మూర్తిని కనుగొనె జానకి

భయపడి గుజగుజలువోవు
ప్రజలను చూచినది సీత
బరువుగ కనురెప్పలెత్తి
ప్రభువును చూచినది సీత

అభిమానం పట్టలేక
ఆక్రోశించినది సీత
అవమానం మోయలేక
ఆక్రందించినది సీత

"అమ్మా అమ్మా అమ్మా"
అని ముమ్మారనెను సీత
అమ్మలేని బిడ్డలాగు
అలమటించె మహీజాత

సీత

శ్రీరాముని స్మరణమె నా
జీవన సర్వస్వమేని
నా తల్లీ భూదేవీ
నాకు త్రోవ చూపింపుము

నా నాథునితప్ప పరుల
నా మదిలో తలపనేని
నా తల్లీ భూదేవీ
నను నీ యొడి చేర్చుకొమ్మ
స్వామి చరణ కమల రుచుల
నా మానస మలరునేని
నా తల్లీ భూదేవీ
నను నీలో కలుపు కొనుము

బృంద గీతి

''జననీ! జననీ: జననీ!''
అని ముమ్మా రనెను సీత
జనని లేని బిడ్డ చంద
మున వాపోయినది సీత
''కటకట! కటకటా''యనుచు
కరగి నీరయ్యెను స్వామి

''ఫట ఫట ఫట ఫటా''యనుచు
బ్రద్దలై పోయెను భూమి
భూమాత సాక్షాత్కరించి
పుత్రిని బుజ్జగించినది
కన్నీరు పైటతో నొత్తి
గట్టిగా కౌగలించినది

కన్నతల్లిని కౌగిలించి
గళమెత్తి రోదించె సాధ్వి
అనుగుబిడ్డను బుజ్జగించి
తనవెంట గొనిపోయె పృథ్వి
''సీతా సీతా సీతా''
శ్రీరాముని కంఠధ్వని
''మాతా మాతా మాతా''
పాతాళమున ప్రతిధ్వని

# శ్రద్ధాంజలి

### శ్రీ జి. జాషువా

✲

ముదిముత్తైదువ లై, నిజేశులమనంబుల్ పండ, సంతానసం
పదతో పుట్టినమెట్టినిండ్లకు సిరుల్ ప్రాపింప, సంపూర్ణస
మ్మద మింపారగ గాజుమట్టెల ప్రజామర్యాదలన్ దేవతా
సదనం బెక్కిన కామినీమణులకున్ శాంతిప్రసూనార్చనల్.

నా దేశం బిది, రత్నగర్భ, కవిరాణ్మత్తేభముల్ బూర్ణను
ర్యాదల్ మేలిసువర్ణవర్షముల నభ్యర్చావిధానంబులన్
మోదంబందిన తావు, వీరపురుషస్ఫూర్జత్ ప్రతాపాగ్నికిం
బాదంచున్ గళమెత్తి పాడుకొను నీభక్తుండ, హిందూరమా!

తను వుప్పొంగగ మీసముల్ మెలిచి యౌద్ధత్యంబునన్ నీచరి
త్రను నీపుణ్యానదీనదంబులను నీరాజ్యవ్యవస్థామహ
త్త్వను వర్ణించుట నాకు నీసుతునకున్ దోషంబుగా దెందు జూ
చిన నుగ్రాకృతి నృత్యముల్ సలుపజొచ్చెన్ స్వార్థభేతాళముల్.

అనికంటన్ దడిపెట్టు నన్ను గని "వత్సా! సావధానంబుగా
వినుమీ సంధియుగాన దేశమున నావిర్భావమున్ జెందుచుం
డును దుశ్శక్తులు, మేటిసంస్కృతులకున్ జోటైన యీహైందవం
బున వర్ధిల్లకపోవు సౌఖ్యవిభవంబుల్ శాంతిచంద్రాంశువుల్."

అని దేశశాంతిసంపద
కనువగు మార్గమును మందహాసోజ్జ్వలితా
ననయై ఉపదేశము స
ల్పిన దది వాక్రుత్తు కుట్మలించిన కవితన్.

కత్తులు దాచిపెట్టుకొని కైతవపుం గవుగిళ్ళొసంగు గ
మ్మత్తుప్రదర్శనల్ సలుపు మానవనాథుల నాటకాలచే
చిత్తము నొచ్చి సత్యసరసీరుహవాసిని శాంతిహంస, యెం
తెత్తున గూడు గట్టుకొని యేగగనంబున దాగియున్నదో!

కలుషితమైన సాంఘికపు కట్టడులందు నశాంతిబీజముల్
మొలిచి, సమాజముం జెరచి ముప్పుఘటింప, స్వతంత్రభావముల్
గలిగి యెదిర్చువా నధికారబలంబున నొత్తిపట్టి, చి
క్కుల కెరజేయు సంఘమునకున్ బదివేలు కరాళకంఠముల్.

అక్కట! విశ్వశాంతికొరకై, బలియై చనినార లెందరో
భిక్కులు బుద్ధశిష్యు లవివేకమతోన్మదభండనంబులన్
నిక్కపు త్యాగదీక్షల పునీతములై నసియైన యన్మహా
భిక్కుల మేనివృత్తికల వెల్గు జగద్ధితశాంతిబీజముల్.

శాంతిజ్యోతి వెలుంగగావలె, సమస్తక్షోణిచక్రంబు, ని
శ్చింతం సౌఖ్యపయోధి దేలుననుచున్ జిత్రంబుగా శుష్కవే
దాంతంబుల్ వినుపించి, దుర్బలులమీదన్ స్వారి గావించు న
త్యంతస్వార్థపరాయణుల్ గలుగ, సౌఖ్యశ్రీ విరాజిల్లునే?

నీపాపాల్ దొలగించి నిన్నమరశాంతిక్షోణికిం జేర్చువా
డాపద్బాంధవు డున్నవా డొకడు నీ వందాక యీకంచముం
గాపీనంబు ధరించి యోర్చుకొనుడం చన్నార్తు లౌవారికిన్
టోపీబెట్టు ప్రబుద్ధు లున్నభువి నెట్టుల్ వెల్గు శాంత్యంశువుల్?

పుట్టల్ గుట్టల చెట్లు చేమల నొగిం బూజించినం గష్టముల్
గట్టెక్కించు నటంచు నమ్ము ప్రజ కింకం బిచ్చి రేగించు స
మ్రాట్టుల్ దుష్కపు లంధకారయుగధర్మంబుల్ ప్రబోధించుచో
నిట్టూర్చుం ఘనసత్యవాణి కనులం నించుం గదుష్టాశ్రువుల్.

పలుకు లీవంక చేత లావంక నిలువ
వల్లెవేయుదు రురు ధర్మపన్నములను
చెప్పునది చేయువారి హర్షించ దెపుడు
నభము శుభ మెరుంగని యమాయకపు జగము.

తనుసాధించు సుఖంబు నల్వురకు జెందఁ గోరు సౌజన్యవ
ర్తను చిత్తంబు ప్రశాంతవారినిధిచందానఁ మహానందగా
హానసౌఖ్యంబును చూరలాడు భువనం బాధర్మవీరాగ్రణిఁ
గని గర్వించు చరిత్రయుం దల నలంకారంబుగా దాల్చెడిన్.

ఆటమబాంబుగోళకభయంకరఘోషల దిగ్దిగంతముల్
బీటలువారుచుండ, పృధివీవలయంబున క్షామరాక్షసుల్
నాటకమాడుచుండ కబళంబున కేడుచు బక్కవాని క
న్నీటిఝరిన్ మునుంగవె వినిశ్చలశాంతిసుఖప్రచారముల్.

మును మున్యాశ్రమసీమలం బొలిచె సంపూర్ణక్షమాశాంతివా
హిను లాత్రేతలు, ద్వాపరాలు కథలయ్యెన్ స్ఫుట్నికుల్ సృష్టిస
ల్పిన శాస్త్రజ్ఞులు గల్గు నియ్యుగమునన్ విశ్వప్రపంచంబునం
దనుమానంబు భయంబు జుట్టుకొనె నౌరా! స్వార్థపుంబంటయై.

తనసంతోషమె స్వర్గం
బనుకొనువా డధము డఖిలధర్మజ్ఞులు భూ
జనసంతోషమ స్వర్గం
బని తలతురు, విస్మరింతు

గౌతమబుద్ధదేవుడును గాంధిమహాత్ముడు చన్న త్రోవలో
జాతి తరించు శాంతిశశి చల్లనివెన్నెల గాయుచుండగా
భూతల మమ్మహామహుల మూర్తులు శిల్పుల కప్పగించి త
న్నీతికి దూరమై తిరుగనేర్చె స్వలాభపథాభిగమ్యమై.

రాక్షసం బైన స్వార్థజ్వాల చల్లారి విశ్వధర్మము కండబెట్టు చోటు
వంచనాకవచంబు వ్రక్కలుగావించి అలఘుసత్యజ్యోతి వెలుగు చోటు
పసిపాపమోముపై కుసుమించు నవ్వులో వెలుగు సౌజన్యంబు మెలగు చోటు
గురితప్పనట్టి దాశరథిబాణమువోలి ధృఢదీక్ష జయము సాధించు చోటు

ఎదిరి కష్టసుఖము లెల్ల స్వీయములుగా
కోరి నరుడు పంచుకొనెడు చోటు
చింతలేని చోటు, సిరులు పండెడు చోటు
వెదకికొందు గుండె కుదుటబడగ.

లలితకళోద్ధరణం బని
కులమతరహితాధికారగుంభితస్వేచ్ఛా
నిలయం బని; సుఖదం బని
హుళక్కి గావించి రీసహోదరమంత్రుల్.

కావలె బహుళత్వమందు నేకత్వ మనెడు
మేలిపలుకులు మాటసామెతకు గాని
ప్రళయఝంఝానిలోద్ధూతబహుళభంగ
సాగరమునందు సాగునే శాంతినౌక.

కరుణానిధులు ధర్మపరు లైన దివ్యదంపతుల మానసముల బ్రజ్వలించి
పరహితార్థంబుగా బలియైన త్యాగమూర్తుల యంతరాత్మల తురగలించి
భూషణదూషణంబుల నేకరీతిగా స్వీకరించెడువారి చెలిమి సలిపి
కడచన్న యుగమహాకవుల జిహ్వాలమీద ప్రత్యక్షరంబున నృత్యమాడి

ఆదిరాజచరితలందు ధర్మమునందు
సౌరభిల్లు నిండు సౌఖ్యలక్ష్మి
హాయిమీర భారతీయుల నట్టింట
వేయుగాలు తాండవించుగాక !

# అందమే ఆనందం

## శ్రీ "అమరేంద్ర"



అందంఇచ్చే ఆనందం అక్షయం అన్నాడు కీట్సుకవి. అన్ని వస్తువులలోనూ దోబూచులాడే సౌందర్యాన్ని దర్శించి ఆరాధించటమే లక్ష్యంగా జీవించిన సుకవి ఆయన. అందుకే అందం సత్యానికి మరొక రూపమని గ్రహించటమే జీవితానికి పరమావధి అని తలపోశాడు. ఆలోచించే మెదడుకి సత్యంగా గోచరించిన వస్తువే అనుభవించే హృదయానికి సౌందర్యరూపంలో దర్శనమిస్తుందని అన్నాడు.

అందమంటే ఏమిటని నిర్వచించవలసిన పని ఏముంది? సంకుచితమైన నిర్వచనాలలో ఇముడని భావాలలో సౌందర్యం ఒకటి. అనుభవంలో అందమంటే ఏమిటో అందరికీ తెలుసును. మాటల్లో తేల్చి చెప్పమని అడిగితే చిక్కులోపడతాం. కాని కాలదేవత చెక్కిళ్లమీదుగా జారిన పాలరాతి అశ్రుబిందువుగా మెరిసే తాజ్ మహల్ ని చూస్తాం. ఒకచేత్తో అమృతకలశం, ఇంకోచేత్తో విష భాండం ధరించి మథించిన మహాసాగర తరంగాలలోంచి ఆవిర్భవించిన ఊర్వశి లావణ్యమూర్తిని భావిస్తాం. కణ్వులు చేసుకున్న తపసుల ఫలంగా నిలిచిన అనాఘ్రాత పుష్పం లాటి శకుంతల సురుచిర స్వరూపాన్ని మనోనేత్రంతో దర్శిస్తాం. అవనీంద్ర, నందలాల్, రఫేల్, లియోనార్డో వంటి శిల్పుల చిత్రాలనిచూసి "కళాదేవతల కడాని చూపుల కాలం బందీ కాదా?" అనుకుంటాం. విమల గాంధర్వం విని వినువీథుల్లో తేలిపోతాం. ఇటువంటి కళా స్వరూపాల్లో సౌందర్యం రూపురేఖలు దిద్దుకొని హృదయాలని ఉర్రూతలూగిస్తుంది. అంతేకాదు. మనచుట్టూ వున్న అందచందాలు చూస్తూ ఒక్కొక్కప్పుడు మైమరచిపోతాం. ఋతువుకొక కొత్త ముస్తాబుతో మనల్ని అలరిస్తుంది వయసెంతో తెలియని భూదేవి. కాలితో తొక్కినా రంగులపూలనీ మెత్తని పచ్చిక తివాసీలని పాదాలముందు పరుస్తుంది. మన తలలమీద విప్పిన పట్టు గొడుగులాగా నిలబడ్డ నీలాకాశం వింత వింత మబ్బులతో విస్మయం కలిగిస్తుంది. ఎన్నిసార్లుచూసినా ఎప్పటి కప్పుడు కొత్త సోయగంతో కనిపించే చందమామ మనలో నిద్రపోయే శైశవాన్ని పలుకరిస్తాడు. ఉప్పొంగే సముద్ర తరంగాల్లో స్నానంచేసినట్లు స్వచ్ఛదీప్తితో పైకివచ్చే బాలభానుడు తన లేత కిరణాలతో మనస్సుని గిలిగింతలు పెట్టినప్పుడు సరోవరాలలో మేలుకొన్న పద్మినిలాగా పారవశ్యంతో ఊగిపోతాం. అసలు ఈ సృష్టిఅంతా ఒక అందాల బరిణె, ఇదంతా ఒక వింత ఆటవస్తువుల పెట్టె. వీటితో ఆడుకునే నిత్య శిశువు మానవుడు అనిపిస్తుంది. మనలోపల ఎంత విషాదం వున్నప్పటికీ మనచుట్టూ ఎంత అందం వుంది! ఎంత ఆనందం వుంది!

కాని ఆధునికయుగంలో జీవితం ఎడతెగని సంఘర్షణగా సంగ్రామంగా మారిపోయింది. చుట్టూవున్న అక్షయ భాండాగారంలోకి అడుగుపెట్టి అందులో దాగిన ఆనందాలని ఆస్వాదించగల తీరిక లేకుండా పోతోంది. యాంత్రిక నాగరికత దుశ్శాసనుడిలాగా ప్రకృతికాంత పచ్చటి వలువలని బలవంతంగా ఒలిచివేస్తోంది. అందుకే జీవితం కన్నీటివానగా, ముళ్ళబాటగా, పాత గాడిగా, మింగలేని చేదుకషాయంగా తయారైపోయింది. శ్రావణ మేఘాలూ, శరత్ కాలపు వెన్నెలలూ, వీథుల్లో రాసులుగా పున్నాగపూలూ, లోపల రక్తహృదయాన్ని దాచుకుని తెల్లగా నవ్వే పారిజాతాలూ, రెప్పవాల్చకుండా తరగని కుతూహలంతో జగన్నాటకాన్ని వీక్షించే ప్రేక్షకులులాగా బారులు తీర్చిన లక్షల నక్షత్రాలు ఈ యాంత్రికయుగంలో బండబారిన మన గుండెలని కది

లించలేకపోతున్నయ్. జీవితంలో ఆనందమే అడుగంటి పోయి పీడ కలలాటి ఈ పాడు బతుకుకి ముగింపు ఎప్పుడా అని ఎదురుచూసే పరిస్థితి ఏర్పడింది. అయినప్పటికీ గుర్తించగల కళ్లువుంటే, పులకించే హృదయముంటే ఈసృష్టి తరగని ఆనందాల గని, తరగలతో నురుగులుపొంగే నవరస ధుని. ప్రతివస్తువునీ పసిపాపలాగా ఆశ్చర్యంతో చూడ గలగాలి. అతిపాతగా తోచే సూర్యాస్తమయమే సరి కొత్తగా కళ్లకి కనిపిస్తుంది. పచ్చటి అద్దాలమేడలోంచి పొంచిచూసే అప్సరసలాగా గన్నేరుపువ్వు కనబడుతుంది· తుమ్మలకొమ్మలలో గాలి బాలలు ఆడుకుంటున్న ఊలు బంతుల్లాగా పచ్చటి గుండ్రటి పూలు ముచ్చటకలిగిస్తాయి·

ఒకరి చూపుకి అందంగా కనబడిన వస్తువు ఇంకొకరి కంటికి ఎందుకూ కొరగాని దానిలాగా కనిపిస్తుంది. దీన్ని బట్టి, అందం అనేది వస్తువులోవుందా, చూసేకళ్లలో వుందా అనే అనుమానం కలుగుతుంది. డాక్టర్ జాన్సన్ కళ్లకి తను ప్రేమించిన స్త్రీ గొప్ప అందకత్తెగా కని పించింది. ఆయనస్నేహితులు ఆమెని చూసి ‹‹రంగులు వేసుకున్న ముసలమ్మ›› అని హేళనచేశారు. అందుకే కాబోలు మనవాళ్లు తాను వలచినది రంభ తాను మునిగినది గంగ అన్నారు. ఒక కవి పావురాన్ని చూసి, మంచులాటి దాని రెక్కలనిచూసి మురిసిపోతుంటే పక్కనే నిలబడ్డ పామరుడు ఆపక్షిని చంపి దాన్ని కూరవండుకుని తింటే ఎంత బాగుంటుందో అని గుటకలు మింగుతాడు. దీన్నిబట్టి చూస్తే అందం వస్తువులోనూ, చూసే మనిషి డెందం లోనూ వున్నదనిపిస్తుంది. భావించగల హృదయంవుంటే నీలిరంగు గడ్డిపూవైనా, ఆకాశంలో ఇంద్రధనుస్సైనా, చీకటి గుబురుల్లో మిణుగురుపురుగైనా, మందార సుందరితో మంతనాలాడే సీతాకోకచిలుకైనా, మనన్ని పలకరించి నిలువెల్లా పులకరింపజేస్తుంది. ఇంద్రియాలకి అపూర్వ సుఖాన్ని చేకూర్చి కనులపండువుగా వీనుల విందుగా జీవితమొక సుధాకలశంగా తోచేట్లు చేస్తుంది. సకలేంద్రియాలతో అందాన్ని, ఆనందాన్ని ఆస్వాదించి తన అనుభవాలకి అక్షరరూపం కల్పించిన కవిశేఖరుడు కీట్సు.

ఈ సౌందర్యారాధనలో ఇంకా ఉన్నతశిఖరాలని అందుకున్న వారున్నారు. అందమైన వస్తువుల్లో భౌతికా నందంతోపాటు ఆధ్యాత్మికవైభవాన్ని గుర్తించకలిగారు. ‘‘ఆప్రణయమూర్తి దరహాస విలాసం సృష్టిలోని సౌందర్య వికాసం’’ అన్నాడు సౌందర్యతపస్వి రాబర్ట్ బ్రిడ్జస్. అందమైన ప్రతివస్తువూ మానవాత్మని పలకరించే దేవ దూతగా కొందరికి కనబడుతుంది. ప్రాణనాథుడికి దూరమై పోయి అశోకవనంలో సీత ప్రవాసజీవితం దుర్భరంగా గడుపుతోంది. లంకలో ఎన్ని భోగభాగ్యాలున్నా ఆమె హృదయాన్ని చూరగొనలేక పోతున్నయి. ఇంతలో మహావీరుడు రామదూతగా వచ్చాడు. ‘నిన్ను ఎల్లా నమ్మగలను?’ అని సీత అడిగినవెంటనే రాముడి మొహరుతో వున్న బంగారపు ఉంగరం చూపించాడు. ఆమె అను మానాలన్నీ మటుమాయమైపోయి ప్రియుడి సందేశాన్ని ఆలకించింది. అల్లాగే ఆరామంలో వికసించే ప్రతిపుష్పమూ విశ్వవిభుడు మానవహృదయానికి పంపిన ప్రణయలేఖ అన్నారు గురుదేవులు. ఈదృష్టితో చూసినప్పుడు ప్రతి అణువులోనూ బ్రహ్మాండభాండం కనిపిస్తుంది· చిన్నిపూవు నేలరాలినా కవిహృదయం కన్నీళ్ళతో నిండిపోతుంది. విషాదభావాలతో హృదయం బరువెక్కిపోతుంది.

కాని ఈ శతాబ్దంలో శిల్పులూ కవులూ అందానికీ వికారానికీ మధ్యవున్న దూరాన్ని తగ్గించివేయాలని ప్రయత్నం చేస్తున్నారు. సంప్రదాయప్రకారం సుందర మైనవిగా గుర్తించే వస్తువులని వదిలేసి అప్రియంగా కన బడే వాటిని స్వీకరిస్తున్నారు. ‘‘హీనంగా చూడకు దేన్నీ. కవితామయమేనోయ్’’! అనే వాదం బయలుదేరింది, దూరంగా వినుదారుల్లో అందీఅందని అందాలకోసం వెదికిన కళ్ళు ఆపరేషన్ గదిలో చావుబతుకుల సరిహద్దుల్లో ఆవులించే రోగినీ, కడుపు దహించుకుపోయే పడుపుకత్తె కళ్ళలో భయంకరబాధల పాటల పల్లవినీ గుర్తించాయి. ఉన్మాది మనస్సినీవాతీలో వినిపించే ఘూకంకేకా భేకం బాకా, రాబందుల రెక్కలచప్పుడూ పొగగొట్టపు భూంకారధ్వనీ, నడినిసిలో తీతువుకూతావిని అస్తవ్యస్త మైన నేటి జీవితానికి వాటిని సంకేతాలుగా ఏర్పరుచు కున్నారు. ఇది అందంమీద తిరుగుబాటుకాదు. సౌందర్య సీమలని విస్తరించటానికి చేసిన ప్రయత్నం అనవచ్చును.

ఎలియట్ కవిత్వం, పికాసో శిల్పం, పాల్ రాబ్సన్ సంగీతం, విలియం సారోయాన్ కథానికలూ, టెనెసీ విలియమ్స్ నాటకాలూ ఈ ప్రయత్నానికే తార్కాణాలు. కిందటి శతాబ్దంలో సామాన్యవస్తువుల్లో ఎప్పుడూ చూస్తూవుంటం వల్ల పాతబడిపోయి మామూలు కళ్ళకి కనబడని వింతని సోయగాలని ఆంగ్ల కవివర్యుడు వర్డ్స్‌వర్త్ తన రచనల్లో ఆవిష్కరించాడు. ఆదర్శదృష్టితో చూసినా, వాస్తవదృష్టితో చూసినా అందంలో ఆనందమే ఎదురవుతుంది. ఆ వెలుగు గుండెల్లో ముసురుకునే చీకటితెరలని పటాపంచలు చేస్తుంది

ఆదికవి నన్నయ మొదలుకొని ఈనాటివరకూ ఆంధ్ర కవులు మాటల్లో ఒదిగిన అందాన్ని ఆరాధించి తరించారు. ఉజ్వల లసత్తర తారకహారపంక్తులనీ, హంససారస మధువ్రత నిస్వనాలనీ, ఇందు శిలలందు జాలువారే గురివెంద పూదేనియలనీ, అలినీగరుదనీకమలినీ కృతధునీకమలినీ సుఖిత శోకకుల వధూకాలనీ ప్రాచీనకవులూ ప్రబంధకవులూ మధురంగా ప్రదర్శించారు. ఆగడపుమబ్బు శయ్యలమీద నిద్రపోయే బుడుత చంద్రుడినీ, ప్రణయిని కన్నులలోని అనంతాంబరంపు నీలి నీడలనీ, వినిర్మలాంబుపూర గంభీర కాసార చిత్ర హృదయములలోని గాటంపు నిదురచాయలనీ సుకుమార హృదయులైన నవకవులు చిత్రించారు. నాటినుంచీ నేటివరకూ అక్షరరమ్యత ఆంధ్రకవిత్వానికి ఆభరణంగా మెరిసిపోతోంది.

సుఖదుఃఖాల దాగుడుమూతలతో, ఆశా నిరాశల రాగమాలికలతో అద్భుతంగాతోచే మానవ హృదయ సౌందర్యం కొందరు రచయితలని ఉర్రూతలూగించింది. ఈ అందాన్ని నవలల్లో, నాటకాల్లో, కథలో ప్రతిఫలించి కొందరు ధన్యులయారు. కాబూలీవాలా కాఠిన్యంలో మరుగుపడిన పితృప్రేమ, వేశ్య చంద్రముఖిలో మేలుకొన్న పవిత్రప్రణయ ప్రవంతి, డెన్మార్కు రాకుమారుని గుండెల్లో రేగిన సందేహాల డోలాందోళనలూ, మానవ హృదయ మహనీయతని నిరూపించాయి

ఉన్నతాదర్శాలు సాధించిన జీవితంలో ఉత్తమ సౌందర్యం వుందన్నారు గాంధీజీ. సత్యంకోసం విషపానం చేసిన సోక్రటీస్, దేశంకోసం అసువులుబాసిన అబ్రహాం లింకన్, సిలువమీదినుంచి క్షమాధర్మం బోధిస్తూ తన ప్రాణాలు తీసిన వాళ్ళని మన్నించిన జీసస్ తమ జీవితాలలో మహిత సౌందర్యాన్ని ప్రస్ఫుటంచేశారు. కళ్ళల్లో దోబూచులాడే అందాన్ని మనుగడలలో అడుగడుగునా అందుకోగలిగిన రమణీయజీవనం వాళ్ళది.

అంతదూరం వెళ్లటం మనకి చేతకాకపోవచ్చును. కాని మన చుట్టూవున్న చిన్న చిన్న చెట్లలో, గట్లలో, పిట్టల్లో పిల్లల్లో తొంగిచూసే అందాన్ని గుర్తించి ఆనందించగల హృదయంవుంటే చాలును. కంటకాలలో దాగిన గులాబుల గుబాళింపులతో అంపశయ్యవంటి బతుకుని పూలపానుపులా పరుచుకోగలుగుతాం. లోకం "అరలు లేని ఇరులు లేని కరుణాలయం"గా, విశ్వమంతా ఆనందమందిరంగా కనబడుతుంది. సకలసృష్టినీ ఆదరంతో చూడగల దృష్టి అలవడితే హృదయం అంచులదాకా నిండిన ప్రణయ కలశం అవుతుంది. అప్పుడు మన మలినమైన అశ్రువులే స్వామి పాదసీమలో "పరమపావన జాహ్నవీ ప్రతిభ గాంచు"అంటారు కృష్ణశాస్త్రిగారు.

ఇదంతా భ్రాంతి అని తార్కికులు పెదవి విరుస్తారు. నిష్ఠుర నీరస సత్యాలకంటే కమ్మని కల్పనలేకదా జీవితానికి ఆధారాలు ? అందుకే అందమే ఆనందం అని మరొకసారి అంటాను.

# అక్కా-చెల్లెళ్లు

శ్రీ "అమరేంద్ర"

మరణం మరుపూ అక్కా చెల్లెళ్ళు
బతుకుదారి పొలిమేరలో ఎదురవుతుంది మరణం
బతుకు గతుకుల్లో అడుగడుగునా నే నున్నానంటుంది మరుపు!
బతుకు గుండెలమీద ఏటవాలుగా పాకే మరణపు నీడ మరుపు

"ముందు నాతో పరిచయం చేసుకోండి.
మా అక్కయ్య జడలు విరబోసుకుని అమాంతంగా మీముందు నిలిస్తే
అదిరిపోకుండా వుండాలంటే ఇదే దారి" అంటుంది మరుపు.

నిన్న

తనువులు వేరైనా మనసు లొకటై
నెలలో వెన్నెలలా
పూవుల్లో తావిలా
పాటలో మాటలా

కలిసి, కరిగి, ద్వైతంలో అద్వైత మైపోయి
రెక్కలాడిస్తూ రిక్కలలోకి దూసుకుపోయి
మందాకినీతీర మందానిలాలలో
నందన సుమవన సుందరసీమలో
జగమునే మరచిన ఖగములజంట

రేపు

ఉయ్యాలలో పసివాడిగుక్క, సావిట్లో పెద్దపిల్లల తిక్క,
వంటింట్లో తల్లికొంగు వదలకుండా కాళ్ళకు అడ్డంపడే ఎడపిల్లరగడ,
తారస్థాయిలో ప్రాణం విసిగిన గృహిణి కేక, తలుపుతట్టే అప్పులవాళ్ళ
నిప్పులమాటల డప్పులు, మారుమూల పడకకుర్చీలో అంపశయ్యమీది
భీష్ముడిలాగా మాజీ ప్రేమికుడి విషాదయోగం

ఇదంతా నా వాళ్ళ విరుపు
కాదూ అంటుంది మరుపు!

మొన్న

కళ్ళు మూస్తున్న భార్యచేతులో చెయ్యివేసి ఆజన్మబ్రహ్మచర్య
దీక్షపట్టిన ఆంజనేయుడి తమ్ముడు

రేపు

కొత్త వలపుల విందుకోసం తత్తరపడుతూ గాలికి చిగురాకు కదిలినా
ఆమె గాజులమోత అనుకొని వెయ్యికళ్ళతో వేచివున్న నవమన్మథుడు

ఎంతటి లోతైనగాయం
ఇంతటిలోనే మటుమాయం
ఇదే మీకు నేను చేసే సాయం
అంటూ అరిచింది మరుపు.

మొన్న

యువహృదయాలలో జ్వాలలు రగిలించి నవస్వప్న విపంచి బిగించి
పరికించిన అందాలబాల ఆనందాలమాల

నేడు

అజ్ఞాతవాసం చేస్తూ అలమటించే నేలరాలిన నక్షత్రం
అర్ధరాత్రి మహాబ్ధిలో విరిగికూలిన తరంగం!

నిన్న

ప్రజల గుండెల పూలదండలు దండిగా మెడనిండా ధరించిన
కొండంత హీరో

రేపు

కాఫీకి కాసీ ఠికానా లేని
ఎక్కడున్నాడో ఎవరికీ అక్కర లేని దిక్కు లేని, ముందర అంకెలేని
బండీచక్రమంత జీరో!
"మా తమ్ముడేసుమా కొంపలంటుకుపోతుంటే
రాగసుధారస పానం చేసిన సమ్రాట్ నీరో!"

శాం

అంటుంది మనుపు
వద్దంటుంది వెరపు
అవునంటుంది వగపు
మరణం మరుపూ అక్కా-చెల్లెళ్ళు

## తీపి-చేదు

చేదు తీపి జీవ ఫలం
కాదు కాలకూట విషం
లేదు సుధా మాధుర్యం!

మరణించిన ప్రాణి కొరకు ఒక మూల విలాపం
మంగళ వాద్యాల నడుమ కళ్యాణ కలాపం
బ్రతుకే ఒక ఉన్మత్తుని అర్థహీన ప్రలాపం

తెలుపు నలుపు గడులతోడ సాగిపోవు చదరంగం
వింత కాంతులను విసిరే చీకట్ల తరంగం!

కాలపు మగ్గం నేసిన కలినేతల చీరెరా
పడుగు పేక చెడుగు మంచి ఎడబాయని చెలులురా!

అశ్రుబిందు హృదయంలో
దరహాస విలాసం
ఒక కంట్లో ఖేదం
ఒక కంట్లో మోదం
అడుగడుగున జగములోన
రెంటికీ అభేదం!

శ్రీ 'అమరేంద్ర'

# నే నెవరిని?

మానవ జీవనసాగర
ఘన తరంగ మాలలపై
ఫేన ధవళ హాసమునా?
దీనహృదయ ప్రతిస్పంద
నినద భయద లయ మృదంగ
ధ్వాన శోకగానమునా?

నే నెవరిని? నే నెవరిని?

కొలను అలలడోలలందు
కలల సోలు నెలవంకనొ?
చిరుగాలుల నటనమాడు
చిగురాకుల గుసగుసనో?

జాలికనుల కొనల తొణుకు
లలితబాష్ప బిందువునో
యౌవన బింబాధరాల
లావణ్యారుణ శోభనొ?

మానసమహతీ ముఖరిత
మధుర రాగరేఖనో
తెలియని లిపితో రాసిన
తొలి వలపుల లేఖనో?

కోమల కరకంకణముల
ఆమని ఝుంకారమునో?
కాళరాత్రి కురుల మెరయు
తారా సుమదామమునో?

శుభప్రభాత నయనాంచల
సుఖస్వప్న స్మరణమునో!
నరుల నిరాశాశ్రువులను
మెరిసే రేపటి వెలుగునొ?

నే నెవరిని? నే నెవరిని?

*　　*　　*

# దర్శనము

## పండరిభాగవతము నుండి

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

★

పుండరీకుడు మహాభక్తుఁడు. పుండరీకవరదుఁ డగుటవలననే స్వామికి 'పాండురంగఁ'డను పేరు గలిగినది. పుండరీకుఁడు దొలుత కామియై, పలువితములఁ జెడిపోయెను. కడకు వివేకముగలిగి, తలిదండ్రుల సేవయే సర్వస్వమనుకొని, దానితోనే తరించెను. పుండరీకుని యానతిని, నేటికిని బాండురంగఁడు— 'పండరీ క్షేత్రము'న నిటుకరాతిపై నిలిచి భక్తులను దరింపఁజేయుచున్నాఁడు. పరమభక్తుడైన పుండరీకునకు, స్వామి దరిసెన మొసఁగిన సందర్భములోని వీ క్రింది ద్విపదలు—

'పండరీభాగవతము' నా మహాకావ్యము. అది 24 వేల ద్విపదలుగ సాఁగినది. 'తాళ్ళపాక' వారితో నంతరించిన ద్విపద కవితలను వ్యాప్తికిఁ దెచ్చుటకుఁ జేయఁబడిన దీ ప్రయత్నము.

సకలజీవముల హృత్సరసీజములను
నికరంబుగా నిండి నిల్చిన వెలుఁగు
దా నొటఁ బుండరీకానీతమైన
మానిత పితృసేవ మదిని దాకినది

పుండరీకుని భాగ్య పుండరీకమ్ము
ఖండసౌరభములు గమియ విచ్చినది

వేంచేసె విష్ణుండు వేంచేసె, మౌని
సంచయానందంబు - సర్వగీర్వాణ
భావనావిషయంబు - పద్మాకటాక్ష
పావనాఽఽరామ శోభావసంతమ్ము

వేంచేసె, సనకాది విబుధహృత్పద్మ
చంచరీకము - భక్తచంద్రికామంద
హాససాభోగమాయాపరిష్కార
భాసురం బాదృత భూసురంబైన,
వెలుఁగు సాయుజ్యశీతలము - మాధుర్య
ములసీమ -యనుకంప దొలఁకెడు టెంకి

శశివిభూషణజటాశాలాఽభిరామ
విసృమరపాటల్యవిభవంబులకును

ననుగలం బగు జొత్తు లడరించి, శైల
తనయాస్మితాఽఽసారతారళ్యములకు
నొరవడులై యొసపరులైన గోప
తరుణుల వీఁగుబిత్తరపుఁజన్నులకుఁ
దొడవులై, యందాల మడువులైనట్టి
యడుగులతో వచ్చె నంబుజాక్షుఁడు

కాంబవోద్యచ్ఛ్రీవిడంబ కంఠాగ్ర
లంబమానాంశుమాలాకీర్ణవైజ
యంతితోమాలియ యట్టిట్టుఁదూఁగ

దంతురకారుణ్యతరళితాపాంగ
చకచకద్రోచిరుత్సవములు చదల
వికసింపఁజేయఁ, గ్రొవ్విరులదామములు

లలితపీతాంబరోజ్జ్వలచారుకాంతి
కళికలు, దిక్కుడుంగములఁ గైసేయ
జలధిజాచరణలాక్షారేఖవోలి
కలికివన్నెలతోడి కౌస్తుభం బమర

జగజంపు గడితంపు జలతారుచేల
నిగనిగల్మిట్టింప నిండైనయెడఁద

తీరైన కస్తూరి గీఱునామమ్ము
జాతి బొమ్మలతోడ సాళగింపంగ

భ్రమరకవ్రాతంబు ఫాలంబుపైని
బొమలాని ప్రెక్కణంబులు హవణింప

పులుగడిగిన ముత్తెములవోలె, మేన
దులకించి స్వేదబిందువులు వట్రిల్ల

నెమ్మిదొలంకెడు గెమ్మోవిపైనిఁ
గ్రమ్మిన చిఱునవ్వు కలకలలాఁడ

మకరకుండలవిభానికరంబు మలసి
ప్రకటింపఁ గండముల్ బలియు బీరెండ

పుంజితశింజానమంజిమానూన
మంజీరములు సూర్య్య మకమకసేయ

బహిరబహిఃపూర్ణుఁ డహిపపర్యంకుఁ
డహరహరుదితుఁ డహస్కరచంద్ర
నేత్రుండు- భవలతాదాత్రుండు - వినుతి
పాత్రుండు - వ్రజలోకభాగ్యభండాగ
మేతెంచెఁ బుడపుటనై తుందపుటము
దొంతరగ్గా ముద్దు దుంపెసలాడ

వేదాత్ముడైనట్టి విహగాధినాథుఁ
డేదిదోపక యడుగెంటనే బాఱ

పని యేమి గల్గెనో స్వామి వేంచేసె
నని సుదర్శనమూర్తి వెనువెంట నంట

ధీరతోదారదుర్వారఝాంకార
చారురూపము పాంచజన్యంబు నడువ
పసనిపయ్యెద దూఁగ నసదు నెన్నడుము
విసవిసగా లక్ష్మి పిఱుపీకులాఁడ

సైన్యాధినేత విష్వక్సేనమూర్తి
యన్యదుర్దముఁడు దోడై సందడింప

కంకణహుంకారఘనపరిష్కార
సంకులసంఖ్య విశంకటవిక్ర
మాటోప మైనగదాగ్ర్య మేపాటు
వాహటిల్లెనో ! యంచు దూటికొనంగ

నగ్రజాగ్రజ్జ్వాలి కోగ్రమై విక్ర
మాగ్రియంబగు నందకాఖ్యంబు గలువ

కనకకంకణసముత్కట ఝణత్కార
ఘనఘనాఘనరవాకర్ణ నోద్భ్రాంత
వినతదైత్యాంగనావేతాళమగుచుఁ
బనివిను శార్ఙ్గమ్ము బలఁగమై యంట

వైకుంఠవాససౌభాగ్యసుశ్రీకు
లాకులంపడ వైష్ణవాచారయుతులఁ

పంచమంగళమైన భద్రగజమ్ము
వంచించు గమనసౌభాగ్యంబుతోడఁ
బారకించె వేదాంతపరమసిద్ధాంత
మరుదైన నారాయణాభిధానుండు

ఆసమయమ్మున నత్యంతభక్తి
భూషితుండైనట్టి పుండరీకుండు

దనబోటి గోమయమ్మున శుద్ధిసేసి
కొనసాఁగు రక్తి ముగ్గులు దీర్చినట్టి
నెలవున జోడుపీటలు వేసి- గురులఁ
జెలువారఁగా నుపస్థితులఁ గావించి

కనులందుఁ దనువందు మనమందు వినయ
మనుగతికంబుగా నల్లన మ్రొక్కి
ఘనసారవాసనాకలితనీరములఁ
బనుపడ భావంబు పాదముల్గడిగి

యాజలం బమరుల కైన దుష్ప్రాప్య
మీజన్మమున దక్కె- నిం కేటి ముక్తి
యనుభావ మశ్రాంత మాక్రమింపంగఁ
గనుదోయి జలము లాకట్టఁగా గ్రోలి

యలరారఁగా శిరస్థ్నలి దాల్చి – కావి
దొలఁకు చందనము నిగ్గులువారఁ బూన్చి

యక్షీణపాపసంధుక్షణాకార్య
దక్షాంఘ్రులకు నక్షతలువేసి మ్రొక్కి

మొలతేర రాగంబు మొన లావులించి
యెలదేటిగము లెంగిలింపనిపూలు

గరువలి సుడిసి దెప్పరముగాఁ గవియఁ
బురిగొన్న పుప్పొడు ల్వ్రాలివోని పూలు

తరణికూటమున మేయరలిదళోష్ఠ
మొరసెడు మధుమద ంబొలుకని పూవు

లావటించుచును సహస్రనామార్చ
నావహితుండనై యటు నొక్కుచుండి

ఘలుఘల్లుమనుపాద కటకనినాద
ములు రెండుచెవులలోఁ బోరుకలంగఁ
దలమల్చి చూచినఁ దన యెట్టయెదుట
జలజనాభుఁడు భక్తకులమనోధనము

మొలకట్టుగజ్జెలు జలధిజాస్మేర
కలగీతముల కనుక్వణనము ల్లాఁగ
గరకంకణమ్ములు ఘలుఘల్లు మనుచు
బొరలేని సాయుజ్యముక్తిఁ గీర్తింప

శిఖిపింఛదళపరిష్కృతములౌ కురులు
ముఖమండలమ్మున ముగ్గిసలాఁడ

నఱుదైన రతనాలసరులచే వెలుఁగు
బురుసారుమాలు చూపఱ నొగ్గియింప

నొప్పైన సిగమీద హొయలుగూడంగ
గొప్ప ముత్తియముల కుచ్చులాడంగ

మంజాడులనుమించి మగఱాలచేత
రంజిల్లు గలికితురాయి దూగంగ

గరువంపుఁ గడినింపు గరువుపై మురువు
ముఱియింపులగుఁ గ్రొత్తమురువులు వెలుఁగ

బులుగడిగిన ముత్తెముల జగాజగలు
ఝళిపించు మదికించు చౌకట్లు మీఱఁ

జుఱుకుఁ గెంపులతోడ జోడైన గంట
సరికంఠమునయందు సరిగాగనొప్పఁ

గట్టాణిముత్యాలు గట్ట నందాలు
మిట్టించు నఱచట్ట మేలిల్లు గాగ

బుగబుగమని తావు లెగయించి యింపు
పగటు నీరాజిదుప్పటి దుసికిల్ల

వలనొప్పు వజ్రాలవంకి, యుత్తరిగె,
లలిమీఱు జాజిపచ్చల చిల్కతాళి.
మెఱుఁగైన గెంపుల మేల్పతకములు
గరమొప్పు నక్షత్రకందమాలికయుఁ
బంచరత్నమ్ముల బాహులపురులు
పంచాణములమేలి వజ్రాంగుళీయ
కమ్ములు, నొసపరికడియముల్, తావి
జిమ్మెడి జీవరత్నముల చేస
రమ్ములు, బిరుదుపెండెమ్ము, గ్రొత్తావి
ముమ్మరించెడునట్టి బొందుతోమాల,
ధరియించి, నడుముపైఁ గరములనుంచి
కరుణాకటాక్షము ల్గడల సారించి
ప్రత్యక్షమైన, నప్పరమపురుషుని
నత్యాదరంబున నభివీక్ష సేసి
తల్లిదండ్రులసేవఁదనియంగఁదీర్చి
యల్లన నరుదెంతు నంతకాలమ్ము
చెలువార నీ శిలాఫలకంబుపైని
నిలిచియుండుమటంచు బలికినఁ బుండ
రీకుని ధర్మాఽతిరేకత మెచ్చి
శ్రీకాంతుఁ డాశిల పైకెక్కి నిలువ

# భారతదేశప్రశంస

## శ్రీ గిడుగు వెంకట సీతాపతి

వేదై ర్వేదాంగసూత్రై ర్మునిజన భణితై ర్జ్ఞానవిజ్ఞానసారై
ర్వాల్మీకివ్యాసకావ్యై ర్నవరసభరితైః కాళిదాసప్రబంధైః ।
రాయుర్వేదాదిశాస్త్రై ర్భరతవిరచితై ర్నాట్యవిద్యాప్రసూనైః
సంపన్నం నిత్య మీడే నవనిధిభరితం భారతం పుణ్యదేశమ్ ॥

యదాఽహం పశ్యామి ప్రకృతివిభవం భారతతలే
హిమాద్రేరగ్రం మా మవనతగతే రుద్గమయతి ।
సముద్రో దృష్ట్వా మా ముపదిశతి గంభీరకవితాం
మదీయం హృత్పద్మం వికసతి సుధీధామకలితమ్ ॥

అద్యా ప్యాదౌ ప్రజనిత మహాసంస్కృతి ర్భాతి యస్మిన్
నీతిర్యస్య స్వయ మభినుతా శాంతి రక్షాభియుక్తా
ప్రీతిర్యస్య హ్యఖిలవసుధా పంచశీలానుమోదాత్
వందేఽహం తం సుగుణజనకం భారతం పూజ్యదేశమ్ ॥

భాషా స్త్వనేకా వివిధాశ్చ ధర్మా
వర్ణాశ్చ భిన్నా బహవశ్చ పక్షాః ।
తథాఽపి సౌభ్రాత్రసమైక్యనీతి
ర్యస్యప్రజానాం హృదయే ప్రవృద్ధా ॥

సర్వేవయం భారతదేశ పుత్రాః
సంస్కార ఏకో లసతీతి మత్వా ।
యస్యప్రజా జ్ఞానయుతా భవంతి
స్మరామి తం భారత మార్యదేశమ్ ॥

స్వాతంత్ర్యయుద్ధం శతవర్షకాలం
కృత్వాఽపి వీరా విఫలా బభూవుః
గాంధి స్త్వహింసాసమరేణ యస్య
స్వాతంత్ర్యసిద్ధిం చ నయేన లేభే ॥

స భారతం నామ విశాలదేశో
లోకే స్వతంత్రో యశసా విభాతి ।
ప్రేమ్ణాచ భక్త్యా వినయేన వందే
తం దేశ మార్యం సతతం స్మరామి ॥

లోకాః సమస్తాః సుఖినో భవం త్వి
త్యేవం త్రిసంధ్యం సమయాచ యస్య ।
సద్ధర్మసూత్రం ప్రవదంతి పుత్త్రా
స్తం భారతం నామ నమామి నిత్యమ్ ॥

ధన్య స్త్వం త్వా మపతు భగవాన్ ప్రార్థితస్సన్ త్వయాఽసౌ
తుభ్యం దేయా ద్విభవ మతులం త్వత్తు గృహ్ణామ కించిత్ ।
ఆచంద్రార్కం తవ సకృతయః కీర్తనీయా భవంతు
శ్రేయోధర్మ స్త్వయ లసతు భోః భారతాఖ్యా ప్రసిద్ధః

జయతు జయతు లోకే భారతం నామదేశో
జయతు జయతు తస్య ప్రాయ సోఽభీష్టశాంతిః ॥
జయతు జయతు తేన ప్రేరితం పంచశీలం
జయతు జయతు తేన ప్రస్తుతా రాజనీతిః ॥

# దేవీస్తుతి

## శ్రీ చెలమచెర్ల రంగాచార్యులు



విలసత్త్రావకదివ్యవీక్షణసుధావీచిన్ సహస్రాంశమే
మలయన్ సుందరవిశ్వమందిరవినిర్మాణైకచాతుర్యముల్
కలిగెన్, నెగ్గెను దేవజాతిఘనుఁడై కంజాతజాతుండు నీ
వలన; న్నిన్ను నుతింపఁ దల్లి యగునా? బ్రాహ్మీ! నమోవాకముల్.

ఒక యంశాంశము త్వద్దయారసధునీప్రోద్ధూతసచ్ఛీకర
ప్రకరమ్మందునఁ దాఁకి తాఁకనటు లై పర్వన్, మహావిష్ణువై
యకలంకస్థితిలోకరక్షణకళాప్రారంభసంభావ్యతల్
ప్రకటించెం ద్రిదశుం డొకం డటు త్రయీరాజన్మణీ! వైష్ణవీ!

దృక్కోణారుణిమప్రకాశకళికారేఖావలేశమ్ము స
మ్యక్కాలాచలభీషణాగ్రరుచు లంపన్ రేఁగి తా నుగ్రుఁడై
చెక్కల్ ముక్కలుగా జగమ్ము లయమున్ జెందించు దైత్యారులం
దొక్కం డౌర! త్వదీయశక్తి తరమే యూహింప మాహేశ్వరీ!

[illegible]! నీబహుబాహుఖడ్గలతికాధారాకణాగ్రాహిన్మై
ముల్లోకమ్ముల కెల్ల మల్లుఁ డనఁగా మోదించి కౌమారసం
ఫుల్లప్రజ్ఞ నెసంగె నొక్కఁ డిలలోఁ బూరిం దగన్ బుట్టియున్,
జెల్లున్ వజ్రము గాఁగఁ బూచికయుఁ ద్వచ్ఛ్రీపాణిఁ గౌమారికా!

కామాంధాచలవజ్రపాతము, లసద్గర్వాటవీదావ, ము
ద్దామాజ్ఞానతమశ్ఛటారవి, యసత్కర్మావలంబాసుర
స్తోమోన్మూలనహేతి, భక్తజనతాతోష్టూయమానోదయా!
చాముండేశ్వరి! త్వత్కటాక్షలవసంసర్గప్రభావమ్మహా

శాం

పారావారపరీతసర్వధరణీభారోద్వహప్రక్రియా
శూరత్వమ్ములు సూపెఁ బంటికొనపైఁ జోద్యంబుగా నొక్క భూ
దార మ్మం చను టేల? విశ్వము నె కై దర్పంబునన్ మోయరే
వారాహీ భవదప్రమేయకరుణాభవ్యప్రసారంబునన్.

అమరీహాసపరీమళమ్ములు, సదా యైరావతారోహముల్,
కమనీయామృతపానగోష్ఠులు, మరుద్గంగావిహారమ్ములున్,
సుమనోరాజ్యరమావిలాసములు సంశోభిల్ల గీర్వాణకులం
దమి నొక్కం డటుమించు నీకతన నింద్రాణీ! నమఃపుష్పముల్.

నీమంజీరరవమ్ములో శ్రుతిసతీనిక్వాణసాంగత్యపున్
సీమల్ దోఁపఁగ, శబ్దశాస్త్రమధువుల్ చిందంగ వాగ్వృత్తులన్
స్వామిత్వంబు వహించి కొంద ఱటు శబ్దబ్రహ్మ లైనా రహో!
నీమాహాత్మ్య మెఱింగి పల్కఁగలరే నీరేజజాతాదులున్ ?

క్షరమై, యక్షరమై ద్విధాప్రసృతమై, కల్యాణమై, కాంతమై,
సరసీజాతభవాండభాండరచనాస్థానంబె తానై సుధీ
వరవాక్చాతురి నొక్కటయ్యు బహుధా వ్యాఖ్యాతమై ఖ్యాతమై
కర మొప్పారెడు మాత! నీప్రకృతికిన్ గర్పూరపూరారతుల్.

సక్తుల్ సజ్జనగోష్ఠులన్, సుకవితాశక్తుల్ బుధారాధనన్,
రక్తుల్ లోకహితార్థధర్మకృతులన్, రాజిల్లు భక్తుల్ మహా
శక్తీ! త్వత్పదపంకజమ్ములయెడన్ సంధిల్లఁగాఁ జేసి యా
ముక్తిద్వారము దీసి ప్రోవఁగదవే! పుణ్యాగ్ర హస్తమ్మునన్.

# మధుపాలిక

శ్రీ స్ఫూర్తిశ్రీ



అందము విప్పుకొన్నవి లతాంతము లల్లవె! శాద్వలంబు లా
నందము కప్పుకొన్నవి; మనం బెసలార గులాబిపూల నం
దందు నలంకరించుకొనుమా! సుషమావతి! గాలి రేగినన్
చిందర వందరై చిటికసేపటిలో సకలమ్ము దుమ్మగున్ !

నీ వదనంబు తావలము నిర్మలశాంతికి; నీ గవేషణన్
చావయినన్ సమంబు నవజన్మకు; నీ పద మధ్యధూళి నా
జీవన సుప్రభాతము హసించిన చక్కని వెల్గురేక; ఓ
దేవి! జగంబు లేల భవదీయ పదాప్త రజంబు చాలదే!

ప్రతిఫలియించు నీ వదనరాజిత కాంతి మదీయ మానస
స్థితిని; దృగంతముల్ బెరసి సేచన కృత్య సమర్థ నిర్ఝరీ
ప్రతిభను గాంచు; తాత్త్వికులు త్రావిరి నీ యధరాగ్రమంటి స
మ్మతముగ వారుణీ రసము; మానిని! దీనిని నే నెఱుంగనే !

ఎఱుగును నిన్ను ప్రేమ; అది యించుక యేదియు నేరనట్టి ద్రి
మ్మరులు కవుంగిలింతు రొక మాయని పాపము నే భ్రమించి; ని
న్నెఱుగక మాకు లెక్కగలదే! జగమందు ముఖాముఖిన్ పర
స్పరము నెఱుంగుటే మనకు భద్రము ప్రేమమహాతపస్వినీ!

లే! కరుణామతీ! నిదుర లెమ్ము! నిశాసతి కప్పుకొన్న యా
చీకటి జారిపోయినది; జీవము నింపుము తావక ప్రభా
లోకముచే మదంతరములోపల; ఇద్దరి రూపులేకమై
అకస మంటుకొంద మిత రావధులం గ్రమియించి హాయిగా.

నా యెదలోన నీవె మును నాటితి నీ ప్రణయాంకురంబు; కా
నీ! యని శ్రద్ధతో నుపచరించితి పెంచితి నింతకాలమున్;
నీ యొడినుండి నన్ను ధరణిం బడద్రోయకు చేయ కిప్పు డ
న్యాయము చేలచెంగు విడనాడక నీ వెను వెంట నుండెదన్.

ప్రమద మహాతిరేక మతిపారము; తారము మున్నె ప్రేమ గా
నము; శిశిరంబె నామనికి; నామన మామని; నేటి నీ విలా
సము నెలజవ్వనంబును విశాల విలోచనముల్ దలంచి యీ
హిమసమమైన ప్రాయము పయింబడి యుండియు నుత్సహించెదన్.

కుతకుతలాడుచుండె నిదె కోమలి! నా హృదయమ్ము; ప్రేమ సం
వృతమతినై శయింతు; కనువిప్పుట శక్యముకాదు; నాదు దు
స్థితి గని నల్గురొక్కటిగ తీర్పరులై చరియింత్రుగాక! నా
గతి విడనాడ; నీ కొఱకు కష్టము లిష్టములై వరించెదన్.

వదలను నాతలంపు తలవంపులు వచ్చిన వచ్చుగాక! నె
మ్మది గల యూరుపెల్ల మటుమాయముగా నణగారిపోయె; నా
హృదయము నీకు గాక మరి యెవ్వరి కెన్న డొసంగ; నిక్కువం
బిది సుదతీ! యథార్థము వచించితి; నీపయినొట్టు; నమ్మవే!

ప్రేయసి! ముంగిట న్నిలిచి పిల్చుట మానను; నన్ను వీడిపో
నీయను; నీవు చంపిన సరే! అదియే పదివేలు నాకు; నా
కాయము మట్టిలో కలియు గాక! దయామతి నెత్తబోకు; శ్వ
శ్రేయసదాయులయ్యెడు సుశిక్షకముల్ 'భవదీయపద్ధతుల్.'

పలుకునుగాక నాలుక శుభంకర తావక భావమున్, కనుల్
నిలుచునుగాక సంతతము నీరుచిపూర్ణ మనోహరాకృతిన్,
మలకలుగొన్న నీ వలపు మైకొనినట్టులు నాశరీరమున్
వలగొనుగాక యేకముగ వాగురలందున కట్టివేయగా!

చేకొని నన్ను నీ ప్రణయ శీతల నిర్మల వీక్షణంబులన్
సాకుము; వీడఁబోకు మొకనాటి సుఖ మ్మొకయేటి దుఃఖ మీ
లోకము; నీ యభీప్సితము లోపల నాగదు చిన్న మెత్తు; ని
ర్వ్యాకులవై గ్రహింపు మెది వచ్చిన గాని సమానదృష్టితో.

కలసిన నెయ్యమయ్యె గతకాలము నందున నీ తలంపు; నీ
చెలిమి తొలంగ జిహ్వకు రుచింపదు నా కెదియేని; ప్రేమికుల్
కులమును జాతి చూడ రనుకొందురు కొందఱు; నాకు ప్రేమయే
కులమును జాతియున్ గనుక కోరుదు నిన్ను మనస్సుతీరగా.

జవజవలై యొడల్ బిగువుజారిన ప్రాయములోని నన్ను నీ
నవకపు ప్రేమపంజరమునన్ బిగియించితి వద్భుతంబుగా:
వివరము మాసి నేను పలవింతును గొంతుక నెత్తి నీదు కం
దువ కసరాని మాసికల దుప్పటి నావల పారవైచెదన్.

డెందపు పాత్రయం దినుమడించిన శోకమలీమసంబు నా
నందపు వాగులో తొలచి నచ్చిక పచ్చిక గల్లు గట్టుపై
సుందరి పొందుగోరి మనసుంబడి యీ పదినాళ్ల పాటు కూ
ర్చుందును వెన్నెల ల్విరియు చూపులతో, చిరునవ్వు మోముతో.

నీ వొక వాలుచూపు కరుణించిన చాలును నామనోంతర
స్థావరమందు నిండిన విచారవికారము లంతరించు; స
ర్వావరణమ్ము ముక్తమగు; ఆసవపాత్రు లదృష్టవంతు లా
హా విధి! పట్టిపోయె మధు వంతయు వంతు లభించునాటికిన్.

కలికీ! కెంపులసొంపు నింపుకొని శృంగారమ్ము గుల్కించు నీ
పలుకే గుండెల కొండనెత్తములపై పారించు చైతన్యపుం
జలపాతంబును; చాలు నయ్యదియె శశ్వజ్జీవితాఖ్యానమై
వెలయించున్ భవదీయ తత్త్వపదమున్ విన్నాణపుం ద్రోవలన్

[ నా 'ఉమరుఖయాము'నుండి ]

# కలాశాంతి

శ్రీ జమ్మలమడక మాధవరామ శర్మ



శ్రీదేవీపూజాపవిత్రహస్తులు దేవ్యర్చనాసమయమునందు షడధ్వప్రక్రియ ననుసరింతురు. వారిక్రియాసర్వస్వము చిన్మయవిలాసము. అధ్వ మనునది మార్గము. మంత్రమార్గము- మంత్రాధ్వ- మంత్రవిద్య- మంత్రవిజ్ఞానము సమభావమునె బోధింపగలవు. ఈమార్గము లారు కలవని శబ్దార్థ దృష్టివిజ్ఞాను లభిమానించిరి.

శబ్దమార్గములు మూడు కలవు.

వర్ణమార్గము- పదమార్గము- మంత్రమార్గము నని. మంత్రము పదసమూహమయిన వాక్యము. అది పద మాశ్రయించును. పదము వర్ణ మాశ్రయించును.

అర్థమార్గములు మూడు కలవు.

కలామార్గము- తత్త్వమార్గము- భువనమార్గము నని. తత్త్వము కలామార్గము నాశ్రయించును. భువనము తత్త్వము ననుసరించును.

ఇట్లు షడధ్వానుసరణములలో దేవీభావనులు కలాభావనులు కాగలుగుచున్నారు. కొందరు శాక్తపథికులు శివదేవుగూడ నారాధింతురు కాని శక్తిపారమ్య మభిమానింతురు. కొందరు శైవపథికులు శివదేవిగూడ నారాధింతురు గాని శివపారమ్య మభిలషింతురు. మరికొందరు శివశక్తిసామరస్యస్వభావకమునె యుపాసింతురు. «వీరు వారికన్న వేరు» అన నక్కఱ లేదు కాని వీరు «కులీను» లనవలెను. కులార్థము శక్తి. అకులార్థము శివుడు. శక్తిశివుల నభిన్నముగ భావించి ఉపాసన మొనరించు సాధకుడు కులీను డగును. కులీనుడు కలార్థము గుర్తించుట కధికారి.

శక్తియె కల. విశిష్టశక్తిస్వరూపము కల. శక్తివ్యాపారమును కల యయినది. అయిదు కలలు ప్రధానములు. ఈయయిదును సకలతత్త్వము (పదార్థము) ల సంపిండితస్వరూపము.

శాంత్యతీతకల- శాంతికల- విద్యాకల- ప్రతిష్ఠాకల- నివృత్తికల యని వాని పేరులు.

శివతత్త్వాది పృథివీతత్త్వపర్యంత మున్న ముప్పదియారు తత్త్వములు, అనాశ్రితము భువనమాదిగా కాలాగ్ని భువన పర్యంత మున్న రెండువందల యిరువదినాలుగు భువనములు కలాపంచకము నాశ్రయించి యున్నవి. మాయా కంచుకము లయిదు కలవు. పరమశివుడు సర్వకర్త సర్వజ్ఞుడు పూర్ణుడు నిత్యుడు వ్యాపకుడు అసంకుచితశక్తి అలుప్త శక్తి యయినను తన యిచ్ఛానుసారమున సంకుచితస్వభావుడై యయిదు కంచుకములలో నంతర్లీనుడై యుండును. కలా కంచుకము ప్రథమకంచుకము. విద్యాకంచుకము రాగకంచుకము కాలకంచుకము నియతికంచుకము కలానుసారమున నుండును. కంచుకపంచకసంకుచితు డయిన పరమశివుడు పురుషు డయినాడు. పరమశివస్వరూపము నావరించినందున కలాపంచకము కంచుక మయినది. సర్వకర్త యగు శివుడు మాయావర్ణమున సర్వకర్తృత్వాదికము సర్వము విస్మరించును. కలాకంచుకమునకు లోనయి యల్పాల్పవస్తునిర్మాణరసికు డగును. అంతటివా డింతయై కించిత్కర్తృత్వాభి

నివేశము కలవా డగుట «కల». ఇది మాయకు రూపవిధాయినీశక్తి. ఈశక్తిసారమున జీవత్వము పొందిన శివుడు నవరచనాచిత్తు డగును. అప్పటి యారచనము నవమగునా? అదియంతయు మహామాయాప్రసాదితమె కాని కలావరణమున నది సుందర మగును. లలిత మగును. ఆనందదాయి యగును. ఇది యంతయు సత్యమని జీవశివు డభిమానించును. బంధనము పొందును. తనపరిధిలో తా నిమిడియుండును. వాడు తత్త్వమున కభిముఖుడయినచో కంచుకపంచకము ముక్తిసాధన మగును. పరమతత్త్వాభిముఖ్యము సంపాదించు నదియె యుత్తమ కల. కలాలక్ష్యము కలయె కారాదు. కాదు. కంచుకము కంచుకముకొరకు కాదు. కలావలయమునందు మానవుడు లయము పొందడు. శివభావమున కున్ముఖు డగును. కలాకంచుక మట్లుపకరించి సహకరించును. ఆత్మస్వరూపసాక్షాత్కారము కలాలక్ష్యము. కలావిలాసులందరు తత్త్వాభిముఖు లగుదురా? సర్వజనులకు సర్వకలలు సర్వసమయములందు సమభావమును సంపాదించునా? కమనీయకలాకంచుకమున కట్టిసామర్థ్య మున్నది. కవులు కలాభావులు వాని నట్టివానిగనె నిరూపించిరి. కలావిలాసు లందరు కలాంతర్గూఢతత్త్వము ననుక్షణము గుర్తింపకపోవచ్చును. భోగరాజ్యమున విశ్రాంతి గూర్చుట కమనీయ కలాసంపదయు కాదు. భోగవిశ్రాంతి కలాబంధనము. భోగ్యభోగవిముక్తి కలాభోగము

విశ్రాంతి ర్యాఽస్య సంభోగే సా కలా న కలా స్మృతా
లీయతే పరమానందే య యాత్మా సా కలా పరా.

సమ్యగ్భోగవిశ్రాంతి కూర్చునది కల కాదు. పరమానందలయము సంపాదించునదియె కల యగును. కలాభోగరసికులు నిత్యజీవితమున కలాసంబంధ మభిలషింతురు. కలామయజీవనమునకు నిత్యజీవనమునకు నిరంతరమయిన నిత్యసంబంధ మావశ్యకము. మాటలలో కలాసౌందర్య మభివర్ణించు నాతకు నిత్యజీవితనిర్వేదము కలవాడయినచో గాలిలో కల తేలిపోవును. జీవనవర్ధమానుడు కొంత కలాభోగము కలవాడు కావలెను. అప్పుడె కలాజీవనమున విశ్వాస ముదయించును. కలాభోగ మానందభోగమై రాణించును. కలాభోగము నిట్లు నిత్యజీవితమున నానందభోగసాధనముగ గుర్తించిన కలాతపస్వి కలాసంపద కమనీయ మని భావింపగలడు.

లోకమున నొకవస్తువు రమ్యమని మరియొకటి కాదని నిర్ణయించుట కాధార మేమి? రమ్యత యనునది రమ్యవస్తుధర్మమె కాని యది భావనిష్ఠము. ఎదుట నున్న వస్తువు రమ్యమని భావించిననె యందలి రమ్యత గోచరించును. ఒకనికి రమ్యము మరియొకనికి అరమ్య మగును. అరమ్యము రమ్యము నగును. రమ్యమని యరమ్యమని నిర్ణయించుటకు కొందరాత్మసంవాదము ప్రమాణ మని భావింతురు. చూచువానియాత్మ, అనుభవించువాని యాత్మ రమ్యారమ్యనిర్ణయ మొనరించునట! ఎట్లు?

ఒక్కొకని భావజగములో నొక శృంగారభావ మున్నది. ఒకవీరభావమును కలదు. వీరశృంగారభావములు కల మానవులు భోగసంభోగభావులుగ నుందురు. వీరభావుడు పాలకాభిమానమున - నే ననుభవించువాడ నని భావించును. ఆవీరభావుని యాభావవీరత తన కనుభవయోగ్యములగువానిని రమ్యము లని భావింపజేయును. భావశృంగారి తా ననుభవింపబడగోరును. త న్నితరు లనుభవించుట తన కనుభవానందము. తాను పాల్యస్వభావముతో నుండుట తన కానందము. ఇట్లు శృంగారభావానుకూలములు, వీరభావానుకూలకులు, లోకమున రమ్యము లన్నప్రసిద్ధి తత్తదభిమాను లాభిమానికముగ నాపాదించిన యాపాద్యప్రసిద్ధి. ఇట్టి భావనమున రమ్య మరమ్యమని నిశ్చయించుట యుక్తమా? లోకభావము లన్నియు వీరశృంగారములె కావు. సర్వభావములు వీరశృంగారభావములకు దాస్యమాచరింపవు. సర్వభావములకు స్వరూపప్రతిష్ఠ యున్నది. వీరశృంగారములనె యనుసరించి భావించి నప్పుడు వస్తువు రమ్య మరమ్య మనుట భావగతముగ భాసించును. వస్తువునందలి రమ్యత యంతయు భావగతమె కాదు. వస్తునిష్ఠముగ గూడ రమ్యత యున్నది. ఆయావస్తుగతమయిన బాహ్యాకారసంపత్తి తల్లీనమై తదేకద్వారముగ నవభాసించు ననంత

భావవ్యూహము తద్వస్తుగతమయిన కలాత్మకసంపత్తికి వ్యాఖ్య. బాహ్యాజగములోని యొక్కొక్కవస్తువు తదంతర్లీనమయిన తత్త్వస్వరూపమును నిరూపింపగలదు. ఇట్లు నిరూపింపగలుగుట కందలి విద్యా రాగ కాల నియతిస్వభావములు హేతువులుగా నుండును. ఏవంవిధముగ వ్యాఖ్యాసాపేక్షమయిన గూఢగహనకలాతత్త్వము కులీనకవి సహృదయ ప్రతిపాద్యమానసుందరమై యంతట నున్నది.

చిరతపస్సిద్ధమయిన కలాభాగ్యము నాత్మాయత్తము చేసికొనినవారు కలాభోగమె ముఖ్యమని భావింపలేదు. కలాద్వారమున నితరసేవనమె కావలెనని తలచలేదు. తమకు తాముగా కలావివేకులై నాగరకవృత్తమునకు రూపమాపాదించిరి. నాగరజీవనపరిష్కార మాపాదించిరి. శరీరానురంజనమె కాక మానసరంజన మాకాంక్షించిరి. సభాప్రవేశమునకు, గోష్ఠీరచనమునకు, పరిమన్నిర్వాహమునకు కలాపరిజ్ఞాన మావశ్యకమయిన దినములలో కలాదేవత కలకలలాడినది. బాణభట్టారకుడు తన కాదంబరీగ్రంథములో శూద్రకరాజరాజసభామర్యాద నిరూపించుచు నచటి వైశంపాయనశుకము నిట్లు విశేషించినాడు.

"విదితసకలశాస్త్రార్థః, రాజనీతిప్రయోగకుశలః, పురాణేతిహాసకథాలాపనిపుణః, వేదితాగీతశ్రుతీనాం, కావ్యనాటకాఖ్యాయికాఖ్యానకప్రభృతీనామపరిమితానాం సుభాషితానా మధ్యేతా, స్వయంచకర్తా, పరిహాసాలాపపేశలః, వీణావేణుమురజాదీనా మసమః శ్రోతా, నృత్తప్రయోగదర్శననిపుణః, చిత్రకర్మణి ప్రవీణః, ద్యూతవ్యాపారే ప్రగల్భః, ప్రణయకలహకుపితకామినీప్రసాదనోపాయచతురః, గజతురగపురుషస్త్రీలక్షణాభిజ్ఞః"

ఇవి వైశంపాయనశుకవిశేషలక్షణము లయినను సభలో నుండదగు సహృదయసర్వలక్షణము లని కలాహృదయుల భావనము. ఆచిలుకకు సకలశాస్త్రార్థములు తెలియును. రాజనీతి నది ప్రయోగింపగలదు. పురాణేతిహాసకథలను చెప్పగలదు. గీతశ్రుతుల గుర్తింపగలదు. కావ్యనాటకాదులలోని సుభాషితముల నాచిలుక చదివినది. అట్టి సుభాషితముల నది రచింపగలదు. పరిహాసపేశలముగా పలుకగలదు. వీణావేణుమురజాదులను చక్కగా వినగలదు. నృత్తము ప్రయోగింపగలదు. చూడగలదు. చిత్రకర్మప్రావీణ్య మున్నది. ద్యూత మొనరింపగలదు. ప్రణయకోపము పట్టిన పడతుల నది ప్రసన్నల చేయగలదు. గజ తురగ పురుష స్త్రీ లక్షణములను చిలుక గుర్తించినది. సభలోనుండువారంద రిట్టివారు కావలెను. కలాపరిజ్ఞాన మిట్టివారిని సృజించును. వీరందరు విదగ్ధమండలము. వీరు కలసభ కలామయసభ.

"కదాచి దాబద్ధవిదగ్ధమండలః- కావ్యప్రబంధరచనేన, కదాచిత్ శాస్త్రాలాపేన, కదాచి దాఖ్యానకాఖ్యాయికేతిహాసపురాణాకర్ణనేన, కదాచి దాలేఖ్యవినోదేన, కదాచి ద్వీణయా, కదాచిత్ ౧. అక్షరచ్యుతక. ౨. మాత్రాచ్యుతక. ౩. బిందుమతీ. ౪. గూఢచతుర్థపాద. ౫. ప్రహేలికాప్రదానాదిభిః"—

కాదంబరిలోని శూద్రకమహారాజొకప్పుడు సహృదయగోష్ఠి నేర్పరచి కావ్యప్రబంధరచన మొనరించెడివాడు. శాస్త్రాలాప మొనరించెడివాడు. ఆఖ్యానకము- ఆఖ్యాయిక- పురాణము- ఇతిహాసము వినెడివాడు. చిత్రములతో వినోదించెడివాడు. వీణయాలించెడివాడు. అక్షరచ్యుతకము మొదలగు చిత్రకవితారీతులను గుర్తించెడివాడు. ఇట్టివిశేషములు కలాపోషకుల కావశ్యకములు.

కాదంబరీ కావ్యమందలి తారాపీడ మహారాజసభలో మూర్ధాభిషిక్తసామంతలోక మిట్లున్నది.

"ప్రసారయతా దురోదరక్రీడాం, అభ్యస్యతా అష్టాపదవ్యాపారం, ఆస్ఫాలయతా పరివాదినీం, ఆలిఖతా చిత్రఫలకే భూమిపాలప్రతిబింబం, అబధ్నతా కావ్యగోష్ఠీం, అతన్వతా పరిహాసకథాం,

విందతా బిందుమతీం, చింతయతా ప్రహేలికాం, భావయతా నరపతికృతకావ్యసుభాషితాని, పఠతా ద్విపదీం, గృణతా కవిగుణాన్"—

ఇట్టివిశేషములు కల సామంతలోకముతో నారాజసభ యున్నది. వారు పాచికలు ప్రసాదింతురు. బంగారు వ్యాపార మభ్యసింతురు. వీణ వాయింతురు, చిత్రఫలకమున రాజచిత్రము నిరూపింతురు. కావ్యగోష్ఠి నిర్మింతురు. పరిహాసాలాప మారంభింతురు. బిందుమతియను చిత్రకవితను గుర్తింతురు. ప్రహేలిక యను కవితావిశేషము భావింతురు. రాజకావ్యములోని సుభాషితముల సంభావింతురు. ద్విపదగీతి పఠింతురు. కవిగుణముల గుర్తింతురు. ఇట్టి రాజలోకమున్నప్పుడు "యథారాజా తథా ప్రజా".

కాదంబరీ హర్షచరితాదికముల రచించిన బాణభట్టారకుడు వత్సవంశమున జన్మించినాడు. ఆవంశము సకల కలాగమగంభీర మట! అచట జన్మించిన వాత్స్యాయనులు గృహమునులు

"న్యక్కృతనికృతయః, ప్రసన్నప్రకృతయః, విగతవికృతయః, ధీరధిషణావధూతాధ్యేషణాః, అసంకుసుకస్వభావాః, ప్రణతప్రణయినః, శమితసమస్తశాఖాంతరసంశయః, ఉద్ఘాటితసమస్త గ్రంథార్థగ్రంథయః, కవయః, వాగ్మినః, విమత్సరాః, సరసభాషితవ్యసనినః, విదగ్ధపరిహాసవేదినః, పరిచయపేశలాః, నృత్యగీతవాదిత్రేష్వబాహ్యాః"

అని ప్రసిద్ధికలవారగుటలో కలారాధనమే కారణము. వారు తిరస్కార మొల్లరు. వారిప్రకృతి ప్రసన్నము. వారికి వికృతిలేదు. వారిధీరబుద్ధి యాచన మెరుంగదు. వారి స్వభావము మృదువు. స్థిరము. వారి నందరాదరింతురు. వారందరిసంశయము పోనాడుదురు. వారు గ్రంథగ్రంథి నూడదీయుదురు. వారు మత్సరులు కారు. వారు సరసభాషులు. వారు చతురుల పరిహాసముల గుర్తింప గలరు. వారు సంస్తవసుందరులు. నృత్యగీతాదులందు వారంతరంగులు. ఇట్లు మానవసంస్కారసంపాదనము కలాతత్త్వము నందున్నది.

బాణుడు స్వతంత్రుడై దేశములు తిరుగాడ మొదలిడినాడు. మిత్రుల వెంటనిడికొనెను. భాషాకవి, వర్ణకవి, ప్రాకృతకృత్, వంది, కాత్యాయనిక, జాంగులికుడు, భిషక్పుత్రుడు, పుస్తకవాచకుడు, కలాదుడు, హైరికుడు, లేఖకుడు, చిత్రకృత్, పుస్తకృత్, మార్దంగికుడు, గాయనులు, సైరంధ్రి, వాంశికులు, గాంధర్వోపాధ్యాయుడు, సంవాహిక, లాసకుడు, ఆక్షికుడు, కితవుడు, శైలాలి, నర్తకి, పారశరి, క్షపణకుడు, కథకుడు, శైవుడు, మంత్రసాధకుడు ధాతువాది, దార్దురికుడు, ఐంద్రజాలికుడు, మస్కరి మొదలగువారనేకులు భ్రమణమిత్రులు. వీరందరు నియతము లయిన కలలలో చతురులు. వారిపేరులు వారి కలాధికారము సూచించుచున్నవి. ఇందు కొందరు స్త్రీ లున్నారు. వారి వారి యాకలావైదగ్ధ్యము వారలకు రూప మిచ్చినది. వీరితోగూడి బాణుడు రాజకులములు చూచి, నిరవద్య విద్యావిద్యోతితగురుకులములు సేవించి, మహార్హాలాపగంభీరగుణవద్గోష్ఠులలో సంచరించి, స్వభావగంభీరధీరధీవుడై విదగ్ధమండలములలో ప్రవేశించి మరల నిజవంశోచితప్రకృతి నవలంబించినాడు. ఇట్టి విశిష్టసంపద కలాభాగ్యశాలికి సహజసంపత్తి.

విద్యాచతురుడు కలాకుశలు డగుట సముచితము. కల లనంతము లని శుక్రాచార్యు డనినాడు. అట్టివి సంఖ్యేయములు కాజాలవు. అయినను "చతుష్షష్టి కలలు" అను ప్రసిద్ధి యున్నది. అరువదినాలుగు కలల పరిజ్ఞాన మందరకు శక్యమా ?

"శక్తో మూకోపి యత్కర్తుం
కలాసంజ్ఞంతు తత్స్మృతం."

వర్ణోచ్చారణాసమర్థుడును కలానిర్మాణకుశలుడు కాగలడని కొందరనిరి. చతుష్షష్టికలలనామనిర్దేశ మావశ్యకము. వాని పరిగణన మంతట నేకవిధముగ లేదు. రామాయణచంపూప్రబంధము భోజదేవుడు సుందరకాండాంతము రచించె నని యనంతరకాండరచనమునకు యత్నించిన లక్ష్మణకవి యిష్టగురుచరణస్మరణమున సకలకలావిజ్ఞానము కలుగునని భావించెను. ఆసమయమున నచటి వ్యాఖ్యాత చతుష్షష్టికలల నిట్లు సంకేతించి నిరూపించినాడు.

"ఇతిహాసాగమాద్యాశ్చ కావ్యాలంకార నాటకం
గాయకత్వం కవిత్వంచ కామశాస్త్రం దురోదరం
దేశభాషాలిపిజ్ఞానం లిపికర్మచ వాచకం
సర్వాణిచావధానాని సర్వశాస్త్రంతు శాకునం
సాముద్రికం రత్నశాస్త్రం త థాశ్వగతికౌశలం
మల్లశాస్త్రం సూదకర్మ భూరుహాణాంచదోహదం
గంధవాదో ధాతువాదః ఖన్యావాదో రసస్యచ
జాలవాదోఽగ్నిసంస్తంభః ఖడ్గస్తంభో జలస్యచ
వాచస్తంభో వయస్తంభో వశ్యాకర్షణమేవచ
విద్వేషణోచ్చాటనేచ మారణం కాలవంచనం
పయస్సిప్లవచాతుర్యం పాదుకాసిద్ధిరేవచ
మృత్సిద్ధి ర్ఘుటికాసిద్ధి రైంద్రజాలిక మేవచ
అంజనం నరదృష్టిస్తు వంచనం స్వరవంచనం
మణిమంత్రౌషధానాంచ సిద్ధయ శ్చోరకర్మచ
వేత్రలోహాశ్మమృద్దారువేణువర్మాంజనక్రియాః
అదృశ్యకరణీ దూరకరణీ మృగయారతిః
వాణిజ్యం పాశుపాల్యంచ కృషి రాహవకర్మచ
లావకుక్కుటమేషాదియుద్ధకారణకౌశలం
చతుష్షష్టి కలా శ్చైతాః కలావిద్భిః ప్రకీర్తితాః"

వాత్స్యాయనకామసూత్రమునందు చతుష్షష్టికలల పరిగణనము వేరొకవిధముగా నున్నది. స్పష్టముగా సాహిత్యముతో సంబంధించి యున్నవి. నాయికానాయకుల విలాసక్రీడా సహాయకములుగ నున్నవి. ఇట్లె శుక్రనీతిసారమునందు లలితవిస్తరమునందు ప్రబంధకోశమునందును ఈకలలపరిగణనము వేరువేరుగా నున్నది. వానిసంకేతమిట్లు గుర్తింపదగును.

1. లలితవిస్తరమునందలి కలాసూచిక
2. కామసూత్ర కలాసూచిక
3. శుక్రనీతిసార సూచిక
4. ప్రబంధకోశ సూచిక

| | | | | 4 |
|---|---|---|---|---|
| 1 | లంఘితం | గీతం | హావాదిసహితనర్తనం | లిఖితం |
| 2 | ప్రాక్చలితం | వాద్యం | వాద్యవాదనజ్ఞానం | గణితం |
| 3 | లిపిః | నృత్యం | వస్త్రాలంకారసంధానం | గీతం |
| 4 | ముద్రా | ఆలేఖ్యం | రూపావిర్భావకృతిజ్ఞానం | నృత్యం |

| | | | | |
|---|---|---|---|---|
| 5 | గణనా | విశేషకచ్ఛేద్యం | శయ్యాస్తరణం | పఠితం |
| 6 | సంఖ్యా | తండులకుసుమబలిః | ద్యూతక్రీడారంజనం | వాద్యం |
| 7 | సాలంభః | పుష్పాస్తరణం | రతిజ్ఞానం | వ్యాకరణం |
| 8 | ధనుర్వేదః | దశనవసనాంగరాగః | మద్యాదికృతిః | ఛందః |
| 9 | జవితం | మణిభూమికాకర్మ | శల్యనిష్కాసనం | జ్యోతిషం |
| 10 | ప్లవితం | శయనరచనం | అన్నాదిసమ్పాచనం | శిక్షా |
| 11 | తరణం | ఉదకవాద్యం | వృక్షపాలనం | నిరుక్తం |
| 12 | ఇష్వస్త్రం | ఉదకఘాతః | పాషాణధాతుభస్మ | కాత్యాయనం |
| 13 | హస్తిగ్రీవా | చిత్రయోగః | ఇక్షువికారజ్ఞానం | నిఘంటుః |
| 14 | రథః | మాల్యగ్రథనం | ధాత్వోషధిక్రియా | పత్రచ్ఛేద్యం |
| 15 | ధనుష్కలాపః | శేఖరకాపీడయోజనం | ధాతుసాంకర్యపార్థక్యం | నఖచ్ఛేద్యం |
| 16 | అశ్వపృష్ఠం | నేపథ్యప్రయోగః | ధాతుసంయోగః | రత్నపరీక్షా |
| 17 | స్థైర్యం | కర్ణపత్రభంగః | క్షారనిష్కాసనం | ఆయుధాభ్యాసః |
| 18 | స్థేమ | గంధయుక్తిః | శరసంధానం | గజారోహణం |
| 19 | శౌర్యం | భూషణాయోజనం | మల్లయుద్ధం | తురగారోహణం |
| 20 | బాహువ్యాయామః | ఇంద్రజాలాయోగః | అస్త్రనిపాతనం | తపఃశిక్షా |
| 21 | అంకుశగ్రహః | కౌచుమారయోగః | వ్యూహరచనా | మంత్రవాదః |
| 22 | పాశగ్రహః | హస్తలాఘవం | యుద్ధసంయోజనం | యంత్రవాదః |
| 23 | ఉద్యాననిర్మాణం | శాకభక్ష్యక్రియా | ముద్రాభిర్దేవతాతోషణం | రస ,, |
| 24 | అపయానం | పానకాసవయోజనం | సారథ్యం | ఖన్య ,, |
| 25 | ముష్టిబంధః | సూచీవానకర్మ | గజాశ | రసాయనం |
| 26 | శిఖాబంధః | సూత్రక్రీడా | కాష్ఠపాషాణాదిసత్క్రియా | విజ్ఞానం |
| 27 | ఛేద్యం | వీణాడమరుకవాద్యం | వాద్యయంత్రనిర్మాణం | తర్కవాదః. |
| 28 | భేద్యం | ప్రహేలికా | వర్ణరంజనం | సిద్ధాంతః. |
| 29 | తరణం | ప్రతిమాలా | జలవాయ్వగ్నినిరోధక్రియా | విషవాదః |
| 30 | స్ఫాలనం | దుర్వాచకయోగః | నౌకారథాదికృతిః | గారుడం |
| 31 | అక్షుణ్ణవేధ | పుస్తకవాచనం | సూత్రరజ్జువిజ్ఞానం | శాకునం |
| 32 | మర్మవేధ | నాటకాఖ్యాయికా | పటబంధః | వైద్యకం |
| 33 | శబ్దవేధ | కావ్యసమస్యా | రత్నవేధపరీక్షా | ఆచార్యవిద్యా |
| 34 | దృఢప్రహార | పట్టికావేత్రవానకల్పః | స్వర్ణాదియథార్థవిజ్ఞానం | ఆగమః |
| 35 | అక్షక్రీడా | తక్షకర్మాణి | కృత్రిమస్వర్ణాదిక్రియా | ప్రాసాదలక్షణం |
| 36 | కావ్యవ్యాకరణం | తక్షణం | అలంకారకృతిః | సాముద్రికం |
| 37 | గ్రంథరచితం | వాస్తువిద్యా | లేపాదిసత్కృతిః | స్మృతిః |
| 38 | రూపం | రూప్యరత్నపరీక్షా | చర్మమార్దవాదిక్రియా | పురాణం |
| 39 | రూపకర్మ | ధాతువాదః | పశుచర్మాంగనిర్హారః | ఇతిహాసః |

| | | | | |
|---|---|---|---|---|
| 40 | అధీతం | మణిరాగాకరజ్ఞానం | దుగ్ధదోహాదివిజ్ఞానం | వేదః |
| 41 | అగ్నికర్మ | దయోగః | కంచుకాదివిజ్ఞానం | విధిః |
| | వీణా | మేషాదియుద్ధవిధిః | జలప్లవనంతరణం | విద్యానువాదః |
| 43 | వాద్యనృత్యం | శుకసారికాప్రలాపః | గృహభాండమార్జనం | దర్శనసంస్కారః |
| 44 | గీతపఠితం | సంవాహనకౌశలం | వస్త్రమార్జనం | ఖేచరీకలా |
| 45 | ఆఖ్యాతం | అక్షరముష్టికా | క్షురకర్మ | అమరీకలా |
| 46 | హాస్యం | మ్లేచ్ఛితం | తిలమాంసాదిస్నేహనిష్కాసనం | ఇంద్రజాలం |
| 47 | లాస్యం | దేశభాషా | సీరాద్యాకర్షణం | పాతాలసిద్ధిః |
| 48 | నాట్యం | పుష్పశకటికా | వృక్షాద్యారోహణం | ధూర్తశంబలం |
| 49 | విడంబితం | నిమిత్తజ్ఞానం | మనోనుకూలసేవా | గంధవాదః |
| 50 | మాల్యగ్రంథనం | యంత్రమాతృకా | వేణుతృణపాత్రకృతిః | వృక్షచికిత్సా |
| 51 | సంవాహితం | ధారణమాతృకా | కాచపాత్రకరణం | కృత్రిమమణికర్మ |
| 52 | మణిరాగః | సంపాఠ్యం | జలసంసేచనం | సర్వకరణీ |
| 53 | వస్త్రరాగః | మానసీ | లోహాభిసారశస్త్రాస్త్రకృతిః | వశ్యకర్మ |
| 54 | మాయాకృతం | కావ్యక్రియా | గజాదిపల్యాణక్రియా | పణకర్మ |
| 55 | స్వప్నాధ్యాయః | కోశచ్ఛందోజ్ఞానం | శిశుసంరక్షణం | చిత్రకర్మ |
| 56 | శకునిరుతం | క్రియావికల్పః | అపరాధితాడనం | కాష్ఠఘటనం |
| 57 | స్త్రీలక్షణం | ఛలితయోగః | నానాదేశవర్ణలేఖనం | పాషాణకర్మ |
| 58 | పురుషలక్షణం | వస్త్రగోపనం | తాంబూలరక్షాదికృతిః | ర్మ |
| 59 | అశ్వలక్షణం | ద్యూతవిశేషః | ఆదానం | చర్మకర్మ |
| 60 | హస్తి ,, | ఆకర్షక్రీడా | ఆశుకారితా | యంత్రకర్మ |
| 61 | గో ,, | బాలక్రీడనకం | ప్రతిదానం | కావ్యం |
| 62 | అజ ,, | వైనయికీవిద్యా | చిరేక్రియా◆ | అలంకారః |
| 63 | మిశ్రిత ,, | వైజయికీ ,, | | హసితం |
| | ౬౪ ,, | వ్యాయామికీ ,, * | | సంస్కృతం |
| 65 | నిర్ఘంటుః | | | ప్రాకృతం |
| 66 | నిగమః | | | పైశాచికం |
| 67 | పురాణం | | | అపభ్రంశం |
| 68 | ఇతిహాసః | | | కపటం |
| 69 | వేదాః | | | దేశభాషా |
| 70 | వ్యాకరణం | | | ధాతుకర్మ |
| 71 | నిరుక్తం | | | ప్రయోగోపాయః |
| 72 | శిక్షా | | | కేవలివిధిః. |
| 73 | ఛందః | | | |
| 74 | యజ్ఞకల్పః | | | |

*కామశాస్త్రనిరూపితములయిన వీనిలో నొక వర్గ విభాగము కలదు. గీతాదు లిరువదినాలుగు కర్మాశ్రయములు, ద్యూతాశ్రయము లిరువది. ఇందు నిర్జీవములు ౧౫. సజీవము లయిదు. శయనోపచారిక కలలు ౧౬. ఉత్తరకలలు ౪. ఇట్లరువది నాలుగు మూలకల లని జయమంగల వ్యాఖ్యలో నున్నది. వీనిలో నవాంతరప్రవేశము పొందిన వాని నన్నిటిని కలిపినచో ౫౧౮ కలలగునట. జయమంగళుడు నిరూపించిన వన్నియు కామతంత్రమునకు సంబంధించిన కలలు. వాని నట తెలియవచ్చును గాని నే నిట వ్రాయరాదు.

75 జ్యోతిః
76 సాంఖ్యం
77 యోగః
78 క్రియాకల్పః
79 వైశేషికం
80 వేశికం
81 అర్థవిద్యా
82 బార్హస్పత్యం
83 ఆసురం
84 మృగపక్షిరుతం
85 హేతువిద్యా
86 జతుయంత్రం
87 మధూచ్ఛిష్టకృతం
88 సూచీకర్మ
89 విదలకర్మ
90 పత్రచ్ఛేద్యం
91 గంధయుక్తి

♦శుక్రనీతిలోని వధికముగా నర్థరము నందలివి వృత్తివిద్యలను తంత్రమునకు సంబంధించి లోకవ్యవహారమును గ్రామ యున్నవి. లోకతంత్రసంబద్ధ నగర జీవనవిధానమును సంబం ములుగా నున్నవి. లలితవిస్తర ధించి యున్నవి.

కలాదర్శన మేకవిధముగ గానవచ్చుట లేదు. తాము తలచిన పదార్థమును వ్యాపింపజేయుట కాయాయభిమానులు తమతమ నిర్ణయములకు దగిన విధమున కలావ్యాఖ్యాన మొనరించిరి. కాగా కల లగువదినాలుగె యన్న నియమ మక్కరకా దనిపించుచున్నది. కొన్ని యాయుర్వేదమునకు సంబంధించి యున్నవి. పర్వతారణ్యభాగములను నదీనదసాగరభాగములను భూతభౌతికసర్వస్థానములను కలానుశీలనమున కుపయోగించుకొనిరి. నేటికాలమున నవనవములుగా గోచరించు వృక్షోద్యానవిశేషములు ఖనిశోధనము లోహశుద్ధిరసాయనతంత్రము కలాకుక్షిప్రవిష్టముగనె యున్నది. భోజదేవుడు "సమరాంగణసూత్రధార"మను తనగ్రంథమున యన్త్రవిధానము సూచించినాడు. వివిధయంత్రనిర్మాణవిధానముల నాతడు సంక్షిప్తముగ సూచించినాడు. ఇట్టివియు కలలన్న ప్రఖ్యాతి కలవయినవి. ఇక నేవి కలలు కావు. కావున నన్నియు కలలు. కల లనంతములు. ఇట్లు వీనిని భావించినపుడు «మనకేమియు లే»వని యన నేయనము. స్వభావభావనె మె లేనపుడు అన్నియు పశ్చిమదిశాసమాగతము లని యనవలసియందును. కలామార్గ మవహేళాస్పదము కాదు. కేవల విలాసస్థానమును కాదు. భౌతికనిత్యజీవనమునకు నది మార్గము. చూడుడు! పరిచూడుడు!

గృహనిర్మాణకల, రూప్యరత్నపరీక్ష, ధాతువిద్య, వృక్షవిద్య, గజాశ్వలక్షణము, చర్మకర్మ, యంత్రకర్మ, ధాతుసంయోగము, బాలక్రీడనకము.

ఈదృశ్యము లన్నియు నుపయోగపక్ష కుక్షిపూరణములు. కాని కలాపక్షమంతయు కుక్షింభరులదే యని విపక్షులు కూడ ననరు. గ్రామ్యధర్మప్రవృత్తులజీవనవ్యవహారములు చిరకాల ముండవు. అది యితరుల కనుకరణీయములును గావు. తత్కాలజీవనసంతుష్టి నిచ్చునవి యాపత్కాలవ్యవహారభోగము లిచ్చునది గ్రామ్యధర్మములు. అవి యప్పటి కప్పుడు మెలుపులు మెరియును. కాని యుండమన్న నుండవు. నాగరకపక్షాశ్రయములు చిరస్థాయులు కాగలవు. వాత్స్యాయనుడు నిరూపించిన కలలు నాగరజీవననిష్ఠ్యాతములు. జయమంగల గీతములు భోగరసికుల విలాససంపద

లయిన నవి యెంతటి నిత్యకల్యాణభోగవైభోగభాగ్యజీవనములో తద్వంచితు లూహింపరు. అసమర్థదుర్జనతాపుర శ్చ్యాదులై యీసడింతురు. వారలను జూడకున్నను జాలి కలుగును. కావ్యనాటకసాహిత్యములలో భోగరసికుల జీవన ప్రవృత్తిని వర్ణింపవలసివచ్చినప్పుడు కలామాంగల్యమె సర్వమనోహరమై భాసించును. కామసూత్రకర్త కవులకు "మార్గదర్శీ మహర్షిః."

నాట్యవేద మతిప్రాచీనము. అది సర్వకలావిలాసమందిరము. అది యొక లలితకలావిజ్ఞానసర్వస్వము. అందలి రీతినీతులు సర్వలోకగతిప్రగతులు. అందు నృత్య గాన వాద్య ఛందోలంకార వేష భూషా విన్యాసము లన్నియు ప్రామాణికములై సర్వశ్లాఘ్యము లయినవి. తన్నిరూపితములు తమ తమ ప్రాచీనతను సంప్రదాయాగతిని సూచింప గలవు. లలితవిస్తరమునందు నిరూపితము లన్నియు సిద్ధార్థున కుపదిష్టములట. అచటనే చతుష్షష్టికామతంత్రకలాప సూచనమును కలదు. క్షేమేంద్రుడు కలావిలాసమునందు కలావతీకలలను వాయుస్థలకలలను కాయసులను గోరువారి కలలను సంకేతించి నాడు. గాయక గణక కలాద భేషజ కలల నెన్నిటినో మనసులో నూహింపజేసినాడు. దొంగ తనము దొరతనము మఱియొకతనము ఎల్లతనము కలయయినది. కలల నాదరించినవారు వారు వారు వీరు వీరు నను వేరు పాటేల? సర్వలోకులు కలాలలితులు కలాలాలితులు నయినారు. వారి దినందినకార్యము లన్నియు కలాసుందరములు. వీనియన్నిటిలోగూడ భారతీయాధ్యాత్మికతత్త్వ మంతరనుగతమై యున్నది. అదియె వానికి ప్రాధానమిచ్చినది. జీవన మిచ్చినది. వాని నంతవాని జేసినది. వాని నందులకే వారట్లట్లు నిరూపించిరి. మొదట మొదట కొందరు కొందరు కలావిముఖు లయినట్లు నటించిరి. కాని కలాకలాశ్రయమునసె తమతమ మతధర్మవాదమును రక్షించుకొన వలసివచ్చినది.

ఒకనాడు జైనులకూటములో శిష్యు డాలస్యముగ వచ్చినాడు. 'నీ వేల యాలసించితివి?' 'ఒకని నాట్యము చూడగా నిట్లయినది. మనము జైనులము అట్టినాట్యము చూడరాదు. కొన్నినాళ్లయినది. మరల శిష్యు లాలస్యముగ వచ్చినాడు. 'ఏల యాలసించితివి?' 'ఒకతె నాట్యము చేయగా నటుచూచుచునుండగా నిట్లయినది.' 'నేను వలదంటి గదా!' పురుషనాట్యము చూడవలదని యని రనుకొంటిని. నారీనాట్యముకూడ వలదందురా?" ఇట్లి జైనులు సరి కొంతకాలమునకు నాట్యమును కలలను వలదనలేకపోయినారు. కలల ననుసరించి తమ ధర్మము వ్యాపింపజేయుటకు వారిష్టపడిరి.

బౌద్ధు లొకప్పుడు కలావిద్వేషులు. హీనయాన మట్లె భావింపజేసినది. కలల నాశ్రయించిన యతి పతితుడగు నని వారు మడిపట్టి తలచిరి. కాని మహాయానము గుహల దూరి దిబ్బల కెక్కి స్తూపముల జేరి విహారముల విహరించి చైత్యములు చూచి విలయము కాని కలానిలయముల స్థాపించినది.

కలాసర్వస్వము ధర్మతత్త్వోపాసనములకు సంబంధించియున్ననే చైతన్యవిలాసము కలదై సజీవమగును. ధర్మా దులకు సంబంధించి కాకపోయినచో లోకమునకు కాకపోవును. కేవల మైహికజీవనసహకారమునకె యయినచో కల కలగా నుండదు. ఆయుపయోగ మట్లెకాక అన్యవిధమునగూడ కలుగు నన్న యూహ పుట్టనుండ జేయువా రుండరు. కోటివిద్యలు కూటికె యయినప్పుడు కల కాటికగుట తప్పదు.

ప్రకృతిచిత్రణము కేవలబాహ్యదృశ్యవర్ణనపర మయినచో నది కేవలము జడము. జడమును చూచి యది కలాత్మకమని మురిసిపోవు ముగ్ధరీతిని నాకు శాస్త్రగురుపీఠ ముపదేశశిక్షణముగ నుద్బోధింప లేదు. దృశ్యమునందు శ్రవ్యధర్మమును భావ్యసంపత్తిని రస్యసంవేదనమును ఆత్మానుభూతిని సంప్రదాయ ముపదేశించును. కలారీతి ననుస రించి సహజసిద్ధమయిన శమసంవేదనము నుద్బోధింపజేసికొనుట ఉపక్రాంతపరాక్రాంతి. శమ మనునది సిద్ధధర్మము.

ఇతరము లాగంతుకములు. అవియన్నియు శాంతసముత్పన్నములు. శాంతమునందె లీనములగును. శాంతమును శాంతేతరములను కలాత్మకము లావేదించునవి కావలెను. రసాత్మసంవిదంశమునకు స్ఫోరకముగ కల యుండును. రసాంగ మగును. అందుననె రసోద్బోధకము లయిన విభావానుభావవ్యభిచారిభావములను సూచించుట కలారూపమునకు రూప సంపద.

కలామయయుగుల నన్నిటిని మన మట్లె భావింతుము. ఉదయ మాదిగా సాయాంతము, తదాదిగా నుదయాంతము మానవుని క్రియాశీలములు చర్యావిశేషములు కలాకంచుకమున గుప్తగూఢములై యున్నవి. 1 ముఖశోధనము 2 దంతధావనము 3 అనులేపనము 4 కేశసంస్కారము 5 అధరనఖరాగము 6 తాంబూలసేవనము 7 స్నానము 8 భోజనము 9 భోజనానంతరవినోదము 10 అంతఃపురము 11 వృక్షవాటిక 12 డోలావిహారము 13 భవనదీర్ఘిక 14 సరోవరము 15 క్రీడాపర్వతము 16 వనవిహారము 17 శకునసూక్తులు 18 వీణావాదనము 19 అంతఃపురశయనకేళి 20 భిత్తిచిత్రము 21 చిత్రకర్మ 22 లేఖనసామగ్రి 23 నవవధూరూపసౌందర్యము 24 ఉత్సవములలో వేషభూషావిశేషములు 25 అలంకారము 26 నాట్యగృహము 27 పరివారోత్సవము 28 వివాహవినోదము 29 అభినయవిశేషము 30 వసంతోత్సవము 31 సంగీతగోష్ఠి 32 కామోత్సవము 33 వృక్షదోహదము 34 కావ్యశాస్త్రవినోదము 35 ఉక్తివైచిత్ర్యము 36 కవిస్పర్ధ 37 పరిహాసగోష్ఠి 38 ఇంద్రజాలము 39 మృగయావినోదము 40 అక్షక్రీడ 41 మల్లవిద్య 42 వినోదశాస్త్రము కలావిలాసుల కలావిశేషములుగా పూర్వీతనుల గ్రంథములందు గోచరించును.

"ఇవి యిట్టివి ధనము కలవారి కలలు. అధనులవి కావు" అని నేడు క్రొత్తగా జెప్పుటలో క్రొత్తలేదు. ఇవి కలవారు సధనులె యయినను వీని చూచువా రనుభవించువారు తదన్యులయిన భావధనులె. సామాన్యముగా వాని వాని ప్రయోక్తలందరు అధనులె. వారి భావధనమె వాని కట్టి వైభవ మిచ్చినది. శ్రీవైభవమునకు తోడు ధీవైభవమున్ననె కలావైభవ మాత్మవైభవ మందింపగలదు. శ్రీయుతు లాదరింపవలసిన కలాపోషణము సముచితముగ నున్నప్పుడాత్మకైంకర్య మవభాసించును. ధనవంతుల ధనము ధనవంతులది కాదు. కలాభాస్వంతు లాధనమున ధనులగుట యుక్తము. అప్పుడు కలామార్గము లకంటకములై యసంకటములై రాణింపగలవు. కలలం దుత్తమాధమసంభావనము భావుకుల కుండదు. మౌలికములయిన కొన్నికలలు స్వాంతర్లీన కలావైదగ్ధ్యముతో నున్నవి. పాశ్చిమభావసంక్రాంతి కలిగిననాటినుండి కలాభావనమున న్యూనాధికభావసంభావన మెవరో తలచినట్లుగ వచ్చినది. పటచిత్రములు భిత్తిచిత్రములు తూలికావర్ణసంయోగమున స్పష్టరూపము లయినవి. అయిన నవి యప్రాణములు. సప్రాణములై సచేతనులకు భాసించును. అందలి వర్ణసంక్లప్తిలావణ్యమేళనము భావదీపనము సచేతోభావరాగ మీయగలవు. సచేతోభావుకు డప్పుడు చిత్రీకృతచిత్తు డగును. చిన్మయభావనుడు నగును. చిత్రమును చూచు చూపాతనిలో నుదయించును. లోకపుచూపు నాల్గువిధముల నుండును. ఒకచూపు సమ్యక్స్వభావకము. వేరొకటి మిథ్యాదృష్టి. మరియొకటి సంశయదృష్టి. నాల్గవది సాదృశ్యాత్మకము. చిత్రము చూచుటలో నీనాలుగుదృష్టులు తగవు. ఇవికాక అయిదవదృష్టి యున్నదా? లేదు కాని యున్నదనిపించును. అది సర్వవిలక్షణదృష్టి. గౌరీదత్తచిత్రము చూచు ప్రభావతి కలకలనవ్వినట్లు చూచినది. తెలికన్నుల చూచినట్లు చూచినది. అది చిత్రముచూచు చూపు. నూరన చూచిన చూపు. మనము చూడవలయు చూపు. ఇట్టిచూపులో బాహ్యము భావకంచుకముతో భావించును. శిలాశిల్ప మున్నది. అందు ఒడ్డుపొడుగులు లావుసన్నములు లోకభావానుగతములుగ నుండును గాని మనము తావన్మాత్రము గుర్తించుట శిల్పదర్శనము కాదు. చర్మచక్షువునకు గోచరించునది యొకటి యయినను భావచక్షువునకు తొమ్మిదివందల తొంబదితొమ్మిది భాసింపవలెను. చిత్రసన్నిధిలోని చిత్రము శిల్పసన్నిధిలోని శిల్పము అంతరాంతరచిత్రశిల్పముల వ్యాఖ్యానించునట్లు మనముచూడవలెను. సాధకులు నిత్యపారాయణమున భావించు దేవీదేవసహస్రనామము

లిట్టి భావసారమునె యందించుచున్నవి. మనము విను గానము నందలి శబ్దము కేవలశబ్దము కాదు. అది యంత స్సంజల్పస్వభావము. పాఠ్యము వలన ధ్రువాగానము వలన శ్రుతి కల శ్రోత సర్వతః రససంపూర్ణము పొందును. తదాస్వాదభరితై కాగ్రుడై సాధకు డంతర్ముఖు డగును. అప్పు డాతని యాహ్లాదప్రమోదను లాతనివి. చిత్రశిల్పనాట్య భావనములందంతట నీభావన మున్నది. కలాభావనమునందు బాహిరమబాహిర మగుట ఆంతర మనాంతరమగుట బాహిరాంతర భేదము లేమి సర్వభావకప్రత్యక్షము. సర్వకలాభావనము సర్వసహృదయులకు స్వస్పందసుందరమై స్వాత్మసంవేదన సంతర్పణ మొనరించుట సచేతఃస్వాత్మదర్శనము. ఇట్లు దర్శనపథసంచారమె కలాశాంతి. శాంతి మూలమయిన శమము సర్వసామితేయులకు సిద్ధభావము. కలామార్గ మనేకవిధముల సాధ్యభావముల నూకొల్పియు పర్యవసానమున సిద్ధభావ మాపాదింపగలదు. ఇది కలాశాంతి.




శ్రీదేవీ వరివస్యాధ్వసంచారోల్లాసిచేతనాః
కలాశాంతి కలాలాప వైదగ్ధ్యే భద్రభావనాః

వర్ణే పదే మంత్రమార్గే చరిత్వా వికసన్మతిః
కలామార్గే కృతస్వాంతో భవార్థం భవ్య మీహతే

శ్రీశక్తి స్సాపరా దేవీ కలారూపేణ సంజ్ఞితా
శివాది స్తంబపర్యంతం షట్త్రింశత్తత్త్వభావనం

కలాకంచుకసంఛన్న మాత్మానం వేత్తు ముద్యతః
ప్రజ్ఞావాదేన జానాతి సచేతా స్సకలాః కలాః

శక్తిసారేణ జీవస్యరచనా నవచిత్రితా
మాయీయం రచనం సర్వం కలావరణసుందరం

తత్త్వాభిముఖజీవస్యకంచుకం ముక్తిసాధనం
అతత్త్వముఖజీవస్యకంచుకం బంధకారణం

కంచుకం కంచుకార్థంచే త్కలార్థం సాకలా భవేత్
జీవస్య శివభావాయ కలావలయలాలనం

స్వసంవిదానందసంభోగః కలాలక్ష్యం ప్రకీర్తితం
కలాభావుకసంభావ్యే వైచిత్ర్యస్య కుతో గతిః

భోగ్యభోగవిముక్త్యర్థం కలాభోగః కవిప్రియః
నిత్యజీవితనిర్విణ్ణః కలాభోగం నవిందతే

ఆనందభోగసామ్రాజ్యం కలాపండితదర్శనం
ఆత్మసంవాదిసౌభాగ్యం రమ్యారమ్య వినిశ్చయే

పాల్యపాలకభావోత్థం భోగ్యభోజకబంధనం
కలాసంపత్తితత్త్వాయ నాపాద్యం స్వాన్యదర్శనం

సచేతః కవిసాపేక్షం కలాతత్త్వం నిషేవ్యతాం
విద్యారాగకలాకాలనియతిః పరిభావ్యతాం.

 

# నేఁ డు

## శ్రీ పోతరాజు పురుషోత్తమరావు

*

అర్కమండల సంవాసే !
బ్రహ్మాండాంతరభాసిని !
అనసూయాత్మచిచ్ఛక్తి !
నమస్తే కరుణామయి !

*

మ. జననంబందినయట్టి యెల్లజనులున్ సత్యంబెకా మృత్యువుం
గనుటల్, భావినిగూర్చినట్టి వెవియేన్ గావచ్చుఁ గాకుండపో
వను వచ్చున్, బ్రతిజీవి మిత్తిఁ గనునన్ వ్యాహార మెప్డైన నే
నన్నృతంబుం బొనరింపఁ జాలు నతఁ డీజ్యామండలిం గల్గనే?

కం. అమరుల యమరత్వంబును
సమీక్ష సేయంగ నదియు సాపేక్షకమే
యమవరుణేంద్రాదులు తమ
తమపదవులఁ బాసి కాలధర్మముఁ గనరే?

కం. క్రిమికీటకాదిదృష్టికి
నమరులమై మనము దోచినట్టులె మన కా
యమరులు గనిపింతురు వే
దమరత్వ మితరులకుఁ బరమాత్మకుఁ దక్కన్.

ఉ. మృత్యు వటన్న దెల్లరకు నెప్డొ యొకప్పుడు వచ్చితీరు నన్
సత్యము నిత్యముం గనెడి చావులచేత నెఱింగినన్ గటా
నిత్యపదార్థమున్ దెలియనే తలపోయక లోక మేదొ యా
స్సత్యము గోరి పర్విడు ననంతదిశావలయంబుఁ జేరఁగన్.

శా. ఈయౌన్నత్య మ దెంతదాకఁ జనునో యేమౌనొ యాపైన, స
ర్వాయంబై తనరారు నట్టివె యనిత్యాలై చనన్ ద్వేషభా
వాయత్తంబుగఁ జేయు కార్యములు శ్రేయశ్శ్రేయముల్ గూర్చునే?
యీయుత్సాహము కార్యదీక్ష జను లాయీశున్ గనన్ జూపరే.

ఉ. ఒక్కరి మించి యొక్కరు మహోగ్రత దారుణమారణాయుధాల్
లెక్కకు మిక్కుటంబుగఁ గడింపను సృష్టియొనర్పఁ జూతు రీ
ఫక్కికి నంత మున్నదియె? భస్మపురాసులు గాక వీనిచే
మొక్క య దొక్కటేనియును భూస్థలి నిల్చునె లోకమాతరో!

ఉ. మానవసృష్టియెల్ల మటుమాయముఁ జెందక నిల్వనేర్చునే
దానను దీరునే ప్రళయతాండవదృశ్యము లుప్పతిల్లవే
జేనెడు పొట్టకోసమయి చేయఁగరానివియెల్ల జేయు వా
రీ నరు లేమి కాఁగలదొ? యేమి యొనర్తురొ యీ ప్రపంచమున్?

చ. ప్రగతి యటంచుఁ బల్కెదరు బాపురె! మానవలోకనాశనం
బగు గతి దుష్టశక్తుల నహర్నిశలుఁ బెనువృద్ధి సల్పుటల్
కుగతియొ? సద్గతిక్రమమొ? కూల్చునొ? తేల్చునొ నేటికాలపున్
విగతులు నెమ్మనంబుల వివేకముతో బుధు లెంచినారలే?

ఉ. బౌద్ధము మా మతమ్ము, పరభావములందును బాధనీని యా
పద్ధతిఁ గూర్చునట్టి గురుపాదు నహింసయె మా వ్రతమ్ము, మా
బుద్ధులు పంచశీలపయిపో యని యేవియొ యేవియో యసం
బద్ధము లాడుచున్ బరుల పావనమస్తముఁ ద్రొక్కనెంచు నా
క్రుద్ధుల దుష్టచేష్టితపుగోడు దురాక్రమణంబు లాఋనే?

ఉ. ఎచ్చటఁ గన్న నీజగతి నిత్తరి కుత్తుక లుత్తరించు నా
పచ్చికసాయివాఁడు పడు పాటులు దక్క జనంబు మేలుకై
మచ్చునకైన పాటుపడు మార్దవమానసు మానవున్ గనన్
వచ్చునె? శాంతి యేగతిని బ్రబ్బెడినో జగదేకమాతరో!

ఉ. ప్రస్తుతకాలమందు జనభావములం జెలరేగు స్వేచ్ఛ యన్
నిస్తులశక్తి నాపఁగల నేరుపు చాలక, సార్వభౌమతా
విస్తృతి వీడఁజాల కెటో వీడియుఁ గొందరు స్వేచ్ఛయిచ్చిన
ట్లస్తునబిస్తుగా నొసఁగి యంతట నిల్వక వారిలోన నే
మస్తము లొండొరున్ నరకమార్గము గల్పన సల్పుచుం డ్రహో!

చ. నిలువునఁ గూనిసల్పుటన నీరముగ్రోలుటకన్న తేలికై
మెలఁగెను నేడు మానవుల మించు దురాశకు నంతులేమిచేఁ
దొలిమలివౌ ప్రపంచరణదుర్భరబాధలు సన్నగిల్లకే
మొలకలువేసె బీజములు మూడవఘోరసమిత్ప్రసక్తిన్.

కం. ప్రచ్ఛన్నయుద్ధ మెల్లెడ
నాచ్ఛాదించెను జగాన నంతట నిలకే
స్వేచ్ఛావాయుప్రసరణ
విచ్ఛిత్తికి దారిఁదీసి విలయం బిడునో?

మ. ప్రళయప్రజ్వలదగ్నికీలలగతిన్ బ్రహ్మాండభాండంబు ప్ర
క్కలు సల్పన్ జెలరేగ నున్నవన నుగ్రస్ఫూర్తి యాటమ్ముబాం
బులు ఘూర్ణిల్లుచునున్న వెల్లెడల నేమో? యెప్పు డేమౌనొ? శాం
తిలుమార్గంబును జూపు నీప్రజల కోదేవీ! జగన్మాతృకా!

ఉ. శాంతి, ప్రపంచశాంతి యని చాటెడువారలెగాని నిర్మల
స్వాంతముతోడ దానికిఁ బ్రయత్నము శక్తికొలంది సల్పు భూ
కాంతులు నేటికాలమున గానఁగరారు గదా? పరస్పరా
త్యంతవిలుప్త మౌట గననయ్యెను బ్రత్యయభావ మెయ్యెడన్.

ఉ. శాంతియటన్న దెచ్చటొ బజారున రొక్కముచేత లభ్యమౌ
నంతటి స్వల్పవస్తువౌకొ? యయ్యది కామరుషామదాదిదు
ర్దాంతసపత్నషట్కము నిరంతరయత్నముచే జయించు ని
శ్చింతుల కబ్బుగాక తగు శీల మెసంగనివారి కబ్బునే?

కం. ఎతుల పెయెతులతోఁ
దత్తరపడువారె గాని తగుపద్ధతులన్
జిత్తము స్వాయత్తంబై
యుత్తమమార్గంబుఁ బట్ట నొనరింపరుగా?

ఉ. మానవజాతిశాంతి తమమానసపుష్కరిణీస్థలాన స
న్మానముగా జనించెడు మహోగ్రదురాశ లటన్న భంగసం
తానము, దుష్టచింతలను తక్కెడమొక్కలు తొల్గఁజేసినన్
గాని లభింపదేగద జగజ్జనయిత్రి! యి దెట్టు లబ్బుటో!

ఉ, బెబ్బులిబొబ్బరింతలటు భీకరరావముతోడ నంతటన్
గబ్బునువేయు యాటము జగద్విలయంబగుబాంబుప్రేలుడుల్
గుబ్బతిలంగనీక జనకోటులఁ బ్రోవఁగ వైరభావ మన్
మ బ్బెదలం దొలంగి మటుమాయముగాగ నొనర్పు మంబికా!

తే. మారణాయుధసృష్టి కిమ్మహిని నేడు
వమ్మొనర్చెడు కోట్లధనమ్ములెల్ల
జనవినాశనమునకెగా సర్వజనని!
అద్ది తత్క్షేమమునకైన నవనియెల్ల
స్వర్గ మైపోదె సౌఖ్యప్రశాంతు లెసగ?

ఉ. ఎక్కడఁగన్న భీతియె మఱెక్కడఁ గన్నఁ బరస్పరంబు లో
నెక్కొను మత్సరత్వమున నిండిన దారుణదుష్టచేష్టలే;
అక్కట! యాప్రజాళిహృదయంబులు ధర్మపథంబు వట్టియున్
రక్కసకృత్యముల్ విడిచి రాజిలఁజేయవె సర్వమంగళా!

చ. తమతమకర్మబంధములఁ దా మిటు చిక్కి కృశించుచుండి రీ
కుమతులు, దైవచింతనము గూడినఁగా శుభ మబ్బు టందువా?
సమవుగదా జగజ్జనని! సర్వజనావళి, వారిలోన నా
సుమతియు నీవె గూర్పవలె సుమ్మి యకాలలయంబు నాపఁగన్,

ఉ. అందఱు నేను నే ననుచు నందురె, నే ననునట్టి వస్తు వీ
యందఱిలోన నున్నదని యంద ఱెఱింగినదే గదా? య టీ
యిందఱిలోని నే నొకటియే యని గుర్తెరుగంగఁ జెల్లదే
డెందము శాంతినొందు ననెదే? జనయిత్రి! యి కేమి కావలెన్!

ఉ. ఇందఱిలోన నున్న యది యేనొకరుండనె యన్న భావ మీ
యిందఱిలో జితించిన ని కెవ్వరుఁ డెవ్వరితోడఁ బోరుఁ ద
న్నెందును దానె చంపుకొనునే యెవఁడైనను? జచ్చునట్టిదే
యిందఱిలోన నేకముగ నెల్లపుడున్ వెలుఁగొందు నాత్మయున్.

తే. చచ్చునట్టిది దేహంబు చావు లేదు
దేహి కతఁడు శాశ్వతుఁడు, తచ్చిత్ప్రకాశ
గుర్తెరింగిన బంధముల్ గూలిపోవు
మనసు లయమొందఁ దత్స్థితిం గను నరుండు
వాంఛలు నశింప మది లయభావ మొందు.

కం. సర్వాత్మభావ మీగతి
నుర్వరలోఁ గలుగువాని కుండునె వాంఛా
నిర్వహణము? పరమాత్మగ
సర్వంబును నతఁడు చూడఁ జాలునుగాదే?

తే. అట్టి యద్వైతసుస్థితి నందు జనుఁడు
జననమరణాదిబంధనజాలమందుఁ
జిక్కఁబోక జీవన్ముక్తిఁ జెందుఁగాదె
ఆత్మతేజఃప్రపూత! లోకైకమాత!

శ్రీ శ్రీ శ్రీ

*  *

కం నక్షత్రమాల నుంచితి
నక్షరరూపిణి! జగజ్జనావనదీక్షా
వీక్షణ! నీగళమున వే
సాక్షాత్కృతి సల్పి ప్రోవు శాంకరి నన్నున్.

ఓమ్ తత్ సత్

*

# ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

## శ్రీ నండూరి రామకృష్ణమాచార్య



శాస్త్రవిజ్ఞాన మహనీయశక్తిచేత
సమయసీమల, పంచభూతముల నెల్ల
కైవసమ్ము గావించుకోఁ గలిగినట్టి
నవ్యనాగరకత కభినందనములు!

కాని— యిదేమి వింత! గతకాలముకంటెను లోకమందు వి
జ్ఞానము హెచ్చురీతిగనె – సౌఖ్యము శాంతియు తగ్గుచుండె; ఈ
మానవజాతియెల్ల తుదమాసెడి రోజులు వచ్చె; నవ్యశా
స్త్రానలదగ్ధమై ధరణియంతయు బూడిదయై లయించునా?

'ఆటముబాంబు' రెక్కల జలాంతరగాములు కాలకూటదుష్
కీటకవాయుజృంభణము క్రిందులుమీదులు లేక సంగరో
చ్చాటన సల్పుటన్; బ్రదుకుచావులు దుఃఖసుఖాల, క్లిష్టశృం
గాటకమందు నిల్చిరి జగచ్చరితంబున నేటిమానవుల్.

యుద్ధము మీదనే మనము యుద్ధమొనర్చుచు నుంటి మిప్పుడే;
యుద్ధరణిన్ రణంబు లిక ఎప్పుడు నుండవు కాన సర్వలో
కోద్ధరణంబుకై అనువులొడ్డు డటన్న మృషాప్రబోధ సం
బుద్ధులు రెండుసార్లు చనిపోయిరి సర్వజగద్ధితంబుగన్.

ఓనవశాస్త్రదారుణమహోగ్రకఠోరవికారఘోరవి
జ్ఞానవికాసమూర్తి! విషచారితరక్తరసప్లుతప్రభా
లీనకటాక్ష మేల ప్రసరించెదవోయి! సహస్రశీర్ష పం
చాననవిశ్వరూపవిలయాంతకభీకరగర్జనార్భటిన్.

ఆకాశమ్మున పక్షిపోలిక విమానారూఢశుంభద్విహా
రాకాంక్షాపరిపూర్తి; చేపవలె నీరాంతర్గతిప్రాభవ
స్వీకారంబున విశ్వజేత వగుచున్, జీవింప లేవేల భూ
లోకంబందున మానుషత్వమున? చాలుం జాలు విజ్ఞానముల్.

వేయిచేతులు పదివేల వెఱ్ఱితలలు
పిడుగు లురులు లక్ష పెద్దనోళ్లు
నిప్పుగురియు కోటినేత్రకుండము లేల?
గుండెలేని పాడుమొండెమునకు!

దూరదర్శనమ్ము దూరశ్రవణమును
విశ్వమంత అరచు వింతనోరు
శ్రోత్రనాగరకత కూర్చుకో గలిగెను
తుదకు హృదయమొకటి కొదువయయ్యె.

'ఈపెనుమంటిదిబ్బ వసియించి రొకానొకనాడు మానవుల్
పాపము! శేముషీవిభవపారగులై ప్రకృతిన్ జయించి వి
శ్వాపరసృష్టి సల్పి, ప్రళయాంతకబుద్ధిని గుండెలేక ఆ
త్మాపహతిన్ వినాశనమునొందిరి యందరు జ్ఞానశూన్యులై.

అనుచు హతశేషమై యెంత అవని మిగులు
ఏ పిపీలికలో రచియించుకొనును
కరుణగీతులను తమవాఙ్మయములోన
ఇయ్యది అవశ్యభవితవ్యమేమొ మనకు.

"ఎవరవు నీవు? నీహృదయ మేల ద్రవించుచునున్న దిట్లు వె
న్నవలె కరంగి; కోమలమనస్కులు చూడగలేరు నేటిపా
శవదురహంకృతుల్ సలుపు స్వార్థపరత్వకఠోరఘోరమా
నవముఖహోమధూమనవనాట్యచలద్వికటాట్టహాసముల్.

భూతలమే శ్మశాన మయిపోయె చితోద్గతకాలధూమురే
ఖాతిమిరమ్ములో అలతికాంతుల నీనెడి నెత్తురెత్తి దీ
ప్తాతిలకప్రసాధనము సల్పుము తద్రుధిరార్ద్రశోభ ప్రా
భాతమరీచివీచు లయి పర్వును నూత్నయుగోదయమ్ముగన్.

ఈదృశకాలబాధ గతియించిన యట్టి చరిత్రలేక పో
లే దెదిరించి నిల్చెను చలింపక మానవజాతి భావిభా
గ్యోదయదృష్టితో; నవయుగోదయమందున ఈప్రసూతికా
వేదనలన్ని ఎట్లనుభవింపక తప్పు ధరాసవిత్రికిన్?

అణుపరమాణుభేదనమహాప్రళయాగ్నిముఖాంతరాళమా
రణనవకేళి దారుణకరాళవిజృంభణ కాదుసుమ్మి తూ
ర్పున వికసించు ఎఱ్ఱమెఱుంపుంగమి నవ్యయుగోదయప్రభా
రుణకిరణమ్ములే యని నిరూపణ జేయవె ఆర్తకోటికిన్.

స్వాదుకవిత్వసంభరితశాంతిసుధారసగాననిర్ఝరీ
నాదము నింపుచుండు మొకనా డధికారికి ఈజగద్ధితా
వేదన గుండెలోన ప్రభవింపకపోదు నవీనసభ్యతో
న్మాదమహాజగత్తు వినినన్ వినకున్నను చిన్నబోకుమా!

కాగి తపించి లోకము వికావికలౌచు వృథా మనోవ్యథన్
వ్రేగయి మూల్గుచున్ పలవరింపగ శాంతరసస్రవంతికా
స్వాగతదివ్యసూక్తములు పాడెడి ఓ అమృతార్ద్రగీతికా
యోగతపస్వి! అల్లుకొను ముత్తమవిశ్వజనీనగేయముల్.

సకలధరణిశాసనపరిషత్తుతోడ
ప్రజలు వసుధైకసామ్రాజ్యపౌరు లగుచు
భూమి యేకకుటుంబమై పొందు నంది
విశ్వమానవకల్యాణవేది యగుత.

# కరుణరసానుభూతి

## శ్రీ అక్కిరాజు వేంకటేశ్వర శర్మ

పుత్రాది వియోగ మరణాదులవల్ల కలుగు వైక్లబ్య మను చిత్తవృత్తికి శోకమని జగన్నాథపండితుని నిర్వచనము. "కరుణోనామ శోకస్థాయిప్రభవః. సచ శాప- క్లేశ- వినిపతిత- ఇష్టజనవిప్రయోగ- విభవనాశ- వధ- బంధ- విద్రవ- ఉపఘాత- వ్యసనసంయోగాదిభిః విభావైః సముపజాయతే" అని భరతముని లక్షణము.

"శోకస్థాయికము కరుణము. ఇష్టజనవిరహమువలన- అర్థనాశమువలన- రాజ్యదేశపరిభ్రంశమువలన దైవికమగు విపత్తివలన- దారిద్ర్యమువలన- రోగాదులవలన శోకము జనించును. ఇది స్వాశ్రయము, పరాశ్రయము అని ద్వివిధము. ఉత్తమప్రకృతులు పరాశ్రయదుఃఖముచే దుఃఖితులగుదురు" అని శారదాతానయుడు భావప్రకాశమున వచించెను.

ఒక్క పుత్రాదిమరణమువలననే కాక పైన వచించిన పెక్కు కారణములవలనకూడ శోకము ప్రభవించును. రాముడువనవాసగతుడైనపుడు దశరథుడు పొందినశోకము సాహిత్యదర్పణమందు కరుణరసమున కుదాహరణముగా నీయబడెను. ఇట్లులే కీచకపరిభూత యగుద్రౌపది ద్యూతమందు సర్వస్వము కోల్పోయిన ధర్మజాదులు కరుణరసాలంబనములు కాగలరు.

కరుణ అనగా దయ. కరుణ మనగా శోకము. ఈరెండును విభిన్నము లని యాలంకారికుల మతము. భావప్రకాశమునందు కరుణ, కరుణము రెండును అభిన్నములుగానే పేర్కొనబడినవి.

"పరాశ్రితానాం క్లేశానా మసహిష్ణుత యోచ్యతే
మనసో యాదృశో భావః సవై కరుణ ఉచ్యతే." — "పరులకష్టములను జూచి సహింపలేని మనోభావమే కరుణ మనబడును" అని శ్లోకభావము. కరుం = క్లేశం నసహతే ఇతి కరుణః (ఇతరుల) కష్టములను జూచి సహింపలేకుండుటయే కరుణ మని వ్యుత్పత్తిని కల్పించెను.

"కృశా విషణ్ణా మలినా రోగిణో దుఃఖిత స్తథా
కరుణాలంబనాభావా దారిద్ర్యోపహతాశ్చయే"

'కృశించినవారు, విషాదమునందినవారు, మలినులు, రోగులు దుఃఖితులు, దరిద్రులు కరుణరసమున కాలంబనములు' అని శారదాతనయుని యభిప్రాయము. ఈయుదాహరణముల వలన కరుణకు కరుణమునకు శారదాతనయుడు భేదమును పాటించినవాడు కాడని తెలియును.

వాల్మీకికి నిషాదశరపీడితమగు క్రౌంచము, దిలీపునికి సింహగృహీత మగు నందినీధేనువు- బుద్ధునకు దేవదత్త శరాహతమగు హంస దయనీయములు. మరియు కరుణమున కాలంబనములు. ఇట్లు కరుణకు కరుణమునకు సన్నిహితత్వమును భావింపవచ్చును.

శృంగారాదిరసములవలన ఆనంద మాస్వాద్యమగుచున్నటులు కరుణరసముచే నానంద మనుభూతము కాగలదా? ఇది శోకస్థాయిక మగుటచే దుఃఖమే కలుగును? యను ప్రశ్నకు ఆలంకారికు లిట్లు సమాధానమిచ్చిరి. దుఃఖమునందు ప్రవృత్తి యెవ్వరికిని కలుగదుగదా! హరిశ్చంద్రనాటకాదులందు కరుణరసప్రధానములగుసన్నివేశములను జూచి జను లానందించుచున్నారు. అందుచే కరుణముకూడ కావ్యములందు ఆనందప్రదమే కాగలదు. అది యనుభవసిద్ధము.

మరి కన్నీరుకారుటకు కారణ మేమి? అనగా "చిత్తద్రవీభావమువలన కన్నీరు స్రవించును" అని సాహిత్యదర్పణకారుని సమాధానము.

“కరుణకావ్యములవలన ఆనందమనుభవసిద్ధము. కాబట్టి కార్యానుగుణముగా కారణమును కల్పించుకొనవలెను. ఏలోకోత్తరకావ్యవ్యాపారమానందసిద్ధికి హేతువో అదే దుఃఖప్రతిబంధహేతువుకూడ కాగలదని జగన్నాథపండితుని యభిమతము.

“అధికముగా నానందము దుఃఖలేశము కరుణమున కలవు. చందనలేపన నఖక్షతాదులందు దుఃఖలేశము, ఆనందాధిక్యము లేవా?” అని వేఱొకరీతిగా నైనను పైవాదము సమర్థనీయమని పండితరాజుపక్షాంతరమును సూచించెను.

మరికొందఱు “కేవలానందమే కరుణరసకావ్యముల వలన సిద్ధించును. దుఃఖలేశముకూడ అందుండదు” అని యందురు. కరుణరసాస్వాదనమున కన్నీరు స్రవించుటకు హేతు వేమి? యనగా “అవి యానందబాష్పములు. దుఃఖాశ్రువులు కావు. భగవద్గుణవర్ణనముచే భక్తునకు కన్నీరు స్రవించునుకాదా! అచట దుఃఖలేశమైన కలదని యందురా? అట్టులే కరుణరసకావ్యాస్వాదనమందును.” అని వారందురు.

“ఒక్కకరుణమువల్లనే కాదు. భయానకభీభత్సాదుల వలనకూడ కావ్యవ్యాపారమహిమచే నానందమే కలుగుచున్నది. లోకమందు శోకహర్షాదికారణములవలన శోకహర్షాదులు కలుగుచున్నవి. కాని కావ్యనాటకాదులందు మాత్రము రసపర్యవసానము పొందిన అన్నిస్థాయిభావముల వలన నానందమే జనించును” అని యాలంకారికుల యభిప్రాయము.

నవరసములలోను కరుణరసమున కొక ప్రాధాన్యము కలదు. భారతీయకవిత కరుణరసముతోనే యారంభమయినది. కిరాతుని బాణముతో నేల వ్రాలిన క్రౌంచపక్షిని చూచిన మహర్షి వాల్మీకిహృదయమందు పొంగిన శోకమే శ్లోకరూపముగా అవతరించినది అదియే ఆదికవిత. అతడే ఆదికవి. “ఆదికవేః పురా క్రౌంచద్వంద్వవియోగోత్థః శోక శ్లోకత్వ మాగతః” అని ఆనందవర్ధనుడు. “నిషాద విద్ధాండజదర్శనోత్థః శ్లోకత్వ మాపద్యత యస్య శోకః” అని కాళిదాసు పైవిషయమునే వివరించినారు.

ఆదికావ్యము రామాయణము కరుణరసప్రధాన మగుటయు విశేషము. రామాయణకావ్యము కరుణరసప్రధానమన్న విషయమును ధ్వన్యాలోకము స్థిరీకరించినది. “రామాయణేహి కరుణో రసః స్వయ మాదికవినా సూత్రితః “శోకః శ్లోకత్వ మాగతః” ఇత్యేవం వాదినా నిర్వ్యూఢశ్చ స ఏవ సీతాత్యంతవియోగపర్యంతమేవ స్వప్రబంధ ముపరచయతా” అన్న ధ్వన్యాలోకపంక్తులు స్మరణీయములు.

శృంగారము మధురమగుచో మధురతమమగు రసము కరుణరసమే యగును.

“శృంగారే విప్రలంభాఖ్యే కరుణేచ ప్రకర్షవత్

మాధుర్య, మార్ద్రతాం యాతి యత స్తత్రాధికం మనః”

“శృంగారమందుకంటె విప్రలంభమందును అంతకన్న కరుణమునందును మాధుర్య మధికము. ఏలయన మన స్సచట నత్యంతము ద్రవీభావము నొందుచున్నది” అని ధ్వన్యాలోకము ప్రతిపాదించుచున్నది.

కనుకనే భవభూతిమహాకవి “ఏకో రసః కరుణ ఏవ” అని యెలుగెత్తి చాటినాడు.

మరియు కరుణరస మొకవిధముగా లోకకల్యాణకారణ మగుచున్నది. శోచనీయస్థితియం దున్న ప్రతిప్రాణియు కరుణరసాలంబనమేకదా! నిరుపేదల అగచాట్లను, దేశ సముద్ధరణమునకు, సత్యధర్మనిర్వహణకొఱకు నాత్మసమర్పణము చేసిన త్యాగమూర్తులను, సంఘస్వార్థమునకు, దౌర్జన్యమునకు నాహుతియైన యనాథులను కవులు కావ్యములందు వర్ణించుట శ్రేయస్కరము. అట్టికావ్యములు దయను, పతితోద్ధరణకాంక్షను, అధర్మప్రతిఘటన దీక్షను రేకెత్తించగలవు. అన్యరసప్రధానకావ్యములకంటె కరుణరసప్రధానకావ్యములకే యీశక్తి యధికముగా గలదనుట నిర్వివాదము.

స్వరూపపరిజ్ఞానమునకు లక్షణవివేచన మావశ్యకమే యైనను, తిననిగాని రుచితెలియదన్నట్లు, ఆస్వాదనము వలనగాని కరుణరస విశేష మవగతముకాజాలదు. మహాకవులకావ్యములనుండి కొన్ని కరుణరస ప్రధానఘట్టముల నిచట లక్ష్యములుగా గ్రహించుట యుక్తము.

ఆదికరుణకావ్య మగు రామాయణమందలి దీసన్నివేశము. హృదయవిద్రావకము.

ఇంటిని ఇల్లాలిని కన్నతల్లిని విడిచి, అన్న పరిచర్యయే పరమార్థ మని నమ్మి రామునితో నడవుల కేగిన యుత్తముడు లక్ష్మణుడు. అట్టి లక్ష్మణుడు రావణశరవిదారిత హృదయుడై రణరంగమున దుమ్ములో పడియుండగా చూచిన శ్రీరాముడు సహజగాంభీర్యము విడిచి

«నహి యుద్ధేన మే కార్యం నైవ ప్రాణై ర్నసీతయా
భ్రాతరం నిహతం దృష్ట్వా లక్ష్మణం రణపాంసుషు»

రణరంగమున దుమ్ములోపడియున్న తమ్ముని లక్ష్మణుని చూచినపిదప నాకు యుద్ధముతోగాని, నాప్రాణములతోగాని, సీతతోగాని యేమి ప్రయోజనము?

«దేశే దేశే కళత్రాణి దేశే దేశేచ బాంధవాః
తంతు దేశం నపశ్యామి యత్రభ్రాతా సహోదరః»

ప్రతిదేశమునందును భార్యలు బంధువులు లభింతురు. కాని తోఁబుట్టిన తోడు (తమ్ముడు) లభించుదేశమును మాత్రము కనలేను.» అని దీనముగా నన్న పరిదేవనవచనము లెవరి హృదయములను కరఁగింపవు. «వనవాసమున కేగువేళ నీతడు నన్ననుసరించినాడు. పరలోకమున కేగువేళ నే నిప్పు డితని ననుసరింతును» అను శ్రీరామునిపలుకు లెవరికి సంతాపకరములు కావు.

ఉత్తరరామచరితలో భవభూతి సీతావివాసనసమయమున శ్రీరామునిచే ననిపించిన కరుణాలాపముల నాలకించుడు.

«త్వయా జగన్తి పుణ్యాని త్వయ్యపుణ్యా జనోక్తయః
నాథవన్త స్త్వయా లోకా స్త్వమనాథా విపత్స్యసే
«అపూర్వకర్మచండాల మయి ముగ్ధే విముంచ మామ్
శ్రితాసి చందనభ్రాన్త్యా దుర్విపాకం విషద్రుమమ్»

«జానకీ! నీవలన లోకములు పావనములు. ప్రజలమాటలు నీయెడ పంకిలములు. నీవలన లోకములు సనాథములు. నీవుమాత్ర మనదవై యాపదల పాలగుచున్నావు. «ఓముద్ధరాలా! అపూర్వకర్మచండాలుడ నగు నన్న విడిచిపొమ్ము. చందనతరుభ్రాంతితో దుష్ఫల మగు విషవృక్షమును సుమా నీ వాశ్రయించితివి.» ఇట్టిపలుకులు విన్నప్పుడు «అపి గ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయమ్.»

ఇక కరుణపరిపోషణలో కాళిదాసుకౌశలమును గమనింపుడు. రఘువంశమందు ఇందుమతీవియుక్తుడగు అజుని ఆక్రందనములు, కుమారసంభవమందలి రతివిలాపములు సముద్రఘోషణమువలె నిరంతరము వినిపించుచునే యున్నవి. అజున కిందుమతి వలచి వలపించుకొన్న ప్రియపత్ని. ఉద్యానమున విహరించుచున్న యాదంపతులు కలసి యొకవకుళమాల నల్లుచున్నారు. అది పూర్తికాగనే యిందుమతికి మొలనూలుగా తానలంకరింపవలె నని యజుని యభిలాష. ఆముచ్చట తీరకముందే మృత్యు వామె నపహరించినది. అదే తలపోసి తలపోసి యాప్రియుడిటులు విలపించినాడు.

«తవ నిశ్శ్వసితానుకారిభి ర్వకులై రర్ధచితాం సమం మయా
అసమాప్య విలాసమేఖలాం కి మిదం కిన్నరకంఠి సుప్యతే»

«కిన్నరకంఠీ! నీనిట్టూరుపుతావుల ననుకరించు పొగడపూల నేరి నాతో కలసి సగమేకదా యీవిరిదండ నల్లితివి. నీకు విలాసమేఖల కాదగిన దీనిని ముగింపకయే నిదురింతు వేమి? పాప మాత డామె చనిపోయినను విశ్వసింపలేక యామాట ననలేక (సుప్యతే) నిదురింతు వేమి? యని పలుకుచున్నాడు. ('సుప్యతే' అన్న పదమందే యజుని హృదయమంతయు నిమిడియున్నది.)

గృహిణీ సచివః సఖీ మిథః ప్రియశిష్యా లలితే కళావిధౌ
కరుణా విముఖేన మృత్యునా హరతా త్వాం వద కిం
న మే హృ—

నాగృహిణివి- నాసచివువి- నారహస్యసఖివి- లలితకళల యందు నాప్రియశిష్యురాలివి- నిన్నుహరించిన దయమాలిన మృత్యువు నాకింక మిగిల్చిన దేమున్నది?

«ఎన్నిసంపద లున్నను నీవు లేక నాకు సర్వసుఖములు నేటితో చెల్లిన వనుకొనుము. ఇతరప్రలోభనములచే నాకర్షింపబడని నాసర్వభోగములు భవదధీనములే సుమా! అని యాతీరున నజుడు విలపింపగా నచటి యుద్యానతరువులు కూడ మకరందరూపమున కన్నీటిబిందువులు కార్చినవట!

ఇక కుమారసంభవమందలి యీకరుణరసఘట్టమును తిలకింపుడు. శివతపోభంగార్థమై దేవతలు మన్మథుని స్మరించిన సమయమున నతడు తనప్రియసతి రతిపాదములను లాక్షారసముతో నలంకరించుచున్నాడు. దేవతలపిలుపు పంద

గనే యాకైసేత నట్టులే విడిచిపోయిన మదనుడు మరల గృహమునకు రానేలేదు. ఆయభాగిని రతి యావిషయమునే స్మరించి గుండెలు వ్రీల నిటులు విలపించినది.

"విబుధై రపి యస్య దారుణై రసమాప్తే పరికర్మణి స్మృతః
త మిమం కురు దక్షిణేతరం చరణం నిర్మితరాగ మేహి మే"

"ప్రియా! వారు విబుధులైనను క్రూరులై నాచరణాలంకరణమైన ముగియకముందే నిన్ను స్మరించిరి. ఈనావామ పాదమును నీవపు డలంకరింపకయే వెడలితివి. మదనా, రమ్ము! వచ్చి యీపాదమును రాగరంజితముగా నొనర్పుము.

"నీవు నాతనువున కొనర్చిన వాసంతపుష్పాలంకరణ మింకను పసివాడక యిట్లే యున్నది. ఈకైసేత చేసిన నీసుందరతనువుమాత్ర మింతలోనే యదృశ్యమైనది."

"నీవు దేహప్రాణములతో నొక్కసారిగానే యూహింపరాని దుర్గతి పాలైతివే. అయ్యో! పరలోకగతుడవగు నీకు నేను చరమాలంకారమునైన నెట్లు చేయగలుగుదునుడి అని యీతీరుగా రతిదేవి కన్నీరు కాళిదాసకవిలేఖినినుం" మున్నీరుగా ప్రవహించినది.

సంస్కృతనాటకప్రపంచమందు విషాదాంతరూపకము భాసరచిత మగు 'ఊరుభంగ' మొక్కటి. అందలి దొక చిన్న సన్నివేశ మిది. భీమునికర్కశగదాఘాతముచే తొడలువిరిగి దుర్యోధనుడు రణభూమిలోపడియుండగా నతని నన్వేషించుచు నతనికుటుంబమంతయు నచటికి వచ్చినది. అందు దుర్యోధనునికుమారుడు పసివాడైన 'దుర్జయుడు' కూడ కలడు. ఆబాలుని చూచి రారాజు "దుఃఖమనగా నేమో తెలియనివాడు, ఒడిలోజేర్చుకొని లాలింపదగినవాడు వీ డిప్పుడు నన్ను జూచి యేమనునోకదా!" యని తనలో తాను కుమిలిపోవుచుండును. అందఱకంటె ముందుగా నాబుడుతడే తనతండ్రిని జూచినాడు. అప్పుడు జరిగిన యాతండ్రికుమారుల సంభాషణ మిది.

రాజు : కుమారా! ఇచటి కెందుకు వచ్చినావురా?
(పుత్ర! కిమర్థ మి హాగతః)

దుర్జ : మరి నీవు చాల ఆలస్యము చేసినావుగా! అందుకని.
(త్వం చిరాయ సీతి)

.... ... ....

దుర్జ నాయనా! నేను నీయొడిలో కూర్చుందును.
(కూర్చుండ బోవును)

రాజు : (వారించుచు) దుర్జయ! దుర్జయ! వలదు! వలదు! అయ్యో! ఎంతకష్టము!

దుర్జ : నాయనా! ఒడిలోకూరుచుండనీయక నన్నేల వారింతువు?

రాజు : "బిడ్డా! చిరపరిచితమగు నీయాసనము నింక మరచిపొమ్ము! ఇకమీద వే రెందేని యొకచో కూర్చుండుము. పూర్వభుక్తమగు నీయీయాసనము నేటినుండి నీకు లేదుతండ్రీ!"

"త్యక్త్వా పరిచితం పుత్ర యత్ర తత్ర త్వయాస్యతామ్
అద్యప్రభృతి నాస్తీదం పూర్వభుక్తం తవాసనమ్."

దుర్జ. మహారాజా! తా మిప్పు డెక్కడకు వెళ్లుచున్నారు.
(కుత్ర ను ఖలు మహారాజో గమిష్యతి)

రాజు : నాసోదరశతము ననుగమించెదను.

దుర్జ : అచటికి నేనుకూడ వత్తును. నన్నును గొనిపొండు.

రాజు : పొమ్ము! పోయి యీమాట నావృకోదరునితో ననుము.

ఈసంభాషణమును విన్నచో నావృకోదరుడేని కంట తడిపెట్టకపోడు.

కరుణరసానుభూతి కీయుదాహరణములు దిఙ్మాత్రములు. సంస్కృతాంధ్రసారస్వతములం దిట్టిసంఘటన లెన్నో కలవు. వానినెల్ల నుదాహరించుట కిచట తావు లేదు.

ఇక వర్తమానాంధ్రసారస్వతములో నవకవు లనేకులు కరుణరసప్రధానకావ్యములను పెక్కు రచించినారు. రచించుచున్నారు. ఇది హర్షింపదగిన పరిణామము. దువ్వూరివారి నలజారమ్మ, కృష్ణశాస్త్రిగారి కృష్ణపక్షము, రాయప్రోలువారి స్నేహలతాదేవి, కష్టకమల, జాషువాగారి ముంతాజ్ మహల్, ఫిరదౌసి, కట్టమంచివారి ముసలమ్మమరణము, గురజాడవారి పుత్తడిబొమ్మ- పూర్ణమ్మ వంటిగేయములు, కరుణశ్రీగారి కుంతీకుమారివంటి ఖండికలు, కరుణరసప్రధానము లెన్నో యెన్నదగిన వున్నవి.

శృంగారప్రధానమగు ప్రబంధయుగప్రభావము తగ్గి నవీనులదృష్టి కరుణరసము వైపునకు మరలుట గణనీయము. ఇంకను నిట్టి రసవత్తరములు త్యాగభరితములు కరుణాకలితములగు కావ్యములు వెలసి సమాజాభ్యుదయమునకు సహకరించును గాక!

# క్రాంతదర్శనము

శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి



ఇవి ఉషస్సులో! ఈశ్వరప్రేరితములు
నవరసోపనిషత్తులో;— నామనస్సు
కోటిసుమనస్సులటు గుబులొక్కనుటె కాదు.
నృత్యమాడును శతకోటినిర్ఝరు లయి!

ఆమనిపొంగు లివ్వి శరదాగమచంద్రికలై, దిగంతవ
ల్లీమకుటోద్గమక్షితిజరేఖలలో వసుధైకవల్లరీ
ప్రేమసుధాగవేషణల భృంగకిశోరవిహారశీలినై
ఈమధురానుభూతి నొకచే గరువారిన మేను దాల్చెదన్!

ఏసీమావధి లేని ఏకవసుధాహేవాకదేవాలయ
ప్రాసాదోపరిఘంటికాశ్రుతులలో, ప్రాలేయకాదంబినీ
ప్రాసక్రీడనదీధితిస్మృతులలో ప్రక్రీడలై క్రాంతిరే
ఖాసంక్రాంతుల పొంగిపోదును జగత్కల్యాణజాగ్రన్మతిన్.

అచ్ఛపు మల్లెపువ్వు హృదయాంతరమందలి స్వచ్ఛతాగుణ
ప్రచ్ఛవిసుప్రకాశనము, ప్రక్కగులాబులగుండెలోని కాం
తిచ్ఛట సంప్రదీపనము తీర్చుటలో నొకటైన దివ్యదీ
వ్యచ్ఛిఖరీసహస్రకిరణావళిసారముకంటె సారమా?

అతివేలరసలోలహరినీలజలధిలో
భవ్యనౌకలపైన పరవశింతు
నవగీతసముపేతనవనీతసరసిలో
పూలనావలమీద పులకరింతు

శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి

ప్రగతీహజగదూహపరిణాహపథములో
ప్రత్యణువునయందు ప్రతిఫలింతు
సవివేకపరిపాకసకలైకపరిధిలో
పరమార్థనిష్ఠతో పరిఢవింతు
ఇవి ఉషస్సులు! ఈశ్వరప్రేరితములు!
నవరసోపనిషత్తులు! నామనస్సు
కోటిసుమనస్సులటు గుబులొక్కనుబె కాదు
నృత్యమాడును శతకోటినిర్ఝరు లయి-

# కనకాభిషేకము

ఎవరి ప్రసన్నత లివి? ఘుమంఘుమలాడు
తీర్చిన కస్తూరితిలకరేఖ!
ఎవరి కపోలమ్ము లివి? ధగద్ధగలాడు
కులుకునీలపురాలకుండలములు!
ఎవరి కటాక్షమ్ము లివి? తళత్తళలాడు
ముత్యాలహారాలపోహణములు!
ఎవరి సుహాసమ్ము లివి? ఝుళంఝుళలాడు
రసధునీరమణీయలాస్యగతులు!
అంతరుజ్జ్వలజ్యోతి రుద్రాక్షమాల
కంఠసీమకౌస్తుభనిభకాంతు లీన
చెలఁగు నీశ్వరార్చనకళాశీలి, అతఁడు
ప్రౌఢనిర్భర శ్రీనాథభట్ట సుకవి!-

చిఱుతకూకటి జటాంచిత మతే! అతనిలో
కవితాస్రవంతి గంగాభవాని!
ప్రతిభాసమాధి హృద్గత మతే! అతనిలో
శృంగారమకుటరాజ్ఞీలలామ!
పసిడిఫాలమ్ము ప్రాభవ మతే! అతనిలో
హారవిలాసవిభూతి హాసరేఖ!
ప్రేక్షణమాలావిహిత మతే! అతనిలో
మౌళీందుమకరందమధుపగణము!

నేత్ర మొకఁడు గంభీరపాండిత్యముద్ర!
మూఁడుమూర్తుల ముక్కంటిఁ బోలు నతఁడు
మదనగౌడడిండిమభట్టువదనకార్శ్య
మదిగొ! ప్రౌఢరాయమహాసభాంగణమున!

స్వేచ్ఛార్థనిర్ఝరీవేగవాగ్ధాటి కు
త్తమహేతుసేతుబంధనము కట్టి,
ప్రతిశాస్త్రచర్చావిలంఘనచర్యకు
మంథాచలమహాబ్ధిమథనము నిడి,
ప్రతికూలతర్కకర్కశదంష్ట్రిఖేలకు
సుకుమారచతురోక్తి సూటిపఱచి,
భళి! నిరంకుశమదేభవిజృంభణములకు
మొదలె సింహస్వప్నములు ఘటించి,

చండతరఖరాంచలఖడ్గఖండనముల
సప్రమాణశాణోల్లీఢ్నప్రకాశ
మణిగణఝణంఝణత్సువర్ణమండనములు
సంతరించునె కవిరాజు సంతసమున!

అది యేమి? ప్రాజ్యదోహదరాజ్యవిన్యాస
మొకపూజ్యసన్యాస మొసఁగు నదియొ!
అది యేమి? సర్వసంపదగర్వకారణ
మొక పర్వపాగణ మొసఁగు నదియొ!
అది యేమి? ప్రౌఢరాయలగాఢవిశ్వాస
మొక గూఢనిశ్వాస మొసఁగు నదియొ!
అది యేమి? డిండిమయ్యల దండినిగ్రహ
మొక మొండివిగ్రహ మొసఁగు నదియొ!

పరశుపంక్తుల పరవళ్ల పగిలిన దొక
కరడు కటువైన పటువైన కంచుఢక్క!
వాదయుక్తుల కెరటాల పగిలిన దొక
పాండితీదర్పపాషాణఫలక మటుల!

"ఇతఁడే ప్రభూ! సరస్వతిని, కస్తూరికా
తిలకమ్ము తీర్చి ఉద్దీప్తపఱచు!
ఇతఁడే ప్రభూ! సరస్వతిని, కర్పూరనీ
రాజన మ్మొసఁగి ఉల్లాసపఱచు!
ఇతఁడే ప్రభూ! సరస్వతిని, మందాకినీ
తోయమ్ము లిచ్చి సంతోషపఱచు!
ఇతఁడే ప్రభూ! సరస్వతిని, వాసంతికా
నవకమ్ము కూర్చి ఆనందపఱచు!

ఇతఁడె ఇతఁడె ఔషధము నమృతము సేయు
వీథివీథుల నితనిదే వీరచరిత!
ఇతఁడె కవిసార్వభౌముఁ డిం కేల తడవు?
చేయవలెనుగా కనకాభిషేక మిపుడె!"

పులకించినవి సదస్యుల పుణ్యఫలములు
కనులారఁ గాంచంగ కనకవృష్టి!
తిలకించినవి నల్దెసల తటిన్నయనాలు
మనసార దీవాప కనకవృష్టి!
ప్రసరించినవి డిండిమసహృదయతలెల్ల
కై మోడ్చి కావింప కనకవృష్టి!
కుసుమించినవి ప్రౌఢవసుధేశుభావాలు
ఘనముగా చేయింప కనకవృష్టి!

అదె, మహాస్వయంవరవేదికాంతరమున
కాంక్షితకవితాజయకాంత కరముగొన్న
పెండ్లికొడుకు శ్రీనాథకవిత్వమూర్తి
పసిఁడిసేసల శుభలగ్నవై భవమ్ము!

పావనోదాత్తగోదావరీవేదవా
క్సుస్వర మ్మద్భుతశ్రుతిని గలిపె!
నిస్తులకృష్ణవేణీతరంగమృదంగ
సంగీత మున్నతస్థాయి నిలిపె!
హర్షప్రపుల్లమహాంధ్రీపురంధ్రీశు
భాశీస్సు లామనిహాయి గొలిపె!
ముక్తావళీపరిస్ఫుటచంద్రశాలాళ
రజ్జ్యోత్స్న స్వచ్ఛతార్ద్రతలు తెలిపె!

రాశులైన సువర్ణపుష్పాశుగములు
ఆంధ్రకవిరాజుదేహాన ఆటలాడ
తన్మహోత్సవదర్శనోత్సాహసరణి
తెఱచుకొన్నవి తలుపులు దిక్కులన్ని!

శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి

# నాం దీ వా

నీవక్రోక్తివిలోకనమ్ముల సమున్మేషమ్ములో నేను చే
తోవీథిన్ పులకోద్గమప్రకరమై, తోడ్తో రసానందమై,
సేవింతున్ కమనీయకజ్జలకళాశ్రీరేఖలే తీర్చి- కా
నీ, వేర్పాటుగ కంటివెంట్రుకలు లెక్కింపన్ జుమీ భారతీ!

నీలావణ్యధగద్ధగాయితహిమానీహేమసౌదామనీ
హేలాకాంతిధునీరసోర్మికలలో ఈడోలికామాలికా
లీలాఖేలనతన్మయీభవనమే రేకెత్తు నేనాడు, కా
నీ, లెక్కింపగలేను రక్తవహతంత్రీరాశి వాగీశ్వరీ!

జీవత్స్నిగ్ధకపోలముగ్ధమధురశ్రీవైఖరీహాసరే
ఖావైదగ్ధ్యకళాత్వదీయహృదయాఖ్యానమ్ములో నేను వ
ల్లీవేల్లన్మధురోహవైభవము నుల్లేఖింతునే గాని, వా
గ్దేవీ! లేదు త్వదస్థితత్త్వకథనోద్దేశమ్ము లేశమ్మునన్.

లాక్షారూక్షకటాక్షవీక్షణవిధాగ్రైవేయఘంటాగవా
ధ్యక్షుల్ మెచ్చరుగాక, చైత్రవనరథ్యాజైత్రయాత్రాచణో
ర్వీక్షేమంకరకాకలీకలగళశ్రీమాధవస్వామి, తా
దీక్షాకంకణసూత్రధారి! అదె నాందీవాణి నాపాలిటన్.

# జ్ఞాతి వైరి

శ్రీ యం. యస్. హనుమంతరావు



పుట్టినదాది పాండవుల
    పోలగ జాలక వారిపెంపునే
గిట్టనివాడవై సతము
    కీడునొనర్చుచె ధర్మమంచు నీ
వట్టుల సంచరించితిక
    దా! కడువృద్ధుల **తూ**లనాడి నా
డట్టుల త్రోసిపుచ్చితివి-
    అంతకుమూల మసూయ కాదొకో!

ఆటలపాటలన్ కలుగు
    నట్టివిభేదము మానలేక నీ
వోటమి నెంచికొంచును కు
    యుక్తుల నాప్తుల చేరబిల్చుచున్
గోటినపోవువానికిని
    గొడ్డలిదాకను తెచ్చుకొంటి వా
ర్భాటము చేసినాడవు- కు
    రంగము లెందు హరిన్ హరించునే!

అపుడు శస్త్రప్రదర్శనమందు పాండ
వాగ్రజులు పెంపుచూపంగ ఆగ్రహమున
వారి గెల్వంగ సూతుని జేరపిల్చి
పట్టమున్ గట్టి వైరము గట్టుకొనుచు
ధర్మపథమును రాజ! కాల్తన్నినావు!

భీమసేనున కున్న పెంపు గ్రహింపక
    విషముపెట్టితిగదా! వెడగుబుద్ధి!
పన్నగంబులచేత-పగతురవలె వారి
    కరపించితివి భ్రాతృకరుణ లేక!
ఇల్లు లక్కను గట్టి-ఇంటికి అగ్నిని
    పెట్టించినాడ వప్రియముగోరి!
దాయాదు లనుమాట తలపక వారిపై
    వైరుల-పురిగొల్పి వలచినావు!

ఆస్వయంవరమందు న్యాయంబుగా నె
పడతి పడయగ లేవైతి; భామపైన
వదలలేవైతి మక్కువ; పలుక నేల
అన్ని తప్పులె రారాజ! నిన్ను కదుప!

తండ్రి యిచ్చిన అడవిని ధర్మరాజు
స్వర్గముగ మార్చె- కుములుచు వారిసిరుల
కర్ణ శకునుల సలహాన కల్లబొల్లి
మాటలనె వారి పిలుచుట మాకు తెలియు!

ధర్మముగ గెల్వనోల్లక ధర్మవిభుని
గృహము చూపెడిమిషతోడ ప్రియము మెరయ
జూదమాడంగ పిలిపించి వాదమందు
సంపదను గొంటి వక్కటా! చల్లగాను

అన్నసతి తల్లివలె నెంచవైతి వకట
పాపబుద్ధివి – కృష్ణ నాపాంసభకు
తోడుకొనివచ్చి– ఏడ్పించి– తొడలుచూపి
మురిసినాడవు నీ కదే ముప్పు తెచ్చె!

వెడలిరి పదమూడేండ్లును
అడవులపడియుండ కుంతి యాత్మజు లటుపై
అడిగిన తమరాజ్యంబును
ఒడఁబడవుగ పంచిఈయ– నొల్లవు హితముఁ.

కడకు "నైదూళ్లు చా"లని కబురుపంప
ఇయ్యకొనకయె "సూదిమో మింతయైన
రాజ్య మివ్వను– పొమ్మని" రచ్చకెక్కి–
కాంచలేవైతి కృష్ణునిఘనత నాడు.

పెడచెవి బెట్టినావు గురు
భీష్ములపల్కులు వార లప్పుడే
ఉడుగక బోధజేసిరిగ
దో– "ఇటె యుందుము కాని వారికిఁ
కడఁకొన దే జయంబనుచు"
కౌరవ!– "ధర్మము వారిదేగదా'!
విడఁవవు నీదు పట్టు అవి
వేకుల నమ్మ ఫలంబు గల్గునే?!

ఎచటఁ ధర్మ ముండొ– అచట జయంబగు
అచట నుండు దైవమైన కాని
అనెడి పల్కు తలప వది యేమి మూర్ఖమో
కడను ఏమి గొంటి కౌరవేంద్ర?!

ఊరువులను జూపి– ఉవిద నేడ్పించంగ
ఊరు విరుగగొట్టె మారుతియును
'జ్ఞాతివైరి' వగుచు కడకు సర్వంబును
కోలుపోయినావు! కురుకులేశ!!

# పాల్కురికి సోమనాథుడు - భీమకవి

## తెలుగు కన్నడముల ఆదాన ప్రదానాలు

శ్రీ కె. సుబ్బరామప్ప

కన్నడ తెలుగు సాహిత్యాలకు అనాదిగా సంబంధం వుంది. తెనుగులో సాహిత్యం ఒక రూపానికి రాకపూర్వమే కన్నడంలో నిర్దుష్టమైన కావ్య రచన జరిగింది. కన్నడంలో 9వ శతాబ్దంలో "కవిరాజమార్గ"ముతో ప్రారంభమై 10వ శతాబ్దంలో పంప కవి భారతముతో ఉత్తమ కావ్యం బయలుదేరింది. తెనుగులో తొలికావ్యం 11వ శతాబ్దంలో నన్నయ భారతంతో బహిర్గతం అయింది. అంతకుపూర్వం తెలుగులో సాహిత్యం అంతా కేవలం జనపద సాహిత్యం అయిన పాటలలో వుండేది. తెలుగువారు "కాసట బీసటే చదివి గాథలు త్రవ్వుతూ వుండేవారు" అప్పుడు తెలుగు అక్షరాలనూ, కన్నడ అక్షరాలనూ చూస్తే రెండూ యించుమించు ఒకటిగా కనిపిస్తాయి. ఈ పోలికనుబట్టిచూస్తే కన్నడిగులకూ తెలుగువారికీ చాలాకాలం ఒకేలిపి వుండినట్టు గోచరం అవుతుంది.

ఈ సాహిత్యం రెండుభాషల్లోను అభివృద్ధికి రావడానికి ముఖ్యకారణం మతం అని చెప్పాలి. తెనుగుదేశంలో 11వ శతాబ్దంవేళకు బౌద్ధమతం విజృంభించింది. వైదిక మతం అడుగంటిపోతూవుండింది. ఆ సందర్భంలో వైదిక మతాన్ని ఉద్ధరించేందుకు «భారతః పంచమో వేదః» అని ప్రసిద్ధికివచ్చిన భారతాన్ని నన్నయ్య తెనుగులోనికి అనువాదం చేశాడు. దీంతో వైదికమతం వ్యాపకానికివచ్చింది. బౌద్ధమతం నాశనం అయింది. సాధారణంగా పూర్వకాలంలో సాహిత్యాన్ని మతం వెన్నంటుతూ వస్తూవుండనేది మనం మరచిపోరాదు. కన్నడసాహిత్యంలో చూడండి ! వారు మొదట సాహిత్యయుగ విభజనము «జైనయుగ, వీరశైవయుగ, బ్రాహ్మణయుగ» అని మతాలపేరిటనే విభజించుకున్నారు. సాహిత్యంపైన మతానికి ఎంత పెత్తనంవుందో తెల్లమవుతుంది.

ఇలా వుండగా కన్నడదేశంనుండి వీరశైవమతం ఆంధ్రదేశంలోనికి జొరబడింది. బసవని వచనసాహిత్యమూలాన కన్నడదేశంలో వీరశైవమతాన్ని చురుగ్గా వ్యాపకం చేస్తున్నారు. ఆంధ్రదేశంలోకూడా అలాంటి జనప్రియత్వం గల్గిన కవిత్వం, దేశికవిత, కావలసివచ్చింది. ఈ మతాన్ని వ్యాపకం చేయడానికి మంచిసమయానికే అవతరించాడు పాల్కురికి సోమనాథుడు. ఈతని కాలాన్నిగూర్చి, ఈతని నివాసస్థలాన్నిగూర్చి వాదోపవాదాలు తెలుగుదేశంలో బయలుదేరాయి. ఈతడు 12వ శతాబ్దంవాడనీ, కాదు 13వశతాబ్దంవాడనీ అంటున్నారు తెలుగుదేశంలో యీనాడు హైదరాబాద్ సమీపానవుండే జనగామదగ్గరి «పాలకుర్తి» యీతని వూరు అనీ ఆంధ్రదేశంలో వాడుకగా వుంది. కానీ కీ॥ శే॥ డాక్టర్ చిలుకూరు నారాయణరావుగారు పాల్కురికి సోమనాథుని కృతి

అయిన «పండితారాధ్య చరిత్ర»కు ఉపోద్ఘాతం వ్రాస్తూ పాల్కురికి సోమనాథుడు మైసూరురాష్ట్రంలోని తుమకూరు జిల్లాలోని 'పాల్కురికె' గ్రామంవాడనీ అన్నాడు. చిన్నతనంలో కన్నడంలో పాండిత్యం సంపాదించుకుని కన్నడంలో కవిత్వం వ్రాశాడు. పిమ్మట ఆంధ్రదేశంలోని వీరశైవుల యాత్రాస్థలం అయిన శ్రీశైలం చేరుకుని తెలుగు నేర్చుకుని తెలుగున వృత్తాల్లో 'వృషాధిపశతకాన్ని' బసవణ్ణన వచనాలను పోలిన ద్విపద ఛందస్సులో బసవపురాణ పండితారాధ్య చరిత్రలు వ్రాసి ఆంధ్రదేశంలో వీరశైవ మతవ్యాప్తికి తోడ్పడ్డాడు. ఈ వాదమే సరియైందని నాకూ తోచింది. తెలుగుదేశంలోని గ్రామాలపేర్లను చూస్తే పేర్ల చివరలో «కురికి» అథవా «కుర్కి» అవి లేవు «కుర్తి» అనేవి వున్నాయి. కన్నడదేశంలోనే «కురికి» అనే వచ్చేవి యెక్కువగా వున్నాయి. ఇదిగాక 10నుండి 14 శతాబ్దంవరకు కన్నడదేశంలో 'ప'కారానికి 'హ'కారం వాడుకలో లేదు. ఉదాహరణకు «పంప భారతంలో» «కోగిలె పాడువ» «యుద్ధమల్లమహీపతిగె నెగర్త పుట్టి» 14వ శతాబ్దంలోని కన్నడ బసవపురాణంలో 'పక్కిగళు గగనక్కె నెగెదవు' అనే ప్రయోగాలున్నాయి. ఈనాడు పాడువ అనేదానికి «హాడువ» అనీ, పుట్టి అనేదానికి «హుట్టి» అనీ, పక్కిగళు అనేదానికి «హక్కిగళు» అనీ వాడుక అయింది. దేశకాలాలనుబట్టి భాషలో మార్పులువస్తాయి. కాలం మారతూ రాగా భాషలోకూడా మార్పువచ్చింది. ఈనాడు కన్నడభాషలో హకారంతో ఆరంభమయ్యే పదాలు అనేకం తెనుగులో పకారంతో ఆరంభం అవుతాయి. ఉదాహరణంగా హాలు-పాలు, హత్తి-పత్తి, హగలు-పగలు, హక్కి-పక్కి, హంది-పంది, హల్లు-పల్లు ఇత్యాది ఇవన్నీ ఆనాటికి పకారాదిగానే వుండేవేమో! కాబట్టి ఆనాటి పాల్కురికి ఈనాడు హాల్కురికిఅయింది. ఇంకొక కారణం వుంది. సోమనాథుడు మైసూరరాష్ట్రంవాడనడానికి «హరహరా శ్రీ చెన్నసోమేశ్వరా»అనే మకుటంతో «సోమేశ్వర శతకాన్ని» కన్నడంలో వ్రాశాడు. ఈ శతకానికి పీఠిక వ్రాసి అచ్చువేసిన కన్నడ సాహిత్య పరిషత్తువారూ, మైసూరువారూ పాల్కురికి సోమనాథుడే వ్రాసివుండవచ్చునని శంకిస్తూ వ్రాశారు పులిగిరి సోమనాథుడు వ్రాసింది అని శంకిస్తారు కొందరు పులిగిరిలోని సోమేశ్వరునికి అంకితం చేశాడు. కాని తన యింటిపేరుగానీ, తాను పులిగిరి సోమనాథుడని కాని యెక్కడా గ్రంథంలో చెప్పుకోలేదు. కాబట్టి పులిగిరి సోమనాథుడు శతకాన్ని వ్రాశాడనడానికి వీలుకాదు. ఇది నీతిశతకం. అనేక నీతులను చక్కని ఉదాహరణలతో వృత్తాలలో వ్రాశాడు. ఇది కన్నడదేశంలో బహుళ వ్యాప్తిలో వుంది. విద్యార్థుల కన్నడ వాచకపుస్తకాల్లో యీ శతకంలోని పద్యాలను అచ్చువేసి విద్యార్థులతో కంఠాపాఠం చేయిస్తారు. తెలుగువాచకాల్లో వేమన్న సుమతిశతక పద్యాలమాదిరిగా. ఇవిగాక కన్నడభాషలో యీ పాల్కురికి సోమనాథుడు 'శీలసంపాదనె', 'సహస్రగణనామ', 'పంచరత్న', 'సద్గురు రగళె', చెన్నబసవ స్తోత్ర', 'శరణు బసవరగళె' వ్రాశాడు. ఈతణ్ణిగూర్చి యీతని తర్వాత కన్నడ వీరశైవకవులు సుమారు పంతొమ్మిదిమంది తమ గ్రంథాదులల్లో కీర్తించారు. ఇంతటి ప్రసిద్ధజెందిన మైసూరుదేశీయకన్నడిగుడు తెనుగులో బసవపురాణం, పండితారాధ్య చరిత్రలవంటి ఉద్గ్రంథాలను వ్రాయగలడా అని అంటారేమో? తన మాతృభాష కన్నడం అయినాకూడా తెలుగుదేశానికి పోయినతర్వాత తెనుగులో పాండిత్యం సంపాదించుకుని యీవరకే కవికాబట్టి ద్విపదలో కవిత్వంవ్రాయడం అతని కేమికష్టమైందికాదు. ('పాల్కురికి సోమనాథుని మాతృభాష కన్నడమా? అనే శీర్షిక క్రింద 'భారతి' మార్చి 1958లో 'కలగూరగంప' క్రింద వ్యాసం వ్రాశాను). ఈనాడు చూడండి! కన్నడ సాహిత్యంలో కృషిచేసి పేరు సంపాదించుకొన్నవారిలో చాలమందియొక్క మాతృభాష కన్నడంకాదంటేనమ్మండి. వారంతా తమ మాతృభాషకాని కన్నడంలో గ్రంథాలు వ్రాయలేదా! ఉదాహరణానికి ద. రా. బేంద్రెగారిది మరాఠి, కన్నడిగుల ఆస్థానకవి గోవిందపైగారిది తుళు, కర్ణాటకకవి చరిత వ్రాసిన నరసింహాచార్యులు, కన్నడ వచనభారతం వ్రాసిన అలసింగాచార్యులుగార్లది తమిళం, కన్నడ ప్రొఫెసర్ కీ॥ శే॥ వెంకణ్ణయ్యగారు సుప్రసిద్ధ కన్నడ నవలారచయితలైన శ్రీ దేవుడు నరసింహశాస్త్రి,

త. రా. సుబ్బారావు, వీరకేసరి సీతారామశాస్త్రి వీరిది తెలుగు. శ్రీ కె. వి. అయ్యర్ గారిది తమిళం, నా. కస్తూరి గారిది మలయాళం, తెలుగువాడైన శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు మైసూరు విశ్వవిద్యాలయం తెలుగు ప్రాధ్యాపకులుగా వుండి కన్నడం నేర్చుకుని వ్రాసినట్టి గ్రంథం 'సాహిత్యమత్తు జీవనకలె' యీనాడు కన్నడ బి. ఏ తరగతికి పాఠ్యగ్రంథంగావుంది. కాబట్టి పాల్కురికి సోమనాథుడుకూడా తెనుగుదేశంచేరుకున్నాక తెనుగు వాడైనాడు ('Be a Roman while in Rome' అన్నట్లు). పూర్వం పాల్కురికినే యీనాడు హాల్కురికె అంటున్నారు. ఈతడు తన అవసానకాలానికి వెతు క్కుంటూ తనదేశానికే వచ్చి బెంగుళూరుదగ్గర మాగడి తాలూకాలో కల్య అనే గ్రామంలో శివైక్యాన్ని పొందాడు ఈతని సమాధి యీనాటికి అక్కడ వుంది. ఇది ఒక వివాదాస్పదమైన, స్వారస్యమైన సంగతి.

పాల్కురికి సోమనాథుడు కన్నడ, సంస్కృత, తెలుగు భాషల్లో పాండిత్యం కలవాడు. చిన్నతనంలో కన్న డంలో సోమేశ్వర శతకాన్ని వృత్తాలతో వ్రాసినాడు. ఇందులో అనేక పురాణాలనుండీ కథలను తీసికొని చక్కని ఉదాహరణాలతో నీతులను బోధించాడు. మానవప్రవృ త్తిని వివిధరీతుల్లో విమర్శించాడు. దీనినిబట్టి చూస్తే, సంసారంలోని యీతిబాధలు అప్పటికీ చక్కగా ఎరిగిన వాడనీ, వాటిపై రోసి వీరశైవాన్ని అవలంబించి తన స్వంతదేశమైన కర్ణాటకాన్ని వదలి దేశాటనంచేస్తూ ఆంధ్రదేశాన్ని చేరుకుని విశ్వశ్రేయానికీ, వీరశైవమత వ్యాప్తికిగాను మొదట వృత్తాలలో అనుభవసారం, వృషా ధిప శతకం వ్రాశాడు. పిమ్మట జానుతెనుగైన దేశికవితలో అందరికీ అర్థమయ్యేలాగున బసవపురాణం, పండితారాధ్య చరిత్ర వ్రాశాడు. తాను వ్రాసిన గ్రంథాలలో తాను పాల్కురికి సోమనాథుడని మాత్రం వ్రాసుకున్నాడు. «బసవని పుత్రుండ బసవని గోత్రుండ» అన్నాడేకాని తన తల్లిదండ్రుల పేర్లుకూడా చెప్పుకోలేదు. కాబట్టి తాను వ్రాసిన గ్రంథాలను గురించి తన పుస్తకాలలో చెప్పుకో లేదు. బసవపురాణం, పండితారాధ్య చరిత్రలలో తన పూర్వకృతులనుగూర్చి చెప్పుకోలేదు. అలాగే తన మొదటి కృతి అయిన అనుభవసారంలోనూ తాను పూర్వం వ్రాసు కొన్న కన్నడ రచనలనుగాని ప్రస్తావన చేయలేదు. తన్ను తాను పొగడుకోవడం వారికి యిష్టంలేక వుండవచ్చు. అది పాపకృత్యమనికూడా వీరి భావం. ఇదిగాక మానవులను కీర్తించకూడదని శివకవుల మతం. అందువల్ల తమ సమకా లీనులనుకానీ, కవులనుకానీ, రాజుల విషయంకానీ యీ శివకవుల గ్రంథాలలో వివరాలు మనకు దొరకవు. అందు కనే సోమనాథుణ్ణి గూర్చి ఊహాపోహలు చేయడానికి వీలు గల్గింది.

ఈతని కవిత్వానికి ఉదాహరణంగా కన్నడంలోను, తెనుగులోను ఒక్కొక్కటి యిస్తాను:

'కెలవం బల్లవరింద కల్తు కెలవం శాస్త్రంగళిం
కెలవం మాళ్పవరింద కండు కెలవం సుజ్ఞానదిం నోడుతం
కెలవం సజ్జన సంగదిం దలరియల్ సర్వజ్ఞ నప్పం నరం
పలవం పళ్ల సముద్రమై హరహరా శ్రీచెన్నసోమేశ్వరా!'
—(సోమేశ్వర శతకం)

## చక్కటి వర్ణన

(బసవ పురాణం)

«తొలి కోడి కను విచ్చి - నిలిచి మైపెంచి
జలజల రెక్కలు సడలించి నీల్గి
గ్రక్కున కాలార్చి కంఠంబు విచ్చి
ముక్కున నీకెలు చక్కొల్పి కడుపు
వెక్కించి మెడ సాచి నిక్కి మిన్నూచి
కొక్కొరో కుఱ్ఱని కూయకమున్న.'

## రగడలను పోలిన ప్రాసలు

(బసవ పురాణం)

'అత్తింటి కోడలు ఉత్తమురాలు
చేట జొన్నలు పోసి చే నిద్రపోను
చక్కగా నాన్నగారి ముక్కుపై చెమట
చేరెడేసి ముత్యాలు చెదరినట్లుండు
చలికి వెఱచినట్లు పులికి నే వెఱవ
కొడుకుల కనని వాళ్ల కడుపేమి కడుపు
కుల ముద్ధరించని కొడు కేమి కొడుకు'

శ్రీ కె. సుబ్బరామప్ప

## భీమకవి

ఇంకొక విశేషం యేమిటంటే సోమనాథుడు వ్రాసిన బసవపురాణం తెలుగుదేశంలో చాలా ప్రసిద్ధికి వచ్చింది. బసవనిపుట్టుక. అతడుచేసిన అద్భుతకార్యాలు (పవాడగళు) ప్రచారంచేసిన మతమూ, అల్లమప్రభు కథ, అతని లీలలు (ప్రభులింగలీలలు) చాలా ఆకర్షణీయంగానూ, జన ంగాను జాను తెనుగులో వర్ణించాడు.

14వ శతాబ్దం ఉత్తరార్ధంలో కన్నడదేశంలోని భీమకవి సోమనాథుని బసవపురాణాన్ని కన్నడంలోనికి అనువాదం చేశాడు. రాఘవాంక కవినుండి సాంప్రదాయికముగా వచ్చిన షట్పదీ ఛందస్సులో దీన్ని కన్నడంలోనికి అనువాదం చేశాడు. "గిరరగళె" "భృంగిదండక" అనే గ్రంథాలుకూడా యీతడు వ్రాశాడు. కాని అవి లభించడంలేదు. ఇతడు ఏవూరివాడైనదీ తెలియడంలేదు. తన్ను తానుగూర్చి యెక్కడా తన గ్రంథములో వ్రాసుకోలేదు. సాధారణంగా శివకవులు తమ్ము తాము వర్ణించుకుని వ్రాసుకోవడం పరిపాటి కాదని యీవరకే మనవిచేశాను. కాబట్టి వారినిగూర్చి అనేక విమర్శలు బయలుదేరాయి.

భీమకవి శివయోగనిద్రలో వుండగా స్వప్నంలో పాల్కురికి సోమనాథుడు కనుపించి, తాను రచించిన బసవపురాణాన్ని వ్రాసుకొమ్మని చెప్పినాడనీ, తన ఆత్మలో సోమనాథుడు వుండుకొని వ్రాసేటట్టు చేశాడని సోమనాథుని దైవాంశసంభూతునిగా వర్ణించుకొని గ్రంథాదిలో వ్రాసుకున్నాడు. (1-15) హరిహర, రాఘవాంక వంటి కవుల కృపతో కన్నడ బసవపురాణాన్ని వ్రాయగల్గానని కూడా కవి చెప్పికొన్నాడు. వీరిద్దరూ వీరశైవ పూర్వకవులు. దైవాంశులని ఈతని భావము. ఈతని కవిత్వము ప్రౌఢముగా "సరసమృదుతర యమక గమకములతో కూడుకొన్నది. దృఢ వ్యాకరణయుత లాలిత్య నియమాక్షర సలక్షణభావములతో" ఒప్పివున్నది. ఈతని శైలిలో మార్దవము, ఓజస్సు, మాధుర్యము వుంది. పురాణకవి యొక్క సహజ సుందర రీతిలో కథాకథనము సాగించినాడు.

ఈతడు బసవపురాణాన్ని కన్నడీకరించిన పట్టులు చూడండి.

### బసవని వర్ణన

"అచ్చ శివ నొందచ్చు భక్తియ నచ్చు శరణర మచ్చు హిరియర
మచ్చు సత్యద కెచ్చు పరనాది గళెదెయ కిచ్చు
మచ్చరిసువర బిచ్చు, కుజనర చిచ్చు, శాంతియ కెచ్చు, ధూర్తర
కొచ్చు, కలితన దచ్చు, సుఖుకణి మచ్చు మరెయిల్ల."

### సూర్యోదయ వర్ణన

"జక్క వక్కి గళిక్కె గొండువు, పక్కిగళు గగనక్కె నెగెదవు
సిక్కిదళి హొరువంటు వబ్బుగళె బసురొళిర్ద (బ్రు)
ఉక్కు బఱతుదు చంద్రమన ముసుకిక్కిదువు నెయ్దిలెగళుడుగళు
దిక్కు గెట్టెవు దెసెదెసెగె; పద్మంగళరళిదువు."

పాల్కురికి సోమనాథుణ్ణి భీమకవి అనుసరించి వ్రాసినట్టే కన్నడకవులను తెలుగుకవులూ అనుసరిస్తూవచ్చారు. నన్నయభట్టు తన భారతానికి వర్ణనలలోను ఛందస్సులోను పంపకవి భారతాన్ని అనుకరించాడు. చామరుసు "ప్రభులింగలీల"ను అనుసరించి పిడుపర్తి సోమనాథుడు తెలుగులో వ్రాశాడు. కృష్ణదేవరాయ ఆస్థానకవి ముక్కు తిమ్మన తన పారిజాతాపహరణ కథావస్తువునకు వర్ణనలకూ కన్నడకవి రుద్రభట్టు (13 శతాబ్దం) వ్రాసిన "జగన్నాథ విజయా"న్ని అనుసరించాడు. ఇదేకాలపు తిమ్మణ్ణకవి తన కన్నడ భారతాన్ని "కృష్ణరాజ భారతాన్ని" తిక్కన సోమయాజి భారతాన్ని అనుసరించి వ్రాశాడు. ఈ విషయమే ప్రత్యేకంగా యింకోసారి మనవిచేస్తాను.

ఈ రీతిగా కన్నడ తెలుగు సాహిత్యాలలో ఆదాన ప్రదానాలు వుంటూ అన్యోన్యంగా వెల్లివిరిసింది.

(ఆలిండియా రేడియో, బెంగుళూరువారి సౌజన్యంతో)

# శిథిలనౌక

శ్రీ 'మౌళి'



ఒక శిథిలనౌకలోన కూర్చుండబెట్టి
మొదలు తుద లేని కడలిలో వదలినారు
అవలి దరిజేర, నాయడియాస, కాని
ఎంతకును దీని కెరటాల కంతులేదు!

హోరుమను నీయపారగంభీరవార్ధి
కుహరహృదయాంతరాంతరాఘోష మొకటె
కెరలి యాశాంచలముల క్రిక్కిరిసి, ఈమ
హాంతరాళమ్ములో గుండెలావటిల్లె!

చూపు కందెడు, నీమహాక్షుభితసాగ
రాగ్రము లనంత — గగనపుటాంచలముల
చీల్చికొని సాగి సర్వదిక్సీమ లొత్తి
గించి యువ్వెత్తుగా పర్వులెత్తు నవిగో!

ఎచటనో ఏకడనో, దరియేదొ కలదు,
స్వర్గమది దివ్యనిధి సర్వసౌఖ్యములకు,
సాగుమట కోర్చి సర్వకష్టముల కిపుడె
కదలుమను వేదవాక్కె చుక్కాని నాకు.

నాకుముం దెందరీమహార్ణవమునందు
విధివిహితమార్గముల బయల్వెడలినారొ
వారు దరిజేరిరో, మహావార్ధిగర్భ
భీష్మవహ్నిశిలాప్రవిభిన్నులైరో!

లేక సర్వదిగంతవిక్లేద్యమాన
మీగభీరాబ్ధియే కబళించె నేమొ!
తలయు తోకయు లేని వార్తాప్రసార
మెట్టులని విశ్వసించుటో యెరుగరాదు!!

ఇంద్రియములెల్ల నాత్మకధీనములుగ
ఆత్మ లవి లక్ష్యమందె యేకాగ్రములుగ
ఇంతవర కెందరో, శక్తులెల్ల కూడ
గట్టి పయనించి రీమహాగమ్యపథము.

ఒకడు దరిలే దనె మరొక్క డున్నదనియె,
నొక్కడది యున్న నేమి లేకున్న నేమి
నీనడక మంచిదిగ పయనింపు మనియె
ఒక డనుభవింపు మనె నిష్ట మున్నదెల్ల.

అల లలలు నింగిముట్ట నుల్లలము లగుచు
బోరగిల గొట్టు పుంఖానుపుంఖములుగ
సుడులబడ నావ, గుండియ లడలు గొనన
నంతఝంఝాప్రకోపితార్ణవము జూచి,
నిబిడజలదావృతుల తమోనిభృతమైన
శూన్యమును జూచి, కర్తవ్యశూన్యు లగుచు
మ్రాన్పడుచు చేతు లెత్తెడి మందభాగ్యు
లెందరో, ఊగువార లుయ్యాలల యలల.

దరులులేని భయంకరోదధి యటంచు
నెరిగియును, దిక్కుతోచని, యెవ్వడో, అ
భాగ్యు డెన్నడో పల్కిన పల్కు నమ్మి,
హృదయగతు లెంతచెప్పిన నేని వినక
భావనామార్గములు మూసివైచి సాగు
నిష్ఫలనిరంతరప్రయాణికులు వీరు
విసుగు మరచిన యంత్రనావికులు వీరు!
హితము వినలేని పాషాణమతులు వీరు!!

అణచిపెట్టిన నాహృదయాంతరముల
ననురణించెడి బాధాకథానుమేయ
మధురరాగస్రవంతిమై మరతు నింక
ఈయుగమ్మ్యానుకరణ మిం కెన్నినాళ్ళు!

క్రమ్ముకొనివచ్చు కటికచీకటులనడుమ
భయదసంఛన్నఘనఘనార్భటులలోన
విలయఝుంఝూప్రభంజనోద్వేలగతుల
మిన్నుమ న్నేకమై దిగమ్రింగవచ్చు.

తీవ్రవారాశిలహరికోద్విగ్నమాన
మీ శిథిలనౌక నడపుటకేని సుంత
శ్రమపడను నిశ్చలత నొక్కసారి మరల
నీభయదయంత్రమనుజసంతృప్తికొరకు.
అనుకరణజీవినై హృదయాంతరముల
పొంగులెత్తెడి సహజావబోధరుచుల
విస్మరించిన కృతకప్రవృత్తి వదలి
స్మృతిపుటమ్ముల నష్టావశిష్టమైన
సహజమానవతారసాస్వాదమునకు.
స్మృతివికలదివ్యరూపతంత్రీచయమ్ము
భగ్నహృద్వీణ సంధించి, పరవశించి
పాడుకొనియెద స్వేచ్ఛాప్రభాతగీతి!

ఒకరి యవహేళనకు, రోషహుంకృతులకు
జాలిగా నవ్వి నిట్టూర్చి సాగిపోదు
అవలి దరిజేర నే డడియాస లేదు
స్వేచ్ఛగా మునిగినను సంతసింతుగాని!

# మా తల్లి

శ్రీ వేదుల సత్యనారాయణ శాస్త్రి

✲

ఆయుషోదేవతానయనాబ్జమధువు
లొలుకు నీశైశిరప్రభాతోదయమున
గుర్తుపెట్టితి సంతానకోటితోడి
తల్లి నీవెపో నావిశ్వధాత్రి వనుచు.

నీ కడకన్నులందె జననీస్తనదుగ్ధవిముగ్ధమాధురుల్
నీ కడకాళులందె హిమనిర్మలజీవనశాంతినిర్ఝరుల్
నాకు లభింప శైశవమునన్ నను వీడిన కన్నతల్లి పు
ణ్యాకృతిఁ బోల్చుకొంటి భవదాకృతిలో నిపు డోకళావతీ!

నీయమృతస్వరూప మెద నిల్చిన యంత గతానుభూతులున్
పోయిన పోకలున్ దెమలిపోవని కాంక్షలు చింకిపాఁతలై
పాయఁగఁ దల్లి నీవని భవచ్చరణమ్ముల మోకరించి 'య
మ్మా!' యని పిల్చుకొంటిబహిరంతరశాంతిసుధల్ స్రవింపఁగన్.

ఈ సచరాచరప్రకృతికెల్ల రసైకవికాసజీవ మీ
వే—సతతక్షుధం బరితపించెడి పేదలపాలి యన్నపూ
ర్ణాసతి నీవె—దుర్బలుల రక్షణకై యభయప్రదానముం
జేసెడి శక్తినీవె జననీ! భవదన్యము లేద యేదియున్.

నీదయ గల్గినన్ జరుగనేరని దేదియు లేదు తల్లి? పృ
థ్వీదయితుండు భిక్షు వగు; భిక్షువు రాజ్యధురంధరుం డగున్
గాదన కింక నీ వభయకంకణ మూనుము నన్నుఁ బోలు ని
ర్వేదులఁ బేదలం జిరనిపీడితులం గృపమై భరింపగన్.

సోదరశోణితమ్ము చవిఁజూచెడు క్రూరులుఁ గార్మిక ప్రజా
స్వేదఫలమ్ముతో నినుపపెట్టెల నింపెడు నిర్దయుల్ మతో
న్మాదనిరంకుశుల్ దురభిమానులు నిండిన లోకమందు అ
స్మాదృశదుర్బలప్రజల మన్పఁగఁ దల్లి! త్వదన్య మున్నదే.

పులియు భుజంగియున్ దమ బుభుక్ష నడంచుకొనంగఁ గన్నబి
డ్డల దిగమ్రింగునట్టు లకటా! విపరీతకిరాతశేముషీ
బలయుతజాతు లైహికపుఁ బ్రాభవవైభవముల్ గడింప దు
ర్బలుల శిరాలపై నినుపపాదము లూని చరింతు రమ్మరో?

ఒక్క మహీజమందె విహగోత్కరముల్ తమగూళ్లఁ బన్ని యే
చిక్కులపాలుగాక నివసించుఁ బరస్పరమైత్రితో మృగా
లొక్కట మందగా బ్రతుకుచుండు సుఖమ్ముగఁ గాని మానవుం
డక్కట ప్రక్కవాని బ్రతుకార్పనె జూచు—నిదేమి తల్లిరో?

ఏ యనుభూతి లేక రస మెండి వివర్ణతఁ దోఁగి వాసనల్
వోయిన నాహృదంబుజములో నొలికింపు మొకింతసర్వసం
ధాయకమైన నీయడుగుదమ్ముల పుప్పొడితోడితేనె త
ల్లీ! యదె చాలు నాకును ఫలించును బ్రోవిడుకొన్న నాకలల్!,

ఆరని మంటగా బ్రతుకునందు రగుల్కొనుచున్న దొక్కచే
కోరిక; నీకృపావనికిఁ గోకిలనై కొనియాడుచుండు, మం
దారసుమారుణద్యుతివితానముఁ గొల్పెడి నీమనోహరా
కారముతో మధూదయవికాసము నింపుము తల్లి! నాయెదన్,

# శ్రీ గీతా సుధాంజలి

శ్రీ పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రి



## విషాదయోగము

ధర్మక్షేత్రమునన్ వసియించియును- సద్ధర్మజ్ఞుఁడన్ గాను, ధీ
మర్మజ్ఞుండను గాను, మూఢుఁడను, స్వాత్మజ్ఞానశూన్యుండ, నీ
కర్మారణ్యమునన్ జలించెదను, నీకారుణ్యచిద్వీక్షలో
నిర్మోహస్మృతి- ధైర్య-యుక్తు లిడి; శాంతిం గూర్పవే యీశ్వరా!

## సాంఖ్యయోగము

"అనుశోచింపకు, లెమ్ము! నీకు మృతిలే" దన్నావు విన్నాను; నా
తనువే నే ననుకొన్న నా కిపుడె నిత్యాత్మస్వరూపంబు వె
ల్గునె? నీబోధసుధాభిషేకమున వెల్గుంగాక! నీశాసన
మ్మనువర్తించెద; కర్మయోగమున ధైర్యమిమ్ము కర్మప్రియా!

నిర్వేదం బొకకొంత యున్నను, గుహానిష్ఠంబులై యున్న దుర్
గర్వాహంకృతు లీల్గకున్నవి: స్థితప్రజ్ఞుండ నెట్లయ్యెదన్?
సర్వాగోచర మా నిగూఢమగు ప్రజ్ఞం గూర్చి, బ్రాహ్మీస్థితిన్
నిర్వాహింపుము; మేలుకొల్పుము ప్రభూ! నీవే జగన్నాయకా!

## కర్మయోగము

అనఘా! కేశవ! ఘోరమౌ నియతకర్మారంభమందున్ నియు
క్తుని గావించి, అదే స్వధర్మ మని వాకొన్నావు; దుష్పూరమై
అనలంబైన విరోధి- కామ; మది- న న్నాడింప, నీయందు నా
పను లర్పించి- నిరాశినై, సముఁడనై, వర్తించు టెట్లో? ప్రభూ!

## జ్ఞానయోగము

కర్మ. నకర్మముం గని; వికర్మ నెఱింగి; విధి ప్రయుక్త సత్
కర్మ నొనర్చుచున్- ఫలము, కామము, సంగము, వీడి; దిట్టవై
కర్మ, నకర్మగాఁ గని, అకర్మను- కర్మగఁ జూడ మంటి''; వీ
మర్మ మెరుంగ నాకు వశమా? వచియింపుము నీవె మాధవా!

## సంన్యాసయోగము

''వాడే చూచినవాడు'' సాంఖ్యము, విభాస్వద్యోగ, మేకంబుగాఁ
జూడంగల్గు నెవండొ, వస్తువులఁ గొంచున్, గంచు, నేకార్యమున్
గూడం దా నొనరింపఁ ''డింద్రియములే కూడున్ నిజార్థాల'' నం
చాడున్ జ్ఞాని, జడుండ ''కర్త'' నని నేనందున్; హృషీకేశ్వరా!

## ఆత్మసంయమయోగము

యతినయి, ఇంద్రియాళి- మనమందు; మనస్సును- బుద్ధియందు ఆ
మతిని, నిజాత్మయం దిడి సమత్వము నూని- అచంచలుండనై,
ధృతిఁగొని, బ్రహ్మభూతిఁ గృతకృత్యుఁడ నై, గతకల్మషుండ నై,
వితతసుఖమ్ముఁ గన్గొను ప్రవీణత నిమ్ము, యతీశ్వరేశ్వరా!

## విజ్ఞానయోగము

తంతుశ్రేణి పటంబు రీతి జగ మోతప్రోతమై వెల్గఁ మ
ణ్యంతర్భాసితసూత్రమ ట్లలరుచున్నా వీవు! మూఢుల్ ప్రజల్
చింతన్ ని న్గన; రర్థి, నార్తుఁడ, మఱిన్, జిజ్ఞాసువున్, జ్ఞానినై,
కాంతున్; మాయనడంచి, శ్రద్ధనిడి, మోక్ష మిమ్ము, మాయామయా!

## అక్షరపరబ్రహ్మయోగము

పరతత్త్వమ్ము, స్మరింపలే రపుడు, విభ్రాంతాత్మ; లయ్యో! కళే
బరమున్ వీడెడువేళ- ఏక్షరమునో భావింత్రు; నిన్నే నిరం
తరవృత్తిన్ స్మరియింతు నెన్నిపను లున్నన్ భక్తి; నోంలక్షితా
క్షరమూర్తీ! స్మృతు లేల నాకు? నిజయోగ మ్మిమ్ము జ్యోతిర్మయా!

## రాజవిద్యా (గుహ్యా) యోగము

ప్రత్యక్షావగమంబు, ధర్మ్యము, పవిత్రం బుత్తమానందచి
న్నిత్యం, బంటివి రాజవిద్య; "జగముల్ నీయందు, నీ వందు నీ
నృత్యం బీప్రజయందుఁ గల్గు," ననియున్ "నీవందు లేనంటి," వీ
సత్యం బీవు వినా యెవం డెఱుఁగు, విశ్వాధ్యక్ష! గుహ్యా

## విభూతియోగము

నీ వాక్కుండవె ని న్నెరుంగుదు; వహో! నీమూర్తి నల్పాంశముల్
భావా; లాసురలందు వాసవుడు, రుద్రశ్రేణిలో శంభుఁడున్;
దేవర్షివ్రజమందు- నారదుఁడు, కీర్తి, శ్రీ క్షమా ముఖ్యముల్
దేవా! దివ్యమహావిభూతు లని గుర్తింతున్ కృపాళూ! ప్రభూ!

## విశ్వరూపదర్శనయోగము

దివ్యానీక, మనేకవక్త్రనయనోద్దీప్తమ్ము; సాశ్చర్యమున్,
దివ్యాలంబము, దివ్యమాల్యపటమున్, దివ్యాయుధంబున్, స్వతే
జోవ్యాప్తాస్యము, దుర్నిరీక్షము, సుధాంశూష్ణప్రభాలోకమై,
దివ్యాక్షీహితవిశ్వరూప మగు మూర్తిం జూపు దివ్యాకృతీ!

## భక్తియోగము

మది నీరూపమునందుఁ జేర్చెదవొ; కర్మత్యాగశీలమ్ము నే
ర్పెదొ! అభ్యాసము సంఘటించెదొ; ఫలాభీష్టమ్ము వర్జింపఁజే
యుదువో; యీమది- నీది, రాగయుతయై యుండం బ్రసాదించి, ఓ
హృదయేశా! ప్రియ నేలుకో, అమృతమూర్తీ! రాగయోగాకృతీ!

## క్షేత్ర – క్షేత్రజ్ఞ – విభాగయోగము

క్షేత్ర- క్షేత్రుల- జ్ఞానమున్, దెలిపి, విజ్ఞేయస్వరూపంబు- నీ
చిత్రోక్తిన్ విశదీకరించి, ప్రకృతి- శ్రీపూరుషాకార, వై
చిత్రిన్ జెప్పితి; వైన- దుఃఖి ననుదృష్టిన్ స్వాత్మ హింసింతు; నే
సూత్రజ్యోతి ననుగ్రహించెదవొ! వాసూ! నిర్వికారాకృతీ!

గుణత్రయవిభాగయోగము

సత్వ, రజస్, తమోగుణవశంబున బద్ధుఁడనై, సుఖప్రకా
శత్వముఁ గాంచి- కర్మమున సక్తివహించి- ప్రమోదమొందితిన్;
సత్వమునందె నిల్పుచు- రజస్తమముల్ వదలించి- సూటి నీ
సత్వము నాపి- బ్రోవుము ప్రసన్నుఁడ వౌచు ననున్ జగత్పితా!

శ్రీపురుషోత్తమప్రాప్తియోగము

క్రిందఁ శాఖలు, మీదమూల మగుమూర్తిన్ వెల్గు "అశ్వత్థమున్"
ఛందఃపర్ణము,ఁ జూడగల్గు కృతి- సంసారాంతముం గాంచు, సం
బంధంబున్ దెగటార్చి- తద్జ్ఞులయి ద్వంద్వాతీతులౌ అక్షరా
నందుల్ భోక్తను జ్ఞాననేత్రులయి సందర్శింత్రు తేజోమయా!

సురాసురసంపద్విభాగయోగము

అసురుల్ కామమె హేతువంద్రు; శ్రుతిధర్మాధర్మముల్ మిథ్య యం
ద్రు; సురల్ త్యాగతపోదమార్జవదయారూఢాత్ములై యుంద్రు, న
న్నసురుం జేయకు, వేదశాస్త్రవిధి నభ్యర్థింతు, మాయాతమః
ప్రసరద్వార- విలోభకామరుషలన్ వర్జింతు, సత్యప్రియా!

శ్రద్ధాత్రయవిభాగయోగము

ఆహారమ్ముల సాత్వికమ్మయిన యాహారమ్మె సంధించి, సద్
వ్యాహారమ్ముల- మౌన, సత్యము, లహింసాదుల్ ప్రసాదించి, ప్రో
త్సాహాప్తిన్ జప- దాన- యజ్ఞముల- 'ఓమ్, తత్, సద్ ' వినిర్దిష్టమౌ
సోऽహంతత్త్వమునన్ సమర్పణముగా నొందింపు విద్యామయా!

మోక్షసన్యాసయోగము

యంత్రారూఢములైన భూతముల మాయాశక్తి నాడింతు వో
యంత్రీ! మాయ నెఱుంగ నావశమె? దేవా! నీవె దిక్కంచు నిన్
స్వాంతంబం దిడి- సర్వధర్మములు నీయందే, సమర్పించెదన్
శాంతిం జూపి, కృతంబుఁ బాపి, సుఖమున్ సంధింపు జీవేశ్వరా!

శాం

మోహము నిష్క్రమించె; స్మృతిఁ బొందితి, నీయుపదేశ దృష్టి- సం
దేహము తీరె; నీ వనిన తీరునఁ జేయుదు నింక; సర్వరూ
పా,! హరి! చంద్రశేఖర! సుధాకర! సూర్య! విధీ! విరాట్స్వరూ
పా! హృతపాప! ధీశ్వర! జోహారు, జోహారు, జోహారు, శ్రీశ్వరా!

# శాంతి

శ్రీ పి. వి. ఎల్. నరసింహారావు

✲

జగతికి నీరాజన మెత్తుతూ, అప్పు దప్పుడే తలయెత్తుతూన్న బాలభానుని పసిడికిరణాలతో బంగారుమలామా చేయబడినట్లు ప్రకృతి కన్నులపండువుగా కనిపిస్తూన్నది. అరవిరిసిన విరులసౌరభాన్ని మోసికొని ముందుకు సాగుతూన్న మలయపవనాల మేల్కొల్పుకు మెలమెల్లగా తలలూపుతూ నిద్దురమత్తు వదలించుకొంటూన్నవి లతలు. ఆలత లణిగిపోగా, అతివడిగా పరుగులిడుట కలవడిన నదీలలామ నెమ్మదిగా, అతి నెమ్మదిగా, నెమ్మదికి నెమ్మది కలిగించెడు రీతిగా ప్రవహిస్తూన్నది. అంబరాన్ని చుంబించే వుత్తుంగ పర్వతశృంగంమీద ధ్యాననిష్ఠాగరిష్ఠుడై నిర్వాతదీపాంకురచ్ఛాయవలె మూర్తీభవించిన శాంతంతో పద్మాసనస్థుడై యున్నా డొకమునిశ్రేష్ఠుడు.

ఓహో ... యే మాగంభీరనిశ్శబ్దత!

ఆహా .... యే మాపరమపావనప్రశాంతత!!

అంత నొకకాంత యెటనుండియో కదలివచ్చింది.

ఆమెఅడుగులసవ్వడి వినిపించదు.

ఆమె పరులకనులకు కనిపించదు.

ఆభామిని ఆమునిపాదాలముందు వ్రాలింది.

ఆముని మూర్తీభవించిన శాంతము!

భామిని మూర్తీభవించిన పరమప్రశాంతము!!

ఏమి నాభాగ్యము!

నామనస్సు నాజీవితతపస్సు ఫలించినట్లు మహదానందం పొందింది.

నిర్మలభావాలతో నిండిపోయింది. కుతుకము కుతుకబంటిని దాటినది.

ఎవ రీవిజ్ఞానమూర్తి?

ఎవ రీపరమపావని!?

‟తల్లీ తమ రెవరు?” అనుకొనకుండగనే పెదవులదాటినవి నాపలుకులు.

తపోభంగమైనట్లు త్రుళ్ళిపడి తలత్రిప్పినది ఆశాంతమూర్తి!

నన్ను జూచి, మరుక్షణంలో మందహాస మొనరించింది.

ఆచిరునవ్వు వెన్నెలల్లో పువ్వులనవ్వులు, నవ్వులసవ్వడులు........ అంతర్లీనమై అవుపించాయి, వినిపించాయి.

అంత నొక ఆకుపచ్చని ఆకు నాకడకు వచ్చిపడింది. అందలిఅక్షరాలను గబగబ చదువసాగాను.

ఆకాంత పేరు శాంతిప్రియ, వాసం శాంతినివాసం!

అమ్మాయి అమ్మ ఆనందమ్మ.

నాతి నాన్న ధర్మరాజు.

అతివ అక్క ప్రేమమయి. సతి చెల్లెలు సత్య.

కన్నియ అన్నయ్య భద్రం!

..............................

..............................

ఆవిడ అందరకూ ఆడబడుచు!

పుడమితల్లికి ముక్కుపుడక!!

‟శాంతిప్రియ ...........” మాశాంతిప్రియ ఆలపించిన ఆరున్నొక్కరాగం చెవులకు సోకటంతో వులికిపడి లేచాను.

ఎంత కమ్మనికల ....ఎంతలో అలలా కరిగిపోయింది?

ఎంత సుందరదృశ్యం ....ఎంతలో అదృశ్యమయిపోయింది....!?

ఎంతలో .... నేను దివినుండి భువికి దిగజారిన సాధారణవ్యక్తి నైపోయాను?

ఎంత మధురానుభూతి ........!?

అయ్యో ....యీ దైనందినజీవనజంఝూటానికీ, ఆపావన పారలౌకిక ప్రశాంతతకు ఎక్కడి పొత్తు?

అది కరకు భావాలపాలిటి కరవాలము, ఆధ్యాత్మికానందాని కనుకూలము.

ఇది అశాశ్వతసుఖాల కాలవాలము, పరమాత్మసన్నిధి జేరుటకు ప్రతికూలము.

నేటి మానవున కేటి కీవ్యర్థప్రయాస?

ఆరాట మెక్కువ, ఆచరణ తక్కువ .... గల మనవారు అపేక్షకు దాసులు, ఉపేక్షకు హరిదాసులు.

ఆశయాలూ, ఆశలూ, ఆవేశాలు, ఆవేషాలు .... ... వీనికి అంతూపంతూ అవుపించదు. అస్తమానమూ, కోరలు తెరచుకొన్న కోరికలు తేనెటీగల తెట్టెలలా గుంపులు గుంపులుగా దండయాత్రలు చేస్తూవుంటవి.

అన్నీ అనుమానాలే ........బహుమానాలు వచ్చునా? తనకు పదవులు, అబ్బాయికి చదువులు, కులసతికి చీరె, పెద్దమ్మాయికి సారె, చిన్నమ్మాయి వివాహము ....జీవితమే ఒక వాంఛాప్రవాహము!

కలతనిదురతో అభయంలేని భయంతో గడుస్తూంది రాత్రి. తెల్లారుతూంది. దానితో బ్రతుకే తెల్లారుతూన్నట్లవుపిస్తుంది. పాలమనిషి, కూరలఅమ్మి, యింటియజమాని ........కారాలు మిరియాలు నూరుతూన్న వీరి ఆకారాలు ప్రత్యక్షం!

అంతతో గుండెల్లో అల్లకల్లోలానికి నాందీగీతం ఆరంభమౌతుంది.

ఇక శాంతికి తా వెక్కడ?

శాంతి అప్పుడే విశ్రాంతితీసికొనేందుకు పరుగెత్తుతుం దెచటికో.

..............................

..............................

మరికొన్ని క్షణాలు .. ........

అధికారిఆగ్రహం, పనిచేయని బంట్రోతు, పనిచేయనీయని పైపిష్టు అమ్మాయి, ....యింతై ....యింతింతై ....యింతింతింతై .... పెరిగిపోయే కాగితాల దొంతరలు ....లాంతరలు వెలిగించినా పూర్తిఅవనిపని ........కార్యాలయకార్యభారంతో కాళ్ళీడ్చుకొంటూ యింటికిరావటంతో ........

ఇంగితం యెరుగని యిల్లాలి సాధింపులు, పసిపిల్లల సుగమసంగీతం, ముసలివారి చాడీలు .... ..

తిరిగీ ....నిదుర ... అదే కలతనిదుర ........

ఈవిషవలయంలో పడి సతమతమవుతూన్న మానవునకు ....శాంతి ఏది? ఎక్కడిది శాంతి? !

ఈమానవునకు శాంతి రాదు.
ఈనరునకు కోరిక పోదు.
ఈవానరున కక్కర లేనిది లేదు.
ఈమనిషికి మంచిమాట చేదు.

ఈనవమానవుడు డార్విన్ సిద్ధాంతం నిజమే ననేటట్లుగా ప్రవర్తిస్తూవుంటాడు తరచు.

“చపలం మమహృదయకపిం, విషయద్రుచరం,
దృఢం బద్ధయామి విభూ........”
ఎంత చక్కగా వర్ణించారు శంకరులు!

గమ్యం తెలీకుండా సాగిపోతూన్న యీసమాజం శాంతిభద్రతలు లేనిదే మనజాలదు. పరస్పరవిద్వేషాలకు స్వస్తి చెప్పి ప్రేమబీజాలను నాటనిదే ధర్మాన్ని నెలకొల్ప జాలదు. సత్యాహింసలు మంత్రాక్షరాలలా జపించి ఆచరించనిదే ప్రగతిపథంలో పయనించజాలదు.

బుద్ధభగవానుని దివ్యవాణి ఆనాడు దశదిశలకు ప్రాకి అహింసాజ్యోతిని, అఖండనీతిని ధరణిలో స్థాపించగలిగింది. ఆనాడు ఆచార్యుని బోధనామృతాన్ని గ్రోలి తరించేందుకు తరలివచ్చింది శిష్యసందోహం నాగార్జునవిశ్వవిద్యాలయానికి. పర్ర నేలలను పచ్చనిపంటభూములుగా మార్చి, ప్రజలభాగ్యరేఖను తీర్చిదిద్దగల దీనాడు తిరిగి మననాగార్జునసాగరం, శాంతిసామ్రాజ్యాన్ని నెలకొల్ప గలదు.

అజంతా, ఎల్లోరాశిల్పాలు, లేపాక్షిచిత్రాలు, నందికొండబౌద్ధస్తూపాలు ....యేవ్యక్తిహృదయాన్ని కదలించి వేయవు?

రవీంద్రకవీంద్రుడు “ఓపరమేశ్వరా!
ఒక్కక్షణం నన్ను నీసన్నిధిలో కూర్చొన నిమ్ము.
నాచేత నున్న పనుల తరువాత ముగింతును.

శ్రీ పి. వి. యల్. నరసింహారావు

నీ ప్రసన్నవదనసందర్శనసౌభాగ్యం లభించని చో నాపని ........

ఒక అగాధార్ణవమై, శ్రమకాశ్రమమై శాంతికి విశ్రాంతికి దూరుడ నగుదును.

నేడు వేసవిగాడ్పులు, నిట్టూర్పులు నాకిటికీ చెంతకు వచ్చినవి. పూలతోటలో తేనెటీగ లెగురసాగినవి.

ఇపుడు, నీ మ్రోల నిలిచి శాంతితో అనంతవిశ్రాంతితో నాజీవనకైంకర్యగీతికను మానంగా ఆలపింపవలసిన సమయం ఆసన్నమయింది" అన్నారు.

ఈజీవనసంగ్రామంనుండి దూరంగా తొలగి విశ్వనాథుని పాదాల మ్రోల కూర్చొనటంలోనే శాంతి లభిస్తుందనే సత్యాన్ని నిరూపించారు విశ్వకవి.

పరస్పరవిశ్వాసం తుదినిశ్వాసం తీస్తూ, విద్వేషం విశృంఖలంగా వీరవిహారం చేస్తూ, అభిమానాలు, అనుమానాలు, అసూయలు, అక్రమాలు ....తలలెత్తుతూ, జాతిమతభేదాలు నీతినియమాలను వదలి ఆవేశంతో కదలి అంతర్యుద్ధాలను పురికొల్పుతూన్న ...........

నేడు ...........

తిరిగీ, భారతీయసంస్కృతి ఆదర్శవంతము, ఆచరణీయము అగు అమూల్యసందేశాన్ని దేశాల కందిస్తూ వున్నది. అంతరంగంలోని సంగరరంగానికి, కాంగోలోని కల్లోలానికి, లావోస్‌లోని మారణకాండకు ................ అన్నిటికీ మూలకారణం ఒకటే ........అది, శాంతికాముకత్వం నశించి, మానవునిలో వెర్రిఆవేశం విజృంభించటమే !

కొందరు ప్రతిదానికీ తొందరపడుతారు. మరికొందరు మిన్నువిరిగి మీదపడినా చలించరు.

కాని, భగవద్గీతలో తెలిపినట్లు "తనకర్తవ్యాన్ని నెరవేర్చి ఫలితాన్ని భగవంతునికి వదలటం నేర్చుకోవటం" ప్రతివ్యక్తికీ యెంతేనీ అవసరం.

పాపభీతి లేకపోవటం, అహంభావ మధికమవటం, దేశభక్తి, సేవారక్తి లోపించటం ... యివన్నీ అశాంతి లతకు ఎరువులు, శాంతితలమీద బరువైనబరువులు.

కోరికలసముద్రం అడుగునపడిపోయిన భగవానుడు, చంటిపిల్ల పాలుత్రాగకపోవటంతో చక్కగా పైకిలేచి వచ్చి తనదివ్యమంగళవిగ్రహంతో సాక్షాత్కరిస్తాడు.

ముడుపులు కడుతాడు, దిగదుడుపులు తీస్తాడు!

కోవెలకు పరుగెడుతాడు, కొబ్బరికాయలు కొడుతాడు!!

ఇదె ....యీనాటిమానవుని స్వార్థము.

ఎదదలోని బెడదలను పారద్రోలి, తలపులో పిలుపులో పవిత్రత నిలిపి, చేతలో రాతలో నీతిని చూపి ....మానవుడు సచ్ఛీలము నలవరించుకోననిదే శాంతికి తావు దొరకదు. అందని చందమామ నందుకోనేందుకు ప్రయత్నించే మానవుని కార్యదీక్ష, సునిశితమేధాసంపత్తి ప్రశంసనీయమే. ఈ 'విజయశ్రీ' 'శాంతిశ్రీ' పరస్పర స్నేహభావంతో కలిసినపుడే జగత్కళ్యాణం జరుగుతుంది. శాస్త్రవిజ్ఞానం శాంతిస్థాపన కొరకుపయోగించకపోతే సర్వనాశనం తప్పదు.

ఇది మనిషిచేతిలోనే వున్నది.

సమాజంలో సద్భావాలను నాటి, వానిని పెంచిపెద్ద జేయగల మహత్తరశక్తి లలితకళలకు వున్నది. కవులు, గాయకులు, శిల్పులు ........మొదలగు కళాకారులు విశ్వాంతరాళంలో శాంతిగీతికను వినిపించి మానవజాతిని మైమరపించగల మహాపురుషులు. సంస్కృతికి.... కవిత్వం, చిత్రలేఖనం, శిల్పం.... యిత్యాది లలితకళలు పట్టుగొమ్మలు.

ఈశాంతిసందేశాన్ని అందించిన మహాపురుషులు ఎందరో యీపవిత్రభరతభూమిలో ఉద్భవించారు.

నేడూ ఉద్భవిస్తూవున్నారు.

నాటికీ, నేటికీ, యేనాటికీన్ని, శాంతియుతసహజీవన ప్రాతిపదికగా నిలిచిన పంచశీల భారతజాతిజాతీయజీవనానికి జీవగర్ర!

'అశాంతి'లో 'శాంతి' దర్శించి మానవుడు ముక్తిపథంలో ముందుకు సాగుగాత!

భారతజాతి వినిపించు శాంతిగీతి దశదిశలా వ్యాపించి, జగత్తుకు వెలుగుబాట జూపించుగాక!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# స్తుతి రత్నములు

శ్రీ చివుకుల సీతారామ శర్మ



దాట శక్యంబుగాని సంద్రమ్ము నొక్క-
రెప్పపాటునఁ దాటి "భళా" యనంగ
లంకఁజొచ్చియు, రక్కసి బింక మడచి
సీతవృత్తాంత మరసి ప్రసిద్ధిఁగన్న
వాయుపుత్రుఁడు మమ్ము కాపాడుగాత

తనదు భక్తుల రక్షింపగను జగాన
సువ్రతమ్మొండు బోధించి చోద్యమొప్పఁ
కరుణపూరితహృదయుడై బరగినట్టి
సత్యదేవుండు మాకు ప్రసన్నుడగుత!

క్రూరులైనట్టి రాక్షసకోటినెల్లఁ
గూల్చి ధరలోన శాంతినిఁ గూర్చి జనుల
కభయమిచ్చిన తల్లి దుర్గాంబదేవి
మమ్ముఁ గాపాడుఁగాత! సమంచితముగ!!

ఏమహాశక్తి, నన్ను తా నింతదనుక
పెంచి పోషించుచున్నదో శ్రీ తెలర్పఁ
అఖిలజగముల కాధార మైనశక్తి
ఆదిశకికి నేను జోహారొనరు.

# ఇలవేలుపు

కోరిన కోర్కెలు కొల్లగా నిచ్చును;
ఏడుకొండలవాడదేమొ కాని;
ఎవ్వరైన తనకడ కేగుదెంచెద మంచు
ప్రార్థనఁసేయగాఁ బాధ మాన్పు,
బాధమానిన వెంట "బాగుబా" గంచును
వెళ్ళకయుండిన వెఱ్ఱిసేయు;
మ్రొక్కుబడులనన్ని బొక్కసంబునఁ జేర్చు
వడ్డీలతోకూడ వశముఁ గొనును;

ఆహా! యెవ్వరైన "వేంకటేశా" యటంచు
భక్తిఁ గొల్చిన వారికి ముక్తినిచ్చు
సకలధర్మంబులన్ భువిఁ సర్వమయుడు
వేంకటేశుండు స్థాపింప జంక డెపుడు.

దిక్కులేనివారి దీనత నెడబాపి
సకలసౌఖ్యములను సమ్ముదమున
నొసగి కరుణనేలు యోగమూర్తియునైన
వేంకటేశు డతడు ప్రేమమూర్తి!

కష్టములను తొలగఁగా జేసి భక్తుల
యిష్టముల నొసంగి ఇహపరమ్ము
లిచ్చు దైవమౌను; ఇలవేల్పు మాకౌను
వేంకటేశు డతడు ప్రేమమూర్తి

శరణుజొచ్చువారి నెఱిగి బ్రోచెడు సామి
మోక్షదాయకుండు ముజ్జగముల
శాంతిసౌఖ్యములను సర్వదా నెలకొల్పు
వేంకటేశు డతడు ప్రేమమూర్తి!

అతడే మాకగు రక్షకుండు నిరత
మ్మాతండె మమ్మేలు మే
మతని౯ వీడము; వీడ డెప్పుడును మ
మ్మాతండు; నిక్కంబుగా
నతడే తల్లియు, దండ్రి యౌను, గురు డౌ
ఆపత్సహాయుండు నౌ
అతడే తిర్పతి వేంకటేశ్వరుడు మా
కారాధ్యదేవుం డిల౯.

# సుమాంజలి

## శ్రీ చిట్టా రామకృష్ణా రావు



శ్రీమన్నిర్మలధర్మపాలన! జగత్సృష్ట్యాదికప్రేరణా!
కామక్రోధమదాదిసంహరణ! సత్కర్మిష్ఠలోకావనో
ద్దామా! సద్గుణసీమ! నిర్గుణ! సమస్తప్రాణిధామా! పరం
ధామా! నిత్య! నిరీశ! విశ్వపరిణేతా! రాజరాజేశ్వరా!

విశ్వేశ! నీ రాజ్యవిస్ఫూర్తి కెన యౌనె రాజ్యాధినేతృసామ్రాజ్యగరిమ?
ధర్మస్వరూప! నీధర్మమార్గము చెంత ధరణిభూతవ్రాతధర్మ మెంత?
శిల్పాబ్ధి! తావకానల్పశిల్పముతోడ భువికళోపాసకాభ్యుదయ మీడె?
వర్ణనాతీత! నీభవ్యగాథాబ్ధికి సకలజీవచరిత్ర సామ్యమౌనె?

అలయకయె భానుశశితారకాదివితతి
ననయమును విశ్వరంగాన నాడఁజేయు
శక్తికిని శక్తి వీవ, నీసాటి యెవరు?
రాజరాజేశ్వరా! దేవ! రమ్యచరిత!

భవదుత్కృష్టకథాసుధారసమహావర్షోరుధారాళి గా
క విమోహాస్పదకాలకూటవిషవాగ్ధారోగ్రగాథాళిచే
భవదుఃఖానల మార్ప నౌనె? తవశశ్వద్దివ్యగాథారసో
ద్భవనిష్ణాతుల కీవె యేడుగడ గావా? రాజరాజేశ్వరా!

బహుభూషణాంబరవ్యామోహపటలిభాస్వత్స్వరూపుని గనఁజాల నిన్ను!
ఐహికభ్రాంతిసందోహమ్ము స్వీయనిస్తులమార్గమున కడ్డుదోచుచుండు!
సకలాండకోటి కంజభవాండములనిండియుండు నీస్పృహయు లేకుండు నాకు!
అస్మదీయహృదబ్జ మంతర్విరోధిప్రభంజనార్భటికి సైపంగ నోడు!

ఎడనెడ భవత్పదాళిసందడులు వినఁగ
మన్మనోమందిరమ్ము నిర్మలతఁ జెందు,
నంతలోఁ గ్రమ్ము మాయఁ బోనడచు మార్య!
రాజరాజేశ్వరా! దేవ! రమ్యచరిత!

దేవా! నీనిజతత్వ మారయుప్రపత్తిన్ గాంచకే నీ వెటన్
లేవం చాడుదు! రెంతశోచ్యమొకదా! లేకున్న నీ విశ్వవి
శ్వావిర్భావ మ దెట్లు? పాలనము సాధ్యంబే ప్రభుల్ లేక? తం
డ్రీ! విశ్వాత్మక! విశ్వభర్త యగు దీవే! రాజరాజేశ్వరా!

శాంతిసరోజినీషట్పదరాజంబు శమదమాదిచకోరచంద్రరేఖ!
నవరసాలంక్రియానందనశుకము, వైరాగ్యసరోవరరాజహంస!
సత్యవాఙ్నిచయరసాలసాలపికంబు నీతికలాపివినీలఘనము!
ఐశ్వర్యసుమవసంతాగమకాలంబు ధర్మసారంగవితానవృష్టి!

వగుచు సకలోపమానసమంచితప్ర
భావిభాకరబహుగుణభాసమాన
విశ్వతేజంబ వగు నిన్ను వినుతిసేతు
రాజరాజేశ్వరా! దేవ! రమ్యచరిత!

ధరలోనాతపతప్తదేహి కడుశీతంబైన వాఃపూరమున్
దరియన్ గోరునుగాదె? వ్యాధిపరితప్తం బైనవాఁ డౌషధుల్
కర మాసించునుగాదె? నాకు నరివర్గక్రూరదుర్వారభీ
కరదావానల మార్ప నీకరుణయేగా? రాజరాజేశ్వరా!

ఐక్యభావాసక్తి నలరు సజ్జనుకోటి దేవ! నీవిస్ఫూర్తి దెలియుఁగాదె?
జీవకారుణ్యగుణావహులను జేర సదయాత్మ! నిన్ను గాంచెదముగాదె?
త్రికరణశుద్ధిసుధీశాలురఁ గనంగ మహితచారిత్ర! నిన్ మఱువఁ గలమె?
పరమతపరపక్షవరసహిష్ణుల చెంత సహనైకశీల! నీస్మరణఁ గనమె?

విశ్వమానవసౌభ్రాత్రవిజయఫలము
సృష్టిపరమావధి, రహస్యమెల్ల నిదియ;
స్వీయధర్మచ్యుతి ప్రశంసనీయ మగునె?
రాజరాజేశ్వరా! దేవ! రమ్యచరిత!

ధరసత్కార్యపరమ్ముగాని బహుళార్థంబుల్, సమర్థత్వమున్,
వరవిజ్ఞానము, సాహసోద్ధతి కడున్ వర్జ్యంబు లౌఁగాన, దే
వ! రహిన్ వీని బరోపయుక్తముగ నల్పన్ జన్మసాఫల్యతన్
దొరలన్ బ్రోవవె వేగ దీనజనబంధూ! రాజరాజేశ్వరా!

గతవీర్యమైన సంఘమున సారము వెల్లివిరియంగఁ గదలించు విద్య విద్య
ఆత్మధర్మవిచారణాచరణాసక్తిఁ గలయఁ జిమ్మ రహించు కలము కలము
పటుదురభ్యాసనంకటతప్తజాతిని సంస్కరింప వెలుంగు శక్తి శక్తి
మానుగ విశ్వకళ్యాణార్థమై హృదబ్జాతమ్ము వెల్వడు కైత కైత.

యంత్రు విబుధాళి, యట్టి విద్యాదికముల
నవని శాశ్వతశాంతిసౌఖ్యాదు లలర
వేగఁ గృపఁ జూడు మయ్యయో విశ్వనేత!
రాజరాజేశ్వరా! దేవ! రమ్యచరిత!

కరమాసక్తి మధువ్రతంబు మధువున్ గంధంబు కాంక్షించి, దు
ర్భరగంభీరకఠోరకంటకసుమాభ్యగ్రంబుఁ దా డాయు మా
దిరి విఘ్నాద్రులనెల్ల నీకరుణ నుత్తీర్ణంబు గావించి, నీ
చరణాబ్జామృత మాననిమ్ము జగదీశా! రాజరాజేశ్వరా!

కపటనాటకసాంద్రకాంతారదావాగ్ని స్వార్థపరత్వభుజంగకేకి!
దుర్మదాంధతమోవిధుప్రభాపటలంబు కోపపావకశిఖాకుంభవృష్టి!
పరవస్తుమోహపర్వతవజ్రశస్త్రంబు దంభకుంజరమృగేంద్రవ్రజంబు!
మమతానుబంధదుర్గమనికుంజకుఠార మజ్ఞానమేఘజంఝూనిలంబు

అఖిలకిల్బిషజాడ్యమంత్రౌషధంబు
నై చెలంగెడు నీకు మాయందుఁ గల్గు
దుష్ప్రవృత్తులఁ ద్రోలంగఁ దొడరు టెంత?
రాజరాజేశ్వరా! దేవ! రమ్యచరిత!

కమలాక్షా! నిను గానలేని దినముల్ కల్పంబు లౌగాదె? వా
సి మదీయైహికనిత్యజీవితవిపంచిన్ బ్రేమ మ్రోగించి, యు
త్తమరాగంబులహృత్సరోరుహము నుత్సాహమ్ము దీపింప ది
వ్యమరందద్రవపూర మిమ్ము బుధగేయా! రాజరాజేశ్వరా!

ఎన్నఁడు తెల్లవారు? నిఁక నెన్నఁడు భక్తజనోత్సవంబు? నా
కెన్నఁడు నీముఖాంబుజసమీక్షణ మబ్బు? కరావలంబ మిం
కెన్నఁ డనుగ్రహింతు? విఁక నెన్నఁడు మద్విపదగ్ని యారు నా
పన్నఁడ రాజరాజపతి! పంతముఁబూనక వేగఁ దెల్పవే!

పరమకృపావికాసగుణభాసిత! భాసితవిశ్వకీర్తితో
త్తరఘనరూప! రూపజితదర్పక! దర్పకదర్పచోర! చో
రహితరాజ్య! రాజ్యభరరాజితదోర్బల! దోర్బలాశ్రితో
ద్ధరగుణ! రాజరాజనుత! తాపవిశోషణ! భక్తపోషణా!

హారికి, దివ్యహృద్వనవిహారికి, సజ్జనవైరివృక్షసం
హారికి, భక్తదోషపరిహారికి, ధర్మగుణోజ్జ్వలన్మనో
హారికి, దుఃఖహారికి, మహాగుణహారికి, భవ్యకీర్తనా
హారికి, రాజరాజనుతి కాత్మసమర్పణజేతు భక్తితోన్.

# “షడంగములలో శికలు”–నిరుకము

శ్రీ షడ్దర్శనం సోమసుందర శర్మ



భారతీయసంస్కృత సాంప్రదాయాదులకు మూలకందములైన, ఋగ్యజుస్సామాథర్వణము లనదగిన, వేదచతుష్టయమునకు అంగభూతము లాఱు. వీనినే 'షడంగము' లనియు, లేక సాంగవేదములనియు వ్యవహరింతురు.

అపౌరుషేయము శబ్దబ్రహ్మాత్మకము లైన అనంతవేదరాశిని ఉచ్చరించుటకు తగిన స్తోమత శిక్షలవల్లను, పదవిజ్ఞానము వ్యాకరణమువల్లను, వాక్యరచనావిధానాదికము ఛందస్సువల్లను, కాలప్రాముఖ్యాదులు జ్యోతిషమువల్లను, అర్థవిజ్ఞానాదికము నిరుక్తమువల్లను, మంత్రానుష్ఠానాదికములు కల్పములవల్లను నెఱుంగదగియున్నవి. కనుకనే ఈ శిక్షావ్యాకరణ ఛందో జ్యోతిష నిరుక్త కల్పము లను నాఱింటిని వేదాంగములుగా భావించిరి.

'శిక్షా ఘ్రాణాంతు వేదస్య, ముఖం వ్యాకరణం స్మృతం।
తస్మాత్సాంగ మధీత్యైవ బ్రహ్మలోకే మహీయతే॥
ఛందః పాదౌ తు వేదస్య, హస్తౌ కల్పోథ పఠ్యతే।
జ్యోతిషామయనంచక్షుః నిరుక్తం శ్రోత్ర ముచ్యతే॥

అను పాణినీయశిక్షావచనము రీతిని, శిక్షలు వేదపురుషునికి నాసిక వంటివనియు, వ్యాకరణము ముఖస్థానీయమనియు, ఛందస్సు పాదములవంటివనియు, చేతులు కల్పములనియు, జ్యోతిషము నేత్రస్థానీయముగను, నిరుక్తము శ్రోత్రరూపముగను నభివర్ణించియున్నారు.

ముక్కు, కండ్లు, చెవులు, నోరు, చేతులు, పాదములు, అను నాఱు మానవునికి ముఖ్యాతిముఖ్యములు. వీనిలో నే యవయవము లోపించినను మానవుని పూర్ణరూపమునకు వికలత్వ మగుటయే గాక, నా యవయవమువలన చేయదగిన కార్యములు భంగమువాటిల్లుట కవకాశము లుండును.

ఆరీతిని వేదము నేర్చియుండియు షడంగములు నేర్వనిచో అవయవయములు లేని మొంటిని ఆరాధించినట్లగును. షడంగములను నేర్చియు ప్రధానమైన వేదమును నేర్వనిచో, షడంగములు నిరుపయోగము లగునేగాని నేర్చియు, నుపయోగము వ్యర్థమై పొడసూపును.

ఈ రీతిని వేదముమాత్రము నేర్చి, షడంగములు తెలియనివారున్నూ, షడంగములలో నేదో యొకదానిని మాత్రము నేర్చి, వేదము రాని శాస్త్రవేత్తలును, ఈనాడు ప్రబలిపోవుటచే వేదమునందలి యుపయోగములు గుర్తింపనేరక కేవల శాస్త్రపాండిత్యమే పరమావధిగా భావించియో, కవితాచమత్కారాదులే మహాపాండిత్యప్రకర్షణకు హేతుభూతము లనియు తలంచి తలంపజేయుచుందురు. వేదశాస్త్రములురాకనే వచ్చినట్లు వేషభావలతో నటించుటయు పరిపాటైపోయినది. కాలగతి కేమందుము?

షడంగములలో శిక్షలు మొదటివి. తైత్తిరీయోపనిషత్తులో నీ శిక్షలనుగూర్చి తెలియజేయబడియున్నది.

'శీక్షాం వ్యాఖ్యా స్యామః వర్ణస్వరః మాత్రాబలం సామసంతానః' ఇత్యుక్త శ్శీక్షాధ్యాయః॥ అని గలదు. వీనిని సర్వజ్ఞులైన శంకరభగవత్పాదులు వ్యాఖ్యానించుచు నీరీతి ననిరి.

'అర్థజ్ఞాన ప్రధానత్వాత్ ఉపనిషదో గ్రంథపాఠే యత్నో పరమో, మాభూదితి, శీక్షాధ్యాయ ఆరభ్యతే' 'శిక్ష్యతే అనయేతి వర్ణాద్యుచ్చారణలక్షణం', 'శిక్ష్యంత ఇతివా శిక్షాః' వర్ణాదయః శిక్షైవ శీక్షాదైర్ఘ్యం, ఛాందసం, తాం శీక్షాం వ్యాఖ్యాస్యామః, వర్ణః అకారాదిః, స్వరః ఉదాత్తాదిః, మాత్రాః హ్రస్వాద్యాః, బలం ప్రయత్న

విశేషః, సామ-వర్ణానాం, మధ్యమవృత్త్యోచ్చారణం, సమతా, సన్తానః సంతతిః-సంహితే త్యర్థః'.

వర్ణాదులను ఉచ్చరించు విధానాదికమును శిక్షించునది గనుక 'శిక్షలు' అని వీనికి సార్థకనామ మలవడినది. వర్ణములు, స్వరములు, మాత్రాకాలములు, ప్రయత్నములు వీని వలన గుర్తింపవలసియున్నది.

పై శంకరభగవత్పాదుల వాక్యములను వివరణగా నానందగిరులు నీరీతిని వివరించిరి.

'స్వరోష్మవ్యంజన ప్రమాదో మాభూ దిత్యర్థః।అన్యథా వివక్షితార్థ సిద్ధిరేవ, నస్యాత్, తదుక్తం' 'మంత్రోహీనః స్వరతో వర్ణతోవా, మిథ్యాప్రయుక్తో నత మర్థమాహ। స వాగ్వజ్రో యజమానం హినస్తి య థేన్ద్రశత్రుః స్వరతోపరాధా దితి'.

లక్షణం - శాస్త్రం, ఋుట్ రషాణాం మూర్ధా, ఇచ్ యశానాం తాల్విత్యాది త స్యాన్యత్రైవ సిద్ధిత్వా దిహ కర్మ వ్యుత్పత్తిరేవ శిక్షా శబ్దస్య గ్రాహ్యా, చక్షిఙః ఖ్యాఙ్ వా లిటేతి, సూత్రేణ ఖ్యాఙాదిష్టోయస్య, తస్యైవం, రూపం, నఖ్యాప్రకథనే, ఇత్యస్య, సోపసర్గస్య, ప్రయోగా నభిధానా, దిత్యర్థః' అనిరి. మంత్రమునందలి స్వరముగాని, అక్షరముగాని సరిగా నుచ్చరించనిచో, వజ్రాయుధము వలె నా మంత్రము ఉచ్చరించువానిని బాధించగలదు. అనగా తప్పుడురీతిని వేదమంత్రములు నోటికివచ్చినట్లు ఉచ్చరించినచో ఫలితముకన్నా బాధలే మెండని తోచెడిని. అట్లు తప్పులుతప్పులుగా వేదమంత్రములను ఉచ్చరించకుండుటకై సక్రమముగా నుచ్చరించు విధానాదికము లీశిక్షలవలన తెలిసికొన వీలగుచుండు ననిరి.

ఇంద్రుడు తనశత్రువైన వృత్రాసురుని సంహరింపదలచి యాగ మొనర్చుచు 'ఇంద్రశత్రు ర్వర్ధస్వ' యని యగ్నిలో హోమ మొనర్చెను. వాక్యము శుద్ధముగనే యున్నది. వ్యాకరణరీత్యా చూచినచో, కాని స్వరము తప్పినది; స్వరముచే నర్థము భేదించినదని తెలియనగును. వాక్యము శుద్ధముగా తోచిననూ స్వరభేదముచే బహువ్రీహిసమాసముగా నుండదగిన వాక్యము తత్పురుషసమాసముగా నేర్పడి శత్రువునశించవలసినదిపోనిచ్చి యజమానికే బాధగలిగినది. అనగా ఇంద్రుడే శత్రువుగా గలవాడై వృద్ధిపొందుగాక యను బహువ్రీహిసమాసమర్థము రాదగిన వాక్యము స్వరభేదముచే ఇంద్రునియొక్క శత్రువు వృద్ధిపొందుగాక, అనగా వృత్రాసురుడు వృద్ధిపొందుగాక యని యేర్పడినదనియు, దానిచే హోమముచేసిన ఇంద్రునికి క్షతి యేర్పడి శత్రువైన వృత్రాసురుడు వృద్ధిపొందగల్గెను, గాన స్వరము యొక్క అపరాధముచే నింతటి యనర్థము వాటిల్లినది గాన వేదమంత్రోచ్చారణావసరమున మహాజాగ్రత్తతో స్వరము అక్షరము, మాత్రాకాలము సక్రమముగా నుచ్చరించిననే ఫలితముండునుగాని పద్యాలు, శ్లోకాలు, పాటలు పాడినట్లుగా నోటికివచ్చినరీతిని వేదమంత్రములు చెప్పినచో, బాధలు తప్పవుగాన ఉచ్చారణాదికమునకై శిక్షలుతప్పక పఠించవలయునని వేదము వచించుచున్నది అని శిక్షాకారులు నిరూపించినారు.

విశిష్టాద్వైత మతస్థాపనాచార్యులైన రామానుజులు పై 'శిక్షాం వ్యాఖ్యాస్యామః' అను వేదమంత్రములను నీరీతిని వ్యాఖ్యానించిరి. 'శిక్షాఖ్య వేదాంగస్య, వేదోపకార ప్రకారో వర్ణ్యత ఇత్యర్థః శిక్షాతి దీర్ఘ ఛాందసః, వర్ణాస్త్రిషష్టి శ్చతుష్షష్టి శ్శంభుమతే మతా। ఇత్యుక్తరీత్యా అకారాద్యాః వర్ణాః స్వరాః ఉదాత్తాదయః మాత్రాః హ్రస్వదీర్ఘాది భేదాః బలం అల్పప్రాణత్వ మహాప్రాణ త్వాది లక్షణం సామ - కౢప్త ప్రథమాది లక్షణాః సప్తస్వరాః సన్తానః వర్ణపదసంహితాదిః ఏతేషాం జ్ఞానం వేదాంగసాధ్యం తతశ్చ ఏత జ్జ్ఞానం బ్రహ్మవిద్యోపయోగీత్యర్థః ఇద ముపలక్షణం వేదాంగాంతరాణా మపి' యని వచించిరి. అక్షరములు ఉదాత్తానుదాత్తస్వరితప్రచయాది స్వరములు హ్రస్వదీర్ఘప్లుతాది మాత్రాకాలములు ఈశిక్షల వలననే గుర్తింపవీలగుచున్నదనియు, ఇట్టి జ్ఞానము బ్రహ్మవిద్యోపాసనకు అత్యావసరముగాని వేదాంగభూతమైన శిక్షలను న్వోదగు టత్యంతావశ్యకమని వచింపగల్గిరి.

సక్రమముగా వేదాక్షరముల నుచ్చరించనిచో మహాదోషముగా వాకొనిరి.

'అపక్షర మనాయుష్యం, విస్వరం వ్యాధిపీడితం।
అక్షతం శస్త్రరూపేణ, వజ్రం పతతి మస్తకే'॥

అనురీతిని అక్షరములుగాని, స్వరముగాని, సక్రమముగా నుచ్చరించనిచో ఆయుస్సుహీనమగుటయు రోగాదిబాధలు గలుగుటయు నేర్పడుచుండగలవుగాన శిక్షామూలకముగా వేదోచ్చారణ మవసరమనిరి.

'స్వరతః కాలతః స్థానాత్ ప్రయత్నానుప్రదానతః
ఇతి వర్ణవాదః ప్రాహుః నిపుణం తన్నిబోధత'

అనురీతిని స్వరము, మాత్రాకాలము, ప్రయత్నములు గుర్తించి వర్ణవిదులు వచించుచుందురు.

'ఉదాత్తశ్చానుదాత్తశ్చ స్వరితశ్చ స్వరాస్త్రయః
హ్రస్వో దీర్ఘః ప్లుత ఇతి కాలతో నియమా అచి.

అనురీతిని ఉదాత్తమనియు, అనుదాత్తమనియు, స్వరితమనియు వేదమున స్వరములు మూడు. వీనితోగూడినవై అక్షరములు, హ్రస్వము, దీర్ఘము, ప్లుతము అను మాత్రాకాలములతో నొప్పుచుండును.

ఉదాత్తే నిషాద గాంధారౌ అనుదాత్త ఋషభ ధైవతౌ।
స్వరిత ప్రభవా హ్యేతే షడ్జ మధ్యమ పంచమాః'॥

అనురీతిని నిషాద గాంధారములుగా ఉదాత్తస్వర మొప్పుచుండును. ఋషభ ధైవతములుగాన నుదాత్తను చెలువారుచుండును. షడ్జ మధ్యమ పంచమాది పోలికలతో స్వరితము చెలంగుచుండును. ఈరీతిని స్వరజ్ఞానముగాని, అక్షరజ్ఞానముగాని, మాత్రాజ్ఞానముగాని లేకయున్ననూ,

'గీతీ శీఘ్రీ శిరఃకంప తథా లిఖిత పాఠకః।
అనర్థజ్ఞోఽల్పకంఠశ్చ షడేతే పాఠకాధమాః'॥

అనురీతిని రాగముతీసిన ట్లుచ్చరించిననూ, తల ఆడించుచూ వణుకుడురోగివలె ఉచ్చరించిననూ, వ్రాసినపాఠమును చూచి చదువుచున్ననూ, అర్థజ్ఞానహీనమైననూ అల్పకంఠముతో గొణుగుతూ వచించిననూ, ఇట్టివారారుగురు పాఠకాధములుగా పేర్కొనిరి. కనుక నీరీతిని నారువిధములైన దోషములులేనట్లు గుర్తించి వేదరాశిని వచించుట [illegible]యమందురు.

శంకితం భీతం ఉద్ఘుష్టం అవ్యక్తం అనునాసికం
కాకస్వరం శిరసిగం తథా స్థానవివర్జితం
ఉపాంశుదష్టం త్వరితం నిరస్తం
విలంబితం గద్గదితం ప్రగీతం
నిష్పీడితం గ్రస్తపదాక్షరంచ
వదేన్నదీనం నతు సానునాస్యం'॥

అనురీతిని సందేహించుచుగాని, భయపడుచూగాని, అవ్యక్తముగాగాని, భయంకరముగాగాని, కాకస్వరముగాగాని, శిరఃకంపముతోగాని, అసందిగ్ధముగాగాని, పండ్లు బిగబట్టిగాని వేదాక్షరము లుచ్చరింపరాదనియు శిక్షాగ్రంథము లుద్ఘోషించుచున్నవి. కనుక స్వర, వర్ణ, కాలాదులను గుర్తించుట కనువైన వ్యాస పాణిని భారద్వాజాది నవశిక్షలను నేర్చి వానియందు వచించినరీతిని వేదోచ్చారణ మొనర్చిననే శిష్టసాంప్రదాయికమైన పాఠప్రవచనమగునేగాని లేకున్నచో వేదమున కపచారము చేసినవారగుదురనుట సత్యదూరము కానేరదని వచించుట సర్వసమ్మత మగుననిన తెలిసినవా రానందించకపోరు.

నిరుక్తము శ్రోత్రములవంటిదిగాఁ బోల్చిరి.

నిశ్చయేన ఉక్తం=నిరుక్తం అని నిశ్చయార్థమునకు నిరుక్తమని నిరూపించిరి. ఇది పంచభేదములతో నొప్పె రొప్పెనిరి.

'వర్ణాగమో వర్ణవిపర్యయశ్చ
ద్వౌ చాపరౌ వర్ణవికార నాశౌ
ధాతో స్తదర్థాతిశయేన యోగః
తదుచ్యతే పంచవిధం నిరుక్తం'

అనురీతిని వర్ణాగమ వర్ణవికారాదులతోను ధాత్వాదిభేదములతోను పంచవిధములుగా నీ నిరుక్త మొప్పుచుండుననిరి.

'అత ఉక్తాధ్యయన విధే రుక్తశ్ఛందః ప్రవిభాగస్య ఉక్త వినియోగస్య ఉపలక్షిత కర్మాంగభూత కాలస్యోపదర్శిత, లక్షణ స్యైతైః అంగైః వేదస్య అర్థపరిజ్ఞానవిషయే, నిరుక్తంనామేదం, అంగ మారభ్యతే' అని దేవరాజయజ్వచే నిరూపింపబడినది. వేదాంగముగా నీనిరుక్తము ప్రదర్శి పబడుచున్నది. «అర్థోహి ప్రధానం» అనురీతిని అర్థము ప్రధానముగాన, వేదము అర్థవంతముగా నేర్చిననే «తద్గుణః శబ్దః» అనురీతిని, అర్థమునకు ఆధారభూతమైన శబ్దరాశిని, వ్యాకరణశాస్త్రముచే గుర్తించవలయుననియు, వేదమంత్రవినియోగములనుగూర్చి కల్ప గ్రంథములచే

గుర్తించవలయుననియు, «శబ్దలక్షణపరిజ్ఞానం, సర్వశాస్త్రేషు, వ్యాకరణాత్, ఏవం, శబ్దార్థనిర్వచనపరిజ్ఞానం, నిరుక్తాత్» అను రీతిని, శబ్దముల సాధుత్వాఽసాధుత్వములు వ్యాకరణశాస్త్రరీత్యాను, శబ్దార్థపరిజ్ఞానము వేదరాశికి, నిరుక్తముచే గుర్తింపవలసినదనియు, పెద్దలు వచింతురు.

«తస్మాత్ అర్థపరిజ్ఞానాభినివేశాదిద మేవ, ప్రధానమి త్యుపపన్నం» అను రీతిని, అర్థపరిజ్ఞానాభినివేశాదులకు నిరుక్తమే ముఖ్యాతిముఖ్య మని వెల్లడియగుచున్నది.

«నామాఖ్యాతోపసర్గ నిపాత లక్షణముగను, భావవికారలక్షణముగను, నామాన్యాఖ్యాతజనితసర్వపక్షప్రతిపక్షయుక్తలక్షణములతోను, శాస్త్రారంభప్రయోజనాది అర్థావధారణములతోను, పదవిభాగపరిజ్ఞానప్రతిజ్ఞానబోధావలంబి, ప్రదర్శనములతోను, ఆదిమధ్యాంతములైన ఏకదేవతాత్మకములైన మంత్రార్థముల ప్రత్యేకతతోను, యాజ్ఞికపరిజ్ఞానముద్వారా దేవతాపరిజ్ఞానప్రతిపత్తితోను, అర్థజ్ఞప్రశంసతోను, అనర్థజ్ఞావధారణముతోను, వేదవేదాంగవ్యూహముగ, ప్రకరణత్రయముగ, నైఘంటుకప్రధాన, దేవతాభిధాన, ప్రవిభాగలక్షణములతోను, నిర్వచనలక్షణములతోను, శబ్దవృత్తివిషయోపదేశముతోను, అర్థప్రాధాన్యముగ, లోపోపధా వికార వర్ణలోప విపర్యయోపశత్వముతోను, సామర్థ్యోపప్రదర్శనత్వముగ, అంతస్థానంతర్ధాతు నిమిత్తముగ, సంప్రసార్యాఽసంప్రసార్యోభయ ప్రకృతి ధాతునిర్వచనోపదేశముతోను, నైగమశబ్దార్థప్రసిద్ధితోను, దేశవ్యవస్థాత్మకమైన శబ్దరూపవ్యపదేశముతోను, తద్ధితసమాస నామనిర్వచనాదిలక్షణములతోను, శిష్యలక్షణాదులతోను, అనేకార్థావగతసంస్కారానుక్రమణత్వముతోను, పరోక్షకృతాధ్యాత్మికమంత్రలక్షణములతోను, స్తుత్యాశశ్శపథాభిశాపాభిఖ్యాపరిదేవనా నిందాప్రశంసాది మంత్రాభివ్యక్తిత్వలక్షణములతోను, స్థానత్రయభేదాదులతోను, దేవతానామాకారచింతనములతోను, భక్తితోగూడిన సంస్తవాత్మకములతోను, పృథివ్యంతరిక్షాది స్థానాదులయందలి దేవతానామాదులతోను, విద్యాపారప్రాప్త్యుపాయోపదేశత్వములతోను మంత్రార్థముల నిర్వచనములతోను, దేవతాభిధాననిర్వచనములతోను, కూడినదై నిరుక్తము విరాజిల్లుచుండునని నిరుక్తవేత్తలు నిర్వచించుచుందురు. «వర్ణాగమో వర్ణవిపర్యయశ్చ ఇత్యాదినా నిశ్చయేనోక్తం నిరుక్తం» అని భరతుని నిర్వచనముగా నిరూపింతురు.

హేమచంద్రుడు «ప్రస్తావస్తు ప్రకరణం, నిరుక్తం, పదభంజనం» అని వచించెను. జగదీశులు, నిరుక్తా ప్రకృతి ర్ద్వేధా» యని యనిరి. ఈరీతిని నిరుక్తమును గూర్చి పలువురు నిర్వచించియున్నారు.

ఈనిరుక్తమునకు దేవరాజయజ్వ దుర్గాచార్యాదులు టీకలు వ్రాసియున్నారు. దుర్గాచార్యులు వృత్తియు భాష్యము యీనిరుక్తమునకు వ్రాసిరి. "రాజవాడే"యును సంక్షిప్తమైన వివరణము వ్రాసిరి. పుష్కరణాచార్యుల వారు వ్యాఖ్య రచించిరి. అమరేశ్వరఠాకూరులు వంగభాషలో దీని కొకవివరణము సంపాదించినట్లున్నది. వైజనాథ కాశీనాథ రాజవాడే యనువారు మరాఠీభాషలో నొకవ్యాఖ్యను రచించినట్లున్నది. ఈనిరుక్తమును యాస్కాచార్యులవారు వ్రాసిరి. కనుకనే యాస్కనిరుక్త మనియు నందురు.

సాయణమాధవవిద్యారణ్యులు తమచు వేదభాష్యమున యాస్కనిరుక్తమును ప్రమాణముగ నంగీకరించి, వివరణము చూపుచూపోయిరి. ఈనిరుక్తము ప్రకృతము ఏడుభాగములుగ లభ్య మగుచుండును.

కానీ నిరుక్తము వాడుకనుండి తప్పిపోయినట్లు కానబడుచున్నది. నిరుక్తమును అధ్యయన మొనర్చినవారుగాని, అధ్యయన మొనర్చువారుగాని లేరనిన, నేటికాలమున సాహసము గాదేమో!

స్వధా – స్వం లోకం, యజమానస్య దధా । స్వధా నవిద్యతే ధ్వరః – (హింసః) అధ్వరః

పురోహితః – పురతఏవ అభిమతఫలసంపాదకత్వేన హితకారీ, యద్వా, పురః పూర్వభాగే, ఆహవనీయాది రూపేణ, హితో-నిహిత యితి, పురోహితః

జాతవేదః జాతాని సర్వాణి వేత్తీతి జాతవేదః

శంతమా = పశుపుత్రాది, సమృధ్యా

ఋషిః – అతీంద్రియద్రష్టా

గాతుం=గచ్ఛంతి అనే నేతి గాతుం, (మార్గం) ఈ రీతిని పదములకు నిరుక్తకారులు యాస్కులుతలంచు నిర్వచనములం చూపుచు బోయిరి. మరికొన్ని చోటులలో వాక్యవినియోగాన్ని నిరూపించుచూ యాస్కులు వచింతురు. తార్కాణమగు 'చత్వారిశృంగేతి' మంత్రమునకు 'చత్వారి శృంగేతి వేదావా ఏత ఉక్తా ఇత్యాదినా నిరవోచ త దత్రానుసంధేయం' అని వివరింతురు.

నాకశబ్దనిర్వచనము=కం నామ సుఖం తద్విరుద్ధ మకం నవిద్యతే అకం దుఃఖం తత్సాధనం పాపం చేతి నాకో ద్యులోకః తథా శ్రూయతే నవా అముం లోకం జగ్ముషః కించ నాక మితి -

కక్ష్యా = అశ్వసంబంధినీరజ్జుః (కక్ష్యారజ్జుః అశ్వస్యేతి

కృశనం - ఇతి హిరణ్యాం నామ

సాను - సముచ్ఛ్రితం భగవ తేతి -

సుమ్నం = సుఖం నామ.

కేతుం = గమనాఽగమనాది రూపం కర్మ.

పుత్రః = పురు త్రాయత యితి పుత్రః

మయః - సుఖం నామ.

యశూనాం = సంభోగానాం (యశ ఇతి ప్రజననామ త త్సంబంధినీ)

కర్మణి - యాశూని = భోగాః.

దంపతిం = గార్హపత్యరూపేణ - గృహస్యపాలకం దమ ఇతి - గృహం నామ.

ఈరీతిని కొన్ని అపూర్వార్థబోధకములైన వివరణములు నిరుక్తమును కాంచినచో వేనవేలు దొరుకగలవు.

మరికొన్నిచోట్ల మంత్రార్థమును, మంత్రప్రాముఖ్యమును గూర్చి యీరీతిని వాక్యరూపముగా వివరించుచూబోయిరి.

'బృహస్పతే అతి యదర్యో అర్హాద్ద్యుమ ద్విభాతి క్రతుమజ్జనేషు యద్దీదయ చ్ఛవస ఋతప్రజాత తదస్మాసు ద్రవిణం ధేహి చిత్రం' అను మంత్రము ఋగ్వేదమున గలదు. యజుర్వేదమున గలదు. దీని నీరీతిని వివరించిరి.

బృహస్పతే అతియదర్యో అర్హా దిత్యేతయా పరిదధ్యాత్తేజస్కామో బ్రహ్మవర్చసకామో వాతావాన్యాద్బ్రహ్మవర్చసమర్హాతి ద్యుమదితి, ద్యుమదివ, వై బ్రహ్మవర్చసం, విభాతీతి వీవవై బ్రహ్మవర్చసం భాతి యద్దీదయ చ్ఛవస ఋతప్రజా తేతి దీదాయేవ వై బ్రహ్మవర్చసం తదస్మాసు ద్రవిణం ధేహి చిత్రమతి చిత్రమువవై బ్రహ్మవర్చసం బ్రహ్మవర్చసీ బ్రహ్మయశస్వీభవ తేతి యని మంత్రార్థమును వినియోగమును కలిపి వివరించుచూబోయిరి. యీరీతిని తరచుగా ఋగ్వేదమంత్రములను యాస్కనిరుక్తమున కానవగును.

ఈరీతిని ఇష్టప్రాప్త్యనిష్టపరిహారాత్మక మైన అలౌకముపాయకమైన అనంత వేదరాశిలోని అపూర్వపదపదార్థ విజ్ఞానమును వివరించుటకై యాస్కమహాపురుషుడు నిరుక్తనామకమైన శాస్త్రమును లోకహితార్థమై వివరించియున్నారు.

ఈరీతి నుండగా, "విహితస్యా ననుష్ఠానాత్ నిందితస్యచ సేవనాత్. అనిగ్రహాచ్చేంద్రియాణాం, నరః పతనమృచ్ఛతి" యను రీతిని, నిర్ణయించి, యాచరింపవలసిన వానిని విడచివేసి, స్వేచ్ఛావ్యాపారప్రియులై, అనవసరమైనవానితో వృథాకాలక్షేపము లొనర్చుచు, శిశ్నోదర పరాయణులుగా మార్పుజెందుచు, భారతీయసంస్కృతికే కళంకమును తెచ్చువారుగను, భారతీయసంస్కృతి విస్మరించువారుగను, నగుచుండుట మిక్కిలి శోచనీయమనిన సమ్మతింతురుగాక!

"బ్రాహ్మణేన నిష్కారణో ధర్మో షడంగో వేదో ధ్యేయో జ్ఞేయశ్చ" యనురీతిని, నిష్కారణముగా ననగా ప్రతిఫలరాహిత్యముగా, వేదమును నేర్చి, షడంగములైన శిక్షా, వ్యాకరణ, ఛందో, జ్యోతిష, నిరుక్త, కల్పములు నేర్చి, వేదార్థమును నెరుంగవలసినదని సూత్రకారులు, ఆపస్తంబ, అశ్వలాయన, బోధాయన, హిరణ్యకేశయాదులు వివరించియున్నారు. కానీ కాలక్రమానుసారము షడంగములతో వేదమును నేర్వడము మానివేసిరి. వేదము మాత్రము నేర్చియు నందలి, విషయములను గుర్తించనేరక వేదవిదులు, యాచ్నావృత్తియే పరమావధిగా భావించి, కొందరుండుటయు, శాస్త్రాదులు నేర్చిన పెద్దలు కొందఱు నారీతినే మెలంగుచుండుటయు మిక్కిలి శోచనీయమని యనక తీరదు.

శ్రీ షడ్దర్శనం సోమసుందర శర్మ

వేదాంగములలోని, వ్యాకరణ- జ్యోతిష- కల్పములు మాత్రము కొంతవరకైన ప్రచారాదులలో గలవుగాని, శిక్షా- ఛందో- నిరుక్తములు మాత్రము చాలావరకు ప్రచారాదులకు దూరములగుచున్నవి. శిక్షలు నేర్వనందున, వేదపాఠముల ఉచ్చారణాదులు సక్రముగాలేక కొందఱిలో అపపాఠములు కలుగుచున్నవి.

వేదాంగసంబంధమైన ఛందస్సు ప్రత్యేకమైనది. శ్లోకాలు పద్యాలువలెగాక కొంత ప్రత్యేకించియుండును. పాదమునకు నూటయిరువదివర్ణములవరకు గల ఛందోభేదములతో వేదాంగఛందము ప్రత్యేకించి యుండును. వీని నెల్ల నెఱుంగుటయు నరుదైయున్నది.

ఈరీతిని వేదాంగములను నేర్చి వేదములు వర్ధిల్లించి, భారతీయసంస్కృతిని దేదీప్యమానముగా విరాజిల్లజేసి, వేదభూమిగా భారతదేశమును ప్రకాశింపజేసి, శాంతి సౌఖ్యముల కాలవాల మొనర్తురుగాక!

# అ హిం సా వి జ య ము

శ్రీ శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి



కాలుడు నిస్సహాయపథికాళికి; హృద్విదళద్విలోకనా
భీలు డమాయికప్రజ కపేతదయారసస్వర్గమిక్రియా
లోలుడు ప్రాంతవాసులకు; లుంఠితమస్తకమానవాంగుళీ
మాలుడు కోసలావని నమానుషఘోరజిఘాంసుశీలుడై.

తన కండ్లయెదుట భర్తను వధింపంగ ననాథయా నింతి దీనారవమ్ము
చనుబాలొసంగెడు జనయిత్రిని వధింప ననదయా పసిపాప ఆర్తరవము
యువకుడౌ సుతు నంతమొందింప హృదయంబు పగిలిన ముదితండ్రి దిగులుసెగలు
తన జీవనాధార మని నమ్మికొనియున్న సుతుఁ జంప తల్లి సంక్షుభితరవము

చొరని కర్ణయుగమ్ముతో, కరుగనట్టి
అశ్మకాఠిన్య మాహృదయమ్ముతోడ
రాజభటులకు చిక్కక ప్రజల శాంతి
భద్రతల మంటగలుపుచు వాడు తిరుగు.

నష్టా లెన్నిటినో సహించినను మానప్రాణముల్ దక్కఁ జే
కష్టంబై నిరతవ్యథాకులితులై కాపాడుడి క్రూవ్వరీ
దుష్టుం డంగుళిమాలునుండి యని ఎంతో దీనులై వాని దు
శ్చేష్టల్ జేనికి విన్నవించి ప్రజ రక్షింపగ బ్రార్థించిరన్.

ధరణీమండల నాయకుండు కరుణార్ద్రస్వాంతుడై వెంటనే
పరిమార్పన్ వలె నాదురాత్ము ననుచున్ భావించి సన్నద్ధుడై
తురగారోహకసైన్యముం గొనుచు నత్యుత్సాహసంపూర్ణుడై
యరుదెంచెన్ వనమార్గమందున తదీయాన్వేషణైకాగ్రతన్.

పరమపవిత్రశాక్యనరపాలకులాంబుధి పూర్ణయామినీ
వరుడు సమస్తభూతసమభావవినిర్మలశాంతిమూర్తి బం
ధురకగుణారసార్ద్రితమనోజలజాతుడు బుద్ధదేవుడా
పరిసరసీమలన్ నడిచి వచ్చుచునుండెను శిష్యకోటితో.

"ఓ సన్న్యాసులి కెందు బోయెద" రటం చుత్తీక్ష్ణనిస్త్రింశుడై
డాసెన్ దుష్టుడు; రూక్షవీక్షణపుమంటల్ చూచి ప్రాణాలపై
నాసల్ వీడిన శిష్యులెల్లరును శాక్యర్షిన్ సమీపించి "స్వా
మీ! సద్యోమరణంబు తప్ప" దని కపింపంగ దైన్యమ్మునన్.

తనమందహాసామృతంపు వర్షమ్మున నతని కోపాగ్ని చల్లారిపోవ
తన ప్రసన్నేక్షణాతిరుణారుణద్యుతి నతని క్రౌర్యతమస్సు లంతమొంద
తన అహింసా భూతదయల పాటవమున నతని భుజాశక్తి యంతరింప
తన హృదబ్జవినిర్గతప్రేమమకరంద మతని పాపమును క్షాళిత మొనర్ప

ప్రబలతమమైన యొక్క దివ్యప్రభావ
మతని మనసున జ్ఞానోదయ మ్మొసంగ
కేల దాల్చిన ఖడ్గంబు నేలరాల్చి
ముగ్ధుడై శాక్యమునివర్యు మోముజూచి.

"స్వామీ! మీ రెవరో మహాత్ములరు నాస్వాంతమ్మునన్ దివ్యమా
ప్రేమజ్యోతి వెలుంగజేసితిరి; ప్రాప్తించెన్ నవజ్ఞానశో
భామాధుర్యము; త్వత్పవిత్రచరణాబ్జాతద్వయీధ్యానదీ
క్షామార్గమ్ముపదేశమిచ్చి సుకృతుంగా నన్ను దీవింపరే!

నోట వచింపరానివి పనుల్ దయమాలి యొనర్చినాడ నీ
యాటవికప్రదేశముల నంగుళిమాలుని పేరు విన్నచో
గాటపు భీతితో తనువు కంపముజెందుచునుండ కూటికిన్
నీటికి నోచుకోక మరణించుచు నుందురు సర్వమానవుల్.

చంపిన యెల్లమానవుల సంఖ్యకు గుర్తుగ వారి యంగుళుల్
నింపి తయారుచేసినది నే ధరియించినకంఠమాల; లె
క్కింపగ లేని హత్య లొనరించిన మోహపిశాచినుండి ర
క్షింపుడు; నన్ను శిష్యునిగ జేకొని ముక్తి ననుగ్రహింపుడీ!''

చలనం బించుక లేక కాళ్ళబడి పశ్చాత్తాపబాష్పాంబుధా
రలు మున్నీరుగ నేడ్చు వానిశిరమున్ ఘ్రాణించి కారుణ్యామం
జులచేతస్కుఁడు బాలభానునిభతేజోరాశి శాక్యర్షి ని
ర్మలభావం బానగూర్చి నెమ్మదిగ చేరందీసి పల్కెన్ దయన్.

''చేసినపాపముల్ దలచి చింతిలు నీ కిక భీతి యేల? నీ
కోసమె యీప్రదేశమునకుం జనుదెంచితి; జ్ఞానసంపదన్
భాసిలునట్లు ధర్మపథవర్తనుగా నొనరించినాడ; దీ
క్షాసముపేతబుద్ధి నివె కావులు దాల్పుము, వెంట రమ్మికన్.''

అంగుళిమాలు దోడ్కొనుచు నయ్యటవీస్థలి నేగుచుండ ద్రో
వం గనుపించె రాజు భటవర్గముతో ప్రబలాయుధాళితో;
సంగతియంతయున్ విని ప్రసన్నతరాననవారిజాతుడై
మంగళమూర్తి శాక్యకులమండను డిట్లు వచించె రాజుతో.

''అంతయు వింతగొల్పెడు; నిరాయుధుడొ నొకనిన్ వధింపగా
నింతటి సైన్యముం గొనుచు నిట్లరుదెంచుట చూడ ధారుణీ
కాంత! మదీయశిష్యు డయి క్రౌర్యముబాసి అహింసయన్ వ్రతం
బెంతయు దీక్షతో గొనిన యీతడె ఆత డటం చెఱుంగుమా''

# గీర్వాణవాణీ గాంభీర్యము

శ్రీ లంకా సీతారామ శాస్త్రి

శ్లో॥ శ్రుత్యర్థప్రతిపాదనీం స్మృతిపథాయాంతీం సుపర్వప్రియాం
తర్క వ్యాకరణాదిశాస్త్రకలితాం విజ్ఞానదాత్రీం శుభామ్
మోక్షాఖ్యోత్తమసాధనీమని నరం సంస్థాపయంతీ మహామ్
గైర్వాణీ మభివాదయే సులలితప్రజ్ఞావబోధాకృతిమ్॥

భారతదేశభాషలలో గీర్వాణభాష పురాతనమైనదే కాక సులభమును, సుప్రాశస్త్య మనునది తద్‌జ్ఞుల కెఱుంగరానిది కాదు. షట్ప్రమాణములలో ముఖ్యమగు నాగమప్రమాణము నజ్ఞులుగూడ విశ్వసింతురు. అట్టి యాప్తవాక్యరూపమగు నాగమప్రమాకలితు లీదైవీవాక్కునకు పూర్వోక్తాంశత్రయోపేతత్వము నంగీకరింపక మానరు. కాగా సంస్కృతభాష సులభము, ప్రాశస్త్యము, ననాదియు ననుటతోబాటు నైహికాముష్మికసాధన మనునది మరువరానిది.

ఆర్యావర్తము పుణ్యభూమియనుటకు హేతువులు పారలౌకిక సౌఖ్యవిచారణచేసిన పుణ్యమూర్తు లిందుద్భవించుటొకటి, పుణ్యపాపవిచారణచే నాధ్యాత్మికవిద్యను సాధించి జన్మకు పూర్వమును పరమునుగూర్చి విలువగట్టగల్పించిన యీ దేవభాష యొకటి. ఈ భాష నాధారముగగొనియే మహర్షులు నేటి నిత్యజీవితాచారముల సూచించిరి. తదార్షవాక్పరిపూతమును, అపౌరుషేయశ్రుతిప్రతిపాదనా పరిశుద్ధము నగు నీ యామరభాష పరమపవిత్ర మనుటలో నెవ్వరును సంశయింపరు.

ఇదికాక లిపులన్నిటి కనాదిగనున్న లిపి బ్రాహ్మీలిపియనియు, దాని నార్యులభ్యసించి యందు గీర్వాణభాషను వెలయించిరనియు భాషాచరిత్రకారులు పలుతావుల వక్కాణించిరి. అందుచే గీర్వాణభాష ఐహికాముష్మికసంపదను గావించునదనియు, సౌలభ్యమును, ప్రాశస్త్యము ననాదియు నైనదనుట కృతబుద్ధు లంగీకరించినను కృతకబుద్ధులగువారికిని దీని యాథార్థ్యమును గోచరింపఁజేయుట ప్రస్తుత చర్చనీయాంశము.

మన ప్రాచీనపండితు లేకైకశూరులై - ఏకద్విత్రిచతుర్వేదములను, షడాగమముల నేకసంథగా గ్రహించిరి. తదనూచానాచారముననే శిష్యులకును నేర్పుచుండిరి. అందుచే నది గురుకులవాసలభ్యముగా నుండెను; గాని సార్వజనీనత నందలేదు. ముఖ్యముగ నిందులకు రాజావలంబన మవసరము. ఏనాడు రాజులు (పాలకులు) వాఙ్మయముపట్ల నాదరభావముఁ జూపుదురో యానాడా సారస్వతము సర్వతోముఖముగ విశ్వవ్యాప్తమగును. ఇందులకు నిదర్శనము భోజరాజుపాలనమునాడు సంస్కృతము రానివాడు లేడని చరిత్రయే బోధించుచున్నదిగదా? వేయేల? మొన్నమొన్నటివఱకు అనఁగా క్రీ. శ. 14వ శతాబ్దమువఱకు సంస్కృతపండితుడనిన నుండెడి మర్యాద తెనుఁగుభాషా పండితునకు లేనేలేదు. తరువాత శ్రీకృష్ణదేవరాయల పోషణమర్యాదలతో నాంధ్రము మహోన్నత్య మందినది. రానురాను ప్రాచ్యభాషావల్లిని నిర్మూలించి, తెనుఁగు నడుగంటించి - తత్స్థానమున స్వీయసారస్వత మతబీజముల నాటఁదలచిన యాంగ్లప్రభుత - యాంగ్లవిద్యాభ్యాసకుల కార్థికస్తోమమును గల్పించి మెల్లగ చల్లగ సంస్కృతాంధ్ర

ముల రెండింటికి స్వస్తిఁ జెప్పించినది. నేటి జాతీయతలో నిచ్చకమునకై మరల ప్రాచ్యభాషల నుద్ధరింతుమనుచు, శాస్త్రవిద్యాధురంధరుల మనుచు, పెద్దపెద్దలు వేదికలపై భగవద్గీతార్థముల నుపనిషదర్థములఁ దోచినరీతి నేకరువుఁ బెట్టుచు సంస్కృతభాషయందు ప్రీతిగలవారువలె నుపన్యాసము లిచ్చుచు నంతర్ద్రోహబుద్ధితో తాము నేర్చిన యాంగ్లభాషను వీడిన స్వాధికారము తొలఁగునని యూహించి హిందీని రాజకీయభాషగా నుంచిన ప్రస్తుత ప్రభుత్వమున గౌరవమును సంపాదించవచ్చు ననుకారణముచే స్వార్థసహితులైన నేటి సంస్కృతభాషోద్ధారకులు సర్వార్థసాధకమగు నామరభాషకు ద్రోహ మొనర్చుబుద్ధితో నిందుఁ గొన్నిమార్పులను తేవలయునని సూచించుచుండిరి.

ప్రధానముగ 'సంస్కృతభాషను సార్వజనీన మొనర్చుట కందుఁ గొన్నిమార్పు లుండవలయును. వ్యాకరణమును సులభముఁ జేయవలయు' ననునవి కేవల ద్రోహవాక్యములు. ఏల ననఁ? ఇదివరలో సార్వజనీనమైన యీ భాష - ఆంధ్రాంగ్లభాషలతో నుపహతమైనను, ఈనాటికిని మనప్రాచీన విద్వాంసులలో దాని స్వస్వరూపమును గోల్పోకుండ వచ్చుచున్నది. ఇప్పటి యీ హిందీభాషను రాజభాష నొనర్పఁదలచుకొని సంస్కృతభాషకు ప్రాధాన్య మొసఁగవలయునను నుపన్యాసము లిచ్చు పెద్దలు గీర్వాణవాణిలో గల క్రమమును సంకోచపఱపించి సర్వాత్మనా విరూప మొనరింపించి - సార్వజనీన మగునని వ్యామోహపఱచుట మఱింత సంస్కృతభాషకు ద్రోహ మొనర్చుటే యగును. మహర్షులగు ప్రాచీనులు సర్వ సౌలభ్యమునకై యాదికాలముననే వైదికవాఙ్మయమును సంస్కరించి దానికి సంస్కృతమను పేరుఁ బెట్టియుండ నేటిసంస్కర్త లిందు మార్పుఁ దేవలయు ననుటలో గల యుద్దేశ్యము తద్ద్రోహమునకనుట పండితలోక మెఱుఁగకపోదు.

సంస్కృతభాష నతీంద్రియద్రష్టలగు మహర్షు లిదివఱకే సులభముగఁ జేసియుండఁగా నేఁ డంతకన్న గొప్పమేధావు లుండి దానిని మఱింత చౌకపారు చేసి లోకమున కందింతు రనునది భ్రమాజన్యజ్ఞాన మనక తప్పదు. ఒకవేళ నెవరేని అర్థాశచే నట్లు చేయఁబూను పండితమ్మన్యు లున్నను వారీవిధముగఁ జూపఁబోవు నంశముల సాధింపనివారే యగుదురు. ఏకార్యము నేఫలమునకై యొనర్చుచుంటిమో తత్ఫలలాభము లేకుండ నాకార్యమును సాధించుట మరుమరీచికోదకాన్వేషణతుల్యమే కాక శశవిషాణసాధ్యమువంటిదగును.

కాగా సంస్కృతభాష కేవలము మాట్లాడుటకుమాత్రమే సాధించుట గాదనియు నందిగనిలో మహనీయులు దాచియుంచిన యనర్ఘరత్నములఁ జేకొని విజ్ఞానధనులమై యైహికవైభవముతో తులఁదూగి భారతావనికి నైజపవిత్రతను చేకూర్చుకొనవలయు ననికాని, కేవలాభిప్రాయనివేదమునకు గీర్వాణమైనను, మఱొకటైనను నొక్కటియేగద?

మన ప్రాచీనులు సారస్వతమును ప్రభుసుహృత్సమ్మితములగువానికన్న కాంతాసమ్మితముల మూడవతరగతికిఁ జెందించినను వానియందు వేదపురాణాగమములనే యుపదేశించిరి. కాబట్టి ప్రియాసద్వృత్తములగు కావ్యములెంత సులభమైనవైనను తద్గాంభీర్యము పునస్సంస్కారానర్హమైనదే కాని పదవినిమయసహిష్ణుతగలదిమాత్రము కాదు. అందుచేతనే దాని నామరభాష యనిరి. క్రీ. శ. 14వ శతాబ్దములో నప్పయదీక్షితులవారీయామరీభాషాప్రాశస్త్యమును నక్కాణించుచు,

చామరీ వామరీ భాషా క్వచిదస్తి వనాంతరే।
ఇయం తు పామరీభాషా సూకరీవ గృహే గృహే॥

అని సంస్కృతభాషను చమరీమృగముసమానముగ బోల్చుటలోని గాంభీర్యమును పాఠకులకు ప్రదర్శించెను.

ఇఁక మన సంస్కృతకావ్యములలో గల శ్లోకముల నన్వయించెడి తెలివి కావలయునన్న నేటి యాంగ్లభాష కొనరించు సేవలో నూరవవంతొనరించినఁ జాలును. అది ముఖ్యము గాదు. అందలి యపూర్వార్థ మెఱుంగుట కష్టాతికష్టము. అందులకుగా సంస్కృతముఁ బ్రాచీనపద్ధతి నభ్యసించుట మంచిది; కాని దాని మార్పుఁ జేయవలయు ననుటయు, దాన సౌలభ్య మగుననుటయు తుషావహననముగ నిష్ఫల మగును.

మన గీర్వాణకావ్యములను పఠించునపుడు అందు వేదములలోని యర్థములు, ధర్మశాస్త్రములు, తర్కవ్యాకరణాది సర్వవిద్యలసార మున్నట్లు పరిశీలించి తెలిసికొనినే దాని యర్థము స్పష్టమగును. దానిచే శాస్త్రవిజ్ఞానమును

చిత్తమున కానందమును గల్గును. కాని కేవల ప్రతిపదార్థ మాత్రమునకు భాషనే మార్పుఁజేయఁదలచు టనవసరము. కేవలార్థమును దెలిసికొనవలయు ననిన ప్రతిపదార్థతాత్పర్యము లనేకవిధముల గలవు. కాని విశేషార్థస్ఫురణ గలుగుటను బట్టియే గీర్వాణభాష గొప్పఁదనము నొంది స్పృహణీయముగ నున్నది. అట్లు లేకున్న నాసంస్కృత మిప్పుడు ప్రపంచములో నున్న భాషేతర తుల్యమై పోయెడిదే! కావున మన సంస్కృతభాషా కావ్యములను పరిశీలించిన వేదవేదాంగశోభితమై యున్నవనియు వానిని సాంప్రదాయసిద్ధముగ నా యా శాస్త్రములసాయముతో నర్థావగాహన మొనరించుకొనుట యుక్తమని యీదిగువ జూపఁబోవువానివలన గుర్తింతురుగాక! దిఙ్మాత్రప్రదర్శనము.

1. వేదార్థ ప్రతిపాదనమునకు :

కి మసుభి ర్గ్లపితై ర్జడ! మన్యసే
మయి నిమజ్జతు భీమసుతామనః ।
మమ కిల శ్రుతిమాహ తదర్థికాం
నలముఖేందుపరాం విబుధ స్స్మరః॥

ఇది శ్రీహర్ష విరచిత 'నైషధ' కావ్యములోనిది. సందర్భము: దమయంతి - నల నృపగతవిరహావేదనఁ జంద్రోపాలంభనము చేయుట.

తా. ఓయీ! చంద్రుఁడా! ఈదమయంతిప్రాణములను దీసిన నాలోఁ జేరునని నీవు తలంచితివేమో? నా కా శ్రుతితాత్పర్యము నొక విబుధుఁడు నలముఖచంద్రపరముగా బోధించెనని సామాన్యార్థస్ఫురణము. ఇచటఁ గవి యిందు శ్రుత్యర్థము నెట్లు విశేషముగా బోధించెనో చూడుడు.

'తదంతర ప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః ప్రశ్న నిరూపణాభ్యాం' అను వ్యాససూత్రోక్తభావము ననుసరించి ఈ ప్రపంచములో జీవుడు దేహాంతరమును ధరింపఁబోవునపుడు (మృతుడైనవాఁ డింకొక దేహమును కర్మానుగతినొందనున్నప్పుడు) నాయా యింద్రియార్థముల నాయా చోటుల నుంచునని యీదిగువఁ జూపఁబోవు శ్రుత్యర్థము.

'యత్రాస్య పురుషస్య మృత స్యాగ్నిం వాగ ప్యేతి, వాతం ప్రాణ, శ్చక్షు రాదిత్యం. మన శ్చంద్రమసం, దిశ

అని

ఇట దమయంతీకృత చంద్రోపాలంభన విషయమైన ప్రకృతాంశమున-ఓ చంద్రుడా! లోకోత్తరసౌందర్యవతి నని, నిన్ను వరింపక నేను నలరాజును వరించితినని నీ కీర్ష్య కావలయును; అందుచే నన్ను బాధించి ప్రాణములను దీసిన నా మనస్సు నీయందు లగ్నమగునను నీపై ప్రత్యర్థమును నమ్మి యిట్లు బాధించితివి కాబోలును; నా కా వేదార్థమునుగూర్చి సంశయము గలిగి శాస్త్రపండితుడగు మన్మథుఁడను వాని నడుగగాఁ నాతఁ 'డో కాంతా! నీ విందు విషయమున దిగులొందవలదు; నీ వబలవగుట నీ హాగ్నికిఁ దాళక మృతినొందినను నీ మనస్సుమాత్రము నలముఖచంద్రునిలో లగ్నమగునుగాని యీ నిన్ను బాధించు ప్రసిద్ధ చంద్రునిలో చేరదు' అని చెప్పినాడు. కాబట్టి 'నన్ను బాధించినను, నేను చచ్చినను నలునిపోరాజును జెందునుగాని నీయందు లగ్నమనస్కురాలను గాను' అని చమత్కారముగ దూషించెను.

ఇందా శ్రుత్యర్థము బాగుగ గమనించినగాని శ్లోకతాత్పర్యము దెలిసినట్లు కేవలార్థమాత్రజ్ఞానమున విస్పష్టముకాదు. కాగా సంస్కృతభాషలో ప్రత్యక్షరవిన్యాసమునను గంభీరమగు భావ మిమిడియేయుండును; ఇట్లు శ్రుత్యర్థప్రతిపాదకములగు తావు లింకేని యెన్నియో గలవు; వానిని దిఙ్మాత్రముగనే జూపితిని.

2 (స్మృతి) ధర్మశాస్త్ర ప్రతిపాదనము

ధర్మలోపభయా ద్రాజ్ఞీ మృతుస్నాతా మనుస్మరన్
ప్రదక్షిణ క్రియార్హాయాం తస్యాం త్వం సాధు నాచరః॥

ఇది మహాకవి కాళిదాసకృత రఘువంశములోనిది. సందర్భము :- దిలీపునకు చాలకాలమువఱకు సంతతి లేని కారణమున గురువగు వసిష్ఠులవారిని తత్కారణ మడుగబోనాయన యోగదృష్టి నంతయు నెఱింగి తత్కారణమును దిలీపున కెఱిఁగించుట.

తా. రాజా! నీవు దేవలోకమునుండు యొకప్పు డయోధ్యకు వచ్చుచుండఁ ద్రోవ దేవగవిని నిరసించిపోతివి. ఆదేమన? నీభార్య ఋతుస్నాతయైనది కావునఁ దదభిగమనము నాకాంక్షించి ధర్మచ్యుతి గలుగకుంటకై యింటికరుగుచు నీదేవసురభిని నమస్కరించిపోవయితివి అని సామా

న్యముగ దీని భావము. ఇఁక నిందలి ధర్మశాస్త్రీయవాదమును దిలకించుడు!

సాధారణముగ ధర్మసూత్రములలో - ఋతౌ భార్యా ముపేయా దేవ - అని సూత్రించి మహర్షులు ఋతా వేవ; భార్యా మేవ; ఉపేయా దేవ. అను నవధారణార్థైకారము నంతట నన్వయించిరి. కాగా - ఋతుదినములలోనే - భార్యతోనే - అనుగమించవలసినదే-అని యభిప్రాయము గల్గును ఆ సూత్రోక్తధర్మము నతిక్రమింపరాదు. అందుల కుపష్టంభకముగ -

ఋతుస్నాతాం తు యో భార్యాం స్వస్థ స్సన్నాధిగచ్ఛతి।
బాలగోఘ్నాపరాధేన యుజ్యతే నాత్ర సంశయః॥

అని మనుస్మృతి. అందుచే ఓరాజా! నీవు ఋతుస్నాత యను ధర్మపత్న్యభిగమనచ్యుతివలన బాలగోఘ్నాపరాధ భీతుడవై త్వరితముగ నింటి కఱిగితివే కాని

మృదంగం దైవతం విప్రం ఘృత మ్మధు చతుష్పథమ్ ।
ప్రదక్షిణాని కుర్వీత ప్రఖ్యాతాం శ్చ వనస్పతీన్॥

అను నీతిశాస్త్రమును గమనింపకపోతివి. అని తాత్పర్య విశేషము. ఇట్టిధర్మశాస్త్రజ్ఞానములేకపోయిన సామాన్య గ్రంథార్థమే యవగతము కానేరదు. చూడుడు; రామాయణములో రుమను చెఱబట్టినందున వాలి వధ్యుడైనపుడు దుందుభితో కొండగుహయందు వాలి యుద్ధమొనర్చుసమయమునఁ దారను జేరబట్టిన సుగ్రీవు డేల యవధ్యు డాశ్రితుడు నయ్యెనోకద? అనవచ్చును. కాని యోనిజాతయందు (రుమయందు) వ్యభిచరించిన వాలి దోషగ్రస్తుడనియు, వ్యభిచారదోషరహితమగు నయోనిజతారతో వ్యభిచరించిన సుగ్రీవు డదోషియనియు ధర్మశాస్త్రజ్ఞు లెఱుగనిది కాదు; ఇట్లే దశరథుఁడు తనపితృమేధమును క్షత్రకులానుచితరీతి ద్వాదశదినపరిమితగఁ గావించె ననుట వాల్మీకిరచనకే యపకర్ష నాపాదింపఁ జేయు ననుచుందురు; కాని తదర్థవేత్తలు-అశ్వమేధయాగకర్తలగు క్షత్రియులు పంచదశదినావధికమగు పైతృకమును ద్వాదశదినావధికముగఁ జేయుట దూష్యముగాదని మన్వాదిస్మృతిద్రష్ట లెఱుంగకపోలేరు. అందుచే ప్రకృతశ్లోకార్థము స్మృతిజ్ఞానజ్ఞేయమగుట సామాన్యముగ సంస్కృతభాషాపాండిత్యముచేఁ దదర్థ మెఱుకపడదు.

## 3. వ్యాకరణశాస్త్రము

ప్రకృష్టకర్త్రభిప్రాయక్రియా ఫలవతో విధీన్।
ప్రయుంజానా స్త్వయా వీరపరిపాల్యామహే వయమ్॥

ఇది మురారిభట్టకృత—అనర్ఘరాఘవనాటకములోనిది. సందర్భము: తాటకను వధించి లజ్జించుచున్న శ్రీరాముని చేరదీసి విశ్వామిత్రుడోదార్చుట.

తా. ఓయీ వీరుడా! ఆత్మఫలకారము లైనవిధుల నాచరించు మేము నిజముగ నేడు నీచే పరిపాలింపఁబడుచున్నాము. అని సామాన్య భావము. కాని యిందు 'స్వరితఞితః కర్త్రభిప్రాయే క్రియా ఫలే' అను పాణిన్యాచార్యులవారు క్రియాఫలమాత్మగామియైన నాత్మనేపదమును సూత్రార్థమును యథాతథముగ ప్రకృష్టకర్త్రభిప్రాయక్రియాఫల మనగా క్రతుఫలము స్వాత్మోత్తారకము లనుటకుమారుగ వ్యాకరణపరిభాషను బోధించిన నీశ్లోకము వ్యాకరణేతరశాస్త్రజ్ఞులకుమాత్ర మెట్లుసుబోధకమగును? ఇట్లే యీకవి యనర్ఘరాఘవమునఁ బలుతావుల సూత్రములను సూత్రములనే వాడెను. జయతి జనకర్తుః ప్రకృతితా అని విశ్వామిత్రాగమసమయమున శ్రీరామదర్శనము—సంతోషదాయకమైనదనుచోట శ్లోకములో సూత్రము నిమిడ్చెను. కాబట్టి యిట్టి శ్లోకార్థములన్నియు నేడు మార్పుఁ జేయఁబోవు సులభసంస్కృతభాషాగ్రాహ్యమగు ననుట యేటిమాట? అది యట్లు సులభబోధకము గావీలులేదు.

## 4. తర్కశాస్త్రము

అగ్రజం వా దశగ్రీవ మనుజం వా విభీషణమ్ ।
అన్వయవ్యతిరేకాభ్యాం వీరః క మభిషేక్ష్యతి॥

ఇదియు ననర్ఘరాఘవములోనిదే! సందర్భము: రామరావణసంగ్రామసమయమున రావణుడు శ్రీరామబాణాహతిఁ దాళలేక కుంభకర్ణుని శ్రీరామునిపై యుద్ధమునకంపగా వీరుడు కుంభకర్ణుని జూచి రాక్షససేనానియగు మాల్యవంతు డనుచరులతో—'ఓయీ! మన ఈ కుంభకర్ణవీరు డీనాటియుద్ధములో రావణునిగాని, విభీషణునిగాని లంకకు రాజును జేయగలడు. అన్వయవ్యతిరేకములచే నీవీరు డెవని నభిషేకించునోగదా? యని సామాన్య భావము.

ఇందుకు న్యాయశాస్త్రాభిజ్ఞులగువారు. అన్వయవ్యతిరేకవ్యాప్తుల వివరించి అనగా యత్సత్వే యత్సత్వమ్, యదభావే యదభావః. వీరుడగు నీ కుంభకర్ణుడు బ్రతికియుండెనా రావణుడు బ్రతికియుండును: లంకా రాజ్యాధినేత యగును; ఈ వీర కుంభకర్ణుడు లేడయ్యె నేని (మరణించెనేని) రావణుడును చచ్చును. అపుడు శ్రీరాముని శరణుజొచ్చిన విభీషణుడే లంకారాజగును. అన్వయవ్యాప్త్యాశ్రయణమున రావణుని జయమును, వ్యతిరేకవ్యాప్త్యాశ్రయణమున శ్రీరామవిజయము నాశంకించిరి. అని ఇట సంపూర్ణాభిప్రాయము. కాబట్టి శాస్త్రపరిచయ విశిష్టసాహిత్యజ్ఞానములేని కేవలసంస్కృత భాషాజ్ఞానుల కిది యజ్ఞాత మనక తప్పదు. ఇట్లే విశాఖదత్త కృతమగు ముద్రారాక్షసనాటకమున రాక్షసవచనములలో సాధ్యే నిశ్చిత మన్వయేన - అను శ్లోకమున, సపక్షధర్మ, సాధ్య, వ్యాప్తి, హేత్వాది జ్ఞానజ్ఞేయముగనే న్యాయశాస్త్రబద్ధముగ నుండెను. ఇట్లనేక గ్రంథములు ననేకములు గలవు; విస్తరభీతిని రూపింపబడవయ్యెను.

## 5. పూర్వమీమాంసాశాస్త్రము

యద్య త్ప్రతిష్ఠాఫలదర్శనేన
విధిర్యతీనాం వర ! రాత్రి సత్రే ।
ప్రకల్ప్యతే త ద్వదిహాపి ముక్తి
ఫలశ్రుతేః కల్పయితుం నయుక్తః.

ఇది శ్రీ మాధవాచార్యకృత శంకరవిజయములోనిది. సందర్భము : శంకరమండనమిశ్ర సంవాదము :

తా. ఓ యతీశ్వరా ! 'తత్త్వమసి' అను వాక్యసాధ్యమైన జీవేశ్వరైక్యము సత్రయాగవిధికి రాత్రివిధిద్వారా ప్రతిష్ఠాఫలకల్పన మెట్టులో అట్లే యిచ్చటను జ్ఞానవిధిద్వారా మోక్షఫలశ్రుతికల్పనము చేయుట యుక్తము అని సామాన్య తాత్పర్యము.

ఇక ఓయీ ! కర్మశాస్త్రానభిజ్ఞుడవైన యతీశ్వరా! రాత్రి సత్రయాగవిధిలో ప్రతితిష్ఠంతి హ వా ఏతా రాత్రీరుపయంతి అనుచోట 'ఉపయంతి' అను వర్తమానార్థక ధాతువు సిద్ధవస్తు ప్రతిపాదకమై విధిబోధకత్వస్థితి నొందనిదగుటచే వాక్యవిపరిణామముచేసి యే ప్రతితిష్ఠాసంతి తే ఏతా రాత్రీరుపేయుః అని లిఙర్థవిధాయక వాక్యవిపరిణామమెట్లు జరిగెనో అట్లే ప్రకృతమునగూడ తద్వ. పత్యాయప్రత్యాయక విధియైన ఆత్మా వా అరే! ద్రష్టవ్య శ్శ్రోతవ్యో మంత్రవ్యో నిదిధ్యాసితవ్యః అను మోక్షఫలవిధికి బ్రహ్మ వేదబ్రహ్మైవ భవతి; తత్త్వ మసి అను వాక్యములను బ్రహ్మ బుభూషు ర్బ్రహ్మైవ భవే దిత్యాదికముగ విపరిణామ మొనర్చి మోక్షఫలవిధాయకవిధిత్వకల్పనద్వారా అద్వైతతత్త్వ ప్రతిపాదకవాక్యమునకుగూడ విధిత్వమును కల్పించెను. ఇట్లే 'స్యాద్వా విరోధ స్తదపి ప్రవృత్తం ప్రత్యక్ష మగ్రే బలమేవ బాధ్యం । ప్రాబల్యవత్వా చ్చరమప్రవృత్త్యా శ్రుత్యా హ్యపచ్ఛేదనయో క్తరీత్యా'॥ ఇందపచ్ఛేదనన్యాయము, జ్యేష్ఠప్రమాప్రకోపాదులను పూర్వమీమాంసాపారిభాషికములను తచ్ఛాస్త్రసాహచర్యముతో సాంప్రదాయసిద్ధముగ దెలుసుకొనవలసినదేకాని సామాన్య సంస్కృత భాషామాత్రాభ్యాసకుల కిం దెట్లర్థస్ఫురణగల్గును? కాబట్టి శాస్త్రసాహిత్యయుతమైన ఈకావ్యార్థావగతికి ప్రాచీన పద్ధతిగనే గీర్వాణభాష నేర్వదగినది. కాని ప్రస్తుత నాగరకతాభ్యాస లభ్యమగునది కాదు.

## 6. ఉత్తరమీమాంసా శాస్త్రము

జన్మాద్యస్య యతోఽన్వయాదితరత
శ్చార్థే ష్వభిజ్ఞ స్స్వరాట్
తేనే బ్రహ్మహృదాయ ఆదికవయే
ముహ్యంతి య త్సూరయః ।
తేజోవారిమృదాం యదా
వినిమయో యత్ర త్రిసర్గో మృషా
ధామ్నా స్వేన సదా నిరస్తకుహకం
సత్యం పరం ధీ మహి॥

ఇది వ్యాసమహర్షిప్రణీత శ్రీమద్భాగవత గ్రంథములోనిది. సందర్భము : ప్రథమశ్లోకము.

తా. ఈ ప్రపంచమునకు ఏకారణమున నన్వయవ్యతిరేకములచే జన్మస్థితిలయాదులో ఇంద్రియార్థములందు జ్ఞానముగలవా డెవడో స్వయంప్రకాశకుడునై యెవడు ప్రజాపతికి వేదోపదేశము చేసెనో; ఎవనినిగూర్చి పండితు

లున విభ్రాంతిజెందిరో; తేజస్సు, ఉదకము, పృథివి యను వానిలో పరస్పరవినిమయ మెట్లుండునో; ఏదానియందు త్రైగుణ్యవిషయసృష్టి సత్యమో అట్టి స్వీయతేజస్సుచే నేనాడును వంచనకు లోబడక మాయను ధిక్కరించిన సత్యరూప మగు పరమాత్మను ధ్యానముచేయుచున్నా నని సామాన్య భావము.

ఇంక నీశ్లోకమున త్రికాలాబాధ్యమైన పరమాత్మను ధ్యానము చేయుచున్నాను అని యన్వయమును వచించి ఆపరమాత్మ యెట్టివా డంగా? ఎవ డున్నచో నీజగత్తునకు జన్మస్థితిలయ మగుచుండునో- అను నన్వయవ్యాప్తిచేతను, ఎవడు లేకున్న నీజగత్తు లేదో యను నన్వయేతర (వ్యతిరేక) వ్యాప్తిచేతను వా డున్నవాడనియు. లేదా- కార్యకారణాత్మకఘటపటాదివిషయముల నన్వయవ్యతిరేకములచే జగజ్జన్మాదికారణు డనియు భావము. అందుచే ప్రధాన, పరమాణువాదప్రసక్తి గలుగుచుండగా దన్నిరసనమునకై అభిజ్ఞుడు (సర్వజ్ఞుడు) అనగా హిరణ్యగర్భుడనుశంకచే స్వరాట్ = స్వయంప్రకాశమానమనియు, స్వయంప్రకాశము మాయోపహితచైతన్య మగు ననభీతిచే దద్వ్యావృత్తికై యాదిసృష్టికర్తయగు హిరణ్యగర్భునకు హృదయములోన సృజనశక్త్యుచితవేద ముపదేశించె ననియు, అందుచే సావయవత్వనిరాసకై పండితులకుగూడ గ్రహింపరాని మోహమును బుట్టించువా డనియు, ఏపరమాత్మస్వరూపమునందు తేజోవారివృత్తులనువలె విపరీతభావ ముండునో అట్టి త్రైగుణ్యసృష్టికల్పన కాధారభూతము సత్యమనియు, అట్టి స్వీయజ్ఞానముచే మాయను తొలగించువా డెవ్వడో? అను నీతటస్థలక్షణలక్షితుండును, సచ్చిదానందరూపము నగు స్వరూపలక్షణుని ధ్యానముం జేయుచున్నా మని. (1) యతో వాచో నివర్తంతే, అప్రాప్య మనసా సహ, (2) వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం. ఇత్యాది శ్రుతుల తోడను, జన్మాద్యస్య యతః, అన్వయవ్యతిరేకాత్, ఈక్షతే ర్నాశబ్దమ్, ఇత్యాది సూత్రార్థములచేత నవగతము కాదగినదే కాని సామాన్యబోధకము కాదుగద? చూడుడు. కాళిదాసకృత కుమారసంభవములో- బ్రహ్మను దేవతలు స్తుతించునపుడు

జగద్యోని రయోని స్త్వం జగదీశో నిరీశ్వరః।
జగదాది రనాది స్త్వం జగదంతో నిరంతకః॥

"ఓయీ! పరమాత్మ! నీవు జగత్కారణుడవు; పుట్టుక లేనివాడవు, జగముల శాసించువాడవు, శాసన మొరుల వలన లేనివాడవు, లోకమున కాదిపురుషుడవు, అనాదివి; జగత్తున కంతకుడవు, అంతములేనివాడ" వని సామాన్యాభిప్రాయము. కాని సకలవేదాంతసారభూతమగు నీశ్లోకమున పంచదశ్యాదిగ్రంథోద్ఘాటిత మగు నాధ్యాత్మికతత్త్వమంతయు నిరూపితమయ్యెను. అట్టితత్త్వశాస్త్రము దెలియనిచో నీపైశ్లోకములోని యభిప్రాయము సామాన్యముగనే యుండునుగాని కార్యకారణభావముతోగూడి సనందర్భముగ నుండదు గద?

## 7. జ్యోతిశ్శాస్త్రము

లగ్నే శుభే శుభయుతే సుషువే కుమారం
శ్రీపార్వతీవ సుఖినీ శుభవీక్షితే చ।
జాయా సతీ శివగురో ర్నిజతుంగసంస్థే
సూర్యే కుజే రవిసుతే చ గురౌ చ కేంద్రే॥

(శంకరవిజయము)

తా॥ శుభగ్రహములతోగూడిన శుభలగ్నమందు సూర్య, కుజ, శను లుచ్చస్థితియం దుండగా, గురువు కేంద్రగతుడై శుభగ్రహములచే వీక్షింపబడిన శుభసమయమున శివగురు పత్నియగు నార్యాంబిక పార్వతీదేవివలె శ్రీశంకరుని సుఖముగఁ బ్రసవించెనని తాత్పర్యము. కాని యిందు జ్యోతిశ్శాస్త్రవేత్తయైన శ్రీశంకరుని జన్మలగ్నచక్రమును :

| | | | |
|---|---|---|---|
| కే | ర ల | | |
| | | | గు చం |
| కు | | | |
| | | శ | రా శు బు |

ఈరీతిగా నిర్ణయించి, మేషాద్యుచ్చస్థాననిర్ణయమును, కేంద్రాదిసంజ్ఞలును, శుభాశుభగ్రహనిర్ణయమును జేసికొని రాజయోగసమ్మిశ్రితమైన చక్రమని వివరణముగ నర్థముఁ జేసి చెప్పగలడు. కేవలభాషావేత్త్వమున భావము వఱకే తెలియునుగాని శాస్త్రజన్యజ్ఞానానందము నీజాలదు; కాబట్టి శాస్త్రజన్యజ్ఞానవిశిష్టమైన సంస్కృతసాహిత్యమే శోభావహమై యొప్పును.

## 8. ఛందశ్శాస్త్రము

కర్మకాలేన సంభావ్య అహం మూర్ఖేణ సంప్రతి ।
అహో ప్రకటితం జ్ఞానం యతిభంగేన భాషిణా॥

(శంకరవిజయే)

సందర్భము : శంకర మండనమిశ్ర సంవాదము.

తా. 'కర్మను (పైతృకమును) ఆచరించు నాతో మూర్ఖుడవగు నీవసంభాష్యుడవు' అని మండనుడనుటతోడనే శంకరులు యతిభంగముగ మాట్లాడు నీజ్ఞానము విస్పష్టమైనదని భావము. కాని ఇందు యతిర్విచ్ఛేదసంజ్ఞకః అను సంస్కృతోక్తఛందోరీత్యా సంభావ్య అహం అనుచోట యతిభంగమాయెననియు, స్వభావసిద్ధముగ యతి (సన్యా) దూషణ మనియు శ్లేషతోగూడిన భావమని విశేషము. ఇట్టి విశేషార్థస్ఫురణ మాఛందశ్శాస్త్రపరిచయమున గాని బోధపడదు.

## 9. ఆయుర్వేదము

మార్గం తావచ్ఛృణు కథయతస్త్వత్ప్రయాణానురూపం
సందేశం మే తదను జలద! శ్రోష్యసి శ్రోత్రపేయం
ఖిన్నః ఖిన్నః శిఖరిషు పదం న్యస్య గంతాసి యత్ర
క్షీణః క్షీణః పరిలఘుపయః స్రోతసాం చోపభుజ్య॥

ఇది కాళిదాసకృత మేఘసందేశములోనిది. సందర్భము: యక్షుఁడలకాపురమునకుఁ బోవుత్రోవను మేఘునకుఁ జెప్పుట.

తా. ఓయీ! మేఘుడా! నీవు వెళ్ళవలసిన మార్గమును వినుము. ఆపై శ్రవణపేయమగు నావార్తనుగూడ వినుపింతును. నీవు త్రోవ నలసినప్పుడా యా పర్వతశిఖరముల బదవిన్యాస మొనర్చుచు, తృష్ణఁజెందినపుడు పథోదకమును ద్రావుచు పొమ్మని సామాన్యభావము

కాని పరిలఘుపయః అనుచోట శరీరకశాస్త్రబోధకమైన వాగ్భటుని వాక్యమగు ఉపలాస్ఫాలనాక్షేపవిచ్ఛేదైః ర్ఛేది తోదకాః । హిమవన్మలయోద్భూతాః పథ్యాన ద్యోభవం త్యమూః॥ అని నీటిలోని పథ్యతను సూచించు నాయుర్వేదభాగమిందు బొందుపఱుపఁబడియె.

## 10. వృక్షశాస్త్రము

రక్తాశోక శ్చలకిసలయః కేసర శ్చాత్ర కాంతః
ప్రత్యాసన్నౌ కురవకవృతే ర్మాధవీమండపస్య ।
ఏకస్సఖ్యా స్తవసహ మయా వామపాదాభిలాషీ
కాంక్షత్యన్యో వదనమదిరాం దోహద చ్ఛద్మనాస్యాః॥

ఇది మేఘసందేశములోనిది. సందర్భము : యక్షగృహచిహ్నము.

తా. ఓయీ! మేఘా! నాయింటిలోనికి క్రీడాపర్వత సమీపమున కురవకలతామండపసమీపమున నొకరక్తాశోకమును, వకుళవృక్షమును గలవు. ఆరెంటిలో నొకటి నా ప్రియురాలిపాదాహతిని, మఱియొకటి గండూషజలమును గోరుచుండుచు. అట్టి యుపవనోపేతగృహము నాదని యూహింపుము అని సామాన్యభావము.

ఇందు వృక్షదోహదశాస్త్రము ననుసరించి.

స్త్రీణాం స్పర్శాత్ప్రియంగు ర్వికసతి
వకుళ స్సీధుగండూషసేకాత్
పాదాఘాతా దశోక స్తిలకకురవకౌ
వీక్షణాలింగనాభ్యాం ।
మందారో నర్మవాక్యాత్పటు
మృదుహసనా చ్చంపకో వక్త్రవాతా
చ్చూతో గీతా న్నమేరు ర్వికసతి
చ పురోనర్తనా త్కర్ణికారః॥

ఈశ్లోకభావ మెఱుగకున్న నీపై మేఘసందేశశ్లోకార్థము విస్పష్టము కాదుగదా? కాబట్టి విశేషార్థస్ఫూర్తితో నభిప్రాయావేదన మీగీర్వాణ భాషలో గావలయు ననిన సాంప్రదాయసిద్ధమైన సంస్కృతభాషాభ్యసనమే ముఖ్యముగాని యిందు మార్పు తేనవసర మిసుమంతేనియు లేదనియు, ఆట్టిశాస్త్రసహకృతభాషాపాండిత్యమే యాంధ్రపండితభూషణ మగుననియుఁ దదన్యము వ్యర్థమనక తప్పదు.

ఇప్పటికే ప్రసక్తానుప్రసక్త సంస్కృతభాషాగరిమను గూర్చి చర్చింపఁదలకొనిన మనము శాఖాచంక్రమణన్యాయమున ప్రస్తుతవిషయమునకుఁ గొంచెము దూరదూరమగుచున్నను అవసరానుగుణముగఁ జర్చనీయాంశములను జర్చించుకొంటిమి.

స్వస్త్యస్తు సర్వేషామ్ జనానామ్

# శాంతి దేవతాహ్వానము

## శ్రీ దివాకర్ల వేంకటావధాని



జగమున నెయ్యెడం గనినఁ జాఘుషవేదన సంఘటించు పె
న్బొగల తమస్సు లేచి వెఱపుం గొలఁపున్, మెల్ల మెల్ల రాజుకొం
చెగసి భయంకరానల మహీనరయోద్ధత హేతిశాతమై
భగభగ మండునో యని ప్రపంచము పెల్లుగఁ దల్లడిల్లెడిన్.

వికటకఠోరమై శ్రవణవీథిని జొచ్చినయంత గుండియల్
పెకలిచి గాత్రవల్లరుల భీజనితాధికరోమవిక్రియా
వికలతఁ గూర్చుచుం, గలఁత పెట్టెడి ద్వేషభుజంగపూత్కృతి
ప్రకర మడంగి శాంతిసుఖరమ్యదినంబులు రావె యింతలోన్.

కల సంపత్తతితోడఁ దృప్తిగన కగ్రస్థానముం జెందఁగాఁ
దలఁపుల్ సేయుచు నన్యదేశములపై దండెత్తఁగాఁ బెద్దజం
గలు సాచుం బ్రతిదేశ మాశ, నదె సంగ్రామాంతకాలోచ్ఛల
జ్జ్వలనజ్వాలలు చిమ్మి లోకముల సంతాపమ్ము పాల్సేసెడిన్.

పరరాజ్యాక్రమణప్రవృత్తికి మొదల్ స్వార్థాభిలాషమ్ము, స
త్వరతన్నిర్వహణప్రయత్నమున నుత్పన్నమ్ము లౌ నీర్ష్యయుం
బరమద్వేషము, నింధనమ్ములయి మండంజేయు నారెండు భీ
కరసంగ్రామమహాశుశుక్షణి జగత్కంపంబు కావించుచున్.

న్యాయముధర్మము న్విడిచినన్ బల మొక్కటియే చెలంగు ని
ర్ణాయకమై ప్రభుత్వకలనాప్రతిపత్తికి నప్పు డాత్మపైఁ
గాయము రాజ్యము న్నెలవుఁ గట్టడిచేసి యడంచుఁ గ్రూరతా
ధ్యేయము నీతిదూర మతిహీనపశుత్వము మానవత్వమున్.

అవనికి శాంతిగావుత జనాళి సుఖించెడుగాత మంచు నా
హవవిముఖమ్ము లున్నతహృదాశయశంసులు నైనవాక్యముల్
సవసవ పల్కుచుం బరుల జ్మాతలముం గ్రసియింపఁ జూచెడిన్
యవసవృతాంధుసమ్మితము లై యక టక్కట! కొన్ని దేశముల్.

మానసవాయువేగ మవమానము చేయు విమానపంక్తులన్
మానితధీవిభూతిపిశునం బణుశాస్త్రవివేకమంతయున్
మానవకోటిశాంతికిని మంగళసిద్ధికి సౌఖ్యవృద్ధికిం
బూనక సంగరప్రళయపూర్తికి హేతువు లౌట వింతయౌ.

అణుశస్త్రంబులు మారణాస్త్రములు లేనప్డే జగంబంత శాం
తినిధానం బయి సౌఖ్యసంతతుల నొందెన్, నేఁ డనం గంటికిన్
గునుకొక్కండును రాక మానసము సంక్షోభంబు చెందంగ జీ
వనముం బుచ్చుట యాయె, శాస్త్రభవలాభం బీదృశక్లేశమున్.

ఏడుల్ దాఁటుకొలంది లోకమునయం దేపారు సంస్కారపుం
జాడల్ నాగరికత్వ మన్నది తలంపం జాల వ్యత్యస్తమౌఁ
దోడంబుట్టిన మానవావళి శిరోధుల్ ద్రుంచుటా, ధాత్రి య
ల్లాడన్ మారణశస్త్రముల్ విసరుటా యాసభ్యతాచిహ్నముల్.

గౌతముఁడే నశోకుఁడును గాంధియు మానవకోటిగుండెలం
బాతుకయున్న దుర్గుణగణంబులు పాఱంగఁ జోపి లోకమం
దాతతశాంతి నిల్పుటకు నాత్మలు చూఱ యొసంగి రాకథల్
పూతములయ్యెఁ బ్రాఁతవడిపోయెడి నెప్పటి కప్పుడే కటా!

మనుజులచిత్తవృత్తులను మా ర్పుదయింపదయేని నాయకు
ల్పనివడి పంచశీలము లభంగురనీతులు బోధసేసినన్
ఘనసమితుల్, సదస్సులనికాయము కూడిన శాంతియబ్బునే
మనసులు కావె మూలములు మంచికి సెబ్బరకుం జగంబునన్,

లౌకికభోగసంపదల లాలసకున్ వశవర్తి యౌచు, నీ
ర్ష్యాకపటాదిదుర్గుణపరంపర పెంచుచు, నాత్మసద్గుణ
ప్రాకటవైభవంబు విడువ న్మెయికొన్న జగంబునందు నే
లా కలుగున్ బ్రశాంతి విమలంబగు మన్గడ మానవాళికిన్.

తరలిన యాత్మసద్గుణవితానము క్రమ్మఱఁ గూర్చి, మానవో
త్కరము నెడందలం బొగలు క్రమ్మఁగఁ జేయు దురూహ లన్నిటిన్
మరలిచి యాశ లన్మధురమంజులనూపురశబ్దముల్ తగం
ద్వరమెయి రాఁగదమ్మ! జనతాపరిపూజిత! శాంతిదేవతా!

# భ్రాంతి - శాంతి

## శ్రీ కేశవభొట్ల సుదర్శన వేణుగోపాలమూర్తి



పూర్వానుబంధభవమహాఘ్యసివారణార్థం
హే జానకీధవ! మహాకులమానసం మాం
కృత్వా త్వదీయపదపంకజభక్తియుక్తం
సాక్షాత్కృతిం కురు మ మాత్మవిశిష్టరూపామ్॥

ఎంత యొనర్చినన్ తుదకు నేదియొ నిందను బొంది వోవు, కా
సంతయుఁ బుట్టుకల్ బ్రతుకుచావులమర్మము కానరా దికన్
పంతములాడి యేవొ పరిభాషల పల్కుదు రంతె యెవ్వరున్
సుంతయు దానిఁ గాంచనగు సూత్రము దెల్పరు జానకీపతీ!

వాతము పైత్యమున్ పయికిఁ బారిన శ్లేష్మమటంచు నొక్కరుం
డీతనుభాగముల్ సెడఁగ నేర్పడె దోస మటంచు వేరొకం
డాతటి మృత్యుహేతు వెదో యందియు నందని రీతిఁ దెల్పుచున్
ఖ్యాతికినై పెనంగుదురు గాని, యెఱుంగరు జానకీపతీ॥

భువి ఘనవైద్యుఁడే యెఱిఁగి పోల్చఁడు గాత్రపుఁజర్య యన్న నిం
కెవరది గాంత్రు? యోగియని యెంచిన నాచ్యవనుండు రోగియై
చవిగొనె మందు; మాంత్రికుఁడు జాడనెఱుంగు నటన్న నోటముల్
దవులును నాతనిన్; మరి విధాన మదేమియొ జానకీపతీ!

మందులు మంత్రముల్ గలసి మారణకారణ మాపలే వికన్
బొందియు నేదో హేతువునఁ బుట్టును జచ్చును జావుపుట్టుకల్
గందరగోళమా కిటుకు కన్పడరానిదో! కాంచరానిచోఁ
గొందలమందుటే నిజము కోవిదుఁడైనను జానకీపతీ!

స్థూలపుదృష్టి కొక్కటియె తోఁచును, రూపము నెవ్వఁ డేనియున్
తాలుచుటేమొ పుట్టుకయు స్తంభనపొందుట యేమొ మృత్యు వే
గోలయు నింతకున్ మిగిలి గోచరమందదు; సత్య మేదియో
చాలఁగ నుండెనం చిటులఁ జాటుదు రార్యులు జానకీపతీ!

బ్రతుకనఁ జావనంగ నొకబంధము – విడ్పును; దేహజీవసం
గతి యది; పూర్వకర్మములె కారణ మందుకు; దాని జ్ఞాన మం
చితముగఁ బాపి ముక్తి నిడు; జీవుఁడె తా నదె బ్రహ్మ మింక వే
రుతనువె యాట ముక్తి సతిరూప మటందురు జానకీపతీ!

భౌతిక మాట దేహ మెటు భంగుర మయ్యది యెట్టకేల కా
భూతములన్ లయం బగు; నపోహల దేహమె తానటంట మా
యాతమి; విశ్వదృశ్యమున కాస్పద మద్ది; అదీవె; అద్దియున్
భూతము లొందు నిన్ ప్రళయమూర్తిని నందురు జానకీపతి!

ఎన్నఁగ జీవుఁ డచ్యుతుఁడె యింక జడంబు శరీర మెంచఁ దా
నెన్నఁడుఁ గాదు; దృశ్య మిటు లేర్పడ నీదగు లీల హేతువా
పన్నికఁ బుట్టిగిట్టుట స్వభావము; ముక్తినిఁగాక దాని సం
పన్నత నాప బెగ్గిలుట భ్రాంతి యటందురు జానకీపతీ!

గాలియటంచు యోగియును గాత్రపుచర్యయటంచు వైద్యుఁడున్
బ్రాలు పురాకృతం బనెడి వాక్యము కర్మఠు, డేదొ భూతసం
చాలనమంచు మాంత్రికుఁడుఁ జాటిన యేనియు నిట్లు గోప్యమున్
తేలుచుదాకఁ గొంతయినఁ దృప్తి జనింపదు జానకీపతీ!

ఎయ్యది కూడునో తుదకు నయ్యది వీడునొ యెవ్వి వీడునో
యెయ్యెడ వారలున్ గనుట యేమియు లేదట; పంక్తిపైనఁ దా
మొయ్యన నిగలారలట యుండిన టీకల; మర్త్యదృష్టికి
ద్దియ్యది యంచుఁ గన్పడునె యెంతగ నేర్చిన జానకీపతీ!

ఫల్గును( డొక్కవిప్రుని యపత్యము మృత్యువు నొందకుండఁ దా
విల్లురిపెట్టి విక్రముఁడు వేత్తయునై పురిటిల్లు గాచినన్
కల్గియుఁ బోయె బిడ్డ యటఁ గన్పడకే; నరుఁడే యెఱుంగఁ డా
యీల్గుట యన్న నేమొ; యిక నెవ్వరు గాంతురు జానకీపతీ!

స్వానుభవమ్ముచేత నిజసంగతి తెల్పఁగలార లెవ్వరో
గాని జగంబునం దిపుడు కష్టముగాంచుట; జీవుఁ డీశ్వరుం
డైన యథార్థము న్గనుల నచ్చుగఁ గాంచినఁ జింతవోవు నీ
వే నయరీతిఁ జూపు మది; ఇంగితమూర్తివి జానకీపతీ॥

వాదముతోడ సంశయనివారణ మందకపోయెఁ గాదె యా
నీదగు ఛాయయా నరుఁడె నిక్కమెఱుంగక విశ్వరూపమున్
నీదయఁ గాంచుదాక; నిక నే నణువుం గద! యెట్లునేర్తు; న
న్నాదరణంబొనర్చి యటు లాత్మను జూపుము జానకీపతీ॥

నీవు జడంబునం దెటుల నిల్చెదొ జీవుఁడ వౌచు; నెండి నీ
వేవిధి స్వత్వ మంది జనియించెదొ! భౌతిక దేహ మెట్టులౌ
నో వడి దృష్టిగోచరము నొందఁగఁ జేయుము విశ్వరూపివై
నావరదుండవై సతము నంద మొసంగుచు జానకీపతీ!

చుట్టమవై కిరీటికి యశోదకు బిడ్డడవై మహాత్మ! చూ
పెట్టితి విశ్వరూపము నవిద్య తొలంగఁగ! నైహికమ్మునన్
గట్టిగఁ బట్టుకొమ్మవయి కాచితి వారలఁ; దండ్రి భక్తుడన్
పట్టిని నన్నుఁ గాచు టొకభారమ? యవ్విధి జానకీపతీ!

జగము లదృశ్యముల్ గలుగు చర్యను గైకొని నిర్గుణుండవున్
సగుణుఁడ వైతి తత్ప్రకృతిసత్వమునందు, నభేదవృత్తి, నా
జగముల మూలకారణము సందియముల్ దొలఁగించి చూపవే
యగు నిక శాంతి నాహృదయమందున నెంతయు జానకీపతీ!

శాం

దర్శితవిశ్వరూపుఁ డల తత్త్వవిదుండగు నర్జునుండు త
ద్దర్శనపూర్వమున్ పరము దర్శక! నిన్ సగుణాత్ముఁ గృష్ణు సం
దర్శన మంది తేరె; మది దార్ఢ్యము దానికి నీ వొసంగి తా
దర్శనము న్బలం బిడి సుదర్శను బ్రోవవె జానకీపతీ!

ఖేదమును బాపి సర్వదా మోద మొసఁగు
నాదబిందుకళాతీత! శ్రీదరూప!
జానకీపతి! నీదు దర్శనము గల్గె
స్వాంత ముప్పొంగి యెంతయు శాంతి బొందె.

# దార్శనిక విచారము

శ్రీ వావిలాల వెంకటేశ్వర శాస్త్రి



కామాదిదోషజనక వాసనాభయంకర మగు సంసారమందు జనించిన ప్రతిప్రాణియు రాత్రింబవలు కష్టించినను స్వదేహరక్షణము, స్వేంద్రియతృప్తి, స్వకుటుంబరక్షణమాత్రమును మాత్రము నిర్వహించుచున్నాడు. ఈవిషయమున పశువుకంటె మానవున కేవిధమైన యాధిక్యము గన్పడదు. పాశ్చరీతికంటె మానవప్రవృత్తికి సమాజవ్యవస్థాపరిపాలనమే యాధిక్యావహమని చెప్పుట కొంతవఱకు సమంజసముగాఁ గన్పట్టినను ముఖ్యఫలముమాత్ర మదియును గాదు. ఏలయన మానవునకు స్వసమ్మత మగు సమాజమునే పోషించుట తన కనిష్టమయిన సమాజమును వదలుటయు గన్పట్టుచున్నది గాన స్వసుఖమేముఖ్యఫలము, సమాజరక్షణాదికము గౌణమనియు దేలినది.

స్వశబ్దార్థము దేహమా? లేక యన్యమా! అని విచారణము సేయవలయును. ఈ స్వశబ్దార్థవిచారణముకొఱకే సర్వదర్శనములు ప్రాప్తించినవి. 'దృశ్'ధాత్వర్థము జ్ఞానసామాన్యము. దర్శన మనగా నుపలభ్యమానములగు చేతనాచేతనరూపపదార్థములయొక్క మూలతత్త్వానుసంధానమే. ఆ పదార్థతత్త్వానుసంధానము ప్రమాణైకసాధ్యము. ఆ ప్రమాణములు ప్రత్యక్షానుమానోపమాన శబ్దాదిభేదముచే నానావిధములు. కాన ప్రమాణభేదముచే ద్రష్టృప్రతిపత్తిభేదముచే దర్శనములు నానావిధములుగఁ గన్పట్టుట సార్వజనీనమగు విషయముగాదా. సామాన్యముగ దర్శనకారులను మూడువిధములుగ విభజింపవచ్చును. 1. ఆధ్యక్షికులు 2. తార్కికులు, 3. శ్రౌతు లని.

ప్రత్యక్ష ప్రమాణైకవాదులు చార్వాకులు, ఆధ్యక్షికు లనంబడుదురు. వారికి పదార్థవిజ్ఞానము బాహ్యేంద్రియజన్యముమాత్ర మగును. ఇంద్రియశక్తి ననుసరించి వారికావిజ్ఞానము గలుగుట సహజముగా నుండును. ఒకనికి దూరమున నుండు పదార్థములు గోచరించును. మఱియొకనికి సమీప, సమీపతరదేశములం దున్న విషయములు గోచరించుచుండును. ఇట్లు తరతమభావముచే పదార్థములు ప్రత్యక్షప్రమాణమునకు లోనయి గన్పడుచుండును. తార్కికు లనగా ననుమాన ప్రామాణ్యవాదులు. వీరిని హేతువాదు లని యందురు. వీరు హేతువులచే విషయములను సాధించుచుందురు. వీరికి ప్రత్యక్షసిద్ధ మయిన విషయమందుఁగూడ హేతురచనచేయుట యం దాసక్తి మెండుగా నుండును. వీరివిషయమున శాస్త్ర మిట్లు ఘోషించుచున్నది. "ప్రత్యక్షపరికలిత మప్యర్థ మనుమానేన బుభుత్సంతే తర్కరసికాః। కరిణిదృష్ట్యే చీత్కారేణ తమనుమిమతే అనుమాతరః॥". తర్కరసికులకు గజము ప్రత్యక్షమయినను దానిఘీంకారముచేత ననుమానించుట సహజమట! తార్కికదృష్టులకుఁగూడ సూక్ష్మసూక్ష్మతరాది పదార్థాన్వేషణ ముండుట సర్వానుభవైకవేద్యము గదా!

శ్రౌతు లనగా శ్రుతిప్రధానప్రామాణ్యవాదులు. శ్రుతియందలి విశ్వాసతారతమ్యము ననుసరించి వీరిలో మతభేదము గలిగియుండవచ్చును. వీరందఱకు శ్రుతియే సామాన్యముగ తత్త్వాన్వేషణసమర్థమయినను మహాతాత్పర్యాదులచే వాచ్య లక్ష్యార్థ నిర్ణయముచేయుటలో మతభేదము గలుగుచున్నది. వీరిలో కొందఱు శ్ర[illegible] ప్రామాణ్యము చెప్పుదురుగాని శ్రుతిశకలావష్టంభసంభావనచే మహాతాత్పర్యమునకు భంగమొనర్చి యనుమానమున కుపష్టంభకముగ శ్రుతిసమన్వయము చేయుచుందురు. వీరుగూడ శ్రౌతు లయినను శ్రుతితాత్పర్యా[illegible]జ్ఞు లని చెప్పబడుదురు.

నాస్తికదర్శనకారులు ఆస్తికదర్శనకారు లని రెండువిధములుగ దర్శనకారులు చెప్పబడుదురు. నాస్తికులు వేదప్రామాణ్యము నంగీకరింపరు. చార్వాకులు, మాధ్యమికులు యోగాచారులు, సౌత్రాంతికులు, వైభాషికులు, జైనులు అని చెప్పఁబడుదురు వేదప్రామాణ్యము నంగీకరించిన వారు ఆస్తికదర్శనకారులు, వైశేషికులు, నైయాయికులు, పాతంజలులు, సాంఖ్యులు, పూర్వోత్తరమీమాంసాకారాదులు. వీరిలో కొందరు వేదము ప్రమాణమగుటకు నీశ్వరోచ్చరితత్వమే కారణమని యందురు. అనుమానప్రమాణమున కనుకూలముగ శ్రుతి నన్వయించెదరు.

దర్శనకారు లందఱుఁగూడ ధర్మార్థకామమోక్షములలో మోక్షమే పరమపురుషార్థమని సమ్మతమైనది. నాస్తికులలో ప్రాత్యక్షికులు, నాస్తికతార్కికు లని రెండువిధములుగ నుండిరి. మొదటివారు చార్వాకులు, బౌద్ధులు, నాస్తికతార్కికులు. వీరు క్షణికపదార్థవాదులు, క్షణికవిజ్ఞానవాదులు, శూన్యవాదులు, బాహ్యార్థానుమేయవాదులు, స్యాద్వాదు లని చెప్పబడుదురు. ఆస్తికులలోఁగూడ సగుణాత్మవాదులు, నిర్గుణాత్మవాదు లని చెప్పఁబడుచున్నారు. శ్రౌతులలో వాక్యార్థవేదులు మీమాంసకులు పదార్థవేదులు వైయాకరణులు నిరీశ్వరవాదులు; సాంఖ్యులు సేశ్వరవాదులు, పాతంజలులు. శ్రౌతులలో శ్రుతికి నిరపేక్షప్రామాణ్య మంగీకరించినవా రద్వైతదర్శనకారులు, శాంకరమతానుయాయులు. ఆద్యంతములయిన చార్వాకాద్వైతదర్శనములను సంక్షిప్తముగఁ గొంత చెప్పి యీ వ్యాసమును పరిసమాప్తి చేయుదును.

'చారుః సుందరః వాకః వచనం యస్యసః చార్వాకః' అను వ్యుత్పత్తిచే సుందరవాక్కులు చార్వాకు లని చెప్పఁబడుచున్నారు. వారిమతము గూడ సుందరముగ ప్రాకృతజనులలో వ్యాపించుచున్నది. కనుకనే వీరిని లోకాయతికులనిగూడ చెప్పుదురు. 'లోకే ఆయతం ప్రసృతం = లోకాయతం తదీయాః లోకాయతికాః' అను వ్యుత్పత్తిచే లోకాయతమత మనగా లోకమందు వ్యాప్తమయినది. ప్రాకృతజనులలో వ్యాపించుటకుఁ దగిన సౌకర్యము లీమతమునందే గలవనుట సాహసోక్తి గాదు. చార్వాకదర్శనమునకు సూత్రప్రణేత దేవగురువగు బృహస్పతి. ఈదర్శనమీయన కనిష్టమయినను దేవగురువగుటచే నీతఁడు శిష్యులగు దేవతలను రాక్షసబాధలనుండి తప్పింపఁ దలచినవాఁడయి సూత్రరచనము చేసియుండవచ్చును. ప్రథమమున రాక్షసులు యాగాదికర్మల నాచరించి దేవతలను జయింపఁ జూచిరి. అప్పుడు వారికి యాగాదులయందు శ్రద్ధజనింపకుండున ట్లుపదేశము జేయదలచినవాఁడై బాహ్యార్థవిషయకము లగు సూత్రములను రచియించియుండవచ్చును. రాక్షసతత్వముగలవారికే యీమతమునందు నాసక్తిమెండుగ గన్పట్టుచున్నది.

రాక్షసులు కర్మభ్రష్టులయి స్వర్గాదిసుఖముల కనర్హులగుటకు నీ సూత్రసిద్ధాంతావలంబమే కారణమని చెప్పుట యతిశయోక్తిదూషితము గాదు. విష్ణుపురాణములో తృతీయాంశమున 17వ అధ్యాయములో నిట్లు గన్పట్టుచున్నది. నర్మదా నదీతీరమున గొందఱు రాక్షసులు శ్రౌతమార్గావలంబులయి తపస్సు చేయుచుండిరి. దేవతలు దీనిని తెలిసికొని నారాయణుని సమీపమునకు వెళ్ళి శరణుజొచ్చిరి. అప్పుడు విష్ణువు తన శరీరమునుండి మాయామోహుడనువానిని సృష్టించి వానిని మీకోరిక నెరవేర్చునని చెప్పి వీరి వెంటఁ బంపెను. వాడు సార్థకనామధేయుడయి బృహస్పతిరచితసూత్రములను రాక్షసులలో నెక్కువ ప్రచారము చేసెను. ఆ ప్రచారమహిమమున వారు తపస్సునుండి విరమించి యాగాదికర్మలు పశుహింసాదిదూషితములని 'అహింసా పరమోధర్మః' అను వేదభాగములు ధూర్తప్రలాపము లనియు నమ్మి ప్రచారము చేసిరి. ఆ చార్వాకులలోఁ గొందఱు బౌద్ధు లయిరి. ప్రపంచమునఁ గన్పట్టు పదార్థము లన్నియు శూన్యము లనియు, క్షణికము లనియు నుపదేశమును స్వీకరించి వారు బౌద్ధమతప్రచారమును జేసిరి. తరువాత చార్వాకు డనురాక్షసుడు నెక్కువగా నీ మతప్రచారము చేసెను. ఇతడే దుర్యోధననాశానంతరము ధర్మరాజసభకువచ్చి మునివేషముతోఁ గఠినోక్తులు పలికి బ్రాహ్మణక్రోధాగ్నిచే దగ్ధుడయ్యెను. ఇట్లు చార్వాకమతము ప్రపంచమున బహుళముగ వ్యాపించెను.

ఇతరదర్శనకారులకువలె నీమతమునకుగూడ వ్యూహచతుష్టయము గలదు. మోక్షము, మోక్షోపాయము, బంధము, బంధకారణ మను చతుర్విధవిషయములు గలవు. మోక్ష

స్వరూపమును దెలియక ముముక్షువు కాఁజాలఁడుగదా! మోక్షప్రతిబంధక మగు బంధమును తెలిసికొనక వదలుట దుర్ఘటము గదా। బంధ మెప్పుడు వచ్చెను? ఎటుల వచ్చెను? ఎవనిచే సంపాదింపఁబడెను? అను విషయములు ముఖ్యముగా విచారింపవలసియున్నది. దేహాత్మవాదు లయిన చార్వాకులు గాక ఇతరదర్శనకారులు చేతనున కచేతనసంబంధము కలిగియుండుటయే బంధమని నుడివిరి. నానావిధములగు నచేతనములు శరీరముద్వారా బంధహేతువు లగుచున్న వనియు కాన దేహికి దేహముతో నుండు సంబంధమే బంధమనియు సిద్ధాంతీకరించిరి. కాన ప్రతిముముక్షువు ఆ బంధనాశముకొఱకే ప్రయత్నింపవలయును. బంధము నివృత్తము గానియెడల మోక్షము గలుగ నేరదని సర్వదార్శనికసిద్ధాంతము. చార్వాకమతమున జ్ఞాతృజ్ఞేయాదులను చెప్పవలసియున్నది. భూరాది భూతచతుష్టయమే జ్ఞేయము. జ్ఞాతయనగా దేహమే. భార్యాపుత్రాదులయందు మమత్వాభిమానమే యజ్ఞానము. భార్యాపుత్రాదుల వైకల్యముచేఁ గల్గు మనోవికారమే దుఃఖము. ముక్తియనగా చరమదుఃఖనాశమే, ప్రమాణము ప్రత్యక్షమే యని నుడివిరి. ఈవిధముగా వ్యాప్తమయిన చార్వాకమతములో 'ఋణం కృత్వా ఘృతం పిబేత్' అను నార్యోక్తి యీమతమునకు మూలమని మాత్రము సంతతస్మరణీయము.

శూన్యవాదులు మాధ్యమికులు క్షణికవిజ్ఞానవాదులు యోగాచారులు బాహ్యార్థానుమేయవాదులు సౌత్రాంతికులు. బాహ్యార్థప్రత్యక్షవాదులు వైభాషికులు. ఇదమిత్థమని వస్తునిర్ణయము లేదుగనుక జైనులు స్యాద్వాదు లని యనైకాంతికు లనియుఁ జెప్పబడుదురు. వైశేషికాది దర్శన నిరూపణము వ్యాసవిస్తరభీతిచే నిక్కడ చెప్పక విరమించితిని. అద్వైతదర్శనమును మాత్రము సంక్షేపముగ జెప్పుచున్నాడను.

'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః' అను సూక్తికి తాత్పర్య మేమన సత్యమయిన పదార్థము సచ్చిదానందస్వరూపమగు బ్రహ్మ మొక్కటియే, బ్రహ్మతిరిక్తమగు ప్రపంచమంతయు మిథ్యారూపమే, బ్రహ్మసత్తాతిరిక్త సత్త లేనిదని యర్థము. జీవుడు బ్రహ్మభిన్నుడని తాత్పర్యము. శ్రుతులుగూడ నిట్లే నుడువుచున్నవి. 'స దేవ సోమ్యేద మగ్ర ఆసీత్ ఏక మేవాద్వితీయం। సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ। నేహ నానాస్తి కించన' ఇత్యాద్యనేక శ్రుతితాత్పర్యమువలన జీవబ్రహ్మైక్యము ప్రపంచ మిథ్యాత్వము సుస్పష్టముగఁ గోచరించుచున్నవి. పైశ్రుతుల తాత్పర్య మిట్లు చెప్పబడుచున్నది. సృష్టికంటెపూర్వము పరిదృశ్యమానప్రపంచమంతయు బ్రహ్మస్వరూపముగానే యుండెను. ఆబ్రహ్మము సజాతీయవిజాతీయస్వగతభేద శూన్యమయి యుండెను. అది సత్యస్వరూపము జ్ఞానస్వరూప మానందస్వరూప మయియున్నది. నానావిధమగు నామరూపాత్మకప్రపంచమంతయు పారమార్థిక మయిన సత్తగలది గాదు. ప్రపంచమంత భ్రాంతికల్పితము. నిరధిష్ఠానభ్రమ యుండదు గనుక ఆయధిష్ఠానస్వరూపమే బ్రహ్మము. అదియే జగత్తునకు కారణము అనగా అభిన్ననిమిత్తోపదాన కారణ మని యర్థము. శుక్తిరజతాది దృష్టాంతపూర్వకముగ వివరించెదను. భ్రమ యన "అతస్మిన్ తద్బుద్ధి రారోపః" అది గానిదానియందు నది యని యారోపించుట భ్రమయని యందురు. (ఒకదానిని చూచి మఱియొకటి గాఁ దలంచుట) ముత్యపుచిప్పను జూచి వెండి యనుకొనుట భ్రాంతిగదా! మనకు గోచరించు వెండికంటె పూర్వము ముత్యపుచిప్పయె యున్నది. వెండి గోచరించు కాలమున నదియె యున్నది. వెండి నశించినతరువాత నదియె యుండును కాన ప్రాతిభాసిక మగు రజతమునకు సృష్టిస్థితిలయకారణమయినది శుక్తియే గనుక శుక్తియె నిజముగా నుండునది. ఆరజతమునకు కారణము. "ఆదావంతే చ యన్నాస్తి వర్తమానే ఽపి తత్తథా" యన్నట్లు ఆద్యంతములయందు లేనిది వర్తమానకాలములోఁ గూడ లేనట్లే. దీనంజేసి కార్యజాతమంతయు కారణాధీన మని చెప్పఁదగును. ఆశుక్తికి విశేషరూపము శుక్తిత్వము సామాన్యరూపము ఇదంత్వము. శుక్తి సామాన్యరూపముతో (ఇదంత్వముతో) గోచరించును గాని శుక్తిత్వరూపముతో గోచరింపదు. విశేషరూపముతో గోచరించిన ఇదంరజత మని ఆకార ముండనేరదు. ఆ శుక్తియందు గోచరించు రజతము ప్రాతిభాసిక మని అనిర్వాచ్య మనియు చెప్పఁబడుచున్నది. మనకు గోచరించు రజతము ఉన్నదా? లేదా? అని విమర్శించిన ఉన్నదనుటకు వీలుండదు. వాస్త

విశేషముగ నున్నయెడల అధిష్ఠానసాక్షాత్కారానంతరము వేఱుగ నుండవలయునుగదా! అటులనే యత్యంతాసత్తయిన యెడల భ్రాంతికాలమునఁగూడ గోచరింపక యుండవలసి నదే. గోచరించుచున్నది గాన సదసద్రూపమగు ననిర్వచనీయమయిన పదార్థము రజత మని చెప్పవలయును. అటులనే ప్రపంచమంతయు సద్రూపమగు బ్రహ్మయందే కల్పితము. సృష్టికంటె పూర్వము సద్వస్తు వొకటియే యున్నది. సృష్టినాశానంతరము బ్రహ్మ మొక్కటియే మిగులును. మధ్యకాలమున బ్రహ్మమే గోచరించు ననుటలో సందియము లేదుగదా! "ఆదావంతేచ యన్నాస్తి వర్తమానే ఽపి తత్తథా" యన్నట్లు అద్యంతములలో లేనిపదార్థము వర్తమానదశయం దెటుల నుండును? సచ్చిదానందరూపముగ ప్రపంచమంతటను గోచరించునది బ్రహ్మ మొక్కటియే.

ఘటోఽస్తి. పటోఽస్తి అను వ్యవహారములయందు 'అస్' ధాత్వర్థము సత్త యనంబడును. ఆసత్త యొకటియే అన్ని వ్యవహారములయందు అనువృత్త మగుచున్నది. ఘటపటాదులు వ్యావృత్తరూపములు. వ్యావృత్తరూపములు మారుచున్నను అనువృత్తరూపముమాత్రము మారనేరదు. "మాసాబ్ద యుగ కల్పేషు గతా గమ్యే ష్వనేకధా నోదేతి నాస్తమే త్యేకా చిత్"అని విద్యారణ్యస్వామి యన్నట్లు అనువృత్తస్వరూపమునకు ఉత్పత్తినాశములు లేవు. ప్రపంచభావమునకు కారణముగూడ బ్రహ్మమే. "అస్తి భాతి ప్రియం రూపం నామచే త్యంశపంచకం। ఆద్య త్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతో ద్వయాం" అని బ్రహ్మస్వరూపము సత్, చిత్, ఆనంద రూపమని నిశ్చప్రచము. బ్రహ్మస్వరూపముగ (నాధారరూపముగ) ప్రపంచమం దంతటను భాసించుచున్నది. బ్రహ్మసాక్షాత్కారము గలిగిన తరువాత నీప్రపంచమంతయు మిథ్యయని నిశ్చయము వొడవును.

నామరూపాత్మకమగు ప్రపంచమున కాధారమయిన బ్రహ్మము ఇంద్రియములద్వారా మనస్సు నామ రూపములను గ్రహించునప్పుడు తదాధారమైనది గ్రహింపఁబడదు. అది యప్రమేయము గావున దానిని గ్రహించుటకు అంతఃకరణమునకుఁగాని ఇంద్రియములకుగాని శక్తి చాలదు. ప్రమావిషయము లయిన ఘటపటాదులగు బాహ్యవిషయములను గ్రహించుటకు నింద్రియాదులకు శక్తి గలదు. "పరాం చిఖాని వ్యతృణత్ స్వయంభూః తస్మాత్పరాజ్ పశ్యతి నాంతరాత్మన్" అని కఠోపనిషత్తులోఁ జెప్పఁబడినట్లు మనస్సునకు బాహ్యవిషయాభిముఖ్యమే కలదు. అంతర విషయగ్రహణము లేదు. కాన దృశ్యమును గ్రహించు మానసికమునకు దృక్స్వరూపమగు బ్రహ్మమెటుల గోచరించును.

లోకములో ఘటపటాదులయందుండు నజ్ఞానము ఘటపటాద్యాకారాకారితవృత్తిచే నశించును. ఘటాదిభావము చిదాభాసునిచే గలుగును. అటులనే బ్రహ్మాకారాకారితవృత్తిచే బ్రహ్మజ్ఞానము నశించును. బ్రహ్మము స్వయంప్రకాశముగాన అది ప్రకాశించుటకు సాధనాపేక్షయే యక్కఱ లేదు. వీరిమతమున 'అవిద్యానివృత్త్యుపలక్షిత బ్రహ్మభావో మోక్షః' అని రాద్ధాంతీకరింపబడియున్నది.

# ఉష్మ్రలికము, ఉపదేశము

శ్రీ చిరువోలు శేషగిరిరావు

“‘నిలుపుము తేరు కౌరవుల నిద్దపుమూకలముందు మాధవా!
పౌలికలనిన్ మముం జెనకుపొంటె మదోద్ధతి నిల్చియున్న- దు
ర్విలసితరాజలోకమున విశ్రుతులం బరికించి యేరికిన్
దలమునుకల్ ఘటింపవలె దార్కొనుచో తలపోసి చూచెదన్’’

అని తను హెచ్చరించు నరు నాననముం జిరునవ్వు వెన్నెలల్
దనుకగ జూచి- రథ్యముల దట్టుచు దండపడంగ తేరువో
వనిమొన నిల్పి పార్థ! కను మక్షిగతుల్ రిపులందు నేరి నీ
వనుపథివై వధింపవలె నాశ్రవముం గొను మేల జాగనన్.

అరదముమీద వీరరస మాకృతిగొన్నటు నిల్చి చూచి తా
జిరచిరబాసి డిల్లబడి చిందిలిపాటున నీలవర్ణ! నా
తరమగునంటె సోదరుల దండ్రుల దాతల బంధు మిత్రులం
బొరిగొని రాజ్యభోగముల బొంది సుఖింప నతర్క్యమచ్యుతా!

నిలుపగజాల హస్తమున నిర్భరమై చనె గాండివంబు- నా
తలకడచెన్ ద్రపిష్ఠమయి తాలిమి తావల మీగి- ధైర్యమే
యలకువ నందె- వహ్నిబడినట్టుల నీతను వుండె- నెందుకీ
విలయపు సేత- మానవత వేరము నేరముకాదె కేశవా!

బ్రదుకుటకై ప్రపంచమున బంధుల మిత్రుల ప్రాణవల్లరుల్
కొదుకక గొందుసేయుటన గొంచెతనం బనిపింప కున్నచో
చదు వది యేల- శాస్త్రపరిచర్య యదేల వనాటవృత్తియే
కద యది పారమార్థికపు కర్సనకల్పితమే మురాంతకా!

శాం

మనుగడ వెళ్ళబుచ్చుటకు మానవనాథుడు తోటిరాజులన్
పనిగొని చంపి సంపదల బ్రామికొనం జను నన్న పల్కునం
దొనకు జుగుప్స- తోషణకు తోడము తోడుపడంగబోవ- దే
మనవలె, విప్రతీపమగు సట్టిది ధర్మమ టండ్రె శ్రీపతీ!

కలుములకై నృపుల్ పెనఁగుకాలమునన్ బురుషుల్ నశించుటన్
నెలతుకలందు నెంజలియు నీతివిరుద్ధత దోచు నాపయిం,
గులముల ధర్మభారమున గూలును కూళతనంబు హెచ్చులో
కుల నడవళ్ల గొందలము గొంటుతనం బగుపించు శ్రీధరా!

ఇది భరియింపరాని దయి- ఇంక జిహాసకమే పురస్క్రియా
స్పద మయి దూకి వచ్చుతరి- పంగెనబట్టి మరల్పవచ్చునే?
కొదుకుల దక్కు- యెందులకు కూడని యీపగ లింక మాకు, పో
యెదము గృహస్థవాటికల నింత మధూకర మబ్బకుండునే.

కనులనె నవ్వుచున్ దననె కట్టడి సేయదలంచు చున్న- పా
వను బరికించి కేల్మొగిచి వారిక నా కిహమున్ బరంబు నీ
పను కొనియుంటి నేలుకొను మక్షయసౌఖ్యము లేర్పరించి నీ
పనుపు నొనర్తు బోద్ధవయి పార్థుని దిద్దుకపో త్రివిక్రమా!

అని వచియించి అక్కటిక మగ్గలికంబును త్రోపులాడగా
కనులను శోకబాష్పములు క్రందుకొనంగ బుభుత్స నున్న ఫ
ల్గుణు బలహీన మూడ్చుటకు గోపతి గోపయితవ్య మైన శా
సన మవకర్షణ మ్మనుచు సాదరమేదురసంభృతాత్ముడై.

నిలిచి నిదిగ్ధమై వెలయు ఙధర్మము వీటిబుచ్చి- వ్యా
కులతను సంకటమ్ము బడి కుంఖిని కుంచుకపోవ నేమియు
జ్ఞుల కిది సెల్లు బోటరికి జొప్పడునే పెరధర్మకర్మముల్
విలుచుట క్షత్రియుం డవయి వేపథువుం బడెదే ధనంజయా!

వినుము భయం బనార్య మగు వెక్కలి రక్కసి- పొత్తుజేసినన్
దినదిన మింతవింతలయి దీనునిగా నొనరించు మానవుం
బనుపడినం బరంపదమె బాపు భరింపగబోడు విజ్ఞు డీ
తన కవిగూర్చు తామసము దారుణముం దరితవ్య మౌటచే-

కూడనియీభయంబు దెగగోయుము కుంకటివే రెరింగి- నీ
యేడుగడైన ధర్మజున కెగ్గగు నట్టి చరిత్ర కెట్లుగా
తోడుపడంగ నెంచితివి తోయమువారలు నవ్విపోరె- యీ
పోడిమి జూచి కౌరవులపొంగులకుఁ బొలిమేర యుండునే-

ఎరుగక కాదు- ధర్మజున కెగ్గొనరింపగ గాదు- శాత్రవుల్
పరపిన బన్నముల్ మరుగుపాటయి కాదు- యధార్థదృష్టికిన్
భరమయిపోయి- యుద్ధమున బాటిలు హానిదలంచి ధర్మపుం
దెర విది కా దటందు- నవధీరణమో- యపహాసపాత్రమో.

చిన్నటినాటనుండి మము జేరగదీసి, ప్రియంబు సెప్పి భా
షోన్నతి గూర్చి- మానవత నుప్పతిజేసిన వారిపాదముల్
కన్నులకద్దుకొంట సరికాని- కృతజ్ఞత బాసి- చంపుటా
చెన్నటి యుద్ధరంగమున- నీ నృపజన్మమె దోస మన్మిటన్.

గురుడు పితామహుండు, గుణకోవిదు డైన కృపుండు మున్నుగా
గర మనురక్తి, మాహితము గన్నుల జూడదలంచు పెద్దలే
చిరముగ వారి యుప్పుదిని చిట్టకముల్ పచరింపలేక- యీ
దురమున మ మ్మెదుర్చుటకు- దోదుమి దాల్చిరిగా బలానుజా!

ఎవ్వరితోడిభోగముల కెక్కువ మక్కువ చెల్లుచుండునో
యెవ్వరితోడిపొత్తు విడు టూహ్యముగా గనుపట్టుచుండునో
యెవ్వరిసాయ మేలుబడి కేడ్గడయై యొసవెట్టుచుండునో
చివ్వను వారి గోలుపడు, చీకిలి మాకిలి చైద మేటికిన్.

ఏమని వీరిపై కినుక నెక్కొలుపం జను- వీరి యున్కి- మా
క్షేమము- స్వర్గరాజ్యమును- క్షేపముగాద టె వీరిముందటన్
దామరసాక్ష- దైవమును- దైర్థము లన్నవి వీరిరూపె- యిం
కేమిటికయ్య- కయ్యమను యెద్దడి- సద్దుమడంగిపోవకన్.

ఇటుల గృపాతిరేకమున కిక్కగు చిత్తముతో రథంబునన్
జిటులుచు బాష్పముల్ తొలకి చెక్కులులం దిగజార- నూరుపుం
దుటుములు పైకొనన్ విగతతోషుడునై- దిగబీకు పెన్వగన్
దిటవు దొరంగి దిమ్మగొని దీప్తి నశించిన క్రీడి నెంచుచున్.

''నేరని ధర్మముం గురిచి, నీవు భరంపడి యున్నయట్లుగా
నూరక ప్రజ్ఞలం బలుకు దోడక- భీష్మ ధనంగ నీమదిం
గూరుచుకొన్న యర్థమున- గుచ్చలి గంతగు నీశరీర మో
చారిమ మైన యాత్మయె విచారణకుం దలకొల్పు మర్జునా!

పుట్టువుతో నభిన్నముగ బుట్టిన మృత్యువు ప్రాణికోటులిం
గట్టుపకాసుపై మెసవు కట్టడ సృష్టిని సృష్టమౌటచే
గిట్టినవారికో యికను గిట్టగనుండినవారికో వ్యథల్
ముట్టరు పండితోత్తములు- ముంగతనంబున ముప్పెరుంగుచున్.

పరమాత్మందను నేను శాశ్వతుడనై భాసింతు- నీభీష్ముడున్
గురుసైన్యంబును- మీరు శాశ్వతులె నాకుంబోలె- జీవాత్మయుం
బరమాత్మందును నొక్కరూపె యగుటన్ బార్థా! శరీరంబు పో
వరుదే నిల్చుట యానుషంగికము నర్థం బర్థవంతం బగున్.

ఒడలున బుట్టు బాల్యమను నొక్కయవస్థ యనంతరంబునం
బొడమును యౌవనం బవల బొందుపడుం దగ వార్ధకంబు- నీ
వడువున జీవకోటికిని వచ్చును పోవును మారురూపముల్
యెడనెడ- ఖేదమోదముల కీకడ ధీరుడు చొటొసంగునే-

చినిగినచేలము న్వదలి చేకురు నూతనవస్త్రఖండమున్
గొనుగతి జీర్ణదేహమును కోల్పడి క్రమ్మర నవ్యభవ్యమౌ
తనువున జేరు జీవములు దానికి తత్తరవోవ నేటికిన్
గనుగొని హర్షపూరముల గన్నుల నింపక శ్వేతవాహనా!

నీవే ధైర్యనివృత్తికి న్నెలవుగా నిశ్శీకు డై నిల్చుచో
దావ మ్మేచిన యట్టి కాన యగు నీదాయమ్ము- దాయాదు లా
కావేషించిన కాలసర్పములె గా; కాటంద కాల్ద్రొక్కరా;
కావచ్చుంగద కశ్మలం బొకదు సోకాదే నవర్ణం బెదో—

పరధర్మప్రతిపాదకత్వనిరతిం బండించి- పార్థిత్రమున్
బరిపాలింప దలంచుకంటె గుణమున్ బాటింపగా నేరమిన్
బరిభూత మ్మగు స్వీయధర్మమునకై ప్రాణంబు వర్జించుటే
వరణీయ మ్మగు నన్యధర్మరతితో వ్యాపించు వ్యాపాదముల్

గాండివనిక్వణక్వణనకాండపరంపర చిమ్మరేగ- భూ
మండలమండలేశ్వరుల మంబర ముద్ధరతన్ వెలార్చి -యు
ద్దండు డుదాత్తుడం చనగ ధార్మికు ధర్మము నేర్పరింపు- మా
ఖండలనందనా! రణముఖాగ్రసరప్రధితిం బ్రతీతి వై—

# మనలో మన మాట

శ్రీ మన్నవ గిరిధర రావు

'తనువు నశించి దుమ్మగుట
ఘ్రువము, నీవు పసిండి ముద్దవా
జను లొకసారి పూడ్చి మరు
సారి నినుం బెకలించి ఎత్తగన్'

ఈ శరీరమనేది ఏదో ఒకశుభముహూర్తంలో దుమ్ములో కలవడంమటుకు ఖాయం. నీవు రాజాధిరాజు వయితే కావచ్చు. బంగారుముద్దవుమాత్రం కావుగదా, ఒకసారి పూడ్చిపెట్టి మరొకసారి దుమ్ముదులిపి తీసుకుపోవడానికి అన్నాడు ఉమర్ ఖయాం.

అవును మరి. అందుకే కుమ్మరివాడు కాళ్ళతో మట్టిని తొక్కుతూవుంటే ఆ మట్టి అంటుందిట కుమ్మరివాడితో: 'నేనుగూడ నిన్ను పూడ్చేరోజు వస్తుంది లె'మ్మని!

ఉద్యోగం ఖాయం కాకపోవచ్చు: పరీక్షలు ప్యాసు కావడం అనుమానాస్పదం కావచ్చు. జీవితంలో మరణం మాత్రమే ఖాయమైనది; తెరదిగడం అనేది నిస్సందేహం; దీపం కొండెక్కడ మనేది తప్పనిసరి.

అందుచేత దీపముండగనే ఇల్లు చక్కబెట్టకోమన్నాడు. 'పుట్టని రేపుకోసమై శిథిలతగన్న నిన్నకై' దిగులు పెట్టుకోవద్దన్నాడు; ముక్కు చీదుకోవద్దన్నాడు; కళ్ళు అద్దుకోవద్దన్నాడు. ఒకచేతిలో మధుపాత్ర పుచ్చుకొని మరొక చేతితో ప్రియురాలిని దగ్గరకు తీసుకోమన్నాడు. అంది నంతవరకే దక్కుదల అన్నాడు. ఇంద్రియసుఖంకోసం ఆఖరుక్షణంవరకు అపురాఘరుమన మన్నాడు. ఇంతకంటె నోరు పులిసేబాట ఏముంటుంది? జీవితంలోతులు తెలియని వారి కిది దివ్యమైన సలహా.

ఇందులో ఒక్కప్రమాదంమాత్రం వున్నది. సుఖంఅనేది ఒంటరిగా ఏ నదీతీరంలోనో, ఏ చెట్టునీడనో, ఏ ఇసుక తిన్నెమీదనో చేజిక్కే పదార్థం కాదు. వెలుగు-చీకట్ల వలె కష్టసుఖాలు చెట్టాపట్టాలు వేసుకొని బావమరదుల మోస్తరుగా ప్రత్యక్షమవుతాయి. అందుకే వివేకానందుడన్నాడు. 'సుఖమనేది దుఃఖమనే కిరీటాన్ని ధరించి' వస్తుంది. ఒకదాన్ని ఆహ్వానించేవాడు రెండవదాన్నిగూడ స్వీకరించగలిగి వుండాలి.

ఏం? దోసకాయలో చేదుగిజరును తొలగించివేసి తీయగానున్న కండనుమాత్రమే పుచ్చుకున్నట్లుగా, కష్టాన్ని వీథిలో వదిలేసి సుఖాన్నిమాత్రమే లోపలికి పిల్చుకో కూడదా?

శ్రమయొక్క ఫలితమే సుఖం. భూమిదున్ని నాటువేసి కోతకోసి, కుప్పకొట్టిన పిదపగాని ధాన్యం వచ్చి ఇంట్లో వాలదు. ఆతరువాతగాని నాలికమీదకి చేరదు. నిద్రాహారాలు విసర్జించి పుస్తకాలను మెదడులోవేసి కాగబెడుతూవుంటే, ఆరేళ్ళకుగాని మీగడ గట్టదు; అప్పటికిగాని డాక్టరవడు.

ఇలాగాక ఎవడిజేబులో కత్తిరించి నాలుగుపచ్చనోట్లు సంగ్రహించి సుఖాన్ని పొందరాదా అని ప్రశ్నించవచ్చు. ఆతరువాత ఒక ఏడాదిపాటు కటకటాలవెనుక కాలం గడపవలసివస్తుందిగదా!

అందుకే ఒక ఆంగ్లకవి అన్నట్లు సవ్యమైన సుఖమనీ, అపసవ్యమైన సుఖమనీ సుఖం రెండువిధాలు. ముందు శ్రమపడి తర్వాత సుఖపడితే అది సవ్యమైన సుఖం; ముందు సుఖపడి తర్వాత కష్టపడితే అది అపసవ్యమైన సుఖం.

దురదృష్టవశాత్తు శ్రమతో నిమిత్తంలేని సుఖంకోసం చాలామంది అర్రులుచాస్తున్నారు. పనిచెయ్యకూడదు; జీతంమాత్రం రావాలి. పుస్తకం ముట్టకూడదు; డిగ్రీమాత్రం

కావాలి. అలవాట్లు మార్చుకోకూడదు; వ్యాధులుమాత్రం నయమవాలి. అర్హతలు పొందకూడదు; ఫలంమాత్రం దక్కాలి. తెలుగులో సామెత చెప్పినట్లు దున్నేరోజుల్లో దేశంమీదపోయి, కోతలరోజుల్లో కొడవలి పట్టుకువచ్చే మనస్తత్వం బాగా ప్రబలింది.

ఇందుమూలాన ఎక్కడచూచినా నైరాశ్యం, జీవితం మీద అసహ్యం కనిపిస్తూ వున్నది. సౌశీల్యం అప్రయోజకత్వంగా అర్థంచేసుకోబడుతోంది దొడ్డిత్రోవలు రాజమార్గా లవుతున్నాయి. నిజాయితీగా బ్రతకడం దుర్లభమవుతూవున్నది. కళ్ళుమూసుకోవడం తప్పనిసరి అవుతోంది.

దీనికి మూలహేతువు 'సుఖపడండి, సుఖపడండి' అని తప్పెటవేసి చెప్పడం. ఇంటింటా ఒక రేడియో, వీధి కొక క్లబ్బు, వీలుదొరికితే విమానయానం, ఇద్దరూ ఒప్పుకుంటే విడాకులు—ఇలాంటి నగ్నమైన ఆకర్షణలు కనిపిస్తున్నాయి. ఆ సుఖాలు పొందటానికి 'అప్పుచేసి నెయ్యి త్రాగు' అనే చార్వాకసిద్ధాంతం అక్షరాలా అమలులోకి వచ్చింది. అప్పులు చేయడమనేది అంటువ్యాధి అయిపోయింది. వందలు సంపాదించేవాళ్ళు వేలల్లోనూ, వేలుసంపాదించేవారు లక్షల్లోనూ, ఆఖరుకు సర్కారువారు కోట్లలోనూ ఋణాలుచేస్తున్నారు. అప్పులుచేయడం అభివృద్ధికి లక్షణమని ఎవరూ చెప్పివుండలేదు.

సుఖపడండి అనేవాదమే దోషభూయిష్టమైనది. సుఖమనేది గాలి నీరు, వెలుతురులాంటి పదార్థం కాదుగదా, కావలసినంత వాడుకోడానికి! ఆసుఖం ఇంద్రియసంబంధమైనది. దానికి అంతము లేదు. ఆజ్యము పోసినకొద్దీ అగ్ని ప్రజ్వరిల్లినట్లుగా తృప్తిపరచుకొంటున్నకొద్దీ క్రొత్తవి మొలకెత్తుతూ వుంటాయి.

మానవునికి ఎంతభూమి అవసరం అనే సందేహం కలిగిందట ఒక రాజుకు. అత నొక నిరుపేదను పిలిపించి 'నాయనా! నీవు సుఖంగా జీవనంగడపడానికి ఎంతభూమి అవసరమో తెలుసుకోగోరుతున్నాను. రేపు ఉదయం బయలుదేరి సాయంకాలంలోగా ఎంతభూమి నీకు కావలయునో అంతభూమిని చుట్టిరావాలి. దాన్ని నీ కిచ్చేస్తాం' అన్నాడు ఆ వ్యక్తిలో ఆశ చెలరేగింది. అతడు తనకూ తనవంశీయులకూ సరిపడే విశాలభూప్రదేశాన్ని ఆక్రమించుకోవాలని వాంఛించాడు. మరునాటి ఉదయం పరుగెత్తడం ఆరంభించాడు. చాల పెద్దవర్తులం చేస్తున్నాడు. తిండిగూడా తినకుండా పరుగెత్తుతున్నాడు. మైళ్ళకొద్దీ పరుగులెత్తి తుదకు గమ్యస్థానమైనా చేరుకోకుండానే మరణించాడు. అతనిశరీరాన్ని గుంటతీసి పూడ్చివేశారు. అపుడు రాజనుకున్నాడు—మానవుడికి ఆరడుగులనేల చాలునని. (దహనం చేస్తాం గనుక మనదేశంలో అదికూడ అవసరం లేదు!)

టాల్‌స్టాయ్ వ్రాసిన ఈకథ కోరికలకు మితంలేదనే సత్యాన్ని తెలుపుతూ వున్నది. కోరికలను అదుపులో వుంచుకోవడంలోనే మానసికశాంతి లభించగలదని మన విశ్వాసం. అందుకై మనం చేసే సాధనలోని భాగములే గంగానదిలో కూరగాయలు వదలి రావడంగాని, తిరుపతిలో కేశములు సమర్పించి రావడంకాని. వాంఛలను పరిమితంచేసుకోవడంవల్ల మహోన్నతఫలితాలు లభ్యమవుతాయని వివేకానందు డన్నాడు. మౌనానికీ, ఉపవాసానికీ గాంధీజీ అత్యధికప్రాధాన్య మిచ్చారు.

కష్టపడమని ఆదేశించేవారు సమాజానికి నేడు ప్రధానంగా అవసరం. శ్రమపడటానికీ, నవ్వుతూ కష్టాలనుఎదుర్కోడానికి సిద్ధపడమనీ బోధించేదే నిజమైన విద్య. అదిమాత్రమే సమాజాన్ని సుభిక్షంగా వుంచగల్గుతుంది. రాజ్యాన్ని కోల్పోయి, తండ్రినికోల్పోయి ప్రాణప్రదమైనభార్యనుకోల్పోయి, చివరకు కుడిభుజమువంటి సహోదరుణ్ణికోల్పోయే పరిస్థితి ఏర్పడినా చెక్కుచెదరక నిలబడగలిగాడు. కనుకనే రఘునందనుడు భారతజాతికి అచంద్రతారార్కము ఆదర్శపురుషుడై విలసిల్లుచున్నాడు. ఎంతమంది భూపాలురు రాత్రింబవళ్ళు నగ్నంగా స్త్రీలతో వ్యవహరించలేదు? వారినందరినీ లోకం గుర్తించిందా? కష్టాలు ధైర్యంగా అనుభవించినవాళ్ళు జాతికి ఆదర్శప్రాయులైనారు. సుఖాలను మరిగినవాళ్ళు క్రిమికీటకాలవలె గుర్తించబడకుండా పోయినారు. చచ్చినతర్వాతగూడ బంగారంమాదిరిగా పెకలించి పైకెత్తబడినవాళ్ళు కష్టాల

కోర్చినవారే. సుఖాలకు దాసులైనవాళ్ళు శాశ్వతంగా ధూళిలో కలిసిపోయినారు. ఉమర్ ఖయ్యాం ఈ చిన్న సత్యాన్ని గ్రహించలేకపోయాడు.

అతను బోధించిన సిద్ధాంతం మనిషిని శాశ్వితంగా దుమ్ములో కలిపివేయగలదే గాని, చచ్చినపిదపగూడా బ్రతికేటట్లు చేయజాలదు. భౌతికదేహమే సర్వస్వం మనుకొనేవాడు అంతకుమించి ఎలా ఆలోచించగలడు? దేహం కొరకే అతడు వ్రాశాడు; దేహంతోనే ఆసిద్ధాంతం అంతమవుతుంది. దేహం లేకుండాగూడా జీవించడ మెలాగో నేర్చుకోవాలంటే భారతీయునియొద్ద జ్ఞానభిక్ష పొందాలి!

# శ్రీ సోమసుందర స్తుతి

శ్రీ బబ్బెళ్ళపాటి కామేశ్వర రావు



శ్రీకర! భక్తమానసవశీకర! సాధుజనోద్ధరా! నతా
లోకవిలోచనా! దురితలుంఠన! భూధరజాతవామభా
గా! కలితాహిభూష! త్రిజగద్వినుతాదిమమూర్తివేష! దే
వా! కరుణింపు మ్రొక్కెద, ఝషాక్షిమనోహర! సోమసుందరా!

విశ్వము నీవ యంద్రు, మఱి విశ్వము నంటక యుండు దంద్రు, నీ
శశ్వదఖండతేజము విచారణసేయ నగణ్య మంద్రు, నిన్
శాశ్వతు డంద్రు సూక్ష్ముడయి సర్వము నిండిన దేవు డంద్రు, వే
దాశ్వ! యెటుల్ నుతించెద ఝషాక్షిమనోహర! సోమసుందరా!

ఒకపరి సృష్టి సేయుదు, మఱొక్క తరిన్ దయబూని గాతు విం
కొకతరి హానిసేయుదు గదోయి! ఇ దేటి విచిత్రఖేలనం?
బిక నిను గాంచు టెట్లు? కన నెట్టిస్వరూపము? చూపు మయ్యా! ఓ
అకలుష! దివ్యసుందర! ఝషాక్షిమనోహర! సోమసుందరా!

కోరినదెల్ల నివ్వగల గొప్ప వదాన్యుడ వీవు గల్గ, నిం
కేరినా నీచమానవుల నేల స్తుతింపగ దొడ్డిలోని మం
దారము వీడి దూరమగు దుత్తుర నాశ్రయ మగ్గినట్లు గా
దా? రజితాద్రిమందిర! ఝషాక్షిమనోహర! సోమసుందరా!

ఎప్పటి కెట్టి కామ్యముల నిచ్చిన సౌఖ్యమొ అవ్వియెల్ల నా
కప్పటి కప్పుడే యొసగి హాయిని గూర్చుచు, నెప్డు కంటికిన్
ఱెప్పగ గాచు నీదుపదనీరజముల్ భజియింపకుంటినో
యప్ప! క్షమింపగా గదె, ఝషాక్షిమనోహర! సోమసుందరా!

ఏ నరు లెట్టి పేరు లిడి, ఏ సమయంబుల నెట్లు పిల్చిననే
గాని ముదావహుండ వయి కామ్యము లిత్తువు: ఎల్లరూపులన్
బూనిన దీ వొకండవె ప్రభో! యని కొల్వ గొలంత యున్నె! గో
యాన! మునీంద్రరంజన! ఝుషాక్షిమనోహర! సోమసుందరా!

క్షమయును, వారి, వహ్నియును, స్పర్శనుడున్, గగనంబు, అర్కుడున్
గుమదహితుండు, దిక్కులు, అకుంఠితమౌ భవదీయమైన రూ
పమె యని యెంతు; నీచరిత వర్ణనజేయ దరంబె యేరికిన్
యమమదగర్వభంజన! ఝుషాక్షిమనోహర! సోమసుందరా!

శివుడని కేశవుం డనుచు, చిన్మయశక్తి యటంచు, ఎవ్వ రె
న్నివిధముల౯ వచించినను, నిర్గుణతత్త్వస్వయంప్రకాశమౌ
రవిశతకోటితేజము నిరంజనరూపము నీవ కావె, ని
న్నవమతు లెట్లెఱింగెదు? ఝుషాక్షిమనోహర! సోమసుందరా!

కర్మముచేతనే భవము గల్గును, వృద్ధిని బొందు, నాశమౌ
కర్మమె కష్టసౌఖ్యముల కారణ మౌ, మరి యెద్ది కల్గినన్
కర్మమె మూల మందు రొకకర్మ యనంగను వేఱె యున్నె? ని
న్నర్మిలి గొల్వకుండుటె ఝుషాక్షిమనోహర! సోమసుందరా!

కొంద ఱసౌఖ్యవంతులుగ కొందఱు గష్టులగాగ, కొందఱన్
నిందితమందభాగ్యులుగ, నిస్తులధీరులగాగ కొందఱు
న్నందఱు నన్నిరీతులుగ, నాడగజేసెద వయ్య! నీ కిదే
యందమ! చంద్రశేఖర! ఝుషాక్షిమనోహర! సోమసుందరా!

గళమున కాలకూటమును, కన్నున చిచ్చును, చే త్రిశూలము౯
బలుపులితోలు పుట్టము, కపాలము పాత్ర, వృషంబు వీతి, బూ
చులు పరివారముల్, గలిగి చూడ భయంకరమూర్తి వెట్లు నా
అలయిక గాంచగల్గెదు, ఝుషాక్షిమనోహర! సోమసుందరా!

# హిందూధర్మం - మతరక్షణావశ్యకత

శ్రీ పి. వేంకటేశ్వరరావు

ప్రపంచమంతటా విస్తరించటానికి ప్రయత్నించి బహుళ జనాదరణకు పాత్రమై కాలము పరిణామాలకు తట్టుకొని నిలవగలిగిన మతాలు ఐదు మాత్రమే—అవి హిందూ, బౌద్ధ, యూదు, క్రైస్తవ, ఇస్లాం, మతాలు, అందులో హిందూ బౌద్ధమతాలు భారతీయ మతాలు. ప్రముఖ బ్రిటిష్ చరిత్రకారుడు టోయన్‌బీ అంచనా ప్రకారం ప్రపంచం అంతటిలో మిగతా మతస్థులకంటే భారతీయ మతావలంబకుల సంఖ్యే ఎక్కువ. అధికారికంగా దేశానికి మతం రంగు పులమడం వల్లనో మరి యితర ప్రత్యక్షపరోక్షమార్గాల ద్వారానో కొన్ని కొన్ని దేశాల ప్రభుత్వాలు యూదు, క్రైస్తవ, మహమ్మదీయ, మతాల అస్తిత్వానికి, వ్యాప్తికి కూడా దోహదం కలిగించాయి. ఉనూ ప్రభుత్వ హయాంలో బర్మా బౌద్ధ దేశంగా అవతరించటం బౌద్ధ మతచరిత్రలో శుభసూచకమైన ఒక మహత్తర పరిణామం.

పెద్ద వనుకుంటున్న ఐదుమతాలలో యూదు, క్రైస్తవ ఇస్లాం, బౌద్ధ, మతాలు ఆధునికప్రపంచంలో మనుగడ కోసమే విశ్వప్రయత్నాలు చేస్తుంటే, మన మతం పరిస్థితి ఎలా ఉన్నదని పరిశీలించుకొనడం హిందువులవిధి. బలవంతంవల్లనో ధనాశవల్లనో ఇతరత్రా పరిస్థితుల ఒత్తిడి వల్లనో వేల సంఖ్యలో మతం మార్పిడి జరుగుతున్నప్పటికీ, శతాబ్దాల కాలంగా భారతదేశజనాభాతో పాటు హిందువుల సంఖ్యగూడా పెరగటం జరిగింది. అయితే అది మతవ్యాప్తికోసం ఎవరో చేసిన కృషి ఫలితం కాదని గ్రహించటం అవసరం. కాలం గడచిన కొద్దీ హిందూ మతతత్త్వంలోని మూలసిద్ధాంతాలను కొందరు మేధావులు తమకు తోచిన విధంగా తమకు అనుకూలమైన విధంగా వ్యాఖ్యానించటం, రూపురేఖలే మారిపోయేవిధంగా వాటిని మార్చడంవల్ల అవి మతంలోమతాలు ఏర్పడడానికి సిద్ధాంతాలపై విభేదానికి, భిన్న వాదులమధ్య వైరుధ్యానికిదోహదం ఏర్పడినది. మతంలో భిన్నవాదాల సమన్వయానికి, హిందువుల సమైక్యతకు పటిష్టమైన కృషి జరగలేదు. అన్యమతాలవారు పోటీలుపడి తీవ్రమైన స్థాయిలో మతప్రచారం చేస్తున్న ప్రస్తుత పరిస్థితులు అందరికీ తెలిసినవే. మరొక మూడు నాలుగు తరాల కాలం ఇలాగే గడచిపోతే హిందూమతం అస్తిత్వానికే ముప్పు సంభవించగల స్థితి ఏర్పడవచ్చు. అల్పమైన కృత్రిమలోపాల మాట అటుంచి కొట్టవచ్చినట్టు కనిపించే కొన్ని మతపతనహేతువులు కొన్నింటిని ఇక్కడ పేర్కొనడం అవసరం. వికృతంగా మార్పుచెంది బూజు పట్టిపోయిన వర్ణవ్యవస్థ మతపతన ధోరణికి మూలకారణం. మతంలో మతాల సృష్టికర్త్వసిద్ధాంతాల వక్రభాష్యాలు, కువ్యాఖ్యానాలు మరో కారణం. «ఇదే హిందూధర్మం» «ఇది మంచి, ఇది చెడు», «మన మతధర్మప్రకారం ఫలానాసమస్యకు ఇది పరిష్కారమార్గం» అని శాసించే వ్యక్తిగాని, సంస్థగాని లేకపోవటం ఒకే విషయంపై సర్వదా భిన్నాభిప్రాయాలు ప్రకటించబడుతుండటం ఇంకొక అనర్థధోరణి. వైవిధ్యాలు స్పష్టంగా కనిపించేటట్టు మతసాహిత్యం క్రమరహితంగా, అరణ్యంలాగా పెరగడం కూడా నేటి దుస్థితికి ఒక ముఖ్య హేతువు. వేదసాహిత్యానికి, తద్వారా హిందూమతానికి సంస్కృతభాష ప్రాణసమానం. సంస్కృతానికి ఆదరణ లేకపోవడం దానిని నేర్చుకోవడం జీవనాధారంగా ఉపకరించదనే పరిస్థితి ఏర్పడటం జాగ్రత్తగా గమనించవలసిన పరిణామం. విద్యార్థిదశ యావత్తు సంస్కృతభాషాభ్యాసా

నికే ధారవోస్తే మరి జీవనాధారం ఎలా అని ఉత్సాహ వంతులైన జిజ్ఞాసువులు సైతం సందేహించి వెనుకంజ వేయడం విచిత్రం కాదు. అనర్థదాయకమైన ఇటువంటి స్థితి తొలగడానికి, హిందూమతం మళ్ళీ మూడుపూవులు ఆరుకాయలుగా వర్ధిల్లడానికి హిందువులలో అన్ని శాఖలు వారు కలసి "వాటికన్" (Vatican) పద్ధతిలో ఒకకేంద్రసంస్థను స్థాపించుకొనడం ఎంతైనా అవసరం. హిందూమతానికి ప్రాతినిధ్యం వహించే పై కేంద్ర పీఠానికి లేక సంస్థకు నిర్వహణ ఖర్చుల నిమిత్తం దేశంలోని ప్రతిదేవాలయం ఆదాయంలో కొంత భాగాన్ని సమర్పిస్తుండాలి. హిందూమతకేంద్రసంస్థకు అనుబంధంగా పండితపరిషత్తు ఏర్పడాలి. ధర్మనిర్ణయంలో కేంద్రసంస్థకు సలహాలు ఇచ్చే ప్రతిపత్తి సంస్కృతభాష, విద్యల అభివృద్ధికి చర్యలు గైకొనే బాధ్యతలను పండిత పరిషత్తుకు అప్పగించాలి. ఇందుకు సంబంధించి పండితపరిషత్తు చేసే ఖర్చులను కేంద్రసంస్థ భరించవచ్చు. దేశరాజకీయవ్యవహారాలతో పైసంస్థలకు ఎట్టి సంబంధం ఉండదు. హిందూమతానికి హిందూధర్మాలకు రక్షణ కలగాలంటే ఇది ఒక్కటే పరిష్కారమార్గం. ఇప్పటి శంకరమఠాలు గాని, రామకృష్ణమఠం వంటి సంస్థలుగాని మతసమైక్యతా లక్ష్యాన్ని సాధించే స్థితిలో లేవు. అందువల్లనే కొత్తగా కేంద్రసంస్థ స్థాపన అవసర మవుతున్నది.

డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ స్పష్టం చేసినట్టు సక్యులరిజం అంటే మతరాహిత్యం కాదు. మన రాజ్యాంగంలో అన్నిమతాలకు సమానమైన స్థానం ఉన్నదని దాని భావం. మతదురభిమానం తప్పు గాని మతాభిమానం తప్పు కాదు. మన మతాన్ని మనం గట్టిపరచుకొనడం రాజ్యాంగదత్తమైన మతసహనానికి భిన్నం కాదు. హిందూమతాన్ని అభిమానించే రాజకీయనాయకులు, సంఘసంస్కర్తలు మతంతో సంబంధం ఉన్న పీఠాధిపతులు సమైక్యమై మత సంరక్షణకు అవసరమైన చర్యలను గైకొనవలసిన సమయం ఆసన్నమైనది. చిత్తశుద్ధితో సమైక్యంగా కృషి సాగిస్తే మరో దశాబ్దంలోనైనా హిందువులు మతపతనాన్ని నిరోధించగలగడం అసాధ్యం కాదు.

# ప్రణయ యోగిని

శ్రీ భమిడిపాటి వేంకట లక్ష్మీనరసింహ శాస్త్రి

❋

గీ. ప్రథితసుకుమార మధువనభ్రాజదవని
నందనందన స్పర్శనానందమందు
తనువు మఱచిన రాధిక కనులువిప్పి
చెంత మురహారి లేమిచే చింత మదరి—

ఉ. ఎందున నుంటివో; త్వరితమే యగుపింపుము రా! మనంబు నీ
యందు విలీనమయ్యెర! ప్రయాసలు పెట్టకు రా! కడుంగడుః
వందురుచుంటి రా! విరహభారము నేసహియింపలేను రా!
సుందరమూర్తి! నీ ముఖముఁ జూడని కాలము దుర్భరంబు రా!

ఉ. బాణము రా! యిదే కుసుమబాణవిసర్జితనూత్న మల్లికా
బాణము రా! మహావిరహపావకతుల్యము రా! కనుంగొనః
ప్రాణముఁ దీయుదానివలె పైపయికిః పరువెత్తి వచ్చురా!
త్రాణ మొసంగ రా! ప్రణయదాసిని నై బ్రతిమాలుచుంటి రా!

ఉ. చిందులు వైచు రా! కుసుమసిద్ధకరుం డదె; సుప్రసిద్ధమా
కందనవప్రవాళపరిఘావృతనవ్యవసంతసౌధ ముం
దందపు వల్లరీజన మహా! యహహా! యని కుల్కుచుండఁగా
తొందర నొందరా! కరుణతో దయసేయుము రా! కృపానిధీ!

ఉ. ఒంటిగ నుంటి రా! మదనుఁ డోర్వఁడు రా! కనులందు నిప్పులం
గొంటుచుఁ జూచు రా! వితతకిల్బిషపూరితమానసుండు రా!
కంటికి నొంటిగాఁ బడతి కన్పడఁ జూచి సహింపలేడు రా!
తుంటరి తేంటివిల్లుఁ గొని తోయజబాణము రువ్వఁ జూచు రా!

ఉ. కాల మిదే; వసంతపరికల్పితపుష్పఘుమంఘుమార్భటీ
జాలనటన్మిళిందసరసప్రతిపత్తుల మించుచుండెరా!
లోలనిరీక్షణల్ ప్రకృతిలో ప్రబలంబులు కానొడంగెరా!
బేలను బ్రోవరా! ప్రణయవీరుఁడవై గణుతింప రమ్మురా!

చ. గబగబ పర్వులెట్టి వెనుకన్ స్మరకింకరు లప్పు రేతరా
జబలగ మన్నటుల్ విపులశక్తులతో ననుఁ బట్టుకొంటకున్
ప్రబలకుతారధార లనవచ్చు సుమంబులు రువ్వినారురా!
యబలను రా! సహాయమని యంటినిరా! దయసేయురా ప్రభూ!

ఉ. రాగిణి నై, భవత్ప్రణయరాగపరాగపినద్ధనై, మహా
భోగ మదే, విముక్తిపథమూల మదే! యనుకొంటిరా! యిదే
యోగముఁరా! నినుం గనుట కోయదునందన! యిట్టి నన్నుఁ బై
రాగినిగా నొనర్పకఁ ద్వరం గనుపింపుమురా! మురాంతకా!

ఉ. కోరితిరా! భవత్ప్రణయగూఢవచోవిషయానుభూతులం
గోరుచునుంటిరా! త్వదనుకూలవిశేషమనఃప్రవృత్తులం
గోరుదురా! భవన్మధురకోమలవేణునినాదమాధురిం
గూరిమిసేయరా! యబలకుం బలముం ఘటింపఁజేయరా!

ఉ. కూరిమిమీరు త్వన్మధురకోమలవేణునినాదమాధురీ
సారములో సతంబు, నను స్వైరవిహార మొనర్పనిమ్మురా!
పారమురా! యదే! మతి కపారముదమ్ము! మనమ్ములోన నే
కోరిక లేదురా! కనులకుం గనుపింపుమురా! మనోహరా!

చ. చిరునగవుల్ తళుక్కుమని చిందు భవన్ముఖనీలకాంతులం
బరపుమురా! మదీయముఖవారిజమున్ వికసింపఁజేయరా!
మురిపెము లొల్కు నాహృదయపుల్లసరోజములో యథేచ్ఛగాఁ
దిరుగుమురా! మిళింద మనఁ దేలుమురా! మది పల్లవించరా!

ఉ. దాగుడుమూత లాడ సరదా పడి దాగితివా! యట్లైన, నీ
దాగుమటంచు నాదు కనుదమ్ములు మూసిన దెవ్వరోయి! యీ
లా గొనరింపుటల్ నయవిలాసములే! యనుకొన్నచోఁ దనూ
జాగృతిలేనివాగియెడ సాగునొకో! వివరింప? మాధవా!

ఉ. వంచన లేలరా! ధవళవారిజలోచన! నిన్నుఁ జూడ, క
న్పించిన యీతమాలతరువృంతము లోబడి యాకునాకు గా
లించితి, కంఠమెత్తి మురళీధర! గోపకిశోర!! యంటి, గ
న్పించవు, నీకు నే నిడిన నేర మెదో? తెలియంగ లేదురా!–

ఉ. భోగముపై పరుండు వని, భోగిశిరంబున నుంటివంచు ది
వ్యాగమవాక్కులన్ విని మహత్తరభోగము లిత్తువంచు, నీ
భోగము లొంద నాసగొని భూసుఖముల్ త్యజియించినానురా!
యీగతి న న్నధోగతికి, నిప్పుడు పాలొనరింపఁబోకురా!

మ. విరిగుత్తుల్ ములుకోలలై హృదయము న్వేధింపుచుండె న్ననుం
గరుణాళూ! మధుపంపుఝంకృతులు, మత్కర్ణంబులందున్ భయం
కరభేరీనినదార్భటీసమములై గర్జింపుచుండెన్, మదిం
బరమానంద మిడన్ సమర్థుఁడవు గాఁ బ్రార్థింపుచున్నానురా!

చ. మలయధరాధరప్రభవమందమరుత్సముఖప్రసారసం
కలనము లిప్పు డుగ్రఋతుకాలసమాగతపశ్చిమాచలా
నిలనిచయప్రసారముల నేర్పులతో ప్రసరింపుచుండెరా!
విలయమురా! మదీయముఖబింబ మిదే వసివాడుచుండెరా!

ఉ. వీనుల విందొనర్చు పరభృత్తరుణీకలకంఠముక్తసం
ధ్వానము వాయసధ్వనివిధానముగా బహుధా కఠోరమై
వీనుల దూరెరా! యిటుల విన్పడ నీయెడబాటు కారణం
బా ననుకొందురా! వనమునం దిపు డుండుట దుర్భరంబురా!

చ. కిలకిలరావముల్ సలుపు కీరయుగంపు పరస్పరంపు, పి
ల్పులు, వినినన్ నభస్థలములోని వలాహకనిస్వనంబులో,
ప్రళయతరంగమాలికల వచ్చు భయార్భటులో యనంగ లో
పల భయముల్ జనించుర! స్వభావము చంచల మయ్యెరా! ప్రభూ!

కం. కృష్ణా! కృష్ణా! యని యీ
కృష్ణద్రుమనిచయమందు- కీరమువోలెన్ -
తృష్ణను గొని తిరిగితి జల
తృష్ణలుగా సలుపఁబోకు ఘృణులను దేవా!

ఉ. కౌగిలియం దిమిడ్చి, కుతుకంబుల ముంచి, సరాగడోలలో
నూగగఁజేసి, మద్హృదయయోగ్యసుఖమ్ము లొసంగి, సన్ముఖా
బ్జాగతవాఙ్మధూమధువు లానను గ్రోలఁగ నిచ్చి, యిప్పు డే
దాగుట లేలనో! తెలియదాయె గదా! మధురాధరాధిపా!

ఉ. కాంచనచేల! నాహృదయకంజము తావకదేహదీప్తి నా
సించి, కనీనికల్ ముడిచి, సిద్ధతపంబున మున్గెగా! ప్రభా
వాంచితమై వెలుంగు భవదంగము నంట ననుగ్రహించి రో
మాంచము గూర్చరా! యికను మామకజన్మము ధన్య మౌనురా!

గీ. వలపుపంటలు పండంగ తొలకరించు
జలదదర్శన మాసించి సత్యదృష్టి
కలిఁగి, యుపవసించెడు చాతకంబు నైతి
తలఁపు లొసఁగర! నీవాక్సుధార లొసఁగి-

శా. భావోద్యానము పల్లవింప, సుమనోబర్హాల్ పురుల్ విప్పి, యా
రావంబుల్ గొని నర్తనల్ సలుపుచుం రాణింపగా హేతువౌ
ప్రావృణ్ణీరద మీవుగా దిరుగు మాపై నేను విద్యుత్తునై
లావుంజూపుచు నుందురా! ప్రణయలీలాఖేలనాపాళిలో,

ఉ. ఇద్దర మొక్కటై మిగుల నింపులు బెంపులు తోఁ జరింప, సం
పద్దశ లెంతలోఁ బ్రబలి బాగుగ క్రొన్నన లీనురా! యిదే
ముద్దియముద్దుకోర్కెర! ప్రభూ! యడియాసలు సేయఁబోకురా!
పెద్దగ నిన్ను వేఁడుదుర! ప్రేమ పిపాసను, ఆదరింపరా!

చ. తగని దెదే నొనర్చినను దాసినిగా క్షమియించి నన్ను, నీ
నగు మొగ మెత్తిచూడర! వినందగు మాటలనాడరా! కనం
దగిన విధమ్మునం గనర! నాహృదయార్పణ జేసినానురా!
సొగ సిది నీయధీన మగుచోఁ! సఫలం బనుకొందురా! వరా!

ఉ. జవ్వని నైతిరా! ప్రణయసారనటత్సుమనస్సరోజ మున్
బువ్వను కాన్కగా నొసఁగి ముక్తిని బొందు నపేక్ష నుంటిరా!
రెవ్వరి కిందు తా వరుదు; ఈవెటులైన పరీక్షఁజేయరా!
త్రవ్వుమురా! కలంచివినరా! [illegible]ల్యము నిన్నె జీరరా—

ఉ. తమ్ముల దూరు నీకనులఁ దాండవమాడు ననంగ సత్కళాం
గమ్ములు దృష్టులం దొలుత గాంచి వరించి, మనంబు నీయధీ
న మ్మొనరించి, యీజగమునం దితరమ్మును విస్మరించి రా!
రమ్మర! రమ్మురా! యని విరామ మొసంగక చీరుచుంటిరా!

మ. ప్రణవోపాసకు లేవిధిన్ విధిని సంప్రార్థింతురో! యట్టులే
ప్రణయోపాసనతోడ నిన్నుఁ గనఁగా ప్రాపంచికానంద వీ
క్షణ నిర్లక్ష్యమనస్క నై, త్వదనురాగప్రాభవోపేతవీ
క్షణ మాసించి తపింపుచుంటిని పరిష్వంగం బిడన్ రావోకో.

గీ. అని యదృశ్యంబు దృశ్యమా నంతదనుక
ప్రకృతిరూపకదృశ్యాలు వదలి, తనువు
మనసు, నిఖిలేంద్రియములును మరచినట్టి
యోగజీవని, రాధిక, యుక్తచరిత.

# తత్త్వ చింత

## శ్రీ కుంటిమద్ది శేష శర్మ



> “భగవద్గీతా కించి దధీతా
> గంగాజలలవకణికా పీతా।
> సకృ దపి యేన మురారి సమర్చా
> క్రియతే తస్య యమోపి న చర్చాం”

“భగవద్గీత, గంగాజలము, ముకుందుడు.” ఈత్రికము చాలపవిత్ర మైనది. యముడు ధర్మరాజు దక్షిణదిక్పాలకుడు, అంతకు డని వాసిగన్నవాడు, దేహావసానసమయమున కళేబరమునుండి జీవుల నాకర్షించి తత్తత్సుకృత దుష్కృతానుసారము సుఖదుఃఖానుభవములకు ననుకూల లోకములను నిర్ణయించి పంపుట ఇతని విధి. ఒక్కరియెడ రాగము మరొక్కనియెడ ద్వేషమును లేనివాడు గాన నీతని సమవర్తి యందురు. ఇతరదిక్పతులకన్న యమునితో ప్రాణులకు వీడరాని సంబంధము.

> “నాగ్ని స్తృప్యతి కాష్ఠానాం నాపగానాం మహోదధిః।
> నాంతక స్సర్వభూతానాం న పుంసాం వామలోచనాః”

కట్టెలతో అగ్నికి, ప్రవాహములతో సముద్రమునకు, తనివితీరనట్లే ఎన్నిప్రాణులను పట్టి శిక్షించినను యమునకు తృప్తి లేదట! విసుగు విరామము లేక తనకు నియమించిన కార్యమును నిర్వర్తించు కర్మఠు డాతడు.

కావచ్చుగాక, మన కీజననమరణపరంపర తప్పు టెట్లు? యమదంష్ట్రికలఁ దప్పించుకొని గడ్డకుఁ బడు టెన్నడు? ఈచావుపుట్టుక లేమిటి? జీవుల కేలఁ గలుగుచున్నవి? అస లీజీవు డెవడు? ఎక్కడనుండి వచ్చెను? ఎచ్చటికి పోవుచున్నాడు?

“జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ” అందురే, “పునరపి జననం పునరపి మరణం పునరపి జననే జఠరే శయనం” అను నీచక్రభ్రమణమున కంతు లేదా? స్వేచ్ఛతో నేజీవు డీ చంక్రమణమునుండి సల్పు చున్నాడా? లేక నితనిని ఈజన్మమృత్యువుల పాలొనరించువా డితరు డున్నాడా? ఇతని కివి యానందజనకములా? దుఃఖోత్పాదకములా? ఇంతకంటె మేలిపద మున్నదా? దానిని పొందు పథ మున్నదా? ఇత డద్దానిని పొందగలడా? ఇత్యాద్యనేకవిషయములను ప్రతివ్యక్తియును విమర్శించవలయును. ఇతరప్రాణుల కీజ్ఞానము లేదు. మానవుడైనను నీయాత్మపర్యాలోకనము చేయక తప్పదు. అప్పుడే అతని మానవత్వము ధన్యము. లేదేని నరజన్మ మెత్తియు ‘పాదయుగముతోడి పశువుగాదె’.

ఈవిచారము బాహ్యేంద్రియాతీతము. జ్ఞానదృష్టి మాత్రగమ్యము. ప్రతివ్యక్తి ప్రతివిషయమును ఆదినుండి స్వానుభవమువలన కనుగొనవలయు నన్న నేదియు తునిముట్టదు. లౌకికవిషయములందువలెనే పారలౌకికములందును పూర్వుల అనుభవములను ఆకళించుకొని జీర్ణించుకొని స్వాయత్తమొనర్చుకొని వాని నూతగా గొని పైవిషయముల గ్రహించుటకు యత్నించిన గుటి నందుకోగలడని విశ్వసింపవచ్చును.

ఈయాత్మవిషయకనిర్ణయములు ఒకొక్కని యనుభవమున నొకొక్కటెన్నన బోయినవి. లోకోపకృతికై యవతారమెత్తిన యొకొక్క కారణజన్ముడు స్వతపోవిశేషముచే నాధ్యాత్మికవిషయజలధి మథించి తేర్చిన నవనీతమొక్కవిధము. తా గనుగొన్న మహత్తరవిషయమును తన్నాశ్రయించిన వారికి బోధించి, వారి నామార్గమున నడిపించెను. ఆయామార్గములే తత్త్వమతములుగా వాసిగన్నవి. “దేవుడు, వాని లోగొనెను తెన్నుగదా మత మన్న!” దేవు డున్నాడా? ఉన్న వానిస్వరూప స్వభావము లేమి? అతనికంటె తాను అన్యుడా అనన్యుడా? తన స్వరూపస్వభావము లేవి? దేవు డున్న, వాని లోగొను

మార్గ మెయ్యది?" అనునదే మతము.

"కా తే కాంతా కస్తే పుత్రః
సంసారోఽయ మతీవ విచిత్రః।
కస్య త్వం వా కుత ఆయాతః
తత్త్వం చింతయ త దిహ భ్రాతః"

అని ప్రశ్నించుకొని విమర్శించుకొమ్మనిరి శ్రీశంకరభగవత్పాదులు.

"అన్న! నీవెవరోయి? ఆ లెవ్వరోయీ?
గోవిందు నేమరక భజియింపవోయీ
ఇది యసార పువిచిత్ర సంసార మోయీ?
నీరాక కత మిటకు యోచింప వోయీ?
ఎందుండి నీవిటకు నేతెంచితోయీ?
ఏమేమి చేయగా నూహించితోయీ?
ఏరోడకు నిందుండి పోదలచితోయీ?
చిత్తమ్ములో నుంత చింతింపవోయి?
నాయిల్లు నాయాలు నావాకి లనుచు
కొడుకులను బిడ్డలను మనుమలను గనుచు
తనకు దా బంధములఁ దగిలించు కొనుచు
విడవ కిడుమలు గుడతు విదె సుఖము లనుచు
నీ కేల వీరిపై నెనరు చూపగ నేల?
సంపదలఁ బొంగి యాపదలఁ గుందఁగ నేల?
ఇదె శాశ్వతము సత్య మని భ్రాంతిపడ నేల?
అది దొలంగిన యంత నవకుండు గానేల?
బంధువుల వీరు? నిను బంధింపలేరోయి;
నీవు పోయెడివేళ నీవెంట రారోయి;
నీ వేని, ని న్నేని వారు విడిచెదరోయి,
నేడు గాకున్న రేపైనఁ బాసెదరోయి;
మూణ్ణాళ్ళముచ్చటకు నీమురిపె మేలోయి
పలుమారు పుట్టుటలు గిట్టుటలు నేలోయి?
రాకపోకలచేత రాపాడ నేలోయి
పరమపదమును జెందు పథము గనవోయీ ||అన్న||

వెంట వచ్చిన దేహ మిదె శాశ్వతము గాదు
అసువు లెడసిన పిదపఁ బుడమి నిలబడబోదు
అపుడొ ఇపుడొ దీని గడువు తెలియఁగ రాదు
ఆపైన వగపు నీ కావంత కొఱగాదు ||అన్న||

దీపముండగ నిల్లు దిద్దుకొనవోయీ
సద్దిపై తెగవునకు సమకూర్చవోయీ॥
ధర్మసాధనవరము దేహ మేనోయీ
పరము విషయేచ్ఛలకు బలిపెట్టకోయీ ||అన్న||

అని శ్రీశంకరాచార్యులవారు భజగోవిందములో, "భ్రాతః = సోదరా!" అని యెంతో ఆదరముతోఁ బిలిచి తత్త్వచింత సేయుమన్నారు. ఇదే నిన్ను గడతేర్చును. ఇతరము లెన్ని విద్యలు నేర్చినా కూటికే. అవేవీ పరమపురుషార్థము సాధింపలేవు.

"భజ గోవిందం భజ గోవిందం భజ గోవిందం మూఢమతే" అన్నారు.

భజ ముకుందుని భజ ముకుందుని
భజ ముకుందుని తమ్ముడా!
చావుకాలము దాపురించినఁ
గావ వేవియు మూఢుడా!! ||భజ||

రేయిగడచును పగలు డాయును
రేపు దొలగును మాపు మాయును
పోవు శిశిరము చను వసంతము
కాలకేళిని మురిసి చూతును||
బెజ్జ ముండిన కడవఁబోసిన
నీర మడుగడుగునకు దీసిన
తెరగు దోపగ మేనిప్రాణము
తరిగిపోవుట మనము గానము. ||భజ||

ఆయు వెంతటిదాక నుండును
కాయమందున నడుగుచుండును
బంధువర్గము కుశల మాతరు
వాత నందరు నేవగింతురు.
కలిమిలేముల మేలుగీడులఁ
బొత్తుకత్తెలు చిగురుఁబోడులు
ప్రాణవాయువు లెగిరిపోయిన
వెఱతు రాతని మేని డాయను.
బ్రతుకు నది యినుమంతకాలము
రేలు మ్రింగును సగము కాలము
పసితనమ్మును ముసలితనమును
బోవ వయసది యెంత కాలము? ||భజ||

చిన్నతనమున నాటమక్కువ
చీకు చింతలు ముదిమి నెక్కువ
పరువమునఁ బ్రియురాలిచక్కన
భ్రమలు గొలుపఁగఁ జేర్చు నక్కన
కామకోపము లెడసి యొక్కఁడు
పరమపురుషుని తెరువుఁద్రొక్కఁడు; ||భజ||

ఎంతవరకును ధనము దెచ్చును;
మేలితొడవులు వలువ లిచ్చును;
మేడలును మాడీలు గట్టును
ఆటపాటల సౌఖ్య పెట్టును
అంతవర కాత్మీయు డందురు
చెంత మూగి చరించుచుందురు.
మారు నందము వీరు నందురు
వీరు డందు రుదారు డందురు.
గడన యుడిగిన, బడలి సడలిన
ఇంద్రియంబులబిగువు దప్పిన
అరులు మరులును మదికిఁ గప్పిన,
ఆలుబిడ్డలు నాదరింపరు. ||భజ||

కుచకచములను ఘనజఘనమును
కమలముకులము లలులచయ మని
విపులసైకత మనుచుఁ దలచుచు,
వేఁదులును గొన వలదు నిజముగ;
తోలు నెమ్ములు వస నరమ్ములు
నిండి యుబికిన కండ నెత్తురు
పంజరమ్ముల గాదలంపుము
తథ్యమెఱిఁగి సదా చరింపుము|| ||భజ||

అని తత్త్వచింత గావింపవలయునట! «యద్దృశ్యం తన్నశ్యం» కనిపించున దంతయు నస్థిరము. దీనివలనఁ గలుగునది యానందాభాసము. మిసాలపై తేనియ లవి. శాశ్వతానందమునకు ప్రయత్నింపు మనెద రాచార్యుల వారు.

«అయిన జీవాత్మపరమాత్మల స్వరూపస్వభావముల విడమఱచి విమర్శించి చెప్పున వేవి? ఎందు నీయాత్మవిచారము విపులముగ చర్చించబడినది.» అని ప్రశ్నించిం:

దేవుడు లేడు పరము లేదు. దేహమే వ్యక్తి. «భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః» అనేవారు «పునరపి జననం పునరపి మరణం» అని జననమరణపరంపరలకుఁ జిక్కుపడుదురు. «అయం లోకో నాస్తి పర ఇతి మానీ పునః పునర్వశ మాపద్యతే మే» «ఇదే యథార్థలోకము. ఇతరము లేదు.» అని తలంచేవాడు మాటిమాటికి నావశ మగుచుండును» అని కఠోపనిషత్తున యముఁడు నచికేతునకు చెప్పును.

ఆస్తికమతము లన్నింటిలో వైదికమతము పరబ్రహ్మను విపులముగా విమర్శించినది.

దీనికి ప్రధానగ్రంథములు ఉపనిషత్తులు. బ్రహ్మసూత్రములు, భగవద్గీత. వీనినే ప్రస్థానత్రయ మందురు.

ఉపనిషత్తు లనంతములు. అన్యోన్యవిరుద్ధములుగ గనుపించు వానివాక్యములను సమన్వయించుకొని అర్థము నిర్ణయించుకొనుట కడింది. బ్రహ్మసూత్రము లన్ననో పండితైకసాధ్యములు. అంతియగాక అవి రెండును జనసామాన్యమున కగమ్యములు. అధికారి నియమము గలవి.

భగవద్గీత కావ్యభాషయందున్నది. తత్పఠనమున కందరు నధికారులే. నరునకు నారాయణునిబోధ యది.

అందు ఆత్మానాత్మవివేకము, జీవాత్మపరమాత్మల స్వరూపస్వభావములు పరమాత్మప్రాప్తిసాధనములు ముముక్షువు లనుష్ఠించవలసిన విధానములు అందు వివరింపఁబడినవి. అందుచే నిది యుత్తమోత్తమ గ్రంథము. నరునకుపదేశింపబడినది గాన నరులందరు నవశ్యము పఠింపఁదగినది.

'గీతా సుగీతా కర్తవ్యాః కిమన్యైః శాస్త్రసంగ్రహైః
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిస్సృతా'

అని వ్యాసమహర్షి శ్రీకృష్ణభగవానుని ముఖకమలవినిర్గతమగు గీతయొక్కటి చాలును. పలుశాస్త్రము లేల? అన్నియుపనిషత్తులను గోవుగా జేసి, నరుడు చేపగా, కృష్ణుడు పిండిన గీతామృత మిది. ఈ యమృతము కొంచెమాస్వాదించినను ధన్యులము.

'కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వ
మిదం విజ్ఞాతం భవతి'

అని ముండకోపనిషత్తున శౌనకు డంగీరసుని ప్రశ్నించును: 'దేని నెఱింగిన సర్వ మెఱింగినట్లగునో దాని నుపదేశించు' మనును.

పదిరెండేండ్లు సాంగవేదము లధ్యయనము చేసి ఇంటికి మరలివచ్చిన శ్వేతకేతువును తండ్రి ఉద్దాలకుడు 'నాయనా, సౌమ్యుడా, శ్వేతకేతూ!

"యేనాఽశ్రుతగ్ం శ్రుతం భవతి
అమతం మతం? అవిజ్ఞాతం విజ్ఞాతం?"

'దేనిని వింటే వినని దంతయు విన్నట్లగును? అమతము సమ్మతమగును? తెలియనిది తెలిసినట్లగును. అది నీకు తెలియునా? చెప్పు'మంటాడు ఛాందోగ్యమునందు.

ఈవిధముగ నుపనిషత్తులయందు వివరింపబడిన బ్రహ్మస్వరూపమును భగవద్గీత సాంఖ్యయోగమున వివరించినది. కావుననే 'భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే' —అంటారు.

ఉభయసేనామధ్యమక్షోణిలో కృష్ణుడు నిల్పిన రథంబుపై నిల్చి, ఇరుసేనల పాఱఁజూచి, రెండనీకములయందున్న తాతల తండ్రుల, గురుల భ్రాతల సుతుల నిధనమునకు కారణము కాఁజాలక విషణ్ణుడై రథముపై కూలఁబడినాడు నరుడు. అది నెపముగా గొని ఆత్మానాత్మవివేకము గలిగించినాడు కృష్ణభగవానుడు

'ఓ అర్జునా! పండితునివలె పలుకుచున్నావు. పెద్దలను బంధువులను చంపలేను. వినలేత్తలేను' అనుచున్నావు. ఏల నీకీ దుఃఖము? వారు చత్తురు; నీవు చంపువాడ నని భ్రమించెదేల? చంపితి ననువాడు, చచ్చితి ననువాడును, అవివేకులే. జీవికి శరీరమునందు బాల్య యౌవన వార్ధక్యములవలె దేహాంతరప్రాప్తియు గల్గుచున్నది. జీర్ణవస్త్రములను దొలగించి నూతనవస్త్రములు దాల్చినట్లు, ప్రాతది వీడి క్రొత్తదేహము జీవుడు ధరించును. కావున శరీరమునకు అపాయము గల్గినను ఆద్యంతములు లేని జీవు నెవ్వడెట్లు చంపును? కత్తితో నిది తెగదు. నీట నానదు. నిప్పున గాలదు. ఇది నిత్యము. ఇట్టి జీవుల నెవ్వడు చంపఁగలడు. వీరిని చంపుదు నను నీ వెంతటి వివేకివి? వీరికై శోకించెడి నీ వెంతమనీషివి'? ఇత్యాదిగా నాత్మస్వరూపము వివరించి పరమపదప్రాప్తికి అవసరములగు కర్మయోగము భక్తియోగము ప్రపత్తిమార్గము బోధించినాడు.

ఇతరమతములఁ దెగడకుము. ఇతరదైవోపాసకుల నిందింపకుము. అట్లు చేసిన, వారు రెంటికిఁ జెడుదురు. క్రమముగా వారే సరియగు మార్గమునకు వత్తురు. నేను సర్వాంతర్యామిగాన, నెవనిని పూజించినను నన్నుఁ బూజించినట్లే. ఇతరదైవతము లొసంగు నల్పఫలముల లాఘవము నెఱింగి కడకు సాక్షాత్తుగా నన్ను భజింతురు. నేనే జగత్సృష్టిస్థితిలయకర్తను. ఇట్టి నన్ను మానుషదేహధారి యైనంత మాత్రమున సామాన్యమానవునిగాఁదలంచువారు మూఢులు. ప్రకృతి నావశముగాని, నేను ప్రకృతిబద్ధుడను గాను. నా మాట వినుము.

'నాప్రాప్తికై మును పుపదేశించిన జ్ఞానకర్మభక్తిమార్గములు అసాధ్యములు. 'వాని కే నశక్తుడను' అని వంతఁగుందనేల? అన్ని ధర్మములు వదలిపెట్టుము. అనగా నేను చేయువాడు అను అహంకారము, ఇవి నాకొరకను మమకారము, ఈ కార్యములవలన గలుగు ఫలము వదలిపెట్టి భృత్యునివలె నిమిత్తమాత్రుడుగా కర్మల చేయుము. యుద్ధ మొనర్పుము. నిన్నే పాప మంటదు. నీచే విడువబడి పెద్దల హింసించిన బాణములకు పాపము లేనివిధముగ నాచే ప్రేరితుడగు నీకు పాప మంటదు. రాజ్యాశ వదలి స్వధర్మమని యుద్ధ మొనర్పుము. నీకే పాపము లంటకుండ విముక్తుని చేయు బాధ్యత నాయది' అని బోధించెను.

'స్వధర్మములను సన్యసించితి. నీదు చరణకమలములను శరణమంటి కావవయ్యా, యన్యగతిహీను నారాయణా రమేశ, కేశవా, ముకుంద!' అని శరణాగతుడైన వాని భారము తాను భరించు పరమాత్మతత్త్వప్రతిపాదక మగు భగవద్గీత యెంత యుత్తమగ్రంథము!!

విషయ మేమున్నదో తెలిసికొని చేపట్టవలెగాని, చవిగన్నవాడు దీని వీడునా! నరునికివలె నిర్వేదముగన్న మానిసికిది పరమౌషధము.

'గీతాయాః శ్లోకదశకం సప్త పంచ చతుష్టయం ద్వౌ త్రీనేకం తదర్థం వా శ్లోకానాం యః పఠేన్నరః చంద్రలోకమవాప్నోతి' ఇత్యాదిగా గీతామాహాత్మ్యము వివరింపఁ

బడినది. కాననే 'భగవద్గీతా కించి దధీతా—' అన్నారు.

అట్టిదే గంగానది.

'కః స్వర్ధుని! వివేకస్తే నయసే పాపినో దివం'
అని చంద్రాలోకము. 'గంగా నీవు తెలివియున్నదా? పాపుల నందరిని పునీతులఁజేసి స్వర్గమున కంపుచున్నావే!' అని వ్యాజస్తుతి చేయబడినది.

ఇక ముకుందుడో:

ఎక్కి రథంబులఁ దిరుగను
త్రొక్కుల నందుకొనఁ గలరు ముక్కోటిసురల్
ఇక్కట్టు పాచి ప్రోవను
నిక్కముగా నిన్నుఁబోలె నీవ మహాత్మా!'

అని జీవికి గల సకలక్లేశములకు ప్రధానకారణమగు భవసంకటము హరించువాడు ముకుందుడు. 'మోక్ష మిచ్ఛేత్ జనార్దనాత్' అని సూక్తి.

'స్వపురుష మభివీక్ష్య పాశహస్తం
వదతి యమః కిల తస్య కర్ణమూలే
పరిహర మధుసూదనప్రపన్నాన్
ప్రభు రహ మన్యనృణాం న వైష్ణవానాం.'

తనభృత్యుని పిలిచి, చెవిలో, 'హరిభక్తులకడకు నేగకుము. ఇతరుల కేను ప్రభువేగాని హరిసేవకులకు గాదు' అన్నాడట యముడు. అందుకే:

'నారాయణ కరుణాలయ శరణం కరవాణి తావకౌచరణౌ,
ఇతి షట్పదీ మదీయే వదనసరోజే సదా వసతు—'

అని యన్నారు శ్రీశంకరాచార్యులవారు.

కనుక భగవద్గీత గంగ ముకుందుడు ముగ్గురూ ముగ్గురే. అందుకే:

'భగవద్గీతా కించి దధీతా
గంగాజలలవకణికా పీతా
సకృ దపి యేన మురారి సమర్చా
క్రియతే తస్య యమోపి న చర్చాం.'

అని పాడినారు శ్రీశంకరభగవత్పాదులు.

# ర త్న మా ల

## శ్రీ మోచర్ల రామకృష్ణ కవి



శ్రీయోషామణికిరణ
స్ఫాయదురస్స్థలవిలోలవరకౌస్తుభ రు
గ్భాయశ్శృంగారరసా
మ్నాయాశ్రయనాట్య రంగనాథస్వామీ !

దేవాదిదేవ, వినఁ దగు
నీపై నను మామకీనకృతి వేడుకమైఁ,
గోవిదులేని వినోదము
గా విందురుగాదె కొండికల జల్పములన్ !

.... .... ...

అల శంభాజికిఁ దనయుఁడు
గలఁ డొక్కఁడు *శివసమాఖ్యగలవాఁ డతఁడు
మ్మలికముతో ఢిల్లీతుర
కల నిర్బంధమున సుచిరకాలము గడపెన్.

అతనిఁ బట్టి తురకమతమునఁ జేర్ప నౌ
రంగజేబు తమి తుఱంగలింప
సలిపినాఁడు జతనముల నెన్నియో, కాని
వ్యర్థమయ్యె వాని యాశయంబు.

అవురంగజేబుకూఁతురు-
చివురాకువజీరుబాకు- జీనతున్నీసా
అవలోకించె నొకానొక
యవసరమున బంధనాలయస్థితు నతనిన్.

చూచి యతని మూర్తి సోయగమ్మున కాత్మ
నలరి ప్రాణసఖులవలన సరగ
మొనసి వాని పుట్టుపూర్వోత్తరము లెల్లఁ
దా గ్రహించి యేకతమున నెలఁత.

"కట్టా, యట్టి మనోహరాంగునకు భో
గ్యం బయ్యెనే యిట్టి యి
క్కట్టుల్ ! చక్కని మల్లెదండ చెడఁ ద్రొ
క్కంగాఁబడెన్ తొంపిలోః
నెట్టెట్టో వినువీథిలో నెలమిమై జృం
భించు రాయంచకున్
బట్టెన్ దుర్గతి- పాడు పంజరపుని
ర్బంధం బవార్యంబుగాన్ !

పదియార్వన్నెపసిండినే పరిహసిం
పన్‌జాలు మైచాయ- శా
రదరాకేందునిగేరు మోము- శతపత్ర
శ్రీయుతమ్ముల్ కనుల్-
కుదురుం గోమలికమ్ము నున్నతి వెడ
ల్పౌం గల్గు వక్షమ్ము- పెం
పొదవన్ జానువు లంటు బాహువులు- సే
యున్ లోచనానందమున్.

ఆభిజాత్యంబు రూపించునట్టి రూపు-
ప్రాయపుం బాలపొంగు లేపారు తీరు-
తనరు నీమోహనాకారుఁ దగవు మాలి
తొడికి మాయయ్య చెఱసాలఁ ద్రోసినాఁడె !

* ఈయనకు "సాహూ" యను మాఱుపేరు గలదు

జనకుఁడు నాకు నిక్కువమె-
సాధుల నీక్రియ బాధవెట్టుటన్
విని కని వెక్కసంపడుచు
నే దిన మొక్క యుగంబు గాఁగ నా
మనుగడఁ ద్రోయుచుంటి- నఖి
మానము నాయెడఁ జూపుఁగాని, యి
మ్మని సలహాలు న న్నడుగు
నట్టిఁడుగాఁ డతఁ డేమి సేయుదున్ !

ఇతని బలాత్కరించి యల
యించి యెటైన మహమ్మదీయసం
స్కృతికి నిబద్ధుఁ జేయఁగఁ బొ
రింబొరి నాజనకుండు నిత్యమున్
యతనము సేయుచుంట నకి
యల్ వివరించిరి, వింటి, దీన నే
వెత యతఁ డొందునో, పితయ
పేక్షిత మాఁటిపుచ్చియక్కటా !

ఏపగిది నైనఁ దప్పక
కాపాడం దగినవాఁడుగాఁ దోచు నితం
డీపని కుపయోగించెద
నా ప్రొలపము తెలివితేట నాపలుకుబడిన్.''

అని నిశ్చయించుకొని త
ద్వనజానన తనమనోరథము సాగింపన్
మునుకొని యనువగు మార్గము
ననుకూలం బైన యదను నరయుచు నుండెన్.

కడచెను గొన్నిదినము లీ
వడువున, నౌరంగజేబు పనివడి యొకనాఁ
డడచిపడి పిలువఁబనిచెన్
మడినడవడివానిఁ దుర్కమతగురువరునిన్

ఆగతునికి వాని కర్హాసనం బిచ్చి
సేమ మడిగి తా వచించె నిట్లు-

''తరలువార మేము దక్షిణదిక్జైత్ర
యాత్ర సేయ తేపురాత్రి కరయ.

మనచెఱలో శివాజిమను
మండు గలండు గదా, యెటైన వా
నిని వెరవూని తేపు తమ
నేర్పునఁ జేయఁదగున్ మహమ్మదీ
యునిగఁ, బలాత్కరించినఁ బ్ర
యోజన మించుకగాని కల్గఁబో
దని మది నెంతు, యుక్త మగు
నట్టి విధమ్మును మీ రొనర్పుఁడీ !

వీరిది మొండిజాతి- తమ
వృద్ధికి మార్గముఁ గానలేరు- వి
డ్డూరపు వింతపట్టు లెపు
డున్ విడివోవనివారు- తొల్లి యే
తీరున వీనినాయన మృ
తిన్ వరియించెనొ యీ రెఱుంగరే ?
యే రిహిఁ జేయఁగల్గుదురొ యీతని
మీరు మహమ్మదీయుఁగాన్ !

మన యుపదేశము వినలే
దని యీతనిజనకుఁ ద్రుంచినట్టులు వీనిన్
దునుమక నిలిపితి, జతన
మ్మొనరిచి మతమందుఁ జేర్చు టుచితమను మతిన్.

తే పేమ తరలిపోయెడు
లోపల, ముసిలిములమతములో నీతని మీ
రోపికమెయిఁ గలిపిన, ముద
మేపారఁగ దండయాత్ర కేగుదు మయ్యా !''

ఈమెయి నిజకామన యా
గామిడికాజీకిఁ దెలుపఁగా, నాతఁడు త
ద్భూమిపతిసెలవుఁ గొని చనె
సామర్థ్యముకొలఁది కడకసల్పుదు ననుచున్.

నికటాంతఃపురమందిరస్థ జినతు
క్నిసా పితృవ్యాహృతిౕ
సకలంబున్ గ్రహియించెఁ బ్రత్యయితుఁ డం
తర్వంశికుం డొక్కఁ డొ
ద్దికమైఁ దా విని విన్నవించుట, నిజో
ద్దేశంబు సాధించు మే
రకు యోజించి వినిశ్చయించుకొనెఁ గ
ర్తవ్యాంశ ముల్లమ్మునన్.

విశ్వసింపఁ దగిన వృద్ధకంచుకి నొక్క
రువునిఁ బిలిచి వానిచెవి నిగూఢ
విషయ మెదియొ చెప్పి, వేగ బొమ్మనియె శం
భాజితనయుఁ డున్న సదనమునకు.

ముదలఁ దల ధరించి పోయి సౌవిదుఁడు శం
భాజినందనునికి మాటఁ జెప్పి
మరలె నంతిపురికి మఱునాఁడు వఱువాక
పాదుసాహికార్యభరము నూని.

కాజీ వేగిర మేగి చూచునగదా
కారాగృహస్థుండు శం
భాజీపుత్త్రుఁడు కానిపించె, గళసీ
మన్ బ్రేలు హారమ్ముఁ బే
రోజౕ ద్రుంపు లొనర్చి తన్మణులు ది
గ్వ్యూహంబునన్ జిమ్ముచున్
గైజంటన్ విదిలించి నేలనిడి మొ
గ్గల్ వేయుచున్ వ్రాలుచున్.

"ఇది యేమి? యేటి కితఁ డిటు
సదమద మగుచున్నవాఁడు? శంభాజిసుతుం
డదిరా, యితఁ డేనా? చూ
చెద మెలఁకువ కలిమి యితనిచేష్టల నెల్లన్"

అని యతండు లోని కరుగక, తనవెంట
వచ్చినట్టి భటునిఁ బంపి పైచి

కడఁగి, చూచుచుండె గదిగవాక్షమునుండి
యొగి శివాజిపౌత్త్రుఁ డున్నయునికి.

ఒకపెను కేక వైచి పడె
నుర్విపయిన్ – వికటాట్టహాసముం
బ్రకటముచేసి లేచి నిలు
వంబడె, నేడ్చెను – దానె యూరడిం
చుకొనియెఁ దన్ను, మంచమున
సోలెను – గ్రమ్మఱ లేచి పాటపా
డుకొనుచుఁ గట్టుపుట్టమును
డుల్చి తటుక్కనఁ జించె నిల్వనన్.

పైనముగఁ జేసికొనెఁ గౌ
పీనముగా మడిచి యొక్కపేలిక, నుదుటున్
మానక మఱియొక చీలిక
నూని శిరోవేష్టనమ్ము నొనరించుకొనెన్.

"ఏదిరా కిరీట మెచట దాచితివిరా
సేవకాధమా వచింప వేమి?"
యనుచు గోడమీఁది యద్దములోఁ దన
వదన మరసి యుఱిమి పండ్లుగొఱికి.

'మననేరవు, చచ్చితి వను
కొనరా!' యని యెదుటి నీటికూజాఁ గొని, జి
వ్వున విసరివైచె నద్ద
మ్మును మఱి కూజాయు వేయిముక్కలు గాఁగౕ.

"అయినదా శాస్తి? చాలునా?" యనుచు నవ్వు
కొనుచు గిరగిరఁ దలఁద్రిప్పుకొనుచుఁ దొడలు
చేతులం గొట్టుకొనుచు వచ్చెను బిరాన
బయటి కాజీని గనెను శంభాజికొడుకు.

కాంచి కవుఁగిలించి కాజీని, బుజములు
వట్టి కూరుచుండఁబెట్టి, యిట్టు
లడుగఁజొచ్చె నతని హస్తాంగుళుల నొక్క
టొకటి లాగి నెటిక లొకట విఱిచి.

''బంగారుబొంగరము నీ
యంగీలో దాఁచుకొంటి వని యెరుఁగుదులే,
దొంగతన మేలరా, నా
యుంగర మిచ్చెదను మ్రింగుమో యబ్బాయీ!

చదివితివా పాఠము? వ
చ్చెదవా కుస్తీకి? శిస్తు చెల్లించితివా?
మెదలింప వేమి పెదవిని?
మదమా? నామీఁద కోపమా యబ్బాయీ!

మంచివాఁడ వబ్బాయీ, నన్ను మో
హించినాఁడవా? పిండివంట చే
యించినాఁడఁ, దిని పొమ్ము లెమ్ము, గ
ర్వించినాఁడవా? పల్క వేమి? నో
రించుకైనఁ గదలించవేమిరా?

అని పాడి యాడి యాతఁడు
మునుకొని కాజీని గదియఁబోవఁగ 'నిలువం
జన దిఁక' నని కాజీ లో
ననుకొని తా లేచి నెట్టె నతనిన్ గదిలోన్.

తలుపు చిలుకువెట్టి యల చెఱకావలి
వారి కెఱుకపఱిచి, వలసినట్టి
యత్తరువు లొసంగి, రిత్తవోయిన మనో
రథముతోడ మందిరమ్ము జేరె,

మేకొని తలపెట్టిన పని
కాకుండుట కడలి, ఱేనికడ కరిగెను: నాఁ
డాకస్మికముగ శంభా
జీకొడు కున్మత్తుఁడగుట చెప్పె నతనికిన్.

'కడపినాఁడు పదునొకండేండ్లు చెఱసాల
నేడువత్సరముల యీడునుండి
సాధు' వనుచు ఱేఁడు శంభాజియాత్మజు
నించుకేని సంశయింప లేదు.

తనకొలువునఁ గల మతగురు
జనులన్ దలమానికంబు, చారిత్రముచే
ననఘుం డని కాజీ ప
ల్కిన పల్కులు ఱేఁడు మదలకింపం డెపుడున్,

చేయఁదగిన ప్రతిక్రియ చేయుఁడంచుఁ
దనచికిత్సకులకుఁ జెప్పి, దండిదండు
దనర, మొగలాయిపాదుషా దండయాత్ర
నెఱప నానాఁటిరాత్రికే తరలిపోయె.

చలపాదియై మహారా
ష్ట్రులకోటలు ముట్టడించుచున్, మఱి వా
రలతోఁ బెనఁగుచు, నతఁ డు
త్తలపడుచున్ దక్షిణాపథముననె చచ్చెన్.

అల్లనాఁటియుద్ధయాత్రకై పోయి ఢి
ల్లీని మరలఁ జూడలేదు ఱేఁడు-
చక్కఁబడకపోయె శంభాజిపుత్త్రుని
పిచ్చిమొగలువిభుఁడు చచ్చువఱకు.

తదుపరి బంధవిమోచన
మొదవెను శంభాజిసుతుని కొక నెలలోనే-
పదునెనిమిదేండ్లచెఱ వో,
స్వదేశమున కరుగుదినము ప్రాప్తం బయ్యెఁ.

పయనమగుటకుముందు శంభాజితనయుఁ
డంతిపురిచేరువకుఁ జేరి యచటి సౌవి
దల్లులకుఁ జెప్పె 'వలయు నిత్తఱిని నాదు
రాక మీరలు జినతున్నిసాకుఁ దెలుప.'
వారలు వల్లెయని లోనికరిగి యవ్వనిత కెఱింగించిన.

ఈసంగతి విని జినతు
న్నీసా విచ్చేసి, తగిన నెలవున నొకచో
నాసీనుఁ జేసి శంభా
జీసుతునకుఁ దనకు మఱుఁగుచీర యెసంగన్

"ఓహో, యేమి విశేషము
సాహూ !" యని పల్కరింప, "జననీ యివె నా
జోహారులు గొనుమీ, నీ
సాహాయ్యమునకు సౌమ్యసంపన్నతకున్.

విషభూరుహమున నావిర్భూతి నందిన
లలితమందారవల్లరివి నీవు,
హాలాహలసముద్రమందు జన్మించిన
కమనీయపీయూషకలశి వీవు,
కారుచీఁకట్లకాంతారాంతరమ్ములో
వెలిఁగెడిదివ్యదీపికవు నీవు,
కాలకుంభీనసగ్రసితుల రక్షింపఁ
గలిగినసంజీవకరణి వీవు,

తల్లి, యౌరంగజేబునందనవుగా జ
నించి నన్నుద్ధరించిన నీకు నాకృ
తజ్ఞతావందనప్రాభృతం బొసంగి
సెలవు గొనిపోవ నెంచి వచ్చితిని నేఁడు.

అమ్మా, నీపితచేత నాఁడు చెఱఁద్రో
యంబడ్డ నే నెట్లు నీ
నెమ్మిన్ సేమము నొందినాఁడనొ, యె
టుల్ నీసూచనన్ వెజ్జి త
త్వమ్మున్ మేకొని, వైపుదప్పక మత
భ్రష్టుండఁ గాకుంటినో
యమ్మర్మమును నీవెఱుంగుదువు స
ర్వాత్ముం డెఱుంగుం జుమీ !

తమితో నాయోగక్షే
మము లనెడి కనీనికలను మహి నీ యభిమా
నము నీదు జాగరూకత
స్తిమితపు ఱెప్పలయి కాచె జినతున్నిసా !

క్షమఁ గల మా కులదేవత
యమృతాత్మ భవాని యార్తి నణఁగెడివారిన్
మముఁ గాపాడఁగ నీహృద
యమునఁ బ్రవేశించియుండు నని యూహింతున్."

అని మఱి యేమేమో వచియిం
ప నతఁడు ముసుకొనఁగ, నొక్కపళ్ళెరమును గై
కొని వచ్చి యొక్కభటుఁ డా
తనికడ నిడి నిలిచె వినయతాత్పర్యమునన్.

అపుడు తెరచాటుతెఱవ యి ట్లనియెఁ "దండ్రి,
నాఁడు నీ వాడినట్టి యానాటకమునఁ
గోలుపోతివి మంచి రత్నాలపేరు,
కాన నే నిప్పు డొసఁగెదఁ గాన్కఁ గొనుము."

అనుచు, దాను దీసికొని వచ్చి పెట్టిన
పయిడిపళ్ళెరమ్ముపయి పటమ్ముఁ
దొలఁచి, పూలనడుమఁ గల వజ్రహారమ్ము
నునిచె సాహుకంఠమున భటుండు.

ఏతన్మణిహారరుచి
స్రోతస్సులయందు సాహు సుస్నాతుండై
ద్యోతించుచు జినతున్ని
సాతో నిట్లనియె గళము సంస్తంభింపన్.

"మాట వచ్చుటలేదు నా నోటివెంట,
నైన, యత్న మ్మొనర్చి ని న్నడుగుచుంటిఁ,
దప్పుగా దని తలఁతు– యుక్తంబె యైనఁ
దల్లి, నా కిమ్ము భవదీయదర్శనంబు."

అట్టు లాతండు వచియించినట్టి తఱినె
వీచె నొకమంచి పయ్యర– ఊఁచెఁ దెరను:
గాంక్షితం బైన రూపంబు కానఁబడియె,
నతఁడు సాష్టాంగవందన మాచరించె.

అడుగులను బాష్పజలములఁ
గడిగెన్, సెలవుగొనెఁ, గదలెఁగడువడిఁ, బయనం
బెడతెఱపిలేక యొనరిచె,
నడరిన తమకమునఁ జేరె నతఁ డభిజనమున్,

చేరి మహారాష్ట్రమ్మున
శారూఢి నరేంద్రుఁ డయ్యె నాతండు, మహా
శూరుఁడు గాఁ డైనను దా
నొరుగ నేలబడి నెఱపె నలుబదియేడుల్.

# దేవీ స్తుతి

## శ్రీ టి. బి. యమ్. అయ్యవారు



సౌరభ్యంబవు- చంద్రమౌళి యను పుష్పం బీవె లేకున్న- నా
నారాజన్నిగమద్రుమాటవుల చిందన్ నేర్చునే? యందముల్-
సారింపం గలవాడె- హాలహలకీలాప్రౌఢహేలాచ్ఛిదా
ప్రారంభుండు- శ్రితాళిపై శిశిరదృక్పాతంబు- కామేశ్వరీ!

ధనముల్- శారదచంద్రికాధవళవస్త్రానీకముల్- భూరికాం
చనభూషామణిసంఘముల్- మదవిరాజత్కామినీనేత్రకో
ణనితాంతచ్ఛవులం దగుల్కొని చిదానందమ్ము పోనాడు నా
మన సేనాటికి నిత్యశాంతి గను నమ్మా! రాజరాజేశ్వరీ!

జననం బందిన దాది- నింద్రియసుఖేచ్ఛాక్రీడలన్ బ్రొద్దుపు
చ్చిన మూర్ఖుండను- తల్లి! యెట్లో కలిగెన్ శ్రీచక్రనీరేరుహా
సనవై- లోకము లేలు నీచరణపూజాదివ్యసౌభాగ్యరే
ఖ- నమస్కారము భాగధేయమున కెక్కాలంబు- శర్వప్రియా!

ఇక నా కేమి భయమ్ము- మృత్యువ్వ వన తల్లీ! ఘోరకాకోలపా
వకదంష్ట్రామయ లేలిహానమును సంభావింతు నీపాదపూ
జకుఁ జేఁ జిక్కిన పూలదండవలె- విశ్వం బేర్చు కార్చిచ్చుఁ గొం
కక మన్నింతుఁ బటీరపంక మని; నిక్కం బింతయున్ శాంకరీ!

నీవాత్సల్యసుధారసాబ్ధిలహరీనిత్యావగాహక్రియా
శ్రీవాల్లభ్యముఁ గన్న ధన్యమతి నేరీతిన్ ఋణం బీగెదన్-
సేవాధర్మపథాధ్వనీనుడను మత్చిత్తంబు- నీజన్మశా
ఖావల్గుప్రసవంబు కైతయును నీకర్పించెదన్ భార్గవీ!

శ్రీ టి. వి. యమ్. అయ్యావారు

కలధౌతాచలతుంగశృంగముల వేడ్కఁ — నీపతిఁ గూడి ని
చ్చలు నేరీతిని సంచరించెదవొ! యాచందమ్మునఁ మన్మనః
స్థలి వర్తింపగ వేడెదఁ సతము — త్వత్ చంచత్ పదాంభోజము
ద్రలు వైరాగ్యసువాసనాధునుల చిందఁ — సింధురాస్యప్రసూ!

మధుపం బీహృదయంబు సంతతము వామాదేహలావణ్యసం
పద పంకేరుహకానన మ్మనుచు నాస్వాదింపగాఁ జూచు నే
విధి నైనన్ గుదియింపనోప నెటు లుద్విగ్నాంతరంగు న్ననున్ —
సదయస్నిగ్ధమతిన్ గనుంగొనెదొ! జ్ఞానం బిచ్చి కాత్యాయనీ!

అపవర్గప్రసవమ్ము పూఁచువలె కాదా? యీతనూవల్లి — యే
వపు చందమ్ములు పెక్కులయ్యె నని చెప్పం జాల సిగ్గాను — ని
త్రపు డంచున్ సడిసన్న నాకె — విషయేచ్ఛాకీటకాలీఢమై
విపరీతస్థితిఁ జన్న దీని కరుణన్ వీక్షింపవే! శాంకరీ!

నిను భావింపఁగఁ జేయలేని సిరులఁ నే గోర — క్రౌర్యంబు పె
ల్చన పెన్ బాముయి నాయెదన్ — కుటిలసంచారమ్ము సేయంగ చొ
చ్చెను — ఫూత్కారమహోగ్రమై — యపుడె! యస్సీ! కొంచెపుంగల్మి కే —
మన నేలా! దయమాలి భామిని వచింపఁ రాదె — నారాయణీ!

పశువుల్ — వృక్షములున్ బరోపకృతి నెప్పాటం బ్రవర్తించు, కా
లశిలాకర్కశమానసంబునను నే లాభింపలే దేరికిన్ —
మసిపా తయ్యెను మాయదారిబ్రతు కీమాడ్కిన్ సమస్తంబు బా
లిశుడఁ — నే కనులారఁ గందునొకొ నీశ్రీపాదముల్ — శాంభవీ!

ఇది నాపెండ్లము — వీడు నాసుతు డటం చేమోహమో చెప్పరా
నిది — నన్నుం బడఁద్రోయు — ఘోరనరకాగ్నిజ్వాలలఁ — వీరియ
భ్యుదయంబే మదిఁ గోరి పాతకము లెన్నో చేయుదున్ — సంసృతి
చ్ఛిదమా నీకరుణారసామృతము వర్షింపంగదే! అంబికా!

వని నన్నే ధరణీరుహమ్ముగనో! దివ్యన్నిర్ఝరం బట్లో- నె
మ్మని సృష్టింపదు బ్రహ్మ- అట్లయిన సంప్రీతిన్ భవత్పాదపీ
ఠిని- పుష్పంబయి కొల్చియుండుసిరి వాటిల్లుం- బయఃపూరసే
చన సేవించెడు భాగ్య మబ్బుఁగద నిచ్చల్ శైలరాణ్ణందినీ!

చదువుల్ గర్వము పెంచె - దైహికబలోచ్ఛ్రాయంబు కామాగమా
స్పదమై పోయెను- జీవితంబన నహో! స్వార్థాసురీ కేళిఁ గ్ర
క్కదలెన్- బీటలువారె నేకరణి నన్ గాపాడెదో! నీవు త
ప్ప దయాజాహ్నవి వింక ది క్కెవరు చెప్పన్ రాదె దాక్షాయణీ!

— నా "దేవీత్రిశతి" నుండి.

# త్యాగబ్రహ్మ

శ్రీ ఆకుండి రామ



కర్ణాటకసంగీతముతో పరిచయమున్నవారిలో త్యాగరాజు పేరు ప్రతీతుల నెఱుగనివా రుండరు. త్యాగరాజెట్టివాడో అతనికీర్తికి తావల మెట్టిదో చాలమందికి తెలియకపోవచ్చును. కాని అతడు సుప్రసిద్ధ వాగ్గేయకారుడని అందఱు నెఱుగుదురు. అంతేకాదు అతడు గొప్ప తత్వవేత్త; బ్రహ్మజ్ఞాని. ఆతనికృతు లెట్టివో, వానిలోని భాషాభావము లెట్టివో, రచనాపద్ధతి యెట్టిదో, వాని ప్రయోజన మేదో తెలిసికొనగోరువారి సంఖ్య అత్యల్పం. త్యాగరాజుకృతులగూర్చి కూలంకషపరిశీలనగావిస్తే ఆయన ఉత్కృష్టపాండిత్యం, వైదికధర్మసూత్ర పరిజ్ఞానం, సాహిత్యప్రజ్ఞాగరిమ, సంగీతశాస్త్రాధ్యయనం, గానకళా వైశారద్యం, గీర్వాణాంధ్రభాషావైదుష్యం, వేదాంతాలంకారశాస్త్రపారంగతత్వం మున్నగు ప్రతిభాపాటవాలు మనకు అవగత మౌతాయి.

తరతరాలనుండి వంశపారంపర్యంగా వస్తూన్న పాండిత్యం, దైవచింతన, ధార్మికప్రవృత్తి, ఆత్మప్రత్యయం మొదలగు సుగుణపుంజాలకు రాశీభూతుడైన త్యాగరాజు ఉద్యోగవిముఖుడై కులదైవమైన శ్రీరాముడిని ఉపాసిస్తూ నిత్యం వేదశాస్త్రాలు, ప్రస్థానత్రయం, పురాణేతిహాసాలు అధ్యయనం గావించేవాడు. దైవప్రేరితుడైన ఒక సిద్ధుడు వచ్చి త్యాగరాజునకు రామతారకమంత్రోపదేశంగావించి శ్రీరామనామం 96 కోట్లసార్లు జపిస్తే భగవంతుడు ప్రత్యక్షమై మోక్షాన్ని ప్రసాదించగలడని చెప్పడం జరిగింది పరమభాగవతోత్తముడైన నారదుడు సన్యాసిరూపములో కనబడి 'స్వరార్ణవ' మనే అపూర్వ సంగీతగ్రంథ మొసగి సంగీతంద్వారా లోకంలో భక్తిప్రచారం ప్రారంభించమన్నట్లు ఒకకథ వాడుకలో నున్నది. మొత్తంమీద ఆయన కృతిరచన కిదియే హేతువు. యావద్భారతదేశంలో ఆతని విఖ్యాతికి ప్రబలంగా కారణభూతమైనది ఆ మహత్తర కృషియే! ఆయన ప్రసిద్ధుడగుటకు తోడ్పడినవి ముఖ్యంగా మూడుఅంశాలు: పాండిత్యం, ప్రవృత్తి, కృతిరచన. మొదటి రెండూ మూడోదానిలో వ్యక్తమైనవి కావున ఆయన కృతిపరిశీలనగావించడ మెంతేనా సముచితం.

## కృతి ప్రశస్తి

త్యాగరాజుకృతులు ధర్మాసక్తిప్లావితములై సర్వవిధాల ఉత్తమోత్తమాలని పేరొందాయి. ఆయనతోనే ఆరంభమైన కృతిరచన ఆయనరచనలోనే అత్యున్నతశిఖరాలను అందుకోగల్గింది. 'Kriti is the most highly evolved form of musical compositions'. ఈ కృతులు ఐహికసుఖదుఃఖజనితములై అక్కడక్కడ పరమానందప్రాప్తిసూచకము లగుచున్నవి. 'మానవజన్మ సుఖదుఃఖ మిశ్రితము. నరునికోర్కెలు గొప్పవే కాని నిర్వహించిన కార్యము లత్యల్పములు' అని సోదాహరణంగా వెలడిచేశాయి ఆయనకృతులు. దారిద్ర్యము దౌర్భాగ్యము మానవుని అనుభవజ్ఞానాన్ని దోహదంచేసి హృదయానికి నిర్మలత నిశ్చలత చేకూర్చి సత్ప్రవృత్తిని అలవడజేస్తాయి.

త్యాగయ్య పరమభక్తుడు కావటంవలన సగుణోపాసకుడు కావలసివచ్చింది. తనకులదైవమైన శ్రీరాముడినే పరాత్పరునిగా భావించి ఆరాధించేడు. ఆ రోజులలో దక్షిణాదిన అద్వైతం ప్రబలి ఉండడంచేత విశిష్టాద్వైత పక్షపాతియైన త్యాగయ్యకు చాలామంది శత్రువు లుండేవారు. త్యాగరాజున్న తిరువాడియందే ముత్తుస్వామి దీక్షితులు, శ్యామశాస్త్రి అనే సుప్రసిద్ధ వాగ్గేయకారు లుండేవారు. ఈ ముగ్గురుశిష్యులు మరికొందఱు ప్రజలున్ను

పరస్పరాసూయాపరులై వైరాగ్నిని ప్రజ్వరిల్లజేసేవారు. ఒకరికి తెలిసిన శాస్త్రమర్మములు వేరొకరికి చెప్పకపోవడం వలన అవి వారితోనే అంతమొందేయి. త్యాగరాజుకృతులెన్నో ఈ రూపకంగా వ్యాప్తిలోకి రాలేకపోయినవి.

శిథిలంకాగా మిగిలిన త్యాగరాజుకృతులకు ఇంకొక కీడుమూడింది. ఆంధ్రభాషాజ్ఞానం లవలేశమేనాలేని దాక్షిణాత్య గాయకులనోటబడి ఆయనకృతులు అనేకవికృతులపాలైనవి. అపశబ్దాలు దూరేయి, పదాలు మారేయి, అన్వయం భ్రష్టమైపోయింది. ఇట్లాంటిపరిణామంతో కృతి సహజాకృతి అస్తవ్యస్తమైపోయింది. భాషాపరిచయశూన్యతకుతోడు సంగీతమంటే తీరని యభిలాష, గానపాటవంలో ఒకరినొకరధిగమించవలెనన్న మాత్సర్యం, భక్తిభావ ప్రపత్తులనుగంటడం మొదలైన అనేక కారణాలవల్ల త్యాగరాయ కృతులలోని సాహిత్యానికి కొంతవరకు ద్రోహం జరిగింది. కాని త్యాగరాజుప్రతిభ, ఆయన కృతులు దశదిశలా వ్యాపించుటకు కారణభూతులైనవారు నిస్సందేహంగా దాక్షిణాత్య గాయకులే. పాడేటప్పుడు సాహిత్యం కొంతవరకు విరూపంచెందడం సహజమే కాని స్వరప్రస్తారం సంగీతపాండిత్యప్రకర్షకు కీలకమనే భావించేవారు సాహిత్యంజోలికి పోరు. దాన్ని సంస్కరించే ఉద్దేశ్యం ఉంచుకోరు.

త్యాగరాజుకృతులు భక్తుల పాలిట కల్పతరువులు. కృతులన్నిటిలోను ఏదో ఒకధర్మసూక్ష్మం ఇమిడేవుంటుంది. త్యాగరాజుకవిత వ్యంగ్య ప్రధానం. కృతిలోని భావం పదముల కర్థం తెలిసినంతమాత్రాన అవగతం కాదు. పదే పదే సాహిత్యాన్ని మననం చేసిననాడు తప్ప సమగ్రంగా భావస్ఫూర్తి హృదయైకవేద్యము కాదు. భావం తెలియకపోతే రసోత్పత్తి కాదు. రసానుభూతి కలుగదు. కేవలం యాంత్రికశ్రవణంకంటె దాని చింతన అత్యావశ్యకం. త్యాగరాజును మంత్రద్రష్టగా భావించవచ్చును. ఇతనికి దైవాంశసంభూతులు ప్రత్యక్షమై ధర్మసూక్ష్మాలు తెలిపేరు. కాన ఆయనప్రతిభ పరిపక్వమై బోధనావిధానం శ్రోతల కనిర్వచనీయానందము కల్గిస్తుంది. భగవత్ప్రసాదం, భాగవతులకృపాకటాక్షం, బోధనామృతం—ఈగుణత్రయాన్ని ఆకళించుకొన్నతర్వాతనే త్యాగయ్య బ్రహ్మర్షిపదవి సిద్ధింపజేసుకోగల్గేడు. ఆయనబోధనలు ఆర్షమతప్రబోధకాలు. ఆయనకృతులు ఉత్కృష్టజ్ఞాన ప్రదాయకాలు. నిత్యపారాయణకు మిగుల అనుకూల్యములు. రామనామసంసర్గము భవతారకహేతు వనుటలో విప్రతిపత్తియేమున్నది? ఈకృతులలో ధర్మసూక్ష్మములమేయము. తాత్త్వికప్రబోధం గంభీరము. సంగీతశాస్త్రజ్ఞానం, గానకళాప్రౌఢిమ ప్రశంసార్హం. ఇవి భక్తిభావ ప్రతిపాదకరసోదంచితములై చిత్తచాపల్యం పోగొట్టి నిశ్చలత నిర్మలత సమకూరుస్తాయి. అందువలన రామనామ సుధారసము తనివితీర గ్రోలి ముక్తిని కరతలామలకంగావించుకొనవచ్చును. ఈకృతులకు 'The Holy Bible in song' వంటివని అనడం ఎంతేనా సమంజసము.

## కృతిపరిశీలన

మానవునకు కర్మాచరణము ఆవశ్యకము. అందులో ప్రవృత్తి నివృత్తి అనే అవలంబనపద్ధతులు రెండు. ప్రవృత్తిమార్గగాములు ఐహికభోగముల వాసింతురు. నివృత్తిమార్గగాములు ఆభోగములు నశ్వరములని భావించి నిష్కామ్య కర్మాచరణము గావింతురు. ప్రవృత్తిమార్గచరులు సంసారచక్రమున పరిభ్రమిస్తూ చిరకాలము మాయావాగురుల జిక్కి అదే పొందవలసిన జీవితసౌఖ్యమని సంతృప్తిచెందుతారు. నివృత్తిమార్గావలంబకులు నశ్వరములైన జీవిత సౌఖ్యము లపేక్షించరు. వారిదృష్టి కేవలం శాశ్వతం, భవతారకం, నిరతిశయం. పునరావృత్తి రహితమైన సౌఖ్యము లందుటకై విషయభోగవాంఛా విముఖులై నిష్కామ్యకర్మాచరణ కుపక్రమిస్తారు. త్యాగరాజు నివృత్తిమార్గప్రవర్తకుడు. ఆయనజీవితమునకు ఎన్నదగిన ప్రాపులలో నిష్కామ్యకర్మ యొకటి. 'అవశ్య మనుభోక్తవ్యం కృతం, కర్మ శుభాశుభమ్'. మానవుడు తాను పూర్వజన్మయం దాచరించిన కర్మఫల మీజన్మయందు అనుభవించును. ఈకర్మ నిశ్శేషముగా రూపుమాపుకోవలెనన్న భగవత్కటాక్షము ఆవశ్యకమని త్యాగరాజు సిద్ధాంతము.

ఇక ప్రవృత్తిమార్గానువర్తుల కోర్కెలెల్లపుడు తీరేవి

కావు. కొన్ని సందర్భములలో వారు కోరిన దొకటి, ఫలమింకొకవిధముగాను లభిస్తుంది. అందుచేతనే 'తా దలచిన దొక్కటౌను మరి దైవమొనర్చిన దన్యమయ్యెడున్' (ఆంగ్లంలో 'Man proposes, God disposes' అనుసూక్తి) అని పెద్దలవాక్యం. ఎవరు చేసుకొన్న కర్మఫలం వారనుభవిస్తారు. స్వయంకృతాపరాధమునకు ఇతరమానవులనుగాని దైవమునుగాని నిందించుట మతిమాలిన పని. 'చేసుకొన్న బ్రాహ్మడా! అనుభవించు' అని ఒకజాతీయం మనవాడుకలో నున్నదే!

'మీవల్ల గుణదోష మేమి? శ్రీరామా,
నావల్లనే కాని నళినదళనయన
బంగారు బాగుగా పదివన్నె గాకున్న
అంగలార్చుచు బచ్చు నాడుకో నేల?
తనతనయ ప్రసవవేదన కోర్వలేకున్న
అరయ నల్లునిపై నహంకార మది యేల?

మానవుడు దోషభూయిష్ఠుడు, వంచనాప్రియుడు, విషయలంపటుడు, అశక్తుడు. కావున తన దుర్విధిపరిపాకంచేత మోహాగ్నిలో బడి పరితపిస్తూ తప్పించుకొనే దారిగానక భగవంతుడే శరణ్యమని అతనిని సద్భక్తితో సదా భజిస్తే దీనవత్సలుడు దయాసింధువునైన శ్రీరామచంద్రుడు మానవుని ఇక్కట్టులు బాపునని పురాణాలు ఘోషిస్తూ ఉన్నవి. త్యాగరాజుకూడా అదేవిధంగా చెప్పాడు.

'ఎందుకు దయరాదురా? శ్రీరామచంద్రా
సందడి యని మరచితివో? ఇంక లేవో
రతిని భవనీరధి యీరడి సైరింపనేరక భయమొంది
పంకజపత్ర నీరవిధి నల్లాడ జూచి చూచి
నీరదాభశరీర, నిరుపమశూర నీ;
జాగేల ఇది సమయము కాదు; (జాగు) చేసిన
నేతి పలుకవయ్యా శ్రీరామ
నీవే గాని దరిలేదయ్యా, దీనశరణ్యా,
త్యాగరాజవినుత తారకచరిత నీ' (కెందుకు)

భగవంతుని తెలుసుకొనుటకు అతని నాశ్రయించి సంసారసాగరము నీది తాపత్రయమును రూపుమాపుకొన దలచినవారికి మూడు మార్గములు కలవు. 1. జ్ఞానము 2. కర్మ 3. భక్తి. మొదటి రెండుమార్గాలు దుర్గమములు. మూడవదే నేడు సర్వజనులకు అందుబాటులో నున్నది. భక్తికి నిదర్శనము సంకీర్తనము. అదే అత్యంత సులభోపాయం. భక్తిభావప్రపత్తులు లేని మానవజన్మ భూభారం. సద్భక్తి చేకూఅవలెనంటే పురుషకార మవసరం. భక్తి నిష్ఠ చేకూఅగానే ఏకాంతభక్తితో కాలము గడపవలెను. దీనికి మేలైన ఉపాయం సత్సంగం— 'సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం, నిర్మోహత్వే నిశ్చలచిత్తం, నిశ్చలచిత్తే జీవన్ముక్తిః' అని శ్రీ శంకరాచార్యులవారి ప్రబోధం. భక్తకోటి రెండు తెగలు—సద్భక్తులు. భక్తవేషధారులు. సద్భక్తులను త్యాగరాజెట్లు వర్ణించాడో పరికించండి.

'భక్తునిచారిత మును వినవే మనసా! సీతారామ
సక్తిలేక తాగోరుచు జీవన్ముక్తుడై యానందమునొందు
జపతపములు తా జేసితి ననరాదు, అదిగాక
మఱికపటాత్ముడు మనమై బల్కరాదు;
ఉపమ తనకు లేక యుండవలెనని ఊరూర తిరుగరాదు
చపలచిత్తుడై యాలుసుతులపై సారెసు భ్రమకారాదను
హరి' (భక్త)

కర్మజాలమున జిక్కి భవసాగరమున మునిగి పరమాత్మనుండి వేరై వియోగం సహించలేక భవబంధవిమోచనం గావింపుమని దైవాన్ని భక్తుడు వేడుకొంటాడు. ఈప్రార్థనకు భక్తి ప్రధానం. సంగీతజ్ఞానసమ్మేళనం అవసరం. సద్భక్తితో కూడిన భజనే 'నాదోపాసన' అంటారు. నాదము భగవంతుని దేహమని నాదసుధారసరూపేణా రాము డవతరించా డని త్యాగరాజుభావన. నాదమునకు ఓంకారము పుట్టినిల్లు— 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ.' ఓంకారమునుండి సప్తస్వరములు వెలువడినవి. కావున సంగీతం మేళవించుకుంటేనేగాని భజన సద్భక్తిచేకూర్పదు.

'నాదతను మనిశం శంకరం నమామి మే మనసా శిరసా
మోదకరనిగమోత్తమసామవేదసారం వారం వారం
సద్యోజాతాద పంచవక్త్రజ సరిగమపధని వరసప్తస్వర
విద్యాలోలం విదళితకాలం విమలహృదయ
త్యాగరాజపాలం'

"సంగీతజ్ఞానంతో కూడిన భక్తి సన్మార్గమున చేర్చును ఇట్టి జ్ఞానం ధాత వ్రాయవలెను. ఇది యోగ యోగ త్యాగ భోగఫల మొసంగును. స్వరరాగసుధారసభక్తి స్వర్గాప వర్గము. సహజభక్తికి రాగజ్ఞానము జతసేయువాడు ముక్తుడు." ఇవి త్యాగరాజు నిశ్చితాభిప్రాయములు. భక్తి, భజన, ఫలప్రదము లగుటకు హృదయం నిర్మలము గాను నిశ్చలముగాను ఉండవలెను. ఇంద్రియనిగ్రహశక్తి లేకున్న చిత్తమునకు శుచి లభించదు. చిత్తమాలిన్యానికి అహంకార మమకారములే కారణభూతములు. ఇంద్రియ నిగ్రహశక్తిని సాధించినవాడు స్వాధీనమనస్కుడౌను— ఇట్టివానిని త్యాగరాజు వర్ణించినతీరిది:

"మనసు స్వాధీనమైన యాఘనునికి
మఱిమంత్రతంత్రము లేలా ?
తనువు తాను కాదని యెంచువానికి
తపసుజేయ నేల ? దశరథ బాల
అన్ని నీ వనుచు యెంచినవానికి
ఆశ్రమభేదము లేల ?
కన్నుగట్టుమాయ లని యెంచువానికి
కాంతలభ్రమ లేల ? దశరథబాల"

దీనినిబట్టి మోక్షసాధనకు ఇంద్రియనిగ్రహం ప్రథమ సోపానం. ఇట్టి నిగ్రహం సత్సంగంవల్ల లభిస్తుంది. నిగ్రహంవల్ల నిర్మలత నిశ్చలత మనస్సుకు సమకూడుతాయి. దానితో భక్తుడు ఐహికఫలభోగవిరాగియై నిష్కామ్య కర్మాచరణాసక్తుడు కాగల్గుతాడు. ఈసోపాన మధిరోహించుటకు భగవత్కటాక్షం అవసరం. దివ్యులసందర్శనంతో త్యాగరాజీశక్తుల నార్జించగల్గేడు.

భగవంతు నారాధించినవారికి మోక్షము సిద్ధిస్తుంది. భాగవతులు పరాత్పరుడినే కరగతం చేసుకోగలరు. భగవంతుడు భాగవతులకు దాసుడే! ఆయనవలన కానిపనిని భాగవతు లొనరింపగలరు. కావున భాగవతుల ఆరాధన గొప్పది. భగవన్నామమహిమ గుర్తెరగడం మిక్కిలి అవసరం.

'రా'శబ్దోచ్చారణాదేవ ముఖా న్నిర్యాంతి పాతకాః
పునఃప్రవేశభీత్యా చ "మ"కార స్తు నిరోధకః'

దీనినిబట్టి రామనామస్మరణ పాపహరణ మనేకదా! కనుకనే భక్తాగ్రేసరుడు శ్రీచైతన్యస్వామి నామస్మరణరూపంలో ఇలా శాసించాడు:

'హరే రామ హరే రామ, రామరామ హరే హరే
హరే కృష్ణ, హరే కృష్ణ, కృష్ణ కృష్ణ, హరే హరే
రామస్మరణా దన్యోపాయం నహి పశ్యామో భవతరణే'

భక్తులు అనన్యచింతతో నిష్కామంగా భగవంతుని సంతతం స్మరించగలరు.

'ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః
యద్భక్త్యా పుండరీకాక్షం స్తవై రర్చే న్నరః సదా'

ఎట్టివారు సదాచారసంపన్నులై ఏకాంతభక్తితో భగవన్నామస్మరణ గావిస్తారో అట్టివారిభక్తి భవతారక మవుతుంది—

సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః'

అని భగవంతుడే గీతలో ధైర్యము గొల్పేడు. కాబట్టి ఎట్టివారైనా నిరాశోపహతులు కానవసరము లేదు. భగవంతునికితప్ప ఇతరజీవు లందరికి కర్మబంధ మున్నది. కర్మ త్రిగుణా (సత్వ, రజ, స్తమో)త్మక మాయాకల్పితము. ఈ మాయను మాపుకోవాలంటే భగవత్కృప సంపాదించాలి.

'మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే'
అని కదా భగవద్వాక్యం. ప్రపత్తిమార్గావలంబనతో మాయ నధిగమింపవచ్చును. అంతటితో కర్మబంధానికి విమోచనం కల్గుతుంది.

త్యాగరాజకృతిసంచయమును పరిశీలించినకొద్దీ ఎన్నో అమూల్యవిషయాలు ద్యోతకమవుతాయి. ఆకారణంగానే ఉత్కృష్టధర్మాలు, సత్ప్రవృత్తి, ఇంద్రియనిగ్రహశక్తి మొదలైన ఆర్షమహోపదేశములతో నిండియున్న త్యాగయ్య కృతిసంచయమును కొందరు 'త్యాగబ్రహ్మోపనిషత్తు' అన్నారు. అలా అనడం ఎంతేనా సముచితం. ధర్మగ్లాని ప్రబలియున్న దినాలలో ఎనభైసంవత్సరాలు జీవయాత్ర చేసి లోకానికి సర్వోత్కృష్టమైన సనాతనధర్మసూత్రాలను, సత్ప్రవర్తనకు వలయు విధులను ఉపదేశం గావిం

త్యాగబ్రహ్మ వాల్మీకిమహర్షి అపరావతార మని మనలో చాలామంది భావిస్తారు.

# కాలానికి కళ్లేలు

శ్రీ కోట వీరాంజనేయ శర్మ



అంతయు నీయధీన మని యార్యులు పూర్వము సల్పినట్టి సి
ద్ధాంతము బూజుపట్టినది; దానిని నమ్మి విశృంఖలమ్ముగా
నింతటినుండి ముందు కడు గేనియు వేయుతలంపు నుంత నీ
స్వాంతముఁ జేరనీకుము; విచారణ సల్పు ప్రజాప్రభుత్వముల్.

శ్రమ యిసుమంత లేకయ సరాసరి కోరినచోటఁ బంచభూ
తములను నిల్పి, కోరినవిధంబున నూడిగమున్ బొనర్పఁ జే
తుము; తలతిక్కతోడఁ బ్రజతో కలహించిన దక్క దింక రూ
పము; వచియింపలే దను నెపంబును బెట్టకు మోసి కాలమా!

ఋతుధర్మంబున సర్వసస్యములు ధాత్రిం బండునం చాడిరే
ఋతుధర్మంబును లేకయే యిపుడు ధాత్రిం బండు సస్యంబు, లీ
వ్యతిరేకప్రతిభాప్రభావమును సంభావించి, మ మ్మెంచి నీ
గతికిన్ మార్పును గూర్పు చేర్పుకొను మోకాలంబ! యీ మీఁదటన్.

మాకె తలంపు గల్గిన హిమాచలశీర్షము ద్రొక్కి చంద్రమో
లోకము దాటి, భానుకుజలోకములన్ గబళించుచున్ బ్రజా
నీకసుఖంబు గూర్పఁ గల నేర్పును గంటిమి; కల్లగాదు, మా
రాకెటులే వచించు వివరంబుగఁ బ్రశ్నలు వేయకుండఁగన్.

అసమత్వంబును రూపుమాపితిమి, సస్యశ్యామలన్ గా నొన
రిచ్చి సహస్రాధికవృద్ధి జూపితిమి ధాత్రిన్; సర్వశాస్త్రార్థముల్
రసనాగ్రంబున నిల్వఁజేసితిమి మర్త్యశ్రేణికిన్, మీఁద బొ
క్కసముల్ హేమముతోడ నింపెదము దుఃఖక్షామవిచ్ఛిత్తికై.

శాం

అంతములేదు వార్ధి కని యాడిరి నిన్ భజియించువారు, తా
రింతకు శక్తిసంపదల హీనులుగా గుఱుతింపకుండ, మా
జంతలు యంత్రమార్గమున సాఁగి కనుంగొని నిర్ధరించినా
“రింత వెడల్పు, లో తిచట నింత” యటంచును, వెఱ్ఱికాలమా!

మండు వేసంగియందు హేమంతమటుల
మంచు సృష్టించి తాపంబు మాపఁ గలము;
ఒక్కబీజంబునందు నెన్నో విధాలఁ
బూలు పూయించి ఫలములఁ బొందఁ గలము.

వేదము నీస్వరూప మని వేదవిదుల్ వచియింత్రు. మా ప్రజా
మోదము దానిపట్ల కడు పూజ్యము, భౌతికశాస్త్రపారగుల్
వాదనజేసి హేతువు లపారముగా రచియించిచూపినా;
రే దిఁక నీకు దిక్కు? పరు వేదక మున్నె యె ఱేని నేఁగుమా!

మా సైంటిస్టుల లేబొరేటరికి రమ్మా. వార లేరీతి నూ
హాసామ్రాజ్యములన్ జరించెదరొ. కన్నారంగ వీక్షింప నో;
గ్లాసుల్ గన్నుల గూడిమాడఁగ నెలక్ట్రాన్సుల్, ప్రోటానుల్, మరే
మో సాధింపుచునున్నవారు ప్రజ కింపున్ సొంపు గల్పింపఁగన్.

గెంతితి విన్నినాళ్ళుగ నకించనలోకము గల్గుపొంకై, ఖం
డాంతరవేధు లున్నవినుమా; యెట నుండిన నీదురూపమా
వంతయు దక్కనీయవు; ప్రజాభిమతంబున కడ్డు నిల్చుచోఁ,
జింతన జేసికొ మ్మిచటి సేవకొ, కా దన వచ్చు చావుకో!

మరణస్వామికి ముఖ్యసేవకులుగా మన్నింపఁగా నైన దు
ర్భరకాఠిన్యజరారుజల్ మనుజులన్ బాధింపకుండంగ సు
స్థిరదీర్ఘాయువు గూర్చు నోషధులచే సృష్టింపుచున్ మందులన్
నరునిన్ శాశ్వతఁ మూర్తిజేసెదము కొన్నాళ్ళేఁగుచోఁ గాలమా!

సుడులతో ప్రవహించి చుట్టుపట్టుల ముంచు
నదులయాటలు గట్టినాము మేము;
నిముసంబులో యోజనము లేఁగ గల విమా
నంబుల సృష్టించినాము మేము:
జననవృద్ధిక్షయసంఖ్య యిచ్ఛావర్త
నమున నిల్వఁగఁ జేసినాము మేము:
గ్రహలోకముల నుపగ్రహములఁ బంపుచు
నడయాడునటు సల్పినాము మేము;

మాకు స్వాధీనపడక యేలోకమందు
నెట్టిశక్తులు పనిచేయ, విట్టియెడల
దిక్కుకే దిక్కు లేదు, నీ దిక్కెవండు ?
కాలమా ! మాదు కళ్ళెలఁ గట్టుబడుమ.

ఆపుము నీకల, మ్మొకటి యాడెద, శ్రద్ధగ నాలకింపు మో
రీ! పురుషాగ్రణీ ! నరవరేణ్య ! యెదో సృజియించి తంచు నీ
యోపినయంత తిట్టితివి యుక్తమయుక్తము నెంచకుండఁగాఁ
గోపము తాపమున్ గలసి క్రూరము లౌ బహుభావభంగులన్.

నీకు స్వాధీనపడకుండ నేఁటివఱకు
నేడిపించెడి యీబాహ్యసృష్టియెల్ల
పంచభూతాలప్రాపున బ్రదుకుచుండు;
నవ్వి నాకంటితుదలలో నణఁగియుండు.

హృదయమునందు నెవ్వఁ డెటులెంచిన వానికి నట్టిదానినే
వెదుకగ బాహ్యమందు కనిపింపఁగఁ జేయుదు; నంతెకాని, నా
తుదిమొదలిట్టు లుండు నని తోఁచినవాఁ డొకఁ డేని లేఁడు, నీ
బ్రదికెడు నాల్గునాళ్ళటుల భావనఁజేసెదు పూర్ణరూపమున్ ?

సృష్టి యాధారముగఁ బునస్సృష్టికొఱకు
సలుపుచున్నావు యత్న మజ్ఞాని వగుచు,
సృష్టియే భిన్నగుణములచేరిక యని,
యరయవు జననవృద్ధిక్షయాత్మక మని.

శాంతియటంచు నీవు పలుసారులు వాగిన జీవకోటికిన్
సుంతయు శాంతి రా దెటులు సూచిన నైనను, నీదుగోల యా
శాంతికి మీఁదుమిక్కిలిగ సల్పును భంగము; నోరుమూసి, ఖం
డాంతరవేధు లన్నిటికి స్వస్తి భజింపుము చచ్చినట్లుగన్,

నన్నెఱుంగుటకైన యత్నంబునందు
నీవు విజ్ఞాన మెఱుఁగుచున్నావు, గాని—
తక్కుభాగాలఁ గూర్చి సుంతయు నెఱుంగ;
వట్టిచో నన్ను బంధింప నౌనె నీకు

పొంగు నీదురహంకారమునను జేసి
నీవు సృష్టించుకొనుదానినే తలంచి
చత్తు నని యేడ్చుచుంటి; వీ చావుతెలివి
నన్ను బంధింపఁజాలునే యెన్నటికిని ?

ఉపమయుపమేయ మెట్లు గాకుండఁగలదొ,
నీదవ్యక్తిత్వ మెట్టుల చూడలేమొ,
తెలియఁబడుచున్న తెలివితో తెలియరాని
దానిబంధింపఁ జూచు టజ్ఞానికర్మ.

వ్యష్టిశాంతిని వదలి సమష్టికొఱకు
సలుపుయత్నము లన్ని నిష్ఫల మటంచు
త్రికరణంబులయందునఁ దెలియు నెప్పు,
డపుడె గలుగు విశ్వమనోఽంతరాత్మ శాంతి.

# నవజీవనము

## శ్రీ ఓగుమర్తి సీతారామస్వామి

ఊగితుదఁ బంటకాల్వకుఁ జేరువగ ప్ర
శాంతమై మది నించు నా ప్రాంతసీమ—
దాని నర్కాశ్రమం బండ్రు తరుచుఁ దోచు
జిల్లేడుం బొదలం జేసి పల్లెప్రజలుఁ
నాగజముడులు కోరడిగాగ బలసి
నిక్క విరిసి పూచును చలివేళలందు—
నేలతంగేడు లటనటఁ బూలపసుపు
చిందు నీరెండలో కనుల్ చెదరిపోవ!

కలవు రసాల సాలములు
కమ్మగఁ బాడెడు కోకిలమ్మలర్
నిలుపుకొనంగ— నొక్కయెడ
నింగిని దాకు శిరీషచారిమల్
చిలుకలఁ జేరదీయుఁ —గడు
లేఁ బగలూళలు నించు పచ్చపు
ల్గు లచటి రావులం దుడుత
గుంపులు వెంపరలాడ పూవులన్

చిన్న దొరువొండు— కడువికసించి యెర్ర
కల్వలుం దామరలు సేయు కనులవిందు—
అట్టిచో తేనెగల వేపచెట్టుమొదట
శాంతుఁ డొక్కఁడు వసియించు సాధుమౌళి.

భాష్యములు శాస్త్రముల్ సూచి పండబారె
పలుకువిందులు సేయు నేర్పరులు వీని
వాట మంతయు వట్టికై లాటమందు
రతఁడు చెవిఁబెట్ట డిట్టి సంగతు లుపేక్ష!

ఇతరుల కేడిదైన వచి
యింపఁగఁ బట్టితి నన్నభావమే
యతనికి లేదు —ప్రాకృతుల
కాయనఁ జూచినఁ జాలు శాంతిసం
గతి చెలువారుఁ —గోరికలు
కల్గిన వారలు పాదధూళి స
న్మతిఁ గొనిపోదు రాతఁ డొక
మాటయు నాడఁడు నిట్లు సాగెడిన్.

అపుడపు డొక్క కోమలి త
దాశ్రమభూమికి వచ్చి సాధుమౌ
ళిపయిని జూపు నిల్పి లవ
లీదళపాండుకపోలబాష్పయై
వపువును నిల్పలేని గతి
వాలు నెదే సురపొన్ననీడఁ జొ
క్క పుజవరాలిమేల్ముసుగు
గాలికిఁ గుప్పనగూరలైనటుల్॥

ఆమె యిటు సోలు 'నే మన' డతఁడు —కొంత
తడవునకుఁ దేరి పోవు నాతలిరుబోణి—
దినము లీగతి బరువుగా జనుచునుండ
నామె కొకనాటి విజనసాయాహ్నమందు—

సాంధ్యారుణ కిరణ నాశ్రమస్థల మపూర్వ
శోభ పులకింప నేచిన మాతృదీక్ష
స్వాదు కలకింకిణీకలరవ శ్రవణతన్మ
యత్వమున సాధుపుంగవుఁ డొక్కొ నిలువ—

దమములంబడి కన్నీటఁ బొర్లి విడుచుఁ
గడల నాయక— 'లెస్స — యే మిది?' యటంచు
బలుకరించు చతండు నివాసభూజ
కట్టినుము చేరునంత— 'నా కుందు దీర్చి
నన్ను దరిఁజేర్చ లేఁడు నీకన్న నొకఁడు—
చి తశాంతికిఁ గాక శోషింతు నిట్టు
లను గృహాంగిక నిశ్చల స్వనముతోడ—
చేసినది చెప్ప వినఁగల, చెలువుఁ డున్న
మనసు తేలికపడు నెంత? యనియె నతఁడు.

రావుల నీడఁ గ్రమములు
రాలుచు వెన్నెలజాడ— మానసం
భావిత మాశ్రమాంగణము
పైకొను తెమ్మెర వేపజొంపముల్
సీవిరులై చలింప —విక
సించిన జీడిపొదల్ గుబుల్కొనం
దావులు కాన్క పెట్ట నెటు
తక్కొనఁ జాలు నశాంతి నిల్వఁగన్.

ఏదో ధీరత తనకున్
వాదోడయి నట్లు పాము వాల్చిన మొగమై
తాఁ దెల్పఁ జొచ్చె నాత్మా
వేదన నావిద్రుమోష్ఠి స్వీయకథ నిటుల్—

ఇది పదిప్రాఁ దరుల్ వెనుక
కేగి వినందగుఁ గాథ —తల్లికూ
ర్మి దినదినాభివృద్ధిగ శ
రీరహృదంతరముల్ వికాసనం
పదఁ బొదలన్ కళాలలిత
మానస నయ్యు వయస్సి నొక్కనిన్
బ్రదుకున దోడి త్రోవరిగ
బాళి వరించితి రూపమోహితన్.

తొలిపొద్దుల్ చనె గాలిపై పొదలపైఁ
దోగాడునెత్తావులై —
మలిప్రొద్దుల్ కనువిప్పులయ్యె మదిరా
మత్తున్ విభున్ జూపి — యె
త్తిలి ప్రాణేశుని దేర్చ యత్నములు ప్రీ
తిం దూల్చి నిష్కారనా
కులతన్ నన్ బడలించె — దుర్విధి నెదు
ర్కొనె నా నెబ్బంగులన్!

నన్ను దీవించి శాంతిసంపన్నఁ జేయు
మనుచు భావాతిశయమానమున వినమ్ర
యైన యాయమమాళిపై హస్తముంచి
ఇంతవిశ్వాసవతి నెటనేని గాన—

ప్రార్థనకుఁగూడ ఘనము విశ్వాస మరయ
విశ్వసించినవారిది వెల్గుబాట—
నాయెడన నీకుఁ గల్గిన నమ్మకమున
లజ్జితుఁడ — దైవకృప నిను లాఁచుఁగాక!

క్షితిలో నుత్తములట్లు తోచు ఘనులున్
జింతింపఁగా నంబుధి
కృతనౌకాంకసముద్ధృతార్తు లనినన్
గట్టందకే తీరతీ

వ్రతరంగాహతిఁ గూడవచ్చు జనుఁ డా
పన్నుండు గా లిగా
క తదన్యం బగు భావ మె ట్లగు
నశ క్తప్రాణిచిత్తంబునన్?

తోడి పాపిని బ్రదిమి నె ద్రోవఁ జూప
వేడుకొనెదవు లెవ్వ– నీజాడ నేను
పాపయే మూటగట్టితి– బ్రదుకు దాటి
మిత్తిఁ దలఁచిన భీతి న న్నొత్తికొనఁగ॥

నీవలెనె నేనుగూడ సన్నిహితుఁ డైన
హృదయశాలికి నాత్మనివేదనమ్ము
తెలియఁజెప్పి యుపాయము తెలిసికొంటి–
దైవకృపకు విశ్వాసమే దారియంచు.

తల్లి చేతులమీద నాధారపడెడు
శిశువుగా కెట్లు పరముని జేరవచ్చు?
నిస్సహాయత శరణార్ర వే లోసంగి
దాదియై నిన్ను నడిపించు దైవశ

కూడనుండిన విశ్వాస మేసుగడగ
నుండ నొంటరి నను భావ మొప్పు నెట్లు?
నీ వనెడు భావవిస్మృతి నిన్ను గాచు–
అఖిలసుఖదము దేవతాత్మార్పణమ్ము!

ఒక్కగుట్టును జెప్పెద నువిద! వినుము
శాంతిదాతలు – మనుజసంసారములకు
దవ్వుగానుండి భావించు ధన్యజనులు–
ఆశ్రమంబుల నున్కి రహస్య మిదియె.

అనునుడు లాపెకుర్ హృదయ
మంతయు వెన్నెల నింపె– బైట గూ
రిన వెలుగుల్ తదాంతరవ
రిష్ఠమరీచులనీడ లంచు దో
చినఁ జెలి యాప్రశాంతనవ
జీవనదాతకు కేలు మోడ్చి సా
గిన దెటకో యిదం సుకృతి
కిక్ భగవద్వినతుండు సాధువుర్

# శాంతి

శ్రీ అగస్త్యరాజు లక్ష్మీవేంకటాచలపతి రావు

*

శ్రీమత్ ప్రాలేయశైలే, తుహినమయ మహో
త్తుంగశృంగప్రదేశే,
గంగాభంగోర్మిమాలాసురభితకమలా
యాతవాతే, ప్రశీతే,
ఆసీన స్సింహపీఠే, మునిసురనికరై
స్సేవిత స్సుక్షణసమంతాత్
శంభుః కాత్యాయనీశః కలయతు కృపయా
పత్రికాం 'శాంతి' మేతామ్.

పంచశీలాదివ్యభావాళిఁ జూపిన
బుద్ధదేవుని తపస్సిద్ధిఁ దలఁచి,
యాధ్యాత్మికోన్నతి నాశ్రయించిన వివే
కానందు శేముషి నాశ్రయించి,
శిలువపై మరణంబుఁ జెంది కీర్తివహించు
క్రీస్తునాథు నహింసఁ బ్రస్తుతించి,
స్వారాజ్యమున స్వరాజ్యజ్యోతిఁ గాంచిన
గాంధీమహాత్ముని గారవించి,

తాత్త్వికస్ఫూర్తితోడఁ జిత్తములఁ జూరఁ
గొనిన శ్రీశంకరాచార్య ఘనత కెరగి,
ధర్మసంస్థాపనార్థ ముత్తమమనీష
శాంతిపథ మాశ్రయించు విజ్ఞాని సుకృతి.

భారతదేశసంస్కృతి య
పారముగా జ్వలియింప, దివ్యవా
క్సారము శిష్యులన్ దనుపఁ
శ సతపోధనపాళి శాంతికె
తీరుగ జన్మమునే జరిపి
దివ్యుల యాశిషమంది, క్రూరకాం
తారములెల్ల మార్చిరి సు
ధారసపూర్వతపోవనాకృతిన్.

చేతము శాంతిలక్ష్మిని వ
సింపఁగఁ, దాత్త్వికదృష్టి యబ్బఁగా
ఖ్యాతి కకుప్తతిన్ జెలఁగ,
గర్వము సర్వము నాశమందఁగాఁ,
నీతిమనస్కులైన యువ
నీజను లెల్లరు తృప్తి జెందఁగాఁ,
బూతములై చెలంగిన త
పోవనభూములు స్తోత్రపాత్రముల్.

క్రూరాణ్వాయుధసంగరంబున జనుల్
ఘోరాయుధాగ్నిచ్ఛటా
కారంబందున, దీపదగ్ధశలభో
గ్రప్రక్రియం జత్తు; రె
వ్వారున్ గోరని యిట్టిజన్యచయముల్
వర్జింపఁగాఁ, బ్రేమ వి
స్తారంబై చన, సేవ సేయుత ప్రజా
శాంత్యర్థమై 'శాంతి' దాన్.

సత్యాహింసల కాలవాల మయి, వి
శ్వశ్రేయ మీక్షించుచున్
నిత్యప్రాభవసంయుతం బగుచు, ని
ర్ణిద్రప్రభావంబునన్

స్తుత్యర్హం బగు శాంతిమార్గ మిది చెం
దున్ సంతతానందది
వ్యత్యాగద్యుతి, మానవుల్ దివిజులున్
భాసిల్ల నూత్నాకృతిన్.
మాయాశీలురు, పూరుషాధములు ధ
ర్మగ్లాని శంకింప; రే
దో యత్యాశమెయిన్ జరించి, కడు సా
ధుశ్రేణి హింసింతు, రా
త్మీయత్వంబున శాంతికాముకులు బే
ర్మిన్ వారి రక్షింత్రు, ధీ
మాయోగంబు ఘటింతు: రిత్తడికి భ
ర్మఖ్యాతి సిద్ధించునే.

రాజకీయధురంధరత్వంబు వహియించి
దేశసేవ యొనర్చు ధీయుతులకు,

శ్రీ అగస్త్యరాజు లక్ష్మీవేంకటాచలపతిరావు

విద్యాప్రమాణాల విస్తరింపఁ దలంచు
విద్యార్థిదేశకవితతులకును,
లలితకళాసృష్టి వెలయించి, లోకవి
ఖ్యాతిఁ గాంచిన కళాకారులకును,
ఉదరపోషణకునై యోర్పుతో దినమెల్ల
కష్టించి జీవించు కార్మికులకు,
వీరు వా రన నేల? నెవ్వారి కైన
శాంతిదేవీపవిత్రాంఘ్రిసరసిజాత
సేవన మవశ్యమై సదా చెలఁగుఁ గాదె!
శాంతి మరుదేశవృక్షవిశ్రాంతి గాదె!

విశ్వశాంత్యై మహాదేవ్యై
యేన మోదీయతే ఽనిశమ్;
ఏషా వినా ప్రజాకోటిః
ప్రశాంతిం న చ విందతే..

# నివేదనము

శ్రీ కందుకూరి రామభద్ర రావు



ఎంతటి యందమో జగతి నెల్లెడలందున జల్లి వెట్టు. నా
స్వాంతము పొంగిపోవు రసవాహిని, లోననె వో తలంపు ల
త్యంతము తీవసాగుచు ననార్తవపుష్పము లెన్నొ పూచు న
శ్రాంతమనోహరంబు లయి. సల్పెదుగాక త్వదర్చనా విధుల్.

ఇదియె సరోవరంబు, తెలిపించెదు నిందొక తమ్మిమొగ్గ, పొం
దెడు హిమపాతశీతలపదంబులు చిమ్ము తుషారసంహతిన్
ముద మొకయించుకేని విడువల్లని, నీయుదయప్రకాశసం
పద మెద సోక ఫుల్లదళభాసురమోదము జిమ్ము నెల్లెడన్.

పొరలను విప్పి నాయెడదఁ బొంపిరివోవు రసానుభూతికిన్
బరిధులు విస్తరించి, జని భవ్యముగాగ ననుగ్రహించి, సుం
దరతరసృష్టిశిల్పముల దాగిన దేవరరూపరేఖ లన్
దెరలను దీసి వైచి హృదిఁ దేల్పవె సమ్మదవార్ధిలోపలన్.

చలిమలసానువందునఁ బ్రసన్నమనోజ్ఞము లైన చంద్రకాం
తులఁ బులకించి, చిర్నగవుతోఁ బ్రవహించి, నదించు జాహ్నవీ
సలిలమువోలె నాయెడఁద స్వర్గముచాయలఁ ద్రిప్పు నీదు మం
జులమధుభావవీచికలచాలులు పొంగులువారి లోపలన్.

పూలవనమ్ములోపల నపూర్వపరీమళశోభితంబు లౌ
పూలను గోసి తెచ్చి వలపుల్ హృదయంబున మోసులెత్తగా
మాలలు గ్రుచ్చి నీ రుచిరమందిరసుందరతోరణంబులన్
వ్రేలఁగఁ గట్టనిమ్ముపచరింపగ జన్మఫలైకసిద్ధిగన్.

శిల జడవస్తువైన నులి చేఁగొని చెక్కిన శిల్పిచేత నా
ప్పాలఁబడి, యెంతొ దీప్తిమయమూర్తిని దాలిచి, లోకమందుఁ బూ
జలు గ్రహియించుచుండఁగ నజాండము జెక్కిన శిల్పిచేతితో
మలచినజీవితంబు బుధమాన్యము గాదె జగంబులోపలన్.

మనుజుని సర్వజీవులకు మానికమై వెలయన్ సృజించి, త
న్మనమున నించినావు కొలమానము లేని మహేంద్రజాలమై
తనరెడు శక్తిసంపుటులు, తన్మహిమోన్నతకల్పనాగముల్
చను దివి దాటి, నిన్నెఱుఁగఁజాలుదునే తత్కృతికర్తనున్ ప్రభూ!

తలఁచుకొనంగ నాహృదయతామరసంబు వడంకిపోవు ని
శ్చలధిషణాధురంధరులు, శాంతిమనస్కులు, సత్యమార్గగా
ములు, జగదంతరాంతరవిముగ్ధగుణగ్రహణానురక్తు లీ
జలనిధివేష్టితావనికి సల్పిరి ప్రాణసుమార్చనావిధుల్.

ఋతువులయుత్సవంబు లలరింపగ నెల్లెడ, నంతరిక్షసం
స్థితరవిచంద్రతారకలు దీధితులన్ వెలయింప జ్యోతులై
కతము నెఱుంగ నీజగతి కాలమహాపథ మంటి సాగెడున్
సతతమహోజ్జ్వలాకృతిని, సారథివై నడిపింతు వో ప్రభూ!

అడుగును మోప నాహృదయమందున నందనశోభ చిందువా
రెడు బ్రదుకంత; చిర్నగవు లింపులు గుల్కఁగఁ బల్కరింతువో
జడమతి వీణనై నటనసల్పెడు గానధునీప్రవాహమం;
దెడమరపింతువో ప్రభువ! యెత్తి కరాబ్జము వీపుదట్టినన్.

అందపు సృష్టిశిల్పము లహర్నిశలున్ వెలుఁగొందుచుండ, నా
నందమహాప్రవాహగమనధ్వని రోదసి నిండ, శక్తిని
ష్యందవిలాసవీచిజలజాండముసర్వముపర్వ సామి! నా
డెందము పొంగిపోయి యొకటే శ్రుతిగా నినదించెదన్ ప్రభూ!

# కాత్యాయనీస్తవము

శ్రీ నేలటూరి భక్తవత్సలము



మఱుఁగు జొచ్చిన వారల మనుతు వమ్మ,
లోకరాజ్ఞివి, బ్రోవుమా లోకవితతి;
నిఖిలలోకాంబ, దయఁ జూడు నీదు సుతుల;
శరణు, కాత్యాయనీదేవి, శరణు, శరణు.

దేవి, విశ్వంభరారూపిణి వయి నీవు
జగము లన్నింటి కాధార వగుదె కాదు,
నీటి రూపమునుం దాల్చి నిఖిలమునకు
హాయి గూర్తు వమోఘవీర్యంబు గలిగి.

విష్ణుదేవుని శక్తివి, విశ్వబీజ
మీ, వనంతవీర్యవతివి, యీ సమస్త
మును, జనని, మోహమునఁ బడి మునిఁగియుండెఁ
గనికరింతువ యేనియుఁ గనును ముక్తి

జనని నీ రూపభేదాలె చదువు లెల్ల;
మాతరో, నీదు రూపాలె మహిళ లెల్ల;
విశ్వ మంతట వ్యాపించి వెలుఁగు నిన్నుఁ
బ్రస్తుతింపఁ దరమె ఓపరాపరోక్తి?

అన్నియును నీవె యై యుంటి వనుచు, దేవి
వనుచు, భుక్తిముక్తు లొసఁగు దనుచుఁ బొగడు
నిన్ను వాఙ్మయం బంతయు; నింతకంటెఁ
దగిన పదములు గలుగునె పొగడ మాకు?

అన్నిటికి బుద్ధిరూపాన నంతరంగ
మందు వెలసియుందువు, జగదంబ, స్వర్గ
మోక్షములను నెల్లరకును బుడుకు దీవు,
దేవి, నారాయణీ, నీ కిదే నమస్సు

కలియుఁ గాష్ఠంబు మున్నుగాఁ గలుగు కాల
భేదరూపిణి వగుచు మార్చెదవు జగతి,
విశ్వసంహారశక్తి వీవే కదమ్మ
దేవి, నారాయణీ, నీ కిదే నమస్సు

మంగళము లన్నిట న్నీవె మంగళతవు,
శివవు, సర్వార్థనివహాల సిద్ధికరివి
గౌరివి, త్రిలోచనివి, సర్వశరణవు — నగు
దేవి, నారాయణీ, నీ కిదే నమస్సు.

భువనముల నెల్ల సృజియించి ప్రోచి పొలియఁ
జేయు శక్తి, వనాదివి, శ్రేష్ఠగుణమ
యివి, గుణాశ్రిత, వభయదాయినివి, మాతృ
దేవి, నారాయణీ, నీ కిదే నమస్సు.

దీను లార్తులు శరణు గోరినను, వారిఁ
బాలనము చేఁతయే నీదు వ్రతము కాదె;
ఎల్లవారల తాపాలఁ జల్లఁబఱచు
దేవి, నారాయణీ, నీ కిదే నమస్సు.

# శ్రీమదభేదానందవాణి - శ్రీరామకృష్ణస్తోత్రామృతము

భోగములందు రక్తిగొని, మోహవశంబునఁ బొంది, యేల రా
యీ గతి భ్రాంతుఁడా, సుడియు దిన్ని దినంబులు ? సౌఖ్యవార్ధిలో
వేగమె మున్గి విశ్రమము వేఁడెదవేని, భజింపుమా మహా
భాగుని రామకృష్ణ నెడబాయును సంసృతితాపసంతతుల్॥

ఘోరము దుర్నివారమును క్రూరము నౌ భవదావమందు వే
సారుచు మాడుచుంటి విసి సౌఖ్యము గోరుచు దుష్టవాసనా
ప్రేరణ నీచులన్ వలచి రెచ్చి శ్రమింతువు శాంతి గోరి; సం
సారవిదాహనాశనుని జయ్యన జేరుమ రామకృష్ణునిన్॥

విడువు మనాత్మశాస్త్రము, వివేకవిహీనుఁడ, మాన వోయి నీ
యుడుగని దుష్టతర్కముల, నొజ్జలమాటలఁ ద్రోసిపుచ్చుటల్
విడువుము; శాస్త్రహీనముల వీడి భజింపుము రామకృష్ణునిన్,
విడి చను నిన్ను సంశయము, వేగ తొలంగును భ్రాంతిసంతతుల్॥

కనకము కామినీగణముఁ గాంక్ష యొనర్చుచు నుండఁ బోకుమా,
విను, భవబంధహేతువు లవే యనుటన్ గ్రహియింపు మోయి, యా
యనుభవ మెంత యుండినను ఆశకు లేదు గదా క్షయంబు, కా
వున జితకామినీకనకపుంజుని గొల్వుము రామకృష్ణునిన్॥

వరసుగుణాలవాలను, నపారవికస్వరభక్తిసంతతా
భరణను, శారదాంబికను- వారవిలాసినులన్ సమంబుగాఁ
బరఁగెడి భక్తితో భువనమాతృస్వరూపిణు లంచు మ్రొక్కినాఁ
డరు దిటువంటి కామవిజయాఢ్యుఁడు ! గొల్వుఁడు రామకృష్ణునిన్

ఘాతువు లంటినంత స్థితి తప్పును, వ్రేళ్ళకు సంజ్ఞ యుండ, దు
ష్టాతల నూగు నంత వణఁ కున్నటులుండియె మేనఁ గల్గెడిఁ
వే తగులున్ జడాయితము, వీడును నింద్రియవృత్తి, యట్టి లో
కాతిగత్యాగశైలశిఖరాఘుని గొల్వుము రామకృష్ణునిన్॥

'విమలం' బంచుఁ, 'బవిత్ర' మంచు విబుధుల్ పేర్కొందురు 'ప్రేమస్వరూ
పము నిస్వార్థ' మటంచు; దానిని మదిం బ్రార్థింతువేనిన్ భజిం
పుము పాదాశ్రిత మానవాళిహృదయంబుం దద్రసార్ద్రింబుగా
నమరం జేసెడి రామకృష్ణుని ననన్యాధీనచిత్తుండవై॥

హేతువు గల్గు ప్రేమె కురియింతురు తల్లియుఁ దండ్రి సోదరుల్,
హేతువు లేక యుండునదె యెంచఁగ నుత్తమమైన ప్రేమ; ని
ర్హేతుక మౌనె కాదు సరి యెందును గానని ప్రేమసింధువున్
బూతపదాబ్జునిం గొలువఁ బూనుము వైశమ రామకృష్ణునిన్॥

ప్రియసంయోగమునన్ సుఖించునెడ నారీరత్న మానందముఁ
బ్రియునిం బాసి చరించువేళల మనఃపీడఁ వహించుం గదా;
ప్రియభక్తుం డరుదేరఁగా ముదమునం బేర్చుఁ మదిన్ రామకృ
ష్ణయతీంద్రుండు, భజింపు మాతని మనశ్శాంతిప్రదున్ సేవ్యునిన్॥

తను సేవింపఁగ వచ్చు దుఃఖితుల నిత్యంబుం గృపావీక్షణం
బున నాప్యాయత గూర్చి, వాఙ్మధువు నిం బొప్పంగ గ్రోలించి వా
రిని మోక్షార్థుల, శుద్ధిముక్తు లిఁడు నా శ్రీరామకృష్ణున్ సనా
తనధర్మప్రదు భక్తితోఁ గొలువుమా ధన్యత్వసంసిద్ధికై॥

యోగంబు ల్వతసాధనంబులును నేర్పొప్పారఁగా జేసి, యు
ద్వేగం బూడిచి చిత్తముఁ వశము నొందింపంగ నౌ సౌఖ్యమున్
దాఁ గాంచు న్నరుఁ డే గురూత్తముని నిత్యంబున్ సమీపించి — వా
నిం గొల్వంగనుమా శమాదిసుఖదున్ శ్రీరామకృష్ణప్రభున్॥

మగవా రందఱియందు నెల్లపుడు పద్మానాథు నీక్షించుఁ బో,
మగువ ల్గానఁగ రాఁగ వారిని జగన్మాతృస్వరూపల్గ తా
వగుచున్; భూతమహేశ్వరుం డయియుఁ జేర్పంబోఁడు గర్వంబు నీ
జగతీజీవుల భృత్యుఁ డౌను, కొలు మాసన్ రామకృష్ణప్రభున్॥

చదువంగ లేదు శాస్త్రముల. శాస్త్రము లెల్ల నెఱుంగు బాగుగాఁ;
జదువంగ లేదు వేదములఁ, జక్క నెఱుంగును వేదసారమున్,
జదువంగ లేదు తంత్రముల, నైన వచించును కౌల*ధర్మమున్ —
గదితసమస్తతత్త్వ శ్రితకామదు గొల్వుము రామకృష్ణునిన్॥

తనకై కోరఁడు దేనిఁగాని, మఱి భూతశ్రేయముం గోరెడిన్
తనకై కర్మలఁ జేయఁబోఁ, డొరులకై తా నన్నియుం జేసెడిన్
తనకై దుఃఖము నొందబోఁ డొరులసంతాపంబుచేఁ బొక్కెడిన్,
మన మారంగ భజింపుమా సదయుఁ డౌ నా రామకృష్ణప్రభున్॥

మిక్కిలిగాఁగ దేవుకథ మెచ్చుగఁ జెప్పుచుఁ, బాడి నవ్వుచుం,
జుక్కల మధ్యలో సతము సోముని పోలిక, భక్తకోటిలోఁ
బెక్కుర మధ్యలో, మిగిలి వెల్గెడు వానిని రామకృష్ణునిన్
నిక్కపు సౌఖ్యదాత భవనీరధిసేతువు గొల్వు మెప్పుడున్।

శివభక్తాగ్రచరుల్ శివుం డను చుపాసింపంగ, నంబాశ్రితుల్
శివయే ఈతఁడు సు మ్మటంచుఁ దరియన్, శ్రీకృష్ణనామాన వై
ష్ణవు లర్చించుచు నుండఁగా, 'పరమహంసా, జ్ఞాని' యంచున్ సుధీ
రవరేణ్యుల్ భజియింప నొప్పెసఁగు సర్వాకారు సర్వాత్మునిన్
శివసంధాతను నిత్యముం గొలువుమా శ్రీరామకృష్ణప్రభున్॥

యోనులఁ బెక్కింట జనియించితిని నేను;
దేహంబులం గంటి బహువిధములఁ;
గాంచనంబును వరకామినీగణమును
భోగవిషయములఁ బొంది తెన్నొ;

* కౌల = తాంత్రికసాధకుల

వీని యన్నింటను విభవ మెంతగ నున్న;
సుఖము గానఁగ నైతి సుంత యైన;
నిప్పుడు వైరాగ్య మెచ్చుగ నను బొందె
నిన్ను దెలిసికొంటి నింతవట్టు,

నమ్రులకు నీవు సఖుఁడ వైనాఁడవు గద
నీవెగా శాంతిసుఖముల నిచ్చునదియఁ
గాన నిను వేఁడుకొందును, గరుణతోడ
నీపదంబుల దృఢభక్తి నిమ్ము నాకు॥

కుమతిని, భ్రాంతుఁడన్, విషయకోటినిమగ్నుఁడ — నైన నన్ గుమా
ర్గమునను దుఃఖపూర్ణమునఁ గాలిడనీక మరల్పుమా, సమీ
పమునకుఁ జేర్చుకొంచును, నపారకృపం గురియించి, నాదు ప్రా
ణములను దేర్పుమా, యొసఁగు జ్ఞానవిరాగములన్ జగత్పతీ॥

రామకృష్ణుఁడె భవసంవిరాముఁ డగయఁ
బరమభక్తిని నాతని భజనసేయు
ధన్యుఁడు విడుపొందు భవబంధమునుండి
వెళమే లేదు శంక రవంతయైన॥

# యుద్ధోన్మాదం

శ్రీ మురళీధర్



మనిషి మేధలోంచి
ఏదో పుట్టుకొచ్చింది
మన స్సనే
తెల్లగోడమీద
మసిబొగ్గురాత నిలిచింది —

అర్ధరాత్రి
అహంకారంతో
హుంకరించిం దప్పుడు
పచ్చని పంటపొలంలాంటి
జీవితాన్ని
రాబందులకు స్థానం
చేద్దా మని సంకల్పం —

శాంతిపావురాన్ని
అప్పుడే ఎవరో
రెక్కలు విరిచెయ్యడానికి
తయారయ్యారు —

జీవితాన్ని తినెయ్యడానికి
ఘోర్కలతో సిద్ధంగా ఉన్నారు —

హృదయాలను
దున్నెయ్యటానికి
మరనాగళ్ళతో
ముందుకు దూకుతున్నారు —

నిశ్చలంగా ఉన్న
సరస్సులోకి రాళ్ళురువ్వినట్లు
నవ్వే శిశువున
కసిగా రక్కి ఏడిపించినట్లు
మనిషిని చంపటానికి
మనిషిని తూటాగా వాడే వీళ్ళు
తిండిగింజలకు బదులు
యిస్తారు తుపాకిగుళ్ళు —

తుఫానుకుముందు ముసురులాగ
యుద్ధానికి సూచనగా యుద్ధోన్మాదం
భయం ఒక పిశాచం
దాంతో కుళ్ళుతుంది జీవితం —

ఉవ్వెత్తున
ఉత్సాహంతో
ఈనాడు మనిషి లేచాడు —

ఈ కాల్చేసే ఉత్సాహం
ఈ యుద్ధపు రాక్షసిని
చేసేస్తుంది హోమం !

గుండెల్లో భయం దాక్కుంటే
పగటికి పక్షవాతం తప్పదు —

నాకళ్ళముందర విరిసిన
లోకంకళ్ళను మరసించి
బళ్ళతో మరఫిరంగులసపై
అవి చాక్లట్లకన్నా
తియ్యాని వని పుకారు —

అణువును అందలాని కెక్కించి
మనిషినిమాత్రం పాతాళంకన్న
క్రిందకు దించి
వాణ్ణి ఆకలికి ఉరితీసి
కోరలతో పీకేసే
చిరుతపులి సమాజానికి నివేదించి
ఊచి నడిరోడ్డులోకి విసిరి

పీకలదాకా దిగవేసావు —
ఊహాకందని మనిషిబ్రతుకును
ఊహాకందని నరకకూపంగా
తయారుచేసావు —

అందుకే
ఈ రాబందులరెక్కలచప్పుడు
వినిపించేదాకా
శాంతినిగూర్చి నాకు చెప్పకు!

శ్రమతో తడిసి,
సుమించి, ఫలించే స్వర్గం
ఎన్నాళ్ళనుంచో
మనిషిఎదురుచూస్తున్న స్వప్నం!
ఈస్వప్నం మనజీవితపరమావధి
దీన్ని నైజంచెయ్యడమే మనవిధి.

# జీర్ణశిల

శ్రీ గాడేపల్లి కుక్కుటేశ్వర రావు

✻

ఒక విజయలక్ష్మి– ఒక మహాభ్యుదయశక్తి-
ఒక సరస్వతి– తెలుఁగుతల్లికి యశస్సు
గూఱిచి పురాణగాథగా మాఱిపోయి
బీడువడి యున్న దాకొండవీటిలోన.

అవి యొకనాఁటిరాజుల మ
        హానివహమ్ముల కాటపట్టు లౌ
భవనము లొక్కనాఁ డవి నృ
        పాలవివాహగృహమ్ము లొక్కనాఁ
డవియె వనీవిహారగతు
        లయ్యెవియే యొకనాఁటి దివ్వెటీ
ల వెలుఁగునఁ దళత్థళల
        రాల్చిన రమ్యపు హర్మ్యపాళికల్.

బురుజుపై కోటకాపరివాఁడు గనరాడు
        బూజుపెట్టిన సాలెపురుగు దప్ప
రాణివాసమున నేరామచిల్కయు లేదు
        నిలయసంచారి గబ్బిలము దప్ప
భూమీశుసభలందు నేమంత్రులును లేరు
        గూబపెట్టిన వ్రేలుగూండ్లు దప్ప
నరపాలసింహాసనంబులు గనరావు
        కూలివ్రాలిన కొండకోనలు దప్ప
పడిన యాగుళ్ళ మెలఁగు సర్పములు దప్ప
నారికేళమ్ము లిచ్చు పూజారి లేఁడు
కలయ నెటుగన్న నెంపుదుబ్బులును దప్ప
గముల వికసించు పుష్పగుచ్ఛములు లేవు.

తరుణనర్తకుల పాదములమంజీరముల్
        మేళవించినవి గాంబోలు నిచట
రాకొమారిత వెంటరాఁ జెలులు లేతెంచి
        నీళుల నీదెఁగాంబోలు నిచట
పండువెన్నెలల నాథుండు కోరిన రాణి
        ముద్దు లిచ్చినది గాంబోలు నిచట
ప్రియురాలికొప్పుఁ జొప్పింప రాకొమరుండు
        పూలుగోసికొనె గాంబోలు నిచట

నిలచి మిథునమ్ము ప్రేమధునీతరంగ
డోల నూగాడిపోయెఁ గాంబోలు నిచట–
పలికి యొకమాట మనకుఁ జెప్పదులె గాని
పటుతరమ్మైన సాక్ష్య మావటకుజంబు,

వేమనభోగి– ఆతరుణ
        వేశ్యసుధాధరమత్తపానదీ
క్షామహిమంబు, ఈశ్వరవి
        చారము, యోగసమాధియున్, ధరి

శ్రీమయదోహదహాసహాస
రిస్ఫుటకంఠరుతమ్ము లీలా
ధామము కండ్లఁగట్టిన వి
షమ్మును చాటుచునుండె నేఁటికిన్.

అఖిలసుకవీంద్రవందనార్హప్రసిద్ధ
మధురతర భావరింఖత్ప్రమాద మైన
అది సారస్వతప్రవాహమ్మొ యేమొ!
ఉరుకుచున్నది- ఆ కొండచరియలనుండి.

మనువఁజాలని ప్రేమంపు నల్లె రేవు
శౌర్యవంతులదాన మౌదార్యపటిమ
చిలిపివలపుల చినరాణి సిగ్గుతెరలు
చితికిపోయిన వా కొండశిలలక్రింద.

ఆతొలినాఁటి వెల్గు లణు
వైకరవైనవి- గడ్డిదుబ్బులం
బాతుకపోయె వందలకు
వందల శౌర్యమరీచు- లాప్రచం
డాతప మారిపోయినది-
అక్కట! చూచెడి కంటి కుద్రుత
ద్యోతకమయ్యె జీర్ణవిభ
వోచితభూములు కొండసీమలున్.

ఆజాతిమొన భీకరారాతులను వీఁక
ఢీకొన్న మొండిగుండియలచాయ
అల జిచ్చి మట్టియూడల ప్రబ్బికొను బిట్టు
తలఁకని ధీసంపదలకు చాయ

బుసకొట్టు నాగన్న విస ముట్టిపడుచున్న
చాలు రేగిన పౌరుషాలచాయ
పలుకీచురాలరొదలు పీచములు రాల
రిప్రకళ మేన్పు నేడుపుల చాయ

పాడుబడియున్న గుడిగోడు బాపనీడు
వలసి డించిన కత్తులబావి చాయ
నిజము నిజమంచు దీని విన్పింపఁ బోదు
కర్మఫలముల గ్రహతారకాకులమ్ము.

ఉరుపీఠిన్ దలలెత్తి రెడ్డినరపా
లోద్వృత్తపతాకమ్ము లి
య్యెడ గర్జించెను- జూల్విదల్చె విజయ
మ్మిచ్చో- విసం బూర్పులన్
విడచెన్ శాత్రవగర్వఖండనకళా
భృద్వీరసర్పంబు లి
య్యెడ బండారము లెల్ల బట్టబయల
య్యెన్ వైరిసేనానులన్.

కదన మ్మాడిన రాజ్యలక్ష్మి చనియెం
గా గాడ్పులం జిక్కి, సం
పద లూరేగిన వస్థిపంజరము నై
భగ్నస్థలం బేలుచు
న్నవి ఆ శైలకుమారి అశ్రువులతో
నాజోలి నీ కెందు క
న్నది జీర్ణేందిర నిత్యనిశ్చలతలం
బం దున్న దానింబలెన్.

# "యద్దృశ్యం తన్నశ్యం"

శ్రీ అంబటిపూడి నరసింహశర్మ



అది యొక పూలతోట– హృదయంగమపాదపముల్ నికుంజముల్
పొదలగ, షట్పదీమధురమోహనగానసుధాప్రవాహముల్
నదులయి పాఱ, భూజనమనమ్ముల సంతతపారవశ్యస
మ్మదజనితప్రభూతజడిమద్రఢిమమ్ములఁ జేసె ప్రేల్మిడిన్.

అతఁ డొక తోటమాలి; క్షణ మైనను తీరిక మాలి, చెట్లపా
దతలము నీటితోఁ గడిగి, తత్పరతన్ తరుదోహదక్రియా
కృతిపరతంత్రుఁడై లతల రెమ్మల ప్రాఁకుల కల్లువెట్టి, యీ
క్షితి నొక నందనోపవనసీమ నొనర్చె మనోజ్ఞశిల్పియై.

ఎత్తుగ చెట్లు చేతులను నెత్తుచు మింటిని గౌగిలించె; పూ
గుత్తులతావు లీని, లతకూనలు తేంట్లను జేరఁ బిల్చె; తా
మొత్తుగ పండ్లఁ దాలిచి, తరూత్కరముల్ కనువిందు సేసె; ఇ
ట్లుత్తమదృశ్యకావ్యరచనోజ్జ్వలుఁ డాకవి యెట్టి మేటియో!

కోకిలదంపతుల్ చిగురుఁగొమ్మల యెఱ్ఱని లేఁజివుళ్ళతో
నాకలి దీర్చికొంచు, నొడియందలి బిడ్డలనోటి కిచ్చుచున్
ప్రాకటదివ్యజీవనపరాయణమై విలసిల్లె; చిల్కయి
స్తోకులు గూండ్లుగట్టి తమతోకముగూడి రమించె నయ్యెడన్.

వ్రాసిరి కావ్యముల్ సుకవివర్యులు తద్ఘనశిల్పిశిల్పవి
న్యాసముల న్నుతించుచు; మహత్తరచిత్రకళాప్రవీణు లా
భాసురసృష్టిఁ గుడ్యములపై లిఖియించిరి; శిల్పు లెందఱో
చేసిరి ఱాలపై సొగసుఁజెక్కడముల్ సుషమాహృతాత్ములై.

క్షణమున కేమి వచ్చునో నిజమ్ముగ ముం దెఱుఁగంగ వచ్చునే?
కనులకు గోచరించిన వికారము సుస్థిరమై చెలంగునే?
మణితలబింబితమ్ము ప్రతిమమ్ము యథార్థమె? మోహముగ్ధవీ
క్షణు లెఱుగంగఁ జాలుదురె- సత్య మసత్యము కల్మి లేమియున్.

ఓయీ పుష్పవనప్రపాలక ! తరువ్యూహమ్ములన్ నాటి, నీ
వా యా తీవలఁ బెంచి, పాదులను నీరారంగ నిండించి, యె
న్నో యాసల్ మదిఁ బెంచుకొంటివిగదా; ఊహింపలేవైతి వీ
నీయాయాసము వమ్మగున్ బ్రళయవహ్నిజ్వాలకం చయ్యయో.

నీవృక్షమ్ములయాయు వెంతటిదొ నీనిర్వాణనై పుణ్యస
ద్భావ మ్మెంతటిదొఁక నివ్వటిలునో వర్ధిల్లు నీతోటలో
తీవల్ నిల్చునొ మారుతాహతికి; పిందెల్ పూవులున్ రాలి నీ
యావద్యత్నము మోడువాఱదొ భవిష్యత్తున్ విచారింపుమా.

ప్రొద్దున రేకులన్ విడిన పూ వది వాడును సందెవేళకున్;
ముద్దిడి మాకరందరసమున్ దమిఁ ద్రావిన షట్పదమ్ము తా
నెద్దియుఁ జెప్పకే యరుగు నెయ్యెడకో; సకలమ్ము శాశ్వత
మ్మిద్ది యటంచు నెంచి వృథ యేటికొనర్తు వమూల్యకాలమున్.

నీతోటన్ గల పక్షిబృందరవముల్ నిత్యమ్ము లౌనొక్కొ? నీ
వేతమ్మున్ గడుఁ ద్రొక్కి తోడినజల మ్మిట్టింకులై పోదె? యే
దోతాత్కాలిక మౌసుఖమ్మనకు నుద్యోగమ్ము గావింతురే?
సాతత్య మ్మగు సౌఖ్యసాధనకు నీసర్వస్వ మర్పింపరా.

ఈదృశ్యమ్ము వినశ్వర మ్మనుచు నీ వీక్షించి, డెందమ్మనన్
పాదుల్ వేసి, రసమ్ము వోసి, పరిపూర్ణజ్ఞానవృక్షాంకుర
ప్రాదుర్భావము గూర్చి దోహదకృతిప్రావీణ్య మేపారఁగాఁ
బ్రోదిన్ జేసి, తదీయసుస్థిరఫలస్ఫూర్తిన్ సమార్జింపరా.

ఐహికశోభకై పెనఁగులాడుట వ్యర్థము; నేఁడో రేపో యీ
దేహము కూలిపోవు; జగతీతలమే విలయమ్ము నొందు; స
మ్మోహము మాని, యీకృతకమున్ విడనాడి, పరోపయోగిస
న్నాహము తోటమాలి! జతనమ్మునఁ జేయుము; సార్థక మ్మగున్.

అంటుల్ గట్టకు తీగకొమ్మలకు నీ వన్యోన్య మొండొంటితో;
అంటేలేని పవిత్రజీవితమె నిత్యానందభాగ్యమ్ము వె
న్వెంటన్ గూరుచు మానవావళికి; ఈవిశ్వమ్ము దృశ్యమ్ము నిన్
బంటుంజేయును దుఃఖరాక్షసికి; తద్వ్యాపారమున్ మానరా.

తోట న్నాటిన మొక్క లెన్ని క్షితికిన్ దూరమ్ము లై పోయెనో
కీటక్లిష్టము లెన్ని జీవితవిముక్తిన్ గాంచెనో— ఈతిబా
ధాటంకమ్ముల నెన్ని రూపఱెనొ వాత్యాఘాతవిచ్ఛిత్తికిన్
చోటై యెన్ని యడంగెనో త్రుటి మనస్సున్ నిల్పి యోచింపరా.

ఆయుర్దాయము వందయేఁడులకె పర్యాప్తమ్ము; ప్రావృణ్ణదీ
ప్రాయమ్మై యురువేగధాటి భ్రమియింపన్ కాలచక్రమ్ము నీ
కాయమ్మే పతనమ్ము నొందు; ఇహలోకమ్మెల్ల శోకోర్మికా
భూయిష్ఠమ్ము; తిరమ్మునౌ నుపవనమ్మున్ నాట యత్నింపరా.

ఆశల వీడి, యైహికపుటందములన్ విడనాడి, లౌకిక
క్లేశము లుజ్జగించి, పరికించి యథార్థము, చిత్తశుద్ధి న
భ్యాసము సేసి, యింద్రియము లన్నిఁటి గెల్చి, మహేశ్వరేశ్వరో
పాసనఁ జేయ జీవిత "సహార" మరుస్థలి నందన మ్మగున్.

# ప్రభూ!

శ్రీ జ్ఞానానంద కవి



మిణుకు మిణు కనీ మొఱపెడు కునుకు దీప
మే నాదీయకుటీరాన మేళవించి
నన్ను నోదార్పుచున్న దన్నా! పరేశ!
జాలిఁగల దొర! దీనుల నేలు వేల్ప!

విసుగుఁ బుట్టించునట్టి నా పేద బ్రతుకు
నిముస నిముసమ్ముఁ దలప గుండియ ద్రవించు
స్వార్థజను లుద్భవించిన వసుధ దారి
యీ యభాగ్యున కేది? స్వామీ! వచింప.

ఈవిశీర్ణ గేహాన నా యి పిశాచ
దేవి తాండ్రించు కొంపను దీర్ఘకాల
బహుళశకంటకజీవనవనములోన
మనుటకును నాకు గడియయు మనసు రాదు.

మిగుల భయపెట్టు నన్ను మబ్బుగమికూడ
వానకై గూడు కట్టుకో లేని నన్నుఁ
గాంచి నాజీవితమ్మునుఁ గాంచి నీకు
కరఁగదా! గుండెకాయ నిర్ఝరమునట్లు.

నిన్ను శరణుఁగోరి నీవంక నిలుచుండి
నీదు పాదసేవ నెమ్మి మీఱఁ
జేసి మ్రొక్కు నాదుదోసమా యిది యేమి?
మందలించి నన్ను మనుపు మయ్య!

దివ్యకవిత వ్రాయఁ దెగియుంతు నంటినా?
ఒగివిచారములకుఁ దగులుకొంటి
సృష్టిఁజేసి నన్ను సిలుగులలో ముంపఁ
గంకణమ్ము నీవుఁ గట్టినావె?

రసమయం బైన యీ దొడ్డప్రకృతిలోన
వేడినిట్టూర్పు విడిచి నేఁ బాడుకొందు
హృదయమునుఁ బెకలించి యభ్యుదయగీతి
పరమపరదైసులో నన్ను మఱచిపోదు.

రెండు జేనెల నేలైన లేదు నాకు
బికిర మెత్తుచు నేను జీవించుకొఱకు
పాత్ర కొకజేన, నా కుక్కిపడక కేది
జేన? దీనజనావనా? యీనతిమ్ము

నాకు నీకుఁ గల్గు నయమిత్ర బాంధవ్య
మెపుడు కల్లగాని యింత దాక
ననఘ! నాకుటీరమునకు రా వది యేమి?
మొగముఁ ద్రిప్పుకొనుట తగునె తండ్రి!

సొమ్ము లేనికతనఁ జుట్టాలు మిత్రులు
తల్లిదండ్రు లింత దగికి రారు
నీవుకూడ సొమ్మునే చూచి వత్తువా?
అయిన నాదుజన్మ మసలు సున్న.

సరసతను మాటలాడి టక్కరితనానఁ
బరుల వంచించి వెలుపల నురుల నొడ్డి
మిడిసిపడునట్టి జనుల సమీపమందు
కాపురముసేయ నాకొంపఁ గట్టలేను.

ప్రకృతిలో సమస్తవైభవాల నిమిడ్చి
నాదుభాగ మింత నాకు నీక
లేమిలోన నేల? కామమ్ము పుట్టించి
చావుదెబ్బఁ గొట్టినావు తండ్రి!

# కిరీటి విషాదము

నా కీసంగాలము వద్దు సోదరులతోనా? నేను పోట్లాట కృ
ష్ణా! కారుణ్యపయోనిధీ! వలదు రాజ్యం బేలు వ్యామోహముల్
నాకళ్యాణముఁ గోరు పెద్దలు, గురుల్ నాబంధువర్గంబులన్
డీకొన్నన్ ఫలమేమి జారెడిని గాండీవమ్ము నాహస్తమున్.

కన్నాకున్ ననుఁ జేయగాఁ దలచి (శ్రీ)కారుణ్యపుంగుండె ను
త్పన్నంబైన రసార్ద్రమంజులసుధాభావాన నం దేల్చి నే
డిన్నాళ్ దాక నఖండదృక్కులను నెంతేఁ జూచు నాయొజ్జ ద్రో
ణు న్నే నెట్టు వధింతు భండనమునందున్నేడు దామోదరా!

జగతిన్ మల్లడిఁ జేయగా గల తపశ్శక్తిస్వరూపుండు నా
పగసూనుండు మహాపరాక్రమయశోభాస్వంతుడౌ భీష్ము డౌ
ను గదా! యాతడు తాత వెండియును కర్ణుం డన్న సామాన్యమా?
తగవా? యుద్ధము నా కదేల? యనుగుం దమ్ముండ్రతో మాధవా!

రణభూమిన్ బ్రతిపక్షనాయకుల బుఱ్ఱల్ జీల్చి చెండాడి చి
క్కినసామ్రాజ్యవధూకంకణం గరమునం గీలించి భోగాలఁ దే
లిన కంటెన్ పులి భిస్సటన్ మెసవి సంతృప్తిన్ బ్రహర్షించి జీ
వనమున్ సేయుట మేలు వైర మిక బావా! వద్దు మున్మాటికిన్.

బలముం జూచి తెగించి భండనము దేవా! సేయుచో నాదు బం
ధు లసంఖ్యాక మనంతముల్ జయముఁ గొందున్ జాలుచా లింక నెం
దుల కీ యాసలు లేసి స్వర్గస్పృహాసందోహమ్ము సృష్టించుటల్
కలధౌతాంబరధారి! నా చిలిపి వ్యాఖ్యానమ్ము మన్నింపవే?

కఱకున్ ముష్కరబుద్ధిచేత నల లాక్షాగేహమున్ మమ్ము సో
దరు లాకౌరవు లెల్లఁ గాల్చ నట యత్నంబున్ బొనర్పంగ నీ
కరుణాసాంద్రవిలోకనప్రభలతోఁ గాపాడినా వన్న నీ
శరణేన్ దేవర! నీదువాక్కులు శిరోధార్యమ్ము మా కెప్పుడున్.

వలదోయీ? చిన మొత్తు మాబ్రతుకుకై బ్రహ్మాండమా? లేవె కొం
పలు జీవింప నితాంతహర్షమున నోస్వామీ! యథార్థంబుగాఁ
దెలుప న్నెత్తుటికూటి భోజనపు విద్దెల్ నాకు వద్దింక చే
తులు రాకున్నవి నన్ క్షమించు గుణసింధూ! దీనబంధూ! నమో!

అయినన్ సంగరభూమిఁ గాల్నిలిపి శస్త్రాస్త్రమ్ములం గుప్పి యీ
జయ మార్జింపఁ దలంపు నా కసలు ప్రస్తావింపగా లేదు, నీ
దయ యున్నన్ బదివేలు నా కది మహాత్మా! యిట్టి కంగారు నా
కయయో! రుద్దకు దుగ్ధసాగరవిహారా! భక్తకల్పద్రుమా!

పగవారా! యలకౌరవేశ్వరులతో పాటల్ల భీష్ముండు నా
దు గురుగ్రామణి, ద్రోణుడున్ సకలబంధువ్రాతముల్ కృష్ణ! నా
దగు దోశ్శౌర్యము నీరసించెడిని మిథ్యారాజ్యసామ్రాజ్య మే
లగ నాడెందము పొంగిపోవదు విలోలంబయ్యె వాక్రువ్వగన్.

# సందేశము

## శ్రీ పాతూరి రాధాకృష్ణమూర్తి



ఎందరురాజు లీధరణి నేలిరి మున్నికముందు నెందరే
లందగువార లుండిరొ ? తిరంబిట నెద్ది కనన్ సదా మహా
నందనిమగ్నమానసుడవై పరమేశు భజింప సార్థకం
బందును జన్మ వేరె ధరయందు శరణ్యము లేదు మిత్రమా !

ధర జనియించి మోహపరతంత్రుడవై సతి నోర్తు గోరి సం
బరమున జెట్టబట్టగ నపత్యము గూడు ననంతరమ్మ, జే
కురు మహనీయకష్టములకున్ గురియౌటయె గాని సౌఖ్య, మే
కరణిని బొంద దీ వెరుగగా, కలిచర్యలు చూడు మిత్రమా !

పోదు దురాశ, యీర్ష్య గొను బూజ్యుల జూచిన, దైవ మన్నచో
లేదు ప్రమాణబుద్ధి, స్మృతిరీతుల నమ్మడు ధర్మదూరమౌ
వాదన యన్న ముందడుగు వైచును, భక్తుల దూరుచుండు, మ
ర్యాద యెరుంగ డట్టి మనుజాధము డెట్లు తరించు మిత్రమా !

చేయడు జీవహింస, దయచే గనుగాని, మ రెన్న డాత్మలో
బాయడు దైవచింతనము, భక్తి జనాశ్రయు డౌను గాని తా
రోయడు దానధర్మముల లోకహితుం డగుగాని, ముక్తికాం
తాయుతు డౌటకున్ దగిన ధన్యుడు ధన్యతముండు మిత్రమా !

కన్నది యెద్దియో ! కనుల గానని దెద్దియొ ! యీధరిత్రి నీ
కున్నది యెద్దియో ! విడువకున్నది యెద్దియొ గుర్తెరుంగ, లే
కున్న పశుక్రియన్ మెసవి యుర్వి మనంగ నగుం గనంగ, సం
పన్నత జూడ కాత్మ గడు భక్తి నుమేశు భజించు మిత్రమా !

సిరిగలవారితో జెలిమిచేసిన సౌఖ్యము గల్గునంచు, సం
బరపడె దేల? యక్షపతిబంధురమిత్రవరుండుగాగ, శం
కరు డెటు భిక్షు డయ్యె నది కంటివె? కర్మ ఫలప్రభావమున్
దరమె దరింప నీభువి విధాతకునైన నెఱుంగ మిత్రమా!

ఆలుంబిడ్డలు, దల్లిదండ్రు లనుజుల్ స్వాత్మీయు లంచున్ దయా
లోలుండై, భువి నష్టకష్టములకున్ లోనౌచు సంసారి, మే
ల్కాలం బంతయు వ్యర్థపుచ్చి జడుడై కాలాత్ము డౌ నీశు, దా
నాలోకింప డదేమి వెఱ్ఱితన మయ్యా! చూడ నోమిత్రమా!

ధరణిన్ బుట్టినదాది గిట్టువరకున్ దాపత్రయోపేతుడై
వరలున్ దా నవివేకి నిత్యము మహాభక్తిప్రపూర్ణాత్ముడై
"హర! శంభో! శివ! శంకరా!" యని మదిన్ ధ్యానించి సుజ్ఞానిసు
స్థిరమౌ మోక్షపథమ్ము చూరగొనుగాదే! చూడ నోమిత్రమా!

# కాదంబిని

## శ్రీ వజ్ఝల కాళిదాసు

వత్సరముల్ గతించు క్షణభంగుర
జీవిత మందు; మల్లికా
గుత్సమునన్ వెలుంగు శతకోటి
శశిప్రభ, నవ్యవర్ణ సం
పత్సముదాయముల్ కోరడు
పజ్జల జేరును, మాతృదేవతా
వత్సలతాగతుల్ పసిడిపండెడు
బీజమునందు పెల్లగున్!

కారణము లేని బ్రతుకు సంఘటనమయము
ప్రతిదినోదయపూర్వాంబరమునందుఁ
బారు పక్షుల కలకలధ్వనుల లీల,
తూర్పువాకిలిలోఁ బూయు తోగరులట్లు!

ఎదురు వచ్చెడి కెరటముల నె
ట్లెదుర్కొను నీ యానపాత్రలు ?
ప్రకృతిశక్తికి బుద్ధియుక్తికి
నిత్యసమరంబు !

విలువయైన రత్నాలు బొగ్గులనె పుట్టు
నందు రది నిజమ్మె యగు; గాఢాంధకార
గర్భకుహరమ్ములందె మానప్రకాశ
రాగములఁ గురిపించుఁ దారాగణమ్ము !

కడుపులో నగ్నికుండముల్ కదలుచున్న
మనసులో మహోజ్వాలలు మండుచున్న
నాశలన్నియుఁ గోల్పోయి నట్టి [illegible]లితి
బ్రతుకు గడ్డకట్టిన హిమపర్వతమ్మొ !

భావి! కలల విన్న భావసంగీతమ్మొ,
పుటలు విప్పబడని పుస్తకమ్మొ,
కాలరాక్షసి లయకాలగర్జాధ్వని,
యుల్లమలర విచ్చు మల్లెమొగ్గ !

విప్పారి వాసనల్ గుప్పుచు నున్న
సూనంబులన్ జూడ నానంద మొదవు;
వన్నెలు చెడి నేలఁబడి వాడియున్న
యలరులఁ జూడ నమ్మాలికమ్ము గలుగు;
సంతోషసంతాపసాగరమ్ములకు
కూలముల్ నిర్మింపఁ జాలు మనస్సు,
ఆశ్రవమందస్మితార్ణవములకు
చెలియలికట్ట రచించును పెదవి !

నా కిక నీకృపాపథమునన్
సుధలన్ గురియించు వెన్నెలల్
ప్రాకవు, కోమలప్రసవ
వాసితరమ్యపరీమళమ్ములున్

శాంతి

జేగురబోవు, నిత్యరమణీయ
    వినూత్ననిశాంతకాశముల్
పోకవు, కాలమే యిచట
    స్రుక్కను చీకటినీలినీడలన్

తారకామల్లికాకోరకమ్ములకు
ప్రతిరాత్రిజననమ్ము ప్రత్యుదయమ్మృతి!

నాఁడు చనె వసంతములు క్షణాల లీల
క్షణములే నేడు నిల్చు వర్షమ్ము లగుచు;
ప్రత్యణువునందు విశ్వరూపమ్ము తోఁచు,
అశ్రుకణమె ముంచెత్తు మహార్ణవముగ!

పూలను త్రెంచి జీవితముఁ
    బుచ్చినవా రెవరైనఁ బాడగా
జాలుదురే మనోజ్ఞముగ
    చంద్రికలే పులకింపఁ దారలే
మేలుకొనన్, సుమమ్ములె
    నిమీలినమొప్పు విరన్ మధూదయ
శ్రీ లిగురెత్తగా విధుర
    జీవితవల్లరి పూలు పూయగా!

# ఉక్తిలాలిత్యము

## శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి



శ్రీమాన్ పరవస్తు చిన్నయసూరి, ప్రాచీనాంధ్రలక్షణగ్రంథములం జాలవఱకుఁ దత్సమప్రక్రియనుమాత్రమే యధికముగా నిరూపించుచు, క్లిష్టబంధములుగా రచింపఁబడుటచే బాలుర కుపయోగపడుపద్ధతిలో సులభమార్గమున సూత్రగ్రంథముగా నొకవ్యాకరణమును రచింప సంకల్పించెను.

ఆ రచించుటలోఁ దా నెక్కడనో దూరమునఁ గూరుచుండి లక్షణకర్తగాఁ బేరు గడించుటకయి తోఁచినరీతి నేదో యొకటి వ్రాసిపడవైచుట మాత్ర మాతని దృష్టి గాదు. మఱి, అంతకుఁబూర్వ మాచ్ఛిక పదస్వరూపము దెలుపు ప్రక్రియ యంతగా లేకుండుటచే నట్టిపదజాలమును బ్రాచీనగ్రంథములలో నున్నదానిని దనకంటి కానినంత వఱకు సేకరించి, యందలి ముఖ్యాంశములను సంగ్రహముగా బోధింపవలయును. ఆ బోధించునది యాంధ్రదేశమందలి బాలబాలికల కందఱకును నిర్దుష్టము సరళమునగు వచనరచన సేయు కౌశలమును గలిగించుఁదై యుండవలెను.

కావుననే, దేశమందలి బాలబాలికలందఱను దనయంతేవాసులుగా నాతండు భావించినాఁడు. తా నొకప్రధాన కళాశాలలో నధ్యాపకుఁడుగూడ నగుటచే శిష్యబృందము నడుమ చిఱునవ్వుమోముతోఁ గూరుచుండి భాషాసంప్రదాయములను బోధించుచున్నంతటి తృప్తి యీరచనాసమయమునఁగూడ నామహనీయునకుఁ గలదేమో యనిపించును.

అందువలననే సూత్రోదాహరణముల నిచ్చుటలోఁ గూడ 'వినుఁడు బాలకులు! వినుఁడు బాలకులార!' అని తనచుట్టును బాలురఁ గలయఁజూచుచున్నటులు, పేరుపేరున సంబోధించి, యొకవంకఁ గూరుచున్న బాలికల నుద్దేశించి 'వచ్చితిరి కాంతలు! వచ్చితిరి కాంతలార!' యని ముద్దుగాఁ బలుకరించి, మరల బాలురదిక్కు మొగంబై 'అన్నలార! మిమ్ము నడిగెద నొకమాట' యని బాలురను మాత్రము ప్రశ్నించు సన్నివేశము ( తత్స- 37 ) సూచితముగా సంఘటించెను. సమాధానములు చెప్పుటలో బాలికలు బిడియపడుదురని కాఁబోలు బాలురనే ప్రశ్నించుట. ఆప్రశ్నించుటలో శిష్యులయెడ నాతనికిఁ గల వాత్సల్యమును, బాలికలయెడ మర్యాదయు, వారికందఱకుఁ బ్రశ్నోత్తరరూపమున నేదో బోధించుచున్న తీరును నొకదానివెంట నొకటి స్ఫురించును. అనఁగా, ఈదేశమందలి బాలబాలికల కందఱకు నొకతరగతి యేర్పఱిచి, తా నధ్యాపకుఁడై బోధించుచున్న తీరు, ఈగ్రంథమునందుఁ బెక్కుతావులఁ గాననగుచు నాతని యుత్సాహమును వెల్లడించుననుట.

తాను బోధింపఁ దలఁచినదా ప్రాచీనభాషాలక్షణము; ఎదుటనున్నవారా బాలురు, పసివారు. కావునఁ దాఁ జెప్పెడిమాటలు శుష్కములై యేవో యుదాహరణసమన్వయమాత్రప్రయోజనములై యుండరాదు. మఱి — మృదువులై మధురములై నీతిబోధకములై భావగర్భితములై, పురాణకథాస్ఫోరకములై, వీలగునెడ ఛందోబద్ధములై హృదయంగమములై యుండవలయును. అంతియ గాదు, తియ్యతియ్యని యనుపానములతో నారోగ్యకరములగు నౌషధముల నిచ్చునట్లు లలితలలితములగు సూక్తులతో భాషాస్వరూపవైవిధ్యమును సోపానక్రమమున, ఆపసివారి మనసులకుఁ బట్టునట్లు బోధింపవలయును. ఇదీ, బాలవ్యాకరణరచనలో చిన్నయసూరి దృక్పథము. కావుననే గ్రంథారంభమున :

> 'ఓనయను లలితోక్తులతో
> నొనరుపఁడం గూర్చి లక్ష్యయోజన మొప్పం
> గను బాలవ్యాకరణం
> బనఁగా లక్షణ మొనర్తు నాంధ్రంబునకున్'

అని హృదయము నావిష్కరించియుండెను. తా నేవిషయము వివరించినను, ఏలక్ష్యము చూపినను, అందుఁ గుదిరినంతవఱకు లాలిత్యము గోచరించి బాలురకు నుత్సాహజనకమై యాకర్షకము కావలయునని యాతని కుతూహలము.

మనోహరములగు కథాఘట్టములను గైకొని సరసములగు కావ్యములు రచించునెడ లలితముగను హృదయంగమముగను రచన సాగింపవచ్చును. అట్లు సాగింతు మని కవులు ప్రతిజ్ఞలను చేయవచ్చును. ఆ ప్రతిజ్ఞలు నిర్వహించుకొనుటయు సాధ్యము కావచ్చును. కాని, శుష్కములు నీరసములు నగు వ్యాకరణాంశములను నిరూపించునపుడు గూడ 'లలితోక్తులతోడనే' రచన సాగింతు ననుటయు, ఆ విధానమును తుదముట్ట నిర్వహించుటయు లాక్షణికులలో నొక్క చిన్నయసూరికే చెల్లినది. అనఁగా, శుష్కకర్కశమైన వ్యాకరణాంశముగూడ నాతని పలుకుబడితీరులో కావ్యత్వసిద్ధి పొందినదన్నమాట. దీనినిబట్టి సూరిహృదయ మెంత మృదువైనదో, యాయనభావ మెంత విశాలమో, బాలురయెడ నాయన కెట్టి యభిమానమో సులభముగా గ్రహింపనగును.

> 'అతఁడు శ్రీమంతుఁడు- ఇతఁడు గుణవంతుఁడు'-
> 'ఆమె శ్రీమంతురాలు- ఈమె విద్వాంసురాలు'
> 'వానివంశము శ్రీమంతము- వీనివంశము గుణవంతము'
> (తత్స- 71)

పైవాక్యములను జదువుటతోడనే యాతఁడు బాలురను దనయెదుట, గూర్చుండఁబెట్టుకొని, వారిలో నొక్కొక్కనిని వ్రేలితోఁ జూపుచు విషయములను బోధించుచున్న సన్నివేశము మనకన్నులకుఁ గట్టును.

శ్రీమంతము- గుణవంతము- విద్వాంసము- అనడ్వాహము- శ్వానము- ఉపానహము'. ఈయుదాహరణముల తీరును, క్రమమును, పైసందర్భమున సంధానించుకొని యాతని యాంతర్యమును నిదానముగాఁ బరికింపుడు—

«ధనవంతులైనవారు గుణవంతులు గావలెను: అంతియ గాదు. విద్యాబుద్ధులను గడింపవలెను. అట్లుగాక బుద్ధి లేని యనడ్వాహములైనచో ననాగరకులై విలువలేక కాలిచెప్పులకుఁ గలహించు శునకములవలె నధములుగాఁ జూడఁబడుదురు» అని బోధించుతీరు నిగూఢముగా నింకిమిడియున్నది.

అంతియగాదు, ఆపిల్లలలో నొకనిని బిల్చి 'భవద్గుణంబులు- త్వదాశ్రమములు' (తత్స- 87) 'నాయనా! నీవు సుగుణవంతుడవు గావలెను. అట్లగుట నీప్రవర్తనాభ్యాసములవలనఁ సిద్ధించును. అది నీలోనే యున్నదిగాని యొకరు తెచ్చిపెట్టవలసినది గాదుసుమా' అని బోధించుతీరును స్ఫురించుచున్నది.

«మత్పుణ్యము- లసద్రూపము» నాపుణ్యము చాల మంచిది; ఏలయన, మీవంటిశ్రద్ధాళువులగు బాలుర కుపదేశించుటచే నా వ్యాకరణపరిశ్రమ సార్థకమగుచున్నది గనుక- అను నభిప్రాయ మిందు గర్భితము.

'భవిష్యత్కాలము - ధూర్వహము' — రాఁబోవు కాల మెట్టిదో! భాషావిషయకముగా నెట్టి యలజడులు పుట్టునో! 'కంటికేగాని కర్ణమునకు గోచరింపని యీయరసున్నలతోఁ జిక్కులు పడలేమయా' యని గోలపెట్టు సుకుమారులు కొందఱిప్పటికే యుద్భవించినారు. ఈ ప్రబుద్ధులవలన నెప్పటికో గాదు, హ్రస్వముమీఁద (=అల్పకాలముననే) ఖండబిందువునకుఁ బూర్ణబిందువు (O=శూన్యత) బహుళంబుగా (సంజ్ఞ-14) నగునేమో యని భీతి పొడముచున్నది. నేను బహుపరిశ్రమచేసి సంతరించిన యీవ్యాకృతి నియమముల నెంతభద్రముగా సంరక్షింతురో! భారము మీయది సుండీ!' యని తనచుట్టునున్న బాలురను గలయఁజూచి యుపదేశించుచున్నతీరు స్ఫురించుటలేదా?

ప్రసంగము వచ్చినపుడెల్ల నుదాహరణవ్యాజమున బాలురహృదయములలో నాటుకొనునట్లు నీతులను ధర్మములను బోధించుట యాతని సహజరమణీయసరణులలో నొకటి. «సత్యము సర్వశ్రేయము, అది లేనిచో సర్వధర్మములు వ్యర్థములు» (సంధి-55) సత్యముపలుకుట యన్నిధర్మములకంటె నుత్తమోత్తమ మని బోధించుట.

అట్లే, «ధనంబుచేత సౌఖ్యంబు గలుగు, విద్య చేత యశంబు గలుగు». 'ధనము - విద్య' యీ రెండిటివలనఁ గలుగు ప్రయోజనముల తారతమ్యముఁ జూపుచు, 'సౌఖ్యము తాత్కాలికము, యశము శాశ్వతము, కావున ధనమార్జించుటకన్న విద్యసంపాదించుట యెక్కుడు లాభకర' మని బోధించుట యాతని యాంతర్యము.

ధర్మములను నీతులను బోధించుటయే గాక, యవకాశము గలిగినపుడెల్లఁ జిన్నచిన్న వాక్యములలోఁ బురాతన ప్రసిద్ధ కథాంశములుగూడ బాలుర హృదయములకు హత్తుకొనున ట్లుదాహరించుట యీతనిరచనలో గమనింపవలసిన యింకొక విశేషము

1. రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేఁడు. (కారక- 12 యాగరక్షణము.)
2. విశ్వామిత్రుఁడు రామునకు మిథిలం గానిపించె. (క్రియ- 124 మిథిలాప్రయాణము.)
3. రాముఁడు విల్లుండిన౦ద్రిలోకంబు లాకులంబులగు. (కారక- 42 శివధనుర్భంగము.)
4. జనకుఁడు రామునకుం గన్య నిచ్చెను. (కారక- 8 సీతాకల్యాణము.)
5. రాముఁడు పట్టిన ప్రతిన వారింపం దరంబు గాదు. (కారక- 32 పాదుకాప్రదానము.)
6. రాముఁడు వాలి నొక్కకోలం గూలనేసె. (కారక- 22 వాలివధ.)
7. లంకం గలకలంబు పుట్టె. (కారక- 22 లంకావాసులు భయభ్రాంతులగుట.)
8. రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రి సహితంబుగఁ బుష్పకారూఢుండయి సాకేతంబున కేతెంచె. (క్రియ- 120 రావణసంహారము అయోధ్యాప్రవేశము.)
9. సుగుణాభిరాముఁడు రామునకు జోహారు వొనర్చెద. (కారక- 27.)

పైవాక్యములఁ బరికించితిమేని రామాయణమునందలి ప్రధానభాగములు పెక్కులు సూచితములు. ఇట్లు శ్రీరాముని గుణగణములను సూచించుటమాత్రమే గాక 'సుగుణాభిరాముఁడు రామునకు జోహారు వొనర్చెద' నని పలుకుటగూడ మిక్కిలి సందర్భోచితముగఁ గానవచ్చును.

ఇట్టిపట్ల 'కాకరుతంబుకంటె నన్యంబు కర్కశంబు లేదు. ఖరంబుకంటె నితరంబు భారవాహకంబు లేదు' అని యుదాహరించినను లక్షణసమన్వయంబున కెట్టి కొఱంతయుం గలుగదు. అయినను, నీరసములు నిరుపయోగములు నగు వాక్యముల నిరూపింపక, ఆనందకరములు, ఆకర్షకములు, సకలానుభవసిద్ధములు నగు వాక్యములం జూపుటలోని లాలిత్యము మెప్పులందక తప్పదుగదా!

ఈ సందర్భమున మరికొన్ని యుదాహరణములతీరు గూడఁ బరికింపుఁడు—తిర్యక్కులు కర్తలగునపుడు భూతతద్ధర్మాద్యర్థకముల ప్రథమపురుష బహువచనంబునకు నేకవచనం బగు ననుటకు—

'చిలుకలు పలికెను—చిలుకలు పలుకును' (క్రియా—25) అని యుదాహరణములు. 'ఇట కాకులు కూసెను-కాకులు కూయును' అన రాదా? అనవచ్చును. కాని — అనఁడు. వ్యాకరణమునందైనను బాలకుల చెవులకు సోఁకవలసినది చిలుకల పలుకులు గాని కాకులయఱపులు కావని యాతని దృష్టి.

ఈరీతిగా వ్యాకరణద్వారమున నొకవంక ధర్మములను నీతులను బ్రస్తావించుచు, వేఱొకవంకఁ బురాతనగాథల స్ఫురింపఁజేయుచు, నడుమ నడుమ భక్తిని నెలకొల్పఁజాలు నలఁతియలఁతివాక్యములను, ఛందోబద్ధములై కంఠస్థములగుట కనువైన చిన్నచిన్న పద్యభాగములను గల్పించి యుదాహరించుట యాతనిరచనలోని మతి యొక్క విశేషము.

ఈక్రిందివాక్యములను దిలకింపుఁడు :

'హరి నను గృపఁ గాంచెడును' — (క్రియ—26)
'హరి నను గృపఁ గాంచుతను — (క్రియ—26)
'ఆర్తిహరుఁడ వౌనినుగొల్తు నంబుజాక్ష'—(కారక-34)
'నందతనయుండు కృష్ణుండు నాకు దిక్కు'—(కారక-19)

'దేవకీపుత్త్రు హరిని నుతింతు నెపుడు' — ,,
'శుభవిధాయులు రామకృష్ణుల భజింతు' — ,,
'భువనవంద్యను రుక్మిణిఁ బొగడుచుందు' — ,,

భగవద్భక్తిగర్భితములగు నిట్టివాక్యములు పనివాని హృదయములందు ముద్రితములై యొకప్పుడు గాకున్న నొకప్పు డేని స్మృతిపథమునకు రాకమానవనియు, రావలయుననియు నాతని తలంపు.

సూరి సరసహృదయుఁడు, సరళస్వభావుఁడును, మితభాషి, మృదుభాషియును. కఠినములు నశ్లీలములు నగు పదము లుపయోగించుటగాని, పరుషముగాఁ బ్రసంగించుట గాని, యొకరిని లఘూకరించుటగాని యాతనిస్వభావమే కా దనిపించును. లక్షణనిరూపణముపట్ల నితరులమతము తన కభిమతము గాకున్న తావులందు :

'ఔపవిభక్తికములు గావని కొందఱు వక్కాణించిరి'
'ఎందుశబ్దమున కలిగాగమము కొందఱు లే దండ్రు'
'నలుఁగడాదుల నీయాగమంబు లే దండ్రు'

అని యీతీరున మృదువుగను, విషయప్రధానముగను జెప్పి విడిచిపైచునేగాని వ్యక్తులపేరైన నెత్తుట యాతనికి రుచింపదు.

ఇంతయేల, లాఘవాపాదకములు, అగౌరవసూచకములు అమంగళములు నగు కార్యములను దెలుపు క్రియలు గల వాక్యములలోఁ గర్తృపదములను గూర్పవలసివచ్చినపుడు 'దేవదత్తుండు వంటకమును వండెను' (కారక - 2), 'మైత్రుఁడు చైత్రునిచేత ఋణంబుగొనియె' (కారక - 4), 'మైత్రుండు రాజ్యంబువలన భ్రష్టుండయ్యె' (కారక - 9), 'చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడి మడిసె' మున్నగురీతిని, ఏకర్తలనో ముడిపెట్టి వాక్యములు చూపునేగాని, వంటకము వండుట, ఋణంబు గొనుట, రాజ్యభ్రంశము నందుట, మరణించుట మున్నగు క్రియలకుఁ బ్రసిద్ధ రామాది కర్తృపదములను వాడనే లేదు. దీనినిబట్టి యాయనహృదయసారళ్య మెట్టిదో, ప్రసంగధోరణి యెంతమృదువుగ నుండునో సులభముగా గ్రహింపవచ్చును.

మఱియు, చేదర్థకానంతర్యార్థకాది ప్రత్యయముల కుదాహరణ లిచ్చునపుడుగూడ :

'వానలు గురిసినం బంటలు పండును' (క్రియా - 41)
'జాబిలి తోఁతెంచుడుం గువలయంబులు వికసిల్లె' (క్రియా - 2)

అని లోకకల్యాణమును, మనోహరదృశ్యసన్నివేశమును గోచరింపఁజేయు వాక్యములే యాతనికి స్ఫురించునుగాని అమంగళములు, జుగుప్సితములు నగుభావములా సహృదయునికి స్ఫురింప వేమో యనిపించును.

చిన్నయసూరి మంచివివేచనముతోపాటు నిదానమగు చూపును, లౌకికమగు ప్రజ్ఞయుఁ గలవ్యక్తి. శాస్త్రీయ విషయములు క్లిష్టములై దురవగాహములై యారంభదశలో నున్నవారి కెంతవిసువు జనింపఁజేయునో గుర్తించిన యనుభవశాలి. కనుకనే లోకవృత్తములను, మనోహరసన్నివేశములను దనయుదాహరణములలో నతినిపుణతతోఁ బొదిగి వ్యాకరణగ్రంథమును జక్కని కావ్యలాలిత్యము గోచరించునటులు రచించెనా యనిపించును.

కారకపరిచ్ఛేదములో 'జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు (కారక – 24) అనుసూత్రము గలదు. జడవాచకశబ్దముల ద్వితీయకుఁ బ్రథమావిభక్తివచ్చుట యిందలివిషయము. దాని కుదాహరణములుగా :

'వాఁడు పువ్వులు దెచ్చె – (వాఁడు పువ్వులను దెచ్చె)'
'ఆకె సొమ్ములు దాల్చె' – (ఆకె సొమ్ములను దాల్చె)
'వాఁ డిల్లు వెడలె' – (వాఁ డింటిని వెడలె)

అను వాక్యముల నిచ్చియుండెను. వీనిని సామాన్యదృష్టితో జూచినచో 'పువ్వులను' అను ద్వితీయకు 'పువ్వులు' అని ప్రథమవచ్చుట మాత్రమే గోచరించును. కాని ఈసూత్రమందలి పదములకూర్పును, నుదాహరణ వాక్యరీతిని గలిపి నిదానముగాఁ బరికించినచో నిది యాలుమగలనడుమఁ బ్రవర్తిల్లిన యొక చిన్ని వినోదఘట్టముగా స్ఫురించును.

సంసారరంగమున సాధారణముగా భర్త ప్రథముఁడు. ఆతరువాతిది భార్య. అనఁగా ద్వితీయ - ఇది లోకసామాన్యము. కాని, జడుని ద్వితీయ(భార్య) తఱచుగాఁ బ్రథమ యగునట. అనఁగా సంసారరంగములో స్వతంత్రయై ప్రధానురాలగుననుట ఏలయందురా; వాఁడు జడుఁడు— సంసారమును జక్కఁ దిద్దుకొన నేరఁడు. ఆభారము సహితము

తానే వహింపవలసివచ్చును. కావున నామెకుఁ గొంత విసుగును భర్తపై నలక్ష్యభావము నేర్పడుట సహజము. అట్టిదానిని గొంతయయినఁ దెలివిగలవాఁ డగుచో వశపఱచుకొనుటయో, వీడుటయో చేయును. ఆ రెండును చేతఁగాని జడుఁడుగాన నామె కేదే నొకమార్గమున నాతఁడు ప్రీతిని గలిగింపయత్నించుట సహజము. అందులకే గావలయును వాఁడు పాపము, ఆమె యిచ్చకమునకై పూవులు దెచ్చినాఁడట! ఆమె యాతఁడు తెచ్చిన పూలు ముడుచుకొన నిచ్చగింపక యావఱకున్న సొమ్ములు దాల్చినదఁట. అతఁ డెంత జడుఁడైనను దాఁ దెచ్చిన పూవులు నిరాకరించుటవలనఁ జిన్నవోక తప్పదుగదా! చిన్నవోయిఁ ఏమియుఁ జేయలేక, ఏమాటయుఁ బలుకలేక యిల్లు వెడలిపోయినాఁడట! ఈచిన్నిఘట్టమున, మందుఁడయిన మగఁడు — చురుకయిన భార్య—ఆదంపతుల సంసారపుసన్నివేశము స్ఫురింపఁజేసి యెంతసరసమగు సమాసోక్తిని సంఘటించెనో పరికింపుఁడు.

ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళములు విధించుచు: «పూచెను గలువలు, తోఁచెను జుక్కలు, చేసెను డక్కలు, నెగడెను దమములు, మొగిడెను బద్మము» అని యుదాహరించెను. స్థూలదృష్టికిఁ బైయుదాహరణములలోఁ గ్రమముగాఁ బరుషములకు సరళము లాదేశము లగుటయే చూపట్టును. కాని యాయుదాహరణసరణిని, గ్రమమును సూక్ష్మముగాఁ బరిశీలించి కావ్యదృష్టితోఁ జూచినచో నీవాక్యసరణియందు సాయంసంధ్యావర్ణన మిమిడియున్నటులు గోచరించును. సాయంకాల మగుటతోడనే కమలబాంధవుఁ డస్తమించుటయుఁ, గలువలఱేఁ డుదయించుటయుఁ బరిపాటిగదా! చంద్రోదయ మైనంతనే కలువలు పూచినవి. చుక్కలును బొడసూపినవి. క్రమముగాఁ జీఁకటు లలముకొనినవి. కావుననే జారచోరులు టక్కులు (మోసములు) సేయ మొదలిడిరి. జలజబాంధవుఁ డస్తమించెను గానఁ బద్మములు ముకుళించినవి. ఈతీరునఁ గువలయవికాసము, తమఃప్రసారము, జారచోరవిజృంభణము, పద్మముకుళనము, అను సాయంకాలధర్మముల నిరూపించుటచేఁ దత్సమయస్ఫూర్తియు, సంధ్యాకాలప్రవర్తమాన ప్రకృతిసిద్ధ కార్యస్ఫూర్తియుఁ గలిగించెను. 'సూరి బుద్ధిపూర్వకముగా నిట్టిసన్నివేశములఁ గల్పించెనా, లేక యానుషంగికముగా నయ్యవి కుదురుపడినవా' యను చర్చతో మనకుఁ బ్రసక్తివలదు. శుష్కము లగు వ్యాకరణాంశములను నిరూపించుపట్లఁగూడ సూరి దృష్టి మనోహరమై లలితమగు రచనారీతి ననుసరించునని గుర్తించుటమాత్రమే సరసమార్గము.

ఇట్లే సంధిపరిచ్ఛేదాంతమున ననుకరణసంధి సూత్రోదాహరణములుగా—

«వర్ధతాం శ్రీ యనియె
తుభ్యం నమో యనె
కింత త్తనియెఁ క స్త్వ మ్మనియె
దాసోహ మ్మనె
తత్కర్తవ్య మ్మనెన్» —

అనువాక్యములు గలవు. సాధారణముగాఁ జూచినచో సంస్కృతవాక్యములు తెనుఁగులో ననుకరించునపు డుండవలసిన విధానముమాత్రమే పైవాక్యములలో గోచరించును. కాని, సూక్ష్మముగాఁ బరిశీలించితిమేని యిందొక వినోదప్రసంగముగూడ నిమిడియున్నట్లు బోధపడును.

వైష్ణవసంప్రదాయముగల యాచార్యుఁడు తనశిష్యుని 'వర్ధతాం శ్రీః' (సంపద వర్ధిల్లును గాక) యని మంగళాశాసనపూర్వకముగాఁ బలుకరించినాఁడఁట. వైష్ణవసంప్రదాయము ననుసరించి 'దాసోహ' మనుచుఁ బ్రణామమొనర్పవలయును. అది గుర్తింపని యాశిష్యుఁడు 'అయ్యా నమస్కార' మను సాధారణరీతిని 'తుభ్యం నమః' అని పల్కినాఁడఁట.

అంతట నాచార్యులు 'కింతత్! క స్త్వమ్!' అదేమోయి! నీ వెవండవు? వైష్ణవుఁడవు గావా? యని హెచ్చరించిరట.

అపు డాతఁడు జ్ఞప్తికిఁ దెచ్చుకొని, నాలుక కఱచుకొని, తప్పు దిద్దుకొని 'దాసోహ'మ్మని పలుకుచు దండము సమర్పించినాఁడట.

అటుపై నాచార్యులు 'తత్కర్తవ్యమ్' 'అట్లు చేయవలయునోయి' యని పల్కినారఁట! ఈవైష్ణవగురుశిష్యుల ప్రసంగమునందలి ముచ్చటను గమనింపుడు.

సూరి తన గ్రంథమును «వృషశైలంబున వెలసి........ కోర్కులు చాలంగా నొసగు కల్పసాలముఁ గొలుతున్» అని దేవతానమస్కారరూప మగు మంగళముతో నుపక్రమించి 'పంకజాక్షాయ నాథాయ వేంకటేశాయ మంగళ' మ్మని శుభాంతముగా ముగించి యుండెను. ఈపద్ధతి సర్వగ్రంథకర్తృసాధారణము.

ఈయన యంతమాత్రముతోఁ దృప్తిచెందక బాలుర శ్రేయమును మఱింతగా నభిలషించినయాతఁ డగుటంచేసి గ్రంథాంతమునఁ దుట్టతుదిసూత్రమును నయితము 'రేఫంబులు లఘ్వలఘువులనుం దక్కంగల విశేషంబులు నార్యవ్యవహారంబులఁ దెలియుట శ్రేయంబు' అని మంగళకర మగు శ్రేయః పదమును గ్రంథాంతర్భాగముగాఁ జేసి తనరచనను ముగించుటలో గోచరించు విశిష్టత గమనింపఁదగినది.

అంతియ గాదు, ఆయన లక్షణరచనములోఁ దన్మయత నంది యసామాన్యమగు నుల్లాసముతోఁ బైనసూచించిన రీతిని లక్షణముతోపాటు ధర్మము, నీతి, భక్తి, వినయము, గాంభీర్యము, పెద్దలయెడగౌరవము, పరదూషణవైముఖ్యము మున్నగువానినిగూడ వినోదముతో, లలితోక్తులతో, బాలురకు బోధించి వారిని లక్షణజ్ఞులుగ మాత్రమే గాక గుణసంపన్నులుగ నయితము తీర్చిదిద్దుటయే పరమలక్ష్యముగా నెంచి, యందులకై తనజీవితమును ధారవోసిన ధన్యమూర్తి. బాలవ్యాకరణమున నామహనీయుని తాత్పర్యము నడుగడుగునను దూరపుఁజూపుతో నాకళించుకొని యాతనిభావములకు సన్నిహితులై మృదువైన యాతని ప్రకృతిని గ్రహించి యాయన నాదర్శముగ నెంచుకొనఁగల్గిన బాలకులు, సూరియభిలాషము ననుసరించి లక్షణవేత్తలే గాక, గుణసంపన్నులు నయితము గాకమానరు—

'ద్రుతప్రకృతులకు సన్నిహితములగుచో పరుషములు సరళములు' గాకుండుట యెట్లు?

# గీతి

శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి

★

వాల్మీకిగళములో
వాక యైనది గీతి
వ్యాసమునిబ్రదుకుగా
భాసించినది గీతి
కాళిదాసునికంఠ
మాల యైనది గీతి
ఆరాధన మొనర్తు
నార్ష కవితాగీతి!

నన్నపార్యునిమురళి
నాద మైనది గీతి

తేజ మైనది గీతి
శంభుదాసునిహృదయ
సార మైనది గీతి,
ఆరాధన మొనర్తు
నాంధ్రసుందరగీతి!!

చేతముప్పొంగ, ప్రే
మాతిశయమున బెంచి
నీతిరీతులు గఱపి
ప్రీతి నను ముద్దాడె,
గీతి నాజననిగా
కేల్మోడ్చి నుతియింతు-

భావనేత్రము దెరపి
త్రోవలో నడిపించి
ఈవిశ్వమర్మంబు
లే వేవొ యెఱిగించె,
గీతి నాగురువుగా
కేల్మోడ్చి సేవింతు-

నిదురలో తను మఱవ
నెద దట్టి మేల్కొలిపి
అద నెఱిగి తను దానె
తుదకు తనలో చేర్చె,
గీతిదైవంబుగా
కేల్మోడ్చి ధ్యానింతు-
ఆర్ష సుందరగీతి
ఆంధ్రకవితాగీతి!

# ప్రభో!

శ్రీ "రంగబాబు'



ఇవాళ నాహృదయం
విలయంగా విజృంభిస్తుం దెందుకు ప్రభు?
ఈవేళ నాహృదయం
శార్దూలంలా గర్జిస్తుం దెందుకు ప్రభు?

జీవితాశయాన్ని విడిచి
చీకటిగోళంలో గ్రుడ్డిగ,
ఎటైనా దిక్కు తెలియక
వెళ్ళుతున్నా నా ప్రభు?

మానవధర్మాన్ని కలచి
ఉన్మాదోన్మత్తశునకంవలె;
వ్యక్తావ్యక్తపాలి
కేక లిడుతున్నా నా ప్రభు?

బ్రతుకుపరమార్థాన్ని మరచి
ప్రయాణించే ఈపథికుణ్ణి,
సర్పరూపంలో సాక్షాత్కరించి
కాటేసిపోవా ప్రభు! – నన్ను
దాటేసి పోకు ప్రభు!!

అవ్యక్తకౌగిలిలో – మనసు,
విచిత్రప్రకృతిలో – మస్తిష్కం,
ఫక్కున పగలబడి
నవ్వుతున్నాయి ప్రభు!

మల్లెపువ్వును జూచి
మండిపడుతున్నాను
చెలినవ్వును జూచి
చిరాకుపడుతున్నాను
ముళ్ళగులాబీని
ముద్దిడుతున్నాను
కళ్ళున్నా కీలంలో
కాళ్ళిడుతున్నాను.

కారణ మేమిటి ప్రభు? – ఈ
దారుణ మేమిటి ప్రభు?

నన్నింకా ఈ
కిరాణాదుకాణంలో,
నకిలీసరుకుగ
చలామని కామంటావా ప్రభు?

ప్రపంచమిత్తికపాత్రలో, నా
పాలి పాపక్షీరాన్ని
గ్రుమ్మరించక మునుపె,
నన్ను పాపులనుండి
నిష్క్రమింపజేయవా ప్రభు?

మృత్యువుసంగీతం
వినిపించవా ప్రభు!
ముక్తి నాకు నీవు
ప్రసాదించవా ప్రభు!!

# వేదనా వాసుదేవము

శ్రీ నాయని సుబ్బారావు

౧

నీవు వాసుదేవ భావవిస్మృతి నొక్క
కొండకొమ్మ నెక్కి కూరుచుండి,
ఆయగమ్యపథము నందుకోజాలని
నన్ను తప్పుబట్ట న్యాయమయ్య!

అన్నా! యెన్నడుగాని నీదరికి గ
ర్వావిష్టత న్నేను రా
నన్నానా, మదిఁ గంటగించుకొని న
న్నజ్ఞాతవాసమ్ము పొ
మ్మన్నా వెందుకు! విచ్చి చూచుకొనవ
య్యా నాదు డెందమ్ము శ్రీ
మన్నారాయణమూర్తి దివ్యపదప
ద్మశ్రీగుబాళించునో!

శ్రీమంతుడవేగా! నా
కామిత మీడేర్ప నీకు గగనమ టయ్యా
స్వామీ! అనంతలక్ష్మి
ధామము నీ గుండె బండతన మేమందున్!

ఆమహాతల్లిచలువఁ గోటానకోట్ల
కీవు పడగలెత్తితివి కొండెక్కి కులుక.
ఆలి చేసిన సంపన్మహానుభావ!
వట్టిపిసినారి వగుట భావ్య మ్మటయ్య!

ఆజగల్లయకారి సాఁబయ్య భ్రష్ట
చిత్తులకు త్రవ్వితండమ్ము లెత్తువాడు!
భక్తులను బిట్టుఱాచి అంపాన బెట్టి
కాని వదలని గడుసు వెంకయ్య వీవు!

ఆయన నిను జూపించును,
ఆయన జూపింతు వీవు హరిహరబలవ
న్మాయావాగుర నెఱకలు
పోయిన పక్షినయి దొద్దవోవుదు నేమన్!

ఇరువురును తోడుదొంగలే పరమగురులు!
హరిహరాద్వైతభావఖలాంతరమున
కలిపికొట్టిరి కొందఱు ఘనులు మిమ్ము.
రాలెనేమొ వారికిని వరాలమూట!

మన సెఱుగలేని పంగనామాలదొరవు!
పదియునాలుగులోకాలపట్టు నీ మ
హోజఠర మెప్డు నకనకలాడనీని
భక్తులకు పంగనామాలు పంచు మంతె!

ఇది నా వేదన నీకు సహ్యమగునో
యేమో అదే మింత ప
ట్టదుపో నాకు, త్రయీశిరోగ్రముల నా
ట్యస్ఫూర్తి దీపించు నీ
పదయుగ్మ మ్మది నాహృదంతరమునన్
బంధించుకోగంటి. నా
కదియే చాలు ననంతవిశ్వభువన
వ్యాపారపారాయణా!

కరములు పాదము లక్షులు
శిరములు వేయేసి యైన చెలువము మదిలో
తిరపడదు నీదు మాయా
నిరవధికమహోద్వమున ననిర్దేశ్యవపూ !

తాపింఛచ్ఛవి వౌట గావలయు నంతా చీకటే లోన నీ
రూపమ్మున్ పదిలించుకో నయనసంరోధమ్ము సేయన్ బహి
ర్వ్యాపారప్రవణేంద్రియమ్ములకు లేవా పట్టపగ్గమ్ము ల
ప్పా ! పాటింపక చూచుచుందువటె నాపాప మ్మిటుల్ పండగన్ !

నామాట వినవు, నాలో
నీమార్గము నెపుడు చెఱుపనే వేచు వృథా
కామనము లింద్రియము, లి
స్సీ మర్దింపవు, బలే హృషీకేశుడవే !

పరపగు వేయిబాహువుల పంచమహాయుధలబ్ధదుష్టసం
హరణము చాలు, భక్తవరదాభయదాయకశోభనప్రభా
కరము కరమ్మునన్ తనువు గప్పి తదంతరరాగమూలని
ర్హరణముగా భవమ్ము చరితార్థము సేయుదె సర్వవిజ్ఞయా !

బలి యీయం గని మూడుపాదములు నీభక్తుండు నీపాదమున్
తలపై బూని నిమేషమాత్రమున పాతాళంబుఁ బ్రాపించె. కే
వల మొక్కంగుళ మైన నీ గనని నిర్భాగ్యుండ నే మోదు నా
తలపై నీదుసహస్రపాదములతో, త్రైవిక్రమశ్రీనిధీ !

వేపాదమ్ములు మోయ నాకు వశమా విశ్వప్రదీపా ! భవ
చ్ఛ్రీపాద మ్మొకడేని చాలునని లో జింతింతు నేవేళ, స
ర్వాపద్వారణసౌఖ్యకారణశుభప్రారంభసంరంభ మా
నీ పాదమ్ము నఖాగ్రరేఖనయినన్ నిండింతువే నాయెదన్.

కనులు జగత్త్రియీభువనకందళసుస్థితికారణమ్ము లై,
కనులు రవీందుబింబములుగా తపనమ్ములు శైశిరమ్ము లై,
కను లవి సర్వభూతహితకాంతినిధానము లై వెలుంగ, నా
కను లివి దైన్యపుంగనులు కాదగు నయ్య సహస్రలోచనా !

ఒక కారుణ్యకటాక్షలేశ మిట రాదో ! తామసీపూర్ణకం
టకసంకీర్ణపరంపదగ్రసనలుంటా కావదీర్ణాస్మదా
స్తికతావీథినిరంతరోజ్జ్వలముగా తేజఃప్రభల్ చిమ్మదో !
వికచాంభోజమరందసమ్మిళితదయావిస్ఫారనేత్రద్యుతీ !

నాదు వేదనకును వింతనవ్వు లొలుకు
పుష్పదరహాస ! నీ వేయిమోము, లేను
గాలమునబట్టి విసరిన నేల మీది
మట్టగిడుసు నై గిలగిల కొట్టుకొనగ !

ఒక నిర్వేదపువెల్లువన్ మునిగి, ని న్నుద్వాసితుం జేసి, భ
ల్లుకపుంబట్టుగ నాదు గుండెగుడితల్పున్ మూసి, లోనన్ బిగిం
చుకొనంగా గడె, యేమి నాతెలివి మందుల్ ! తల్పుపైనుండి పా
యక తీయంగల కుంచెకోల యది నీహస్తార్పిత మ్మె ప్రభూ !

నను నుద్వాసితు జేసె వీ డని సదానందప్రసన్నాకృతీ !
కనలే పుట్టదు నీకు, తల్పు తెఱువంగా నీవు పొంచుండి మె
ల్పున సారించిన కుంచెకోలమొనత్రిప్పుల్ నాకు గిల్గింత లై,
తను వుద్యత్పులకాప్తి కోరకితమందారద్రుసంకాశమై !

కుంచికత్రిప్పులన్ విడియగొట్టిన లోగడెయా కవాట మిం
చించుక యోసరించి, హసియింపుల లోలదృగంచలమ్ములన్
కొంచెము తొంగిచూతు; శతకోటితటిల్లత లొక్కసారి చుం
బించిన యట్టులై వెలుఁగువేలగ నాదు తమోంతరంగమున్ !

నిను నిర్వాసితుజేయ నే నెవరు తండ్రీ! చీమవై బ్రహ్మవై
అనిరుద్ధాకృతి విశ్వభూభువనముల్ వ్యాపించి నీ వుండగా
మినహాయింపగు నేమి నాయెడద; స్వామీ! తప్పువచ్చెన్ బిగిం
చనులే త ల్పిక, సర్వజీవహృదయస్థా! వాసుదేవప్రభూ!

నను నిర్వాసితుజేసి సేతుహిమవన్మధ్యస్థలిన్ దైన్యభా
జనతన్ ద్రిప్పెదవయ్య! చేతి కొకభిక్షాపాత్ర సంధించి; నీ
పనుపేమో యెఱుగంగరా, దిది మహాప్రస్థాన మై పేర్చునో!
కనుగంతల్ గల గానుగెద్దునడకల్ గానై సుడుల్ వోవునో!

ఓతప్రోతము లైనమార్గముల చొ వ్వాహింపరా, దైన వీ
తాతంకమ్మగ దృష్టిగోచరపథవ్యామోహి నై పోవుచో
శ్వేతద్వీపము వచ్చెనిం కొకటి వచ్చెం గాక నా కేమి, సం
గాతమ్మై వెనువెంట వత్తు వనియున్ నా కొక్కటే ధైర్యమై!

వెనుకం జేరియు తందనాల్ పలుకుటే వేడ్కైనచో నెట్లు, ముం
దనుసంధించియు దారిజూపు మది కాదా, మోయగా భారమై
చను నీయక్షయపాత్ర నీవును ధరించన్వచ్చుగా కొంత సే
పనిదంపూర్వడ వేమి కాదుగద నీయాధిక్యముం జాటుకోన్!

ఇదియే మత్యయ మయ్య! నాహృదయమం దేమూలనో లీలగా
కదలున్ నీపదబంధముల్ ప్రతిగృహాగ్రక్షోణి నంచద్రసా
భ్యుదయశ్రీకముగా సమర్పితము లై, ఓవేయినామాల దొ
డ్డదొరా! ఒక్కడు చూడడున్ వినడు మాటల్ రెండు మాట్లాడడున్!

వెనుకని ముందఅంచు నతివేలముగా వెతబెట్ట నెంతగా
చినిగితివయ్య! యింక దయసేయుము నాయెదపాన్పుమీది, కె
యనువుననైన గేస్తుమరియాదకు లోపములేక యింత నీ
తినుటకు తెచ్చిపెట్టి దగ దీర్తునులే, ప్రణతార్తిభంజనా!

ప్రణతార్తిభంజనుడ వని
గణేయులగువారు పొగడగా ముగ్ధుడ నై
గుణహీను నిన్ను విడువక
గుణింతు నిది యేమి బావుకోనో తెలియన్ ॥

గుణముల్ మూడిటి నిచ్చవచ్చినగతిన్ గుప్పించినన్ సర్వదు
ర్గుణకందమ్ముగ తీర్చిదిద్ద నిది నీకున్ వేడుకా నోటు ॥ స
ద్గుణతుంగాచ్ఛతరంగరంగవిలసత్కూలంకషా ॥ న న్నిటుల్
గణనాతీతమహౌఘపుంజమునకున్ గావింతువే పాత్రమున్ ॥

ఇది చేయం దగనట్టి కార్యమని లో నేధర్మమో మూల్గ నై,
ఇదియే చేయుచునుందు నెల్లపు డధర్మేచ్ఛాదృత మ్మంత బో
కిది నీపన్నినమాయయంచు నొకసాహిత్యమ్ము సంధింతునే,
నిది లోకోత్తరమైన భక్తిగదె ॥ ప్రహ్వాభూతమాయావధీ ॥

మాయలమారిపోకడలమం చెద విజ్జనియెల్ల ముండ్లకం
పై యెటు లీడ్చినన్ తరుగనట్లుగ, నిన్ని యుగమ్ములయ్యు నా
ప్యాయత నన్ను నాకు తెలుపం బనిలేని తటస్థవేషధా
రేయ మి కెంతకాలము వరించెదవో యది నేను చూచెదన్ ॥

యమనియమాదిసాధనములంటవు, సేంద్రియచిత్తవృత్తి మో
క్షమహితబోధవల్లరులు సాగ వొకంగుళ మేని, కాని ప్రా
ణము లివి వేదశాఖలకొనల్ ఫలియించిన నీస్వరూపమున్
గమిచికొనంగనే పొరలగాబడు, దీనికి స్వస్తి యెన్నడో ॥

నను నెట్లుం గడతేర్ప జాలని భవన్నాథత్వ మేపాటి, నా
మన సి ట్లూరక దుఃఖవహ్ని మరగింపన్ సేమమా నీకు, పే
నును కుక్కించెద నన్న భూరిబలవంతుండే గదా రాజు, రా
జును చెక్కింపగ లేచె పే వను కథాసూక్ష్మమ్ము గుర్తుంచుకో ॥

న న్నేదో వెలిగింపు పౌరుష మనిశ్చ, దైవమ్ము నాపైన నే
నున్నా నంచని చెప్పి తప్పుకొను నుద్యోగ మ్మికం జెల్ల దా
ప న్నిత్యాశనిపాతభీతిజనితాపస్మార మ్మై నా కప
చ్ఛిన్నమ్మయ్యెను పౌరుష మ్మిక నవిచ్ఛిన్నమ్ము నీ దైవమే !

అణుగర్భమ్మున పీటవెట్టుక సుసూక్ష్మ ! చర్వణాసాధ్యచి
క్కాణమై పోతివి నాకు, భౌతికమహాజ్ఞానప్రభాధీమద
గ్రణు లీసృష్టిరహస్యభేదనకళాకాముల్ నినుం గాన క
య్యణుగర్భమ్మను ద్రక్కలింతు, రిక నయ్యా ! నీకు తా వేడనో !

కుజగోళమ్ములు చంద్రగోళములు నీకుం గానివై నేటి క
క్కజపున్ రీతుల విక్రమింతు రణుసంజ్ఞావేదు లీనేల, తో
యజమిత్రాంతరభేదనప్రతిభ నీయం తేను గన్గో ననం
తజగన్నాటకసూత్రధారి, యపు డైన న్నన్ను గుర్తింతువో !

గీ

నను గుర్తించిన చందమా యిది, హిరణ్యస్కంధరమ్యాష్టచ
క్రనిరూఢాద్భుతతీవ్రవేగశకటాంకస్థాయివై, క్షీరతో
యనిధిప్రాంతవినోదసంతతవిహారాఢ్యుండవౌ స్వామి ! నా
కని పాదద్వయభూప్రదక్షిణము నిత్యక్రీడగా కూర్చియున్ !

శ్వేతద్వీపనివాససుస్థిరపదశ్రీనాథ ! శేషాహిశ
య్యాతంద్రాంకితమూర్తి వయ్యు, నరవిప్రా నీ కటాక్షాంతసం
జాతాజ్ఞావధిలోని బొంగరములుంగా సర్వగోళమ్ము, లీ
నీతిభ్రష్టుడు దిక్కుమాలి తిరుగున్ నీ కిన్కకుం బాత్రమై,

పుట్టినగ్రామమున్ విడిచిపొమ్మని, మిత్రుని సాకతమ్మునన్
మెట్టినయూరు కాదని, సమీకృతసంకరసర్వసభ్యతా
ఘట్టము, సర్వసంస్కృతివికారనికారఘరట్టమైన యీ
కొట్టములోన తెచ్చి పడగూల్చితి, వెంత దయాపరుండవో !

పుట్టినకొట్టు కన్మొఱగిపోయి నిశీధమునందు, నేటి యా
గట్టున గొల్లపల్లె నొకకాపురమై తదనంతరంబు చే
పట్టిన పట్టణం బొకని బారికి నగ్గముగా, పయోధిలో
కట్టిన కొంపయే శరణుగా మనుదేవుడ వేమి సేయవున్ !

ఈయఘ మిట్లు పోవలయునేకద, నీవు విదిల్చివేయగా
నాయనువారు లేని గహనమ్మున మత్స్యమజీవనంపు టెం
కాయలతోటకున్ తెగులుక్రమ్మగ, మందులు చల్లిచల్లి నా
చేయిపడెం గదయ్య, యొకచిన్నమునెత్తు గుణంబు మృగ్యమై !

నానోటన్ విన నీకు ముచ్చటయటే, నాచేత బల్కించు వి
ట్లీ నిందాస్ఫురదార్తవాక్యములు తండ్రీ ! మత్స్యరాజన్మక
ర్మానీకమ్ములు నా యదృష్టమును పాలాడంగ నీ దేమి త
ప్పైనన్ నా మతి యింద్రియోపహతమై యల్లాడు మోహాంధమై !

కట్టిడి యింద్రియార్థముల కాఱియ లెంతని, ప్రక్కజేబులో
పెట్టిన డబ్బుసంచి మఱపించి నిమేషములోన నేర్పుమై
కొట్టెడు దొంగలట్లు, సమకూడిన యల్పవివేకపాకమున్
తట్టుకొనంగ జూచు సతతమ్మును వంచక సార్వభౌములై !

ఈచోరాగ్రణు లార్చి పేర్చెదరుపో, హేత్వంతరాభాసలీ
లాచాతుర్యతురీయవర్గహరణోల్లాసక్రియాదక్షులై
ఆచార్యుల్ పరిషత్తులం దెలుపు నయ్యర్థమ్ములన్ మాపి, నీ
దౌ చేయూతయె నాకు దిక్కు, నవనీతాహర్తృకాధ్యాపకా !

నిను గుర్తింపగబోయి తద్జ్ఞపరిషన్నిర్వాణశాస్త్రార్థశో
ధనలం బారముముట్టరాక తలక్రిందై కొట్టుమిట్టాడితిన్,
నను రక్షింపుము, నేటి కిట్లుపనిషణ్ణమ్మైన నాబుద్ధి, చి
ద్ఘనతత్వామృతపోషితప్రతతియై క్రాలంగ, మాతాకువై.

౬

కొండలమీదిమల్లయలు కోటయలు న్నిజభక్తకోటి పెన్
బండలు ప్రాకలే కలతపాల్పడ మోకులు దించి చేదుకోన్,
రెండును నైదు కొండలు ధరించిన దేవుడ వీవు నీదు పై
కొండకు వారివెంట్రుకలకున్ విడరానిముడిన్ ఘటింతువున్ !

ముడి సడలింపగా నయిన మూర్ధచలత్రిక్కయలందు వెంట్రుకల్
విడివడవున్, మహాచలము వీసమునేనియు సంచలించదున్,
తొడిబడి యెన్నడో యెటులనో భవదర్పిత సత్పథమ్ము వెం
బడిబడి నీదుకొండకయి వచ్చెదరా ముడి విప్పుకొంటకున్ !

నీ కల్యాణరమాగృహాంతరమునన్ నిల్చున్నపాళమ్ముగా
నా కేశమ్ముల నూడ్చుకొంటివి దొరా ! నాక్లేశముల్ తీరి, నా
నాకల్పమ్ముల నట్టగట్టిన మహైనఃపుంజముల్ బాసి, యే
చీకుంజింతయు లేక నాయెద సమాశ్లేషింప నీ పాదముల్ !

తలనీలా లిచ్చిన మ
తుక్కలసతితాళియును లాగుకొంటివివో ! మం
గళనవకళ్యాణసము
జ్జ్వలతన్మస్తకము నీలవసనావృతమై !

అప్పటమైన భక్తికరణాదృతి నీదగు నిత్యభోగముల్
కుప్పలు తెప్పలై స్మయముగొల్పెడు రన్న ! భవత్పదార్చకై
యప్పన మేమి తేగ నని యల్పుడ నిత్యదరిద్రుడన్ ప్రభూ !
తప్పులు సైచి నన్ను నొకదాసునిగా దయ నేలుకోగదే !

అప్పుల మున్గితేలెడు భయమ్మున పర్వతమెక్కి, పెండ్లికై
నప్పుల మున్గితేలెడు మహాపురుషా ! యొకవేడికోలు, మా
యప్పను తెచ్చిపెట్టుకొను మాయమ నీఋణబాధ పీగగా
నప్పుడె నీదు గర్భగృహ మన్నది సార్థకనామధేయమౌ !

అమ్మ చేసిన త ప్పేమి రయ్యా! మామ
సారెతోగూడ కరివేపసంబళమ్ము
పంపలేదని గాదె కోపమ్ము పొంగి
ఆయమను కొండ వీడి పొమ్మంటి వౌర!

కరివేపాకురుచుల్ వరించిన రసజ్ఞా! నిత్యనానావిరం
తరభూజాన్వితసుందరోపవనమీ ధాత్రీధర మ్మిందు నే
చటియందో మొలిపింప వచ్చుగద స్వేచ్ఛగా మొక్క నొక్కండు, తా
మరతంపమ్మయి మీ పరస్పరరుచుల్ మాయించి రాణింపగన్!

నను నొక్క మొక్కగా, నీ
ఘనపర్వతశిఖరభూమి కల్పింపగదే!
దినదినము మీదురసనా
వినూత్నరుచిపాకగతుల వే తరియింపన్!

# భగవద్విభూతి

మ్రాను మ్రానెల్ల కత్తులజీను, పైన
మట్టలన్నియు నీపెలతుట్టె, లచట
గుత్తిగొను నీతపండ్లను కోరి కోసి
కొనగ మానిసి కెంత సాధనము వలయు!

కొండచరు లన్ని బండల గుదులు, కాలు
మోపుటకు లేదు, చేపట్టు మొదలె లేదు,
కొండకొమ్మన నమృతమ్ము గురియు తేనె
పట్టు కొట్టుట కెంత నిబ్బరము వలయు!

ఘోరనానావిధప్రాణికులవిహార
రంగ, మతిభీకరోత్తుంగభంగజనిత
ఫేనవికటాట్టహాసజృంభిత, మగాధ
జలధి రత్నాపహృతి కెంత కడక వలయు!

భౌతికార్థమ్ములకు నిన్నిపాట్లు పడెడు
మానవా! లెమ్మ లౌకికమధుర, మమర
కాంతిపూరము, నీయంతరాంతరమున
వెలయు పరమార్థ మది నీవు తెలియవలదె?

ఇంద్రియార్థమ్ములగు నూహ లీడ్చికట్టి,
నిర్వికారచిత్తోన్మేషనియతి బట్టి,
అంతరారాముడవు గ, మ్మనంతగతుల
ప్రస్తరించు నీలో భగవద్విభూతి!

# నిర్వాణపరీక్ష

శ్రీ జి. వి. కృష్ణారావు

[ఆర్యనాగార్జునునినామము జగత్ప్రసిద్ధము. ప్రపంచతాత్త్వికులలో అతఁడద్వితీయుఁడు. అతని అద్వయవాదము నాఁటివిద్వల్లోకము నుఱ్ఱూఁతలూచి నేఁటినిష్పాక్షికవిమర్శకుల నీరాజనము లందుకొనుచున్నది.

అద్వయవాదప్రతిపాదక గ్రంథకోటిలో మూలమాధ్యమికకారికలు మకుటాయమానములు. ఈకారికలకు వ్యాఖ్యలు పెక్కులు వెలువడినవి. వీనిలో చంద్రకీర్తిప్రణీతమైన 'ప్రసన్నపద' ఒకటి.

ప్రకృతగ్రంథభాగము ప్రసన్నపదసహితమూలమాధ్యమికకారికలయందలి యిరువదియైదవ ప్రకరణమున కనువాదము. ]

"ఈసమస్తమ్ము శూన్యమై యేర్పనేని
తెలియఁబోదు ప్రభవ మైన విభవ మైన;
ఏప్రహాణమ్మునను జేసి, ఏ నిరోధ
మునను జేసి నిర్వాణమ్ము పొసఁగఁ గలదు?"

ప్రకృతమున, 'పవిత్రజీవనము గడపినవారు,[1] తథాగతశాసనప్రతిపన్నులు, ధర్మముల ధర్మము యథాశాస్త్రముగ నెఱింగినవారు[2] నగు జీవులు[3] ద్వివిధ మగు నిర్వాణము పొందుదురు,[4] అని బుద్ధభగవానులు బోధించియున్నారు. ఆ రెండుతెఱంగుల నిర్వాణమునందు మొదటిది సోపధిశేషము; రెండవది నిరుపధిశేషము.

అవిద్యారాగాదికమగు క్లేశసమూహము నిరవశేషముగా ప్రహాణము పొందుటవలన మొదటిది సోపధిశేషనిర్వాణమని చెప్పఁబడుచున్నది. ప్రాణప్రీతికి ఉనికియైనది ఉపధి. ఈ యుపధిశబ్దముచే పంచోపాదానస్కంధములు (సాస్రవధర్మములు) గ్రాహ్యములు. మిగులునది శేష మగును. ఉపధిమాత్రమే మిగులును కావున ఉపధిశేష మగును. ఉపధిశేషముతో నుండునది సోపధిశేషము.

ఆనిర్వాణ మెట్టిది? అది కేవలము స్కంధమాత్రకము (అనాస్రవధర్మము); ఆత్మనిత్యతాదృష్ట్యాది[5] క్లేశతస్కరరహితమై విహతాశేషచోరగణ మైన గ్రామమాత్రావస్థానమును పోలియుండును. అదియే సోపధిశేష మగు నిర్వాణము.

ఎందు స్కంధమాత్రకమునేని మిగులదో యది నిరుపధిశేషనిర్వాణ మనఁబడును. ఏలయన నిందు ఉపధిశేషము గూడ నంతరించును. నిహతాశేషచోరగణమై యాత్మ నాశము పొందిన గ్రామమునుపోలి ఈ నిర్వాణ ముండును. ఇదియే యిట్లు వర్ణ్యమాన మగుచున్నది.

1. ఉషితబ్రహ్మచర్యులు, 2. ధర్మానుధర్మప్రతిపత్తియుక్తులు, 3. పుద్గలులు, 4. ఆత్మస్నేహము,
5. సత్కాయదృష్టి.

"అస్తమించెను భౌతికం బైన తనువు
అంతరించె సంజ్ఞ, లదృశ్యమయ్యె సర్వ
వేదన లుడిగె సంస్కారవితతి, యారి
పోయె విజ్ఞానము (ప్రదీప్తిపుంజమట్లు).

కాయ మదియ సంలీనమై క్రాలుచుండ
ఆర్యుఁ డగువాఁడు వేదన ననుభవించు
నల్ల నిర్వాణమున విమోక్షమందుఁ గాదె
చేత[6] మస్తంగత మగు ప్రద్యోతమట్లు'

ఇట్లా నిరుపధిశేష మగు నిర్వాణము స్కంధనిరోధము వలన లభ్యమగుచున్నది.

మహాయానవాది: ద్వివిధ మగు ఈ నిర్వాణ మెట్లు పొసగుచున్నది.

హీనయానవాది: క్లేశస్కంధముల నిరోధమునఁగదా నిర్వాణములభించుట! ఈసర్వము శూన్యమైనప్పుడు ఏదియు పుట్టుటలేదు; ఏవియు గిట్టుట లేదు. అప్పుడు క్లేశములేని స్కంధము లేని యుండవు. క్లేశస్కంధముల నిరోధము లేక నిర్వాణము లభ్యము కాదు. కావున భావములకు స్వభావ మున్నదని

ప్రత్యుక్తి: నిజముగా మీరు చెప్పినట్లు భావములు సస్వభావము లని యంగీకరించినను

"ఈసమస్తమ్ము శూన్యమై యేర్పునేని
వెలయఁబోదు ప్రభవ మైన విభవ మైన;
ఏప్రహాణమ్మునను జేసి, యేనిరోధ
మునను జేసి నిర్వాణమ్ము పొసఁగఁ గలదు?'

క్లేశములు, స్కంధములు స్వభావముచే వ్యవస్థితము లగునేని, స్వభావమున కెన్నఁడు భంగము వాటిల్లదు కావున యవి యెట్లు నివృత్తిపొందును? వాని నివృత్తివలన నేకదా నిర్వాణప్రాప్తి. కావున స్వభావవాదులకు నిర్వాణమేమాత్రము ఉపపన్నము కాదు. ఇఁక శూన్యతావాదు లన్ననో నిర్వాణము క్లేశనివృత్తిలక్షణమని కాని, స్కంధనివృత్తి లక్షణ మనికాని చెప్పుటలేదు. కావున వారికి ఈపేర్కొన్నదోషము వాటిల్లుట లేదు. ఇట్లు శూన్యతావాదుల కిని యదోషమే యగుచున్నది.

నిర్వాణము క్లేశనివృత్తిలక్షణమని కాని, స్కంధనివృత్తి లక్షణ మనికాని శూన్యతావాదులు చెప్పలేకనున్నారు. సరే, వారు నిర్వాణమునకు చెప్పు లక్షణము లెవ్వి?

అట్లయిన వినుఁడు:

"అప్రహాణమై యప్రాప్తమై యనష్ట
మై యనిత్యమై యవిలీనమై యజాత
మైన దాని నిర్వాణ మటండ్రు మునులు
(సర్వధర్మస్వరూపవిజ్ఞానసిద్ధులు)

నిర్వాణము రాగాదికమువలె సంతకింపదు; శ్రామణ్యఫలమువలె పొందరాదు; స్కంధాదికమువలె ఉచ్ఛిత్తి పొందదు; అశూన్యమువలె నిత్యము కాదు. అది స్వభావముచే అనిరుద్ధము, అనుత్పన్నము, సర్వప్రపంచోపశమ లక్షణ మని చెప్పఁబడినది. నిర్వాణ మిట్లు నిష్ప్రపంచ మగుచుండఁగా క్లేశకల్పనముగాని, స్కంధకల్పనముగాని యెట్లు పొసఁగును? క్లేశస్కంధనిరోధమువలనఁ గదా నిర్వాణము లభించుట. ఈకల్పనలు ప్రవర్తిల్లుచుండఁగా నిర్వాణాధిగమము కలుగదు.

హీనయానవాది: అవును. నిర్వాణమందు క్లేశములు గాని, స్కంధములుగాని యుండవు. కాని నిర్వాణమునకు మున్నవి యున్నవి. ఆవెనుక నవి పరిక్షయముపొందఁగలవు. ఆపరిక్షయము వలన నిర్వాణము లభ్యమగును.

మహాయానవాది: ఈభ్రాంతినే[7] వదలుకోవలె. నిర్వాణమునకు మున్ను స్వభావముచే వర్తిల్లువానిని వెనుక నిఃస్వభావములను గావింప శక్యము గాదు. కావున నిర్వాణాభిలాషులీ కల్పనను త్యజింపవలెను.

ఆచార్యులే ముందు చెప్పుచున్నారు:

"ఏది నిర్వాణకోటియై యేర్పడుచుండు
నది యసంసారకోటియై యవతరించు
ఆద్వయమ్మునకు నడుమ నంతరమ్ము
చొప్పడఁగఁబోదు సూక్ష్మాతిసూక్ష్మమైన.

6. చేతము = విజ్ఞానస్కంధము.

7. గ్రాహము.

కావున నిర్వాణమునందు నేదియు ప్రహాణము పొందదు. ఏదియు నిరోధ ముందదు. కావున నిరవశేషకల్పనాక్షయ రూపమే నిర్వాణము.

భగవానుఁడు,

> ''ఏ నివృత్తిధర్మములు వర్తించుచుండఁ
> బోవు, ఒకప్పుడు లేని ధర్మములు కలుగఁ
> బోవు, కలదు లే దను తలపోఁతలందు
> మెదుగువారికి వంత శమింపఁ బోదు.''

అని వచించెను.

ఈగాథ కర్థమిది: నిరుపధిశేష నిర్వాణధాతువునందు క్లేశకర్మజన్మలక్షణమగు ధర్మము లేమి, స్కంధధర్మము లేమి యెల్లవిషయముల నసంగతములై ఉండుటవలన వర్తిల్లవు. ఇట్లగుట సర్వదార్శనికులకు సమ్మతము. నిర్వృతియందు వర్తిల్లని ధర్మము లొకప్పుడు నుండవు. చీకటియందు త్రాటిని జూచి యది సర్పమని భయపడుచున్నాము. ప్రదీపోదయమువలన నాభయము తొలఁగుచున్నది. యథార్థముగా సర్ప మెప్పుడు ఉన్నది కాదు. నిర్వృతియందలి ధర్మములు నిట్టివే. క్లేశకర్మజన్మాదిలక్షణములగు నాధర్మములు ఏకాలమునను, సంసారావస్థయందైనను వాస్తవముగా లేవు. చీకటియందును త్రాడు యథార్థసర్పము గాదు. ఏలయన నది యథార్థసర్పమట్లు చీకటియం దేమి వెలుఁగునం దేమి కాయచక్షువు రెంటిచే గ్రహింపఁబడుట లేదు

అట్లగుచో నది సంసారమని యెట్లు చెప్పఁబడుచున్న దందురేని వినుఁడు: ''తైమిరికులకు లేని కేశమశకాదులు కనఁబడునట్లే నేను నాది యను మోహముచే నుపహితులైన బాలపృథగ్జనులకు సత్స్వరూపములు కానివయ్యు అభావములు సత్స్వరూపములట్లు ప్రతిభాసించుచున్నవి. కావుననే,

> ''కలదు లే దను తలపోఁతలందు
> మెదుగువారికి వంత శమింపఁ బోదు.''

అయినను, 'ఉన్నది' అని జైమినీయకాణాదకాపిలాదుల నుండి నైభాషికులవఱకు భావసద్భావకల్పన సేయుచున్నారు. భవిష్యము లేదని అపయగతిప్రపాతు లగు నాస్తికులు గాలిమేడలు కట్టుచున్నారు. తదన్యులగు సౌత్రాంతికులు భూతభవిష్యములను[8], అవిజ్ఞప్తిని, రూపచిత్తవిప్రయుక్తసంస్కారములను[9] లేనివనుచు తక్కుంగలవి యున్నవని కల్పన గావించుచున్నారు. యోగాచారులు పరికల్పితస్వభావము లేదనుచు పరతంత్ర పరినిష్పన్నభావములు రెండుమాత్ర మున్నవని కల్పన సేయుచున్నారు. ఇట్లు కలదు లేదను తలపోఁతలందు మెదుగువారికి వంత-అనఁగా సంసారము – శమింపదు.

> ''గరళసంసేవనాతిశంకాహతుండు
> భగ్నచిత్తుఁడై మూర్ఛలో మునిఁగిపోవు
> అట్లె నేను నాది యనుమోహమునఁ దవిలి
> బాలిశుండు సంభవవిభవంబులందు.''

కావున నిర్వాణమునం దేదియు ప్రహాణమందుట లేదు; ఏదియు నిరోధముపొందుట లేదు. కావున సర్వకల్పనాక్షయరూపమే నిర్వాణము

ఇట్లే రత్నావళియు

> ''భావమేనియుఁ గాదు నిర్వాణధాతు
> వట్టిదానికి భావన యగుట యెట్లు?
> కలదు లే దను తలపోఁత తొలఁగియుంట
> మాత్ర నిర్వాణ మని సమామ్నాతమయ్యె''

అని చెప్పుచున్నది.

నిర్వాణము సర్వకల్పనోపశమరూప మని, ప్రతిపాదింపక, భావరూపమనియు, అభావరూపమనియు భావాభావరూప మనియు, భావాభావానుభయరూప మనియు బరికల్పించువారినిఁ బ్రత్యుత్తరించుచు నాచార్యపాదులు చెప్పుచున్నారు.

> ''భావ మగునన్న వేళ నిర్వాణమునకు
> వార్ధకమరణలక్షణప్రాప్తి యొదవు,
> వార్ధకమరణలక్షణప్రాప్తి లేని
> భావమన్నది యెందు లేబరము గాదె!''

8. అతీతానాగతములు, 9. విప్రయుక్తసంస్కారములు.

భావరూప మగు నిర్వాణమునం దభినివిష్టులగు కొందఱిట్లు వాదించుచున్నారు. "జలప్రవాహనిరోధనమునకు సేతు వావశ్యకము. సేతువు నునికి లేక జలప్రవాహము నిలువదు. క్లేశ కర్మ జన్మ సంతాన మొకప్రవాహము. ఈప్రవాహనిరోధనమునకు సేతుసదృశమైన యొకానొక పదార్థము ఉండవలయును. ఆ సేతుసదృశమై యునికి గలిగినదియే నిర్వాణము. నిజముగా నిర్వాణము భావము గానిచో క్లేశాదిసంతానప్రవృత్తినిరోధము కలుగఁజాలదు. ఏలయన స్వభావముచే లేనిధర్మ మేదియు కార్యకారి కాకపోవుట మన కనుభవసిద్ధము.

సౌత్రాంతికుఁడు: "జీవితానం దానుషంగిక[10] తృష్ణ యొక్క క్షయము, విరాగము, నిరోధము నిర్వాణ మని వ్యాహృతము. కావున కేవలక్షయము భావము కాఁజాలదు.

"అల్ల నిర్వాణమున విమోక్షమందుఁ గాదె
చేత మస్తంగత మగు ప్రద్యోతమట్లు

అని చెప్పఁబడినది. ప్రద్యోతముయొక్క నివృత్తి భావముగా నుపపన్నము కాఁజాలదు.

వైభాసికుఁడు: "మీరు తృష్ణాక్షయ మను పదమునకు తృష్ణయొక్క క్షయమని విగ్రహ వాక్యము కల్పించి యర్థము చెప్పుచున్నారు. అర్థము చెప్పుకొనవలసినది యట్లు కాదు. తృష్ణయొక్క క్షయ మెందో యది తృష్ణాక్షయము. నిర్వాణ మనఁబడు ధర్మ మున్నదగుచుండఁగా తృష్ణాక్షయ మగుచున్న దని చెప్పికొనవలయును. ప్రద్యోత మిట దృష్టాంతమాత్రము. ఈదృష్టాంతమందును ఒకానొకటి యున్నప్పుడే చేతమునకు విమోక్ష మగుచున్నదని యెఱుఁగవలయును.

నిర్వాణ మిట్లు భావరూప మని వ్యవస్థాపించువాదము నిప్పు డాచార్యులు పరీక్షించుచున్నారు. నిర్వాణము భావమాత్రము కాఁజాలదు. కారణ మేమి? భావమే యగుచో దానికి జరామరణలక్షణములు సంక్రమింపవలసి వచ్చును. ఏలయన భావమునకు జరామరణములు అవ్యభిచారిలక్షణములు. భావమగుచో నిర్వాణము జరామరణములు పొందవలయును. అద్దానివలన విజ్ఞానాదికమట్లు నిర్వాణమును నశింపవలసియుండు -నని యభిప్రాయము.

ఆజరామరణలక్షణముల యవ్యభిచారితనే ఆచార్యులు స్పష్టపఱుచుచు చెప్పుచున్నారు:

"వార్ధకమరణలక్షణప్రాప్తి లేని
భావ మన్నది యెందు లేబరముగాదె!"

జరామరణరహితమైనది భావమే కాఁజాలదు. ఇందులకు హేతువు జరామరణరాహిత్యము. దృష్టాంతము గగనకుసుమము. (ఆకాశకుసుమము వాడదు. నశింపదు. కావున నది భావము గాదు.)

మఱియు—

"భావ మగు నన్న వేళ నిర్వాణధాతు
వప్పు డయ్యది సంస్కృతం బగును విధిగ
తనరఁబోదుగదా సంస్కృతమ్మగాని
భావ మొకఁడైన గాని యెప్పట్టునందు

నిర్వాణము భావ మగునేని యది సంస్కృతము (హేతుప్రత్యయసంజాతము) గావలయును. భావత్వమే దీనికి హేతువు. విజ్ఞానాదులు దృష్టాంతము. (విజ్ఞానాదికము భావ మగుటచే సంస్కృత మగుచున్నది. అట్లే నిర్వాణము భావమగునేని సంస్కృతము గావలయును. అనఁగా హేతుప్రత్యయసంజాతము కావలెను. కాని నిర్వాణము హేతుప్రత్యయసంజాత మగుట యిష్టముగాదు). దీనికి వ్యతిరేక వాక్య మిట్లగుచున్నది: నిర్వాణము అసంస్కృతము. ఇందులకు హేతువు అభావత్వము. దృష్టాంతము ఖరవిషాణాదికము. ఈవ్యతిరేక హేతువునే ప్రదర్శించుచు చెప్పుచున్నారు.

తనరఁబోదు గదా సంస్కృతమ్ముఁగాని
భావఁ మొకఁ డైనగాని యెప్పట్టునందు.

ఎప్పట్టునందు అనఁగా ఏయధికరణమునందుఁగాని, దేశమునందుఁగాని, సిద్ధాంతమందుఁగాని యని యర్థము. భావ మొండైనఁగాని యన ఆధ్యాత్మికభావ మొండె, బాహ్యాత్మికభావ మొండె నని యర్థము.

10 నందీరాగసహగత

మఱియు:

భావ మగు నన్న వేళ నిర్వాణధాతు
వప్పు డది యనుపాదాన మగుట యెట్లు?
తత్త్వదృష్టి కెందున నుపాదాన మగుచు
తనరుచుండెడి భావమ్ము గనఁగరాదు

మీమతమున నిర్వాణము భావ మగునేని అది యుపాదానముకలది కాలయును. అనఁగాసర్వకారణసామగ్రిని పొంది భావము గావలయును. కాని నిర్వాణమునకు కారణ సామగ్రియున్నదనుట యిష్టము కాదు. కావున కారణ సామగ్రి లేకయే నిర్వాణము కలుగవలయును. నిర్వాణము భావమైనప్పుడు స్వకారణసామగ్రిలేక కలుగఁజాలదు. ఏలయన నిర్వాణము విజ్ఞానాదికమట్లు భావ మగుచున్నది. ఆచార్యుఁడు "తత్త్వదృష్టి కెందున నుపాదానమగుచు తనరుచుండెడి భావమ్ము కనఁగరాదు," అని వ్యతిరేక కారణమును ప్రదర్శించుచున్నాఁడు. సౌత్రాంతికుని సూచన పైనిపేర్కొన్న దోషమునుబట్టి నిర్వాణము భావము కాఁజాలదు. క్లేశజన్మనివృత్తిమాత్ర మగుటవలన నది కేవల మభావమే యగును.

సిద్ధాంతి:—

ఇదియు యుక్తము గాదు ఏల యనఁ?

భావ మేని కాకున్న నిర్వాణధాతు
వయ్యది యభావ మేనియు నగుట యెట్లు?
భావ మన్నది యెచ్చోటఁ బరఁగకుండు
నరఁగఁబోవ దచ్చోట నభావ మేని.

నిర్వాణము భావముగానప్పు డభావ మగునా? అభావముగూడఁ గాఁజాలదని యాచార్యుల యభిప్రాయము. క్లేశజన్మముల రెంటి యభావమే నిర్వాణ మగునేని, ఆ రెంటియనిత్యత నిర్వాణము గావలయును. ఏలయన క్లేశ జన్మముల రెంటి యనిత్యతకంటె అభావము అన్యముకాదు. ఆ యభావమే నిర్వాణ మగును. అప్పుడు నిర్వాణ మనిత్య మగును. నిర్వాణ మనిత్య మనుట సమ్మతము గాదు. ఏల యన అపక్షమున యత్నములేకయే మోక్షము సిద్ధింపవలసి వచ్చును. కావున నిర్వాణము అభావము కాఁజాలదు.

మఱియు:—

కేవలమ్ము నిర్వాణ మభావ మైన
నప్పు డదియనుపాదాన మగుట యెట్లు?
తత్త్వదృష్టి కెందు ననుపాదాన మగుచు
తనరుచుండు నభావమ్ము కనఁగరాదు.

అభావమేని యనిత్యతయేని భావము నాశ్రయించి ప్రజ్ఞాయమాన మగుచున్నది. అభావము ఖరవిషాణము వంటిది. ఇది యనిత్యమని యనుభవగోచరమగుట లేదు. లక్షణము నాశ్రయించి లక్ష్యము, లక్ష్యము నాశ్రయించి లక్షణము ఊహింపబడుచున్నది. ఇట్లు పరస్పరాపేక్షతో లక్ష్య లక్షణప్రవృత్తి యగుచుండఁగా భావమగు లక్ష్యము నపేక్షింపక అనిత్యత ఎట్లు కలుగఁగలదు? కావున అభావము గూడ ఉపాదానము నపేక్షించి యూహింపఁబడుచున్నది. అట్లగుటఁజేసి నిర్వాణ మభావమగునేని, యది యుపాదాన మపేక్షింపక యెట్లు సిద్ధించును?

ఈ యర్థము నీ వాక్యమునఁ జెప్పవచ్చును.)

ప్రతిజ్ఞ: ఉపాదాన మపేక్షించియే నిర్వాణము కలుగు చున్నది.

హేతువు: అభావ మగుటవలన.

దృష్టాంతము: (ఘటాది) వినాశమువలె.

దీనినే "తత్త్వదృష్టి కెందు ననుపాదానమగుచు తనరు చుండు నభావమ్ము కనఁగరాదు," అని స్పష్టము సేయుచు న్నాఁడు. కాగా ఉపాదాన మపేక్షింపని యభావము కలుగుట లేదు.

1. ప్రజ్ఞప్యతే.

ఉపాదాన మపేక్షింపక అభావము కలుగనిచో వంధ్యా పుత్రాదులు ఉపాదానము పొంది యభావములు కావల యును.

ఇంతకు వంధ్యాపుత్రాదులు అభావము లని యెవరు చెప్పిరి? పూర్వమే చెప్పితిమికదా!

"భావమునకు సిద్ధి ప్రాప్తింపదేని య
భావమునకు సిద్ధి పరఁగఁబోదు

ప్రజలభావ మనుచు భాషించునట్టిది
వైపరీత్య మగును భావమునకు"

అట్లగుటచే వంధ్యాపుత్రాదిక మభావము గాదు.

"గొడ్డురాలిబిడ్డ కుందేటికొమ్ములు
గగనసుమము లెపుడు కలుగవనుచు
ప్రజలు పలుకుచుంద్రు భావకల్పనములు
కూడ వాని కీడుజోడు లగును"

ఇట్లు చెప్పినప్పుడుగూడ భావకల్పనము మాత్రమే నిరాకరింపఁబడుచున్నది కాని అభావకల్పనము ప్రతిపాదింపఁబడుటలేదు. ఏలయన అభావమునకు సిద్ధిలేదు. వంధ్యాపుత్రుఁ డనునది కేవలము శబ్దము మాత్రమే కాని అద్దాని యర్థము అనుభవగోచరము గాదు. ఆయర్థము భావము కాదు, అభావమును గాదు. అనుపలభ్యమానస్వభావమునకు భావాభావకల్పన యెట్లు పొసగును? కావున వంధ్యాపుత్రుఁడు అభావము కాదని యెఱుఁగవలయును. ఈవిధముగా నుపాదాన మపేక్షింపక విద్యమాన మగు అభావము కలుగదని స్థిత మగుచున్నది.

శంక:- నిర్వాణము భావము కాదు; అభావమునుగాదు. మఱేమగును ?

ఇదిగో సమాధానము:—

ప్రత్యయావాప్తి నొందెడి నుద్భవత నొందె
ఆజవంజవీభావమై యలరు నేది
యది యవిగళితప్రత్యయావాప్తి నొందె
నభవతను నొందె నిర్వాణమంద్రు మునులు.

ఆజవంజవీభావ మనఁగా అగమన గమనరూప మగు జన్మమరణపరంపర యని యర్థము. దీర్ఘమునుబట్టి హ్రస్వము ప్రజ్ఞప్యమాన మగుచున్నట్లు ఆజవంజవీభావము ఒకప్పుడు హేతుప్రత్యయముల నాశ్రయించి ప్రజ్ఞప్యమాన మగుచున్నది. ఇట్లు ఉపాదాన మపేక్షించి కాని హేతుప్రత్యయము లపేక్షించికాని జన్మమరణపరంపరాప్రబంధము వ్యవస్థాపిత మగునేని ఉపాదానమునుగాని హేతుప్రత్యయములనుగాని యపేక్షింపని యప్రవృత్తి నిర్వాణమని వ్యవస్థాపిత మగుచున్నది. అంతియ కాని కేవలాప్రవృత్తిని భావమని కాని, యభావమని కాని పరికల్పింప శక్యము గాదు.

ఈకారికకు మఱియొకరీతిగా నర్థము చెప్పవచ్చును. ఈ పక్షమున నిర్వాణము హీనయానవాదులు చెప్పుకొన్నట్టిదియే యగును. కాని యిచ్చట నొకవిశేష మున్నది. వారు నిర్వాణము భావమని వాదింతురు. కొందఱు (సర్వాస్తివాదులు) సంస్కారప్రవాహమే సంసార మనుచున్నారు. ఈ జగత్తున క్షణికము లగు ఉత్పాదవినాశములు హేతుప్రత్యయములను మాటిమాటికి పొంది కలుగుచున్నవి. ఈ హేతుప్రత్యయములను మాటిమాటికిపొందుట యుడిగి యప్రవర్తమానమగునదే నిర్వాణమని వారు చెప్పుచున్నారు.

మఱికొందఱు (వాత్సీపుత్రీయులు) ఇట్లు చెప్పుదురు. పుద్గలాత్మ యున్నది. అది జననమరణములఁ బాల్పడుచు నవాచ్య మగుచున్నది. అది క్షణికము గాదు; నిత్యమును గాదు. ఆ యా యుపాదానము నాశ్రయించి ఆపుద్గలాత్మకు ఆజవంజవీభావము కలుగుచున్నది. అది యట్లు ఒక యుపాదానము వెనుక మఱియొక యుపాదాన మాశ్రయించి ప్రవర్తిల్లుచు కాలమువచ్చినప్పుడు ఉపాదాన మాశ్రయింపక అప్రవర్తమాన మగుచు నిర్వాణము పొందుచున్నది.

ఎవ్వ రెట్లు చెప్పినను సంస్కారముల కేవలాప్రవృత్తిని కాని, పుద్గలాత్మయొక్క కేవలాప్రవృత్తినికాని భావమని యేని అభావ మనియేని పరికల్పింప శక్యము కాదు.

కావున నిర్వాణము భావము గాదు, అభావమును గాదనుట యుక్తము

మఱియు :

"భవము విభవమ్ముగూడ వివర్జ్య మనుచు
వ్యాహరించినారలు శాస్త లైనమునులు
కాన నిర్వాణ మది భావమేని మఱి య
భావమేని కాకుంట సంభావ్య మగును."

"భిక్షువులారా! భవమును భవాంతరముచేగాని విభవముచేఁ గాని తరింపఁ గోరువారు పరిజ్ఞానవంతులు గారు"

అని యాగమము చెప్పుచున్నది. భవతృష్ణ, విభవతృష్ణ— ఈ రెండును పరిత్యాజ్యములు. అంతియ కాని నిర్వాణము ప్రహాతవ్యమని భగవానులు వచింపలేదు. కావున నది యప్రహాతవ్యమే యగుచున్నది. నిర్వాణము భావరూపమో యభావరూపమో యగునేని యప్పు డది ప్రహాతవ్య మగును. కాని నిర్వాణము ప్రహాతవ్యము గాదు.

"కాన నిర్వాణ మది భావమేని మఱి య
భావమేని కాకుంట సంభావ్య మగును."

కొందఱు (వైభాసికులు) నిర్వాణమునందు క్లేశజన్మములు రెండు నుండవుగావున నది అభావరూప మగుచు, తనకుఁ దాను భావరూపము కలదగుటవలన భావరూపము గూడ నగు ననుచున్నారు. ఇట్లు నిర్వాణ ముభయరూప మగుట యసంభవమని ప్రతిపాదించుచు వచించుచున్నాడు.

"భావతదభావ యుగళస్వభావ మగుచు
పరమనిర్వాణధాతువు పరగు నేని,
భావతదభావయుగళస్వభావ మగుచు
తనరు మోక్షమట్లగుట యుక్తమ్ము గాదు."

నిర్వాణము భావాభావముల యుభయరూప మగునేని మోక్షముగూడ భావము నభావము గావలయును. ఈపక్షమున సంస్కారములయునికియు నశించుటయు కలసియే మోక్షము కావలయును. కాని సంస్కారములయునికియే మోక్షమగుట భావ్యము కాదు. కావుననే యాచార్యు లది యయుక్త మనుచున్నారు.

మఱియు:—

భావతదభావయుగళస్వభావ మగుచు
పరమనిర్వాణధాతువు పరఁగునేని
యది యుపాదాననిరపేక్ష మగుట లేదు;
అయ్యుభయ

నిర్వాణము భావాభావరూప మగునేని యప్పు డది హేతుప్రత్యయసామగ్రి నాశ్రయించి కలుగవలయునే కాని వాని నాశ్రయింపక కలుగరాదు. కారణ మేమి? «అ య్యుభయ ముపాదానసమాశ్రయమ్ము» భావము నపేక్షించి (ఉపాదానమునుపొంది) యభావము, నభావము నపేక్షించి భావము కలుగుచున్నవి. ఇట్లు భావాభావములు రెండును ఉపాదానమును పొందియే కలుగుచున్నవి. కాని పొందక కలుగుట లేదు. ఇట్లే భావాభావరూప మగు నిర్వాణము నగును. కాని యిది యిట్లగుట యుక్తము కాదు.

మఱియు:—

భావతదభావయుగళస్వభావ మన్న
పరగు నెట్లు నిర్వాణ మ్ముభయము నగుచు
శస్యమైన నిర్వాణ మ్మసంస్కృతమ్ము
భావతదభావములు సంస్కృతావిలములు.

స్వహేతుప్రత్యయసామగ్రీసంభూతత్వమువలన భావము సంస్కృతము. భావము నపేక్షించి పుట్టినదగుటవలనను, ఆగమమునందలి జాతిప్రత్యయజరామరణవచనమువలనను అభావముగూడ సంస్కృతము. నిర్వాణము భావాభావ స్వభావమగుచో, నది యసంస్కృతము. కాక సంస్కృత ధర్మమే యగుచున్నది. కాని నిర్వాణము సంస్కృతధర్మ మగుట యిష్టము కాదు. కావున నది భావాభావస్వరూప మగుట యుక్తము కాదు.

నిర్వాణము భావాభావరూపము కాదు కాని యనిర్వాణమందు భావము నభావము నుండవచ్చునని యన్నచో నదియు యుక్తము గాదు. ఏలయన:—

"భావతదభావయుగళస్వభావ మన్న
పరఁగు నెట్లు? నిర్వాణమ్ము నుభయము నగుచు
రెండు నవి యొక్కచో ప్రవర్తిల్లఁ బోవు
వెలుఁగుచీకటు లొక్కచో నిలువనట్లు"

పరస్పరవిరుద్ధము లగు భావాభావములు ఒక్కచోటను నిర్వాణమున నుండుట సంభవము గాదు.

కావుననే

'భావతదభావయుగళస్వభావ మన్న
పరఁగు నెట్లు నిర్వాణ మ్ముభయము నగుచు?'

పరఁగనే పరఁగదని యభిప్రాయము.

ఇప్పుడు నిర్వాణము భావాభావానుభయరూపము కాదని ప్రతిపాదించుచు ఆచార్యులు చెప్పుచున్నారు :

"పరమనిర్వాణధాతు వభావమేని
కాదు భావమ్ముఁ గాదను కల్పనమ్ము
పడయుచుండుఁ బ్రసిద్ధి యభావభావ
యుగ్మకం బాత్మసంసిద్ధి నొందునపుడు"

భావ మనునది యొకటి సిద్ధించునేని, అప్పుడాభావప్రతిషేధముచే నిర్వాణము భావమే కాదను కల్పన సిద్ధించును. అభావ మనునది యొకటి సిద్ధించునేని, అప్పుడాయభావ ప్రతిషేధముచే నిర్వాణము అభావమే కాదను కల్పనము సిద్ధించును. భావాభావములు రెండును లేనప్పుడు, సిద్ధింపనప్పుడు వానిప్రతిషేధముగూడ లేదు. కావున «నిర్వాణము భావము కానేకాదు, అభావము కానే కాదు» అనుకల్పనకు ఉపపత్తియే కలుగుట లేదు. ఇట్టికల్పన అయుక్తమగుచున్నది.

మఱియు :

"భావ తదభావముల కన్యభావ మగుచు
పరమ నిర్వాణ ధాతువు పరఁగు నేని,
భావతదభావముల కన్యభావ మైన
దానిఁ దెలియంగ నెవ్వాఁడు దక్షుఁడగును?"

నిర్వాణము అభావరూపము గాదు, భావరూపమును కాదని కల్పింపఁబడుచో, అనుభయరూపముగా దాని నెవ్వడు గ్రహించుచున్నాఁడు? ఎవఁడు ప్రకాశ్యమానము గావించుచున్నాడు.

అట్టివా డక్కడ లేడన్న నిర్వాణమున నుండవచ్చునందురా? లేక అదియు నసంభవ మందురా? అట్టి ప్రతిపత్తి యొకఁ డున్నాడని యందురేని తావన్మాత్ర మగు నిర్వాణమున మీయాత్మ యుండవలయును. కానినిరుపాదాన మగు నాత్మిక స్తిత్వము లేదని మీరును అంగీకరింతురు. కావున అట్టి అస్తిత్వము ఇష్టము గాదు.

అట్లుగాక తాదృశుఁడగు ప్రతిపత్తి లేడందురా? అగుచో ఇత్థంవిధ మగు నిర్వాణ మున్నదని యెవఁడు పరిచ్ఛేదము సేయుచున్నాఁడు? సంసారావస్థితుఁడు తత్పరిచ్ఛేదము గావించు చున్నాఁడని యందురేని యతఁడు (సంసారావస్థితుఁడు) ఆ పరిచ్ఛేదము విజ్ఞానముచేఁ జేయుచున్నాఁడా, లేక జ్ఞానముచేఁ జేయుచున్నాఁడా? విజ్ఞానముచే నతఁడు తత్పరిచ్ఛేద మొనరించుచున్నా డనుట యుక్తము గాదు. కారణ మేమి? విజ్ఞానము నిమిత్తాలంబనము పొంది ప్రవర్తిల్లును. (వ్యావహారికజ్ఞానము వివిక్తములగు పదార్థముల యాలంబనమును పొంది కలుగును). నిర్వాణమం దట్టి నిమిత్తము (వివిక్త పదార్థము) కలుగదు. కావున నది విజ్ఞానము (వ్యావహారిక జ్ఞానముచే) గ్రహింపఁబడుట లేదు.

తాదృశమగు నిర్వాణము జ్ఞానముచే ననుగ్రహింపఁబడుట లేదు. కారణ మేమి? జ్ఞానమునకు శూన్యతయే ఆలంబనము. కావున అది యనుత్పాదరూపము. ఇట్టు అవిద్యమానస్వరూపము ప్రపంచాతీత స్వభావము నగు జ్ఞానముచే నిర్వాణము భావాభావముల యనుభయరూపమని ఎట్లు గ్రహింపఁబడును.

కావున నిర్వాణము «అభావము గాదు, భావమును గాదు,» అని యెవనిచేతను గ్రహింపఁబడుట లేదు; ప్రకాశింపఁజేయఁబడుటయు లేదు.

కావున అనజ్యమానము అప్రకాశ్యమానము, అగృహ్యమాణము నగు నానిర్వాణ మట్టే యున్నదనుట యుక్తము గాదు.

ఎల్లవిధముల నిర్వాణమునందు ఈచతుర్విధకల్పనము (1 భావము 2. అభావము 3. భావాభావము 4. భావాభావానుభయము అనుట) సంభవము కాదు. అట్లే నిర్వాణాధిగంత యగు తథాగతునియం దీకల్పనలు ఏమాత్రము పొసఁగవని ప్రతిపాదించుచు ఆచార్యులు చెప్పుచున్నారు.

'బుద్ధదేవుండు నిర్వాణమునకు వెన్క
పరఁగునో మఱిపరగఁడో పరఁగి పరఁగ
కుండునో పరఁగి పరఁగకుంట లేదో
ఎట్టి ధీశాలికైన నూహింప రాదు'

పూర్వమే చెప్పితిమికదా !

'ఘనతరాభినివేశసంగ్రస్తుఁ డగుచు
పూజనీయుండు బుద్ధదేవుండు కలుగు

విలయమునకంటె మున్నని తలఁచువాఁడు
లయమునకు వెన్క తద్వికల్పనము సేయు.'

ఇట్లు నిరోధమునకు వెన్క తథాగతులు కలుగుదురని కాని కలుగరని కాని యూహింపరాకున్నది. ఈయుభయమును లేనిదగుటచే యుభయరూపమని యెఱుఁగ వీలుకాదు. ఈ యుభయమును లేనిదగుటచే ననుభయరూప మనియు గ్రహింప నయితి గాదు.

ఇట్లు తథాగతులు చతుర్విధప్రకారములచే నిరోధమునకు వెనుకమాత్రమే యనూహ్యమాను లగుట లేదు. తిష్ఠమానులుకూడ అగృహ్యమాణు లగుచున్నారని ఆచార్యపాదులు చెప్పుచున్నారు.

'తిష్ఠమానుఁ డైనను బుద్ధదేవుఁ డరయ
పరఁగునో మఱి పరఁగఁడో పరఁగి పరఁగ
కుండునో పరఁగి పరఁగకుంట లేదో
ఎట్టి ధీశాలికైన నూహింప రాదు'

తథాగతులయునికి ఎట్లు అగ్రాహ్యము, నప్రకాశ్యము, ననూహ్యము నగుచున్నదో తథాగతపరీక్షయందు వివరింపఁబడినది. కావుననే

'స్వల్ప మగు భేదమేని సంసారమునకు
నల్ల నిర్వాణమునకు వర్తిల్లఁబోదు
స్వల్ప మగు భేదమేని నిర్వాణమునకు
నల సంసారమునకు వర్తిల్లఁబోదు'.

తిష్ఠమానులగు భగవత్పాదులు అస్తిత్వాదికముచే నెఱుఁగరానివారగుచున్నారు; ఊహింపరానివారగుచున్నారు. నిర్వృతులగు భగవత్పాదులును అస్తిత్వాదికముచే నూహింపరాకున్నారు. సంసారముగూడ అస్తిత్వాదిచే నూహింపరానిది. కావుననే సంసారనిర్వాణములకు పరస్పరము నెట్టివిశేషము లేదు. విచార్యమాణములగు నీ రెండును తుల్యరూపములు. భగవానులును చెప్పియున్నారు: «భిక్షువులారా! జాతిజరామరణరూప మగు సంసారము అనవరాగ్రము». ఈ వచనము సంసారనిర్వాణములకు విశేషము లేమివలన నుపపన్న మగుచున్నది.

అశ్లే—

'ఏది నిర్వాణకోటియై యేర్చుచుండు
నదియ సంసారకోటియై యవతరించు
ఆ ద్వయమ్మునకు నడుమ నంతరమ్ము
చొప్పడఁగఁబోదు సూక్ష్మాతిసూక్ష్మమైన'

నిర్వాణముచే నవిశిష్టమగుటవలన సంసారమునకు ఆద్యంతముల కల్పనము అసంభవము. ఈ కల్పన యొకటిమాత్రమే కాదు.

అల తథాగతుల నిరోధ మాశ్రయించి
సంసరణపు టాద్యంతముల్ సంశ్రయించి
యనుపపద్యమ్ము లైన యంతాదికములు
శాశ్వతాదికములు దృష్టిచయము లేర్చు"

సంసారనిర్వాణములు రెండును ప్రకృతిశాంతములు. ఏకరసములు కావున ఆకల్పనలు ఉపపద్యమానములగుట లేదు. «అల తథాగతుల నిరోధ మాశ్రయించి" అను నుపలక్షణముచే నాలుగు దృష్టులు గ్రహింపఁబడుచున్నవి. ఆదృష్టులు : 1 మరణమునకు వెనుక తథాగతుఁ డుండును. 2. మరణమునకు వెనుక తథాగతుఁ డుండఁడు. 3. మరణమునకు వెనుక తథాగతుఁ డుండును ఉండడును. 4. మరణమునకు వెనుక తథాగతుఁడు ఉండనే యుండడు; యుండకపోవుట యుండదు. ఈదృష్టిచతుష్టయము నిర్వాణపరామర్శముచేఁ బ్రవృత్తి మగుచున్నది.

అంతాదులును దృష్టులే. అవి 1) లోకమునకు అంత మున్నది. 2) అంతము లేదు. 3) అంత మున్నది లేదును. 4) అంతము లేనేలేదు; లేకపోవుటయు లేదు. ఈదృష్టిచతుష్టయము అపరాంతము నాశ్రయించి ప్రవృత్త మగుచున్నది. ఆత్మభవిష్యముగాని, లోకభవిష్యముగాని యెఱుఁగఁజాలక లోకమునకంత మున్నదని కల్పించుచు, మానవుఁడు అపరాంతము నాశ్రయించి ప్రవర్తించుచున్నాఁడు. ఇట్లే భవిష్యము నూహించుచు లోకమునకంతము లేదని ప్రవర్తించుచున్నాఁడు. భవిష్యమునుగూర్చి యూహాపోహము సేయుచు లోకమునకు అంతానంతత్వ

మును ప్రతిపాదించుచున్నాఁడు. ఈయుభయప్రతిషేధముచే "అంతము లేనేలేదు, లేకపోవుటయు లే" దని ప్రతిపాదించుచున్నాఁడు.

ఇట్లే లోకపూర్వాంతమును సమాశ్రయించి చతుర్విధ దృష్టులు ప్రవర్తిల్లుచున్నవి. అవి 1. లోకము శాశ్వతము 2. అశాశ్వతము 3. శాశ్వతాశాశ్వతము. 4. శాశ్వతము కానే కాదు. శాశ్వతము కాకపోవుటయు లేదు. ఆత్మయొక్క అతీతమగు నుత్పాదమునుగాని లోకముయొక్క అతీతోత్పాదమునుగాని యూహించుటచే లోకము శాశ్వతము అను ప్రతిపత్తి యగుచున్నది. అతీతోత్పాదము నూహింపకుండుటచే లోకము శాశ్వత మను ప్రతిపత్తి యగుచున్నది. ఆయుత్పాదమును కాంచీకాంచక యుండుటచే లోకము శాశ్వతము అశాశ్వతమును నను ప్రతిపత్తి యగుచున్నది. తద్ధర్మనానుభయత్వమువలన లోకము శాశ్వతము కానేకాదు. శాశ్వతము కాకపోవుటయు లేదు" అను ప్రతిపత్తి యగుచున్నది.

ఈ దృష్టు లెట్లు పొసఁగును? ఏపదార్థమునకేని యొకానొక స్వభావ మున్నయెడల, తద్భావాభావ కల్పనవలన ఈదృష్టులు కలుగఁగలవు కాని సంసారనిర్వాణములకు విశేషము లేదని ప్రతిపాదిత మైనది.

అప్పుడు:—

"అఖిలధర్మముల్ శూన్యమ్ము లగుచునుండ
అంతవంత మేది యనంత మగున దేమి?
అంతవ దనంతములు యుగ్మమగున దేమి?
తదనుభయరూప మగుచును దనరు నేది?
తానె యైన దేది కానిది మఱి యేది
నిత్య మేది మఱి యనిత్య మేది
అద్వయమ్ముల రూపమైన దేది మఱి త
దనుభయమ్ము రూపమైన దేది ?

భావమునకు స్వభావము లేనప్పుడు అవ్యాకృతములగు నీచతుర్దశవస్తువులు పొసఁగవు. భావస్వరూప మధ్యారోపించి, తద్విగమావిగమములవలన నీదృష్టుల నుత్పాదించి యభినివిష్టుఁ డగువాడు నిర్వాణపురగామి యగు మార్గమును జేరనీక యతని నా యభినివేశము నిరోధించుచున్నది; సాంసారిక దుఃఖములందు బంధించు చున్నదని యెఱుంగవలయును.

ప్రతిపక్షి: ఇట్లే యగుచో నిర్వాణముకూడ భగవానునిచే నిరాకృత మగుచున్నది. అతఁడు అనంతచరితసత్త్వరాగ్యానువర్తకుఁడు సకలజగదాశయస్వభావమును యథాభూతముగా నెఱింగినఁవాడు. మహాకరుణాపరతంత్రుఁడు ప్రియైకపుత్రప్రేమమానుగతశేష త్రిభువనజనుఁడు. అతనిచే లోకమునకు నిర్వాణాధిగమార్గము నిజముగా బోధింపఁబడిన చరితప్రతిపత్త్యానురూపధర్మ మగు ధర్మము నిర్వాణమును ప్రతిషేధించుచు వ్యర్థమే యగుచున్నది.

సమాధానము: సస్వభావ మగు నొకానొక ధర్మము కాని అధర్మము విను శ్రోతలుకాని ఉపదేష్టయగు బుద్ధభగవానుఁడు భావసభావుండు కలుగునేని మీరు చెప్పినట్లే యగును కాని—

"సర్వోపలంభశమము ప్రపంచోప
శమము శివము (తత్త్వసార మిదియ)
బుద్ధదేవు లెపుడు బోధింప లేదు సు
మ్మెట్టి ధర్మమైన నెవనికైన."

ఇప్పుడు మీ చెప్పినదోషము మాకెట్లు వాటిల్లును. సర్వనిమిత్తప్రపంచోపశమమే నిర్వాణమని యిచ్చట సిద్ధాంతము. ప్రకృతిచే నుపశాంతమగుటవలన నాయుపశమమే శివము. వాచాప్రవృత్తివలన గాని, చిత్తముయొక్క ప్రవృత్తివలనగాని ప్రపంచోపశమ మగుచున్నది. ఇదియు శివము క్లేశముల యప్రవృత్తిచేఁ గాని జన్మమునకప్రవృత్తిచేఁ గాని ప్రపంచోపమగుచున్నది. ఇదియు శివము. క్లేశప్రహాణముచేఁగాని నిరవశేషవాసనాప్రహాణముచేఁ గాని ప్రపంచోప మగుచున్నది. ఇదియు శివము. జ్ఞేయానుపలబ్ధిచేఁగాని, జ్ఞానానుపలబ్ధిచేఁ గాని ప్రపంచోపశమ మగుచున్నది. ఇదియు శివము.

బుద్ధభగవానులు సర్వప్రపంచోపశాంతరూపము శివము నగు నిర్వాణమునందుఁ బ్రవేశించినప్పుడు ఆకాశమునందు హంసరాజములట్లు ఆలంబనరహితముగా స్వ

పుణ్యజ్ఞానసంభారపక్షపాతవాతము నకంపనము నగు గగనమునందు నిలిచిరి. అప్పుడు సర్వానుపలంభనగుటచే దేవలోకములయందుఁగాని, మానవలోకములందుఁగాని దేవతలకుఁగాని, మానవులకుఁగాని సాంక్లేశికధర్మమునొండె వైయవదానిక ధర్మమునొండె బోధింపలేదని యెఱుంగవలయును.

ఇట్లే తథాగతగుహ్యసూత్రమున చెప్పఁబడినది.

“శాంతిమతీ” అనుత్తరమైన సంబోధిని దెలిసి నిర్వాణము పొందనున్నరేయి తథాగతుఁడొక్కయక్కరమేని యుదాహరింపలేదు. వ్యాహరింపలేదు. వ్యాహరించుచుండుటలేదు. వ్యాహరింపఁబోడు. కాని సర్వసత్త్వములు (సర్వజీవులు) విశ్వాసానుగుణముగా (యథాధిముక్తమున) నానాలక్షణములు (ధాతువులు) నానాశయములు పొంది తథాగతులు వివిధభాషణము లాడుదురని యూహించును. «భగవానుఁడు మనకు ధర్మముపదేశించును. మేమును తథాగతుల ధర్మదేశనము విందము» అని తలంచును. తథాగతులు కల్పనసేయరు వికల్పనగావింపరు. సర్వకల్పవికల్పజాలవాసనాప్రపంచవిగతుఁడగుటచేఁగదా యతఁడు తథాగతుఁడగుచున్నాడు.

“ధర్మములవెల్ల శాంతాదినిర్మలములు
అక్షరమ్ములు సర్వశూన్యములు అనుక్తి
గోచరములంచు గ్రహియించుకొన్న వాఁడు
బోధిసత్త్వుండు కేవలబుద్ధుఁడనిరి”

ఇట్లు బుద్ధుఁడెప్పుడెవ్వనికి నెట్టిధర్మము నుపదేశింపఁడేని విచిత్రములైన వ్యవహారములు (ఆగమములు) ఎట్లు తెలియనగుచున్నవందురేని వినుఁడు: “అవిద్యయను నిద్రయందుండి దేహులు కాంచెడి స్వప్నము (ల) వలెనీ స్వవికల్పాభ్యుదయమగుచున్నది. సకలత్రిభువనసురాసురనాథుఁడగు భగవానుఁడు “మాకీధర్మము నుపదేశించుచున్నాఁ”డని వారు తలంతురు. ఇట్లే భగవానుఁడు వంచించియున్నాడు.

“నిర్మలతరమైన కుశలధర్మమునకు
బుద్ధదేవుండు ప్రతిబింబభూతుఁడగును
అట తథత లేదు లేఁడు తథాగతుండు
అఖిలలోకులు ప్రతిబింబ మరయుచుంద్రు”.

ఇదియు తథాగతవాగ్గుహ్యపరివర్తమందు సవిస్తరముగా వివరింపఁబడినది.

ఇట్లు నిర్వాణార్థము ధర్మదేశనయే లేదు. కావున ధర్మదేశనయుండుటచే నిర్వాణమున్నదనుట యెట్లు పొసఁగును? కావున నిర్వాణముకూడ లేదని సిద్ధమగుచున్నది. భగవానుఁడు చెప్పెను గదా!

“ నిర్వాణ మరయ ననిర్వాణ మనుచు
పరమలోకేశ్వరుల్ భాషించినారు
గగనభాగముచే గ్రథితమ్ము గ్రంథి
గగనభాగమ్ముచే కొంచె మోచనము”

ఇంతియ కాదు. «భగవానుఁడా! కొండొకధర్మము పుట్టుచున్నదని కాని నాశనమగుచున్నదని కాని తలంచువారికి బుద్ధోత్పాదమగుట లేదు. నిర్వాణము భావముగా నెంచి నెమకువారు సంసారమును తరించుటలేదు. కారణమేమి? సర్వనిమిత్తప్రశమము, సర్వేంజితసమింజితముల యుపరతి నిర్వాణము. భగవానుఁడాస్వాఖ్యాతమగు ధర్మవినయముపేరిట సన్యసించి తీర్థికదృష్టియందు నిపతియలై నిర్వాణము భావముగ నెంచి దాని నన్వేషించువారు మోహపురుషులు (అజ్ఞానులు). నిర్వాణము పొందుటయన తిలలనుండి తైలము, క్షీరమునుండ నవనీతము పొందుటవంటిదని తలఁచి వారు దాని నన్వేషించుచున్నారు ధర్మములు అత్యంతపరినిర్వృతము లగుచుండఁగా ఎవరు నిర్వాణ మన్వేషింతురో వారిని నేను అభిమానికులైన తీర్థికులని యందును భగవానుఁడా యోగాచారుఁడు (ఇక్కడ యోగియని గ్రహింపవలెనే కాని యోగాచారవాది యని గ్రహింపరాదు) సమ్యక్ప్రతిపన్నుఁడు నగువాఁడు కొండొకధర్మము నుత్పాదింపఁడు; నాశమొందింపఁడు; కొండొకధర్మము పొందవచ్చు ననికాని, ప్రజ్ఞాపారమితను గ్రహింపవచ్చు ననికాని తలంపఁడు

# శరణాగతిః

## శ్రీ నారాయణం రామానుజాచార్యః

❈

౧

లక్ష్మీనివాస! భువనత్రయకారణత్వం లోకేశ్వరాదిదివిషత్పరిషత్ప్రభుత్వమ్
నిర్హేతుకోపగతవత్సలతాసుహృత్త్వం స్వామిత్వ మి త్యభవ! నైజగుణా స్త్వదీయాః

౨

వ్యాసాదయ శ్చిదచిదీశ్వరతత్త్వవిజ్ఞా, స్సంచిన్త్య సర్వనిగమాగమశాస్త్రపారమ్
ధ్యేయః పరః పరమకారుణిక స్త్వ మేవే త్యుద్ధృత్య బాహు మవద న్మునిచక్రవా

—

కః ఫుల్లపద్మనయనః ? కరుణాకరః కః ? కః శ్రీపతిః ? భువనరక్షణదీక్షితః కః ?
కః కేశవః ? శ్రుతిశిరస్థితపాదుకః కః ? స్వామిన్! త్వ దన్యపురుషః పురుషార్థదః కః ?

—

యుష్మద్దివ్యకథాసుధారసపరిగ్రాహే విరక్తాత్మనాం
పుంసాం ఇంద్రియదాస్యజీవనవతాం త్వద్దాసవిద్వేషిణామ్
ఆచార్యప్రతిపత్తిశూన్యమనసాం సర్వేశ! లక్ష్మీపతే!
దూరా ద్దూరతరే స్థితం తవపదం చే త్యబ్రువన్ సూరయః.

౫

అచింత్యభవ్యాద్భుతదివ్యయౌవన
స్వభావలావణ్యగుణామృతార్ణవమ్
ఉమాధవాభ్యర్థితపాదపంకజం
రమాధవం త్వాం శరణ్యంగతో స్మ్యహమ్.

# నీలిమబ్బులు

శ్రీ కోగంటి సీతారామాచార్యులు





లోఁబుట్టలోనుండి ప్రాపించె దుర్వార దీర్ఘనిశ్వాససంధితవిషమ్ము
వనమయూరమ్ము వెచ్చని గాలితాకిడి ననువు లేక నికుంజమునకు వెడలె
పరితపించినవి దుర్భరతరాతపవికీర్ణత నాఖుతతు లెల్లఁ గుతిలపడుచు
తిరుగుళ్ళు పడి బయ ల్వరుగులెత్తినవి సారంగార్భకము లెల్లఁ జెంగు లిడుచు
దూసికొనిపోయినవి కొన్ని దూరమందుఁ గానిపించెడి మఱ్ఱివృక్షములపొంతఁ
గంతదఘ్నమ్ముగా సాగెఁ గాననమున నిప్పుతేళ్ళల సెగల భ్రమించు నెండ.

నెమ్మి లోఁబొదనుండి నిక్కి చూచినదిలే యొక చిన్నిమబ్బైన నురుమఁ బోదు
పరితాపనిభృతి బెగ్గురులు చూచినవిలే త్రుళ్ళింతతోఁ జిత్తజల్లు లేదు
పారావతకులమ్ముఁ దారాడఁ జూచెలే వడగాలిసుడి బయల్వడఁగ నీదు
సాఁగి యాటాడంగ నాగన్న చూచెలే యొకమబ్బు నీడగా నుండఁబోదు
లేళ్ళ గుంపులు గుంపులై నీళ్ళయాసఁ బరువులెత్తెనులే గాలివారువములు
ఎండమావులుఁగూడఁ దా ముండి యుండి దిగ్దిగంతమ్ములందు నందించు రూపు.

అట్టె చూచెడునంతలో నంత నంత
చిద్రుప లై, పింజ మై నభస్సీమయందుఁ
జిట్టచివరలఁ దిరుగాడు చిన్నిమబ్బు
లొకఁటి కొక్కఁటిఁ గూడి బల్పెక్కి యురిమె.

తులలేని నైల్యమ్ము లొలికించి యొలికించి దెస లాక్రమించి పందిళ్ళ గట్టె
మురజస్వనార్భటీపరిరంభసంరంభ గాఢఘూర్ణిత మయ్యె గగనతలము
కరదీపికలువోలె మెఱుపులు మబ్బులపందిళ్ళలో నైక్యభావ మందె
వ్రేలాడినవి కొన్ని వినువీథిఁ గ్రొత్తయౌ పెండ్లిపిల్లమనోజ్ఞపృథుకచములు

నడిచినవి కొన్ని బెట్టుగాఁ గడలినుండి బారుబారున వియ్యాలవారువోలె
ఎదురునడిచెను తడియెల్ల నింక గొన్ని పొగరు దూసిన పెండ్లింటి మోసలట్లు.

నీకు వినీలనూతనఘృణీ పరివేషితచిత్రచిత్రశో
భాకమనీయమూర్తికి నుపాయన మిత్తు; మనఃప్రసూనమా
లాకలితోత్తమామలచలన్నవసౌరభరాజి నోయి ! దై
వాకృతి ! యోయి నీరద ! గ్రహమ్ములు క్రొత్తలు సొంపు లొల్కెడున్.

మూర్తిమదగ్నిపుంజము, సముజ్జ్వలితాఖిలదిగ్దిగంతజీ
వార్తికరోగ్రతైక్ష్ణ్యము, జనాదృతిదూరము నిట్టి రోహిణీ
కార్తికి నూతనత్వమును గల్పనసేసితివో బళా ! మహ
స్స్ఫూర్తిఁ జెలంగు నీమధురమూర్తికి నాయెద యేటికోళ్ళురా !

ఓయి కృపామతీ ! నవనవోదయ మయ్యెను నీదురాక, అ
త్యాయత మౌవిహాయసమునం దణువున్ ద్వ్యణుకమ్ము నీదురూ
పోయి కనంబడున్ వికసితోత్పలకాంతివిహార ! గుర్తులే
వో ? యివిగో ! సహస్రములు పొల్చెడు వజ్రిధనుఃకలాపముల్.

కల్పాంతోజ్జ్వలనీలనీలవిసరత్కాదంబినీప్రౌఢిమాఽ
నల్పోల్కారవభీతభీతజనతానందచ్ఛిదల్, కైశ్యసం
కల్పశ్రీమధుతార్ద్రిముల్, చలదపాంగశ్రీదళత్కైరవా
కల్పమ్ముల్ నవవార్షుకాభ్రములమూకల్ రోహిణిం గప్పెడిన్,

నీలోన గుంపులై నెగడిన బహువర్ణ శబలితమ్ములు సేంద్రచాపరమలు
నీలోన నొరసిన నీరంధ్రకాంతిమాలికలు నీతుఱుము మల్లియలచెండ్లు
నీలోన నిమిడిన నిబిడతమోరేఖ జీవకోట్యజ్ఞానసిద్ధిముద్ర
నీలోన డాగిన స్నిగ్ధగంభీరఘోష మయాచితాశ్లేషసౌఖ్యదాయి

నీవు నిన్నే యెఱుంగవు; నీకు నిన్ను విప్పిచెప్పెద హృద్వీథి వెడలివచ్చి
నీవు సృష్టికిఁ దొలి సృష్టి నిన్ను మించి సాగ దడుగైన జలధరసార్వభౌమ!

నీలోని నవనవల్ నింపుకొన్నది నాయెడంద చిత్రమ్ము లానందపరిధి
నీప్రాతరధిగత స్నేహమ్ము కొండకోనల నాయెడందలో మలఁగిపోయె
నీరూపు గంభీరసారస్వతాంభోధిరేఖ నాలోన పరిమళించె
నీసేంద్రచాపనిర్ణిద్రమూర్త్యంతరమధురిమల్ నామనోంబరము చుట్టె
నీశరీరాంతరమ్మున నిడుద లైన వానకాఱులు ముదురు సంపంగితీవ
జొంపములువోలెఁ బెనఁగొని సొంపు లొలసె నామనోవీథిలోనఁ ననంతరూప!

మూసలఁ గట్టి నీ వొలకఁబోసిన ముత్తెపుగుత్తివానజ
ల్లో? సరిగంచువస్త్రములలోఁ దులకించెడు నైగనిగ్యమో?
మాసరమైన వాసరము మధ్యల దుర్దినరేఖ మీదు కాఁ
గా సవరించు నీమెఱుఁగుఁగాంతులు మాకుఁ బ్రసన్నమయ్యెడున్.

గళితము నైన జల్లువెనుకన్ దొలివెల్గుచిటారునన్ సము
జ్జ్వలితముఁ, గొండ కొండ వరుసన్ శిఖరమ్ములు చుట్టివచ్చు నీ
జలమయరూప మంతరము చాళ్లలలో నొరిపిళ్ళువెట్టె క్రొం
దళుకు వెలార్చు నిగ్గు తొలిదాటులు మాకుఁ బ్రసన్నమయెడున్.

కొల్లలుఁ గొల్ల లై జనులకున్ గడుభీతిని బిట్టొనర్చు పెన్
జల్లును జల్లునంతరమునన్ తెలివాకలతోడి నుర్వ్రత్రా
ట్రిల్లుటలోఁ గనంబడు సరీసృపముత్తము కూస మట్లు నీ
తెల్లనివెల్గువెన్నెలలతేటలు మాకుఁ బ్రసన్నమయ్యెడున్.

# స్వప్న శ్రీనాథము*

శ్రీ కె. జోగయ్య శర్మ



అది బ్రాహ్మముహూర్తము. పలపలఁ వేగఁదొడగినది. కొక్కొరొకో యంచు కుక్కుటములు కూయఁజొచ్చిన.

అంతలో కలతనిద్దుర, కలతనిద్దురలో కల, కలలో పరమకైవల్యరాశి కాశి, కాశిలో విశాలాక్షీ విలాసమందిర ద్వారముకడ నిలచితిని. అమ్మ యేమనునో యని తలుపు గిఱ్ఱునకుండ తరిమి, కొంచెం బైన యోరవాకిట దేహ మొయ్యఁజొనిపి చూతునుగదా, అమ్మహాదేవి—

"కబరికాభారంబు కై పెక్కి విరులతో
  నవటుభాగంబుపై నత్తమిల్ల
నలఁతి లేఁజెమటచే నసలుకొన్న లలాట
  కుంకుమంబున చిన్ని కురులు మునుగ
తరళతాటంకరత్నప్రభారింఛోళి
  గండస్థలంబుల కౌఁగిలింప

నేర్పునకై నేసి, నిలువుటద్దముచూచి తన దివ్య మంగళ మోహన రూపమును ఆ విశ్వనాథునకు గానుపింప నాతని శయ్యోపకంఠమున కేగి, సాంగభంగంబైన యావులింతకు అంగుళిస్ఫోటంబు నాచరించుచుండెను.

నేనును నిశ్శబ్దముగా ఆయమకు కన్నుల మ్రొక్కి వెనుకకు వచ్చి ఆకసమువంక చూచితిని.

"కదిసె నంగుళియుగ్మకం బంతరము గాఁగ
గగనగంగారథాంగద్వయంబు"

తెల్లవారఁజొచ్చినదని తలచి ముందునకు సాగితిని. అప్పుడే ప్రహరితిరుగు చాలించి భైరవుండు, గవని మోసాల యరుగుపై కన్ను మోడ్చినాడు.

ఆతని నిద్దురకు భంగము గలిగింప మనసొప్పక, మునివ్రేళ్లు లోయ్యొయ్య మోపి, చప్పుడుగాని పరిపాటి పవనంబుపట్టి నడచి, కొన్ని యడుగులు ముందునకువైచి, యీవలకు వచ్చితిని. ఢుంఠి విఘ్నేశ్వరుండు, గండూషచేసి యుమియుచుండెను చంద్రకుండోదకముల.

ఏమిది! అంతయు వింతగ నున్నదే! ఇది విశ్వేశ్వరు నగరువలె చూపట్టుచున్నది! ఇచటి కెట్లు వచ్చితినని యనుకొనుచు మొగసాల కరుగుదెంచినంత, ఏమి చెప్ప! ఇట్టి మహాద్భుత మెన్నడును చూడము; వినము. సమున్నతాకారుడు, విశాలఫాలుడు, ఆకర్ణాంత విశాలనేత్రుడు, ఉన్నసుడు, ఆజానుబాహుడు, సువర్ణవిగ్రహుడు, రాజస బ్రహ్మతేజములు తడబడు నొకపుంభావ సరస్వతి, కమలాప్తు డుదయింపకయ మున్న అభ్రగంగ నుపస్పర్శ మాచరించి,

"తరుణ కంకేళి పాదపపల్లవము చాయ
  తవణిల్లు జడలజూటంబు ముడిచి,
హైమంబులైన రుద్రాక్షకుండలములు
  శ్రవణపాశము లందు సంతరించి
నిర్నాభిబిలముగా నెరివీగు బొజ్జపై
  సలిలకాషాయ వస్త్రముధరించి

* శ్రీనాథుని కవితావిలాసమును శివభక్తి తాత్పర్యమును ప్రదర్శించుటకై, యాతని రచనలనే మలచి యీ వ్యాసము విద్యావినోదముగా రచించితిని. సహృదయులగు పాఠకులు అన్యథాగా భావింపరని ప్రార్థన.

ఆపాదమస్తకం బఖిలాంగకంబుల
సన్నాహసన్నద్ధశాళ్వం బొనర్చి
పాశుపతదీక్ష రూపంబు వహించినట్లు
శాంతిప్రుంభావమందిన సౌష్ఠవమున"—

విశ్వపతినగరి మొగసాలకు గొడుగు పావలగిలకలు గులకరింప నల్లన నడచెంచుచు. అల్లంత దూరమున నన్ను గాంచి 'వత్సా, ఇటు రమ్మ'ని హస్తసంజ్ఞాదరలీల వత్సలత దనర పిలిచినాడు. ఆపిలుపుతో, ఏదో జన్మజన్మాంతర వాసనా వాసితాంతరంగము మెరుపు మెరిసిన చందాన నన్నాతని చెంత పదనైచినది. ఆ దివ్యమూర్తి శ్రీపాదములు కనుల కద్దుకొని, లేచి నిలువంబడి చేతులు జోడించి తేరిపార చూతునుగదా! ఆతడు బ్రాహ్మీదత్తవరప్రసాది, సశరీరముగా శివసాన్నిధ్యమునందిన మహాశైవుడు, మద్గురుమూర్తి శ్రీనాథుడు. ఆమ్మహాకవి నన్ను జూచి, ఎన్నాళ్లకెన్నాళ్లకని పలుకరించి, 'అరుణగభస్తిబింబ ముదయాద్రిపయిం బొడతేర గిన్నెలో పెరుగును వంటకంబు వడపిందెలునుం గుడువంగ' ముచ్చటపడువాడవు, ఆరగింతువు కడుపు నిండార రమ్మని అదరముమెయి నాడి, మెయినిమురుచు బుజ్జగించుచు తనవెంట గొంపోయినాడు.

చిరకాలమునకు గలిగిన గురుసందర్శన భాగ్యమునకు ఒడలుప్పొంగ, నాతని వెంబడింబడి, కొన్ని కక్ష్యాంతరంబులు గడచి లోన ప్రవేశించి చూతును గదా! అది యా కవి సార్వభౌముని కవితా సామ్రాజ్యము! అభినవదానకర్ణులు, అష్టదిగ్గజ భయంకరులు, విక్రమాపరగాండీవులు, భోగవసంతరాయలు, సంగరరంగ గాంగేయులు నగు గండరగండలైన ఆంధ్రక్షమామండలాఖండులులు ఆతని సాహితీ సామ్రాజ్యములో పాతకాపులై పని వినుచుండిరి. ఆ బ్రహ్మాండ కర్పరములో నొకచో మొలక యెండ; ఇంకొకచో సంజకెంజాయ, వేరొకచో తరిపివెన్నెల, కొండొకచో చిరుతచీకటి కడలుకొని వింతవన్నియలు వెలార్చుచుండెను. అందలి యారామ కల్పవృక్షముల వరుసలు పరువంపుపుప్పొళ్లు పరిఢవిల్లజేసినవి.

ఆ వృక్షవాటికలు గడచి, విశ్వనాయకుడు తన నగరి మొగసాల కెదురుగా ప్రమథగణముల బనిచి ముచ్చటపడి కోరి కట్టించి యొసగిన «త్రైలోక్యవిజయసౌధ» ప్రాంగణమున ప్రవేశించినంతనే గుగ్గులు మహిసాక్షి వాసనలు క్రొవ్విన మంగళధూప ధూమములు సర్వేంద్రియ సంతర్పణ మొనర్చినవి. ఒడలు జలదరింప లోని కేగితిని. అంతట —

"శ్రీపాదముల పైడి చిరుగజ్జియలతోడ
తవణీల్లు గండపెండార మమర,
తెలిదామరలపోలు వెడద క్రాల్గన్నులు
మద్దికాయలతోడ నుద్దివడయ,
మొలక కూకటి గ్రాలు ముత్యాలరవిరేక
భసితంపు బొట్టుతో బాదరింప
వాలబుగ్గలకాంతి పల్లవంబులతోడ
చిన్ని లేనగవులు చెలిమిసేయ
లజ్జయెరుగని కటిమండలంబుమీద
వలుదవజ్రాల కనురు గర్వంబు సూప

దివ్యబాలకుడొకడేతెంచి, చనవుమెయి తన చిన్ని కరాంగుళులతో నా కేలు పట్టుకొని యభ్యంతర మందిరమునకు గొంపోయి యచట నొక మణిస్తంభ మండిత సౌవర్ణ వేదికాలంకృత కౌశేయవితానోపశోభిత మౌక్తికాగార సభాంతరంబున —

"పరిపూర్ణ హేమకుంభములు హస్తంబుల
ధరియించి యిరువంక కరులుగొలువ
బలగమై వరశంఖపద్మ మహాపద్మ
మకరాది నిధులు నేమమున గొలువ
వింజామరలుపూని వెనుకదిక్కున దేవ
గంధర్వ గుహ్యకాంగనలు గొలువ
నెలవంక బలువంక నింద్రాది దివిజులు
సేవాంజలులు మోళి జేర్చికొలువ
భర్మపంకజ కర్ణికా భద్రపీఠి
కాగ్రమున నిందుకొలువుండి"

తేచెమటచే చేర్పుక్కు చెమ్మగిల్ల, కలికి నవ్వు తళుకు చూపులతో, తరళతాటంక రత్నప్రభారింఛోళి గండస్థలం

బుల కౌగిలింప, ముత్యాలసరులు పేరురముపై మురువుసూప స్వర్ణద్వయంబు తరంగ రింఖణ లసత్సాహిత్య సౌహిత్యయై, నఖముఖ ముఖరితవీణయై వేసలి పాటపాట నరవెంట్రుకలై తిలతండులాన్వయశ్రీ నటియించు పెద్దముత్తైదువ యగు శారదాంబ పాదపీఠముచెంత విడిచినాడు.

గోదావరీ పావనోదకంబుల యందును, తుంగభద్రా సముత్తుంగ కల్లోలినియందును అఘమర్షణ స్నానమాచరించి చుంగులువార పసిడిపుట్టముగట్టి కలధౌతపాత్రములలో కల మాన్నము లారగించి, కర్పూరహిమాంబు సంకుమద కస్తూరీ పటీరంబులు మేళవించిన తాంబూలచర్వణ మొనర్చి, కవులు కైదండ యొసగ, ఆంధ్ర క్షమామండలాఖండలుల నిండుపేరోలగములందు దీనార టంకాల తీర్థమాడి, చిన్నారి పొన్నారి చిరుత కూకటివయసు మొదలు ప్రాయము కైవ్రాలుదనుక త్రికరణశుద్ధిగా తన్నారాధించిన మద్గురుదేవునకు పలుకుతోడైన సరస సద్గుణ నికురంబను శారదాంబను గాంచి సాగిలబడి మ్రొక్కితిని.

అపుడు—

“ప్రథమ సంధ్యాకాల బలిశంఖ నినదంబు
ప్రభవించె శ్రీవిశ్వ భర్తనగర.”

అయ్యవసరమున—

“ వకుళఫలాను కారులయి వట్రువులై
మెరుగారు గ్రొత్త మా
క్తికముల పేరొకింత తులకింపగ, నిర్మల
హేమరత్నక
ర్ణికలు చలింప, నందియల కేంకృతి కంకణ
మేఖలాధ్వనిన్
ప్రకటముసేయ మందగతి భాస్వర నవ్య
విలాస మేర్పడ”

నొక ంధ్రి యేతెంచి, దేవతార్చనా సామాగ్రి యొడగూర్చి, మలవిజ్ఞానదీపంబు వెలుగజేసి, అయ్యగారికి పూజావసరము నివేదించినది. అంతట గురుదేవుడును ‘అభ్రగంగ నుపస్పర్శ మాచరించి వేగవిచ్చేయు’ మని నన్ను వీడ్కొలిపి, వైశ్వదేవాది విధులు సర్వమునుదీర్చి, ఖండేందుశేఖరు కామధేనువుల యూధస్యధారల నోల లార్చి, కల్పపాదపముల ఫలపుష్పముల నీశాను నర్చించి, రత్నదీపముల శివుని నివాళించి, కంఠేకాలునకు నిర్మల మణులు కానికల నొసగి దేవతార్చన విధులు సర్వమును దీర్చినాడు. ఏనును మణికర్ణికాంభః ప్రవాహంబున తటుకున స్నానమాచరించి వచ్చి గురుదేవునిసన్నిధి గూరుచుండి తదీయ శైవార్చనావిధానము నంతను తదైకాయత్తచిత్తుడనై తిలకించుచుంటిని.

అంతలో కుతపకాల మగుటయు, ‘అంబుజ కర్ణికాసన కులాగ్రణి. రెండవజాముగంట వ్రేయంబడె ఆరగింప సమయం’ బని పంకజదళాక్షులు విన్నవింప, మొగసాల నున్నట్టి జగతీసుపర్వుల లోనికి గొనితెమ్మని నాకు సన్న చేసినాడు. నేనును, ప్రాంగణ బహిర్ద్వారమునకు వెడలి, అచట వితర్దికలపై నాసీనులైయున్న యతిథులకెల్ల భోజనావసరము నివేదించి, రండు లోనికి విచ్చేయుడని సబహుమానంబుగా దోడ్కొనిపోయి, చంద్రికాసంకాశ కౌశేయ శత సహస్ర సందానిత వితానోపశోభితంబును, కాలాగురు ధూపధూమవాసనా సనాథంబును, కర్పూరరచిత రంగవల్లీ వేల్లితంబును, కస్తూరికాలేపనసురభి శశికాంత మణిశిలాకుట్టిమంబును నగు చతుశ్శాలా భోజనమందిరంబున వృద్ధానుపూర్వకంబుగా నుచితాసనంబుల గూర్చుండజేసితిని. అంతట—

“జిలుగు సంధ్యారాగ చీనాంబరముగట్టి
కుసుమగర్భముగ కీల్కొప్పు తురిమి
కస్తూరి మెదిచిన గంధసారమలంది
ముత్యాలు తాటంకములు ధరించి
సీమంతపథమున చేర్చుక్క సవరించి
కురులపై చిన్నిపూ గుస్తరించి
శ్రీపాదముల హేమనూపురంబులు దాల్చి
కటిమీద వజ్రాల కమరు నిల్పి’

విశాలాక్షి విశ్వపతిదేవి యచటి కేతెంచి చేసన్న చేసినది. అద్దేవియాజ్ఞ దేవపురంధ్రులు, మొగివిరిసి కలువకూడక పగు

లత వెడలుపును నిడుపుపనిమియుగల లేఁజిగురుటాకులు వెట్టి సే యభిషుకించిరి.

అప్పు డాయన్నపూర్ణ, వేలుపుగిడ్డియు వరుసవేరియు, కల్పకుజంబును తోడరా, లాలిత పాదనూపుర ఝుళంఝుళ నాదము లుప్పతిల్ల, పైచేల చెరంగు తూలగ విశృంఖల వృత్తి–చరించుచు నన్నిపంక్తుల కేతెంచి, ఆజ్యధారాప్రవాహంబు, శర్కరాక్షీర సికతాంచితంబు, బాయసాపూప సంపన్నంబగు కలమాన్నంబును, ద్రాక్షా గోక్షీర క్షౌద్ర పుండ్రేక్షు ఖండమండితంబును, రంభానారికేళఫల పాక శాక సాకల్యంబును, మీఁదబరసావళీ పానక ప్రచురంబును, శరచ్చంద్రచంద్రికా ధవళదధి సమృద్ధంబును అగు చతుర్విధాహారంబుల వడ్డించి 'అమృతాయతా' మని చిఱుఁగేలు దోయి మోడ్చినది.

శ్రీనాథుఁడును బంతిఁగడిమి కేతెంచి, భక్తి నందరకు నన్నంబుదారవోసి, ధర్మగేహిని తాలవృంతంబు వీవ మాదు బంతిన గూర్చుండి, యాదరము చనవు నయము గారవము పెనగొన చుట్లనున్నవారిని పలుకరించుచు మాతో నారగింప మొదలిడెను. మేమును, విచిత్రంబులగు పలు తెరగులైన వంటకముల చవు లుగ్గడించుచు, ముచ్చటలు చెప్పుకొనుచు, మనసు కోరికనిండగ చతుర్విధాహారంబుల నారగించి, హస్తప్రక్షాళనంబుచేసి యాచమించి, గంధర్వభామినీ సందర్శితాస్థాన మంటపమున సుఖోపవిష్టులమై యున్నంత, శ్రీనాథుడు మాయొద్ద కరుదెంచి «కడుపు నిండార భోజనము చేసితిరే! ఆదనుతప్పిన తలగి మీలో నంత నంత నున్నవారు లేరుగదా!» యని పలుకరించుచుండ, పరిచారికాజనంబు లందరకును కర్పూరతాంబూలంబులం దెచ్చియిచ్చిరి. మేమును వీటీచర్వణంబు సేయుచు పరమ మాహేశ్వరుడగు శ్రీనాథునిపై విశాలాక్షీ శ్రీమన్మహాదేవులకు కలిగిన యనుభావం బగ్గించుచుండ ఆ బ్రాహ్మీదత్త వరప్రసాది యెల్లర కలయంగనుంగొని:

నాయభ్యర్థన మన్నించి సారస్వతప్రియులగు మీ రెల్లరిచటి కరుదెంచుట ముదావహము. నేఁడు యామత్రయానంతరమున ముక్తిమంటప మధ్యమున అస్మదాంధ్రీకృత కాశీఖండమను మహాగ్రంథమును ఆ విశాలాక్షీ శ్రీమన్మహాదేవుల శ్రీచరణముల కంకితము సేయనున్నాను. మీ రెల్లరంతదనుక నిచటనే విశ్రమించి కృతిప్రదాన మహోత్సవమును గాంచి యభినందింప గోరుచున్నాడ" నని మంద్రగంభీరస్వరమున పలుక, నేమెల్లర మైక్యకంఠముతో 'తథాస్తు'ని ప్రత్యుత్తర మొసగితిమి. అంత నాతఁ డందర మరల పేర్పేర పలుకరించి, యభ్యంతర మందిరమునకు విశ్రమింపనేగెను. మేమును చతుర్విధాహార సంప్రభూతాయాసంబు వాయ తదాస్థాన మంటపమున కొంతతడవు విశ్రమించితిమి. ఇంతలో యామత్రయంబు దాటుటయు నగరి మొకసాల ప్రమథగణముల హెచ్చరికలు వినవచ్చుటయు, అది అది సభాప్రారంభసమయ కలకల మగుట మేమెల్లరము గుర్తించి, సవసవ ముక్తిమంటపమున కేగి మామా స్థానముల నాసీనులమై యుంటిమి. అట్టియెడ –

"చంద్రబింబానన చంద్రరేఖామౌళి
నీలకుంతల భార నీలగళుడు
ధవళాయతేక్షణ ధవళాఖిలాంగుండు
మదన సంజీవని మదనహరుడు
నాగేంద్రనిభయాన నాగకుండలధారి
భువనమోహనగాత్ర భువనభర్త
గిరిరాజకన్యక గిరిరాజనిలయుండు
సర్వాంగసుందరి సర్వగురుడు
గౌరి శ్రీవిశ్వనాథుండు కనకరత్న
పాదుకలు మెట్టి చట్టలు పట్టుకొనుచు

... ... ...

జయయు విజయయు నొకవంక సరసరాగ
నందికేశుండు ముందట నడచిరాగ
నడచివచ్చిరి ముక్తిమండపము చేర
నధికతరభక్తి శ్రీనాథు డనుగమింప

ఇట్లరుదెంచి ముక్తిమంటపంబు నడుమ కైలాస శృంగంబునుం బోని హేమ సింహాసనంబున దిండుధరుండు అంబికా సహాయుండై గణాధిప స్కంధ నందికేశ్వరులు గొలువ నాసీనుండగుటయు,

"మండు వేసవినాటి మార్తాండ బింబంబు
గోడగించు పసిండి గుబ్బతోడ
తొలుకారు క్రొమ్మెరుంగుల ధాళధళ్యంబు
రవణించు రత్నదండంబుతోడ,
అచ్చవెన్నెలచాయ హెచ్చుకుందాడెడు
వెలిపట్టు జగజంపు వలువతోడ,
కడలియం దేకోదకము వేళ పుట్టిన
పవడంపు తీవల పంజుతోడ
వేనవేల్ యోజనంబుల విరివినొప్పు
లక్షకోటి శలాకికాలంకృతంబు
తారకాస్థూల మౌక్తిక స్థాపితంబు
విశ్వపతికిని వెనకయ్య వెల్లగొడుగు పట్టినాడు.

ఈవిధంబున ఫాలలోచనుం డంబికాద్వితీయుండై నిండు పేరోలగంబున్న యవసరమున, పరమ మాహేశ్వరుడును, బ్రాహ్మీదత్తవరప్రసాదియు నగు శ్రీనాధ కవిసార్వభౌముడు ఆయ్యాది దంపతుల శ్రీచరణములకు సాష్టాంగముగా ప్రణమిల్లి లేచి నిలువంబడి సభ కలయంగనుంగొని, కేలుదోయి ఫాలమున గీలించి స్వయంభూ జంభారి ప్రముఖులగు బర్హిర్ముఖులును, యక్ష కిన్నర గరుడాది దేవయోనులును, నారదపరాశరాది మహర్షులును, వ్యాస వాల్మీకి భాసాది సంస్కృత మహాకవులును, నన్నయ తిక్కయజ్వ ప్రబంధ పరమేశ్వరాది- ఆంధ్రమహాకవులును, రాజనరేంద్ర వీరభద్రేశ్వరాది - ఆంధ్రక్షమామండలాఖండలులును, అన్నమంత్రి విస్సన్న ప్రముఖ మహామాత్యులును సభాస్తారులై హర్షసంభ్రమ పులకితగాత్రులై యాకర్ణింప శ్రీరాగం బందుకొని –

"శ్రీకాశీనగరాధిరాజ్య పదవీ సింహాసనా
ధ్యాసి లో
కైకగ్రామణి విశ్వనాథుడు విశాలాక్షీ
ద్వితీయుండు నా
కౌకస్సంచయ కామధేనువు మదీయాంధ్రీ
శ్రీకన్యా హృదయాధినాథుడు కృతిస్వీకా
కారముం జేయుతన్

దేవదేవునకు నాడికి యాది యగు వాని
కంబికాపతికి దక్షాధ్వరారి
కహితపురత్రయాధ్యక్షు సంహారునకు
హరిలోచనాంబుజాభ్యర్చితునకు
బ్రహ్మాది దేవతోపాస్యసన్మూర్తికి
నమృత మూర్తికిని స్వాయంభువునకు
నిగమార్థ విశ్వోపనిషదంగనా మాళి
చుంబిత శ్రీచరణాంబుజునకు

భోగమోక్షంబు లతిపాప బుద్ధులకును
గరుణ నొసగెడు వానికి కామితార్థ
కల్పశాఖకి కాశికాఖండకృతిని
భక్తి నొసగెద శ్రీనాథభట్ట సుకవి.

కంఠాగ్ర కరిరాజు డుంఠి విఘ్నేశుండు
వడకు గుబ్బలికూతు కొడుకుకుఱ్ఱ
ఆకాశ మండలంబను నల్ల గలువకు
నకరు వాద్యుండు లోలార్కమూర్తి
గోపాలభామల గుబ్బచన్నుల మెచ్చు
గీర్వాణ వంద్యుండు కేశవుండు
కరటి ప్రీడాశూన్యకటి గోపురద్వార
పరి రక్షకుడు కాలభైరవుండు

కాలకంఠుని శిరసు పూ గగన గంగ
కాశికా క్షేత్రమున కేడు గడయునైన
యిందరును నిత్తురెల్లప్పు డీప్సితమ్ము
లస్మదీయమౌ కృతికన్య కహరహమ్ము.
మార్కండేయ మహేశ్వరుం డఖిల
సామ్రాజ్యంబు పాలింపగా
నర్కేందుల్గల యంతకాలము తదీయాం
ఘ్రిద్వయీ భ-

పహోంకృదంచిత భాగ్యసంపదలతో
క్ష్మామండలీ సత్కవుల్
కోర్కుల్నిండ స్వతంత్రతాగరిమ
చేకొం(డాయు రైశ్వర్యముల్.

గరళకూట వినీల కంఠాయ శంభవే
మదనాంతకాయో న్నమశ్శివాయ
కాద్రవేయాధిప గ్రైవేయ భూషాయ
మధుభిత్సకాయోన్నమశ్శివాయ
కుంభినీ ధరసుతా కుచకుంభ పరిరంభ
మహాలోలుపాయోన్నమశ్శివాయ
వేదాది నిశ్శేష విద్యావధూమాళి
మణికలాపాయోన్నమశ్శివాయ

గంధ దంతావల జలంధ రాంధకాది
విబుధ పరిపంథి వాహినీ నిబిడవర్గ
బంధ ఘోరాంధకార సంభార కిరణ
మాలినే శాశ్వతాయోన్నమశ్శివాయ''

అని ప్రావృషేణ్యపయోధర ధ్వాన గంభీరంబగు నెలుంగునం బలికి శ్రీ తాళపత్రసంపుటములో వ్రాసియుంచిన- ఆంధ్రీకృత కాశీఖండ మహాప్రబంధమును భక్తి తాత్పర్యగరిమ యచ్చుపడ ధర్మపత్నీ సహాయుండై విశాలాక్షీ శ్రీమన్మహాదేవుల కేల సమర్పించి వినయ వినమిత గాత్రుడై తత్సమీపమున ఆసీనుడయ్యె. అయ్యవసరమున-

"చాముండి యొసరించు జంపె తాళమునకు
భృంగీశ్వరుం డాడె ప్రేంకణంబు
వెనుకదిక్కుననుండి కనకభూషలు మ్రోయ
సూర్యేందు శశియు వీచోపులిడిరి
పెండికట్టులతోడ వేత్రదండము పూని
సందడి నెడగల్గ జడిసె జముడు
కాలోచితంబుగా కైవార మొనరించె
పలుకుతొయ్యాలి గద్యపద్య సరణి

అఖిలలోకములకును బ్రహ్మాండములకు
ఆధిపత్యంబు వహియించు నభవు కేల
పరమశైవుండు శ్రీనాథభట్టసుకవి
యుంచు భక్తితో కృతిసమర్పించు వేళ."

ఏనును తత్కృతి మహోత్సవ సందర్శన సంజనితానంద బాష్ప పూరపరిపూర్ణ లోచనుండనై, 'దక్షారామ చళుక్య భీమవర గంధర్వాప్సరోభామినీ వక్షోజద్వయ గంధసార ఘుసృణద్వైరాజ్య భావంబు నధ్యక్షించిన' మా కవిసార్వభౌముని ప్రౌఢసాహిత్యములు విశాలాక్షీ శ్రీమన్మహాదేవుల మందిర ప్రాంగణమున ప్రమథగణములు పఠియించు దివ్య ప్రబంధములుగా పరిఢవిల్లుట చూచి ఆనందతాండవ మాచరించి, శ్రీ గురుచరణములకు పునఃపునః ప్రణామంబులు చేసి యాశీస్సులంది యామంత్రణంబు నడసి నిజనివాసమున కరుదెంచితిని.

# స్వాగతమ్

## శ్రీ నారాయణం శ్రీరామాచార్యః



భోః స్వాగతం తే సుకుమారమూర్తే
చైత్రప్రభో! చిత్రవిచిత్రమార్గ!
ప్రదక్షిణీకృత్య జయంతి, తే తే
వర్షా స్సమస్తా అపి చక్రరీత్యా

వసంత! వర్షోత్సవ! కోకిలార్ద్ర
గీతీశ్రుతిస్వైరవిలాసహాస!
సమస్తసౌభాగ్యవిభాసిమల్లీ
వల్లీలసత్ప్రౌఢమనోజ్ఞవేష!

చైత్ర! త్వ మేవాసి; వసంతయజ్ఞే
ఋత్విగ్వరః, మాస పురస్కృతస్సన్
చూతాంకు రోఽగ్నిః పరభృ త్కుహూశ్చ
మంత్రశ్రుతిః కాల అహో స్వి దాజ్యమ్–

త్వాం స్తౌమి చైత్ర! ప్రభు మస్యజీవ
లోకస్య కాలస్యచ కౌతుకస్య
త్వాం నౌమి దైవం సుహృదం కవీనాం
రసాత్మకం సౌరభపుణ్యభావమ్–

# మధుర స్మృతులు

శ్రీ దావూద్



మానససముద్రతటమున మారు మారు
సతతభంగతరంగసంహతు లి వేల?
కలకలధ్వను లొలయంగఁ బలుకసాగె
నలఁతి భూతవిస్మృతవిషయముల నేఁడు.

నాహృదయసీమ స్మృతుల పెన్నగర మొందు
స్వయమ నిర్మితిఁగన్న దీసమయమందు
నీలతానిలయం బగు నింగియందుఁ
దరళనక్షత్రలోకంబు వరలు భంగి.

వికలతాదైన్యమున ముంచు వేదనమును
గొని సుఖమ్ములఁ బిల్వఁగాఁ గనె నెవండు
మూర్ఛ మున్గిన మామకాబోధమంద
భాగ్యచేతనమున కింకఁ బ్రణయసుఖమె

మోహమయ మాదకత్వవిస్ఫూర్తి గొల్పె
మనసును వినోదపెట్టు నామగ్నలీల
మధుర మాప్రేమభరితసమగ్రపీడ
హృదయసౌధము నిపు డూపి వదలు నట్టె!

జీవనసమస్యజటిల మై సిద్ధయోగి
జటలవలెఁ జిక్కు వాయని సరణి యేల?
నోలి మచ్చుష్కహృదయాన ధూళి రేగి
యెవతె యార్ద్రవిభూతి నర్థించు నిట్లు.

నిజమనోవ్యథ లన్నియు న్నిదురఁ గూర
నేడు సుఖపరవశలయి నెగడుచున్న
వారి కిప్పట్ల దొలకదు తీరి కవుర!
యలఁతి మముబోంట్ల కరుణగాథలు వినంగ,

పూర్ణిమాచంద్రుతోడ సముద్రమునకుఁ
బరిచయ మ్మెట్టు లొదవెనో యెఱుకవడదు
కిరణపుంజము పయినుండి యరుగుదేరఁ
దరగపిండును గౌఁగిలింతలకుఁ దారు,

వెక్కిలింతలతో నేడ్చి వెండి వెండి
నేను నాకరుణాగాథ నెమరువేయ
వినియు వినని తెఱంగున వెలఁది నీవు
సుమములం గిల్లి నెపమునఁ జూచె దకట!

అస్మదీయకుటీరసీమాంగణమున
నాక్రమించెను బ్రళయాబ్ద మట్టె వచ్చి
గాఢవిరహము వ్యాపింపఁ గాంచి వికృతి
యంధతామసి హృదయాన నలమి కొనియె.

ఎన్ని నిర్జనరజనులం దేను జుక్క
సెమ్మెల న్వెలిగించి చూచితిని నిన్ను
స్వాగత మొసంగు నుపహారసరణి నీకుఁ
గడకు మందాకినీధార విడిచి నాఁడ.

నాకు మిధ్యగఁ దోచు నీనగ్న జగతి
నవుర! చిరసత్యసుందరం బైతి వీవు
దేవి! జీవనసంగి పై కేవలమ్ము
కలితకల్యాణసౌఖ్యమార్గమున నుంటి.

శశివదనమున వలిపెమున్ సవదరించి
యంచలముచాటు దీపము నుంచి నాదు
బ్రదుకు గోధూళివేళకుం బ్రాకినపుడు
పరమకౌతుకహృదయాన వచ్చి తీవు.

ఘనమునన్ శ్రావ్యసుందరగర్జపగిది
గర్జలోఁ జంచలాచలత్కాంతిమాడ్కి
కనులలోని కనీనికాకరణిఁ గంటి
పాపలో శ్యామకాంతినా వచ్చి తీవు.

ప్రతిమయందున జీవంబుపగిది నాదు
కనుల భవదీయసౌందర్యగరిమ నిల్చె
నొక్క సుందరరేఖగా నున్న దదియ
లక్షసంఖ్యలఁ బ్రత్యేకలక్ష్య మట్లు.

సరసతావకపావనస్పర్శ నంది
శీతలానిలములు నన్నుఁ జెనకునపుడు
అశ్రుధారల గురియించి యనవరతము
నేను భయమునఁ గంపింపఁ బూనుచుందు.

నాకనులతెప్ప వ్రాల్ప కానందవశత
నాయనంతసౌందర్యము నరసి మురిసి
ప్రతిభమెయి దాని గొనితెచ్చి భద్ర మనుచు
సుకవి కర్పింతు నే మహోత్సుకత మెఱయ.

['అశ్రుకావ్యము' నుండి]

# చంపకమాలిక

విరసము నీరసమ్ము నవివేకము నజ్ఞతఁ బారఁద్రోలుచున్
సరసవిదగ్ధమార్గములఁ జాగెడు నవ్యకవీంద్రులార! మీ
సరసత వాక్పటుత్వముఁ బ్రసన్నత నున్నతిఁ జాటుఁ డయ్య! దు
స్తరము కవిత్వవాసన ప్రసాదముగా లభియించె మీకు దు
ర్భర మగు శాస్త్రముల్ చదివి పాండితులం గడియించి తర్కభీ
కరులయి శబ్దశాస్త్రగతకల్పనలం బఠియించి నంతనే

సరసకవిత్వసుందరి ప్రసన్నత లభ్యము గాదు మానసాం
బరమున మచ్చ లేని ప్రతిభాప్రణయార్ద్రిత వృద్ధి సల్పి వి
స్తరనిజసంస్కృతిం దజచి తాపము నంది వియోగరాగముల్
విరహము యోగముం వలపు వెక్కసమున్ రుచి చూచి దానివె
ల్వఅచు విధానముం దెలుపుబాటను వాణిమనంబులోపలన్
నిరతము నిల్చి భావగతనిర్మలతం బరికించి కల్పనా
పరిసరదృశ్యజాలగురుభారము మానససీమ మోపుచున్
వరము లొసంగి నప్పుడె యభంగరసప్రదకావ్యసంపదల్
విరచన సల్పుచున్ రసికవీరులఁ దన్పుఁ గవీశ్వరుండు నే
ర్పరి యగువాని శబ్దమయరాజ్యము కూరుపు నోర్పు బోధనా
గురుత విశిష్టమై తరుణగోష్ఠికి సృష్టిరహస్యపాఠముల్
తరుగని తీపితోఁ దెలిపి, తత్వము సత్వము వెల్లడించి యా
దరమున గౌరవంబు సతతంబును సంగ్రహణం బొనర్చు న
ప్పరమపవిత్రవప్రమునఁ బంటకు నష్టము గాని యట్లు వి
బ్బర మగు కల్పనల్ వలపుబాటల వర్తిలు సంస్మృతుల్ త్రపా
భరమృదునూత్నశబ్దమయభంగిమ, చారుమనోజ్ఞవాసనా
స్ఫురితరసప్రవృత్తి సరసుల్ విరసుల్ విని సంతసించు న
ట్టెలుఁగున బాసకున్ స్తుతగతిన్ ఘటియించి వికారరోగముల్
పొరయనియట్లు వ్యాకరణపున్ మునుముల్ చెడకుండఁ గాంచి త
త్పరమతిఁ దెల్గుపల్కులకు స్థానము గూర్చుఁడు కావుకళ్ళపుం
దెలుఁగున గట్టిదేశ్యముల తీరగు నానుడులం గ్రంహింపుఁడీ
తలుకల జల్లుమాటలను దాలును బొల్లును నింపఁబోకుఁ డా
దరమున నన్యదేశజపదంబుల వాడుఁడు ప్రాజ్ఞకోటి వ
హ్వారె, భళి, సాధు, సాధు, తరహా సలహాల హుషారు గూర్చు నీ
సరసుని కావ్యవీథిని- పసందగుమాటలు బేష్ సెబా సహో

తరుణతపస్వి నేటిసరదాలకుఁ జిక్కనివాఁ డటంచు భూ
వరులును ధీవరుల్ పొగడ వర్తిలు మీరలు వ్యావహారిక
స్తరమున నున్నవానికిఁ బ్రచారము గూర్చుఁడు ఛందమందు ని
త్తెలుఁగున నున్నఁ గాదె మనతెల్గుకవిత్వపుఁ దీరుతెన్ను ల
బ్బురమును గూర్చు పాఠకుల ముచ్చట దీర్చును దివ్యగానమా
ధురుల వెలార్చు రాగరసతోయధికిం బసఁగూర్చు కల్పనా
భర మగు లోకమందు కవి భావవిహార మొనర్చి యాత్మదు
ర్భరకరుణారసంబును బరంపరఁగాఁ బ్రవహింపఁ జేసి ము
ష్కర మగు శోకవార్ధి నమాంతము ముంచుచు విప్రలంభబం
ధురరసతాపమందు పరిధుల్ విపరీతముగా నమర్చి సుం
దరపదపద్మముల్ తలఁపుఁ దల్పములం జతకూర్చి గానవ
ల్లరులను బెంచి నూత్నకళలం జెలువారు చిగుళ్ల నించి పూ
సరముల భావముల్ తెనుఁగుసారసముల్ వలపుల్ గులాబులన్
గర మనురక్తితోఁ బ్రణయగంధముతో సవిలాసభూతితో
విరచన సల్పి కావ్యముల వెల్లువఁ బెట్టి రసజ్ఞశేఖరుల్
పరువులువారఁ గూర్చుఁడు ప్రభావముఁ జాటుఁడు గాని వక్రపుం
దెరువునఁ బోయి గ్రామ్యముల తీరును గేరుచు నవ్వులాటకుం
దరి యగు బాసతో నెలుకదానివిధంబున సింగిమాడ్కి క
క్కురితికి విజ్ఞపీగుటకుఁ గూలికి గాలిపదంబు లల్లి య
బ్బురమగు మీయశమ్ము వృథపుచ్చకుఁ డిప్పు డసాధ్య మేది భా
స్కరకిరణంబు సోకని ప్రకాశవిహీనతలంబులోపలం
జొరఁబడి తద్రహస్యముల సూటిగఁ బల్కఁగలారు మీరు మీ
సరి మఱి యేరు లేరు పరజా పడి నిద్దుర నున్న జాతి స
త్వరముగ మేలుకొల్పుడి యుదారత ధీరతఁ దెల్పి త్యాగబం
ధుర మగు జీవితంబుల గతుల్ దలపించి వివేకవీథికిం

డిరుగఁగఁ జేసి జీవితపుఁదీపిని త్యాగమయప్రపంచముఁ
వరుసగ బోధ సల్పి గుణవాదముల న్నవరించు టొప్పగున్
వి[illegible]చన సల్పి మీహృదయవీథుల స్పష్టమొనర్చి వెలుగున్
ద[illegible]మున నున్నవారలకు ధర్మము తెల్పి విధంబు లగ్గగున్
వ[illegible]ము లొసంగి శారద శుభమ్ముల మీపయిఁ గ్రుమ్మరింపఁ బూ
సరు లరుతన్ ఘటించి సరసం బగు వాణుల పౌరులెల్ల మి
మ్మరిమురి గౌరవింప మరియాదలు చక్కఁగఁ జిక్కఁబట్టి యాం
త[illegible]గత దేవదేవునిఁ బ్రధానముగా వివరించి యాస్తిక
స్తరమును మాయనీయక యథామతి సేవ లొనర్చ రయ్య! యా
పరముఁ దనంతభద్రములఁ బ్రాప్తిలఁ జేయుత మీకు నెప్పుడున్.

# శ్రీ మాత

శ్రీ రాజనాల రామసుబ్బయ్య శాస్త్రి



అమ్మా! నీచరణారవిందమకరందాస్వాదనానంద మీ
వమ్మా, దీనుడ, మంత్రతంత్రవివిధధ్యానాత్మయోగార్తి లే
దమ్మా, నీకడ దబ్బరల్ వలుకగా నోనా, మహాకాళి దు
ర్గమ్మా, నీదయ జూపి కావ దగు నో కామాక్షి- కాత్యాయనీ!

మానస మెల్లకాల మనుమానము లేక వచింతు నీ పద
ధ్యానమె గోరుచుందు, నిది తథ్యము, నిశ్చలతత్వనిష్ఠమై
గానను కాలముం గడుప కారణ మేమొ వచింపలేని య
జ్ఞానము పారద్రోలి నను గావగ ర మ్మఖిలార్థసాధనీ!

ఈదితి నేబదేండ్లవర కెట్టులో యీభవసాగరంబు నే
డేదియొ, యార్తి మానసము, నెప్పుడు దా గలగుండు వెట్టు నీ
పాదము లంటి మ్రొక్కెదను పావని! నీకరుణామృతంబు నా
మీద ననుగ్రహించి కడు మే లొడగూర్పు మొసంగి నెమ్మదిన్.

జననీ! లోకమునందు నీసుతులు వాక్చాతుర్యధుర్యుల్ సదా;
నిను గీర్తింపుచు నుందు రేను జడుడన్ నేర్వ న్నినున్ గొల్వ నా
యనుమానంబుల బారద్రోలి సత మాహ్లాదంబు న న్గూర్చి ధ
న్యునిగా జేయుము; తల్లి దుష్ట యగునా? యోగీశ్వరీ- శ్రీశివా!

చండుని ముండు నిర్జ నజాకి సాకితి వంట జగంబు నాడు దో
ర్దండము లెత్తి మ్రొక్కెదను దాంతియు శాంతి యొసంగి మేనిలో
నుండిన వైరివర్గముల నొంచి యహీనకృపాకటాక్షముల్
రెండవసాటి లేదు ప్రసరింపగ జేయుము తల్లి, యీశ్వరీ!

కాం

పలుకఁగ రాని మాత్ర మది బాయక నామననమందు నెప్పుడున్
గిలుకుచునుండు సందియము కేవల మీపదపద్మసన్నిధిన్
తెలిపి ప్రశాంతతన్ బడయు ధీయుతు డౌదు నటంచు నెన్నియో
కలలను గందు కాని యధికారము చాలద దేల తల్లిరో!

తలఁచిన యంతమాత్రమున దైన్యము వాపెద వంచు నెందఱో
తెలుపఁగ వింటి నేటి కఱుదేఱఁగ గల్గెను నిన్ను జూడఁగా
తలపున గల్గు దోసముల తత్త్వ మెఱింగి యడంచి యెన్నడున్
కలుగని నిర్మలత్వ మిడి కావఁగ రావలె నేడు తల్లిరో!

తడవులబట్టి నాహృదయతాపము నేఱికి జెప్పలేదు; నా
యెడగల ప్రేమమూర్తి వని యెంచితి దాపరికంబు లేదు నా
జడమతి నీకృపామహిమ చక్కనిమార్గము వట్టి వోవగా
నుడివెద చిత్తచాపలము - నూల్కొనజేయు వివేకవర్ధనీ!

వాత్సల్యమ్మున నీవు జీవతతులన్ వాలాయముం గూర్చుచున్
వత్సా! రమ్మని చేఱజీరి యభయావస్థానముం గూర్చి నీ
యుత్సంగమ్మున జేర్చి చే నిమిఱెనన్ ఊర్జస్వియా వాడు; శ్రీ
వత్సుం డౌదును, సర్వకాలమును నీవాత్సల్యముం గోరుదున్.

# చాణక్య ప్రతిజ్ఞ

శ్రీ బి. యేలియ



గల గలంబారు తెలివాకగట్టుపైని
మట్టమధ్యాహ్న మాషాఢమాసమందు
పాటలీపుత్రపురివంక బాటసారి
శీవిమై నొంటిపాటునఁ బోవుచుండె.

మేన నిందీవరమ్ముల మిసిమిదోప
శాంతసుందరబ్రహ్మతేజమ్ము వదన
మండలము నాక్రమింపగా మకరకుండ
లముల కాంతులు గండభాగమునఁ గ్రాల
పేరురమ్మున రుదురాకపేరు వ్రేల
నెన్నొసటఁ ద్రిపుండ్రమ్ములు నెలకొనంగ
లోచనమ్ముల నున్నతాలోచనములు
గ్రమ్ముకొన నేగుచుండె పరాకుతోడ.

ఒక్క కేల కమండలు వొక్క కేలఁ
దా రచించిన యర్థశాస్త్రమును బట్టి
మండుటెండకు పదములు మండుచుండ
చకచకన్ పుష్పపురిదారి చనుచునుండె.

కడువడి నేగువాని యర
కాలను నాటెను దర్భముండ్లు, వె
ల్వడె రుధిరంపుబిందువుల
వారిగ పాదమునుండి వేగమే
వెడలెను, నాసికాగ్రమున
వెచ్చనియూర్పులు మచ్చరంబుతో
వెడలెను లోచనమ్ముల, న
వేలరుషాపరుషారుణద్యుతుల్.

క్రోధ ముప్పొంగ వేవేగ కుశ వెకల్చి
హుతవహజ్వాలలందు నాహుతి యొనర్చి
భసితమును చేత గల జలపాత్ర గలిపి
గటగటం ద్రావె నాతని కక్ష దీర.

అంగియున్ బైని మేల్పట్టుటంగరఖయు
తొడిగి సరిగంచు శాలువ కుడిభుజమున
వల్లెవాటుగ వేసి యావంక వచ్చు
శూరు దొకరుండు విప్రునిఁ జూచి మ్రొక్కి

స్వామీ! యే మది పుక్కిలించెదరు, భ
స్మద్రవ్యమే హవ్య మా
నేమో మీచెయి సోకి, యీవెలుఁ గయా
రే, వేదశాస్త్రాళి మీ
రామూలాగ్ర మెఱుంగుటం దెలిపె; మం
త్రాంగప్రవీణత్వమున్
మోమే చెప్పక చెప్పె, మీ రెవరయా
పుంభావవాగ్దేవతల్.

తరుణ దడుగంగ వచియించె ధరణిసురుఁడు
బూదియైనట్టి యీదర్భముండ్లు నాదు
పాదకీలాలమున కాశపడిన కతన
కసిమసంగియు మొదలంటఁ గాల్చినాడ.

కంటకము గాదు నా కపకారి యైన
రాక్షసేశ్వరు నైన రారాజు నైన
లావు గల చతురంగబలాల నైన
పగను సాధింతు నామంత్రబలముచేత.

శాం తి

సార్వభౌముల మహాసచివాగ్రణుల గన్న
తెలుగురారాణి ముద్దులసుతుండ
తక్షశిలాపురీశిక్షితవేదవే
దాంగప్రవీణవిద్యార్థివరుడ
కాశికానగరి దిగ్దంతిపండితసభన్
విజయపట్టము గొన్న వేదవిదుడ
విహగరాజమ్ముల విషధరేంద్రమ్ముల
మచ్చికం జెంచెడి మంత్రధనుడ

అర్థశాస్త్రప్రణేత నై యత్యపూర్వ
కీర్తికేతనమును హిమగిరులనాట
జైత్రయాత్రను సాగింప శంఖమొత్తి
బయలుదేరిన చాణక్యపండితుడను.

చాణక్యుం డనుపేరు కర్ణములకుఁ
సంతోషముం గూర్పగా
ద్రోణాచార్యసమానతేజునకుఁ జే
తుల్ మోడ్చి, 'నే మౌర్యుడన్
ప్రాణమ్ముల్ వికసించె. మిమ్ము గను నా
భాగ్యమ్ము వర్ణింప, గీ
ర్వాణుల్ చాలరు, చంద్రగుప్తుడను నన్
రక్షింపు మిప్పట్టునన్."

అని చాణక్యుని పాదపద్మముల క
త్యాసక్తితో మ్రొక్కు నా
తని బేర్మిం గని, ధర్మశీలుర కసా
ధ్యం బేమి టన్నా ! మహా
ఘనతం జెందిన మీపితామహుని స
ద్గాథావళుల్ వింటి నోఁ
యనఘా ! నీకు శుభంబు చేకురు నటం
చాశీర్వదించె న్వడిన్.

దీవెనల నంది హృదయ మెంతేని పొంగ
వినయవినమితగాత్రుడై వృషలు డంత
కనుల నానందబాష్పముల్ గ్రమ్ముచుండ
హస్తములు మోడ్చి మెల్లన ననియె నిట్లు,

నేడు సుకల్పనందధర
జీధవుజన్మదినోత్సవమ్ముచే
వేడుకమీరె పట్టణము,
వెల్గె మణీమయతోరణాలతోఁ
గూడి సువర్ణసౌధములు,
కోటలపై విజయధ్వజమ్ము లా
టాడె, సుమించె మూడుపువు
లాబు కాయలుగాఁ దదున్నతుల్.

వేదపారగుల్ పదివేలవిప్రవరులు
ధర్మశాలకు నందభూధవులతోడ
విందు భుజియింప వత్తురు వేడ్క మీర
మీర లాతిథ్యమున కట చేర రండు."

మౌర్యచంద్రగుప్తుమాటలు విన్నట్టి
విష్ణుగుప్త హృదయవీథియందు
వెనుకబోవు తీవె పదముల పెనగొన్న
చందమయ్యె సంతసమున దేలె.

నా కపకార మేమియు నొ
నర్పని నందనరేంద్రులం గసిం
జైకొని రూపుమాప, నప
వాదగు, లోకులు కాకు లైరి, యే
పాకున మంత్రిరాక్షసు వి
శాలయశోనిధి గెల్వజూతు నం
చాకులపాటు జెందుచు, ర
యంబున జేరెను పాటలీపురిన్,

పుష్పాటలీ ప్రత్నగరిశృంగాటకమున
గల సమారాధనంపుటంగణము జేరి
స్నానమొనరించి భోజనశాల జొచ్చి
కాంచె పదివేల భూదేవగణము నచట.

వెండిపీటల గూర్చున్న విప్రవరుల
చెంత నవరత్నఖచిత మై కాంతు లీను
స్వర్ణపీఠ మ్మొసంగెను స్వాగతమ్ము
నార్యచాణక్యపండితుం డతిథి యనుచు.

వేదవేదాంగపారీణవిప్రవరుడు
దక్క వేరొక్క డీగద్దె నెక్కరా ద
టంచు తద్విప్రనిచయమధ్యమ్మునుండి
పల్కె నొకవ్యక్తి యవ్యక్తఫణితితోడ.

మేరుగిరిశృంగముల వెల్గు లారబోయు
భాను డన వెల్గె నయ్యాంధ్రపండితుండు
అనుజులు పురోహితామాత్యు లనుగమింప
విందుశాల ప్రవేశించె నందరాజు.

అవనిపతిరాక జూచి బ్రాహ్మణులు లేచి
స్వస్తివాక్యము లల్లన జదివినారు
కుందనపుటాసనంబున గూరుచుండి
తొణక కాశీర్వదించె నచ్చణకుపట్టి.

డంబముతోడ పుత్తడిబె
డంగుజరీపయిపంచె జీరి యా
డం బగడాలదండలు మె
డం దనరార, పురోహితప్రభువుం
డంబరవీథి దృష్టినిడి,
హా ! యని చేష్టలు దక్కి నిల్వగా
పంబిన మచ్చరంబున, నృ
పాలునితమ్ముడు పల్కె నల్కమై.

"ఔరా ! మాసుబంధులవారియాసనమున
గూరుచుండగ నీ కెంత గుండెదిటవు
కాక మారాక గాంచియు గౌరవమున
గద్దె నైనను దిగ వెంత కావరంబొ."

అన, చాణక్యుడు, కాశికానగరవి
ద్యాపీఠవిఖ్యాతి నం
దినవిద్వద్గజసింహ మీపసిడిగ
ద్దెన్ కోరి కూర్చుండ, కా
దనగా జెల్లునె, యర్థశాస్త్రకృతిక
ర్తన్, నన్ను గెల్వంగ జా
లిన, యుద్దండులు గల్గ రం దనుచు ప
ల్కెన్ శాంతగంభీరతన్.

అర్థశాస్త్రంపురచయిత నన్న పల్కు
విన్న రాక్షసుగుండె గుభిల్లు మనెను
జేనిచెంతకు జేరి వారింప జూడ
నంతలో పల్కె భూమీశు డాగ్రహమున.

ఎట్టులైనను మాపురోహితుల తప్ప
నొండొరులు గద్దెపై గూరుచుండ దగరు
విప్రకులతిం గొన్న బహువేదవేత్త వైన
వైళమే పీఠముం దిగవలయు ననెను.

అత్తరి నందభూధవుని
యాగ్రహముం గని, మల్లనాగవి
ప్రోత్తము డున్నతాసనము
నుండి చలింపక పల్కె నిట్టు "లి
య్యుత్తమవేదపీఠమున
కున్న మహోన్నతకీర్తి బాప, మీ
చిత్తము వచ్చినట్టుల ని
సీ ! వచియింపగ న్యాయ మౌనొకో,

ఇది సుబంధులగద్దె యం చిప్పు దైన
వ్రాసియుంచుడు నేను సత్వరమె లేతు
పేరుగల మహాబ్రాహ్మణపీఠ మిద్ది
అష్టాదను నేనె దీనిపై నధివసింప

ధర్మమును రాజు పాలింపఁ దగును గాని
స్వేచ్ఛగా శాసనముఁ జేయ చెల్ల దెపుడు
పాడిదప్పుట స్వపతికి కీడటంచు
పక్షిలస్వామి పల్కెను పరుషముగను,

మగధసామ్రాట్టు విప్రునిమందలింపు
లకు, మహోదగ్రరోషోజ్వలజ్వలితమ
తిని పలికె, నీ ద్విజన్మ గద్దెపయినుండి
త్వరితముగ లాగి శిరమును తరుగు డంచు,

అరయంగా మును వారణాసిపురమం
దాంధ్రోర్వికీ ర్తిద్యుతుల్
విరియం బ్రహ్మరథంబు నెక్కిన మహా
విద్వన్మణీ జై యటం
చరవిందాక్షులు జల్లు పుష్పముల పూ
జ్యం బైన తజ్జూట మొ
క్కరు డొక్కమ్మడి పట్టి లాగె నకటా!
కాలాహి నర్గించె నాన్

మిసము ల్లాగ గర్జించు కేసరి యన
వాలముం ద్రొక్క బుసకొట్టు వ్యాళ మనగ
ఉత్తరాయణకాలమం దుగ్రకిరణ
చండకిరణుండు నా నొప్పె చణకసూతి.

విడిన శిఖ నల్లత్రాచునా వ్రేలుచుండ
కనకన మటంచు నిప్పుకల్ కనుల రాల
ముకుపుటమ్ముల నూర్పులు ముమ్మరింప
నృపులు భీతిల్ల సభ దద్దరిల్లఁ బలికె,

''విం దై వచ్చిన నా కవజ్ఞ నిడి రీ
విశ్వాసఘాతాత్మకుల్
నందుల్, వీడినకేశపాశము మహా
నాగేంద్ర మై, వీరలన్
మ్రందింపన్, పరరాజుచే మగధసా
మ్రాజ్యమ్ము నేలింతు, నే
నందాకన్ నిదురింప, చూచెదరు లెం
డస్మత్ప్రతిజ్ఞాప్రభల్.''

# శాంతి

## శ్రీ వసంతరావు వేంకటరావు



«ఏమండీ!»

«ఏం?»

«ఇప్పుడేం సందేహ మొచ్చిందిట?»

«అన్నీ సందేహాలుగానే ఉన్నాయి. ఇన్ని సంవత్సరాలబట్టి మీతో చర్చిస్తూన్నప్పటికీ చర్చ పూర్తికాగానే కలిగిన విశ్వాసం నిలబడక, కొంతకాల మయేసరికి సందేహాలకు తావిస్తూందండీ! ఈయుక్తియుక్తవిచారణను ఎందుకు అభ్యసించేనా అని ఒక్కొక్కప్పుడు వాపోతాను సుమండీ.»

«అవసరం లేదు. విశ్వాసం కుదరడం కష్టం, అది క్షీణించడం సులభం. నాకే ఒక్కొక్కప్పుడు కుశ్శంక కలిగి హృదయాన్ని కలచివేస్తుంది. తర్కప్రవంతికి ఎదురీదలేక, ఆతర్కాన్ని మనస్ఫూర్తిగా అంగీకరించలేక, విషమావస్థలో క్రుంగినరోజులు ఇప్పుడుకూడా తటస్థిస్తూంటాయి. సరే, ఇప్పుడు నీకు కలిగిన సందేహ మేమిటో?»

«ఈ ఉదయం పూజచేసికొంటూంటే ఒకభావం హృదయంలో జొరబడింది. 'భగవంతు డొక్కడేకదా, అయితే బహురూపాలలో ఎందుకు ఆరాధించాలి' అన్న ప్రశ్న యాదృచ్ఛికంగా ప్రత్యక్షమై, పూజ నిరర్థక మనిపించిందండీ. ఎంత వద్దనుకొన్నా ఆభావం హృదయాన్ని పీడిస్తూ పూజకు అంతరాయం కలిగించింది. అప్పటినుండి హృదయం స్థిరపడలేదు.»

«బోధపడింది. ఈ సందర్భంలో ఒక్క ముఖ్యవిషయాన్ని జ్ఞాపక ముంచుకోమన్నాను. ఇట్టి సందేహాలు తీర్చుకోడానికి ప్రయోగాలు ఉపకరించవని ఎన్నోసార్లు గమనించేము. ఆధ్యాత్మికక్షేత్రంలో ప్రత్యక్షానికి స్థానం లేదు. తెలిసిన సత్యాల నాధారంగా చేసికొని, హేతువాదంతో కొంతవరకు, ఉపమానాలసహాయంతో మరికొంతవరకు ఆత్మజ్ఞానాన్ని సంపాదించాలి. ఒక్కవిషయం యోచించు. కొన్నిసందర్భాలలో మనం చేసేపనులని విమర్శించుకోవాలని తోచనే తోచదు. ఒకపద్ధతికి లోబడి పనులు చేస్తూంటాము. చీకటిలో నున్నప్పుడు అప్రయత్నంగా లైటుస్విచ్చిని నొక్కుతాము. ఉక్కిరంగా నున్న సమయంలో ఫాను వేసికొంటాము. బట్టలు ఇస్త్రీ చెయ్యవలసివచ్చినప్పుడు ఇస్త్రీపెట్టెనే వాడుతాము. నీళ్లు కాచుకోవాలంటే హీటర్‌ని వినియోగిస్తాము....»

«ఈ పనులు చెయ్యడానికి యోచించడ మెందుకండీ? పొరపాటున చీకటిలో ఒకప్పుడు ఫానుస్విచ్చికి బదులుగా లైటుస్విచ్చి నొక్కుతామేమో కాని, తెలిసి అట్టిపొరపాటెవరు చేస్తారు?»

«నిజమే. దాని అంతర్యాన్ని గ్రహించలేదని నీకు చెప్పడానికే ఈ ఉదాహరణను ఎంచుకొన్నాను. భౌతిక విజ్ఞానిని అడిగితే విద్యుత్తునుగురించి కొన్ని అభిప్రాయాలు ప్రకటిస్తాడు. లోహపుతీగలలో విద్యుత్తు ప్రవహించినప్పుడు తీగవెంబడి ఎలక్ట్రానులు ప్రవహిస్తాయని చెప్తాడు. ద్రవంలో విద్యుత్ప్రవాహమంటే అయానుల ప్రవాహమంటాడు. విద్యుత్తు ఒకే ఒకశక్తి. దానిని మనం అనేక విధాలలో వినియోగించుకొంటున్నాము. సన్నటితీగలో నుండి ప్రవహించినవిద్యుత్తు కాంతి నిస్తుంది; తీగచుట్టలో నుండి ప్రవహించినప్పుడు గాలి వీచేటట్లు పనిచేస్తుంది. మధ్యరకంతీగలోనుండి ప్రవహించినప్పుడు వేడినిమాత్ర మిస్తుంది. అంటే ఒకవిద్యుత్తు ఇన్నివిధాల నుపయోగపడుతూందే అన్నభావం నీకు కలగలేదు. అందులో విశేషం కనిపించలేదు; అది ఆశ్చర్యకర మని తోచలేదు. కాని, ఒకేభగవంతుడిని వివిధరూపాలలో ఆరాధించడమంటే నీ తర్కం సహించలేకపోతూంది.»

«ఈ రెండూ ఒకటే నంటారా?»

«కాదా? ఒకే శక్తిని వివిధయంత్రాలలో ప్రవేశపెట్టి వివిధ కార్యాలకు భౌతికంగా ఉపయోగించుకొంటున్నాము కదా! విద్యుత్ ప్రవాహానికి కలిగే నిరోధాన్నిబట్టి, దాని నావరించిన క్షేత్రంయొక్క లక్షణాన్నిబట్టి దానిఫలితం కనిపిస్తుంది, వేరువేరు ఫలితాల నిస్తుంది. అదేవిధంగా ఒకవిగ్రహాన్ని విద్యకు అధిదేవతగాను, మరొకదానిని ధనానికి, ఇంకొకదానిని బలానికి అధిదేవతలుగా భావించడంలో అర్థం లేదంటావా?»

«వాదానికి మీరు చెప్పింది బాగుంది కాని, నాలుగైదు విగ్రహాలనో పటాలనో తెచ్చి, వాటిని లక్ష్మి, సరస్వతి, రాముడు, ఆంజనేయుడు, కృష్ణుడు అనుకొని పూజించినంతమాత్రాన్న వివిధ ఇష్టకామ్యాలు సిద్ధిస్తాయంటే నమ్మడానికి మనస్కరించడం లేదండీ. విద్యుత్ పరికరాలలో భాగా లుంటాయి. వాటిలో మార్పు కలిగించినప్పుడు ఫలితంకూడా మారుతుంది; అది సమంజసమే. కాని, విగ్రహంయొక్క రూపం మారినంతమాత్రాన్న దాని నుండి లభించే ఫలితంకూడా మారుతుందని నమ్మడం ఎట్లాగండీ?»

«తెలిసినవిషయాల నాధారం చేసికొని ప్రత్యక్షంగా ఋజువుచేయలేని విషయాలు నమ్మకతప్పదు; వేరొకమార్గం లేదు. విశ్వాసం కోల్పోయిన మనస్సులో తిరిగి విశ్వాసాన్ని నెలకొల్పాలంటే సులభం గాదు; యథోచితంగా ప్రయత్నించినప్పుడు కష్టమూ కాదు. విద్యుద్విషయంలో నీకు తెలుసునని భ్రమపడుతున్నావు. ఆభ్రమ కైనా ఆధార మున్నట్లు నీకు నమ్మక ముంది. విగ్రహాలసందర్భంలో వెలుగు కనుపించలే దంటావు. మరొకవిధంగా యోచించు. మంత్రా లున్నాయి. ఒక్కొక్క దేవతను ఆరాధించడానికి ఒక్కొక్క మంత్ర ముంది, ధ్యానశ్లోకా లున్నాయి. ఏదైనా చదివినప్పుడు ధ్వనిని కలిగిస్తాము, అదే శబ్దం. మానసికంగా పఠించినప్పుడు శబ్దం వినిపించదు కాని, సామాన్యంగా మనం గుర్తించలేని శక్తి కలుగుతుంది. అది అనుభవంవల్ల తెలుసుకోవాలి కాని, భౌతికవిజ్ఞానంలో సాధ్యమైన ప్రయోగాలవంటి ప్రయోగాల మూలంగా నిరూపించలేము. అట్టి నిరూపణకు భౌతిక విజ్ఞానం ప్రయత్నించలేదో, లేక, ప్రయత్నించినప్పటికి జయం పొందలేదో చెప్పలేను. ఏమైనప్పటికి, మానసిక శక్తిని గుర్తించే సాధనాన్ని ఇంతవరకు భౌతికవిజ్ఞానం కని పెట్టలేదు. కాని, మానసికశక్తినిమాత్రం అనుభవపూర్వకంగా గుర్తించిన విజ్ఞాను లున్నారు. నోబెల్ బహుమానం పొందిన ఎలెక్సిస్ కారెల్ (Alexis Carrel) అంటాడు:» దూరదృష్టి (Clairvoyance) భావసంవేదనం (telepathy) కూడా వైజ్ఞానిక పరిశోధన యొక్క ప్రాథమికసామాగ్రి. ఈశక్తి గలవారు పంచేంద్రియాల నుపయోగించవలసిన అక్కర లేకనే ఇతరుల రహస్యభావాలను గ్రహించగలరు. కాలంలోను ఆకాశంలోను దూరంగా నున్న సంఘటనలను వారు దర్శించగలరు. దూరదృష్టిగల వారికి అదొక సామాన్యవిషయంగానే స్ఫురిస్తుంది. పంచేంద్రియాలనుండి లభ్యమయ్యే జ్ఞానంకంటె నిశ్చితమైన జ్ఞానాన్ని దూరదృష్టి సంపాదించిపెట్టుతుంది. మానవుల ముఖపరిశీలనకంటె సులభంగా వారిభావాలను తెలిసికో గలడు దూరదర్శకుడు....పంచేంద్రియాలవల్లనే కాక ఇతర మార్గాలలో బాహ్యప్రపంచజ్ఞానం మానవునికి కలుగ వచ్చును. వ్యక్తులు చాలా దూరంగా నున్నప్పటికి ఒకరి భావాలు మరొకనికి ప్రసరింపవచ్చును. నవీన ఆధిభౌతిక శాస్త్రానికి చెందిన ఈవిషయాలను యథాతథంగా అంగీకరించాలి. వాస్తవికతలో ఇదొకభావం. మానవుని అపూర్వము అజ్ఞాతము నైన ఒకభాగాన్ని అవి వివరిస్తాయి. భౌతికప్రపంచంపై మన కధికారమిచ్చిన బుద్ధి సామాన్యమైనది కాదు. బహుముఖాలుగా నున్న బుద్ధియొక్క ఒక ముఖమే మన మెరుగుదుము. కళాశాలలలోను, విశ్వవిద్యాలయాలలోను దానినే అభివృద్ధి చేయ ప్రయత్నిస్తాము....» ఇంత నిష్కర్షగా మానవబుద్ధివిశేషాలగురించి మహావిజ్ఞాని ప్రకటించలేదు.»

«నోబుల్ బహుమానం పొందిన విజ్ఞాని అశాస్త్రీయంగానున్న భావాలవంటిభావాలను వెలిబుచ్చుతాడా?»

«ఇప్పుడు విజ్ఞానలోకంలో నున్న పెద్దప్రశ్న యేమిటంటే: ఏది శాస్త్రం? ఏది అశాస్త్రం? అని. విజ్ఞానం యొక్క అవధులు విపరీతజవంతో పెరిగిపోతున్నాయి.

ఏవిషయమైనా నిష్కర్షగా చెప్పగలమా అంటే సమాధానం కనిపించడం లేదు. ఎప్పుడో భర్తృహరి చెప్పిన స్థితిలో నేటివిజ్ఞాని డోలాయమానంగా నున్నాడు:

"తెలివి యొకింత లేనియెడ
తృప్తుడనై కరిభంగి సర్వమున్
దెలిసితి నంచు గర్వితమ
తిన్ విహరించితి దొల్లి, ఇప్పుడు
జ్ఞులమతులైన పండితుల
సన్నిధి నించుక బోధశాలి నై
తెలియనివాడ నై మెలగి
తిన్ గతమయ్యె నితాంతగర్వమున్"

తనపరిమితత్వాన్ని గ్రహిస్తున్నకొద్దీ తనప్రత్యేక తర్కం నిరర్థక మని బోధపడుతూంది. శతాబ్దాలనుండి శ్రమించి నిర్మించిన విజ్ఞానసౌధాలు అంతగా వాసయోగ్యాలు కావని తెలిసికొంటున్నాడు. పంచేంద్రియాలతో విశ్వరూపాన్ని దర్శించే భాగ్యమే లేదని గ్రహిస్తున్నాడు. ఇంద్రియాతీతమైన జ్ఞానానికి ఎక్కువ ప్రాధాన్యమిస్తే కాని జగత్స్వరూపం తెలిసికొనే అవకాశమే లేదని గుర్తిస్తున్నాడు. ఇంతకూ, మానవుడు మానవుడుగానైనా జీవించలేకపోతే, అధికారదురహంకారానికి దాసుడైతే, అరిషడ్వర్గాలను జయించలేకపోతే శాంతిరహితమైన ప్రపంచంలో ద్వేషపూరితహృదయంతో నిరంతర ప్రచ్ఛన్నయుద్ధావస్థలో జీవితం గడపవలసివస్తుంది మానవాభ్యుదయానికి వినియోగించవలసిన విజ్ఞానం వినాశానికి దారితీస్తుంది.

"భౌతికవిజ్ఞానం ఎంతపురోగమించినప్పటికీ ప్రకృతిని వశంచేసికోలేదు. మానవుడు. జలవాయుతేజశ్శక్తులలో ఏఒక్కశక్తి విజృంభించినప్పటికి మానవజాతి దాని నెదుర్కొనలేదు. జాతికి క్షేమాన్ని కూర్చేది భౌతిక విజ్ఞానం గాదు ఆంతరంగిక విజ్ఞానం. మానవుని అంతరంగం పరిశుద్ధమైనకొద్దీ ప్రపంచంలో సంఘర్షణలు క్షీణిస్తాయి. ఒక్కవిషయం ఆలోచించు. విద్యుత్తరంగాలు మనకంటికి కనిపించవు. అదృశ్యమైన శక్తితరంగాలు కోట్లకొలది మనల నంటకొని ఆవరించిఉన్నాయి. వాటిని రేడియోలు గుర్తించగలవు, రేడియో టెలిస్కోపులు గుర్తించగలవు. యథార్థంగా మనం శక్తిసాగరంలో మునిగివున్నాము. ఎటుచూచినా అలలే! అయితే అవి మనభౌతికనేత్రాలకు గోచరించవు. యంత్రాలసహాయంతో వాటిని గుర్తిస్తారు. 8¾ లక్షలమైళ్ళు వ్యాసంగల గోళంగా భౌతికదృష్టికి గోచరించు సూర్యగోళమే రేడియోతరంగాలదృష్టికి 15 లక్షలమైళ్ళ వ్యాసంగల గోళంగా వ్యక్తమౌతుంది. నక్షత్రాలు లేని నిర్మలాకాశభాగాలలో కాంతిరహితములైన నల్లటి నక్షత్రాల నెన్నిటినో రేడియోటెలిస్కోపులు గుర్తిస్తున్నాయి. శక్తిసముద్రమధ్యమం దుండికూడా ఆ శక్తిని మనం వినియోగించుకొనలేకపోతున్నాము.

"మనస్సు మహాద్భుతమైన యంత్రమని విజ్ఞులంటారు. దానిని రేడియోవలె కాని, రేడియోటెలిస్కోపు వలె కాని పనిచేయించగలశక్తిని సంపాదింపవచ్చునని తత్త్వవేత్త లంటారు. బాహ్యశక్తులపై ఆధారపడినంతకాలం మానవసంఘంలో సంఘీభావం పెంపొందదు మారణాస్త్రాలనే తమబలానికి కొలబద్దగా భావించినంతకాలం మానవజాతికి ప్రమాదం తప్పదు. బుద్బుదప్రాయమైనజీవితంలో ఏఆశయాలు మానవాభ్యుదయానికి సహకారకాలో నిర్ణయించుకోవాలి.

"మంత్రంగురించి ప్రస్తావిస్తున్నాము కదా. మంత్రం యొక్కశక్తిని భౌతికవిజ్ఞానం నిరూపించలేకపోయినప్పటికి అనుభవపూర్వకంగా దానిసామర్థ్యాన్ని గమనిస్తున్నాము. పాముమంత్రమే తీసికో."

"అవునండీ. ఆరోజున 9 నెలల పసికూనను పాము కరిచింది. శరీరమంతా ఎర్రగా మారిపోయినా, నురగ లుకారినా మంత్రం వెయ్యగానే హాయిగా ఆడుకొనమొదలుపెట్టింది."

"ఇట్టివి ఎన్నెన్నో తార్కాణాలున్నాయి. అయినప్పటికి భౌతికవిజ్ఞానం మంత్రాలశక్తిని సహేతుకంగా వివరించలేకపోయిం దని వాటిని మనం తృణీకరిస్తున్నామే కాని, వాటిసామర్థ్యాన్ని కళ్ళార చూస్తున్నా ఆశక్తిని సంపాదించడానికి ప్రయత్నించి లాభం పొందలేకపోతు

న్నాము. మనస్సుకి సంబంధించింది మంత్రం. మనశ్శాస్త్రంలో కృషిచేస్తున్న భౌతికవిజ్ఞాని ఇంతవర కెట్టిఫలితాలను పొందలేదు. వానిమార్గమే సరియైనది కాకపోవచ్చు. ఆత్మశక్తిని సంపాదించిన వ్యక్తినుండి ఏదోవిధమైన శక్తి వెలువడుతుంది. దానిని గుర్తించగలిగితే ఒకమెట్టు ఎక్కినట్లే. ఇక, మంత్రాన్ని పురశ్చరణ చేసినప్పుడు విశ్వశక్తులనుండి క్రమక్రమంగా జపితి శక్తిని గ్రహిస్తావని భావించాలి. పదేపదే అపథంగా ఆర్జించి భద్రపరచిన శక్తిని అవసరమైనప్పుడు వినియోగిస్తా దనుకొంటే నీతిరాక్యానికికూడా భంగం లేదు.»

«ఆవిధంగా భావించడానికి ఆధార ముందంటారా?»

«అనుభవంకంటె, ఇప్పటికి, వేరొక ఆధారం లేదు. నీకా అనుభవం కలిగితే నమ్ముతానంటావు. కాని, దానికైనా శ్రమించాలి. భౌతికవిజ్ఞాను లెట్టి మనశ్శుద్ధితో నిర్విరామంగా కృషిచేస్తున్నారో గమనిస్తే నీమనస్థితి మార్చుకోగల అవకాశం కనిపిస్తుంది. ఒక్కొక్క ప్రకృతిరహస్యాన్ని కనుగొనడానికి జీవితాలర్పించినవిజ్ఞాను లున్నారు. జ్ఞానార్జన మాటలతో సాధ్యంగాదు. ఇంతకూ ఒక్కసత్యం గమనించాలి. పంచేంద్రియాలతో గుర్తించగల శక్తిద్రవ్యాల నాధారంచేసికొని భౌతికవిజ్ఞాని పరిశోధనచేస్తాడు. అయినప్పటికి వస్తుస్వభావాన్ని పూర్తిగా నిర్ణయించలేకపోతున్నాడు. ఎంత సున్నితమైన యంత్రాలు నిర్మించినా ఎంత శక్తిమంతిములైన పరికరాలను పరికల్పించినా ఏకైక సత్య మింకా వెలువడలేదు. ఎక్కడిక క్కడే తన పరిశీలనలను సమీకరించుకొని వాటికి వర్తించే సూత్రాలు ప్రకటిస్తున్నాడు. విరుద్ధంగా నున్న ప్రయోగఫలితాలను సమర్థించడానికై ద్వైతభావాన్ని అంగీకరించేడు. ప్రకృతిలో గోచరించు బహుధానేకత్వంలో ఏకత్వాన్ని దర్శించడానికి కృషిచేస్తున్నాడు. భౌతికప్రపంచజ్ఞానాన్ని సంపాదించే సందర్భంలో పంచేంద్రియాలు నిరర్థకమైన ఉపకరణాలని గ్రహించేడు. ఆ జ్ఞానానికి పరిమితమై యున్నంతవరకు పరమసత్యం జ్యోతించదనికూడా తెలిసికొన్నాడు. నీవు అనుగమిస్తున్న తర్కమార్గాన్ని విడిచిపెట్టి బహుదూరప్రయాణం చేసేడు.

«జీవితలక్ష్యాన్ని తెలిసికోడానికి సామాన్య భౌతిక విజ్ఞానం తోడ్పడదు. శక్తిద్రవ్యాల యథార్థస్థితిని ఊహించకలిగితే ఏది నిజం అనే భావం పీడిస్తుంది. ద్రవ్యంలో గట్టితనం లేదంటాడు విజ్ఞాని. ద్రవ్యమంతా పరమాణువుల సమూహమైతే, పరమాణువులో నున్నవి విద్యుత్కణాలు. అవైనా కణాలో శక్తిపుంజాలో చెప్పలేము. ఒకప్పుడు కణాలలాగ మరొకప్పుడు శక్తిపుంజాలలాగ ప్రవర్తిస్తాయి. అందుచేత ద్వైతభావాన్ని అంగీకరించక తప్పిందికాదు. శక్తివిషయంలోసైతం అట్టి విషమస్థితే ఏర్పడింది. అదికూడా అవసరాన్నిబట్టి కణంగా కాని, శక్తికోశంగా కాని ప్రవర్తించగలదు. ఇక విశ్వం గురించి అంతు చిక్కడం లేదు. కాలానికి ఆకాశానికి ఆద్యంతా లున్నాయా? విశ్వ మెంతవరకు వ్యాప్తమైయుంది? నక్షత్రా లెప్పుడు పుట్టేయి? భూమిలో జీవం ఏవిధంగా ఉత్పన్నమైంది? ఇట్టి ప్రశ్నలకు సమాధానం దొరకలేదు. బ్రతికినంతకాలం ఆదర్శప్రాయంగా జీవించాలంటే కొన్ని విలువలను పాటించాలి. కరుణ, స్వార్థత్యాగం, పరోపకారం, సహకారం, సేవ మొదలైనవి అలవరచుకొంటే మానవుడు సంఘానికి ఉపయోగపడతాడు. స్వోత్కర్షకే ప్రాధాన్యమిస్తే సంఘాన్ని విచ్ఛిన్నం చేస్తాడు. భౌతికవిజ్ఞానపులోతులు తెలియనివారికి అహంకారం పెరుగుతుంది: తెలిసినవారికి ఆత్మజ్ఞానం పెంపొందుతుంది.

"జీవంతో పుట్టింది యుద్ధం. యుద్ధా లున్నంతవరకు శాంతి కలుగదు కదా! యుద్ధనివారణావశ్యకతను ఆత్మజ్ఞానం ప్రబోధిస్తూండగా మారణాస్త్రసామర్థ్యాన్ని విజ్ఞానం పెంపొందిస్తూంది. సుఖజీవనానికి తోడ్పడుతూన్న భౌతికవిజ్ఞానం నిజానికి, మానవహృదయాన్ని సంస్కరించలేకపోతూంది. మానవునికి కావలసింది శాంతికాని సుఖం కాదు. భౌతికవిజ్ఞానం సుఖాన్ని ప్రసాదిస్తే ఆత్మజ్ఞానం శాంతిని ప్రసాదిస్తుంది. ఒకదాని కొలబద్దతో రెండవదానిని కొలవడానికి ప్రయత్నిస్తే లాభం లేదు. ఆపొరపాటు మనం చేస్తున్నాము. అది గమనించి సవ్యమార్గాన్ని ఆశ్రయించాలి.

"యథార్థజ్ఞానాన్ని సంపాదించాలన్న ఆవేదన కలిగినప్పుడు కాని అది లభ్యం గాదు. భగవద్గీత మరొకసారి

చదువు. మనశ్చాంచల్యాన్ని అరికట్టేవిధానాన్ని సూచించమని అర్జునుడు ప్రాధేయపడినప్పుడు భగవానుడు :

అసంశయం మహాబాహో
మనోదుర్నిగ్రహం చలమ్
అభ్యాసేన తు కౌన్తేయ
వైరాగ్యేణ చ గృహ్యతే॥
అసంయతాత్మనా యోగో
దుష్ప్రాప ఇతి మే మతిః।
వశ్యాత్మనా తు యతతా
శక్యోఽవాప్తు ముపాయతః॥

సందియము లేదు మహితభుజాబలాఢ్య!
మనసు నిగ్రహింపబడక మలయు నదియె;
ఐన, కౌంతేయ! పరలయాభ్యాసమునను,
విషయవైరాగ్యమున నడ్డుపెట్టబడును.
చేతనము లోబడనివాని చేత యోగ
మొంద నలవిగాని దని నాయొక్కనిసుకు;
కాని, మతిలోబడి కడగువానిచేత
నలవియగు నొంద, దగు నుపాయంబువలన.

(శ్రీభగవద్గీత గీతలు : 6 - 35, 36)

ఆత్మజ్ఞానం సంపాదించడానికి మొదటిఅర్హత "లోబడిన మనస్సు; ఆత్మవిశ్వాసం. నీవు ఆత్మవిశ్వాసానికి మూఢవిశ్వాసానికి వ్యత్యాసాన్ని గమనించలేక బాధపడుతున్నావు. ఆత్మవిశ్వాసం లేనిదే ఏపని చేయడానికైనా సాధ్యం గాదు. ఆత్మవిశ్వాసంతో కృషిచేసినప్పుడు జ్ఞానం లభిస్తుంది. దానిమూలంగా శాంతి సిద్ధిస్తుంది. ఆత్మవిషయాలలో నీతర్కానికి తావు లేదు. ఈదృష్టితో మరొకసారి ఆత్మను హెచ్చరించుకొని ప్రయత్నించు."

# నైవేద్యము

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య



అంచితభక్తితోడ జనులందఱు పువ్వులు పండ్లనున్ సమ
ర్పించుచు నుండ నే నొకటి రెండు ఫలంబులు నారగింపు సే
యించక చెంతనుండి భజియించెడు నప్పుడు స్వామిచూపు నా
పంచియలోని పండ్లపయి బడ్డది- చప్పున మాటువెట్టితిన్.

తేకువతోడ నేడు గొనితెచ్చిన పండ్లివి నీ కొసంగి నా
రాకకు వేచి వాకిట నిలంబడి చూచుచు "ఏవి పండ్లు నా
న్నా! కొనిరావు నీ వెపుడు నా" కను బిడ్డల కేను నిర్దయా
భీకరమూర్తివోలె గనిపించగ లేను ప్రభూ! నిమేషమున్.

ఎవరో స్వామికి పూజచేయించుచుండ
వెస గుబాళించె నామూట వెలయు పండ్లు;
పండ్లవాసన లెట్లు నాపంగ వచ్చు?
స్వామి కనుదమ్ము లెట్లు కప్పంగ వచ్చు?

అంత నర్చకుండు యవనిక దిగజార్చి
స్వామి కారగింపు సలుపుచుండ
నన్ను పరిహాసించె నా జిల్గువలిపంపు
పంచలోనిపండ్లు పయికి దేలి.

గుడిగంటల్ వినిపింప నీకడకు రాకుండంగ పోలేను- నా
కడ నున్నట్టివి నీ కొసంగక చనంగా లేను- ఏ దేని నీ
కిడుచున్నప్పుడు నాదు బీదతనమో ఏదో ననున్ లుబ్ధునిన్
కడుదుర్బుద్ధుని జేసి కొంతతడ వాకట్టున్ గదే చేతులన్.

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య

ఆదరమొప్ప నే నొసగు నట్టిఫలం బది శూన్యమందునన్
గాదని, నీకు నర్పణ మొనర్చిన దించుక యేని వ్యర్థమై
పో దని దానిసిం దిరిగి పొందెద నం చని నమ్మియుండియున్
లేదనకుండ నే నొసగలేనుగదా దురదృష్టవంతుడన్.

పద్యమందు దగిన పదము వేయకయున్న
కవికి గలుగునట్టి కష్ట మెంతో
దైవమునకు నీయ దగినది యీకున్న
భక్తు డొందునట్టి బాధ యంత.

అకృతాత్ముల్ సుకృతాత్ములో తెలియరా కజ్ఞాత మైయున్న యా
స్తికలోకమ్మున కీ వొసంగెడి శుభాశీర్వాదవారమ్ములో
నొక యంశంబును మాకు జెందునటులన్ యోజించి మావంటి అ
ర్భకులంగూడ సముద్ధరింపుము ప్రభూ! దాక్షిణ్యభావమ్మునన్.

# ఆత్మశాంతి

శ్రీ దివాకర్ల రామమూర్తి

❈

మోక్షమునా! దుఃఖబాధావిమోచనమునా
జననమరణరాహిత్యసంసారమునా, మ
నఃప్రగాఢశాంతినా, కోరు నరుఁడు; మోక్ష
మనిన దెఱుఁగక; శాంతివాసనయు లేక,

మోక్షసాధనముగ శాక్యముని వచించె
నష్టవిధపథంబును, తదన్యంబు త్యాజ్య
మనుచు; శ్రద్ధ, వాఙ్నియమము స్వచ్ఛకార్య
ఘటన మాదిగ జ్ఞానమార్గంబు కొఱకు,

ఒకమతమా! ప్రసిద్ధపథ
మొక్కటియా? ఋషిమార్గముల్ శ్రుతి
ప్రకటితసూక్తపంక్తులకు
వ్యాఖ్యలుగా మఱి వేనవేలు; దే
నికి నదియే మహోత్తమము;
నిర్ణయ మేరు వచింపనేర్తు రీ
సకలవిధానముల్ తెలియ
జాలి సమన్వయ మొందు కూడునే!

*　　　*　　　*

ఇది ఛాందోగ్యములోనన్
విదితమ్ముగ వ్యక్తిగతవివేకముపొంచెన్
చదురుగ వివరింపంబడె
నెద మననం బొనరిచి గ్రహియించి తరింపన్.

*　　　*　　　*

ఆత్మ విమలము; క్షుత్పిపాసాదిదుఃఖ
దూరము; జరామరణవిపద్దోషరహిత
మార్ద్రసత్యము తత్స్పృహ; అహరహంబు
తత్స్పృహాళి సత్యంబులై తనరుచుండు;
జ్ఞేయ మాయాత్మ ప్రజ్ఞావిశేష మొప్ప
చింత్య మనుభవ్య మది గురుసేవ దగిలి.

*　　　*　　　*

అసురులు దేవతాళి యుభ
యం బగు నాత్మపదార్థలక్షణ
ప్రసరణ మాలకించి. "అను
భావ్యము తత్స్ఫురణంబు, దానిచే
నసమవిలాససంపదల
నంది, కృతార్థత పొంది, సౌఖ్యస
ల్లసితులు గాఁదలంచిరి; వి
లక్షణలక్షితముల్ స్వభావముల్.

దేవరాజు మహేంద్రుఁడు. దితితనూజ
ముఖ్యుఁడు విరోచనుఁడు, గురుముఖ్యుఁ డగు ప్ర
జాపతినిఁ జేరి, శిష్యులై శ్రద్ధతోడ
నధివసించిరి ద్వాత్రింశదబ్దము లట,

'ఏల యిన్నేండ్లు మీరు వసించు టిచట'
అని ప్రజాపతి ప్రశ్నించి నంత; వారు —
'ఆత్మ నెఱిఁగిన భోగభాగ్యమ్ము లెల్ల
వశ్య మగునని విని, తదవశ్య మెఱుఁగ
వచ్చితిమి; వసించితిమి; మీవద్ద' ననిరి;
"అక్షి గోచరించు పురుషుఁ డాత్మ అమృత
మభయము; త దేవ బ్రహ్మ; జ్ఞేయ మ్మ" దనియె.

'ఉదశరావమ్మునందు, మహోజ్జ్వలంపు
దర్పణమునందు, ప్రతిబింబితను వహించు
నట్టిదాః యాత్మ' యని గురు నడిగినారు;
అన విని వారి కిట్లనియె;
'ఔ' నది యాత్మ; కనంగ నౌను మీ
రు నిజము- వీని నన్నిటను;
లోనుదకంబుల మీరు మిమ్ము చూ
డ నగు; అగమ్య మేదయిన
తారసిలన్ వచియింపుఁ డయ్య నా
కనుచు వచించి పుచ్చెను, గు
ణార్థి ప్రజాః ారి నిద్దరన్.

*

చని నీటంగనినారు బింబముల; ఆ
చార్యుండు ప్రశ్నించె వా
రిని; 'ఆత్మం గనినారె' యంచు; ఉభయుల్
ప్రీత్యున్నతిం జెందుచున్
మనవిం జేసిరి, 'కంటి మాత్మ'; నఖముల్;
మాన్యంబులౌ, కేశముల్
ఘననీలాలకసుందరమ్ములు' లస
త్కాంతిప్రభాపుంజముల్.

సాధ్వలంకృతులును, సువసనులును, సుప
రిష్కృతులు నయి యేఁగి దర్శింపుఁ డిపుడు
మఱల, నుదశరావమ్ము నేమరక నాత్మ
అనుచు నాజ్ఞ నిడఁగ వార లరిగి వచ్చి;
''స్వామిః దర్శించితిమి యాత్మ; స్పష్టరేఖ
మమ్ము పోలినది; పరిష్కృతమ్ము సువస
నాద్యలంకారభూషిత'—యనిన 'నిజము;
ఆత్మదర్శన మయ్యె మీ కరయ నిందు;
అమృతమును నభయమును బ్రహ్మమ్ము నాత్మ'
అనఁ బ్రజాపతి; సంతుష్ట లగుచు చనిరి;

*　　*　　*

చనియెడు వారలం గని, వి
షాదము పుక్కిటబంటి యైన ని
ట్లనియె గురుండు; వా రుభయు
లజ్ఞులు; ఆత్మవిచారశూన్యతన్
జనిరి; ప్రమోద మందుచు, వి
చక్షణ చేయక- ఎవ్వ రీక్రమం
బనుసరణం బొనర్తురు హ
తాశులు, నష్టులు వార లందరున్.

*　　*　　*

ఆత్మవిజ్ఞానభాగ్యం బబ్బె ననుతృప్తి
నరిగి విరోచనుం డసురలోక
మునకు ప్రబోధింప మొదలిడె; నీ రీతి—
'దేహాత్మఁ బూజింపఁ దివురు గొనుఁడు;
దేహ మారాధ్యంబు- దేహైకపూజాప
రాయణుం డిహము పరంబు నొందు;
దేహాత్మభావనాదిక మిది యసురోప
నిషదర్థసార మ్మనేకగతుల;"

*　　*　　*

ఇంద్రుఁడు విచికిత్స పడి గ్రహించె; నిష్ప్ర
యోజనము తత్ప్రబోధ మయోగ్య, మభయ
రహిత, మమృతత్వగళితము, బ్రహ్మపదము
కాదనుచు- వివేకవిచారకలనఁ జేసి.

ఉదకశరావమందుఁ గన
నొప్పిన యాత్మయలంకృతమ్ము నై
నది స్వశరీరయష్టి సుభ
గాకృతి భూషిత గాఁగ, వస్త్రముల్
చదురుగఁ దాల్పఁ దాల్చినది;
స్వాంగము కాణము నైన కాణమౌ-
పదములు ఖంజ మైనఁ గను
పట్టెడి ఖంజతచే వికారి యై,

*　　*　　*

తను వడి నష్టమైనఁ దను ధర్మముఁ
దాఁ గని యాత్మ నష్టమై
కనఁబడకుండు; ఇట్టి యను
గం బగునట్టి విచిత్రవస్తువుం
గనినది యేమి జ్ఞానము, సు
ఖప్రద మె ట్లగు నంచు నెంచి- ఇంద్రుఁ డే
గెను గురుబోధచే మనసు
ఖేదము సంశయ మెల్ల తీరఁగన్.

అధివసించె నంతట గురునంతికమున
మఱల ద్వాత్రింశదబ్దముల్ సురవిభుండు;
బోధఁ గావించె గురుఁడు సంపూర్ణకరుణ
క్రమక్రమంబుగ ఆత్మప్రకార మంత,

'ఎవఁడు స్వప్నమున మహీయమానుఁ డగుచు
సర్వ మనుభవిం చఖర్వగతిని;
ఆతఁడె యాత్మ; యమృత మభయంబు, బ్రహ్మంబు'
అనిన సంతసించి యరిగె విభుఁడు.

అమరపతి చేరెనో లేదో యమరతతినిఁ
దాను నేర్చిన దాని వ్యర్థత్వ మెఱిఁగి
స్వీయహృది విచికిత్స గావింపఁ దొడఁగె.

* * *

''ఈశరీర మంధ మయిన నిదియు నంధ
మింత కాదు; ఖంజ మయిన నింత ఖంజ
కాదు; హన్య మయిన కాదు హన్యము; మఱి
దుఃఖ మొందు విలాపించు 'దూలి తూలి —
స్వామి! ఏమి లాభం బిట్టి జ్ఞాన మొంద''

అని ప్రజాపతి కడకేఁగి యంఘ్రులంటి
జ్ఞానబోధ నపేక్షించి పూని నిలిచె
మఱల ద్వాత్రింశదబ్దముల్ సురవిభుండు
గురుఁడు బోధించె ఆత్మ తత్త్వంబు నపుడు.

''సుప్రసన్నుఁ డై శాంతసంశోభితుఁ డయి
స్వప్న మెఱుఁగక నిద్రించువాఁ డెఱుంగు
మాత్మ; అమృతం బభయము బ్రహ్మమ్ము నదియ.''

అనిన విని శాంతహృదయుఁ డై చని విచార
మూని తత్ జ్ఞానమున నిష్ప్రయోజనంబు
నెఱిఁగి యింద్రుఁడు విచికిత్స నెఱపఁ దొడఁగె

'నిద్రఁ జెందిన వెనుక నిర్నిద్రమతి నె
ఱుంగ 'మహ మస్మి' యనుచు; నెఱుంగ మితర
వస్తుసంస్థితియు— వినాశభావ మింత
కంటె వేఱొం డెది; గుణంబు కలదె యిందు;—
'నాహ మత్ర పశ్యామి భోగ్యం బొకండు."

అన విని 'నీదుపల్కులు య
థార్థము; పంచసమంబు లిందుఁ గూ
ర్చిన మతి నుండుమీ— అట వ
చించెద నాత్మరహస్య'మంచు చె
ప్పిన యమరేంద్రుఁ డందు గడి
పెన్ మఱియైదుసమంబు లంత ఏ
చిన కుతుకంబుతోడ, నవి
శేషము బోధనొనర్చె వానికిన్.

'పరిదృశ్యమాన మై పరఁగు శరీరము
సర్వ మనశ్వర ముర్వియందు;
మృత్యుసంగ్రస్త మై మెలఁగు తచ్ఛారీర
మందిరాంతరమందు నమృత మాత్మ—
తదధిష్ఠానంబుచేఁ దనరి ప్రియాప్రియ
మనుభవించును నాత్మ యనవరతము.

ఈశరీరం బందు నెల్ల కాలంబును
సుఖదుఃఖములు తిరోముఖత గనవు;

ఈయుపాధిని విడిచిన, యెల్ల ప్రియము
లప్రియంబులు తొలఁగు; తదవసరమున
నిరయమున్ బొందు దుఃఖసంకరము లన్ని
దేహతాదాత్మ్యభావమ్ము తీఱిపోవు.

ప్రతిబుద్ధుం డయి జీవుఁ డంత విమల
త్వం బొంది దేహాత్మతా
మతిదూరుం డయి, ఇంద్రియంబులకుఁ, ద
న్మాత్రాదిసంసర్గసం
తతికిన్ స్వీయమనఃప్రవృత్తికిని బాం
ధవ్యంబు నిర్జించి ని
త్యత నద్వైతము నొంది యంత సుభగ
త్వం బొందుఁ దాదాత్మ్యతన్.

ఇది సాధ్యం బగునా యటంచు నెద చిం
తింపంగరా దాత్మసం
పద సామాన్యము సర్వజీవులకు, త
ద్వ్యాపారసందీపితా
భ్యుదయం బయ్యది కల్గు సజ్జనుల శ్రే
యోవాససంసర్గముల్
గదురన్ వస్తుగతాభిమాన ముఱలన్
కైవల్యసంప్రాప్తిచేన్.

ఏవిధి నాశ్రయించి చరి
యించిన తాత్త్వికసత్యదృష్టిసం
భావిత మై, నిరంతరవి
పత్పరివేల్లితప్రాకృతప్రజా
జీవిత మొందు శాంతి, సవి
శేషదురంతవిపాకశూన్యబో
ధావిమలంబు తత్పరమ
తత్త్వ ముపాస్యము జీవకోటికిన్.

ఏయది సార్వకాలిక మ
హీనమహామహిమాఢ్య మేది జీ
వాయతనమ్మ, విశ్వభువ
నాంతరరూపవిపర్యయక్రియా
స్థాయదనంతసృష్టికి అ
పార మనంత మమేయ మై సదా
ధ్యేయము జ్ఞేయ మేది సక
లేడ్యము తత్పదమున్ స్మరించెదన్,

# ఆమె

## శ్రీ అన్నాప్రగడ శ్రీరామమూర్తి

※

[ ఆమె ఒకమహాకవికి ప్రేయసి. అర్ధాంగి. ఆరాధ్యదేవత. ఆమెపేరే కవిత. వారియిర్వురిప్రేమగాథయే నా 'ఆమె' యను ప్రహేళికకు నితివృత్తము. విరహమే లేదనుకొన్న యాదంపతులకు విధి నిష్కారణశత్రు వైనాడు. విరహము ఘటిల్లినది. ఆవిరహవీచికయే యీయుద్ధృతభాగము.

ఎవఁడురా వాఁడు చెరిచినాఁ డిట్లు నాదు
నవరసానందలోకసంచారసుఖము
నొరుల సౌఖ్యమ్మునకుఁ దన యోర్వలేని
తనము చూపించి రాక్షసత్వమున మించి.

ఎవఁడురా వాఁడు పాషాణహృదయుఁ డిట్లు
మామకాక్షరసుందరీమధురమూర్తి
బద్ధనిశ్చలప్రణయతపస్సమాధి
కాచుకొని కూరుచుండి భంగమ్ము చేసె.

ఎవఁడురా వాఁడు రాక్షసకృత్యరతుఁడు
రసపిపాసులకొఱకు నిర్వహణ మైన
నాదు చలివేంద్ర దగ్ధమొనర్చినాఁడు
పరుల యపకృతి కలవాటు పడినవాఁడు.

ఎవఁడురా వాఁడు తనచర్య కెదురులేక
విశ్వకల్యాణబాధ్యతావిహితుడు నయి
నా ప్రయాణించుభావసుందరపథాల
ప్రాణసంకటకంటకాల్ పాతినాఁడు

ఎవఁడురా వాఁడు దుండగీ డిన్నినాళ్ల
మా నిరంతరాద్వైతదంపతులమధ్య
పెరుగు ప్రేమలతను తెగ నరికినాడు
తన భయదకఠోరకుఠారధారతోడ.

ఓ విధీ! యీవిధమ్మున నీ వటోయి
నాదు లౌకికజీవితోన్మత్తయాత్ర
నీతిబాధ లన్నియుఁ సృజియించినావు
నే నెఱుంగుదు లేవోయి నీ ప్రవృత్తి.

ఓ విధీ! నే నెరుంగుదునోయి నిన్ను
చాలవత్సరములనుండి జగతిలోన
నా బ్రతుకుదారిలోన నొంటరిగ తరచు
గా తటస్థపడెదవు నాకర్మకొలఁది.

ఓ విధీ! గుర్తుపట్టెదనోయి నిన్ను
మొట్టమొదట గాకున్నను చిట్టచివర
కైన మంచికి చెడుచేయుటందు చాల
నేర్పరివి నీవు నే గ్రహించితిని మునుపె.

ఓ విధీ! క్రొత్తగాదు లేవోయి నాకు
నీస్వభావమ్ము నాదు కన్నీళ్లచూచి
సంతసించెద వీవు — నా సంతసమును
నీవు వీక్షింపనే లేవు నిమిషమైన.

మునుపు సుప్రసిద్ధముగ నీమూలముననె
రాజ్యలక్ష్మియు గృహలక్ష్మి భ్రష్ట మైన
నల హరిశ్చంద్ర ధర్మరాణ్మణులకన్న
అధికుడను గాను నిన్ను నే నధిగమింప.

నామహర్షిత్వ మేమాయె నా బుధైక
వేద్యపాండిత్య మే మాయె విషయములకు
నాదు బుద్ధీంద్రియము ద్రిప్పినావు నీవు
నిష్ఠురవియోగ మిట్లు సంధింపఁబడెను.

నా విరహంబు నీదు ఘట
నంబు—త్వదీయవినోదహేతువుల్
నా వివిధేతిబాధలును—
నామది దేహము ద్వంద్వభావసే
వావశ మై ప్రవర్తిలుట
పర్యవసానముగా త్వదీయచే
ష్టావళి వక్రవక్రములు
నై కొనసాగిన నేను ధీరుఁడన్.

నీ కావించిన వాయుగుండములతో
నే నీఁదు సంసారఘో
రాకారాంబుధి నిండియున్నది జగద్
వ్యాపారసారంబుతో
నాకుం గల్గిన దిక్ప్రదర్శిని చెడన్
నానావిధానూనబా
ధాకల్లోలము లెట్లు దాటెదను చి
త్తం బోటి బోటయ్యెనే.

లోకంబంతయు కారుచీకటుల క
ల్లోలమ్ముగా నుండె నా
ధీకాంతుల్ గతముల్ భవద్గ్రసితమై
తీక్ష్ణప్రభావాస్తమై
నీకున్ నాపయి నేల కల్గినది యీ
నిర్హేతుకక్రోధ మే
నే కన్పించితినా కళానిధిగ నీ
వే రాహు వె నా విటుల్.

నీ సంతోషము నా విచారమును కా
నేకావులే నిత్యముల్
నీసామర్థ్యము నే నెరుంగుదునులే
నీగెల్పు లెన్నాళ్లలే
నీ సాంకల్పికవిఘ్నఖండనముకై
నే సానపట్టించు ప్ర
జ్ఞాసిం దూసెద దేనికైన సమయం
బాసన్నమై రావలెన్.

నా బుద్ధీంద్రియ మీవు లోకవిషయాం
తర్వర్తి గావించి యు
హాబద్ధం బగు ప్రేయసీమధురలో
కానంద విభ్రష్టునిం
గా బాధించితి వీవు విశ్వమునకున్
కల్పింతు శ్రేయమ్ము లో
గో బాగో యిది నాకు నష్టియును నీ
కున్ తుష్టి నీ చేష్టలన్.

పవమానప్లవమానచిత్తవిహగీ
బందంబు ధావత్గతి
స్తవనీయోద్యమలేఖినీసమధిక
స్తంభంబు సానందమై
భవశృంగారదరిద్రతాస్థితియు సం
ప్రాప్తించె నా కిప్పుడున్
భవదిచ్ఛాభవవిప్రయోగమున ని
ర్వేదుష్యమూర్ఖస్థితిన్.

నాప్రియురాలి నవ్యనట
నంబులగాథలు గల్గియున్న ప
త్రప్రచయంబు గాలి కెగు
రన్ జనియించిన మర్మరధ్వనుల్

నా ప్రతిరక్తనాళతప
నం బొనరించెడు మాటిమాటికిన్
నా ప్రమదాలలామచర
ణధ్వనులన్ భ్రమగొల్పి వంచనన్.

నిక్కము చెప్ప నాహృదయ
నీరజమందు వసించు లక్ష్మి నా
కొక్కొకవేళ నాపరిసరోద్ధతి
కన్పడకుండినంతనే
యెక్కడినుండి వచ్చునని
దృక్కులు దిక్కులు చూచు తేప కిం
కక్కట యెన్ని పుట్టునొగ
దా యిటువంటి వియోగచర్యలున్

ఒక మృత్యుంజయ మౌశరీరమును ప్రే
మోద్రేక మందిచ్చి భౌ
తికదేహమ్ము గతించు నన్న భయమున్
దీర్చెన్‌గదా నాకు నే
నకటా! యేగతి విస్మరింతును మ
దీయప్రేయసిన్ బహ్వన
ర్థకమూలం బగు విప్రయోగము దు
రంతం బెట్లు సైరించెదన్.

వలసియున్నట్టి హక్కులు పడయలేక
పడసినట్టి హక్కులను కాపాడుకొనగ
లేక బిట్టుగా గుట్టుగా శోకమందు
నాదుబ్రదుకున కామె యానందరేఖ

దేహవిషయసౌఖ్యదీపఫలభ్రాంతి
మన్మతిశలభాయమాన మౌన

పాయమును గడచునుపాయము చూపిన
యామె లేక భద్ర మేమి గలుగు?

నేను విరహాగ్నిదందహ్యమానుఁడ నయి
ప్రియకళాసతియందు నిల్పిన నిరీక్ష
ప్రియకళాసతి నన్ను నల్పినపరీక్ష
జీవితముమీఁద ప్రబలచేసెను తితీక్ష

ఆమె నాయికాత్వమంది నాచిత్తము
కాంతిపథములోని శాంతిరథము
విశ్వరాజ్యవాసపీడితప్రజ లెక్క
హక్కు లేమొతెలియ దిక్కుతెలియ.

ఆమెమీద నాకు నామీద నామెకు
ప్రేమ రుజువుచేయ వీలుగలదు;
ఈసమాజ మేల యిట్లడ్డుపడు మధ్య
నొకరిసుఖము చూచి యోర్వలేదు.

ఇన్నినాళ్ల ప్రేమ యేమాయెనో యామె
యెరుగరానిచోట మరుగుపడెను;
బ్రహ్మభావ మంది రసలోకమం దుండు
హక్కు లేదు నాకు దిక్కు లేదు.

పోయెను మాటలమాధురి
పోయెను మతి వేగ మామె పోయిన నాకున్
పోయినవి శక్తులన్నియు
పాయక వచ్చినది యొక్కపరివేదనయే.

కనులు చూచి చూచి గాజుబుడ్లాయెను
మనసు తలఁచి తలఁచి మట్టియయ్యె;
ఆశ పెరిగి పెరిగి ఆకాశ మైపోయె
నాకు మిగిలె విరహనరకబాధ.

# శాన్త్యష్టకము

## శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు



స్వామీ! యౌవనమందు ముందుగల కష్టాలన్ విచారింపఁబో-
కేమీ జంకును గొంకు లేకయె, ను రేవేవో మహాపాపముల్
ఏమాత్రంబును మంచి, చెడ్డ గమనించేపాటి తెల్వేమియున్
లేమిన్ జేసితి నింక జేయ నటు శాన్తిన్ దేవ సాయించుమా!

చేసినపాపముల్ కొలువుచేసిన నీ మనసందు సందుగా
న్నాసల నాసియా తలపు లారడివెట్టెడు నింగి, నేల మా
భాసము గాగ దోచెడు స్వభావపు భావపుఁదోవ నేవిధిన్
ద్రోసునొ? చేయిజేసికొని తోలు మ టావల శాన్తిసాధనన్.

ఇదివరలో నొనర్చినవి యేవియు బూరితి నొందలేదు క్రొ
త్తది మనసందు సందుగొని దాని దొలంగగ జేయుచుండె నే
మిది యని మందలించు పరమేశ్వరు డెవ్వడు? నీవ, శక్తుడం
చిదియు ప్రసిద్ధమేకద రమేశ్వర! శాన్తి నొసంగి కావవే.

నీ నిర్మించినసృష్టి నంతటను శాన్తిన్ దేవ కాంక్షింతు నే,
మైనన్ ఈ యలజళ్ళ వేల యుదయంబయ్యెన్ బ్రపంచంబులో,
గానన్ లోపము, తండ్రి! కర్మ దగునా ? కార్యమ్ము దా ? కర్మదా ?
దేనన్ ? దీని దొలంగ జేయగదె శాన్తి న్నింప సర్వేశ్వరా !

శాన్తికె సుమ్ము కూర్చెదరు సైన్యములన్, బహుళాయుధమ్ములన్
శాన్తికె కూర్చుచుండిరి. ప్రశాన్తికెసూ పరమాణుబాంబులున్
శాన్తికె రాజ్యకూటములు, శాన్తికె, శాన్తికె, శాన్తికే నటం
చెన్తయొ గొంతుచించుకొని యేడ్తురు తుచ్ఛులు తుచ్ఛబుద్ధితో.

మనలో లేని యహింస మాటలతో నేనా? బుద్ధిలో లేని శు
ద్ధిని స్నానాలతో గూర్చునా? మనసులో లేదేని సత్యంబు వా
కున దేగల్గునె? కందకే దురద లేకున్నంతలో, గత్తిపీ
ట నదెట్లుండును, శాస్త్రి, లోన నహిం, చేష్టల్ శాన్తిమన్త్రింబులో.

మనసులో లేదు సిగ్గు, పలుమారును పైటను గప్పుచుండు గా
మిని, మడి లేదు బోడితల మీదను మాటికి నీట మున్గ జూ
చెను విధవమ్మ, పేరుపున సిగ్గులు, వేసగి నిష్ఠలంట, ఈ
పనులట, శాన్తి యంట పొరపాటుకదా యగు, దాగ బోవునే.

లోకులు సర్వదా మనసులో జపియించిన శాన్తి చేకురున్
వాకున కాటవం బెపుడు మానుట బూనిన శాన్తి చేకురున్
పోకల లోకకంటకపు బోకడ మానిన శాన్తి చేకురున్
ఈకరణిన్ బ్రవర్తిలిన నెల్లసుఖంబులు శాన్తి జేకురున్.

# శిథిలసమాధి

## శ్రీ శనగన నరసింహస్వామి



జనం నడిచే బాటప్రక్కగా కాలువ. కాలువఆవలిగట్టున చిక్కుపలు చిద్రుపలుగా చెదరిపోయి, రూపు మాసిన ప్రాతసమాధి. ఆ శిథిలసమాధిని అధికరించి, ఈ కావ్యఖండిక.

కాలవశుండవై యిహసుఖచ్యుతు డైన నరుండ వీవు, ప్రే
తాలయవాసు డైన నిను నధ్వగు లెవ్వరు పల్కరించు వా
చాలురు గారు; ప్రాణబలశాశ్వతతామతరాజ్యపీఠి, ల
క్ష్మీలలనాకటాక్షమృదుసేచన మందిన జీవివే కదా?

సమసిన నీదు దేహమువెసన్ భవదాత్మజు లంతరంగప్రే
మము నడపింప తెల్లని సమాధి వినిర్మితి జేసి, వత్సర
క్రమముగ వచ్చి బాష్పములు కందుదలం దులకింప భక్తి దీ
పము వెలిగించి మ్రొక్కిన శుభక్షణముల్, స్మరియించుకొందువే?

గడచె శతాబ్దముల్ నిమిషకాలములోపల, పెద్దలైన నీ
కొడుకులు కూతులున్ మనుమకుఱ్ఱలుగూడ నశించినారు; నీ
పడిన శ్రమమ్ము నీతరమువారికి భుక్తముగాగ, నీదుపే
రడిగినవాడు లేడు, శిథిలాకృతి దాల్చెను నీసమాధియున్.

చీకటిలోన వెన్నెలలు చిమ్ముచు గాఢభయప్రదేశ మై,
లోకమువారి కాయువులలోపము దెల్పెడి నీసమాధి శ్ర
ద్ధాకరణమ్ము లేక, బహుధా శకల మ్మయి, శైత్యతాపవ
ర్షాకర మైన దప్పటికి నప్పటికిన్ వికటించుచున్ గటా!

దీక్ష వహించి యింత గుఱుతింపగ లేము సమాధిమీద నా
మాక్షరపంక్తి నీ యది, మహాధని వై మను నీ కనాము డా
భిక్షుకమూర్తి కైన నొక వీసము భేదము లేనిరీతిగా
శిక్ష యొనర్చు ఈవిఫలసృష్టికి చక్కని యర్థ మున్నదే?

# శాంతి

నా తరుణసుందరార్ద్రమనస్సుమమ్మ
దళదళపరీతవేదనాదగ్ధ మయ్యె ;
ఆశ్రవాంతవినేత్రపద్మాంతరముల
మిగుల లే దొక్క తుహినకిర్మీరకణము.

విని విని వసంతకోకిలోద్వేలమధుర
ముగ్ధగానము వీనులు వ్రోడువారె ;
కాక గృధ్ర దివాంధ సృగాల రవము
లస్మదీయతమోంధజీవాన్న మయ్యె.

శాంతికొఱకు దివాకరజ్వాల లందు
విశ్వమెల్ల గవేషించి విసిగి తుదకు
అమృతహృద్వేది యని నిశీథార్ధమందు
కాలు నూనితి ఈవల్లకాటి నేల,

రుంద్రచాంద్రీతమస్వినీరుద్ర మైన
ఈశ్మశానమహావాటి యిరుల యిఱుకు
కారుమబ్బుల ముగ్గి శ్లాఘ్యత గడించు
నా యెదకు దీని కుపమార్హ్వణమ్ము కలదు.

అంగముల అంచులనుగూడ ఆనకుండ
వ్రేలుచున్నవి వటజటాడోలలందు
కొఱవిదయ్యము లుచ్ఛ్వాసగుణము మఱచి
నిద్రబడుచుండె నిర్మలరుద్రభూమి.

రండు రండు భూతములార ! రండు రండు
శాకినీఢాకినీపిశాచప్రచయము !
నీరవవిభావరీతమోనిర్భరజఠ
రమ్ము రంధ్రము పడకుండ రండు రండు.

అంఘ్రితలముల ధారుణి నంటకుండ
కొలువు దీరుడు పర్కటీకుజముక్రింద ;
శవదమేయతమిస్రాసబంధుకేశ
వేశముల గప్పు డిక నన్ను, పితృవనమును.

పవనసుకుమారపృథుకశ్రవస్సహస్ర
చిత్రమయసుషిరములను జేరకుండ
నన్ను వలగొని, మృదుసాంత్వనప్రహర్ష
ణప్రభాషణప్రణయమనస్వు లగుచు !

ప్రాణి యని, భయపడు నని, బహుళరాత్ర
మని కరుణ జూపి తొలగకు డహరహముహు
రాత్తదుర్దాంతకష్టనష్టాసువు నయి
నేను శిలనయి దయ్య మై నిల్చినాడ,

## పిశాచబృందవృత్తము

బ్రదికి కృశించి ప్రాణములు
బాసిన మా యెదలందు మోదసం
పదకొఱ యయ్యె, కల్మషత
మస్సులు చాయలవోలె సాగి మా
పదముల నంటివచ్చెను ; ది
వంగతు లైనను మన్నగాని దు
ర్మదమమతాసదాంధు లగు
మానవు లాత్మలు శాంతిదూరముల్.

# గీతాంజలి

నాకలోకము నిన్ను వినాకరించి
బాల్యమున నేను నడచినబాట లేదు;
నా పసియెడంద మోసిననాటి నీదు
చరణముద్రలు నేటికి చెరగలేదు.

సారెసారెకు నీవు హస్తములు సాచి
పిలిచితివి కౌగలింప; నీ వలపు విసము
గా భ్రమించుచు దూరముగా తొలంగి
ఓ మహాదేవ! సర్వబాహ్యుండ నైతి.

కవిని నే నను దుర్జ్ఞానగరిమ విను ని
రాదరించితినే కాని ఆదికవి! త్వ
దేక విరచిత సురుచిరలోకకావ్య
బంధమున నక్షరంబైన పలుకలేను.

ఎంత దిగజాఱిపోయిన ఈ యమాయి
కాత్మపై గల్గె నీకు దయాలవమ్ము;
అపు డపుడు వేదనానయనాంబరాంబు
దాంతరజ్యోతి వై తళుక్కని మెఱయుదు.

గగనగంగామనోజ్ఞమంగళకిరీట
ధారి! హిమగిరిదీర్ఘశరీరి! తావ
కీనపాదాంతరేణుసంకీర్ణశీర్ణ
మృదుపిపీలిక నన్ను క్షమింప గలవొ?

# ఫలశ్రుతి

ప్రతినిమేషము పంకిలభావభంగ
తుంగహృదయసముద్ర ముప్పొంగు క్రుంగు;
వేదనాబడబానలోద్వేలజృంభ
ణములు భరియించి హాసఫేనములు గ్రక్కు.

క్రోధమదలోభమత్సరకూర్మనక్ర
మకరపాఠీనసంచారమలిన మగును.
వక్రజాతకఝంఝాప్రభంజనజవ
లబ్ధనిమ్నగావర్తసంక్షుబ్ధ మగుమ

మహితముహురనుతాపాద్రిమథ్యమాన
మానసక్షీరసాగరమధ్యసీమ
నమృతకలశార్థమై వీక్షణములు బఱప;
బాహిర మ్మయ్యె భయదహాలాహలమ్ము.

కాలకూటవైశ్వానరజ్వాలలందు
తప్తమయ్యెను స్వాంతరత్నాకరమ్ము;
తడవిచూచిన లేవు ముత్యములు, మణులు,
పగడములు — నత్త లాలిచిప్పలు వినాగ.

అంత లయరుద్రమూర్తి నై, అంతరుత్థ
గరళము పెకల్చి కబళించి కంఠపార్శ్వ
పదవిభూషణ మొనరించి పావనాశ్రు
జాహ్నవీతోయధారలు చల్లినాడ.

# హం సోఽ హ మ్

## శ్రీ పిల్లలమర్రి మార్కండేయ శాస్త్రి



భారతదేశమునందు జనించిన సకల తత్త్వశాస్త్రములకు ముఖ్యోద్దేశము మోక్షము. మోక్షమనగా «ముచ్» ధాతువునుండి యేర్పడిన శబ్దమగుటచేత విడుచుట యని యర్థము దేనిని విడుచుట అనగా దుఃఖమును విడుటయే. దేహము దాల్చిన సర్వప్రాణులు దుఃఖము ననుభవించుట అందరెరింగినదే. కాన దాని నివారణకై తత్త్వశాస్త్ర ముత్పత్తిల్లెను. చార్వాకులుదక్క భారతీయతత్త్వశాస్త్ర వేత్తలందరు లోకము దుఃఖభూయిష్ఠమని యంగీకరించి దాని నివారణోపాయములు వెదకిరి. అద్దాని మూలకారణము నన్వేషించినగాని దుఃఖనివారణము శక్యము గాదు కావున దానిమూలకారణము దాని నివారణోపాయమును గౌతమమహర్షి న్యాయశాస్త్రములో నిట్లు జెప్పెను.

'దుఃఖజన్మ ప్రవృత్తిదోషమిథ్యాజ్ఞానానా ముత్తరో త్తరాపాయే తదన న్తరాపాయా దపవర్గః.'

సాంఖ్యాచార్యు లిట్లు జెప్పిరి :

"దుఃఖత్రయాభిఘాతస్య"

శ్రీశంకరభగవత్పాదు లిట్లుపక్రమించిరి:

"ఆత్మనః కిం నిమిత్తం దుఃఖమ్'

కావున తత్త్వశాస్త్రజ్ఞులు ప్రేక్షావంతుల ప్రవృత్తికై 1. విషయము, 2. ప్రయోజనము, 3. సంబంధము, 4. అధికారి అనెడి నాల్గువిషయములను తొలుదొల్త విచారణ చేసిరి ఇవియే అనుబంధచతుష్టయ మని శాస్త్రములో వ్యవహారము.

విషయము : జీవుడు - బ్రహ్మము - వీరి యభేదము.

ఈవిషయమే యీ వ్యాసమునందు సూచింపబడినది లోకములో «అహం» అని వ్యవహరింపబడునది శరీరమనియు అందరు తలంచినదియే. ఈశరీరము మూడువిధములు. 1 స్థూలము అనగా కనబడునట్టి అన్నమయ దేహము. 2. సూక్ష్మదేహము అనగా ప్రాణవాయువులు 3, జ్ఞానేంద్రియములు 4, కర్మేంద్రియములు 5, మనస్సు, బుద్ధి ఈపదునేడు సూక్ష్మశరీరమని చెప్పబడును.

పంచప్రాణ మనో బుద్ధి
దశేన్ద్రియ సమన్వితం
అపంచీకృతభూతోత్థం
సూక్ష్మాఙ్గం భోగసాధనమ్."

ఇదియే భోగసాధనము. 3 కారణశరీరము అనగా అజ్ఞానము లేక మాయ అని శాస్త్రమున వ్యవహారము. కనబడు ఈ పైజెప్పబడిన మూడుశరీరములకంటె వేరుగా ఆత్మ యున్నదని సకల వేదవేదాంగసారము. ఉపనిషద్రహస్యముకూడ కాఠకోపనిషత్తులో నచికేతసుడు యమధర్మరాజిచ్చిన మూడువరములలో మూడవవరముగా నీ విషయమునే అడిగెను.

«యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే అస్తీత్యేకే నాయమస్తీతి చైకే ఏతద్విద్యా మనుశిష్ట స్త్వయాహం వరాణామేష వర స్తృతీయః»

పున విజ్ఞానవంతులగు మానవులు ఆత్మవిచారణము చేయవలెను. శంకరులు మోహముద్గరములో నిట్లు నుడివిరి.

"కాతే కాన్తా కస్తే పుత్ర
స్సంసారోయ మతీవ విచిత్రః
కస్య త్వం వా కుత ఆయాత
స్తత్త్వం చిన్తయ తదిహ భ్రాతః"

మానవుడు జన్మించినదానికి ఫలమేమి ? కర్తవ్యమేమి?

నే నెవరు నా గమ్యస్థాన మేమి? జన్మ ఎట్లు వచ్చినది? మరణ మెట్లువచ్చును? సృష్టికికారణ మేమి? ఇది సత్యమా? బ్రహ్మ మనగా నేమి? జీవబ్రహ్మలసంబంధ మేమి? మోక్షము గలదా? ఇవి విచారింపనినాడు మానవత్వము సార్థకము గాదు. కావుననే ఋషులు ఆశ్రమములలో బ్రహ్మసభలు చేసి ఆత్మతత్వవిచారణ చేసి వారి యనుభవమును గ్రంథరూపమున రచించిరి. ఆ గ్రంథములే వేదాంతశాస్త్రము. అవి ప్రస్థానత్రయము (1) శ్రుతి – యనగా సకలవేదములలోని యుపనిషత్తులు. జ్ఞానకాండము. (2) స్మృతి–అనగా శ్రీకృష్ణపరమాత్మచే కౌరవ పాండవ సంగ్రామమున అధికారి యగు పాండవమధ్యముడగు అర్జునున కుపదేశింపబడిన గీతాశాస్త్రము. (3) బ్రహ్మ సూత్రములు: అనగా శ్రీకృష్ణద్వైపాయనునిచే రచింపబడిన చతురధ్యాయిలో నుండు అయిదువందలయేబది రెండు సూత్రములు. వీని వ్యాఖ్యానరూపమయిన శ్రీశంకరభగవత్పాదుల భాష్యము, వానివ్యాఖ్యానువ్యాఖ్యలు. యివి పరస్సహస్రముగా గలవు. కంటికి గోచర మగు పంచ భూతములకంటె వేరుగా సచ్చిదానందరూప మగు నాత్మను నిరూపించుటచేతనే 'ధర్మయతి' దర్శనము అని శాస్త్రములకు పేరువచ్చెను. అవి యారు 1. న్యాయము 2. వైశేషికము 3. జైమినీయము 4. వైయాసికము 5. సాంఖ్యము 6. పాతంజలము. వీనిలో వైయాసికము సకలతత్వశాస్త్రవేత్తలచే నాదరింపబడినది. ఇదియే వేదాంతశాస్త్రము.

అధ్యాసస్వరూపము

అధ్యాసి అనగా ఆత్మయందు అనాత్మ యగు దేహేన్ద్రియమనస్సులయు వానిధర్మములయు ఆరోపణము. ఇట్లే అనాత్మయగు మనస్సునందును, ఇంద్రియములందును, దేహమునందును, ఆత్మసంబంధారోపము, ఆత్మధర్మారోపణము. ఈయారోపణమునకు మూలకారణము అవివేకము, అజ్ఞానము. దీనిచేతనే "అహ మిదం. మ మేదం" అనెడి యభిమానము దేహమునందును, నాది యనెడి యభిమానము ఇంద్రియములందును, దారాపుత్రాదులందు జనించుచున్నది. "పుత్రభార్యాదిషు వికలేషువా. సకలేషువా. అహమేవ వికలస్సకలో వేతి బాహ్యధర్మానాత్మ న్యధ్యస్యతి" ఇట్టి యధ్యాస "అతస్మిన్ తద్బుద్ధిః" అనగా భ్రాంతి తొలగుటకై బ్రహ్మస్వరూపజ్ఞానము కావలయును. దానికొరకై బ్రహ్మబోధకమైన వేదాన్తవాక్యవిచారణ చేయవలయు నని వ్యాసాచార్యులు 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అని సూత్రించిరి.

రెండువస్తువులకు అభేదభ్రాంతి కలిగినచో వానిధర్మములకును ఆరోపము కలుగును. ఎట్లనగా ఇనుపగుండు కాల్చుచున్నది అనునపుడు అగ్నికిని ఇనుపగుండునకును మొదట అభేదభ్రాంతి కలిగి తరువాత అగ్ని ధర్మమైన దాహకత్వము అయోగోళమునందు ఆరోపింపబడుచున్నది. అదేవిధముగా ఆత్మకంటె వేరగు దేహేంద్రియాదుల ధర్మములైన స్థూలత్వ కాణత్వాదులు దేహాత్మభేదభ్రాంతి చేత ఆత్మయందు ఆరోపింపబడి "నేను లావుగా నున్నాను నేను గ్రుడ్డివాడను" అని పలుకుచున్నాడు. ఇవ్విధముగ ఆత్మానాత్మభ్రాంతి యనెడి అధ్యాస సిద్ధించును.

«ఓయీ! ఆత్మానాత్మలయవివేకము సంభవింపదు. ఏలననగా ఆత్మభిన్నపదార్థములు ఘటాపటాదులు «ఇది కుండ, ఇది పటము» అనెడి వ్యవహారములో ఇది యను శబ్దముచేత వ్యవహరింపబడుచున్నది. నేను కుండ చూచుచున్నాను.» అనెడి వ్యవహారములో అహంకారాస్పదమైన ఆత్మపదార్థము భాసించుచున్నది. కావున ఇది «నేను» అనెడి ఆత్మానాత్మపదార్థములకు భ్రాంతి పొసగదు. భ్రాంతియున్నచో «నేను కుండ» యనెడి వ్యవహారముండవలెను.

'ఆత్మానాత్మలకు అవివేకము లేదు.' అనుట పొసగదు. ఏలననగా దేహము, ఇంద్రియములు, మనస్సు, చైతన్యముచేత ప్రకాశింపబడి ఘటపటాదులవలె ఇది యను శబ్దముచే వ్యవహరింపబడుచున్నవి. అట్లే దేహాదులు అహం అను శబ్దముచేత వ్యవహరింపబడుచున్నవి. ఈవిధముగా ఇది యను శబ్దముచే చెప్పబడు శరీరము «అహం» అనెడి శబ్దముచే వ్యవహరింపబడుట ఆత్మానాత్మావివేకమువలన కలుగు నని చెప్పకతప్పదు. ధర్ము లయిన ఆత్మానాత్ముల భ్రాంతిచేత వానిధర్మములకు కూడ ఆరోపణము తప్పదు. అనగా శరీరమునందున్న లావు, కార్శ్యము, ఆత్మయందును, ఆత్మధర్మమయిన చైతన్యము శరీరమునందును ఆరో

పింపబడి «నేను తెలిసికొనుచున్నాను. నేను చిక్కినాను» «నేను బలిసినాను.» అనెడి వ్యవహారము లోకములో కనబట్టుచున్నది.

తొలుదొల్ల ఆత్మానాత్మలకు అభేదాధ్యవసాయము అనగా అన్యోన్యత్వభ్రాంతి కలుగును. పిదప దానిధర్మము లయిన చైతన్యమునకు సుఖిత్వమునకు, దుఃఖిత్వమునకు అవివేకము కలుగును. తరువాత దేహేంద్రియాదులందు «అహం» బుద్ధి జనించును. దానివలన సంసారము-అనగా ఆనందరూప మగు నాత్మయందు దుఃఖిత్వాభిమానము జనించును. ఆద్దానిని తొలగించుటకై గురూపదేశమువలన కలిగిన శాస్త్రజన్యమైన జ్ఞానము అవసరము. శ్రవణ మనన నిదిధ్యాసనాది సంస్కృతమయిన మనస్సునుండి జనించిన వేదాంతశ్రవణజన్య మయిన జ్ఞానమువలన దేహేంద్రియాదులనుండి ఆత్మను వేరుపరచినచో శరీరధర్మము లయిన స్థూలత్వాదులు, ఇంద్రియధర్మములయిన కాణత్వాదులు, మనోధర్మము లయిన కామ, సంకల్పదుఃఖాదులు, ఆత్మయందు లేవని దృఢనిశ్చయము కలుగును. ఆత్మ- ధర్మరహిత మని నిరూపింపబడును. జీవాత్మకును బ్రహ్మకును అభేదము సిద్ధించును, అజ్ఞానముచేత దేహేంద్రియాదులందు కలిగిన అధ్యాస అనగా భ్రాంతి తొలగును. దానివలన జనించిన సంసారము దాని మూలకారణ మైన అధ్యాసతోగూడ నశించును. సామాన్యముగా «అహం» అనెడి జ్ఞానములో ఆత్మవిషయ మైనను దాని నిజరూపమయిన నిత్య, శుద్ధ, బుద్ధ ముక్తస్వభావము గోచరింపదు. అట్టి నిజరూపమును తెలుసుకొనుటకై శాస్త్ర మవసరమగుచున్నది. ఆశాస్త్రమే మహావాక్యము- సామవేదములోని ఛాందోగ్యమున నిట్లున్నది. «తత్ త్వ మసి» అనగా «శ్వేతకేతువా! నీవు సర్వాత్మకమయిన బ్రహ్మరూప మయితివి» అని దాని యర్థము. 2) «అయ మాత్మా బ్రహ్మ» (3) «అహం బ్రహ్మాస్మి» (4) «ప్రజ్ఞానం బ్రహ్మ» ఇవి నాలుగు నాల్గువేదములలోని మహావాక్యములు.

వీనివలన కలిగిన జీవబ్రహ్మల యభేదజ్ఞానమువలన జీవునకు సంసారిత్వదుఃఖిత్వభ్రాంతి తొలగి నిజరూపమయిన బ్రహ్మత్వము గోచరించును.

వాక్యము అర్థమును బట్టి ప్రమాణ మగుచున్నది. వాక్యార్థజ్ఞానమునకు పదార్థజ్ఞానము కారణ మగుచున్నది. కావున తత్త్వమసి వాక్యా జ్ఞానమునకు ముందుగా తత్ పదార్థజ్ఞానము, త్వంపదార్థజ్ఞానము కావలెను. ఆపదార్థములుకూడ వేదమువలననే తెలియదగును. «యతో వా ఇమాని భూతాని జాయన్తే» అనెడు శ్రుతివాక్యమువలన తత్పద వాచ్యార్థమును «సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ» అనెడి శ్రుతివాక్యమువలన తత్పదలక్ష్యార్థమును బోధింపబడుచున్నది.

త్వంపదార్థము జీవుడు, అన్తఃకరణములోని ప్రతిబింబము. అతడు మోక్షమును పొందువా డగుటచేత అభ్యర్హితుడు. కావున ముందుగా జీవాత్మనుగూర్చి విచారణచేయవలయును.

## జీ వ స్వ రూ ప ము

«నేను స్థూలముగా నున్నాను. నేను బ్రాహ్మణుడను» అనెడి వ్యవహారమునుబట్టి దేహమే ఆత్మయని చార్వాకుల యభిమతము. భూమి, నీరు, తేజస్సు, గాలి అనెడి నాల్గు భూతముల సమ్మేళనమే శరీరము. అందు భూభాగము మాంసము, జలభాగము చెమట, చక్షుస్సు తేజోభాగము, ప్రాణములు వాయుభాగములు — ఈ నాల్గుభూతముల సమ్మేళనముచేత శరీరమునందు చైతన్య మేర్పడును. వీరినే దేహాత్మవాదు» లందురు.

కన్ను మొదలగు ఇంద్రియములు ఆత్మయని కొందరు చెప్పుదురు. మృతదేహమునందు చైతన్యము లేమింజేసి శరీరాత్మవాదము సమంజసము కాదు.

అంతరిన్ద్రియ మైన మనస్సే ఆత్మయని మరికొందరు చెప్పుదురు. ఇంద్రియమే ఆత్మ యన్నచో ఒక్కసారిగా శబ్దస్పర్శాది జ్ఞానములు కలుగవలయును. అట్టి సర్వజ్ఞానములు ఒక్కసారిగా కలుగుట యనుభవసిద్ధముగా లేదు. మనస్సే ఆత్మ యనినచో నది యేయిన్ద్రియముతో కలియునో ఆ యిన్ద్రియమువలన నావిషయము మాత్రమే గ్రహింపబడును. కావున నొక్కసారిగ విభిన్నవిషయ జ్ఞానములు కలుగవు.

ప్రాణవాయువులే యాత్మయని కొందరు చెప్పుదురు. మనస్సే జీవు డయినచో ప్రాణములు పోయినను మన స్సుండినచో జీవు డుండుటవలన జీవుడు బ్రతికియుండవల యును. లోకములో ప్రాణముపోయినది అని వ్యవహ రింతురు. నిద్రలో మనస్సు లేకపోయినను ప్రాణ ముండు టచేతనే బ్రతికియున్నాడు గాని చనిపోయినట్లు వ్యవహా రము లేదు.

క్షణికవిజ్ఞానవాదము ప్రాణమే జీవు డన్నచో నిద్రలో ప్రాణవాయు వుండుటచేత విషయవిజ్ఞాన ముండ వలయును. అది లేదు. కావున క్షణిక మయిన విజ్ఞానమే యాత్మ యని వారియభిప్రాయము. విజ్ఞానము క్షణికమై నను దానిపరంపర నిత్య మగుటచేత వ్యవహారము సిద్ధిం చును.

శూన్యవాదము శూన్యమే యాత్మ యని చెప్పుదురు. క్షణికవిజ్ఞానమే యాత్మ యనినచో ప్రతిదినము అనన్త మైన జీవులు పుట్టుదు రని చెప్పవలయును. నిద్రలో క్షణికవిజ్ఞానము లేకపోవలయును. కావున జాగ్రత్తులోను స్వప్నములోను, సుషుప్తిలోను శూన్యమే యున్నదని వారి యభిప్రాయము. దీపము వెలుగుటకుముందు శూన్యముగా నుండి ఆరినతరువాత శూన్యమైనట్లు ప్రపంచమంతయు శూన్యమునుండియే పుట్టి శూన్యములోనే యవసానమును పొందు నని వారిసిద్ధాంతము.

దిగమ్బరమతము : ప్రపంచము లేనిదే అయినచో నుండేటికొమ్మువలె కనబడరాదు. కనబడుటచేతనే సత్ అని చెప్పవలెను. కావున శూన్యము అని అనరాదు. సృష్టికి పూర్వము గూడ ప్రపంచమున్నదని చెప్పకతప్పదు. లేనిచో «కృతహానాకృతాభ్యాగమ» దోషము సంభవిం చును. అనగా జనులు చేసిన కర్మకు ఫలము లేకపోవు టయు చేయకయే ఫలము వచ్చుటయు, అనెడి రెండుదోష ములు వచ్చును. కావున దేహేంద్రియాదులకంటె వేరగు నొకవస్తువు ఆత్మ శరీరపరిమాణకము. పరమాణువు అయి నచో «కాలు నొచ్చుచున్నది» «తలపై బాధ లేదు» అనెడి జ్ఞానము ఒక్కసారిగా కలుగరాదు.

వైశేషికమతము

ఆత్మ దేహపరిమాణము కల్గినచో మానవశరీరమునందు చేసిన పాపమువలన కీటజన్మము వచ్చినచో నందు ప్రవే శము జీవున కెట్లు సంభవించును. కావున జీవుడు విభువు— అనగా నంతట వ్యాపించియున్నవా డని చెప్పకతప్పదు. మరియు ఆత్మజ్ఞానరూపుడు గాడు. జ్ఞానము ఆత్మయం దుండు గుణము. కర్తృత్వము, భోక్తృత్వము ఆత్మయొక్క స్వాభావసిద్ధ గుణములు. అవి స్వాభావసిద్ధమయిన గుణములు కానిచో శాస్త్రములో చెప్పబడిన కర్మఫలభోగము వ్యర్థ మగును.

బౌద్ధమతము

ఆత్మ జడమైనచో ఘటమువలె అచేతనమగును. కావున జ్ఞానరూపము మఱియు జ్ఞానాశ్రయమును అని అంగీకరింప వలయును.

సాంఖ్యయోగమతము

పరస్పరవిరుద్ధములయిన జడత్వచైతన్యములు ఆత్మయం దుండుట యసంభవము. కాన జీవుడు జ్ఞానరూపుడే. కర్మ ఫల మనుభవించును. కర్తయు, భోక్తయును లేనిచో ఫలా నుభవమే లేకపోవును. అది లేనిచో కర్మ చేయువాడు లేడు. కర్మ లేనిచో వేదమే లేదు. వేదము ప్రమాణ మని నచో జీవుడు చేసినకర్మఫలమును జీవుడు అనుభవించు నని చెప్పక తప్పదు. ఆత్మాధిష్ఠిత మైన దేహేన్ద్రియాదులు కర్మ చేయుచున్నవి. ఆకర్మఫలమును జీవుడు అనుభవించు చున్నాడు. భోగము చేతనమునందే యుండుట సమంజసము. ఈరీతిగా కర్తృత్వము లేకపోయినను కర్మఫలానుభవము జ్ఞానస్వరూపమయిన జీవునియం దుండునని కపిలపతంజలుల యభిప్రాయము.

శ్రీ మచ్ఛంకరభగవత్పాదాచార్యులు:

ఆత్మ సత్తు, చిత్తు, ఆనన్దరూపము అయ్యును ధర్మములు లేని దనియును చెప్పుదురు. దానిని మాయ తన యావరణ శక్తిచేత గప్పి విక్షేపశక్తిచేత ఆత్మనే ప్రపంచాకార ముగా కనబరచుచున్నది. మాయ ఆత్మను ఆశ్రయించి యున్నది. దానికి ఆది లేదుగాని అంత మున్నది. వీరు అనాదు లని యొప్పినవి ఆరు పదార్థములు.

(1) జీవుడు, (2) ఈశ్వరుడు, (3) శుద్ధమైనచిత్తు, (4)

జీవేశ్వరభేదము, (5) అవిద్య, (6) అవిద్యాచిత్తుల సంబంధము. అవిద్య, అజ్ఞానము, మాయ ఇవి పర్యాయపదములు. అవిద్యచేత ఆత్మకు కర్తృత్వభోక్తృత్వములు ఆరోపింపబడుటవలన విధినిషేధశాస్త్రములు బాధింపబడవు. యథార్థముగా పరమానందబోధరూపమయిన ఆత్మకు కర్తృత్వభోక్తృత్వములు లేవు. అనగా శంకరాచార్యులు వారి సిద్ధాంతమునందు ఆత్మకు కృతి యనుగుణముగాని లేక భోగమనెడి సుఖదుఃఖములు గాని లేదని భావము. అయితే నేను చేయవలయును. నేను అనుభవింపవలయును. అనెడిభావము దేనికని ప్రశ్నించినచో అంతఃకరణ మను అన్తరింద్రియమునకే ఆధర్మములు కలవు. అందు చిద్రూపమయిన ఆత్మము ప్రతిబింబభావమును పొందుటచేత దాని ధర్మములు బింబభూతమయిన ఆత్మయందు నారోపింపబడి ‹‹నేను చేయుచున్నాను›› ‹‹నేను అనుభవించుచున్నాను›› అనెడి వ్యవహారము కల్గుచున్నది. ఇదియే ఆరోపితకర్తృత్వ మని చెప్పబడును. ఇట్టి ప్రతిబింబమైన జీవత్వముకూడ కల్పిత మనవలయును. కావుననే సర్వజ్ఞాత్మముని సంక్షేపశారీరికమున నిట్లు నుడివిరి.

"ఆచ్ఛాద్య విక్షిపతి సంస్ఫుర దాత్మరూపం
జీవేశ్వరత్వజగదాకృతిభిర్మృషైవ
అజ్ఞాన మావరణవిభ్రమశక్తియోగా
దాత్మత్వమాత్రవిషయాశ్రయతా బలేన"

ఇదియే అహంపదార్థము. ఇదియే తచ్ఛబ్దవాచ్యము- అనగా పరబ్రహ్మమని భావము.

## బ్రహ్మస్వరూపము

పరబ్రహ్మము సత్యము, జ్ఞానరూపము, ఆనందము, అనన్తము- అనగా దేశపరిచ్ఛిన్నముగాని కాలపరిచ్ఛిన్నముగాని వస్తుపరిచ్ఛిన్నముగాని కానేరదని భావము. శ్రుతి ప్రమాణము.

"సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ"

ఆత్మ పరిచ్ఛిన్నమయినచో వినాశ ముండవలయును. ఆత్మకు నాశము ప్రామాణికము గాదు. వినాశ మనగా అభావము. అయ్యది నాల్గు విధములు (1) ప్రాగభావము, (2) ప్రధ్వంసాభావము. (3) అన్యోన్యాభావము, (4) అత్యన్తాభావము. ఘటము పుట్టుటకు ముందుగా నుండుదాని యభావము ప్రాగభావము అనంబరగును. ఘటము పగిలిపోయినతరువాత దాని యభావము ప్రధ్వంసాభావము అనబడును. ‹‹ఘటము లేదు. పటము›› అనెడి ప్రతీతి విషయమైన అభావము అన్యోన్యాభావము. ఘటము లేదనెడి ప్రతీతి విషయమైన యభావము అత్యన్తాభావము. ఆత్మకు ప్రాగభావము గాని ప్రధ్వంసాభావము గాని గ్రహించుటకు వీలుపడదు. ఆత్మకాని జడపదార్థమయిన ప్రాగభావము గాని ప్రధ్వంసాభావము గాని చక్షురాదీంద్రియములచేతనే గ్రహింపబడవలెను. ఆ యింద్రియములద్వారా ఆత్మచేతనే గ్రహింపబడు నని పర్యవసితమగును. తన యభావమును తాను గ్రహించుట యనునది విరుద్ధము. వేఱొండు ఆత్మ లేదు. ఆత్మ దేశకాలవస్తు పరిచ్ఛిన్నముగాదని నిరూపింపబడినది.

ప్రకృతి జడమును, దుఃఖభూయిష్ఠము నగుటచేత నెంత విమర్శించినను దుఃఖజనకమే కాని ఆనందజనకము కాజాలదు. కావున ఆనందమును పొందుటకై మానవుడు తహతహలాడును. ఆనంద మెక్కడ గలదు? ఆత్మకు ఆనన్ద మెట్లు వచ్చును? అనెడి విషయమును విచారింపవలెను. ఈవిషయమును యాజ్ఞవల్క్యమహర్షి బృహదారణ్యకములో నిట్లు తన భార్య యగు మైత్రేయి కుపదేశించెను. ‹‹న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి, ఆత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి›› అదియే పరమ ప్రేమాస్పద మనియు దానిని బట్టియే మిగిలిన వానియందు ప్రేమ జనించుననియు నిరూపింపబడెను. విద్యారణ్యులు పంచదశిలో ఇట్లు నుడివిరి.

"అయ మాత్మా పరానందః
పరప్రేమాస్పదం యతః
మానభావం హి భూయాస
మితి ప్రేమాత్మ నీక్ష్యతే"

కావున ఆనందరూప మనియు నిర్ధారణచేయడ మైనది. ప్రపంచమంతయు ఆరోపితము, కల్పితము అయినచో కల్పనకు అధిష్ఠాన ముండవలయును. త్రాడు లేనిచో సర్పభ్రాన్తి

పొసగదు. కావున ప్రపంచకల్పనాధిష్ఠానము ఆత్మ యని నచో అయ్యది సత్య మనియే చెప్పక తప్పదు. ఆనంద రూపము సత్యము అయినను అజ్ఞాతమైనచో అనగా ప్రకాశింపనిచో ప్రయోజనము లేదు. బాలుడు పరీక్షలో నుత్తీర్ణు డయినను తాను తెలిసికొనిననే గాని ఆయానంద మనుభవింపలేడు. కావున ఆత్మ జ్ఞానరూప మనియు అంగీకరింపవలయును. మఱియు ప్రకృతియంతయు జడము గావున అంధప్రాయము, చైతన్యరహితము కావున దీనిని ప్రకాశింపజేయుటకై స్వయంప్రకాశ మయిన వస్తువు అవసరము. కావున ఆత్మ స్వయంప్రకాశము జ్ఞానరూప మని చెప్పక తప్పదు. ఈవిషయమునే కాఠకోపనిషత్తులో మంత్రద్రష్టలు వర్ణించిరి.

"న తత్ర సూర్యో భాతి న చన్ద్రతారకం
త మేవ భాన్త మనుభాతి సర్వం
తస్యభాసా సర్వ మిదం విభాతి"

ఇట్టి సచ్చిదానందరూపమయిన పరమాత్మ ఆయా శరీరములలో నున్న సాత్త్విక మైన అంతఃకరణములలో ప్రతిబింబించి జీవు డని వ్యవహరింపబడుచుండెను. అంతఃకరణ రూపమయిన ఉపాధివలననే జీవునకు ఈశ్వరునకు భేద మేర్పడుచున్నది. కావున జీవేశ్వరభేదము కల్పితము. ఉపాధి తొలగినచో జీవుడు బ్రహ్మమే యగును. అద్దములోని సూర్యప్రతిబింబము అద్దము పోయినచో సూర్యుడుగానే ఉండును. అనగా బింబభూత మైన సూర్యునికే అద్దముచేత ప్రతిబింబత్వము అను ధర్మము కల్పితమయ్యెను.

శ్రవణ, మనన, నిదిధ్యాసనాదులచే సంస్కృత మయిన మనోవృత్తిలో పరమాత్మ ప్రతిబింబించినచో నయ్యది అఖండసాక్షాత్కారరూప మయి ప్రపంచ భ్రాన్తిని పటాపంచలు చేసి జీవునకు బ్రహ్మాభేదమును ప్రకాశింపజేయును. ఇయ్యదియే కైవల్యము—తత్త్వమసి మహావాక్యజన్యమైన అఖండసాక్షాత్కారముచేతనే సర్వానర్థప్రహాణి జరుగును అని శంకరభగవత్పాదుల సిద్ధాన్త డిండిమము.

ఇతి శివమ్

# నేను

శ్రీ మంచికంటి వేంకటేశ్వర రావు



సప్తధాతువులచే జనితమై యొప్పెడి
యీస్థూలదేహంబు నేను గాదు
రూఢి శబ్దస్పర్శరూపరసమ్ములం
దెల్పు జ్ఞానేంద్రియాల్ నేను గాదు
వాగ్గమనాదు లేర్పరుపంగ సాగు క
ర్మేంద్రియపంచకం బేను గాదు
పదపడి శ్వాసాదిపంచవృత్తులు గల
ప్రాణవాయువు లైదు నేను గాదు

నిత్యము దలంచెడి మనస్సు నేను గాదు
ఎల్లవిషయావృతాజ్ఞాన మేను గాదు
సచ్చిదానందరూపమై శాశ్వతముగ
నెసగు నిరుపమానం బైన యెరుక నేను.

ఆత్మస్వరూపమం దలరెడి యొక మహ
చ్ఛక్తి మన స్సది సంతతంబు
తలపుల దలచు నా తలపుల నెడద్రోచి
కన మన స్సనునది కానరాదు
కనుకఁ దలంపులే మనసుయొక్క స్వరూప
మది లేక జగతి యన్యముగ లేదు
నిదురించుచుండిన యదనునఁ దలపులు
లేవు ప్రపంచంబు లేదు లేదు

జాగరస్వప్నములలో నెసంగుచుండు
తలపులున్నఁ బ్రపంచంబు గలుగు నాత్మ
రూపము మనస్సు తద్బహిర్ముఖముగాగ
జగము దోచును కానప్డు జగము లేదు,

మనసు స్వరూపం బేమో
యనయము వెదుకంగ దొడగ నదియే తానై
తనరును తా ననునదియే
యనువుగ నాత్మస్వరూప మై వెలుగొందున్.

మనసు స్థూలవస్తువును నాశ్రయించి, యె
ల్లపుడు నుండు నది యిలాతలమున
సూరి జనముచేత సూక్ష్మశరీరం బ
టంచు జీవు డంచు నన దనర్చు.

ఈతనువున "నే" నని వి
ఖ్యాతిగ దోచునది యెదియొ అదియే మన సౌః
ఆతలపు హృదయమున సం
జాతం బని తెలియదగు విచారణవలనన్,

మనసున దోచెడి తలపుల
కును మొదటితలంపె "నేను" కుదురగ నీ నేన్
జనియించిన మీదటనే
యనువుగ బొడసూపు తలపు లర్బుదములుగాన్

నేను దోచిన తరువాత నీవు వాడు
మొదలగు పదంబు లెదలోన బొదలసాగు
జర్చసేయ నుత్తమపురుషంబు లేక
తక్కుపురుషంబు లుండగా దగవు గాదె,

నే నెవడ నను విచారణ
చే నణగు మనంబు తనకు స్థిరతరజన్మ
స్థానం బగు హృదయంబున
నే నిలుకడ జెందు శాంతి నిత్యం బలరన్.

మానసమును వెలుపలకుం
బోనీయక ద్విదళపద్మమున నిల్పుటకే
మానుగ నంతర్ముఖ మన
గా, నహ ముఖ మనగ వెలయుగా శాస్త్రములన్.

మనసున హృదయాంభోజం
బుననుండియు వెలుపలకును బోనిచ్చుటయే
యనబడు బహిర్ముఖం బని
కనుగొనలే దిద్ది ముక్తికాంతామణినిన్,

హృదయమున మనసు నిలిచిన
యదనునఁ దలపులకు మూలమై తగు, నేనుం
దుదముట్టి సత్స్వరూపము
బొదలును నదె మౌన మండ్రు బుధవరు లెల్లన్.

ఎల్లవిషయవాంఛలను నటేట గలిపి
మనసు నాత్మస్వరూపమం దణగు నట్లు
సలుపుటే జ్ఞానదృష్టి, యీ సత్యదృష్టి
గలుగ సర్వంబు తానె యై వెలిగిపోవు

ఆత్మస్వరూపమౌ జగ
మాత్మాకృతి యేను— సత్య మాలోచింపన్;
ఆత్మస్వరూప మీశుం
డాత్మయె సర్వంబు నిశ్చయంబుగ జూడన్.

ఎచ్చట "నే" నుదయించునొ
అచ్చట శ్వాసము జనించి యటువెడలు మనం
బెచ్చో నణంగుఁ బ్రాణం
బచ్చో నణగున్ సుషుప్తియందున దప్పన్

కాయ వ.నది మరణించెనో యనంగ
సందియము నందకుంట కీ సరణి శివుడు
కల్పనము చేసియుండె జాగ్రత్సమాధు
లందు మనసణ్గగాఁ బ్రాణ మణగకుండ

మనసు స్థూలరూప మనఁబడు ప్రాణంబు
మరణమందువరకు మనసు ప్రాణ
మును తనువును దాల్చి— బొంది వీడెడుపట్ల
నరుఁ బ్రాణముఁ దనయందె తాల్చి

మానసమును లోగొనగాఁ
బ్రాణాయామంబు తోడువడునే గానీ
మానసముగూల్పగా లే
దే నిముసంబందు నైన నేగతి నైనన్

తా నిష్టపడిన మూర్తి
ధ్యానమ్మాహార నియమ మల జపములు నా
ప్రాణాయామమువలెనే
మానసమును లోగొనంగ మార్గంబు లగున్.

ధ్యానజపములచే జిత్త మందుకొనును
మంచి యేకాగ్రబుద్ధి యమ్మార్గమునను
శీఘ్రముగ మోక్షరాజ్యంబు జేరవచ్చు
జన్మరాహిత్యపదవి గాంచంగ వచ్చు

జలనిధిఁ దరంగములవలె
జెలగెడి విషయంబులను నశింపగ జేయం
గలుగు స్వరూపధ్యానము
గలిగియు గాంచంగవలయు గైవల్యరమన్

నేను మహాపాపుడ నని
మానకరోదించునట్టి మానవు డటులే
యౌ నౌ— నాత్మధ్యానము
చే నిరుపమపురుషు డగుచు జెన్ను వహించున్

మనసునందు నెంతదనుక విషయవాస
నాళి మెలగుచుండు నంతదనుక
నే నెవండ ననెడి నిర్మలతరవిచా
రణము నరుని కవసరంబ యౌను

శాం తి

జలధిలో దరంగములవోలె జనియించు
తలపులోని పెక్కుతలపు లెల్ల
బుట్టుతావునందె గిట్టింపవలె విచా
రణముచేత జ్ఞానగుణముచేత,

అరయ సుఖమనంగ నాత్మస్వరూపమే
కాని - యైహికపుసుఖంబు లెల్ల
శాశ్వతములు గావు సర్వవాంఛలనుండి
మరలినప్పుడ గలుగుఁ బరమసుఖము,

నిద్రవేళ సమాధిలో నెగడువేళ
మూర్ఛవేళ, గోరినకోర్కెఁ బొందువేళ
నరికి గీడువాటిలువేళ సరసి మనసు
కాంచు నంతర్ముఖంబై యఖండసుఖము

ఈవిధి మానసము వెలికి
బోవుచు లోనికిని మరలిపోవుచు సతమున్
భావింపగఁ బలువాంఛల
తో వెతలన్ సుఖము లంది తూలుచునుండున్

మ్రానిక్రింది నీడ ప్రబలసౌఖ్య మొసంగు
బయటియెండ మిగులబాధ పరచు
నెండనుండి నీడ కేగివచ్చును నల్పు
డనఘు డెపుడు నీడయందె యుండు,

జ్ఞానిమనసు బ్రహ్మములో
లీనం బజ్ఞాని మది విలీనము జగమం
దానందం బే బ్రహ్మం
బా నిగమాతీతు జ్ఞాని యరయు సతంబున్

స్వాంతమెదుట సూది కదలెడిపోల్కి సం
కల్పరహితు డగుచు గ్రాలునీశు
సన్నిధానమందు జనులు కర్మలు చేతు
రతనికెట్టికర్మలంటబోవు.

లోకకర్మలు సూర్యుని దాకకుండు
నటుల నీశున కేకర్మ లంటబోవు
ఆమహేశునియందు నైక్యంబు జెందు
సరణి వేరులే దిక మనోజయముదక్క.

తన్ను వదలకుంటె తిన్న నౌజ్ఞానంబు
అద్ది కలిగియున్న యలఘుమతికి
నమలమోక్షపదవి హస్తామలక మౌను
ముక్తికాంత దాసిబోలె మెలగు.

కోట నెంతవరకుఁ గ్రూరారు లుందురో
అంతదాక వెలికి నరుగుదెంత్రు;
వచ్చువారి నణప వశ్యమౌ నాకోట
నటుల దలపులెల్ల నణపవలయు,

గురువును దైవం బొకటియె
పరికింపగ వేరుగారు పరమార్థము స
ద్గురు వాదరమున దెలిపిన
కరణిం జనుచే ప్రశస్తకార్యము తలపన్.

ఆత్మచింత తప్ప నన్యచింతలకు దా
వీక నాత్మనిష్ఠ నెసగియుంట
దనకు దానె యీశ్వరున కర్పితం బౌట
నందువలన భారమందు శివుడు

ఎల్లకార్యములను పరమేశుశక్తి
నడుపుచుండగ గనుచు లోబడుట మాని
యటుల జేసెద నిటు జేతు ననుచు వెఱ్ఱి
కోరికలతోడ నల్లాడు గోల యేల?

సర్వభారాలు పోగబండి సంగ్రహించు
కొనియు నేగుట దెలిసియు మనము, మనదు
మూటనం దుంచి హాయిగా బోక మూట
దలపయిని దాల్చుకొని పోవు సిలు గదేల?

ఆమనోనిగ్రహము జెంద ననవరతము
నే నెవడ నను సువిచారణానిమగ్ను
డై- తనను దా నెరింగి యనంతనిశ్చ
లానుపమనిర్మలానంద మందవలయు.

పంచకోశాంతరంబున బరగుఁ దన్ను
పంచకోశాల వెలుపల బరగు శాస్త్ర
ము లెటు దెలియంగ జాలు నామూఢభావ
ములను విడి తన్ను దా నెర్గి మెలగవలయు.

ఊడ్చివేయు చెత్త నొగి బరీక్షించుట
వలన లాభ మరయ బండిసున్న
తనను దాను తెలిసికొనక శాస్త్రాలలో
వెదకు టెల్ల వట్టి వెట్టియూహ

తానె యెల్లజీవులలోన దనరు వస్తు
వగుట నొరుల కిచ్చెడి దాన మరయ దనకు
దానె యర్పించుకొనునట్టు లౌను నిద్ది
యెరిగిన మహాత్ము డితరుల కేమి యీడు !

తాను లేచిన నన్నియు దాండవించుఁ
దా నణంగిన నన్నియు వే నశించు
నెంతకెంతకు మనసు జయింప గలమొ
అంతకంతకు సౌఖ్యమ్ము లందగలము.

చెవికిఁ జెవి మదికిని మది జీవమునకు
జీవ మక్షికి నక్షియై చెలగు నేది !
వాక్కునకు వాక్కయిన పరవస్తు వేది ?
అట్టి నిశ్చలజ్ఞానబ్రహ్మంబ నేను

ఈజగత్తు బ్రకాశింప నెలమి నేది
సలుపునో యట్టి యద్భుతశక్తి నేను;
క్ష్మాతలంబున జీవునిగా జరించు
నేను నిజముగ బరమాత్మనే తలంప-

దారువందు నగ్ని దాగియుండినమాడ్కి-
బ్రణవనాదహృదయమునను దాగి
బయలుపడక సతము భాసిల్లు జ్యోతిస్వ
రూపి నేన చిత్స్వరూపి నేన-

ఆపరబ్రహ్మమూర్తి నైనట్టి నేను
దప్ప- నన్యంబు లేదు లే దెప్పుడైన
లోకసంతానమును కుక్షిలోన నిల్పు
కొన్న దైవంబునకు నా కభిన్న మగును.

బాగుగా జూడ శాశ్వతబ్రహ్మ మేన
వెనుకముందును నేన -దక్షిణము నుత్త
రంబునన్ నేన -సర్వజగంబు నిండి
యుండిన మహాప్రభావయుక్తుండ నేను.

క్రింద మీద నిండి శ్రేష్ఠమై యుండిన
విమలవస్తు వేన- విశ్వ మేన
నేను గాని దేది నిఖిలప్రపంచాన
లేదు నిశ్చయముగ లేదు లేదు.

అద్వయాఖండరూప మాద్యంతరహిత
సచ్చిదానందరూపము- సర్వజీవ
హృదులజ్యోతిస్వరూప మై యేది గలదో
ఆమహాసత్పదార్థమే యగుదు నేన-

నేను జనియించుటకు ముందు భానుడాది
గ్రహములును తారలును వృక్షగణము లేమి
లేవు- సాగరములు లేవు లేవు- రేబ
వళ్ళు సైతము లేవు- విశ్వములు లేవు.

అగ్ని దహియింప లేదు- న న్నంబువులును
తడుపగా జాల వస్త్రశస్త్రములు ద్రుంప
జాలవు- శతఘ్నులును గూల్ప జాల వింత
యేల- ఆత్మస్వరూపుడ నెపుడు నేను-

# పద్మము

శ్రీ అన్నంరాజు సత్యనారాయణ రావు



నారాయణోదర నాభియం దుత్పన్న
మై యశస్సంపద నరసినావు
సృష్టికర్తను బొట్టఁ జేర్చుక జన్మకు
కారణం బై ఖ్యాతిఁ గాంచినావు
శ్రీలతాంగికి సుఖాసీనంబ వై లోక
కళ్యాణవిభవంబుఁ గాంచినావు
ముగురమ్మలకు హస్తముల నలంకార మై
సౌభాగ్యరాంద్రుఁగా సలిపినావు

చెఱకు విలుకాని శృంగార చేష్టలకును
నాయుధంబ వై ప్రాభవ మందినావు
సకలశుభసంపదాకర స్థాననిలయ
పద్మరాజమా! యవిరళప్రముఖచరిత

అట రత్నముల నసంఖ్యాకంబుగాఁ గన్న
సాగరుండుండు నీ సరస నెపుడు
విశ్వమెల్లెడలను- వెలుఁగునిడెడు సూర్య
భగవానుఁ డగు నీకు బాంధవుండు
సకలకల్మషముల సంహరింపఁగఁ జాలు
వెన్నుండు నిన్నెప్పు వీడకుండు
ప్రమథగణపతి, శ్రీ వరసిద్ధి విఘ్నేశుఁ
డనయంబు నీ తోడ నలరియుండు

విశ్వవిఖ్యాతి నార్జించి వెలసినట్టి
నిన్ను మించిన వస్తువు లున్న వొక్కొ-
నవ్యకోమలమృదుమధుదివ్యరూప
సంతతసుగంధవిలసిత సరసిజాఖ్య!

మూఁడులోకముల స-మ్మోహించు సుందరి
వదనంబు నినుఁబోల్చి వడయుఁ దృప్తి
ఆదివిష్ణువునకు నైన నయనముల
నినుబోల్చి తృప్తినిం గనఁగ వలయు
ఆదిశక్తి కరము నైన నీయరుణకాం
తికి సరిపోల్చి సంతృప్తిఁ గనును
జవరాలిచనుజంట సరిగ కన్నుఁ దెరువ
నినిను బోల్చుకొనుచుఁ గనును దృప్తి

కాని నిను మీఱు నందంబు కాన రాదు
కవిహృదయమున కేనియుఁ గాన రాదు
జన్మజన్మాంతరముల నీ సత్ఫలంబు
గాక మరియొండుఁ గలదె? విఖ్యాతచరిత!

సుగుణము లెన్నో యున్న, గడు
సుందరరూపము పొందియున్న, ధీ
రగుణులు తోడునీడయిన,
రమ్యతసౌరభ మందియున్న, నీ

ప్రగతికి మచ్చ యొండు నయి
ప్రాభవహీనము చేయఁజూచెడిన్
మగటిమి కాంచనంబుకు స
మానము నా గుణ మెందకై వడిన్.

చల్లని ఱేఁడు, రూపమున,
జక్కనివాఁడు, ప్రసన్నమూర్తి నీ
చెల్లెలి ఉల్లమందు సుధ
చేర్చెడి నెచ్చెలిగాఁడు మంచివాఁ
డల్లవిరోధిగా జనన
మందిన నాటనుగోలె నాయె, ను
త్ఫుల్లహృదంతరాళపరి
పూర్ణవిశుద్ధుఁడు చంద్రుఁ డేలకో.

ఇంతగ దేవతాగణము
లిచ్చల నెచ్చెలు లౌట నబ్బెవే
దాంతము, స్వార్థహీనతయు
నంటియు నంటని సద్గుణంబు నీ
కెంతయు వచ్చెఁ బత్రమున;
నిమ్ముగ మెక్కఁగ రాజహంసకున్.
వింతగఁ దూండ్ల నిచ్చెదు వి
వేకివి, దేహము త్యాగ మొప్పగాన్

హృదయమును విప్పి, యాదార్ద్ర మెఱుకపఱచి
సహజసంభవమధుకోశ సహరహంబు
నర్థి మధుకరిసంఘంబు ప్లోద మొందఁ
జేయు దాతృత్వ మీయది చెప్పఁ దరమె!

('కిరణములు' : ఖండకావ్యమునుండి

# సంక్రాంతి తలఁపులు

## శ్రీ తుమ్మల సీతారామమూర్తి



వెచ్చనిగడ్డిపై నడుగువేయుచు మంచుమొయిళ్ళబంటుగా
వచ్చిన సీతుకక్కసికి వంగక గిత్తలబంతి దోలుచున్
బుచ్చిన కొయ్యలోఁ జివురుపుట్టునటుల్ వలిపాట పాడుచున్
రెచ్చిన జవ్వనంబును స్మరించెద నీమకరోత్సవమ్ములన్.

రెపరెప సెజ్జవీడి నిదురించు నెలంతను మేలుకొల్పి వం
టపనులు దెల్పి జాలి నిగుడన్ ననుఁ జూచు వెలంది నెట్టెటో
కృపకు ధనిష్ఠఁ జేసి వడిరేయికడన్ బసితోడ నేగి రేఁ
గిపడుగు నూర్చినాడఁ బరికింప నదెంత కఠోరనిష్ఠయో.

పడు గటు నల్లుచుండ నిటు పాఁతఱ సంగతి నెంచి గింజలం
బిడిచిన సేకె నేర్చి సరిపెట్టి నెఱామొలత్రాడుకై వడిన్
బుడుపులురాని శిల్పములప్రోవును వెంటిని దీర్చి నిల్పినన్
సిడమువిధాన నిచ్చెఁ బదిచేతులపాటిది యయ్య నయ్యెడన్.

అరుణమయూఖబింబ ముదయాద్రికిఁ జేరకమున్నె పొట్టలో
నెరగలి సాగె నప్పు డది యేమి బుభుక్షయొ; కూడికావడుల్
దరిసెన మిచ్చుదాఁక నయథాతథమై నయనద్వయమ్ము నాఁ
డరిమురి పడ్డతీరు తెలియంగలవా రొక కాఁపులే కదా!

బట్టనవ్రేళ్ళతో నదిమిపట్టిన మిర్యపుఁగాయ నంజుచున్
దెట్టలు తెట్టలై మిసిమిదేలిన మజ్జిగబువ్వ దోసిటం
బట్టి బుభుక్షతీవ్రతలు పాయఁగ జుర్రిననాఁటితృప్తి నా
పొట్టకు ముట్ట దీముదిమిప్రొద్దుల సాపడుపిట్టమేఁతలన్—

ఊరుఁగాయలు పచ్చడుల్ పులుసు లేవో కూర లైదాఱు సాం
బారున్ మీఁగడ లప్పడాలు వడియాల్ వడ్డించినన్ నేఁ డిసీ
చేరెం డన్నము లోనికిన్ దిగ; దహో! చిన్నప్పు డే నొక్కఁగోఁ
గూరన్ గుండెఁడుకూడు మెక్కితి నెఱాగోతాలతో మూఁకిటన్.

గట్టితనమ్ము చిందఁ బిడికట్టకు సాగిన దెబ్బదెబ్బకున్
బుట్టెఁడు రాలి రాసివడెఁబో! కుసుమల్; కడియమ్ముమీఁదికిం
బట్టినగడ్డి నొడ్డి పన పంజినచోఁ బదిమోపు లుండు నా
రెట్టబలమ్ము నేఁడు సయిరింపదు పీసెడుకూర లెత్తఁగన్,

అబ్బు పులిసి గిత్త యంకె వైచినతఱి
నడుముగట్టి పట్టి మెడకుఁ దార్చి
యాబిలోని బండి నూఁపి లేపిన మొన
గాఁడ వెఱతు నిపుడు కడవఁదోడ.

ఆబల మాజవమ్ము సగ మైనను లేమికి నావయస్సులో
నేఁబదిరెండు వత్సరము లేగుట కారణ మౌను? తాతలై
ప్రాఁబడినట్టి కర్షకులు బంధుజనుల్ పిడిరాళ్ళకై వడిన్
రేఁబవ లింట దుర్భరపరిశ్రమకోర్చుచు నార్చుచుండగన్.

ఈదౌర్బల్య మకాలవార్ధకము నాయీకొన్న పీఠమ్ముతో
బ్రాదుర్భూతము లయ్యె నొజ్జన మెదో భాగ్యంబుగా నెంచి నా
పాదెల్లన్ గదిలించుకొంటిని, రుజాభారమ్ము నార్జించితిన్,
జేఁదున్ మెక్కితిఁ బంచదార యని సీసీ ధర్మమున్ దక్కితిన్.

ఒక మరకై వడిన్ గదలుచున్నయెడల్ కురిచీకి దత్తమై
సకలజవమ్ము గోల్పడియె సంధులు గ్రంధులు త్రుప్పువట్టెఁ బొ
ట్టకు శని దాపురించె నకటా! నికరమ్మగు జుత్తువోయె సం
దుకొనెఁ దెగుళ్ళు మందులను దోఁగితి వేఁగితి నొవ్వు గ్రొవ్వులన్.

రొక్కములేనినాడు కొమరుల్ తలచూపనినాడు వైదుషీ
రుక్కులు రానినాఁడు పదురున్ గొనియాడనినాడు గద్దియల్
దక్కనినాడు మానిసి వెతంబడ నొల్లకపోవుఁగాక వాఁ
డుక్కునఁ జేదయై రుజలకోడిననాడు తపింపకుండునా ?

అన్నము దిన్న చేతితడి యాఱియు నాఱక ముందె వేళ పై
కొన్నఁ బ్రమాదమంచుఁ బరుగుల్ నురుఁగుల్ వెడలించి రొప్పుచు
న్నన్నినవేసటన్ నిలువఁబట్టుచుఁ దిన్నది గొంతుదాఁటి పో
కున్నను బాఠముల్ నుడువుచుండవలెన్ విధి కంజలించుచున్.

అటు నిటు నేగి వచ్చి గడియారపురంకెల కోహటించి యాఁ
కటినెగు లెంతయున్న నరికట్టి హుటాహుటి దుమ్ముఁగాళ్ళతో
జొటజొటజాఱు క్రొంజెమరుఁ జుక్కలతో బడికేగి నాయికా
నటనలు సెప్ప లంకణమునన్ మఱుగల్పు తెఱంగు కన్పడున్.

పదుగురకుఁ గాదు మఱి యి
ర్వదిమందికి గాదు బుద్ధిబలశూన్యుల కేఁ
బదిమందికి వినఁబడు న
ట్లదలింపవలెన్ గళంబు నాసాయమ్మున్.

వలచి పఠించువారు పదివందలు వచ్చిన ముద్దుముద్దుగాఁ
దెలిసినవట్టు నేర్పి పరితృప్తి వహింతు సహింతుఁ గాని కా
కులు వరశుల్కపుంజదువు గోరెడిబొట్టెలు చట్టులైనచోఁ
గలఁగి నలంగి నెవ్వగలఁ గందక కుందక యుంట శక్యమా ?

మూఁగిన యూర్పుతోడఁ దలమున్కల వేదనతోడఁ బాఠముల్
వాఁగిన జాలునా ? పొరలివచ్చు పరీక్షలు లక్షదోసముల్
రేఁగిన వ్యాసముల్ పొరిఁబొరిన్ సవరింపకతప్ప దొజ్జకున్
మూఁగిన పాప మీ చెనటిమందల వ్రాఁతల దిద్దితీర్పుటల్.

చర్చలు చేసిచేసి గురుసత్తములన్ గొనియాడి యాడి నా
నేర్చిన నే ర్పులంతి యన నేరను సోమరిఁ గాను బల్మివో
నార్చితి విన్నినాళ్ళ తుద కబ్బిరి నల్గురు మేటి శిష్యులే
వోర్చిన తక్కునోవి యిసిరో! వితయైనది చెత్తమూర్చు తై.

కూఁతురు వంజ యౌట కన్నుఁగోక మగంటిమి లేనివాఁడు జా
మాత యటన్నటుల్ పనికిమాలిన కుంతలు తోఁకలేని యీ
క్రోఁతులు నెగ్గకున్న నది కోవిదులోటని తేల్చి వానికిన్
వాతలు పెట్టఁ జూతు రనివార్యులు జీతము నిచ్చునేలికల్.

ఇంత శ్రమించి యీతొడుగు నీడ్చి గడించెడు సంబళంబు వా
రాంతము రాకమున్నె వ్యయమైచను నెంత బిగించి పట్టినన్
సంతనచేసి మత్పిత యొసంగిన భూములు బుట్టలుంట నా
గంతులు సాగుచున్నవి బికారికిఁ బెట్టఁగ నిల్లు నెట్టఁగన్.

నెట్టికసీల నొజ్జను గణించుట మెచ్చుట కల్గినప్పు డీ
పొట్టకు బట్టకైన సరిపోవని రాబడి కియ్యకొందు మై
గట్టితనమ్ము క్రక్కదలి గాసికి దాసుఁడ నౌట సైతమె
ట్టెట్టొ సహింతుఁ గాని పరువెంత వశంపడు నయ్యవారికిన్.

కూటికి లేని సోమరులకున్ సరిపోవునుగాని సేద్యపుం
బాటున ముగ్గి తేలు బలభద్రులకున్ బడికొల్వు గిట్ట; దీ
మాటలు త్రచ్చి సెప్పితి సుమా! యివి బుక్కలమీఁది బుక్క; లీ
బాటకు రండు మోహ మెడఁబాసి సుఖింపుఁడు కర్షకప్రజల్!

"పంతుల వౌట నీకవిత పండె, సముజ్జ్వలకావ్యసృష్టికిన్
సంతనగట్టి గెల్చితి, ప్రజల్ ప్రభువుల్ కనకాభిషేకభా
స్వంతు నొనర్పఁ గుల్కితి, వసత్యమె యీపలు" కందురేని రా
ద్ధాంతము జోలి కేగ, వినయ మ్మెసరేఁగ శిరమ్ము వంచెదన్.

# తత్త్వదృష్టి

శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రి



ఓ జగన్నియంత ! ఓ మూలకారణ !
సర్వశక్తియుక్త ! జ్ఞానమూర్తి !
ఓ యనాదినిధన ! ఓ మోక్షసంధాత !
భక్తియోగగమ్య ! పరమపురుష !

నిన్నుఁ బొగడిన నుబ్బి మన్నింతు వనియు
నిన్నుఁ దెగడినఁ గనిసి దండింతు వనియుఁ
గొంద ఱంద్రది మృష యనుకొందు నేను
స్వామి ! నీకును గోపతాపములు గలవె !

స్వీయు లని కొందఱికి మేలుచేయు దందు ;
రన్యు లని కొందఱికి కీడు నాచరింతు
వందు; రది యెల్ల మృష యనుకొందు నేను
తండ్రి ! నీకును పక్షపాతములు గలవె ?

శిష్టసంరక్షణార్థంబు, దుష్టశిక్ష
ణార్థ మవు డప్డు పుట్టువు నందుచుందు
వందు; రది యేమొ మృష యనుకొందు నేను
దేవ ! నీకును పుట్టువు- చావు గలవె ?

పనిలేనిపనిగ నేఁ దనువుఁగైకొనఁ బూని
నవు డేల వల్దన వైతి వయ్య !
కానితలంపు నాలోనఁ బుట్టిన యప్డె
ఆరసి యేల నీ వణఁప వయ్య !
నియతిమాలినపల్కు నేఁ బల్కఁ బూనుచో
నవు డేల యిది కూడ దనవు దేవ !
వెడఁగుఁ జెయ్దమ్ము గావింపఁగ నే సిద్ధ
పడ నేల నీ వడ్డుపడవు స్వామి !

చేయరాని పనుల్ ముందు చేయనిచ్చి
అవల శిక్షింతువా ! యేమిః న్యాయ మయ్య !
అదుపునం దుంచుకొనుము ; లేదా, పొనర్చు
తప్పులు క్షమింపు మయ్య వందన మొనర్తు.

నీపెత్తనంబు ; లేదా,
నాపెత్తన ; మంతెగాని, నా తనువున నీ
నాపెత్తనములు పెనిచినఁ
దాపమెగా కెట్లు శాంతి తనరారు ? హరీ !

"కర్మహతి నాఁగ హరికృప
వర్మం" బని బుధులు పల్కు పల్కు నిజంబా !
"కర్మం బనుభవ్యం" బని
మర్మజ్ఞులు చెప్పునట్టి మాట నిజంబా ?

పరిపరిగతుల, సర్వవ్యాపకుని నిన్ను
వెదకఁబోయితి నెంత వెఱ్ఱి నయ్య !
నీనామరహితత నే నెఱింగియు నట్టె
పిలువఁ బూనితి నెంత వెకలి నయ్య !
సర్వసముఁడ వన్న సంతన యెఱిఁగియు
పొగడసాగితి నెంత మొరటు నయ్య !
ఆకారశూన్యుఁడ వౌ టెఱింగియు నిన్ను
నరయఁగోరితి నెంత మొఱకు నయ్య

అవగతంబయ్యె నిగమరహస్య మెల్ల ;
ఆకళింపయ్యె ప్రకృతిగూఢార్థ మెల్ల
నేనె నీ వౌట యీనాఁటి కెఱుఁగ నయ్యె
స్వాంత మింతకు, తండ్రి ! నిశ్చింత మయ్యె.

# రూపములు మాఱిన పదములు

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

✻

నన్నయాదులు వాడిన తెనుఁగుపదములు కొన్ని, కాలక్రమమున రూపమున మార్పు నందినవి. మన మీనాఁడు వాడుకలో నున్న రూపములను ప్రయోగించుటలో తప్పు లేదుగాని, పూర్వరచనల నుదాహరించుటలో, ఈనాఁటి వాడుక ననుసరించి, ఆ పాఠములను మార్చఁగూడదు. అట్లు మార్చుట, యిటీవల అలవాటుపడినది. అందుకు తార్కాణగా, ఒకటి రెండు పదములనుగూర్చి మాత్ర మిక్కడ ప్రస్తావించుచున్నాను.

## 1. 'తెలివి'

'తెలివి' అని, ఇదంతముగా మన మిపుడు వాడుచున్న పదముయొక్క మొదటిరూపము 'తెలివు'. (ఉదంతము). నన్నయభట్టారకుఁడు, ఉదంతరూపమునే వాడినాఁడు. నన్నెచోడునినాఁటికి 'తెలివి' యనురూపము వచ్చినది. నన్నెచోడుఁడు, తిక్కన, ఎఱ్ఱనయును, 'తెలివు'-'తెలివి' యను రెండురూపములను ప్రయోగించినారు. 'తెలివు' అనురూప మీ క్రిందిరచనలలో కనఁబడుచున్నది.—

(1) «పలుకులముద్దును గలికి క్రాల్గన్నుల తెలివును» (ఆది. 3. 27)

కన్నుల తెలివు = కన్నులధావళ్యము.

(2) «వా, తెఱయును దీని యానవము తెల్వు మనో హరంబులు» (ఆది. 7. 74)

ఆననము తెల్వు = ముఖవికాసము.

(3) నేఁతికుండ మోచియే† తెలివున సోబ
నాలు వ్రాకు నైపుణంబు గలుగు
పురుషునట్లు యోగపరిణతుండును నాత్మ
నేమఱక విముక్తి కెక్కవలయు» (శాంతి 5.587)

తెలివునన్ = మెలఁకువతో - అని యిక్కడ అర్థము.

(4) ముక్కున నోరను నెత్తురు
గ్రక్కున వెడలంగ ధైర్యకలితుఁ డగుటఁ దా
నొక్కింత సైఁచి యంతన
నెక్కను తెలివునఁ బ్రహసనిర్భరమతి యై». (హరి. ఉ. 6. 65)

ఇక్కడ, నెక్కొను తెలివునన్ పురికొను ఉత్సాహముతో — అని యర్థము.

ఇట్లు భారతకవులు ముగ్గురును వాడిన 'తెలివు' అను పదము మఱుఁగుపడిపోయినది. నేఁడు వ్యవహారములో లేదు. కవులును ప్రయోగించుట లేదు. పలువు రాపదమునే యెఱుఁగరు. ఇతరులమాట యెందుకు? శబ్దరత్నాకరకర్తయే గుర్తించ లేదు. శ. ర. లో 'తెలివు' లేదు. 'తెలివి' మాత్రమే యున్నది. అందువలన, శ.ర. మీఁదనే యాధారపడి భారతమును పరిష్కరించినవారు అందలి 'తెలివు'ను, 'తెలివి'గా మార్చుటయు జరిగినది.

«ఆననము తెల్వు» అను పాఠము (1921 సం.) వావిళ్ల ప్రతిలో «ఆననము తెల్వి»గా మాఱినది.

శ. ర. కర్త 'తెలివు' అను రూపమును గుర్తింపనందున, «సిద్ధ మెవ్వారిఁ దెలివొందఁ జేయునేర్తు» అను తిక్కన (ఉద్యో. 3. 263) ప్రయోగమును 'తెలివి' అను పదము క్రింద, ఆపదమునకు ప్రమాణముగా నుదాహరించినాఁడు. కాని, తిక్కన వాడినది 'తెలివు' గాని 'తెలివి' కాదు.

† «యే తెఱఁగున సోపనాలు» అని శ. ర పా. (చూ. సోపనము) ఈ పాఠమున అర్థము కుదురదు. శబ్దము 'సోబనమో'—సోపనమో విచారింపవలసియున్నది.

శ. ర. కర్త ‘తెలివి + ఒంద’ అని యనుకొనియుండును. అది పొసఁగదు. ఆ విభాగమున ఇత్వసంధి యగును. ఇత్వసంధి భారతకవిసమ్మతము కాదు.

ఇక్కడ చెప్పవలసిన విశేష మొకటి యున్నది. అది యేమనగా: సప్తార్థప్రకాశికాకర్తలు — శ. ర. ననుసరించే కాఁబోలు— “ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగా నగు” నన్న (సంధి. ౫) సూత్రముక్రింద “తెలివొందు” అను ప్రయోగమునే ముఖ్యముగాఁ జూపి, ‘భారతములో ఇత్వసంధి విరివిగా నున్న’దన్న భావమును వెలిపుచ్చినారు. భావకు ప్రమాణమై యున్న నిఘంటువు “తెలివొందు” అను ప్రయోగములోని పదము ‘తెలివి’ యని చెప్పినప్పుడు, ఆ వ్యాకర్త లట్లు భావించుటలో తప్పేమున్నది? మఱియు వారు, ఇత్వసంధికి భారతమునుండి యింకను కొన్ని యుదాహరణలను చూపియున్నారు. కాని వాటిలో చాలాభాగము నిల్చునవిగా లేవు. ఆ విచారణ కిది చోటు కాదు. “తెలివొందు”లోనిది ఇత్వసంధి యగునా?— అన్నదే యిక్కడ విచారణీయమైన యంశము.

శ. ర గమనింపని ‘తెలివు’ను, సూర్యరాయనిఘంటువు గమనించినది. “కాంతి, ప్రకాశము, నైగనిగ్యము” అని యర్థము చెప్పి, “క్రాల్గన్నులతెలివు”— “ఆననము తెల్వు” అను రెండుప్రయోగములనుగూడా ఇచ్చినది. కాని, ఆ ‘తెలివు’ క్రిందనే చూపవలసిన యీక్రింది ప్రయోగములను, శ. ర. వలెనే, ‘తెలివి’ క్రింద చూపించినది.

“ఆ తెలి వాత్మతత్త్వమునకు” (అను. 4. 194)
“తెలివొందినఁ గాక” (అను. 5. 163)
“మీ తెలి విట్లు గోరుచు నున్నారము” (ఆశ్ర.I. 96)
“జలముల తెలివెల్ల” (నన్నె. కు. సం. 8. 157)

ఇట్టి యుదాహరణ లింకను కొన్ని గలవు. అన్నింటిలో” ఉన్నపదము ‘తెలివి’ యనియే సూ. ని. భావించినది. ఇత్వసంధి యనియే తలంచినది. ‘తెలివు’ అను రూపమున్నదిగావున, ఆ ప్రయోగము లన్నింటిలోను ‘తెలివు + ఆత్మతత్త్వము = తెలివాత్మతత్త్వము.’ ‘తెలివు + ఒంది = తెలివొంది’ ఇత్యాదిగా ఉత్వసంధి యనియు, ఆప్రయోగములను ‘తెలివు’ క్రింద చూపుట యుచితముగాని, ‘తెలివి’ క్రింద చూపుట యుచితము కాదనియు నాయభిప్రాయము.

సూ. ని., శ. ర. ననుసరించుటచేత ఈప్రమాదము జరిగినదిగాని తాను స్వయముగా విచారించియున్నచో జరిగి యుండదు. అందు నొక్క దృష్టాంతము—

## ‘చెఱి’

‘ఒక్కొక్కనికి’ యను నర్థమున, ‘చెఱి యొకటి’— ‘చెఱి సగము’ అనుట నేఁటివ్యవహారము. ‘చెఱు’ అనుట భారతకవులకు పరిపాటి.

ప్రయోగములు:

(1) “మీ కేవురకుం జెఱు నూఱేసి యిచ్చెద.” (ఆది. 7. 51,)

(2) “అందఱుకుం జెఱు వేయు నేసి.... ధేనువుల” (సభా. I. 15.)

(3) “పాదవి చెఱొకపోటు వొడుచు నెడలు” (విరా. 3. 164)

(4) “చెఱొక్క యక్షోహిణితోడ” (ఉద్యో,I. 219)

శ. ర. లో ‘చెఱి’ యే గాని ‘చెఱు’ లేదు. శ.ర. కర్త నన్నయ ప్రయోగించిన ‘చెఱు’ నెఱుఁగక, ‘చెఱి’ యను పదముక్రింద నన్నయరచనను,—“చెఱి వేయివేయి ధేనువుల నిచ్చె. (సభా. ౧. ఆ.)” అని యుదాహరించినాఁడు. (ఈ పాఠము తప్పు.)

సూ. ని., యీ ‘చెఱి’ విషయమున, శ. ర. ననుకరింపక, ‘చెఱు’ అను రూపమును గ్రహించి, పూర్వపాఠములను సరిగనే యుదాహరించినది. కాని, ఆయుదాహరించుటలోను కొన్నిపొరపాటులు జరిగినవి. వ్యాసవిస్తరభీతిచేత ఆవిషయముల నిక్కడ స్పృశించుట లేదు.

సూ. ని. లో సవరింపఁబడవలసిన పొరపాటులు, పలుతావుల కనఁబడుచున్నవి. ఇక్కడ ఒక్కటిమాత్రము చూపించుచున్నాను.

## 'మీఁదఁ జూచు'

సూ. ని., “మీఁదఁజూచు = గర్వించు, ఔద్ధత్యము నొందు” అని యర్థము చెప్పి, యీ క్రింది పద్యము నుదాహరించినది.

> “సిరిపెంపునఁ గడు నొప్పెదు
> సురనాయక! యిపుడు; మీఁదఁ జూచెదు నీకుం
> బరిభవము దెచ్చుటకునై
> కరము వెసన్† వచ్చు చేటుకాలము తెలుఁగున్”
>
> (శాంతి. 4. 435)

క్రియ, 'మీఁదుచూచు'—'మీఁదులుచూచు' అని యేక పదముగా నుండునుగాని, 'మీఁదన్ = పైభాగమునందు చూచు'—అని వ్యస్తముగా నుండదు. మఱియు సూ. ని. చెప్పిన యర్థమున్నూ పద్యమున సరిపడదు.

“సురనాయకా! ఇపుడు సిరిపెంపునన్ కడునొప్పెదు; నీకు పరిభవము దెచ్చుటకై, కరము వెసన్ వచ్చు చేటు కాలము తెలుఁగును, మీదన్—చూచెదు” అని సమన్వయము.

“నీ విపుడు - ఐశ్వర్యాతిశయముచేత పొంగిపోవుచున్నావు. కాని, ఇది శాశ్వతము కాదు. నీకు పరాభవమును తెచ్చుకాలము త్వరలోనే రానున్నది. మీఁదన్ = తరువాత (భవిష్యత్తున), నీవే చూచెదవు” అని పద్యార్థము.

కాఁబట్టి 'మీఁదఁజూచు' క్రియ యనుటయు, దానికి 'గర్వించు' అని యర్థము చెప్పుటయు సరిగాదు.

## 2. 'ముందర'

మననిత్యవ్యవహారమున నున్న 'ముందర' అను పదమునకు, తొలిరూపము 'ముందరు'. (ఇది ప్రథమావిభక్తి రూపము). 'ముందరన్' అనునది, సప్తమ్యర్థము నిచ్చు ద్వితీయాంతరూపము. ద్రుతలోపముచేత 'ముందర' యని వ్యవహరింపఁబడుచున్నది. వ్యవహారము ననుసరించి, శ. ర. కర్త, 'ముందర'ను, ప్రథమాంతముగా గ్రహించి, ఇట్లు వ్రాసినాఁడు.

“ముందర. దే. వి. 1. మునుపు. “తైలధాన్యములఁ జెచ్చెర ముందర సంగ్రహింతురు.” (భార. అర. 3 ఆ.) —“ముందఱ=1. ఎదురు. “తిద్దేవి కిచటు ముందఱగాదె” (కళా. 3. ఆ.). —3. మొదలు “ముందఱ అరదము డిగుము” (శల్య. ౨. ఆ.)”

సూ. ని., 'ముందరు' అనురూపమునుగూడా చూపి, యిట్లు వివరించినది.

“ముందరు (రు) = ముందఱు (ఱు). వి. దే. ముందు. (అదంత మని శ. ర., వ్యవ.— ప్రయోగములందు లోప విభక్తికముగాఁ గానవచ్చుటచేతను, క, సం. లో నుదంతముగా నుండుటచేతను, పై రెండురూపములును గ్రహింపఁబడినవి. నిర్ధారకప్రయోగములు లేవు).” అని చెప్పి, సూ. ని. యీక్రింది ప్రయోగము లుదాహరించినది.

> “వెనుకముందర లేక వెనరైన చుట్టాలు”
> (నైష. 1. 107)
>
> “నేలవేల్పు తలముందరి పల్లియ కేఁగి”
> (నీలా. 1. 100)
>
> “వీరలు ముందరెఱుంగ రక్కటా” (ఆది. 6. 195)
>
> “శిరమునఁదాల్చు ముందఱు ప్రసిద్ధియు”
> (కు. సం. 7. 844)
>
> “చన్నులతనర్పున ముందఱు గానరాదు”
> ( ,, — 8. 16)
>
> “ఇంక ముందఱి భవంబున” (కవిక. 5. 27)
>
> “ముందఱికిఁ జూడు” (ఆము. 2. 19)
>
> “వార్తకున్, ముందఱఁ బోయి” (విరా. 3. 126)

సూ. ని. సంతరించిన యీప్రయోగములన్నీ, 'అసలు పదము 'ముందరు' గాని 'ముందర' గా దనుటకు నిర్ధారకములే నని నా మనవి.

ఇక్కడ ఒక్క మాట— నన్నయ 'ముందర' అని లఘు రేఫముగా (ప్రాసములో) వాడినాఁడు; తిక్కన అలఘు రేఫముగా వాడినాఁడు. కావున మనకు రెండును గ్రాహ్యములే. మన చర్చ కేరేఫమైనను ఒకటే గావున, ఆభేదమును పాటించుట లేదు.

† “వచ్చుఁ జేటుకాలము” అని ముద్రితప్రతిపాఠము-సరి కాదు.

ఇది ప్రశ్నితము—.

సూ. ని., 'ముందర'; 'ముందరు' అని రెండుపదములుగా భావించినది. అట్లు భావించుట సరికాదు. 'ముందరు' అనునదే పదము. అది యౌపవిభక్తికము. అందువలన,— «ఔపవిభక్తికముల తృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు» నన్న (అచ్చిక. 38) సూత్రమును బట్టి, సప్తమ్యర్థమున 'అను' ఆదేశమై, 'ముందరు + అను = ముందరను' ( = ముందరన్ ) అయినది. ఊరన్, గోరన్, నోరన్, ఎదురన్— అనుట యెట్టిదో «ముందరన్» అనుటయు నట్టిదే. కాబట్టి «ముందర» యనునది ప్రత్యేకపద మనుట సరికాదు.

శ. ర. కర్త, «ముంద అరదము డిగుము» అన్న ప్రయోగములో నున్నది. «ముందటు» యను అదంతపద మన్నాఁడు గాని, అది సరికాదు. అది 'అదంత' మైనచో «ముందటన్ + అరదము = ముందటనరదము» అగును గాని, ముందఅరదము» కాదు. అందున్నది «ముందటు» అను ఉకారాంతపదము. కనుకనే «ముందటు + అరదము = ముందఅరదము» అయినది. «ముంద రెఱుంగరు» అన్న నన్నయరచనలోను — «ముందరు + ఎఱుంగరు» అని ఉకారసంధియే గాని, «ముందరన్ + ఎఱుంగరు» అని కాదు.

అసలుపదము «ముందరు» (ఉకారాంతము) గాని, «ముందర» (అకారాంతము) కాదు. అందుకీ క్రింది ప్రయోగములు ప్రమాణము.

(1) «సేవకుఁడై మనుకంటె ముంద ఱార్జించిన కీర్తి నిల్వ గతి సేకుఱుఁగా ననిచావు సేగియే?» (నన్నె. కు. సం. 10. 197)

(2) «ముంద రర్జునునకుఁ బాణిగ్రహణంబు సేయ నెట్లగు?» (ఆది. 7. 241)

(3) «అగ్ని నేను నాకు నాహార మయ్యింద్రు ఖాండవంబు దీనిఁ గాల్పఁ గడఁగి యొగవఁబడితి ముంద రింద్రు పంచిన మహా దారుణాంబుధరశతంబు చేత» (ఆది. 8. 238)

(4) «అర్జుననందన! నీవు ముంద రి, మ్మొన యొక యింత సించిన» (ద్రోణ. 2. 8)

(5) అతనికి నాకునుం గలిగె నాహవ మింతకు ముందరందు» (కర్ణ. 3. 31)

(6) «తాను ముందరై, తిరముగఁ జేయఁజాలు» (శల్య. 1. 75)

(7) గుడుపునకు ముంద రొడ్డుల గోవునకు సమంచితగ్రాసముష్టి నిత్యంబు నేఁడు గాల మిచ్చిన» (అను. 2. 415)

'ముందరు' అనునదే ప్రథమా విభక్తిరూప మనుటకీ ప్రయోగములు చాలవా?

ముందరు—అను ఉదంతరూపము సంధిఘటితమై, బహుకవిప్రయుక్తమై యున్నది గావునను, 'ముందర' అను అదంతమునకు సంధియు—ఔపవిభక్తికరూపములును పొసగవు గావునను నిఘంటువులు 'ముందరు'ను ప్రథమరూపముగా మూలపదములలో పఠించి, 'ముందర'ను ప్రయోగములలో చూపుట కర్తవ్యము. అదంతరూపము, ఉదంతరూపము — రెండును కలవనుట సమంజసము కాదు.

ఇది నాకు తోఁచినమాట. విచారణార్థము విజ్ఞలోకమునకు విన్నవించుకొన్నాను.

# సద్ధర్మము

శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి

బ్రహ్మదత్తుండు గాశికాపత్తనంబుఁ
బాలనము సేయుతఱి వానిపట్టమహిషి
గర్భమున బోధిసత్త్వుఁ డావిర్భవించె
సర్వకల్యాణగుణసముచ్చయముతోడ,

దినదినాభివృద్ధి గనుచు నా బాలుండు
శుక్లపక్షచంద్రుశోభ నొంది
కరముఁ బ్రకృతితతికిఁ గనువిందు, సెవివిందు
సలిపెఁ దనదు నందచందములను.

ఒక్కనాఁ డక్కరంబుల గ్రుక్కఁబట్టి
గుణితముల నొక్కనాఁడు మూర్కొని, యతండు
పాఠ్యపుస్తకముల నొక్క పాటఁ బాడి
కొలఁదినాళులఁ జదువులకొలఁదు లంచె,

సకలకళలందు సర్వశాస్త్రములయందు
రాజ్యతంత్రంబున నతండు రాసికెక్కె
శైశవమునందె ప్రాపించి కౌశలంబు
పిల్లమిరియం బితం డని యెల్ల రాడ.

పితృపైతామహమైన రాజ్య మది ప్రా
ప్తింపంగఁ బట్టాభిషి
క్తత యుక్తంబగు కాలమం దెనసి *స
ద్ధర్మంబు లోకంబునం

జతురంశంబుల జాగరూకమయి మిం
చం జూచుచున్ భాగ్యదే
వత రూపొందె నటంచు స్వప్రజ నుతిం
పం బొల్చె వాఁ డున్నతిన్

న్యాయస్థానములెల్ల శూన్యములుగా
నయ్యెన్; సమస్తప్రజల్
న్యాయాధీశులు, నర్వగేహములు న్యా
యస్థానముల్ కావుటన్
ఆయుర్వీశుఁడు విష్ణుఁ; డాజను లమ
ర్త్యోఘంబు, వైకుంఠ మో
హో! యాభూపతిదైన రాజ్యమును వే
యుం జెప్పఁగా నేటికిన్?

కబ్బముల నల్లి పాటలుగా రచించి
కథలుగా గ్రుచ్చి, తగ నాటకములు వ్రాసి
యామహీపతిచారిత్ర్య మహరహంబు
ప్రీతి దళుకొత్త బుధులు వర్ణించుచుంద్రు.

రచ్చల లోకాభిరామాయణంబుల
నాడు చిల్లరమూఁకఁ గూడిమాడుఁ
గడిఁది విస్రబ్ధంబుగా మంతనములాడు
పెద్దలతో వాదుపెట్టి యాడుఁ

* బౌద్ధధర్మమునకు సద్ధర్మ నిర్వాహణము.

బరిషత్తులకుఁ జొచ్చి పార్షదులకుఁ బ్రతి
ద్వంద్వివై చర్చలం బాలిగొనును
బానశాలల నసంబద్ధప్రలాపమున్
వదరు నున్మత్తుల పలుకులు విను

దినదినము నొక్క యవతారమును ధరించి
యాప్రభుండు భ్రమించు నహర్దివంబు
నేల నాలుగుచెఱఁగుల విఖ్యమెయిని
స్వీయదోషంబులను గవేషింపఁ దలఁచి.

ఆతఁ డట్టుల్ చరియించుచుం గని స్వరా
జ్యక్షోణిపారంబు హ
ర్షితుఁడై యాత్మగుణప్రశంస, మరలం
జేరంగ స్వగ్రామ పే
గు తఱిన్ గోసలరాజుసద్గుణసమ
గ్రుం డీనృపుం డట్లు స్వ
క్షితిరాజ్యంబునయందు గ్రుమ్మఱుచు వ
చ్చెన్ మెల్ల నచ్చోటికిన్

ఎదురయ్యె వారియరదము;
లది యిఱుకగు బాట యగుట నవకాశము లే
దొదిఁగి చన; సూతు లిఱువురుఁ
గొదికిరి తమతేర్ల వెనుకకును నడిపింపన్

అలఁతి తడ వట్లె నిలిచి కోసలమహేంద్రు
సారథి వచించెఁ గాశీశుసారథికినిఁ;
"ద్రిప్పుమా ! వెన్కదెసకు నీతేరు వెసను;
సార్వభౌముం డితండు గౌసలుఁడు సుమ్ము !"

అంతఁ గాశీశ్వరుని సూతుఁ డాడె నిట్లు
"సార్వభౌముండు గాశిభూజాని యితఁడు;
పీదునరదంబె వెనుకకు నెట్టవోయి !
ఇప్పటికె చాల ప్రొద్దయ్యె నేగవలయు."

ఇట్టు లిఱువురు "నీవు నీ" వంచుఁ గొంత
తడవు వాదాడ తుది కిట్లు ధర్మనిర్ణ
యం బొనర్చిరి; "ఇర్వురియందుఁ జిన్న
బాట నొసఁగంగవలెఁ బెద్దవాని" కనుచు

అరయగ వారియిర్వురివ
యస్సు సమానమ యయ్యెఁ, బెద్దరా
చఱికముఁ బట్టి తేల్పఁ దలఁ
చం దులదూఁగిరి వారు; వంశపున్
గరిమముఁ బేర్కొనన్ నృపయు
గంబు సరాసరి యంచుఁ దేలె; నె
క్కరణిని ధర్మనిర్ణయము
గావలెనో ? కద యిట్టిపట్టునన్.

అంతఁ జోదకు లిద్ద టొక్కింత తిరిగి
కలిసి యోజించి "గుణ్యుండె గణ్యుఁ డిలను;
గాదు ప్రాయంబు; రాచఱికంబు గాదు;
వంశగౌరవ మేనియుఁ గాదు గాదె.

కాన గుణవంతుఁడైన క్ష్మాజాని కిచట
దారి నొసఁగుట యుక్తియుక్తం బటంచు
నిశ్చయించిరి; కోసలనేతృసూతు
డోలిఁ దనజేని గొనము లి ట్లుగ్గడించె.

"దండించుం గడుదండ్యులన్ జముని చం
దంబున్ విడంబించు చు
ద్దండుం డై; తగఁ బ్రోచు సాధుజనబృం
దంబుల దయాంభోధి వి
ష్ణుం డట్టుల్; ప్రజ లొజ్జగాఁ దలఁచి రా
జున్ మెత్తవానిం జెవుల్
పిండున్; గావున నాతికర్కశతఁ జూ
పించుఁ మనోవాక్కులన్.

అరులకు సింహస్వప్నము;
సరసుఁడు; చుట్టాలసురభి; సజ్జనతతి కె
త్తటి ముంగొంగుఁబసిఁడి మా
ధరావరుఁడు; కాన మాకు దారిని నిమ్మా!''

అనుచుఁ గాశిరాజ యంత కోసలరాజు
తేరిఁదోలువానిదెసకుఁ దిరిగి
నిరసనంబుఁ దెలుపు చిఱునవ్వు నవ్వుచుఁ
దనదు జేనివృత్తమును వచించె.

దండింప దయవశ్యదండ్యుల నేనియు
క్షాంతిమైఁ దద్బుద్ధి సంస్కరించుఁ;
దనదువాఙ్మనసంబుల నయంబు నవనీత
రచితంబులట్లు మార్దవముఁ బూను;
మహితసత్త్వస్ఫూర్తి సహితబృందం బాత్మ
హితబృందముగఁ బరిణత మొనర్చుఁ
దనవారు లాఁతివా రనుభేద మెఱుఁగని
చేతన్నరములేని దాతృతఁ దగుఁ;
గోప మెఱుఁగఁడు; చెవియొగ్గి కొండియములు
వినఁడు; సత్యవ్రతంబును విడువఁ డెపుడు
జేండ్లపై జేఁడు; భృత్యుల భృత్యతరుఁడు
మాప్రభూత్తంసుఁ డిమ్మోయి! మాకు దారి,

ధర్మపరుఁడు మీదుధరణీవిభుండు; స
ద్ధర్మపరుఁడు మాదు ధరణీవిభుండు;
అడరు నిరువురందుఁ గుడియెడమలభేద
మిదియ నిర్ణయించు హెచ్చు తచ్చు''

కాశీభూపతిచారుచర్యను సమా
కర్ణించి యాకోసల
క్ష్మేశానుం డట సూతుతో దిగి రథం
బేతెంచి పెక్కిబత్తిఁ గా
శీశాంఘ్రిద్వయి వ్రాలి ''నా కితఁడు ల
క్ష్మీభూతుఁ'' డం చెంచి వీ
తాశంకం ''దనతేరు నెట్టు'' మనియెన్ యం
తన్ వడిన్ వెన్కకున్.

వరవడిఁగాఁ గైకొని త
చ్చరితముఁ గోసలమహేశచంద్రుఁడు లోకో
త్తరుఁ డగు గాశీవసుధా
పురందరునకుఁ బ్రతిబింబముగ నయ్యెఁ దుదిన్.

# జీవేమ శరదశ్శతమ్

శ్రీ "కొలకలూరి"



ఆమె మాట రసధ్వని
కనద్గగనగంగాధుని!
ఆమె కనులు మయూఖాలు
నృత్యద్వనమయూరాలు!!

ఆమె ఆశల అందాల
సుమాల నాట్యనందనం!
ఆమెనవ్వుల ప్రహేళిక
గులాబిపూలమధూళిక!!

ఆమెతలపు భూగోళం!
అనురాగం నవనీతం!!
ఆమెకాంతి ప్రగతిజగతి!
ఆనందం!! ఆహ్లాదం!!

ఆమె తనూసౌష్ఠవం
నవ
ఆ మహిమోజ్జ్వలహృదయం
సాహిత్యం! హిమాలయం!!

ఆమెమోము నిండి నింగి
సూర్యరశ్మి సోకుతుంది;
ఆకాశం నుదుటిబొట్టు
చంద్రరేఖ తాకుతుంది.

ఆశాంతరాళధ్వనులు
ఆమెనడక చూచి పొంగు;
ఆశయాంతర్గతమురళి
ఆమెగొంతురవళి మ్రోగు.

జీవదేవిఓంకారం
శ్రీకారం చిరంజీవి
మామకీనసింహాసన
సుధా మధురహృదయభావి.

నాగుండెలు నిండించిన
నవ్యామృతవర్ష ధార
నాభావన వెలిగించిన
నవజ్యోతి కాంతిజీర.

దశావతారతోరణం
తారావతరణం ఆమె,
దశదిగంతశాంతదీప
దృగంతదిక్సూచి ఆమె;

సెలయేటిజ్వాలాస్నిగ్ధత
నవలతాలీలముగ్ధత!
క్రొందేనెల సుకుమారత
మీగడతరగల నవ్యత!!

మల్లెమొగ్గ సౌభాగ్యం
మేఘమాల సౌజన్యం
పాలవెల్లి సౌందర్యం
కల్పవల్లి మాధుర్యం.

సమతామయ యువతీయుత
జనతాదీపిక ప్రతీక!
నవభావన నందనవన
నవరసాల నవపతాక!

భూతభవిష్యద్వర్తన
వర్తమాన యుగపట్టిక
భూమాతపుత్రు గుండెలు
పూజించు దీపమాళిక.

కాళిదాసు షేక్స్పియర్ ల
కలంకేళి రసభావం!
అరిస్టోటిల్ చాణక్యుల
ఆలోచనవాగ్జీవం.

క్రీస్తు పసినవ్వుల తేట
బుద్ధుని చరణాల తేజస్సు
గాంధి హాసముఖజ్యోతి
లింకన్ ప్రయత్నాలఉషస్సు

నింగి క్షుధావ్యథా రాత్రి
ధవళకాంతుల జాబిల్లి
శాంత్యహింసల పూదోట
చిన్నిచెల్లి కన్నతల్లి.

వెన్నముద్ద వన్నెసొగసు
వెన్నెల పన్నీటి సొబగు
వేకువ నిద్రించెడి కల
లోకలాలితలలితకళ!

చతుష్షష్టికళా స్రష్ట
చేతనాచేతనద్రష్ట!
త్రిలోకాలోకితతుష్టి
త్రిమూర్తులభావవృష్టి!!

రామారామసామ్రాజ్య
రామాయణమహీజాత!
భారతభాగవతభావి
భావగతతనూజదూత!!

అనంతాంబరాంతర్గత
నమ్రకాంతి క్రమరేఖ!
అనంతాంబుధిరత్నాల
అర్ధలక్ష్మీ ప్రేమలేఖ!!

కన్నతల్లికనుల కాంక్ష
కాచగోళపరీరక్ష!
మాతృభూమీమనస్సుమ
మధురరజస్స్ఫూర్తి దీక్ష!!

తెల్లదొరలపాలనలో
నల్లజాతిప్రభాసిద్ధ!
జాతీయవిజాతీయత
సంధికథాపరాకాష్ఠ!!

తెలుపునలుపుకలయికలో
వలపుచిమ్ము కళ్యాణం
గుడిదేవుడిగోడలలో
మసీద్ చర్చిమాంగళ్యం!!

క్రాసుతో మహమ్మదీయయువతి
దివ్యవేదపఠనాసక్తి
జందెంతో క్రీస్తుజనం
ఖురాన్ లో వచించుశక్తి

ఆమె సృష్టిరహస్యాలు
అందించు వరాల సమత!
ఆమె జ్యోత్స్న అభినందన
మృదులసుధాభిమతసమత!

నింగి నీటి భావాంతర
అనురాగసూత్రం జనత
పాలపుంత రేఖాంచల
ప్రభలనక్షత్రం సమత!

మానవత్వజయఘంటిక
ధ్వనిపుష్పవాటిక సమత!
మానవకళ్యాణరథం
నడచుమహాపథం సమత!!

సమత అంటె లోకంలో
నవసమాజసంకల్పం!
సమత అంటె తరతరాల
తరతమాల సన్న్యాసం!!

సమత అంటె సమభావం
సామరస్యసంకేతం
సమత శాంతిసందేశం
సహకారం! సహవాసం!!

నా భావం నా జీవం
నాధ్యాసం ఆమె సొత్తు.
నాలోపలి ఆవేశం
ఆకాశం కన్న ఎత్తు.

సమతజిగీషమనీషిని
సవరించెడి ఆలోచన!
సమత నాకు సంతోషం
సంతరించెడి సులోచన!!

సమత జగదేకసుందర
కళాఖండికానుభూతి!
సమత మామకసాహితీ
మనోజ్ఞజీవసరస్వతి!!

# శాంతి విలాసము*

## శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి



శ్రీవంశమ్మున సజ్జనాత్మజుడ నై చేకొంటి జన్మంబు నెం
తే వింటిం బరమార్థబోధ సుఖ ముంటిన్ గష్టముల్ గంటి నే
త్రోవన్ ద్రొక్కిన నెన్నినాళ్లకును లేదున్ లేదు సంతృప్తి యీ
నా విడ్డూరపు పాపరాశి బహుజన్మానీత మెంతెంతయో.

నీచపు జోటులన్ దిరుగు నేర్పు మదంఘ్రులయందు పెద్ద సం
కోచము లేక బొంకుటకు గొప్పది నా నుడి యొడ్ల తప్పులన్
దాచక బైటపెట్ట ఘనతావతి నా మతి పుణ్యలేశము
న్నోచని కుంటి మూగిని ననుం బసి కీడుగ జెప్ప నొప్పదే.

అనయ మ్మెవ్వరి మేలు మామకము మోక్షాతీతసంతోషమో!
ధనముం బ్రాయము సేవలం దెవరికై త్యాగమ్ము గావింప జం
కనొ! యా నా సతి నా వయోధనము లింక న్నన్ను నూల్పోగుక
న్నను హీనమ్ముగ జూడ జొచ్చె నిపు డన్యాయమ్ముగా దైవమా!

ఏరివి బిల్లలం బెనుప నెన్ని దొసంగులు జేసినానొ! యె
వ్వారల విద్యకై తినుట పండుట లేక శ్రమించినానొ! య
వ్వారు మదాత్మజుల్ తమది ప్రాక్తనపుణ్యపరిశ్రమాత్తవి
ద్యారమ యంచు నన్ దలప రయ్యయొ! నా వెత లేమిచెప్పుదున్,

దారాపుత్రులు ప్రాణమిత్రులును నాప్తశ్రేణియున్ సేవకు
ల్లేరో! నన్ "కలనైనవీడిబ్రదుకన్ లే" మంచు నమ్మించరో!
క్రూరంబౌ జము నాజ్ఞ దద్భటులు నన్ గొంపోవుచో వీరిలో
నేరీ! నా వెనువెంట న న్విడక తా మేతేరు వా రీశ్వరా!

---

* మహాకవి శ్రీ నీలకంఠదీక్షితుల కృతి కనుకృతి.

ఏలికబం టౌసంగు చనవే గుడు కూరిమి జేని వాకిటన్
గ్రాలుచె మాకు నైమిశమున న్వసియించుట భావరుండె మా
పాలిటికిం బరం బయిన బ్రహ్మము రాజుల సేవలోన మే
మిలుగుచే భవాబ్ధి దరియించుట యిట్టివి మా స్వభావముల్.

ఆకౌమారము సద్గురున్ గొలిచి మే మార్జింతుమా: బ్రహ్మవి
ద్యాకౌశల్యము దాని గాథలుగ రేలందు న్నృపుల్ నిద్రకై
యాకాంక్షింప వచించుచుంటి మిపు డత్తై కాని జీవింపలే
మీ కాలమ్మున వట్టి కట్టుకథ లయ్యెన్ మాకు వేదాంతముల్.

''తీర్థయాత్రలు సేయ దిరుగుటకై మాకు
దారిబత్తెము'' లంచు దరచి తరచి
''ముక్కోటిదివిజుల నొక్కట గొలుచుట
కై కావలయు'' నని యడిగి యడిగి
''చాలగా యజ్ఞముల్ సలుపుటకై మా క
వసర' మటంచు బల్ కొసరి కొసరి
''చెరువులు నూతులు దొరకొని త్రవ్వింప
వేంచేసినా'' మని వేడి వేడి

విద్య నమ్మి గణింతుము విత్తమేము
పాతియిడుదుము తినమేము పరులకీము
పయిపముల్ తలపెట్టిన వారు యోగ్యు
లెన వారికి మా కెంతో యంతరంబు.

నీరము తిండి వాహనము నీడయు దీపము వస్త్ర మిన్ని చే
కూరిన నొప్పు నిం దొకటికూడ కొనన్ లభియింపనట్టి పెం
దూరపు ద్రోవ నాత్మ చనదో? యొకనా డిపు డేరికైన సం
చారసుఖార్హవస్తువు లొసంగితిమేమన మప్పు డొందగా॥

యమనగరీరుదజ్జనమహార్తరవమ్ములు వీనుసోకె గం
ఠమును బిగించుచున్న దొక నల్లని పాశము చెప్ప కేడకో
గమనము బూను ప్రాణములు కా దన దిప్పుడు నాత్మ తుచ్ఛసౌ
ఖ్యములను బాపముల్ కలుడుగట్టెనొ! నా ప్రకృతిప్రదోషమో!

మీసము గడ్డము న్నలసె మే న్బిగిదప్పె రదమ్మ లూడె చూ
పోసరె గే ల్వడంకె మతి పోయె నయో! యమదూత లైన యీ
వేసపు నైజముల్ మనకు జేర్చి ప్రబోధము సేయుచున్న నీ
వేసమె నిల్ప గోరుదుము వెఱ్ఱుల సాంత్వనముం భజించుచున్.

పరువులువెట్టె నింద్రియపు వారువముల్ వ్యసనమ్ము త్రోవ జా
ఠరపిఠరాగ్ని రేగె దమి డాల్కొనె ము న్నరు లైన వానికిన్
గరువము వాలె నేడు విధి కారణ మౌటన కాని లోగ దే
కరణిని నేటికిన్ మనసు గంధగజమ్మును మించె నద్దిరా!

నానోపాయములన్ దిశల్ దిరిగి నే నార్జించితిన్ దేనినో
యా నా సంపద పోయి నేడు మెయి స్థౌల్య మ్మెక్కుచే నిల్చె ని
స్సీ! నే వింటిని వింటి శాస్త్ర ఉపదేశింపంగ న ట్లయ్యు న
య్యో! నా యాత్మ నమాసచీకటులలో నోలార్చె నజ్ఞానముల్.

"ఎందే డాగెద గాలకింకరులు న న్వీక్షింపలే రెట్టులై
నన్ దర్పోద్ధతు నన్ను దాకగలరే? న న్మించుచో రాజుచే
తన్ దోరింపగజేతు నాకు యమబాధాభీతియే లేదు లే
డెం దస్మాదృశధైర్యశాలి" యనుకొం చీల్గు న్నరుం డూరకే.

ఔనా సత్యము వేద మీశ్వరుని ధర్మాధర్మనిర్మాణవి
జ్ఞాన మ్మట్టులె యున్నె? మృత్యువు నపాస్త మ్మెల కాకూడదో!
యే ని ట్లెప్పుడు నుండరాదొ! యని యెంతే ప్రొద్దు జింతించి సుం
తైనన్ గర్జము లేక జీవితము వ్యర్థం బౌచు బో కుందుమే!

జాములు జాము లేగ తనుసంధుల బంధము లూడసాగె నా
యామము జీవన మ్మలతి యయ్యెడి నూర్చియు నూర్చియల్పమే
సేమము గూర్చి కూర్చగ గ్రసించుచునున్నది పుణ్యరాశి యే
మేమియు జేయ జేయగ నిసీ! దురిత మ్మభివృద్ధి నొందెడిన్.

తప్పదు పోక ముండ్లవెతదందడిత్రోవల బోయి యందఱన్
జెప్పక చంపు న య్యముని జేరవలెన్ జము డిచ్చు నాజ్ఞమై
జొప్పడు నారకివ్యథల సోలవలెం భరియింప రాని యీ
ముప్పును విస్మరించి దినము న్మన మూరక బుచ్చవచ్చునే.

నీరము ద్రావి భుక్తి గొని నిద్దురబోయి రమించి సంతతిన్
గూరిమి బెంచి కృత్యమునకుం బెఱ లౌచు నకృత్యంబందు లౌ
వారలు పాదభేదమున వర్తిలు వింతపసుల్ మనుష్యులన్
వేరుగ జెప్పికో దగదు వేరగు జ్ఞానము లేనియంతకున్.

శ్రమసంప్రాప్తధనమ్ము నందలి శతాంశస్ఫూర్తి యౌ వడ్డి కి
త్తుము పత్రమ్మను నమ్మి యెట్లొ యది పో దుఃఖింతుమే కాని యీ
యము దానమ్ముగ శాస్త్రపత్రములపై ని ట్లీగుచో వేయిరె
ట్లమరున్ దత్తముకన్న కల్మి ధనవంతా! భావిసౌఖ్యార్థమై.

మే యొగి జిక్కుచో దెవులు మీరినచో బగ కగ్గమైనచో
నేయదిసౌఖ్యదమ్ము? మది కెక్కునె కామ? మ దట్టు లుండనీ
యాయువు నిల్పు నెంతవఱ? కన్ని యెఱింగిన వారలున్ దురా
శాయుతు లౌచు ధర్మమును సల్పమి మిక్కిలి యక్కజం బహో!

"ఋణదాత లట్లు న న్ననుసరించెడి వారు
కొమరులు వారిపై మమత యేల?
పడకలో నొదిగెడు పాము పగిది నుండు
పెండ్లాముపై నాకు ప్రేమ యేల?

> చెఱసాల వోలె నన్ జెరము నిర్బంధించు
>     నాలయమ్మున దగులాట మేల?
> తిరిగి యిల్ద్రొక్కక తిరుగు సన్యాసికి
>     శుభముహూర్తమ్ముల జోలి యేల?"

యనుచు నావేశమున నింటి గనుమ దాటి బాలరుదితమ్ము చెవిబడ వారి "నూఱ
డించి పోద" మటంచు లోనెంచి గృహము జొచ్చు వానికి వైరాగ్యసుఖ మ దేడ?

"బాల్యమున గొంత లౌల్యమ్ము వలన గొంతగడచె గాలమ్ము వృథగ నింక గడెమేని
తడయరా దింట" నని బయల్వెడలియును బ్రియాననము నెంచి మగుడుదు రబలమతులు

అతిథివ్రాతము చుట్టముల్ హితులు దీనానాథు లభ్యాగత
ప్రతతుల్ మెచ్చగ వారి కన్న మిడుటల్ భావ్యంబు తత్కార్య మా
గతసౌఖ్యార్థమె కాదు భావిజనిలో గల్పించు నీ యాత్మకు
ద్గతి నెంతే నటు సేయకున్న మనుజత్వ మ్మేల? మిత్రోత్తమా!

మనువున్ వ్యాసుడు యాజ్ఞవల్క్యుడును బల్మా త్రొజ్జలుం బోలె మం
చిని బోధించిరి ప్రేమతో మనకు దన్నిర్హేతువాత్సల్యజీ
వనదాకారులు లోకబాంధవులుగా బ్రఖ్యాతి గాంచన్ తమ
మ్మున దుష్కీర్తిని బ్రహ్మబంధువులమై పౌర్లాట మా పా ల్వడెన్.

పాతాళమ్మున జక్రవాళగిరిపై భాగాన భూగర్భమం
దా తామిస్రసమాఖ్యఘోరనరకంబందున్ గుహూరాత్రులన్
స్ఫీతిన్ గొన్న మహాంధకార మఖిలం బీ మామకాంతస్తమో
జాతంబందలి పీసపాలె కద! దుశ్చారిత్రముల్ జీవికల్.

"ఎల్లలు లేని దుఃఖమున కెయ్యది మూలమొ యీసడింపగా
జెల్లిన దేదొ యీ తనువు నీవుగ మోహము బెంచికొందు! నీ
మొల్లపు దేహ మేని మరి ముందగు జన్మమునందు నబ్బున
శ్లెల్ల చరింపు! మో హితుడ! యేమర కయ్య శ్రుతిప్రబోధమున్!

పాకిన్ గైకొను మాడ కన్న ఘనమా పాపార్జితార్థమ్ములు
న్నేదల్? వైభవ మన్నము న్మిగులనేమి పర్యుదస్తాన్నముల్?
నావెం బౌ సుఖ మిచ్చునే గృహిణికన్నన్ వేశ్య? మాఘవ్యపున్
దేడా చక్క నెఱుంగ రాక జన ముత్సేకించు నుచ్ఛాస్త్ర మై.

ఆస్తికు డిచ్చు పాత్రునక యర్థము నాస్తికు డైహిలోరుభో
గస్తిమితుండుగా నొడమి ఖర్చిడు నెవ్వరి కీక మేలునన్
గస్తినిసేన్ వ్యయించుకొన కా ధనముం భువి జాతిదెట్టు వా
రాస్తికనాస్తికేతరు లహో యిల కెంటికి జెడ్డ రేవడుల్.

కుక్కల తోకవంకరయు గోతుల పంప్లిగిలింపు నోంద్రయున్
గక్కసపెట్టవో? దలప గంపుకదా పిహితంబు పెంటిపై
నెక్కెడు పోతుజాతి యటు లింతులు రొమ్ముల వావు గాంచి పె
న్మక్కువ గూడు మానవుల మౌర్ఖ్యముగా కొక తెల్వి యున్నదే.

కఱతురు కామినీముఖము గాముని కేళి బెనంగు వేళ నో
గిర మిడు వారి కేల్గఱవ గిట్టదో భోజనవేళ! బాళిమై
బరవశ మంద సిగ్గిలరు పాయగ జాలరు మోహవృత్తి బా
మరులను బిచ్చివా రయిరి మానవు లుద్ధతమారవేదనన్.

దారల్ సంతును బాన్పు లన్నములు వస్త్రంబుల్ మణీభూష లిం
పారన్ గల్గుడు! కాని య య్యనుభవంబం దైన నేమమ్ములన్
మీఱన్రా దని తెల్పుచుంటిమి విన న్మే లౌను గర్హించుచో
సారాంశమ్మను మీకు దండధరుడే చాటున్ వినుం డో ప్రజల్.

వినవిది విన్నయట్లు తలపించిన సూక్ష్మసుబుద్ధి యొప్పు నే
మి? నిగమపాఠమం దనుపమేయుడు నైనను నేమి? వాదమం
దనిశము నందఱన్ గెలుచు నైపుణి నొందిన నేమి? తత్త్వచిం
తనమును సేయ జాలని యతం డెవరైనను వ్యర్థుడే కదా!

పాడిన్ దప్పని సన్మతివ్యసనితత్వ మ్మొప్ప ముక్తుండగున్
వా దెట్టిండును నర్ధయామమున ఖట్వాంగాదులుం బోరె నె
వ్వా డాశంకల బుద్ధి గోలుపడు దుష్పాండిత్యవంతుండొ వా
డేడ న్నెగ్గడు కాకినా బ్రదుకు నెంతే బ్రొద్దు వ్యర్థాయు వై.

ధన మబ్బునేని దాన నగు ధర్మము మాని శరీర కష్టసా
ధనమున ధర్మముం బలువిధమ్ముల సల్పమె! యాశరీరముం
బనివడదేని ధర్మమును బాయుదుమే! శివునందు మానస
మ్మును గుదియించి చింతితము బూర్తి యొనర్పగలేమె! మిత్రమా!

జీవుడె బోధసేయవలె జీవున కంచు శ్రుతిప్రసూక్తి గా
రీవరు దానతీయ ఋషిబృందము చెప్పిన ధర్మశాస్త్రమం
దే వెటు లున్నవో కని గ్రహింతము మూర్ఖత నెల్ల వేళలన్
జీవిక రిత్తవో మనము చేద్వడుచో శివు డేమి సేసెడిన్.

జలధుల వార్చి నట్టిరును సర్వమహాస్త్రహరమ్ము దండమున్
గలిగిన వారు సృష్టికి దగన్ బ్రతిసృష్టి యొనర్చి వారలు
న్నలగిరి కాలచక్రమున నాకమునందుననేని వట్టి ది
ట్టలు కలరే! యిక న్మన యొడళ్లు నలంగును కర్జ మెంచుడీ.

ఒడమెను బంధువర్గమును నొప్పిన దేహము నింద్రియోన్నతిన్
గడుసుదనమ్మునుం బడసి గ్రక్కున బొంగెద మంతె కాని యా
యడరెడి యూరు పంత్యమొ యుపాంత్యమొ నా బరికించి యీశ్వరు
దడవి నిమేషమేని భజన మ్మొనరింప దలంప మక్కటా!

శ్రుతుల న్నేర్చి గృహస్థు డై కలిమికూర్పున్ జక్కగా జేసి దే
వతలన్ దన్పి మఖాన బుత్రు గని యాపై సన్యసింపంగ నీ
రిత మియ్యో న్మనుధర్మపద్ధతి మహాశ్రేయంబు నే డాయు వ
ల్పతమ మ్మై దగ నంత వేచు బని యేలా? సన్యసింపం బ్రజల్.

పరుసగ సన్నధాన్యమును బంగరవున్ ధర నే విధాన బా
మరు లొక టబ్బుచో నొకటి మానక కోరుదు రట్లె పండితుల్
పరుసగ నీ భువిజ్ఞ దివిని వారిజగర్భు జగమ్ము నుత్తరో
త్తరము భ్రమ న్వరింతు రట దాము తిరమ్ముగ నిల్తు రన్నటుల్.

ఒక పర్యాయము సేయు పాపమునకై యున్నట్లు పాపమ్ము బా
యక పల్మా ఱొనరించు నా కెచట ప్రాయశ్చిత్తమే లేదు నీ
వకలంకున్ గరుణాబ్ధి పై మనుచున ట్లస్మాదృశుం బ్రోచుచో
వికలమ్మై తెగు ధర్మసేతు విక నా విజ్ఞప్తి యేమో! శివా!

విడుపరాని ధర్మమ్మున నడచుకొనుట
చేతకానట్టి మన మెట్లు శివుని దేర్చి
తత్కృపారసమునకు బాత్రములు మౌదు?
మిదియ జనులార! సందేహ మొదవె నాకు

తొలిమిన్కుల్ పరియింతు జన్నము లొనర్తున్ గృచ్ఛ్రచాంద్రాయణ
మ్ముల నింకెన్నియొ సల్పి నీ మదికి గూర్తుజ్ఞ గాని యన్యోన్యశ
త్రునాకో! శ్రద్ధయు డెల్వి య వ్వేవుడు బోరు న్నా మనస్సీమ జే
తల నా రెండును లేక సేత వృథ కాదా! యంతరాత్మా! శివా!

అతిచపలు న్నిరంతరతమోంధుని గౌరవహీను మాదృశు
న్వ్రతకియు గానలే వెచట విశ్వవిభూ కరుణింపయ్యా! న
"న్నితడును జన్మవార్ధి దరియించును గాత" యటంచు లేనిచో
బతితుడ నిట్లె పుట్టుదు భవత్కృప కల్గెడి దాక నీ భువిన్.

చేసిన దోసముల్ తలచి చింతిలి యింతటనుండి మేము నీ
దాసుల మౌటకై నియమధారణ సేయుచు నాయు విప్పుడే
మోసము సేయుచో నియమముల్ సెడి రిత్తగ బోదు మేమొ! యే
యాసలు లేక వేగ శరణార్థుల మైతిమి బ్రోవవే శివా!

త్రిమతోన్మ క్తచిదేకరూపమున సందీపించు నీ ధ్యానలో
లమహాసూరుల ముందు న న్విడచి కై లాసమ్ములో వింత యై
న మృగ మ్మెన్నడు జూడనట్టి దిది కాన్పన్ దెచ్చినా'' నంచు జూ
పుము: శంభూ: నను నీదుప్రాపు నెటులో పొందింపు మేనాటికేన్.

ద్విజవరవంశజన్మి నయి పేర్మి గురుల్ జదివింప దప్పు: నొ
ప్పు జదురుమై నెజంగితిని పూర్వవృషోన్నతి యూత గాగ ని
ట్టి జనిన నాకె యా స్తికత డిందినచో నరకమ్మునుండి యె
ల్లజనులు ము క్తులైనను గళంకిని ము క్తుడ గా ని కెన్నడున్.

వల దింద్రత్వము నెట్టి దివ్యపదవిఁ వాఛింప నన్నింట మి
క్కిలి బ్రహ్మత్వము దాని నొల్లను పినాకీ, యొడ్ల సంప త్తి కా
సలు సేయఁ దగవే: తదీహ కగునే సల్లోకసంప్రా ప్తి: న
న్నలరింపన్ గదె: యుద్ధరింపగదె: యాత్మానందసంధాయి వై.

దేహ మరోగ మై కరణదీ ప్తియు బ్రాయము శ్రీనివాస మౌ
గేహము సౌఖ్యమున్ దనరి కేరుచు దా సహజమ్ముగా నెవం
డీహలు లేని నిర్విషయ మింబుగ విచ్చిన పువ్వు బోలు ని
ద్దాహృదయంబు నొందునొ యతండె కృతార్థుడు మ ర్త్యమండలిన్.

నలినజు నాటినుండియును నా కులవృద్ధులు నేను గుక్షిలో
పల బొరలాడు టాదిగ భవత్పదపద్మములం భజించుటల్
తెలియును నీకు ''మాయికమతిన్ గొన నంటిని కూర్చుమయ్య: శీ
తలరుచిశేఖరా: సముచితస్థితి నీవె ప్రమాణ మన్నిటన్.

దండిన మర్థుడ నని యొక దండము గొని సకలభువనతండమును విధిన్
దండించు నా కృతాంతుని దండించిన వాని గలిగి తలకగ నేలా?

# "కృష్ణపక్షము"లో ప్రకృతి

## శ్రీ జంధ్యాల "మహతీశంకర్"



గులాబీపువ్వు ఎంత అందమైంది! పట్టుకుంటే నలిగిపోయే సుకుమారతామార్దవమూ కలిగిన ఆపుష్పం అందాన్ని ఎట్లా ఆనందిస్తాడు మానవుడు? లేతగులాబీరేకుల క్రింద చిన్నచిన్న ముళ్లు వాని ప్రాణసంరక్షణార్థం సమకూర్చిన ఆసృష్టికర్త మానవుడికి అందాన్ని అనుభవించాలి అనే ఆకాంక్షను ఎందుకు కలిగిస్తున్నట్లు? ఆనందాన్ని అందివ్వలేని అందంకూడా నిజమైన అందమేనా! అదే కాబోలు సృష్టిరహస్యం.

కాని ప్రకృతి సర్వశక్తిమంతమైనది. అది ఒక అందాల రాశి; అది ఒక ఆనందమూర్తి; అది ఒక భయంకర మహాసృష్టి; అది ఒక తత్వశాస్త్రము; అది ఒక విజ్ఞానదీపిక. ప్రకృతి మానవుణ్ణి లొంగదీసుకోగలదు. జీవితాదర్శాలనూ ఆశయాలనూ బోధింపగలదు. సౌందర్యాన్వేషణలో మార్గాన్ని సుగమం చేయగలదు.

ప్రకృతి కాలానుగతికం. ఎప్పుడూ నదులనిండా నీరుండదు; ఎల్లప్పుడూ పూలు పూయవు; కాయలు కాయవు; ఎల్లవేళలా సూర్యచంద్రులు ఒకేరకంగా ఉండరు. కాలాన్నిబట్టి, ఋతుధర్మాన్ననుసరించి, దేశప్రదేశాలను బట్టి ప్రకృతి తన ఆకృతిని మార్చుకుంటుంది. మానవుడూ అంతే. కాలదేశాదులనుబట్టి ఆచారవ్యవహారంలో, వేషభాషలలో, భావంలో, అనుభవంలో, ఆశయాదర్శాలలో మానవుడు తన ఆకారాన్ని మార్చుకుంటూ ఉంటాడు. ఈసమన్వయదృష్టితో మానవుడికీ ప్రకృతికీ అవినాభావ సంబంధం ఉన్నదనటం స్పష్టం. మానవుడు లేకపోతే ప్రకృతికి ఆకృతి లేదు; ఆధారం లేదు; అనుభావం లేదు. ప్రకృతి లేకపోతే మానవుడికి ఆనందాకాంక్ష లేదు; ఆదర్శభావం లేదు; అజ్ఞానమూ లేదు; విజ్ఞానమూ లేదు. మనకు కనిపించే ఈ ప్రకృతిఅంతా బ్రహ్మసృష్టి.

సృష్టికి ప్రతిసృష్టి చేయగల పాండితీధురంధరులు కవిబ్రహ్మలు. వారు ప్రకృతి సృష్టియొనరించి కావ్యప్రపంచము నెట్లు కళామయము చేశారో గ్రహించటం సంభావ్యం. కవి తన కమనీయలేఖినితో కావ్యనిర్మాణం చేస్తాడు. ఆకావ్యనిర్మాణములందు పాత్రోన్మీలనంలో, కథాకథనరీతిలో, నీత్యుపదేశసమయంలో, నాటకీయశైలీనిర్మాణంలో, అలంకార ఔచితీపద్ధతిలో ప్రకృతిపరిశీలనం చేస్తాడు. రసపుష్టితో భావపుష్టితో కావ్యసృష్టి చేసే సమయంలో పలువిధాలుగా ప్రకృతిరూపాన్ని కవి ఉపయోగించుకుంటాడు. కవి ప్రకృతి హృదయుడు. కవికి ప్రకృతిని తన ఇచ్ఛవచ్చినరీతిలో నిరంకుశంగా ఉపయోగించుకొంటానికి అధికారం ఉంది. అయితే సమగ్రమైన ప్రకృతిపరిజ్ఞానంతో ప్రకృతి విరుద్ధమైన విషయ విశేషాలను ఉల్లేఖించకుండా కవితాసత్యాన్ని మనస్సులో ఉంచుకొని కావ్యనిర్మాణం చేస్తాడు కవి. కవే ప్రధాన పాత్రగా రూపింపబడే ఆత్మాశ్రయకవిత్వంలో ప్రకృత్యున్మీలనానికి ఎక్కువ అవకాశం ఉంటుంది. పరాశ్రయ కవిత్వంలోకూడా ప్రకృతికి తగినరీతిగా ప్రాధాన్యం ఇవ్వబడవచ్చు. వస్తుభావకవిత్వాలలో భావకవిత్వంలో ప్రకృతిలోని వివిధదృశ్యపరిశీలనకు ఎంతైనా అవకాశం ఉంటుంది. విషయప్రధానంగా గల వస్తుకవిత్వములో అక్కడక్కడా ప్రకృతివర్ణన ఉండవచ్చును.

సాహితీవ్రతుడు తనప్రబంధంలో కాని, నాటకంలో కానీ, నవలలో కానీ, కథానికలో కానీ, కావ్యంలో కానీ ఖండకావ్యంలో కానీ ప్రకృతికి స్థానం ఇవ్వక తప్పదు. కారణం కవికూడా ప్రకృతిలో ఒకభాగం.

కాబట్టి తాను ఏం వ్రాసినా చెప్పినా తనపరిసరాలను చుట్టు ప్రక్కల జరిగే విశేషాలను గమనించకుండా ఉండ లేడు. కవి తనభావాలను స్పష్టంగా విపులీకరించాలి అనే ఆ కాంక్షతో ఉంటాడు. అప్పుడు సామాన్యప్రకృతిలోని విశేషాలతో జోడించి తన భావాన్ని సుస్పష్టంగా ప్రకటిస్తాడు. మనోజ్ఞభావాలతో మధుర మైనభావలతో మంజుల మైనశైలిలో కవి కావ్యనిర్మాణం చేస్తాడు. అటువంటి సమయాలలోతనభావాలకు అనుభవాలుగా ప్రకృత్యం తర్గతవ్యక్త్యస్వీకరణం చేస్తాడు. కవి. కవి కావ్యశిల్ప వైభవంలో తనప్రతిభాపాండిత్యాలను లోకంలో నిరూపించుకుంటాడు. ఈ విలక్షణతను నిరూపించుకుండేటప్పుడు ప్రకృతిరూపాలని స్వీకరించి, అలంకార విన్యాసంతో కావ్యనిర్మాణం చేస్తాడు. కవి తనకావ్యప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని నీత్యుపదేశంచేస్తాడు. ఆసమయంలో ప్రకృతిలో వుండే వివిధలక్షణాలనుతన కనువగురీతిలో ఉపయోగించుకుంటాడు కవి.

మహాకవులు పలువిధాలుగా ప్రకృతివర్ణనం చేశారు. భారత రామాయణాదిమహేతిహాసాలలో కథాగమన రీతిలో ప్రకృతివర్ణనం కనబడుతుంది. మనుచరిత్ర వసుచరిత్రాది ప్రబంధాలలో అష్టాదశవర్ణనలయందు ప్రకృతిని స్వీకరించారు కవులు. కేవలం "ప్రబంధముద్ర" కోసం ప్రకృతిని వర్ణించారే గాని ప్రబంధకవులు ప్రకృతి పరిశీలనకు ప్రత్యేకప్రాముఖ్యము నీయలేదు. కొందరు ఉపమ రూపకము ఉత్ప్రేక్ష అతిశయోక్తి అర్థాంతరన్యాసాది అలంకారాలకు తగినట్లుగా ప్రకృతిని మార్చుకొని ఉపయోగించుకొన్నారు. మరికొందరు రసదృష్టులు శృంగారాది రసనిరూపణంలో విభావరూపంలో ప్రకృతిగానం చేశారు.

నవ్యకావ్యాలలో ప్రకృతి ప్రభుత్వంచేసింది. ప్రకృతి నేటికవులకు ఒకప్రజ్ఞామూర్తిగ ప్రణయదేవతగా ఆరాధనీయ మైంది. మానవాతీత మైనశక్తి ప్రకృత్యంతర్గతమై ఉన్నదని గ్రహించి ప్రకృతిని నుతించారు నవభావుకులు. ఆంగ్లసాహిత్యప్రభావంవల్ల మహాకవులు కీట్సు, షెల్లీ, టెన్నీసన్, వర్డ్సువర్తు, ఆర్నాల్డు మున్నగు మహనీయులు నవ్యకవులకు కవితాగురువు లైనారు. విశ్వకవి రవీంద్రుడు సరోజినీదేవి వంటి భారతీయకవికోకిలలు ప్రకృతిగానం చేశారు.

ప్రకృతి - కవిత్వము అనగానే నవ్యాంధ్రులలో స్ఫురించే మహావ్యక్తి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి. కావ్యం "కృష్ణ పక్షము". ఏదో తెలియనిబాధతో ఆవేదనతో ఆక్రోశిస్తూ అట్టుడికిన ట్లుడికిపోతాడు కవి. ప్రకృతిలో లీన మౌతా నంటాడు. ఈలోకంలో నాకు స్థానం లేదంటాడు. కృష్ణపక్షం తెరవగానే కనిపించేది యిది.

"ఆకులో ఆకు నై పూవులో పూవు నై కొమ్మలో కొమ్మ నై నును లేత రెమ్మ నై" పోతానంటాడు. కవి దృష్టితో చూస్తే ప్రకృతి అట్లాగే గోచరిస్తుంది. ప్రకృతి అంతా ఒకసారి కృష్ణశాస్త్రి ఆనందానందమయంగా గోచరిస్తుంది. కొంతకాలానికి ఆకులు రాలిపోతాయి: పూలు వాడిపోతాయి; కొమ్మలు కొమ్మలుగానే మిగిలిపోతాయి. జీవితం ఒక అడవి. అయినా ఆ అడవిలోని ప్రతివస్తువులోనూ తా నొకభాగస్వామి నౌతా నంటాడు కవి. జీవితానుభవాలకీ ప్రకృతివివిధరూపాలకీ తనభావసూత్రంతో ఏకత్వాన్ని సమకూర్చి రెంటికీ సమన్వయం చేస్తానంటాడు కవి.

కవి స్వేచ్ఛాశీలి. ఈకవి స్వతంత్రస్వాతంత్ర్యప్రియుడు. ఛందోబంధాలను సడలించి గేయంలో పద్యంలో పాటలో ఎందుట్లో నైనా తనభావప్రకటనం చేయగలడు. భాషలో భావంలో జీవితంలోకూడా స్వేచ్ఛను అనుసరింపగల కవి కృష్ణశాస్త్రి. నక్షత్రాలు రాగానే చీకటిప్రభావం తగ్గుతుంది. లోకానికి వెలుగు ప్రసాదిస్తాయి నక్షత్రాలు. బండరాతిని చూస్తే ఎగుడుదిగుడుగా కళాహీనంగా కనిపిస్తుంది. అదే చట్రాతిని ఉత్తమశిల్పి జీవముట్టిపడే కళామూర్తిగా రచింపగలడు. ఆకులులేని కొమ్మలు మోడులై శుష్కంగా నిస్తేజంగా కనిపిస్తాయి. వసంతాగమనంతో ఆ ఆకులు లేని కొమ్మలే బంగారుపుబొమ్మలు లాగా కనిపిస్తాయి. అంటే ప్రకృతి ఒకనాడు నిస్తేజంగా మరొకనాడు తేజోమయంగా కనిపిస్తుంది. సంకుచిత మైన సంఘానికి స్వేచ్ఛాగీతిని పాడి నవ్యదీప్తి నందిస్తా నంటాడు కవి

ఈ క్రింది పద్యంలో,

"తీవియలత తాప కాకుసుమములఁ దాల్చ
నిర్ఝరి శిలయు నవజీవనకళలఁ దేఱ
మ్రోఁకుమోఁక చివ్రుసలెత్తి మురువుఁజూప
సముదయించె స్నేహ గానసుధల విందు"

పాషాణహృదయములనుగూడ తన గానసుధలతో కరుణాత్మంలుగా చేయగల శక్తి తనకవిగా కుంటుంటాడు కవి ధ్వనిరూపంలో. యీ యుగాలలో స్వేచ్ఛకై "ప్రాణసుమము లర్పించు వీరయోధుల జీవితఫలము స్వాతంత్ర్య గాంచునట్లుగా "స్వేచ్ఛాగానం చేస్తానంటాడు కవి. చిట్టచివరకు విశ్వమే పరవశమయి పాడ జీవనగానం చేస్తాడు కృష్ణశాస్త్రి.

తెల్లని మబ్బుతెర చాటున వున్న చందమామతో జతగూడి సరసమాడగలను. "నేను దిగిరాను దిగిరాను దివినుండి భువికి"- ఇది కవి ఆత్మవిశ్వాసము. అంతే కాదు పరుగెత్తి పరుగెత్తి పవనునితో కూడి- చెట్లకొమ్మలలో దూరి - పత్రాలను జేరి ప్రణయ రహస్యాలు పల్కుతానంటాడు. ప్రకృతిలో లీనమైపోతా నంటాడు—

"పక్షి నయ్యెద చిన్న ఋక్ష మయ్యెదను
మధుప మయ్యెదఁ జందమామ నయ్యెదను
మేఘ మయ్యెద వింత మెఱపు నయ్యెదను..."

ఇంకా ఏదో ఏదో ఔతా నంటాడు. ఇంకా కవికి స్వేచ్ఛమీద ఆసక్తి తగ్గలేదు. "నేను స్వేచ్ఛాకుమారుడను- నేను గగనపథవిహారవిహంగమపతిని- నేను మోహనవినీల జలధరమూర్తిని. నేను ప్రళయ ఝంఝూప్రభంజన స్వామిని"- ఇంతటితో కవి స్వేచ్ఛాప్రియత్వము పరాకాష్ఠనందినది. ఇది కవి ప్రకృతిస్వరూపము.

ఆయన పవిత్రప్రణయమూర్తి. ప్రణయదృష్టితో చూస్తాడు ప్రకృతినంతటినీ. తాను పెంచుకొన్న తీగ తెగిపోయింది. ఆయన ప్రణయలత వంగిపోయింది. సర్వప్రకృతి విలపిస్తున్నట్టుగా దృగ్గోచరమయింది. అందుకే దురంత దుఃఖంతో విలపిస్తాడు. మలయానిలపవనాలలో ఉండే ఓ సౌరభమా, ఓ గానమా, ఓ హిమకణమా, ఓ తేనెచినుకా, ఓ నీరదమా - ఓ లేటిమ్రోతా- ఓ కోయిలకూతా- మీరు ఇవ్వండి నాకు శాంతి. మీరు చేకూర్చండి నాకు 'ప్రశాంతి' అని మైమరచి విశ్వరూపంతో కనిపించే ప్రకృతిదేవతను వేయివిధాల వేడుకుంటాడు.

అయినా యౌవనం నూత్నవికసితం. అతి విశుద్ధమైన ప్రణయం మహోన్నతమైంది. ప్రణయమార్గంలో ప్రళయాలు సంభవింపవచ్చును. కాని ఆశలేశంగా ఏదో ఒక మూల ఉన్నది. ఎందుకల్ల నంటే "ప్రేయసీ! శర్వరీ తమోవీథులనుండి చందురుడు రాడె పూర్ణ తేజస్వి యగుచు" ఒకొకసారి ఒకసారి పకృతిఅంతా ప్రేమమయంగా కనిపించింది; ఇక మరొకసారి ప్రకృతి శోకమయంగా కనిపిస్తుంది. ప్రాణకాంతకోసం తా నేడుస్తాడు. ఎదుటివారిని ఏడిపిస్తాడు. కరుణరసం కాల్వలై ప్రవహిస్తుంది. అయ్యో! పత్నీవిరహ బాధితుడనైన నాహృదయబాధ కన్నీరుగా వరదలై పారుతున్నదే! పరమపవిత్రమైన గోదావరీ ప్రవంతి తరంగాలలో ఊగే మలయపవనమా! నన్ను కాపాడ మని అడుగుతాడు కవి. ప్రణయపు సలిలధారలతో పెంచి పెద్దచేసిన స్నేహపుపూలతీవ సుగంధవాసనలను వెదజల్లకుండానే ఒరిగిపోయింది! ప్రణయినీ భగ్నమానసుడైన కవి జీవతంతువుకూడా తెగిపోయినట్లే కవితో పాటు ప్రకృతికూడ ఏడుస్తుంది ఇక్కడ.

మానవజీవితం ఎంత విచిత్రమైంది. ఎన్నో భావాలతో ఆశయాలతో ఆదర్శాలతో తన జీవితంలో గాలిమేడలు కట్టుకుంటాడు మానవుడు. ఆమేడలు కూలిపోతే జీవితంలో నిరాశ- నిస్పృహ మిగులుతాయి. అందుకే "మింట జుక్క లదృశ్యమాయెను, చేతికందెడు పూలు వాడెను, 'సారహీనపు జీవితమునకు కోరికల్ మాత్రమే మిగిలాయిట!" —కాని జీవితంలో కేవలము కష్టాలే వుండవు. అక్కడ సుఖాలు —సంతోషకార్యాలు— సంభవిస్తాయి అన్న జీవితసత్యాన్ని నిరూపిస్తాడు కవి. ఆదృష్టితో చూస్తూ ప్రకృతినిగూర్చిఇట్లా భావిస్తాడు కవి. ప్రళయకాలమహోగ్ర........ఘోరఘోరార్భటులలో మెఱపేమిటి? హాలాహలంలో అమృత మేమిటి? ప్రబల నీరంధ్రాంధ........రాత్రీకుంతలములలో చుక్క లేమిటి? ఏమిటీ పరస్పరవైరుధ్యం— ఇదే ఒక తత్వము. ఒకసారి

ప్రకృతిఅంతా దీనంగా కనిపించింది; ఈనాడు తత్త్వబోధన కుపకారిగా గోచరమైంది. ఈ చిత్రవిచిత్రజగత్తులో "ఎడతెగని యాత్రను సాగింపలేక — యేద్వగా లేక కృశియింతు" నన్నాడు. ఈవిధంగా జీవితపారమార్థిక తత్త్వ విమర్శనంలోకూడా ప్రకృతిపాత్ర కృష్ణపక్షంలో ప్రముఖంగా ఉంది.

కృష్ణశాస్త్రి నిరంతరశోకాకులమైన లోకాన్ని చూచి ఏడుస్తాడు. విసువులేక విరతిలేక దుర్భరశోక విషమగీతులతో నేను "అనంతశోకభీకరతిమిరలోకైకపతి" నంటాడు. హృదయంలో అనంతమైన ఆవేదనతో లజ్జావిషాదాత్మకమైన ఈ పాడుబ్రతుకు వంగిపోయి పాతాళానికి క్రుంగిపోతుం దంటాడు. ఈ ప్రణయభారాన్ని మోయలేను— నేను జీవింపలేను— ఈవిధంగా ప్రకృతి మాటున కవి దాక్కొని వుంటాడు.

మానవునికి మోక్షప్రాప్తికి దైవసాన్నిధ్యమే ఏకైక శరణ్యము. స్వామి ప్రార్థనతో ప్రకృతినికూడా వేడుకుంటం కృష్ణపక్షంలో కనిపించే విశిష్టత్వం. కవి ప్రభుభక్తి కలవాడు. ప్రభుభక్తి సూచించే సమయంలోకూడ కవి ప్రకృతిని మరిచిపోలేదు.

"తరుణ శృంగార మధురమాధవుడ వీవు
కలికిపాటల కోయిలకొలము మాది"

అది శరద్రాత్రి. రాధ మాధవునికోసం అన్వేషణ చేస్తున్నది. మధురమోహన మురళీగానం వినాలనే ఉత్సుకతతో ఇట్లా అంటుంది. ఇక్కడ ప్రకృతిఅంతా నోరువిప్పి మాట్లాడుతుంది.

"ఎలదేటి చిఱుపాట సెలయేటి కెరటాల
బడిపోవు విరికన్నె వలపువోలె
తీయని మల్లిపూదేనె సోనలపైని,
తూగాడు తలిరాకుదోనె వోలె
తొలిప్రొద్దు తెమ్మెరత్రోవలో బయనమై,
పరువెత్తు కోయిలపాటవోలె
వెల్లువలై పాఱు వెలదివెన్నెలలోన,
మునిగిపోయిన మబ్బుతునకవోలె
చిరుత తొలకరివానగా చిన్నిసొనగ
పొంగిపొరలెడి కాల్వగా-నింగి కెగయు
కడలిగా- పిల్లగ్రోవిని వెడలు వింత,
తీయదనముల లీనమైపోయె నెడద.

ఈవిధంగా «కృష్ణపక్షము»లో కవిజీవితంలో లోకరీతిలో పారమార్థికచింతనలో ప్రణయసంకీర్తనలో కరుణరసనిరూపణంలో ప్రకృతి సర్వత్రా సాక్షాత్కరించి కృష్ణశాస్త్రిని «ప్రకృతికవి»గా చేసింది.

# పుత్రకాంక్ష

## శ్రీ కొండపీటి వేంకటకవి

[విశ్వకవి రవీంద్రుఁడు రచించిన "శాక్రిఫైజు" రూపకమునకు స్వేచ్ఛానువాదము. రాజపత్ని గుణవతి సంతానము లేనిదై జగజ్జననిసన్నిధానమునఁ దనహృదయావేదనను వెల్లడించుకొనుట యిందుఁ దెలుపఁబడును.]

తల్లీ! పిల్లలులేని యీబ్రదుకు నెందాకన్ భరింతున్ భవత్
ఫుల్లాంభోరుహనేత్రయుగ్మ మిఁకలేదో యాశిషవ్రాతమున్
దల్లిం గాఁగల భాగ్య మీజనికి లేదా లేనిచో మ్రోడునై
యుల్లాసంబు పరిత్యజింపఁగలనా యూహింపుమా శాంకరీ!

మాతృస్వర్గమునుండి నన్నధమగా మంత్రించి సృష్టింప నే
లా తల్లీ! గతజన్మకర్మఫల మెల్లం బండగాఁజేసి నా
చేతోవీథిని నగ్నిపర్వతము వాసింపంగ శిక్షింతువా!
నాతప్పుల్ సయిరింప నీకొను మపర్ణా! రాజరాజేశ్వరీ!!

ఈవక్షోజము లింక నెప్పటికిఁ బాలిండ్లౌనో లేదో భవా
నీ! వాత్సల్యరసామృత మ్మిటుల జీర్ణింపంగ నేదోషముల్
గావింపంబడెనో మహాత్ములకు నేఁ గావించు సేవావిధుల్
త్రోవ ల్దప్పినవేమొ గొడ్డఱిక మిట్లుం గూర్తువా లేనిచో.

మలమూత్రముల నంకతలము గల్మష మైనఁ గాంచి యానందించు కలిమి లేదు
పాలబుగ్గలు సొట్టవడ నవ్వు నునుకాంతిఁ గనులారఁ జూచు భాగ్యంబు లేదు
ఉయ్యాలతొట్టిలో నుంచి జోకొట్టించు పనిఁజూడ నే నోఁచుకొనఁగ లేదు
నిల లేక తప్పటడ్గులు వేయ నడపింపఁ జేయూఁదు విధులఁ గాంక్షింప లేదు
దాసదాసీజనమ్ములు తాత తాత యత్త య త్తనిపింప నే నరయలేను
కటికి గొడ్రాలితన మూని కాంతిలేని కాఁగడా నౌచు నాఱిపోఁగలను దుదకు.

శ్రీ కొండవీటి వేంకటకవి

ఈసౌధమ్ములు బొమ్మరిండ్లగునటే యీబొమ్మపెండ్లిండ్లతో
నాసంతోషము లాఱిపోఁగలుగునా నాయన్వయస్వర్గసం
వాసుల్ వంధ్యను నన్నుఁ గాంచి యభిశాపం బిచ్చి దూషింపరే
నాసామ్రాజ్యము దాయభాగముల కౌనా వీరమాహేశ్వరీ!

లేనునుమేనికాంతికి వళిత్రయ మీఁగినవేళ భర్తక
న్గోనలఁ జందమామ వెలుఁగుల్ గననైతిని; గాసెకోకతో
మేను ములంచి పై చెఱఁగుమీఁదికిఁ గప్పిన చంటిపాపనిం
బూనిన నన్నుఁ జూచు చెలువుం గననైతిని మందభాగ్యనై.

దానులు లేనివేళఁ దనుదానయి వచ్చుచుఁ బండుటాకులం
బ్రోదియొనర్చు చెక్కిళుల ముట్టుచు నెత్తురుకందు నవ్వఁగా
మోదముతోడ వీఁడు నిను బోలెడివాఁ డని నవ్వులాటగా
భూదయితుండు పల్క విను పుణ్యము నాకు లభింప దయ్యెఁగా.

స్త్రీనై పుట్టఁగ నేల, పుట్టితిని బో సృష్టిక్రియాహీననై
నానాయాతన లందనేల జనసంతానమ్మునే సంతతి
స్థానమ్మందును నిల్ప గర్భమును నంతశ్శయ్య గావింతువా
ప్రాణిస్పందసుఖానుభూతి యిఁక లేదా! నాకుఁ గాత్యాయనీ

వ్రత జప మంత్ర తంత్రము లవారిగఁ జేసితి నిత్యముం బతి
వ్రతలకుఁ బూవుబొత్తుల నుపాయన మిచ్చితిఁ గన్నకన్న దే
వతల కుపాస్తి సేసి యుపవాసము లుంటిని శాంతిపౌష్టిక
క్రతువులఁ జేసితిన్ నొసటవ్రాఁత మరల్పఁగ లేకపోయితిన్.

కఱదలతోఁ బురాణములగాథలతో శ్రుతిశాస్త్రసంహితల
గఱచుటతో సమాన లగుకన్యలనృత్యవినోదకేళితో
నఱిగెను బాల్య; మాపయిని యౌవనమంది వివాహకృత్యముల్
నెఱపుటతో సుఖమ్ములను నిల్చుటతో నది నేఁడు దీఱెడిన్.

బలి' నుండి]

# ఉమా సహస్రము

## పంచమ స్తబకము

శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణ శాస్త్రి

❈

[శ్రీరమణమహర్షిశిష్యులు శ్రీగణపతి మునీంద్రులు. సంస్కృతమున నాతని కవితాధార యనన్యాదృశము. ఆమునీంద్రునికృతులలో నొకటి యుమాసహస్రము. ఆధ్యాత్మికముగ కల్పనాత్మకముగ నొప్పారు నాగ్రంథ మండలి కొన్నిఘట్టములను అనువదించుసంకల్పము నాయీపద్యరచనకు మూలము. అందయిదవ స్తబక మిం దనువదింపబడినది. ప్రాజ్ఞు లెల్లరు పరిశీలింతురుగాక!]

సకియల గండభాగములఁ జందనచర్చలరీతి నొప్పు నా
చకితమృగాక్షి గౌరి మృదుచారుదరస్మితకాంతు లుజ్జ్వల
త్సకలజగద్విశేషమునఁ జారురమాపరమానుషంగభా
సకము లొనర్చుగాత నిజశక్తి పటిష్ఠత నొంద నిచ్చలున్.

కనకగిరి న్శరాసనముగా నొనరించిన యాదిశంకరున్
కినుక జయించి నట్టిమరుకీర్తి యన న్జెలువారు పార్వతీ
వనజముఖీదరస్మిత మవారిగ సంపద లిచ్చి మామకీ
ననవకవిత్వశక్తుల ననారతముం గయిసేసి ప్రోవుతన్.

సుందరమందరోన్మథిత శుభ్రసుధార్ణవవీచిమాలికా
బృందసముత్పత ద్ధవళబిందుసముత్కరసన్నిభంబు లా
నందితురంగపత్నిజననందనమందసితస్మితాభ లా
నందము నిచ్చుగాత నయనంబులకు న్సఫలీకృతేచ్ఛ లై

శారదచంద్రచంద్రికల చాయను గెల్చు ప్రసన్నతారుచిన్
ధీరగిరీశనేత్రయుగతృప్తిఁ గొల్పు నమందశోభలన్
ధారుణి నెవ్వి యా శివ యుదారమనోహరహాససంపదల్
వారని మీమనోరథప్రవాహముల న్సఫలంబుఁ జేయుతన్.

చంచల మై వలక్ష మగు చారుకుచోపరిభాసమానవ
స్త్రాంచలశోభతోడ సరసంబుల నాడు పురత్రయారివా
మాంచితభామినీ విమలమందమనోహర ముగ్ధహాసముల్
సంచితతద్విపద్విపులసారముల న్నశియింపఁ జేయుతన్,

సర్వదిగంగనావిమలచారుకపోలతలంబులన్ సుధా
గర్వవినాశకాచ్ఛరుచిగర్భిత శ్రీఘనసారశోభ లా
శర్వకుటుంబినీ హసితసంపద లాపద లెల్లఁ ద్రోసి యీ
సర్వజనావళిన్ సతము సంపదలన్ దులఁదూగఁ బ్రోచుతన్.

శ్వేతగిరీంద్రకూటవిలసీకృత పుష్పవనంబులఁ నవ
స్ఫీతవసంతశోభ నతిపేశలముం దగఁజేయు పార్వతీ
పూతసితస్మితాభలు ప్రభూతము లౌ భవదీయకామనా
వ్రాతములన్ సమగ్రఫలవాహము లౌ నటుఁ జేయుఁగావుతన్,

భాసురశీర్షభాగసుమ భాస్వరశీతమయూఖరేఖకున్
నాసికయగ్రభాగమున నర్తితభూషణరత్నరేఖకున్
వాసిగ నౌ ద్విరుక్తి యన వన్నెఁ దలిర్చు పురారిభామినీ
భాసిదరస్మితాంకురము భవ్యఫలప్రద మౌచుఁ గాచుతన్.

శిల్పకళావిశేషము లశేషముగా మదిఁ గొన్న వీడు సం
కల్పముఁ దా నెఱింగి శితికంఠుఁడు విశ్వగృహంబు భాసురా
కల్పముగా నొనర్చి నినుఁ గాంతగ మార్చి యతంచు పూరుషా
కల్పక మై రమించెనటః కామినిః తా నెఱిగించి శిల్పితన్.

ఫాళధృత్స్ఫటికాలపరిధానముతోడ మహేంద్రనీలర
త్నాళి లసచ్ఛిరోజభరసన్మ్రజటాధృతవేణితోడ నీ
లాళివిలాసలాసిధవళాంబుజనేత్రయుగంబుతోడ నే
వేళల నొప్పు నీతనువు వే శివు ముగ్ధు నొనర్చె భామినీ!

వరవక్షోజశిరోజనాభిముఖసర్వాంగప్రభారాశితోఁ
గర మొప్పు న్రమణీయ మై సురుచిరాకారంబు నౌ నీదు రూ
పుర మల్ లోకము వీడి శాంతుఁ డని యొప్పుం గన్న విశ్వేశు నా
సురమై ర్త్యార్చితపాదపద్మ నిల గేస్తుం జేసె నో శాంకరీ!

శర్వుఁ బురాణపూరుషుని శాశ్వతప్రేమ భజించినావు శ్రీ
శర్వుఁడు నీదురూపమున సమ్మదితుం డయి కోరె నిన్ను మీ
యిర్వురిపేర్మి దంపతిసమృద్ధికి నిశ్చలహేతు వై సదా
సర్వజగత్తునందు వరజంపతిభావపథోత్తబీజ మౌ.

అంచితతావకీనయనాంచలశోభ మనోహరంబు; రా
గాంచితతత్పురారిమృదుహాసము నూతనశీతరశ్మి; భా
వాంచిత మీ ద్వయంబు విభవాతిశయంబు వివాహమంగళం
బెంచగఁ గాంచి యొప్పె భవదీయకరగ్రహపూర్వరంగ మై.

వరదం బై యభయప్రదానచణ మై వజ్రాంకుశోపేత మై
సురబృందంబుల కెల్ల రక్షకము నై శుంభద్వీర్యసంపృక్త మై
హరపాణ్యగ్రగృహీత మై నిఖిలకల్యాణప్రదం బై శుభం
కర మై యొప్పుభవత్కరం బెపుడు న గ్గాపాడుతన్ శాంకరీ.

తాకుట కైన శక్తి గలదా? ధరణిన్ ధరరాజనందినీ!
నీకరపంకజం బఖిలనేత శివు న్స్మరియింప నేరికిన్
దేఁకువ గల్గునా? యగజ! దివ్యము మీ కమనీయబంధ మే
కాకృతు లీరు; మీ రఖిలకారణకారణమూర్తులే కదా

నిండుమనంబుతో శివుఁడు నీకు నొసంగె శిరోవతంసమున్
రెండుగఁ జేసి యం దొకటి బుక్షపతిన్; భవదీయవేణికా
ఖండభరంబునం దిడితి కాంతిఁ దలిర్పఁగ నీవు దాని నా
చండమయూఖవైరియును శార్వరిఁ గూడినయట్లు భాసిలెన్.

నీ వల పర్వతేంద్రకులనీరధి సుద్భవ మైన దాది యా
దేవుఁడు నీదు రూపుపసఁ దీరనివాంఛను జూడఁ గోరి స
త్పావనశైలకూటతటి వాసముఁజేసెను దేవి! చంచలా
శ్రీవిలసత్త్వదీయతనుచిత్రితకోమలతాత్తచిత్తుఁ డై.

'వశి' యను కీర్తి శంభున 'కపర్ది' యటం చల గౌరిదేవికిన్
విశదముఁ జేయ నెంతయును వీర్యముఁ జూపె మరుండు కాని నా
డశిథిలప్రేమబంధ మగు నాశివశక్తుల సిద్ధయోగమున్
కుశలతఁ దా నెఱింగియును గోరి మృతిం గొనునే ప్రమాది యై.

తొలిజన్మంబున నీదునాథుఁ డగు రుద్రుం భర్తగాఁ గోరుచున్
మలిజన్మంబునఁ జేసితీవు తప మా మౌనీశసంభావ్య మీ
యిల నేవాఁడును గాంచఁగల్గునె ఫలం బిష్టం బనుద్యోగి యై
యలఘూద్యోగివి! నీతపస్సు కిదియే యర్థంబు కాత్యాయనీ!

ఫాలాక్షుండు కపాలమాలి విలసద్భస్మాంగరాగుండు నా
గాలంకారుఁడు దర్పకోన్మథనవిఖ్యాతుండు శీర్షత్రయా
లోలచ్ఛూలధరుండు భాసురజటారోచిఃప్రపూర్ణుండు కం
కాలాకీర్ణశ్మశానవాసి విలసద్గంధేభచర్మాంబరుం—

డాలక్ష్యోద్ధసనుండు రుద్రుఁడు మహీయఃప్రేమపాత్రత్వల
క్ష్యాలంకార మిదే గదా జగతి దృష్టాంతంబు సత్ప్రేమకున్;
మూలాధార మ దేదొ యాంతరము సూ భూతావళిం గూర్పఁగా
జాలుం భావము గాని కావు జగతిన్ సారోపాధిసచ్చిహ్నముల్.

ఇందుకళావతంసుఁ డరిబృందభయంకరరూపముగా జనా
క్రందనచేష్టితంబుఁ బరగన్ ధరియించియు నెల్లవేళలన్
సుందరి! నీసమక్షమున శోభిలు ముగ్ధమనోహరంబు నా
నందన మైనరూపున మనం బలరించెడు ముగ్ధచేష్టలన్,

ప్రహసద్వక్షము నై ప్రసన్నముఖ మై భ్రాజిష్ణుమౌళీంద్ర మై
విహసత్సింహము నై వినోదితగణాన్వీతంబు నై భాగ్యసం
వహనం బై యలరారె మాత! భవదుద్వాహంబు శీతాద్రిపై
సహముల్ రాత్రు లపూర్వతామహిమ నత్యానందసంధాయి యై.

ప్రేయసి వైన నిన్నుఁ గొనిఁ బ్రీతిఁ గనె న్బరమేశ్వరుండు దీ
ర్ఘాయురుపేతులన్ సుతులఁ గప్రవచస్కుల నిర్వురన్ బ్రజా
శ్రేయముఁ గోరి యం దొకఁడు పేరె మహీధరకందరంబు వా
లాయమునన్ భ్రమించె బహులాది యనన్ బ్రజలెల్ల నొక్కడున్

పూతచరిత్ర మై జగతిఁ బూజ్యతఁ గన్న పురారిభామినీ
మాతృయశంబు కీర్తనము మానుఁగఁ జేయు నుపేంద్రశక్ర
జాతతపద్యముల్ ముదముఁ జాల నొనర్చి తలిర్చు నెప్డు కీ
ర్త్యాశ్రితతసత్సమాజముఖరాజితరూపము లై యపూర్వతన్.

శ్రీగణపతిప్రీతి రస్తు

# శ్రీ జగన్నాథ పండితరాజు

## శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణ శాస్త్రి



సంస్కృతసారస్వతము నామూలాగ్రముగ నాకళించిన మహామహు లెందఱో భారతదేశమున నావిర్భవించిరి. అందు జగన్నాథపండితరాజు మిక్కిలి ప్రసిద్ధుఁడు. స్వాంశమునగ సకలశాస్త్రముల నభ్యసించి లబ్ధప్రతిష్ఠుఁ డయ్యెను. ఆమహాశయుని చరితము నావంత గ్రహించి యానందించుట యాంధ్రుల విధి. కాన నాతనిచరిత మిందు సంగ్రహింతును. చారిత్రకాధారములఁ బట్టి కొంతయు, జనశ్రుతులను బట్టి మఱికొంతయు నిందు నిరూపింపఁ బడును. పాఠకలోక మందలి సత్యమును గ్రహింతురుగాక!

శ్రీ జగన్నాథపండితుఁడు తెలుఁగు బ్రాహ్మణుఁడు. "ఆసఫ్ విలాసము" అను గ్రంథముయొక్క ప్రారంభమున "తైలింగకులావతంసేన పండిత జగన్నాథేన" అను వాక్యము గలదు. 'తైలింగ' పదము తెలుఁగుజాతిని సూచించును. కాన నితఁడు ఆంధ్రబ్రాహ్మణుఁ డనుట నిర్వివాదము. ఈతని తండ్రి పేరుభట్టు, తల్లి లక్ష్మి.

«పాషాణాదపి పీయూషం స్యందతే యస్య లీలయా,

తం వందే పేరుభట్టాఖ్యం లక్ష్మీకాంతం మహాగురుం»

అను వాక్య మందులకుఁ బ్రమాణము.

పేరుభట్టు ప్రసిద్ధుఁడయిన పండితుఁడు. జ్ఞానేంద్రభిక్షు వను సన్యాసికడ వేదాంతశాస్త్రమును, మహేంద్రుఁ డను విద్వాంసునికడ న్యాయవైశేషికదర్శనములను, ఖండదేవుఁ డను నుపాధ్యాయునికడఁ బూర్వమీమాంసను, శేషవీరేశ్వరపండితునితోడ వ్యాకరణమహాభాష్యమును, నధ్యయనము గావించెను. ఇంతియకాక యితఁడు వేదాదివిద్యల యందును గడుప్రవీణుఁడు. పాషాణములను సయితము ద్రవింపఁజేయు వాక్చాతుర్య మీతని సొత్తు. కావుననే యీవిద్వన్మణికి 'సర్వవిద్యాధరు' డను ప్రఖ్యాతి లభించెను.

«శ్రీమద్జ్ఞానేంద్రభిక్షో రధిగతసకలబ్రహ్మవిద్యాప్రపంచః
కాణాదీః క్షపాదీ రపి గహనగిరో యోమహేంద్రా దవేదీత్,
దేవా దేవాధ్యభీష్ట స్మరహరనగరే శాసనం జైమినీయం
శేషాంకప్రాప్తశేషామలభణితి రభూత్సర్వవిద్యాధరోయః
«పాషాణా దపి పీయూషం స్యందతే యస్య లీలయా»

అనువచనము లద్దానికిఁ దార్కాణములు.

ఇట్టి తండ్రికడనే పండితరాజు సర్వవిద్యలను సముపార్జించెను. మఱియుఁ దనతండ్రికి గురువయిన శేషవీరేశ్వరునికడ నితఁడు గొంతవిద్య నభ్యసించెను. «మనోరమాకుచమర్దన» మను గ్రంథమునందలి వాక్యమునుబట్టి యిది యవగత మగును.

«అస్మద్గురు పండితవీరేశ్వరాణాం» అనిన పండితరాజన్ని శాస్త్రములందును నిరుపమాన మగు పాండిత్యప్రతిభఁ గలవాఁడు. దర్శనములందును సాహిత్యశాస్త్రమునందును నితని కెక్కువ సామర్థ్యము గలదనియు నయ్యది యత్యద్భుత మనియుఁ జెప్పవచ్చును. 'రసగంగాధర' మను నాతని గ్రంథరాజమునఁ దాను గావించిన రచనాపద్ధతులే యిందులకు దృష్టాంతము.

పండితరాజు దనకాలమునఁ గల విద్వాంసులలో నుత్తమశ్రేణి నలంకరించినాఁడు. బహుభాగ్యముల ననుభవించిన భోగశీలుఁడు. చిన్నతనముననే యితఁడు సకలవిద్యలందునను సామర్థ్యము నుపార్జించెను. ఆవిద్యాప్రభావముననే 'షాజహాను' చక్రవర్తికృపకుఁ బాత్రుఁడయ్యెను. ఆ సభయందే యితనికిఁ బండితరాజను బిరుదము లభించెను. తన యౌవనదశయంతయు నచ్చటనే గతించెను. «భామినీ

విలాసః" మను గ్రంథమందలి "ఢిల్లీవల్లభపాణిపల్లవతలే నీతం నవీనం వయః" అను వాక్య మిందులకు నిదర్శనము. 'జగదాభరణ' మను గ్రంథమున నీపండితుఁడు 'షాజహాను' కుమారుఁ డగు 'దారా'ను వర్ణించెను. కావున 'దారా' కాలమునఁ గొంతవఱకుఁగూడ నీకవివతంసుఁ డున్నట్లు తోఁచును. పండితరాజు 'షాజహాను' దర్బారులోఁ గొంత కాల ముండెనని స్పష్టముగఁ జెప్పవచ్చును. 'షాజహాను' చక్రవర్తికి క్రీ॥ శ॥ 1628వ వత్సరమున రాజ్యాభిషేకము జరిగెను. క్రీ॥ శ॥ 1658వ సంవత్సరము నాతఁడు దన పుత్త్రుఁడగు 'ఔరంగజేబు'చే బంధీకృతుఁ డయ్యెను. క్రీ॥ శ॥ 1666వ సంవత్సరమున నాచక్రవర్తి దివంగతుఁ డయ్యెను. జగన్నాథపండితుఁ డీతనికాలమున నుండెను గావున క్రీ॥ శ॥ పదునేడవ (17) శతాబ్దిలోనివాఁ డని చెప్పవచ్చును. 'షాజహాను' మరణానంతరమునఁగూడ నితఁడు జీవించె ననియుఁ దెలియుచున్నది.

పండితరాజు జీవితమునుగూర్చి పెక్కు కింవదంతులు గలవు. అందుఁ గొన్ని సత్యదూరము లనిపించును. కొన్ని యథార్థము లనఁదగును. కాన నన్నిఁటియందును గొంత కొంత వాస్తవికత యున్నదని యంగీకరింపవచ్చును

పండితరాజు విద్యాభ్యాసమునుండి విరమించినపిదప మున్ముందుగ నుత్తరదిశయందున్న జయపురమున కేగెను. అచ్చట నొకసంస్కృతపాఠశాలను స్థాపించి బాలకులకు విద్యఁ గఱపుచుండెను. అచ్చట ముసల్మానులమతగ్రంథము లగు 'ఖురాను' మున్నగు వాని నచిరకాలమునఁ బఠించి యందుఁ బరిపూర్ణప్రజ్ఞ నార్జించెను. ఒకదినమున ఢిల్లీరాజధానినుండి యేతెంచిన కాజీతో (ముసల్మానులమతప్రవక్త) వాద మేర్పడెను. ఆవాదమున నితఁడు సయుక్తికముగ 'కాజీ' నోడించెను. పరాభూతుఁ డయ్యును గుణగ్రాహి యగు నా'కాజీ' జయపురమునుండి ఢిల్లీ కేతెంచి 'షాజహాను' చక్రవర్తి సమక్షమునఁ బండితరాజుప్రతిభను వేనోళ్ళఁ గొనియాడెను. 'కాజీ'యే స్వయముగఁ గొనియాడుటం గాంచి యాసార్వభౌముఁడు మిక్కిలి ప్రీతుఁడై యాపండితరాజును ఢిల్లీకాహ్వానించెను. అతనిప్రతిభావిశేషములకు ముగ్ధుఁడై తనయాస్థానమున నిడుకొనెను. నాఁటి నుండియు నాజగన్నాథపండితుఁడు వివిధవిలాసవిశేషవిరాజమానంబగు నా ముసల్మాను చక్రవర్తికొలువుకూటమునఁ బండితస్థాన మలంకరించెను. రసికాగ్రణి యగు నాజగన్నాథుఁ డాసమయముననే యారాజధానియందలి యొక యవనకన్యను ప్రేమించెను. పాదుషా యాతనినిష్కల్మష ప్రేమను బరిశీలించి యభినందించి యామె నాతని కిప్పించి వివాహముఁ గావించెను. ఈతీరునఁ దన యౌవనదశ నట వెళ్ళించి వార్ధక మంకురింపఁగనే యామనీషి తనయర్ధాంగితోడంగూడ వారాణశి కేతెంచెను. కాని యచ్చటిపండిత ప్రకాండు లగు నప్పయ్యదీక్షితాదులు యవనీసంసర్గదూషితుఁ డగు నాపండితరాజు తనపావిత్ర్యమును బ్రకటించుకొనుటకై యొకదినమున గంగాతీరమున కేగి తత్తీరోపరి సోపానతలమున నాసీనుఁడై తత్కాలవిరచితపద్యరత్నములచే గంగామాతను స్తుతించెను. ఆపద్యములే 'గంగాలహరి' యను పేరం బ్రసిద్ధము లయ్యెను పండితరాజుస్తుతివచనములకు భాగీరథి యుప్పొంగి, యన్నిసోపానముల నతిక్రమించి, యవనీసహితుఁ డగు నామనీషివతంసునిఁ దన పావనజలములో లీనముఁ గావించుకొనెను. ఈర్ష్యాళువు లగు నాకాశీవిద్వాంసులందఱు నాసన్నివేశమును గాంచి చకితహృదయులై పశ్చాత్తప్తు లయిరి. నాఁటినుండియు నామహాశయు ర్తి నభివర్ణించుచుండిరి. ఇది యొక యపదానము.

మఱి యొక కింవదంతి యిట్లున్నది. షాజహానుచక్రవర్తికరుణకుఁ బాత్రుఁడైన పండితరాజు ధనసంపదచే నున్మత్తుఁ డయ్యెను. యౌవనాగ్నియం దాసంపద ఘృతాహుతి యయ్యెను. ఆతనిలోని వివేకజ్యోతి క్షీణించెను. అజ్ఞానాంధకార మలముకొనెను. ఆతఁ డొకయవనయువతీప్రేమపాశనిబద్ధుఁ డయ్యెను. అద్వితీయప్రతిభాశాలి యగు నామనీషి యాయువతింగూడి కొన్నినాళ్లు సుఖించెను. కాల మెప్పుడు నొక్కతీరున నుండదుగదా! కొన్నినాళ్ళకా యవనకాంత మృత్యుగ్రస్త యయ్యెను. అయ్యది పండితునకు దుర్భరహృదయాఘాతముగఁ బరిణమించెను. కాంతావియోగమున నాకవి కడుంగడు కృశించెను. రాజధానిని వీడి యన్యస్థలమున కేగ సంకల్పించెను. కతిపయ దినములకుఁ గాశీనగరమునుఁ జేరుకొనెను. కాని యచ్చటఁ గూడ నాతనికి శాంతి దుర్లభమయ్యెను. ప్రేయసీవియోగ

దుఃఖమునకుఁ దోడుగ నచటిపండితప్రవరులు గావించు నవమాన మతిదుస్సహ మయ్యెను. అట్టిదుఃఖమును నిట్టి యవమానమును భరింపఁజాలక యాపండితరాజు తనజీవిత మందలియాశనే త్యజించుకొనెను. వర్షాదిదినములలో నుప్పొంగి ప్రవహించు గంగం జేరి యామెను స్తుతించుచు నందులోఁబడి మరణించెను.

మఱియొక కింవదంతి యిట్లున్నది.

వార్ధకమున జగన్నాథుఁ డొకనాఁడు గంగాతటమున యవనకాంత నాలింగనము గావించుకొని నిద్రించుచుండెను. పలితధవళం బగు నాతని శిఖమాత్రము నేలపై వ్రేలాడుచుండెను. ముఖము వస్త్రాచ్ఛాదిత మయ్యెను. ఆసమయమున దైవవశమున నటకు స్నానార్థ మేతెంచిన యప్పయ్య దీక్షితులు వానినిఁ గాంచి ముసలికాలమునఁగూడ నీతఁ డెవ్వఁడో యైహికసుఖములను విడఁజాల కున్నాఁ డని భావించి,—

“కిం నిశ్శంకం శేషే శేషే వయసి త్వ మాగతే మృత్యౌ” ‘వార్ధకమున మృత్యువు తలపై నృత్యముఁజేయుసమయమునను నింకను నిశ్శబ్దముగా నిద్రించుచున్నా వేమి? ఇప్పటికైనను సుఖమును వీడుము. భగవంతు నిప్పుడైనఁ బ్రార్థింపుము’ అని పలికెను. ఆమాటలను విని పండితరాజు ముఖముపైనున్న వస్త్రమును దీసి యాతనిం జూచెను. దీక్షితుఁ డాతని జగన్నాథుఁ డని గుర్తించి, మరల,

“అథవా సుఖం శయీథా నికటే జాగర్తి జాహ్నవీ భవతః” ‘పోనిమ్ము. సుఖముగ నిద్రింపుము. నీసమీపమునసే లోకపావనియగు గంగానది యున్నదిగదా’ అని పలికి స్నానార్థ మేగెను.

జయపురాధిపతియు ‘మీర్జా’ రాజు నగు జయసింహుఁడు గాశీవాసి యగు జగన్నాథునిఁ దనతోడఁ దనపురమునకుఁ గాశీనుండి కొనితెచ్చెను. దానికిఁ గారణ మీక్రిందివిధమునఁ గలదు. పాదుషాదర్బారులోని మొగలాయీలు గొంద ఱాజయపురాధిపతినిఁ గాంచి, “మీరు నిజమయిన క్షత్రియులుగారు. పరశురాముఁ డిరువదియొక్కసారులు పృథివినిఁ బర్యటించి, క్షత్రియులను జంపి, భూమిని నిఃక్షత్రముఁ గావించెను. మఱియు మీచే నాదరింపఁ బడుచున్న సంస్కృతభాష మాయఱబ్బీభాషకంటె నర్వాచీనము. మాభాషయే ప్రాచీనమయినది” అని యాక్షేపించుచుండిరి. జయసింహుఁ డీయవమానమును సహింపఁ జాలక వానికిఁ దగురీతిని సమాధానమీయఁజాలిన సమర్థు నరయుచుండెను. ప్రతిభాశాలి యగు జగన్నాథుఁ గాంచగనే యాప్రభు వీతనితోఁ దనయవమానకారణమునుఁ దెలియజేసెను. పండితరా జద్దానిని విని తన యుక్తులచే మొగలాయీలను నిరుత్తరులనుఁ గావించెద నని ప్రతిన యొనర్చెను. ఆ మేధావి మొదటిప్రశ్నమున కప్పుడే సమాధానమును జెప్పఁగలఁడు. కాని రెండవదానికి సమాధాన మిచ్చుట కాతని కరబ్బీభాష రాదు. కావున నాతఁ డరబ్బీ నాకళించుట కాగ్రాకుఁ బోయి యందుఁ బరిపూర్ణమగు ప్రజ్ఞ నార్జించి జయపురమున కేతెంచి రాజదర్శనముఁ గావించెను. జయసింహుఁ డానునీషి ప్రతిభ కచ్చెరువడి యాతనిఁ దోడ్కొని ఢిల్లీదర్బారున కేగెను. జగన్నాథుఁడు వా రడిగినప్రశ్నములలో మొదటిదానికీతీరున సమాధాన మిచ్చెను. ‘పరశురాముఁ డిరువదియొక్కసారులు క్షత్త్రియులను జంపి భూమిని నిఃక్షత్త్రము గావించెనను వాక్యమునకు క్షత్త్రియు లందరికిని నిర్విశేషముగఁ జంపె నని యర్థము కాదు. చాలవఱకు క్షత్త్రియులను జంపె నని యర్థము. పూర్తిగ వారిని జంపిన నిరువదియొక్కసారులు భూమి నేల పర్యటనము గావించును? ప్రతిపర్యాయము నెవ్వరో కొందఱు రాజులు మిగులుచునే యుండిరి. వారు మిగిలి రను వార్తను విన్నఁగానే పరశురాముఁ డుగ్రుఁడై వారిని ఖండించుచుండెను. ఇట్లు ఇరువదియొక్కసారి గావించెను. విశ్రాంతుఁ డయ్యెను. ఇరువదిపర్యాయములు తిరిగితిరిగి సంహరించినను మిగిలిన క్షత్త్రియు లిరువదియొక్కపర్యాయము సంహరింపఁ బడిరి అట్లే యిరువదియొక్కసారియుఁ గొందఱు మిగిలియే యుందురు. మిగుల లేదని చెప్పుట కాధారము లేదు. “ఇరువదియొక్కసారి” అను పదమే వా రింకను మిగిలియుండిరనునర్థమును సూచించుచున్నది ఆమిగిలినవారే యీరాజులకుఁ బూర్వులు. ఇందు సందేహము లేదు” అని తనతార్కికదృష్టిచే సమాధాన మొసంగెను. ఇది మొదటి ప్రశ్నమునకు సమాధానము.

'ముసల్మానులు హిందువులకు విరుద్ధముగ నన్నివిధముల నాచరింపవలెను. అది వారిధర్మము' అని 'హదీసు'ను ముసల్మానుల మతగ్రంథమునఁ గలదు. ఈవాక్యమును బరిశీలించిన నీ గ్రంథనిర్మాణమునకుఁ బూర్వముననే హిందువుల కేదో యొకధర్మ మున్నదని స్పష్టమగుచున్నది. ఆధర్మము భాషమూలమున నిబద్ధమై యుండును. కాన హిందువులకుగూడ నొకధార్మిక సంస్కృత భాషయు నుండితీరును. అదియే సంస్కృత మయియుండును. కావున నీసంస్కృతభాష యరబ్బీభాషకంటె నతిప్రాచీనమనుట నిర్వివాదము. ఇది ద్వితీయప్రశ్నకు సమాధానము.

ఈరెండుసమాధానములను విని గుణగ్రాహి యగు షాజహానుచక్రవర్తి మిక్కిలి ప్రసన్నుఁడై యీ పండితరాజును దన యాస్థానమున నుంచుకొనెను.

పైకింవదంతులనుబట్టి జయపురమహారాజుమూలమునఁ బండితరాజు షాజహానుదర్బారులోఁ బ్రవేశించె ననియు, నచ్చట నొక యవనకన్యను బ్రేమించి గ్రహించె ననియు, వార్ధకమున వారణాశిలో నప్పయ్యదీక్షితాది పండితప్రవరులచేఁ బరాభవింపఁబడె ననియు. స్పష్టముగఁ జెప్పవచ్చును. పండితరాజు యవనీహృతచేతస్కుఁడని చెప్పుటకుఁ దాను రచించిన శ్లోకములే నిదర్శనము.

"యవనీ నవనీతకోమలాంగీ
శయనీయే యది నీయతే కదాచిత్,
అవనీతలమేవ సాధు మన్యే
న వనీ మాఘవనీ వినోదహేతుః"

"నయాచే గజాళిం నవా వాజిరాజిం
న విత్తేషు చిత్తం మదీయం కదాచిత్,
ఇయం సుస్తనీ మస్తకన్యస్తహస్తా
లవంగీ కురంగీ దృగంగీ కరోతు."

పండితరాజు మిగుల తీవ్రమయిన స్వభావముగలవాఁడు. కటువుగా నున్నను సత్యమును జెప్పుటలో వెనుకంజ వేయఁడు. ఒకదినమున నొకకవి తనకవిత్వమును వినుఁడని పండితరాజును బ్రార్థించెను. అతఁ డంగీకరించియు, గవిత్వమును వినుటకుముందుగనే యాకవితో మిత్రుఁడా! నీవు పరిపక్వద్రాక్షాఫలప్రసన్నమధుధారాసదృశములగు వచనరచనల సారమెఱింగి కవిత జెప్పఁగడంగిన నీకవితను నాకడ వినిపింపుము. కాని నాఁడు స్వకృతపాపమువలె నీకవిత్వమును గూడ వినిపింపక నీహృదయముననే నిలిపికొనుము" అని యిట్లు పలికెను.

"నిర్మాణే యది మార్మికోసి
నితరా మత్యంతపాకద్రవ
న్మృద్వీకామధుమాధురీమద
పరీహారోద్ధురాణాం గిరాం,
కావ్యం తర్హి సఖే సుఖేన కథయ
త్వం సమ్ముఖే మాదృశాం
నోచేత్ దుష్కృత మాత్మనాకృతమివ
స్వాంతా ద్బహిర్మాకృథాః"

పండితరాజు స్వాభిమానధనుఁడు. ఆతని గర్వోక్తులు సంస్కృతసారస్వతమున బహుముఖముల వ్యాపించినవి. "లోకమునఁ గవులు పలువురు గలరు. కాని మృద్వీకా పాకసంకాశములగు వాక్కుల కాచార్యుఁడను నేను మాత్రమే. ఈ వాగాచార్యస్థాన మలంకరించుట కన్యుల సమర్థులే" అని తన గర్వోక్తి నిట్లు ప్రకటించెను.

"ఆమూలాద్రత్న సానోర్మలయ
వలయితా దాచకూలా త్పయోధే
ర్యావంత స్సంతి కావ్యప్రణయన
పటవస్తే సముగ్రం వదన్తు
మార్ద్వీకామధ్య నిర్యన్మసృణ
రసఝరీమాధురీభాగ్యభాజాం
వాచామాచార్యతాయాః పద
మనుభవితుం కోస్తి ధన్యో మదన్యః"

ఇది యాతని పాండిత్యవీరమున కుదాహరణము. గర్వో కాదని యాతని సిద్ధాంతము.

మఱియు నొక నాయికను వర్ణించుచు నా మహాకవి "ఆ నాయిక నా కవితవలె నతి మనోహారిణి" అని పలికినాఁడు. స్వాభిమాన మెట్లు ప్రకటించుకొనెనో గమనించునది.

"సా మామకీనకవితేవ మనోభిరామా
రామా కదాపి హృదయా న్మమ నాపయాతి"

ఇంకను నాతఁడు "తెనకరతెను విని యెవ్వఁ డానందింపఁ జాలఁడో యాతఁడు జీవించియు మృతుఁడే" యని పలికి నాఁడు. చూడుఁడు.

"ధ్రువం తే జీవంతో౽ ప్యహహ మృతకా మందమతయః
న యేషా మానందం జనయతి జగన్నాథభణితిః"

ఉగ్రస్వభావముండుటచేతనే యాతఁ డుద్దండపండితుల రచనలయందు నయితెను దోషముల నెంచుటలో వెనుఁ దీయలేదు. ఇట్టి మహాకవియు, మహాపండితుఁడునగు జగన్నాథుఁడు ముక్తిపురిలో మరణించి ముక్తుఁడయ్యెను.

ఈతఁడు పంద్రెండుగ్రంథములను రచించెను. అందు రసగంగాధరము - మనోరమాకుచమర్దనము - చిత్రమీమాంసాఖండనము - శాస్త్రగ్రంథము లనఁబడును. ప్రాణాభరణము - జగదాభరణము - ఆసఫ్‌విలాసము - చారిత్రకములు వర్ణనాత్మకములును. అమృతలహరి - కరుణాలహరి - పీయూషలహరి - లక్ష్మీలహరి - అనునవి ఖండకావ్యములు. భామినీవిలాసము సంస్కారణాత్మక కవితాసంగ్రహము.

ఇట్లు సంస్కృతభాష నుపాసించి, సంఘమునకు మహోపకృతిఁ గావించిన యీ మహాశయుఁడు ధన్యజీవి. ఈ మహోదారుఁ డాంధ్రుఁడగుట యాంధ్రులభాగ్యము.

"జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
యేషాం నాస్తి యశఃకాయే జరామరణజం భయం"

# శ ర ణా గ తి

శ్రీ శ్రీనివాస సోదరులు



ఏమీ! వచ్చితి రయ్యా!
రామయ్యా! లక్ష్మణయ్యా! రండీ! రండీ!
ఈమఁదవగ్గునకు పరం
ధామము గురుదేవు లిడిరి తమపరిచర్యన్.

దేహ మంతయు కనులుగా సాహసమున
ప్రాణధారణ మొనరించి నాను తండ్రి!
నేడు గురుదేవువాక్కులు నిక్కములుగ
నీవు దయసేయ జన్మ పండినది నాకు.

ఎంత శ్రమ, ఎంత శ్రమపడి ఇచటికి దయ
చేసితివి! ఎంత కరుణ ఈదాసిమీద
ఈవె దయచేసి రక్షింపవేని నన్ను!
బోలిన నికృష్టులకు నింక ముక్తి కలదె?

అంబరం బెల్ల మేఘావృతం బైనంత
నా దేవుఁ డెపుడు కన్పడు నటంచు
మట్టమధ్యాహ్నంపు మార్తాండుడు వెలుంగ
నా దేవు తేజ మెంతటిదో యనుచు
నిండారు జాబిల్లి పండువెన్నెల గాయ
నా దేవు నవ్వులే నాణె మనుచు
మాఘవనుల గాలి మంజుళంబుగ వీవ
నా దేవు చలువె ప్రసన్న యటంచు

దేనిఁ గనుగొన్న నీమాటె తేప తేప
కురువడి జ్ఞప్తికెలసి నిన్నరసినట్ల
మై పనుఁలోన తికమక యావహించి
ఎంచలేని నాచెలుల నవ్వించు చుందు.

ఇదిగో! ఈహృదయంబు నే యడుగుమీ
ఎన్నెన్నిపర్యాయముల్
చిదురల్ గాఁ దలపోసి సిద్ధపడెనో,
చిత్తాడి ముత్తాడెనో,
తుద కేనాటికి నైన నీపదములన్
దూరాన నేనిన్ శ్రవః
పదముం జేర్పకపో నటన్న నిరుకున్
వాడించి వేధించెనో.

పొడవై పోయిన చాయలంబలె వ్యథా
పూర్ణస్థితుల్ తోఁప; ఈ
బడుగున్ దేహము సాయ మాతపమటుల్
పండంగ, నే మందు? రాఁ
దొడఁగెన్ సంశయకాళరాత్రి; ఇఁక నీ
తో నాకు సాన్నిధ్య మే
కడగొట్టున్ సుడిమెట్టు పుట్టువున నో
గాఁ యంచుఁ జింతించితిన్.

ఒంటిదానను గదా ఒం టేమి సేయుదు?
నిను గొల్తు ననుకొంటి ననునిమిషము,
నా కేమి తెలియు నా నరనరమ్మును వట్టి
పెడకట్టెలై నను వేచుననుచు
ఆ! నాదౌర్భాగ్యమా! నాదు నుతికూడ
కుట్ర చేయునె శత్రుకోటిఁ జేరి
ఎంత పెట్టిన నేమి? ఈనాల్క చూడుమీ
వెక్కిరించును నన్ను కొక్కిరించు

దీని కత చూడు పుట్టిన దినమునుండి
కలసి మెలసియె యుంటిమి గద! విడువక
యున్నటులె యుండి గోయిత్రవ్వుచుండు వెనుక
ఎంత మాయలమల్లియో ఈహృదయము!

పురిటిలో సందుగొట్టినపోల్కి పుట్టి
నపుడె యేపులినోటనో అడఁగిపోవు
దాన బ్రతికితి: నమ్మిక తగిలె నాకు
ఒసగు నని నీకు పాద్య మీ ఓటికుండ.

నా యానందము మాయ యెత్తుకొనిపో
నా పాదముల్ కాయలై
ఫోయెన్ వెన్బడి పర్వులెత్తి, అది నీ
ముత్యాలసౌధమ్ములో
మాయం బైనది, నీపరాచకపు కం
పన్ దీసి, ఇప్పింపుమా
నా యానందము, లేద? నీగృహములో
నన్ జూచుకో నీయుమా!

ఈవె యజ్ఞాతశక్తి వై యెందు నింకి
పొటమరింతువు మొగ్గవై, పూవ వగుదు
కాయ వగుదువు, పండవై కడకు బీజ
రూపమున నిల్తు వీ మాయలోకమందు.

స్వప్నమందును, వ్యర్థప్రసంగమందు
నీరవపదమ్ములను గమనించు నాయు
వటులె వెన్నంటి తిరుగుచున్నట్టి నిన్ను
నింతవఱకును నే గుఱుతింప నైతి.

ఈనాడో! ఆనాడో! ఏనాటినుండియో
నిన్ను వర్ణించెడు నిగమతతులు
యమనియమాదుల శ్రమ లెక్క సేయక
ఉడుగక నినుఁ గొల్చు యోగిజనులు
శీతాతపంబుల చీరికిం గొనక నీ
ధ్యానంబు సాగించు మౌనివరులు
స్వపరస్వరూపముల్ చక్కగా గుఱుతించి
నీ నిత్యభక్తులౌ జ్ఞానధనులు

ఎంద ఱెందఱు లేరు? వా రీదినమ్ము
వఱకు తావకాన్వేషణప్రయతనమున
మొట్టమొదటి మెట్టును దాట; రెట్టు లీవి
కారి శబరికి నీకటాక్షంబు దక్కె!

ఇంత టంతటఁ గాదు, వేయేండ్ల కైన
లక్ష్య మగు పట్టునను నాస లవము లేదు
మేఘరూప! నీకడగంటి మెఱపుమీఁద
నింక గమ్యస్థలము చేరనిమ్ము నన్ను.

చనవును మున్గొని యోగం
బును సలుపుచు నున్న పెడగుముదివగ్గు ననుచున్
కనుమీ తెప్పల కుప్పను
ఘనకమనార్ద్రపరీక్షకవిలోకములన్.

నాలో గుణాలవమును లే
నే లేదు, మతంగమునులు సిభక్తులలో
చాలం జే రందిరి, ముని
వాలా! తచ్ఛిష్యురాలిఁ బాలింపవాకో!

అనుచు శబరి నిర్భరానందమున స్మరిం
చిన పురానుభవములను వచించి
భవము చించి చెండి పరమపదమునీయ
నర్థిఁ గోరె : రాముఁ డాత్మ నలరె.

# నివేదనము

## శ్రీ భట్టారం మల్లికార్జున కవి



శ్రీమత్పుస్తక నవ్యపంకజ విపంచీ వర్ణమాలావిభూ
షా! మంజీరకలార్భటీవిజిత కూజద్రాజహంసీవ్రజా!
హేమాంభోరుహపత్రసంగత సుధాహీరేందుశుభ్రద్యుతీ!
శ్యామా! పండితచాతకప్రకర వర్షానీరదా! శారదా!

ధీమన్మండలగీయమాన కరుణాదీప్తాంతరంగా! మన
స్సీమారామవిహారిణీ! లలితకించిన్మందహాసోష్ఠశో
భామందీకృత బాలచంద్రకలిత పత్యగ్రసంధ్యాద్యుతీ!
వామాక్షీ! నతసాధుభక్తనివహప్రజ్ఞాప్రదా! శారదా!

లలితేందూపలవేదికాస్ఫురిత లీలావిగ్రహా! వల్లకీ
కలనిక్వాణ నివేదితాగమవచఃక్రమాకృతీ! మంజుమం
డలగండస్థల బింబితశ్రవణతాటంకప్రభాలీనపే
శల నాసాభరణచ్ఛవీ! సుకవితాసంపద్ధృతీ! శారదా!

తొలిజన్మంబునఁ జేసినట్టి యఘమో, తోయేజగర్భుండు నా
తలపై వ్రాసిన వ్రాఁతకున్ ఫలమొ యత్నం బెంత నేఁ జేసినన్
ఫల మావంతయు లేక విద్య పరిపక్వస్ఫూర్తిగా నేర ద
వ్వలిజన్మంబున నైన నాకొఱఁతఁ దీర్పం జూడుమా, శారదా!

తపనీయాద్రిని దెచ్చి యిమ్మన, మహేంద్రత్వంబు వేఁడన్, గుబే
రపదప్రాప్తి ఘటియింపుమా యనను, సామ్రాజ్యంబు వాంఛింప, నా
యపరాధంబులు సైఁచి కించిదుదయద్ధాసప్రదీప్తాస్య పై
కృపతో దర్శన మిమ్ము ; వేఱొకటి కాంక్షింపన్ నినున్ శారదా!

దురితౌఘంబు నడంచి సద్గతికి నుద్యోగింపఁగాఁ జేయు అ
క్షరసంరూపిణి వంచు నీదు పదయుగ్మం బంటితిన్; నా యెదన్
పరకాంతాపరకీయవిత్తహరణవ్యాసక్తులన్ మాన్పి ఆ
పరతత్త్వస్ఫురణంబుఁ గూర్పు మనుచుం బ్రార్థించెదన్ శారదా!

ధన మార్జించుటయే తలం పయిన, విద్యాగంధ మేమాత్రమున్
బనిలే దమ్మ, నిరక్షరాస్యులు గడింపన్ జాలరో విత్త, మె
ట్లనినన్ జాలిన సాధనంబు లగుఁ జౌర్యద్యూతనైపుణ్యముల్ ;
జననంబున్ దరియింపఁ జేయుటకె నీ సాంగత్యముల్ శారదా !

మీసంబుల్ మెలివెట్టుచున్ గుటిలగంభీరప్రలాపంబులన్
గాసుల్ మూఁటలు గట్టినార మనుచున్ గర్వించు టాటోటులన్
దాసోఽహ మ్మని వేఁడఁబోరు గద విద్వాంసుల్ : భవత్పాదసే
వాసక్తుల్ గద; వారి కేకొఱఁతయున్ బాటిల్లునా? శారదా!

వేషాడంబరపోషకుల్ బహువిధస్వేచ్ఛాదురభ్యాసగుల్
యోషాపాంగతరంగసంచలితచిత్తోన్మాదు లై భ్రష్టులై
భాషామూర్తివి శేముషీప్రదవు నీవాల్లభ్యముం గోర ; రీ
దోషం బేటికిఁ గల్గె నమ్మ? సుమనస్తుత్యాకృతీ! శారదా!

అంధుం డైనఁ గురూపి యైన బధిరుం డైనన్ ద్వదీయాంఘ్రిసం
బంధాత్ముం డగు మానవుండు వితతప్రజ్ఞానిరాఘాటవా
క్సంధాదుర్జయుఁ డై నరేశ్వరసభాగారంబులన్ సాహితీ
గంధంబుల్ వెదఁజల్లి గౌరవములన్ గాంచెంగదా! శారదా!

సమసెన్ గాలతరంగఘట్టనమునన్ సామ్రాజ్యముల్ శిల్పముల్
శమియించెన్ ద్రిదశేంద్రవైభవములున్ జండార్కశౌర్యోద్ధతుల్
విమలజ్ఞానరుచిప్రదీప్త మగుచున్ వేధోఽండ మందున్ భవత్
కమనీయాకృతి కావ్య మొక్కటియె నిత్యంబై మనెన్, శారదా!

ఏనాఁడో గతియించిపోయినవి తల్లీ! స్నానసంధ్యాద్యను
ష్ఠానంబుల్ చతురాగమాధ్యయనముల్ శాస్త్రార్థసంధానముల్
నానావేషశిరోజఖండనవిధానవ్యాపృతిన్ విద్యసో
పానంబుల్ దిగజాఱె నాగరికతావ్యాజంబునన్ శారదా!

స్వమతాచారవిచారమూఢులు శిరోజశ్మశ్రువుల్ వింతచం
దముగాఁ దీరిచి, వేషభాషలను జిత్రంబుల్ ప్రదర్శించు మా
త్రమునన్ లోకము గౌరవించునొకొ విద్యాహీనునిన్? రాసభం
బు మృగేంద్రం బగునొక్కొ కేసరచయంబుం దాల్చినన్ శారదా!

రాజుల్ మెచ్చి బహూకరించు దినముల్ రాఁబోవు, విద్వాంసులన్
బూజింపం దలపెట్టునట్టి దినముల్ పోయెన్, జతుర్వేదవి
భ్రాజిష్ణుండుఁ గుటుంబభారమును దీర్పన్ లేఁడు, గీర్వాణభా
షాజీవంబులు క్రుంగె దుర్దశ లిటుల్ సంధిల్లఁగా, శారదా!

బాలాదిత్యుఁడు ప్రాగ్దిశామదవతీఫాలంబునన్ గుంకుమ
శ్రీలాలిత్యముఁ గూర్చువేళఁ గమలశ్రేణీనటద్భృంగగా
నాలాపంబున మేళవించి శ్రుతివాక్యాభ్యాసముం జేయుచో
ఆలోకించెడు భాగ్య మేనిఁ గరువే యైపోయెఁగా, శారదా!

ప్రాతర్మందసమీరపోతవిచలత్ప్రత్యగ్రసంపుల్లకం
జాతమోదసరోవరాంబుకలితస్నాతుల్ జటావల్కల
స్ఫీతుల్ తాపసబాలకుల్ ప్రణవవాగ్విన్యాసు లై హేళికిం
జేతుల్ మోడ్చెడు దృశ్య మెన్న డిఁక వీక్షింపంగ నౌ శారదా!

క్రతుయోగ్యంబులు దర్భలన్ గొఱికి తున్కల్ చేయు సారంగడిం
భతతిం బ్రేముడి గారనూనియలు జిహ్వన్ రుద్ది, నీవారసం
తతులన్ మేపి నిజాంకభాగముల నిద్రం బుచ్చుటల్ కావ్యసం
గతు లేనా? యిఁక నెన్నఁడైన మగుడన్ గాన్పించునా? శారదా

సారాచారవిచారదూరులు గజాశ్వస్యందనాదుల్ ధనా
గారంబుల్ రమణీయహర్మ్యములు నిక్కం బంచు భావించు చు
న్నారే! మృత్యుపిశాచినోటఁ బడి జీర్ణం బౌను గా యివ్వి; ఆ
తారార్కం బు భవత్కృపాజనితవిద్యాగంధమే, శారదా!

కలిమాహాత్మ్యమొ, పాపసంచయము పక్వం బైనచో సృష్టికిన్
విలయాంతం బగువేళ తారసిలెనో, విజ్ఞానమున్ మృత్యుజి
హ్వాలకం బెం గడు ఘోర మైన పరమాణ్వస్త్రంబు సాధింపఁగాఁ
దులువల్ పాదొనరింతు రీతలఁపులన్ దూలింపుమా, శారదా!

జనవాక్యశ్రవణంబుచేఁ దెలిసితిన్ సంగీతసాహిత్యముల్
స్తనయుగ్మం బని నీకుఁ దద్గతపయస్సాంగత్యసిద్ధిన్ ననున్
దనియింపం గదవమ్మ, నారసనకున్ ధన్యత్వముం గూర్పుమా,
జననీ! యే దలఁ దాల్తు నీపదసరోజాతంబులన్ శారదా!

# శారదావతారము

## శ్రీ "సుప్రసన్న"



ఆసంకల్పములైన లోకములు పర్యాధ్మాతముల్
వేణువీణాసమ్మోహనవాయులీననినదాం
తర్వ్యక్తి నాదాబ్ధిమై ఆశాంతమ్ములు
తీర్చగాబడని పూర్ణాకాశ మానాడు
సంధ్యాసౌవర్ణరుచిప్రలిప్తమయి
సౌందర్యార్చకై పొల్చెనో.

తన పుట్టు పద్మసౌందర్య రేఖలతోడి
తన మేని బంగారుతళుకు పొంగి
తన చుట్టు పాలసంద్రము ఫేనములతోడి
తన సృష్టిభావనార్థము మలంగి
తన తల్లి నేత్రాంతదరహాసములతోడి
తన నైగమాంతవృత్తిని వెలింగి
తన చతుర్ముఖవాక్ప్రధానరాజ్యముతోడి
తనయందు పుష్పేషుధనువు వంగి

అఖిలనాదాంబరస్ఫురత్ హైమరేఖ
క్షీరసాగరవీచికాస్నిగ్ధమూర్తి
అఖిలసౌందర్యలావణ్యహార్దభావ
ముల కధిష్ఠాత్రి శారద పొలిచినపుడు.

ప్రసరదుదారనాదపరిపాలితలోక
చతుర్దశమ్ము రాగసరఉదీర్ణపంకజముగా
వెలుగొందెడి వాణి చూచినన్
అసితసితచ్ఛవుల్ కనుల అందములై
విరబోసికొన్నచో, విసరిన సృష్టికర్మ డయి
వేద జడుం డత డేమి యయ్యెనో?

అమథితవార్ధివీచికొసయందున పొల్చిన చంద్రరేఖ యై
అమృతము పంచిపెట్టినది, ఆవృతమృత్యు
విభీతమర్త్యలోకమునకు
తీవె మీటి తనకచ్ఛపిపై సృజియించు
నాదలోకమున సమస్తరాగమధుకాంతలు
గౌగిలులందు తేల్చగన్.

ఇది శబ్దమ్మని యందు రీపదము శబ్దించెన్
మహాకాశమం, దిది యర్థమ్మని యందు
రీపదము వ్యాపించెన్ మహాలోకమం
దదియున్ నిచ్చెనపైన నిచ్చెనయుగా
నారోహణంబుం బొనర్ప, దయామోహిని,
సర్వాశుక్ల, ప్రణవబ్రహ్మాణి, పాదాగ్ర మై.

తగు నిటువంటి లోకముల తా నయి పొల్చిన
దుఃఖ మొక్కయెత్తుగ, సకలేంద్రియమ్ములును
ధూర్త తమఃపరిపాలితమ్ము లై
తగని దురూహలం బడిన తాకిడిలో
మధుమాసికోజ్జ్వలప్రగుదయమోహనంబు
లయి చల్లబడున్ భువనంబు లామెచే.

పొలిచిన సర్వభూతముల పూర్ణమనోనుభవమ్ము
లెల్లతీరుల విభజించి వాని
యవరోహణమార్గములంచులందు
వేల్పులు కనరాని సౌఖ్యముల పొందికగా
శఫరీదృశాంతరోచులరసవీథు లేలు
పదచుంబితనైగమమూర్తి పొల్చెడిన్.

# బౌద్ధ శ్రీ

శ్రీ [illegible]సి వెంకటే[illegible]

శ్రీవిమలోదయా! సక[illegible] [illegible]రూప [illegible]లయా! జగ
త్పావనభావనా! వివి[illegible] [illegible]
దేవనుతప్రభావ భల[illegible] [illegible]భవ! మహానుభావ!
దేవ! సమంతభద్ర! [illegible] నుది [illegible]హా త్త్వమున్.

ఆశాపాశము కోసివేసి, [illegible]భార్యాపుత్ర[illegible]నాస్పృత
క్లేశానీకము దవ్వుచేసి [illegible]హారెన్ రోసి, [illegible]లనా
వేశమ్ముల్ శమియింపఁ జేసి యతివై విశ్వ[illegible]శాంతి కై
ఆశాసించిన నీప్రబోధ [illegible]నో ధ్యానింతు బుద్ధప్రభూ!

సారసుఖాలవాలసువిశా[illegible]ధరపాలనమ్ము, శృం
గారకలాకలాపపరికల్పి[illegible] సతియ[illegible]న్,
మారునిపోరు జౌరు [illegible]లున్ ధరో
ద్ధారణకై త్యజించిన [illegible]సుధానము [illegible]

చండం బై వెలుఁగొందు [illegible] దగు నహింసాకీర్తి [illegible]జ్ఞానపుం
గొండ లెన్నెండు కఱంగె, పండినవి ఘోరా[illegible]కమ్ములున్
పండంబారిన బౌద్ధబోధన [illegible]సద్భాగ్యాసి శాంతిప్రభా
భాండారం బయి భారత[illegible] కడున్ వాసించె దేశాలలో!

పూత మందిన దఁటే! భువి యెల్ల నీబౌద్ధధర్మసుధాసారధారఁ గ్రోలి
మురిసిపోయిన దఁటే! భరతమాత త్వదీయజననశోభను గర్భమున ధరించి
స్తంభించినా డఁటే! అంభోజవైరి నీ త్యాగమహావికాస మరసి యొరసి
పొంగిపోయిన దఁటే! బోధివృక్షము నీ[illegible] జ్ఞానకాంతిర్జ్యోతి కాన వచ్చి

సారనాథాదిస్తూపాలు మారుమ్రోసె
నీదు సందేశగానసమ్మోద మంది
పులకరించె నీ మాహాత్మ్యముం దలంప
అఖిలభూతదయాసింధు ! అర్కబంధు !

శుద్ధాత్మప్రతిభావిభాసమున ఈక్షోణిన్ వెలిగించియున్
సద్ధర్మప్రతిపాదనావిధిని హింసన్ ధ్వంస మొందించుచో
సిద్ధించెన్ భవదీయసంభవ మహాశ్రేయస్సు శౌద్ధోదనీ !
బౌద్ధశ్రీ ఫలియించి మించిన దహో ; స్వర్ణచ్ఛవీభాసియై.

నరమృగపక్షిరూపము లనంతముగా ధరియించి, మానవో
ద్ధరణ మహత్తరార్థ మని తద్దయు సద్దయ జాలువారఁగాఁ
బరమపవిత్రధర్మసుధ పామరపాళికిఁ బంచి యిచ్చి, దు
స్తరభవవార్ధికిన్ దరణసాధన మైతివి గౌతమప్రభో !

ఒక్కొకజన్మలోన నెదియో భువనావనకార్యదీక్షయే
నెక్కొనఁజేసినావు మహనీయదయాహృదయాన, వానిలోఁ
జక్కని బోధచే మనుజజాతికి నీతినిఁ గూర్చి కీర్తిన
ల్దిక్కుల నింపినట్టిది కదే ! భవదీయకురంగరూపమే !

నాగార్జునాచార్యవాగమృతమ్ములోఁ జవులూరఁ జేసిన జ్ఞానబోధ
ధారుణీశు నశోకు ధర్మచక్రమ్మున దర్శనం బొసఁగిన ధర్మబోధ
జాతికిపిత గాంధితాత సత్యాగ్రహసమరాన నమరిన శాంతిబోధ
పండితజహ్వారు 'పంచశీల' విశాలభావాలలోఁ గ్రాలు భవ్యబోధ

జగతి బహుదుఃఖతిమిరమ్ము సమయఁజేయ
నీవు దయచేసినట్టి దయావిలాస
కాంతికిరణాలపుంజమే కద మహాత్మ !
భూతకరుణాప్రబుద్ధ ! శ్రీబుద్ధదేవ !!

అముద్రిత 'హరిణరాజు' నుండి]

# స్మృతిచిహ్న మొక సంతానము

## శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రి



హిందువుల కెప్పుడును ఐహికాముష్మికచింతలలో ఆముష్మికచింత (పరలోకచింత) అధికము, బలీయము. ఎంతకాలము ఈలోకమున నున్నను ఒకనాటికి పరలోకమునకు పోవుట తప్పదుగదా యని పరలోకసౌఖ్యమునకై ఈ లోకమునుండియే అనేకులు కృషిచేయుచుందురు. జగద్విఖ్యాతి గాంచి బుద్ధుడైన సిద్ధార్థునికి బాల్యమందే విరక్తి కలిగినది. ఎందరో గొప్పవారు పెండ్లి, సంసారము, ఇవి శాశ్వతములు కావని చిన్నతనమందే గ్రహించి భగవద్ధ్యానమందే కాలము గడిపి జనులకు భక్తిభావము నుబోధించియున్నారు. కొందఱికి ధర్మకార్యములు చేసి లోకోపకారము చేయుటయందాసక్తి యెక్కువ. ఈభావమును శ్రీనాథమహాకవి శృంగారనైషధమున దమయంతిచేత సొంపుగా చెప్పించినాడు. ఇంద్రుడు పంపిన దూతిక దమయంతితో దేవేంద్రుడు వందయజ్ఞములు చేసి ఏలోకసౌఖ్యము నొందినాడో ఆసౌఖ్యము నే నీకిచ్చుటకు పంపినాడు అను నర్థమున ఇట్లు పలుకును —

> "ఏలోకంబునకై మహాక్రతుశతం
> బేకాగ్రతం జేసినాఁ
> డాలోకంబు నలంకరించుటకు ని
> న్నర్థించె జంభారి"

అందులకు దమయంతి ఇట్లు బదులు పలుకును —

> శర్మమె కాని, యన్విబుధ
> సద్మమునందుఁ దలంచిచూడఁగా
> ధర్మము సేయరాదు; ఇచట
> ధర్మము సేయఁగ, నిర్విశంకతన్
> శర్మము నొందనుం, గలదు;
> శర్మము ధర్మముఁ గాంచు టొప్పునో
> శర్మముఁ గాంచు టొప్పునో, వి
> చారముసేయుము నెమ్మనంబునన్.

దీనికి మాతాతగారు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి తాత్పర్యము — "ఇందులభావ మేమన — ఏపుణ్యముచేత స్వర్గశర్మము కలుగునో అది తుచ్ఛకర్మానుభవముచే వ్యయితమై పోఁగాఁ అనంతరము అశర్మమే గదా ప్రాప్తించును; ఇటనే యుండి పూర్వకృతధర్మఫలమైన శర్మము నిపుడనుభవించుచు భావిశర్మమునకై ధర్మమునుకూడ ఆచరించుచుండిన ఎప్పటికిని శర్మపరంపర కలుగుచునే యుండును. కావున నలుని వరించి యిటనే యుండి శర్మధర్మములు రెండును సాధించుచుండెను." శర్మ మనఁగా సౌఖ్యము. పరలోకమందు సౌఖ్యమును కోరువాఁడు గాన బ్రాహ్మణుఁడు శర్మనామ్యుఁడైనాఁడు. ఎంతటి ధర్మకార్యమైనను చేసి శాశ్వతబ్రహ్మలోకనివాసమును పొందుటకు హిందువులు కోరుచుందురు.

ఇట్టి ధర్మకార్యములను మనవారు సప్తసంతానములని పేర్కొనిరి. ఇందులో ఎంతో భావము ఇమిడియున్నది. సంతానమనఁగా బిడ్డలు. పరంపర ఎట్టివారికిని తమ వంశము అవిచ్ఛిన్నముగా పెరుగుచుండవలయు నని కోరికయుండును. కొమారుఁడు, మనుమఁడు, మునిమనుమఁడు ఈరీతిగా. అట్లు సంతానములేనివారు తమగోత్రమువానినో, దాయాదికుఱ్ఱవానినో దత్తుచేసికొందురుగదా! ఈసంతానము తమకు శ్రాద్ధాదులు చేయుటచేత పరలోకసౌఖ్య మొనగూర్చునని మనవారి విశ్వాసము. ఇట్లు సంతానము కలుగనివారును, సంతాన మున్నను ఆచంద్రార్కము తమపేరు భూమిలో నుండవలయు నను నుద్దేశముతో

నుండువారును శాశ్వతధర్మకార్యములను చేయుచుండు. ఆలయ తటాకాది ప్రతిష్ఠలు ఇట్టి ప్రతిష్ఠలను గూర్చి మనవారిట్లు చెప్పియున్నారు.

"నందనుఁడు, వనమ్ము నల్లిల్లు, నిధి, సుర
గృహము, చెఱువు, మేలికృతి యనంగ
జగతి వెలయు సప్తసంతానములు; వీన
బుణ్యమును యశంబుఁ బొందవచ్చు."

మంచనకవి - కేయూరబాహుచరిత్రము

(1) కుమారుఁడు (2) వనము (అనఁగా తోట) (3) అగ్రహారము (4) నిధి (అనఁగా గొప్పజలాశయము) (5) దేవాలయము (6) చెఱువు (7) సత్ప్రబంధము అను నివి సప్తసంతానములు. శబ్దరత్నాకరనిఘంటువులో శ్రీ సీతారామాచార్యులవారు సప్తసంతానములు ఉదాహరణముగా నీక్రింది పద్యమును హైరావణచరిత్ర మను కావ్యమునుండి ఉదాహరించినాడు (చూ నల్లిల్లు)

'సుతుఁడును గుడి. నిధి, చెఱువును
గృతియును, నల్లిండ్లు, వనము క్షితిలోపల సం
తతుఁ లిందులోన నెన్నఁగఁ
గృతివలనం గలుగు నంద్రు కీర్తియు గతియున్.'

ఆంధ్రవాఙ్మయమున సప్తసంతానములను గుఱించి మొదట పేర్కొన్నకవి తిక్కన్నకు దాదాపు ముప్పదియేండ్లతర్వాతివాఁడు, పైన పేర్కొనఁబడిన, మంచనయే. తిక్కనయు, ఆయనవలెను ప్రాచీను లెవరును పేర్కొనలేదు. ఆంధ్రదేశమందు అందును గుంటూరిమండలము వారికి విశేషముగా సంతోషింపఁదగిన విశేష మేమనఁగా ఈసప్తసంతానాది ప్రతిష్ఠలు అతిప్రాచీనకాలపువి గుంటూరిసీమలోనే కనఁబడుచున్నది. ఆంధ్ర దేశపు ప్రాచీనవాస్తుశకలములు గుంటూరిలోనే గదా యున్నది. నాగార్జునాచార్యాది మహనీయులు ఈమండలమందే వెలసియుండిరి. ధాన్యకటకాదినగరములు ఇక్కడివేగదా!

వాఙ్మయముకంటె శాసనములలోను సప్తసంతాన ప్రశంస చాలముందుగా కనఁబడుచున్నది. క్రీ. శ. 1132 లో గుంటూరుమండలములోని నిడుబ్రోలునందలి యొక శాసనమున ఈపేరుపెట్టఁబడకపోయినను ఈప్రతిష్ఠలు కొన్ని పేర్కొనఁబడియున్నవి. (సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్ వాల్యూము 6 - సంఖ్య 123)

పెంచెం జట్టుల నెల్ల, పేర్మి వెలయ
న్నెట్టించె సత్రంబు, గ
ట్టించెం న్భక్తి శివాలయంబు, లిల బ్రా
ధిం దాల్మి యొప్పంగ ప్రొ
ష్ఠించెం బూర్ణతటాకముల్. జలధిగం
భీరంబ్లు గావించె న్నిధుల్
మించెం న్నాగయపండఁ డర్థి భవనా
నీకంబులం గీర్తుఁడై.

పూర్వకాలమున ఆంధ్రదేశమున రాజులును ధనికులైన వైశ్యులు మాత్రమే గాక అమాత్యులుగా నుండిన నియోగి బ్రాహ్మణులు లెక్కకుమించిన దానధర్మాదికములను చేసియున్నారు. వెల్లంకి గంగాధరమంత్రి దత్తపుత్రునికూడ సంతానములలో చేర్చినాఁడు.

తన పెంచిన సంతానము
తన సంతానమ్ము గృతియుఁ దన నల్లిల్లున్
వనమును జెఱువును గుడియును
జనవినుతము లైన సప్తసంతానంబుల్.

క్రీ శ. 1300 ప్రాంతమునిగా పరిగణింపఁబడుచుండు కేయూర బాహుచరిత్రమున కవి కృతిపతియైన గుండనామాత్యుని దానధర్మాదికములను గుఱించి యిట్లు వ్రాయుచున్నాఁడు.

'పుణ్యానదీతీరభూమిఁ దా నిలిపిన
నల్లిండ్ల విప్రగణంబుచేత,
సరసకవిత్వప్రసంగతఁ దనుఁ బ్రీతిఁ
గొనియాడు సత్కవిజనుల చేత,
గర్పూరకస్తూరికాముఖ్యద్రవ్యాను
భవవేళ సభలోని ప్రభులచేత,
గాంతుఁడైనఁ దను బొందఁగాంతుమోయని యుప
శ్రుతులు వోయెడు వధూవితతిచేత,

దానశక్తి బహుకథానిపుణత్వంబు
సులభభోగమహిమ సొబగు పేర్మి
నెగడుచుండ వెలసె జగతీతలంబున
మంత్రిం గుండఁ డమలగతి గుణుండు'......

'వసుగుఁ బెండిలి సేయ వయస్సైన విప్రులఁ
దడవి సేయించు నీపుడమి యెల్ల,
దోడఁ బూయఁ గట్టంగ నిడ గల్గునట్లుగ
సహకుటుంబులఁ గవిజనులఁ బ్రోచుఁ
బాదక గాయకప్రముఖుల మన్నించి
యాందోళికాదివాహనము లొసంగుఁ,
బాటించి కాశికేశ్వరు తిరునాళ్ళలో
నర్థుల కేఁ కోట నర్థ మిచ్చు,
ధర్మజుఁడు భానుజుఁడు తొంటి తప్పువాయ
దేహ మేకమై పుట్టిన తెఱఁగుదోఁప
దాపమును దానధర్మముల్ దన్నుఁ బొందె,
మంత్రిభీమన గుండనామాత్యమణికి.'

అని ఇంతటిదాతగా కవి వర్ణించి ఇదంతయు వర్ణన కాదు, నిజమే యని నొక్కిచెప్పినాఁడు. 'సహజంబు లివియు, వర్ణనలుగావు, గుండనామాత్యునకు మంత్రికుంజ రునకు.'

ఈవిధముగా దానధర్మాదికములు చేయుచు కొన్నాళ్లకు ఒకగొప్పవిషయమును మనవారు కనుగొనిరి. అదేదనఁగా ఈ సప్తసంతానము లనఁబడు దేవాలయాది ప్రతిష్ఠలు లోకోపకారకములే యైనను ఈ సంతానములలో శాశ్వతతమమును సర్వోత్కృష్టమును నైన సంతానము కావ్యము అని గుండనామాత్యుఁడే మంచనతో నిట్లనెను.

'వననిధి తటాక దేవభ
వనములు పుణ్యాదిము లైనవాని ననుష్ఠిం
చినచోనకాని యెఱుఁగరు
చనఁగాదే సరసకవిత సకలదిశలకున్.

కావున నాకు నొక్కకృతి కైకొన నిష్టము,, అని.
శ్రీనాథునికి శిష్యప్రాయుఁడైన పిల్లలమర్రి పినవీరభద్రుఁడు జైమినిభారతములో :

ఆదట సప్తసంతతతుల
యందును నొక్కొకకాలమందు వి
చ్ఛేదము గల్గు నాఱిటికిఁ
జెప్పె విపర్యయ మే యుగంబునన్
లేదు కవిత్వసంతతికి,
నిక్కము, తత్కవితావిలాసమున్
జాదులు నిష్టదైవము ప్ర
సాదము నా హరికీర్తనంబునన్'

అని కావ్యముయొక్క శాశ్వతత్వమును ప్రశంసించినాఁడు :

శాశ్వతస్వర్గనివాసము కావ్యమువలన కలుగునని విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణిలో నిట్లు తెలిపినాఁడు:

"వినుతయశంబునం గలుగు
విశ్రుతనాకనివాస; మయ్యరో
జననము శ్రవ్యకావ్యముల
సంగతి నొప్పగు; శ్రవ్యకావ్యముం
దనరుఁ గవిప్రభావమునఁ
దత్కవిసమ్మతి లేని రాజు లే
పున విహరింప; రవ్విభులు
పోయినజాడ లెఱుంగఁబోలునే."

"కవిసంసిద్ధపదంబు భావరస
విఖ్యాతంబు లోకోచిత
వ్యవహారంబు నుదాత్తనాయకము శ్ర
వ్యంబుం జతుర్వర్గసం
భవసద్మంబును నైన కావ్య మిల నా
పద్మోద్భవస్థాయియై

కవిసంస్ఫూర్తియుఁ దాత్మకీర్తియుఁ దగం
గల్పించు నెల్లప్పుడున్.”

కాకమాని అప్పకవి తనయాంధ్రలక్షణగ్రంథ మగు నప్పకవీయమున ఈయభిప్రాయమును చక్కఁగా చెప్పినాఁడు.

“ధర్మములలోన నుత్తమ
ధర్మము కావ్యము నిజంబు ధర నెవ్వని కా
ధర్మము సేకురు నతండు సు
ధర్మను వసియించుఁ బెక్కుదైవతయుగముల్.

“తనయుఁడు చెఱువును గావ్యం
బు నిధానము గుడి వనంబు భూదేవస్థా
పనమును నను నివ్యేడును
జనుశాస్త్రములందు సప్తసంతతు లనఁగన్.

“దుష్కృతము లెన్ని సేసినఁ దుదిని సప్త
సంతతులలోన నొక్కటి సలుపునతఁడు
కుతుకమునఁ దన నూటొక్క కులమువారి
నరకములఁ బాపి ముక్తికి నడపు నిజము.

“ఇల సప్తసంతతులలో
పలఁ గావ్యము దక్క దేవభవనవనాదుల్
ఖిలము లగుఁ గొన్ని వర్షం
బుల కని చంపువు రచించె భోజుం డెఱుకన్.

“నిలిపి రెక్కడ నచట నె నిలచియుండు
నగ్రహారాదిసంతతు లరసిచూడ
నవియు గృతిముఖరచనచే నఖిలదిశల
నెగడుఁగావునఁ గావ్య మన్నిటికిఁ దొడవు.

“పురి వఱదనీరు గోదా
వరి గలిసిన యోగ్యమైన వడుపునఁగడు దు
ర్భరితుండైన నను గావ్యాం
తరమునఁ జెపఁబడి పావనచరితుఁడగున్.

“క్షితి నెవ్వనినామము స
త్కృతి నెన్నిదినంబు లుండు దివి నాపుణ్యా
వ్రతుఁ డంతకాల ముండును
ధృతి నింద్రద్యుమ్నునికి దృష్టాంతము గాన్.”

భూలోకమున నెంతకాలము మనపే రుండునో అంత కాలము మనకు స్వర్గసౌఖ్య ముండునట. ఈవిధముగా గ్రంథములను అంకితము పొందుట చేత శాశ్వతపుణ్యలోక ప్రాప్తి కలుగునని మనయాంధ్రులు విశ్వసించి కవులను ప్రోత్సహించి, ప్రార్థించి వారిచేత కావ్యములను అంకిత మందుచుండిరి. కొందఱు ప్రభువులు కవులచే తిరస్కరింపఁ బడినను ఆప్రభువులు ఎట్లైనను అంకితము పొందవలెనని చాల ప్రయాసపడియు తుదకు కవులకే లొంగిపోయిరి. అట్టివారిలో పోతనామాత్యుఁడు జగత్ప్రసిద్ధుఁడు. ఆంధ్ర మహాభాగవతమును అంకితమందుభాగ్యము సింగభూపాలు నికి లేకపోయినది. దేవుని కర్పించి పోతన భక్తాగ్రేసరుఁ డైనాఁడు. ఆంధ్రులభాగ్య మేమనఁగా ఈ విధము గా గ్రంథములను అంకితమందు సాంప్రదాయము ఆంధ్రదేశమం దభివృద్ధి యైనట్లు మఱియెచటను కాలేదు. మనపద్దయే వేలు. అందులోను కృతిని కన్య యనియు ఆకన్య సప్త సంతానములలో నొకటి యనియు దానిని మంచివరునికి, గొప్ప కృతిపతికి, సమర్పించుట పుణ్యమనియు లోకమునకు చాటినవారు మనతెలుఁగుమంత్రులు. వారే మన ప్రాచీన కవులు. పూర్వకాలమున మనమహామాత్యులే కవిత్వమునకు పూనుకొని కావ్యములు వ్రాయుచుండిరి. ఇట్టి ఈసప్త సంతానభావములకు గుంటూరుసీమ పుట్టినిల్లగుట గుంటూరి భాగ్యము. ప్రాచీనాంధ్రశాసనములో గుంటూరి శాస నములలోనే ఈ విషయము కనఁబడుచున్నది.
కావ్యముల కెక్కినది.

# పాషాణి

శ్రీ అనిపిరాల విశ్వం

ఓ జీర్ణాలయశిథిలశిలాశైలూషిక!
ఓ అసీమచైతన్యకళామంజూషిక !!
ఈదారిలేని యెడారిసత్రాలకు చివఱ
ఎవరు కట్టారు నీ కీమందిరం ?
ఇది మందిరం కాదు– ప్రవాసిజనహృదయస్పందనం.
నీ వన్నా చెప్పు : నా వెళ్ళే ఆఖరిమజిలీ
ఇం కెంత దూరమో ?
వీడ్కోలుపు తప్ప స్వాగత మెఱుగని మౌనవియోగిని !
నీ గుండెబరు వెంతో నీపయోధరాలే చెబుతున్నయ్
ఏడువకు బిక్కుమంటూ.

ఓ చిరదగ్ధదుఃఖినీ పాషాణీ !
ఓ అభిశప్తశిలామయకళ్యాణీ !!
నీపాదమంజీరాలు పూర్వం
ఎన్నిహృదయాల భావస్వర్గాలో చెప్పు?
ఏ శిల్పిచిన్మయస్వప్నాలకు
స్థాణురూపసుందరివో నీవు?
ఏకళాత్మకల్పనలకు
అమృతదేవివో నీవు ?

నిద్రపోయేశిలలో నిద్రపోయే విన్ను
బుజ్జగించి లేపటానికి
నీ చెవిలో శిల్పి చెప్పిన రహస్య మేమిటో ?
కోర్కె నెఱుగక తల్లి శిలలో కూర్కుతీసే నిన్ను లేపి
నీలో నిదురించే రూపులేని మమతను
తన యులిముక్కున రగిల్చి
ఎక్కడకు పోయా డాశిల్పి ?

ఓ పారహీనమరుభూమిమధ్యగతదూరప్రవాసినీ !
ఓ సారహీనచిరకామబుభుక్షాతీరవాసినీ !!
స్థాణు వైన నీలో
జీవలక్షణ మైన
యింతటికామాన్ని ఎలా దాచుకున్నావో చెప్పు
ఎంతకీ పలకవేం ?
అవును, నీవెందుకు పలుకుతావులే ?
నీ వౌకపరావాక్కువు.

నాలో నీవే ఎందుకు మేల్కొలిపేవు ?
అరూపసంకల్పాన్ని
అసుప్తచైతన్యస్పందనాన్ని.
ఆస్పందనానికి
అమృతస్యందనంలాంటి
నాప్రాణపుగూటిలో
నీవే ఎందుకు కూర్చునేవు ?
నిస్తైలపూర్ణజ్వాలాకీలికలా
నీ కనుచివఱల మిగుల్చుకొన్న
బాధల యెడారికి మధ్య
కట్టుకున్న జ్ఞాపకాలమందిరంలో
దాచుకున్న ప్రతిమామూర్తులను
ఎంతకాలం నిష్పూజనంగా ఉంచేవు?

ఎందుకు నిలిపేవు నీ నయనశూన్యంలో
వెలుగులేక ఓక్కుమనే
దిగులునిశకు దీపంగా
యీ అసంఖ్యాశ్రుకణమణిమాలికలను
నీ ఊహలరహశ్శుద్ధాంతాన్ని
మరపు చీకటి ముంచేకముందే
తెరచివెయ్ కవాటాలను
వెతుక్కోనీ, యీ వ్యథాపరిఖిన్నజీవిని
నోచుకోనిఅదృష్టాలను.

ఓ నితాంతఆశాపూర్ణమధురహాసినీ!
ఓ నిశాంతదిశావర్ణవిధురకేశినీ!
నాలో
పయనించే కోర్కె సడలిపోయి,
నీ గుండెదారుల యెడారుల్లో
కలిసిపోదామ మని ఉంది

అయినా——
నా వెక్కేవే క్కింది
ఎందరికో పీవొక్కలపు ఇచ్చిన నీవు
కనీసం చివరి మజిలీని గూర్చి హోమేష్పు డైనా
పలకవేం నిష్కరుణీ! పాషాణీ!!

ఈదిగంతపరివ్యాప్త అరూపసుప్తసౌందర్యసముద్రాన్ని
మథించి
నీదృగంతపరిన్యస్త సురూపదీప్తసౌందర్యామృతంగా
పిదికి

ధన్యుడై పోయా డాశిల్పి;
నీ ప్రథమ దర్శనపీయూషాన్ని త్రాగి
మిగిల్చిపోయాడు,
అనంతకాలానికి అర్పణంగా హాలాహలాన్ని
అందుకే నిన్ను చూస్తే
నాలో అగ్గి రగుల్తుంది.

# రెండే క్షణాలు

గడిచిపోయిన పాతరోజు లెన్నో
పారేయలేని పనికిరాని పాతసామానులా మిగిలి
రెండే చిన్నగదుల అద్దెకొంపలాంటి
రెండేక్షణాలు మిగిలిన ఈజీవితంలో
క్రిక్కిరిసి పట్టలేక బిక్కగా చూస్తున్నయ్,

గతం వికసించి వర్తమానపువాసనలు చిమ్మి
భవిష్యత్తుగా ముకుళించే కాలమహాపద్మంలో
చిక్కుకున్న జ్ఞాపకపుతుమ్మెదనీలిరెక్కలవలె
ఎగురలేకపడిఉన్నయ్ రెండే, క్షణాలు.

క్షణా న్నొక యుగమంతగా బ్రతికి
జగా న్నొక శాశ్వతకల్పమంతదూరం చూచి
లెక్కలేనన్ని కాలాలు నేనే ఉన్నా ననుకోనేట్లు చేసి
పట్టలేని నిర్వృతిలో మనస్సును
మహాతృప్తిగా ఆవరించినయ్ రెండే క్షణాలు.

ఈబందీజీవితానికి మిగిలిన
సీమ తెలుగని చిరంతనస్వప్నాలను
వెలుఁగునీడలపల్లకీలో ఊరేగించి
వెళ్ళలేక వెళ్ళే బోయిల్లాగ
వెనుక నిలవక, ముందు కదలక
స్థితిలోనే చలనాన్ని దాచుకొని
చూపును రూపునూ ఒక్కటిగా చేయటానికి
చూస్తున్నయ్ రెండోక్షణాలు.

# కవితా సాంత్వనము

శ్రీ అన్నపరెడ్డి విజయభాస్కర రెడ్డి

రోజు ప్రవహించు స్రోతస్సు, రొదలలోన,
రోజు నుదయించు దినకరు, రూపులోన,
గగనగంగాతరంగాలకాంతిలోన,
నిత్యనూతనభావమ్మె నిలుపుకొంచు,
మమత హాసియింప కైతను మలచుకొమ్ము.

అకురాల్చిన గుండెకు హరిత మొసగి
చివురులు వాసింప, కుసుమాలు చవ్వకళింప
జేయు మేఘమాల! అటులె స్నిగ్ధశిల్ప
భావములు, కైతహృదిలోన పలుక నిమ్ము.

పేదవారలగుండెలో పేరుకొన్న
కటికదారిద్ర్యతిమిరమ్ము కదిపివేయు
వెలుగురేఖల కవితలో విరయ నిమ్ము
సరససాహితి నీ రీతి సాగ నిమ్ము.

కడుపుకాలెడి వ్యక్తికి- కరుణ నొసగి,
పరువు చూపెట్టి వానికి బ్రతుక నేర్ప
ఆత్మ యన్నది వికసించ— అట్టి భావ
నలు ప్రతికవితహృదిలోన నవ్వ నిమ్ము.

కొండసుడిగాలి ధాటికి కొట్టు లైన
మ్రాను కొమ్మల, కొసలందు, మ్రాకులందు,
లేతచిగురాకు లేలేతపూతతోడ
విరయ కాయనిమ్ము -మమత పెరుగనిమ్ము.

రాత్రి కన్పట్టు తారకారమ్యకాంతి
కోయిలమ్మలపాటల కులుకు శాంతి
దేశభ లిగించు దివ్వె-
నీదుకవిహృదయమందు నిలుపుకొమ్ము
విశ్వసాహితి నీరీతి విరయనిమ్ము.

ప్రతి తెలుంగువాడు పాడవలె కవిత
దేశభక్తి నింపి దీక్షతోడ
ప్రతికలమ్ములోన పలుకవలె 'ప్రగతి'
నిండుమనసుతోడ నేర్పుగాను.

ఆమెసాంత్వనమ్ము అందగించిన జాలు
మల్లెవోలె మనసు పల్లవించు—
ఆమె కనులనుమత అందగల్గిన జాలు
మానవుండు మారు 'మానవతగ'.

మల్లెవోలె మనసు పల్లవించిననాడు
విశ్వమందు శాంతి విరియగలదు;
మానవతగ నరుడు మారిపోయినవాడు
అందగించు ఎడద నందనముగ.

# పుణ్యక్షేత్రయాత్ర*

శ్రీ అక్కిరాజు చంద్రమౌళి శర్మ



ఆవల శ్రీరంగముఁ జని । కావేరీమజ్జనమ్ము గావించి మహా
దేవాదిదేవు రంగని । పావనచరణముల కెఱఁగి ప్రస్తుతి చేసెన్,

కావేరితెలినీట గాంచి మజ్జనమును తిలకంబు మోమునఁ దీర్చి దిద్ది
అపరంజి పళ్ళెమం దారగిం పొనరించి పుక్కిటఁ జేర్చి కప్పురపు విడెము,
ముసిముసినగవుతో ముపురాంద్రు సేవింప సరససల్లాపముల్ సలుపుకొనుచు
కడఁగి యేకాంతముగాఁ బండి యున్నావె । శేషాహి సవరించి సెజ్జగాఁగ
వరకృపాపాంగ । దర్పితవైరిభంగ । వైనతేయతురంగ । సద్వారిదాంగ ;
సంచితవిభంగ । సంతతసాధుసంగ । విమలహృదయాంతరంగ । కావేటిరంగ ।

చేరి యిల్లిట మున్ఁటి క్షీరవారాశిలో నత్తమామలకు నీ కతుకలేద ।
వైకుంఠమున భక్తవరుల సందడి హెచ్చఁ గాంక్షించినావ, యేకాంతసేవ
శేషశైలమున విశేషార్థ మార్జించి బడలి నిద్రింపఁగాఁ దొడఁగినావ
పురుషోత్తమక్షేత్రమున దూఱు పడలేక తలఁగి యిచ్చట డాఁగఁ దలఁచినావ
ఏడుప్రాకారముల కోట నేర్పఱించి క్షీరవారాశికన్యను జేరఁదీసి
పాపపాన్పున నేకాంతపరత నున్న విడరె భక్తులు నిన్నుఁ గావేటిరంగ ।

పుక్కిట విసముంచి బుసలువెట్టుచు నున్న భోగీంద్రుఁడా నీకుఁ బూలపాన్పు
చెట్టుచెట్టునఁ గూడుఁగట్టి త్రిమ్మరుచుండు పూరిపిట్టా నీకు వారువంబు
పర్వమందునఁ బొంగి సర్వస్వము హరించు పాలవారాశియా పడకటిల్లు
గోఁచిపాతను బెట్టి బూచులవలె నున్న జడదారులా యేలుబడికిఁ బ్రజలు

---

* మత్కృత స్వయంప్రకాశ ప్రబోధ కావ్యమునుండి సముద్ధృతము.
యాత్రాసమయమున శ్రీ స్వయంప్రకాశానందావధూతస్వామివారు చేసిన దేవతాస్తవము

పచ్చిబంగారువంటి మాలచ్చి నిచ్చె పిచ్చిసాగరుఁ డెటు మోసపుచ్చినావొ!
ఆపదలతోడికాపురి మనక పంకి పొంగుచున్నావటోయి! శ్రీరంగశాయి!

రంగవిభుఁ గొల్చి విడిచి శ్రీరంగపురము దూరమునఁ బుణ్యభూములు నిర్గమించి
రామనాథపురమ్మున రాత్రి నిలిచి యరిగె రామేశ్వరమ్మున కర్కునిఁ గని.

సేతుస్నానము చేయఁగఁ బ్రీతిం జని సాగరమును వీక్షించి మహో
ద్ధాతతరంగపరంపరఁ జేతోముద మొదవ వినుతిఁ జేసె మహాబ్ధిన్.

ఘనుల కప్పు లొసంగి కడువృద్ధిగాఁ గొని దండిగా రత్నాకరుండ వైతి
లోకోపకారివై సాకుచున్నావు ప్రాణిసంతతుల లోపలను వెలిని
ధర్మభీతిని హద్దు దాటలేకున్నావు శక్తిగల్గియు తాల్చి సాత్వికమ్ము
గాంభీర్యమున వెల్తిఁగాంచక మన్నావు కలిమిలేముల నొక్కగతి భరించి
అడుగబో వెవ్వరిని నిత్తు వడుగువారి కమితముగ రత్నములను శంఖాదికములు
కోర వతివల వారె నిన్ గోరివత్తు రఘముల హరింతు నీసాటి మఘవుఁ డగునె!

నీమూలమునఁ గదా నీరజాతేక్షణుం డర్ధాంగి కల్గి గృహస్థుఁడగుట
నీమూలమునఁ గదా నిర్జరామర మైన యమృతము వేల్పుల కబ్బఁ గనుట
నీమూలమునఁ గదా నిత్యజీవన తుష్టి మానవుల్ దనధాన్యమహిమఁ గనుట
నీమూలమునఁ గదా నిర్జరారాతులు తలదాఁచికొని చావుతప్పి మనుట
ఆదిబ్రహ్మాండమెల్ల నీయంద కలిగె ధన్యుఁడవు నీవ పంచభూతములలోన
పావనుఁడ వీవ లోకైకభర్త వీవ కరుణజూడుము గురుతేజ! కంధిరాజ!

కడకంట నెట్టుడా ల్గా రాఘవుడు చూడ విడిచి గాంభీర్యము వడకినావు
దేవాసురులు పెక్కుదినములు మర్దింప సర్వస్వ మర్పింప జాలినావు
ఘనుఁ డగస్త్యుఁడు ద్రావఁగాఁ జేయిసాచిన చిన్నపుడిసిలిలోనఁ జిక్కినావు
కోతికుఱ్ఱఁడు గంతుగొనఁ బైకిలఘింప నొక్కయంజెకు రాక నక్కినావు
వరుణునకు నాలయమ వైన శరధి వైన సరసుడవే యైన భాగ్యవిస్తరుఁడ వైన
లోకసంత్రాత వైన నలోభి వైన కష్టములు తప్పెనే నీకుఁ గలధిరాజ!

ముల్లోకములు పూతముగఁ జేయఁగాఁ జాలు పుణ్యవాహినులు నీ పూవుబోండ్లు
వరకళానిధిలోకవందనీయుఁడు రాజు కువలయాప్తుండు నీ కొడుకుకుట్టు
కడకంటిచూడ్కులఁ గలిములు గురియించు శ్రీమహాలక్ష్మి నీ చిఱుతపట్టి
సకలలోకాధారసంస్తూయమాన మౌ జీవనంచే నీకు జీవనంబు
ఆశ్రయింతురు ఘనులు ని న్ననవరతము ధర్మసేతువు దాటని దాత వీవు
పావనంబు జీవనము లోకభాజనంబు నీవు నుతిసేయ దగుదు మనీషులకును.

వరుణున కాలయ మైతివి హరునకు తూణీర మైతి వబ్జాక్షునకున్
వరశయనాగరమ వై గురుకీర్తిని గంటి మంటి గుణనిధి వగుచున్

అనుచుఁ గొనియాడి సంకల్ప మాదిగాఁగ  ఆగమోక్తముగా స్నానమాచరించి
మ్రొక్కి సేతువునకు రామమూర్తి కెఱఁగి రామలింగేశ్వరునిఁ గాంచి ప్రస్తుతించె.

కాపాడినావు మార్కండేయమునిని చావకయుండ సప్తకల్పములదాఁక
రక్షించినావు ద్వారముఁ గాచి బాణుని గర్వించి నీమీఁదఁ గవయుఁదాఁక
పాలించినావు సుపర్వుల నెనరులో దక్షాధ్వరమున నిన్ దలఁగుదాఁక
సాధించినావు రాక్షసదేశికుని బట్టి వినుతించి గిరికన్య విడుచుదాఁక
కరధృతకురంగ ! రతిరాజగర్వభంగ ! పాపపంకపతంగ ! గోపతితురంగ !
పూజ్యగంగోత్తమాంగ ! యంబుధినిషంగ ! రజత ధవళాంగ ! శ్రీసేతురామలింగ !

ఆవాస మగురజతాద్రిని బెకలించు దశకంఠు వరములఁ దనిపినావు
ఇల్లాలిసౌభాగ్య మీర్ష్యతోఁ గాంచు యక్షేశ్వరునకు నిధు లిచ్చినావు
విల్లెత్తి మోదిన విజయుని మన్నించి పాశుపత మిచ్చి పంపినావు
కంటిపై పాదరక్షను బెట్టి నొక్కిన కన్నప్పఁ బ్రమథులఁ గలిపినావు
కొలుచువారికె కాక పెల్లలచువారికైన నిచ్చుట లొక్క నీయందె కలదు
క్ష్మాతలశతాంగ భుజయుగాంగదభుజంగ ! రాజితశుభాంగ శ్రీసేతురామలింగ.

కనకాచలంబును గనకాంబరుండును జాపమై రోపమై యొప్పువాఁడు
నగరాజజాత పన్నగరాజనేత సద్దారయై నారియై మీరువాఁడు

శాంతి

గజరాజచర్మంబు కైలాసశైలంబు వలువగా నెలవుగా మెలఁగువాఁడు
శూలంబు ఢక్కకపాలంబు లభయంబు వాలుగా మాలగాఁ గ్రాలువాఁడు
లేఁడు లేఁ డన్నవారికి లేనివాఁడు కలఁడు కలఁ డన్నవారలఁ గాచువాఁడు
చూచువారల మనముల దోఁచువాఁడు దోఁచుకొనువాఁడు భక్తుల దోసములను.

కరుణకు దేనెయూట, రతికంతుని పువ్వులతోఁట, శాత్రవుల్
చెరుపఁగరానికోట, పరసీమకు దిద్దినబాట, కామినీ
కరములపైడిమూట, జయకాంక్షకు సింగపువేఁట పార్వతీ
చరణము లాశ్రయించెదము శాంతికి, దాంతికి, భ్రాంతి శాంతికిన్.

మంచుమల గన్న వెలలేని మానికమ్మ! ఫాలలోచను నాడించు పైడిబొమ్మ!
కృత మెఱుఁగుదమ్మ! మా నమస్కృతుల గొమ్మ! అన్నపూర్ణమ్మ! మ మ్మేలు మమ్మ! కొమ్మ

# జీవనివేదనమ్

శ్రీ జూలూరు హనుమంతరావు



ఈవే విశ్వము వౌచు విశ్వమున నీవే నిండి నీలోననే
జీవాళిన్ సృజియించి చంపుకొని నిర్జీవుండ వై జీవి వై
యీ విశ్వాంతరశాంతిభంగములలో నేలా స్వకీయస్ఫుర
ద్భావంబున్ బరిఖిన్నతన్ నిలుపుదో పల్మారు దేవా! యిటుల్

ఒక బడబానలమ్ము సకలావనిఁ గాల్చినఁ గాల్చుఁ గాని నీ
వికృతరుషానల మ్మయిన విశ్వములోఁ బెనవేసికొంచు నా
గక కొనసాగి కంటకముఖమ్మయి పోవు నశాంతివల్లరిన్
బెకలిచి కాల్చ దేమి? కనుపింపదొ! దైవమ! సృష్టినిర్మితిన్.

పుట్టిన జీవి కెట్టి తెరువుం గనరాదు ప్రశాంతికోస మె
ప్పట్టున యాతనాభరవశంబునఁ జిక్కుచు నంత్యమందునన్
మెట్టును శాంతిమార్గమున నిల్చిన యొక్క వెలుంగుదివ్వె చూ
పెట్టు జరాప్రపన్ గొలది విశ్రమముం గడియింప నీశ్వరా!

ప్రతిదృశ్య మ్మొక శాంతిహీనకరుణాభావమ్ముగాఁ గన్పడున్
బ్రతిశబ్ద మ్మొక వేదనానిబిడదుర్వారమ్ముగా విన్పడున్
బ్రతిభావమ్మను శూన్యతాబధిరసంబంధమ్ముగాఁ దోచెడున్
గతి నీసృష్టికి దేవ! యిట్లె యగుచోఁ గల్పించుటే యేలనో!

వెలుగులకై ప్రశాంతికయి విశ్వములో నొకజీవి యెన్ని జ
న్మలు వహియించుచున్నదొ! తమస్సులు నిల్చిన దేహమందుఁ జి
క్కులు వడి ముక్తికోసమయి కూ యిడినం గనరాదు మార్గ మె
ట్టులు దరియంగ నేర్చునొ! కడుంగడు రేగు నశాంతివార్నిధిన్.

భవములు లేక మృత్యువుల బాధలు లేక యనంతకామసం
భవములు లేక జీవి యొకపట్టున నిచ్చలు శాంతి కాంతి రే
ఖవములు విల్పోపీయఁగ నుపాయమె దోచదా నీకు దేవ ! యీ
భవములు దామరాకుపయి వారికణమ్ములు గాగ జీవికిన్.

దివి యొకఁ డున్న దంచు నట తేజము శాంతి లభించు నంచు మృ
త్యువు దరిజేర దంచు నేవియో పలుకాడుదె కాని మిత్తికిం
జివికిన దేహమున్ విడచు జీవి విరామ మెఱుంగలేని పు
ట్టువు గన నేలనో ! యిక నెటుల్ గడియించును దైవసన్నిధిన్.

దేహ మను మాయలోన బంధించి బహుళ
వేదనాజాలములఁ ద్రోసి వెల్లరేగు
తమములోఁ దట్టుమిట్టాడి దరియ లేని
జీవి నిట్లేల సాధింతొ ! దేవదేవ !

సృష్టి నిర్మితినఁ బరవశించు నీకు
బాగులే కాని యోగులు బడవు కంట
నోగు లున్నను బాగులో నొదిగిపోయి
యెల యును బాగుగాఁ దోచదే యనంత !

# అద్వైత (వేదాంత) దర్శనము-సర్వదర్శన సామరస్యము

శ్రీ ముదిగొండ వేంకటరామ శాస్త్రి



"తార్కికాణాం తు జీవేశౌ
వాచ్యా వేతౌ విదు ర్బుధాః।
లక్ష్యౌ చ సాంఖ్యయోగాభ్యాం।
వేదాంతే త్వైకతా తయోః"

ఈ విధముగ శ్రీశంకరభగవత్పాదాచార్యులవారు షడ్దర్శన సామరస్యనిరూపణ పురస్సరముగ నద్వైత (వేదాంత) దర్శనమునకు సర్వదర్శనమూర్ధన్యమును, అఖండశ్రేయోనిదానత్వమును సదాచారములో నిరూపించిరి.

## దర్శనములు : వాటి ప్రధానోద్దేశ్యము

దర్శన మనగా మహర్షులచే ననుగృహీత మైన యోగ్య మగు వైదికదృష్టి యని యర్థము. ప్రతిదర్శనమునకుగూడ ఆత్మశ్రేయోనిరూపణమే ప్రధానోద్దేశ్యము. ప్రతివారు తనయొక్క నిజమైన స్వరూపస్వభావములను గుర్తించి, యీ మానవదేహములో తనకు రాదగిన గొప్పశ్రేయస్సును నిర్ణయించుకొని తదనుకూలసాధనమార్గము నవలంబించి, సాక్షాత్తుగనో క్రమముగనో లేక ముఖ్యముగనో గౌణముగనో శ్రేయస్సు నొందుటే సర్వదర్శనములకు ప్రధానోద్దేశ్యము.

## నాస్తికాస్తికదర్శనములు

అట్టిదర్శనములలో కొన్ని యాస్తికదర్శనము లనియు, కొన్ని నాస్తికదర్శనము లనియు చెప్పబడును. వేదప్రామాణ్యము నంగీకరించినవి యాస్తికదర్శనములు, తద్భిన్నములు నాస్తికదర్శనము లని వాటివ్యవస్థ నెరుగనగును.

ఇంతియేగాని భగవదస్తిత్వ-పరలోకాస్తిత్వ-జన్మాంతరాస్తిత్వ - పుణ్యపాపాస్తిత్వాదివాదము లాస్తికములు, తద్భిన్నములు నాస్తికములు అనుటమాత్రము పొసగదు. జీవాత్మశ్రేయోనిరూపణమే ప్రతిదర్శనమునకు ప్రధానోద్దేశ్య మగుటచే సాంఖ్యమీమాంసాది దర్శన ప్రణాళికలలో భగవదస్తిత్వనిరూపణాదికము లేనంతమాత్రమున వాటిని నాస్తికదర్శనము లందుమా?

మరియు నతీంద్రియార్థములగు— భగవ, త్పరలోక, జన్మాంతర, పుణ్యపాపాదులలో దేనిని నిరూపింపవలెనన్నను ప్రత్యక్షోపజీవ్యానుమానాదు లప్రతిష్ఠితము లగుట వలనను, ఆర్షములగు స్మృతీతిహాస పురాణాగమాదులన్నియు స్వతఃప్రమాణములు నిత్యములు అనంతశాఖాభేదభిన్నము లగు వేదములే మూలముగా గల వగుట వలనను, శ్రేయోర్థములగు దేవతాద్యతీంద్రియార్థము లన్నియు వేదైకసమధిగమ్యములె యగుటవలనను శ్రేయోనిరూపణప్రమాణమూర్ధన్య మగు వేదప్రామాణ్యాంగీకార తదనంగీకారములే యాస్తిక్య నాస్తిక్య నిరూపకము లనక తప్పదు.

అందు బౌద్ధ - జైన - చార్వాకాదిదర్శనములు నాస్తికదర్శనములు. వైశేషిక - నైయాయిక - సాంఖ్య-యోగ - పూర్వోత్తర మీమాంసాత్మక షడ్దర్శనములు, శైవ - శాక్త వైష్ణవ - సౌర - గాణాపత్యాద్యాగమిక (తాంత్రిక) దర్శనము లాస్తికదర్శనము లని చెప్పనొప్పును.

## షడ్దర్శనాదులలోని యాస్తిక్య సాధర్మ్య వైధర్మ్యములు

షడ్దర్శనములలోగూడ వైశేషిక - నైయాయికాత్మక

ద్వివిధతర్కదర్శనములు, సాంఖ్యయోగాత్మక ద్వివిధసాం ఖ్యదర్శనములు - లోకవ్యవహార[illegible]ను లగు నియతను యాస్తికతనురూపమున వేదవాక్యములు కొన్నిటి నుదాహ రించుచుండెను. - బ్రహ్మమీమాంసాత్మక పూర్వో త్తర మీమాంసాదర్శనము లన్ననో! వైదిక పద - వాక్య ప్రమాణముల ననుసరించి, యుక్తిరూపసంహారాది షడ్విధ తాత్ప ర్యనిర్ణాయక లింగముల ననుసరించి మాత్రమే వేదవా క్యార్థనిర్ణయ మొనర్చునే గాని లౌకికయుక్తుల కచట స్వాతంత్ర్యము నివ్వవు. ఇదే ద్వివిధమీమాంసాదర్శన తది తర దర్శనవిశేషయమునకు గల యాస్తిక్యవైశిష్ట్యము.

స్వవేదశాఖాధ్యయన, వేదోక్త స్వధర్మానుష్ఠానాంగి కారము షడ్దర్శనములకు గల యాస్తిక్యసార్వత్రిక్యము.

శైవ - వైష్ణవాది తాంత్రికదర్శనములు తత్తత్తంత్రాను కూలముగ వేదవాక్యముల నన్వయించును.

## బౌద్ధాది దర్శననాస్తిక్యము

బౌద్ధ జైన చార్వాకాదిదర్శనములుగూడ తమమతములు వేదసమ్మతములే యనుటకు షడ్విధతాత్పర్యలింగశూన్యము లగు కొన్ని వేదవాదములను - అనగా ఆయాకత్యలలో వినబడినట్టి వేదవాక్యములు కొన్ని,

చెందిన వేదవాక్యములు కొన్ని, తర్క- సాంఖ్యాద్యాస్తిక దర్శనములవలె నుదాహరించుట కలదు. కాని ఆవేదములె స్వీయధర్మమూలము లని యొప్పి, తత్తద్వేదాధ్యయనములు గూడ స్వధర్మములేయని షడ్దర్శనములంగీకరించిన ట్లీబౌద్ధాది దర్శనము లంగీకరించనందున నివి నాస్తికదర్శనము లగు చున్నవి.

ఐతే యిట్టి నాస్తికదర్శనములలోగూడ వేదవాక్యోదా హరణము లేందుకుకలవు? అని సంశయము కలుగును. షడ్ద ర్శనములద్వారా సర్వాస్తిక లోకప్రమాణమూర్ధన్యముగ నిర్ణీ తములైన వేదములలోగూడ తమ (నాస్తిక) దర్శనములకు గూడ స్థానము న్నదని చెప్పినచేగాని భారతీయులు లేక తత్తదధికారులు బౌద్ధాదిదర్శనములను విశ్వసించరు గనుక

విశ్వాససంపాదనమునకు మాత్రమే నాస్తిక దర్శనము లలో వేదవాక్యోదాహరణము లుండుననియు, తావన్మా త్రమున నవి యాస్తికదర్శనములు కాజాలవనియు దెలియ నగును.

## సర్వదర్శనములు వేదమూలకములే

అనాదినిధనములు- భగవదాజ్ఞారూపము లగు వేదముల లోని పూర్వోత్తరపక్షవాదముల ననుసరించియె తత్తదధి కారిసముద్ధరణార్థమై భగవదాజ్ఞానుసారముగ నాస్తి కాస్తికనిఖిలదర్శనములు, శైవ- శాక్త- వైష్ణవ- సౌర- గాణాపత్యాది సకలతంత్రాగమాదులుమాత్రమే గాక వివిధ ఖండాంతరీయమానవమాత్రయోగ్యము లగు క్రైస్తవ- మహమ్మదీయాది మతములుగూడ నాయా మానవ శ్రేయః ప్రాప్తికొరకే భగవదంశాగత మహాపురుషులద్వారా ఆయాదేశకాలములలో నభివ్యక్తము లైనవేగాని అన్ని దర్శనములకు లేక అన్నిమతములకుగూడ మూలసూత్రము లనాదినిధనము లగు వేదములలోనే కలవు. కనుక మన మిప్పు డెరిగిన మతములెగాక మనమెరుగజాలని మతములు గూడ ననంతములుగ ననంతము లగు వేదములలో సూత్రి తము లయ్యేయున్నవి. అందుచే నన్నిమతములు అనాదులే. అనంతములే. అనగా వివిధజీవులలో కొందరు బాలురు, కొందరు వృద్ధులుగ గానుపించినను అనాది జననమరణ భ్రమణాత్మక బ్రహ్మాండసంసారచక్రములో సర్వజీవులు అనాదులు- అనంతులుగ నున్నట్లే వివిధదర్శనములకు వివిధ మతములకు అభివ్యక్తి కాలపూర్వాపరభావ ముండినను అనాదిత్వానంతత్వములు తప్పవు.

## మానవులకు మతములు దర్శనములు, వ్యవస్థితములే

«మనో రపత్యాని పుమాంసో మానవాః» అనెడి మానవశబ్దవ్యుత్పత్తి అందరము మనుసంతతివారల మైనను ఉద్భిజ్జాదులకువలె అవాంతరభేదము తప్పదు.

ఏయే భూఖండములలో నే యే కులగోత్రములలో నేయే తలిదండ్రుల కేయే జీవులు జన్మింతురో వారివారి జన్మలు నిర్ణిమిత్తము లనుకొనుట మాత్రము చాల పొర పాటు. అచింత్యవిచిత్రరచనాత్మకముగ పరిదృశ్యమాన

మగు నీబ్రహ్మాండమును సృజించిన పరమాత్మయాజ్ఞాను సారమే తరుగుల్మలతాదులయొక్క పశుపక్ష్యాదులయొక్క జన్మాదులవలెనే—

«చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః»

అని భగవానుడు చెప్పినట్లు మానవజన్మలుకూడ నాయా దేశకాలములలో సకారణముగ సంప్రాప్తము లగుటచే

«స్వే స్వే కర్మ ణ్యభిరత సంసిద్ధిం లభతే నరః»
«స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః»
«స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః»

ఈవిధముగ స్వధర్మానుష్ఠానమె ప్రతివారికి శ్రేయఃప్రద మనియు, పరధర్మానుష్ఠానము పతనహేతు వనియు, భగవద్వచనములవలననే స్ఫుటమగుచున్నది మరియు ఎవరికైన నేధర్మ మైన ఆశ్రయణీయమె యైనచో నిచట స్వపరధర్మవిభాగము వ్యర్థము కావలసివచ్చును గనుక—

"యేనైవ పితరో యాతాః
యేన యాతాః పితామహాః।
యేన యాయా త్సతాం మార్గః।
తేన గచ్ఛ న్నరిష్యతి"

ఇత్యాద్యార్షోక్తులను పరికించినచో సన్మార్గానుసారులగు తనతండ్రితాత లవలంబించినట్టి వేదశాఖాగోత్ర సూత్రాదుల వలె మతమునుగూడ తా ననుసరించుటే సర్వులకు శ్రేయస్కర మనియు; అంతకంటె నుత్తమసోపానమును, ఉత్తమ జన్మను, ఉత్తమధర్మమును తనజీవయాత్రలో క్రమముగ తనకు భగవానుడె యనుగ్రహించు ననియు; గుర్తించినచో మతము లనంతము లైనను నేత్రశ్రోత్రాదులకు దర్శనశ్రవణాదులు వ్యవస్థితములై యున్నట్లే ప్రతిమానవునకును తన మతము, తన దర్శనము, తన కక్ష్య వ్యవస్థితము లయ్యే యుండును గనుక స్వైరచారము పతనహేతు వనెడి రహస్యమును గుర్తించి సర్వులు స్వధర్మానుయాయులైననే శ్రేయము నొందగలరు.

పర్యవసానములో «భావాద్వైతం సదాకార్యం। క్రియాద్వైతం నకర్హిచిత్» అనెడి సూక్తిననుసరించి సూక్ష్మ బుద్ధితో విచారించినచో ఔపాధికములగు జాతి - మత - కుల - వర్ణాశ్రమాది వివిధావాంతరభేదదర్శనము ననుసరించి స్వస్వధర్మానుష్ఠానపరులైనవారికే.

«సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే»

అని భగవానుడు చెప్పిన ట్లద్వైతదర్శనమహాలాభము లభించుననియు, ఔపాధికములగు వర్ణాశ్రమాది ధర్మవ్యవస్థననుసరించనివారికి భావాద్వైతాత్మకమగు అద్వైతదర్శనము లేక సమ్యగ్దర్శనము లభింపదనియు గుర్తింపనగును. అపుడె సర్వదర్శనసామరస్యము లభించును.

## నాస్తికదర్శన స్వరూపస్వభావములు - ప్రయోజనములు

అద్వైతదర్శనములో సర్వదర్శనసామరస్య నిరూపణమును గావించుటకై ముందు వైవిధముగ వ్యవస్థితములగు వివిధదర్శనములలో రెండు మూడు నాస్తికదర్శనాగ్రగణ్యములను వానిస్వరూపస్వభావప్రయోజనాదులను దిఙ్మాత్రముగ నిరూపించి పిదప షడ్దర్శనాది నిరూపణ మొనర్చెద.

(1) చార్వాకదర్శనము — విరోచన ప్రణీతము, «అన్నం బ్రహ్మేతి వ్యజానాత్" అని పరిదృశ్యమాన స్థూల శరీరమునకు బ్రహ్మాత్మభావము నాపాతముగ జెప్పెడి వేద వాక్యము నాధారముగ జేసికొని పృథివ్యాదిభూతములు నాల్గె తత్త్వము లనియు, తత్పరిణామమగు స్థూలశరీరమే యాత్మయనియు, దానికి విజ్ఞానశక్తి చతుర్భూతసంయోగ విశేషమున సహజ మనియు, తాను జీవించినంతలో సుఖించుటే స్వర్గ మనియు, దుఃఖించుటే నరకమనియు, పరలోకములు పుణ్యపాపములు జన్మాంతరములు బ్రాహ్మణ జీవికార్థకల్పిత వేదసిద్ధములే గాని యప్రత్యక్షము లగుటచే నబద్ధములే యనియు, స్థూలదేహనాశమె ముక్తియనియు చెప్పెడి సిద్ధాంతమే —చార్వాక సిద్ధాంతము.

నాస్తికులకు పుత్రభార్యాది సాకల్య వైకల్య కృత బాహ్యధర్మాధ్యాస నాత్మయందు తొలగించుట కీదర్శన ముపకరించును.

(2) జైనదర్శనము — జిన ప్రణీతము - «ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్"। 'మనో బ్రహ్మేతి వ్యజానాత్' మున్నగు వేదవాదముల ననుసరించి స్థూలశరీరాతిరిక్తము,

స్థూలశరీరాంతర్గతము, స్థూలశరీరసమానపరిమాణక మగు సూక్ష్మ (లింగ) శరీరమే ఆత్మ యనియు, లుంఛితకేశత్వ, తప్తశిలాశయనాది కఠినధర్మముల నాచరించినందున లేక సుకృతముచే స్థూలదేహవిరక్తు లగు మానవులకు మరణకాలములో నీటిలో ముంచబడి వదలబడిన యుండుసొరకాయవలె సూక్ష్మశరీరము స్థూలశరీరమునుండి పైకెగిరి నపై స్థూలశరీరాంతర ప్రవేశాసక్తి లేనందున అవ్యాయమగ్నాని పరతోర్ధ్వగమనము నొందుచు సర్వదా పైకెగిరి పోవుచునే యుండుననియు, అదియే ముక్తి యనియు చెప్పెడి జైనసిద్ధాంతము.

నాస్తికులకు స్థూలశరీరాత్మభ్రాంతిని తొలగించుట కీదర్శన ముపకరించును.

(3) బౌద్ధదర్శనము — బుద్ధ ప్రణీతము - «అసద్వా ఇద మగ్ర ఆసీత్» «విజ్ఞానం యజ్ఞం తనుతే» «ప్రజ్ఞానఘన ఏవైతేభ్యో భూతేభ్యస్సముత్థాయ తాన్యేవానువినశ్యతి న ప్రేత్య సంజ్ఞాస్తి» ఇత్యాది వేదవాక్యముల ననుసరించి సుషుప్తికాలికానందమయకోశమును, ప్రళయకాలికమూలప్రకృతిని శూన్యముగా భావించి, దానినుండి వెలువడెడి విజ్ఞానమయకోశమును లేక మహదహంకారాదితత్త్వములనే క్షణిక విజ్ఞానాత్మతత్త్వములుగ నెంచి, తత్సంకల్పమాత్రమున నావిజ్ఞానాత్మయే స్వాప్న ప్రపంచమువలె నిఖిలక్షణిక భూత భౌతిక విజ్ఞేయాత్మకముగ పరిణమించి తుదకాక్షణికవిజ్ఞానాత్మ శూన్యమగుచుండు ననియు ముండితశిరస్త్వ, పీతాంబరధారిత్వ, పంచశీలానుయాయిత్వ, చైత్యవందనాది ధర్మాచరణమున నాక్షణికవిజ్ఞానసంతతి పరిణామసంస్కారశూన్యతచే నిర్బీజమై పునఃక్షణికవిజ్ఞానాంకురరహిత మై శూన్యభావము నొందుటె ముక్తియని చెప్పెడి సిద్ధాంతమే బౌద్ధసిద్ధాంతము.

నాస్తికులకు భోక్తృ భోజ్య సత్యత్వదృష్టిని దొలగించుట కీదర్శన ముపకరించును.

పర్యవసానములో నీమూడు (చార్వాక - జైన - బౌద్ధ) నాస్తికదర్శనములు క్రమముగ స్థూల - సూక్ష్మ - కారణ శరీరములనే ఆత్మలుగా నిరూపించుచు నిజాత్మదర్శనమగు అద్వైతదర్శనాభిలాషను నాస్తికులకు గలిగించుట కుపకరించు నని అద్వైతదర్శన దృష్టితో నిరూపింప నగును.

శేషించిన నాస్తికదర్శనము లెల్ల భంగిభేదములతో నీమూటిని పోలియుండుటచే తద్విచార మనతిప్రయోజన మగుటచే నిక ఆస్తికదర్శనవిచారమునకు గడంగుదము.

## షడ్దర్శనములు, వాటి స్వరూప స్వభావములు, యోజనములు

(1) వైశేషికదర్శనము - కణాదమహర్షి ప్రణీతము - షట్పదార్థతర్క మని చెప్పబడును. అందు ప్రత్యధ్యాయ మాహ్నికద్వయోపశోభితము. అట్టి పదియధ్యాయములలో - «అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః» మొదలు «తద్వచనా దామ్నాయస్య ప్రామాణ్య మితి» వరకు — 370 సూత్రములు. ప్రశస్తపాద భాష్య ఉపస్కారాద్యనేకవ్యాఖ్యోపవ్యాఖ్యా విరాజితము లై యున్నవి

అట్టి వైశేషికదర్శనములో జ్ఞానేచ్ఛా పుణ్యాపాప సుఖదుఃఖాది విశిష్టు డగు జీవాత్మునకు సత్యజ్ఞానేచ్ఛాశాలియు వశరీరుడు నగు పరమాత్ముని యాజ్ఞారూపము లగు వేదములలో విహితములగు స్వస్వవర్ణాశ్రమోచిత విశిష్టధర్మానుష్ఠానమున వివిధాభ్యుదయప్రాప్తియె (ఐహికాముష్మికసుఖప్రాప్తియె) గాక ద్రవ్యగుణకర్మసామాన్య విశేషసమవాయాత్మక షట్పదార్థ సాధర్మ్యవైధర్మ్యవిజ్ఞానముచే నాత్యంతికదుఃఖనివృత్తిరూప నిశ్శ్రేయసము (ముక్తి) గూడ కలుగు నని చెప్పబడియున్నది.

ఈ వైశేషికదర్శన మాస్తికుల కానందమయకోశము నందాత్మదృష్టిని కలిగించును.

(2) న్యాయ (నైయాయిక) దర్శనము—గౌతమమహర్షి ప్రణీతము. షోడశపదార్థతర్క మని చెప్పబడును. అందు ప్రతిఅధ్యాయ మాహ్నికద్వయ పరిశోభితము. అట్టి యైదధ్యాయములలో — «ప్రమాణ ప్రమేయ సంశయ ప్రయోజన . . .» మొదలు «హేత్వాభాసాశ్చ యథోక్తాః» వరకు 523 సూత్రములు. వాత్స్యాయన భాష్య విశ్వనాథభట్టాచార్యవృత్త్యాద్యనేకవ్యాఖ్యోపవ్యాఖ్యా సమలంకృతము లై యున్నవి.

అట్టి నైయాయిక దర్శనములో అనిత్యజ్ఞానేచ్ఛా పుణ్యాపాప సుఖదుఃఖాదివిశిష్టు డగు జీవాత్మునకు వైదిక

కర్మానుష్ఠానాసాదితవిశిష్టప్రజ్ఞతో ప్రమాణ ప్రమేయాది షోడశపదార్థసామాన్యవిశేషవిజ్ఞానము లబ్బినంతనే ఆత్యంతిక దుఃఖధ్వంస రూప మగు నిశ్శ్రేయసము సమకూరు నని చెప్పబడియున్నది.

ఈ న్యాయదర్శనముగూడ ఆస్తికుల కానందమయ కోశమం దాత్మదృష్టిని కలిగించును.

(3) సాంఖ్యదర్శనము—కపిలమహర్షి ప్రణీతము. నిరీశ్వరసాంఖ్య మని చెప్పబడును. ఇందలి యారధ్యాయము లలో «అథ త్రివిధదుః ఖాత్యంతనివృత్తి రత్యంతపురుషార్థః» మొదలు «యద్వా తద్వా తదుచ్ఛిత్తిః పురుషార్థ స్తదుచ్ఛిత్తిః పురుషార్థః» వరకు 527 సూత్రములు. విజ్ఞానభిక్షుభాష్య సాంఖ్యకారి కాద్యనేకవ్యాఖ్యోపవ్యాఖ్యా విరాజితము లై యున్నవి.

అట్టి సాంఖ్యదర్శనములో— నిత్య చిన్మాత్ర (విజ్ఞానమాత్ర) స్వరూపు డగు జీవాత్మునకు అనాది ప్రధాన (మూలప్రకృతి) పరిణామాత్మక మగు లింగ (సూక్ష్మ) శరీర కర్మావివేకమూలముగ తటస్థించినట్టి ప్రకృతిపురుషభోగ్య భోక్తృభావాత్మకబంధము ప్రకృతి పురుష వివేకముచే విచ్ఛిన్నమైనంతనే ఆధ్యాత్మి కాధిభౌతి కాధిదైవిక త్రివిధ సుఖదుఃఖాత్యంతనివృత్తిపురస్సరముగ జీవాత్మకు సహజ చిన్మాత్రావస్థానలక్షణమోక్షము వర్ణితమైయున్నది.

ఈసాంఖ్య దర్శనము ఆస్తికులకు చిదచిద్విచారముతో చిన్మాత్రాత్మతత్త్వమును బోధించును.

(4) యోగదర్శనము— పతంజలిమహర్షి ప్రణీతము. ఇందలి నాల్గధ్యాయములలో «అథ యోగానుశాసనమ్» మొదలు «పురుషార్థశూన్యానాం గుణానాం ప్రతిప్రసవః కైవల్యం స్వరూపప్రతిష్ఠా వా చితిశక్తి రితి» వరకు 195 సూత్రములు శ్రీకృష్ణద్వైపాయనభాష్య వాచస్పత్యాద్యనేకవ్యాఖ్యోపవ్యాఖ్యాప్రకాశితము లై యున్నవి.

అట్టియోగదర్శనములో క్లేశకర్మాదిరహి తేశ్వరప్రణిధానాత్మకాసంప్రజ్ఞాత (ధర్మమేఘ) సమాధిచే స్వయముగ నిత్యవిజ్ఞానమాత్రస్వరూపు డగు జీవాత్మునకు జడ ప్రధాన వికారాత్మకాంతఃకరణ (లింగశరీర) ప్రతిబింబ భావాత్మక సంసృతిబంధము తొలగును. అనగా - అట్టి జీవునకు పుణ్యాపుణ్యాత్మక సంసృతిబీజములు ధర్మమేఘ సమాధి సంజాతానుక్లకృష్ణకర్మమహిమచే నశించగనే తల్లింగ శరీరాత్మకాంతఃకరణమునకు కర్తవ్యముగాని కర్తృత్వ యోగ్యతగాని లేనందున క్రమముగ పూర్వాపూర్వపరిణామ క్రమమున అంతర్ముఖ తరంగమునకు సముద్రకైవల్యమువలె త్రిగుణసామ్యావస్థాత్మక ప్రధాన కైవల్యమున్ను, జపాకుసుమాపాయ ప్రయుక్తస్ఫటికభావశ్యకైవల్యము వలె నంతఃకరణాపాయమున జీవాత్మునకు సహజచిన్మాత్ర కైవల్యమున్ను వర్ణితములై యున్నవి.

ఈయోగదర్శన మాస్తికులకు చిన్మాత్రేశ్వరానుసంధానాత్మక సమాధిచే జీవాత్మకు చిన్మాత్రానుభూతిని దృఢపరచును.

(5) పూర్వమీమాంసాదర్శనము - జైమినిమహర్షి ప్రణీతము - ఇందలి పండ్రెండధ్యాయములలో – 907 అధికరణములు (సిద్ధాంతములుగా) «అథాతో ధర్మజిజ్ఞాసా మొదలు «అన్వాహార్యేచ తద్దర్శనాత్” వరకు. 2745 సూత్రములు. శాబరభాష్య - కుమారిలభట్ట వార్తి కాద్యనేక వ్యాఖ్యోపవ్యాఖ్యా సమలంకృతములై యున్నవి.

అట్టి మీమాంసాదర్శనములో వేదములోని పూర్వభాగ మగు కర్మకాండములోగల యావత్సంశయములు నిరాకరింపబడి శ్రౌతస్మార్త కర్మాచరణమున తుదకు కర్తయగు దేహాతిరిక్త (లింగశరీరాత్మక) జీవాత్మునకు నిత్యసుఖరూప మగు స్వర్గఫలవిశేషమే మోక్షముగ వర్ణితమై యున్నది.

ఈమీమాంసాదర్శనము ఆస్తికులగు విషయసుఖాభిలాషులకు నిత్యసుఖాభిముఖ్యమును కలిగించును.

(6) ఉత్తరమీమాంసాదర్శనము - శ్రీ వేదవ్యాస ప్రణీతము. దీనినే శారీరకమీమాంసాదర్శన మనియు, బ్రహ్మమీమాంసా దర్శనమనియు, వేదాంతదర్శన మనియు అద్వైతదర్శనమనియు వ్యవహరింతురు. ఇందలి నాల్గధ్యాయములలో - 192 అధికరణములు (సిద్ధాంతములు)గా «అథాతో బ్రహ్మ జిజ్ఞాసా» మొదలు «అనావృత్తి శ్శబ్దాదనావృత్తి శ్శబ్దాత్» వరకు 555 సూత్రములు. శ్రీశాంకరభాష్య, పంచపాదికా భామత్యాద్యనేకవ్యాఖ్యోపవ్యాఖ్యావిభూషితములై యున్నవి.

ఈయద్వైత వేదాంతదర్శనములో - నిఖిలవేదముల లోని యుత్తరభాగాత్మకము లగుటనే వేదాంతము లని చెప్పబడు యుపనిషత్తులలోని యావత్సంశయములు నివారింపబడి జీవాత్మపరమాత్మలు ఘటమఠాకాశములు మహాకాశమాత్రములై యున్నట్లు వస్తుతః నిర్విశేషాఖండాద్వితీయ సచ్చిదానందమాత్ర మగు పరబ్రహ్మస్వరూపులే యైయుండి రనియు, అసద్భాసమాన మాయా-ఽవిద్యాపర్యాయ ప్రకృతివశమున జీవేశ్వరజగద్రూపములుగా నా పరబ్రహ్మాత్మక నిజాత్మతత్త్వమే తోచుచుండు ననియు, అనేకజన్మార్జితవిలక్షణసుకృతపుంజప్రాప్తపరమేశ్వరానుగ్రహవశమున శ్రీసద్గురుముఖాగతమహావాక్యమహిమచే జీవాత్మునకు బ్రహ్మాత్మసాక్షాత్కారము సంఘటించినంతనే కలనుండి మేల్కాంచినవానిచందమున «యత్రత్వస్య సర్వ మాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్» అని శ్రుతిమాత చెప్పినట్లు సర్వభూతాత్మభూత బ్రహ్మాత్మకైవల్యరూప నిశ్శ్రేయసము త్రైకాలికముగ సమకూరియున్న విషయము గోచరించు ననియు అదియే సర్వదర్శనసోపానక్రమసమధిగమ్యమగు అఖండాద్వితీయవస్త్వైక్యకైవల్యరూప మగు అద్వైతదర్శన మనియు వర్ణితమై యున్నది.

ఈయద్వైతదర్శన మాస్తికాగ్రగణ్యులకు సర్వదర్శన సామరస్యముతో అద్వితీయాఖండాత్మస్థితిని బోధించును.

## ఉత్తరమీమాంసా (వేదాంత) దర్శన మద్వైత దర్శనమే

ప్రస్తుతమగు నీ వేదాంతదర్శనము వస్త్వైక్యపరమగుటచే శ్రీశాంకరభాష్యము ననుసరించి యద్వైతదర్శనమనియే చెప్పనొప్పును.

ద్వైత- విశిష్టాద్వైత- శైవ- శాక్తాది భాష్యకర్తలు చెప్పిన ట్లీవేదాంతదర్శనమందుకూడ జీవనానాత్వ, జగత్సత్యత్వ జీవపరభేదమే పర్యవసన్నమైయున్నచో కపిల కణాదా ద్యాస్తికదర్శనాంతరములలో నెల్ల «నహి నిందాన్యాయము»తో నిరాకృతమైనట్టి యద్వైతవేదాంత సిద్ధాంతమునకు స్థానమే లేకపోవలసివచ్చును. గనుక- «బ్రహ్మవి దాప్నోతి పరమ్» «సర్వం ఖల్విదం బ్రహ్మ» «నేహ నానాస్తి కించన» «ఆత్మై వేదం సర్వమ్» «బ్రహ్మై వేదం సర్వమ్» «క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి» «జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్» «వాసుదేవ స్సర్వ మితి» «విభేదజనకే ఽజ్ఞానే నాశ మాత్యంతికం గతే। ఆత్మనో బ్రహ్మణో భేద మసంతం కః కరిష్యతి» «సాపి మత్తః పృథఙ్మాయా నాస్త్యేవ పరమార్థతః» ఇత్యాది శ్రుతి స్మృతీతిహాసపురాణాదులలో నద్వితీయతాత్పర్యలింగావధృతమగు అద్వైతవేదాంతసిద్ధాంతమే. ఉత్తరమీమాంసా దర్శనములోని— «అథాతో బ్రహ్మజిజ్ఞాసా» «జన్మాద్యస్య యతః» «శాస్త్రయోనిత్వాత్» «తత్తు సమన్వయాత్» «ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా దృష్టాంతానుపరోధాత్» «ఆత్మని చైవం విచిత్రాశ్చ హి» «తదనన్యత్వ మారంభణశబ్దాదిభ్యః» «చితితన్మాత్రేణ తదాత్మకత్వాదిత్యౌడులోమిః» «అనావృత్తి శ్శబ్దా దనావృత్తి శ్శబ్దాత్» ఇత్యాదిసూత్రములలో— కపిలకణాదిభేదవాది దర్శనాంతర దర్శనాత్మక ప్రతిపక్షిదృష్టిలోగూడ సిద్ధమగుచుండుటచే నీయుత్తరమీమాంసాదర్శన మద్వైత దర్శనమే యని చెప్పకతప్పదు. గనుక «బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః» అనెడి శ్రీశాంకరాద్వైతసిద్ధాంతమే శ్రీబాదరాయణమహర్షిచే ప్రణీతమైన వేదాంతదర్శనములో ప్రకాశించుచున్న దనుట సమంజసమై యున్నది.

## వేదాంతదర్శనములో - శైవవైష్ణవాది తాంత్రిక దర్శనములు

ఐతే - ఉత్తమీమాంసాదర్శనవిచార్యము లగు నుపనిషత్తులలో జ్ఞానకాండవలె నుపాసనకాండకూడ నుండుటచే కేవల బ్రహ్మాత్మసాక్షాత్కారమాత్రముననే నిఖిలసంసారకారకాజ్ఞాననివృత్తి లేక బ్రహ్మాత్మ కైవల్యము సంఘటించు నని చెప్పెడి యుత్తమాధికారిక కైవల్యవాక్యములే గాక, మధ్యమాధికారికోపాసనపర క్రమముక్తివచనములు, లేక సాలోక్య సారూప్యాది గౌణముక్తివచనములుగూడ నుండుటచే తత్తదధికారిసాధక సముద్ధరణార్థమై «విచారాక్షమ మర్త్యాశ్చ తచ్ఛ్రుత్యోపాసతే గురోః» ఇత్యాది వేదాంతరహస్యజ్ఞులు తత్త్వజ్ఞులు నగు - శ్రీనీలకంఠాచార్య - శ్రీరామానుజాచార్య - శ్రీమధ్వాచార్య -

శ్రీ పంచాననతర్కరత్నభట్టాచార్య ప్రభృతులు శ్రీవేదాంత దర్శనమునకు - శైవ - వైష్ణవ - శాక్తాది తంత్రగ్రంథ ప్రామాణ్యముల ననుసరించి ఉపాసన పరములగు ద్వైత - విశిష్టాద్వైత - శివ - విష్ణు - శక్తి-సాలోక్య సారూప్యాది సగుణ (గౌణ) ముక్తిపరములగు భాష్యములను రచించిరి.

ఏసిద్ధాంతమందైన పరసిద్ధాంతనిరాకరణ మొనర్చినది స్వమతము సుప్రతిష్ఠితమగుటగాని, స్వమతాధికారులకు ప్రయోజనము గలుగుటగాని తటస్థించదు గనుక నీభేదవాది భాష్యకారులెల్లరు నద్వైతసిద్ధాంత నిరాకరణ మొనర్చిరే గాని నిజముగ వేదాంతదర్శనమున కద్వైతసిద్ధాంతమందే పరమతాత్పర్యము కలదను రహస్యమును వా రెరుగనివారు కారు.

తత్తద్భేదవాదిభాష్యవ్యాఖ్యానోపవ్యాఖ్యానకర్తలలో కొందరు, తదనుయాయులలో కొందరుమాత్ర మీరహస్యము నెరుంగకపోవుటచే అద్వైతనిరాకరణావేశములో నహినిందాన్యాయమును వారు విస్మరింతురు. ఇది అద్వైత భాష్యవ్యాఖ్యానోపవ్యాఖ్యాతలలో కొందరు, తదనుయాయులలో కొందరు, భేదవాదిభాష్యకర్తల హృద్గత మగు అద్వైతరహస్యమును గుర్తింపక భేదవాదిభాష్యనిరాకరణైకదృష్టితో సర్వదర్శనసామరస్యరహస్యము నెరుంగని యద్వైతినామమాత్రధారులు ప్రవర్తించినట్లే యగును గాని వారివారి యుపన్యాసము లెన్నటికిని సర్వదర్శన సామరస్య సంపాదకములు కాజాలవు. «జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి» అనుమాట కర్థమే యుండదు -

## అద్వైతదర్శనముననే సర్వదర్శనసామరస్యము

న్యాయమగు సర్వదర్శనసామరస్యదృష్టితో షడ్దర్శన మూర్ధన్య మగు నీవేదాంతదర్శనమును సమన్వయింప బూనినచో «శతే పంచాశన్న్యాయము»న మాయావచ్ఛిన్న చైతన్య విభూతివిశేషములగు నాయాభూమికలలో ద్వివిధ తార్కిక, ద్వివిధసాంఖ్య, పూర్వమీమాంసాదర్శనములె గాక ఉపాసనాప్రధానములుగ నీ వేదాంతదర్శనమునకు భాష్యముల గావించినట్టి వివిధతాంత్రిక - శైవ - శాక్త - వైష్ణవాది సిద్ధాంతములుగూడ శ్రీ శాంకరాద్వైత దర్శన సిద్ధాంతము ననుసరించి తత్తదధికార్యుపయుక్తము లగు స్థానవిశేషములలో నసంకీర్ణములుగ నిరూపితములగుట కవకాశ ముండునే గాని ఐక్యసిద్ధాంతమగు నీశాంకరాద్వైతదర్శన మితరదర్శనములలో గాని భేదవాది వేదాంత సిద్ధాంతాంతరములలో గాని ఏకదేశీయ మగుట అసంభవము.

ఇంతమాత్రమే గాక «పరస్పరం విరుద్ధ్యంతే తైరయం నవిరుద్ధ్యతే» «స్వహస్తపాదాదిభిరివ» అనెడి మాండూక్య కారికా భాష్యములనుబట్టి ఒకయద్వైతదర్శనము వదలినచో శేషించిన యితరదర్శనములు శైవ- శాక్త- వైష్ణవాది వేదాంతదర్శనములు. వీటిలో నేదర్శనమునకైన దర్శనాంతరముల నెల్ల తనలో నేకదేశీయములుగ నిరూపింపదగిన సామరస్యము వంధ్యాపుత్రాయమాణమె యగును.

## వివర్తవాదముననె సర్వవాదసామరస్యము

మరియు జగత్సృష్టిప్రళయాదివిచారములలో సర్వ జనసుప్రసిద్ధములైనట్టి ఆరంభ- పరిణామ- వివర్త వాదములు- అనగా- పరమాణు (నిరవయవసూక్ష్మ రేణువు) ద్వయసంయోగముచే ద్వ్యణుకము, ద్వ్యణుక త్రయసంయోగముచే త్ర్యణుకము ఈవిధముగ మహాపృథివీజల తేజోవాయుసృష్టియు, తత్తదవయవసంయోగనాశ క్రమముచే మహాభూతచతుష్టయము తిరిగి పరమాణువులుగ మిగులుట ప్రలయము. అనెడి కార్యకారణభావవాదమె ఆరంభవాదము. సత్త్వరజస్తమోగుణసామ్యావస్థాత్మక మూలప్రకృతి మహదహంకారాదిక్రమముగ మహాపృథివ్యాదిపంచభూతపర్యంతము కార్యభావము నొందుటే సృష్టి యనియు, తిరిగి భూతభౌతికములెల్ల పూర్వాపూర్వ పరిణామక్రమమున మూలప్రకృతిభావము నొందుటె ప్రలయ మనియు చెప్పుటే పరిణామవాదము. పైరెండు నానాత్మ వాదములు అవాంతర ప్రలయ, మహాప్రలయ ప్రభృతి జగచ్చరిత్రను చెప్పునేగాని «ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞ» నొనర్చిన యౌపనిషదతత్త్వమును చెప్పజాలవు గనుక తత్పూర్వాపరములను వైదికదృష్టితో నాలోచించినచో ఒకేవిధమగు సత్యజ్ఞానానందాత్మకపరమాత్మ తత్త్వమె అజ్ఞాతమై పరిణామిప్రకృతిగాను అన్యథాజ్ఞాతమై వివిధపరమాణువులుగాను, ద్వివిధప్రలయములలో గోచ

శించుననియు సమ్యగ్దర్శనముచే స్వాత్మాజ్ఞానము తొలగి నంతనే కేవలాఖండాద్వితీయాత్మయే గోచరించు ననియు చెప్పెడి వాదమె వివర్తవాదమనియు ఈత్రివిధవాదములు గూడ తత్తన్మానవగుణములగు- హీన- మధ్య-మోత్కృష్టదృష్టులు- అధమ- మధ్య మోత్త మాధికారిక భేద సంగ్రాహ్యములై క్రమముగ- స్థూల సూక్ష్మ- కారణ- శరీరత్రయ నిరూపణార్థములు తర్క- సాంఖ్య- వేదాంత దర్శనములలో అనేకరూపములై యున్నవి. ఇందులోగూడ- వివర్తవాదములో నారంభపరిణామవాదభావము లేకదేశీయము లగునేగాని తదన్యతరములో వివర్తవాద మేకదేశీయము కాజాలదు గనుక వివర్తవాదదృష్టిగల యద్వైత దర్శనమునందే సర్వదర్శనసామరస్యము పొసగును.

పరమార్థాద్వైతదర్శనమందజాతవాదమే

«న నిరోధో న చోత్పత్తిః» అనెడి సిద్ధపురుషుని పరమార్థాద్వైతదృష్టిలో పైజెప్పిన వివర్తవాదముగూడ నిలువదు. అట్లగుటవలననే ఆరంభవాదవార్తనె స్మరింపక— పరిణామవివర్తవాదములు రెండును అధమోత్తమసాధకానుగ్రాహకము లనియు సిద్ధపురుషదృష్టిలో అజాతవాదమే యనియు.

"కృపణధీః పరిణామ ముదీక్షతే
క్షపితకల్మషధీస్తు వివర్తతామ్।
స్థితమతిః పురుషః పునరీక్షతే
వ్యపగతద్వితయం పరమంపదమ్»

ఈవిధముగ సంక్షేపశారీరకాచార్యులవారు అజాతవాదము నె స్వానుభూతితో నిలిపిరి. మరియు :

"ఉపలంభాత్సమాచారా దస్తి వస్తుత్వవాదినామ్।
జాతిస్తు దేశితా బుద్ధైరజాతే స్త్రసతాం సదా»

అనెడి మాండూక్యకారికలో గౌడపాదాచార్యులవారు జగజ్జన్మాదికారణత్వరూప వివర్తవాదవైభవము "న నిరోధో నచోత్పత్తిః» అనెడి సిద్ధస్వైక్యసిద్ధాంతమును విని భయపడెడియుత్తమసాధకుని సముద్ధరించుటకే జన్మాది - ప్రకృ - త్యాద్యధికరణములతో అద్వైతదర్శనమున వర్ణితమైనదేకాని పరమార్థసమ్యగ్దర్శనములో కాదనిరి. ఈ రహస్యము -

«దృఢాగ్రహవతాం శ్రద్ధాలూనాం మందవివేకినా మర్థోపాయత్వేన సాదేశితా జాతిః। తాం గృహ్ణంతు తావత్। వేదాంతాభ్యాసినాంతు స్వయమే వాజా ద్వయాత్మ విషయో వివేకో భవిష్య తీతి, నతు తాత్పర్యబుద్ధ్యా»

ఈవిధ మగు శ్రీశాంకరభాష్య సూక్తివలనను,

«తత్త్వదృష్ట్యా కార్యకారణత్వస్యాప్రసిద్ధత్వే కథం జన్మాదిప్రముఖైః సూత్రైః జగత్కారణం బ్రహ్మసూత్రిత మిత్యాశంక్యాహ = 'ఉపలంభా దితి' అవివేకినాం వివేకోపాయత్వేన కార్యకారణత్వ ముపేత్య సూత్రకా ప్రవృత్తి రిత్యర్థః»

ఈవిధ మగు ఆనందగిరియుపంక్తివలనను స్ఫుటముగా గలదు.

కనుక పరాపర (సగుణనిర్గుణ) విద్యాధికారివ్యవస్థతో గాని, అధికారివిశేషభూమికాకృతవ్యవస్థతో గాని, నిరుక్తాస్తిక దర్శనములకే గాక ఆర్షములగు నిఖిలనాస్తికదర్శనములకుగూడ స్వసిద్ధాంతైకదేశీయత్వరూప సర్వదర్శన సామరస్య మీయద్వైత వేదాంతదర్శనమందే నిర్వివాదముగ సంఘటించునని తెలియనగును.

ఐతే అజాతవాద మనగా - జగజ్జన్మనిరాకరణవాద మని మాత్రమేగాక స్థితి - లయములుగూడ లేవను వాదమె గదా! అది నిఖిలద్వైతదర్శనములకును, సర్వలోకానుభవమునకును నచ్చుటెట్లు అందురా? «తదనన్యత్వ మారంభణశబ్దాదిభ్యః» «ఆత్మని చైవం విచిత్రాశ్చ హి» మున్నగు వేదాంతాధికరణములను విచారింపుడు. స్వాప్న పదార్థముల జన్మస్థితిలయములవలె అజ్ఞాతాఖండచిదాత్మ తత్త్వమే నిఖిలజగజ్జన్మాదిరూపముల వెలుగొందు ననెడి రహస్యమును స్మరించినచో «సర్వం ఖల్విదం బ్రహ్మ» «నేహ నానాస్తి కించన» «ఐతదాత్మ్య మిదగ్ం సర్వమ్» ఇత్యాది శ్రుతియుక్త్యనుభవసిద్ధమగుటచే అజాతవాదము సర్వసంప్రతిపన్న మని సర్వులకు విదితమగును.

ఇట్టి యద్వైతవేదాంతదర్శనమును వదలినచో ఆర్షము లగు వివిధదర్శనములకు నేవిధముగగూడ సామరస్యము, సర్వలోకప్రశాంతియు సంభవించుట యసంభవమగును. వైదికములు ఆర్షములు నగు దర్శనముల కేకవాక్యత లేదను

కొనుటయు, తన్మూలమున తత్తద్దర్శనప్రణేతలు పరస్పర కామక్రోధాది భూయిష్ఠులు అసమ్యగ్దర్శులు, అసర్వజ్ఞులు అనవలసివచ్చుట శోచనీయము గాదా? అపుడాయాదర్శనముల కార్యత్వము 'ఘృతకౌశాతకి' వంటిదె యనవలసి వచ్చును. అట్లనుటకంటె నవివేకము వేఱుండదు గదా? కనుక పైజెప్పినరీతిగ అద్వైతవేదాంతదర్శనము నాశ్రయించి సర్వదర్శనసామరస్యము నధిగమించుట సర్వశ్రేయోనిదానము.

ఈ సందర్భములో - «లోకాయతాది సాంఖ్యాంతా శివే విశ్రాంతి మాగతాః। తృణార్చకాదియోగాంతా ఈశే విశ్రాంతి మాగతాః» అని నాస్తికాస్తికభేదమునువదలి వివిధభేదవాదివర్శనములలో గూడ వివిధజీవపరాదిభేద భ్రమారూఢసాధకోద్ధరణార్థమై సర్వజ్ఞులగు వివిధదర్శనకర్తలు ప్రవర్తించినవిషయమును సూచింపుచు, వివిధదర్శనసామరస్యదృష్టి ననుగ్రహించినట్టి సర్వదర్శనసంగ్రహాదిప్రణేతలు పూర్వోత్తరమీమాంసావ్యాకర్తలు, చతుర్వేదభాష్యకర్తలు నగు శ్రీవిద్యారణ్యచరణులు శ్రీశంకరగురుచరిత్రలో నెలవిచ్చినట్టి యొకటిరెండుసూక్తుల నిచట మచ్చునకై యుదాహరించెద.

«అభిసంధిమానపి పరే
విషయప్రసరస్మృతీ ననుజిఘృక్షు రసౌ।
తదవాప్తిసాధనతయా
సకలం సుకృతం న్యరూపయ దితిస్మ పరమ్॥

పూర్వమీమాంసాదర్శనకర్త యగు జైమినిమహర్షికి గూడ స్వగురుచరణులగు వేదవ్యాసప్రణీతమైన యుత్తరమీమాంసాదర్శనగతబ్రహ్మాత్మైక్యసిద్ధాంతమందే సంపూర్ణాభినివేశముండియు, తదనధికారులకు తదధికారసిద్ధికై అనాదిభ్రాంతిసిద్ధ కర్త్రాత్మభావానువాదములో కర్మ (ధర్మ) నిరూపణమును పూర్వమీమాంసలో గావించె ననెడి పైజెప్పిన శ్రీశంకరభగవత్పాదసూక్తిని విని యత్యంతాశ్చర్యసంశయదుఃఖ దోలాందోలితహృదయు డగు మండనమిశ్రు ననుగ్రహించుటకై శ్రీశంకరుడు స్మరించినంతనే యాజైమిని మహర్షి సాక్షాత్కరించి -

«గురుణా చిదేకరసత
త్పరతా నిరణాయి హి శ్రుతిశిరోవచసామ్।
తత్ప మేకమాత్రమపి త
ద్విమతం కథయా మ్యహం త పపపాతిత ధీః»

ఈవిధముగ కైముతికన్యాయము తో సర్వదర్శనసామరసిద్ధాంతమవగతమగులాగున కర్తృత్వాకర్తృత్వైకత్వానేకత్వబుద్ధ్యాశయములగుటచే పూర్వాపరసముద్రగమనము లవలె నత్యంతవిరుద్ధార్థములుగ గానుపించెడి పూర్వోత్తరమీమాంసాదర్శనసామరస్యము నత్యద్భుతము నావిష్కరించెను. గనుక సర్వదర్శనసామరస్యమద్వైతదర్శనమునను మహావాక్యార్థప్రబోధమున సంఘటించు ననుట నిర్వివాదము.

## అద్వైతదర్శనము - మహావాక్యార్థప్రబోధము

అద్వైత దర్శన మనగా - బ్రహ్మసూత్రములు మాత్రమే యని యర్థము గాదు. తదుపష్టబ్ధనిఖిలవేదాంత శిరోరత్నములగు "తత్త్వమసి» «అహం బ్రహ్మాస్మి» «అయమాత్మా బ్రహ్మ» «ప్రజ్ఞానం బ్రహ్మ» అనెడి చతుర్వేదగతమహావాక్యచతుష్టయమాత్ర సమధిగమ్య మగు సమ్యగ్దర్శనమె వాస్తవాద్వైతదర్శనము.

అచట - గ్రాహ్యగ్రాహకాత్మక మగు బాహ్యేంద్రియజన్యద్వైతదర్శనము గాని, అంతరింద్రియాత్మకమనోజన్యద్వైతదర్శనము గాని ప్రసక్తము కాదు. గ్రాహ్యగ్రాహకాత్మకనిఖిలప్రపంచమునకు సాక్షియగు గ్రహమాత్రస్వరూపమె తానై వెలుగుచుండెడి యఖండచైతన్యమే అద్వైతదర్శనము. నిఖిలతరంగము లంతర్ముఖము లైనపుడు మహాసముద్రమాత్రముగ నున్న చందమున నిఖిలద్వైతదర్శనతరంగము లంతర్ముఖములై యఖండవిజ్ఞానమహార్ణవాత్మకాద్వైతదర్శనముగ సర్వదా ప్రకాశించుచుండుట సహజమెగదా?

ఇందులో గ్రాహ్య మగు బ్రహ్మాండతరంగమె లేక లోకత్రయమె విరాడ్రూప మగు తత్పదవాచ్యార్థ మనియు, గ్రాహకపిండాండతరంగమే లేక దేహత్రయమె త్వంపదవాచ్యార్థ మనియు, తదుభయాధిష్ఠాన మగుటచే తదుభయసాక్షిగా నున్న యఖండచిదాత్మయే «తత్త్వమస్యా»ది మహావాక్యాఖండార్థ మనియు,

«జీవాత్మా పరమాత్మా చే త్యాత్మా ద్వివిధ ఈరితః
చిత్తాదాత్మ్యాత్త్రిభి ర్దేహై ర్జీవస్సన్ భోక్తృతాం వ్రజేత్»

సాత్మా సచ్చిదానంద స్తదాత్మ్యం నామరూపయోః।
గత్వా సోఽన్యోన్య మాపన్నస్తత్ర వివేకేన బోధయన్॥
"యస్మిన్ యస్మిన్ స్థితే లోకే బోధ స్తత్ర ప్రవేక్షతే।
యస్తోయే మాత్రం బ్రహ్మైక్యం నిర్భ్రాంత
నిశ్చయః॥

ఇత్యాది శ్రీవిద్యారణ్యస్వాములవలనను,

"అహమన్న మహమన్న మహమన్నమ్ అహమన్నాదోఽహమన్నాదోఽహమన్నాదః॥
ఇత్యాది శ్రుతులవలనను,

"శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్" ఇత్యాది బ్రహ్మసూత్రములవలనను, సమస్తదృశ్యదృష్టిరాత్యైక్యభావనతో నద్వైతదర్శనము సర్వదర్శన సమన్వయము నిరూపితమైయున్నది.

## ఉపసంహారము

అఖిలలోకప్రశాంతికరమగు సర్వదర్శనసామరస్యము శ్రీశంకరభగవత్పాదులవారు "తార్కికాణాంతు జీవేశౌ వాచ్యౌ వేతౌ విరుద్ధధర్మిణౌ చ సాంఖ్యయోగాభ్యాం వేదాంతే త్వైకతా తయోః" అనెడిసదాచారసూక్తిలో తేటతెల్లమొనర్చిన విషయము నుపక్రమమందే నిరూపించియుంటిని.

ఇచట "తార్కికాణామ్" అని బహువచనముండుటచే వైశేషిక, నైయాయిక, మీమాంసాదర్శనములే గాక సాంఖ్యయోగ భిన్నభిన్నాత్మదర్శనములన్నియు జీవునకు కించిద్జ్ఞత్వ కర్తృత్వ భోక్తృత్వ, సుఖదుఃఖాదికమును దేవునకు సత్యకామసత్యసంకల్పత్వాదులను సహజముగ నంగీకరించువివిధప్రక్రియలతో "తత్త్వమసి"ది మహావాక్యగత "త్వం" పదవాచ్యార్థనిరూపణ మొనర్చుచున్నవనియు, సాంఖ్య-యోగదర్శనములు జీవాత్మపరమాత్మలకు బాధకములగు కించిద్జ్ఞత్వసర్వజ్ఞత్వాది ధర్మముల ద్రోసిపుచ్చి వానిభయములను చిన్మాత్రులుగ నిరూపించుటచే "తత్త్వం" పదలక్ష్యార్థనిరూపణ మొనర్చుచున్నవనియు; కాలాకాశాదులనుగూడ వస్తుకృత పరిచ్ఛేదముకలన సుందోపసుందన్యాయముగ నుభయమున కనిత్యత్వము వచ్చినట్లే చిన్మాత్రులగు అనేకజీవులకును, జీవపరమాత్మలకును పరస్పరభేదప్రతీతివిషయత్వరూప మగు వస్తుకృత పరిచ్ఛేదమువలన నుభయల కనిత్యత్వము సంభవించుటేగాక "ద్వితీయాద్వై భయం భవతి" "ఉదర మంతరం కురుతే అథ తస్యభయం భవతి" ఇత్యాది శ్రుత్యుక్తసద్వితీయత్వప్రయుక్తభయరూప సంసారవిముక్తి ముముక్షువులకు అద్వైతదర్శన మాశ్రయించిన యుత్తమసాధకుడు మహావాక్యానుగ్రహమునను, సద్గురు కరుణాకటాక్షమాత్రమునను జీవాత్మపరమాత్మాఖండబోధ లభించినంతనే "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" "తరతి శోకమాత్మవిత్" "జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి" ఇత్యాది శ్రుతిస్మృతిసిద్ధమగు జీవబ్రహ్మైక్య కైవల్య సామ్రాజ్యపట్టాభిషిక్తుడగును. సర్వభూతాత్మభూతాత్ముడై వెలుగును.

అప్పుడు "ఏతద్దేశప్రసూతస్య సకాశా దగ్రజన్మనః స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః" అనెడి మానవన్యాయానుసారముగ ఖండాంతరార్యములగు వివిధనాస్తికదర్శనములతోను, భరతఖండార్యములగు వివిధాస్తికదర్శనములతోను విరాజిల్లెడి యద్వైతవేదాంత దర్శనకైవల్యమహాసామ్రాజ్యము తరతమభావాపన్న వివిధ సామంతభూపాలమౌళిమణిరాజిత దివ్యపాదపీఠవిరాజిత సార్వభౌమునిభంగి అనన్యసమృద్ధర్షమైయనన్యసామాన్య మహావైభవముతో విరాజిల్లుచుండు నను విషయమును:
"నహి తార్కికవాది చాటభట ప్రవేసాదిసార ఇహ వేదాంత ప్రమాణమహారాజబాహుగుప్తే ఆత్మైకత్వే విషయే"
ఈవిధముగ శ్రీ శంకరభగవత్పాదాచార్యులవారు సర్వదర్శన సామరస్యముతో అద్వైతవేదాంతదర్శన మహాసామ్రాజ్యవైభవమును ప్రకాశింపజేసిరి.

గనుక అద్వైతపదములో ద్వైతపదమునకు స్థానముండునేగాని ద్వైతపదములో నద్వైతపదమునకు స్థానముండనట్లే "సర్వే వేదా యత్పద మామనంతి" యని శ్రుతిమాత జెప్పినట్లు నిఖిలద్వైతదర్శనములకు అద్వైతదర్శనములో స్థానముండుటేగాక నిఖిలద్వైతదర్శనములకు పూర్వాపర విచార మొకింత సమరసదృష్టితో గావించినచో అద్వైతమందే పర్యవసానము గానుపించును గనుక నిఖిలద్వైత దర్శనసామరస్యము సకలలోకప్రశాంతియు నద్వైతవేదాంత దర్శనమందే సంఘటించును.

"లోకా స్సమస్తా స్సుఖినో భవంతు."

# ని వే ద న

## శ్రీ వెల్దండ ప్రభాకరామాత్య



సడలెన్ మానసధైర్యకంచుకము ప్రాశస్త్యాత్మవిశ్వాస మే
యెడ జీర్ణించెనొ! దేహదార్ఢ్యము వృథా యీజీవితార్థంబులో
నుడిగెన్ దైవవిపాక మేగతి మదీయోద్వేగమున్ మాన్పునో
కడతేరం గలవో యెఱుంగను మదాకాంక్షిషితార్థంబులున్.

బరు వౌచున్నది జీవితంబు వివిధవ్యాసంగదుర్వారదు
స్తరచింతాభరశీర్ణితం బయి ప్రశ స్తం బైన సత్కావ్య మే
సరణిన్ వ్రాయగనేర్తునో! యది రసజ్ఞామోదముం గాంచగన్
సరసాలంకృత మైన కావ్యరచనాసామర్థ్యమే లేనిచో.

నీ యాదేశము కల్గినంచు నిక నేనిన్ వచ్చితిం గాని యే
మాయాజాలప్రభావమో యెఱుఁగ నీమౌనవ్రతం బేమొకో!
నా యాశాకుసుమంబుఁ ద్రుంచితివి యేనాడో సమర్పించితిన్
నా యారాధ్యపు దైవతంబ వని న న్నన్యాయముం జేతువా!

స్వామీ! ని న్గను భాగ్య మబ్బు టెపుడో! ప్రాపింపనే లేదు; ఎ
న్నేమారుల్ భవదీయసన్నిధికి నే నేతెంచినం గారణం
బేమో! రంగపురీనివాస! నను నాదేశింపవా కావ్యమున్
నీ మహాత్మ్యము జూపి వ్రాయ నిక నేనిన్ సద్గతు ల్గలగన్.

శాంతి యొకింత లేదు మనసార నినుం గనకుండ నాకు న
శ్రాంతము రంగధామనిలయాంగణమే స్మరియించుచుంటి. నీ
మంతన మే నెఱుంగ నిక మత్కృషి నీకయియే ఫలింప న
న్నింత పరీక్ష సేయదగునే కరుణింపు సుధార్ద్రదృక్కులన్.

నీవు కృపాంబురాశి వవి నిత్యము భక్తులు కొల్తురి: కాని నీ
భావము వా రెఱుంగుదురె। పాన్పున శ్రీసతి పాదసేవలన్
పై వివశంబు గాగ నిను నమ్మిన వారిఁ దలంప వంచు పృ
థ్వీవలయంబునన్ గలిగె దేవ। యపప్రథ యాలకించితో।

నీ కృపావిశేషమ్మె యనీదృశంబు
మాటిమాటికి వచ్చి నిజా మందలింతుఁ
బలుకకుండిన నే నేమి పలుపువాఁడఁ
దలతు నీకర్మ మింతని పలుకరింప
నింక కావ్యప్రసక్తితో నీరజాక్ష।

# నివేదన!

శ్రీ "కొప్పెర్ల"



పరమాణువు మొదలు ప్రాణుల నన్నింటఁ జేరి బూటకములఁ జేయు టేమి!
జీవరాసుల నెల్ల సృష్టించి పాలించి పిమ్మట లయము గావించు టేమి!
కష్టసుఖమ్ములఁ గావడికుండలఁ గావించి సంతృప్తిఁ గాంచు టేమి!
శిష్టరక్షణ దుష్టశిక్షణ మొనరించి తెలియని లీలగా మెలఁగు టేమి!
ఎన్నిమారులు చూచిన నేమి టయ్యా! అర్థమేకాదు నీ పరమార్థ మేమొ!
రమ్మ- తెల్పుము- నా కింక రాశిఫలము నాదు జీవితయాత్ర నీ పాదయాత్ర!!

ప్రకృతి కెల్ల మనోజ్ఞవర్ణసంపద నింపి సొంపును గూర్చిన శోభ నీది;
మొగ్గను విరియించి నిగ్గుజగ్గు లిడి; తేనియల నందించిన నేర్పు నీది;
తేనెల మధురంపుసోనల నూరించిభృంగాల మురిపించు విందు నీది;
పలికిన పదముల వల్లింప గల శక్తి చిలుకల కిడిన కౌశలము నీది;
అంతియే కాదు నీలోన నంతు లేదు అన్నిటికి నీవె! కారణ మైతి వయ్య!
చాలు చాలిక నీయాట సాంబమూర్తి! కరుణచూడుము మాపైన కాలకంఠ!!

కమనీయరమణీయకవితను జెప్పిన నన్నయ్య మాయింట నడచినాఁడు,
ఘనమైన కందాలు మనసార పలికిన తిక్కన్న మాయింటఁ దిరిగినాఁడు,
మందారమకరందమాధుర్య మొసగిన పోతన్న మాయింటఁ బుట్టినాఁడు,
ప్రభువులమెప్పులు పలుమారు పొందిన పెద్దన్న మాయింటఁ బెరిగినాఁడు,
వాణియే రాణిగా నెంచి పల్కినట్టి వీరభద్రుండు మాయింటఁ బేరుపొందె;
మధురకవు లెంతో ముదమున మసలినారు; అంతియేకాదు మాయింట నంతు లేదు.

బాలచంద్రునికత్తిపదును కోరలుచాచి మెఱయుచు మాయింట మెలఁగుచుండె;
రుద్రమ్మశౌర్యాగ్ని భద్రమ్ముగా వెల్గిదివ్వెయై మాయింటఁ దిరుగుచుండె;
వీరబొబ్బిలివారు పారబోసిన రక్తమీనాఁడు మాయింట మిగిలియుండె
సర్వాయిపాపన్న చల్లిపోయిన శక్తి యరుణకాంతులతోడ నలరుచుండె;
అంతియేకాదు మాయింట నంతులేదు; ఖడ్గతిక్కన బట్టిన కఱుకకత్తి
తాండ్రపాపయ్యబొడ్డున తళుకుబాకు కృష్ణరాయలు పొందిన కీర్తికూడ!!

మీసలన్ ద్రిప్పుకొందును బాస లెన్నొ పలుకుచుందును, మాయింటి వైభవంబు
జెప్పుకొందును, మావారిగొప్పతనము మోసికొనివచ్చి మాయింటఁ బోసికొందు!-

# పల్లె పట్టు సంధ్య

శ్రీ పాకేలు తిమ్మారెడ్డి



పసుపు కుంకుమమ్ము పట్టించి నట్టుల
పశ్చిమమున నెఱ్ఱవారె నభము
తపనుఁడొప్పెఁ జూడఁ దప్త మయఃపిండ
మట్లు చరమవార్ధియందుఁ జేరి.

పీఠి బడి పీఠఁ గేకలు వేసికొనుచు
జారిపడు పుస్తకమ్ములు సరుదుకొనుచుఁ
బారుచుండిరి యష్టహాషారుగా బ
జారులందున పిల్లలు సంతసమున.

రచ్చక ట్టెక్కి లోకాభిరామచరిత
వినుచుఁ జెప్పఁచునుండిరి వృద్ధజనులు
కన్నమూఁతలు చెడుగుడుల్ కట్టెచెండు
లుప్పుటాటలకై బాలు రురికి రపుడు.

కలకల మని పిత్సంత
మ్ములు రొద సేయుచును వసథములకై పారెన్
గలగల మని ఘుర్ఘరిరవ
ములను బశూత్కారము లింటి మొగమై వచ్చెన్.

పొలముల సేద్యముల్ ముగియఁ
బ్రొద్దయిపోయెను నేఁ డటంచుఁ గా
పులును గొటారువేసి యిఁకఁ
బొమ్మని యెద్దుల కానవెట్టి ది
క్కులు పరికిం చొకరి
కొక్కరు సుద్దులు జెప్పికొంచుఁ బి
ల్లల ముఖదర్శనోత్సుకత
తొందరవెట్టఁగఁ జేరి రిండ్లకున్.

గుంపులు గట్టి యొండొరులు
కొట్టుకులాడుచు మేలమాడు కొం
చింపుగఁ గోన మారుపలు
కీన్నఁగ వేణువు నూదికొంచుఁ గా
వింపుచుఁ గోతిచేష్టలు ప్ర
వీణతఁ బోతుల నెక్కి స్వారిగా
వింపుచు గోపబాలకులు
వెన్కయి క్రేఁపులఁ గట్ట రిండ్లలోన్.

క్రేఁపు లంబా యటంచును గ్రేళ్ళురుకుచు
నెదురుగా వచ్చి తల్లుల నిలువరించె
నంత వాత్సల్యభరమున నాల్గు చనులు
చేఁపి పాలిచ్చె నాకుచు మూపు లపుడు.

మంజీరమ్ములు ఘల్లుఘల్లు రనఁగా
మందాక్షభారాలసల్
పుంజీభూతజగన్మనోహరలు ద్రా
వుం గ్రేఁపులే పాలటం
చుం జారంగఁ బయోధరావరణముల్
సూనాస్త్రిబాణమ్ము లా
సంజం బారిరి పట్టి క్రేఁపులను గుం
జన్ గట్టిగన్ గట్టఁగన్.

అడవికి నేఁగి యిండ్లకపు
డప్పుడె వచ్చి కొటారు దింపకే
బడతులఁ గాంచి యే మిది వి
పర్యయ మేగతి నేర్చునో గదా!
నడువఁగ మాధవీలతలు
నాఁ గనుసంభ్రమచిత్తు లౌచు నే
ర్పడ మఱి కొంత సేపటికిఁ
గ్రక్కున వారు కొటారు దింపఁగన్.

కొంతులఁ గాంచి సిగ్గున మొ
గ మ్మొకయించుకఁ వంచి ప్రక్కకున్
గెంతివ పయ్యెదన్ జనులఁ
గీల్కొనఁ జేయుచుఁ గెంపు కాఁగ నా

క్కాంత మొగమ్ము హాసమునఁ
        గ్రేఁపుల నీడ్చుచు లోని కేఁగి ర
క్కాంతలు నిర్నిమేషముగఁ
        గాంచుచు నిల్చిరి వారిభర్తలున్.

శిరములఁ జంకలందునను
        జేర్చుక బిందెలు కుమ్ము సుద్దులన్
జరుపుచుఁ జన్నువ్రేగునకు
        సన్నని కౌ నురియాడ వేనలిం
దరిమిన మల్లెపూవులు సు
        దూరము గుప్పుమనంగ వీథులఁ
దరుణులు సోయగమ్మున కె
        దన్ దము మెచ్చఁగఁ జేరి రిండ్లకున్.

కాడి విడిచి నీరము ద్రాపి గాటఁ గట్టి
చొప్ప యొక్కింత వయిచి విశుద్ధచరిత
కాంతయొక చెంబుతో నీరు కాళ్ళగడుగఁ
దెచ్చి యీ నోరచూపులఁ బుచ్చికొనుచు.

తనకుఁ దినంగ నేమయినఁ
        దాఁ గొనివచ్చెనొ నాన్న యంచుఁ గా
ళ్ళను జెనవైచి ముద్దుగను
        "లాకును బండ్ల"ని గోము సేయు పు
త్త్రికకును రేఁగులన్ గళివి
        దుంపురులున్ బలుసత్తి నేరెడుల్
దిన నిడి విచ్చుమోముఁ గని
        తృప్తిగ ముద్దిడు ప్రేమమూర్తియై.

సజ్జకొట్టైమీఁద జంద్రుని హసియించు
వెన్నముద్ద యింత పెట్టి తల్లి
తెచ్చి యీయ దానిఁ దిని రేపు కూలీల
కొఱకు నూరు వెదుకఁ బఱచె నతఁడు.

గుడిలో నాముదపు ప్రమిద
నిడి పూజరి యేఁగెఁ గంబ మెక్కిరి; పిల్లల్
చెడ మ్రోయించిరి గంటలు
గడబడ నొక పెద్దరభస గావించి రొగిన్.

కాంతు నాగమనము కాంక్షించి యామినీ
కాంత యపుడు తనదుకనులఁ దీర్చు
కజ్జలంపు నీలికాంతి చిమ్మినయటు
లిరులు జగతి యందు విరిసికొనియె–

[ 'మాయూరు' నుండి ]

# శ్రీ రామ సాహి

## శ్రీ పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు

"కూజంతం రామరామేతి
మధురం మధురాక్షరమ్
ఆరుహ్య కవితాశాఖాం
వందే వాల్మీకికోకిలమ్."

రామాయణము - వాల్మీకి

"శ్లోకంబుల్ శతకోటిఁ గాండములుగా
సూత్రించి రామాయణం
బ్బేకై కాతుర మెల్ల పాపముల మా
యింపంగ నిర్మించి సు
శ్లోకుం డైన పురాణసంయమివ
రుఁగా జూతు న్మనోవీథి వా
ల్మీకిన్ బ్రహ్మపదావతీర్ణ కవితా
లీలావతీవల్లభున్!"

**వాల్మీకిమహర్షి:** వాల్మీకి మహాకవి: సంస్కృతమున నాది కావ్య మని ప్రసిద్ధిఁజెందిన శ్రీమద్రామాయణమును రచించిన సుశ్లోకుఁడు. రామాయణ మాదికావ్య మగుటయే కాదు; అయ్యది యుత్తమోత్తమకావ్యముకూడ. అది రామునిగూర్చిన గాథ; అంతియే కాదు: అది రమణీయమైన ఫణితిలోఁ జెప్పఁబడినది. రాముఁడు తెలుఁగులకు దైవము. ఒక్క తెలుఁగులకే యననేల? భారతీయులకెల్ల రాముఁ డవతారపురుషుఁడుగా నారాధ్యుఁడే! లోకసంగ్రహార్థము భగవానుఁ డవతారములఁదాల్చి దుష్టశిక్షణ మొనర్చి శిష్టుల రక్షించుచుండును.

పరిత్రాణాయ సాధూనాం
వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే.

అట్లు త్రేతాయుగమున నవతరించిన మహాత్ముఁడు శ్రీరామచంద్రుఁడు. అమ్మహనీయుని చరితమును "పాఠ్యే గేయే చ మధురమ్" అని ప్రఖ్యాతి వడసినవిధమున వాల్మీకి సుప్రసన్నగంభీరకవితాశైలిలో రచించెను. ఈకావ్యరచనముచే వాల్మీకికి యశస్సు చేకూరిన దని తెలుపుటవలన నాకావ్యప్రయోజనము తీరినట్లు కాదు. దానిని పఠించినవారు నిశ్శ్రేయసమును పొందుదు రన్న విశ్వాసము భారతీయహృదయము. శ్రీరామసాహిత్యసంపద్విలసితమై భారతీయ సంస్కృతి మహనీయమైనది. రామకథనిమిత్తముగా లోకవృత్తమును చిత్రించినదై రామాయణము సాహిత్యప్రధానలక్షణమైన హితబోధ గావించుచు విశిష్టమైన విజ్ఞానమున అనశ్వరమైన ఆనందమును ప్రసాదించుచున్నది. వాల్మీకి రామాయణ మొక మహాకావ్యము. రామాయణము వేదోపబృంహణము. వేదము రామాయణరూపమును దాల్చినదని తాత్పర్య బుద్ధికలవారు గనుకనే -

'వేదవేద్యే పరే పుంసి
జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీ
త్సాక్షా ద్రామాయణాత్మనా'

అని సంభావించుట జరిగినది. సంస్కృతమున నాదికవియైన వాల్మీకి ప్రథితకవిధీరులు పలువురచేఁ గీర్తనీయుఁ డైనాఁడు. కాళిదాసమహాకవి "సకృతిం గాపయామాస కవిః ప్రథమపద్ధతిమ్" అనియు, భవభూతికవి "అథ భగవాన్ప్రాచేతసః ప్రథమం మనుష్యేషు శబ్దబ్రహ్మణం తాదృశం వివర్త

మితి హాసం రామాయణం ప్రణినాయ" అనియు శ్లాఘించినారు. 'ప్రథమకవితా విరచనవిద్యావిలాసాతిరేకి వాల్మీకి' అని పోతన నుతియించినాఁడు;

"ఏమని తృప్తిం జెందెదు
రాముని చరితామృతౌఘరసపానముచే
నాముని ననఘుని వరగుణ
ధాముని వాల్మీకిఁ గొల్తుఁ దాపసముఖ్యున్".

అని భాస్కరరామాయణమునందలిస్తుతి :

కావ్యము - పురుషార్థసాధనము

కావ్యము విశ్వశ్రేయమును గూర్చునట్టిది; లోకకల్యాణమును జేకూర్చునది; ఆనందమును గల్గించి హితమును ప్రబోధించునది; ఇష్టార్థమును లేక రమణీయార్థమును ప్రతిపాదించి రంజిల జేయునది; సత్యమును దెల్పి దానియం దభిరతినిఁ గల్గించునది; శివేతరమునుండి తప్పించునది; సౌందర్యదిదృక్షువులఁ గావించునది; జిజ్ఞాసుల నొనరించి ముముక్షువులను రసానందమును గల్గించునది.

రసానందకల్పనమునకు 'వాగర్థములు' సాధనములు. వాగర్థప్రణయము సుకుమారము సున్నితము నైనది. అయ్యది పార్వతీపరమేశ్వరప్రణయమువలెఁ బవిత్రము నైనది. ఓంకారస్వరూపుని ననహంకారమతులమై యిరుతెఱఁగుల నుపాసించి చేరఁగలము. ఒకటి శబ్దబ్రహ్మోపాసనము. నాదబ్రహ్మోపాసనము మఱియొకటి. ఈయుపాసనమునకుఁ ద్రికరణముల శుద్ధి యత్యావశ్యకము — మనోవాక్కర్మల యందు మానవుఁడు తాను శుచినొప్పఁజేసి కొనవలెను. ఈ ప్రపంచమువలె శరీరముకూడ పంచభూతాత్మక మైనదని (పృథివ్యప్తేజోవాయురాకాశములు) యెఱుంగవలెను. చిత్తశుద్ధి ఇంద్రియనిగ్రహము లన్నవి సాధకులకు వలసిన ప్రధానాంగములు. పుణ్యమును గాని పురుషార్థమును గాని యార్జించుటకు యోగ మావశ్యకము చిత్తైకాగ్రత యోగమునకుఁ బ్రథమసోపానము. ధర్మార్థకామమోక్షములు చతుర్విధములైన పురుషార్థములు. అర్థకామములు నిమిత్తమాత్రములై ధర్మప్రవణము మోక్షోన్ముఖము నైన తటి జీవియంతఃకరణము నిర్మలము నిశ్చలము నగు సరస్సువలె దర్శనమునకు యోగ్యమైనది కాఁగలదు."

భారతీయసంస్కృతి - వైలక్షణ్యము :

భారతీయసంస్కృతి యాధ్యాత్మికసంబంధియై విశిష్టమైనది; జన్మసిద్ధాంతముచేఁ బృథక్త్వము గలది; పుణ్యాపాపముల వివేచనముతోడను, విగ్రహారాధనము పూజాదికముతోడను విలక్షణమైనది. బుద్ధిబలముకన్న హృదయసంస్కారము వాంఛనీయము. భూతదయ సకలసృష్టియందును భగవానుని దర్శించుట, పరహితపరోపకారపరాయణత్వము, ఉత్తమసంస్కృతిలక్షణము లగును. పవిత్రజీవులగాథలు మన కావేశకారణములు. మన పురాణేతిహాసకావ్యము లట్టివి.

Mythology and holy figures are necessary for any great culture to rest on its stable spiritual foundation and function as a life giving inspiration and guide—Rajagopalachari.

భారత రామాయణ భాగవతములు, అష్టాదశపురాణములు - సంస్కృతమున వెలసిన సాహిత్య మంతయు నుపలక్షించునట్టిది ఈ యుత్తమసంస్కృతినే — కావ్యము ఆదర్శనాయకచరితమై యుత్తమోపదేశము నిచ్చునదగును. ధార్మికజీవితవిధానమును బోధించు నుత్తమకావ్యము రామాయణము.

వేదప్రామాణ్యము గల్గిన యుపనిషన్మతము సర్వోత్కృష్టమైనది. భారతశరీరమునందు హృదయస్థానమాక్రమించునది "భగవద్గీత". అధ్యాత్మరామాయణమున రామగీతలు కూడ సనాతనధర్మప్రబోధ మొనర్పజాలినవి. ఇహలోకము నిమిత్తమాత్ర మనియు, శరీరము నశ్వర మనియు, జాతస్య మరణం ధ్రువ మ్మనియు, 'ఆత్మ' స్థిరము — అచలము - సనాతన మనియు, 'శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్' నియు, అదృష్టమైన యనంతరజీవితము కర్మఫలమనియు, నిష్కామకర్మ కరణీయ మనియు, 'సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ' యని భగవానుఁడాదేశించినట్లు చరించుట శ్రేయమనియు, భారతీయులకుఁ బ్రత్యేకముగా బోధింపనక్కరలేకయే వారిరక్తమున జీర్ణించినట్టి భావములై తనరారుచున్నట్టివి.

జననమరణములగూర్చిన జిజ్ఞాస యొకవిధముగ భారతీయుల ప్రవర్తనముపైఁ బ్రభావము నెరపుచున్న దనవలెను.

«వాసాంసి జీర్ణాని యథా విహాయ, తథా శరీరాణి విహాయ» యని భగవద్గీతలోఁ జెప్పఁబడినట్లు ఆత్మ బహుశరీరములఁ దాల్పఁదగిన శాశ్వతవస్తువు. ఆత్మను శస్త్రములు ఛేదింపజాలవు; అగ్ని కాల్పజాలదు; ఉదకము తడుపజాలవు; గాలి శోషింపజేయలేదు. ఆత్మ అనశ్వరమైనది! భారతీయతత్త్వ మీఆత్మజిజ్ఞాసతో గూడినట్టిది.

ఋషితుల్యుఁడైన కవి తనకావ్యవాఙ్మయములోఁ బ్రసక్తానుప్రసక్తముగా నాధ్యాత్మికతత్త్వమును విశ్వసత్యములను కాంతవలె లలితముగను వ్యంగ్యముగను నుపదేశింపఁబూనుకొనును. కావ్యమున నాయికానాయకు లాలంబనవిభావములు; ఆనాయికానాయకులును విలక్షణలక్షణోపేతులైన యాదర్శశీలురై యుప్పారి ఋజువర్తనమునకు సత్తమోదాహరణములై నిలుతురు. పలుకులలో, ప్రవర్తనములలో నంతట నాదర్శశీలము నే ప్రబోధించువారలై యొప్పుదురు అట్టి యాదర్శదంపతులే సీతారాములు. ఇట్టి యుత్తమనాయికానాయకులే రామాయణమహాకావ్యప్రశస్తికిఁ గారణభూతులు. ఇట్లు భారతీయసంస్కృతిని ప్రబోధించు నుత్తమకావ్యము రామాయణము. అందలి వివిధాంశముల నింకఁ జూతము :

*శ్రీరాముఁడు - నాయకమణి*

శ్రీరాముఁ డాదర్శపురుషుఁడు రామాయణ కావ్యనాయకాగ్రణి - పుత్త్రుఁడుగా, భర్తగా, శిష్యుఁడుగా, వీరుఁడుగా, రాజుగా నెట్లెట్లు సర్వజనామోదావహమౌ శీలము గల్గియుండెనో గ్రహించిన శ్రీరాముఁడు లోకోత్తరపురుషుఁ డని వ్యక్తము కాఁగలదు. «పౌరుషము పితృభక్తి, జనానురాగము, క్షాంతి, కారుణ్యము మున్నగు లోకోత్తరంబు లగుగుణముల కాకరంబైన శ్రీరాముం బోలు పురుషోత్తముం డను మఱి యొక్కరుండు లేఁడనుట సర్వజనవిదితము». ఈక్రింద నుదాహరించిన రాముని గుణగణముల నారయునది :

శ్రీరాముఁడు ధీరోదాత్తుఁడైన నాయకుఁడు. పితృవాక్యపరిపాలనాదక్షుఁడు - గురుభక్తియుతుఁడు. సత్యవ్రతుఁడు. ధర్మజ్ఞుఁడు, అచలసంకల్పుఁడు. సదాచారసంపన్నుఁడు. సర్వశాస్త్రజ్ఞుఁడు - సర్వకార్యధురంధరుఁడు. ప్రియదర్శనుఁడు - పరాక్రమశాలి - ధైర్యోపేతుఁడు - అసూయక్రోధము లెఱుఁగనివాఁడు. యుద్ధకుశలుఁడు. శత్రునిబర్హణుఁడు - శరణాగతవత్సలుఁడు - ఏకపత్నీవ్రతుఁడు - ప్రజానురంజనుఁడు నియతాత్ముఁడు - పరనిందాసహిష్ణుత - పరస్త్రీపరాఙ్ముఖత్వము - సోదరప్రీతి - స్వార్థనివృత్తి రాముని లోకోత్తరునిఁ జేయుచున్న గుణములు - ఇవియన్నియు ప్రజలయేలికలగు నాయకు లవలంబింప దగిన గుణశీలములు కాగలవని సూచనము ఆదర్శనాయకుఁ డనుకార్యుఁడు గదా! అనూచానముగ భారతీయ గృహములలో బాలురెల్లరకు శ్రీరాముని నాదర్శపురుషునిగాఁ బెద్దలైన యొజ్జలు, పితరులు చూపుచుండుట తరతరములుగ వచ్చుచున్న యాచారమే సుమా. పితరుల దేవులభంగి పూజించుచు సగౌరవముగా వారి యభిలాషానుసారము వర్తించు కుమారు లెందఱుందురు? అందున నరణ్యవాసక్లేశము ననుభవింప నుద్యుక్తుఁడౌనా, కలవారిబిడ్డఁడు కైకమ్మతల్లికిఁ దనతండ్రి దశరథావనీశుఁ డొసఁగిన వరము నందలి యసామంజస్యమును వితర్కింపఁడు; కైకమ్మను పల్లెత్తుమాట యైన నాడి దూషింపఁడుగదా!

*సీత - సహధర్మచారిణి*

రామునిసౌజన్యమునకు సీతపాతివ్రత్యము బంగారమునకుఁ దావి యబ్బినట్లై కీర్తనీయమైనది. సహధర్మచారిణియై భార్య భర్తకుఁ బురుషార్థసాధనములో దోడ్పడునది యని భారతీయసంప్రదాయము బోధించును. మఱి జానకి పతివ్రతలకు శిరోలంకారమై భాసించుభవ్యచరిత సుమా! "క్షాంతి, దయ, సౌశీల్యము, మున్నగు సుగుణంబులచే విలసిల్లి సకలపతివ్రతాజనతాలంకారంబై యొప్పు లోకమాత సీతంబోలు సతీరత్నంబు" కానరాదు.

లోకోత్తరుఁడైన రాముని గుణగణములను గ్రహించియుంటిమిగదా; నాయకునిశీలమునకు వన్నె తేజాలినది పరమపతివ్రతాశిఖామణి సీతసౌశీల్యము. సౌఖ్యమందుగాక కష్టములందుఁ బొడగట్టునేది శీలమైన- కానల కేగినపుడు తొలుత (కైకవరమున ననుసరించి) రామలక్ష్మణులుండుటచే నామెకుఁ బరీక్షాసమయము కాలేదు. అయినను దనంతట తాను పతియరణ్యములకేగుచుండ నాతనితోడిదే లోకమని తా నాతని ననుగమించుట ప్రశంసనీయము. లోకనిందకుఁ

నుండి రాముఁడు జానకిని లక్ష్మణుచే విపినంబుల డించి రమ్మని పంపినపుడు జానకి విలపించినభంగి హృదయద్రావకమైనది. ఆవియోగము భరింపఁజాలనిదై జానకి వితర్కించుకొన్న తీరులో నామె సౌశీల్యము పొడగట్టును; గంగ దాటించి లక్ష్మణుఁడు సీతకు రామాజ్ఞం దెల్పి మిక్కిలిగా విచారించుచుండ «అల్లల్ల నతని వచనము లెల్లన్ విని, మొదలు నఱుక నించుకవడిలోఁ ద్రెళ్ళెడి కదళికవలె హా! తల్లీ! యని బిట్టు సొరిగి ధరపైఁ బడియెన్". అప్పటి సీతాదేవిదైన్యమును కరుణారసము పరాకోటికి దీసికొనివెళ్ళి వర్ణించిన పాపరాజకవి చిత్రణమే చిత్రణము. సీతచరితమును గాపాడినవిధము జూతుడు- «ఆడలకు మన్న నీకు విబుధాధిపు నానతి దాటవచ్చునే? యి కుమలఁ జెందుమంచు విధి యాథ? నన్ను సృజించి యుండగా గడువగ నెవ్వ రోపుదురు? ఆశ్రమవాటికలజూడఁ దలంపు గల్గి విభుని తాను కోరుటకూడ "ఈదుఃఖము లాపాదింప విధి తలంచి యుం"డుటవల్లనే కదా! అనుచున్న సాధ్వి సీత మానవాతీతమైన విధి బలీయమని విశ్వసించినది. "ఎడపక పూర్వజన్మమున నేమిధువంబులఁ బాయఁజేసి వారడలగ నవ్వుచుండితివో? యీ యఘ మూరకపోనె?" అను పుణ్యాపాపములగూర్చియుఁ బూర్వజన్మకృతపాపమును గూర్చియు తలపోసి భారతీయసంస్కృతీపరములైన మూలసూత్రములఁ బ్రస్తావించిన దాయెను.

పూర్వరామాయణమున సీతను రావణుఁడు చెఱబట్టి లంకలో నశోకవనమున నుంచిన సందర్భ మొక ఘోర పరీక్షాసమయము. అచటిసీత అగ్నిపరీక్షలో నెగ్గిన నిష్కలంకశీల. ఆనాఁటివియోగము రామునిశత్రువు కల్పించినది. కాని యుత్తరరామాయణమున రాముఁడే స్వయముగ గల్పించినది. కావుననే సీత నిస్పృహ జెంది—

'పతి మతి నెంచ నేమొ? తను
బాసి యశోకవనంబులోపలన్
బ్రతుకదె పెక్కునాళ్ళనుచుఁ
గ్రమ్మఱఁ దాఁ జనుదెంచు, శత్రునిన్
హతునిగఁ జేయు; నేలు నన
నాసగదా బ్రతికించె నాఁటి కా
గతి నిఁక నేమి యూసగొని
కాయము నిల్పుదుఁ దెల్పు మిప్పియున్.'

అయినను మది చిక్కబట్టుకొని తనభర్తకు వచ్చిన యపవాదమును దనయపవాదముగా గ్రహించి «రాము జననిందితుఁ జేయుదునే" అని వితర్కించి 'తదాజ్ఞ యెల్ల గతులఁ బూని కావల మెలంగుదు మేనుగలంతకాలమున్' అని నిశ్చయించి, యతని సాగనంపుచు సీత లక్ష్మణునితో "తలఁప నాకేమగదయును దానెయగును; బావ మెప్పును దనమూర్తిఁ బాయదనుము; నెమ్మి యొకయింత నామీఁద నిల్పుమనుము" అని పల్కిన వాక్యములలో కష్టసహిష్ణుత పాతివ్రత్యము లెట్లు గోచరించుచున్నవో యూహింపవచ్చును ఆమె యుత్తమసాధ్వీత్వమును ప్రకటింపజాలిన ఘట్టము లామె వియోగసందర్భములే. సీత ఆదర్శగుణోపేత! భారతనారీమణులకు నారాధ్యచరిత. ఆమె 'సౌశీల్యమిల్లాండ్రకెల్లను మేల్బంతి."

భరతుని భ్రాతృభక్తి :

రామాయణపాత్రలలో దేని కదె విశిష్టమై గుణపాత్రమును ప్రబోధించునదే. అయినను సీతారాములయనంతరము భరతునిసౌశీల్యము మకుటాయమానమైనది. భ్రాతృభక్తికి భరతునిశీలమే యాదర్శము. అనవరతము ప్రక్కనుండి సంసేవ లొనర్చిన లక్ష్మణునిఁ దలఁదన్నిన గుణసంపత్తికలవాఁడు భరతుఁడు. ఇయ్యది 'పాదుకాపట్టాభిషేక' ఘట్టమునఁ దెల్లము కాగలదు. భరతుని ప్రముఖముగా భాసింపఁజేయు సన్నివేశ మది.

కైక దశరథావనీశుని రెండువరములఁ గోరియుండెను. శ్రీరాముని పదునాల్గువత్సరము లరణ్యవాసము జేయువనుచుట యొకటి; భరతునకుఁ బట్టముగట్టుట మఱియొకటి. సత్యమును బాలించుటకై దశరథుఁడు కైక యడిగినవరముల నొసంగెను. జానకీ లక్ష్మణోపేతుఁ డగుచుఁ దండ్రి యానతిని శిరసావహించి రాఘవుఁడు విపినంబులకుఁ బోయెను. అయోధ్యానగరము రామవిరహిత మగుట శోభావిహీనమై దశరథుని మనస్తాపహేతు వైనది. పుత్త్రవిరహముచే దశరథుఁడు కృశించి మృతినొందెను.

మేనమామలయింట నున్న భరతుని నయోధ్యకు రప్పిం

నటకై సత్వరమంత్రులను వశిష్ఠుఁడు పంపెను.

భరతుఁ డంతట నయోధ్యఁ జేరంచి తల్లికి నమస్కరించి నగరేల శూన్యముగా నున్నదని యామెను ప్రశ్నించెను. కైక తనకుమారునకు జరిగినదంతయును జెప్పె రాముఁ డడవుల కేఁగినట్లును దశరథుఁడు నిర్యాణ మొందినట్లు నెఱిఁగించి యాయుత్తునకు తానే కారణమగుటకు విచారింపఁ గొనఁగెను.

భరతుఁ డీవిషయములను వినినంతనే మూర్ఛితుఁ డాయెను. 'కనుగొన నిప్పులు రాల' తల్లిపై మిక్కిలి కోప పడుచుఁ గొనెను. «రామునిఁ గాంతారమునకుఁ బనుపఁగా నోరెట్లాడె నీకు» అనియు, రాముఁడు జటాజినములు ధరించియుండఁ దా నెట్లు భోగముల ననుభవింతు ననియు, «పాపపుం గడుపునఁ బుట్టి పనవిన్నాఁడఁ బాతుకుఁడ నైతి ననియు» ఘోరముగ బాధించి తల్లిని «నీచమతి! ఏమి చేసితి» వనియు, 'రాక్షసీ!' యనియు, 'పాపజాతి' వనియు, 'పతిహంత్రి' వనియు నేవిధముల దూషించెను; స్వార్థమతి యైన తల్లియెడల గర్హ్యమును, పితృవాక్యపరిపాలనాపేక్షుఁడును, జనానురంజకుఁడైన రామునియెడల గల గౌరవమును ధర్మముపైఁగల ప్రామాణికబుద్ధిని ప్రకటించినాఁడు భరతుఁడు.

శత్రుఘ్నుఁడు రోషావిష్టుఁడై యట నున్న వారందఱిపై ముఖ్యముగ కైకపయి గదిసిన తఱి, భరతుఁడు వానిని వారించి తన సజ్జనత్వమును ప్రకటించెను. కౌసల్యతో రామునకు ద్రోహినైతి నేని, అభిషేకలక్ష్మి కాశ చేసితి నేని, కైక గావించిన కపటకర్మవిధ మ్మెఱిఁగితి నేని నీచులగతికి పోదునని శపథమూనిన భరతుఁ డార్జవశీలము గలవాఁడని యెఱిఁగించెను. ఏమరానునకు ద్రోహులనుగాముని దశరథుని కళేబరముపైఁ బడి రోదనము చేయుచున్న తఱి భరతుఁడు నిష్కపటియై కన్పించును.

దశరథుని తదనంతరవిధుల నిర్వర్తించిన పిమ్మట వశిష్ఠుం డరాజకమైయున్న రాష్ట్రమునకు కీడువాటిల్లును గనుక నింక పట్టము గట్టుకొను మని భరతునితోఁ జెప్ప నాతఁడు మిక్కిలిసముజ్జ్వల ధర్మమును జూడక యిట్లాడుట పాడియే యనియు, దుష్టాత్మ యైన కైకనందనుఁ డగుట తన్ను తన తప్పేమియు లేదనియుఁ దెల్పి తన యకళంక శీలమును బయలుపరచెను. శ్రీరామునకే పట్టము గట్టెద ననియు నతనికి రాకున్న దపోవేషములో నడవులయందుఁ దాను నిలచెద ననియు భరతుఁడు తనసంకల్పమును వెలిబుచ్చెను. సభాసదుల మన్నన ల్బడసిన సచ్ఛీలుఁడు భరతుఁడు.

తాను పల్లకీని సైన్యసమేతుఁడై తల్లులతో మంత్రులతో, పురోహితులతోఁ గూడి, రాముని నడవులనుండి కోడితెచ్చుటకై వెడలెను. మార్గమధ్యమున భరతుని నపార్థము జేసికొన్న గుహుఁ డరోషోక్తులను సస్మితాస్యుఁడగుచు రామునిఁ బట్టముగట్టబోయెదనుగాని ద్రోహిని గానని నచ్చఁజెప్పి యాతని నాశ్చర్యచకితుని గావించెను. అట్లే తదనంతరము భరద్వాజమునికిఁ గల్గిన యనుమానమును బోనాడి 'ద్రోహచింత నా మనమున లేదు» అని తెల్పెను.

రామానుజుని యనుమానమునకు సయితము గురియై భరతుఁడు పరోక్షమున రాముని ప్రశంసలకుఁ బాత్రుఁ డాయెను. రామునితమ్ముఁడైన లక్ష్మణుఁడు వినయశూన్యుఁడై భరతునిగూర్చి నీచోక్తు లాడినందులకు రాముని నోట లక్ష్మణుఁడు తిట్లను తినినాఁడు. «నీకంటె వాఁడు నాకు భక్తుండు» ఆయుత్తముని చిత్తవృత్తి నీ వెఱుంగవు అని రాముఁడు భరతునిగూర్చి లక్ష్మణునితోఁ బల్కిన వాక్యములు. ఇంతకన్న భరతుశీలము గూర్చి వేఱుగా మన మేమి వ్రాయవలెను! రామునిచలరించిన యనుజుఁడు భరతుఁ డదృష్టశాలి. తదనంతరము భరతుని ప్రవర్తనము రామునియూహలకు వ్యాఖ్యానమే యాయెను. «అయోధ్యాదయితత్వ మన్యులకు నర్హముగాదు; భువనభారము పూనను నేనుదెమ్ము ఆట్లుగాక తక్కిన నిదే మీ ముందట ప్రాయోపవేశము చేయుదును -» అని తెల్పిన భరతునికి రామునిపై గల గౌరవప్రపత్తులెట్టివో వెల్లడియగుచున్నవి గదా! అంతటి భక్తాగ్రేసరుఁడు భరతుఁడు. రామచంద్రుని వాత్సల్యమునకుఁ బాత్రుఁడై యాతనిపాదుకలను వశిష్ఠుని సూచన ననుసరించి గ్రహించి మస్తకమున నిడుకొని నందిగ్రామమున నయుతిర్భరతతో నిజాన్వయకీర్తిచంద్రిక లొప్ప భూప్రజాసుఖము లొనర్చుచుం గాలముబుచ్చె.

రామాయణమున భరతుఁ డిట్లు భ్రాతృభక్తికి నిదర్శనముగా నిలచిన యకలంకాత్ముఁడు. ఆదర్శజీవి. లోకము 'సీతవంటిభార్య'తోపాటు 'భరతునివంటి తమ్ముని' పడయుట మహాభాగ్య మని భావించునంతటి ఉత్తమచరిత్రుఁడై భరతుఁ డొప్పారుచున్నాఁడు. అన్నదమ్ములు గలయుంట భరతునిఁ గనఁగల్గితిమేని సుకృతులమే యనుకొందుము.

భృత్యులు - భక్తులు :

ఇంక రామునకు సేవ లొనర్చిన భక్తులలో బేర్పెన్నిక వహించిన మహానుభావులు సుగ్రీవుఁడు- హనుమంతుఁడు- విభీషణుఁడు- అను వారలు. స్వామిభక్తి కల్గి యెట్లు విశ్వాసపాత్రులై వీరు స్వామికార్యముల నిర్వహించిరో చూచిన వారికి నాశ్చర్యముల గొల్పుదురు. ఉదాత్తభక్తి జగద్విఖ్యాతమై యుదాహరణముగ నిలిచిపోయినదిగదా! ధర్మసంస్థాపనకార్యనిర్వహణములో నేపాటియైన సహాయపడుట యిందలి గుణపాఠము.

రామాయణమున సుందరకాండము ప్రాధాన్యము వహించి పుణ్యప్రద మైన దగుచున్నదని పారాయణ మొనర్చు చున్నవారి విశ్వాసము; అనుభవమును. ఈ సుందరకాండము హనుమంతుని దౌత్యముపై నాధారపడి యున్నది. హనుమంతుఁడు రామదూత.

మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్॥
వాతాత్మజం వానరయూథముఖ్యం।
శ్రీరామదూతం శిరసా నమామి॥

కాణ్డస్య సున్దరాఖ్యస్య శ్రవణాత్ పఠనాదపి
మాం ప్రాప్నుయా జగద్ధేతుం నాత్ర సందేహ ఇష్యతే.

ఉల్లఙ్ఘ్య సిన్ధోః సలిలం సలీలం
యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః
ఆదాయ తేనైవ దదాహ లఙ్కాం నమామి తం
ప్రాఞ్జలి రాఞ్జనేయమ్.'

హనుమంతుఁడు కాఞ్చనాద్రికమనీయవిగ్రహ మని వర్ణింపఁబడుటంజేసి సుందరవిగ్రహుఁడు వునసే సుందరకాణ్డ మను పేరువచ్చిన దని భావింపఁదగును :

'ఈశ్వర తేజమునన్ జనించి వి
ష్ణువౌ హృదయంబుగాఁ గల న
నోజవమారుతతుల్యవేగుడన్
నవమదనాభిరాముఁడను
నవ్వగు విన్నకోలందిఁ గోఁతినే
యవునెడ నాదుపేర నెట్టు
లయ్యెను సుందరకాండ మట్టులన్.'

—పంచవటి.

'సేవాపరాయణత్వమునకుఁ బరోపకారమ్మునకు స్వామిభక్తికి, పరాకాష్ఠ హనుమంతునిపాత్ర - వినయమునకు వినయము, శౌర్యమునకు శౌర్యమును దాల్చిన యద్భుతగుణశీలము వాతనియందుఁ గానఁగల్గుదుము. సీతకు రాముని సందేశమును తెలియజెప్పుటలో హనుమంతునివ్యక్తిత్వ మతిలోకసుందరమై పొడగట్టును. అంతటి విశ్వాసపాత్రుఁడైన భక్తుఁడు మఱొకఁడు గానరాడు.

ఇట్లు ప్రధానముగా ననుసరింపఁదగిన యాదర్శనాయకుఁడు, ఉత్తమనాయిక, మహనీయసోదరుఁడు, మహాభక్తుఁడు గల రామాయణమును పఠించుటవలన ప్రాకృతులు ప్రాజ్ఞులు కాగలరు. ప్రసక్తానుప్రసక్తముగా ననేకేతర పాత్రలు, సందర్భములు లోకజ్ఞానమును గల్గించి సంస్కరింపజాలినవియుఁ గలవు; ఇహమును పరమును బడయఁజాలుటకు రామాయణపారాయణము నిత్యము నింటింట జరుగవలసియున్నది.'

## రామరాజ్యము :

ప్రజలు - అమాత్యులు

రామాయణకథ మూఁడుస్థలములు ప్రధానకేంద్రములుగా నడచినది. అయోధ్య, దండకారణ్యము, లంక లీకథకు రంగస్థలము లైనవి; 'రామరాజ్య మన్న సుసంపన్నము నానందమయము నైన రాజ్య మని యర్థ మొదవినది. రామాయణమున నా రాజ్యపరిపాలనమున ప్రజ లెట్లు వర్తిలిరో గ్రహింతము: ప్రసక్తానుప్రసక్తముగా రాజులవర్తనము

గూడఁ జేయుచుండెను. 'యథా రాజా తథా ప్రజా' అనిగదా యందురు.

రామాయణకాలమున ప్రభువులు బావులను, చెరువులను త్రవ్వించుచుండిరి; ఆలయములు, విద్యాలయములు స్థాపించి పోషించుచుండిరి; జితేంద్రియులై వారు తమనారీ సమేతులై ధర్మార్థకామముల ననుభవించుచుండిరి. కృతజ్ఞత చూపుట, యతిథిసత్కారము గావించుట, యడిగిన వానికి లేదనక యిచ్చుట యానాటి ప్రత్యేకతలు. రాష్ట్రమునందు - క్షామములు, చోరులు, వంచకులు, వ్యాధులు, కాముకులు, కిరాతులు, దుష్టసంకల్పులు కాక యా రామరాజ్యము శ్రేయోవంతముగా సుఖప్రదముగా నుండెను.

రామరాజ్యమందలి యమాత్యులెట్టివారై యుండిరో యరయుదము. వారు విద్యావినయసంపన్నులై యొప్పిరి. నీతికుశలురు, నియతేంద్రియత్వము గల బుద్ధిమంతులు వారు. శాస్త్రజ్ఞులైన పరాక్రమవంతులు మంత్రనైపుణ్యమున్నవారు. అకార్యాచరణమునకు వెరచినవారు, సహనమున్నవారు. ఎల్లప్పుడు హెచ్చరికతో (Alertness) నుండువారు. కొరకొరలాడక జనుల చిరునవ్వుతో సంభావించువారు. అనృతమాడరు. సర్వవ్యవహార సమర్థులు. మిత్రామిత్రభేదము లేదు. అపరాధిని శిక్షించుటలో 'తన–పర' అని భేదము పాటింపరు. బొక్కసము పెంచుట, సైనికాభివృద్ధి గావించుట తమ ధ్యేయములు. అన్నిటిని మించి నిశ్చయజ్ఞానమున్నవారు. కనుకనే రామరాజ్యము వర్ధిల్లినది.

*వ్యథలేని కథలేదు : క్రౌంచమిథునగాథ*

ఇట్టి యాదర్శదంపతులచరితము కావ్యముగా నాలపించిన వాల్మీకమునిపుంగవుల కావ్యావేశమును నొసంగినట్టిది యొకయపూర్వసన్నివేశము. తమసానదీతీరమున క్రీడాపరమైన క్రౌంచమిథునము నందు మగపిట్టను బోయఁ డొకఁడు గురిపెట్టి కొట్టిచంపెను. విరహాదోదూయమానమై విహంగము విహ్వలహృదయముతో దానిచుట్టును పరిభ్రమించుచు నాక్రోశించుచుండెను. ఈ దృశ్యము స్నానార్థమేతెంచిన వాల్మీకిని దుఃఖపరవశునిఁ గావించినది. ఆతనిశోకము కోపకారణమై యాకటికిని బోయకను తిట్టించినది. శ్లోకరూపమున జాలువారినది యా శుద్ధమునివాక్కు.

> మానిషాద ప్రతిష్ఠాం త్వ
> మగమ శ్శాశ్వతీస్సమాః
> యత్క్రౌంచమిథునా దేక
> మవధీః కామమోహితమ్.

ఈ కాంత ప్రాణిహింసాదర్శన సముద్భూత శోకోద్రేక వశమున నిట్లు ఛందోబద్ధముగాఁ బైకి దానంతట దా వెడలిన తన వాణికి కాశ్చర్యపడి యామునిసత్తముండు స్నానోత్థితుఁడై శిష్యునితోఁ దన యాశ్రమమునకుఁ బోయెను. దేవపూజాదికమును నిర్వర్తించి సుఖాసీనుఁడై యవశోత్పన్న శ్లోకమును గూర్చి చింతించుచుండ నింతలో బ్రహ్మ యరుదెంచి విచారము వలదని తెల్పి, తనసంకల్పముచేతనే సరస్వతి ప్రసరించినదని వివరించి, నారదునివలన వాల్మీకి వినిన శ్రీ రామకథను జగద్ధితార్థము లోకమునఁ బ్రకటింపవలసిన దని యుపదేశించి యంతర్హితుఁడాయెను. ఇది వాల్మీకిరామాయణప్రాదుర్భావసందర్భము! దైవచోదిత కార్యములు చోద్యములుగదా! వ్యథలేనిదే కథ లేదనుటకీ కావ్యసంసారమంతయుఁ దార్కాణమే!- కావుననే

"The sweetest songs are those that tell us the saddest tales." అనెడివాక్యము సత్యసమ్మతమనిపించుచున్నది.

బ్రహ్మదేవుఁడు పల్కినట్లే పర్వతము లున్నంతవఱకు నదులు ప్రవహించుచున్నంతవఱకు రామాయణము మానవుల పారాయణగ్రంథమై వారిపాపముల పోద్రోలుచుండు ననుట తథ్యము. రామాయణకావ్యమున రాముఁడు దివ్యాంశసంభూతుఁడైన మానవోత్తముఁడై భూమియందలి సుఖదుఃఖముల ననుభవించిన భూమిజాపుత్రుఁడై ధర్మసంస్థాపనార్థము కృషియొనర్చిన మహాత్ముఁడై విరాజిలుచున్నవాఁడు. వాల్మీకిమహర్షి రచనము గంభీరము; ప్రసన్నమును. మనోహరశబ్దములతో రమణీయశైలిలో సుసంగతములు నౌచితీసంపన్నములునైన వాక్యములను గేయఫణితినిఁ బొందించినాఁడు. అంతటి సులభసుందరమైన శైలి మఱొకసంస్కృతకావ్యమునఁ గానము.

సంస్కృతభాషయందే రామకథను దృశ్య శ్రవ్య కావ్యములుగా నవతరింపఁజేసిన కవు లనేకు లున్నారు. కాళిదాసు 'రఘువంశము' సుప్రసిద్ధమైనది; భవభూతి యుత్తరరామచరితమును దృశ్యకావ్యముగా నిబంధించి కీర్తనీయుఁ డాయెను. భాసుని ప్రతిమానాటకము మనోజ్ఞము, ప్రతిభావంతము నైనది. మురారి యనర్ఘరాఘవము, జయదేవుని ప్రసన్నరాఘవము జగత్ప్రసిద్ధకావ్యములు గదా! శక్తిభద్రుని ఆశ్చర్యచూడామణి నూత్నకల్పనాలతో విరాజిల్లుచున్న రామకథానాటకము; అద్భుతరస ప్రతిపాదక మైనది. ఇట్లు రామకథామృతము సంస్కృతమున గ్రోలిన మహనీయు లనేకులు తమ యద్భుతదర్శనము నితరుల శ్రేయస్సునిమిత్తమై మరల రమ్యకావ్యఘటనల నందఁజేసి ధన్యులై

లోకమున బహుభాషలలోనికి రామాయణకథ యనువదింపఁ బడిన దన్న వాల్మీకిరామాయణకావ్యప్రశస్తి వేఱుగఁ జెప్పఁబనిలేదు. బహుకావ్యప్రక్రియాఘటనల రూపొందిన రామాయణగాథ భారతీయులజీవితముల నిత్యము ప్రబోధింపఁజాలినదై వరలుచున్నది.

తెలుఁగులో —

రామకథాకావ్యములు :

మధురాతిమధురమైన తెలుఁగుభాషాస్రవంతిలో దోగాడిన రామాయణ మెట్లు తెలుఁగులకు సంసారాంబుధి నతిక్రమింపజాలిన తరణియై యొప్పారినదో యించుక చూతము.

ఆంధ్రభాషలోనికి రామాయణకథ ద్విపదలుగ, నిర్వచనకావ్యముగ, ప్రబంధముగ, కీర్తనలుగ, శతకములుగ వచనముగా (గ్రాంథికములోను. వ్యావహారికములోను), భజనగీతములుగ, ఖండకావ్యములుగ, స్త్రీలపాటలుగా, ననేకరూపములలో నవతరించి పండితపామరజనరంజనము పొందించినది. నన్నయభట్టునుండి నాఁటివఱకు నున్న యీ మధ్యకాలమునందనేకాంధ్రకవులు, కవయిత్రులు, రామాయణము నాలపించి చరితార్థులైనారు

మన మెఱిఁగినంతవఱకు ఆంధ్రమున ద్విపదలో వెలసిన 'రంగనాథరామాయణము' మొదటి యాంధ్రీకృతరామాయణము. తిక్కనామాత్యుఁడు నిర్వచనముగ, పద్యకావ్యముగా, రామాయణోత్తరభాగము ననువదించుట చూడ దీని కారణము రంగనాథరామాయణమునందు నాతనికాలము నకుఁ బూర్వభాగము వ్రాయఁబడియుండుటచే గావచ్చును. కాచవిభుఁడు, విఠలరాజు అను వారలు రంగనాథరామాయణోత్తరభాగమును రచియించినట్లు తెలియుచున్నది. గోన బుద్ధారెడ్డి పూర్వభాగమును రచించినాఁడని పరిశోధకపండితమతము. ఇది క్రీ. శ. పదమూఁడవశతాబ్దమునాఁటి స్థితి. తిక్కనసోమయాజి యనంతరము వచ్చిన ఎఱ్ఱాప్రగడ (14వ శతాబ్దము) రామాయణమును రచించినట్లు పింగళి సూరనపద్యము*వలనఁ దెలియవచ్చునేకాని యీ రామాయణమందలి పద్యములను లాక్షణికులును తరువాతకాలమున నుదాహరించుటయేకాని, ప్రత్యేకముగా నాతని రామాయణ మిప్పటికి లభింపలేదు. అటుపిమ్మట భాస్కరునిపేర రామాయణాంధ్రీకృతి వెలసినది. ఇయ్యది పుత్త్రునిసహాయముతోడను (మల్లికార్జునభట్టు)- శిష్యునిసహాయముతోడను (కుమారరుద్రదేవుఁడు) — మిత్త్రునిసహాయముతోడను (అయ్యలార్యుఁడు) భాస్కరుఁడు (అరణ్యయుద్ధకాండములను తాను దెలిగించి) నిర్వహించినాఁడు. పదునేనవశతాబ్దమున రామభక్తాగ్రణియైన పోతనామాత్యుఁడు భాగవతము నాంధ్రీకరించుచు నేతదంతర్గత మైన "శ్రీరామచరిత్ర"మును (నవమస్కంధమున) ప్రసాదించెను. మృదుమధురశైలిలో పద్యనిర్వహణశిల్పముతో శబ్దాలంకారములతో నీశ్రీరామ

* ఏ యెడ నర్థగౌరవ సమృద్ధియు శబ్దవిశుద్ధియుం దిరం
బై యనవద్యతం బరగ నంధ్రవచస్స్థితి భారతంబు రా
మాయణము న్రచించిన మహాత్ముల నాత్మదలంచెదన్ జగ
ద్ధేయుల నన్నపార్యునిలను దిక్కయయజ్వను నెఱ్ఱసత్కవిన్. -రాఘవపాండవీయము

పెద్దిబుచ్చిసుందరరామశాస్త్రిగారి 'పంచవటి', గుడిమెళ్ల రామానుజాచార్యగారి 'శబరి', బులుసు వెంకటేశ్వర్లుగారి 'అహల్యాగౌతమము', పూడిపెద్ది ప్రజ్ఞాచార్యులవారి 'కైకేయీ సౌశీల్యము', గొట్టిముక్కల రామకృష్ణశాస్త్రిగారి 'శ్రావణుడు', పంగనామముల రామచంద్రరావుగారి 'ఋశ్యశృంగము' లఘుకావ్యములు; ఇయ్యది పాత్రచిత్రణకౌశలము ప్రకటించి సహృదయుల నలరించుచున్నవి.

రామభక్తాగ్రేసరులైన త్యాగరాజు, రామదాసులు సంకీర్తనములను రచించి, యాలపించి, రామనామమే తమకుపాయముగ, ప్రాణానిలముగా గ్రహించిన మహనీయులు. సాహిత్యముతోపాటు సంగీతమునకు వన్నెతెచ్చు రచనములు వారివి. పారమార్థికచింత పరతత్త్వనిరూపణము లొనర్చుటయే కళలయొక్క పరమప్రయోజన మని విశ్వసించినచో త్యాగరాజు రామదాసు లట్టి ముముక్షువులై కళను ప్లవముగా గ్రహించి సంసారసాగరమును తరించినవారని చెప్పవలయును. గోపన్నకృతమైన దాశరథీశతకము శతకవాఙ్మయమందే స్తవనీయస్థానము బడసినట్టిది; భక్త్యావేశము భవ్యకవితావేశములు పుష్కలముగా నాపద్యముల నుండుటయేకాక కవియొక్క యాత్మశుద్ధియు నందు గోచరము కాగలదు†. రామభక్తులరసనలపై నిరంతరము నర్తించు రామదాసుభజనకీర్తనల ప్రాశస్త్యము వేఱుగాఁ జెప్ప నవసరమే లేదుగదా. త్యాగరాజు పండితులను, రామదాసు పామరుల నుద్ధరించుటకై యవతరించిన కారణజన్ము లేమో యనిపించును.

స్త్రీల కనువుగా పాడుకొనుటకు కొంత రామసాహిత్యము పదములరూపమున వెల్విడినది. కుశలాయకము—ఉత్తరాభిషేకము—లక్ష్మణదేవరనవ్వు—లంకాయాగము—సంపూర్ణరామాయణము—మొదలగునవి చక్కని తేట తెలుగుపదకవితలో రచితములై స్త్రీల ప్రబోధమును గావించుచున్నవి. వైవాహికక్రతువులందు పెద్దముత్తైదువలు పాడుపాటలలో మంగళగీతులలో గూడ సీతారాములే యుక్తులై యుంట గమనార్హము. అధ్యాత్మరామాయణకీర్తనలు పాటలలో రూపుపడినవి.

రామాయణానువాదములలో చెప్పదగిన పండితులు కొందఱు బహుళప్రచారమునకు నోచుకొనకపోయినను. ... త్యాగరాయశాస్త్రి, దేవరాజసుధీ, గోస్వాముల కుప్పరామశాస్త్రి ... పూర్ణముగ ... వ్యాఖ్యాసహిత భాషలో శ్రీనివాసశిరోమణి— శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి మహోదయులు రామాయణవచనముల వ్రాసినారు. ... రామాయణ మొకటి సత్యనారాయణశాస్త్రిగారు రచించినది. విశ్వవిఖ్యాతులు సమాత్యులు నైన కల్లూరి చంద్రమౌళిగారి 'రామాయణసుధ' యనెడి వ్యాఖ్య రామకథాసందేశముల మఱింతగా వ్యాప్తము గావించుచున్నది.

సంస్కృతనాటకములలో రామకథనాధారముగ రచించిన ఉత్తరరామచరిత- అభిషేక- అనర్ఘరాఘవ- ప్రసన్నరాఘవ- ప్రతిమాశ్చర్యచూడామణీనాటకములు మున్నగునవి యాంధ్రీకృతములై పాఠ్యగ్రంథములుగాను, ప్రయోగగౌరవము గలవిగాను విరాజిల్లుచున్నవి. గోపాలాచార్య కృతియైన రామదాసునాటకము రామునిపైఁ దాత్పర్య బుద్ధిని కల్గించు నుత్తమదృశ్యకావ్యము. అట్లే, "పాదుక" హనుమద్విజయము (మతుకుమల్లివారిది) మున్నగునాటకము

† కనకవిశాలచేల భవకాననశాతకుఠారధార స
జ్జనపరిపాలశీల దివిజస్తుత సద్గుణకాండ కాండసం
జనితపరాక్రమక్రమ విశారదశారదకంద కుందచం
దనఘనసారసారయశ ! దాశరథీ, కరుణాపయోనిధీ !

శ్రీ పిల్లలమర్రి రామదాసభాగవతుల శ్రీరామచంద్రప్రభుశతక మర్వాచీనము.
ఏతీరుగ నను దయచూచెదవో ఇనవంశోత్తమరామా
నాతరమా భవసాగర మీదను నలినదళేక్షణ రామా !
క్రూరకర్మములు నేరకచేసితి నేరము లెంచకు రామా !
కారుణ్యాలయ భక్తవరద నిను కన్నది కానుపు రామా !

లను వెలువడిన భక్తిస్తోత్రాలు వరించినవి.

ఆధునికకాలమున చిన్నినాటికలు, రేడియోనాటికలు ప్రాముఖ్యము పొందినవి. రామాయణమునందలి ప్రసిద్ధఘట్టములను గ్రహించి నాటికలు వెలువడినవి. చింతాదీక్షితులు గారు, శబరిని రూపించియు, కృష్ణశాస్త్రిగారు 'శబరి'- 'గుహుడు' అను రేడియోరూపకములను కల్పించియు రామభక్తిప్రచారమునకు తోడ్పడిన ప్రతిభావంతులని పించుకొన్నారు; పాపయ్యశాస్త్రిగారి 'సీత' శ్రోతల నాకర్షించినది.

ఇంక హిందీభాషలో ప్రసిద్ధివహించినది తులసీదాసు రామాయణము: రామచరితమానసమున కున్న ప్రశస్తి గొప్పది. మైథిలీశరణగుప్త 'సాకేత్'- పంచవటి పేరు పొందిన రామాయణకావ్యములు. తులసీదాసుతర్వాత 'రామచంద్రికా' యను పేర మహాకవి కేశవదాసు రచించినాడు. ప్రాణచంద చౌహాన్ నాటకశైలిలో రామకథను నిబంధించినాడు. హనుమన్నాటకము హృదయరామ్ రచితమైనది హృద్యమైనది. ఏమైనను హిందీసాహిత్యమున తెలుఁగుసాహిత్యమున నున్నట్లు రామకథాసంబంధమైన కావ్యములు విశేషముగా లేవనియే చెప్పవలెను. కృష్ణభక్తి ప్రబోధాత్మకకావ్యములే హిందీభాషలో హెచ్చు.

ఆంగ్లమునను రామాయణము సంక్షేపింపఁబడినది. రామాయణమితరయూరపుభాషలన్నిటను వ్యాపించినదని చెప్పవలెను; రాజనీతికోవిదులు ప్రసిద్ధదేశభక్తులైన రాజగోపాలాచారిగారి "రామాయణము" ఆంగ్లమున సుబోధము నిశితమునైన కథాకథనశైలిలో (Bhavan's book University) వెలువడి యాంగ్లేయులకు భారతీయ సంస్కృతిని జాటుచున్నది. సుధా ముజుందార్ ఆంగ్లమున కృత్తివాసరామాయణము నందించినది.

ఇంక బాలురకు సుబోధముగ నుండుటకు సులభశైలిలో రామాయణము లిటీవలకాలములో వెలువడినవి. గేయములో రామాయణము నాలపించుకొనుట కనువైన రీతిలో సామవేదము జానకీరామశర్మగారు రచించుచున్నారు. పుట్టపర్తి నారాయణాచార్యుల ప్రయత్న మొకటియొక రసవచ్ఛైలిలో శ్రవణానందకరముగ సాగుచున్నది. ఎవరి యనుభూతి వారిదిగాన నెందరెందరో రామసాహితిని పురస్కరించుకొనుచున్నారు. ముమ్ముందు ననేకముగా రామసాహితి విస్తరింపగలదు.

లోకవ్యవహారము—రామాయణప్రభావము

లోకవ్యవహారము తెలుఁగునాట స్థిరపడిపోయిన సాదృశ్యములు రామాయణకథననుసరించినవి యనేకము లున్నవి. ఈ క్రిందివానిని జూతుము.

రామరావణయుద్ధము— సుగ్రీవాజ్ఞ— కుంభకర్ణుని నిద్ర— గిరిగీచినట్లు— ఉడతాభక్తి— చుప్పనాతిశూర్పణఖ— హనుమంతుడు సముద్రము లంఘించినట్లు—రావణబ్రహ్మ!— కట్టె కొట్టె, తెచ్చె — మాయదారిమంథర వే!— హనుమంతునిముందు కుప్పిగంతులవలె— లంకను బుట్టినవారు— కిష్కింధపురాగ్రహారీకులు— వాడు చండకౌశికుఁడండీ—మాయింటి వశిష్ఠుఁడాయన— వాని మాట రామబాణం లాంటిది—లోకాభిరామాయణము— సంజీవిపోసినట్లు— రామాజ్ఞ— శ్రీరామరక్ష— సీతాయుస్సు— మొదలైన ప్రయోగములు నిత్యజీవితములో మనచెవిని బడుచుండుటవలన రామాయణము తెలుఁగుజీవితములో నెట్లు పెనవేసికొనిపోయినదో వ్యక్తముకాగలదు; వేయేల? అసలు "శ్రీరామసాహితిపై నొకపరిశోధనగ్రంథమే మనభాషలో నిర్మింపఁదగియున్నది.

నీరాజనము

ఇంతటి మహనీయమైనది శ్రీరామసాహితి. ఇది రామాయణకల్యాణభారతి!! ఇది శాంతికి నే పట్టిన హారతి!!!

సర్వేజనా స్సుఖినో భవంతు
ఓమ్ శాంతి శ్శాంతి శా.

# తత్త్వ గీతం

శ్రీ పిల్లలమర్రి వేంకట హనుమంతరావు



జన్మ యెత్తి వృథా వృథా
కర్మ మహిమ గనక బుధా!

రుజా జరా కలిత వ్యథా
తప్పదేరికైన బుధా!

మృత్యు మకుట ధారి సదా
జీవి; తిరుగు లేదు బుధా!

రజ స్తమో గుణ ప్రధా
సత్త్వ దూరు జేయు బుధా!

అర్థ కామ దాసు కథా
ధర్మమెఱుగ కుండు బుధా!

శత్రులార్గు రుంద్రు గదా
మాయ వీడ నీక బుధా!

పాయ గాను లోని క్షుధా
భక్తి రసము గ్రోలు బుధా!

అని సత్య జ్ఞాన సుధా
ఆత్మ తత్త్వ మెఱుగు బుధా!

# సాధన

## శ్రీ కాకాని నరసింహారావు



క్రోధము మోహ మాది అరికోటికి జిక్కి కృశించు మన్మనో
వ్యాధిని మాన్పఁగాఁ దగు నుపాయము "సాధన" దక్క నన్యథా
లేదని సద్గురుం డన "భళీ" యనిఁ బూనితి నిర్వికల్పమౌ
సాధనకున్ గృతార్థతకు సందియ మున్నదె లోకరక్షకా!

అరిషడ్వర్గమహాగ్నికీలలను శాంతాంబోధిఁ జల్లార్చి యీ
శ్వరపాదాబ్జమరందపానజనితవ్యాహారి నై జన్మమున్
చరితార్థం బొనరించు సాధనకు నే సంకల్పముం జేసి, యి
త్తరి నారంభము జేసినాడ దయలేదా! తండ్రి నీ పుత్రుడన్.

విముఖం బైనను విశ్చలత్వముగ హృన్నీరేజమున్ నిల్ప శ
క్యముగా కెల్లపుడున్ దురూహల నిమగ్నం బైన నే నేడ దు
ర్గమయోగాభ్యసనానుభూతికలనాగమ్యానుసంధానది
వ్యమునీంద్రాదిమహత్వ మేడ? అది సాధ్యంబా యుపాసింపగన్ ?

ఇంచుక భూషణం బొదవ నెంతయు తబ్బిసలాడి యుబ్బు య
త్కించితు దూషణం బమర కించను జెంది కుమారిలున్ నిజం
బెంచగ నాత్మ కీయుభయ మేదియు నంటద టన్నపల్కు లా
లించని చిత్తవృత్తి గల నే నెటు శాంతిని నందగల్గుదున్.

వాదముజోలి యేల ధనవాంఛను గాదు యశమ్ము కేనియున్
కాదు రచింపనేర్తు నను గర్వము కాదు మనమ్ములోని యా
వేదన బ్రోత్సహింపగ కవిత్వము సాధనచేయ బూనగా
కాదనువారె; అట్టి యధికారము లేదనువార లుందురే.

అందరిజీవితమ్ము పరమావధి ఏవ్విధిచేత నైన నా
నందము నందుటే పరధనగ్రహణాదికవృత్తు లిచ్చు నా
నంద మనిత్య మల్పము మనమ్మున నిశ్చలనిర్మలావ్యయా
నందము చింతనామృతమునన్ లభియించు గడించి తీరెదన్

సాధనచే సమస్తమును సాధ్య మగున్ పరమేశమానసా
రాధనకూడ తోడ్పడ కొరంత ఘటిల్లునె ? భక్తశేఖరుల్
సాధులు యోగిపుంగవులు సంతత మేపరమార్థవస్తువున్
సాధనసేతు రే నదియ సాధన జేసి గడించి తీరెదన్,

పరులకు ధర్మసూత్రములు పల్మరుఁ జెప్పుచు తాను ''అష్టవం
కర''పనులన్ నిమగ్ను డగు కాతరభక్తునివోలె గాక నే
నరయుచు నిత్యజీవితమునందు ప్రవర్తన మార్చుకొంచు, ఈ
శ్వరకృపకర్హతన్ బడయ సాధన జేసెద; రిక్తవోవునే,

విలయాంబోధిఁ దరంగపంక్తివలె హృద్వీథిన్ దురూహల్ సదా
చెలరేగన్ స్తిమితమ్ము లేక మదిలోఁ జీకాకు రేకెత్తె; నీ
విలసద్దివ్యపదారవిందభజనన్ విజ్ఞానగంధమ్మునన్
తలపుల్ దక్కి ప్రశాంత మౌవవధిమధ్యంబట్లు వర్ధిల్లదే.

ఉన్నతకీర్తిశృంగముల నున్న మహామహు లొక్కమారుగా
సన్నుతి కెక్కిరే వెనుకజన్మల మాట లటుండనిచ్చి ఇం
దెన్ని విధాల యత్న మొనరించి గడించిరి నేను మాత్ర మా
తెన్నున సాధనన్ సలుప ధీవిభవమ్మును గాంచలే నొకో.

అందని మ్రానిపండని భయం బిసుమంతయుఁ జెంద సచ్చిదా
నందుని చింతానామృతమునన్ జపలత్వము వాసి మన్మనం
బందదె నిశ్చలత్వము, హృదంతరవర్తివి నీవు కల్గగా
కొందల మంద నేల? మది కోరిక లీరికలెత్తకుండునే.

ఏవ కీసృష్టికి కర్త యెందులకుగా సృష్టించి పోషించి మృ
త్యుపాతం బడఁద్రోయు నీతనువు నిందుఁ గడించి జీవాత్మ యే
మవు నెచ్చోటికిఁ బోవు ము న్నెచట నె ట్లావిర్భవం బందె నీ
వెవ రే నెవ్వఁడ బంధ మేమి మనకుఁ గా సాధింతు నీ సంగతుల్

ఎది నీ విచ్చిన దానినే సుఖముగా నే నెంచి సంతుష్టి చెం
దెద నెచ్చోటను నీవు నిల్పిన నదే దేవేంద్రభోగమ్ముగా
మది భావించెదఁ ద్వత్కృపామృతఝరీమాధుర్యమాహాత్మ్యసం
పద నోలాడెడి నాకు తుచ్ఛసుఖముల్ వాంఛింపగాఁ జెల్లునే.

అమలోదాత్తఘవక్రపాకలననిత్యానందసామ్రాజ్యపీ
ఠముపై నెక్కి ఝణంఝణ త్తకిట ధోంటంకారనాదమ్ము పా
దములం దుద్భవమందు నల్పు కవితాతన్వంగినృత్యమ్ము ని
త్యము వీక్షించుచుఁ ద్రావుచుందుగద వేదాంతామృతం బీశ్వరా!

కనులన్ ద్రిప్పుచు నృత్యమున్ సలుపుచున్ కంఠమ్ము సారించుచున్
తనశీర్షమ్మున నున్న దీపముపయిన్ ధ్యానమ్ము లగ్నమ్ము చే
సిన అ న్నట్టువరాలిపోలిక సదా చిత్తమ్ము నీయందె ని
ల్పును కార్యాంతరవర్తి యై మెలగినన్ పూజ్యాండు సత్సాధనన్.

మేనుల్ బుద్బుదముల్ సిరుల్ మెరపు లీమిథ్యాప్రపంచమ్ములో
దేనిన్ గన్న నవిత్యమే యను విరక్తిన్ బెంచి ధీశక్తిచే
నా నీ భేదసమన్వయం బెరిగి జ్ఞానంబున్ సమార్జించి, ని
త్యానందంబున దేలియాడెదను దైవానుగ్రహపాది నై,

ఏ నెవ్వాడనొ ఎన్నిజన్మములు న న్నెత్తించితో ఇంకపై
నే నేజన్మము లెత్తగా వలెనొ న న్నెందుండి రప్పించితో
నే నెచ్చోటికిఁ బోవగా వలెనొ నన్ సృష్టింపగా నేలొకో
నా నీభేద మదేమొ తెల్పగద వన్నా! భక్తసంరక్షకా!

శ్రీ కాకాని నరసింహారావు

నాలో నుంటివి నీవు నేనును జగన్నాథా ! ఛవప్రాపమం
దాలీనంబయి యుంటి వీప్రకృతి కీవాధార మైయుండ నే
పాలింతున్ బరికింప నిర్వ్వరకు రూపం బొక్కలాగుండు నీ
నాలో భేద మదేమొ తెల్పగద వన్నా భక్తసంరక్షకా !

పరమాత్మంబవు మాయ నేలిన పరబ్రహ్మంబ వై తండ్రి ఈ
శ్వరనామమ్మున దేజరిల్లెదవు జీవాత్మంబ వై నీవ క్ర
మ్మర మాయామయజన్మ మంది తిరియే మర్మమ్ము మాయాధరా
ధరమున్ దాటిన నేను నీ వొకటి కాదా భక్తసంరక్షకా !

జలరాశిన్ బలె నీ వనంతుడవు నై శాంతుడ వై యొప్పు దం
దలివీచీతతి ప్రాణికోటులు ప్రవర్తల్ చక్రవర్తుల్ గదా !
అల మిన్నందు తరంగముల్ నడిమి కాయాసంబునన్ జేరి చిం
తలఁ బోకార్చిన నేను నీ వొకటి కాదా భక్తసంరక్షకా !

# విన్నపము *

**శ్రీ చిట్టా దామోదర శాస్త్రి**

స్వామి, కుశలమ్ము రాజ్యాంగసప్తకమ్ము
యుక్త మిదిగద! ఆపద లొదవకేని
దేవమానవమూలము లేవి యైనఁ
దొలఁగఁబెట్టఁగ నీ వుందువు గదయ్య.

తమరు మంత్రంబుచేతను శమితు లగుదు
రరులు దృష్టాంతకారిస్త్రు లయ్యు స్వామి,
పరమప్రత్యక్షలక్ష్యసంహారణక్ష
ములు శరమ్ము లతినిరస్తములు గదయ్య.

హోతలగు మీరు శాస్త్రోక్తరీతి యగ్ను
లందు నునిచెడి యట్టి యాజ్యంబె స్వామి,
వృష్టి లేకుంట మిగుల శోషించు సస్య
ములకు వర్షమ్ము కారణమ్మును గదయ్య.

స్వామి, తమదగు బ్రహ్మవర్చస్సువలన
బ్రతుకుచుందురు నూరుసంవత్సరములు
భయము సుంతయు లే దీతిబాధలును దొ
లంగ సుఖమున్నవారు నా ప్రజ గదయ్య!

బ్రహ్మవంశంబునం దుద్భవంబు నంది
తాము గురుదేవు లగుచు చింతనము నిట్లు
చేయగా నేల కా వవిచ్ఛిన్నములును
ఆపదలు మాదు సిరులకు నగునె స్వామి!

ద్వీపవతి రత్నగర్భ మేదినియుగూడ
స్వామి సంతోషపరుపంగ జాల దయ్యె
మమ్ము బోలిన పుత్రరత్నమ్ము తమదు
కోడలైన సుదక్షిణకును గలుగమి.

శ్రాద్ధములయందు పితృభోజ్యసంగ్రహమ్ము
సేయ నాసక్తులై సుష్ఠు జేయలేరు
తమకు నా వెన్క భక్తి శ్రాద్ధములుసేయ
సుతులు కల్గమి నెఱిగి నాపితరు లెపుడు.

జన్మమున శుద్ధుడైనట్టి జ్ఞాని నయ్యు
పుత్రరహితత్వజిజ్ఞాసమూలమున ని
మీలితుడ నౌదు నే జక్రవాళమువలె
సప్రకాశత నప్రకాశతల వెలయ.

అగును సుఖదాయకమ్ము లోకాంతరమున
తపము దానమ్ములకు ఫలిత మవు సుకృతి
పరలు సుఖదాయకుం డిహపరములందు
శుద్ధవంశాన జన్మించు సుతుడు స్వామి.

అట్టి సంతానరహితుండ నైన నేను
ఆశ్రమపు వంధ్యవృక్షక మనగ నుంటి
పరమప్రేమార్ద్రదృష్టుల బఱపికూడ
తపన పొందవ దేలకో ధాత వయ్య.

షడ్గుణైశ్వర్యసంపన్న స్వామి, నాకు
సజ్జనము లేని దంతికి మర్మభేద
కమ్ము దుఃఖద మాలానకమ్మువోలె
తెలియు మో దేవ నాదు పైతృకఋణమ్ము.

నీళ్లు వదలగ నా వెన్క నిసుగు లేమి
తెలిసి నే నిడునట్టి యంజలినివారు
స్వీయ నిశ్వాసముల నింత వెచ్చబడగ
స్వీకరింతురు స్వామి, నాపితరు లెపుడు.

తండ్రి, ఇక్ష్వాకునృపులు పొందంగరాని
యర్థముల పొందజేయు సమర్థుడవుగ
అట్టి పితౄణముక్తుండ నగుట యెట్లొ
అట్లె చేయంగ దగువాడ వయ్య స్వామి!

* రఘువంశము మొదటిసర్గమున దిలీపుఁడు పుత్రార్థియై వసిష్ఠుని కిట్లు విన్నవించెను

# సూర్యనమస్కారము

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి



అఖిల విశ్వంభరాభ్యుదయమ్ము నెంచి
కరుణమై జీవతతి మేలుకనుపొంచె
నెఱిఁ దనర్చిన వేవెల్గు నేత్రుకందు
పుట్టుకకు ముజ్జగమ్మునఁ బురుడు లేదు

దుర్దమ దురంత కల్మాష కర్దమంపు
శేవమెల్లను నిట్టింకు లింకఁజేసి
శ్రీవిడంబితమై విశ్వభావుకమ్ము
చేయుఁగావుత ! ప్రాభాకరీయశోభ.

పాపవాతాపిఁ ద్రేఁచి చూపఱులు బెగడి
వింజమాఁకిడినట్లుగా వెలయ వెలుఁగు
మిత్రమైత్రావరుణి దయామేయబుద్ధి
నిష్టసిద్ధి నొసంగు నియ్యెడల మాకు.

ప్రాగ్దిశా మత్తకాశినీ రచితరుచిర
దివ్యరుచి రక్తకుంకుమ తిలకమునకుఁ
బ్రాతరుదిత నభోమణిఫలకమునకు
నంజలిఘటించి కల్మష మడఁచికొందు.

అంధకారావలి నడఁపంగఁ బాదపాం
తరితుఁడైన యుదయదరుణ దాశ
రథికి భక్తిఁ బ్రాతరభివందనం బిడఁ
గలుషరాత్రిచరులు పొలియు టరుదె !

గగనపటమున నభినవకల్పనముల
సరస చిత్రకళాసృష్టి సంతరించి
సభ్యలోకమునకుఁ బ్రదర్శన మొనర్చు
చిత్రకారుని ప్రత్యగ్రమిత్రు నెంతు.

అంతపై యింతపై ఘనభోంతరమ్ము
గ్రమ్ముకొని వర్ణనీయవిక్రాంతిఁ గనిన
ప్రాఁబలుకుపెంకితపుకుఱ్ఱ భక్తతతికి
నలరి పట్టును మేలిమువ్వాలగొడుగు.

ఆజవంజవ జీవంజవాభిపేయ
మైన యాశామహాశశాంతాతపమ్ము
వెట్టిగాడ్పుల విసరి నస్వోఁపకుండ
నుదయమునం బొంది లోవెత లుడుపు మరుణ !

హృదయమనునట్టి గడియార మిది భవత్ప్ర
భావమునఁ జేసి పనిచేసి దేవ ! యిట్టి
కలఁగి యొకపరి హెచ్చుతగ్గులుగ నడచు
దాని సరిచేయవే త్రయీతనుఁడ ! ఇనుఁడ !

పద్మబాంధవ ! నీ ధృష్టిపంక్తి రాత్రి
వీతిహోత్రున కొసఁగి నీ వితరణమ్ము
ప్రకట మొనరించుచుంటివి; ప్రణతిగాక
యేమి యర్పింపఁగలము మే మింతకంటె.

ప్రకృతి దుష్ప్రేక్ష్యమగు సురాభాండమందు
క్రమగోక్షీర సంభృతకలశమందు
సమతఁ బ్రసరించు నీమయూఖములగుణము
ద్యుమణి ! వర్ణింతు సర్వదోషములు వాయ.

అఖిలసాగరవారి పాద్యమ్మొసఁగెఁ
బ్రకృతిదేవత యర్ఘ్యమ్ముపట్టి నిలిచెఁ
బావనముచేయ మా జగద్భవన మెల్ల
దినమణీ ! రమ్ము మా సమర్హణను గొనుము.

# శైష్యోపాధ్యాయిక

నయనాంచలముల పస్నగఁ దోఁచు తామ్రరేఖలఁ జక్రవర్తిలక్షణము చెలువు
పరదారపరిణయాపరనిక్షణము నెంచి మాతృభావమ్మున మసలు తెలివు
ఆజానులంబిబాహాయుగ్మమున మాంసలత పెంపు లొరయు చెల్వాపుఁ బసందు
నెవఁ డెట్టి యాసించి యేతెంచినను జేతి కెముక లేకుండఁగా నిచ్చు విందు
తమ్మిపిరిమొగ్గ విచ్చిన దళములయటు గొనము పేరెతి నాత్మశిష్యునకు విరియ
వేయికరిములతోఁ గృష్ణరాయ నొత్తె మిత్రుఁడై తిమ్మరుసుమంత్రి మెచ్చు నతని.

సువిశాల వీక్ష విస్ఫూర్తి నేత్రములకుఁ జూపులలో సూక్ష్మసూక్ష్మగతులు
వజ్రకాఠిన్యమ్ము వక్షస్స్థలమ్మునఁ జిత్తమ్ములోఁ బువ్వుమెత్తఁదనము
విగ్రహమ్మునఁ బుట్టు పెడఁద యౌన్నత్యము గురువులయెడ వంగి కొలుచుభంగి
నడకలో స్వరములోఁ బొడము గాంభీర్యము పేదవారలఁ జూచి ఖేదపాటు
పడుగుఁ బేకయుఁగా నేయఁబడిన యట్టు లలరి దేహాత్మగుణము లన్యోన్యమైత్రిఁ
గృష్ణరాయలలో నందగించుచుండ నరసి యాశీర్వదించుఁ దిమ్మరుసు గురుఁడు.

చదివినట్టులె యుండు సాహిత్యపాఠమ్ము; సంగీతకళకు నాసక్తి నెఱపుఁ
జేసినట్టులె యుండుఁ జెలఁగి గుఱ్ఱపుస్వారి; చిత్తమ్మునకు వచ్చుఁ గత్తిసాము
వినినట్టులే యుండు వేదాంతవాదముల్; దండనీతులకు వార్తలకు మరియు
నలిగినట్లే యుండు నన్యాయములయెడఁ జిఱునవ్వుమల్లియల్ కురియుచుండు
నరయుచున్నట్లె యుండు సుందరతరమ్ము ప్రకృతిమంథర మైన శోభావిలాస;
మంతలోఁ దనలోనఁ దా నరసి మురియు; నపుడు రాయలలోనఁ దిమ్మరుసు మెఱయు.

దౌదల నిలఁబడి తగులమ్ము దిగనాడి వ్యసనంబు లేడింటిపస లెఱింగి
మన మనాసక్తమై తనరఁ జతుర్విధ మదనమార్గముల సంపదలు తెలిసి
అనభిషంగతఁ దంత్రము నెఱింగి శృంగారయువతీయువకరీతు లవధరించి
యంతరంగముఁ బరార్థాభిలాషల నిల్పి యష్టభోగముల తియ్యములు పట్టి
మెలఁగు నారాచబిడ్డ రాయలవయస్సుఁ దెలిసి యాచట్టు సిగ్గువో దిటవు గొలిపి
వేడ్క డెందము పుష్పింప వీఁపుతట్టు మంత్రిమాధవుఁ డల్ల తిమ్మరుసుబుధుఁడు.

తల గ్రుచ్చుకొన్న తెక్కలి నంటి పంటకాలువఁ బవ్వళించు వాతువుల సరసి
మొనసి కళ్లానఁ బోసిన కొల్చుఁ జేటల విసరఁ బాఱిన పొల్లుపెంటఁ గాంచి
యొకకన్ను నిద్రవో నొకకంట మేల్కొను వెలుఁగు సాలాగ్రముం బెనఁగఁ జూచి
వరిగింజ నొకటఁ బల్వురుసఁ బోమెడు కుందరదన కెంపెదవి సౌరంగుఁ దెలిసి

యవి వినూత్నకవిత్వవర్ణ్యాంశములుగఁ గృష్ణరాయ డెడందఁ బొంగినప్డు తతని
యభినవం బగు ప్రతిభఁ దిమ్మరుసువిబుధుఁ డరసి మోదాశ్రుకుందమాల్యములు విడుచు,

అతఁ డుచ్చరించు మహావాక్యములలోన భావ ధ్వని వ్యంగ్యపరత మెఱసి
అతఁడు చూచిన చూపునందు హైందవధర్మ మర్మజ్ఞతారహస్యమహము తొనకి
అతఁడు వేసినయట్టి యడుగులో గజపతిగతి క్రిందు సేయుపద్ధతి చిగిర్చి
అతఁడు నవ్విన నవ్వునందు నమ్లేచ్ఛమౌ స్వచ్ఛతాకీకాచ్ఛవి తనర్చి

అతఁడు తనకౌఁగిటం జేరినపుడు చిటిలు జాతిమున్ దైవ సరులలో నైక్య మెంచి
తిమ్మరుసుమంత్రి యంతరంగమ్ములోనఁ గృష్ణరాయలవళ లపేక్షించుకొనును.

మహితవిజ్ఞానతరణి యమ్మంత్రిమౌళి నిజకరస్పర్శ హృదయనీరజము విచ్చెఁ;
కృష్ణరాయల కెలదేఁటి తెక్కనల్పు మీసములపొల్పువయసు క్రమ్మికొని వచ్చె.

['ఆంధ్రపురాణము' నుండి]

# నాంద్యాహ్వానము

మును వజ్రాహతిపాతభీతిమెయి సొంపుంబాసి సోత్కంపతన్
వనధిన్ డాఁగిన పక్షవచ్ఛిఖరి మైనాకుండు వజ్రాసనం
బున శ్రీరాయలు కాలువెట్టు నను సమ్మోదంబుతోఁ గాన్కఁ దె
చ్చిన రత్నచ్ఛవిమత్కిరీట మనఁ దోఁచెన్ రాచవీ డయ్యెడన్,

అల వేడ్కం గనులారఁ జూచెడి తలంపై కన్నులన్ మూయుల
వల మిన్నుల్ పడుచోటునుండి పులకింపన్ హవ్యవాహప్రభా
వలసత్పాంతలఉల్ బుధప్రవరు లొప్పన్ రాగ నారాచవీ
థలరారెం గవితాస్పందం బనఁగ నార్యాశ్చర్యధౌరేయ మై.

తనివోవం బ్రణయాభిమానఖని సత్యాదేవి కౌతూహలం
బునకుం గృష్ణుని గుప్పెటన్ మొలచి సొంపుల్ తేటగా నారఁబూ
చిన నెత్తావుల పారిజాత మటు పొల్చెన్ రాచవీ దెల్ల లో
చనపర్వోదయమంగళోత్సవ ఫలోత్సాహత్వరానంది మై.

వినుతం బయ్యభిషేకవార్త విని యుర్వీనేతఁ గీర్తింప వ
చ్చిన విద్వత్కవిపాళి మంజుకవితాశ్రీవాహినుల్ రాజభూ
షణకోలాహలవీథి నడ్డుకొని యుచ్చైస్సంగశృంగారభం
గి నినాదింప నెలర్చె నయ్యెడల రక్తిన్ రాచవీ దెల్లెడన్.

> పుడమిబరు వింక రాయలు మోయుననుచుఁ
> దీరుబడి చూచుకొని యష్టదిగ్గజములు
> చుట్టె శ్రీకారముల్ రసజ్ఞులశ్రవస్సు
> లలర భవ్యమహాకావ్యములకు నాఁడు.

పొలపము నెత్తు ముత్తియపు ముగ్గులజగ్గులతో ననంటిబో
దెల రమణించు ద్వారముల నిగ్గులతో నెఱిపూఁత జీడిపిం
దె లలరు మావికొమ్మలఁ గుదించి వెలార్చిన తోరణాళితో
విలసితమై వసంతకృతివీథికిఁ దత్పురి తీర్చెఁ బీఠికన్

పొరిపొరి వగ్గులై వయసుముగ్గిన ముత్తెపుముగ్గుబుట్టలా
శిరములతోడఁ బున్నెముల చేరికలై తగు రాచయైదువల్
తిరుమలదేవిఫాలమున దిద్దిన కుంకుమ సోగరేకలోఁ
దెరమఱుఁ గింత లేక గమనింతురు రాయలపట్టబంధమున్.

అరయంగా నెటఁజూచినం దనకుఁ దాసై యున్నయట్లుండి, యం
దఱిడెందంబుల కాతిథేయపరమానందంబు విందార్చు తి
మ్మరుసయ్యం గనుఁగొంచుఁ దద్రుచిరనేత్రాంతమ్ములన్ వింత దొం
తరలై తోఁచిన కృష్ణమూర్తులకు జోతల్ తీర్తు రభ్యాగతుల్.

ఒకచో వచ్చిన రాచవారి కుచితోద్యోగంబునం దీర్చు లౌ
కికమర్యాదలకున్, మఱొక్కయెడ భక్తిన్ సక్తిఁ బాటించి వై
దికమార్గమ్మునకున్, గనుల్ పనిచి మంత్రిశ్రేష్ఠుఁ డాతండు కౌ
తుకియై నిల్పెను భ్రూయుగాంతరమునందున్ గృష్ణకల్యాణమున్.

చేరి రాంధ్రావనికి సర్వభారతీయు;
లాంధ్రులెల్లరు కర్ణాటమందుఁ జేరి;
రఖిలకర్ణాటజనులు తిమ్మరుసుఁ జేరి,
రతఁడు శ్రీకృష్ణదేవరాయలను జేరె.

రాశీభూతపురాణభారతసుధర్మక్షేత్రసంచార లీ
లాశుభంజ్జయపాణి రాయలకుఁ గల్యాణాభిషేకంబు స
ర్వాశల్ పండఁగ రే పనంగఁ దొలినాఁ డాదికిశిశావది
వ్యాశీఃకల్పకసూనసౌరభము నాంధ్యాహ్వాన మై సొంపిలెన్.

# మహాశ్మశానము

శ్రీ నోరి నరసింహశాస్త్రి



జగ మంతా ఒక మహాశ్మశానం
జన్మకు సత్యం చావొకటే
చావంటే ఈ సంభ్రమ మేటికి,
సంబర మేలా జన్మంటే?

సృష్ట్యాదిగ నిట దేహము దాల్చిన
జీవకోటి నూహించితివా?
సృష్ట్యాదిగ నిట దేహము దాల్చిన
జీవరాశిలో ఒక టున్నే.

బ్రహ్మాండములో పరమాణువు లవి
బ్రహ్మకు శక్యమె లెక్కింపన్!
బ్రహ్మాండంబున పరమాణువులను
పాడరిపోనిది ఒక టుందా!

ప్రాణిసంఘములు పరుగులు వారెడి
ఫల మని మృత్యుముఖంబునకున్
భాగ్యశాలురను ప్రాపించెద రది
పడసెద రలసులు నిర్భాగ్యుల్.

జన్మంతా ఒక పవిత్రయజ్ఞం
చావందున పూర్ణాహుతిరా
జగమంతా ఒక మహాశ్మశానం
జన్మకు సత్యము చావొకటే!

# బహువ్రీహిసమాసము

శ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రి



దైవతాని కతి సన్తి చావనౌ నైవ తాని మనసో మతాని మే
దీక్షితం జడధియా మనుగ్రహే దక్షిణాభిముఖమేవ దైవతమ్।
నత్వా గురూ సుబ్బరాయ వేంకటేశ్వరశాస్త్రిణౌ।
సూర్యనారాయణే నాత్ర బహువ్రీహి ర్విచార్యతే।

'అనేక మన్యపదార్థే' (2-2-24). ఇందు 'శేషో బహువ్రీహిః' అను సూత్ర మధికృత మగును. 'సుబామంత్రితే పరాఙ్గవత్స్వరే' అను సూత్రమునుండి సుప్ అనునది అనువర్తించును. ఈసూత్రమున సుపా అను తృతీయాంతము అనువర్తింపదు. అనువర్తించినచో రెండుపదములకు సమాసములభింపనేరదు.

'శేషః' అను పదమునకు ప్రథమాంతమని యర్థము. శేష మనగా ఉపయోగింపబడిన దానికంటె మిగిలినది. ప్రకృతమున (1) ద్వితీయాశ్రితాతీత.... (2) తృతీయా తత్కృతార్థేన (3) చతుర్థీ తదర్థ.... (4) పంచమీ భయేన (5) షష్ఠీ (6) సప్తమీ శౌణ్డైః' అను సూత్రములలో ద్వితీయాదివిభక్తు లుపయోగింప బడినవి.

దానికంటె మిగిలినది ప్రథమావిభక్తి, కాగా 'ద్వితీయాశ్రితాతీత' ఇత్యాది సూత్రములచే ఏత్రికములకు విశిష్య సమాసము చెప్పబడలేదో ఆత్రిక మిచట శేషశబ్దమున కర్థము. అన్యపదార్థమందు వర్తమానమగు అనేకమగు ప్రథమాంతములు సమసించును. ఆసమాసము బహువ్రీహిసంజ్ఞ గలదగును,' అని అనేక మన్యపదార్థ సూత్రమున కర్థము. సూత్రమున పదగ్రహణముచేత అన్యపదముయొక్క అర్థము నందు శక్తములగు అనేక ప్రథమాంతములకు సమాసము లభించును. వాక్యార్థమును బోధించెడి ప్రథమాంతములకు సమాసము రానేరదు. ఎట్లన 'గ్రాహవతీ నదీ' అనునవి రెండు ప్రథమాంతములు. ఇవి 'మాస్నాహి' అను వాక్యార్థమును బోధించుచున్నవి. కనుక నిచట సమాసమును వారించుటకై సూత్రమున పదగ్రహణమావశ్యకము. బహుపద బహువ్రీహిని స్వపదార్థమున వారించుటకై సూత్రమున అన్యగ్రహణము. మఱి బహుపదములకు ప్రవర్తించి చరితార్థమగు బహువ్రీహిని పదద్వయమున అన్యపదార్థమందుకూడ సమానాధికరణతత్పురుషసమాసము బాధించెడిని. ఈసూత్రమున అన్యపద మున్నచో అన్యపదార్థమున విహితమగు బహువ్రీహి స్వపదార్థమున విధింపబడిన కర్మధారయసమాసమును బాధించును. బహుపదములకుగూడ బహువ్రీహి లభించుటకై సూత్రమున అనేకపదగ్రహణము చేయబడినది. ఆలోచించినచో 'తద్ధితార్థో'త్యాది సూత్రముచే 'ఉత్తరపదే పరతః' సమాసవిధానమువలన యథాభిధానముగా బహుపదమునకుగూడ సమాసము లభించుటచే ఈసూత్రమున అనేకగ్రహణము స్పష్టార్థమే. ఈయంశము మహాభాష్యమున స్పష్టముగా నున్నది. అన్యపదే అని చెప్పినను అన్యపదమందు అనేకప్రథమాంతములకు వృత్తి సంభవింపనందున సూత్రారంభసామర్థ్యముచే అన్యపదార్థే అని లభించుచుండగా తిరుగ అర్థగ్రహణమువలన ద్రవ్యలింగసంఖ్యాసహితమగు అన్యపదార్థమును బోధించుపదములకు బహువ్రీహిలభించును. ఈయర్థమును పురస్కరించుకొనియే అన్యపదార్థము ఏలింగమో ఏవచనమో అదియే బహువ్రీహిసమాసమునకుగూడ లభించును' అని వ్యవహారము కల్గినది.

సూత్రమున అన్యశబ్దముచే ఉపస్థితమగు సమస్యమాన ప్రథమాంతములకంటె అన్యమగు అర్థము గ్రహింపబడును. ఆయర్థము 'యస్య, యస్మిన్, యేన' మొదలగునవి. దీనిచే ప్రథమేతరవిభక్త్యర్థమున బహువ్రీహిసమాసము ప్రవర్తించును.

అనేకప్రథమాంతములకు సమాసములు విధించుటచే అర్థాత్ సమానాధికరణపదములకే బహువ్రీహిసమాసము లభించును. కనుకనే 'బహువ్రీహిః సమానాధికరణానామ్, కిం ప్రయోజనమ్? వ్యధికరణానాం మాభూత్. పంచభిర్భుక్తమస్య' అని అనేక మన్యపదార్థే అను సూత్రభాష్యమున నున్నది. కనుకనే మత్వర్థే బహువ్రీహిః, కర్తృకర్మవచనేః అప్రథమాయాః ప్రథమావిభక్త్యర్థే బహువ్రీహిః, శేషోబహువ్రీహిః, ఇతరః శేషః' అని మునివచనములు కాన్పించుచున్నవి. ఈవచనముల పర్యాలోచనచే సమానాధికరణములకే బహువ్రీహి సమాసము లభించుటచే సమానాధికరణబహువ్రీహిసమాసమే మునిసమ్మతము. వ్యధికరణబహువ్రీహిసమాసము మునిసమ్మతము కాదని చెప్పవలసియున్నది. వ్యధికరణపదబహువ్రీహిని బోధించెడి మునివచనములు స్పష్టములుగా లేవు. మీదుమిక్కిలి 'వ్యధికరణానాం మాభూత్' అని మహాభాష్యకారుడు వచించియున్నాడు. కాని మునిత్రయము వారి యాశయమును వారిగ్రంథములమూలమున నిరూపించినపుడు వ్యధికరణపదబహువ్రీహికికూడ తావుకలదు కాగా సమానాధికరణసమాసము స్వారసికము. వ్యధికరణపదబహువ్రీహి క్వాచిత్కము. సాధ్యమైనంతవరకు సమానాధికరణబహువ్రీహినే వాడుకచేయవలెనని తోచుచున్నది.

పాణిని సమర్థసమాసమును బోధించెను. అసమర్థసమాసమును స్వీకరింపు మని చెప్పలేదు. కాని ఆఋషియే అసూర్యశబ్దము ఉపపదముగ నుండగా దృశ్ ధాతువుకంటె "అసూర్య లలాటయోః దృశి తపోః" అను సూత్రముచే ఖశ్ ప్రత్యయమును విధించియున్నాడు. ఉ; — అసూర్యంపశ్యాః, దానికి 'సూర్యం న పశ్యంతి' అని యర్థము. అసూర్యం పశ్యంతి అని యర్థము కాదు. ఇచట నఞర్థమునకు క్రియతో అన్వయము. సూర్యశబ్దముతో అన్వయము లేదు. అందుచే అసూర్య అనునది అసమర్థసమాసము. ఈమునివ్యవహారమునుబట్టి అసమర్థసమాసమునుగూడ క్వాచిత్కముగ గ్రహింపవలెను. కనుకనే 'శివే భగవతి భక్తః' అను అర్థమున 'శివభాగవతః' అని మునివచనము. సామర్థ్యము లేకపోయినను గమకమున్నపుడు వృత్తిని స్వీకరించుట మునివ్యవహారసిద్ధము. ఇట్లనేకములగు మునివ్యవహారము లున్నవి. 'సమర్థః పదవిధిః' అను మునివచనము కణ్ఠరవముగా నున్నను ఆమునుల యితరవ్యవహారములచే అసమర్థములకుకూడ వృత్తిని స్వీకరించుచున్నారు.

ఇట్లే సమానాధికరణములకు బహువ్రీహిసమాసమును ఋషులు బోధించినను ఆఋషులయితరవ్యవహారములచే వ్యధికరణపదబహువ్రీహినిగూడ తప్పక అంగీకరింపవలసియున్నది. మునులవ్యవహారము లిట్లున్నవి.

(1) 'సప్తమీస్థానే యోగా' అని పాణినిసూత్రము. ఇచట 'స్థానేయోగా' అనునది సమాసపదము. వ్యస్తపదము కాదు. వ్యస్తమైనచో 'షష్ఠీ' అను స్త్రీలింగమునకు 'యుక్తః' అని యోగమను నర్థమున ప్రయోగించియుండవలసియున్నది. 'స్థానే యోగః యస్యాః' అని బహువ్రీహిసమాసము. ఇచట సప్తమికి అలుక్ నిపతింపబడినది. లేక 'స్థానే యోగః యస్యాః' అని చెప్పవలయును. తృతీయాంతములకు సమాసము. తృతీయకు సామాసికలుక్కు. స్థానశబ్దమున చివరను 'ఏ' కారము నిపతింపబడినది. మహాభాష్యమున ఈరీతిగ వ్యధికరణపదబహువ్రీహియే చూపబడినది. సమానాధికరణపదబహువ్రీహి చూపబడలేదు. (2) అల్పాఖ్యాయామ్. అని పాణినిసూత్రము(5-4-136) అల్పత్వము బోధ్యమగునపుడు ఉత్పూర్వాది గంధశబ్దాంత బహువ్రీహికి ఇత్వము ఈసూత్రముచే విధింపబడినది. సూపస్య గంధః (లేశః) యస్మిన్ తత్ సూపగంధిభోజనమ్; 'గంధో గంధక ఆమోదే లేశే సంబంధగర్వయోః' అని విశ్వనిఘంటువు. సమానాధికరణములకే బహువ్రీహియని నియమించినచో ఈసూత్రమునకు తావులేదు. ఇచట గంధః (లేశః) సూపః యస్మిన్ అనురీతిని ఇది సమానాధికరణ బహువ్రీహి కావచ్చును.

కాని అట్టితఱిని గంధశబ్దమునకు పూర్వనిపాత కలుగుటచే గంధశబ్దాంతబహువ్రీహియే లేనందున అట్టి సమాసమునకు ఇత్వవిధానము అసంగతము కావలయును.

(3) దక్షిణే ఈర్మం (వ్రణం) యస్యసః దక్షిణేర్మా, వ్యాధునిచేత దక్షిణభాగమున చేయబడిన వ్రణముకలది.

(4) అపో యోని యన్మతిషు' ఇది సప్తమికి అలుక్కును బోధించెడి వార్తికము. 'అప్సుయోనిః (ఉత్పత్తిః) యస్య సః అప్సుయోనిః' అని యుదాహరణము, 'బహువ్రీహిః

సమానాధికరణానామ్' అని చెప్పిన వరరుచియే ఈవార్త్తికమును రచించియున్నాడు.

(5) 'అకడారా దేకా సంజ్ఞా' అను సూత్రమున కాత్యాయనుడు 'ఏకసంజ్ఞాధికారే విప్రతిషేధాత్ బహువ్రీహిః' అని ప్రయోజనమును చెప్పియున్నాడు. 'వీరపురుషకః' అనుచోట కర్మధారయసమాసముకంటె పరమగుటవలన బహువ్రీహిసంజ్ఞయే యుండును. అని వార్త్తికముల కర్థము. తరువాత 'ఏకసంజ్ఞాధికారే విప్రతిషేధాత్ బహువ్రీహి రితిచేత్ క్త్వార్థే ప్రతిషేధః' అని దోషమును చూపెను. పరమగుటవలన బహువ్రీహిని అంగీకరించినచో 'నిష్క్రాన్తః కౌశామ్బ్యాః' నిష్కౌశామ్బిః' అనుచోట కర్మధారయమును బాధించి బహువ్రీహిగావలయును అని వార్త్తికాశయము. నిర్ + కౌశామ్బి పదములు వానికంటె ఇతరమగు క్రాంత శబ్దార్థమును బోధించుచున్నందున బహువ్రీహి ప్రాప్తించుచున్నది. 'సమానాధికరణానాం బహువ్రీహిః' అను వార్త్తికము చెప్పిన యిచట బహువ్రీహి ప్రాప్తియే లేనందున ఈదోషము వార్త్తికకారుడు చెప్పుట పొసగదుగదా!

(6) 'ప్రహరణార్థేభ్యః పరే నిష్ఠా సప్తమ్యౌ' ఈవార్త్తికము బహువ్రీహియందు ప్రహరణార్థకశబ్దములకంటె నిష్ఠాప్రత్యయాంతమునకు సప్తమ్యంతమునకు పరనిపాతము విధించుచున్నది. సప్తమ్యంతమునకు బహువ్రీహిసమాసము లేనందున సప్తమ్యంతమునకు పరనిపాతవిధానము వార్త్తికకారునకు సరిపడదు. దణ్డః పాణౌ యస్య సః దణ్డపాణిః ఇచట పాణిగతః దణ్డః యస్య అని సామానాధికరణ్యమును చూపుట యుక్తము కాదు. అట్లైనచో సప్తమ్యంతమే లేనందున ఈవార్త్తికమునకు ఉదాహరణ మెట్లు పొసగును.

(7) త్రికతః శేషః – యస్య త్రికస్య సమాసః అనుక్తః సశేషః, కస్య చానుక్తః ప్రథమాయాః. అని భాష్యకర్త స్పష్టముగ చెప్పియు సూత్రములలో అనేకచోట్ల వ్యధికరణపదబహువ్రీహిని చూపియున్నాడు. (1) 'వృద్ధినిమిత్తస్యచ తద్ధితస్యా రక్తవికారే' అను సూత్రమున నున్న వృద్ధి నిమిత్తస్య అనుదానికి వృద్ధేః నిమిత్తం యస్మిన్ సః వృద్ధినిమిత్తః' అని విగ్రహము చూపియున్నాడు.

(2) స్త్రియాః పుంవద్భాషిత పుంస్కాత్. ఇత్యాది సూత్రమున 'భాషిత పుంస్కా దనూఙ్' అనునది బహువ్రీహిసమాసము. ఇచట నిపాతనా త్పంచమ్యాః అలుక్, షష్ఠ్యాశ్చలుక్, అని యంగీకరించియున్నాడు. (3) 'అదసో సేర్దాదు దోమః' అను సూత్రమున 'అసేః' అనుపదమునకు అః సేః యస్య సః అసిః, తస్య అసేః అని వ్యధికరణపదబహువ్రీహిని భాష్యకారులు చూపియున్నారు.

(8) 'సప్తమీ విశేషణే బహువ్రీహౌ' అని పాణిని సూత్రము. బహువ్రీహిసమాసమున సప్తమ్యంతమునకు విశేషణమునకు పూర్వనిపాతము నీసూత్రము విధించుచున్నది. కణ్ఠేకాలః, కణ్ఠేకాలః యస్య సః కణ్ఠేకాలః, సప్తమ్యంతార్థమునకు కర్తృకర్మద్వారా క్రియయం దన్వయము కలుగుటచే విశేషణత్వము నియతము. కాగా సూత్రములో విశేషణపదముచేతనే గతార్థమగుచుండగా తిరుగ సప్తమీగ్రహణము వైయధికరణ్యమునందుకూడ బహువ్రీహిసమాసజ్ఞాపనార్థము.

ఇచట అధునాతనులు కొందఱు ఈరీతిగ అభిప్రాయపడిరి. వ్యధికరణపదబహువ్రీహి అనార్షము. సప్తమీ విశేషణే బహువ్రీహౌ' అనుసూత్రమున సప్తమీగ్రహణమునకు ప్రయోజన మీరీతిగ చెప్పవచ్చును. కణ్ఠేకాలః అనుచోట కణ్ఠే స్థః కాలః యస్య సః అని విగ్రహము చూపవలయును. స్థ శబ్దమునకు లోపము రాగా శేషించిన సప్తమ్యంతమునకు పూర్వనిపాతను విధించుటకై 'సప్తమీవిశేషణే బహువ్రీహౌ' అను సూత్రమున సప్తమీగ్రహణమావశ్యకము. కనుకనే 'అనేక మన్యపదార్థే' అను సూత్రమున 'సప్తమీపూర్వస్య ఉపమానపూర్వస్యచ బహువ్రీహి ర్వక్తవ్యః,' ఉత్తరపదస్యచ లోపో వక్తవ్యః, కణ్ఠేస్థః కాలః యస్య సః కణ్ఠేకాలః—ఉష్ట్రముఖమివ ముఖం యస్యసః ఉష్ట్రముఖః' అని మహాభాష్యమున పతఞ్జలి తెలిపియున్నాడు. పైరీతి కణ్ఠేకాలః యనునది సమానాధికరణపదబహువ్రీహియే. పతఞ్జలి కణ్ఠరవముగ చెప్పియున్నాడు. అందుచే నవీనవ్యాఖ్యాతలు చూపినభావము సరికాదు. వ్యధికరణపదబహువ్రీహి అనార్షమే అని నవీనుల యభిప్రాయము.

నేను పైచూపినరీతిని వ్యధికరణపదబహువ్రీహికూడ ఋషిసమ్మతము అనునది నిర్వివాదము. మఱియు కణ్ఠే

కాలః సమానాధికరణపదబహువ్రీహియు, కణ్ఠే స్థః కాలః అని విగ్రహము. 'స్థ' శబ్దమునకు లోపము అని 'అనేక మన్యపదార్థే' అను సూత్రమున భాష్యకారుడు చూపి యున్నాడు. కణ్ఠేకాలః యనునది వ్యధికరణబహువ్రీహి యనునదికూడ భాష్యసమ్మతము; 'వర్ణో వర్ణేన' అను సూత్ర భాష్యమున చెప్పుచున్నది. 'సమానాధికరణసమాసాత్ బహువ్రీహి ర్విప్రతిషేధేన' సమానాధికరణసమాసస్య అవకాశః వీరః పురుషః వీరపురుషః బహువ్రీహే రవకాశః, కణ్ఠే కాలః న హోభయం ప్రాప్నోతి, వీరపురుషకో గ్రామః బహువ్రీహి ర్భవతి విప్రతిషేధేన»

కర్మధారయబహువ్రీహిసమాసములకు ఇచట భాష్యకర్త విప్రతిషేధవిచారము చేసియున్నారు. ఏవిద్యోదాహరణములలో ప్రవర్తించుటచే చరితార్థములగు రెండు సూత్రములకు ఒకేలక్ష్యమున యుగపత్ప్రవృత్తి కలిగినపుడు పరశాస్త్రము ప్రవర్తించును. ఉ:- 'సుపిచ' అను సూత్రము 'బహువచనే ఝల్యేత్' అనుసూత్రమునకు విషయము కాని రామాభ్యామ్ మున్నగు చోటులందు చరితార్థమైనది. 'సుపిచ' అను సూత్రమునకు విషయము కాని 'రామేషు' మున్నగు చోటులందు 'బహువచనే ఝల్యేత్' అను సూత్రము చరితార్థమైనది. ఈరీతిగ అన్యత్ర చరితార్థములగు 'సుపిచ' బహువచనే ఝల్యేత్ అను రెండుసూత్రములకు రామ+భ్యస్ అనుచోట యుగపత్ప్రవృత్తి కలిగినది. అపుడు విప్రతిషేధే పరం కార్యం' అను సూత్రము చొప్పున బహువచనే ఝల్యేత్ అనుసూత్రము ప్రవర్తించినది. రామేభ్యః అను రూపమేర్పడినది. అట్లే భాష్యకారుడు కర్మధారయబహువ్రీహులందు విప్రతిషేధ విచారము చేసియున్నాడు. కర్మధారయ, బహువ్రీహిసమాసములకు వివిక్తవిషయమును చూపియున్నాడు. వీరః పురుషః వీరపురుషః అనునది అన్యపదార్థము లేనందున బహువ్రీహికి విషయము కాదు. ఇట్టిచోట కర్మధారయ సమాసము ప్రవర్తించి చరితార్థమైనది. కణ్ఠేకాలః అనునది బహువ్రీహికి విషయము. ఇది కర్మధారయమునకు విషయము కాదు. వీరాః పురుషాః యస్మిన్ సః వీరపురుషకో గ్రామః అనుచోట సామానాధికరణ్యా ముండుటచే కర్మధారయసమాసము ప్రాప్తించుచున్నది. అన్యపదార్థవివక్ష యుండుటచే బహువ్రీహి ప్రాప్తించుచున్నది. అట్టికతి 'విప్రతిషేధే పరం కార్యం' అనుసూత్రముచొప్పున పరమగు బహువ్రీహిసమాసము ప్రవర్తించును అని భాష్యాశయము. ఇచ్చట కణ్ఠేకాలః అనునది బహువ్రీహికి వివిక్తోదాహరణముగ చూపబడినది. అనగా కర్మధారయసమాసమునకు ప్రాప్తిలేని సమాసము బహువ్రీహికి ఉదాహరణము చూపబడినది. ఇచట చూపబడిన కణ్ఠేకాలః అనునది వ్యధికరణబహువ్రీహిసమాసమే యని యంగీకరింపక తప్పదు. ఇచ్చట మఱియొకమార్గము లేదు. ఇచ్చటకూడ కణ్ఠే స్థః కాలః యస్య అని విగ్రహము చూపి సమానాధికరణసమాసము అనినచో సామానాధికరణ ముండుటచే కర్మధారయసమాసమునకుగూడ ప్రాప్తియుండుటచే బహువ్రీహికి వివిక్తోదాహరణము కానేరదు. అపుడు 'బహువ్రీహే రవకాశః కణ్ఠేకాలః' అను భాష్యము సంగతము కానేరదు. కాగా విప్రతిషేధవిచారపరమగు భాష్యము వలన కణ్ఠేకాలః అనునది వ్యధికరణపదబహువ్రీహి యనునది సిద్ధించును. అట్లైనచో సామానాధికరణ్యము లేనందున బహువ్రీహికి ఇదే వివిక్తోదాహరణ మగును. ఇచట ఈయంశమును గుర్తింపవలయును. సప్తమీ పూర్వపదస్య సమాసః ఉత్తరపదలోపశ్చ, కణ్ఠే స్థః కాలః యస్యసః కణ్ఠేకాలః' అను 'అనేక మన్యపదార్థే' అనుసూత్రస్థభాష్యమును బట్టి కణ్ఠేకాలః అనునది సమానాధికరణపదబహువ్రీహి. బహువ్రీహే రవకాశః కణ్ఠేకాలః అను 'వర్ణో వర్ణేన' అను సూత్రస్థభాష్యమునుబట్టి కణ్ఠేకాలః అనునది వ్యధికరణపద బహువ్రీహి. కణ్ఠేకాలః అనుచోట మీదిభాష్యమునుబట్టి సమానాధికరణబహువ్రీహిని వ్యధికరణపదబహువ్రీహిని కూడ అంగీకరింపవలయును.

అందుచే కణ్ఠేకాలః అను బహువ్రీహి వ్యధికరణపద బహువ్రీహికూడ కావచ్చును. ఇట్టిసమయమున కణ్ఠేకాలః అనుదానిని సమానాధికరణపదబహువ్రీహిగ చూపించి వ్యధికరణపదబహువ్రీహి ఎచటను అంగీకరింపనక్కరలేదు. అంతతః అది అనార్షము. కేవలము నవీనవ్యాఖ్యాతలు జొనిపిన అంశము అనునట్టి అధునాతనుల యాశయము పరిగ్రాహ్యము కాదు.

నాచే చూపబడిన మీది సూత్ర, వార్తిక, భాష్య

సందర్భమువలన «వ్యధికరణబహువ్రీహి అన్ష ము» అను అంశము అవివాదాంశము.

అధునాతనులయభిప్రాయము ఆలోచనీయము. ఇందు తత్త్వమును విజ్ఞులు గ్రహింతురుగాక!

చిత్రగుః అనునది బహువ్రీహిసమాసము. చిత్ర+జస్ గో+జస్ అను అలౌకికవిగ్రహవాక్యమున 'అనేక మన్య పదార్థే' అనుసూత్రముచే సమాససంజ్ఞ ప్రవర్తించును. తత్ప్రయుక్తమగు లుక్కు రాగా 'గో స్త్రియో రుపసర్జనస్య' అను సూత్రముచే హ్రస్వము ప్రవర్తించును. 'స్త్రియాః పుంవదిత్యాది సూత్రముచే 'చిత్రా' శబ్దమునకు పుంవద్భావము ప్రవర్తించును. చిత్రాః గావః యస్య అనునది లౌకికవిగ్రహవాక్యము. చిత్రగుః అను సమాసమువలన చిత్రాభిన్నగోస్వామీ అనుబోధ కల్గును. చిత్రాః గావః యస్య అను లౌకికవిగ్రహవాక్యమువలన 'యత్సంబంధిన్యః గావః చిత్రాః' అను బోధ కల్గును. కాగా వృత్తి విగ్రహములకు భిన్నార్థకత్వము వాటిల్లుచున్నది. వాటికి సమానార్థకత్వము న్యాయము. పైరీతిని వృత్తివిగ్రహములకు సమానార్థకత్వము లభింపలేదు. వృత్తివిగ్రహములకు సమానార్థకత్వమును మీమాంసకు లీరీతిగ పొందు పఱచిరి. చిత్రగుః మున్నగు సమాసములకు చిత్రాణాం గవాం అయం అని విగ్రహమును చూపవలయును. ఈ విగ్రహవాక్యము వలనకూడ 'చిత్రా భిన్నగోస్వామీ' అను బోధ కలుగుచున్నది. ఇట్లు వృత్తివిగ్రహములకు సమానార్థకత్వము సిద్ధించును. చిత్రాః గావః యస్య అని లౌకికవిగ్రహము చూపరాదు. అట్లైనచో పూర్వము చెప్పినరీతిని వాటికి భిన్నార్థకత్వమే లభించును. కనుక వృత్తివిగ్రహములకు సమానార్థకత్వానురోధముచే చిత్రగుః మున్నగువానికి చిత్రాణాం గవాం అయం అను విగ్రహమే ఉచితము. చిత్రాః గావః యస్య అనునది ఉచితము కాదు. అట్లు వైయాకరణులు చెప్పుట అయుక్తము.

ఈమీమాంసకులయాశయము సరికాదు. చిత్రాణాం గవాం అను విగ్రహము మునివచనవిరుద్ధము. చూడుడు: సత్యర్థే బహువ్రీహిః, కర్తృకర్మవచనేన అప్రథమాయాః, అప్రథమా విభక్త్యర్థే బహువ్రీహిః శేషో బహువ్రీహిః త్రికతః శేషః అని మునివచనములు. వీనివలన ప్రథమాంతములకే బహువ్రీహి యనియు, అప్రథమా విభక్త్యర్థము నందే బహువ్రీహిసమాస మని స్పష్టపడుచున్నది. అలౌకిక విగ్రహవాక్యమున ప్రవిష్టములగు పదములు సమాసములు రాగా 'చిత్రగుః' అని సమాసరూప మేర్పడును. సమాసము లేని పక్షమున అలౌకికవిగ్రహవాక్యప్రవిష్టములే పరినిష్ఠితములై సమాసార్థమును తెలుపుటకు ఉపయోగింపబడును. అట్టి లౌకికపదములు అభియుక్తులచే చిత్రాః గావః యస్య అని యుపయోగింపబడుచున్నవి. అందువలన అలౌకికవిగ్రహవాక్యమున ప్రథమాంతములకే ప్రవేశము. లౌకికవిగ్రహవాక్యము మాత్రము షష్ఠ్యంతపదములకే అను మీమాంసకాభిప్రాయము శాస్త్రవిదూరము. మఱియు కేవలము సమాసార్థమును బోధించుటకొరకే లౌకికవిగ్రహవాక్య ప్రయోగము కాదు. మఱి సమాసాదులకు వైకల్పికత్వమును ప్రదర్శించుటకుకూడ లౌకికవిగ్రహవాక్యప్రయోగ మావశ్యకము. వైకల్పికత్వప్రదర్శకమగు వాక్యము చిత్రాః గావః యస్య అనునదియే. చిత్రాణాం గవాం అయం అనునది కానేరదు. మఱియు సమసనం ఏకీభావః అను నర్థము కలది సమాసము. దానికి ప్రతిద్వంద్విపదము విగ్రహమను పదము. సమాసఘటకపదానాం విభిన్నత్వేన గ్రహః విగ్రహః అని దానియర్థము. చిత్రాణాం గవాం అయం అనునది విగ్రహవాక్యము కానేరదు. చిత్రాః గావః యస్య అనునదియే యగును. కనుక వృత్తివిగ్రహములకు సమానార్థకత్వము నుపాదించుటకై మీమాంసకులు చూపిన విగ్రహము మునివచన విరుద్ధము. అయుక్తము. అనుపపన్నము. వృత్తివిగ్రహముల కీరీతిగ సమానార్థకత్వము నుపాదించుట యుక్తము.

చిత్రగుః అనునది సమాసపదము. ఆ సమాసార్థమును వివరించెడి వాక్యము చిత్రాః గావః యస్య అనునది. చిత్రాః గావః యస్య సః అనునది స్వతంత్రప్రయోగము. అనగా స్వతంత్రముగా అర్థబోధార్థమై ప్రయుక్తమగు వాక్యము. ఇచట విగ్రహవాక్యముగ స్వీకరింపబడిన చిత్రాః గావః యస్య సః అనుచోట విశేష్య విశేషణ భావ వ్యత్యాసముచే వృత్తియందువలె చిత్రగోస్వామీ అనుబోధయే కల్గును. విశేష్యవిశేషణభావవ్యత్యాసము చూపుటకై చిత్రాః గావః యస్య సః చిత్రగుః అని

వృత్తులు ప్రవర్తించుచున్నారు. సర్వనామసంజ్ఞాసూత్రస్థ భాష్యమునకూడ 'సర్వ ఆదిః ఏషాం తాని' అని విగ్రహము చూపబడినది. చిత్రాః గావః యస్యసః చిత్రగుః అను వాక్యమున చిత్రగు అనుపదము చిత్రగు పదబోధ్య పరము. చిత్రగోస్సమ్బన్ధీ యో భవతి స చిత్రగు పదబోధ్యః అని వాక్యమున కర్థము. పచతీతి పాచకః అను మున్నగు వాటికి ,పాచకపదం పచతీ త్యేతత్సమానార్థం' అను బోధ కల్గును. కాగా వృత్తివిగ్రహములకు సమానార్థకత్వము స్పష్టము. విగ్రహవాక్యమువలన చిత్రగోస్వామీ అనియే బోధకల్గును. చిత్రగుః అను సమాసపదమువలనకూడ చిత్రగోస్వామీ అనియే బోధకల్గును. చిత్రాః గావః యస్య సః అను స్వతంత్రవాక్యమున విశేష్యవిశేషణభావము యథాస్థితముగనే యుండును. ఇట్లే అక్షైః దీవ్యతి ఆక్షికః అను మున్నగుచోటులందుకూడ విగ్రహవాక్యమున విశేషణ విశేష్యభావ వ్యత్యాసముచే అక్షకరణక దేవనాశ్రయః అను ఆశ్రయవిశేష్యకబోధయే కల్గును. కాగా అక్షైః దీవ్యతి అను తిజంతమందుకూడ విశేషణవిశేష్యభావము విపరీత మగును. అనగా స్వతంత్రవాక్యమున దీవ్యతి అనునది తిజంత మగుటచే భావప్రధాన మాఖ్యాతమ్, అను యాస్కవచనానుసారముగ క్రియావిశేష్యక బోధజనక మగును. ఆ తిజంతమే విగ్రహప్రవిష్ట మగునపుడు అర్థనిర్ణయము కొఱకు సూత్రఘటక మగునపుడును కర్తృవిశేష్యక బోధ జనక మగును. విశేషణవిశేష్యభావవ్యత్యాస మనగా నిదియే. ఇచట దీక్షితాదులు ఈరీతిని చూపిరి తిజంతము సర్వత్ర క్రియాముఖ్యవిశేష్యకబోధజనకమే యగును. అట్టి 'తిజంతార్థమున విధింపబడిన తద్ధితప్రత్యయము క్రియాముఖ్యవిశేష్యకబోధజనక మగును. అనగా క్రియాప్రధాన తిజంతార్థరహిత మగు తద్ధితప్రత్యయము విశేషణవిశేష్య భావవ్యత్యాసముచే కర్తృవిశేష్యకబోధజనక మగును. వ్యత్యాసము తద్ధితయందే కలుగును. కాగా వృత్తివిగ్రహములకు సమానార్థకత్వము అను నియమము విశేషణవిశేష్య భావాతిరిక్తవిషయకము.

కాని ఈ దీక్షితాశయము సరికాదు, పూర్వము చెప్పిన రీతిని వృత్త్యర్థానుసారముగ విగ్రహవాక్యమునందును సూత్రస్థ మగు దీవ్యతి అనుపదమునందును విశేషణవిశేష్య భావవ్యత్యాసమును స్వీకరింపవలెను. అపుడు వృత్తివిగ్రహములకు సమానార్థకత్వము ఉపపన్నమగును. ఇది నాగేశుని యభిప్రాయము. నాగేశమతమునకు తేన దీవ్యతీత్యాదౌ నిర్దేశే గుణప్రధానభావో న వివక్షితః అను పుంజరాజగ్రంథము ప్రమాణ మగుచున్నది. ఇట్లే తద్వహతి రథయుగ ప్రాసంగం' అను సూత్రస్థభాష్యముకూడ నాగేశ మతమునకే అనుకూలముగ నున్నది. ద్వితీయాంత మగు రథాదులకంటె వహతి అను అర్థమున యత్ప్రత్యయము ఈ సూత్రముచే విధింపబడుచున్నది. 'రథం వహతి రథ్యః' ఇచట భాష్య మిట్లున్నది. 'తస్యేదం' అను సూత్రము చేత షష్ఠ్యంతముకంటె రథస్య వోఢా అను అర్థమున యత్ప్రత్యయము సిద్ధించుచుండగా తద్వహతీత్యాది సూత్రారంభము నిష్ప్రయోజనము అని శంకించుకొని 'శబ్దభేదాన్నప్రాప్నోతి, అన్యశ్శబ్దః రథం వహతి, అన్యః రథస్య వోఢా' అని చెప్పెను. వహతి అనునది క్రియాప్రధాన మగుటచేతను వోఢా అనునది ద్రవ్యప్రధాన మగుటచేతను శబ్దభేదముండుటచే 'తస్యేదం' అనుసూత్రముచే ప్రత్యయ సిద్ధి కానేరదు. తరువాత 'అర్థసామాన్యాత్సిద్ధమ్' ఇహ య ఏవార్థో రథం వహతి, స ఏవార్థః రథస్య వోఢా' అని చెప్పెను. రథ్యః అనునది తద్ధితాంతము. ఇచట తస్యేదం అనుసూత్రముచే ప్రత్యయము విధించినచో రథస్య వోఢా అని విగ్రహము. తద్వహతీత్యాది సూత్రముచే ప్రత్యయమును విధించినచో 'రథం వహతి' అను విగ్రహమును చూపవలెను. కాగా య ఏవార్థః రథం వహతి స ఏవార్థం రథస్య వోఢా' అను భాష్యమునకు రథ్యః అను తద్ధితాంతమునకు విగ్రహభూత మగు రథం వహతి అను వాక్యమునకు ఏ అర్థము కలుగుచున్నదో ఆ తద్ధితాంతమునకు విగ్రహభూత మగు రథస్య వోఢా అను వాక్యమునకు కూడ అదియే అర్థము అని ఆశయము. ఈ భాష్యముచే విగ్రహవాక్యమునగే, సూత్రస్థ తిజంతమునవే విశేషణ విశేష్యభావవ్యత్యాసము స్పష్టముగ చూపబడినది. కాగా రథం వహతి రథస్య వోఢా అను చోటులందు అర్థసామ్యముండుటచే 'తస్యేదం' అను సూత్రముచేతనే ప్రత్యయసిద్ధి కలుగుచుండుటచే తద్వహతీత్యాది సూత్రారంభము వ్యర్థము అను పూర్వపక్షమును సిద్ధముచేసి తరువాత 'ద్వి

రథ్యౌ' ఇత్యాదౌ 'యతో ఽంగభావాత్ప్రాంతతత్' అని సమాధానము చెప్పెను. 'ద్వి రథ్యః' అనుచోట 'త స్యేదం' అను సూత్రముచేతనే ప్రత్యయమును విధించినచో ఆ ప్రత్యయము ప్రాగ్దీవ్యతీయము కనుక ద్వయోః రథయోః వోఢా ద్విరథ్యః అనుచోట 'ద్విగోర్లుగనపత్యే' అను సూత్రమున ఆ ప్రాగ్దీవ్యతీయమునకు లుక్కు రావలెను. ఆ యత్ప్రత్యయమునకు అంగభావాత్మమై 'త ద్వహతి' త్యాది సూత్రముచే యత్ప్రత్యయ విధాన మావశ్యకము. ఈయత్ప్రత్యయము ప్రాగ్దీవ్యతీయము కానందున లుక్కునకు ప్రాప్తి లేదు. ఇచట యత్ప్రత్యయము అజాది ప్రత్యయము కానందున 'ద్విగోర్లుగనపత్యే' అను సూత్రముచే లుక్కు ఎట్లు? లుక్ సూత్రమున అజాది యనునది అపూర్వ వచనము కాదు.

'గోత్రేఽలుగచి' అను సూత్రమునుండి 'అచి' అనునది అపకర్ష చేసి వాక్యభేదముచే అన్వయింపవలెను. అందువలన కొన్నిస్థలములందు హలాదిప్రత్యయములకుకూడ లుక్కు రావచ్చును. ఈయర్థమును కల్పించుటలో తద్వహతి రథయుగ ప్రాసఙ్గం, యేన విధి స్తదన్తస్య' అను రెండు సూత్రములలోని భాష్యము ప్రమాణము. ఈ యర్థము 'ద్విగోర్లుగనపత్యే' అను సూత్రభాష్యప్రదీపోద్ద్యోతమున స్పష్టముగ నున్నది. సిద్ధాంతస్థలమున ఈవ్యాఖ్యానము చూపబడినది. న్యాయసామ్యముచే సమాసవృత్తిలోగూడ విశేషణవిశేష్యభావవ్యత్యాసము స్వీకరింపబడినది.

ఇట్లు వృత్తివిగ్రహములకు సమానార్థకత్వ ముపపన్నమగును. వృత్తివిగ్రహములకు సమానార్థకత్వము విశేషణవిశేష్యభావాతిరిక్తవిషయకము అను సంకోచముకూడ చేయనక్కరలేదు.

సారాంశము : సమానాధికరణపదబహువ్రీహి స్వారసికము. సార్వత్రికము. వ్యధికరణపదబహువ్రీహి మునిసమ్మతము. "చిత్రాణాం గవాం అయం అనునది విగ్రహవాక్యము" అను మీమాంసకవాక్యము అయుక్తము. 'వృత్తివిగ్రహములకు సమానార్థకత్వనియమము విశేషణవిశేష్యభావాతిరిక్తవిషయకము' అను దీక్షితాదుల యాశయము అయుక్తము. వృత్తివిగ్రహములకు సమానార్థకత్వము సర్వదా సోపపత్తికము.

# భువనేశ్వరీస్తుతి *

శ్రీ ఘమిడిపాటి వేంకట సుబ్రహ్మణ్య శర్మ

❈

శ్రీమన్నాదబ్రహ్మ
క్షేమం బరానందమయి న శేషజగత్కా
ర్యామేయకారణము వి
ద్యామయి నంబిక నుతింతు, నఖిలశ్రీదన్.

అమ్మవు సుమ్ము విశ్వమున, కాద్యవు బమ్మకుఁ దమ్మికంటికి
న్నమ్మెమ్మనవాలుదాల్పునకు ముద్దగు మేనుల నిచ్చి తీవె; లో
కమ్ముల మూటికి స్జని వికాస లయమ్ముల నీవె సల్పె ద
చ్ఛ మ్మగు పల్కున న్నిను భృశమ్ము నుతించెద విద్య నంబికా!

ఇల, జల, మగ్గి, గాలి నభ మిందుఁడు భానుఁడు హోత నాగ మే
ను లెనిమిదింటిచేఁ దగు మనోజరిపుం డగు నమ్మహేశుఁ డి
చ్ఛలు బృథుశక్తితో సత మెసంగుటకుం గత మెన్నఁగా నగే
ట్కులవరసార్వభౌమునసుఁగుందనయా! నిజ మీవె యంబికా!

దేవత లెల్లరుం గొలువఁ దెన్నుల మూట రహించి పారు గం
గావహినీవరేణ్యకు జగమ్ముల నెల్ల విశిష్టతాప్తి యం
బా, విలసిల్ల హేతువు త్వదంఘ్రిసరోజరజఃపవిత్రిత
శ్రీవహసోమభృజ్జలముఁ జెంది భ్రమించుట నం చెఱింగితిన్.

కుముదిని నేకలాఢ్యుఁ డెసఁగుం గనఁ జేయును గాని యన్యకుం
బ్రమదముఁ గూర్ప లేఁడు; రవి పద్మినినే యలరించుఁగాని హ
ర్షముఁ గలిగింప నేరఁడు ధర న్పెర; కొక్కనిఁ దన్ప నొక్కఁడో
పు; మఱిప్రపంచము న్జననిః ముంచెదు తుష్టిని దృష్టి నీ వహో!

* శ్రీమహాయోగివర దూర్వాసోమహాముని విరచిత శ్రీభువనేశ్వరీస్తుతికి భావానువాదము.

అద్దిర పెద్ద విజ్జగము, లన్నిటి కయ్యును గ్రొత్త జన్మనం
బొద్దిక నంది యుండెద వహో! పృథుశైలజవయ్యు మార్దవం
బుద్దవిడిం దగ న్నెగడె, దోపి; త్రయీజనయిత్రి వయ్యు నా
సుద్దికిఁ గానరా పెడఁద చొప్పున లేకయు ధ్యేయ వంబికా!

పొందఁగరాని మానవులఁ బుట్టుకఁ బెందఱి కంది యింద్రియా
లందుఁ బటుత్వముం బడసి యన్నిజగమ్ములఁ గన్న నిన్ను హృ
న్మందిరమందుఁ జేర్చి పరమం బగు భక్తి భజింపకున్న వాఁ
రందఱు మందులై పడెద, రమ్మరొ! నిచ్చెన నెక్కి క్రిందకిన్.

పచ్చని కప్పురంపు బొడి బాగగు చల్లని నీటఁ జందనం
బెచ్చుగఁ జేర్చి కూర్చి జనయిత్రిరొ! నీమెయిఁ బూసి వాసిగా
విచ్చి సువాసనన్జెలఁగు వేలకు మించిన మంచిపూల ని
న్నెచ్చిన భక్తి వేడ్క భజయించి రహింతురు సార్వభౌమతన్.

తొలుతటి తమ్మిపూ నడి విధుప్రతిమానన! కూర్కుఁ గన్న పా
పలయెకిమీనిఁబోలు నడిబాటను జేరి జగం బొనర్చి మిం
చుల ననచుట్ట దైన సొగసు న్వహియించి రహించు చేను ద
మ్ముల విదళించి మించి జగము న్గడుఁబొంది రహింతు వంబికా!

అచ్చటనుండి జారు పరమామృతబిందురసంబుల న్మెయి
న్గ్రిచ్చుటఁ దడ్పు చాసరణిగా మఱల న్లయ మందినట్టు లేఁ
రచ్చఁపు డెందమందు నిను నమ్మరొ! కొంతురొ! వారిఁ కెన్నడుం
బొచ్చెఁపు గర్భమం దునికిఁ బొందరు దర్పకజిత్కుటుంబినీ!

ఇమ్మహి యోగులెల్ల భువనేశ్వరి! యోగము నంది వైరిష
ట్కమ్ము నడంచి యింద్రియనికాయముఁ గట్టి ప్రసన్న మైన చి
త్తమ్మునఁ బాశ మంకుశ ముదాత్తవర మ్మభయమ్ము హస్త వ
ద్మమ్ములఁ దాల్చి వొల్చు నిను, మంజుతరాస్యను గాంత్రు ధన్యులై.

పరభక్తి న్సతతంబు డెందమున నావర్తింతు నాలంబికా
స్ఫారకర్ణాభరణంబు; రమ్యముఖముం, జార్వాయతాక్షంబుఁ దీ
వరవృత్త స్తనయుగ్మకమ్ముఁ దనుదీవ్యన్మధ్యము న్హస్తస
ద్వరదాఽభీకలశాఽక్షసూత్రకర మౌ త్వద్రూపము న్శాంకరీ!

ఇరుగడలందు నాలు గగు నేన్గులు బంగరుకుండల న్సుధా
భరితముల న్గరంబులను బట్టి సమాప్లుతి సల్ప లీల బం
గరుకమలంబుల న్గరయుగంబునఁ దాల్చి వరాఽభయాఽద్యహ
స్తరుచిర మౌ సువర్ణసదృశప్రభ లక్ష్మివి నీవె యంబికా!

ఎనిమిది బాహువల్లరుల నెంతయు ధీతినిఁ గొల్పి నాయుధా
ళిని వహియించి సింగమును లీలగ నెక్కి మహాఽసురవ్రజం
బును దునుమాడి, లేగరికఁ బోలెను శ్యామలదేహయష్టిఁ బా
వనతర మైన దుర్గవు భవాని! నిజంబుగ నీవె, యంబికా!

చెమ్మటబొట్లు మోము విలసిల్ల గురింజలపూసపేర్లఁ గం
ఠమ్మునఁ దాల్చి కెంపుల బెడంగున రాజిలు చీరఁ గట్టి యం
దమ్మన నింద్రనీలరుచిఁ దన్ని సమున్నతి నంది యెన్న నా
సొమ్ములఁ గ్రాలు చెంచుపడుచు న్నిను నా మది నెంచి మ్రొక్కెదన్.

మొరసెడు నూపురంబులను, ము న్గడుదూరమునందె సూచి పె
ల్లురుసముతోడ నంచలను, యానమునుం గతి నేర్వఁ జేయఁ బై
నెఱిఁ దగఁ బుట్టు నాళముల నెక్కొను తమ్ములజంట మై గడుం
బరఁగెడు నీదు కాల్గవను మౌళి వహింతు మహేశకామినీ!

దట్టంబౌ ననురక్తి కిక్క యగు నా స్థాణుండుఁ గందోయి చే
నెట్టో సూచి యతృప్తుఁ డై నయన మొం డెవ్వాని వీక్షింపఁగాఁ
బుట్టంజేసి కృతాఽర్థతం బొరసి పెంపుం గాంచెనో? గట్టురా
పట్టీ! యట్టి త్వదీయజంఘలకుఁ బె న్భక్తి న్నతు ల్సల్పెదన్.

తలఁతు నెడందలోన సతతంబును లాపున నేస్గుతొందమం
దలరెడు గర్వము న్గెలిచి; యాకదళం దమ మార్దవంబుచే
వెలసి తిరస్కరించి యతివేలము శ్రోణిభరంబు మోయ మం
జుల మగు జవ్వనం బొసఁగఁ జూపిన నీతొడల న్మహేశ్వరీ!

చనుఁగవ శ్రోణియుగ్మమును జానగు నున్నతి నొక్కవేళఁ జెం
దునటు లొనర్చు యౌవనవినూత్నదశ న్గడు నల్లనై రహిం
చి నెగడు నారు బొడ్డుపయి నిగ్గుల నీనఁగ నొప్పు నీదు పా
వన మగు మూర్తి నాహృదయవారిరుహమ్మున నమ్మ! యొప్పుతన్!

హరునయనాగ్నికి న్వెరచు నవ్వలజేనికి మిత్ర మైన క్రాం
బరువము మున్ను తా నెనసి భద్రతకై పృథుచారుతాంబుసం
భరితము నప్రతిష్ఠ మగు పల్వల మట్టు లెసంగు నీదు భా
సుర మగు నాభి నోత్రిపురసుందరి! మర్వ నొక్కప్పు డేనియున్,

మును శివుమేన నౌ భసితము న్వహియించియు నంతఁ గుంకుమం
బున ననులి ప్తమైన చనుమొగ్గల యుగ్మము తావకం బెదన్
జనని! మునింగి లేచు నిమిషంబె కనందగు నుద్గకల్గియం
తనరుణితంబు నౌ సమదదంతిపకుంభయుగంబు జేర్చెడిన్.

కుత్తుక మీరుచు న్వెలలు గొప్పగు నిగ్గను ధారఁ గ్రాలు నీ
సత్తపనీయభాసురభుజంబు లహో! జగదంబ! యాజగ
జ్జిత్తతిపుం డనంగుఁడుఁ గసి న్దన వైరిగళంబుఁగట్టఁగాఁ
గ్రొత్తగఁ జేయు పాశము లొకో యనఁగా గనుపట్టె నెమ్మదిన్.

పొంకపు సంకుదైన పొలుపు న్వెస దొంగిలి దీర్ఘ మంతగా
కంకిలి లేని పల్వితము లౌ వరభూషలఁ గ్రాలి సద్గుణా
లంకృతిచే మనోజ్ఞతఁ జెలంగెడు నీగళముం దలంచి యో
శంకరధర్మపత్ని! కనఁజాలను దృప్తి నొకప్పుడేనియున్.

యంతయు నాయతంబు లగు నీక్షణము ల్గల దై విశాల మై
యంతగు ఫాలపట్టమును మందస్మహాసముచేఁ గపోలరే
ఖాంతము నించుకంత వెలయ న్నొసట వె త్తును గల్గు నాస యు
న్వింత తగు దొంతమోవిఁ దగు నీముఖ మెంచు నతండె ధన్యుఁ డౌ,

మించిన మేల్మితావుల గమించిన పూలపయి న్సృపించి రా
జించెదు చంచరీకతతిసం బురుడించి విరించిముఖ్యను
త్యంచిత మై సదాశివవిరాట్పరిష్కృత మౌ భవత్సుకే
శాంచితపాదముం దలఁప, నమ్మరొ! శ్రీలఁ బురాణపాళముల్.

అనుదిన మార్ద్ర మౌ నెడఁద నంది సుధీశ్రుతిపేయ మైన పా
వనభవనేశ్వరీస్తుతి నెవండు పఠించునొ ? యాతఁ డెప్డు నొ
ప్పు; నిఖిలభూమిభృన్మకుటపుంజరుచిస్ఫురదంఘ్రికంబు లౌ
చు నెగడు భూరిసంపదల చోటయి మేటి భవానికృపన్.

# దక్షిణామూర్తి స్తుతి *

తన మౌనతాఽవలంబనమె వ్యాఖ్యాన మై
వరపరబ్రహ్మతత్త్వంబుఁ దెలుప
తనదు మనోజ్ఞయౌవనమూర్తి బ్రహ్మని
ష్ఠప్రవయోమౌనిసంవృతిఁ దగఁ
దనదు చిన్ముద్రాంచితనవోల్లసత్కరాం
భోజం బదెంతయు నోజ మీరఁ
దన దరహాసయుక్తముఖంబు జ్యోత్స్నవి
రాజి రాకేందు నిరాకరింపఁ

* శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య జగద్గురు శ్రీ శ్రీ శ్రీ శంకరభగవత్పాదవిరచిత శ్రీమద్దక్షిణామూర్తి స్తోత్రానువాదము.

బరఁగి పావన మౌ వటతరువు క్రింద
బోధమయు స్వాత్మారాముఁ బుండరీక
భాసురాసను నాచార్యవర్యు, భద్ర
మూర్తి నానందు దక్షిణామూర్తిఁ గొలుతు.

తనలో నద్దమునందుఁ జూడబడు సద్యత్పట్టణం బట్లు వా
ల్చిన విశ్వంబును మాయచే బయట నోలిం గ్రాలు మాడ్కి న్గనుం
గొనుచున్ స్వాత్మను నిద్రచే బలెనె కన్గో వేఁగువేళ న్నిజా
త్మనె తోపించెడు నొజ్జకుం బ్రణతి మేధాదక్షిణామూర్తికిన్.

ము న్నంకూరము గింజలోఁ బలె జగంబు న్నిర్వికల్పంబు విం
క న్నిద్దం బగు మాయచే స్థలమునుం, గాలంబును న్మన్నుగాఁ
జెన్నౌ భూరివిచిత్రతాకలనచే స్వీయేచ్ఛ మాయావియ
ట్లెన్నం జూపెడు నొజ్జకుం బ్రణతి యోగీడ్దక్షిణామూర్తికిన్.

తన దౌ స్ఫూర్తి సదాత్మకం దగు నసత్కల్పార్థకం; దేఁడు సే
రిన వారిం దగఁ దేర్చుఁ 'దత్త్వమసి' య చ్ఛ్రీవేదశీర్షోక్తి; నె
వ్వని సాక్షాత్కృతిఁ జేసి వెండియు భవాఽపారాబ్ధి నావృత్తి డిం
దునొ? యా శ్రీ గురుమూర్తికి న్నతి నొనర్తు న్దక్షిణామూర్తికిన్.

పలు చిల్లు ల్గల కుండ నుండు పెను దీపంపు న్వెలుం గట్లు భా
సిలు జ్ఞానం బెది యేని దక్షిముఖసంసిద్ధేంద్రియద్వారత
న్వెలికి న్జిందెడి యెల్ల విశ్వ మిది సందీపించు; 'జానామి' యం
చు లలిం బొల్చెడు నేనితో బ్రణత వొల్చు న్దక్షిణామూర్తికిన్.

మాయాచ్ఛాదనరాహుసంపిహితసోమబ్రధ్నులంబోలి యే
డాయె న్నిద్రితుఁ డింద్రియోపహృతిఁ జేయ న్దానె సన్మాత్రుఁ డై
పాయ న్సుప్తియుఁ 'దొల్తఁ గున్కితిని నబ్బా!' యంచుఁ దాఁ బ్రత్యభి
జ్ఞీయాఖ్యం దగు నట్టి యొజ్జకు నతుల్, శ్రీదక్షిణామూర్తికిన్.

తన బాల్యాదియు జాగ్రదాదియు నగా నౌ నవస్థాళి నె
ల్లను వ్యావృత్తిమునందుఁ బోఁ బొలిచి పోల న్నేనె యం చంతరం
బున దీపించుచు నొప్పు ప్రకటి మౌ ముద్రగా స్వకీయాత్మ భ
క్తున కత్తి న్ప్రకటించు సద్గురు నుతింతు న్దక్షిణామూర్తినిన్ .

ధరయు న్నీరము నగ్ని గాలియు ననంతం బిందుఁడు న్భానుఁడు
న్పురుషుం డంచుఁ జరాచరాత్మ మిది యొప్పు న్దానిమూర్త్యష్టకం
బె; పరిజ్ఞానికి లేదు వే రెదియు నెంతే నీపరు న్మించి యా
దరు వౌ శ్రీగురుమూర్తి కిద్దె నతి మేధాదక్షిణామూర్తికిన్.

ఈవిశ్వంబును గార్యకారణత, భృత్యేశానత న్దైశికాం
తేవాసిత్వముచేతఁ జూచు సుతపుత్త్రత్వాదిచే నేఁడు భే
దావేశంబున జాగృతి న్గలను మాయాసంపరిభ్రామితుం
డా వర్ణ్యు న్గురువర్యు నేఁగొలుతు నాయ్యు న్దక్షిణామూర్తినిన్.

సర్వాత్మత్వ మి దిట్టు లీస్తుతిని సుస్పష్టీకృతం బౌట నీ
యుర్వి న్వింటఁ దదర్థ మెంచుటను ధ్యానోత్కంఠసంకీర్తన
న్సర్వాత్మత్వమహావిభూతియుత మీశత్వంబు నైశ్వర్యముం
బర్వ న్దానయి యెవ్విధౌ తెగ లెలర్పంగా నఖండంబు నై.

అరయ నీశ్వరుఁ డొజ్జయు, నాత్మ యనఁగ మూర్తిభేదంబున విభాగమును వహించి
మిన్ను మై మేనినెల్లఁ గ్రమ్మి రహియించు దక్షిణామూర్తిగురున కిత్తఱి నెఱఁగెద.

ప్రణవ మను మంత్రమునకుఁ దాత్పర్య మగుచు శుద్ధమౌ జ్ఞాన మనెడు నిస్తులసుమూర్తి
నెగడి యనిశప్రసన్నుండు, నిర్మలుఁ డగు దక్షిణామూర్తి గురున కిత్తఱి నెఱఁగెద.

సిరికి నెలవగు కైలాసగిరి వసించు చిన్నిజాబిల్లిఁ దలను దాల్చిన ఘనునకు
మునివరులచేత సతము నర్చనములందు దక్షిణామూర్తి గురున కిత్తఱి నెఱఁగెద.

# శాంతి

## శ్రీ గోపాలచక్రవర్తి



మూడుకళ్ళసామి నుదుటికన్ను
తెరచినప్పటి కాక
మహాయుద్ధభూతపు రాక
ఆటమిక్ రక్కసులమీద
మిక్కుటంగా అలిగి వసుధ
గతంలో సతిలా ముక్కలుగా చీలు
మూడవప్రపంచసంగ్రామం
నిజంగా వొచ్చిన రోజు.

వసుంధరాదేవి బతికి బట్టకట్టాలి పదికాలాలు
మటుమాయ మవ్వాలి మారణాయుధాలు
సర్వనాశనమయ్యాక సార్వభౌము డెవ డైతేనేం
ఎవరికయ్యా కాళరాత్రి శ్మశానగానం?
రాజ్యాలేలే బాబులకు బాంబులు క్రీడావస్తువు లయితే

హామీ ఏమీ లేదు నీ అసువులకు శిశువులకు
హిరోషిమా నాగసాకి స్మృతి
కలచివైచు నేటికీ విశ్వహృది.

అంతవరకు అక్కడ జ్యోత్స్న
అంతలో అంతులేని వంత
కాళ్ళూకళ్ళూ కీళ్ళూ లేక ఎందరో
మరి కీనాశుడి పాలబడ్డవారు వందలు వందలు.

ఆటమ్‌పిడుగు పడ్డ మరుక్షణం
అంతా ఒక దీర్ఘ కాళరాత్రి
మైళ్ళకొలది రుద్రభూమి, రుధిరభూమి
అయినా తెర వేసేద్దాం గతానికి
మూఢంగా అని కోరే మతానికి
మానవవాదం నవీన వేదం కావాలి
ఎద నిండి ఎదనుండి జాలువారాలి జాలి
రమ్యబృందావనంలా పుడమి మారేతరుణం నేడు
గమ్యం చేరబోతున్నాడు అదే నరుడు
ఇపుడు ద్రోహం తలపెట్టకు
సందేహాల అరణ్యంలో
కాందిశీకుడిలా నిలబడకు
నిరుద్యోగనివారణకు మహాసమరం మందు కాదు
ఆతలపే నోటిలో మిగుల్చు ఒకరకం చేదు

ఒకసారి అన్నాడు ఇలా స్పినోజా
విను వినువీథిమానిసీ
మకుటంలేని మహారాజా!
"కేవలం సంగ్రామం లేకుండుట శాంతి
అనుకోవడం కూడా నిజంగా భ్రాంతి
శాంతి ఒక మనఃస్థితి
ఉదారదృష్టి ఆత్మవిశ్వాసం న్యాయం
వీటికి అపుడు హృదయమే కైంకర్యం."

# రేపటి మనిషి

భవిష్యన్మానవుడితలపై
బాధల ముళ్ళకిరీటం ఉండదు
అనఘం ఒక ఆధునికకవిసమయం
సరే అదే నేనూ అంటాను మొదట

నాలుగో ప్రపంచయుద్ధం వస్తే కొట్టుకుంటారు
కత్తులూ ఈటెలతో
అది ఋషి ఐన్‌స్టైయిన్ పలుకు
కాని ఆయుద్ధం రాదు, మనిషిమీద మనిషి
విసుక్కోడు ములుకు
భవిష్యత్ మానవుడు మనకంటె తెలివైనవాడు
అన్నీ సర్దుకుపోతాడు కన్నీళ్ళులేకుండా చేస్తాడు
నేస్తాలకు
మూన్నుండి మరోగోళంనుండి జనం వొస్తారు

అప్పుడు
దుఃఖాన్ని అయిదడుగులు పాతిపెట్టేసి
ఆనందభైరవిరాగం ఆలపిస్తాం అందరం.

లోకంనుండి శోకం బేనిష్‌చేసే
అనిమిషుడు వొస్తున్నాడు అతనికిదే నాస్వాగతం
కాల్చేవాళ్ళు పదిమంది సిగరెట్లు ఒకటే
అదీ నిన్నటి అవస్థ
పాలూ తేనె ప్రపంచంలో ప్రవహించి ప్రతివాడికి
రేపుగురించి భయంలేనిది రేపటివ్యవస్థ

ఇవాళ మనకు కోరికలే గుర్రాలు
మూడూ ఇంటూ ఏడూ శతాబ్దంలో
సరఫరా చేసుకుంటాం
రెక్కలగుర్రాలుకూడా
రిక్కల్లోకి నిజంగా ఎగరడానికి
ఎల్లలు చెరిగిపోయి
ఎల్లరు ఒక టయ్యే వేళ
నేటి సగటుసంతోషాన్ని
వేయిపెట్టి హెచ్చించేరోజు
నిత్యం వసంతంగా వుండేసీజను
అదే కనిపిస్తున్నది మనస్టెలివిజనులో.

# యోగదర్శనము

శ్రీ మిన్నికంటి గురునాథశర్మ

యోగేన చిత్తస్య, పదేన వాచాం,
మలం శరీరస్యచ వైద్యకేన
యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం
పతంజలిం ప్రాంజలిరానతోఽస్మి.

మన మెక్కడనుండి వచ్చితిమో, మరల నెక్కడికిఁ బోవలయునో చూపుటకే దర్శనములు వెలసినవి. అవి యాఱు. దశాధ్యాయరూపమైన వైశేషికదర్శనమును గణాదముని రచించెను. పంచాధ్యాయరూపమైన న్యాయదర్శనమును గౌతమముని రచించెను. ఆఱధ్యాయములుగల సాంఖ్యదర్శనమును గపిలముని రచించెను. పండ్రెండధ్యాయములుగల పూర్వమీమాంసాదర్శనమును జైమినిముని రచించెను. నాల్గధ్యాయములుగల యుత్తరమీమాంసాదర్శనమును బాదరాయణమహర్షి రచించెను. నాలుగు పాదములుగల యోగదర్శనమును బతంజలిముని రచించెను. పతంజలిముని మనోదోషము హరించుటకు యోగసూత్రములనే గాక వాగ్దోషము హరించుటకు వ్యాకరణమహాభాష్యమును, కాయదోషము హరించుటకుఁ జరకవార్తికమును లోకమున కనుగ్రహించెను.

## పతంజలి

'గోనర్దదేశే కస్యచిదృషే రంజలేః
సంధ్యాకరణసమయే పతిత ఇత్యైతిహ్యాత్'

అని నాగేశభట్టు వ్యాకరణమున నుల్లేఖించెను. ఒకఋషి గోనర్దదేశమున సూర్యుని కర్ఘ్యమిచ్చుటకై యంజలింబట్టి నాదిశేషుఁడు సూక్ష్మరూపమున నాయంజలియందుఁ జేరి యటనుండి భూమిపైఁబడి మునికుమారరూపమునఁ గాన్పించెను. ఆబాలు నాఋషి కొడుకుగా స్వీకరించెను. అతఁడే పతంజలిమహర్షి. ఇతనిజనని గోణిక. ఆమె పుత్రార్థినియై తపస్సుచేయుఁగా నామెకే యితఁడు లభించెనని కొందఱు వ్రాసిరి. పతంజలికి వ్యాఘ్రపాదుఁడనియు నామాంతరము కలదు. పతంజలికాలము పదియవశతాబ్ది యని పరమహంసపరివ్రాజకాచార్య శ్రీ అనుభవానంద స్వాములవారు చర్చించి సౌరభమున వ్రాసిరి.

## యోగసూత్రములు

పతంజలిమహర్షి యోగసూత్రముల నాల్గుపాదములుగా వ్రాసె. మొదటిది సమాధిపాదము. ఇందు 51 సూత్రములు గలవు. రెండవది సాధనపాదము. ఇందు 55 సూత్రములు గలవు. మూఁడవది విభూతిపాదము. ఇందు 55 సూత్రములు గలవు. నాలవది కైవల్యపాదము. ఇందు 34 సూత్రములు గలవు. మొత్తము 195 సూత్రములలో సూత్రలక్షణప్రకారము యోగపద్ధతినంతయుం దెలిపెను. ఈ సూత్రగ్రంథమునకు వ్యాసమూర్తి భాష్యము రచించెను. దానికి వాచస్పతిమిశ్రులు 'తత్వవైశారది' యను వృత్తిని రచించెను. భోజుఁడును నొక వ్యాఖ్యానము వ్రాసెను. తనబాహువును ఖండించినను దెలిసికొనని యోగిపుంగవులు శ్రీ సదాశివేంద్రసరస్వతీస్వాములవారు యోగసుధాకర వృత్తిని వ్రాసిరి.

«హిరణ్యగర్భో యోగస్యవక్తానాన్యః పురాతనః» అని యాజ్ఞవల్క్యస్మృతిలో నుంటచే యోగము మొదట హిరణ్యగర్భునినుండి బయలుదేఱినది. «త్రిరున్నతం స్థాప్య సమం శరీరమ్ ( 2-8 ) అని శ్వేతాశ్వతరోపనిషత్తులోను యోగపద్ధతులు గలవు. మఱియు "తత్కారణం సాంఖ్య

యోగాధిగమ్యం. జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః. (6-13) అనియు సందే యోగము ప్రశంసింపబడినది. కాని యోగమువారిసిద్ధ మనకతీతము. వీనిని దత్తాత్రేయాది భగవదవతారమూర్తులు కార్తవీర్యార్జు నాలర్కాది రాజర్షులు పెంపొందించిరి. ఇతిహాసికి పురుషులుగాని వా రెందరో కలరు.

శ్రీ ఆదినాథ, మత్స్యేంద్ర;శాబ, రానందభైరవాః
శౌరంగీ, మీనా, గోరక్ష, విరూపాక్ష, బిలేశయాః
మన్థానో భైరవో యోగీ, సిద్ధి, బుద్ధశ్చ, కంథడిః
కోరంటకః సురానందః,సిద్ధపాదశ్చ చర్పటిః
కానేరీ, పూజ్యపాదశ్చ, నిత్యనాథో, నిరంజనః
కపాలీ, బిందునాథశ్చ, కాక చ్చండీశ్వరాహ్వయః
అల్లామః, ప్రభుదేవశ్చ,ఘోడా,చోలీచ టింటిణిః
భానుకీ నారదేవశ్చ, ఖండః, కాపాలిక స్తథా
ఇత్యాదయో మహాసిద్ధాః, హఠయోగప్రభావతః
ఖణ్డయిత్వా కాలదండం; బ్రహ్మాండే విచరంతి తే
(హ. ప్ర)

అని శ్రీస్వాత్మారామయోగి వ్రాసెను. వర్తమానకాలమున గూఢముగా నెందరో కలరు. నాపరిచితులే పదుగురు కలరు.

## యోగాభ్యాసము

ఇంక నీయోగము నె ట్లభ్యసింపవలయునో చూతము. యోగాభ్యాసము చేయుమందిరము పరిశుభ్రముగా నుండవలె. మంచిగాలి వచ్చుచుండవలె. చీమలు దోమలు నల్లులు మున్నగువానిబాధ యుండరాదు.

అల్పద్వారమరంధ్రగ ర్తవివరం
నాత్యుచ్చనీచాయతం
సమ్యగ్గోమయ సాంద్రలిప్తం, మమలం,
నిశ్శేషజంతూ జ్ఝితం
బాహ్యేమంటప వేదికూపరచితం
ప్రాకారసంవేష్టితం,

ప్రోక్తం యోగమఠస్యలక్షణ మిదం
సిద్ధై ర్హఠాభ్యాసిభిః'

ఆహారవిహారనియమములును మిక్కిలి యావశ్యకములు. "అతీవభోజనం త్యాజ్యం, అతినిద్రా - అతిభాషణం, త్యజేత్ కట్వమ్లలవణం, క్షీరభోజీ సదా భవేత్ - వహ్ని స్త్రీ, పథిసే వాదీన్ - ఆదౌ వర్జన మాచరేత్" కారము-పులుసు- ఉప్పు కూడదు. కల్తీలేని యావుపాలనే సేవించుచుండవలె. పాయ్యిదగ్గఱకు స్త్రీదగ్గఱకుఁ బోరాదు. దారి నడవరాదు. శరీరకష్టము కూడదు. ఉపవాసము - ఏకభుక్తము ప్రాతస్స్నానమును పనికిరాదు.

## అంగములు

యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణా ధ్యాన సమాధయో ఽష్టాంగాని (యోగ 2 పాద 29సూ). యోగమున కెనిమిది యంగములు గలవు. అహింస, సత్యము, పరద్రవ్యమపహరింపకుండుట. బ్రహ్మచర్యము, దానాదులు పట్టకుండుట, (యో. 2 పా. 30 సూ.) యివి యమము లనంబడు.

శౌచము-సంతోషము-తపము-స్వాధ్యాయము. ఈశ్వరార్పణబుద్ధితోఁ గర్మలు సేయుట, (యో 2 పా 32 సూ) యివి నియమము లనంబడు. వీనిని నుండలవఱచుకొనవలెను. తనకు సుఖముగా నుండు నాసనమునఁ గూర్చుండి ప్రాణాయామమునకుఁ గడంగవలయును. ప్రాణాయామము సులభముగాఁ గైవసము కాదు. అది కైవసమగుటకు షట్క్రియ లుండవలె.

## షట్కర్మలు

ధౌతి, ర్వస్తి, స్తథా నేతిః,
త్రాటకం, నౌలికం తథా-
కపాలభాతి శ్చైతాని-
షట్కర్మాణి ప్రచక్షతే"

అభ్యాసారంభకాలమున గురుదేవాదులం బూజించి నమస్కరించి యావల "మణిభ్రాజత్ఫణాసహస్రవిధృతవిశ్వంభరామండలా యానంతాయ నాగరాజాయ నమః" అను

మంత్రము పఠించి యాదిశేషునికి నమస్కరింపవలె.

1. ధౌతి : నాలుగంగుళముల వెడల్పును బదునైదు మూరల పొడవును గల సన్నని-మెత్తని-తెల్లని-వస్త్రమును నూలుపోగులు లేకుండఁ బ్రక్కలు సన్నదారముతో మిషన్‌పైఁ గుట్టించి సేకరింపవలె. సూర్యోదయమునకు పూర్వమే లేచి దానిని నీళ్లలోఁ దడిపి మ్రింగి మెల్ల మెల్లగా వెలికిఁ దీయవలె. ఇట్లు ప్రతిదినము నభ్యసించుచు రోజుకు రోజు మూరమూర లెక్కించుచు గుడ్డనంతయు మ్రింగి వెలికిఁదీయవలె. వెలికిఁదీయునపుడు గట్టిగాఁ బట్టుకొని రాకపోయినచో గ్రుక్కెడునీళ్ళు మ్రింగి లాగినచో సులభముగా నూడివచ్చును. ఆవల నాగుడ్డను సబ్బునీళ్లతో జాడించియు, నుడకబెట్టియు గుడ్డను బరిశుభ్రము చేసి యెండలో నారవైచి తీసి చుట్టచుట్టి యుంచుకొనవలెను. పదినిముసములలో గుడ్డనంతయు మ్రింగి వెలికిదీయవచ్చును. పదునైదునిముసములు మించకున్న మంచిది. ధౌతికి నేతికి వలయు పరికరముల నాకొసంగి యొద్దకూర్చుండి నేర్పిన శ్రీమాన్ పత్కుమారాచార్యులవారి నిట సంస్మరించుట నాధర్మము. మాఅన్నగారు శివరామయ్యగారు జలధౌతిని జేసెదరు. వారు నాదానుసంధానము చేసికొన్న ధన్యులు. ధౌతి మున్నగువానిలో నెన్నియో రకములు గలవు.

2. నేతి : జేనెఁడు పొడవు గల్గిన సులకత్రాడంతలావు గల నూలుత్రాటిని నాసికారంధ్రములనుండి యెక్కించి నోటిలోనికి వచ్చినపిదప నా రెండుకొనలం బట్టి మెల్లగా నటునిటు లాగి ముఖమునుండి వెలికిఁ దీయవలె. ఈనూలు దారమును బ్రత్యేకముగా బేనుదురు. మొదట నాకు నూలు దార మెక్కకపోఁగా సన్ననిరబ్బరు వాల్‌ట్యూబును వాడితిని.

3 వస్తి : బొడ్డులోతునీళ్లలో దిగి యుత్కటాసనమున గూర్చుండి గుదముతో నీరుపీల్చి మరలి వదలవలయు. రెండు పాదాంగుష్ఠములను భూమిమీఁద మోపి మడిమల పైకెత్తి కుర్చిమీదఁ గూర్చున్నయట్లు పిఱుదులు మోకాళ్లకు సరిగా నుండునట్లు కూర్చుండిన నుత్కటాసనమగును. ఈయాసనములు 86వరకు గలవు. పాఠశాలలలో నేవో డ్రిల్లు చెప్పెదరు గాని యీయాసనములనే డ్రిల్లుగా జెప్పినచో బాలుర కింక వ్యాధు లుండునా?

4. నౌలి : పొత్తికడుపు నరములను బొడ్డులో నటునిటు కుడియెడమవైపులకు గిరగిర త్రిప్పుట. ధౌతియందు వీనిం గూడఁ జేసి వస్త్రముం దీయుదురు.

5. త్రాటకము : రెప్పలు మూయక అను నొకలక్ష్యముం జూచుట.

6. కపాలభాతి : నాసికారంధ్రములనుండి నీటిని నోటిలోనికిఁ బీల్చి వెడలఁగ్రక్కుట. నోటితో నీరు పీల్చి నాసికారంధ్రముల వెడలించుట.

ఇతరపద్ధతులలో ఫలము వెంటనే కన్పించదు గాని యీ యోగపద్ధతిలో నభ్యాసమునకు నొకకొన్నది మొదలు కొని ఫలము సముచితముగాఁ గన్పించుచుండును. అందుకే 'చేసికొన్నవానికిఁ జేసికొన్నంత మహాదేవ' యను సామెత యేర్పడినది.

ఈ షట్క్రియలవలన శరీరము పరిశుద్ధ మగును. అం దన్నియుఁ జేయకున్న 1. 4. 2-6 వన. జేయవలయును. అప్పుడు ప్రాణాయామము సులభసాధ్య మగును.

'శ్వాస ప్రశ్వాసయో ర్గతివిచ్ఛేదః ప్రాణాయామః'

(యో. 2-49)

బయటగాలిని లోనికిఁ బీల్చుట శ్వాసము. దీనినే పూరక మందురు. లోనిగాలిని వెలికివిడుచుట ప్రశ్వాసము. దీనినే రేచక మందురు ఈ రెండుకార్యములు లేకున్న ప్రాణాయామ మగును. బాహ్యమునఁగాని యాభ్యంతరమునఁ గాని గాలిని కుంభించిన కుంభకమగును. ఇదియే ప్రాణాయామము. బ్రహ్మానందసరస్వతీస్వాములవారు 8 శకండ్లు పూరకము, 32 శకండ్లు కుంభకము, 16 శకండ్లు రేచకము నైన నొకనికృష్టప్రాణాయామ మగు ననియు, 12 శకండ్లు పూరకము, 48 శకండ్లు కుంభకము, 24 శకండ్లు రేచకము నైన నొక మధ్యమప్రాణాయామ మగుననియు, 16 శకండ్లు పూరకము 64 శకండ్లు కుంభకము, 32 శకండ్లు రేచకము నైన నొక యుత్తమప్రాణాయామ మగుననియు వ్రాసిరి. ఈవిషయము విపులముగా నాదత్తమహిమలో వ్రాసితి. మరల నిచట నేల? ఇందుఁ బ్రాణవాయునిరోధము ముఖ్యము. ఎంతకాలము ప్రాణవాయుచలనము నాపుదుమో యంతకాలము మనస్సుగూడఁ జలింపక నిలిచిపోవును.

బంధీకిఁ గట్టిన యెద్దులు
రెండిటిలో నొక్కదానిఁ బ్రాణశక్తిం బో
షించె నరికట్టు నెడల
రెండవయది చచ్చినట్లు నిలువంబడదే?
నాగారికల్యాణము]

నాదబిందుకళానుభవమునకుఁ గాని, నాలుకను మూర్ధస్థానమునఁ జొనిపి యమృతము నాస్వాదించు ఖేచరికిఁ గాని, ఆధారపద్మమును మూఁడున్నరచుట్లతోఁ జుట్టుకొని నోటితో సుషుమ్నాద్వారమును మూసి పరుండియున్న కుండలిని లేపుటకుఁ గాని, స్రవించిన వీర్యమును మరల గ్రహించు వజ్రోలికిఁ గాని, నాసాగ్ర, జిహ్వాగ్ర, తాలు జిహ్వామధ్యజిహ్వామూలాది ప్రదేశములందుఁ జిత్తమును సంయమించుటకుఁ గాని, హృదంబుజము నూర్ధ్వముఖముగాఁ ద్రిప్పి తత్కర్ణికయందలి సుషుమ్నానాడిలో వెల్గు సూర్యచంద్రమసవైద్యుతాదిప్రభానిభం బైన జ్యోతిఁ దర్శించుటకుఁ గాని. సమాధికిఁ గాని, ప్రాణాయామ మత్యంతావశ్యకము.

కుంభకద్వారమున మనస్సునిలుపుటను నేర్చుకొన్న పిదపఁ గుంభకము లేకున్నను మనస్సును నిలుపవచ్చును. 'మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' అన్నిటికిని మనస్సే కారణముగాన దానిని నిలుపుట కిన్ని తిప్పలు పడవలయును.

'స్వస్వవిషయా సంప్రయోగే చిత్తస్వరూపానుకార ఇవేంద్రియాణాం ప్రత్యాహారః' (యో. 2 పా. 5 సూ.) శ్రోత్రాదీంద్రియములు స్వవిషయములగు శబ్దాదుల నంటుకొనక చిత్తాకృతి ననుకరించుచు నున్న వానివలె నున్నచోఁ బ్రత్యాహారము. యమాదులు పూర్వాంగ మనియుఁ బ్రత్యాహారాదు లుత్తరాంగ మనియు సాధకులు పేరిడి యుత్తరాంగమును యోగపరముగను జ్ఞానపరముగనుగూడ నుపయోగించుచున్నారు. ఈయోగదర్శనమున 'త్రయ మంతరంగం పూర్వేభ్యః' (3-7) అని యమాదిపంచకము సంప్రజ్ఞాతసమాధికి బహిరంగ మనియు, ధారణధ్యానసమాధులుమూఁడు నంతరంగమనియు నీయంతరంగమునకే సంయమ మని నామాంతర మనియుఁ గలదు. ఈసంయమమెచట నిల్పిన నేమి ఫలమో యది యిందు విభూతిపాదమున విస్తరింపఁబడెను. అందులకే విభూతియని యీ పాదమునకుఁ బేరిడఁబడెను.

'దేశబంధః చిత్తస్యధారణా' (యో-3-1) ప్రదేశమునందు వృత్తిరూపముననే చిత్తమును బంధించిన ధారణయగు. ప్రదేశమన నాత్మగాని షట్చక్రాదులుగాని యేదైనం గావచ్చు.

షట్చక్రములు

మూలాధారం గుదస్థానం,
స్వాధిష్ఠానంతు మేహనం
నాభిస్తు మణిపూరాఖ్యం
హృదయాబ్జ మనాహతం
తాలుమూలం విశుద్ధాఖ్యం
ఆజ్ఞాఖ్యం నిటలాంబుజం
సహస్రారం బ్రహ్మరంధ్ర
మి త్యాగమవిదో విదుః'

ఈచక్రముల వ్యవహారము నట్లుంచి ప్రకృత మనుసరించెద.

'తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్. (యో - 3-2) ధారణ యుంచిన స్థానమందే తొలఁగుచున్న చిత్తవృత్తిని మరలమరలఁ దెచ్చి నిల్పుట, విషయాంతరమునకుఁ బోనీక యొకేవిషయమం దుంచవలెను.

ఇదే ధ్యానము. ఇఁక మిగిలినది సమాధి. 'తదే వార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః' (యో-3-3) నేనున్నా నన్నయెఱుక లేక బ్రహ్మాకారముతో నున్న మనోవృత్తిప్రవాహమే సమాధి. ఇది యపరిమితధ్యానము వలనఁ గాని లభింపదు. ధ్యానమునఁ గర్తయుఁ గరణానుసంధానము నుండును. సమాధిలో నట్లుండదు. వీనిమనోవృత్తి ధ్యేయాకారము నొందఁగా ధ్యేయ మొక్కటియే భాసించుచుండును. అహంభావ ముండదు. అట్లు బ్రహ్మాకారముతో సమాధిలో దీర్ఘకాల ముండఁగా రజస్తమస్సులణఁగారిపోవును. సత్త్వ ముద్రేకించును. వాసనలు క్షీణించును ఇట్టివానికి నీశ్వరునకు నేకొంచెమోకాని యంతభేద ముండదు. సర్వశక్తులు వచ్చిపడును.

ఈసమాధియు సవికల్పము, నిర్వికల్పము నని రెండు విధములు. సవికల్పమును సంప్రజ్ఞాతము సబీజము ననియందురు. నిర్వికల్పమును అసంప్రజ్ఞాతము నిర్వికల్పము నిర్బీజము వని యందురు. సంప్రజ్ఞాతమున నాల్గుభేదములు గలవు. 'వితర్కవిచార - ఆనంద - అస్మితా - రూపానుగమాత్ సంప్రజ్ఞాతః' (యో, 1 - 17) వస్తువుయొక్క స్థూలరూపజ్ఞానము వితర్కము. సూక్ష్మరూపజ్ఞానము విచారము. ఆవస్తువువలనఁ గల్గునది యానందము. ఏకాత్మకత్వము అస్మిత. ఇట్లు నాల్గువిధములైన సంప్రజ్ఞాతసమాధిలో బాహ్యవిషయత్వ మండును. సంప్రజ్ఞాతముదాఁటి యసంప్రజ్ఞాతసమాధి నొందవచ్చును. 'మనసోవృత్తి శూన్యస్య బ్రహ్మ యాస్థితిః అసంప్రజ్ఞాతసమాధిః' సర్వవృత్తుల నిరోధించిన నిర్బీజసమాధి యగును. ఈస్థితిలో పాపము : మనస్సు నలినలియై నుగ్గునుగ్గైపోవును. శక్తిహీనమై లేవలేకపోవును. అప్పుడు పురుషుఁడు - కూటస్థుఁడు. పరిశుద్ధుఁడు నిత్యుఁడు ప్రకాశించుచుండును చితిశక్తియొక్కటే వెలుఁగుచుండును.

## ప్రధానము

ఏపనిపాటలేక ముక్కుమూసికొని కూర్చుండిన సమాధివలన నేమి ప్రయోజనము? దీనివిచారణకు ముందు మనకుఁ గల్గిన యాపద యేమిటో చూచుకొందము. సత్వరజస్తమోగుణములు మూఁడు గలవు. అవి తమతమ పరిణామములబట్టి నాలుగు తెఱఁగుల నుండును. "విశేష - అవిశేష - లింగమాత్ర - అలింగాని గుణపర్వాణి. (యో. 2పా. 19సూ.) మొదటిది అలింగము. దీనినే ప్రధాన మందురు. ఇందు మూఁడుగుణములు సమానముగా నుండి భోగాపవర్గహేతుకములు గాకుండును. ఇదియే ప్రకృతి. మూలప్రకృతి. రెండవది లింగమాత్రము. ఇందు బుద్ధి యుండును. బుద్ధియే మహత్తు అనఁబడును. మహత్తున సర్వకార్యములు సూక్ష్మరూపమున విలీనములై యుండును. మూఁడవది అవిశేషము. ఇం దస్మిత యనంబడు నహంకారము, శబ్దస్పర్శరూపరసగంధములను పంచతన్మాత్రలు, శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణము లను జ్ఞానేంద్రియములు వాక్పాణిపాదపాయూపస్థములను కర్మేంద్రియములు మనస్సునుండును. నాలవది విశేషము. ఇందు పృథివ్యప్తేజోవాయ్వాకాశములను పంచభూతము లుండును. ఇట్లొకగుణము మొదలుకొని యొకదానినుండి మరొకటి పుట్టినది. ఈవిషయమునే

శ్లో॥ ప్రకృతే ర్మహాన్ తతో ఽహంకారః
తస్మా ద్గణశ్చ షోడశకః
తస్మాదపి షోడశకాత్
పంచభ్యః పంచభూతాని

[సాంఖ్య కారిక 22]

ప్రధానమందలి గుణములు విషమములుగాఁ బరిణమింపఁగనే మహత్తు. మహత్తునుండి యహంకారము—అహంకారమునుండి జ్ఞానకర్మేంద్రియములు మనస్సు! పంచతన్మాత్రలు. పంచతన్మాత్రలనుండి పంచభూతములు పుట్టెను. అని సాంఖ్యము నుడువుచున్నది. యోగము చాలవిషయములలో సాంఖ్యము ననుసరించి యుండును. ఇట్లు గుణములవలన సృష్టి యేర్పడినదిగానఁ బ్రధానము జగత్కారణ మందురు. "ప్రకాశక్రియాస్థితిశీలం భూతేంద్రియాత్మకం భోగాపవర్గార్థం దృశ్యం." (యో- 2పా 18సూ॥ అలింగముగాక తక్కిన విశేషావిశేషలింగమాత్రలు మూఁడును దృశ్య మనంబడును. దృశ్యమే జగత్తు గదా. ఈజగత్తే భోగమును కైవల్యమును గూడ నిచ్చుచున్నది. ఎవరికీభోగము? ఆభోగ మెట్టిది? "సత్వపురుషయో రత్యం తాసంకీర్ణయోః ప్రత్యయావిశేషో భోగః" (యో - 3 పా 35)

బుద్ధిపురుషు లత్యంత విరుద్ధస్వభావములు గలవారు. భోగ్యమగు బుద్ధి వేఱు. భోక్తయగు పురుషుఁడు వేఱు. అయినను అనాద్యవిద్యావాసనచే నిరువురకు భేదము గోచరింపనంత యేకత్వము కల్గినది. అందువలనఁ బురుషునకు సుఖదుఃఖజ్ఞానము గల్గును. అదియే భోగము. బుద్ధిపురుషులేకమగుటతోడనే భోగము వచ్చిపడినదా? ఎవఁ డీపురుషుఁడు?

## పురుషుఁడు

'క్లేశకర్మవిపాకాశయై రపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః' (యో. 1 పా. 24 సూ.) దుఃఖకరమైన కర్మవాసనల కందని పురుషుఁ డొకఁడు కలఁడు. వాని

నీశ్వరుఁ డందురు. 'తత్ర నిరతిశయం సర్వజ్ఞబీజం' (యో. 1 - 25) అతఁ డెవ్వరికిలేని సర్వజ్ఞత్వ శక్తి గలవాఁడు. 'పూర్వేషా మపి గురుః కాలే నానవచ్ఛేదాత్' (యో. 1 - 26). అతఁడు పర్వులకు సర్వకాలములందు గురుఁడై యుండును. ఆప్పురుషుఁడు కాలమునకు బద్ధుఁడు గాఁడు. మఱియు నతఁడు ద్రష్ట అసంగుఁడు, నిరీహుఁడు, మున్నగు విధముల నాపురుషుఁడు వర్ణింపఁ బడెను. ఆ పురుషు డీశ్వరుఁడే యని గ్రహించితిరిగదా!

## సంసారము

ఆట్టి పురుషునకు ననాదికాలమున బుద్ధితోడికలయిక సంభవించెను. 'ద్రష్టృదృశ్యయోస్సంయోగః హేయహేతుః' (యో. 2 - 17) అని పతంజలిమహర్షి బుద్ధిపురుషులకు సంయోగము కలిగెనని చెప్పెను. 'బుద్ధౌ సన్నిధిమాత్రేణైవ పురుషస్య ద్రష్టృత్వమ్' అని భోజుఁడు పురుషుని బుద్ధిసన్నిధికి మాత్రము గొనిపోయెను. ఆబుద్ధిసాన్నిధ్యబలంబునఁ బురుషునకు భోగము వచ్చినదఁట. వ్యాసులు మాత్రము తమభాష్యమున విద్యారణ్యస్వాములవలె 'ద్రష్టా బుద్ధేః ప్రతిసంవేదీ పురుషః' (యోగభాష్య 2 - 17) అని పురుషుఁడు బుద్ధియందుఁ బ్రతిబింబింపఁగా ద్రష్టయయ్యెనని పతంజలిసూత్రమున కర్థము వ్రాసెను. అట్లే వాచస్పతి మిశ్రులును 'బుద్ధేశ్చైతన్యబింబగ్రాహేణ చైతన్యశ్చ శాంతాద్యాకారాధ్యారోప శ్చంద్రమసఇవ' (యో. భా. వా. 3 - 35)

పురుషుఁడు బుద్ధియందుఁ బ్రతిబింబింపఁగనే శాంతఘోరాదిచిత్తవృత్తు లన్నియుఁ బురుషునకు లేకున్నను నున్నట్లారోపింపఁబడుచున్నవనెను. దానికి జలమందుఁ బ్రతిఫలించిన చంద్రునకు జలగుణము లంటుకొన్న ట్లని దృష్టాంతము చూపెను.

"పురుషస్య దర్శనార్థం కైవల్యార్థం
తథా ప్రధానస్య
పంగ్వంధవ దుభయో రపి
సంయోగః తత్కృత స్సర్గః

[సాంఖ్యకారిక 21]

ప్రధానపురుషులకు సంయోగము కలుగఁగా గార్యము నడచుచున్నది. పురుషునకు దర్శనశక్తి యున్నదికాని వాఁడు కుంటివాఁడు. నడచుశక్తి లేదు. నిష్క్రియుఁడు. ప్రకృతికిఁ గ్రియాశక్తి యున్నది. నడచుశక్తి యున్నది. కాని గ్రుడ్డిది. అందువలనఁ బ్రకృతి పురుషు నెత్తుకొన్నచో వాఁడు దారిచూప మార్గమునఁ బోవచ్చును. ఇట్టియుభయులసంయోగమువలన వ్యవహారము జరుగుచున్నది. ఎప్పు డీయుభయులు గూడినది? «దృగ్దర్శన శక్త్యో ర్నిత్యత్వాత్. అనాదిస్సంయోగః» (భాష్యము) ద్రష్ట యనాది. నిత్యుఁడు. దృశ్య మనాది. నిత్యము. వీరికలయికయు ననాది. కర్మవాసనాపరంపరయు ననాది. ఈకర్మవాసనాసమితి ప్రతిసర్గాంతమున బుద్ధితోఁగూడఁ బ్రధానమున విలీనమైయుండి పునస్సృష్టియందుఁ దొంటియట్ల పుట్టుచుండును. 'ధాతా యథాపూర్వ మకల్పయత్' అని కలదుగా. ఇట్లు పురుషుఁడు జననమరణప్రవాహమునం బడి గోలుగుడిచెను. అనిత్యమును నిత్య మనియు, నపరిశుద్ధమును బరిశుద్ధమనియు, దుఃఖమును సుఖ మనియు భావించుచు నవిద్యలోఁ దగుల్కొనెను. ప్రకృతి యేదో? పురుషుఁ డెవఁడో? తెలిసికొనలేకపోయెను. విషయరసప్రవాహమున మునిఁగిపోయెను. అరిషడ్వర్గముచే నలజడిచెందెను. ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికతాపములకుఁ దల్లడిల్లెను. ఇట్లు చిరకాలము సాంసారికదుఃఖములు పడిపడి విసుగెత్తి చివరకు వానిం దొలఁగించుకొనుటకు యత్నించెను. పెద్దల సేవించెను. శాంతికై యాకాంక్షించెను. అశాంతికిఁ గారణము చిత్తమని యెఱింగెను. «యోగః చిత్తవృత్తినిరోధః» (యో - 1.2) యోగమువలనఁ జిత్తవృత్తుల నిరోధించి శాంతిని బొందవచ్చునని తెలిసికొని సంసారవాంఛలఁ గ్రమక్రమముగా వదలి యోగము నభ్యసించెను. [illegible]

అణిమాద్యష్టైశ్వర్యములు వలదన్నను వచ్చిపడెను. అవియు బంధహేతువులు. అశాంతికారణములు» అని వానిపై వాంఛను వదలెను పట్టు విడువక «. కైవల్యం స్వరూపప్రతిష్ఠా వా చితిశక్తిః» (యో 4-34) స్వస్వరూపసంధానము చేసికొనెను. నిర్బీజసమాధిలోఁ బడెను. శాంతి చేకూరెను. సమాధిప్రయోజన మిదియే. ఇంతకంటె నేమి కావలయును? «సత్త్వపురుషయోః శుద్ధిసామ్యే

కైవల్యమితి» (యో3.55) బుద్ధికర్తృత్వాభిమానము వదలి పరిశుద్ధమై ప్రధానమునం గలియును. పురుషుఁడును బుద్ధి నుండి తొలఁగి పరిశుద్ధుఁడై స్వస్వరూపమున నుండును. ఇదియ కైవల్యము. కైవల్య మెప్పుడు సాధ్యము కాదు గదా. అందువలన నట్లనెను. ఈకైవల్యము వడసిన పురుషునికి నిక సంసారబాధ లెక్కడివి?

## అసంగునకు సంగ మెట్లు?

అవునయ్యా! పురుషుఁ డసంగుఁడు గదా! వానికి బుద్ధితోడి సంయోగ మెట్లు? ఒకవేళ సంగ మేర్పడినను వాఁడు నిష్క్రియుఁడు గదా! వానికి సాంసారికబాధ లెక్కడివి? వానికి బంధమోక్షము లేమిటివి? అని పాఠకు లడుగవచ్చు. చెప్పెద. తొందరపడక వినుఁడు. ఈవిషయము పూర్వులు విచారింపకపోలేదు. శారీరకభాష్యమున 2-2-7 సూత్రమునకడ "కథం చోదాసీనః పురుషః ప్రధానం ప్రవర్తయేత్» అని యెత్తుకొని» ప్రధానస్యాచైతన్యాత్ - పురుషస్య చౌదాసీన్యాత్ - తృతీయస్యచ తయో స్సంబంధయితు రభావాత్ - సంబంధానుపపత్తిః' అని శ్రీశంకర భగవత్పాదులు భాషించిరి. ప్రధాన మచేతనము, కదలదు, పురుషుఁ డుదాసీనుఁడు. కదలఁడు. మఱి వీనిని కలుపు మూడవవాఁడు యోగమతమున లేఁడు. అట్టిచోఁ బ్రధాన పురుషసంయోగ మెట్లు? "ఏతేన యోగః ప్రత్యుక్తః» (శారీరక- 2- 1- 3) అని సాంఖ్యముంబోలె యోగముం గూడ శ్రీబాదరాయణులు యోగప్రత్యుక్త్యధికరణమున ఖండించిరి. మఱి యద్వైతులకు రెండవవాఁడే లేఁడే. వీరి కెట్లు సంసారము సంభవించును? అదియు విచారింపఁదగిన దేకా- అద్వైతుల కొక్కటే పరబ్రహ్మము కలదు. అది నిర్గుణము. ఆబ్రహ్మము విశుద్ధసత్త్వప్రధానమగు మాయతోఁ గూడుటతోడనే సగుణబ్రహ్మ మగును. ఈసగుణమునే యీశ్వరుఁ డందురు. ఇతఁడే సర్వజ్ఞుఁడు. సృష్టికర్త. మఱియు నానిర్గుణబ్రహ్మము రజస్తమోలేశములున్న మలినసత్త్వప్రధాన మగు నవిద్యతోఁగూడిన జీవుఁ డగును. ఈజీవునకుఁ గర్మబంధమోక్షములు గలవు. నిర్గుణబ్రహ్మ ముదాసీనముగా నున్నను సగుణబ్రహ్మమగు నీశ్వరుఁ డీజీవుని నియమించుచుండుంగాన నద్వైతుల కాగొడవ తప్పినది. యోగులు సర్వజ్ఞుఁడైన పురుషు నంగీకరించినను వాపురుషుఁడే యసంగుఁడు నుదాసీనుఁడు గాన బుద్ధితోఁ గూడఁడు. కూడినను బనులు చేయుఁడు అని ప్రతిపక్షు లాక్షేపించిరి. దానికి యోగులు, పురుషుఁడు సర్వశక్తిసమన్వితుఁడు. కాన బుద్ధితోఁ గలియఁగలఁ డని యాయాక్షేపముం గీటువంబుచ్చిరి.

> "తథాపి పుంవిశేషత్వాత్ -
> ఘటతే ఽస్య నియంతృతా
> అవ్యవస్థౌ బంధమోక్షౌ -
> ఆపతేతా మి హాన్యథా"
>
> (పంచదశి. చిత్ర 106)

ఈశ్వరుఁ డసంగుఁడైనను బురుషోత్తము డగుటవలన సర్వమును నియమింప సమర్థుఁ డగును. అట్లు కానిచో బంధమోక్షములు నియమము లేనివి కావలసివచ్చును. యోగసూత్రవ్యాఖ్యాతలును, «నసంగుఁ డగు పురుషునికి వాస్తవమున బుద్ధియోగమున బంధము లేదు. ఉన్నట్లు మన యజ్ఞదృష్టికిఁ గన్పట్టుచున్నది. జలమందు బింబించిన చంద్రబింబమునకు జలగుణము లబ్బినట్లు మనకుఁ గన్పించినను వాస్తవమున కంటినవా? చంద్రున కాగుణము లున్నవా? అట్లే పురుషునికిని బుద్ధిగుణము లబ్బినట్లు బంధము వచ్చినట్లు కన్పించును. వాస్తవమున కాయసంగపురుషునికి బంధము లేదు. మోక్షము లేదు» అనిరి.

> "తస్మా న్నబధ్యతే- నాపి ముచ్యతే.
> నాపి సంసరతి కశ్చిత్.
> సంసరతి బధ్యతే ముచ్యతేచ.
> నానాశ్రయాప్రకృతిః (సాం, 62)

పురుషునికి సంసారబంధమోక్షములు లేవు. ప్రకృతికే కలవు. అన్యోన్యాధ్యాసచే నట్లు కన్పట్టుచున్నవి.

«ద్రష్టా దృశిమాత్రః శుద్ధోఽపి ప్రత్యయానుపశ్యః
(యో 2 - 20)

ద్రష్టా పురుషో దృశిమాత్రః చిన్మాత్రః. నజ్ఞానాదిధర్మకః తద్ధర్మకత్వే తస్యవృత్తిరూపతయా వినాశశీలత్వాత్ ... అతః శుద్ధః అపరిణామ్యపి ప్రత్యయం బౌద్ధ మనుపశ్యతి. త మనుపశ్య న్నతదాత్మాపి తదాత్మభూతఇవ ప్రతిభాసతే.

(సు) పురుషుఁడు చిన్మాత్రుఁడు. పరిశుద్ధుఁడు. అపరిణామి. అతని కేగుణము లంటవు. అంటినట్లుమాత్రమే కనఁబట్టు చున్నాఁడు. అంటినచో నతఁడును వశింపవలసివచ్చును అని సుధాకరవృత్తి.

## సమన్వయము

అద్వైతులైనను నీపరమార్థము నంగీకరింపవలసినదే. వారి బ్రహ్మమునకుమాత్రము జీవత్వ మెట్లు వచ్చినది? వారికి జీవుఁడును వాస్తవమున బ్రహ్మము గాదా? వారును చిత్తుఁ గనాది కాలమున నవిద్యాసంబంధ మేర్పడిన దనిరి గదా!

> జీవ, ఈశో, విశుద్ధాచిత్,
> తథా జీవేశయోర్భిదా
> అవిద్యా, తచ్చితోర్యోగః,
> షడస్మాక మనాదయః

జీవుఁడు, ఈశ్వరుఁడు, శుద్ధబ్రహ్మము, అవిద్య, జీవేశ్వరులభేదము, శుద్ధబ్రహ్మ మవిద్యతోఁ గూడుట. ఇవి యాఱు ననాదులు. ఏమతస్థులకైన ననాదు లుండక తీఱదు. యోగులును 'క్లేశకర్మవిపాకాశయై రపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః' (యో. I - 24) అని యీశ్వరు నంగీకరించిరి. అంగీకరించుటయేగాదు. 'ఈశ్వరప్రణిధానాద్వా' (యో. 1-23) ఈశ్వరార్పణబుద్ధితోఁ గర్మము లాచరించినచో ఫల మాసన్నతమమగునని. 'ఈశ్వరోఽపి సమారాధనాదినా సాధనేన ఆరాధితః ఇదమ స్త్వభీష్టమస్తు. ఇతి సంసారాంగారే తప్యమానం పురుష మనుగృహ్ణాతీతి భావః' (సు) ఆరాధింపఁబడిన యీశ్వరుఁడు వారి కోర్కులఁ దీర్చుననియుఁ బల్కిరి. ఇతఁడే సుఖదుఃఖముల జన్మమరణముల వారివారికర్మానుగుణ్యముగా నిచ్చుననిరి. ఇచట నొకచిక్కున్నది. కర్మమునఁ గాని పుట్టఁడాయె. పుట్టినఁ గాని కర్మ చేయఁడాయె. ఇది యెట్లు? ఈయన్యోన్యాశ్రయదోష మెట్లుతీఱును? దీనికి నుత్తరము "నకర్మ. అవిభాగా దితిచేత్. న అనాదిత్వాత్" (శారీరక 2 - 1 - 35) సంసారమున కాదియున్నచో నీ వన్నచిక్కేర్పడును గాని సంసార మనాది కాన నాచిక్కు లేదు. "అనాదౌ తు సంసారే బీజాంకురవత్ హేతుహేతుమద్భావేన కర్మణః సర్గవైషమ్యస్యచ ప్రవృత్తి ర్నవిరుధ్యతే" అని భాష్యము. సంసార మనాది కావున జీవుల కర్మానుగుణ్యముగా నీశ్వరుఁడు ఫలమిచ్చుచుండును గాన నాతనికిఁ బక్షపాతముగాని నిర్దయత్వముకాని లేదు. యోగులును బుద్ధితోఁ గూడినపురుషునకు వచ్చిపడిన సంసార మనాది యనిరి. ఈబుద్ధినే యంతఃకరణ మనియు, బురుషుని జీవుఁ డనియు నద్వైతు లందురు. జీవుని మందిర మహంకార మనిగదా యద్వైతులభావము. అంతఃకరణ మందలివేగదా బుద్ధ్యహంకారములు. మఱియు నద్వైతుల వలె యోగులును నవిద్య నంగీకరించి యనాది యనిరి. బుద్ధిపురుషులభేదము సంయోగము ననాది యనిరి. భక్తిజ్ఞాన వైరాగ్యాదులను జీవరకుఁ గైవల్యముంగూడ యోగు లంగీకరించిరి. "పురుషార్థశూన్యానాం గుణానాం ప్రతిప్రసవః కైవల్యం. స్వరూపప్రతిష్ఠావా చితిశక్తి రితి" (యో 4 - 34) ఇది గ్రంథాంతమందలి సూత్రము. కావునే బ్రహ్మస్మరణముతో ముగింపఁబడెను. ఇచటి చితిశక్తి పురుషుఁడేగదా! సుధాకరవృత్తిలో నెల్లయెడల బ్రహ్మస్థానమున రెండవపదము వాడక చితిశక్తిపదమునే స్వాములవారు వాడిరి. పురుషుఁడు చిత్తని యంగీకరించిన వాద మేముండును? చిత్తు పరబ్రహ్మమేగా. కనుక యోగులు చిత్తును అనగా బ్రహ్మమును, ఈశ్వరుని, పురుషుని అనఁగా జీవుని అంగీకరించిరి. తక్కిన పుణ్యపాపస్వర్గనరకపునర్జన్మాదివిషయములలోఁ దగవే లేదు. ఇఁక నొక్కటి యున్నది. అద్వైతులు రెండవవస్తువు నంగీకరింపరు గాన బ్రహ్మవివర్తమే జగత్తనిరి. రెండవవస్తువు నంగీకరించుటలో నంతపట్టింపు లేనియోగులు ప్రధానపరిణామము జగత్తనిరి. నిత్య మనిరి. అద్వైతులు జగత్తు మిథ్యయన్నను వ్యావహారికసత్యత్వము నంగీకరించిరిసుఁడీ! ఇదియేభేదము. ఇఁక చిత్తే యవిద్యవలన నీశ్వరుఁడుం బురుషుఁడు నయ్యె నని కంఠోక్తిగా జెప్పకపోయినను సూత్రసమన్వయమున మన కాభావము గోచరింపకపోదు. యోగసూత్రములు తత్త్వవిచారమునకుఁ బుట్టలేదుగాన నావిషయమును సుస్పష్టముగాఁ జెప్పలేదు.

ఈ "పురుష" పదము యోగుల కాణాచి కాదు. "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" అని శ్రుతి. "ఇంద్రి

యేభ్యః పరాహ్యర్థాః. అర్థేభ్యశ్చ పరం మనః. మనసస్తు పరాబుద్ధిః. బుద్ధే రాత్మా మహాన్ పరః. మహతః పరమవ్యక్తం. అవ్యక్తాత్పురుషః పరః - పురుషాన్న పరం కించిత్. సాకాష్ఠా సాపరాగతిః (కఠ 3-11) పురుషుని కంటెఁ బైనెవ్వరు లేరని కఠోక్తి గదా. ఈపురుషునే యోగులు గైకొనిరని యేల తలంపరాదు. పిదప జహదజహల్లక్షణను జూచుకొనవచ్చును. మహతః పరమవ్యక్త మను పదములకు మసిపూసి మారేడుకాయం జేసిన భాష్యకర్త పురుషునిజోలికిఁ బోలేదు. కనుకనే యోగముం ద్రోసివేయవలసివచ్చినందులకు భగవత్పాదు లటునిటు చూచిరి. "యేన త్వంశేన నవిరుధ్యేతే. తేనేష్టమేవ సాంఖ్యయోగస్మృత్యోః సావకాశత్వమ్" మేము యోగమునంతయు నిరసింపము. కావలసినదానిం గైకొందుమనెను. జగత్కారణత్వమును జగన్మిథ్యాత్వమును మనస్సులోఁ బెట్టుకొని శ్రీవారట్లనియుందురు. మఱియు "నాన్యఃపంథా విద్యతే ఽయనాయ" అనియు, "జ్ఞానాదేవతు కైవల్యమ్" అనియు శ్రుతులు ఘోషించుచుంటచే సర్వశ్రుతుల సమన్వయింపఁబూనుకొన్న భగవత్పాదు లాకట్రవే లడ్డముంచిన నేమిలే యని యోగమును బ్రహ్మప్రాప్తికిఁ బరంపరాసాధనముగా నంగీకరింతు మనిరి. అనిన నననిండు. యోగులు జ్ఞానము నంగీకరింపకపోయినంగదా మనకు వ్యసనము. జ్ఞానవైరాగ్యముల వారును నెత్తిం బెట్టుకొనిరి. సాంఖ్యము నెడమచేతిలో నద్వైతముం గుడిత్రేలితోఁ బట్టుకొని యోగము నిర్విచారముగా విహారము చేసినది.

## విషయము

వేదాంతమున బ్రహ్మవిచార ముండును. యోగమున బ్రహ్మసాధన ముండును. మాటలు కాదు. చేతలు కావలయును. చూడుఁడు మొదటి సమాధిపాదమున యోగలక్షణము వృత్తిపంచకలక్షణము, తన్నిరోధోపాయములు, అభ్యాసవైరాగ్యములు, ఈశ్వరనిరూపణము సబీజనిర్బీజసమాధివిధులు మున్నగునవి కలవు. రెండవ సాధనపాదమునఁ బంచక్లేశములు కర్మవాసనలు దృశ్య పత్యాహారము వఱకు నష్టాంగలక్షణములు తత్తత్ఫలములు మున్నగునవి కలవు. మూఁడవ విభూతిపాదమున ధారణాధ్యానసంప్రజ్ఞాతసమాధిలక్షణములు చిత్తపరిణామములు నిందిర్యజయోపాయములు తత్తత్ఫలములు నణిమాదిసిద్ధులు వివేకఫలము త్రికాలజ్ఞానము పరకాయప్రవేశము, ఆకాశగమనము సిద్ధదర్శనము దూరదృష్టి దూరశ్రవణము మున్నగునవి కలవు. నాలవ కైవల్యపాదమునఁ గర్మజాతులువాసనాజన్మలయములు వస్తుజ్ఞానభేదము ధర్మమేఘసమాధి జీవన్ముక్తి కైవల్యము మున్నగునవి కలవు. "లఘూని సూచితార్థాని. స్వల్పాక్షరపదానిచ. సర్వత స్సారభూతాని. సూత్రా ణ్యాహు ర్మనీషిణః" (భామతి I 1.1.) అను సూత్రలక్షణానుసారముగా నీయోగ సూత్రగ్రంథము రచింపఁబడినది. సంసార మెట్లు వచ్చును? 2 అది వచ్చిన గష్టమేమి? 3 ఆకష్ట మెట్లు తొలఁగును? "అతొలఁగుట కేమి చేయవలె? అను నాలుగువిషయములకు సమాధాన మీగ్రంథరాజము. అట్టి గ్రంథరాజము రచించి లోకోద్ధరణ మొనర్చిన గోనర్దీయమహర్షి పాదములకు నమస్కరించెద.

> "శ్రీమత్పతంజలే స్తస్యపదద్వంద్వ మనిందితం
> వందే యేన మనఃకాయ-వాచాం శుద్ధి రకార్యసౌ".

## శ్రీ సదాశివేంద్ర సరస్వతీస్వాములు

ఇట్టియోగము నవలంబించినవారిని స్మరించుట సమంజసము కాకపోదు. జనసామాన్యమైనవి మానుషశక్తులు. అమానుషమైనవి దివ్యశక్తులు. ఇప్పుడిప్పుడు మానవుఁడు దూరదృష్టి, దూరశ్రవణము ఆకాశగమనము వైద్యుతశక్తి వశీకరణము మున్నగు కొన్ని దివ్యశక్తుల యంత్రసాహాయ్యమునఁ బడయుచున్నాఁడు. పూర్వ మీ దివ్యశక్తులనెల్ల దపోయాగాదులవలన మానవుఁడు పడసెను. యాంత్రికశక్తివలన లభించు శక్తులనెల్ల రుపయోగించుకొన నవకాశ మున్నది గాని తపశ్శక్తివలన లభించుశక్తు లాతపస్వికే గాక యొరుల కుపయోగించుకొను నవకాశము లేదు. ఎవరికి వారు కష్టించి తపస్సుచేసికొని సంపాదించుకొనవలసినదే. అయితే ఐహికవాంఛలనెల్ల నుజ్జగించి యహంకారమమకారముల నణఁచివేసికొని జ్ఞానవైరాగ్యములం బూని తపస్సుచేసినంగాని యట్టిసిద్ధులు లభింపవు. అట్టివీతరాగులకా సిద్ధులు లభించినఁ బ్రజల కేమి యుపయోగము? చివరకా సిద్ధులే యుపయోగించుకొనరైరి. కనుకనే తన్నుఁదా

నుద్ధరించుకొనవలె ననుట

శ్రీసదాశివేంద్రసరస్వతీస్వాములవా రట్టిసిద్ధపురుషులు. ఈయన 150 యేండ్ల క్రిందట చోళమండలమున "కరూర్" అనుగ్రామమునఁ బుట్టెను. సర్వవిద్యల నేర్చుకొనెను. వివాహముజరిగినది. ఆవల సంసారము దుఃఖభాజన మని తలంచి వైరాగ్యము గ్రహించి సన్న్యసించెను. పరమశివేంద్ర యోగీశ్వరులపాదముల నాశ్రయించెను. యోగము నభ్యసించెను. యోగానుభవముల "ఆత్మవిలాసము" అను గ్రంథమున వెల్లడించెను. పాతంజలయోగసూత్రములకు యోగసుధాకరవృత్తి రచించెను. మఱియు ద్వాదశోపనిషత్తులకు దీపికను, బ్రహ్మసూత్రములకు వృత్తిని రచించెను.

## మౌనదీక్ష

ఇతఁడు పరమశివేంద్రగురుసన్నిధియందుండఁ బండితులెందఱో గురుదర్శనమునకు వచ్చునపుడు సదాశివేంద్ర స్వాములతో వాగ్వాదము జరిగి వా రోడిపోయెడివారు. ఏశాస్త్రమునందును నావచ్చెడి పండితులు గెలువలేక యసూయావిష్టులై గురునితో నేదేవియో చెప్ప నాగురు వేమని తలంచెనో "సదాశివా! వాక్సంయమనము నెప్పు డలుంగుదువురా?" యనెను. వెంటనే సదాశివేంద్రుఁడు గురుపాదాలపైఁ బడి యామరణమౌనవ్రతము నవలంబించెను. పిదప దేశములు దిరుగుచు కరతలభాజనుఁడు తరుతలశాయియు నగుచు వర్తించుచుండెను.

## జననింద

మనసదాశివేంద్రస్వామి స్వేచ్ఛగాఁ దిరుగుచు నెండను గాలిని జలిని జయించి యొకనాఁడు వరిమాగాణిలో గట్టుపై దలయుంచి శయనించెను. కొందఱు రైతులు పొలమునకు వచ్చి యదిచూచి «యన్నియు వదలివచ్చినవానికి గట్టు తలదిండు గావలసివచ్చినది» అని యనుకొనుచుఁ బోయిరి. స్వామి యామాటలు విని గట్టుమీఁదనుండి తలదీసి పరుండెను. కొంతసేపటికా రైతులు గృహోన్ముఖులై చనుచు నటువచ్చి యదిచూచి నవ్వుకొనుచు «మన మాటలు స్వామి విన్నాడురా. తలదిండు తొలగించుకొన్నాడు ఇంకను నభిమానమున్నది కాబోలు» ననియనుకొనుచుఁ బోయిరి. ఎంతవారికిఁ బామరుల నిందాస్తుతులు తప్పవు కాఁబోలు. ఈవిషయ మెఱింగి స్వామి సతీర్థ్యుఁడు వేంకటేశపండితుఁడు

"తృణతులితాఖిలజగతాం
కరతలకలితాఖిలరహస్యానాం
శ్లాఘావారవధూటీ
ఘటదాసత్వం సుదుర్నిరసమ్"

అని శ్లోకించెను.

## ఉన్మత్తత

అంతట స్వామి బధిరునివలె పిచ్చివానివలెఁ జరించుచుండెను. పాఱవైచిన విస్తరాకులలోని యెంగిలి మెతుకులు తినును. బురదనీరు త్రాగును. తిట్టినఁ గొట్టిన నేమి లెక్కింపఁడు. ఈచర్యను విని గురువుగా రగు పరమశివేంద్రులు తలపోసిరి.

ఉన్మత్తవత్సంచరతీహ శిష్యః
తవేతి లోకస్య వచాంసి శ్రుణ్వన్
ఖిద్యన్నువాచాస్యగురుః పురాహో
హ్యున్మత్తతా మే నహి తాదృశీతి.

## సికతామగ్నత

కోడిముడి గ్రామము సమీపమునఁ గావేరీనది ప్రవహించును. స్వామి యానదీసైకతమునఁ గూర్చుండి ధ్యానమగ్నుఁ డయ్యెను. కొన్నిదినములు జరిగెను. ఒకనాఁడు వర్షించి కావేరివరద వచ్చెను. స్వామి యాప్రవాహములో మునిఁగిపోయెను.

ఒడ్డుననున్నవా రయ్యో! అయ్యో! అనిరి. కాని యేమియుఁ జేయలేకపోయిరి. ఆవలఁ గొన్నిదినములకుఁ బ్రవాహము తగ్గెను. మూఁడునెలలకుఁ గావేరి యొక పాయగా మధ్యస్థలమునఁ బ్రవహించుచుండెను. కొందఱు జను లాయిసుకలోఁ జెలమలు దీసికొనుచుండిరి. ఒకచోటఁ గొందఱు చెలమ త్రవ్వుచుండఁగా స్వామి యాయిసుకనేలలో నుంటచే పాఱదెబ్బ తగిలి నెత్తురుకాఱెను. అది చూచి కార్మికులు భయపడి పదిలముగా నిసుకను దొలఁగింపఁ గూర్చున్న స్వామి బయటపడెను. తత్రత్యులు భయాశ్చర్యములకు లోనైరి. కొద్దిసేపటిలో స్వామికన్నులు

తెఱచి లేచి యెవ్వరివంక చూడక తలవంచుకొని యెందే నరిగెను.

"స్థూల, స్వరూప, సూక్ష్మ, అన్వయ,
అర్థవత్త్వ, సంయమాద్భూతజయః"
"తతః అణిమాదిప్రాదుర్భావః
కాయసంపత్. తద్ధర్మానభిఘాతశ్చ".
(యోగసూత్ర ౩-౪౬-౪౭).

అట్టి యోగసూత్రతత్త్వ మెఱింగి ధారణధ్యానసమాధి త్రయయుక్తసంయమము పూనిన స్వామి యిట్లుంటలో నబ్బుర మేమి ?

## స్తంభనము

కరూర్ గ్రామమున నొక రైతు పొలమున వడ్లరాశి చేసి ప్రొద్దుక్రుంకుటచే రక్షకుల నేర్పఱచి యింటి కేగెను. కొంతరాత్రికి స్వామి యొడలు తెలియక తిరుగుచు వచ్చి వచ్చి యావడ్లరాశి తగిలిపడెను. పడ్డవాఁ డట్లె యుండఁగా రక్షకులదాటునఁ జూచి దొంగవచ్చెననుకొని కఱ్ఱలెత్తి కొట్టఁబోయిరి. ఏమి చెప్పుదు ! ఆయెత్తినచేతులెత్తినట్లే నిలుచున్నవారు నిలుచున్నట్లే సూర్యోదయమువఱకు నుండిరి. అప్పుడు క్షేత్రస్వామి వచ్చి నమస్కరించి నిలువఁబడె. జనులు కూడి గుసగుసలు వోయిరి. ఆరొదకు మన స్వామి కనులు తెఱచి చూచి లేచిపోయెను. ఆవల రక్షకులు కదలఁగల్గిరి. చ్యవనమహర్షి వజ్రిహస్తమును స్తంభింపఁజేయలేదా ? యోగులచర్య లూహాతీతములు !

## కట్టెలమోపు

స్వామి యొకనాఁ డరణ్యమునఁ జరించుచుండెను. అట్టి యెడఁ గొందరు భటులు తమయధికారికొఱకు వంటకట్టెలు కొట్టి మోపులుగట్టి మోసికొని వచ్చుచుండిరి. అందులో నొకపోకిరిబంటు తాను దెచ్చు కట్టెలమోపుమ మనస్వామి నెత్తిని బెట్టి మోయించుకొనివచ్చి తమ రాజకీయోద్యోగి యింటఁ బడ వేయించెను. స్వామి మోపు పడవేయుట తోడనే భగ్గున మండి యచ్చటివానినెల్లఁ గాల్చి తుద కాయధికారిగృహమును సైతము బూడిద చేసి వేసెను. ఆవల నధికారి తప్పు తెలిసికొని భటుల నేమి యన్న నేమి లాభము. స్వామి కన్పింపకపోయెను. ఇచట రహూగణుని పల్లకి మోసిన భరతుఁడు స్మృతికి వచ్చు చున్నాఁడుగదా.

## ఆకాశగమనము

స్వామి యొక్కొక్కప్పుడు తనచుట్టు చేరిన బాలురతో నాడుకొనుచు వారికి కేవలి దినుపదార్థములు పెట్టుచు నుండును. ఒకసారి యాచవువుర నిరువురు పజ్జవాండ్రు "స్వామీ! నేఁడు మధురలో సుందరనాథస్వామికి వృషభ వాహనోత్సవము జరుగునట. మాయూరివారు కొందరేగిరి. మనము నేగి చూచిన క్షేమా" యనిరి. స్వామి యీమాటలు విని నవ్వుచు సిద్ధులై రెండుచంకల నెత్తుకొని కనులుమూసికొనుఁ డని సైగచేసి యావలఁ దెఱవుఁ డని సైగచేసెను. వారు కన్నులు తెఱువ మధురలో స్వామి సన్నిధి నుండిరి. వా రాయుత్సవముం జూచినపిదప నట్లే వారిని స్వామి స్వగ్రామమునకుఁ దెచ్చి దించెను.

"కాయాకాశయోస్సంబంధ సంయమాత్
లఘుతూలసమాపత్తేశ్చాకాశగమనమ్"
[యోగసూత్ర ౩-౪౨]

"గ్రహణ, స్వరూప, అస్మిత, అన్వయ, అర్థవత్త్వ, సంయమాత్ ఇంద్రియజయః"
"తతో మనోజవిత్వం వికరణభావః
ప్రధానజయశ్చ" [యోగ - ౩ - ౪౭ - ౪౦

అను యోగసూత్రములకు వృత్తి వ్రాసి స్వామి వాని ననుభవమునకు దెచ్చుకొనెను.

## సర్వగతత్వము

స్వాములవారు మహాశివరాత్రిపుణ్యకాలమునఁ గాశిలోను, రామేశ్వరములోను, మధురలోను, గన్పించువారట. ఆయాస్థలముల కరిగిన "కరూర్" గ్రామస్థులొకచోఁ జేరి ముచ్చటించుకొనుచున్నపుడీవిషయము బయల్పడెనఁట. గుంటూరుమండలమున చేజెర్లగ్రామవాసి తుంగదుర్తి బుచ్చయ్యగారును వెనుక ఇట్టియోగమహిమల నెన్నియో చూపిరి.

## అనుగ్రహము

ఒకబ్రహ్మచారి స్వామివెంట నుండి కొంతకాలము సేవించెను. వెనుక బాలుర నాకాశమునఁ గొనిపోయిన వృత్తాంతమును విన్న యాశిష్యుఁ డొకనాఁడు స్వామి

పాదాలపైఁ బడి శ్రీరంగములోని రంగనాథుని సేవింప వేఁడుకొనఁగా స్వామి వారిం జూచి సైగతోఁగనులు మూసికొని తెఱువు మనెనఁట. అంతేమి వారు శ్రీరంగనాథుని సన్నిధి నుండిరి. పిమ్మట స్వామి కన్పింపక యాశిష్యుఁడు వెదకి కరూర్ చేరి యచట ధ్యాననిమీలితాక్షుఁడై యున్న స్వామిని సందర్శించెనఁట. పిదప నొకనాఁ డాశిష్యుఁడు ప్రార్థించుటచే నేలమీఁద నొక మంత్రము వ్రాసిచూపెనఁట. ఆశిష్యుఁడు దానిం గ్రహించి మహావిద్వాంసుఁడు ధనవంతుఁడు నయ్యెనఁట.

## హస్తచ్ఛేదము

యోగిపుంగవు లప్రతిహతగతులు. వారిగమనమునకు గోడలు తలుపులు మున్నగునవి యడ్డుగావు. స్వామి సంచరించుచును, బ్రహ్మీభూతుఁడై యుండునుగాబోలు. ఒకనాఁడు స్వామి యవనమహీపతియంతఃపురమున యువతుల మధ్యమందుఁ బోవుచుండెను. అది యాయధిపతి చూచి యాగ్రహోదగ్రుఁడై నిశితకరవాలమున స్వామిహస్తము నొక్క దెబ్బతో ఖండించెను. భుజమువఱకుఁ జేయి తెగి పుడమిపైఁ బడెను. ఒడలంతయు రక్తమయము. కాని స్వామి కిది యేమియుఁ దెలియదు. యథాప్రకారము నిర్వికారుఁడై పోవుచునే యుండెను. ఇది యాయవనాధిపతి చూచి భయసంభ్రమములకు లోనై "యితఁ డెవరో మహానుభావుఁ డైయుండును. అపరాధము చేసితిని" అని తలంచి తదనుగ్రహార్థ మూడిపడిన చేయిపట్టుకొని వెంటఁ బోవుచుండెను.

ఎదుటంబడి మాటాడలేకపోయెను. ఎంతయో సమయము గడిచెను. తుద కామ్లేచ్ఛుఁడు ధైర్యము వహించి రెండుపాదాలపైఁ బడి గట్టిగాఁ బట్టుకొని యపరాధము మన్నింపుము స్వామీ తెలియక తమచేయి నఱికితి నన స్వామి యానఱికినతావును రెండవచేతితో స్పృశింప నెప్పటి యట్ల చేయి వచ్చియుండెను. మ్లేచ్ఛునిఁ బొమ్మని సైగచేసెను. ఎంతవింత! ఇది సత్యమా యని యాధునికులు సంశయింపవచ్చును. చూడుఁడు శృంగేరిపీఠాధీశ్వరులు శ్రీశివాభినవనృసింహభారతీస్వాములే మనిరో-

"యో ఽనుత్పన్నవికారో-
బాహౌ మ్లేచ్ఛేన ఛిన్నపతితే ఽపి
అవిదితమమతాయాస్మై-
ప్రణతిం కుర్మః సదాశివేంద్రాయ"॥

పురా యవనకర్తనస్రవదమందరక్తో ఽపి యః
పునః పదసరోరుహప్రణతమేన మేనోనిధిం
కృపాపరవశః పదం పతనవర్జితం ప్రాపయత్
సదాశివయతీట్ సమయ్యానవధిం కృపాంసించతు

అని స్తోత్రము చేసిరి. మధుప్రతీకాసిద్ధులు గన్న మహానుభావుల కిట్టివి లెక్క యేమిటి?

"జాతిలక్షణదేశై రన్యతానవచ్ఛేదాత్
తుల్యయో స్తతః ప్రతిపత్తిః" [యోగ. 3-౫౩.]

ఇట్టిపరీక్షల నెగ్గుట యోగుల కొకలెక్కయా? సంకల్పసిద్ధులుగదా వారు.

## వాత్సల్యము

నవశాలజనపదాంతర్గతమైన తిరువరంగుల గ్రామము సమీపమందలి యరణ్యమున స్వామి సంచరించుచుఁ దద్దేశాధిపతియగు శివజ్ఞానపూర్ణుఁడని ప్రసిద్ధిం బొందిన విజయరఘునాథతొండమాన్ నృపాలుఁడు తన్ను సేవింప నాతని యం దనుగ్రహము వొడమి యిసుకపై నొకమంత్రము వ్రాసిచూపెను. అతఁ డామంత్రము నేర్చుకొని యక్షరము లున్నంతమేరం గల యిసుకనుగూడ భద్రపఱచుకొని పూజించుకొనుచు మహోన్నతస్థితి నొందెను. నేటికిని దద్వంశీయు లాయిసుకను బూజించుకొనుచు సర్వసంపదలతోఁ దులతూఁగుచుండిరి.

## సమాప్తి

స్వామి నేరూరు గ్రామవాసులైన విప్రులం బిలిచి మిథునమాసీయ జ్యేష్ఠశుద్ధ దశమినాఁడు దీక్షాలము మఱుఁగుపడుదును. అప్పుడే కాశినుండి బాణలింగముగొని యొకవిప్రుఁ డరుదెంచెను. నాసమాధిసమీపమున నాశివలింగముం బ్రతిష్ఠించునది యని వ్రాసి యెఱింగించెను. స్వామి యానాఁడు గర్తముం ద్రవ్వించుకొని యందు దిగి సమాధినొందెను. స్వామి చెప్పి నట్లప్పుడ కాశినుండి శివలింగము వచ్చెను. ఆవిప్రులు స్వామి చెప్పినట్లు చేసిరి. ఇట్టి సిద్ధపురుషుల నామస్మరణము సర్వపాపహరణము. *

* [సుధాకరవృత్తిగ్రంథమునుండి స్వామిచరిత్రనుగ్రహించితి]

# జిజ్ఞాస

శ్రీ యం. వీరేశ్వరశర్మ



వచ్చె వసంతలక్ష్మి సుఖవర్ధన యై, చిరదూరవాసతన్
నొచ్చియు నూత్ననూతనమనోహరకాంతులునుం బ్రతాపముల్
దచ్చి కడ వ్వెలుంగ విశదమ్ముగ మావులఁ బూఁజివుళ్ళు నై
యచ్చపు వెన్నెల ల్తరుణితారుణకాంతులు నై ప్రియమ్ముగన్.

సురుచిరముల్, త్రిలింగకవిసుందరభావరమావిశేషముల్
పరిణతభాగధేయము లపశ్చిమముల్. సువిపశ్చిదాత్మభా
స్వరములు మాధవప్రభుప్రసర్పణము ల్మది మేలుకొల్పు లై
పరభృతలోకము ల్వలివె స్వాగతముల్ ప్రణయార్ద్రకంఠముల్.

ఎన్నఁగ దేశకాలగతి నేర్పడు నీ నవతాపురాణతల్
భిన్నము లెట్లు మూఢున, కభిన్నము లట్లు యథార్థశీలికిన్
దిన్నదె తిన్నదే మఱలఁ దిందుము దేనికొ, యెన్నిమాఱులో
విన్నదె విన్నదే మఱల విందుము దేనికొ చెప్ప నేర్తురే.

ఎన్ని భవమ్ము లాయెనొకొ, యే నొకరుండయి నాదు చిత్త మీ
పన్నినదారులం బడుచుఁ బర్వులు వెట్టి పరిభ్రమించుచున్
దిన్నగ నాదుగూడు గుఱుతించినఁ బుట్టు నఖండబోధముల్
మిన్నులు ముట్టిన న్వశమె మిన్నకయుండ వశంవదాత్మతన్.

ఎన్ని యుగమ్ము లేగినవొ యే నిటు లైతిని విశ్వవిశ్వమున్
భిన్నముభిన్న మౌచుఁ గనువేదురు పుట్టఁగ సంచరించి నా
యున్న నిజం బెఱుంగుటకు నుత్సుకతం దఱి వేచి వేచి, యే
నున్నటు లుండి యొక్కొకపు డూరక యేలకొ గొంతువిచ్చెదన్.

ఎన్నితరమ్ములైన వాకా యాకడవెళ్ళవి పెక్కురూపులం
దున్న యథార్థముం గనఁగ, నొక్కొకబాటను సాఁగిసాఁగి నా
కన్న సుఖమ్ము గష్టమును గంతము విచ్చుచు బాడికొందు నా
సన్నవిగొంతుకం దెలియఁజాలనె ప్రాణులు సత్యరూపముల్.

ఎన్ని గతించెనో యెఱుఁగ నిమ్మెయి భిన్నత లెంచి యెంచి, యా
యన్నిట నేకరూప మరయం, గనుపట్టిన హర్షబోధముల్
నన్ను "గుహూకుహూ" యను మనం, బదులాడుట లే నెఱింగితిన్
జిన్నలవోలెఁ బెద్దలను జేరుచు నన్నుఁ గుహూకరించుచో.

ఎన్నగ భాష కందనిది యిట్టిది యట్టి దనంగరాని దై
యున్న యొకానొకం దగు రసోజ్జ్వలరూపము నన్ను ముట్టినన్
నన్నును నేనె చూచిన ఘనప్రమదమ్ములు నా కుహూధ్వనుల్
ఎన్ని ప్రతిధ్వనింతు రొక వెట్టినా మీరు నిజ మ్మెఱింగియో

ఏ నొకసత్కవీంద్రుఁ డని యే నొకబోద్ధ నటంచు, నేనె గా
జ్ఞాని నటంచు నే నొకరసజ్ఞశిఖామణి మౌని నంచు పై
నే నొకస్వార్వభౌముఁ డని యెంతటి మన్నన లిత్తురౌర యీ
నా నిజరూపముల్ దెలిపిన న్మఱి మీరలు నవ్విపోరొకో

నేను వసించు తావుల వినిందితనిత్యవసంతసీమముల్
మానినికాకలీమధురమంగళకంఠము లాటపట్టులై
జ్ఞానిరసజ్ఞచిత్తముల నవ్విడి పట్టులు నుందు నెందునున్
మానక యొక్కయొక్కయెడ, న గ్గన నేర్తురు కొంద ఱల్పతన్.

[నా 'ఉత్తమ మనుసంభవము' నుండి]

# గీత

## శ్రీ పొన్నెకంటి హనుమంతరావు



అవ్యయుం డ వినాశుండు నజు డటంచు
ఆత్మ నెఱిఁగిన పూరుషుం డాతఁ డెట్లు
హింసఁ జేయు నితరులఁ దా హింసఁజేయఁ
జేయు నొరులను విజ్ఞానచేతసుండు.

చివికినట్టి వస్త్రముల మానవుఁ డ దెట్లు
తొలఁగఁజేసి నూత్నములనుఁ దొడుగునట్లు
జీర్ణ దేహముల వదలి జీవుఁ డతఁడు
అన్యనూత్న దేహములకు నరుగుచుండు.

ఛేద మొనరుప శస్త్రము చేతకాదు
దాహ మొనరింపఁ జాలఁడు దాహకుండు
నీర మాతని తడుపఁగ నేరఁబోదు
ఆత్మ శోషిలఁజేయలేఁ డనిలుఁ డైన.

చోద్యముగ నాత్మ నొక్కఁడు చూచుచుండు
చేత మాశ్చర్య మొందంగఁ జెప్ప నొకఁడు
వినుచువాని వింత నొకఁడు వినుచునుండు
అయిన నొక్కఁ డెఱుఁగలేఁడు ఆత్మ నెపుడు.

మానవుఁడు సర్వమున నుదాసీనుఁ డౌచు
శుభమునందు గాని మఱి యశుభమునందు
నైన మోదఖేదము లవి యందకుండు
నతని బుద్ధియె స్థిర మని యనిరి బుధులు.

* * *

విషయచింతన మాసక్తి వెలయఁజేయు
కలుగుచుండు నాసక్తిచేఁ గామ మెపుడు
కలుగు క్రోధము దానిచేఁ గ్రమముగాను
మానవున కిట్లగుట యెందు మహిని కలదు.

మోహ మట్టిక్రోధమునను పుట్టుచుండు
దానిచే స్మృతిభ్రంశము, దాని వలన
బుద్ధి రూపఱి బూడిద బుగ్గి యౌను
దానివలనను నాశమౌ మానవుండు.

ఎద్ది మోహము విడువగ నెఱుఁగఁజేసి
ఆత్మయందు పిదపపరమాత్మయందు
సర్వభూతకోటిని చూపు సమముగాను
అదియె జ్ఞానమని తెలియు మనిరి బుధులు.

జ్ఞానమువలన మఱియు విజ్ఞానమునను
తృప్తిగల యాత్ముఁ డై విజితేంద్రియుండు
మట్టిపెడ్డఁ బసిఁడి, ఱాతి మది నొకటిగ
నరయఁగలవాఁడె యోగియౌ ననిరి బుధులు.

చలన మది లేకయు నివాతస్థలమునందు
దీప మేవిధాన సతము నిలిచియుండు
అటులె నియమితాత్ముఁ డయిన యోగి దైన
ఆత్మ స్థిర మని పండితు లంద్రు భువిని.

* * *

శత్రు మిత్రులందును భావసమత కలిగి
మానవం దైనను మఱి యవమానమునను
సమత, శీతోష్ణముల దుఃఖసౌఖ్యములను
సంగమంబు వర్జించియు శాంతు డౌచు

మోదమందఁ డెవఁడు ఖేద పడఁడు
ద్వేష మందక, కోరక విషయసుఖము
ఎవఁడు శుభము నశుభము నెడముఁ జేయు
అట్టివాఁడె భక్తుఁ డనఁబడు నాద్యునకును.

ప్రకృతిని గుణత్రయంబు సంభవము నంది
సత్త్వ, రజ, తమములను విషయము లౌచు
అవ్యయుఁడైన దేహిని యంటిపెట్టి
దేహమున బందిగా చేయు నిహమునందు.

సాత్త్వికమున నుద్భవమొందు జ్ఞాన మిదియ
రాజసంబున లోభ మిదే జనించు
తామసంబున జ్ఞానశూన్యతయు మోహ
మును ప్రమాదము లనునవి పుట్టుచుండు.

*                *                *

కామక్రోధలోభము లవి కలిగియున్న
ఆత్మనాశనకర మౌచు నవియె మూడె
ద్వారము లగును మూఁడును నరకమునకు;
కాన వీని వీడవలయు మానవుండు.

తపములందును మఱియు దానవిధుల
సాత్త్వికము రాజసము తామసము లనంగ
తపములను శ్రద్ధ దంభవిధ్వంసము లని;
పాత్ర మెఱిఁగి, కోరి ఫలము, పాత్ర మౌచు
దానము లవి మువ్విధముల తనరుచుండు.

కర్మముల మోహబుద్ధిచేఁ గాలఁద్రోచి
కష్టభీతిచే త్యజియించు కర్మములను
ఆస్థ కలిగి కర్మములను ఆచరించు
త్యాగము లిట్లు మువ్విధముల దనరుచుండు.

పూను పరధర్మమునకంటెఁ బుడమియందు
స్వీయధర్మమె మేలౌను విగుణమైన
స్వీయధర్మాన మృతి యైన శ్రేయమౌను
పరులధర్మ మనుసరింప భయము గొల్పు.

ధర్మమునకు గ్లాని యెపుడు ధరణిఁ గలుగు
ఎపు డధర్మము క్రమముగా వృద్ధిగాంచు
రక్ష సేసి ధర్మ, మధర్మ శిక్షకొఱకు
అప్పుడప్పుడు భగవంతుఁ డవతరించు.

*                *                *

సర్వవిధము లయిన కామసంగతులను
విడిచి, ఆశ యేమియు లేక విడిచిపెట్టి
విడిచి మమకారము నహము విడిచివేయు
నతని కగు శాంతి సతతంబు నవనియందు.

# కవిత



కళాస్వాదనం
మోక్షదాయకం
బ్రహ్మానంద
సహోదరానందం.

అదే జన్మరాహిత్యం
అమరలోకాధిపత్యం
అవయవాల మలపులలో
అసమానకళాఖండం

అకుంఠితవిగ్రహాశిల్పం
ఆదిమూర్తి నిర్మితితో
పూర్తి చెందుగద
శిల్పరూపకల్పనంలో
కల్పనాభాగ మత్యల్పం

ఏదో ఏదో ఒక
నిర్దిష్ట భావం
ప్రకటిత మయ్యే
చిత్రలేఖనావైదగ్ధ్యంలో
చేతనాకళ సందిగ్ధం.

సంగీతస్వరకల్పనలో
సృష్టి కన్వర్థ మసమగ్రం
అది తత్జ్ఞానానంద
పరిపూర్ణత్వం.

భావనాలోకంలో
వినూత్నవిశ్వసృజనం
కవితాసుప్రయోజనం
లలితకళాలోకంలో
అతులితకళాసృజనం
భారతీదేవికి
భావరూపనీరాజనం
భావానికి భాషారూపం
ఆత్మకు సంగీతసమానం
నియతికృతం
నియమరహితం
హ్లాదైకమయం
అనన్యపరతంత్రం
నవరసరుచిరం
కావ్యనిర్మాణం.

# రామ మహస్సు

రాముచరితామృతము మది రమణఁగ్రోల
దాశరథిగుణకీర్తనల్ తవిలి సేయ
పావనపదయుగళి హృదిఁ బాదుఁగొల్ప
జనన మొందఁ గోరుదు జన్మజన్మములను.

తల్లి రాముఁడు, రాముఁడే తండ్రి నాకు
సోదరుఁడు రాముఁడె సుహృదుఁ డతఁడె
సర్వమును నాకు నల రామచంద్రుఁ డౌను
సత్కృపాకరుఁ డతనికి సాటి కలరె.

రవికులేంద్రు నామమహిమ శివుఁ డెఱుంగు
అరుణచరణప్రభావం బహల్య యెఱుఁగు
శక్తిసామర్థ్యముల్ ఈశు చాప మెఱుఁగు
చక్రి దా శరధాటి యాసంద్ర మెఱుఁగు

సూర్యవంశ్యుతత్త్వము వాయుసూనుఁ డెఱుఁగు
రాముమైత్రిభావము నల రవిజుఁ డెఱుఁగు
రాము యుద్ధగతి నెఱుఁగు రావణుండు
సత్యవాక్పాలనము విభీషణుఁ డెఱుఁగు.

# విశ్వశాంతి

## శ్రీ కల్లూరు నాగభూషణరావు



న్యాయాన్యాయవిచక్షణావిముఖు లై స్వార్థంబునన్ మానవుల్
మాయోపాయములన్ పరస్పరము దుర్మానంబు వాటించుచున్
ఆయుశ్శ్రీల హరింపజూచు జగమం దావంతయున్ శాంతి లే
దోయీ! పాంథ! లభింప దయ్యది సముద్యోగంబు గావింపకే.

ధనము సమస్తభోగసుఖదం బని యెంచి అధర్మబుద్ధి వం
చనమెయి తోడిమానవుల సంపదలన్ గొనబూను టాత్మవం
చన మగు, దానిచే గలుగు సౌఖ్యము కేవలభౌతికంబె; నీ
మనము ప్రశాంతతన్ బొరయు మార్గము విత్తము జూప దేయెడన్.

స్వమతావేశముతోడ నన్యమతసంపర్కంబు గర్హించి, ద్వే
షము ప్రేరేప మతాంతరప్రజకు హింసల్ గూర్చు నాధూర్తచి
త్తము లాధ్యాత్మికభావశూన్యములు, నిర్దాక్షిణ్యముల్; సత్యధ
ర్మములే లేక ప్రపంచశాంతి యెటు సంభావ్యం బగున్ జాతికిన్.

అనితరప్రాణిలభ్య మగు నాత్మవివేచన, ధీవిశేషమున్
మనుజున కిచ్చె దైవ మని మారణయంత్రవినిర్మితిం బ్రద
ర్శన మొనరించి పూనెదవె రాక్షసభావము; వాని విశ్వశాం
తివి ఘటియించు యత్నమున నిల్పిన గల్గు పరమ్మహమ్మునన్.

పరమవివేకపూరుషులు పల్కిన పల్కులు చిల్కలట్లు వా
క్కరణవిజృంభణన్ బలుక గల్గునె? శాంతి, యెడంద, మాట, నా
చరణమునం ద్రిశుద్ధ మగు సచ్చరితమ్మనగాక; తొల్లి మం
ధరమున క్షీరసాగరము ద్రచ్చగనే అమృతంబు పుట్టెనే?

క్షమ, కారుణ్య మహింస సత్యము జగత్కల్యాణభావంబు, ధ
ర్మము భవ్యాచరణంబు సత్వగుణసంపన్నత్వ మేపూరుషో
త్తము నాత్మీయగుణమ్ము లాత దగు నాదర్శంబు; ఈ విశ్వశాం
తిమహాభాగ్యము లమ్మహాత్ముని తపోదీక్షాఫలోత్పన్నముల్.

ప్రకృతిశక్తులమీద ప్రాభవ మ్మాసించి
జయము సాధించిన శాస్త్రవేత్త,
అమరకావ్యాల భవ్యాదర్శసందేశ
మవని కందించిన కవివరుండు,
సృష్టిసౌందర్యవిశేషమంతయు గండ
శిలలలో మలిచిన సిద్ధశిల్పి,
బ్రహ్మసాక్షాత్కారభాగ్యంబుచే జన్మ
ధన్యత గాంచిన తాత్త్వికుండు,
ఎన్నికం గన్న పూరుషు లెవ్వరైన
జీవితముల నాధ్యాత్మికభావితముల
జేయక విశిష్టకళల సృష్టించలేదు,
మించి విశ్వవిఖ్యాతిని గాంచలేదు,

సంతతజ్ఞానయోగమును సాధనజేసి పరంబు గన్న వే
దాంతులు, భక్తియోగమున ధన్యత గాంచినవారు, కర్మసి
ద్ధాంతవిధానముఞ్ క్రమము దప్పని వైదికనైష్ఠికోత్తముల్
శాంతము లేక పొందిరొకో? సౌఖ్యము, చంద్రుడు లేక చంద్రికా?

సృష్టించినారు విశిష్టసాహిత్యంబు
వ్యాసవాల్మీకు లేపరమశక్తి
గౌతము దేశక్తికతన నాత్మీయస
త్యాన్వేషణమున సిద్ధార్థు డయ్యె

ఖండఖండాంతరఖ్యాతి గాంచెను, వివే
కానందు దేశభక్తి నలవరించి
దేశస్వతంత్రంబు దేవిమూలమున గాం
ధీమహాత్ముండు సాధింప గల్గె

ఎందరో మహాత్ము లిట్టివా రిజ్జగమున
బ్రహ్మజిజ్ఞాసు లగుట దుర్ఘటము లైన
కార్యములయందు విజయము గాంచినారు;
అందరికి జయహేతు వధ్యాత్మశక్తి.

భారతభూమి చూడుము! ప్రపంచ మనుక్షణ మెన్నొభంగులన్
మారుచు వేషభాషలను, నాగరరీతి పురోగమించినన్
గౌరవ మందుచుండుటకు కారణ మార్యులదైన జ్ఞానభాం
డారము బ్రహ్మవిద్యయు సనాతనసత్పురుషాత్మశక్తియున్.

భేదంబుల్ మతవర్గపక్షములలో భేదింప కైక్యమ్ము రా
బోదోయీ! హృదిసామరస్యమున బెంపుం జెంద కేశాంతియున్
లేదోయీ! తదభావమైన సుఖమున్ లేదోయి! కాన్పింపగా
రా దాధ్యాత్మికచింతదక్క మరి మార్గం బొండు, తత్సిద్ధికిన్.

# అతిలోకుని అర్ధాంగి

శ్రీ ఆంధ్ర శేషగిరిరావు



శాంతినికేతనస్థాపకుడు రవీంద్రకవిచంద్రుడని చెప్పవలసిన పనే లేదు. అతనిభార్యపేరు మృణాళినీదేవి.

అతిలోకునకు అర్ధాంగి అయ్యే అదృష్టానికి నోచి పుట్టిన రమణీమణులలో ఆమె ఒకతె.

రవీంద్రుడు 1861లో పుట్టాడు. మృణాళినీదేవి 1887లో పుట్టింది. వారివివాహం 1883లో జరిగింది. పెళ్లినాటికి వరుడికి ఇరవైరెండేళ్లు. వధువుకు పదియేళ్లు.

## పెళ్లినాటి 'ప్రిభాత్ సంగీత్'

అప్పటికీ రవీంద్రుడు ఒక కవిగా లోకానికి పరిచితుడు. పదిహేనోఏటనే అతను కవితారచనకు ప్రారంభంచేశాడు. పద్దెనిమిదిఏళ్లు వచ్చేసరికి అతను ఆరువేలపంక్తుల పద్యపాదాలు వ్రాశాడు.

వివాహమైన కాలంలో అతను 'ప్రిభాత్ సంగీత్' అనే పుస్తకాన్ని వ్రాస్తూ ఉండినాడు.

యథాకాలాన అతనిభార్య కాపరానికి వచ్చింది.

## నిరాడంబరదంపతులు

రవీంద్రుడు సంపన్నకుటుంబములో పుట్టినప్పటికీ ఆడంబరత్వాన్ని సహించేవాడు కాడు. అతనిభార్య ఎప్పుడూ సాధారణమైన దుస్తులనే ధరించేది. కాని ఆమె అప్పుడప్పుడు పిల్లలకు ఖరీదైన దుస్తులు వేస్తూఉండేది. పిల్లలకు అట్టిదుస్తులువేస్తున్నప్పుడల్లా రవీంద్రుడు మందలిస్తూ ఉండేవాడు. అతనిమాటను ఆమె తులసీదళంలాగున తలదాల్చేది. తోడికోడళ్లపిల్లలవలె తనపిల్లలుకూడా ఖరీదైన దుస్తులు ధరించాలని ఆమె మనసులో ఉబలాట పడుతూ ఉండేది. కాని భర్తయొక్క ఆజ్ఞాదృఢబంధ సంయమిత అయి ఆమే తన ఈ అసందర్భమైన కోరికను మితపరుచుకునేది.

నిరాడంబరత్వవిషయంలో మృణాళినీదేవి రవీంద్రనాథునకు తగిన అర్ధాంగి అనిపించుకున్నది. ఎప్పుడు కాని విలాసవస్తువులకోసం వెంపరలాడ లేదు. ఎప్పుడూ కొంచెపు నగలే ధరించేది. సంపన్నకుటుంబములో పుట్టి సంపన్న కుటుంబాన్ని మెట్టినప్పటికీ ఆమె మగనిమాటలను చెవినిపెట్టి నగలవిషయంలో మితంగా ఉండేది.

రవీంద్రనాథునకు విలాసవస్తువు లన్న అసలు కిట్టదు. నగలు, నాణాలు, మెఱుగులు మొదలయినవి అతనికి అసలు నచ్చేవి కావు. ప్రకృతిసిద్ధంగా సుందరమైనవానికి పైపై మెఱుగులు అక్కరలేదని అతని అభిప్రాయం. అనాగరికులు మాత్రమే పచ్చబొట్టు పొడిపించుకుంటారని అతడు పలుమారు అంటూ ఉండేవాడు.

## లోలకుల ముచ్చట

రవీంద్రనాథ్ కోడలు హేమలతాదేవి కవిసాంసారిక జీవితంలోని ఒకటి రెండు చక్కని పట్టులను గ్రంథస్థమొనర్చి ఉంది.

అవి వినడానికి చాలా ముచ్చటగా ఉంటాయి.

ఒకసారి హేమలత చెవులకు లోలకులు పెట్టుకోమని మృణాళినీదేవి బలవంతం చేసింది. అవి పురాతనపద్ధతి లోలకులు. బంగారపు నగిషీపనితనం కలవి. కోడలు మాట తీసివేయలేక ఆమె వాటిని పెట్టుకుంది. ఇంతలో అక్కడికి రవీంద్రుడు రావడం తటస్థించింది. తోడనే ఆమె చెవిలోలకులుకనిపించకుండా మేలిముసుగు సవరించుకుంది. వానిని రవీంద్రుని కంటబడేటట్లు చేయమని కోడలు ఎంత

బతిమిలాడినా ఆమె వినలేదు. మగని మనస్సుకు అంతగా పట్టింపని చేశానని ఆమె అప్పుడు విచర్ల అయింది.

## చిన్నవయస్సులో 'నాయనమ్మ'

రవీంద్రుడు తండ్రికి పద్నాలుగో సంతానం. కాగా అన్నల కొడుకులు కొందరు రవీంద్రునికంటె పెద్దవారై ఉండేవారు. వారిభార్యలున్నూ మృణాళినీదేవికంటె పెద్ద. వయస్సులో ఆమెకంటె పెద్దవాళ్ళు వున్నూ, అభిరుచులవిషయంలో ఆమె హెచ్చు శ్రద్ధను ప్రదర్శించేది. తానమాత్రము తనభర్త ఇష్టానుప్రకారము దుస్తులవిషయంలో, నగల విషయంలో నూత్నపద్ధతిగా ఉండేది. కోడళ్ళు ఈవిషయమై ఆమెతో ప్రస్తావించేవారు. అప్పుడు ఆమె అనేది 'మీ రంతా సంతానవంతులు. అనగా నేను నాయనమ్మనయ్యా నన్నమాట. వయస్సులో చిన్నదాన నయినా నాఅంతస్తు మీఅంతస్తుకంటె పెద్దది. కాబట్టి నాయనమ్మ నాయనమ్మలాగే ఉండాలి' అని.

## భర్తకు బొత్తాములు

పుట్టినరోజుకు బహుమానముగా మృణాళినీదేవి ఒకసారి రవీంద్రనాథుని అంగీకి బంగారుముద్ద బొత్తాములు చేయించింది. ఆమె వానిని అస్తారుబతంగా భర్తకుఇచ్చింది. భర్త సంతోషించలేదుసరికదా 'మగవారుకూడ బంగారపునగలు పెట్టుకొని కులుకవలసినరోజులు వచ్చాయి అన్నమాట' అన్నాడు. ఈబంగారుబొత్తాలు అతనికి నచ్చలేదని ఆమె రాయి పొదిగిన గుండీలు చేయించి యిచ్చింది. వానికి అతనేమి అభ్యంతరం చెప్పలేదు. కాని వానినయినా అతడు రెండుమూడు సందర్భాలలోనే బలవంతంమీద పెట్టుకుంటూ వచ్చాడు.

## కవిత్వకళ : పాకకళ

రవీంద్రనాథునిభార్యకు వంటలో మంచిపేరు ఉంది. ఆమె ఏపదార్థం చేసినా జిహ్వాలేచివచ్చేటట్లు ఉండేది. ఆమె భర్తకోసం రకరకాలవంటలు కూరలు, కుమ్మలు-పచ్చళ్ళు, పదళ్ళు- వంజళ్ళు, నవకాయపులునులు చేసేది. ఆమె మిఠాయిలు చాలా రుచిగా చేసేది. ఇంట్లో ఇతరులు ఎవరుచేసినా వానికి ఆరుచి వచ్చేది కాదు. కాగా ఇంటిలోని ఇతరఆడవాళ్ళుకూడా ఆమెవంటకాన్ని ఎంతగానో మెచ్చుకునేవారు.

వంటసమయంలో అప్పుడప్పుడు రవీంద్రుడు ఆమెతో ఉండేవాడు. అంతవరకు సంప్రదాయంగా లేని కలగలుపులెన్నిటినో అతడు కూరుస్తూ ఉండేవాడు. వంటయింట్లో కూర్చుని అతను భార్యతో అది ఇట్లా కలియబెట్టు దానికితాళింపు ఈవిధంగాపెట్టు అని తలుచు ఉపదేశాలు చేస్తూ ఉండేవాడు. 'నీకు వంటవిషయంలో మగవాడు పాఠాలు చెప్పవలసి వస్తోంది' అని ఛలోక్తిగా అంటూ ఉండేవాడు. అట్టిసందర్భాలలోనే మృణాళినీదేవి మృదుహాస్యంతో 'మీరు కవిత్వకళలోనే కాదు పాకకళలో కూడా సాటిలేనివారు' అనేది.

## 'బుర్రకి మేత'

ఒకొక్కొక్కప్పుడు, రవీంద్రుడు అకారణంగా కఠిన పథ్యం చేశావాడు. ఇంట్లోవాళ్ళందరూ దీనికిగాను కించపడేవారు. మంచిపడుచుతనంలో ఉండడంచేత, తండ్రిలాగ అతనుకూడా మంచి ఆరోగ్యవద్దేహుడు కావడంచేత ఈకఠినపథ్యం అతనిని అంతగా నీరసపెట్టేదికాదు. అయినా ఇంట్లోవారికి అదోవిధమైన బెంగగా ఉండేడి. కాని మృణాళినీదేవి ఈవిషయమై ఎప్పుడుకాని ఆదుర్దా చూపలేదు. పొట్టకికంటె బుర్రకి ఆహారం సంపాదించేవిషయంలో వారు ఎక్కువ శ్రద్ధ చూపుతున్నా రని అట్టి సందర్భాల్లో ఆమె అనేది.

విద్యావేత్త, కవి అయిన రవీంద్రుడు ఒక ఆదర్శపాఠశాలను స్థాపించడానికి పూనుకున్నాడు. ఆవిషయంలో అతనిభార్య- మృణాళినీదేవి అతనికి చేదోడువాదోడుగా ఉంటూఉండేది. ఆసమయంలో ఆపాఠశాలలో చేరినపిల్లలకు ఉపహారాలు తానే స్వయంగా చేసిపెట్టేది. వారు పసితనంలో తల్లిదండ్రుల్ని వదలివచ్చి విద్యకోసం ఆపాఠశాలలో ప్రవేశించారు. వారు ఆపాఠశాలలో ఉన్నంతసేపూ ఆమె తల్లిగా ఉపచరించేది.

దురదృష్టవశాత్తు ఆపాఠశాల పెట్టిన ఏడాదికే ఆమె ఆయుర్దాయం చెల్లిపోయింది.

## అస్తమయం

ఆమెకు జబ్బు చేసింది. విసుగు, విరామం లేకుండా

రవీంద్రుడు ఆమె మంచంవద్దనే కనిపెట్టుకొని ఉండేవాడు. సకలమైన ఉపచారాలు నర్సుకంటె ఎక్కువగా చేసేవాడు. ఆమె రెండుమాసాలు మంచం పట్టింది.

అతనికి మృణాళినీదేవివల్ల నలుగురు బిడ్డలు. ఇద్దరు కూతుళ్లు; ఇద్దరు కొడుకులు. మొదట ఆడపిల్ల. ఆమెపుట్టేసరికి మృణాళినీదేవికి చిన్నతనం. కాగా బిడ్డపెంపకంలో రవీంద్రుడు తరుచు తోడుపడుతూ ఉండేవాడు. బిడ్డకు పాలుపట్టడం, ప్రక్క వేయడం, ప్రక్కబట్టలు మార్చడం మున్నగు పనులన్నీ అతను ఎట్టి ఎబ్బెట్టుకాని లేకుండా చేస్తూ ఉండేవాడు.

శాంతినికేతనంలో బ్రహ్మచర్యాశ్రమం స్థాపించిన పదకొండు మాసాలకు 1902 నవంబరు 23-వ తేదీ ఆదివారం నాడు మృణాళినీదేవి మృతిపొందింది. చనిపోయేసరికి ఆమెకు ఇరవైతొమ్మిదేళ్ళు.

రవీంద్రుని తండ్రి మహర్షి అప్పటికి ఇంకా సజీవుడై ఉన్నాడు. మృణాళినీదేవి మృతిపొందిన సమాచారం విని అతను ఇట్లా అన్నాడు: «రవినిగురించి నాకు ఎంత చింత లేదు. అతనికి పుస్తకాలతో ప్రొద్దుపోతుంది. గ్రంథరచనతో కాలక్షేపమవుతుంది. నావిచారమంతా పిల్లల్ని గురించి.»

## 'స్మరణగీత'

భార్యను స్మరిస్తూ రవీంద్రుడు 'స్మరణ' అను పేరిట కొన్ని గేయాలు వ్రాశాడు.

మృణాళినీదేవిమృతితో రవీంద్రుని గృహస్థజీవితానికి ఆశ్వాసాంతమైంది. ఆమీద అతనిశాంతినికేతనము విశ్వభారతి అయింది. అతను విశ్వకుటుంబి అయినాడు.

# సాకూతము

### శ్రీ రామచంద్ర కౌండిన్య



ఎన్నడేనియు చిందకున్నె త్వదీయ
దివ్యకరుణాసుధావృష్టి దీనపైని
యనుచు హృదయమ్ము తహతహలాడ నేల?
నీలి కనుగొన నశ్రుకల్లోల మేల?
అస్మదీయాధరామృతాస్వాదనంబు
పాపి గాటంపు సిట్టూర్పు పాలి కేల?
కమ్రబాహుల బలితంపు కౌగిలింత
నా పతికి నీకు గాక శూన్యమున కేల?
కాంచునది యేదొ తెలియక కాంచు టేల?
కరగిపో నేల, నా లోనె, కాంత! నేను.

మేలమాడుట మానుకొమ్మిమ్మ, మదీయ
హృదయపాత్రిక గైకొన గదవె, సదయ
తరుగు వోవని ప్రేమదుగ్ధముల నింప;
శిథిలమో గిన్నె గాంచి కుంచింపకోయి
కనుబొమల, నుంత కదిపిన గలగుమనము
చిత్రగతి యంగములను భజించు జడను.
నాళముల నేదో వికృతి బెనంగి, యొడలి
జల్లుమనిపించి యంతలో సమసిపోవు:
ప్రీతె యిది, కాని నన్ను గోపింతు వేమి?
అపరిపక్వము మృత్తిక, యలతిజలము
లను ఘటించిన ఘట మెంత మనగ గలదు?
సైపజాలని విరహసంజనిత మెద్ది
అరసి తెలియుము దోస మెవ్వారిదొ; నాదె?

# గీతగోవిందము

"గగనము నీరదావృతము, కాన్గుల కాటుక బర్వుకాన, రే
యగు, నతిభీరు వీతని గృహంబును జేర్పగ నీవ రాధికా
తగు" దను నందు నానతి ముదంబున వెల్వడి యామునద్రుమకుం
జగులు రహింత్రు కేళివిలసత్తను లాచు ముకుందరాధికల్.

భువి నలరించి రాగరసపూరణ, నుత్పలపత్రినైల్యమా
ర్దవముల దొల్కు సంగముల దారిచియున్ మదనోత్సవంబు, వ
ల్లవలలనాజనేష్టబహుళాశ్లిషదప్రతిమాంగు డై, రతీ
ప్రవిమలమూర్తి ముగ్ధహరి వర్తిలు గేళి వసంత వేళలన్.

మలగ గళంబు కంపిలగ మస్తకశేఖరపాళి, వేణుగీ
తలె నయతారమున్, తదవధానలు కానని రీతి రాధికా
కలమధురామృతాస్యశశి గండళితంబులు కృష్ణునీక్షణో
ర్ములు చిరకాల మోహముత మమున్ పానగూర్చి శుభోదయంబులన్.

రాస ముదంబు మీరు వ్రజరామలు విభ్రమ లున్న మ్రోల నా
సాసల దాసి రాధ, ప్రణయాంధ, కవుంగిట గ్రుచ్చి వక్షు, "మా
హో, సుధలొల్కు నీవదన" మం చని గీతి నుతించు నేర్పుమై
నేసరి ముద్దుగొన్న స్మితకృష్ణమనోహరు డోముతన్ మమున్.

గోకుల మంబుపాతమునకున్ బలివోయిన బ్రోవగా
గిరిన్ జేకొనె, తోన గొల్లత లశేషముదాన చిరంబు ముద్దు లీన్
జేకొనె, వారి యాయధరసిందురముద్రిత మోచు దర్పమున్
వాకొనె, కంసశాత్రవుని బాహువు, మీ కొనరించు శ్రేయముల్.

## ప్రణయమా!

* * *

అరుదెంచితివి నీదు
కరమె నను గ్రహియించె
చుంబింతు నీ పాణితలము
ప్రణయమున, భయమునను, ॥చుంబింతు॥

ప్రణయమా, నా నాశ
మొనరింప నీరాక,
ఇంత తెలియదు నిక్కముగను;
వడకు పాదయుగంబు
కడతేర్పు, నను రమ్మ ॥చుంబింతు॥

నిసమాన శీల మనల
విసరేపవు. భుజియింపు
మెద చూడు మిద్ది నీ యదియె;
నీ రచనకృతము క్షతి
నార మూండిన సుకృతి ।చుంబింతు।

పొందగోరెదు నన్ను
పూర్ణ; నంతియు పొంది
పొందబో వొక సుంతయేని;
నీవు సాగిన దారి
నెగడు విధ్వంసనమె ॥చుంబింతు॥

ఎల్లియే నీ కేలు
మెల్ల లాలింపుచునె
కొల్లగొను నా జీవములను;
ముద్దుగొను వేళనే
మారకాహతి కెదురు నూతు.
చంపు, మర్దింపు నను
సందియము వీడు మా
చెడుగె శుభ మీజీవి యెడల,
ముక్తి నొసగెదు, రుద్ర ॥చుంబింతు॥

నారక్త మురలించు
నాహంతులు బంధముల
నొక్కొక్కటినె త్రుంచు సుమ్ము;
సహమాంసముగ నాదు
సంకెలల నెడలించు
నీపాణి చుంబింతు నమ్ము.
ఒడలిచెఱ విఱుగగా
పొడిచెదవులే, హంత,
వివరంబు నొసగితివి కాదె?
నాప్రాణము పలాయ
నము సేయు నాసరణి ॥చుంబింతు॥

కృష్ణనగు నాలోన
కష్టబీజము నీవు
నిల్పినది యెరిగింతు నేను
వెత దివ్యమును నాటు
విశ్వఖేదము దెల్ల
పరిపక్వమాత నా హృదిని
చుంబింతు నీ పాణితలము
భయమునను, ప్రణయమున
చుంబింతు నీ పాణితలము.

# మీరాప్రశంస

శ్రీ వింజమూరి శివరామరావు

మీరాసతి! నీకు సాటి
లేరు భక్తకోటిలో!
మాన్యచరిత్రవు నీవే
ధన్య వీ ధరిత్రిలో!

శౌరికథాగానసుధా
పూరితమ్మ నీ వచస్సు!
గోపాలకరూపకళా
దీపితమ్ము నీ మనస్సు!

నీదుమాట పొందికలో
వేదాలె నందించెనూ!
నీపాటల సందడిలో
పాపాలె నశించునూ!

స్త్రీజాతికి ఏ నాటికి
నీజీవిత మాదర్శము!
నీపావన భావమ్ములు
దీపిక లీ లోకానికి!

# మీరాప్రార్థన

ఎంత మనోహరమూ! యమునో
పాంతవన మ్మతిసుందరమూ!!
నీలతనూ విభవాతిశయమ్ముల
నీ లత లీ తరు లందినవీ!

ఏ వనమాలికలోనిసుమమ్ముల
తావు లిచటనే మూగినవో?
ఏ మృదువేణువు నంటి స్వరమ్ములు
సామములె యిటు సాగినవో?

ఏ నవనీతము నీ యెడ గోపకు
లానికి విందులు చేసినవో?
ఏ నవ కౌస్తుభకాంతులు వెన్నెల
మౌని మనమ్ముల కాసినవో?

ఇట నే పూతనగర్వ మడగెనో?
ఇట నే గోపిక సర్వ మొసగెనో?
నరులందర నుద్ధరించుటకు నై
వరవైకుంఠమె యిందు నిలిచెనో?

# దేవాలయము

శ్రీ కామఋషి సత్యనారాయణ వర్మ



మనదేశమునందు దేవాలయము లేని పల్లెగాని పట్టణముగాని కాన్పింపదు. ప్రతికోవెలకు ఒకగోపురం ఉంటుంది. ఏదైనా జనపదము చూడబోతే ముందుగా గోపురశిఖరం కంటబడుతుంది. ప్రతికోవెలముందు ఒక కోనేరు ఉంటుంది. కోవెలకు గోపురము అందమైతే కోనేటికి కలువలు శోభిస్తాయి - కోనేరు తల్లివలె చల్లని నీటితో మాలిన్యం కడుగుతుంది. తియ్యని తోయంతో దాహోపశమనం చేస్తుంది. తరతరములుగా ప్రజలు దేవతాదర్శనమునకు దేవాలయములకు పోవుచున్నారు. ఎందరెందరో మహారాజులీ దేవాలయసంస్థలకు పోషకులై అగ్రహారాలు దానంచేసి నిత్యము ధూపదీపనైవేద్యములు—నిత్యోత్సవ, మాసోత్సవములు జరుగుటకై శాశ్వతమైన సౌకర్యములను కలిగించినారు. నేటికి ప్రజాజీవనముపై ఈదేవాలయముల కున్న పలుకుబడి ఇంతింతని చెప్పజాలము — కోట్లకొలది ధనము స్థిరచరాస్తులరూపమున ఈదేవాలయములలో నిక్షేపింపబడియున్నది. కవులు తమకవితాప్రతిభను గనబరచుకొనుటకు, శిల్పి తనచాతుర్యమును ప్రదర్శించుటకు, గాయకుడు తనకళను ప్రకటించుకొనుటకు, నట్టువకత్తె తననాట్యప్రదర్శనమునకు మునుముందుగా దేవాలయమే ముఖ్యస్థలముగా స్వీకరించినారు.

పండితునిమొదలు పామరునివరకు గల అనేక మనస్తత్వములు గల ప్రజానీకమునకు అనుకూలముగా పూర్వ ఋషులు తమ తపశ్శక్తివలన దేవతామూర్తులను ఊహించి ధ్యానశ్లోకములుగా రచించి వాటిరూపకల్పనమునకు మార్గముల ననుసంధించినారు. అవాఙ్మానసగోచరుడగు పరమేశ్వరుని, సర్వాంతర్యామి యగు దేవతాచైతన్యమును మన చర్మచక్షువులకు గోచరింపజేసి ఆదేవతయొక్క శక్తిని అవగాహన మొనర్చుకొనుటకు ఈసగుణారాధన మొకసాధనముగా నేర్పడినది. సృష్టికి మూలకారణమై అంతటా నిండియున్న జగదీశ్వరునో, జగన్మాతనో భావించి ధ్యానించుటకు విగ్రహ మొకసాధనము మాత్రమే — మనస్సుచే గ్రహింపదగు జ్ఞానమునకు చక్షురాది ఇంద్రియములచే నెఱుంగుట ప్రథమసోపానము. అందులకే ఈదేవాలయములు ప్రజల హృదయపరివర్తనమునకు ప్రధానస్థానములుగా స్థిరపడిపోయినవి.

దేవాలయప్రాంగణమున కాలు పెట్టగానే మనస్సుయొక్క చాంచల్యము దిగులు, బెంగ వదలిపోతుంది. ఆగోపురశిఖరాలను, అందలిశిల్పాలను చూస్తూంటే మనస్సు ఉన్నతపథాలకు పోయి ఒకవిధమైన శాంతి, ధైర్యము ఏర్పడతాయి. దేవాలయమందలి ఘంటాధ్వనులు దీపకాంతులు, ధూపములు సువాసనలు, ప్రపన్నుల పాశురపఠనములు, శ్రీసూక్త పురుషసూక్త పారాయణలు - ఏకాంతసేవలు, భజనలు అనుదినజీవితయాతనలలో నలిగిపోతున్న మానవున కూరట కలిగించి మనశ్శాంతిని కలిగిస్తున్నవి. ఏటఏటా జరుగు తీర్థములు- తిరునాళ్లే లేకపోతే మానవుడింకను ఎంతగా క్రుంగిపోవునో అనిపిస్తుంది. ముక్కోటి, శివరాత్రి, సంక్రాంతి, ధనుర్మాసము మొదలగు పర్వదినములలో ప్రత్యేకమైన ఉత్సవాలు జరుపుతుంటారు. దేవుని పెండ్లికి అందరూ పెద్దలే గదా! ఉత్సవదినములకు ముందుగా కళాకారులు, పారిశ్రామికులు అనేక వస్తువులను తయారుచేసి తీర్థములలో అమ్మకమునకై సిద్ధపరచెదరు. కళ్యాణపురోజులలో ఆలయపరిసరప్రాంతమంతా ఒక చక్కని వ్యాపారకేంద్రమైపోతుంది. దేవాలయాలంకరణమునకు, రథములు, వాహనములు చేయుటలోను అనేకమంది కళాకారులకు పుష్కలముగా పని దొరుకగలదు. బోయీలు, కాగడాలు వెలిగించువారు,

మాలాకారులు ఎంద రెందరికో పని కలుగుతూఉండేది. ఆరాధనదినములలో పండితులకు, ఆగమవేత్తలకు, వేదాధ్యయనపరులకు, హరిదాసులకు, గాయకులకు దండిగా పనికల్పింపబడుతూంది. ఈపనులన్నీ ప్రజల త్యాగము, ఔదార్యమువల్లనే నేటికీ జరుగుతూఉన్నవి.

మనదేవాలయములు విద్యాస్థానములుగా వర్థిల్లినట్లు అనేకచారిత్రకాధారములు గలవు. పండితులు దేవాలయ మండపములలో శిష్యులను చేరదీసి ఉచితముగా విద్యా ప్రదానము గావించుట ఒక ఆచారముగా నున్నది. వేద వేదాంగములు, పురాణములు తరతరములుగా నిలిచి యుండుటకు ఈదేవాలయసంస్థలే ముఖ్యకారణములుగా నున్నవి. ఆనాటి ప్రభువులు, శ్రీమంతులు విద్యావ్యాప్తి కొరకు దేవాలయములకు భూరివిరాళము లిచ్చి విద్యార్థులకు, గురువులకు భోజనవసతిసదుపాయములు కలుగజేసెడి వారు. శ్రీకూర్మం, సింహాచలం, శ్రీకాకుళము, శ్రీశైలము మొదలగు దేవాలయములు ప్రఖ్యాతవిద్యాస్థానములుగా నున్నట్లు చరిత్రలవల్ల శాసనములవల్ల తెలియవస్తుంది. రుద్రమదేవి తనఅస్త్రశస్త్రవిద్యాగురువైన విశ్వేశ్వరశివాచార్యులకు దానంగా ఇచ్చిన మందరగ్రామంయొక్క రాబడిని వినియోగించి గోళగీమఠం కట్టించి అచ్చట కేవలం విద్యాభ్యాసమునకేగాక ప్రసూతి, ఆరోగ్యములకు శాలలుకూడ కట్టించెనట. ఇటువంటి నిదర్శనములు చరిత్రలో కొల్లలుగా నున్నవి.

మనభారతదేశమందలి గుహాలయనిర్మాణము తలంచుకొన్నంతనే ఆనాటిశిల్పుల ప్రతిభావికాసము - ఏకాగ్రత పరాకాష్ఠ నొందినట్లుగా తెలియగలదు. వేయిమంది ఆసీనులగుటకు వీలైన సభాస్థలములుగా బండరాళ్ళను మార్చి తొలచి శిలలకు జీవము పోసిన ఆశిల్పులు ఋషితుల్యులనుటలో సందేహము లేదు. ఎల్లోరా కైలాసగుహాలయముల సౌందర్యము చూడవలసినదే గాని వర్ణింప నలవి గాదు. ఒక మహోన్నతపర్వతమును దొలిచి గుడి, మంటపము, ఇరువైపులా గోపురములు, రెండుధ్వజస్థంభములు, ఇరువైపులా రెండు గజేంద్రములు యాత్రికమందిరములు విహారమంటపములుగా చెక్కబడినది. రాష్ట్రకూటప్రభువు కృష్ణరాజు కుష్టువ్యాధి కుదిరినందున ఈకైలాసము నిర్మింపబడినట్లుగా చరిత్రవల్ల తెలియవచ్చుచున్నది. అజంతా గుహాలయ చిత్రరచనాసమర్థత విలువకట్టరానిది. «శతాధికముగా నున్న గోడలపైనను, స్తంభములపైనను మన కన్నులయెదుట ఒకనాటకి మాదిరిగ నడుచుచున్న ట్లుండును. అందు రాజులు, యతులు, మునీశ్వరులు, స్త్రీలు, పురుషులు ఎందరో పాత్రలుగ గోచరింతురు. వెనుకగా అరణ్యములు, వనములు, రాజదర్బారులు, పట్టణములు వాటికి రంగములుగా కన్పట్టును. స్త్రీపురుషవ్యక్తులయొక్క దైహికసౌందర్యము జంతువులు, పక్షులు, పూలు, లతలు మొదలగువానియొక్క సహజసౌందర్యము సహస్రవిధములుగా దృగ్గోచరమగును. 'సాధారణమైన నిత్యజీవితమునందు పొంగులువారు ఆధ్యాత్మికానుభూతిని వర్ణించుటయే ఈ అజంతాచిత్ర మండలి ముఖ్యసత్త్వ మని' ప్రొఫెసర్ విలియం రోథన్‌స్టైన్ గుహాలయసౌందర్యమును కళ్ళారాచూచి చెప్పిన మాటలు. ఇందు బుద్ధదేవుని కారుణ్యముపట్ల మానవునకు గల అభిమానమే వానినారాధకునిగా తీర్చిదిద్ది—శిలకు జీవము పోయగలిగినది.

ఆంధ్రనాట్యసంప్రదాయములలో అఖండవిఖ్యాతిపొందిన మొవ్వగోపాలపదకర్త క్షేత్రయ్యకు భక్తిభావముకలిగి పదకర్తయై నాట్యశాస్త్రకులపతి యగుటకు మొవ్వగోపాలస్వామియే కారణము. కూచిపూడిఅగ్రహారంలో సిద్దప్ప అనే బ్రాహ్మణుడు సన్యసించి సిద్ధేంద్రయోగియై భామకలాపం, గొల్లకలాప మనే శృంగారగ్రంథములను నాట్యానుకూలముగా రచించి భాగవతప్రదర్శనములకు ఆదిగురువు లైనారు. ధూర్జటికి కాళహస్తీశ్వరుడు కంచర్లగోపన్నకు భద్రాచలరాముడు, పాలుకురికి సోమనాథునకు శ్రీశైలమల్లికార్జునుడు, కూచిమంచి తిమ్మకవి పీఠికాపుర కుక్కుటేశ్వరుడు ఇట్లు ఒక్కొక్క మహాకవికి ఒక్కొక్క స్థానికదైవం ఇష్టదైవముగా నేర్పడి వారికావ్యకల్పనకు ఉత్తేజితపరచినటుగా వారిరచనలవల తెలియగలదు—

ఈవిధముగా ఏదేవాలయమును పరిశీలించినా ఆ మహాసంకల్పమునకు కారణభూతులైన మహనీయులఔదార్యము దేవాలయగోపురశిఖరములకంటె ఉన్నతముగా గోచరించక మానదు. దేవాలయనిర్మాణమునందు స్వార్థముగాని, సంకుచితభావముగాని గోచరించదు— తటాకమును త్రవ్విం

చుట, నిధులను నిక్షేపించుట, అగ్రహారదానము, దేవాలయప్రతిష్ఠ, ప్రబంధకృతిస్వీకృతి. పుత్రసంతానమును బడయుటలు వీనికి సప్తసంతానము లని ప్రశస్తి. ఇవి సంగీత సాహిత్య కళాపోషణకు పరిశ్రమాభివృద్ధి, వాణిజ్యాభివృద్ధికి దోహదము చేసినవనుటలో సందేహము లేదు. ఇట్టి సంస్థలను జాగ్రత్తగా కాపాడుకోవలసియున్నది. ఇట్టి పవిత్రకృషిలో తమపాలు పంచుకోగలిగినవారు ధన్యజీవులు — "కూడబెట్టిన ధనమునకు త్యాగమే రక్షణ. చెఱువు నిండిన నీటికి తూములు తెరవడమే రక్షణ."

—చాణక్యనీతిదర్పణము.

# అధ్యాత్మ - అన్వేషణము

శ్రీ కృష్ణ భిక్షు



పితృయానము

ఈ యనంతవిభావరి నీ యసంఖ్య
శశికిరణమాలికాడోల చలువలందు
నూగుచును నూగుచును బోవుచున్నవాఁడ
నొక విమానమునన్ బలె నూర్ధ్వమునకు.

తారకాకాంతులును లేని తావులందు
సుమములును లేని సౌగంధ్యశూన్య, భయద
ములగు నిశ్శబ్ద, గంభీర, మోహాకాధ్వ
ములను బోవుచు నున్నాఁడఁ గలఁకుఁలేక.

ఒక యేకాకిత; భీతి పెంచె క్షణ మే నూర్ధ్వప్రదేశంబునున్
ప్రకటం బౌ గతి దాఁటి నిశ్చలముగా రాణింతు యానంబునన్
సకలస్వాంతమరందమత్తతఁబలెన్ స్వారాజ్యగంగాధునీ
వికచాబ్జస్ఫుటవాసనాలహరి నన్ వేష్టించుటల్ గాంచితిన్.

ఎవరును లేని యీకడకు నే నెటు వచ్చితి? నెందుఁ బోవుదున్?
పవనునితోఁడ లేదు, నిఁక నేస్థితి నుండుదు? నెవ్వ రీదిశన్
ప్రవణత రాజ్య మేలుదురు? భావమునందును నెప్డు రాని యీ
ప్రవిమలసీమ నా కనుభవం బగు చందము లెట్లు కల్గెనో?

ఎందుల నుండియో పలుకు లే విన నయ్యెడుఁ 'దండ్రి కొన్మ నే
నిందుఁ ద్వదీయసద్గతికి, నిచ్చెదు పిండము వారిపూరమున్
పొందము నీవు నీపితలఁ బూర్వకులప్రథితాత్మబంధులన్
వందుర నేము నయ్యాదియు బాధ యొనర్పక యుంతు నీకునున్.

## వెలుఁగుజగతు

జ్యోతిర్మయాంగకులు శోభాసమున్నిద్ర
లింపు నను జేర్చి, రిటు: లంత మాయం బైరి
అమృతకోశిలకాంతు లావరించు జగత్తు
సూర్యచంద్రులు లేని భాగసుటచ్చోట విదియు

పూవిమానములోనఁ దావిమండలిలోన
నాకాశజలములో నంశుమాలాకోల
మిన్నేటికెరటము మీఁదఁ జిందెడునట్లు
వచ్చి చేరినవాఁడ, వర్థిల్లఁ దనుసుఖము.

మకరందవల్లికలు, వికసితముఖాబ్జలును
విద్యుచ్చలద్రుచుల్ ప్రేమసారేక్షణలు
నృత్యదంఘ్రిసరోజ లత్యంతసుఖదేహ
లావరించినవార లస్మన్నికటభూమి

నా దేహంబును వెల్గువెల్లువ యగున్, నానారసావిర్భవ
ద్దేదీప్యంబగు శక్తినార మయి దివ్యం బైన భోగంబు లే
నీడం జేయఁగఁబోలు నచ్చరల ప్రేమార్ద్రైకలౌల్యంబులన్
ఈదౌర్భాగ్యము నాకు వచ్చెఁ గట! ప్రాణేశాని వే యుండఁగా

ఆప్రియ శుద్ధ, తాపసి, కులాంగన, ప్రేమరసంపుమూర్తి నా
విప్రియ మెన్నఁడున్ గనదు; వేడుక గొంటినె యప్సరోగతిన్?
ఆప్రియ వీడె నన్నగజయంతికభూముల నుండ, దాని కే
నప్రియ మెట్లుఁ జేయుదునె? యక్షుల క్రీలెడుఁ దన్వి చెయ్దముల్.

పావనమైన మహేశు లీలలను బాడెడు సుస్వరనాద మహో
జీవనపోషకరుద్రకేళికలఁ జెప్ప చెలంగుచు నుందు రహో
భావము సర్వము నాదాకృతి యగుఁ బరమాస్థానమునందు నహో
కేవలశాశ్వతమృతునివై భవము కేళీపర మయి క్రాలు నహో.

శాంతిపరాగభూషితము జానుగ దేవసరిద్విభూషమున్
కాంతజటావళిగ్రసితకామము దివ్యశుభాస్పదంబు నై
కాంతికభక్తకోటి కెపు డాశ్రయమున్ మహితాత్మమైన యా
శాంతవిముక్తిదానపరసత్త్వగుణంబు సమాశ్రయించెదన్.

అదె నాకాంత! కనుంగొనంగ మది మెట్టై పోవునో చెప్ప హా
పదమూర్తే లే దెట: నశ్రుసంతతుల సంభాషించు నేత్రంబులే
మది నిల్పోపదు; దేవసన్నిధిని గామప్రక్రియల్ చెల్లునే
ఇది గా, దంక మహేశపాదముల భావింతున్ సుఖస్ఫూర్తికై

కైలాసంబున శర్వుపాదముల సంక్షాళించి పాపంబు, నీ
హేలావ్యాపృతి నార్చి శాంతముగ నీహారాద్రికన్యాకటా
క్షాలానస్థితిపుణ్యవైభవము వే సాధింపవే నెచ్చెలీ
కాలోదగ్రమహాగ్ని నెట్లయినను న్యక్కారమున్ జల్పవే.

పదములనుండి పాతకవిభావనఁ జేయుటఁగాదె పాసి యే
గి దవిలి పార్థివంబుల జిగీషల సంస్కృతిలోనఁ గూలితిన్
వదలని యైక్య మీయవె శుభంబుల వేడితి కాదు కామమున్
ఎదలను గాక దేహ మది యేకముగా మముఁ జేసి చూడవే.

చింత

సంచరించితి నేను సకలలోకముల
పంచాస్త్రిబారిని బాసి పోలేదు
పంచేంద్రియారామపంజరశుకమ
కొంచె నైతి వివేకకూలమ్ము గొనక.

ఏల జనించుఁ దృష్ణ? మది నెల్ల వికర్షణ సేయ దృశ్యముల్
ఏలకొ యింద్రియంబు లవి యీడ్చెడు నన్నిటు దృశ్యపంక్తికై
బాలుఁడ నే పరుల్ నను విపన్నుని జేయఁగ? నే నెవండ ని
త్యాలఘుబ్రహ్మ మేన యని యార్యులు చెప్పఁగ వింటిఁగాదె మున్.

అకలనిరంజనుండఁ, బరమాద్భుతమాయను వ్యక్తఁ జేసితిన్
వికలయగాదె నే నెఱుఁగ? వేఱుగ నొం డెట నుండు నాకునున్
ప్రకటితవృత్తివైభవము చా టొనరింతును, నిల్తు నొక్కటన్.

ఒక్కఁడను నేను లోకాల నుంటి, నుందు,
నున్న వాడను స్వప్నాన నుండువాఁడ;
సుప్తియందు, నతీతంబు శూన్యమందు
నేయవసల నాసితి కేమి క్షతియొ?

ఇంద్రజాలమునకు నేది యాధార
మట్టివాస్తవవస్తు వలఘుత నేన
అహ మస్మి; బ్రహ్మాహ మహము బ్రహ్మంబు
సర్వంబు బ్రహ్మమే సర్వము నాత్మ.

# "నవవధూ!"

శ్రీ జంఘ్యాల లక్ష్మీనారాయణ శాస్త్రి "సుధాంశు"



రావమ్మా! నవవధూ!
నవజీవనరాగమధూ!!

అరవిచ్చిన పద్మం వలె
పరమముగ్ధభావం వలె
పాలకడలి కెరటం వలె
పారిజాతపుష్పం వలె

రావమ్మా! నవవధూ!
నవజీవనరాగమధూ!!

మాధవీవిలాసం వలె
మధువసంతహాసం వలె
పుష్పించిన అందం వలె
పూర్ణరసానందం వలె

రావమ్మా! నవవధూ!
నవజీవనరాగమధూ!!

దీపశిఖాదీధితి వలె
దివ్యకాంతిసంతతి వలె
ఐంద్రచాపసుందరి వై
ఐహికభాగ్యేందిర వై

రావమ్మా! నవవధూ!
నవజీవనరాగమధూ!!

సహజమధురసౌమ్యమతీ!
సరసభావజయగీతీ!
జగదద్భుతజీవయాత్ర
సాగింపగ రావమ్మా!

రావమ్మా! నవవధూ!
నవజీవనరాగమధూ!!

స్నేహమయీ! రావమ్మా!
గృహదీపము వెల్గింపగ
రావమ్మా! గృహలక్ష్మీ!
రాగమయీ! స్వాగత మిదె!

రావమ్మా! నవవధూ!
నవజీవనరాగమధూ!!

పుట్టింటికి శుభగౌరవ
పుష్పమాల పంపింపగ
మెట్టినింట శ్రీసుఖసం
ప్రీతిగీతి విన్పింపగ

రావమ్మా! నవవధూ!
నవజీవనరాగమధూ!!

సుధామధురసుమసుగంధ
సుందరసుస్నేహాంకిత
సుఖజీవన మందుకొమ్మా!
సుఫలశోభ గైకొమ్మా!

రావమ్మా! నవవధూ!
నవజీవనరాగమధూ!!

ముద్దులొలుకు నిరతము నీ
ముఖఫలకశ్రీతిలకము
కాంతులొలుకు సతతము నీ
గళసూత్రము కళ్యాణీ!

రావమ్మా! నవవధూ!
నవజీవనరాగమధూ!!

ప్రభుపదానువర్తిని వై
ప్రణయమూర్తి రావమ్మా!
శాంతిసుధాకరుణకిరణ
సంక్రాంతీ! రావమ్మా!

రావమ్మా! నవవధూ!
నవజీవనభాగ్యమధూ!!

# సరోజిని - సానుతాపస్మృతులు

శ్రీ మండలపర్తి ఉపేంద్ర శర్మ

☆

సరోజినీదేవి మానవత అధికముగా కలిగినమహావిదుషి. ఆమెయందు సమస్తమయిన సంస్కృతులు సమ్మేళన మొంది ఏవిధమైన లోపములు లేకుండా నుండెడిది. ఆమెలో వికాస మెప్పుడును నిరంతర ముపస్థితమై యుండెడిది. హృదయవైశాల్యము కల ఆ ఉదారచరితయందు లోపము లెట్లు లేవో అట్లే యితరులయందుకూడా లోపములు లేవని భావించెడిది. ఎవరిలోటులను వెదకి వెలువరించెడిది కాదు. అందరియెడల ఆమెకన్నతల్లివలె హెచ్చుతగ్గులు లేక సంకుచితత్వము లేక సమభావముతో ప్రవర్తించెడిది. అందరిని ఆదరించి ద్వేషము అసూయ ఎవరియెడలను చూపక మెలగినట్లే అందరు ఆమెయెడ ఆదరాభిమానములతో మెలగుచుండెడివారు.

మన ప్రధానమంత్రి నెహ్రూపండితుడు సరోజినీదేవి పలుకుబడికి స్నేహవాత్సల్యములకుచకితుడై ఆమెను 'సర్వప్రియ' అను బిరుదునకు అర్హురాలు కావించెను. సరోజినీయందు కరుణాదృష్టి అపారము. వైరుధ్యభావము ఈషన్మాత్రము ఎంత అన్వేషించినను కానరాదు. మహిళాలోకమందు సరోజినితో సరితూగు వనిత లెందరో లేరు. సోదరి నివేదితతో తులచెప్పుటకు అనేకలక్షణములు కలవు. పరోపకారదీక్ష పరిచితవ్యక్తులయొక్క సానుతాపస్మృతులను వెలడించుటయందు గోచరింపనగు ఈగుణములు ప్రసిద్ధము.

సరోజినీ దేవిని సోదరి నివేదితతో సరిపోల్చుటకు అనేకాధారము లున్నవి. భారతీయవనితాసముద్ధరణమందును, మానవసేవయే మతముగ స్వీకరించుటయందును స్వరమాధుర్యమునందును, వాగ్వైభవమునందును, రచనాపాటవమునందును, కళానిష్ణాతృతయందును, సరోజినీదేవి నివేదితాసోదరిసామ్యము కలిగియుండిరి. భారతదేశమును నివేదిత ప్రేమించినది. పాశ్చాత్యదేశములను సరోజిని ప్రేమించినది. నవ్యరీతుల నిర్వురు పొగడెడివారు. మహాత్మాగాంధియందు సరోజినిదేవికి గౌరవాతిశయములు-వివేకానందస్వామియందు నివేదితాసోదరికి గౌరవాతిశయములు. పరోపకారదీక్షయందు భారతీయులకు హృదయపూర్వకముగ హిత మాచరించుటయందు, సేవాత్యాగములందు సమానలై మన మెల్లప్పుడును ఆ మహిళామణులకు, ఋణగ్రస్తులమై యుండునట్లు గావించిరి. ప్రేమయే పరమేశ్వరుడు, ప్రేమకు లేమి లేదు అని ప్రబోధించిన ప్రవక్తల కుచితమైన శిష్యరాండ్రు, ఈయిరువురు విదుషీమణులు. తమజీవితముల దేశారాధనముల కంకితమొనర్చి తరించిరి. తోడివారికి తరణోపాయముల చూపిరి — స్వార్థరహితసేవకు ప్రసిద్ధినందిన ఈవనితామణులు తమ గురువులను కొలుచుచు వారి యోగముల నరయుచుండెడివారు — సోదరి నివేదిత వివేకానందస్వామిని కనిపెట్టుకొనియుండి రామకృష్ణమఠముననే వసించుచు ఆ సేవాసమితిపరమున భారతదేశమంతటిని పర్యటించి కష్టనివారణకార్యక్రమములలో పాల్గొని ఉపచరించినది. సరోజినీదేవి గాంధిమహాత్ముని సర్వకాలసర్వావస్థలయందు కాచికాపాడి, జాతీయ మహాసభ కార్యకలాపము నడిపించినది.

ఆడుచు పాడుచు ఆ మహాత్మునితో పనిచేసి, అలుపుసొలుపులు లేకుండ ఎల్లప్పుడు సాహసౌదార్యోత్సాహముల నాయనలో సర్వప్రియ ఇనుమడింపచేసినది. ఆయాసము లేకుండ ఆనందముతో, ఉల్లాసముతో, ఉత్సాహముతో మహాత్ముడుండునట్లు సరోజిని సర్వదా చూచెడిది. కరమ్చందునకు కార్యదర్శి మహదేవుడు, మాతా సరోజినీ

ముఖ్యముగ పరిచర్య లొనర్చి తైమజీవితము స్వేశోహిత మొనర్చినవారు.

బాపూజీ పరమపదించినప్పుడు ప్రపంచమునందలి ప్రముఖులు బాష్పాంజలులను విడిచిరి. ప్రసిద్ధచరిత్రకారులు, సుప్రసిద్ధ శాస్త్రకారులు, రాజకీయనాయకులు, మతగురువులు మహాత్ముని నిర్యాణమునకు దుఃఖించని జీవి ఈలోకమున లేదు. "ఐన్‌స్టీన్" మహాత్మునివంటివాడు భూమిపై మానవశరీరధారియై చరించె నని బహుశః రాగల తరములవారు విశ్వసింపలేక పోవచ్చునవెను. "జవహరిలాలు" ముందు రానున్న శకాలలో భవిష్యత్ శతాబ్దాలలో భావియుగాలలో ఈభగవదంశసంభూతుడై గాంధీజీ అవతరించి సంచరించిన ఆత్యల్పులమైన మనముకూడ ఆయన అడుగులిడిన పుడమిపై సంచరించితి మని అనంతరపురుషాంతరములవారు చెప్పుకుందురు. ఇట్లు అరవిందులు, రవీంద్రులు మహాత్ముని అనుచరవర్గము అయనబలిదానమును గూర్చి బహువిధముల విచారించిరి.

సరోజినిమాటలలోని భావము, ఆమె మహాత్మునినిర్యాణమునకు ఎట్లు కుములుచున్నదో వ్యక్తముచేయుచున్నది. ఆమె మహిళావంశక్షీరసముద్రమునకు సుధాకరరేఖ. కరుణాగుణ పరిపూతమూర్తి.

సరోజినీదేవి వాక్యములు కన్నతల్లి కడుపుతీపు కాదు, కడుపుకోతను వ్యక్తముచేయును. ఆమె ఉపన్యాస మొక శోకగీతి. ఆమె విషాదము ఈప్రసంగమురూపమున ప్రకటితమై (ఆకాశవాణిద్వారా) అందరను దుఃఖమున ముంచివేసినది. అందు కొంతమాత్ర ముదాహరింపబడును"

(మహాత్ముని) ఆయన మరణము మరువజాలని మాకందరకు వ్యక్తిగతమైన నష్టము. మాలో కొందరు ఆయనమరణము వలన ఖండములుగ ఛేదింపబడినారు. ఎందువలన అనిన మాహృదయము, మా రక్తము, మా జీవితములోని ప్రతి అంశము ఆయనజీవితముతో ఎడతెగనిబంధములతో పెనవేయబడినది ఈక్షణాన నా గద్గదస్వరము నాలకించు ప్రపంచముఎదుట ముప్పదిసంవత్సరములక్రిందట ఈమహాత్ముని సేవకు నాజీవితమును అంకితము చేసికొనినట్లు తిరిగి అట్టిప్రతిజ్ఞనే చేయుచున్నాను. నే నొక అల్పసైనికురాలనే కావచ్చును. నాతోపాటు మహాత్మున కత్యంతప్రియ (శ్రమ) శిష్యులైన నెహ్రూ, వల్లభాయి, రాజేంద్రబాబు, భారతదేశము నలుమూలలనుండి ఆయన కంతిమఅంజలి ఘటించుటకు వచ్చిన ఇతరశిష్యులును గలరు.

ఇంతకుపూర్వము నిరాహారదీక్షాసమయములందు ఆయన సపర్య చేయుచు ఆయనక్లేశభారము తగ్గించుచు నవ్వించెడి భాగ్యము లభించినప్పుడు- ఒకవేళ గాంధీజీసేవాగ్రామములోగాని నౌఖాళిలోగాని మరొకమారు ప్రదేశమునగాని అస్తమించిన ఎటు లక్కడికి వెళ్ళుదు అని సందేహించెడిదానను రాధాకైన అప్రణ్యమూర్తి భారతరాజాధిరాజులు గతించిన ప్రదేశమున గతించుట, అట్టి అంత్యక్రియలు జరుగుట ఎంతయు సముచితము సుక్రమము.

నా నాయకుని నా గురువును నాజనకుని ఆత్మశాంతి చెదరకుండుగాక! ఆయన మరణానంతరము భారతదేశము నిజస్వరూపము దర్శించుకొరకు పునర్జన్మ కలుగుంతటి శక్తి, ఆవేశం, ఆయనఅస్థికలనుండి ఆయనచితాభస్మము నుండి ఆవిర్భవించుగాక!

జనకా! నీవు విశ్రమింపకుము. మాప్రతిజ్ఞాపాలనకు ఆవశ్యకమయిన శక్తియుక్తులను మాకు ప్రసాదింపుము. నీ వారసులమయిన నీ బిడ్డలము, నీ శిష్యులము నయిన మమ్ము మరువకుము. మేము నీస్వర్ణస్వప్నరక్షకులము భావిభారత భాగ్యసంధాతలము నై నీ దయకలన ఒప్పుచున్నాము.

వీరమరణము అనాహూతముగ లభించిన అభ్యర్థితముగ సంప్రాప్తమయిన, ఆయాచితము నొడగూడిన నది ఆనంద జనక మని మహాత్ము డనెడివాడు. ఆవీరున కట్టి అనాయాసమరణమే ప్రాప్తమయినది. ఆశేముషీధురంధరున కుచితమయిన అంజలిని ఘటింప గలిగినది. సర్వకళాకుశల సరోజినీదేవి. ఆమహాత్ముని కార్యదర్శి, శిష్యుడు సర్వస్వము ఆయనసేవయందు సమర్పించిన ధన్యుడు మహాదేవ దేశాయి దివంగతు డైనప్పుడు నీ కరుణామయి, సరోజినీ మాత హృదయవిదారకముగ వ్రాసినది. హరిజన్ పత్రిక నుండి భారతి అనువదించు కొనిన ఈక్రింది వాక్యములందు సరోజినీదేవి మాన్య వివేకాభిమాన సౌజన్యక్షాత్రములు వెల్లడియైనవి. మాతృవాత్సల్యము- హృదయావేదన విదితములు.

"మహాదేవదేశాయిని అనుకొనినప్పు డెల్ల నామనస్సున

సాహచర్యముననుగూడ ఆయననుభవించిన ఎన్నెన్నో తల
పులు,- తియ్యనివి, తీవ్రమయినవికూడ అలముకొని వానిలో
నన్ను ముంచెత్తును. ఆయన నా ప్రసాదితమైన ఒక మహా
వ్యక్తి, ప్రేమపాత్రుడు, ఆయనతో స్నేహ మది ఒక మహా
భాగ్యము ఆయనసహచర్య మది ఒక ఆనందకందము.
మోహనమంత్రమువంటి మహాత్ముని పిలుపు చెవిసోకినపుడు
మహాదేవునకు పాతికయేండ్లుండునేమో !.... నిర్వికారనిష్కా
ళంకభక్తితో ఆతడు తనసద్గురునిచరణకమలముల పాతి
కేండ్లు సేవించి ధన్యు డయ్యెను

ఈస్మృతిసంబరములో నాకన్నులయందు మహాదేవుని
గూర్చిన అనేకచిత్రములు వడివడిని కనుపడగా పోవుచూపి,
నాభావనాపీఠిని చిత్రమయము చేయుచున్నవి. ముఖ్యమై
నవి సబర్మతి వార్ధా సేవాగ్రామఆశ్రమములో నవనవ
లాడు చమత్కారములను చక్కనైన హాస్యప్రసంగము
లతో మేళవించి గుప్పించుచున్న మహాదేవు, కన్నులను
వాల్చి తదేకతానముగా సారస్వతవ్యాసంగములుచేయుచు
తనకు తనంతగా తట్టినవో లేదా గురువులవారినుండి సంక్ర
మించినవో అయిన రమణీయమైన భావతరంగములను
అంతమయిన భావములోనికి దింపుచున్న మహాదేవు, బూడిద
రంగు సాలువు కప్పుకొని, బహుసూక్ష్మమయిన ఏదో
రాజకీయవ్యవహారము నెత్తికివేసికొని ఢిల్లీలోని రాజ
ప్రతినిధిసోపానము నెక్కుచున్నమహాదేవు, లండనులో
బకింగుహాము రాజమందిరములో రాజుగారి ఆదరాతిథ్య
ముల నందుకొనవెళ్ళిన మహాత్మునిని జిగేలుమనుచున్న
తెల్లనిఖద్దరువలువలతో దివ్యరూపమున వెన్నంటి వెళ్ళిన
మహాదేవు, యూరపు అమెరికాలనుండియు దూరప్రాచ్య,
సమీపప్రాచ్యములనుండియు ధారావాహిగా మూగివచ్చు
చున్న విదేశయాత్రికతండములకు తన సద్గురుబోధామృత
సందేశమునను అచ్ఛస్ఫటికసంకాశమయిన అద్దములో
సాక్షాత్తుగ ప్రతిబింబించునట్లే మృదుమధురమయిన గౌరవ
మర్యాదలతో విడమర్చి వ్యాఖ్యానించుచున్న మహాదేవు”

ఈ స్మృతులలోనికెల్ల మిక్కిలి చిత్తక్షోభకరమయినది
జన్మజన్మములకు మరపురానిది ఏదనగా ఆయనజీవితము
చాలించిన ఆవిచిత్రసన్నివేశము . తెగ వణకుచున్న చేతు
లతో ఎవరితోడ్పాటును లేకయే గాంధిమహాత్ముడు.
మహాదేవు శరీరమునకు యథోక్తముగ స్నానము చేయించి
నాడు. పరిమళగంధమును మై నలదినాడు. సుగంధకుసు
మములతో కై సేసినాడు ఇన్నియు అతిగంభీరముద్రతోనే
చెక్కుచెదరకుండ చేయుచు వచ్చినాడు. కాని చివరకు
ఆదుఃఖము పట్టలేకపోయినాడు. మహాదేవు ఇన్నిపను
లను నాకు చేయుదు వనుకొంటినే నాయనా ! చివరకు
నేనే నీకు చేయవలసి వచ్చెనదే అని పయికి వినబడి వినబడ
నట్లు గొణుగుకొనినాడు. ఆ అపరాహ్ణమునకే ఆ శరీర
మును ఊరేగింపుతో (ఉన్నకొద్దిమంది) తీసికొనివెళ్ళి ఆ
ఆగాఖానుమందిరప్రాంగణములో ఓమూల ఏర్పాటయిన
దహనభూమికి చేర్చితిమి. ఇంకేమున్నది’ మరికొన్ని నిమి
షములకెల్ల అక్కడ మిగిలినది చిన్నభస్మరాశి. ఆ ఉదయ
వేళ ధగధగ వెలుగుచు కాన్పించిన జీవజ్వాల సాయంకాల
మగుసరికి రాశిపోసిన రజతచూర్ణమువంటి భస్మరాశి అయి
పోయినది. మనదృష్టిపథమునుండి మహాదేవు మాయమయి
నాడు. కాని శక్తికిమించిన సాహస సత్యాగ్రహములతో
తాను అంతగ సేవించిన తనదేశముయొక్క హృదయ
ములో నద్యాపి జీవించి వెలుగుచునే యుండెను. ఇట్లు
సమాజమునకు తులలేని సేవచేసిన వ్యక్తులయెడ సరోజినీ
మాత ఎంతయు ఆప్యాయతను ఆదరమునుచూపి సాకుచుం
డెడిది. వారి చావునొవ్వులకు సమాధానపడి బాధపడి
కాలము జరుపుచుండెడది. యువకు లనిన ఆమెకు ఎక్కడ
లేని విశ్వాసము ప్రేమ. పందొమ్మిదివందల ఇరవైరెండు
నుండి మహాదేవదేశాయిపై సరోజినీదేవికి వాత్సల్యము.
విద్యార్థిసభకు ఆరోజులలో అధ్యక్షతవహించినది. తన
సమాధిపై నిలిపిన శిలాఫలకముపయి సరోజినీదేవి స్మారక
వాక్యము లీ తీరున నుండగోరినట్లు తెల్పినది. భారతదేశ
యువజనులపై ఆమెకు ప్రేమ ప్రగాఢము. వారినే యధి
కముగ విశ్వసించినది. వారితోడనే ఎక్కువగ కృషిచేసి
నది. వారిసాహాయ్యముననే భారతస్వాతంత్ర్యము సంపా
దించినది. ఆమె ప్రభావము యువకులపై అపరిమితము.
వారిపయి పెట్టుకొనిన ఆశకూడ అంతులేనిది. మద్రా
సులోకూడ మహోపన్యాసము చేసి యువకుల నెందరినో
ఉత్సాహపరవశులను చేసినది. భావిపౌరులని భారతో
ద్ధరణ గావింపవలసినవారని విద్యార్థులను గూర్చి వాకొను

చుండెడిది.

విశ్వకవి కీర్తిశేషు డైనప్పుడు కవయిత్రి చూపిన సానుభూతి సౌహార్ద్రభూయిష్ఠము- భక్తిభరితము-త్రికరణశుద్ధము.

"What can be greater than to be a poet like Togore? Philosophers have lived and died; their schools of Philosophy have grown up and been forgotten. Kings have lived and died and who remembers them, their names, and dynasties they founded? Great generals have achieved glory and been forgotten. But the poets live for ever, he lives in the hearts of today, he lives in the hearts of tomorrow and a poet like Tagore who loved his conntry was none the less a lover of all countries. Even in every fibre of his beeing, in the silvery hair of his head, in every rich drop of his blood. Indian outside and Indian inside of him, he, none the less, was the symbol of genius of India. But he always had a universal quality. And India always universal in her appreciations of all knowledge, the reception of all sciences has found her last, her latest, her most lovely interpreter, her most lovely embcdiment, her most lovely prophet, her most lovely affirmation in Rabindranath Tagore who before he died with the knowledge of his coming death said "I have tested the hidden honey of a lotus". The hidden honey of the lotus was the ultimate vision this seer and out of the lotus of his own lyric genius it was that he drew the hidden honey with which he went, sweet up on his tongue, to greet the immortals in the world of poets, his fellow poets belonging to the World of Song.

# వేమన్న యోగి

శ్రీ నందివెలుగు వేంకటేశ్వర శర్మ

❋

డంబరం బెఱుఁగని నిరాడంబరుండు
చేవ గల భూమి నీనించు సేద్యగాఁడు;
కవి విరాగియు ననఁగను ఘనతఁగాంచి
నట్టి తెన్గువాఁడు మన వేమన్న యోగి!

నీ మతం బౌటచే నిరుపమఖ్యాతితోఁ
దనరుచుండెను శివాద్వైతమతము
నీ కులం బౌటచే నిఖిలదేశమ్ములఁ
బ్రఖ్యాతి వహియించె రెడ్డికులము
నీ భాష యౌటచే నితరభాషలకంటెఁ
దీయతీయము లొల్కు తెలుఁగుబాస
నీ జాతి యౌటచే నిరుపమప్రభతోడ
నలరారుచుండె నీ యాంధ్రజాతి
నీ యునికి కొండవీడయి నెగడియుంటఁ
జేరు ప్రఖ్యాతిఁ జెందె గుంటూరుసీమ
నీకు సరిపోలఁ గలరె? యీలోకమందు
మహితగుణగణసాంద్ర వేమన కవీంద్ర!

కోరినన్ని బహూకృతుల్ గూర్పఁజాల
వనుచునో వట్టి వేదాంతి వనియొ యేమొ
నిన్ను గొందఱు కవిగ గణింపరైరి
వెఱ్ఱి యనినారు కొందఱు వేమనార్య!

ఇంతేసి పద్యాల నెట్లిమిడ్చితి వొక్కొ
కొండంత భావమ్ము నిండుకొనఁగ
ఆటవెలందుల యాటల సొబగుల
నెట్లు తీర్చితి వొక్కొ! యెలమి కలిమి
వేదవేదాంతార్థవిశదవాసనఁ గ్రోలి
సూక్ష్మమ్ములో నెట్లు చూపితొక్కొ!
బ్రహ్మాండమంతయుఁ బశుపతి మయ మని
పశుపాలనమ్మునం బాడితొక్కొ!
దేశదేశాంతరమ్ముల దివ్యభవ్య
వార్షికము లొనరింత్రు మహర్షివర్య!
లలితగుణగణరమ్య నిస్తులకవిత్వ
తత్త్వపాథోధిపూర్ణ సుధానిధాన!

నీతిఁ దెల్పు నీపద్యముల్ నేఁటి వఱకుఁ
బల్లెకూటమ్ములందునఁ బ్రబలియుండెఁ,
బండితులుఁ బామరులుఁ సదా పాడుచుంద్రు
కాఁపురముసేయుచుండెను గవులయిండ్ల.

నీవు లిఖియింప నేరని నీతు లేవి?
నీవు కన్పఱచని ధర్మనిరతు లేవి?
నీవుచూపని వేదాంతనిష్ఠ లేవి?
దొఱక వెందైన నిట్లు మందునకు వేమ!

హృద్య యా జానపదగీతి నేర్చి, కూర్చి,
అతులభావార్థమణులతో నతికి, పొదవి
కమ్రసుమాధుర్యములు మేల్మికబ్బములను
తూఁచఁగల షరాబులు లేరు తులను విలువ
వేలరూప్యముల్ సేయును వేమనార్య!

తెలుఁగునాటఁ గ్రొత్తవెలుఁగు నీ కవితామ
యూఖమాలఁ బుట్టునొందెనోయి
పారతంత్ర్యదూర! పరిపూర్ణవైరాగ్య!
సారధీర! కవికుమార! వేమ!

పదుల మెప్పునకై కైత వలుకవైతి
చేవగలవారి లక్ష్యమ్ము సేయవైతి
సిరిగలాఁడని పోయి యాచింప వైతి
వపుర! నీకెన యెవరు? వేమన్నయోగి!

భూతి రుద్రాక్షదామముల్ పూన వేల?
జడలును మఱి కాషాయవస్త్రములు నేల?
తత్త్వమెఱుఁగనివారి కీ దంభ మేల?
యనుచు నెలుఁగెత్తి చాటితి వయ్య వేమ!

నీ హితబోధ నవ్యనవ
నీతమృదూక్తి తెనుంగుజాతిలో
మోహనశక్తిఁ జూపినది,
మస్కరసంఘనియంత లౌ ప్రజా
ద్రోహులకూటనీతి బడఁ
ద్రోసి, యథేచ్ఛకు దారిఁదీసి వా
గ్వాహినిఁ జేసి సర్వసమ
భావముఁ జూపితి వయ్య వేమనా!

తఱిగిపోలేదు నీ తత్త్వధారామృత
పాటవం బింత యీ నాఁటివఱకు
చెఱగిపోలేదు నీ చరణకంజాతముల్
నడచినచోటు లీ నాఁటివఱకు
వాడిపోలేదు నీ పద్యకాంతులతోడ
నాటినమొలక లీ నాఁటివఱకు
చచ్చిపోలేదు నీ సత్కళాదీప్తులు
మేటియోగీంద్ర యీనాఁటివఱకు

కవివో? యోగివో? జ్ఞానివో? యెవఁడవో? మ
హాత్మ! కారణజన్ముఁ డైనట్టి బ్రహ్మ
మనుచుఁ దలఁచుటకంటె సత్యమ్ము లేదు
విశ్వమయుఁడవు మాకు నో వేమయోగి!

కామం బేరికి గెల్వ సాధ్య మగు ని
గ్రహం బారయ నీకె పో
భూమిన్ వేత్తలమంచు నీల్గెదరు; నీ
ముం దెవ్వారేఁ బండితుల్
మోమెత్తం గలవారె? బాధకగురుల్
బోధింతు మం చెందఱో
కామధ్వాంతమనస్కులై చెడిరి వీఁ
క నేమనిద్వన్మణీ!

మతపరంపరలందలి మర్మ మెఱిఁగి
విసిగి, వేసారి, వెతనొంది, వివిధవిధులఁ
దిట్టి, దూలించి, ఖండించి, తుట్టతుదకు
నాత్మయే బ్రహ్మముగఁ దగ నరసి తీవు!

ఈషణత్రయబద్ధమనీషు లగుచు
బంధురగ్రంథసంబంధబంధు లగుచు
వేత్త లెందఱు లే రహో! వేమ! నీకు
నీడగు విరాగి యొకఁడును లేఁడుగాక!

ఆంధ్రదేశమ్మునం దెల్ల నల్లిబిల్లి
నల్లె నీ కీర్తిలతిక బ్రహ్మస్వరూప!
ఖండఖండాంతరమ్ముల నిండియుండె
సుహితభవదీయకీర్తి వేమనకవీంద్ర!

# అవిముక్తము

శ్రీ యస్వీ జోగారావు

❈

ఏవ రీఅస్తమరేయి నెక్కటిగ నీ
యేకాంతనిశ్శబ్దనీ
రవనైరాశ్యనిశావిశంకటకుటీ
రప్రాంగణప్రాంతమం
దవలీలన్ జొరజూచువా రవుర యే
మా దుర్నిరీక్ష్యప్రభా
వవిభాతావహదివ్యదీధితి వహ
వ్వా నీ వటోయీ ప్రభూ:

మొగిలుమొవ్వులనుండి రివ్వున దుసికిలి
జారి వచ్చిన చిరుగాలిజాలువోలె
గాలిగోవాళ్ళ గడుసరి యేలపాట
కల్లనల వచ్చు జడివన్నెలాడివోలె.

వచ్చితివా ప్రభూ! పరమ
భాగవతప్రథితాంతరంగపా
టచ్చర మైన నెన్నడ యె
డాటముతో నిటు లీకుటీరమున్
జొచ్చితివా ప్రభూ! కలయ
జూచితివా యిట నేమి యున్నదో!
వచ్చినదారి నేగు మిక
భక్తిని బత్తెముగా నొసంగెదన్,

దేవా! ఏమని యానతిచ్చితివి! ఏ
దీ యేది ఆమాట మ
ళ్ళీ వాకొ మ్మది యేదొ మోక్షమును నా
కీవచ్చినా నందువా?
భావస్నిగ్ధము భక్తిముగ్ధమును మ
త్స్వాంతమ్ము, నే నందువా
జీవన్ముక్తుడ నొందుచోటికిని వేం
చేయంగ నూహింపుమా!

స్వామి! మోక్ష మనగ నేమి? నీలోన నా
యంతవా డూరక యైక్యమగుట
పోనిమ్ము లీనమై పోదునా యన్న నా
వలె మరి నిను గొల్చువా డెవండు.
నీకు లోకములో ననేకు లుందురుగాక
భక్తులు- నావంటివాడు లేడు
కాదుకా దిది యహంకారమ్ము- నా వెర్రి
బాగుల మమకారఫక్కి- యింత

ఏను కోరని మోక్షము నిత్తు ననుచు
కోరి నష్టమునకు నేల గురియగుదువు?
ఈవు లేక నే నుండలే నేను లేక
ఎట్లు లుందువు నీవు నాచిట్టితండ్రి!

# ఉపాసన

చల్లనిగాలికి చెల్లాచెదరగు
మొగిళుల నడుమను జిగేల్ జిగేల్మను
ముగుదా నీ వెవ్వరవో!

పున్నమ వెన్నెల మిన్నుల మిలమిల
కడలికి బొట్టూకాటుక పెట్టే
కాంతా నీ వెవ్వరవో!

మాటికి మాటికి మింటికి మంటికి
వానల మబ్బుల వంతెనవేసే
చానా నీ వెవ్వరవో!

రేపును మాపును పగటికి రేయికి
మునివాకిట నునుముగ్గులు దీర్చే
పాపా నీ వెవ్వరవో!

ఏనాడో నీ వెందుకు కంటివో
మానడు మానవు డీ మారాములు
మాతా నీ వెవ్వరవో!

భగవంతుని ప్రియవల్లభవో!
తల్లివో! బిడ్డవో! చెల్లివో! నాతో
చెప్పుము దేవీ! నీ యెద
విప్పుము దేవీ!

# అక్షరము



ఎన్నిజన్మల సంస్కార
బలము కారణమొ
సన్నిహితం బీ జన్మకు
సాహిత్యము నా యెదకు.

ఎన్ని యెన్ని ఘనకావ్యము
లెందరో మహాకవులు
నిన్నుబోలు మిన్నలు మన
సార కన్న శిశువులు.

ఒక్కొక్కటి యొకమధు
రోపనిషన్మధుకోశమురా

చక్కగ అన్నీ చదువుట కీ
జన్మము చాలదురా

బాబూ భగవంతుడ! న
న్నొకపదిజన్మములపాటు
మనని మ్మీలోకమ్మున.
వద్దు వద్దు మహాప్రభో

నీమోక్షము గీక్షము
ఒక సుకవిత్వశ్రీవిద్యోపాసక
జిహ్వాంచలమంత్రాక్షరబీజము నై
పరమశివా! చివరకు నిను చేరెదరా!

[నా 'ఉపనిషత్తు' నుండి]

# నాదపరిమళం

శ్రీ సి. నారాయణ రెడ్డి



ఇప్పు డిప్పుడే యేదో నా
నవరీవల్లికి కోరమ్ము
నా మనస్సులోలోపలి
నందనమున కాల్మోపెను.

పలుమారులు రమణుల చె
క్కిళులపైన జారిపడ్డ
నాచూపులు నేటికి ఆం
తరకాంతివ్రతము లయ్యె.

ఇంకా శమియింప వేమి?
ఈపంచేంద్రియబంభర
మహాన్ముఖరఝంకార
మ్ములు; విషయవికారమ్ములు.

క్రొత్తక్రొత్తవిరులపెదవి
కొసలరుచుల మరగినట్టి
మత్తమధులిహము లప్పుడే
మానస్థగితము లగునా?

మల్లడిగొను ఈబాహిర
కల్లోల మ్మణగినపుడె
అనుభావ్య మ్మగును నిర్గ
ళాంతర్నాదరసాక్ష;

కన్ను లెదుట విస్మారిత
కాంత్యాకింజల్కమ్ములు
చెల్లాడగ మనసులోని
చిరవాసన లారు టెట్లు?

క్షణకాలావధిక మన
స్తర్పణానిఘ్నమ్ము లైన
ఈ వాసన లెచట? శశ్వ
దీశ్వరపరిమళ మ్మెచట?

ప్రణవాక్షరపద్మముఖ
ప్రసరన్మృదుపరిమళమ్ము
నా తనువున కమృతచేత
నస్థితి కలిగించుగాక!

బహుస్పృహాసంక్షోభ
స్ఫాటితమా అస్మదంత
రాళములో ఆనందమ
రాళము రమియించుగాక!

# దివ్వెల మువ్వలు



కదలనేర్చినట్టి మట్టిగాదెమైన నాతనువున
సిరాపథము లంటి ప్రాకె చిత్రమైన కాంతిలహరి.

ఆధిభౌతిక మ్మగు నా యీ దేహవితర్దిపైన
గజ్జెకట్టె ఆధియాజ్ఞిక మ్మగు రూప మ్మేదో?

దివ్వెలమువ్వలతో నర్తించు జగన్మోహిని యది
ఆత్మకుమాత్రమె దృశ్యమ్మగు అక్షరవాహినియది.

ఆయమ కెంగేలి వ్రేళ్ళు అలలై పింపిళ్ళు వోయి
కడిగివేసినవి నాలో విడిదిచేసిన తమస్సుల.

అపుడెగిసెను నామనస్సు హవిరుద్గతధూమమట్లు
అపుడు చేసె నాదు అంతరాత్మ హోమధేనువట్లు.

బ్రహ్మాండము ప్రమిదవోలె భాసించెను;దానిలోన
స్నేహామృతవర్తి ప్రకాశించెను పరమాత్మలీల.

ఓ దివ్వెలమువ్వలదానా! దివ్యత్వనిధానా!
ఎల్లప్పుడు నాలో ఇటు లేల గజ్జె కదలించవు?

వత్సరమున కొక్కమారు వచ్చి నన్ను వట్టి పిచ్చి
వానిగ జేసెదవేలా? ఓ నారోచిర్మాలా!

నీవ్రేళ్ళుల తళత్తళలు నిత్యము కన్పించినచో
మాయాంధమ్మైన బ్రతుకు మహితకాంతిగోళ మ్మగు

నీమువ్వలఘులంఘులలు నిత్యము విన్పించినచో
మృణ్మయ మౌ ఈ దేహము చిన్మయ నాదాత్మక మగు.

# భారతీయ దర్శనములు - ఔపనిషదదర్శనములు

శ్రీ ఓరుగంటి నీలకంఠ శాస్త్రి



సమస్తజంతుజాలముచేఁ దెలియఁబడుచున్న యీ ప్రపంచమంతయుఁ బరిశీలించి చూచినచో జడములు - చేతనములు అను రెండు విభాగములతో నొప్పుచున్నట్లు స్పష్టము. అట్టి యీ రెండువిధములగు పదార్థములును ఒకదానితో నింకొకటి సంబంధించియే యుండును. అట్టిసంబంధములు పలువిధములుగాఁ గానవచ్చినను ప్రధానముగా వాని నన్నింటిని రెండు రకములుగా నున్నట్లు చెప్పవచ్చును. అందు నొకటి భోక్తృభోగ్యభావము, రెండవది వేత్తృవేదవేద్యభావము. అనఁగాఁ దినెడివాఁడు, తినఁబడునది; అట్లే తెలిసికొనువాఁడు, తెలియఁబడునది యని యర్థము. ఇందుఁ దినెడివాఁడు, తెలిసికొనువాడు అనునది చేతనరూపము. తినఁబడునది తెలియఁబడునది యనునది జడరూపము. చేతనజడరూప మగు నీప్రపంచమంతయుఁ ప్రధానముగా నిట్టిసంబంధముతోడనే ప్రవర్తించుచున్నది.

ప్రాణులకుఁ గలుగు సుఖదుఃఖము లన్నియు ఇట్టి సంబంధముతోడనే గలుగుచున్నవి. అందు సుఖమునుగాని దుఃఖమునుగాని అనుభవించునది మాత్రము చేతనరూపమే గాని జడరూపము గాదు. చైతన్యవిహీన మగు జడపదార్థమునకు సుఖదుఃఖములు లోకమునఁ గనపడకపోవుటచేతను, జడముతోడి సంబంధము లేనట్టి కేవలచైతన్యమునకుఁగూడ లౌకికము లగు సుఖదుఃఖములు గానరాకుండుటచేతను జడవస్తుసంబంధముచేతనే చేతనము సుఖదుఃఖముల ననుభవించుచున్న దని పైనితెల్పిన విషయము రుజు వగుచున్నది.

లోకములో అనాదికాలమునుండియు జరుగుచున్న యీవ్యవహారమునుగూర్చి ప్రపంచములోని తత్త్వవేత్తలు బహువిధములుగ విచారించియున్నారు. అనఁగా చేతన మగు పదార్థ మేది? అది యెట్లు గల్గినది? అట్లే జడపదార్థమేది? అది యెట్లు గల్గినది? ఈ రెండింటిసంబంధము వలనఁ గలుగు సుఖదుఃఖములను జనుఁడు తప్పక యనుభ యనుభవింపవలసినదేనా? లేక మనుజుఁడు సహజముగ వాంఛించు సుఖమునుమాత్రమే యనుభవించుటకు, వాంఛింపని దుఃఖమును బొందకుండుటకు నేదేని యుపాయము గలదా? లోకములో నెల్లవారును నాకు సుఖమే కావలయును దుఃఖ మెంతమాత్ర మక్కఱలేదు అనియే గదా కోరుకొనుచుందురు. కావున నట్టి శాశ్వతసుఖప్రాప్తికి నేదేని యొక యుపాయము గలదా? ఉన్నచో నది యెట్టిది? అను నీ విచారమంతయు ఎంతయో ప్రాచీనకాలమునుండియుఁ దత్త్వవేత్తలు చేయుచునేయుండిరి. అందు గల్గిన దుఃఖమును బోఁగొట్టుకొనుటకుఁ జేయు యత్నమొకటి. అట్లుగాక ఇఁక నెన్నటికిని దుఃఖము కలుగకుండ జేసికొను యత్నము వేఱొకటి. కావున పురుషుఁడు ఈ రెండువిధములగు దుఃఖములను నివర్తింపఁ జేసికొనవలయును. అట్టివిషయమున భారతదేశమునందలి వివిధతత్త్వవేత్తలు తమతమ యభిప్రాయములను ఎట్లు నిరూపించిరో యయ్యది దిగువ సంగ్రహముగ నిరూపింపఁబడుచున్నది. ఈయభిప్రాయములను నిరూపించుగ్రంథములనే దర్శనములందురు. ఈదర్శనములు ఆస్తికదర్శనము లనియు నాస్తికదర్శనము లనియు రెండువిధములు. ఆస్తికదర్శనము లనఁగా వేదమును ప్రమాణముగా నంగీకరించి ప్రతిపాదించిన దర్శనములు. నాస్తికదర్శనము లనఁగా వేదములు ప్రమాణములుగా నంగీకరింపక యెవ్వఁడేని యొకయాచార్యునిచేఁ దనమనీషానుసారముగఁ బ్రోక్తములగు దర్శనములు. ఆస్తిక నాస్తిక శబ్దములకు సంస్కృతవ్యాకర్తల నిర్ణయానుసారము గమనించిన "దేవుఁడున్నాఁడు-లేఁడు"

అనుసర్తుములతో నెంతమాత్రము సంబంధము లేదు. వేద ప్రామాణ్యము నంగీకరించుట — అంగీకరింపకపోవుట యనియే వానియర్థము. కావున చార్వాక బౌద్ధ జైనములు నాస్తికములు. కణాద గౌతమ - కాపిల - పాతంజల - పూర్వమీమాంసో త్తరమీమాంసలు ఆస్తికములని విద్వన్నిర్ణయము. కావున ఇట్టియాశయముతోడనే ఇందు విషయము ప్రదర్శింపఁబడుచున్నది.

## చార్వాకులు

పృథివి- జలము- అగ్ని- వాయువు అనెడి భూతములు నాలుగు. వీనితోడనే జగత్తు ఏర్పడినది. ప్రాణి శరీరము గూడ ఈ నాలుగింటిచేతనే ఎర్పడినది. దేహమునందలి చైతన్యశక్తి దేహముకంటె విలక్షణముగా గానవచ్చినను ఈ నాల్గుభూతముల పరస్పరసమావేశముచేఁ గల్గినదే యగుటవలన ఈభూతకార్యమే. కావున భూతములకంటె చైతన్యము వేఱుగాదు. కావున ఆత్మ యనఁగా దేహమే. కావున ఆత్మ నశించునదియేగాని నిత్యము గాదు. దీనితో ననుభవించు సుఖదుఃఖములే స్వర్గనరకములు. అంగనాలింగనాదిజాతసుఖమే పురుషార్థము. కావున మనుజుఁడు రాజశిక్షకు దొరకకుండ ఎట్టిసుఖములను ఎట్లు అనుభవించినను అయ్యది స్వర్గానుభవమే. పుణ్యాపాపము లనునవి అశక్తులచేఁ గల్పింపఁబడినవి. లేదా వంచకులచే గల్పింప ఏదేని విషయమును దెలిసికొనుటకుఁ బ్రత్యక్షము మాత్రమే ప్రధానప్రమాణము. ఇది విరోచనుఁ డను అసురరాజుచేఁ బ్రవర్తింపఁ జేయఁబడినట్లు ఛాందోగ్యోపనిషత్తునందలి యింద్రవిరోచనోపాఖ్యానమువలనఁ దెలియుచున్నది.

## బౌద్ధులు

లాగ్నివాయువులతోపాటు ఆకాశముకూడ ఒక భూతమే. కాని దీనికిఁ బరమాణువులు లేవు. పై నాల్గు భూతములకుఁ బరమాణువులు గలవు. ఆ పరమాణువుల సమ్మేళనమువలననే జగము ఏర్పడుచున్నది. కావుననే యీబాహ్యప్రపంచము భౌతికము. ఈప్రపంచవ్యవహారమంతయు అయిదు స్కంధములవలన జరుగుచున్నది. అయ్యవి—రూపస్కంధము, విజ్ఞానస్కంధము, వేదనాస్కంధము, సంజ్ఞాస్కంధము, సంస్కారస్కంధము అనునవి. ఇందు "నేను నేను అనెడి ఆలయవిజ్ఞానప్రవాహరూపమగునదియే విజ్ఞానస్కంధము. అదియే యాత్మ, చిత్తమని వ్యవహరింపఁబడును. వైషయము బౌద్ధులందఱకు సామాన్యమే యైనను వీరల ప్రపంచదృష్టి భిన్నభిన్నములుగా నుండుటచే మఱల వీరలు- మాధ్యమికులు- యోగాచారులు సౌత్రాంతికులు- వైభాషికులు- అని నాల్గువిధములుగ నున్నారు. వీరు క్రమముగా (i) సర్వము శూన్యమే యనియు; (ii) బాహ్యము మాత్రము (భూత-భౌతికములు) శూన్యము, ఆంతరము (చిత్త- చైత్తము) మాత్రము శూన్యము గాదనియు; (iii) బాహ్యార్థములుగూడ అంత శూన్యములు గావు, అయ్యవి అనుమేయములనియు. (iv) బాహ్యార్థములుగూడ అనుమేయములు గాక ప్రత్యక్షములే యనియు ట్లు పరస్పరవిరుద్ధములగు మార్గముల బ్రవ యున్నారు. ప్రపంచమునుగూర్చిన భావనావిశేషముచేతనే మోక్షము గల్గుననియు, ఆభావనావిశేషము—"సర్వం శూన్యం శూన్యం, సర్వం క్షణికం క్షణికం; సర్వం దుఃఖం దుఃఖం; సర్వం స్వలక్షణం స్వలక్షణం; అనియుఁ జెప్పుదురు. బుద్ధభగవానుఁడు తనశిష్యులకు ఒకేవిధమగు నుపదేశము చేసినను గ్రహించువారల బుద్ధిభేదమునుబట్టి ఇట్టివైవిధ్యము గల్గి యుండనొప్పు నని పెద్దలు చెప్పుదురు. ఇట్టి భావనావిశేషమువలన దుఃఖరూపమగు సంసారమునుండి ముక్తి గల్గును. ఇదియే మోక్షము. ఇయ్యది స్త్రీపురుషులందఱును సంసారత్యాగరూపమగు సంన్యాసమువలన సాధింపవలయును అని బుద్ధుఁడు బోధించెను.

వాస్తవికదృష్టితోఁ జూచినచో ఈబౌద్ధబోధ వైదికమార్గమునకు భ్రష్టరూపముతో నొప్పుచున్న ట్లూహింపవచ్చును. ఏల యనగా- క్షత్త్రియుఁడగు బుద్ధుఁడు వేదమునంతను అధ్యయనము చేసియుండును. కాని అందు ఆతనికిఁ బూర్వకాండమునందు (కర్మకాండ) జెప్పఁబడిన కర్మవిశేషములు ఏమియును బనికిరాలేదు. ఇఁక నుత్తరకాండమునందుఁ దెల్పఁబడిన జ్ఞానమార్గము తత్సాధనముగా నుపదేశింపఁబడిన సంన్యాసమాత్రమే ఆతనికి నచ్చుటచే అద్దానినే యాతఁడు పరమపురుషార్థసాధనముగా గ్రహిం

చెను. అందుచే వేదమునందు బోధింపఁబడిన క్రమమున సంన్యాసయోగ్యతను బరిగణింపక జనసామాన్యమునకంత కును మోక్షసాధనముగ సంన్యాసమును బోధించెను. అద్వైత ఆత్మస్వరూపము జ్ఞానరూప మని గ్రహించియు నట్టి జ్ఞానము క్షణిక మని వేదవిరుద్ధముగ బోధించెను. ఇట్లు దాను బోధించిన మార్గమునకు వేదములందలి బీజములనే యాధారముగఁ గైకొనియు, అవి సరి యగు వైదికములు కాక పోవుటచే కష్టులు వానిని ఆక్షేపింతు రనుతలంపుతో బుద్ధుఁడు వేదము తనకు ప్రమాణమే గాదని చెప్పసాగెను. ఉపనిషత్తులయందుఁ జెప్పఁబడిన, అహింస- జ్ఞానము- సంన్యాసము- వర్ణాశ్రమరహిత (ముక్త) స్థితి మున్నగు వానిని మాత్రము తనమతమున గ్రహించియు దాను వానిని స్వయముగనే బోధించినట్లు చెప్పినాఁడు. తాను బోధించిన ధర్మములకు వేదము మూల మయినను దాను వేదమును బ్రమాణముగ నంగీకరించినచో వేదములయొక్క పూర్వ భాగమునందుఁ దెల్పఁబడిన కర్మలు వర్ణాశ్రమాదులుగూడఁ దా నంగీకరింపవలసివచ్చును. అట్లయినచోఁ దన మూల సూత్రములకు భంగము కలుగును. ఒకే గ్రంథమునఁ గొంత ప్రమాణము, కొంత ప్రమాణము కాదు (అర్ధజరతీయముగా) అని చెప్పుటకు వీలులేదు గదా! కావుననే తన బుద్ధ్యను సారముగానే తన మతము ప్రవర్తింపఁజేయఁబడినట్లు బుద్ధుఁడు దెల్పెను. కావున ఈబౌద్ధమతము వైదికమార్గము నకు భ్రష్టరూపమే యగుచున్నది. దీనినే వివేకవిలాస మనుగ్రంథము ఇట్లు పేర్కొనినది.

> "రాగాదిజ్ఞానసంతాన
> వాసనాచ్ఛేదసంభవా।
> చతుర్ణామపి బౌద్ధానాం
> ముక్తి రేషా ప్రకీర్తితా॥

> కృత్తిః కమండలుః మౌండ్యం
> చీరం పూర్వాహ్ణభోజనం ।
> సంఘః రక్తాంబరత్వంచ
> శిశ్రియే బౌద్ధభిక్షుభిః॥

వీరలకు వస్తునిర్ణయమున - ప్రత్యక్షము - అనుమానము, అనెడి రెండుమాత్రమే ప్రమాణములు.

ఇట్లు సుగతునిచే బోధింపఁబడిన యీమతము క్రమ ముగాఁ బూజాములనెడిపేరిటఁ జార్వాకులచే ఆవశ్యాచర ణీయములుగాఁ జెప్పఁబడిన దేహసుఖములనుగూడ నపే క్షింప మొదలిడెను. ధనమును అధికముగఁ బ్రోవుసేసి ద్వాదశాయతనపూజ తప్పక చేయవలసిన దని వీరు విధించి నారు. ద్వాదశాయతనపూజ యనఁగా దేహేంద్రియాను లకుఁ దృప్తిని గల్గించుట.

> "అర్థానుపార్జ్య బహుశో ద్వాదశాయతనాని వై
> పరితః పూజనీయాని కి మన్యై రిహ పూజితైః॥
> జ్ఞానేంద్రియాణి పంచైవ తథా కర్మేంద్రియాణిచ
> మనోబుద్ధి రితిప్రోక్తం ద్వాదశాయతనం బుధైః॥

## జైనము

జైనమునే ఆర్హతము, స్యాద్వాదము, సప్తభంగివాదము అని యందురు. ఇందు : జీవ- అజీవ- ఆస్రవ- సంవర- నిర్జర- బంధ- మోక్షము లను సప్తపదార్థములు గలవు. అజీవ శబ్దార్థ మగు భూతములనుండి జనించిన యీభౌతిక ప్రపంచమును సాధనముగాఁ జేసికొని జీవుఁడు వ్యవహరించు చున్నాఁడు. అనగా జీవునికి అజీవము లగు విషయముల యందు ఇంద్రియములద్వారా ప్రవృత్తి గల్గుటచే లోక వ్యవహారము ప్రారంభ మయి సుఖదుఃఖములు గల్గు చున్నవి. అట్టి సంసారమును నిరోధించుటకు యమనియ మాదు లావశ్యకములు. ఈయమనియమాదులే సంవరము. ఇట్టి సంవరముతోఁ దప్తశిలారోహణము మున్నగు నిర్జర మును గావించినచోఁ బురుషునికల్మషము తొలఁగిపోవును. దానివలనఁ గర్మరూపపాశ"బంధ"ము విడిపోఁగా జీవుఁడు సత్యలోకరూప మగు నాకాశమును ప్రవేశించి సతతోర్ధ్వగమనమును గావించుచుండును. ఆకాశము నందలి యీయెడతెగని యూర్ధ్వగమనమే మోక్షరూ పము. దీనినే వారు—

> "గత్వా గత్వా నివర్తన్తే
> చంద్రసూర్యాదయో గ్రహాః।

అద్యాపి ననివర్తన్తే
త్వాలోకాకాశ మాగతాః॥

అని చెప్పుదురు. మఱియు వీరలు తమమతముయొక్క యతిశయమును బ్రదర్శించుకొనుటకై "సప్తభంగీ" న్యాయమును నుడువుదురు. లోకములోని ప్రతిపదార్థముగూడ ఉండుట, లేకపోవుట, నిర్వచింపఁబడుట, నిర్వచింపఁబడకపోవుట మున్నగు స్థితుల నందుచుండుటచే సర్వపదార్థములును ఈసప్తభంగులను బొందుచుండు నని వీరు చెప్పిరి. సప్తభంగులనఁగా- 1. "స్యాదస్తి, 2. స్యాన్నాస్తి, 3. స్యాదస్తిచ నాస్తిచ, 4. స్యాదవక్తవ్యః, 5. స్యాదస్తిచావక్తవ్యశ్చ, 6. స్యాన్నాస్తిచావక్తవ్యశ్చ, 7. స్యాదస్తిచ నాస్తి చావక్తవ్యశ్చ అనునవి. దీనినిబట్టియే వీరివాదమునకు 'స్యాద్వాద' మను పేరుగలిగెను. వీరలకుఁగూడ వస్తునిర్ణయమున బౌద్ధులకువలెనే ప్రత్యక్షానుమానములుమాత్రము ప్రమాణములు.

జీవునిపరిమాణము ఆయాశరీరముపాటిది యగును. అట్టి జీవుఁడు యమనియమాదులచేతను తప్తపాషాణారోహణాదులచేతను దన్ను బరివేష్టించిన కర్మాష్టకమును ద్యజించి ముక్తుఁడగును. ఈమోక్షమునకుఁ దగు యోగ్యులు సంన్యాసులుమాత్రమే. వారు శ్వేతాంబరులు డిగంబరు లని రెండు విధములుగా నుందురు.

ఇంతవఱకు నాస్తికదర్శనస్వరూపము సంగ్రహముగ నిరూపింపఁబడినది. ఇఁక ఆస్తికదర్శనములస్వరూపము నిరూపింపఁబడును. ఈయాస్తికదర్శనములలోఁగూడ రెండు విధములగు దర్శనములు గలవు. అందు మొదటివి తమతమబుద్ధికిఁ దోఁచినవిధమున ఆత్మ జగన్మోక్షముల తత్త్వమును విచారించి నిర్ణయించుచుఁ దమచే నిర్ణీతములగు విషయములే శ్రుతిచే జెప్పఁబడుచున్నట్లు శ్రుతివాక్యములను బ్రమాణములుగా నుదాహరించును. అనఁగా వీనికిఁ బురుషబుద్ధిగమ్యము లగు యుక్తులు మున్నగునవి ప్రధాన ప్రమాణములు. శ్రుతివాక్యములు తదనుసారులై సామాన్య ప్రమాణములు నగును. ఈమార్గమునందు నడచునవియే, న్యాయ- వైశేషికములు, సాంఖ్య యోగములును.

ఇఁక రెండవతరగతికిఁ జెందిన ఆస్తికదర్శనములు జీవజగన్మోక్షతత్త్వములను శ్రుతివాక్యానుసారముగనే నిర్ణయించి ఆశ్రుత్యుక్తనిర్ణయము పురుషబుద్ధిగమ్యము లగు యుక్త్యాదులకుఁగూడ సరిపోవు నని నిర్ణయించుచుండును. అనఁగా ఈరెండవతరగతి ఆస్తికదర్శనములలో వేదవాక్యములు ప్రధాన ప్రమాణములు. తదనుసారులగుటచే యుక్త్యాదులుగూడ సామాన్యప్రమాణము లగుచున్నవి. ఈమార్గమున నడచునవే పూర్వోత్తరమీమాంసలు. కాఁగా మొదటి యాస్తికులు శ్రుతియుక్తులకు విరోధము గల్గినచో శ్రుతినిఁ ద్రోసివేయ సాహసింతురు. రెండవయాస్తికులు శ్రుతినిమాత్రము గ్రహించి యుక్తిని దూరముగ నుంతురు.

## న్యాయ – వైశేషికములు

న్యాయదర్శనకర్త గౌతముఁడు. వైశేషికదర్శనకర్త కణాదుఁడు. ఈరెండుదర్శనములు కలిసియే నేఁడు లోకమున "తర్కశాస్త్ర" మని వ్యవహరింపఁబడుచున్నవి. ఈరెండుదర్శనములును బరమాణువులనుండియే ప్రపంచము పుట్టుచున్న ట్లంగీకరించుచున్నవి. రెండుపరమాణువులు కలిసి ద్వ్యణుకమై అట్టిద్వ్యణుకములు మూఁడు గలిసి త్ర్యణుకమై యీక్రమమున జగత్తు ఆరంభింపఁబడుచున్న దని ఈవాదము తెల్పుటచే ఈపరమాణుకారణవాదమునకు "ఆరంభవాద" మని పేరు. అట్లే వస్తువు (కార్యము) పుట్టుటకుఁ బూర్వము అసలు లేదనియుఁ గ్రొత్తగానే పుట్టుచుండు ననియు ఈపరమాణువాదము బోధించుటచే ఈవాదమునకు "అసత్కార్యవాద" మనియుఁ బేరు గలదు. భూతములు అయిదయినను ఆకాశమునకుఁ బరమాణువులు లేకపోవుటచేఁ బరమాణువులు నాల్గువిధములే. ఈ నాల్గువిధములగు పరమాణువులనుండి పృథివి- జలము- నిప్పు- గాలి యనెడి మహాభూతములు గల్గుచున్నవి. ఆత్మలు అసంఖ్యాములు. ఇయ్యవి సిద్ధములు అచేతనములు. ఆత్మకు మనస్సుతోఁ గలయిక గల్గినపుడు ఆత్మకు మనస్సుతోఁ గలయిక గల్గినపుడు ఆత్మయందుఁ జైతన్య మనెడి యొక గుణము నూతనముగాఁ బుట్టును. అట్లు పుట్టిన చైతన్యగుణముతోడనే యాత్మ సర్వవ్యవహారములను గావించును. అనఁగా సంసారప్రవృత్తుఁ డగును. మోక్ష మనఁగా అత్యంతము దుఃఖము నశించుటయే. మిథ్యాజ్ఞానమువలన

రాగద్వేషాదిదోషములు గల్గు ననియు నద్దానివలన ప్రవృత్తి గల్గుననియు, నద్దానివలన జన్మమును నద్దాన దుఃఖమును గల్గుననియు, తత్త్వజ్ఞానమువలనం దొలుత మిథ్యాజ్ఞానము నశింపం దనాశకములనం క్రమముగా దోష - ప్రవృత్తి - జన్మ - దుఃఖములు నశించు ననియుం గావున నట్టి దుఃఖముయొక్క యాత్యంతికనాశమే అపవర్గము ననియు గౌతమమహర్షి "దుఃఖ-జన్మ-ప్రవృత్తి-దోష-మిథ్యాజ్ఞానానా ముత్తరోత్తరాపాయే తదనంతరాపాయా దపవర్గః" (న్యా. సూ. 1-2.) అని చెప్పెను. కావున నీన్యాయవైశేషికదర్శనములందు మోక్షము అనంగా ఆత్మయొక్క జడస్వరూపస్థితి యని భావము. ఇంక నీరెండు దర్శనములకుం గల ప్రధాన మగు భేద మేమనంగా కాణాదుండు జగత్కారణము లగు పరమాణువులనే పరమార్థకారణములుగా నంగీకరింప నీగౌతముండు పరమాణువులకు నతీతుం డగు ఈశ్వరుండు గూడ గలండని యంగీకరించియున్నాడు. ఈతార్కికులు - ప్రత్యక్షము- అనుమానము - శబ్దము - ఉపమానము అను నాల్గును ప్రమాణములుగా నంగీకరింతురు.

## సాంఖ్య యోగములు

సాంఖ్యదర్శనము కపిలాచార్యుని చేతను యోగదర్శనము పతంజలిమహర్షి చేతను ప్రవర్తింపం జేయంబడినవి. ఈదర్శనములకు ఋషులు వీరలే. న్యాయవైశేషికముల కెట్టి సంబంధమో సాంఖ్య యోగములకుంగూడ నట్టిదియే సంబంధము.

లోకములో ప్రతివస్తువునందును సుఖదుఃఖమోహములు గానవచ్చుచుండుటచే సుఖదుఃఖమోహాత్మకము గు ప్రపంచమునకు నట్టి మూండుగుణములు గల్గిన వస్తువే కారణ మగుననియు అట్టివస్తువునకుం "బ్రకృతి" యని పేరనియు వీరు చెప్పుదురు. జగత్తునందలి వస్తువులలో సుఖదుఃఖ మోహములు సమ మగు భాగములలో నుండక విషమ మగు భాగములలో నున్నను జగత్కారణ మగు ప్రకృతియందు సుఖదుఃఖమోహములు సత్త్వరజస్తమో గుణములను పేర వ్యవహరింపంబడును. కాంగాం బ్రకృతియనంగా సత్త్వరజస్తమోగుణములు సమముగాం గలది యని నిర్వచింతురు. పాలు పెరుగుగా మారినట్లు ప్రకృతియే ఈజగద్రూపముగా మారుటచే ఈసాంఖ్యవాదమును "పరిణామ" వాద మని చెప్పుదురు. మఱియుం బుట్టుటకుం బూర్వము ఈజగమంతయు కారణ మగు ప్రకృతిరూపముగా నుండియే ఆయాపరిస్థితులలో స్పష్టముగా జగద్రూపమునం గాన నచ్చుటచే ఈజగత్తు పుట్టుటకుం బూర్వముగూడ కారణరూపమున నున్నదనియు నందుచే ఈవాదము "సత్కార్య వాద" మనియుం జెప్పుదురు. ఈవాదమునందలి జగత్కారణముగాం జెప్ప మూలప్రకృతి జడరూపము. ఆత్మలు చేతనములు నానాసంఖ్య గలవి. పురుషు లను పేట ఈయాత్మలే చెప్పంబడుచున్నవి. ఈ పురుషులు చేతనులయ్యు సహజముగ దేనితోడను కలియనివారలు. ఇట్టి పురుషుల సంబంధముతోం బ్రకృతి యనేకరూపములం బరిణమించి జగత్తుగా నగుచుం దనతో సంబంధించిన పురుషునికి సుఖదుఃఖములను గల్గించుచు సహజముగ అసంగుం డగువానికి సంసారమును గల్పించుచుండును. ఏనాండు పురుషుండు దాను సహజముగ ఒకదానితో సంబంధింపని కేవలచేతనరూపుండ ననియుం దన కీసంసారము ప్రకృతిసంబంధముచే మాత్రము గల్గిన దనియుం దెలిసికొనునో యానాండు అతండు స్వస్వరూపజ్ఞానముచే ప్రకృతిసంబంధమును వీడి సంసారరహితుండై ముక్తుం డగును. ముక్తి యన జీవునికి నిస్సంగస్థితియే.

పైని నిరూపింపంబడిన ప్రక్రియయంతయు యోగులకుం గూడ సమానమే. అయినను యోగులు పైని చెప్పంబడిన జీవ - ఆత్మ - పురుష శబ్దవాచ్య లగు చేతనులకంటె విలక్షణుండును ఒకానొక పురుషవిశేషరూపుండును అగు నీశ్వరుని నంగీకరించియున్నారు. సాంఖ్యులు చెప్పినవిధము గానే చెప్పి యూరకున్నచో, ప్రకృతి కేవలజడరూప మగుటచేతను, ఆత్మలు కేవలము ఒకదానితోం గలియని స్వభావము గలవగుటచేతను బ్రకృతిపురుషులకు సంబంధమే యేర్పడుటకు అవకాశము లేదు. అట్టితఱి జగద్వ్యవహారమే జరుగుట కవకాశము లేకపోవును. కావున ఆయా పురుషులను బ్రకృతితోం సంబంధింపంజేయు నొక యీశ్వరుని దప్పక అంగీకరింపవలయు నని యోగులు చెప్పుదురు. ఈ సాంఖ్యయోగులు వస్తునిర్ణయమున - ప్రత్యక్ష- అనుమాన- శాబ్దములను బ్రమాణములుగా నంగీకరింతురు.

## పూర్వమీమాంస

వేదమును బరమప్రమాణముగా గ్రహించి తదనుసారముగా జైమినిమహర్షి ఈదర్శనమును రచియించెను. వేదమంత్రములు ప్రమాణమయ్యును అందలి పూర్వభాగము అనఁగాఁ గర్మలను బ్రతిపాదించుభాగము మాత్రము పరమప్రమాణ మనియు నుత్తరభాగము అనఁగా జ్ఞానమును బోధించుభాగము కర్మకాండము ననుసరించుటచేతనే ప్రమాణభావము నందుననియు, నందుచే వేదములకంతకును కర్మలయందే సమన్వయ మనియు నీతఁడు చెప్పెను. దేవతలు కేవల మంత్రరూపులే గాని మనుష్యాదిప్రాణులవలె భౌతికములగు శరీరములు గలవారు కారనియు, కర్మలవలననే జగద్వ్యవహారమంతయు జరుగుచుండు ననియు, భిన్నభిన్నలగు జీవులు తమతమ వర్ణాశ్రమాదివిహితములగు కర్మల నాచరించినచో తదనుసారము లగు స్వర్గనరకాదులను బొందుదు రనియు జైమినిమహర్షి చెప్పెను. స్వర్గ మనఁగా నిరతిశయ మగు సుఖము. ఇదియే వీరల దృష్టిలో మోక్షముగాని, స్వర్గభిన్న మగుమోక్షము వీరలకు లేదు. అట్టే నరక మనఁగా అపారమగు దుఃఖము. వీనినే బహువిధము లగు చిత్రణములతో అర్థవాదరూపములుగా ఇతిహాసపురాణములు వర్ణించుచుండును. కావునఁ బుధుఁడు యావజ్జీవము కర్మల నాచరించుచుఁ దత్ఫలముల నందుచుండవలయు నని జైమినిదర్శనసారము.

## ఉత్తరమీమాంస

ఉత్తరమీమాంస వేదముల తుదిభాగము లగు నుపనిషత్తుల నాధారముగాఁ గైకొని ప్రవర్తింపఁజేయఁబడుటచే దీనికి ఔపనిషదదర్శనము వేదాంతదర్శన మనియు వ్యవహారము గలదు. ఈదర్శనమును బ్రవర్తింపఁజేసిన యాతఁడు «వేదవ్యాసుఁ» డను బిరుదు గల శ్రీకృష్ణద్వైపాయన మహర్షి. ఈతఁడు «బ్రహ్మసూత్రము» లను పేరుగల శారీరకమీమాంసాదర్శనమును సంతరించెను. ఈదర్శనమునకుఁ బ్రధానము లగు ప్రమాణగ్రంథములు మూఁడు విధములుగా నున్నవి. అందు మొదటివి ఉపనిషత్తులు. వేదశాఖలు అనేకములుగా నుండుటచే వానికి సంబంధించిన ఉపనిషత్తులుగూడ అనేకము లున్నను పెద్దలు ప్రధానప్రమాణములుగా నెంచుకొనిన యుపనిషత్తులు పది మాత్రమే. అవి «ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యక»ములు. ఈపదింటిచే బోధింపఁబడిన తత్త్వమార్గమును «ఉపనిషత్ప్రస్థాన» మందురు. ఈయుపనిషత్తులనే ప్రధానాధారములనుగాఁ జేసికొని శ్రీబాదరాయణమహర్షి పైని దెల్పిన «బ్రహ్మసూత్రము»లను రచియించెను. ఈసూత్రములద్వారా ఉపనిషదర్థములను విమర్శించి తెలిపిన తత్త్వమార్గమును «సూత్రప్రస్థాన» మని యందురు. ఈసూత్రములను తత్రాపి దాని శాంకరభాష్యమును మనము శ్రద్ధతో జదివినచో నందు వివిధములగు విషయములు బహుభంగుల విమర్శింపఁబడి యుండుటచే నేఁటికాలములో జిజ్ఞాసువులకుఁ గల్గు అప్రత్యక్షవిషయములనుగూర్చిన సంశయము లన్నియు పటాపంచలగునట్లు సందియము లేదు. ఉపనిషదర్థములనే స్మరించి శ్రీకృష్ణభగవానుఁడు యుద్ధసమయమున హృదయదౌర్బల్యము నందిన యర్జునునకు గీతారూపమున నుపదేశించెను. కావున ఈభగవద్గీతారూపమున దెల్పఁబడిన «గీతాప్రస్థాన» మని యందురు. ఈమూఁడుమార్గములు సమానమగు విషయమునే ప్రతిపాదించుచున్నను తెలుపునట్టిరీతులు భిన్నభిన్నములుగా నుండుటచే ఈమూఁడుమార్గములను గలిపి శిష్టులు శాస్త్రమున «ప్రస్థానత్రయ»మని వ్యవహరింతురు. ఉపనిషత్తులచేఁ దెల్పఁబడిన యర్థమునే వేఱువేఱురీతుల సులభముగా బ్రహ్మసూత్ర భగవద్గీత లుపదేశించుటచే ఈమూఁడు మార్గములు వేఱువేఱు గమ్యములు గలవిగాక సమాన విషయప్రతిపాదకములే యని మాత్రము తప్పక యంగీకరించి తీరవలయును.

ఈప్రస్థానత్రయమును భారతదేశమునందు మతప్రవర్తకులుగాఁ బ్రసిద్ధిని గనుచున్న శ్రీశంకర, రామానుజ, పూర్ణప్రజ్ఞ (మాధ్వ) శ్రీకంఠ, వల్లభ, నింబార్కాదులు వేఱువేఱు దృక్పథములతో వ్యాఖ్యానములను వ్రాసి యున్నారు. వీని నన్నింటిని మనము సంగ్రహపఱచి చెప్పినచో అద్వైత- విశిష్టాద్వైత- ద్వైతమార్గ బోధకము లని పేర్కొననొప్పును.

ఈమార్గాశ్రయమునుఁ బ్రవర్తింపఁజేసినవారలు వేదము

నంతము (పూర్వోత్తరభాగములను) సమాన ప్రమాణముగానే గ్రహించి యొకానొకవ్యవస్థతో ఆయా వేదభాగముల సిద్ధాంతములను అందలి యధికారములను నిర్ణయించిరి గాని పూర్వమీమాంసకులు చెప్పినట్లు వేదములోని యొకభాగమే ప్రధాన ప్రమాణ మనిమాత్రము చెప్పియుండ లేదు. మతత్రయ ప్రవర్తకులు ప్రస్థానత్రయమును పరమ ప్రమాణముగా గ్రహించినను బ్రస్థానత్రయముచేఁ బ్రతిపాదింపఁబడుచున్న విషయమును మాత్రము భిన్నభిన్నములుగాఁ బ్రతిపాదించిరి. ఎందు శ్రీరామానుజులు- పదార్థములు చిత్తు- అచిత్తు- ఈశ్వరుఁడు అని మూఁడువిధములుగా నున్నవి. ఇవియే క్రమముగా భోక్త- భోగ్యము- నియామకుఁడు నగుచున్నవి. ఈనియామకుఁడే పరమేశ్వరుఁడు. నారాయణశబ్దవాచ్యుఁడు. జగదుత్పత్తిలయములు పరమేశ్వరునుండియే గల్గుచున్నవి పరమేశ్వరసృష్టమగు నీ జగమంతయు సత్యము. తుల్యానుభవముచే స్వప్నము గూడ సత్యమే. జీవ జడ భేదముతో నొప్పు నీ విశ్వమంతయుఁ జిజ్జడభాగములతో నొప్పు పరమేశ్వరుని యంశరూపమే. కావున జీవపరమేశ్వరులకు శేషశేషిభావము సంబంధము. జీవుఁడు దేవతాస్థానసంమార్జనజలహరణాదులు, గంధమాల్యాదిసంపాదనము, దేవతాపూజనము, వైష్ణవమంత్రసూక్తజపపఠనాదులు, దేవతానుసంధానము అనెడి రూపములతో నొప్పు అభిగమన- ఉపాదాన- ఇజ్యా- స్వాధ్యాయ- యోగము లనెడి పంచవిధోపచారములతోఁ బరమేశ్వరుని సేవించి నిరవధికపునరావృత్తిరహితనిత్యపద మగు వైకుంఠమును బొందును. ఇదియే ముక్తి. పైని దెల్పిన పంచవిధోపచారములచే జీవునికి స్వాభావికజ్ఞానాదులు తొలఁగి పరమేశ్వరము లగు సకలకళ్యాణగుణములు కలుగును. ఈశ్వరునితో సమానరూపము కల్గును. ఇట్లు జీవుఁడు ముక్తుఁడై పరమేశ్వరునితో సాలోక్యము సారూప్యము- సమానగుణత్వము నందినను పరమేశ్వరునికి జగత్స్రష్టృత్వము లక్ష్మీపతిత్వము విశేషము. తనభక్తుల యనుగ్రహము కొఱకుఁ బరమేశ్వరుఁడు తనరూపమును అర్చా (ప్రతిమాదులు) విభవ (రామాద్యవతారములు) వ్యూహ (వాసుదేవ- సంకర్షణ- ప్రద్యుమ్న- అనిరుద్ధరూపములు) సూక్ష్మ (విశిష్టవాసుదేవరూపము) అంతర్యామి(సకలజగన్నియామకత్వము) రూప పంచవిధములగు భేదములతో ఉపాసకుల యధికారమునుబట్టి వారలయుత్తమోత్తమస్థితికై ప్రదర్శించును అని బోధించిరి. శ్రీమధ్వరాయలన్ననో జగత్తులోని తత్త్వములు స్వతంత్ర- అస్వతంత్ర భేదముచే రెండేగాని రామానుజులు దెల్పినట్లు మూఁడు గావనియుఁ దెల్పిరి. జగమునందు గన్పట్టునట్టి అయిదు విధము లగు భేదములు- అనఁగా 1. జీవేశ్వరభేదము 2. జడేశ్వరభేదము 3. జీవులకుఁ బరస్పరము గల భేదము 4. జడజీవభేదము 5. జడములకుఁ గల పరస్పరభేదము అనునవి సత్యములే యనియు బోధించెను. విష్ణుపారమ్యదృష్టితో విష్ణువు నర్చించి దృఢమగు విష్ణుసర్వోత్తమత్వ జ్ఞానమును సంపాదించి విష్ణుప్రసాదముచే సంసారరహితుఁడై జీవుఁడు దుఃఖరహితానందము ననుభవించుచు విష్ణుసన్నిధి నుండును. ఇదియే ముక్తి అని సరళముగ శ్రీరామానుజులవలెనే బోధించెను.

ఈవిశిష్టాద్వైత, ద్వైత మతప్రవర్తకాచార్యులు కేవల వేదమునుమాత్రమే ప్రధానముగా నంగీకరింపక పాంచరాత్రాద్యాగమములనుగూడ వేదములతోఁ దుల్యము లగు ప్రమాణములనుగా నంగీకరించుట యొకవిశేషము.

ఇఁకఁ బ్రస్థానత్రయమునకు శ్రీశంకరభగవత్పాదులు ప్రబోధించిన తీరు ననుసరించి విషయము సంగ్రహముగ నిరూపింపఁబడును.

దర్శనాంతరములయందు శాంకరదర్శనమునే ఔపనిషద మని పేర్కొనుటచే ఈశాంకరదర్శనమే ప్రధానముగా 'ఔపనిషద' శబ్దమునకుఁ దగియున్నట్లు మన మూహింప వచ్చును. ఉపనిషత్తులయందు జగత్కారణముగా వర్ణింపఁ బడిన- "సత్తు- ఆత్మ- బ్రహ్మము" అనెడి మూఁడును ఒకేవస్తువును బోధించునట్టి పర్యాయపదములే గాని వేఱు వేఱర్థములను బోధించు శబ్దములు గావని గ్రహింపవల యును.

ఉపనిషత్తుల నన్నింటిని మనము పర్యాలోకించినచో నయ్యవి జగదాత్మము క్తికర్తృత్వములను రెండువిధములుగా బోధించుచున్నట్లు దెలియుచున్నది. అందుఁ గొన్ని యుపనిషత్తులు జగదాత్మము కర్తృత్వము లను సృష్టిక్రమము ననుసరించియు మఱికొన్ని యుపనిషత్తులు సంహారక్రమము

ననుసరించియు బోధించినవి.

అందు సృష్టిక్రమ మనఁగా సృష్టికిఁ బూర్వము ఆత్మ యొక్కటియే గలదనియు అట్టి ఆత్మతత్త్వమునుండి ఈ సమస్తమగుజగత్తు గల్గిం దనియుఁ దెల్పుచు ఆత్మజగన్ముక్తి తత్త్వములను వివరించుక్రమము. సంహార క్రమ మనఁగాఁ బ్రపంచస్వరూపమును దొలుత వివరించి యిట్టి కార్యరూప మగు నీజగము కారణ మగు బ్రహ్మమునుండి గల్గిన దని క్రమముగా జగదాత్మముక్తితత్త్వములను వివరించునట్టి క్రమము. ఐతరేయ - ఛాందోగ్యాదులు సృష్టిక్రమమును, భృగువల్లీ - ప్రశ్నోపనిషదాదులు సంహారక్రమమును అనుసరించి లక్షణపూర్వకముగా తత్త్వమును బోధించినవి. ఇట్లుపనిషత్తులు కారణమునుండి కార్యమును బోధించుట, కార్యమునుండి కారణమును బోధించుట యనెడి సృష్టి సంహారక్రమముల ననుసరించి జగదాత్మముక్తితత్త్వములను బోధించినట్లు ఉపనిషత్పర్యాలోకనముచేఁ దెలియఁ గలదు.

శ్రీశంకరభగవత్పాదు లీయోపనిషదతత్త్వము నిట్లు వివరించిరి.

ఈజగత్సృష్టికిఁ బూర్వము సచ్చిదానందరూప మగు బ్రహ్మ మొక్కటియే గలదు. సదసద్విలక్షణ మగు ప్రకృతి వస్తురూపము గాకపోవుటచే దానినిబట్టి బ్రహ్మమునకు సద్వితీయత్వము సిద్ధింపదు. ఆప్రకృతి మాయ - అవిద్య యను శబ్దములచేఁ బేర్కొనఁబడుచుండును. ఇట్టి ప్రకృతియందుఁ బ్రతిబింబించు బ్రహ్మమే చిదాభాసుఁ డగును. ఈప్రకృతి సత్త్వరజస్తమోగుణాత్మకము. 'భూతఅద్దము' నందుఁ బ్రతిబింబించిన సూర్యప్రతిబింబము తనకు బింబభూత మైన సూర్యునికంటెఁగూడ అధికదాహకత్వశక్తి గల్గియున్నట్లు శుద్ధచిత్తునకుఁ బ్రతిబింబమగు చిదాభాసుఁడు విశేష మగు లోకవ్యవహారమును గావింప సమర్థుఁ డగును. ఈచిదాభాసుఁడే ఈశ్వరుఁడు. ఈ యీశ్వరుఁడే ప్రకృతినుండి ఆకాశవాయు అగ్నిజలపృథివీ రూపములను నిర్మించి తద్ద్వారావిశ్వమును నిర్మించెను. ఈతఁడే సృష్టి - స్థితి సంహారములను జగత్తునకుఁ గల్పించుచు బ్రహ్మ — విష్ణు — శివనామముల నందుచుండును. తాను సృష్టించిన యీజగమునందలి యాయాశరీరములలోఁ దానే ప్రవేశించి శరీరభేదములచే విద్యుచ్ఛక్తివలె అనేకవిధములగు నామములతో (దేవమనుష్యతిర్యగాది) దానే వ్యవహరించుచున్నాఁడు. ఈయర్థమునే «తత్సృష్ట్వా త దే వానుప్రావిశత్» అను శ్రుతివాక్యము తెల్పుచున్నది. విద్యుచ్ఛక్తి యొక్కటియేయైనను, ఒకవిద్యుద్దీపపుబుడ్డియందలి దోషముచే ఆదీపపుబుడ్డియే వెలుఁగుటలోని దోషముల ననుభవించునుగాని మిగిలిన దీపములుగాని విసనకఱ్ఱలుగాని యనుభవింపనట్లు చైతన్యము ఒక్కటియైనను. ఉపాధినిబట్టి కలుగు సుఖదుఃఖములను ఆయుపాధిగతుఁ డగు జీవుఁడే యనుభవించునుగాని ఇతరుఁ డద్దాని ననుభవింపఁడు. బ్రహ్మవిష్ణుమహేశ్వరులు మొదలు క్రిమికీటాదిప్రాణులవఱకుఁ గల చేతనజాలమంతయు ఈచిదాభాసరూపములే. అందు ఉపాధుల శ్రేష్ఠత్వమునుబట్టి జ్ఞానాధిక్యమును ఉత్తమాధమభావమును బొందుచుండును. తమతమ యుపాధులతో నాచరించు పుణ్యపాపరూపకర్మములఫలములను వీరలనుభవించుచుందురు.

చీఁకటి యను దోషమువలన చిట్టడివిలో ఒంటరిగ ధనమును గైకొని పోవుచున్న వ్య సున్నముగొట్టిన కొంచెము దూరములోఁగల మైలురాతియందు చోరుఁ డను భావము గల్గును. తరువాత ఆభీతిచే ఆరాయికదలి తనవైపునకే వచ్చుచున్నట్లును ఆచోరునిచేతిలో కత్తి యున్నట్లును ఇట్లనేకభావములు గల్గి బాటసారి పలువిధములగు ననర్థముల పాల్పడును. ఇది సర్వలోకప్రత్యక్షానుభవసిద్ధము. దీనిలో రెండుస్థితు లున్నవి. ఒకటి మైలురాతిని రాయిగాఁ గన్పట్టనీయని స్థితి. అట్టిస్థితి గల్గినవెనుక యది కదలుచున్నట్లును తనవైపునకే వచ్చుచున్నట్లును ఇంకను అనేక పరిణామములు కల్గించునట్లును ఉన్నస్థితి. ఈస్థితులలో మొదటిస్థితిని «ఆవరణశక్తి» యనియు, రెండవస్థితిని «విక్షేపశక్తి»యు అని యందురు. ఇట్లే మూలకారణ మగు బ్రహ్మము యొక్క స్వరూపమును ఆచ్ఛాదింపఁజేసిన ప్రకృతిశక్తి ఆవరణశక్తి. అట్టి ఆవరణశక్తినుండి బ్రహ్మాదిస్తంబపర్యంతముగల సకలప్రపంచవ్యవహారమును గల్గించునది విక్షేపశక్తి. ఇట్టి యాద్వివిధము లగు శక్తులనుండియే జగద్వ్యవహారమంతయు చిదాభాసు

నందే కల్పితేమైనది. మూలభూత మగు మైలబ్బాయికి వల
నాటిజగాని వేఱొక వికారములుగాని కలుగనే లేదు. అది
వలెనే కుండగనే సకల వ్యవహారోత్పత్తియుఁ గల్గి నడచినది.
ఇట్లే బ్రహ్మము చలింపకుండ ఉన్నది యున్నట్లుండగనే
జగత్తు తోఁచుచున్నది. దీనినే "వివర్త" మందురు వివర్త
మనఁగా మూలభూతపదార్థమునకు దెబ్బమార్పు లేకుండనే దాని
నాధారముగఁ జేసికొని యనేక వ్యవహారములుండుట. కావున
న్యాయవైశేషికులది ఆరంభవాద మనియు, ఔపనిషదులది
'వివర్తవాద' మనియు పెద్దలు చెప్పుదురు. చోర
భ్రాంతిచే యాతనల ననుభవించు వానికి భాగ్యవశమున
వివేకియగు సత్పురుషుఁ డొకఁడు కనపడి "ఇది చోరుడు
గాఁడు, మైలబ్బాయి" అని చెప్పి వాని బాధలను బోఁగొట్టి
నట్లే—స్వప్నాదుల యశాశ్వతత్వమునుగూడ గమనించి
యనాదియగు ప్రవాహరూపమగు సంసారమున విసిగి
వేసారి యీయాతనలనుండి శాశ్వతానందమును బొందు
టకు నేదైన నుపాయము గలదా యని వెదకుట కారం
భించిన పురుషునకు అతని భాగ్యవశమున విజ్ఞానవంతుఁ డగు
సద్గురువు లభించి తత్త్వబోధనపూర్వకముగ నాతని బాధ
లను బోఁగొట్టి శాశ్వతానందమును సమకూర్చును. అనఁగా
విరక్తుఁడగు జిజ్ఞాసువు సద్గుర్వనుగ్రహమున బ్రహ్మవిద్యోప
దేశము నంది వేదాంతశాస్త్రవిచారణమును గావించుచు
"బ్రహ్మమే సత్యము, జగత్తు స్వప్నమువలె మిథ్యా
రూపము. అలలు అన్నియు సముద్రరూపమే యైనట్లు
చేతను లగు జీవులందఱు చైతన్యఘన మగు బ్రహ్మరూపులే
గాని వేఱు గారు. ఈవిషయమునే మహావాక్యము లన్నియు
బోధించుచున్నవి అను తత్త్వ నిశ్చయజ్ఞానము నందును.
అప్పు డతఁడు ముక్తుఁ డగును. అనఁగా తాను సుఖదుఃఖ
ములను అనుభవించుచున్నా నని యనుకొను జీవుఁడు
యథార్థజ్ఞానముచేఁ దాను సంసారిని వాస్తవముగా గాన
నియు నేను బ్రహ్మరూపినే యనియుఁ దెలిసికొనుటయే
జ్ఞానము. అదియే ముక్తిసాధనము. అట్టిజ్ఞానము గల్గిన
వాఁడే ముక్తుఁడగును. కావున ముక్తియనఁగా జీవుఁడు
బ్రహ్మభావము నందుటయే. ఇయ్యది పురుషుఁడు జీవించి
యుండఁగనే (ఈశరీరముతో నుండునప్పుడు) గూడ
సంభవింప నవకాశము గలదు గావున ఈశరీర మున్నప్పుడే
ముక్తుఁడైనవానిని జీవన్ముక్తుఁ డని యందురు. ఈజీవన్ముక్తి
ఔపనిషదసిద్ధాన్తము నందే గాని విశిష్టాద్వైతాదిసిద్ధాన్తము
లందు లేదు. అద్వైతజ్ఞానము గల్గియుండియు నయ్యది పరి
పక్వము గాకుండ మృతిచెందినచో నట్టివాఁడు పరమేశ్వ
రానుగ్రహముతో మరణానంతరము ముక్తుఁడై మఱల
జన్మము లేనివాఁ డగును. సంసారపతితునికి ముక్తిగల్గుట
దుర్లభము గావున సంసారత్యాగము చేసి జ్ఞాని యయిన
సన్న్యాసికి మాత్రమే ముక్తిసంభవింప నవకాశము గలదని
శ్రీశంకరభగవత్పాదుల యాశయము. ఈయౌపనిషద
దర్శనమున వస్తునిర్ణయమున ప్రత్యక్షానుమానశాబ్దోపమాన
ములే గాక అర్థాపత్తి - అనుపలబ్ధి యను మఱి రెండుగూడ
ప్రమాణములుగా నంగీకరింపఁబడుచున్నవి.

మొత్తముమీఁద శాంకరబోధ సారాంశ మిది:

జనుఁడు వేదములోఁ జెప్పఁబడినట్లు వర్ణాశ్రమాను
గుణముగఁ గర్మలను బరమేశ్వరార్పణబుద్ధితో ఫలము
లపేక్షింపకయే ఆచరింపవలయును. అట్టికర్మాచరణమువలన
మనస్సు పరిశుద్ధ మగును. అట్టి పరిశుద్ధమానసునికి వేదాంత
బోధమునకు ననఁగా తత్త్వజ్ఞానమునకుఁ గావలసిన నిత్య-
అనిత్య వస్తువివేకము, ఐహిక - ఆముష్మికఫలములందు
వైరాగ్యము, శమము - దమము - తితిక్ష - ఉపరమణము-
శ్రద్ధ - సమాహితత్వ మను నాఱుసద్గుణములును, దాను
ముక్తుఁడు కావలయు నను తీవ్రేచ్ఛయుఁ గల్గును. ఇవి
సిద్ధించినతర్వాత అముముక్షువు జగదాత్మమోక్షస్వరూప
ములను దెలిసికొనుటకు సద్గురువు నాశ్రయింపవలయును.
అట్లాశ్రయించిన యాతఁడు శాస్త్రమును ఆచార్యోపదేశ
మును శ్రవణ మనన నిదిధ్యాసములతో విచారించినచో
అతనికి ద్వితీయవస్తురహిత మగు బ్రహ్మమునందు జగత్తు
వివర్తరూపమున భాసించుచున్నదేగాని వాస్తవముగ లేద
నియు, బ్రహ్మ మొక్కటియే సత్య మనియు జననమరణ
ప్రవాహరూప మగు నీసంసారమునందు సుఖదుఃఖముల
ననుభవించు నీజీవుఁడు నిత్యచిదానందరూప మగు బ్రహ్మ
స్వరూపుఁడే యైనను దనవాస్తవరూపము నెఱుంగకపోవు
టచే నిట్టి సంసారయాతనల ననుభవించుచున్నాఁ డనియు,
గురుశాస్త్రోపదేశములవలనఁ దాను చిత్ - సత్ - ఆనంద-
శాంత- శివ- అద్వైతబ్రహ్మరూపమే యనియుఁ దెలిసి

కాని యట్టి బ్రహ్మమే యగుచున్నాఁడు. ఇదియే మోక్షము. అట్లు యథార్థస్వరూపమును తెలిసికొనుటయే మోక్ష సాధనము. ఈతత్త్వమే సర్వోపనిషత్తులయందుఁ దెల్పఁ బడినది. దీనినే శ్రీకృష్ణభగవానుఁడు కార్యాకార్యము లందు మూఢుఁడైన పార్థున కుపదేశించెను. ఇయ్యదియే శ్రుత్యాదులకు విపరీతార్థములను గల్పించి శ్రుతితాత్ప ర్యము నెఱుంగని వారలు ప్రతిపన్నము లగు నర్థములను బోధించుచుండ నట్టి విపరీతార్థములవలన ముముక్షువుల నర్థములను బొందుదు రనుతలంపుతోఁ గలిద్వాపరసంధి యందు శ్రీకృష్ణద్వైపాయనమహర్షి యథార్థమును బోధింప బ్రహ్మసూత్రములను రచించి తదధికరణములందు ఈయర్థమునే సిద్ధాంతీకరించెను. కావున నిట్టి యౌపనిషద సిద్ధాంతమును అందఱును అత్యాసక్తితోఁ దెలిసికొనవల యును. ఇట్టి యతిశయము గల్గియుండుటచేతనే జ్ఞానసిద్ధు లగు పరమహంసపరివ్రాజకులకు భారతదేశము ప్రథమ స్థానము నొసఁగినది.

“ముక్తిశ్రీనగరస్య దుర్జయతరం
ద్వారం యదస్త్యాదిమం
తస్య ద్వే అరరే ధనంచ యువతీ,
తాభ్యాం పినద్ధం దృఢమ్ ।
కామాఖ్యార్గళదారుణా బలవతా
ద్వారం, తదేతత్త్రయం
ధీరో యస్తు భినత్తి సోఽర్హతి
సుఖం భోక్తుం విముక్తిశ్రియః”

(శ్రీశంకరభగవత్పాదాః సర్వ. వే. సి. సా. సం.)

# సుప్రభాతము

## శ్రీ దాశరథి

❋

ఉదయాద్రిబుజ మెక్కి ఒకడు నవ్వెను చూడు
భూదివమ్ములు వెల్గుపూలు పూయ,
ఉవిద తామర బుగ్గ నెవడొ ముద్దిడె చూడు
మనసులో వలపు చందనమురాయ
చిమ్మచీకటి కాలజిమ్మె నెవ్వడొ చూడు
గుండెలోపలి తమోగుణము మాయ
కనురెప్ప దుప్పటికప్పు లాగె నెవండొ
వెలుగులోకాలు తల్పులను తీయ

వేయిచేతుల ధరణిని పిలిచి పిలిచి
కౌగిలించె నెవండొ శృంగారి చూడు,
కానబడరాని దివ్యలోకాలు చూపి
తాను కనుమూయు లోకబాంధవుడు వాడు.

వీ డటో నిద్రాణపృథివికన్నులమీది
చీకటిబరువు పోజిమ్మువాడు,
ఈత డేనా తమోభూతమ్ము సిగలోన
మందారమాలిక మలచువాడు,
ఈతడే నటవె జీమూతమ్ములను పెంచి
జగతిపై ముత్యాలు చల్లువాడు,
ఈతడేనా జగద్ధితముకై గగనాన
కాలికి బలపమ్ము కట్టితిరుగు,

ఈత డీతడే కావచ్చు ఇంద్రదిశకు
పశ్చిమాశకు నడుమ రేబవలు నడచి
ఒకరివృత్తాంత మొక్కరి కొసగి యొసగి
స్నిగ్ధబంధంబు కూర్చెడి స్నేహితుండు.

ఇతడు లేకున్నచో ఏది పద్మాంగనా
ఫాలాన గోరోచనాలవమ్మ?
ఇతడు రాకున్నచో ఏది భూభామినీ
గల్లభాగాన బంగారువన్నె?
ఇతడు తేకున్నచో ఏది దిక్కామినీ
తనువుపై పట్టుపీతాంబరంబు?
ఇతడు పోకున్నచో ఏది నీలాకాశ
కచపాశమున చంద్రఖండశోభ?

ఈతడే కాదె నాహృదయేప్సితమ్ము?
ఇతడు లేకున్న జగమెల్ల ఇరులె సుమ్ము!
సుప్రభాతమ్ము, లెమ్ము, తమఃప్రభావ
మంతరించెను, రమ్ము! నిశాంతమునకు.

పైపై బ్రాకి నభోమహాభవనశుం
భద్గోపురాగ్రానకున్
దాపై ఆపయి క్రిందుక్రిందు లయి తా
నంభోధినంతర్హితుం
డై పూర్వాశకు నశ్వముల్ నడపి ఘో
రాంధ్యమ్ముమాయించువా
డాపద్బాంధవు డేగుదెంచె నదె లె
మ్మా! సుప్రభాతమ్మునన్.

# ఎవరి పాదచిహ్నము లివి?

ఎవరి పాదచిహ్నము లివి?
ఎవరి పాదచిహ్నములు?
ఆతని ప్రతిఅడుగుగురుతు
ఆలయమై తలయెత్తును
ఆతని చెయిగొడుగుక్రింద
అఖిలజగము శయనించును.

దానవులను కరగించిన
మానవు డత డెవ్వడు?
గుండె నొడ్డి తుపాకీల
గుండె పగులగొట్టె నతడు
రాటంతో రణశూరుల
ఈటెల నెదిరించె నతడు.

హిమాలయముకన్న నెత్తు
ఎవ డాతం డెవ్వడు?
ప్రతిమానవు హృదయమ్మున
నొదిగిపోవ జాలు నతడు
విశ్వములో ప్రతిప్రాణిని
ప్రేమించగ జాలు నతడు.

కత్తికి కన్నీరుగూర్చు
కరుణాకరు డెవ్వడు?
విషమిచ్చినవాని కమృత
చషక మిచ్చె నాతడు
కారాగారము స్వర్గము
గా మారిచె నాతడు.

తరతరాల మనసంస్కృతి
తానై నిలిచిన డెవ్వడు?
ఎవనితనువు గతాగతము
లేక మైనయటుల తోచు
ఎవని చిన్నినివాసము
అవనికి కైలాసము?

# జీవితగడియారంలో 12 గంటలు

శ్రీ రాయసం వీరభద్ర శర్మ



వెలుగుచీకటుల మధ్య
కాలం దోబూచు లాడుతోంది
అతడు, ఆమె జన్మించినపుడు
పన్నెండుమీదనుంచి
బద్ధకంగా కదిలింది
జీవితగడియారపు చిన్నముల్లు.

గౌనులూ, లంగాలు వదలివేసి
చీరలు, రవికలు తొడిగిందామె,
పూరిపాక స్కూలు విడిచి
చెక్కడపురాళ్ళ కళాశాల చేరాడతడు
ఒంటిగంట కావస్తున్నది.

సిగ్గుదొంతర్లక్రిందామె
నూనూగుమీసాలక్రిందతడూ
చిరునవ్వుల చెండాడుకుంటుంటే
చెంగున గంతేయబోయి
కట్నాల బేరానికి నిశ్చేష్టమై
ఒకక్షణం స్తంభించింది జీవితం.

ఆకు కోక బంతిపువ్వు
గుంజ కోక పట్టుపంచె
పకపక మంటున్న పందిరిలో
వేళానికి తాళమేసి
ఒక్కసారి మోగింది.

జీవితసమరాంగణంలో
విల్లులా వంగిందామె తనువు
సంధించిన శరమైనాడతడు;
వెచ్చని కౌగిళ్ళలో
సెగ హెచ్చిన చుంబనాలలో
చిటపట రాలే చినుకుల్లో జనించి
నవ్వులు చల్లుకున్న శయ్యలపై
కరగే కలహాలతో
చంద్రచంద్రికలలా
పెనవేసుకు పోయిన కాలంలో
మందహాసాలు చిందిస్తూ
సగర్వంగా రొమ్ము విరుచుకొని
బారెడు బారెడు అంగలలో
నాలుగును చేరింది జీవితం
(రెండు, నాలుగుల దగ్గర రెండుసార్లు
అటకపైనుంచి దిగింది ఉయ్యాల)
అనురాగాలు అలవాటై
ప్రేములు పరామర్శలై
తమవికాని అందాలను
చిలిపిగా చూస్తూ
కొండమీదినుంచి వచ్చే గుండులా
దొర్లివచ్చి ఆరును చేరింది జీవితం:
అలవాట్లు శివరాత్రులై
పరామర్శలు పండుగులకు

మాత్రం ప్రత్యేకించబడగా
బాకీలు బ్రాటోవర్లు కాగా
వేసటను విసుక్కుంటూ ఉండగా
ఏడుగంటలైనది.

సంసారతులాభారంలో
అప్పులపళ్ళెం నేలపడుచుకొని
ఆస్తులబలి కోరగా.
అద్దాలలోనివాళ్ళ గడ్డాలు
తొంగిచూడగా
ఉయ్యాల దిగిన వరాలు
వోణీ లేసుకోగా
బరువు దించేవాళ్ళు
పెంచినబేరాలకు
గుండె లవిసినాయి ఎనిమిదింటికి.

గడ్డాలపై చదువుకు
వోణీలసంబరాలకు
తనను కన్నవాళ్ళ
పరలోకయాత్రకు
చత్వారం కళ్ళజోడుకు
దాయాదుల దావాలకు
సరదాగా కొన్న చేతికర్ర
ఆసరాతో తొమ్మిందింటికి వచ్చి
చతికిలపడ్డది జీవితం.

సుందరాకాండపారాయణం
మూగచూపులతో
మాసినమమతలచర్చలు
నెరసిన మీసాలు చప్పిదవడలు
విసుకుకొనే ఛలోక్తులు
చూస్తుండగానే పదయింది.

చూపు కెక్కినాయి
పాతబడ్డ పాదరక్షలు
తిరస్కరించినాయి
అనుసరించి మారటానికి
అలవాట్లు అవసరాలు.
తనచెట్టునీడ అంతరించటంతో
తాను నాటిన చెట్లనీడ చేరగా
కాకతాళీయంగా రాలిన
ప్రతిపండుకూ తల బొప్పకట్టింది.

తలకు మించిన భారాన్ని మోసిన
తనువుకు తలే భారమైనది,
రెండు ఒకట్ల మధ్యలోయలో
ఒత్తిగిలింది జీవితం
కాలుడిబాణానికి
క్రౌంచమిథునంలో ఒకటి రాలింది.

పందిరి కూలింది
కాపుఊడిగిన పొట్లతీగ
పుడమి కొరిగింది.
తనగుడ్డే తనను విసుక్కోగా,
గూటచేరిన కలకంఠి
తోసివేయగా
జంటబాసిన ఏకాకి
నేలకూలింది.

జీవితపు ప్రాంగణంలో
కాలపు గడియారం
పన్నెండుసార్లు మోగింది.

# రహదారుల కూడలి



సందేహాల ప్రశ్నలకు
హేతువులు జవాబివ్వక
దండల కండలు కరిగి
బండలు పైకిలేవక;
మొక్కిన మొక్కులను
దేవతలు ఆలకించక,
ఆరాధిత వ్యక్తులతో
దైవత్వం కనుపించక
మనసిచ్చిన మనుష్యులు
చాచిన చేయి అందుకోక,
జీవితంలో సౌకర్యాలె
కుండలీకరణాలలోకి పోలేక
అవసరాల ఆవరణల
ప్రాకారాలు దాటలేక,
కృత్రిమ మర్యాదల
ఆభరణాలు వీడలేక
గతంలో బ్రతకలేక,
మార్పుల నవ్యత్వం నమ్మలేక,
పరిష్కారాల రహదారుల కూడలిలో
సిద్ధాంతాల ప్రకటన దీపాలను
నివ్వెరపడి చూస్తున్నవాడికి
అనుమానాల మబ్బులు విచ్చే దెలా?
సగర్వంగా సన్మార్గాన నడిచే దెలా?

[“శరీరాల సంత” నుంచి]

# ఆ జ్ఞాన సస్యకేదారమైన శృంగేరిపీఠ చరిత్ర

శ్రీ ధారా రామనాథ శాస్త్రి

❋

## కప్పకు పడగ పట్టిన పాము!

ఆదిశంకరుని అమరవాణి అద్వైత ప్రతిపాదకంగా ఆసేతు శీతనగము మార్మ్రోగిస్తున్న దినాలు. సర్వమత ఖండనద్వారా సర్వమత సమన్వయాన్ని నిరూపించి, అద్వైతసిద్ధాంతమే పరమధ్యేయంగా ప్రతిపాదించి అఖండమైన విజయాన్ని చేపట్టి శంకరుని అపరావతారమని భావింపబడిన శ్రీమదాదిశంకరులు భారతదేశ తాత్త్వికసింహాసనాధ్యాసియై జీవించిన స్వర్ణయుగము. భారతదేశంలో పశ్చిమ పర్వతశ్రేణీప్రాంతము. సుందరమైన ప్రకృతి. అల్లంతదూరాన ఆకాశంతో ఐక్యాన్ని భజిస్తూ యుగయుగాల భారతీయాధ్యాత్మిక స్థైర్యతకు చిహ్నంగా నిలచిన పర్వతశ్రేణి. దిగువభాగాన ఉత్తుంగతరంగాలతో తుంగామహానది ప్రవహిస్తున్నది. పర్వతసానువులు, హరిత పత్ర రంగవల్లులు, తమగాంభీర్య సౌందర్యాలను తుంగా తరంగ భంగాలమీద పచరించుకొని మురిసిపోతున్నవి. మధ్యాహ్న సమయము. నాతి దీర్ఘమైన దేహయష్టి, సర్వ శరీరానికి ప్రధానంగా కనిపించే ముండిత శిరము, మహో జ్ఞానరోచిస్సులు పండిన తీవ్ర నేత్రకోణాలు, అసాధారణ సంకల్పబలాన్ని సూచించే పెదవుల పొందిక కలిగి కాషాయాంబరం అరుణకిరణాలతో మెరసిపోతుండగా జగద్గురువులు శ్రీశంకరభగవత్పాదులు అన్వేషణాలసమైన గమనంతో దిక్కులు కలయచూస్తూ నడుస్తున్నారు ఆప్రదేశానికి రాగానే వారి నిండు మనస్సున ఒక శాంతి ప్రసన్నత వెల్లివిరిశాయి. ఒక చల్లని కాసారతీరాన్ని దరియగానే అక్కడ ఒక అద్భుతదృశ్యం వారిదృష్టిని ఆకట్టుకొన్నది. ప్రసవవేదనతో జీవన్మరణసంధిలో గిలగిల తన్నుకొంటున్న ఒక ఆడుకప్పకు ఎండతగులకుండా పడగవిప్పి ఒక పాము కాపాడుతున్నది. పాము పడగ నీడన ఒక కప్ప బ్రతుకగలిగిన యీస్థానమే విశ్వమానవ సౌందర్యానికి, జగత్కల్యాణ పరంపరకు కేంద్రమైన శృంగేరి. ఆది శంకరుల అమృతహృదయం ఆనందంతో స్పందించింది. 'ఇదే నాకు కావలసిన స్థానం. ఇక్కడే ఆశ్రమం స్థాపిస్తాను' అనే మాటలు వారి నోటినుండి అవ్యక్తంగా వెలువడ్డాయి.

ఇది కేవలము ఒక కథ కావచ్చు. కాని యిందలి భావ ప్రాధాన్యంమాత్రం చాలాగొప్పది. తుంగానదీ తరంగ శీకరాలతో, శీతల వాయువులతో, పరమ ప్రశాంత భావానికి ఆలవాలమై, విశ్వశాంతిధ్యేయంగా, సర్వ సమత్వం ఆదర్శంగా, ఆనాడు భగవత్పాదులు స్థాపించిన శృంగేరిపీఠము ఈనాటికీ అదే పవిత్రాదర్శంతో వర్ధిల్లుతున్నది. అక్కడ ఆధ్యాత్మిక ధ్యేయానికి జాతి, కుల, మత విచక్షణలు లేవు. యుగయుగాల మహర్షుల జీవితాలు ఏపవిత్ర సంకల్పాలతో నడచాయో శృంగేరీ ఆచార్యపీఠంకూడా వానినే సాధిస్తుంది. ఈపీఠంయొక్క ఆధ్యాత్మిక కాంతి పుంజంచేత ఆకృష్టులైన సాధకుల్లో మహమ్మదీయులు, క్రైస్తవులూ ఉన్నారు. మతతత్త్వరహితమైన యీనాటి ప్రజాస్వామ్యంలో శృంగేరీ కెంతైనా ప్రాధాన్యమున్నది.

అది మైసూరు మహారాజ ప్రసాదం. మహారాజులు అప్పుడే తమ ప్రాసాదాన్ని పవిత్రంచేసిన జగద్గురు ఉగ్రనరసింహ భారతీ స్వాములకు అర్ఘ్యపాద్యాదివిధులతో పూజచేసి పాదధూళిని శిరస్సున ధరిస్తున్నారు. మహారాజ్ఞి చెంగటనే పున్నమి చందమామను బోలిన బాలుణ్ణి ఎత్తుకుని నిలబడి ఉన్నది.

స్వాముల వత్సలదృష్టి బాలుడిపై బడింది. 'నీవు చాలా అదృష్టవంతురాలవు కాశీక్షేత్రయాత్ర ధ్యేయంగా కలిగిన బాలుని కన్నావు' అన్నారు. శాంత గంభీరస్వరంతో. తల్లికి ఆమాటల్లో అంతర్యం తెలీలేదు. ఆచార్యుల అనుమతిపై తలమీద త్రి గర్భరేఖను కప్పిపుచ్చుతూ 'అంతా తమ ఆశీర్వచనం అన్నారు,' 'నిన్నొక మహాఫలం అర్థించడానికి వచ్చాను. తప్పక యిస్తావుకదూ. నీచేతులో ఉన్న బాలుడు సామాన్యుడు కాడు. శృంగేరి పీఠానికి కాబోయే ఆచార్యుడు. ఆబాలుణ్ణి పీఠానికిసమర్పించి మానవజాతికి మహోపకారం చేసిన గౌరవాన్ని దక్కించుకో' అన్నారు. మాతృశ్రీ స్తబ్ధురాలైనది. ఒక్క క్షణం క్రితం ఆమె మనస్సులో ఉబికిన ఆనంద తరంగం విరిగి పడిపోయింది. కను కొలకుల్లో కన్నీటి బిందువులు క్రమ్ముకుంటున్నవి. ఎంతకాలాలు నిరీక్షణోద్వేగానికి మూగపోయి నది 'స్వామీ ఎన్నోనోములు వ్రతాలుచేసి లేక లేక కన్న సంతానం. సాంగజ్ఞులు. తమరిలా శాసించడానికి నేనేం మహాపరాధం చేశాను. నాబిడ్డణ్ణి నానుంచి వేరు చేయకండి. మీ పాదాలకు మ్రొక్కుతాను' అని గద్గద స్వరంతో రోదించింది: 'కాదు తల్లీ ఇది యీశ్వరేచ్ఛ. పీఠం తనకు కావలసిన స్వామిని తాను వెదుక్కుంటుంది. ఇది సనాతన ధర్మం, ఆధర్మరక్షణకోసమే మీరాజరికం అంకిత మైనది. దాన్ని నీవుకాదనలేవు. ఈ బాలుని భవిష్యత్తుకు నీవు కర్తవుకావు. కేవలం కన్నావు అంతే అన్నారు ఆచార్యులు సానునయంగా. తల్లినోట మాట రాలేదు. ఆచార్యులు సమాలోచించుకొని, 'పిల్లవాడి భవితవ్యం చాలా చిత్రమైనదమ్మా ఒక రహస్యంకూడా ఉన్నది. ఆరహస్యం నానోట నేను ఉచ్చరించను. ఉచ్చరిస్తే జరిగితీరుతుంది' అంటూ ఆస్థానజ్యోతిష్యుని కనుసన్నతో ఆజ్ఞాపించారు.

జ్యోతిష్కుడు బాలుని భవితవ్యం చదివాడు. అతని జన్మ ఉత్తమమైనది. లోక సేవాపరుడౌతాడు. కాని ఒక్కలోపమున్నది. అతని పదునారవయేట గండమొకటి చాలా తీవ్రమైనది ఉన్నది. ఈవృత్తాంతం విని మాతృశ్రీ హృదయం ఒక్కసారిగా స్తంభించిపోయింది. అపుడు దేవీ, ఆగండాన్ని రూపుమాపి అతనికి పునర్జన్మ ప్రసాదించి జగద్గురువును చేయడానికే నా అభ్యర్థన. సన్యాసాశ్రమ స్వీకృతితో పునర్జన్మ పొందుతాడు. అంతేకాదు, లోకాచార్యుల మాతృస్థానం నీకు లభిస్తుంది, దానికితగినవాడు కాబట్టే నేనువచ్చాను. ఇంకొకసంగతి. ఈ ప్రాతః కాలం నేను ధ్యానంనుండి వచ్చి నీబాలుణ్ణి దగ్గరకు తీసుకున్నాను. బాబూ నీకేమైనా పాటలు వచ్చా? అన్నాను. పిల్లవాడు పలకలేదు. ఊకొనలేదు. కాదనలేదు. ఏదో ప్రశాంతతతో చూచాడు, సన్నగా నవ్వాడు. ఉన్నట్టుండి ఒక చక్కని గేయాన్ని ఆలపించాడు. ఏమనో తెలుసా.

అదనైన నది స్వీకృతికో దేవా నను కాదనకుము
నేను వినా నీవెవరిని నీచెంగట చేర్చుకొనెదు
నీవు వినా నేనెవరికి కానుకగా బోదు దేవ!
క్షణమైనను నిలువజాల నిరీక్షణ వేదన నోర్వజాల.

అని, అలాంటి సహజజ్ఞానిని ప్రసాదించి చరితార్థవు కావమ్మా' అని అనుశాసించారు స్వామి. మహారాజ్ఞి హృదయం డోలాందోళితమైనది. ఒకవేపు మాతృహృదయంలో మమకారము, అల్పాయుః ప్రమాణంపట్ల భీతి, తన కుమారుడు ఆచార్యశ్రీ కాబోతున్నాడనే తృప్తి, ఆమెలో ముప్పిరిగొన్నవి. క్షణకాలమాలోచించి తన ఆర్ద్రనేత్రాలలో నిర్ణయం బలం వెలిగిస్తూ ఆయమ్మ యిలా అన్నది. 'అలాగే కానీయండి స్వామీ. అంతా మీఆజ్ఞ. మీఆశీర్వచనం' అన్నది. స్వామి ముఖం ఆనంద వికసితమైనది. బాలుని చేతికి తీసుకొని స్వామి శృంగేరీ దెసకు ప్రయాణమైనారు.

పవిత్రమైన శృంగేరిపీఠం చేరినప్పటినుండి శ్రీస్వామి బాలుని చాలా జాగరూకులై పెంచారు. అనుకున్నట్టుగానే పదునారవయేట బాలుడు తీవ్రవ్యాధిగ్రస్తుడైనాడు. స్వామి బాలుని అనారోగ్యంనుండి రక్షించడానికి బంగారు రేకుమీద బాలుని బొమ్మ చెక్కించి పార్వతీ శ్రీకంఠేశ్వరుల పాదాలదగ్గర ఉంచి తపస్సమాధి మగ్నులై బాలునికి పునర్జన్మ నర్థించారు. బాలుని గండం తప్పింది. బ్రహ్మతేజోవిరాజమానుడైన యీ బాలకుడే తరువాత పీఠాధిపత్యం పొందిన శ్రీ సచ్చిదానంద శివాభినవ నరసింహ భారతి.

రాజయోగి : జనాభా లెక్కలు.

సంప్రదాయజ్ఞుల స్మృతిపథాలలో శ్రీసచ్చిదానందుల మాహాత్మ్యం యింకా చెరిగి పోలేదు. శ్రీవారు సన్నని శరీరంతో పొడగరి. అన్నిట రాజసం ఉట్టిపడే తీరున తామున్నచోట ఆకర్షణా దర్పము వెలార్చుతుండే వారట. శిష్యుల సేవలను స్వీకరించడంలో ఆర్తులకు సాయపడడంలో ఎంతో సంతృప్తిని చూపిస్తూనే వీటన్నిటికీ అతీతంగా ఉండేవారు. జనాభా లెక్కలు వ్రాసే ఉద్యోగి వస్తే తమ వృత్తిని తెలిపేచోట 'ఆత్మాను సంధానము' అని వ్రాశారట. శ్రీవారికి వీరాసనం ప్రీతిపాత్రము. విశాల నిటాలంమీద విభూతిరేఖలు ఆధ్యాత్మిక తేజాన్ని కాంతిగోళాలవలె భాసించే నేత్రాలు, మందహాసం చిందించే పెదవులు కలిగి శ్రీవారు కాషాయాంబర ధారులై వస్తుంటే శిష్యబృందం దర్శన మాత్రానే తరించేవారట.

మౌన వ్యాఖ్య;

వారి తరువాత పీఠాధిపతులు శ్రీ చంద్రశేఖర భారతీ స్వాములు. ఉదయవేళ స్వాములు పూజానంతరం వెలికి వచ్చి శిష్యకోటినీ తమ ప్రసన్న దృక్కులతో చూడగానే అందరికీ అజ్ఞానాంధకారం నశించి పోయేది. శ్రీవారు 'మౌన వ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వమ్ యువానమ్' అనే శ్రీ దక్షిణామూర్తి తత్త్వానికి మూర్తులు. యోగాభ్యాస పాటవము, మానవతా గుణాలు, మౌన ముద్రాంకిత తత్త్వోపదేశాలు శ్రీవారి ప్రత్యేకత. శిష్యులు తీవ్రమైన కుతుకంతో నిరీక్షిస్తూ నిలుచుని ఉండగా దక్షిణామూర్తి వలె శ్రీవారువచ్చి శిష్యుల నొకచల్లని చూపుచూచి వెళ్ళుతుంటే జన్మాంతర సంస్కారాలన్నీ ఉద్బుద్ధములై ప్రతి సాధకుడూ పులకించిపోయేవాడట.

మహామహులైన యీ జగద్గురు పరంపరలోనే ప్రస్తుత పీఠాధిపతియైన శ్రీ అభినవ విద్యాతీర్థస్వామి పూర్వజగద్గురువుల తపశ్శక్తిచేత నిండిన మహనీయులుగా భాసిస్తారు. మనకన్నులముందే వెలుగుతున్న యీ జగద్గురు తేజమే ఒకనాడు శ్రీ మదాది శంకర భగవత్పాదులుగ, శ్రీ విద్యాశంకర విద్యారణ్యులుగ, శ్రీనృసింహభారతిగ, శ్రీమచ్చంద్రశేఖర భారతిగా భాసించి ఉన్నది. అదేమార్గంలో కఠోరమైన తపోనిష్ఠా, శిష్యులపైవాత్సల్యము, మానవాళిపై అపార కారుణికస్వభావము, చిన్మయానందరోచిష్షు శ్రీ [illegible] ప్రదర్శిస్తున్నారు

వీరు 1954లో పీఠాధిపత్యాన్ని చేబట్టారు. పీఠాధిపతి కాగానే మూడు ప్రదేశాలలో బ్రతుకు వెళ్ళబోస్తూ ఆధ్యాత్మిక విశ్వాస కేంద్రంగా శృంగేరిని ఆరాధిస్తున్న అశేష భక్తకోటి యొక్క దృష్టి మరలించారు. మొదట దక్షిణదేశ యాత్ర ప్రారంభించి సాధకులందరికీ సందేశామృతాన్ని తీసుకొని వెళ్ళారు. [illegible] తి మానవ హృదయంలో నిరంతరంగా చెలరేగుతున్న సుఖదుఃఖాలను సానుభూతితో అర్థంచేసుకొని అందరికి శృంగేరి ఆనంద సందేశాన్ని యివ్వగలదని నిరూపించారు. శ్రీవారి యీనూతన దృక్పథ ఫలితంగా యీనాడు పతిగృహంలోనూ శృంగేరి దివ్యతేజం లాస్యంచేస్తున్నదంటే అబ్బురం కాదు.

నూతన చరిత్ర

దీనికితోడు శృంగేరి చరిత్రలో ఒక నూతనాధ్యాయాన్ని శ్రీవారు స్థాపించారు. శృంగేరి కేంద్రశక్తిగా ఉన్న అపారములైన వేదపాఠశాలలను, మఠాలను శ్రీవారు పునరుద్ధరించినారు. హైదరాబాదులోను, కోయంబత్తూరులోను, సేలంలోను నూతనంగా మఠాలను స్థాపించారు. కాలడిలో శంకర కళాశాల అధిపత్యాన్ని స్వీకరించి నిర్వహిస్తున్నారు. ఈ కార్యక్రమాలన్నిటిలో అజేయమైన పరిపాలనా దక్షతను శ్రీస్వామి ప్రదర్శిస్తున్నారు.

పర్యటనా కార్యక్రమాలు, వ్యవహార దీక్ష ఒకయెత్తు. యుగయుగాల ఆధ్యాత్మిక శక్తికి చిహ్నమైన తపశ్శక్తి ఒకయెత్తు. ఎన్నికార్యకలాపాలు తీర్చిదిద్దుతున్నా స్వామివారి ఆధ్యాత్మిక సాధనను బహుగుణీకృతంచేస్తూనే ఉన్నారు.

ఈనాడు శృంగేరి భారతీయుల అచంచల విశ్వాసానికీ ఆధ్యాత్మిక శక్తికీకేంద్రం. అశేషజన వాహినకీ ధర్మోపాయాన్ని బోధించే విద్యాపీఠం. సాధకులకు పుణ్యతీర్థం. అద్వైత జ్ఞానసస్య కేదారం.

('జ్ఞానప్రభ' సౌజన్యంతో.)

# అందుకే ఈ ప్రతీక్ష

## శ్రీ విశ్వం

❈

ఏ అనంతాంతరిక్షప్రాంగణముననో
ఏ దిక్తటాంతకాంతాచికురపాళినో
ఏ చిద్విలాసవిద్యుజ్జ్వాలయో లేచి
శాంతిపూరపతాక
కరణి వెలుగొందితే
ఎంత మనసుకు హాయి! ఎంత మనిషికి హాయి!
ఆ అనంతాంతరిక్షప్రాంగణముననే
ఆ దిక్తటాంతకాంతాచికురపాళినే
ఆంధ్యమ్ము కాటుకలకూటువలు గుజిసి
తిమిరప్రతీక యై
తెఱకప్పి పోవగా

ఎంత మనసుకు దిగులు! ఎంత మనిషికి పొగులు!
ఏ పూరిగుడిసెమూలనో కుక్కిమంచమున
ఏ పచ్చిబాలెంతచిగురుపొత్తిళ్ళనో
ఏ శిశువుతొలికేకయో గిల్లుమని రేగి
సంచలచ్చైతన్య
సంభార మై విన్న
ఎంత మనసుకు హాయి! ఎంత మనిషికి హాయి!
ఆ పూరిగుడిసెమూలను కుక్కిమంచమున
ఆ పచ్చిబాలెంతచిగురుపొత్తిళ్ళలో
ఆ శిశువుకడసారి ఆక్రందన మ్మగుచు
చైతన్యహీనని
శ్చలజడిమ చెవిసోక
ఎంత మనసుకు దిగులు! ఎంత మనిషికి పొగులు!

* * *

ఏ మల్లికాలతాలలితలాస్యముననో
ఏ పల్లవారుణారుణకిరణసరణినో
ఏ నవోదయసుధామధురమంజులగీతి
మాధవాగమనస
న్నాద మై తలనూప
ఎంత మనసుకు హాయి! ఎంత మనిషికి హాయి!
ఈ జీవసంజీవనీప్రభోదయమాల,
ఈ జరామృత్యుసంతిమిరచ్ఛటాజ్వాల
ఈ గతాగతమహోద్ధతవీచికాఖేల
ద్వంద్వదుఃఖాగాధ
దర్పణమ్మైన్నతోప
ఏది మనిషికి శాంతి? ఏది మనసుకు దాంతి?

* *

అనుక్షణప్రత్యాసన్నమృత్యుపరిష్వంగంలో
అనుదినప్రత్యాగతజీవనప్రహేళికలో
అంతరహితనరకస్వఃకవాటములవిపాటనంలో
అరిగిపోతున్న మానవపరమాణువిలా
విలువలేని కలలకు బలిఅవుతూ
చలువలేని తలపులకు గురిఅవుతూ
విహ్వలు డై, విషణ్ణు డై
విధురు డై వేదనాభరంతో

విడివడ లేక కంటికి కడివెడుగా
తడిగుండెలతో ఎన్నాళ్ళీ
పడిలేచుట?

* *

ఏదో ఒకమూల
ఎంత హింసాతాండవం!
ఏదో ఒక నేల
ఎంత దిగుళ్ళపంట!
ఏదో ఒకచాయ
ఎంత నికృష్టపు గుంట!
ఏదో ఒకదోవ
ఎంత అప్రాచ్యపు మంట!
ఎప్పటికీకావిరికళ్ళలో ఆవిరితీసి
ఏపుణ్యాత్ముడింత వెన్నపూస పూయ గలడు?
ఎప్పటికీలోకంలో పాపాలకీకారణ్యం
తుప్పలు ప్రక్కలించి ఏ మహాత్ముడు
తొలిపూలతోట వేయించగలడు?

* *

ఇరుగింటిలో ఇరులు తిరులెక్కి
పొరలుతుండగా
పొరుగింట పరమవేదనానాట్యం
బరువుగా అడుగులు వేయగా
చెఱగూర్చైన కొంపలు కడగండ్లు చెఱగుతుండగా
తరుణారుణసుఖమయ రేఖానఖంపచ
పరిరంభణప్రాప్తికై
కరుణాక్రందనం చేస్తున్న
ధరణీజనహృదయధరణీధ్రం ఱెక్కలు
చతాలున కరాసితో తెగ నఱికివార వేస్తుండగా
ఎప్పటికి శాంతి?
ఎన్నటికి శాంతి?

*

ఆదికమఠం విదవిద లైపోతున్నది
ఆదిశేషుఫణామండలి పిటపిటలాడుతున్నది
దిక్కరికుంభస్థలివిపాటనం పొక్కుతున్నది
ఎక్కడెక్కడ కులపర్వతాలకుమ్ములో
క్రుంగిపోతున్నవి.
చుక్కచుక్కగా సప్తసముద్రాలు
ఆరిఆవిరవుతున్నవి
మహామాయామలినచేలాంచలం
విహాయసం పై విప్పుకొని కప్పుకుంటున్నది
ఎప్పటికీతమను
ఇంకిపోవుట?
ఎప్పటికీదిగుళ్ళపుట్ట
ఈగిపోవుట?
ఎన్నటికిక వెలుతురు?
ఎన్నటికిక వెలుగు?
ఏదీ రాదేమిటి? ఏమైన దా వెలుగు?
ఏమైనది? ఏమైనది?

* * *

అందుకే ఈ ప్రతీక్ష.
అందుకే ఈ నిరీక్ష.

# భూ ప్ర శం సా

**శ్రీ యస్. సి. హెచ్. కృష్ణమాచార్య**



శ్రీమచ్ఛేషఫణాగణాగ్రనిభృతబ్రహ్మాండభాండాత్మికాం
నీవృత్పత్తనపల్యహార్యవిపినప్రాచుర్యసంశోభితాం
సస్యశ్యామలకోమలాంబరధరాం సౌగంధ్యసంవాసితాం
దిగ్వేదండకరార్చితాం వసుమతీం త్వాం నౌమి విశ్వంభరాం.

ప్రాణాయామవిధౌ స్మరంతి భవతీ మోంకారపూర్వం ద్విజాః
ద్రవ్యేష్వాద్య ముదాహరంతి నవసు త్వాం దేవి నైయాయికాః
ఈష్టే కః ప్రతిగంతు ముత్తమగతిం త్వయ్యంతరేణోద్భవం
ఏతాదృఙ్మహిమాన్వితాపి నచల స్యాహో ఽంబికే మేదిని.

వైకుంఠ స్తవనాయకః కమలజానీశేసపత్న్యా వహో
బాలార్క స్తిలకం శశీతు ముకురో రత్నాకరో మేఖలా
వింధ్యశ్శైతవగ స్స్తనౌ త్రిపథగాముఖ్యా స్తటిన్య స్స్రజః
మాహాత్మ్యం తవ వేత్తి కోభగవతి క్ష్మాదేవి తుభ్యం నమః.

గైర్వాణీ ప్రబభూవ కేవలమయే వాణీ సుపర్వాలయే
కిం త్వేషా నవివర్ధితా నగమితా తత్రప్రకాశం క్షితే
నూనం చక్రు రలంకృతాం రసమయీం దైవీం గిరం త్వత్సుతాః
వాల్మీకిప్రముఖర్షయః కవివరా శ్శ్రీకాళిదాసాదయః.

భువం బిభ ర్తీతి కథాం ప్రకల్ప్య
వదంతి శైలం మహిః భూభృదాఖ్యం
ప్రవృత్తి రేషా కథ మన్వితా స్యాత్
విశ్వంభరా త్వం ఖలు తత్వతోఽంబ.

ఏకో మహేంద్రో దివి రత్నగర్భే
త్వ య్యుద్బభూవు ర్బహవో మహేంద్రాః
నైకోపి యాగౌఘవినాశకారీ
నైకోపి సత్తాపనతాపకారీ.

సర్గక్రియాయై హరినాభిపద్మే
సంభూయ కృత్యాదిమదుఃఖభాజా
ధాత్రా తపో యచ్చరితం తదాసీత్
త్వయా కృతార్థం కిల భూతధాత్రి.

ప్రత్యక్షమే వాంబ మమ ప్రమాణం
సమ్యక్ప్రణమ్యా మవగమ్య నిత్యం
ప్రదక్షిణీకృత్య భవంతి పుణ్యాః
త్వా మబ్జబంధు శ్శశభృచ్చ తారాః.

క్షాంతి స్తే కియతీతి వచ్మి జనని త్వద్గర్భజాతా స్సమే
బాధంతే పదఘట్టనై ర్భగవతీం త్వా ముర్విసర్వం సహే
నిత్యంవై న తథాపి కుప్యసి కదాప్యాహో తవై వాగ్రహో
జాతశ్చే ద్విలయో భవే త్ప్రతిపదం జాయేత సర్వం నభః.

భుంక్తే సూను ర్మృద మితి పరిజ్ఞాయ గోపాంగనాభ్యః
ధృత్వా గాఢం కర మకరుణం తర్జయంతీ యశోదా
బాలే తస్మి న్వివృతవదనే త్వా మి లేం౨తస్సమీక్ష్య
జిత్వా మోహం సపది పరమబ్రహ్మవేత్రీ బభూవ.

గర్జన్ భీమతరం ప్రసార్యజలధిః కల్లోలబాహోచ్ఛ్రటాః
లోకానాక్రమితుం జవేన మహతా చోత్థాయ వేలాంతికే
స్మృత్వా త్వాం పృథివీ మనర్హ మితి తద్జ్ఞాత్వా స్వకం చేష్టితం
నమ్రీభూయ శనైశ్శనై ర్గతజవః పశ్చా త్పరావర్తతే.

లోకే స్వయంభూగణనాప్రసంగే
నిర్దిష్ట మేత ద్విబుధై ర్విశేషైః
విష్ణు స్స్వయంభూ ర్గిరిజా స్స్వయంభూ
ర్యత్ర స్స్వయంభూ స్త్వమసి స్వయంభూః.

ఆచ్ఛాద్యచ్ఛత్రమేకం చిరమపి వసుధాం త్వా మనేకే నృపాలాః
సంత్రాతుం బద్ధభావా అహమహమికయా త్యక్తదేహానురాగాః
ఆయో ధ్యాన్యోన్యమంతే విజయవిలసితా రాజ్యలక్ష్మీసమేతాః
ఆజౌ కృత్తాస్తు వీరత్రిదివసు ఖరమాశ్లిష్టకంఠా భవన్తి.

జగత్పవిత్రేతి సమస్స్యతే గౌః
కో హేతు రత్రేతి విచార్యమాణే
అవ్యాజ్యలై తన్మమ కాశ్యపి త్వ
త్పర్యాయ గోశబ్ద సమీరితత్వాత్.

ఘూసేన గాః క్షితిసురాంశ్చ సమిత్కుశాద్యైః
రాజ్ఞస్తు రత్ననిచయై ర్వణి జోఽర్థజాతైః
సస్యైః కృషీవలజనా నవిభేదభావం
సంతర్పయ స్యహహ!! తత్తదభీష్టదానైః.

యా సర్వైరపి రంజితా రసచయై ర్వ్యాసర్వగంధై ర్యుతా
తత్తాదృగ్గుణశోభితాం భగవతీం త్వాం ప్రాప్యజాయా మహో
ధాత్రీదేవి! నిగద్యతే ఽఖిలరసో నిశ్శేషసౌగంధ్యభాక్
ఇత్యేవం పరమః పుమాన్ శ్రుతిశిరస్సీమంతినీభి స్సదా

యః ఖేలయా చుళుకితం కృతవా న్పయోధిం
ప్రాదుర్బభూవ సఘటే మునిసార్వభౌమః
త చ్ఛాణుభి ర్ఘట మసృజ్యత తే పరాగైః
ఆరాధ్యతా సుమహితా మహి తావకీనా.

మాయావటో స్త్రిపదచంక్రమణప్రభావా
చ్ఛారే రథో నియమితో ధరణేః బలేంద్రః
సస్యాదిభి శ్శుభకరీం భవతీం ప్రణంతు
మాయాత్యుదాత్తకుతుకః ప్రతివర్ష మంబ!

ఊర్ధ్వేషు పుణ్యవిభవైః పితరో వసంతో
లోకేష్వపి ప్రతిసమం త్వయి తస్థివద్భిః
శ్రద్ధాశుభి ర్మహి! జనైః పరిదీయమానై
రర్చాదిభి ర్నియత ముచ్చగతీ ర్లభంతే.

విష్ణోః పదం వ్యవహరన్తి విపశ్చితః ఖం
ప్రత్యేతి మాదృగపరిష్కృతధీః కథం తత్
అర్చామయః పరమకారుణికో ముకుందః
సత్తాం కరో త్యనుపదం త్వయి తత్వతోంబ!

జలధరపటలవ్యాప్తాం
అబ్జజగత్కాంతిహేతుహంసగతిం
ద్విజరాజమండలాఢ్యాం
తవ మన్యే ప్రతికృతిం దివం ధాత్రి

త్వమేవ ఖలు కథ్యసే ప్రకృతి రిత్యభిజ్ఞై రిలే
ఋతూపచయశోభితా వివిధపుష్పరాగాంచితా
త్వయి ప్రసృతతేజసః పరమపూరుషా న్మేదిని
నిరంతరఫలాన్వితా ప్రసవధర్మిణీ పూజ్యసే.

వోఢుం సమస్తజగతా మవనాధికారం
మూర్ధాభిషేకవిభవస్య పరస్య పుంసః
ముక్తాతపత్రితదివ స్త్వముపే త్యనూనం
సింహాసనత్వ మయి పూరయసి ప్రభుత్వం.

జన్మాదిశూన్యోఽపి హితోఽపి సదా ప్రమోద
పూర్ణో వ్యసుప్తిమపదోఽపి విపంతిభామో
హేతుం ప్రకల్ప్యకిమపి త్వయి జాయమానో
లీలావినోదనపరో రమతే నిరాంతం.

# నా రా య ణా!

❋

శ్రీరాజత్ఫణిరాజతల్పశయనా! శ్రీకంఠముఖ్యామరా
ధారాంఘ్రిద్వయ! సంతతోత్సవలసద్ధామా! విభూమాధ్వసం
చారప్రాప్తవిదీప్తిముక్తపురుషాక్రాంతాధినంద్యోల్లస
త్కారుణ్యాదిగుణాధివాస! హతలోకత్రాస! నారాయణా!!

సంసారంబు త్యజించి సర్వమును నీస్వాధీనముం జేసి నిన్
సంసేవించెడివార లెందఱో ధరిత్రీ రాజిల్ల నారీకథా
సంసక్తుండ మమత్వదూషితుఁడ నా సాధ్యంబె ముక్తిం గనన్
హంసప్రాప్యపదారవింద! పరిపూర్ణానంద! నారాయణా.

సత మాశాగుణబద్ధుఁ డౌచు మృగతృష్ణం గాంచి కాసారమన్
మతిఁ బర్వెత్తెడివాని భంగి నిజతృష్ణాశాంతి సేకూరకే
హతుఁడౌఁ గాని నరుండు తావకపదధ్యానామృతాస్వాదన
వ్రతుఁ డై శాంతిపథమ్మునందుఁ జనఁగోరం డేల నారాయణా.

యమభృత్యుల్ నిశితాయుధప్రతతిచే నంగమ్ములన్ ఖండఖం
డము లౌనట్టు లొనర్చునత్తఱి విషణ్ణస్వాంతుఁ డై దిక్కులే
క మొఱల్వెట్టును గాని జీవుఁడు రమాకాంతా! హరీ! పూరుషో
త్తమ! యం చిప్పుడు వాకొనంగఁ దమి జెందం డేల నారాయణా.

ఆదిత్యాంతరభాసమాన! భువనాఖ్యాధార! పద్మాసన
ప్రాదుర్భావనిదాన! దానవమదప్రాచుర్యనిర్భేదకా!
ఖేదామోదవిదూర! కర్మచయసాక్షీ! మౌనిహృత్పద్మష
ట్పాదా! వేదశిరశ్శిరస్తటనటత్పాదాబ్జ! నారాయణా!!

చోరుం డీవని సాక్ష్య మిచ్చిరి మునీశుల్ గొపికావార మీ
వేరోజున్ మనముల్ హరించితివి కాదే! యింకఁ బోనిత్తునా?
పారంజూతువె? భక్తిశృంఖలములన్ బంధించి నాస్వాంత మన్
కారాగారమునందు ని న్నునిచి శిక్షంజేతు నారాయణా

వసుధాభార మడంప యాదవకులప్రాశస్త్యముం బెంపఁ బా
లసులం ద్రుంప వ్రజస్థయౌవతము నాహ్లాదమ్మునన్ ముంప సా
రసగర్భాదుల గర్వభంజనము నిర్వర్తింప గీతార్థముల్
వెస బోధింప స్వయంసముద్భవము గేశింగొన్న నారాయణా!

వానిలా

పహా! పంశికలనాద మోహపరితోవష్టబ్ధగోపీసమూ
హా! హాసమ్మగ్ధతరాననాంబురుహా! మాద్యత్కాళియౌద్ధత్యని
గ్రహా! లీలాధృతమర్త్యవిగ్రహా! విచిత్రవ్యూహా! నారాయణా!

అరిషట్కం బెదురయ్యెఁ జిత్త మను తే రాయత్తమయ్యెన్ హృషీ
కరయాభిద్రవవాజిరాజముల వీకం బూన్చి నా శాత్రవో
త్కరముం గూల్పఁగ జైత్రయాత్ర కిఁక సూతత్వంబు నీ వందుమే
నరుఁడన్ గానొకొ! నూఱుపాళ్ళను నరుండన్ నమ్ము నారాయణా!

ఆసమాప్తాప్రియుతరూప! పంకసహితం బౌ నామనోవీథి సం
తస మొప్పన్ విహరింప నీ కెటులు స్వాంత బొప్పు నీ నాదు మా
నసమే మానస మౌట భక్తిరసపూర్ణం బౌట రాయంచచా
య సతం బీవు చరించుటం దెపుడు లభ్యంబౌనొ? నారాయణా!

నిన్నుఁ జేరంగ ననేకమార్గములు క్షోణిం గల్పనం జేసి వా
నినిఁ జేకొంటకు వానివాని ఘనతం దెల్పంగ మామార్గమే
ఘనమస్మత్పథమే ఘనం బనుచుఁ దర్కం జేల? యేమార్గ మై
నను నిన్ జేర్చును గాఢనిష్ఠుఁ డయి యున్నం జాలు నారాయణా.

మారుండుం దన వాఁడిబాణముల నొంపన్ వేచియున్నాఁడు నే
నారాటంబున నీదు పూజనము సేయంబోవ, శిక్షింపుమా
క్రూరున్ వానిఁ దలంతు వేమొ! నిజపుత్రుం డంచు, న్యాయ్యక్రియో
దారుల్ సూడఁగ బోదుగా స్వపరభేదం బెద్ద నారాయణా!

ధరణిం గల్గు సమస్తమానవులకుం ద్వద్దర్శనం బిచ్చి త
ద్దురితౌఘమ్ములు దీర్చుకోర్కె గిరులందుం దివ్యవేషమ్ములం
దరుదారన్ బహునామరూపములతో నా యిందిరాదేవితో
స్థిరవృత్తి న్నెలకొన్న భవ్యగుణరాశీ! దేవ! నారాయణా.

పిహితుం డౌదువు చర్మనేత్రములకున్ వేదాదినేత్రమ్ములన్
బహురూపంబుల గోచరించెదవు నానానామముల్ దాల్చి లో
కహితుం డౌదువు సృష్టిరక్షణములన్ గాలుండ వౌ దీవు దా
నిహతింగూర్చుచుఁ జేతఁగాని పనియున్నే నీకు? నారాయణా.

ఏ నీదర్శనకాంక్షులై సతము యోగీశుల్ నిరీక్షింతురో
యే నీప్రాపునుఁ గొన్న దేవనికరం బేబాధలం బాసెనో
యే నీసత్కృపఁ గొన్న మాన్యుఁ డపవర్గేశత్వముం బొందునో
యా నీపాదము లాశ్రయించితిని నా కడ్డేమి? నారాయణా.

# శాంతి - కాంతి

శ్రీ దామరాజు పుండరీకాక్షుడు



శాంతి శాంతి యటంచు భూజనము లంద్రు
ధనికునవహంసతూలికాతల్ప మగున!
భోగిమానసోల్లాససరాగ మౌన!
శ్రామికునిసుఖనిద్రయా! శాంతి యేది!

ఒక్కొకం డొక్కరీతి నే యొక్కరోజు
నింటిబత్తెంబు దీర్చి నిద్రించుముందు
తాను నిల్లాలు పిల్లలు దైవమునకు
తమకృతజ్ఞత దెలుపు స్వాంత మది శాంతి.

మాయకాయంబునకు శాంతిమాట యొకటి,
మానసికశాంతి మరొక టాత్మకును శాంతి
వేరొకటి శాంతిలోకాంతి వెలుగు శాంతి
శాశ్వతానందశాంతి యీవిశ్వమునకె

చిత్తశాంతి !!

మలినవస్త్రంబు వీడి వేర్వలువ గట్టు
మానవునిశాంతి తత్క్షణికాన శాంతి,
నాటిదినవెచ్చమున కుబలాట ముడుగ
మూటతో సిల్లు సేరు టాపూటశాంతి.

వ్యావహారికధర్మనిర్వహణాయందు
లౌకికానంద మరసి వివేక మలర
ధాటి జరియించు టదియ యానాటిశాంతి
మానసికశాంతి కొక పరిమాణ మున్నె!

పసుల పొట్టలఁ గొట్టి తా ప్రబలిప్రబలి
ఎంత తన కున్న లోకుల నేవగించి
"దైవ మెవ డింక జగతిలో ధనము కన్న"
అనుచు మీసాలు మెలుపు ద్రోహ మొక శాంతి

పరభూము లాక్రమించుట
పరదారల దూరి మోహపరవశు లగుటల్
పరరాజ్యములకు దూకుట
నరహంతకులగుట శాంతి నరజంతులకున్.

ఆశ్రమబద్ధుడై పరము
నైహికరూపమునన్ గ్రహించి యెం
తో శ్రమ జేసి వాంఛలను
ద్రోసి పరాత్పరునంశ సర్వది
వ్యాశ్రయ మా సుధాశయ మ
టంచు ప్రపంచగతుల్ దొలంగు యో
గాశ్రమభాసికిన్ గలుగు
గా వరశాంతియు కాంతియున్ సదా.

సంసార మీదుచున్నను
కంసారిని మరువకుండ కలిగిన దానన్
హింసన్ దలపక హితము ప్ర
శంసించెడు తృప్తి పరుని శాంతిసుఖం బౌ.

### గృహము-గృహిణి:

సకలప్రాణులకును శాంతి స్వగృహంబు;
గృహమునకు శాంతి ఆయింటి గృహిణి యొకతె
గృహిణి గృహమును యజమాని కెంతొ శాంతి
శాంతిమాత్రమె గాదు విశ్రాంతి యదియ.

వేకువ లేచిన పక్షులు
ఆకసమున నెగిరి మొగిరి యటనట దొరుకన్
రూకలు గావవి, యేవో
నూకలఁ దమగూళ్ళఁ జేర్చు నోటన్ శాంతిన్.

గృహిణియే దీప మొక్కొక గృహమునందు
గృహిణి దిగజార యజమాని స్పృహకు రాడు,
ఇంటి యధిపతి తా నెంత బంటొ తెలుపు
కంటికిన్ పాప సతియె యే యింటనైన.

### లోక శాంతి

ఐహికార్భాటముల వ్యక్తి కలరు శాంతి
శాంతి గా దది హాంతకచర్య గాని.
సాటి మానవకళ్యాణసమ్మతముగ
వ్యక్తిగను శాంతిప్రకృతిప్రభాసము గద.

ధర గల మానవాళిఁ దమ
దార్ఢ్యమె మెండని విర్రవీగి కొం
దరు, తమజాతి గొప్ప దని
తక్కిన జాతులపైన పెత్తనం
బరయగ కొందరుల్, మతము
నం దభిమానము మేరమీరి కొం
దరును, ప్రపంచశాంతిని వి
నాశ మొనర్తురు దుస్సహం బహో!

వసుంధర భాగ్యవంత మని
స్వార్థసుఖంబులకై విశుద్ధసం
గరముల సేయు శూరులును.
కంటకులై తమప్రక్కవారి యూ
పిరి గొను ఘాతుకాధములు.
విశ్వవసుంధరసస్యసుందరా
భరణము దైవభాస మని,
స్వార్థమతిన్ దలపోయ రక్కటా!

భూమిని విర్రవీగి సభ
మున్ తమ కేల ధరించు ప్రజ్ఞలన్
సా మొనరించువారు గ్రహ
చారమునం దవరోధసాధకో
ద్దామపరాక్రమాతిశయ
దక్షులనుంచును మానవాళిపై
ప్రేమ నశించ పైకెగయు
వారును మానవహంతకుల్ గదా.

దేశదేశాలపరిధులు నాశమైన,
జాతిమతభేదకలతలు సన్నగిలిన,
చెనటిస్వార్థాధికారయోచనలు సమయ,
సర్వసౌభ్రాతృజగతీప్రశాంతి గాదె.

మనజునిప్రవృత్తి కొక్కొక మార్గమందు
శాంతి గలుగుట భ్రమయె: నిజం బెఱుంగ
శాంతిగా దది మానసజాడ్యమేమొ
పరులహింసించు నాశాంతి సరస మగునె.

మారణయంత్రసాధన న
మాంతము మానవజాతి నెల్ల సం
హార మొనర్తు నంచు మహి
తాస్త్రము లెత్తిన శాంతి యోనె ప్రే
మార సమస్తజీవులవి
హారము సల్పు ప్రశాంతచింతనా
ధారమహాత్మగాంధి మహి
తాత్ముని శాంతియె శాంతియౌ ధరన్.

గృహ గృహంబుల శాంతి
గ్రామ గ్రామంబులన్ శాంతి సంఘమున శాంతి,
సంఘశాంతియె దేశదేశాల శాంతి,
గాంధి వరశాంతి యఖిలలోకైకశాంతి.

**ఉపశాంతి**

కాయ మెట నున్న నాత్మ లోకంబు లెల్ల
రివ్వునన్ జూచుచుండు నిద్రించువేళ,
ఇంక శాశ్వతనిద్ర నదేవిధంబొ!
శాశ్వతానందమున నె ప్రశాంతిగనునొ!
మన యెఱుగలేము దైవమే మనకు శరణు.

# ఆత్మార్పణ

## శ్రీ భాగవతుల వేంకట సుబ్బారావు



కనుఁగొనఁ గల్పజీవితము గల్గిన
　　వేఁడియు, జన్మదుఃఖముం
బొనరుచు నూర్ధ్వలోకమును
　　బొందుటకన్న నిమేష మాయువుం
డి· నపురుషార్థక ప్రదము నీరజనాభు
　　పదంబుఁగూర్చు పా
వన **భరతావనిన్** మనుజభావముఁ
　　బూనుట యుత్తమంబగున్.

—భాగవతము

భారతమాతా సహస్రప్రణతులు!!

మేము నీ బిడ్డలము. అజ్ఞులము. అన్నెము-పున్నెము ఎఱుఁగని పసికూనలము. కష్టమో సుఖమో కన్నావు. కంట వత్తిడుకొని పెంచావు. ఆటలు మాటలు నేర్పావు. అచ్చట ముచ్చట తీర్చుకొన్నావు. లాలించావు. పాలించావు. గురువుల కప్పగించావు. వారును పంచాక్షరీ మంత్రంతో చదువునారంభించారు. మామంచిగోరి "గురుశుశ్రూషయా విద్యా" అని ఆదేశించారు. "చిత్తము స్వామీ" అన్నాము. నాటి గురువుల సేవామహత్త్వమేమో!! అంతలోనే ప్రసన్నులైనారు. అఖిల విద్యావంతుల మైనాము. వారి సెలవుమీద క్రమంగా గృహస్థాశ్రమ ధర్మాన్ని స్వీకరించాము. అప్పుడు నీవు "నాయనలారా! పెద్దవాళ్ళయినారు. ఇంకమీరు పూజ్యులయినట్లే. పరులు మిమ్ములను ముందురోజుల్లో ఆర్యమహాశయాది పదాలతో సంబోధిస్తారు. నేడు మొదలు విదేశీయులకు మీ ప్రజ్ఞావైభవమన్న గనుగుట్టుగాక! భారతీయుడన్న ప్రతిభావంతుడు అను అభిప్రాయము నిశ్శంకగా గలుగుగాక! నాగరికత మీ సొమ్ముగా చెల్లుగాక! బుద్ధిలో బృహస్పతిని, పరాక్రమంలో పరశురాముని మఱపించండి ఇదేతీరుగా బృందారకులఁబోలి సర్వగతుల ధీరోదాత్తులై ధీరోద్ధతులై, ధీరలలితులై, ధీరశాంతులై తీరు తీయముగా పేరుగనండి. ఉత్తమనాయకులై ఉర్వి నేలండి. ఆదర్శపౌరులై అలరారండి. సుగుణసంపద మీకిమ్ముగా వేద శాస్త్ర ప్రమాణాన్ని వీడకండి. సోదరభావంలో వాదాలు పెంచుకోకండి. మాతృభాషకే ప్రాధాన్యమీయండి. ఇతర భాషలను చవిచూడండి. వింతవింత విజ్ఞాన సుమమ్ములను వెదజల్లండి. అధికారంలోగాని, అనధికారంలోగాని అరమర చూపించకండి. విశ్వకల్యాణమే ప్రధానసూత్రముగ మెలగండి. పవిత్రహృదయాలతో సత్సంతానాన్ని కనండి. దేశమాతను మరచుట మీవంటివారి కుచితంబు కాదని మాత్రము తెలిసికొనండి. జన్మభూమిని వీడకండి. పొరుగింటి పుల్లకూరకై ఉవ్విళ్ళూరకండి. అందఱు అందలమెక్కాలని అనుకోకండి. పురాణప్రసిద్ధులైన విదురాదులు వచించిన నీతిశాస్త్రాలను ఏమరకండి, ధ్రువతారవలె కీర్తిమంతులై జగదాకాశమున వెలయండి; మాతృఋణ విముక్తుండే పుత్త్రుడు. దేశఋణ విముక్తుడే వీరుడు. ఇదుగో కత్తి. ఇదుగో కలము. శ్రీరస్తు శుభమస్తు అని నీ కరుణా కలిత హృదయంతో కరకమలముల నిమురుచు ఆశీస్సులిచ్చావు. అప్పటి నీదగ్గనభాగ్యమే భాగ్యము, అప్పటి నీ ప్రేమాశీస్సులే ఆశీస్సులు, మరపునకురావు. ఆనాటి నీ బోధామృతమునకు ముగ్ధులమై అందరము ఐక్యకంఠముతో 'సరే' అన్నాము. తదాదిగా సత్యాదర్శాలతో యథాశక్తిగా ప్రసిద్ధ చరిత్రతోనే జీవితాన్ని గడుపుతూవచ్చాము.

*　　*　　*　　*

అప్పటినే భారతావని ఉత్తర—దక్షిణ దేశాలుగా

విభాగమయింది. ఔత్తరాహులు ఆర్యులుగా, దాక్షిణాత్యులు ద్రావిడులుగా ప్రసిద్ధిగన్నారు. పల్లెలు—పట్టణాలు వెలసినవి. ఎవరికి తగిన వేషభాషలు, ఆచారవ్యవహారాలు పాడిపంటలు, ఒక్కటేమిటి మానవ జీవితావసరాలన్ని ఆవాతావరణానికి తగినట్లు క్రమంగా అభివృద్ధిజెంద సాగినవి. బుద్ధిమంతులు పుట్టారు. బలవంతులు ప్రభవించారు. భక్తులు ప్రాదుర్భవించారు - కవులు పుట్టారు- కావ్యాలు వెలసినవి. నాగరికత నలుదిక్కుల వ్యాప్తమయింది. బలవంతుడే రాజయినాడు. ఆసేతు హిమాచలందాక నిరాటంకంగా రాజ్యమేలుబడి జరిగింది. మాతృదేశం మఱపునకు వచ్చిందేమో! ఏమూలనో అప్పుడే స్వార్థచింతలసూపింది, ఇంకేమి! భిన్నభిన్న భావాలు-భిన్న భిన్నరుచులు ప్రజలలో మొలకలెత్తినవి ల్లరరాజ్యము లేర్పడ్డవి. చక్రవర్తులయినారు, పరులు వచ్చారు. సరిపాలకులయినారు. ఇక చెప్పెడిదేమి? చేసెడిదేమి? ఎక్కడవారక్కడ సర్వేజనాః సుఖినోభవంతు అనుకొన్నాము. చరితలు పెరిగినవి. శతాబ్దాలుగడచినవి. తరాలు చెల్లినవి ప్రజలు మారినారు - ప్రభువులు పోయినారు - రాజ్యాలు మారినవి - కాలానికి ముందుచూపేగాని వెనుకచూపు ఉండదుగా!

*

కవులు దేశచరితలు బండ్లతో నడిపారు-స్వర్ణయుగములు' సంధియుగములు, శతాబ్దాలతరబడి యేనాటిచరిత్ర ఆనాటి కొక భారతగ్రంథముగ తయారయింది. భారతదేశ సౌభాగ్యమన్న విదేశీయులకు పొరుగింటి పుల్లకూరఅయింది. వారి ధాకకు నల్లేరుపై బండినడక అయింది. భారతదేశం అంధకారం ఆలముకొన్నది.

అంతలో పరదేశీయ ప్రవాహం వెల్లువలైవచ్చి మమ్ములను ముట్టింది. దానిమీదనుండివచ్చు ఝంఝామారుతము ఇచ్చటి సౌభాగ్య సౌధాన్ని కూల్చింది. పాపభీతిగల భారతీయులు బ్రతుకుతెరువుకు దానినే ఆఘ్రాణించక తప్పింది కాదు. అది మొదలు అప్పటివారి రేఖావిలాసాదులకే కాకుండ నిత్యజీవనానికి మనస్సులకుగూడ అనిర్వచనీయమైన, అస్పష్టమైన మార్పులు తరంగములవలె ఎన్నో కలుగుతూవచ్చినవి. అవే పెద్దవై తరువాత పుట్టి పెరిగినవారికి, వారికి పుట్టినవారిలో ఇంకకొన్ని మార్పులు కలుగుతూ వచ్చివచ్చి చివరకు మామనస్సు లిప్పుడు పోలాహలమునే మేలనిపిస్తున్నవి.

*    *    *    *

ఏమని చెప్పమన్నావు? తల్లీ! శారదాంబా! ఇప్పటి మాచరిత్రమొక విషాదపాతఅయింది. అద్యంతాలులేవు. ఎవరికివారే స్వతంత్రులమయినారు. ఒకరికి ఒకరు చెప్పే రోజులు పోయినవి. పెద్ద పిన్నలలోని అంతరమే వ్యత్యస్తమయింది. కొందరు దానిని కలియుగధర్మము-ఇంతేఅన్నారు. కొంతమంది అది పాశ్చాత్య నాగరికతా ప్రభావమన్నారు. పిలువని పేరంటాలుగా ఒకవంకనుండి వేదాంతవిచారులు, 'ఓరోరీ! కాలము బ్రహ్మస్వరూపం. దానికి మార్పేమిటి? మన మనస్సులే మారుతున్నవి' అంటున్నారు. వీరిని ఎవరిప్పుడు బొట్టు కాటుకపెట్టి పిలిచారు? అయినా బోలెడంత పల్లపువేదాంతం గ్రంథాలలో ఉండగా వీరి మెట్టవేదాంతం ఎవరికి కావాలి? లోకంలో ఊహాపోహాలకేమి? అంతా—పొంతా? కదిలించితే చాలు తలకొకతీరుగా తమకవిత్వాన్ని వెలువరించి కలవరపెడతారు. ఏమైతేనేమి? ప్రజల చిత్తవృత్తికి రాజులహృదయాలవలె క్రొత్త ఒకవింత ప్రాత ఒక రోత అయింది. ఎంతమార్పో-అందులో ఎంతవింతో గమనించాలి తల్లీ!!

తులసీవనంలో గంజాయిమొక్క మొలిచింది. అచ్చని ఆవునేతిలో బట్టె నేయి మూడువంతులయింది. అది మొదలు దేశంలోని ప్రతిగృహము పూరిపాకపుడకనుండి బంగారందాకా విదేశవస్తువులతో నిండిపోయింది. వాని ముందు స్వదేశవస్తువుకు దివ్విటీక్రింద దీపంగతి పట్టింది. ఇంక వేషభాషల్లోనేమి-ఆచారవ్యవహారాల్లోనేమి రాజును జూచిన కంటితో మగనిని చూచినట్లయింది మా స్థితి. ఉన్నసుగుణాలకు ఉజ్జగింపుగలిగి ఉడికిపోతుంటే ఊడిపడ్డ గుణాలుతోడై మొదటికే మోసంతెచ్చింది.

ఈపరిస్థితులతోబాటు వ్యక్తుల మతులుగూడ సర్వవిధాల వాచామగోచరమయినవి. ఇప్పుడు బ్రదుకుదెరువుకే

ప్రాప్తమవుతుంది. వినిపించినంతయు, నోరేంద్రాదుల్వాయు మన్నట్లుగా మాస్థితి. పూర్వచరిత్రలో సువర్ణాక్షరములలో వ్రాయబడిన భారతజాతి గౌరవమర్యాదలు - శౌర్యధైర్యాలు కీర్తిప్రతిష్ఠలు - నేడు కలికానికైననూ లేవు నాటి దేశౌన్నత్యాలు నేడు లేవు. నాటి రాజులు-రాజ్యాంగాలు: గురువులు — శిష్యులు; కవులు - గాయకులు నేడు లేరు. కొన్ని శతాబ్దాల పాశ్చాత్య పరిపాలనలో దేశ మొక్క కొత్తదశకి వచ్చింది. ఆదెబ్బతో ప్రజల దృష్టికే లోప మావరించింది - మతులగతులే తప్పినవి - ప్రవృత్తులే విరుద్ధమైనవి - ఈ మొదళ్ళూడిన భారతభూమిలోని సంఘాలు, సంస్థలు, సంస్కారాలూ వక్రరీతుల గొడ్డలిపెట్టయింది. ఆచారవ్యవహారాలకు అవహేళన అధికమయింది - వేదాలెందుకన్నారో తెలుసుకునేవారే లేరు - కులగోత్రాలు పూర్తిగా కూలిపోయినవి: మతాలు తల్లక్రిందయినవి - గొప్పవంశాల లోనే కుళ్ళు బయలుదేరింది - చదువుకొన్న వారిలోనే సభ్యత నశించింది - అన్యాయానికే నమ్మకం ఇమ్మయింది- నైచ్యానికే ఆధిక్యత - అల్పునికే అధికారం. అక్రమార్జనదానికే ఆస్ఫాటం, హంతకుడే పెద్దమనిషి ధనవంతుడును, మంచికి సంకోచం కల్గింది - పాపానికి వెఱపు సన్నగిల్లింది - సత్యశౌచాదులు సోదికికూడా రావు - సహనమెక్కడనో, ఏవంకబట్టిన అధర్మము, అవినీతి, అశాంతి, స్వార్థము ఇత్యాది దుర్గుణపిశాచాలు తాండవానికి నాంది ప్రారంభించినవి. ప్రత్యణువులోను విశ్వామిత్రము ప్రతిధ్వనిస్తున్నది. పాపుడెవడో — పుణ్యుడెవడో, మంచి ఎక్కడో చెడ్డఎక్కడో అర్థంకాకుండా పోయింది. ఇతర దేశాలలో ఎన్నోజన్మలెత్తి తపస్సు చేస్తేగాని భారత భూమిలో జన్మలభించదు- అన్నాడు వ్యాసభట్టారకుడు. అట్టిచోట పుట్టికూడ ఇంత మూఢమతులుగా తయారు కావడం ఎంతశోచనీయము!! సుమారు పాతిక, ముప్పది సంవత్సరాల నుండి భారతజాతి ఆర్థికంగా, రాజకీయంగా, సాంఘికంగా, నైతికంగా, వైజ్ఞానికంగా ఏరూపమైన చరిత్ర ప్రోగుచెయ్యలేకపోయిందంటే ఎంత హాస్యాస్పదం? ఎంతఘోరం? వేదశాస్త్ర పురాణప్రమాణాలు పండితులకే ముక్కువిరుపయింది. వారి శాసనాధికారాలను చోటేది ? ఈ మహాప్రళయంలో కులము - గోత్రము మతము - ఏడడ్డుబట్టినవో !! దైనందిన, జీవితాకాశం-ఆడకు మగకు రేకెత్తుచున్న దవేష భాషావ్యామోహ వాయువులతో గగ్గోలెత్తిపోవుచున్నది. అర్థహీనము - అయోమయము వేదిక లమీద విబుధులను మించి మాట్లాడుట, స్వస్వానుష్ఠానంలో ఆతురులను మఱపించుట సామాన్య కార్యక్రమమయింది.

తలపోత

పెద్దలు - అనేవారికి ఇంత ఎత్తుకు పైఎత్తులలో పంచతంత్రంలోని కాటకపాటకులు - కరటక దమనకులు ఎందుకు చాలరంటే నమ్మాలి. వీరే లౌకికులని కొందఱి వాదన. ఆహాహా! వీరికి ఏదేవుడు ప్రసన్నుడౌతాడో!! సమస్తకళావిలాసాల్లోనేమి. పెద్దరికం లోనేమి, విశ్వదాతృత్వంలోనేమి, విశాల భావాలలోనేమి, సర్వవిధాల నక్షత్రాలలో చంద్రుడులాగ వెలుగవలసిన ఈపవిత్ర భారతజాతి నేడొక విజాతీయ వేషభాషలకు ఆచార్య వ్యవహారాలను అనుకరిస్తూ స్వజాతిరూపాన్ని, ధర్మాన్ని పోగొట్టుకొని రెండువడ దీనాతిదీనంగా క్రుంగి కృశిస్తున్నదంటే ఒక్క పెద్దమనిషి కంట తడిపెట్టడు. కారణం గ్రహించడు, మారణహోమం ప్రారంభించడుసరిగదా తానుగూడ 'తంధాన' అంటూ తాళంగొట్టుతూ గోవిందలు కొట్టుతాడు. ఎంత నైచ్యం, ఎంతశోచనీయం!! ఎప్పటికో జ్ఞానోదయం! ఈపరిస్థితులను పరిశీలిస్తుంటే ఈ మాజాతి ఎన్ని శతాబ్దాలుగా దుఃస్థితికి వచ్చిందో మరల అన్నిటికి పదిరెట్ల శతాబ్దాలకు గాని తొల్లిటి వైభవాన్ని నిలబెట్టుకో లేదేమో అనిపిస్తుంది. అప్పటికి అపనమ్మకమే! క్రొత్తదనము - క్రొత్తదనము అని కోరుట, ప్రాతలోకి ప్రవేశించుట ఇది నేటి విమర్శకుల విజ్ఞానసంపద.

ఇంతదీనస్థితిలోగూడా జరిగే చిత్రాతిచిత్రమైన సంఘటనలకు అంతేలేదు. ఆశా పిశాచాలకు అగ్గమగుట-ఆచరణ సామగ్రికి దూరమగుట. ఇంకేమి కావలెను ?

కని విని ఘోరకృత్యాలు రాక్షసులెవ్వరో అనుకొనుటతప్ప సోదరులముగదా అందఱమును. మాలోమాకే లంచగొండితనము. ముక్కుమొగము చూడరు. ఎంతహేయము. క్రిందనుండి పైదాక అధికార రంగంమీద నటించే మాయానాటకపాత్రదారులను ఇక వర్ణించేపనేలేదు. ప్రతి ఒక్కడు విశ్వామిత్రమార్గాన్ని సముపార్జించాడు. ఇంట

గాని బైటగాని ఒక క్రమశిక్షణలేదు. ఎవరికార్యము వారు నిర్వర్తించ పాటుపడరు. పగలకొలకే వారు ఉద్యోగము చేయుట అని ప్రత్యేక ప్రకటన. ఆహాహా! ఎంత మహోపకారులైనారు తల్లీ నీబిడ్డలు!! సిగ్గులేదు. ఆంధ్ర ధూర్తత్వంలో అందెవేసిన చేతులై, దూషణ భూషణాలలో ముందడుగు వేస్తూ ఉత్తరకుమార ప్రజ్ఞలలో ఉత్తమశ్రేణి గడిస్తూ ఆకాశ పంచాంగానికి కర్తృత్వం వహించారు.

దారినిపొయ్యే శనిగ్రహాన్ని ఊరకే పిలిచి తెచ్చుకొనుట ఒక పనిఅయింది. ఆలు మూడుకానీ, మూడు ఆలు కానీ మామతమేమాది. అన్నంతిన్న ఇంటికే కన్నంవేద్దామన్న పద్ధతి ప్రస్తుతం మాకు అమలులోనున్న వ్యవహారం. మంచి మాకు ఎదురుచుక్క అయింది. చెడ్డసర్వస్వ మయింది. ఆవిశ్వాసమే ఆహారంగా జీవయాత్ర సాగిస్తున్నాము. అశాంతిమయ సౌధాలలో మానివాసం కల్పించుకొన్నాము. మూర్ఖలోకము!! 'భారతజాతి' అని అవసరం వచ్చినప్పుడు ఆత్మస్తుతులకు అలరింతలు చెందుట మాత్రము ప్రస్ఫుటమగుచున్న దేకాని పరోక్షమున ముందడుగు వేస్తున్న విదేశీయులచే సకలవిషయాలలో తృణీకరింపబడుట కానకున్నది. పెద్దకు పిన్నకు రంధ్రాన్వేషణతత్పరతయే ఉద్యోగము. ఎవరికివారు సత్యసంధుల మనుకొందురు. అట్టిచో ఇంత పాప మెచ్చట పండుచున్నదో గ్రహింపజాలకున్నాము. మహాత్ములు, ఆంధ్రరత్నాలు, ఆంధ్రకేసరులు, విశ్వదాతలు మాకంటికి ఇంపుగారు. మా యీ ఘోరకృత్యాలకు ఒక్కొక్కటి తలచుకొనుచున్న గుండెలవిసిపోతున్నవి. వీనికి ఏదేవుడు మెచ్చి వరాలిస్తాడో తెలియదు. ఇంకా బోలెడంత ఉంది. ప్రస్తుతం ఒక్కముక్కచెప్పి విరమిస్తాము. దేశానికి భావవికాసం. అది పంథాతప్పింది. ఈ అనర్థాలు దాపురించినవి అని దుఃఖము పొంగి పొరలి వస్తున్నది. కన్నులు మిఱుమిట్లు గ్రమ్ముచున్నవి. నానాటికి చీకట్లు అలముకొంటున్నవి. కంటికి మంటికి ఏకధారా! ఏది క్రొవ్వడి?

తల్లీ భారతజనయిత్రీ! నిన్నెంత శ్రమపెట్టుచున్నాము? కన్నతల్లివి కాబట్టి బిడ్డల అవినీతి భరిస్తున్నావు. కాలాంతరమున మా కీడుపక్తి చెందుయోగ మున్నది. జరుగుచున్నది. మొదట తల్లితోబాటు పిల్లలు. తరువాత పిల్లలతోబాటు తల్లులు దా! ఎంతకాల మీ ప్రవాహ వేగములో కొట్టుకొని పోవుదుమో తెలియదు. ఏనాటికైన మంచి రాకపోదు. ధృవతారకలవలె మేము వెలయకబోము. ఏయెండ కాగొడుగు పట్టునలె నన్న సామెతకు స్వాధీనమై, కల్లిబొల్లి కబుర్లతో కాలయాపన చేస్తూ రసాభాసపు పార్టీలతో రాచకార్యాలు జరుపుచున్నాము. ఇంతగోడు వెళ్ళబోసి గోపంకంతే మమ్మే మేము మరచామన్న బాగోవో! బుద్ధివచ్చింది. దారి కొంత మార్చుకుంటున్నాము. ఇప్పుడిప్పుడే కుదుట పడుచున్నాము. స్వాతంత్ర్య ఫలాన్ని అనుభవంలోని తెచ్చుకుంటున్నాము. ఇప్పటికిని నీ అమృతరూపం తలంచనిదే నీమంగళ చిహ్నానికి నమస్సులర్పించి కీర్తించనిదే మేము ఏకార్యం ప్రారంభంచేస్తున్నాము - ముగింపు చేస్తున్నాము? మా సర్వస్వము నీవే. ఇవే మాతనువులు - ఇవే మా ధనములు. నీళ్లముంచిన, పాలముంచిన, నీవే. నీయానాటి ఆశీర్బలమే ఎన్నిగండములనో తప్పించినది. సజీవులనుగా చేసింది. మరల మనసార ఒక్కసారి తలయెత్తి మమ్ము ఆశీర్వదింపుము. కొండంత పత్రి పెట్టగలమా? అమ్మా, క్షమించు అపరాధులము. పాపులము. తోడిమకు కాయ బరువగునా?

తల్లీ - రక్షించు రక్షించు
ఇదే ఆత్మార్పణము
ఇంకనైన వెలుంగిమ్మ!!
'అన్యథా శరణం నాస్తి'.

# శ్మశానబాల

శ్రీ కోటభట్టరు వేంకట రంగాచార్యులు



దయ్యాలు భూతాలు దైత్యాదినికరంబు నిజభృత్యగణము లై నిలుచు నీకు
కీయంచు క్వణియించు కీచురాయిగములు గానకోకిలము లై గఱపు నీకు
కంకాళశకలాలు కలిగించు మోదంబు నాటవస్తువులుగా నమరు నీకు
నల్లేరు దవన మై జిల్లేడు మల్లికాముకుళమ్ము లనురీతి పొసగు నీకు
పన్నగంబులు తమతమ పడగ లెత్తి నాట్యకర్త్రియలకరణి నటన సల్ప
సంశయం బేల యింక శ్మశానబాల గరళకంఠుని యుంపుడుగత్తె వేమొ.

గగనంబు చుంబించి ఘనముగా భాసించు కలధౌతశైలంబు నిలయ మగును
కమనీయగుణరాశి కారుణ్యవారాశి త్రైలోక్యపూజిత ధర్మపత్ని
సాగరకాలుష్యసంహార మొనరింప బూనిన జాహ్నవి ముద్దుబరణి
రతనాలప్రభలీల రాజిల్లు సువిశాలనగసీమ సౌందర్యనాట్యశాల
కాకయున్న నిన్నింటను కాల దన్ని జడలు ముడివైచుకొంచు నీ గడపలోన
పాదచారి వై కావలివానివోలె తిరుగునా! నిద్దురే లేక పురహరుండు.

పట్టుపీతాంబరా లట్టు ఈశ్వరుని మై నెట్టితోలును గట్టబెట్టినావు
రజతపాత్రలలోన భుజియించు గంగాపతికి పుఱ్ఱె చేతి కందిచ్చినావు
మణిరత్నసౌవర్ణమాలలం దీయించి యెంచి పాము లలంకరించినావు
చందనలేపనానంది యా శూలికిన్ బూడిదపూతలే పూసినావు
వృషభరూఢు డై హిమగిరివీథులందు కరము సంతుష్టహృదయు డై తిరుగుచుండు
శివునె తుదకు భిక్షాచార్యు జేసినావు ఏమి చేయుదు రిక సాను లింతకన్న.

మఱచిపోయితి నే నొక్కమాట నిదిగో చెవుల నిక్కించి యాలించు శివునిసాని
కపటసన్న్యాసివర్యునికరణి నీవు బూడిదను దీసి మేనన బూసినావు.

దాతల- సప్తసాగరపదావృతభూరివిశాలధారుణీ
నేతల- భారతీసుతుల- నిస్తులసాహసగుణ పసల్కులన్
ప్రేతల జేసి కాల్చుకొని ప్రీతిగ మెక్కుట నేర్చియుంటి వే
రీతి యుగంబులాదిగ ధరిత్రి జెలంగగ నట్టహాసముల్.

ఆకలి తీర లేదా! యెద నాసలు సుంతయు తీర లేదా! నీ
వాకిట నూగులాడెడి కపాలపుమాలలు చాల లేవా! నీ
వా కమలాసనున్ గెలువ పందెము వైచితివో! శ్మశానమా!
శాకినిఢాకినీపతికి ''సాని నే'' నను దుష్టగర్వమో!

# నాలోని నాదాలు

శ్రీ కుందుర్తి

❖

౧

మూడునెల్లక్రితం ఓ రోజు
మృత్యువు వచ్చి పిలిచింది
ఏడునాళ్ళహోరాత్రాలు యీ దేహాన్ని గెలిచింది
చివరిరోజు వెడుతూ వెడుతూ
సిగ్గుపడుతూ అడిగింది.

"ఏం జేస్తావు యింకావుండి? వెడదాం రా మా వూరు!
ఉన్నకొద్దీ బ్రతుకుతో ప్రతినిత్యం పోరు
ఉద్ధరించను లోకాన్ని ఎంతమంది లేరు?"

"ఎవరు నువ్వు?" తెలీనట్లు ఎదురు తిరిగాను నేను
"ఎన్నెన్ని యుగాలైంది నేను మొక్కగా మొలిచి?
పూవులా పరిమళంతో ప్రతివాణ్ణి గొంతెత్తి పిలిచి
ఏమిటి చెప్తున్నాను
వడ్లగింజలోది బియ్యపుగింజ!
ఎందరో చెప్పిందే,
దాదాపు అందరూ ఒప్పిందే."

"మ రెందు కీ బాధ?"

"నీకూ బాధ!
నాకు గుండెలో తళుక్కు మంటున్న బోధ
అంటాను అన్నమాటే; చెప్తే వినని లోకంకొరకు
చేసే త్యాగంలా బ్రతుకుతూ
ఉంటాను ఉన్నచోటే!'

ఒళ్ళంతా కండ్లుచేసుకుంటున్నట్లు
గచ్చకాయలంత మచ్చలతో
భయంకరంగా చూసింది నన్ను
ఉరుములా హూంకరించి
ఊగుతూ, సాగుతూ, అటూ, యిటూ.
వెర్రిగా, వెకిలిగా వికటాట్టహాసం చేసింది:

గది కదిలిపోయింది
అదిరిపడింది మంచం
కిటికీతలుపులు చటాలున మూసుకున్నాయి
బజారులో గాలి స్తంభించింది
భయపడ్డారు జనం!

అవతరించిన సత్యంవంటి ప్రసన్నమైన చిరునవ్వుతో
ఆవేపు చూసేసరికి
అదేఃపోత; తిరిగిచూడదు!
దేవుడికి మారుపేరైన తెలివిలా చూసేసరికి
అదేఃపోత; తిరిగిచూడదు.

సగర్వంగా చెప్తున్నాను; సాగరం భూగర్భం కోసేచోట
గుండెలమీద ఆనించి కూలీలు కొండరాళ్ళు మోసేచోట-
పాతఓడలు పెనుతుపానుకు పగిలిపోయే రీతిలో
అప్పులతో కూలి కుప్పైన పూరిండ్లకు
ఆశల కప్పులు వేసే నీతిలో—
అందులో నే నున్నాను.

బాలసూర్యుని లేతకిరణాలచరణాలకు స్వాగతం చెప్పి
వినువీథి చేసే రంగుమబ్బుల విందులో నే నున్నాను

సగర్వంగా చెప్తున్నాను; చల్లని సాయంత్రపువేళ
రాలిపడిన పూలకోసం జాలిపడే గుండెవాణ్ణి
అనుభవం అందుకోలేని
అందంలో నే నున్నాను;
భవిష్యత్తుకొమ్మమీద వాలిన
పక్షుల బృందంలో నే నున్నాను

సగర్వంగా చెప్తున్నాను; సృష్టికాంతకంఠంలో
ముప్పేటగా మలిచిన కాలం మూడుపాయలు కలిసినచోట-
సంగమంలో నే నున్నాను.

వాక్యార్థంవంటి భూతకాలం వెనకాల
దాక్కున్న ధ్వనివంటి వర్తమానవాహనంమీద
పరనిర్వృతిప్రాయమైన
భవిష్యత్తుకు నాపయనం.

నాటకంలో నాయకుడిలా ప్రతిరంగంలో నే నున్నాను
రక్తికట్టడంలోనేకాదు,
రసభంగంలోనూ వున్నాను.

ఎప్పుడో, ఎక్కడో ఒకడు
పిలుస్తాడు ఒంటరిగా నన్ను
వాడు- అర్థాల అద్దాలలో లోకం
తన్ను తాను చూసుకునే కన్ను.

నిజం నిజంగా భాసించదు; నీ వనే రిక్షాలో ఎక్కి
ముసుగేసుకుంటుంది ఘోషాసుందరి
పరపురుషులు చూస్తా రని భయంవేసి కాబోలు
పాపం, భగవంతుని ముద్దులభార్య!

అప్పుడప్పుడు తొంగిచూస్తుంది ఆశగా నాకలం వేపు
దూషణభూషణలు పట్టని నాసంకల్పబలం వేపు
ఆమెను నేను ప్రేమిస్తాను;
అనుకోండి కాముకుణ్ణని
ఆ పరదా తొలగిస్తాను;
అనుకోండి అతివాది నని.

నీడను పట్టుకోబోతున్నట్లు
నే నేదో వెతుక్కుంటాను నిత్యం;
రిక్షాలోంచి తొంగిచూసి
కిలకిలా నవ్వుతుంది సత్యం.

సహస్రకోటినక్షత్రలోచనాల సందీప్తకాంతితో
ఆకసం కనుసైగ చేసిం దంటే అలంకార మవుతుం దేమో
పునరుక్తి కాబోలు జూదేవి పుక్కిళ్ళుపట్టిం దంటే
వేదాలసుధవంటి
నాలోని నాదాల పాటలపాలు.

అలంకారాలభార మొల్లని
అతిసహజసౌందర్యవాదీ!
నిజం నిజంగా కనిపించే
నీకవితాశాఖమూల మేదీ?

కోపం లేదు నీమీద నాకు
కోర్కెలు రాలి పడుతున్న ఆకులుగా
జీవితం మోడైన చెట్టుగా
జీర్ణించుకున్న సమస్తసుఖదుఃఖాలు శిశిరంగా
గడుస్తున్న కాలం నడుస్తోంది నామీద.

శాంతి

మరుజన్మ వసంతంలోని
చిరునవ్వుల చిగురింతలకోసం
ఇప్పుడే పట్టిన తపోదీక్షగా
ఎదురెక్కింది బ్రతుకు.

గోడవెనకాల నక్కి శత్రువు రహస్యం వింటున్నట్లు
నేను చేసే ప్రతిపనిమీద నిఘావేశా వెందుకో?
కాలస్వరూపానివి నువ్వే కాదుగదా కొంపతీసి?

ఎవ?      అడుగు చెపారు
ఈజీవి దొంతిలో ప్రవేశించాక
జాగా ఊహ తెలియనప్పుడు సాగిన జీవితం పోను
ప్రతిరోజూ తనలోపల, నీ
ప్రతిబింబం చూసుకొంటున్నాడు,

పిలువని పేరంటానికి వెళ్ళే తత్వం కాదుకనుక
ఎక్కడో: ఏరోడ్డుమలుపులోనో
ఎప్పుడో: ఏనడిరాత్రిలోనో
తప్పతాగి వీధిలో దొర్లాడుతున్న కార్మికుడి కనురెప్పలలోనో
వాడుకున్నవారందరూ వదిలేసినప్పటి
అనాథవనిత అందంలోనో
కాస్తో కూస్తో కనిపించి కనుసంజ్ఞ చేస్తే తప్ప
నీధ్యాస కలగదు నాకు,

మళ్ళీ నరజన్మ ఎందుకంటే
మనుష్యులంటే యిష్టం నాకు
దేవుడికంటే మనిషియిష్టం
దేశం యిష్టం- తెనుగు ఇష్టం.

# నాగార్జునాద్రి

శ్రీ "ధనకుధరం"



ఒకనా డిచ్చట బౌద్ధధర్మముల కాయుర్దాయమున్ పెంచి, నై
తికపుష్టిన్ సమకూర్చి, మానవుని జ్యోతిర్మూర్తిగా జేయు ప్రా
ణిక నాగార్జునపండితుండు వెలయించెన్ విశ్వవిద్యాలయ
మ్మొక డత్యద్భుతవాస్తుశిల్పవిభవం బుర్వ్యాల జంపాలగా.

ఆనా డెందరొ దేశదేశములవా రత్యాదరానన్ మహా
యానస్థాపకు ఘోషధీరసరహాస్యజ్ఞుండు నాచార్యు డౌ
శ్రీనాగార్జునుపాదపద్మముల సంసేవింపగా వచ్చి వి
జ్ఞానప్రాభవసిద్ధు లై గడపి రానందప్రభాతమ్ములన్.

పులిబొబ్బల్ వృకదమ్ములును రేపుల్ మాపు లేకమ్ముగా
కొలువుల్ చేసినచోట బౌద్ధపికమాకూతమ్ముగా శాంత్యహిం
సలు గానమ్మొనరింప నా డచటి పాషాణమ్ము లార్ద్రమ్ము లై
పులకించెఁ బహుధా తథాగతకళాపూర్ణస్వరూపమ్ము లై.

ప్రత్యూషమ్ము మొదల్ నిశాసమయపర్యంతంబు తత్త్వార్థసా
హిత్యవ్యాకరణౌషధీవివిధశాస్త్రీయప్రబోధమ్ములే
నిత్యక్రీడగ సాగ మ్రోగె నట మంజీరధ్వనుల్ గా అనౌ
చిత్యోచిత్యవిచారవాక్పరిధు లుజ్జీబట్టి కవ్వించుచున్.

నినదించెన్ సుమనోజ్ఞ మై త్రికరణానీకమ్ము ముప్పొద్దులం
దున; ఆచార్యశిరోమణుల్ త్రిపిటకాదుల్ నిత్యభాష్యార్థచిం
తన గావించిరి శిష్యసంఘములచేతన్; దుఃఖభూయిష్ట మీ
జనికిఁ శాంతిపథమ్ము జూపిరి అహింసాదివ్యతేజస్సులన్.

ప్రాచీనాద్భుతవైభవ మ్మిప్పుడు స్వప్నప్రాయమై లీలగా
తోచన్ నా మెదడింత లేవో అనుభూతుల్ పొంగి తత్కాలశీ
తాచైతన్యము సంక్రమించినటులన్ గర్వించి తద్భావనా
వీచీడోలల తేలియాడుదు మహావేశమ్ము పొంగారగన్.

# జయ పరాజయాలు



[మహాత్ముడు సాగించిన నవఖాళీ యాత్ర మానవజాతిచరిత్రలోనే మహాద్భుతగాథ]

అచ్చపు రాక్షసత్వమున కంకితు
లై ప్రతిజీవితమ్మునన్
చిచ్చు రగిల్చి గుండియలు
చీల్చి విమోహమతిప్రసక్తులై
ఉచ్చులు పన్నువా రెవర
హా! కనుగొండదె పాపచారిమై
వచ్చుచునున్న ఆముసలి
వాని; అదే మటు తెల్లబోదు రే?

శతవృద్ధాత డొకండు; మీరలు బలో
త్సాహంబు దీపించువా
రతిసంఖ్యాకులు; మౌనముద్రకలవా
డాతండు; మీరల్ ప్రచం
డతర్కాటములన్ దిగంతముల నూ
టాడించువా రాతడు
గ్రతకున్ చాలనివాడు; మీరు ప్రతిప
క్షక్రుద్ధశార్దూలముల్.

అది ఏమి గజగజలాడెద రా బక్క
చిక్కినవాని వీక్షించినంత!
అది ఏమి మూతపడ్డది నోటి కాబోసి
నోటి తాపసిని కన్గొనినయంత!
అది ఏమి క్రాగిపోయెద రట్టు లామంద
హాసుని మోమెదురైన యంత!
అది ఏమి పారెద రనదలై ఆ గోచి
పాతరాయండు కన్పడినయంత!

గుప్పిటకు చాలు తనుయష్టి నొప్పువాని
మూర్తి చూచియు చూడకమున్నె, పెద్ద
పర్వత మ్మొండు శిరముల పడినయట్లు
హృదయ మగులగ కుప్పకూలెద రదేల!!

జగము మండించి సర్వనాశనము సేయు
ప్రళయవిస్ఫూర్తిలోన పరాక్రమించి
హాలహాలము నుమియు వికటాట్టహాస
మేడ! ఎవరికంతమ్మునం దిరుకుపడియె?

సాయుధులు మీర లత డహింసాయుధుండు
సాగ్రహులు మీర లతడు సత్యాగ్రహుండు
మాయకులు మీర లాత డమాయకుండు
జయము వానిది— మరి పరాజయము మీది!

# నేను

ఏను వాల్మీకికవిని– నా కీ జగాన
పరమ కైరాత్యకర్కశబాణసహతి
హృదయ మెడబాసి దీనతాస్పదులు నగుచు
సాశ్రునేత్రాల శూన్యదిశాంచలాలు
కలయజూచెడి నిర్వాసితులు, వియోగ
శోకసంతప్తమూకతానేకజీవి
శాసహస్రముల్ సతము సాక్షాత్కరించు.

ఏను వాల్మీకికవిని –మదీయహృదయ
మెల్ల వేళల 'మానిషా' దేతి శాస
నోక్తి నినదించు– మామకీనోక్తిలోన
రాక్షసత్వమ్మదియు నమరత్వ మొందు.

ఏను వాల్మీకికవిని– నే నీ జగాన
రావణాదిమహాసుర ప్రథితదురధి
కారహంకార భయదగర్జారవాళి
రేకదుస్సహాకారకృ[illegible] నిరంకు
శత్రుకుటిలదుర్మార్గసమావిరోధి
తతి సమూలనాశనము ప్రత్యక్షముగను
కననగాని కలమ్ము చెంచను నిజమ్ము.

ఏను వాల్మీకికవిని– ఘోషింతు నేను
అమృతనిష్యంది సుకవితాఖ్యానఫణితి
మధురమధురాక్షరాలు సమన్వయించి
శతశతాబ్దము లెన్నెని సంచలించి
పుడమి ఎన్నిసారులు క్రొత్తపుట్టుకలను
గన్న, మాయని విశ్వవిఖ్యాతకలిత
సకలసుగుణాభిరాములచరిత లెల్ల.

# రామాయణము - మహాకావ్యము

శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం



వాల్మీకిమహర్షికృతమైన శ్రీమద్రామాయణము మోక్షదాయకమైన గ్రంథమని ముముక్షువులును, మహాకావ్యమని సహృదయశిరోమణులును భావించుచున్నారు.

«వాల్మీకిగిరిసంభూతా రామసాగరగామినీ
పునాతు భువనం పుణ్యా రామాయణమహానదీ.»

ఇట్లు భావించుట ఈనాటిది కాదు. ఈదేశమునకే పరిమితమైనదియు కాదు. ప్రాచీనమునుండియు నిది యిట్లే పుణ్యకథాస్రవంతిగా ఆరాధింపబడుచున్నది. ఎందరో పూర్వమహాకవులు వివిధరీతులుగా వ్రాసిన శ్రీరామునివృత్తాంతమును అనర్ఘరాఘవనాటకముగా వ్రాయుచు మురారి మహాకవి తన యత్నము నిట్లు సమర్థించుకున్నాడు.

యది క్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్యచరితం
గుణైరేతావద్భిర్జగతి పునరన్యో జయతి కః
స్వమాత్మానం తత్తద్గుణగరిమగంభీరమధుర
స్ఫురద్వాగ్బ్రహ్మాణః కథ ముపకరిష్యంతి కవయః

పూర్వకవులు చేబట్టిరని రామకథను విడచిపెట్టినచో అట్టిగుణోజ్జ్వలుడైన నాయకుడు లభించుటయెట్లు. శబ్దబ్రహ్మవిదులైన కవిపుంగవులు తమపాండిత్యమును ధన్యము చేసికొనుటెట్లు? అని ప్రశ్నించుకున్నాడు.

పోనిండు. రామకథాసారస్యమునుగూర్చి సజ్జనభృంగములాస్వాదించని మధుబిందువుల నపూర్వముగ తేగలమా అన్నచో అదియు హుళక్కియే. రసము నిత్యనూతనము. నిన్న కాసిన వెన్నెలయే నేడును కాయుచున్నది. రేపును కాయగలదు. చంద్రిక తన శైత్యమును ఆహ్లాదజనకత్వమును కోల్పోవుచున్నదా? అట్లే *రామకథాసుధాలహరియు రుచితరుగని మహాసాగరము. భోజుడు తన రామాయణచంపువులో నీభావము నిట్లు ప్రకటించుచున్నాడు:

«వాల్మీకిగీతరఘుపుంగవకీర్తిలేశైః
తృప్తిం కరోమి కథమప్యధునా బుధానామ్
గంగాజలైర్భువి భగీరథయత్నలబ్ధైః
కిం తర్పణం నవిదధాతి జనః పితౄణామ్.»

భగీరథుడు అవతరింపజేసిన గంగాజలములచే లోకులు పితరులకు తర్పణము చేయుటలేదా! అట్లే నేనును వాల్మీకి ఆలపించిన రామకీర్తిలేశముచే బుధులకు ఎట్లో సంతర్పణము చేయదలతును.

ఎవడు మహాకవి? ఏది మహాకావ్యము. కవి కాదలచినవ్యక్తిమీద పెద్దబాధ్యత కలదనియు ఆతడు నేర్వవలసిన విద్య లెన్నియో కలవనియు భామహుడు చెప్పుచున్నాడు.

నతచ్ఛిల్పం నతచ్ఛాస్త్రం
నసావిద్యా నసాకలా
జాయతే యన్న కావ్యాంగమ్-
అహో భారో మహాన్ కవేః

అవి యభ్యసింప నక్కరలేని శిల్పముగాని, శాస్త్రముగాని విద్యగాని, కళగాని లేదనియు, కవిపై దొడ్డభారము కలదనియు ఆతనిమతము. ఈయంశముపై వాల్మీకి స్వయముగ నేమిభావించెనో వాచ్యముగా నాతడు చెప్పకున్నను వ్యంగ్యమర్యాదచే సూచించినవాడయ్యెను. తననుగూర్చి

* ప్రస్తుతము ఆంధ్రప్రదేశప్రభుత్వమున సహకారశాఖామాత్యులుగ ఉన్న శ్రీ కల్లూరి చంద్రమౌళి గారు 'రామాయణసుధాలహరి' అను పేరుతో శ్రీమద్రామాయణమునకు ఆస్తికబుద్ధితో గొప్పవివరణము వ్రాసినారు.

యాతడు ప్రయోగించుకొనిన విశేషణమే దీనికి తార్కాణము. రామాయణమునందలి ఆరంభశ్లోకమునందే 'తపస్వీ' అని తనను నిర్దేశించుకొన్నాడు. నారదమహర్షిని తపస్స్వాధ్యాయనిరతుడనీ, వాగ్విదులలో శ్రేష్ఠుడనీ, మునిపుంగవుడనీ వర్ణించెను. దేవర్షియైన నారదమునిం బ్రశ్న పృచ్ఛచేయగల వాల్మీకి సాధారణవ్యక్తి యైయుండడు. కావున అతడును తపస్స్వాధ్యాయనిరతు డనీ, వాగ్విదాంవరు డని మనము ఊహించుటలో విప్రతిపత్తి లేదు. వాగ్విదు లనగా వేదజ్ఞులనీ, వారిలో శ్రేష్ఠు డని వ్యాఖ్యానింపబడినది. మహాకవి ప్రతిభాశాలి కావలె నని యాలంకారికుల మతము. 'శక్తిర్నిపుణతా'. ప్రతిభ యనగా నవనవోన్మేషశాలి యగు 'ప్రజ్ఞ'. ఆదికవియైన వాల్మీకి మహర్షి ప్రదర్శించిన కల్పనాశక్తి అనిదంపూర్వము. ప్రతిభతోపాటు వ్యుత్పత్త్యభ్యాసము లుండవలెను. ముఖ్యముగా వ్యాకరణశాస్త్రమునందు ప్రాచేతసమహర్షికి అభ్యస్తితభావము కలదని సూచన లభించుచున్నది. ఆంజనేయుడు రామలక్ష్మణుల సన్నిధానములో మొదటిమాటలు పలికినప్పు డాతని సంభాషణానైపుణికిని, వాక్యశుద్ధికిని వారు తలయూచిరి.

నానృగ్వేదవినీతస్య నాయజుర్వేదధారిణః
నాసామవేదవిదుష శ్శక్య మేవం ప్రభాషితమ్
నూనం వ్యాకరణం కృత్స్న మనేన బహుధా శ్రుతం
బహు వ్యాహరతానేన నకించి దపశబ్దితమ్

త్రయీసంపన్నుడు గాని ఈవిధముగా భాషించుట శక్యము గాదు. ఈతడు వ్యాకరణసమస్తమును బహువార మధ్యయనము చేసియుండును. పెక్కుపలుకులు పలికిన ఈతని నుడులయం దపశబ్ద మించుకేని దొరలలేదు.

మహాకవిలక్షణములలో తపస్వితను పేర్కొంటిమి. కృచ్ఛ్రచాంద్రాయణాదులచే కవి కాగలుగునా? రసహృదయము కలవాడే కవిత్వము వ్రాయగల్గును. ఇచ్చట ప్రసక్తమైన తపస్సు గాత్రశోషణపరమైనది కాదనియు అహింసాపరమనియు, సర్వభూతహితాత్మకమైనదనియు గ్రహింపదగును. సత్త్వగుణము దాని ఆవిర్భావము. వాల్మీకి మహర్షి భూతదయాపరు డని క్రౌంచమిథునవృత్తాంతమే సాక్ష్యము. మహాకవి లోకజ్ఞుడై యుండవలె నని ఆంధ్ర మహాభారతప్రథమకర్త యైన నన్నయభట్టారకుడు భావించెను. ఆతడు తనను 'శాస్త్రజ్ఞ, లోకజ్ఞ' 'అవిరళజపహోమతత్పరుడు, విపులశబ్దశాసనుడు' మున్నగు విశేషణములను ప్రయోగించెను. కవి కావ్యమునం దెట్టి నిర్మలత్వము, స్వచ్ఛత్వము నుండవలెనో ఆ జీవితమునందును అట్టి ధర్మముచే నెలకొనవలెనట. ఈయంశమునకై ఆంగ్ల మహాకవి మిల్టను మహాశయుడు చెప్పిన మాట అస్మత్సంప్రదాయమునకు అనుగుణముగా నున్నది. మిల్టను చెప్పిన మాటయే 'A poet must live his poem' కవిజీవితము—కావ్య జీవితము ఒక్కటియన్నట్లే సంచరించెను. కావుననే మిల్టను కవి మద్యపానమును త్యజించి ఫలాహారములనే వాడెనట. వాల్మీకిమునీంద్రుని లోకజ్ఞత రామాయణమునందెల్లెడ అవభాసితమగుచునే యుండును. కులపాలికయు పరమసాధ్వియైన సీతాదేవివరకును, కాకాసురునితో మొదలు శ్రీరామచంద్రునివరకును వాల్మీకకవివరుని మనోనయనముల కందని రహస్యప్రకాశవృత్తాంతములు లేవు. బ్రహ్మదేవుడు వాల్మీకిమహర్షికి ఈయంతశ్చక్షువునే యనుగ్రహించెను.

«వృత్తం కథయ ధీరస్య యథా తే నారదా చ్ఛ్రుతం
రహస్యంచ ప్రకాశంచ యద్వృత్తం తస్య ధీమతః
రామస్య సహసౌమిత్రేః రాక్షసానాంచ సర్వశః
వైదేహ్యాశ్చైవ యద్వృత్తం ప్రకాశం యదివా రహః
తచ్చాప్యవిదితం సర్వం విదితం తే భవిష్యతి.»

చతురాననుడు వాల్మీకికి ప్రసాదించిన మరియొకవరము మహాకవిలక్షణముగనే మనము గ్రహింపవలెను. బ్రహ్మవాక్యములు.

'న తే వాగనృతా కావ్యే కాచి దత్ర భవిష్యతి'
మహాకవివాక్కు కావ్యమునం దనృతము కాజాలదట. దీనిని గోవిందరాజిటు వ్యాఖ్యానించినాడు.

«ఏవం యథార్థదర్శిత్వ మనుగృహ్య, యథార్థవాదిత్వ మనుగృహ్ణాతి- అత్ర కరిష్యమాణే కావ్యే తే వాక్- కించి దపి వాక్య మిత్యర్థః -అనృతా- బాధితార్థా నభవిష్యతి.»
వాల్మీకి అవితథవాక్యత్వమును 'మానిషాద' శ్లోకమునందు చూడవలె నని మహేశ్వరతీర్థులు వ్యాఖ్యానించిరి.

ఋషుల వాక్యములు అబాధితములనియు, వారివాక్కు ననుసరించి యర్థము తీగవెంట పరుగునదనియు మహాకవి భవభూతి పల్కినాడు.

"లౌకికానాం హి సాధూనాం అర్థం వాగనువర్తతే
ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోఽనుధావతి"

మహాకవిలక్షణము లనుండి మహాకావ్యలక్షణములవంకకు మరలుదము. ఏది మహాకావ్యము చతుర్వర్గఫల ప్రాప్తిని కలుగజేయునదని ప్రాచీనులఆశయము. భామహు డిట్లు చెప్పెను.

ధర్మార్థకామమోక్షేషు వైచక్షణ్యం కలాసు చ
కరోతి కీర్తిం ప్రీతించ సాధుకావ్యనిషేవణమ్.

సాధుకావ్యనిషేవణమువలన చతుర్వర్గఫలప్రాప్తి యగుచున్నది. ఎట్లన "రామాదివ ద్ప్రవర్తితవ్యం- నతు రావణాదివత్"—ఇత్యాది కృత్యాకృత్య ప్రవృత్తి నివృత్త్యుపదేశ ద్వారేణ' రామాదులవలె నడువవలెను, రావణాదులవలె నడువరాదు—ఇట్లు కృత్యాకృత్యములందు ప్రవృత్తినివృత్తిబోధనద్వారముగా చతుర్వర్గ ఫలప్రాప్తిని గల్గించుచున్నవి. కావ్యము రసప్రధానము. ఆనందము నొసంగుటయే దానిపరమప్రయోజనము గాని ఇతిహాసాదులవలె చతుర్వర్గవ్యుత్పత్తిని కల్గించుట కాదని దశరూపకకారు డాక్షేపణ తెలిపెను. ఈమతము ఆలంకారికసామాన్యము కాదు. సద్యఃపరనిర్వృతితో పాటు ఉపదేశములనిచ్చుటగూడ కావ్యముయొక్క ముఖ్యప్రయోజనముగా భావింపబడినది. పాశ్చాత్యసాహిత్యవిమర్శకులుగూడ 'A great poem has a message' మహాకావ్యము వ్యంగ్యరీతిని లోకమున కొక గొప్ప సందేశము నీయగల్గి యుండవలెననియే అంగీకరించిరి.

మొత్తముమీద ధర్మమూలమై, ప్రేమనిలయమైన శాశ్వతరచన మహాకావ్యమని నిశ్చయింపవచ్చును. రామాయణ మహాకావ్యము సత్యము- ధర్మము- ప్రేమ- వీరము అను స్థిరగుణములపై నిర్మింపబడిన ఆదర్శజీవితసౌధము. రామాయణము సార్వకాలికగ్రంథ మని బ్రహ్మదేవుడే అనుగ్రహించెను.

యావత్ స్థాస్యంతి గిరయ స్సరితశ్చ మహీతలే
తావ ద్రామాయణకథా లోకేషు ప్రచరిష్యతి—

వాల్మీకిమహర్షి ఆత్మవిశ్వాసము అల్పసత్త్వులైన సామాన్యకవులను గడగడలాడించును. పర్వతములున్నంతవరకు, నదులున్నంతవరకు తనగ్రంథమునకు చలనము లేదని ఎవరు పలుకనేర్తురు. వాల్మీకి భావితాత్ముడని చెప్పబడినది. (వాల్మీకే ర్భావితాత్మనః). భావితాత్ముడనగా చింతితపరమాత్ముడని వ్యాఖ్యాతలు వ్రాసిరి. ప్రాచేతస మహర్షి ఆత్మపరాయణుడు కావుననే అట్టియాత్మవిశ్వాస మాతనికి చెల్లినది. రామాయణము సర్వపురుషార్థసాధక మని వాల్మీకియే నుడివెను.

తదిదం వర్తయిష్యామి సర్వం నిఖిల మాదితః
ధర్మార్థకామసహితం శ్రోతవ్య మనసూయయా.

అనసూయయా- అనగా శ్రద్ధతో వినవలెనని మహర్షి హెచ్చరించుచున్నాడు. అసూయారాహిత్యమే రామాయణశ్రవణాధికారి ముఖ్యలక్షణము.

మహాకావ్యముయొక్క ఆవిర్భావముకూడ ఉజ్జ్వల వాతావరణమునందే జరుగుచున్నదని మనము గుర్తింపగలము. కవి పనికట్టుకొని కూర్చుండి మహాకావ్యము వ్రాయుట లేదు. అతని కొకదివ్యసందేశము సమాధిస్థితిలో వినవచ్చుచున్నది. దానిమేర కాతడు కావ్యనిర్మాణదీక్షితుడగుచున్నాడు. రామాయణకావ్యావతారవృత్తాంతము ఆబాలగోపవిదితము. క్రౌంచమిథునకథ నడచినప్పుడు వాల్మీకి సమాధియందు లేడే. స్నానార్థమై సరయూనదికి వెడలినాడు గదా అని శంక జనించును. రామాయణము నందలి ఈఘట్టమును నిపుణముగ చదివినచో సంశయ నివృత్తి కాగలదు.

అకర్దమ మిదం తీర్థం భరద్వాజ నిశామయ
రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనో యథా
స శిష్యహస్తా దాదాయ వల్కలం నియతేంద్రియః
విచచార హ పశ్యం స్తం సర్వతో విపులం వనమ్.

వాల్మీకిమహర్షి యిప్పుడు భౌతికముగ నడచుచు శిష్యునితో మాట్లాడుచున్నవాడైనను అతనిమనస్సు ప్రకృతి

ధ్యానతత్పరుడై యున్నాడు. ఆతడు జితేంద్రియుడై యున్నాడు. అచ్చట, నొక క్రౌంచమిథునమును చూచెను. ఆజంటకు వేసిన విశేషణము 'అనపాయినం'. అనగా అవినాభూతమైనది. క్షణవిరహాసహిష్ణువైన మిథునము. ఆధివ్యాధిరహిత మైనదని మహేశ్వరతీర్థులు. భావితాత్ముడైన వాల్మీకిమనస్సు మెఱపు మెఱసినట్లు జీవాత్మ మాత్మలవంకకు మరలినది.

'ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం
వృక్షం పరిషస్వజాతే। తయో రన్యః పిప్పలం
స్వాద్వత్త్య నశ్నన్ అన్యోఽభిచాకశీతి'

అను మహోపనిషద్రహస్యము తలపునకు వచ్చి ఆతడు సమాధిస్థుడే అయినాడు. ఇప్పుడాతడు క్రౌంచపక్షులను చూచుట లేదు. "అందమైన ఱెక్కలు గలవియు, ఎప్పుడును ఒండొరులను విడువనివియు, స్నేహబద్ధములును అయి ఒకే చెట్టు నాశ్రయించియున్న రెండుపక్షులు ఆతనికి గానవచ్చుచున్నవి. వానిలో నొకటి రుచ్యమైన ఆవృక్షఫలమును చవిచూచుచున్నది. రెండవదైన పిట్ట పండ్లుతినక తటస్థత వహించియున్నది". ఆపిట్టలు జీవాత్మపరమాత్మలు. ఆవృక్షము ప్రకృతివృక్షము. ఆపండు సంసారఫలము. జీవాత్మయైన పిట్ట సంసారఫలము రుచిచూచుచున్నది. పరమాత్మ యైన విహంగము నిర్లిప్తతతో నట్లే చూచుచున్నది.

వాల్మీకి భౌతికనేత్రములతో చూచుచున్నది క్రౌంచ ఘులజంట, మనోనేత్రములతో వీక్షించుచున్నది విశ్వమిథునము. ఆతడిప్పుడు సమాధిస్థితు డగుటలో విప్రతిపత్తి లేదుగదా.

ఇంతలో నాతనికి సమాధిభంగమైనది. ఏలన వ్యాధునిచే మగపక్షి చంపబడగా ఆడపక్షి దీనయై విలపించుచున్నది. 'భార్యాతు నిహతం దృష్ట్వా రురావ కరుణాం గిరమ్' వాల్మీకి శుష్కహృదయుడైన జడదారి కాదు, సర్వభూతహితచింతకుడు. ఆతడు దివ్యత్వమునుండి ఒక మెట్టు దిగి ఉత్తమమానవత్వమున అడుగుపెట్టినాడు. దివ్యత్వమునకును, ఉత్తమమానవత్వమునకును నడుమ సరిహద్దు రేఖలు అస్పష్టమైనవి. ఒకటి యెచ్చట విరమించునో, రెండవది యెచ్చట ఆరంభించునో సామాన్యులు నిర్ణయింప జాలరు. లౌకికపరిభాషలో చెప్పవలయునో బి. యే. ప్రథమ శ్రేణికిని, ఎం. ఏ. తృతీయ శ్రేణికిని సరిహద్దు విస్పష్టముగా కానట్లు. వేటకాని నిష్కారుణవైరమునకులను వాల్మీకి హృదయము ద్రవించి మహాకావ్యారంభమైనది. "మానిషాద ప్రతిష్ఠాం" అను శ్లోకరూపమున ఆయన శోకము వైఖరీరూపము నందెను. రామాయణమునంతటికీ అనేక కల్యాణప్రదమైన మహాకావ్యమేమి, నిషాదుని శపించుటతో ఆరంభమాయేమని ప్రాచీనులు వితర్కించి యిట్లు సమాధానము చెప్పిరట. మానిషాదశ్లోకమునకు రామపరముగను వ్యాఖ్యానము చేయబడెను. "మా = లక్ష్మీదేవి. నిషీదత్యస్మిన్నితి నిషాదః నివాసః. లక్ష్మీదేవికి నివాసమైనవాడు శ్రీనివాసుడు. భగవంతుడు. ఓ శ్రీనివాసా! నీవు శాశ్వతవిజయము నందుదువు గాక - ఏలన, క్రౌంచ మిథునాత్ - రాక్షసమిథునాత్ - రావణమండోదరీరూపాత్ - కామమోహితం - సీతాపహర్తారం రావణం అవధీః మోహాత్ముడైన రావణుని సంహరించి జగన్మంగళము సమకూర్చితివి" అని యన్వయించిరి. ఇట్లు కావ్యముఖమునందుండవలసిన 'ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాఽపి తన్ముఖమ్' అను మేరకు రామాయణవస్తునిర్దేశమైనదని భావించుచున్నారు.

ఇట్టిమహాగ్రంథమునందలి కావ్యలక్షణములను కొన్నిటిని రుచిచూతము. రామాయణ మనగా 'రామమ్ అయతి జ్ఞాపయతీతి రామాయణం. సర్వే గత్యర్థాః జ్ఞానార్థాః' రామునిగూర్చి ప్రవర్తించునది. రామచరితను జ్ఞాపకము చేయునది. వాల్మీకియే దీనిని గొప్ప ఆఖ్యానమని వాక్రుచ్చినాడు.

"మహదుత్పన్న మాఖ్యానం రామాయణ మితి శ్రుతమ్"

కావ్యము నిబద్ధమైన ఇతివృత్తము కలిగి, నాయికానాయకవర్ణనము, ప్రకృతిచిత్రణము, రసభావాలంకారవిన్యాసము మున్నగు నంగములతో నొప్పి, వ్యంగ్యార్థప్రధానమై ఔచితీవిభూషితమయి, సద్యఃపరనిర్వృతియు, ఉపదేశప్రయోజనమును గల కవికర్మ యని చెప్పవలెను. కావ్యనిర్వచన మెన్నియోరీతుల చేయబడినది.

'ఇష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళిః' అని దండ్యాచార్యుడును, 'వాక్యం రసాత్మకం కావ్యమ్' అని సాహిత్యదర్పణకారుడును, 'రమణీయార్థప్రతిపాదకశబ్దః కావ్యమ్' అని జగన్నాథపండితుడును పలువురు పలువిధముల నిర్వచనములు చేసిరి. అయినను వీరిలో వస్తుతత్త్వ మభిన్నమనియే చెప్పవచ్చును. రసాత్మకమైన యొక్క వాక్యమే కావ్య మను మాట నిజమైనను అది రసనిష్ఠనొందిన సహృదయశేఖరుని విషయమునందే చెల్లుచున్నది. సామాన్యస్త్రీపురుషుల కింత తేలికగా రసోదయము కాదు. సర్వతోన్నతమయిన శుష్కేం ధనసారాని వహించుచుండు కొలది ప్వారిన్వా రాజును. కాని పుష్పఫలావళీలలితసుందరద్రుమప్రకరంబు కలిగిన జీవారణ్యమును దహించుటకు దావానలమే కావలెను. సామాన్యహృదయమునందు రసోత్పాదనము కలిగించుటకై కావ్యసామగ్రి సమృద్ధముగ నుండవలెను. రామాయణము ఆ కాలపు మహర్షిమండలికిని, సాధారణజనులకునుగూడ ప్రీతిపాత్ర మైనట్లు వాల్మీకియే చెప్పెను. కుశలవులు రామాయణగానము చేయుచు సంచరించుచుండిరి

తౌ కదాచి త్సమేతానాం ఋషీణాం భావితాత్మనాం
ఆసీనానాం సమీపస్థా విదం కావ్య మగాయతాం
తచ్ఛ్రుత్వా మునయ స్సర్వే బాష్పపర్యాకులేక్షణాః
సాధు సా ధ్వితి తా వూచుః పరం విస్మయమాగతాః.

రాజమార్గము లందును, నడివీథులందును గూడ ఆ బాల గాయకులు సర్వశ్రుతిమనోహర మైన రామాయణమును పాడుచు పోవుచుండగా శ్రీరాముడు వారిని జూచెనట.

'ప్రశస్యమానౌ సర్వత్ర కదాచి త్తత్ర గాయకౌ
రథ్యాసు రాజమార్గేషు దదర్శ భరతాగ్రజః.'

వాల్మీకిమహర్షి తనకృతియందు కావ్యసామగ్రిని విపులముగనే సమకూర్చెను. ఒకప్పు డది శిశుప్రపంచమా యనిపించును. కార్యకారణసామగ్రిని దేనిని బీరుపోనీక పూసగ్రుచ్చినట్లు చిన్నపిల్లలకు చెప్పినట్లు వాల్మీకిమునీంద్రుడు వర్ణించుచుండును. అంతయు సహజము. అకృత్రిమము, తమసాజలముల నాయన వర్ణించినట్లే ఆయన కావ్యమును ఉండును.

అకర్దమ మిదం తీర్థం భరద్వాజ నిశామయ
రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనో యథా.

«భరద్వాజా! ఈనదియొక్క అవతరణప్రదేశము బురదలేనిదై, స్వచ్ఛమైన జలములు గలదై, కామాదిదోషరహిత మగుటవలన నిత్యప్రసన్నమగు సజ్జనమానసమువలె నున్నది. మహర్షియే తనకావ్యగుణముల నిట్లు సూచించినవాడాయెను.

'శ్రమపగతసమాససంధియోగం
సమమధురోపనతార్థవాక్యబద్ధం
రఘువరచరితం మునిప్రణీతం
దశశిరసశ్చ వధం నిశామయధ్వమ్.'

'శాస్త్రానురూప్యేణ ప్రాప్తాః సమాససంధియోగాయస్మిన్ — అనేన సమాసదోషసంధిదోషపదదోషశూన్యత్వముక్తం. సమం - బంధే ష్వవిషమం - మధురం ఉపనతార్థం - అర్థవ్యక్తిః - అనేయత్వం - తన కావ్యము సమాససంధియోగాదులందు దోషరహితమై, విషమబంధము లేనిదై మాధుర్యయుక్తమై, నేయార్థము గాక ఉండునని మహర్షి శపథము చేసెను. రామాయణమహాకావ్యమత్యంతము ఇట్లే యున్నదనుట బుధులెరింగిన విషయము.

ఇతివృత్తము.

రామాయణేతి వృత్తము ప్రఖ్యాత మని ఆస్తికులందరును భావించుచున్నారు. పాశ్చాత్యులును కొందరు దేశీయపండితులును రామవృత్తాంతము వాల్మీకిభావనాఫలమనితలచిరి. రామచరితము సత్యవృత్తాంతముగనే తోచుచున్నది. అందసంబద్ధ మేదియు లేదు. ఈకథ మహాత్ములైన ఇక్ష్వాకువంశీయుల కులమునందు సంభవించె నని మహర్షి పలుకుచున్నాడు.

«ఇక్ష్వాకూణా మిదం తేషాం రాజ్ఞాం వంశే మహాత్మనామ్
మహదుత్పన్న మాఖ్యానం రామాయణ మితి శ్రుతం»

ఇతివృత్తముయొక్క ప్రాశస్త్యమును బట్టియే రసముల సన్నివేశమును, ఉపదేశమహత్త్వమును నియమిత మగును. 'ఉపశ్లోకస్య మహాత్మ్య దుజ్జ్వలాః కావ్యసంపదః' ఉపశ్లోక్యుడైన మహాపురుషునిఘనత నాధారము చేసికొని

కావ్యగానమును ప్రవర్తించుచు. తాను కీర్తింపబోవు నాయకోత్తముడు విశ్వారాధ్యుడని సూచించుటకై కావ్యారంభమునందే రామగుణసంఖ్యానమును మహాకవి అద్భుతముగ చేసెను.

"కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః
చారిత్రేణచ కో యుక్తః సర్వభూతేషు కో హితః
విద్వాన్ కః కస్సమర్థశ్చ కశ్చైకప్రియదర్శనః
ఆత్మవాన్ కో జితక్రోధో ద్యుతిమాన్ కో౽నసూయకః
కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే"

శ్రీరామునిగుణవర్ణనమునందు మహర్షి అవతార పురుషుని గాక ఆదర్శమానవునే సంభావించె నని తోచుచున్నది. సముద్రశోషణము మున్నగు కొన్ని అమానుషచర్యలను విడిచి చూచినచో రామాయణమంతయు మహావీరచరిత్రముగానే భాసించును. దీనిచే "రామాదులవలె నడచుకొనవలయును" అను ముఖ్యసందేశ మేదికలదో అది మానవులకు ప్రయత్నసాధ్యము, అనుకరణీయమును అగుచున్నది.

రామాయణమహత్వమునకు ముఖ్యహేతువు రామునితో పాటు సీతాదేవియై యున్నది. మహర్షి దీని నొకప్పుడు సీతాచరిత్రముగనే వాకొనెను.

"కావ్యం రామాయణం కృత్స్నం
సీతాయాశ్చరితం మహత్
పౌలస్త్యవధ మిత్యేవ చకార చరితవ్రతః"

నాయకుడైన శ్రీరాముడు ధీరోదాత్తుడని యాతనిగుణవర్ణనమే సూచించుచున్నది ఈవిశేషణములే గాక ఇతర ప్రదేశములందును వాల్మీకి తనకావ్యనాయకుని పెక్కువిధముల భూషించెను. 'రామో విగ్రహవాన్ ధర్మః' రామ స్సత్యపరాక్రమః, రామ శ్శత్రునిబర్హణః, రామ స్సత్యసంగరః" రాముడు రూపమును దాల్చిన ధర్మము- రాముడు సత్యసంగరుడు. ఈమాటలలోనే రామాయణ లోకోత్తరప్రశస్తి యున్నది. శ్రీరాము డొకప్పుడు తనను గూర్చి యిట్లు చెప్పెను. 'రామో ద్వి ర్నాభిభాషతే' రాముడు రెండుమాటలు చెప్పడు. ఎంతటి ధీరోదగ్రవచనము. రాముడు మితహితసత్యవాక్యతత్పరుడు. అడిన మాట తప్పడు. ప్రియవాక్యశీలుడైనను శ్రీరాము డొకప్పుడు గంభీరముగ శాసింపగలడు. సుగ్రీవుడు కిష్కింధారాజ్యపట్టమును పొంది సుఖలాలసుడై రామకార్యమును విస్మరించినవాడువలె ఆలస్యము చేయుచున్నాడు. అంతటి రాముడు కోపించెను కినిసి లక్ష్మణునిచే నిట్లు సందేశమంపెను.

"నచ సంకుచితః పంథా యేన వాలీ హతో గతః
సమయే తిష్ఠ సుగ్రీవ! మా వాలిపథ మన్వగాః"

"నిహతుడై వాలి యేబాట వెంటపోయెనో ఆబాట సంకుచితము కాదని తెలిసికొనుము. ఓసుగ్రీవా! నీప్రతిజ్ఞను నెరవేర్పుము. వాలిపథము ననుసరించి పోవలదు సుమా." జాతరోషుడైన యెవనిజూచి దేవతలే కంపిల్లుదురో అట్టిరాముని యాగ్రహమునకు కపిమాత్రుడైన సుగ్రీవుడు గడగడలాడుట ఆశ్చర్య మేమి. ఐనను రాముడు తొందరపాటు కలవాడు కాడు. గొప్పనిదానము, ఆత్మనిగ్రహము కలవాడు. అన్నగారిట్లనగనే భృశకోపనుడైన లక్ష్మణుడు సుగ్రీవుని వధించి వత్తునని ప్రచండచాపమును బూని లేచెను. శ్రీరాముని వశీకృతచిత్తత యిచ్చట కనబడును. తమ్ముని వారించి యిట్లు పలికెను.

"నహి వై త్వద్విధో లోకే పాపమేవం సమాచరేత్
పాప మార్యేణ యో హంతి సవీరః పురుషోత్తమః"

'నాయనా! నీవంటివా డిట్టిపాపకృత్యమును చేయవచ్చునా. మిత్రవధరూపమైన పాపమును ఎవడు సమ్యగ్వివేకబుద్ధిచే పరిహరించునో ఆవీరుడే పురుషోత్తముడు' అని సానునయవాక్యములు పల్కి లక్ష్మణునికోపమును చల్లార్చెను.

సాధ్వీమతల్లియైన సీతాదేవిచరిత్రము వర్ణించెడి దేమి. స్త్రీపాత్రచిత్రణము మహాకవియైనవానికి గొప్పపరీక్షాస్థానము. మొట్టమొదటనే కవి నెదుర్కొనుసమస్య ఏదనగా నాయికాసౌందర్యమును వర్ణించుటయా - మానుటయా. వర్ణింపకున్న రసవంతముగా నుండదు. అస్థానమునందు వర్ణించుట అనుచితము. ప్రప్రథమమున సీత మనకు

సంక్షిప్తరామాయణమునందు కనవచ్చినది. ఎత్తుకొనుట లోనే మహాకవి సీతాత్యాగమూర్తినే మనకు పరిచయము చేసెను. రాము డరణ్యమునకు పోవుచుండ సీత యనుగమించె ననుకొ:

'రామస్య దయితా భార్యా నిత్యం ప్రాణసమా హితా
జనకస్య కులేజాతా దేవమాయేవ నిర్మితా
సర్వలక్షణసంపన్నా నారీణా ముత్తమా వధూః
సీతా ప్యనుగతా రామం శశినం రోహిణీ యథా.

బాలకాండమునందు స్వయంవరవృత్తాంతకథనమున సీత వీర్యశుల్క యని మాత్రము కవి తెలిపినాడు. కల్యాణ సమయమునందును తండ్రివెనుక కన్యయగుటచే సీతనుగూర్చి విశేషములు లేవు. జనకుడు కన్యనిచ్చుచు అల్లునితో నిట్లనెను.

ఇయం సీతా మమసుతా సహధర్మచరీ తవ
ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా
పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతా సదా.

ఇచ్చట వ్యాఖ్యాతలు ప్రతిపదమునకును విశేషార్థములు వ్రాసిరి. రామాయణమునందలి వ్యంగ్యప్రధానరచన కివి నిదర్శనము. «అథ సౌందర్యాభిజాత్యాదినా సీతాయాః ప్రతిగ్రహార్హతాం వదన్ ప్రతిగ్రహ మనుజానాతి-సౌందర్యము, ఆభిజాత్యము, పతివ్రతాశీలము మున్నగు గుణాతిశయములచే సీత పరిగ్రహయోగ్యరాలని నిర్దేశించుచున్నాడు.» ఇంతవరకు సీత ఒకపలుకైన పలుకలేదు. వివాహానంతరముకూడ ఆమె చాలకాలమువరకు అత్తమామలకును భర్తకును చాటున ఉన్న నూతనవధువు. ఆకులచాటుపిందెవంటిది. అప్పుడును ఆమెనుగూర్చి ఇతరులు చెప్పుటేకాని ఆమెయై పలుకుట మన మెరుగము. సీతారాముల నవదాంపత్యజీవితమును మహాకవి యిట్లు సంగ్రహముగా వర్ణించెను.

«రామస్తు సీతయా సార్థం విజహార బహూన్
ఋతూన్ మనస్వీ తద్గత స్తస్యా నిత్యం హృదిసమర్పితః»

«ప్రియాతు సీతా రామస్య దారాః పితృకృతా ఇతి
గుణాద్రూపగుణాచ్చాపి ప్రీతి ర్భూయోఽభ్యవర్ధత
తస్యాశ్చ భర్తా ద్విగుణం హృదయే పరివర్తతే
అంతర్గాతమపి వ్యక్త మాఖ్యాతి హృదయం హృదా»

రాముడు సీతతో కలిసి పెక్కుఋతువులు సుఖముగా నుండెను. అత డామెను ప్రేమించి ఆమెహృదయమునందు ప్రతిష్ఠితు డాయెను. తండ్రిగారిచే అనుజ్ఞాతయైన భార్య యని శ్రీరామునకు సీతయం దెక్కువ ప్రీతి. దీనికి ఆమె గుణములును, రూపసౌందర్యమును దోహదము చేసెను. సీత అంతకు రెండురెట్లధికముగా భర్తను ప్రేమించెను. శ్రీరాముని హృదయభావములను ఆతనికంటె ఆమెయె ఎక్కువగా హృదయముచే తెలిసికొనగలిగెను.'

ఈవర్ణనమునుబట్టి ప్రేమించి పెండ్లిచేసుకొను పాశ్చాత్య పద్ధతిగాక, పెండ్లియయిన వధువును ప్రేమించుటయే భారతీయ సనాతనపద్ధతి యని వ్యక్తమగుచున్నది. ఈయంశమునే 'మహేశ్వరతీర్థు లిట్లు నొక్కి వివరించిరి. "పితృకృతాః బ్రాహ్మవివాహసదృశవివాహేన
సఏవ వివాహ స్సర్వథా శ్లాఘ్య ఇతిభావః» ఇప్పు డిప్పుడే సీతావ్యక్తిత్వము కొంచెము కొంచెము మనకు మెరుపువలె దోబూచులాడుచున్నది. ఆమె అనుకూలవతియైన భార్యగా మెలగుచు:

సీతావ్యక్తిత్వము అయోధ్యకాండనుండి ప్రస్ఫుటమగుచున్నది. అరణ్యవాసమునకు నిశ్చయించి రాముడు సీతతో చెప్పిపోవుటకై ఆమెప్రాసాదమున కేగెను. ఈఘట్టములో సీత వినీతయయ్యు స్వతంత్రాలోచనయు మనో నిశ్చయమును గల భారతవనిత యని నిరూపితమైనది. వనవాసమునకు తనను వెంట గొనిపొమ్మని ఎన్నియో యుక్తులతో సీత వాదించినది. అన్నియుక్తులతోను రాము డామెను అయోధ్యయందుండి అత్తమామలసేవ చేయుచుండు మని వారించెను. వనవాసదోషములను విస్తరించుచు 'సీతే దుఃఖతరం వనం' అను మకుటముతో రాముడు చెప్పినమాటలు వాల్మీకిమహర్షి ఆలంకారికశైలికి చక్కని ఉదాహరణము. ఆంగ్లములో దీనిని Rhetorical method అందురు. రామునినిశ్చయము మార్చలేక సీత పతయాశ్రుబాష్పయై రోదించినది. చివరకు ధర్మకుటుంబినికి రావలసిన ఆగ్రహమామెకు వచ్చి భర్తను మృదువుగా నిందించెను.

"కిం త్వా మన్యత వైదేహః పితా మే మిథిలాధిపః
రామ జామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహం"

"నన్ను విడిచి యరణ్యమునకు నీవు ఒంటరివై యేగెదో మా తండ్రి జనకుడు నిన్ను పురుషరూపధారివైన స్త్రీయని భావించును" అని సత్యపరాక్రముడైన రాముని యెత్తిపొడిచెను. సీత యిప్పటిపలుకులలో వారి భవిష్యజ్జీవితమున కుపశ్రుతి వినవచ్చుచున్నది. ఇది యొక మహాకావ్యశిల్పము. మాట్లాడుచున్న పాత్ర తనకు తెలియకయే ఏదో వచించును. అది భవిష్యత్తునందు సత్యముగా పరిణమించును. దీనినే ఆంగ్లములో Dramatic Irony అందురు. పతాకాస్థానక మని మనవా రనుచున్నారు. సీత అన్న మాటలు :

"నచ తత్ర గతిః కించి ద్ద్రష్టుం మ్మాసి విప్రియం
మత్కృతే చ నతే శోకో నభవిష్యామి దుర్భరా"

"ఓ రామా! నామూలముగ అరణ్యములో నీ కెట్టి విప్రియమును కలుగదు. నేను నీకు దుర్భరను కాను". సీత అయోనిజ యయ్యు భవిష్యద్దర్శనములోనికి చూడజాలదు. పదుమూడు సంవత్సరములతరువాత వా రనుకొనుండగా సరిగా ఇదియే జరిగినది.

సీతారామలక్ష్మణులు అత్రిమహామునియాశ్రమమును సందర్శించినప్పు డొక సుందరసన్నివేశ మైనది. అత్రిమహాముని యాదేశముపై సీత వృద్ధురాలును మహాపతివ్రతయు నగు అనసూయను సేవించి యామె ఆశీస్సుల నందెను. ఇక్కడ స్త్రీస్వభావమును వాల్మీకి మహర్షి రమ్యముగ చిత్రించెను. ఎంతవయస్సు గడిచినను నారీమణులకు వివాహవృత్తాంతములను వినుట ముచ్చట. పెండ్లిముచ్చటలు ముత్తైదువుల కెప్పుడును ప్రీతిదాయకములు. స్వయంవర వృత్తాంతమును సాకల్యముగ వినగోరి అనసూయ సీతను కోరెను. ఆమెయు ఉత్సాహభరితయై తనపెండ్లికథను ఆద్యంతము పూసగ్రుచ్చినట్లు వర్ణించి చెప్పెను. తనతండ్రి జనకమహారాజు తనకొరకు తగినవరుని సంపాదించుటకై ఎట్లు చింతాక్రాంతు డయ్యెనో లలితకరుణముగ వివరించినది.

"పతిసంయోగసులభం వయో దృష్ట్వాతు మే పితా
చింతా మభ్యగమ ద్దీనో విత్తనాశా దివా ధనః.
సదృశా చ్చాపకృష్టా చ్చ లోకే కన్యా పితా జనాత్
ప్రధర్షణా మవాప్నోతి శక్రేణాపి సమో భువి."

"నాకు పెండ్లియీడు వచ్చుట చూచి, నిర్ధనుడు విత్తనాశము చేతవలె మాతండ్రి దీనుడై చింతాక్రాంతు డయ్యెను. ఇంద్రసమానుడైనను కన్యలుగల తండ్రి సమానులనుండియు, తక్కువవారినుండియుకూడ తిరస్కారములకు పాత్రుడగును కదా!" వాల్మీకిమహర్షి యొక్క లోకజ్ఞత అద్భుతము గదా! రెండుమూడువేలయేండ్లు గడచినను భారతదేశములో కన్యాపితల కడగండ్లు ఇట్లే యున్నవి.

సీత ముగ్ధరా లైనను స్వతంత్రభావములు లేనిది కాదు. రాముడు రాక్షససంహారము చేయుదు నని దండకారణ్యమునులకు ప్రతిజ్ఞ చేసెను. ఇది కారణరహితహింస యేమో నని సీత శంకించి భర్తను హెచ్చరించెను. ఈఘట్టమునం దామె ప్రదర్శించిన ధర్మజ్ఞానము సూక్ష్మతర మైనది.

"త్రీణ్యేవ వ్యసనాన్యత్ర కామజాని భవంత్యుత
మిథ్యావాక్యం పరమకం తస్మా ద్గురుతరా వుభౌ
పరదారాభిగమనం వినావైరం చ రౌద్రతా.
ధర్మా దర్థః ప్రభవతి ధర్మా త్ప్రభవతే సుఖం
ధర్మేణ లభతే సర్వం- ధర్మసార మిదం జగత్
స్త్రీచాపలా దేత దుదాహృతం మే
ధర్మంచ వక్తుం తవ కస్సమర్థః"

'శ్రీరామునియందు మిథ్యావాక్య, పరదారాభిగమన రూపము లైన దోషములు. అచింత్యములు. నిష్కారణవైరము కూడ మహాదోష మే గదా! అపరాధములేకుండ రాక్షసుల నైనను సంహరించుట తనకు గిట్టదని యామె చెప్పెను. 'స్త్రీచాపల్యముచేత ఏమేమో చెప్పితిని. మీకు ధర్మము నుపదేశించు శక్తి నా కెక్కడ గలదు' అని యామె విరమించెను. రాముడు దానికి సమీచీనముగ సమాధానము పలికెను. ఇచ్చటకూడ మనము పతాకాస్థానకమునే చూడగలము. ఏరాక్షసులకు పట్టుబడి తా నెన్ని అనర్థములకు

పాలుగాచున్నదో వారిపక్షము వహించి సీతాదేవి పలుకుట విపరీతము.

సీతాదేవి క్షత్రియకాంత యగుటచే రాజసస్వభావము కలిగియుండుటయు ఆశ్చర్యము కాదు. అట్లుండకపోవుట విపరీతము. పాతివ్రత్యమునందు లోపమని భావింపదగదు. మారీచునిచే ఆకృష్టుడైన తననాథుని సాహాయ్యము నకు పొమ్మని తొందరపాటుతో మరదియైన లక్ష్మణుని, నిందాపూర్వకముగ భాషించుటలో ఆమె రాజసమును చూపినది. భర్తృకష్టమును శంకించి, ఉద్విగ్నయై తత్కాలావేశముతో ఆమె భర్తయైన మరదినితప్పబలికినది. ఆమెయందున్నసత్త్వభావము చిరకాలారూఢ మని చెప్ప జాలము. ఇప్పటి సీతాప్రవర్తనము 'ప్రాయస్సమాపన్న విపత్తికాలే ధియోపి పుంసాం మలినా భవంతి' అను సూక్తికి లక్ష్యమైనది. ఆపత్తు ఇంతలో రానేవచ్చినది. విపదంబుధిలో సీతానౌక మహాతరంగతాడితమై విక్షోభ్య మైనది. అయినను ఆమె మనస్స్థైర్యమును, సద్యస్స్ఫురణమును వీడలేదు. రావణునిరథముపై నుండియు, తన జాడలు భర్తకు తెలియుటకై తన నగలను చీరచెంగున ముడివైచి సుగ్రీవాదులముందు పడునట్లు విడిచినది. ఆమెప్రత్యుత్ప న్నమతి కిది గొప్పతార్కాణము. మూర్తీభవించిన రాజస మైన ద్రౌపదికూడ ఇంతనేర్పుగ వ్యవహరించినట్లు మనము చూడము.

అశోకవనమందున్న సీతాదేవి లోకమునందలి ఉత్తమ కాంతలకు మౌళిమణియందనము. ఆమె మూర్తీభవించిన సత్త్వగుణము. శోకదేవత. కరుణరసమున కాదర్శోదాహ రణము. రామాయణమునందలి విచిత్రసన్నివేశములలో ఒక టేమనగా సీతాదేవిదేహసౌందర్య మిచ్చటనే మొదటి మాటును కడపటిమాటును సముచితవివరములతో వర్ణింప బడినది. పెండ్లిముందును కాదు; పెండ్లిపీటలమీదను కాదు ఇష్టభోగము లనుభవించు అయోధ్యయందును కాదు. భోగ రహితమైనను స్వేచ్ఛావాయువుల పీల్చుచు దండకారణ్య సీమలలో గడపిన త్రయోదశాధికాబ్దజీవితమునందును కాదు. రావణుని చెరలోబడి, రాక్షసిస్త్రీలచే తర్జనము లందుచు కంటికి మంటికి ఏకధారగా విలపించు ఈదినము లలో సీతాసౌందర్యమును వర్ణింపవలెనను ఔత్సుక్యము మహర్షి కేల కల్గెనో! ఇదివరలో మరచిపోయి ఇప్పుడు జ్ఞాపకము వచ్చి నాయికావర్ణనము లేకయే కావ్యము పరి సమాప్తినొందుచున్న దను సంభ్రమముచేత వర్ణించినా డందమా! ఇప్పట్లు సీతాసౌందర్యమును వీక్షించినవా డెవరు? రసికశేఖరు డెవడైనా అందమా? అదియును కాదు. సీతను ఇప్పుడు చూచినవాడు బ్రహ్మచర్యవ్రతనిష్ఠుడై- హనుమంతుడు. ఏమి టీసాధనవైపరీత్యము అని శంక జనింపవచ్చును. మహాకవివాల్మీకి శిల్ప మిచ్చటనే నిభృ తమై యున్నది. పూర్వఘట్టములలో సీతాసౌందర్యమును వర్ణించును పనికట్టుకొని ఆమె తనూవిలాసమును అంగప్ర త్యంగమును నిరూపించుట. అదిభౌతికతాజుష్టము. వీతరాగు డైన మహర్షి చేయునది కాదు. రాముడు తనభార్యాసౌంద ర్యము తాను వర్ణించుకొనుట అవివేకము. లక్ష్మణుడు నిత్యము వదినెగారిని చూచుచున్నను అతడు మహాభక్తుడు. సీతపాదములను మించి అతడు చూడడు. సీతభూషణము లను గుర్తింపు మని అన్న యాదేశింపగా లక్ష్మణు డన్న మాటలు:

> 'నాహం జానామి కేయూరే
> నాహం జానామి కుండలే
> నూపురే త్వభిజానామి
> నిత్యం పాదాభివందనాత్'.

వాల్మీకిమహర్షి యౌచిత్యపరిజ్ఞాన మాశ్చర్యకరముగదా!

దుస్థితిలో నున్న సీతసౌందర్యమును ఊర్ధ్వరేతుడైన హనుమంతునిచే వర్ణింపజేయుటలోని ఔచిత్య మేమి? దీనికి సమాధాన మిట్లు చెప్పవలెను. ఇప్పుడు సీతాసౌందర్య వర్ణన ప్రకృతోపయోగి యైనది. ఈమె సీతాదేవియని గుర్తించుటకు ఆంజనేయున కిదియే మొదటి అభిజ్ఞానము. లంకానగరమునందాత డెందరో మదిరాక్షులను చూచి నాడు. ఒకప్పుడు మండోదరిని చూచి ఆమెయే సీత కాబోలునని ఉబ్బి గంతులు వైచినాడు. త్వరలోనే తన తప్పును గ్రహించినాడు. పతి నెడబాసిన సీతాదేవి అలం కృతయై యుండదు గదా యని స్మరణకు తెచ్చుకొన్నాడు. ఇంతమంది సుందరాంగు లున్నచోట సీత నెట్లు గుర్తించ

వలెను. ఆమె యసాధారణసౌందర్యముచేతనే శక్తింప వలెను. కావుననే సీతాసౌందర్యము మిక్కిలి సంయమనముతో వాల్మీకి యిచ్చట వివరించెను. మిక్కిలి సంతప్తమైన సీతాసౌందర్య మిప్పుడు భౌతికశృంగారావరణను దాటి దివ్యశృంగారముగా పరిణమించినది. ఆమె కృశించియున్నది. మలినవసనయై యున్నది. నిర్భూషణయైయున్నది. కామవిద్ధముగాని పద్మినిర్మలివశృంగారమా మెయంగముల నావరించి యున్నది. దీనినే మారుతాత్మజుడు సందర్శించి భక్తినమ్రతలతో మనకు వినిపించినాడు. స్త్రీదేహసౌందర్యమును వర్ణించుటకు వాల్మీకి మహర్షి యింతకాలము వేచియుండవలసివచ్చెను. ఇదియే మహాకవికి గావలసిన సంయమనము. సామాన్యకవియైనచో సీతాకల్యాణమునకుముందే ఆమె కుచకుచసౌందర్యమును తనివితీర వర్ణించి అనౌచిత్యమునకు పాల్పడియుండును.

అంజనానందనునిదృష్టిని విశేషముగా నాకర్షించిన సీతాగతసౌందర్యచిహ్నము లేవన :

సేయం కనకవర్ణాంగీ నిత్యం సుస్మితభాషిణీ
నీలనాగాభయా వేణ్యా జఘనం గతయైకయా.
ఇమా మసితకేశాం తాం శతపత్రనిభేక్షణాం
సుఖార్హాం దుఃఖితాం దృష్ట్వా మమాపి వ్యథితం మనః

రాఘవోఽర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా. ఎన్నిమారులును ఆంజనేయుడు చూచినది సీత బంగారు వర్ణము, నల్లత్రాచువంటి ఏకవేణి, శతపత్రములవంటి కన్నులు. కామశృంగారద్యోతకమైన అంగవర్ణనము మచ్చుకైన కానరాదు. వాల్మీకికావ్యము అర్షమనుటకిది యొక ప్రతిపత్తి. సీతాదేవి పాతివ్రత్యమేకాక ఆమె యౌచిత్యపరిజ్ఞానమును ప్రశంసాపాత్రము. సీతాదేవిని తత్క్షణమే విడిపించుటకై తన వీపెక్కి రమ్మని, భర్తకడకు క్షణములో చేర్తునని హనుమంతుడు చెప్పెను. విపన్నయైన సాధారణస్త్రీ ఇట్టియవకాశమును చెయిజారనీయదు. కాని సీతాదేవి ఆత్మనిగ్రహము, పతిపరాయణత్వము అద్భుతము ఆమె ఎన్నియోకారణములు చెప్పి చివరకిట్లన్నది.

«భర్తృభక్తిం పురస్కృత్య రామా దన్యస్య వానర
నస్పృశామి శరీరం తు పుంసో వానరపుంగవ»

పరపురుషుని గాత్రసంస్పర్శము చేయనని సీత చెప్పినది. అయినచో రావణునిబలాత్కారము మాటేమని విమర్శక మహాశయుని వెంటనే సమాధానము చెప్పించినాడు.

యదహం గాత్రసంస్పర్శం రావణస్య బలాద్గతా
అనీశా కింకరిష్యామి వినాథా వివశా సతీ

అప్పుడు నేను అనీశను, వివశను, మూర్ఛాగ్రస్తను. ఏమి చేయగలను అని చింతతో పల్కినది.

రామాయణమహాకావ్యమునందలి ఒకటి రెండుపాత్రలనుగూర్చియే ఇంత నిశితపరిశీలన మవసరమగుచుండగా అందలి వివిధపాత్రల తీర్పు నేర్పును ప్రశంసించుట సాధారణకార్యము కాదు.

రామాయణసంబంధి మహాకావ్యలక్షణములలో ప్రకృతి వర్ణనలను విశిష్టగుణాధాయకముగా చెప్పవలెను. మహాభారతము మానవవ్యాపారబంధురము. మనుష్యప్రకృతియందెన్ని నిమ్నోన్నతములు కలవో అన్నియు మహాభారతమునందు ప్రాతినిధ్యము వహించినవి. మానవునకును జడప్రకృతికిని ఎడతెగనిసంబంధ మున్నను భారత మేలనో ఈసంబంధము నంతగా మథింపలేదు. మానవునకును దివ్యతత్త్వమునకును గల నిత్యానుబంధమును మాత్రము చర్చించుటతో భారతము తృప్తిపడి యూరకున్నది. దివ్యతత్త్వము తన ధామమునుండి భూమికిని, జడప్రకృతికిని అవతరించిన సుందరవిధానమును రామాయణము ఉపలక్షించుచున్నది. భారతము వేదాంతములోనికిని, రామాయణము కవిత్వములోనికిని అవగాహన మొనర్చినవి. ఈరెండును భిన్నసత్యములు కావుగాని ఒకేసత్యముయొక్క పూర్వోత్తరరూపములు.

వాల్మీకిమహర్షి ఉపమానములకై తరుచు ప్రకృతివంకకు మరలుచుండును. శ్రీరాముని గుణములు వర్ణించుచు :

సముద్రఇవ గాంభీర్యే ధైర్యేణ హిమవానివ
కాలాగ్నిసదృశః క్రోధే క్షమయా పృథివీసమః

అని మహాపదార్థములతో సామ్యము కల్పించును. రామాయణకావ్యమునకు వనాంతరములందు తమసానదీతీరమున క్రౌంచమిథునవిషాదజీవితముతో నాంది జరిగినది. మహా

భారతము జనమేజయుని యాగశాలయందు ప్రవృత్తమైనది. ఇతిహాసములు రెండును తిర్యక్కుల ప్రవేశముతోనే మొదలిడినవి. మహాభారతమునందు దేవశునకమైన సరమకుమారుడు, సారమేయుండును, పసివాడు జనమేజయుని యాగశాల ప్రవేశింపగా ఆతని తమ్ములు దాని నడచి వెడలగొట్టిరి. పసివానియెడ నిట్టి క్రౌర్యము తగునా యని దేవశుని యాక్షేపించినది.

క్షితినాథ కను నకరుణా
న్వితులై నీతమ్ము లతివివేకవిహీనుల్
మతిఁ దలపక నాపుత్త్రకు
నతిబాలకు ననపరాధు నడచిరి వెలుచన్.

తను నిది చేగ దని యెడలో
వగవక సాధులకుఁ జేనవారల కెగ్గుల్
మొగి చేయు దుర్వినీతుల
కగు ననిమిత్తాగమంబు లయిన భయంబుల్.

వాల్మీకి మహర్షి క్రౌంచనిహతికి వగవ, శ్లోకరూపమున అప్రయత్నముగనే ఆతని వాణి వెడలినది. ఇట్లే మహాగ్రంథములలో తిర్యక్కులవిషయమై వైర నిర్వైరములు స్ఫుటలక్షణములుగా భాసించుచున్నవి. వాల్మీకిమహర్షి దివ్యతత్త్వమును వలెనే ప్రకృతితత్త్వమునుగూడ బహువారములు పరికించి మానవుని ఈ రెండు సముద్రములను కలుపు జలసంధిగా తిలకించెను. మనుష్యహృదయముపై ప్రకృతి మహాపదార్థముల ప్రభావము నాతడు అడుగడుగునను క్షించుచునే యుండును.

రామాయణమునందలి గొప్ప వర్ణనములలో పర్వతారణ్యవర్ణనములు ఋతువర్ణనములు రమ్యతరమైనవి. వాల్మీకి మహర్షి ప్రకృతిసౌందర్యచిత్రణము కిష్కింధాకాండమునందలి వర్ష శరద్వర్ణనములలో మెరుగెక్కినది. ప్రకృతి వర్ణనమునందు మహాకవి మూడునాలుగువిధానము లవలంబించెను. (1) సహజస్థితివర్ణన. స్వభావోక్తిమూలము. (2) ఉత్ప్రేక్షాతిశయోక్తులు మూలముగా వర్ణించుట. తిర్యక్కులజీవితముతో సానుభూతిని ప్రకటించుట మరి కొన్నిసందర్భములలో ప్రకృతి మానవజీవితముతో సానుభూతిని వహించుచున్నట్లు భావించుట (3) ఔపమ్యము లకై ప్రకృతివస్తువులలో సాదృశ్య మరయుట (4) సమాసోక్తి అలంకారమునకు విషయముగా ప్రకృతిని వర్ణించుట అప్రస్తుతవిషయప్రశంస ధ్వనించునట్లు చేయుట (5) ప్రకృతివర్ణనమును సప్రయోజనముగ కూర్చుట, ఇది యొక శిల్పవిధానము.

సుగ్రీవపట్టాభిషేకానంతరము రాముడు నాలుగునెలలు వేచియుండ వలసివచ్చెను. వర్షఋతువు ఆరంభించెను. సీతాన్వేషణము శరత్కాలము వచ్చువరకు వేచియుండ నయ్యెను. కథాగమనమునం దిది యొక అవాంతరము. కథ ముందుకు నడువక చరికిలబడెను. అనంతరఘట్టము సమాపన్న మగువరకు పాఠకుని మనస్సునకు పని కల్పింపవలెను. అట్లుచేయక నాలుగు నెలలు వృథాగా గడచిపోయినట్లు చెప్పుట శిల్పలోపము కావున ఇచ్చట కథలో నేర్పడిన అవగ్రహమును తొలగించుటకు వాల్మీకి అదు ము ప్రదర్శించెను. అదియే వర్షఋతు, శరదృతు వర్ణనలు. ఈ రెండుఋతువులనుగూడ ఒక్కగుక్కలో వరుసగా వర్ణించిన విసుగుపుట్టును. ఇందుకై సీతాన్వేషణము నిమిత్తమై త్వరపడవలయు నని హనుమంతుడు సుగ్రీవునికి విజ్ఞప్తిచేయు కథాభాగములో మధ్య ప్రవేశపెట్టినాడు. ఇట్లు రెండు మనోహరమైన ఋతువులు కొంచె మెడముగ వర్ణితములై సహజత్వస్ఫూర్తిని కలిగించుచున్నవి.

సుగ్రీవుడు కిష్కింధారాజ్యమును స్వభార్యను వడసి భోగపరీవృతుడై యుండెను. రామలక్ష్మణులు ప్రస్రవణగిరిపై నొక విశాలమైన గుహలో వర్షాకాలము వెళ్ళింప నిశ్చయించుకొనిరి. సీతావియోగఖిన్నుడైన శ్రీరామునకు రాత్రులు దుఃఖసంతానము లయ్యెను. అతడు సుగ్రీవుని సౌహృదమును నదులప్రసన్నతను గణించుకొనుచు దీనుడై యుండెను.

సుగ్రీవస్య ప్రసాదంచ నదీనాం చానుపాలయన్'

వర్షాకాల మారంభించినది. ఆకాశము పర్వతసన్నిభములైన మేఘములచే ఆవరింపబడినది.

శక్య మంబర మారుహ్య మేఘసోపానపంక్తిభిః
కుటజార్జునమాలాభి రలంకర్తుం దివాకరమ్.

మేఘములను మెట్లవెంబడి ఆకాశము నధిరోహించి,

కొండమల్లెపూవులతో నలంకృత నారాధింపవచ్చును. సంధ్యారాగముచే ఎఱ్ఱనై, కొనలయందు తెల్లగా నుండు మబ్బుతునకలచే నాకాశము వ్రణమునకు కట్టిన అంబర ముపలె నున్నది. గ్రీష్మతప్తమైన భూమి నూతన వర్షోద బిందువులచే తడిసి శోకసంతప్తయైన సీతవలె వేడియూర్పులను విడుచుచున్నది. నీలమేఘగతమైన విద్యుత్తు రావణాంకగతయైన సీతవలె నున్నది. సలిలభారముతో గూడిన మేఘములు పర్వతశృంగములమీద విశ్రమించుచు, విశ్రమించుచు మెల్లగా సాగిపోవుచున్నవి. ఇది గర్భిణీస్త్రీ జన వృత్తాంతమును సూచించుచున్నది. ఒక్కొక్కప్పుడు మహా కవిరచనాశిల్పముచే సహజవర్ణనలకు రంగువూయుచుండును. క్రియలను మాలగా గూర్చి ప్రయోగించుటచే ఈచమత్కార మేర్పడుచున్నది.

> నిద్రా శనైః మభ్యుపైతి
> ద్రుతం నదీసాగర మభ్యుపైతి
> హృష్టా బలాకా ఘన మభ్యుపైతి
> కాంతా సకామా ప్రియ మభ్యుపైతి.

'అభ్యుపైతి' అనుక్రియను అంత్యానుప్రాసగా వాడి చిత్రరచన కావించినాడు. మరొకచో క్రియలను యథా సంఖ్యాలంకారములో మాలగా గ్రుచ్చినాడు

> వహంతి వర్షంతి నదంతి భాంతి
> ధ్యాయంతి నృత్యంతి సమాశ్వసంతి
> నద్యో ఘనా మత్తగజా వనాంతాః
> ప్రియావిహీనాః శిఖినః ప్లవంగాః.

ఇప్పుడు రవి భాసింపకుండుటచే సూర్యాస్తమయము గూండ్లకేగుచున్న పక్షులవలనను, ముకుళించు తామరలవలనను, వికసించు మాలతీకుసుమములవలనను మాత్రమే తెలియబడుచున్నది. కష్టకాలమునందు బంధువులు స్మరణకు వత్తురు. రామున కిప్పుడు సరయూనది, భరతుడు జ్ఞాపకమునకు తగిలెను.

శ్రీరాము డిట్లతికష్టముతో వర్షర్తువును వెళ్ళించెను. శరత్కాల మాపతితమయ్యెను. రాముడు లక్ష్మణునితో నిట్లనెను. 'మహాసాక్షుడు భూమిని వర్షములచే తడిపి సస్యసమృద్ధి నొనర్చి విశ్రాంతుడైనాడు. గర్జనముల నర్షము గల మేఘములు దిక్కులను శ్యామీకృతములుగా జేసి ఇప్పుడు మద ముడిగిన ఏనుగులవలె శాంతవేగము కలవియై యున్నవి. శరత్కాలమందలి నదులు నెమ్మదిగ వీడిన యువతుల జఘనములవలె, మెల్లమెల్లగా పుళినములను చూపుచున్నవి. ఆకాశము మేఘవిహీనముగుటచూచి, వనములందు త్యజింపబడిన పింఛాభరణములు కలవై, ప్రియకాంతలందు ఆసక్తిలేనివై ఉత్సాహహీనులై నెమళ్ళు ధ్యానపరాయణములైనవి. బురదలేనివియు, ఇసుకలు లేనివియు, ప్రసన్నజలములు కలవియు, సారసారావభరితములైనవియు అగు నదులలో హంసలు సంతోషితములై దూకుచున్నవి.

> చంచచ్చంద్రకరస్పర్శహర్షోన్మీలితతారకా
> అహో రాగవతీ సంధ్యా జహాతి స్వయ మంబరమ్.

ఈ శ్లోకము సమాసోక్తికి ఉదాహరణమై ఉత్తేజితాను రాగ యైన కాముకీవృత్తాంతమును సూచించుచున్నది. శరత్కాలమందలి వెన్నెలశోభ వర్ణనాతీతము.

> రాత్రి శ్శశాంకోదితసౌమ్యవక్త్రా
> తారాగణోన్మీలితచారునేత్రా
> జ్యోత్స్నాంశుకప్రావరణా విభాతి
> నారీవ శుక్లాంశుకసంవృతాంగీ.

రాత్రికాంత ఉదయించిన చంద్రుడను వక్త్రముకలదై, తారాగణచారునేత్రయై, వెన్నెలయను ప్రావరణముకలదై, శ్వేతాంబరధారిణి యైన అంగనవలె భాసించుచున్నది. అన్యోన్యబద్ధవైరముకలవారును విజిగీషువులు నగు నరేంద్రులు యుద్ధోద్యోగము చేయు సమయ మిది. కాని సుగ్రీవుడు మద్యమత్తుడై యెట్టియుద్యోగమును చేయువాడుగా కనబడుట లేదు. ఆచక్రవాకము భర్తనువలె, అరణ్యము నుద్యానవనముగా భావించి సీత నన్ననుగమించినది. లక్ష్మణా నీవు కిష్కింధకు వెళ్ళి కామాంధుడైన సుగ్రీవుని హెచ్చరించి రమ్ము నామాటగా ఇట్లనుము 'నచ సం

కుచితః పంథా యేన వాలీ హతో గతః.

సంస్కృతభాషయందు లౌకికకవిత్వమునకు ఆద్యోదాహరణమైన రామాయణమహాకావ్యము సత్యము, ధర్మము, వీరము, ప్రేమము అను చతుస్తంభములమీద నిలచిన ఆర్ష జీవితసౌధము. కవిత్వబీజములు వేదవాఙ్మయమందే లభించుచున్నవి. అక్కడ కవిత్వము పరమేశ్వరనాయకము. వాల్మీకి యీవివిధకవితాబీజములను ప్రోగుచేసి అవతారపురుషుడుగను, ఆదర్శమానవుడుగను భావింపబడుచున్న శ్రీరాముని ఇతివృత్తమునకు సంధించి, పర్వతములు నదులు ఉన్నంతకాలము నిలువగల ఇతిహాసమును నిర్మించెను.

# కుసుమాంజలి

శ్రీ మహావాది వేంకటరత్నము

❋

ఏ నొకమాపు పూలవని కేగితి; కమ్మని పూలవెల్లి యు
ద్యానము నెల్ల ముంచినది; యవ్విరితావుల మోచి తెచ్చు మం
దానిలసౌఖ్యముం గనుచు నద్భుత మైన రసానుభూతితో
నే నొక పూవుగొమ్మకడ నిల్చితి; నూహలు పర్వులెత్తగన్.

బాహ్యసృష్టి మఱచి భావనాజగతిలో
పూవుగొమ్మపొంత బొమ్మవోలె
నెంత సేపు నిలిచి యే నుంటినో కాని
నన్ను మేలుకొలిపె నమిలికూత.

కన్నులు విచ్చి నల్దెసలు గాంతుగదా పువుగొమ్మ లెల్ల మే
ల్వన్నెల పచ్చనాకు వలిపంబులు దాలిచి, మొగ్గసొమ్ములం
జిన్నెలు దిద్ది. కెంజిగురుజేతులు మెల్లన సాచి, పిల్చిన
ట్లున్నది నన్ను; పూలసిగ లూపుచు తియ్యని తేటిపాటలన్.

కమ్మని పారవశ్యమున కన్నులు రెండును చెమ్మగిల్ల పూ
గొమ్మల పిల్పు గాదనక గొబ్బున ముందుకు సాగిపోయి యం
దమ్ముల నొప్పు నొక్క లతదాపున నిల్చితి; తత్ప్రసూనద
ర్పమ్ములు నన్ను గెల్చి తమవంకకు లాగెను నేత్రపర్వమై.

సురుచిరపుష్పవైభవముఁ జూచుకొలందివి నామనస్సులో
తఱుగని కాంక్ష లూరినవి; తావుల జిమ్మెడి యొక్కపూవుకై
కరములు సాచి కోసికొనగా గమనించితి; నంతలో నెదో
గుఱుతుకు వచ్చి పాప మని కోయుట మానితి జాలిగుండెతో.

అది గని పుష్పులెల్ల ప్రియమారగ నిట్లనె: మమ్ము దాక గా
దెదరెద వేల? యీపగిది బిత్తరపోయెద వేల? యేమి యా
పద ఘటియిల్లె? మాదు చెలువంబులు కన్నుల కింపుగావొ? మీ
చదువులు మమ్ముగూర్చి విరసంబు లెవేనియు నూరిపోసెనో?

అంటగరానివార మనియా వెనుకాడెదు? మమ్ము దాక; మా
కంటె పవిత్రు లెవ్వరు జగంబున? మంగళశోభ లెల్ల మా
యింటనె చేరియుండు గద? హేయపువారము గాము మేము; మ
మ్మంటిన నీమహత్వ మడుగంటునొ? శౌచము మాసిపోవునో?

ఆటవికుల మంచు నల్పాయువుల మంచు
కంటకములు గ్రుచ్చి కలతుమంచు
నెపము లెన్నకయ్య: నిత్యకళ్యాణంబు
పచ్చతోరణంబు బ్రతుకు మాది.

గాలికెరటాల కెల్ల గందాలు నింపి
ప్రకృతిరమకు సౌందర్యడోలిక లమర్చి
ప్రాణికోటికి తేనెషర్బత్తు లొసగి
తనుపుచుందుము సకలభూతముల మేము.

మా మహత్వంబునకు స్వర్గసీమ సాక్షి
మా శుచిత్వంబునకు లోకమాత సాక్షి
మా మృదుత్వంబునకు మంచి మనసు సాక్షి
మా ప్రతాపంబునకును మన్మథుడు సాక్షి.

జంగమస్థావరాత్మకజగతియందు
నేమిటను మాకు దీటైన దేదిలేదు;
సృష్టియెల్లను మాతోడి చెలిమి జేసి
మించుశోభలతోడ దీపించు గాదె?

మా మనస్సులు మధుపూర్ణమందిరములు
మా స్వరూపము లందాల మంటపములు
రసికులే కాదు కేవలారసికులైన
శిరములం దాల్చి గౌరవించెదరు మమ్ము.

సృష్టిగలట్టి చక్కదన మెల్లను దోచినజాతి మాది; యు
త్కృష్టము మాదు జన్మ; మొకకీడును మాదెస లేదు; మేము నీ
కిష్టము గాకపోవుటకు హేతు వదేమిటొ చెప్పుమా? కళా
స్రష్టల మైన మాఘనత చాటగలారె కవీంద్రు లేనియున్.

లలితమనోజ్ఞమోహనకళావిభవంబును రాశిపోయు మ
మ్ముల గనినంత రాగరసపూర్ణులు గారె విరాగులైన? మా
బలమున మున్ను మన్మథుడు భర్గుని దివ్యతపోమహత్వమున్
గెలువగలేదె. గౌరిపయి నెయ్యము తియ్యము సందడింపగన్.

అయ్యో! యే మిది? యెంత చెప్పినను దవ్వై పోవుచున్నావు? మా
నెయ్యంబుల్ వెగటయ్యెనా? మనసులో నీకున్న సందేహ మే
మయ్యా! తెల్పగదయ్య! మాయెడల రవ్వంతైన దోసంబు లే
దయ్యా! నమ్మగదయ్య! మాదరికి రావయ్యా! భయం బేటికిన్?

కన్నుల నీరు నింపుచు నెగాదిగ చూచెద వేల? మేము వా
కొన్నది నమ్మవేని కనుగొ మ్మిదె మాహృదయాలు చీల్చి; త
ప్పున్న మముం ద్యజింపు మిటు లూరక దవ్వగు టేమి యొప్పు? నీ
ఖిన్నత దక్క; మంచు పలికెన్ బువులన్నియు మూగబాసలన్.

అంచితబుద్ధితోడ పువులన్నియు బల్కిన పల్కు లెల్ల త
ర్కించితి; చిత్తమందు పరికించితి సత్యము; కాని తొల్లి జీ
ర్ణించిన జాలిపల్కులు స్ఫురించి యెదం గరగింప పువ్వులన్
గాంచుచు నేమి. చెప్పుటకు నా మన సొప్పక మిన్నకుండితిన్.

నా మౌనంబును గాంచి పువ్వు లనుమానం బేల? మా నెయ్యముల్
బ్రేమజ్యోతులు ముజ్జగంబులకు; హాళిన్ మమ్ము స్త్రీపూరుషుల్
కామింపం దగు; నమ్మ గొమ్మనుచుఁ బిల్వన్ మూగనై చాలసే
పేమీ తోచకయుండి తుట్టతుద కే నిట్లుంటి కన్నీళ్ళతో.

సత్యము మీరు చెప్పినది; సర్వవిధంబుల మీదుజన్మ సం
స్తుత్యము; సృష్టిలోన సరితూచగ నెదియు మీకు సాటిగా;
దత్యధికంబు మీ మహిమ; మన్నిటినిం దలదన్ను మీ కళౌ
న్నత్యము; చెప్పనేల? సుమనస్సులు మీ కొక లోపమున్నదే?

హేయపువార లంచు గణియింపను; కంటకజాతి యంచు న
ల్పాయువు లంచు నాటవికు లంచును దక్కువమాటలాడి య
న్యాయము గట్టుకోను; కృపణత్వముతో మిము గోసి ప్రాణముల్
దీయగ బుద్ధిపుట్టక మదిన్ దపియించుచు నుంటి జాలితో.

తలకు తొలంక మమ్ము గని ''తల్లికి బిడ్డకు వేరుసేయు పా
పుల'' మని దుయ్యబట్టితిరి; ''పువ్వుల మానధనంబు వెల్ల వి
చ్చిలవిడి దోచువార'' మని చాటితి; రా నుడులెల్ల లోఘవ
ర్తుల మగు మాయెడందల చుఱుక్కున గ్రుచ్చును వాడిసూదులై.

''దండలు గట్టి కొప్పులను దాల్పగ మీ యెలనాగలెల్ల మా
గుండెలలోన సూదులను గ్రుచ్చుచు వేఁచెదరంచు- న త్తరుల్
వండగ మీరు మాయసువులన్ బలిపెట్టుచు పచ్చినెత్తురుల్
పిండెద'' రంచు మున్ను విలపించితి; రా వెత లారిపోయెనే?

మించిన శోకతాపమున ''మీ నరజాతికి నీతి యున్నదా?
యంచును మీరు మమ్ము దెగనాడినపల్కులు ముల్కులట్లు గా
సించుచునుండ నెట్లు మిముఁ జేరుదు? కోరుదు మీదు నెయ్య; మో
యంచితమూర్తులార! పువులార! క్షమింపుడు నన్ను; మ్రొక్కెదన్

నామాటల్ విని పుష్పలన్నియును దైన్యంబెల్ల బాపింపగా
స్వామీ! యొ కవిసోదరుం డొకడు మాపై జాలితో జెప్పినా
దేమో మీ రవి యెన్ని మా కిటుల నస్థైర్యత్వముం గూర్చి మ
మ్మీమాడ్కిన్ వెలివేయగా దగునె? మేలే యిట్టి విద్వాంసుల్?

మా మానోజ్ఞము లెల్లకాలము కళామాన్యంబులై యుండ నే
మేమో యూహలకొద్ది చెప్పినవి మీ కీలాగు ప్రత్యక్షర
ప్రామాణ్యంబులుగా గ్రహించు టది భావ్యం బౌనె? సంభావనా
సామర్థ్యంబు గలట్టి మీకవుల ప్రజ్ఞల్ నూత్నసృష్టుల్ గదా!

ఇమ్మెయి నీవు పేర్కొనిన వెల్లను మాహృదయాంతరాళభా
వమ్ములు గావు; వట్టి కవిభావన; లాకవి మైన పుష్పహా
రమ్ములు దాల్ప డొక్కొ? మకరందము లానడొకో? సుగంధశై
లమ్ములు పూయడొక్కొ? పువులన్ నిరసించెడువార లుందురే?

కలకాలంబును మాశరీరము లనాఘ్రాతంబులై యున్న మా
లలితామోదము లెందుకయ్యె? సుమనూహ్లాదంబు విశ్వంభరా
వలయంబందు నశించిపోవదొకొ? మాభాగ్యంబు దీపించునే?
యిలపై మాబ్రతుకుల్ వృథా యగును గాదే? యెందు కీపుట్టువుల్?

మీరు కోయని మాత్రాన మేము చిరము
బ్రదుకనేర్తుమె? గాలికి రాలిపోక
నిరుపయోగంబుగా నిట్లు నీల్గుకంటె
పరుల కుపయోగపడుచావు ఫలము గాదె?

మాది పూటబ్రదుకు; మహిమీద నాచంద్ర
తారకంబు మాదు గౌరవంబు:
తలను దాల్చి మమ్ము తగ గౌరవించును
ధాత యైన వాని తాతయైన.

విరులపూజలంది వేల్పులు మెత్తురు;
విరులు పొడగి లతలు తరులు వెలయు;
విరులు ముడిచి స్త్రీలు పురుషులు శోభింత్రు;
విరులు లేని సృష్టి వృథయ కాదె?

ఇట్టి యదృష్టముల్ గలవె యెవ్వరి కైనను? విశ్వకీర్తికిం
బట్టము గట్టికొంటిమి ధ్రువంబుగ నల్పుల మయ్యు; మమ్ములన్
ముట్టిన మాసిపోదు మని పూజ్యులు మీరు త్యజింతురేని మా
పుట్టువు లేమిగాక చెడిపోవు గదా? యిది మీకు పుణ్యమే?

కరచరణాదు లెవ్వియును గానని మాకు ధరిత్రిలోన మీ
కరముల నాశ్రయింపనిదె కల్గునె? దైవము గొల్చు భాగ్యముల్;
పరమతపోధనుల్ గనని పావనమూర్తిపదాల వ్రాలి త
చ్ఛిరమునఁ జేరుభాగ్యములు చేకుఱు మీదగు చెల్మి చెడ్డదే?

ఎవరికిగాని యీతనువు లెందుకు? కొమ్మల నంటియున్న నీ
వివిధసుఖానుభూతులు లభించునె? మాకు నఖండకీర్తి వై
భవములు దక్కునే? యడవిపాలయి పోవుటగాక; తొంటి మా
యవినయభాష లెన్నక సమాదరవృత్తి ననుగ్రహింపుడీ!

తరుణీకోమలకంఠమాలలుగ నుద్భాసించుచున్ దత్పయో
ధరసంస్పర్శసుఖంబులం దనియుచున్ దన్మంజునీలాలకో
పరిభాగంబుల సొమ్ములై మెఱయుచున్ వాసించుకంటెన్ మహ
త్తరభాగ్యంబులు మాకు వేఱ కలవే? తర్కింపు డయ్యా! కృపన్.

కా దనబోక కష్టముల గ్రాగి – యకుంఠితదేశభక్తితో
చేదులు మ్రింగి – బాధపడి – జీవములం బలిపెట్టి – కీర్తి సం
పాదకు లౌ మహాత్ముల సమాధులపై పవళించునట్టి స
మ్మోదము మాకు మీ దయినపొత్తు లభింపకయున్న గల్గునే?

వాడిసూదుల బోలు పదరయున్న
వలపుసెజ్జల పైబడి నలగకున్న
వేడినూనెలలోన తపింపకున్న
కలుగునే మాకు నింతటి గౌరవంబు?

దర్శనపర్వమై సొబగుతావుల నించెడి మాకు మికర
స్పర్శసుఖం బొసంగి వలవంతలు మాన్పుడు; రమ్యజీవితా
దర్శము గూర్చి మా బ్రతుకు ధన్యము సేయుడు; మిమ్మఖావరా
మర్శలు మాని మమ్ము గతు మన్ననఁ జూడు; డివే నమస్కృతుల్

అంజలి చేసి మ్రొక్కినటు లా పువులన్నియు గాలితాకునన్
సంజవెలుంగునందు తెలిచాయలతో దల లాడ్చెవంచె నా
కుం జనియించె నెయ్యములు; కోసితి మెల్లన తాకి; పుష్పముల్
రంజిలె నేమొ తత్పరిమళంబులు గుప్పుమనెన్ వనంబునన్.

పుష్పలత లెల్ల నామీద పూలు గురియ
పికము లన్నియు మధురగీతికలు పాడ
నెమిలిమూకలు భరతనాట్యములు చేయ
ఘనముగా నన్ను వనలక్ష్మి గౌరవించె.

# దైవబలము

శ్రీ వావిలకొలను లక్ష్మీనరసింహారావు



వడివడి నడక్కతో తనువువచ్చెను దుఃఖప్రబంధుపాళితో
జడలుగ తీర్చియున్న కను చక్కగ నిక్కిన పిల్లజుట్టుతో
వడుగు నొసట్ల కాంతులను వారగ జేసెను జన్నిదంబుతో
గుడికిని జేరు బాలు డెఱుగండు మృకండుని చిట్టిపట్టిగా.

ఆటలపాడగా తగిన యట్టి వయస్సు సదస్సులోపలన్
పాటితవేదసత్ప్రథలు పాఱగ సేయగ దగ్గ యీడులో
వాటిని మాని యేమి పరివర్తనొ ఆర్తిమె మూర్తిగొన్నటుల్
మాటయు మంతి లేక గుడిమార్గము పట్టెను పూలపూజకై.

పరమేశుడు వరమిచ్చెడు
తరి పదునార్వత్సరములు తా మితి నిడుటన్
జరిగిన కీ దుర్ఘటనా
పరిణతి యిటు లున్న వెలుగుబాటలు రావే.

అభము శుభము నెఱుగనట్టి లేహృదయాలు
పసరుకాంతు లీను కిసలయాలు
ఏమి మునుగకున్న స్వామిగేహము జేరి
కేలుమోడ్చి నిలువజాలు నెదుట.

అమ్మయు నాన్న పప్పకయి ఆరట పెట్టగ కొట్టిరేమొ క
న్నమ్ముల జాలువారినవి నాయన నీరము ఘోరరూపమై
చుమ్మలువారె మానసము చూపుము మో మయవారిశిక్షకా
వుమ్మలికాలు; చాలు, నిక పూజక చేరర యిల్లు పిల్లడా!

మరణావృతేతి వెంపనునఁ మార్గము బట్టితె వారించితివె
అపుగున మృత్యురూపయగు నా నరభోజ ఘూపదీపముల్
జనువుము ప్రాణికోటిపయి జాలివహింపక కొంపముంచు నీ
పోరతన మేమిటో హాసనితో పసిపల్కుల ముచ్చటింపరా.

శాఖులు కండ్లు ప్రేలి వినగా కనగా కథ ఏహ్యారూపికిన్
చాలగ ఏండ్లు వృద్ధునకు చక్కని చక్కెరబొమ్మకన్నదున్
మేలగు పూప ప్రాయము సుమించెను వారికి కొద్దికాలమి
ట్లేలకొ భేదముల్ తెలుపుటే గద స్వామ్యము దైవమైననున్.

కన్నులు రక్తరోచులను కార్చగ నూర్చుచు ఏండ్లు ఘోరమా
తున్నను నెక్కి ప్రాణములు తూల్చగ వచ్చెను కాలరూపి యీ
తెన్నున నూరకున్నయెడ తెచ్చును ముప్పును లేత ప్రాణికి
చిన్నెల వేమి శంకర వచింపుము ప్రక్రియ కుజ్జువానికిన్.

కానక కన్న యొక్కరుడు కాడొకొ పిల్లడు వానికండ్లలో
మానికమట్లు పెంచి రగు మాతయు దండ్రియు వారిప్రేమలన్
బోనముచేసికొన్నయెడ పోవునె యాకలి ధర్మరాజుగా
తా నిటు సేయగా జగతి దారులు తప్పుచు ముప్పు కప్పదా.

బుడుత హారమూని శంభుని
విడువడు తా ప్రేతపతియు విజ్ఞత కనుచున్
కడువడి పాపని కావడు
చెడె ధర్మము స్వామిభక్తి చేడ్పడకున్నె.

పాపము శంభుకౌగిటను బట్టె భవంబును పారగొట్టి తా
చూ పిటు త్రిప్ప డాసిసుగు శుభ్రదుదాత్తమహాత్వవేత్తయై
కోపముతోడ కాలు డడుగో తనపాశము బాలు నౌదలన్
మోపెను జర్జరించినదిపో నరలోకము శోకరూప మై.

బాలుడు వదలడు శంకరు
కాలుడు విడ డసలు బాలు కాకోలవిష
జ్వాలలు విడె పరమేశుడు
చాలగ పసివాని గాచు సంరంభములో.

జటలో జాబిలి తుల్క గంగ తొణుకన్ జాజ్వల్యమానంబుగా
నిటలంబందున కన్ను వెల్గ కరుణానిర్నిద్రభావోదయాల్
తుటటుముల్ గట్టి నటింప శైలతనయాదోర్ధగ్నవామాంగుడై
పటు భక్తావనదీక్షు శంకరుడు తా ప్రత్యక్షమై నిల్చినన్.

కాలు నణచ జగము గగ్గోలు పడిపోవు
పాపరాశి హెచ్చు భయము చచ్చు
కావు మనుచు శివుని దేవతాపతి వేడ
మనిచినాడు పదవి నునిచినాడు.

మధురమధురమైన సుధలూరు జీవిత
వెలుగు జేరి కోలలు వెలికిబాటి
మంగళములు గాంచి మహిత మార్కండేయ
తపసియయ్యె భక్తితత్త్వమునను.

# అవ్యాజానురాగము

❋

తెరలును జాలరుల్ మృదుల
తిన్నెలు వన్నెలు చిన్నెలెన్నియో
అరలునులోని కూటములు
అంతరువుల్ పరమేశుపూజలన్
జరిపెడు భక్తసంఘముల
చర్చలశాలల నెన్నో నిల్పుచున్
తిరిగెడు నెవ్వరో తెలిసె
తీర్పరి శిల్పి సలీడు కాడొకో.

భుగభుగ పొగలకు మాఱుగ
ధగధగ లను గ్రక్కు మణులతండము భక్తిఁ
భగవంతుని తల నిలిపెడు
సొగసుగ భుజగప్రభుండు సూపెన యెదుటన్.

నిండి తొణక తనదు తొండంబు నిండను
సరససరస మైన సలిలమూని
విసలు పత్రి కొనుచు నరిగెడు పూజకు
కరివరుండు నడల శిరులు పుల్క.

అందరు భక్తిసగ్రస
లాయహిభూషణుకాలకంధరున్
చందురుతాల్పు గంగ సిగ
జాల్కొను వేల్పు దినంబు కొల్చు నా
నందము నందగా తలపు
నందినవారలె జాతిధర్మముల్
సుందరముల్ శివంకరము
లున్ సుమనోహరపాత్రముల్ గదా.

ఎండకు యెండుచు వానకు
గుండెలు చెడ తడిసికొనుచు కొంపయు కనకే
యుండెను శివు డీవనిలో
దండి దయాస్పదుడు తా త్రిదండివిధమునన్.

అనుచును తల్చి సాలీడు మ
హాద్భుతసుందరసౌధరాజముల్
కనుల మెఱుంగు మాలికల
కల్పనసేయగ కట్టి జాలరుల్
వ్రనుచుచు వ్యర్థజీవితము
పూరక పుచ్చక స్వామిసేవకై
ఘనముగ త్యాగముల్ సలుప
గల్గుట స్వర్ణచరిత్ర కాదొకో.

కుక్షిఁగట్టి స్వామియడుగుల
నిడుచుండె నివాళి కరియు నిర్నిరిభ న్
ప్రా... భువనము నిడుచున్
చెడుబూ జని తొండమునను చరచును వానిన్.

తొండముతోడ తెచ్చి నవ
తోయము పోయుచు చంద్రమౌళి నా
ఖండిలమై భవోన్నతుల
గాఢముదంబున గొల్చి పూలతో
మండలతోడ పత్రిని స
మర్పణ జేసి శిరంబు వంచి వే
దండము మ్రొక్కు కన్గొనల
ధారలు గట్టుచు ప్రేమలూరగన్.

ఆకులు కొమ్మలు పూవులు
లోకేశ్వరుతలను నిలిపి లోకువ నిడుటల్
తాకని వానిని దీయుచు
సాకారత మణులు నిలిపె స్వామికి ఫణియున్.

వీరు పెట్టువాని వారలు తీయుచు
భక్తి దెలుప తమదు శక్తి నిలుప
పూజసేయుచుండ రోజుకు రోజును
కాలగళుడు వాని లీల మెచ్చె.

మచ్చర మూని పుట్టముల
మాపిన దెవ్వరు నాదు పూజనున్
మెచ్చక భంగమున్ సలుప
మేకొని రెవ్వరు నా నివాళికిఁ
యిచ్చుచు స్వస్తి నాశనము
నిట్టుల సేయుట యెవ్వరంచునున్
అచ్చపువైర మా మువుర
యందున దోచుచు రెచ్చె హెచ్చుగా.

సాలీసిపూజబుసలును
తూలించెను ఫణియు మణుల తోరపుఅలుకన్
రాలని కరి తొండంబున
కూలిచి పూవులను పెట్టె కోమల మనుచున్.

పూజ లిటుల రోజురోజును మాయుట
చెత్తచెదము వచ్చి నెత్తిపడుట
కోపశిఖలు మదిని రేప నంతరువుల
పొంచి రొక్కరొకరు వంచనముల.

జాలరు లంతరువులు బుస
తూలింపగ ఆగ్రహంబు తోరం బగుటన్
కూలగ వేలని కాళము
కాలాభీలంపునాల్కకడ శ్రీ నిలిచెన్.

తనదు వైరి నెదిరి దండింప ద్విరదంబు
పూనుకొనియె దానిమేను దొరగ
జేయ సర్పరాజు చేసెను యోచన
పగలు పొగలు సెగలు రగుల జేయ.

భుజగ మూర్పుగాలి పోసి జాలరులను
తూల్చులోన దూరి గెల్చితినని
సాలి డెంచుకొనియె కూలింప మణులకు
క్రింద పొంచె పాము ముందుముందె.

రాళ్ళు రప్ప లటుల రాసులు పెట్టుచు
తనదుపూజ దూల్చు దానవులను
మట్టుబెట్ట నెంచి కట్టల్కఁ నేనుగు
తొండమునను మణులు తొలఁగద్రోచె.

పాము లోన దూరి బాధించె ద్విరదము
వైరి నటుల గాని వంచ ననుచు
శివునిమూర్తిపైన శీర్షంబు గొట్టంగ
కాళ మడగె కరియు తూలిపడియె.

రంగగు బాలచంద్రుడు శి
రంబు పయిన్ నటింప పెన్ సిగన్
పొంగి యభంగసంగతుల
పోవుచు గంగ రహింప నింపుగన్
ఖంగున మ్రోగుచున్న చిరు
గంటలతోడ వృషేంద్రవాహుడై
మంగళమూర్తి వచ్చె నుమ
మానసవర్తి శివుండు ప్రోవగన్.

మువ్వురకు మోక్షము నిచ్చుచు
అవిరళశ్రీకాళహస్తి నది పానరించెన్
చవు లిడి కీరితి కావ్యపు
హావళికి గిరిజాప్రియుండు హారిగుణుం డై.

## సాక్షాత్కారము

విల్లును అంపకోలయును
వెంటను భిల్లైత బోయగుంపునుఁగా
కొల్లగనుండ కానలను
కోనల చిందరవంద రౌనటుల్
పెల్లుగనార్చు కొంచు పటు
భీకరసూకర మొండు పర్వగా
అల్లనపోవువా రెవ్వరు
నాతడు శాంబరవేషి శంభుడా.

కంఠాలు తీరి నిగ్గుల వె
గా నునువెల్గుల వెల్లఝుంచి భూ
మండలమందు కాంతులను
మార్చెను భానునియట్లు నొప్పుచున్
మండితవీరవిక్రమర
మాపరిణద్ధవిలాసభాసికో
దండధురం ధరుం డెవఁడొ
కవ్వడి సవ్వడి కెల్లిపోయెనే.

చెవిదాక లాగి యిషువును
పవి సన్నిభ బాణచయము పారించిన మే
నవియగ ప్రాణము విడలుచు
భువిగూలెను పంది భూరిభూధరమనగన్.

నా విశిఖాన కూలినది
నా దని బోయయు నాదుబాణమే
జీవముదీసె నీ కిటికి
ఛీ వెడలుం డని బాలయోగియున్
స్థావరజంగమం బయిన
సర్వప్రపంచము శస్త్రసంతతిన్
కావిరి గ్రమ్మ యుద్ధమున
కాలిడి నారలు నుచ్చరించుచున్.

పగడాకువలె తూలి తొగ రేకువలె సోలి
గట్టిగా పల్లటీల్ కొట్టి కొట్టి
కోరమీసముదువ్వి మేర మీరుచు నవ్వి
ఉనుములపోల్కిగా నరచి యరచి
దిక్కుంభినులగుండె వ్రక్కలు వారగా
యురవడి తొడలను చరచి చరచి
పికిలిపిట్టలయట్లు బీరంబు సడలక
బిరబిర తిరుగుడు తిరిగి తిరిగి

చుట్టుచుట్టు ఫీలు లిజ్జు చేతులు తట్టి
తనను మెచ్చి [illegible] తలచుచుండె
[illegible] మాయబోయకు తపసిగా
నున్న [illegible] చవారియువకునకును.

ఎంతగ బోరి మాయలను
సేచిన ప్రాచిన మోదుగట్లుగా
క్రంతలు వారి రక్తఝరి
కారిన మారిన పూవు వైరి కా
వంతయు హస్తముల్ ముడిచి
వంచడు శీర్షము ధాచవారిఢీ
మంతము మూర్తిమంతము ప్రశ్ర
మాంతము శాంతము సౌఖ్యవంత మై.

మాటలతోడ నేల యను
మానము ఆటలతోడ మాను నే
యీ మెలగాక యీతనిప
యిం బడి నోర్చుచు కీర్తిమాలికల్
గాటపుశక్తికి నోందు నని
కవ్వడి గాండివ మూని భిల్లుపై
తూటులువెట్ట నెత్తె నది
తోడనెలాగెను బోయ మాయగా.

తూణము ధనువును లాగుట
ప్రాణముకడ చనుట తెలిసి పార్థుడు ధరణీ
స్థానము వడకగ మల్లత
నూనుచు యుద్ధమ్ము సేయ నొడిసె శివుపై

జెట్టులయట్లు చేతులను
చేతుల దట్టుచు నుగ్గునూచ తా
నట్టుల వృక్షసంతతుల
నాశము సేయుచు కాలితాపుచే

గుట్టలుగూడె పిండిగను
కొట్టుచు వారెడు పార్థుమీదికిన్
బెట్టుచు నేలపై వయిచి
పెకొ భిల్లుడు నల్లపీసుడై.

తన జపమును సత్వంబును
పనిమాలిన వగుచు పవను పజ్జ నిలుపు డి
ప్వాను పోలుచు పొల్లుగ నర
కనుమాయుచు అర్జునుండు కరములు మోడ్చెన్.

సికలోన పెట్టిన చిత్రంపు నీకలు
చదలేటిలో నున్న చందమామ
కుతుకను గూర్చిన కురువెంద పేసలు
భూరిఫూత్కృతఫణిభూషణములు
కటిచుట్టు వెట్టిన కమ్మల గోచియే
ముచ్చటౌ ఏనుగుపచ్చితోలు
విజయలక్ష్మిని గూర్చు విల్లును అమ్ములే
దనుజుల దునుము ముమ్మొనలవాలు
పిఱుద నున్న భిల్లపిల్లయె గిరిజగా
బోయలెల్ల ప్రమథపుంజ మవగ
మొలకనవ్వు విరిసి మోమున క్రమ్మగా
నీలగళుడు పార్థు మ్రోల నిలిచె.

ఏమిది ఏమి కన్నుగవ
యేరిని చూచును చంద్రమౌళినా
స్వామినె భర్తు గాచుటకు
చక్కగ వేషము గట్టి బోయవై
కామిత మీయ వచ్చితివె
కాలమహోనట నీలకంఠనీ
కోమలపాదపీఠి మది
కొల్వొనరింపుము రమ్ము శంకరా.

అరివిజయకారణంబులు
గురుతరమోక్షప్రశస్తి గూరుచు సొమ్ముల్
పరిచితవేదార్థంబులు
స్మరహర నీపదయుగంబు సారించగదే.

అని తనువేడు పార్థునకు
నద్రిజవల్లభు డిట్లు వాకొనున్
తోణుకగ తేనె కన్నుగవ
తోచగ వెన్నెలవాక నెత్తిపై
ఘనతరభంగసంగతుల
గంగ నటింపగ నింప తృప్తి వే
గను నిదెకొమ్ము పాశుపత
కామితదివ్యశరాసనంబులన్.

అనుచు పలికి యియ్య అద్రిరాట్సుత గూడ
కనులలోన ప్రేమ చినుకుచుండ
తల్లిదండ్రిపాదతలములు స్పృశియించి
పార్థుడరిగె తనదు భ్రాతకడకు.

# వైదేహి

## శ్రీ నాదెళ్ళ మేధా దక్షిణామూర్తి



'వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా'

సీతారాములు లోకైకపూజ్యులు. ఇందాబాలగోపాలము వారిని స్మరించుచుందురు. ఆదికవియే వాల్మీకి మొద లెంద సుకవు లెందఱు వారిపేర్మి నెంచలేదు? ముందిం కెంద ఱెంద ఱెంచకుందురు?

'యది క్షుణ్ణం పూర్వై రితి జహాతి రామస్య చరితం
గుణై రేతావద్భి ర్జగతి పున రన్యో జయతి కః?'

అని ప్రశ్నింపఁడా మురారి? శ్రీరాముని మించిన ధీరోదాత్తనాయకుని, వైదేహిని మించిన సాధ్వీమతల్లిని గానము. వెక్కేల? సీతారాములనే మన తలిదండ్రులనుగా నెంతుము.

అట్టి లోకైకజనని నేదురాత్ములైన స్పృశించుటఁగూడ సహింపము. కావున, రావణుఁ డాయమ మూర్ఛనందినప్పుడు :

'తతో విదార్య ధరణీం నఖై, రుద్ధృత్య బాహుభిః'

అని గడ్డనే పెల్లగించెను గాని, యాతల్లిని స్పృశింపలేదన్న ట్లధ్యాత్మ రామాయణాదికములం దెందెందో కలదు. కాని పుట్టపట్టి యన్నదిట్టు:

«జగ్రాహ రావణ స్సీతాం। బుధః ఖే రోహిణీమివ
వామేన సీతాం పద్మాక్షీం। మూర్ధజేషు కరేణ సః
ఊర్వోస్తు దక్షిణేనైవ। పరిజగ్రాహ పాణినా.»

చంద్రునికి (బృహస్పతిభార్యయో) తారయందు జన్మించిన బుధుఁడు తనసవతితల్లియే రోహిణినివలె 'పూజాం గృహ్ణాతి' యను సూచనకొఱకని వ్యాఖ్యాతలంద్రు. శ్రీరామచంద్రమూర్తిని దనకడకు రావించికొని భూమిజం గొనిపోయి పూజించెననియు ననువారుందురు. అంతేకాక రక్కసులకుఁగల ఛాయాగ్రాహిత్వ నైపుణ్యమునుబట్టి :

'కేశచ్ఛాయాం పరామృశ్య। జానుచ్ఛాయాం తథైవచ
గృహీత్వా జానకీం హృష్టో। లంకాం ప్రాయాత్స రావణ'

అన్న స్కాందపురాణోక్తిని పాటించినను, దశముఖుఁ పిదప జటాయువు క్లిశ్యమాను నొనర్చినతని

'స పరిష్వజ్య వైదేహీం వామే నాంకేన రావణః
తలే నాభిజఘా నాశు జటాయుం క్రోధమూర్ఛితః॥'

అని వాల్మీకి పల్కినదానిలోఁగూడ నాయమను నిజవామాకస్థితం జేసికొని చనెనని స్పష్టము కాకపోలేదు.

కాని, యతివేషధారిగాఁ దానిల్చిన యామాయావి తాను రావణుఁడనని 'భార్యా భవసి మే యది' యంచు బయటఁబడ్డంతనే

'త్వం పున ర్జంబుక స్సింహీం మా మిచ్ఛసి సుదుర్లభాం
నాఽహం శక్యా త్వయా స్ప్రష్టు మాదిత్యస్య ప్రభా యథా'

యని బహుళపల్కుటలోఁ దనకు రామునందుఁగల యవినాభావత్వమును సూచించుచు, 'ఇక్కడకు దేవలోకమునకు' నన్నట్టున్న తారతమ్యము నుగ్గడించె. తుద నశోకవనము నందుఁ బదిమాసములు నిద్రాహారవర్జితముగాఁ గృశించి యహోరాత్రముల బహువికృతానన రాక్షసీ సంవర్జితయై వణఁకుచున్నెడఁగూడ నారాక్షసేశ్వరుఁడు మరలమరల నయముననో భయముననో వశపఱచుకోఁజూడఁగా వానికిఁ దనకు నడుమను దృణాంతరమును గల్పించుకొనియో, పరాఙ్ముఖముగానో,

'అనన్యా రాఘవే ణాహం భాస్కరేణ ప్రభా యథా'

యన్న పాఠమునే మరలమరల బోధించినదిగాక,

'నహి శక్యః మహాభాగో రామలక్ష్మణయో స్త్వయా
నిక్యం సందర్శనే స్థాతుం శునా శార్దూలయోరివ'

యని యారాక్షసిని నిరసింపనైన నింతయు వెనుదీయ దయ్యెను.

త్రిలోకవిజేతయగు నిట్టివీరు నామహాబలశాలి కృశాంగియే నొక్కయబలచే నిట్లు పలుమఱు నిరసింపంబడియు, బలాత్కరింప వెనుదీయనేమిటికి నేకైకను దోఁపకపోదు. అప్పుడాతనితోనే యట్లన్న మహాపాతివ్రత్యతో మున్ను తానందిన వేదవతీ నలకూబర శాపంబులం బాటింపక పుంజికస్థలకు వంచించినందుల కలిగిన పితామహుం దట్టియకృత్యమున కింకెప్పుడైనం బాల్పడ్డ వెంటనే తలలెల్ల వ్రక్కలయ్యెడి వనెన్న భీతిం దెల్పెను. కావున నెంతసేపైనను మూరాక్షసుండైయే చేర్పరింపుటో వెఱపుఁగొల్పుటో జరిగెనే కాని

స్పృశి బోలేదన్నది మనకు సువ్యక్తము గాఁగలదు.

అంతేకాదు. ఆపౌలస్త్యుఁడు కామరూపుండౌట నెన్నెన్ని వేసములనో తాల్చి మోసపుచ్చఁ జూచినకతన, నాంజనేయుఁడు తనను డాయవచ్చినప్పు డెంతకు నమ్మక తుదకు శ్రీరామ కల్యాణగుణ కథనపూర్వకవద్దివ్యమఙ్గళ విగ్రహాభివర్ణనంబున, సీతాప్రత్యయోత్పాదనకారియై, శ్రీరామదత్తాంగుళీయకదానంబొనర్చి, తచ్చోకపారవశ్యం బెలింగించి తద్దాసభూతుండైన తాను దదనుగ్రహంబునఁ బారావారంబును దాఁటి శ్రీరామకార్యార్థమే వచ్చి తద్దేవీపాదాబ్జవందన పరిపూర్ణచేతసుండ నైతినని భక్తిభావం బుగ్గడింప, నాతల్లి మహాగాధకూపపతి తాద్భుత భయంకర నిజస్థితిం దెల్పి తత్క్రూరరాక్షస నిర్ణీత మాసద్వయాత్మక జీవితానుగ్రహ కాలపరిమితిని వేదనం బొనర్పఁగా నామారుతి

'అస్మా ద్దుఃఖా దుపారోహ । మమపృష్ఠ మనిందితే
త్వాంతు పృష్ఠగతాం కృత్వా । సంతరిష్యామి సాగరం
శక్తిరస్తి హి మేవోఢుం । లంకామపి సరావణాం.'

అనుచుఁ దా నణురూపంబుదొట్టి యాకసంబంటుదనుకఁ దనదేహంబును గుంచుచుఁ బెంచుచు నెంతకైనం దగుదునని యగపఱచి విశ్వాసంబుఁ గొలిపెను.

ఇంతిం తనరాని మహావిపత్సముద్రమున మునకలిడుచు నల్లాడుచున్నదయ్యు, నాసాధ్వీమతల్లి యేమని బదులు వల్కెనో యా ప్రాచేతసుల నోట నేవిందము :

'తవసత్త్వం బలంచైవ। విజానామి మహాకపే!
వాయోరివ గతించాపి। తేజ శ్చాగ్నేరి వాఽద్భుతం!

భర్తృభక్తిం పురస్కృత్య। రామా దన్యస్య వానర!
నస్పృశామి శరీరంతు। పుంసో వానర పుంగవ!'

యని యంతతోనూరకుండక, యేకోఁతికూఁతలకు సందీయకుండనే,

'యదహం గాత్రసంస్పర్శం। రావణస్యబలాద్గతా
అనీశా కింకరిష్యామి। వినాథా, వివశా సతీ!'

యని బుద్ధిపూర్వకము కాని యానాఁటి తన యశక్తస్థితిం దెలిపి, యింక, గర్తవ్య మేమన్న.

'యదిరామో దశగ్రీవ। మహ త్వా సబాంధవం
మా మితో గృహ్య గచ్ఛేత। త త్తస్య సదృశం భవేత్'.

అని నిర్వచించివైచెను. ఆహా! అంతటి ప్రాణసంకట స్థితిలోనేమి? యా గుండెనిబ్బర మేమి? ఏమి దీక్ష! ఏమి ధర్మైకపరత్వము! అట్లన లోకాతీతయె నాకల్పికే చెల్లెఁగా నొరు లెవ్వరికైన నౌనా? మన పొడిమాటలేల? ఆజగచ్చక్షుశ్చాత్ర వయ్యండే

'ఏత త్తే దేవి! సదృశపత్న్యా స్తస్య మహాత్మనః
కా హ్యన్యా త్వామృతే దేవి। బ్రూయా ద్వచన
మీదృశమ్?'

అనికదా యద్భుతపడెను. అట్టియాయమ పాతివ్రత్య మహత్త్వమునకు దారుకాణ వెనువెంటనే యగపడెనుగాదే! ఆహనుమంతునితోఁక ముట్టించినట్టు విన్నంతనే యాదేవి,

'యద్యస్తి పతిశుశ్రూషా। యద్యస్తి చరితం తపః
యదిచా స్త్యేకపత్నీత్వం। శీతోభవ హనూమతః॥'

అని యనుకొన్నంతనే, యాభక్తాగ్రణి దేహంబున కాయగ్గి కాకయంటక లంకాదాహంబునకే తోడ్పడెను. కావున నంత మితిమీఱినయెడ నాపతివ్రతాశిరోమణి తీవ్రదృష్టిం

జటిపీనమాత్రాన రావణుఁడేకాదు వానియబ్బ మహేంద్రుం డైన భస్మము కాకయుండునా? అందులకు శ్రాత్రిజ్ఞ తనపతేమిని చాఁజేయలేదనియుఁ బాపినిగూడ నంపు లకుఁ బూనవలదనియు లోకైక మహావీరాగ్రణియే నాకు త్రియేశునకే తద్వశంబు దక్కవలెననియుం బల్కెను.

ఇట్లు 'క్షాంతిమీఁదిసాము'గా నామహాదేవి చరించినను అగ్నిపరీక్షకు లోనుగావలసినదై

'పవపపురాశిలోని నవపర్ణశలాకయుఁబోలెఁ జారుప
ల్లవముల కుప్పలోనిడిన లాలితచంపకదామమట్లు ర
క్తవనజరాజిహంసియనఁగా నరుణాభ్రములోనవున్న యా
నవశశిరేఖఁబోలె దహనస్థితయయ్యె విదేహకన్య తాన్'

అని యెన్నంబడిన యాయన్నమిన్న పాతివ్రత్యం బగ్ని సాక్షికమైనది కావుననే—

'లంకేశ్వర ప్రణతిభంగ దృఢవ్రతం త
ద్వంద్యం యుగం చరణయోర్జనకాత్మజాయాః
జ్యేష్ఠానువర్తిజటిలంచ శిరోఽస్య సాధో
రన్యోన్య పావన మభూ దుభయం సమేత్య.'

అని భరతాభినందితగాఁ గాళిదాస చిత్రితయయ్యెను.

అట్టియా యశస్విని 'వివశ'యై మున్నెడనైనఁ దద్దైత్య స్పృష్టయౌటకూడ దోషాపాదకము కాకుండుటెరు వొకం డవ్వాల్మీకభవుండే తనయద్భుతోత్తరకాండమం దగ పఱిచెను.

అదెట్లనిన, నాపౌలస్త్యుండు తన జైత్రయాత్రలో నొక్కెడఁ దపోవనంబులదెసకేగి యందలి ఋషీశ్వరులను దాను జయించినసంజ్ఞగా వారివారి దేహంబులనుండి యొక్కొక్క రక్తబిందువుం దాను గైకొందునని వారి నొప్పించి గైకొన్నదానిని గృత్స్నమందు దాదిలక్ష్మి నావహించిన పాయసబిందు సందోహగర్భిత భాండంబున నునిచి తెచ్చి మండోదరి కిచ్చి 'విషపూర్ణం బిది దాఁచి యుంచు'మని తాను స్వర్లోకంబుపై దండెత్తిపోయి కామో ద్రేకంబునం జరించుచో, నేశాపవశంబుననేమి, యందే నిల్చిపోయినయెడఁ దనకు వైధవ్యం బౌనని ప్రాణ త్యాగార్థినియై, భర్తృదత్త విషగ్రహణం బొనర్చినతతి, నస్పృష్టపరపురుష కాద్భుతోత్తర రామాయణంబునం దెల్పినట్లు:

'తా నొకింతముట్టఁడఁప, నైన వెంచి దలంచు
నంత్రము లోని లిక్షైయాటఁగాదె!
వేగపడను నొంచి వెలిపింపఁగాఁబోయి
వెలిచి వచ్చునట్టి విధ మిదయ్యె'

ఆ మందోదరి యాఘ్రాణింపంబడియున్నకతన, నవోద్య గర్భంబున నుద్భవించి దేదీప్యమానరూప దివ్య విగ్రహంబుగల యాపట్టి నొకపెట్టెలోఁ బెట్టి పుష్పకా రూఢయై వచ్చి సుమారష్ట మిథిలానగర ప్రాంత క్షేత్రాంత స్థితం జేయుటయుఁ గొంతకాలమునకదవఁగా నొక్కట లాంగలం బంటిన యా మందసంబునుండి వెలువరింపబడి యద్దా సీతాభిధానయౌటయు సంఘటించినట్లు కలదు. అట్లేర్పడిన మందోదరీగర్భాపత్యాతిని బట్టి రావణునికి సీత కొమరితె యయ్యెంగాని, స్పర్శమాత్రమైనను దోషాపాదకము కానేరదన్నది ప్రస్తుతాంశము.

అది యర్వాచీన ప్రాచేతసేతర కల్పితమేమోయని శంకింప నవకాశము లేకుండ నట్లు వేదోక్తమే యైయున్నది సుండీ. ఎట్లందురేని, ఋగ్వేదమందే,

'పితా యత్స్వాం దుహితర మధిష్కన్
క్ష్మయా రేతః సంజగ్మానో నిషించత్
స్వాధ్యోఽజనయ న్బ్రహ్మ దేవా
వాస్తోష్పతిం వ్రతపాం నిరతక్షన్'

అని భవిష్యపురాణోపబృంహిత సీతాసముద్భూతి యందు సూచితమే యగుచున్నది. ఇందలి 'పితృ'శబ్దము కామస్వ రూపుఁడౌ రావణుని యెఱుంగునది. కులోచ్ఛేదికగా నేర్పడ్డ యీబిడ్డ సుదూరమున భూగర్భనిహిత యయ్యెను. లోకకల్యాణాభినివిష్టతకై సర్వవ్యాపక దైవతము శిశు వునందు బ్రహ్మచైతన్యమును గల్పించి మాతృగర్భమం దెట్లోయట్లే యాతల్లిని బృథివీగర్భంబున న్మనుపఁ దత్త్వా నాధీశుఁడౌ జనకభూజానికిఁ బరిలబ్ధ కానయ్యెననియు నిర్ధానసుబోధము కానౌను.

ఇంకొక్క విశేష మిద్దాన నెఱుంగదగ్గది. 'పితృ'

శబ్దము కామపరము. 'మహిత్వ' శబ్దము శ్రద్ధాత్మకము నౌట చేతఁ గామము శ్రద్ధారూప సముద్భూతిని గనునెడఁ గామ మును వత్సరవాసరములెల్ల ననుష్ఠించెడి దనియు. సాత్త్వి కమా శ్రద్ధానిని రాజసమా కామము మూలముగా వ్యష్టిమా నట్లు ఇంటింప యజ్ఞాదిసత్కర్మ కారి కడి లభించి లోక కల్యాణంబుఁ గొల్పును.

హిరణ్యకశిపుని బరిమార్చించి లోకక్షేమోత్పాదకుండు గానైన ప్రహ్లాదుభంగి, సీయమ రాజదుహితయై, తత్సురారి కులోన్మూలనంబుఁ గావింపనున్న దాటచే. దేవత లాయమను

'ఆర్వాచీ సుభగే భవ। సీతా వందామహే త్వా
యథానః సుభగాసని యథా నః సుఫలాసని'.

యని ప్రార్థించిరి. 'సీత' యన సర్వరాక్షస సంహర్త్రి యని యర్థము. అట్టి యో లోకకల్యాణ ప్రదా! మా కైశ్వ ర్యములకలుగ బలిపత్ని నాశము కాఁగాఁ బ్రకాశమునంది మా కనుకూలురాలవు గావలెనని దేవతలు కేల్మోడ్తురు. ఆపె నిట్లెంతురు :

'ఇంద్రః సీతాం నిగృష్ణాతు। తాం పూషాఽనుయచ్ఛతు
సా నః పయస్వతీ దుహా। ముత్తరా ముత్తరాం
సమామ్'.

ఇందలి 'యింద్ర' శబ్దము శ్రీహరిసోపాకము. వీర్యశుల్కము సర్వరాక్షస సంహర్త్రియునౌ నయ్యాదిలక్ష్మిని 'రామ' రూపమున నవతరించిన యా 'చక్రి' నిర్వక్ర పరాక్రమంబు దీపింప స్వాయత్తం బొనర్చుకొనుఁగావుత! 'పూషా' యన నచోఁ బోషకుఁడౌ జనకమహీపాలుఁ డాయమ నాతని కిచ్చుఁగావుత! అట్టు లాతల్లి మాకెల్లరకు రాఁగల పెక్కు వత్సరములు సమృద్ధిగా నన్నప్రదాత్రి యయ్యెడుఁగావుత!

ఇందలి 'యింద్ర' శబ్దము శాస్త్రార్థావబోధపరమాచో, 'సీత' యన సాత్త్వికశ్రద్ధ కానౌను. అది జతపడఁగాఁ (పూషా) బయోయోగసిద్ధి సంధాయకతఁ గొల్పుఁగాక! యని సమన్వయము.

ఇ దెక్కడిదో కాదు. ఏవివాహశుభలేఖలందుఁగాని సాధారణముగా 'జానక్యాః కమలామలాంజలిపుటే' యన్న శ్లోకంబు నుదాహరించి కొనునట్లే యేశుభంబులం దైనను గట్టాలవేళను :

'సుమఙ్గలీయం వధూరిమాం సమేతపశ్యత
సౌభాగ్య మస్మై దత్వా। యథాస్తం విపరేతన'.

యను మంత్రమును బఠించుట పెక్కురెఱింగినదే. ఆమంత్ర ముయొక్క యర్థము నాపాదివెడివారుగాని వినువారుగాని యరయరు. అదేమనిన 'సౌభాగ్యవతియైన సీతయిదిగో. ఈమెకొఱకు వచ్చిచూడుఁడు. ఈమెకు సౌమంగల్యమును గల్పించి మీమీయిండ్లకుఁ జరలుఁ' డని లోకసామా న్యావబోధము. దీనికి ముందువెనుకలం దరయ, రామా యణమెల్ల నద్దాన ద్యోతకము గాఁగలదు. ఆయొక్క చోటనే కాదు. వేదచతుష్టయంబునం దచ్చటచ్చటఁ దత్తత్స్ఫూరకము లెన్నేనియుం గలవు.

సీతోపనిషత్తని ప్రత్యేకము గాఁగల దాని యం దాయమ మూలప్రకృతియుం దానే ప్రణవప్రకృతియునై 'ప్రకృతి' వాచ్యగానొప్పు 'సాక్షాన్మాయామయి' యవ్యక్త స్వరూపగా నుండి, 'రామ' తాపి న్యుపనిష 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మేతి స్వరూపలక్షణ లక్షి తుండౌ సచ్చిదానందస్వరూప శ్రీరామసాన్నిధ్య వశమున సర్వదేహ్యుత్పత్తిస్థితిసంహారకారిణియైన జగదానంద సంధాయినిగా వెలింగెడినని తెలుచున్నది. కావుననే, 'ఆలోడ్యాఖిల వేదరాశి మసకృ ద్యత్తారకం బ్రహ్మ త ద్రామో విష్ణురహస్యమూర్తిరితి యో విజ్ఞాయ తీర్మికభూః గాయత్ర్యాః శ్రుతిమాతు రర్థమథనం ప్రత్యక్షరం వ్యాకరో ద్దైకైకస్య సహస్ర మాచితవాన్ గ్రంథంచ రామాయణో' యని యెంచంబడినది. అయ్యాదికృతియం దాధ్యాత్మిక సమన్వయంబు గాఁదగునట్లు, వాఖ్యాతిశాయి వ్యంగ్య ద్యోతకంబుగానక్కవికులగురుండు 'తత్రో రావణ సీతాయాః సీతాయాః' అను మొదలగు పెక్కుతావులందుదాహరించెను. 'లంకా' పదంబు శరీరద్యోతకంబనియు, 'నేకాక్షీప్రభృతి రాక్షసానీకం బింద్రియసూచకంబులనియు రావణకుంభ కర్ణు లహంకార మమకారములనియు నింద్రజిత్ప్రభృతులు కామాదిషట్కమనియు నిర్విధంబునఁ దెలియందగ్గది. 'పక్షీచ శాఖానిలయః' అన్నప్పుడు

ఉభాభ్యామేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాంగతిః ।
తథైవ జ్ఞానకర్మాభ్యాం నియతా పరమా గతిః' అన్నమైనే
జ్ఞానకర్మాంగాంగీభావ సముచ్చయంబువివక్షితంబైయున్నది.
ఇట్టి లోకమం దాధ్యాత్మరామాయణాదికను లేవైనను
వేదచోదితములే యైనా యఖండకావ్యచయంబుగానే పరి
గణింపఁదగ్గవి కాని యిప్పుడు బయలుదేరు ఖండకావ్యముల
వంటివి కావని యెఱుంగునది.

శ్రీసీతాభ్యుదయప్రశంస నిఖిలశ్లోకంబు లోకంబు నం
దై, సమ్యక్పరమార్థగమ్య మతిరమ్యం బౌచులక్ష్మీస్మృతి
వ్యాసంగంబున నగ్రగణ్యమగుచున్ వ్యాప్తంబుగానొత సా
నాసంపత్ప్రదసర్వసాధకతనందంగాంబ్రమాణోద్ధృతిన్

# హి పదేశము

## శ్రీ ఉప్పల వేంకటశాస్త్రి

❈

స్నానసంధ్యాద్యనుష్ఠాన సత్క్రియాక
లాపచణు లయి సూనృతా లాపు లగుచు
బఱగుదురుగాక బ్రాహ్మణుల్ భారతీయ
నిచయమునకు లభించుత నిత్యశాంతి.

గణ్యులైనట్టి రాజాధికారు లెల్ల
ప్రజలఁ బాలింత్రుగాక కృపాపరు లయి
భావుకాన్వితులై జనుల్ బఱఁగుచుంద్రు
గాక; భరతావనికి శాంతి గలుఁగుగాక.

అక్రమమ్ముగ వ్యాపారు లైనవారు
ధనము క్రయవిక్రయమ్ముల గొనక న్యాయ
పథము వీడక వర్తించి పఱగుచుంద్రు
గాకభరతావనికిశాంతి గలుగుగాక.

జగతి నంగార్థబలములు సంఘబలము
గలుగువా రెల్ల రన్యోపకారు లగుచు
ధర్మమార్గానుగతు లయి తనరుచుంద్రు
గాక భరతావనికి శాంతి గలుగుగాక.

అగ్నిసాక్షిగఁ గళ్యాణ మాడినట్టి
వల్లభుల వీడి కాంతలు పల్లవులకు
నుల్లము లొసంగి వర్తింపకుంద్రుగాక;
భరతభూమికి శాంతిఁ జేకురునుగాక.

అగ్నిసాక్షిగ గళ్యాణ మాడినట్టి
యిందువదనల నపరాధ మెఱుఁగనట్టి
వారి పురుషులు దుర్నీతి వదలకుంద్రు
గాక; భరతావనికి శాంతి గలుగుగాక

యువకు లైనట్టి భారతీయు లిఁకమీద
కట్నముల మిషఁ గన్యలఁ గన్నవారి
గుండియలలోన రక్తముఁ గ్రోలకుంద్రు
గాక; లోకమ్మునకు శాంతి గలుగుగాక.

గురులు శిష్యులయెడ వంచకులును గాక
గురులయెడ శిష్యులును వంచకులును గాక
క్రమముగా దయ భక్తియు గలిగి యుంద్రు
గాక; భరతావనికి శాంతి గలుఁగుగాక.

సుతులు పితరులయెడల నసూయ వదలి
సుతులయెడలను పితరు లసూయ వదలి
దేవతాభక్తిచేత వర్తిల్లుచుంద్రు
గాక; భరతావనికి శాంతి గల్గుగాక.

ఓర్మి నగ్రజులనుజు లన్యోన్యమైత్రి
మెలగుచుందురుగాక భూమీతలమున
జాతివైషమ్యములుగూడ సమయుగాక;
జేకురుఁగాక; భారతక్షితికి శాంతి.

శిల్పి తనకుంచ కవి తన చేతికలము
గాయకుఁడు వాద్యమున్ వీడి కలఁతఁ జెంద
కుండ దాతలు దయ గనుచుండ్రుగాక
చేకురున్ గాక భారతక్షితికి శాంతి.

కవుల గాయకులను శిల్పకారకులను
ధనికులో దాతలున్ ప్రభుత్వమ్మువారు
నెనరుచే నాదరించి మన్నింత్రుగాక
గలుగుగాక; కలాకారకులకు శాంతి.

న్యాయమార్గమ్ము బాయక నాయకులు ధ
రాతలమ్మును బాలింత్రుగాత జలద
సంచయమ్మును తఱిని వర్షించుగాత
శాంతి చేకూరుగాత దేశమున కెల.

బొజ లోపలఁ ద్రిభువనమ్ముల వహించి
పుట్టె నెవ్వాఁడు దేవకీ బొజ్జనుండి
యట్టి మాయార్భకుండు లోకాభినుతుఁడు
శాంతిఁ జేకూర్చుగాక దేశమున కెల్ల.

# ఉపాధ్యాయుఁడు

శ్రీ జి. జోసపు



హాయి జెమర్చు గొప్ప పర
మార్థహితోక్తుల సేసబ్రాలతో
తీయతలంపుబువ్వొడుల
దేల్చి నిసుంగుల చిత్తభూములన్
బాయలు జేసి జ్ఞానరస
వార్ధుల నింప శ్రమించు మాయుపా
ధ్యాయమహాశయా! నతుల
నందుకొ! మెచ్చితి నీదుశాంతికిన్.

మాటలు వచ్చిరాని కొఱ
మాలిన నేదరపిల్లవాండ్ర స
య్యాటల నీటుతో బ్రకృతి
యభ్యుదయంబుల పాఠశాలలో
గూటము జేసి, రేబవలు
కోరిన విద్యల కొల్లకొల్ల మో
మోటము లేక నేర్పుటకు
పూనెద వెంతటి శాంతమూర్తివో?

నీదెస జాటు భావముల
నేర్పు తనంబున కీర్తనీయవి
ద్యాదయనీయపద్ధతులు
తాండవమాడుచున్న వోయి ప్రే
మోదయ! నీ ప్రశాంతసుగు
ణోజ్జ్వలశక్తులు పూయకున్నచో
లేదు అదృష్టజాతకపరీమళ
సౌఖ్యము భూతధాత్రికిన్.

నీయొద్ద యోన్మాలు నేర్చిన కుఱ్ఱండు
సింహపీఠిక నేల జిత్తగించె
నీయొద్ద గుణితంబు నేర్చిన బాలుండు
రాజ్యాల గెలువ బరాక్రమించె
నీయొద్ద శాస్త్రాలు నేర్చిన పసివాడు
ప్రోద్దండమూర్తి యై యుజ్జ్వలించె
నీయొద్ద గరిడీలు నేర్చిన వీరుండు
సర్వసేనానిధ్వజంబు నెత్తె

దివ్య మౌ నీవుబెత్తంపుదెబ్బ దినిన
వ్యర్థు డొక కవిరాజుగా వన్నెకెక్కె!
చలువ గలిగిన నీచూపుమలుపులందు
అభ్యుదయ ముట్టిపడు నుపాధ్యాయవర్య.

బోధింతు వొకనాడు భూగోళ ముఱ్ఱూగు
భావాలపటిమను బ్రద్దలించి
దిద్దింతు వొకనాడు దివ్యాక్షరంబుల
విజ్ఞానశక్తుల విరియబూచి
ఆడింతు వొకనాడు హాస్యంబు వర్షించు
జిలిబిలిపలుకుల జిడ్డు తీసి
శిక్షింతు వొకనాడు సిసలైన దేశీయ
సంగ్రామచరితల శక్తి జాటి
తెలిసి తెలియని పిల్లల నెలలు దీర్చి
హృదయమన్ మరుభూముల పదను జేసి
విత్తుచుందువు జ్ఞానంపు విత్తనముల
శ్రమ సహించిన సాంత్వనశాంతమూని.

అధ్యాత్మసంవేది పై జ్ఞానసూక్తుల
హృదయభాండమునందు బదిలపఱచి
ప్రకృతివిద్యలసాని బ్రహ్మాండపరమణీయ
చిత్రంపుటూహల సేకరించి
రాజకీయార్థశాస్త్రవివాదతత్త్వదు
ర్ఘటవిషయాల ఒక్కటను ఒట్టి
సాంఘికసద్ధర్మసంబంధసాధన
కార్యపట్టంబుల గఱుగబోసి
బోధ గావింతు వెవ్వాని బుద్ధి కెద్ది
గిట్టుబా టగుచుండునో; అట్టివాని
నెల్ల; మాయుపాధ్యాయ దేవేంద్ర! నీదు
ప్రతిభతోఁ బోల్చ నెవ్వండు పనికిరాడు?

అక్షరంబుల దిద్దనం చౌక పోకండు
మారాము జేసిన మండిపడక
బడికిరా నని మొండిపట్టున నొకరుండు
వెక్కిళ్ళ నేడ్చిన విసుగుపడక
మాతల్లి లేదని మల్లాడు చొక్కండు
పరువెత్తి పోయిన భంగపడక
ఈపూట గాదులే రే పని యొకరుండు
వాయిదా వేసిన వాలిపోక
బ్రతిమిలాడుచు నిత్యంబు బడికి పిలిచి
బుజ్జగించుచు శాంతంబు పుటము పెట్టి
తొమ్మిదిరసాలయుగుతో ద్రుక్కుతూచి
విద్యనేర్పు నీ వెంత వివేకమతివొ?

నీ శిక్ష లందిన నిపుణుండు మాలవ్య
విశ్వగురుండునై వినుతి కెక్కె
నీ దివ్యవాక్కుల నేర్చి రవీంద్రుండు
విశ్వకవీంద్రుఁడై విజయ మందె
నీ ధైర్యభావాల నేర్చుకొనిన తిలక్
రారాజులకు నక్షరాలు నేర్పె
నీ రాజకీయంబు నేర్చిన గోఖలే
భారతదాస్యంబు బాప గలిగె
నీమహోత్తేజభావాల ప్రేమికొనిన
గాంధి చంద్రబోస్ నౌరోజి ఘను లనంత
కీర్తిసామ్రాజ్యపీఠాల క్రీడసలిపి
స్వర్గ మేతెంచినారు విశ్రాంతి బొంద.

చదువుల్ వచ్చియు రాని వా డొకడు లం
చాలిచ్చి మోసంబుతో
పదవీపీఠ మలంకరించి, కుపిత
స్వాంతంబు శబ్దించి నిన్
బెదరించున్, తఱు గేమి నీకు విబుధా!
విజ్ఞానమూర్తుల్ మహా
భ్యుదయంబున్ నిను పూజసేతురుగదా!
పుష్పాభిషేకంబులన్,

# మ హా య జ్ఞ ము

శ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులు

❋

తమ్ములు నల్వురున్ బలువిధమ్ముల నండగ నుండ బందుగుల్
సమ్ముఖసీమలన్ నిలువ సంతసమంద బుధుల్ కళానిధుల్
ముమ్మర మైన ఖేదమును మోదము నందుచు నశ్వమేధయా
గ మ్మొనరించె ధర్మజుఁ డొకానొక కాలమునన్ వినమ్రుఁడై.

తాతల సంహరించి పెదతండ్రికుమారులఁ ద్రుంచి సద్గురు
వ్రాతము నుక్కడంచి నృపవర్యులసంపద కొల్లగొట్టి త
త్పాతక మశ్వమేధమునఁ బాయు నటంచుఁ బరాశరాత్మజుం
డూతగఁ బల్క నమ్మి యతఁ డోపికతో నెరవేర్చె యజ్ఞమున్.

వచ్చుచునుండెఁ గట్నములు వార్ధితరంగములోయనన్ జనం
బచ్చెరువొందఁ బాండవుల కా సుముహూర్తమునందు ధర్మజుం
డిచ్చుచునుండెఁ గానుకల బుధేంద్రమహీంద్రకవీంద్రమండలిన్
మెచ్చుచు సత్కరించుచు సమీహితు నొనర్చుచు గౌరవించుచున్.

కానుకలన్ గ్రహించి కమకమ్మని విందుల నారగించి స
న్మానము లంది నూత్నవసనమ్ములఁ బొంది ముదమ్ముఁ జెంది భూ
జానిని యజ్ఞముం బొగడసాగిరి పండితపామరప్రజల్
మానవనాథులున్ హితులు మంత్రకళాభిమతుల్ పురోహితుల్.

పరువడి ధర్మనందనునిపై నవనందనపుష్పవర్షముల్
కురిసె జయధ్వనుల్ మొరసెఁ గోవిదు లందఱు మెచ్చుచుండి రా
తరి నొక ముంగి పెంగలుగు దాటి బయల్వడి వారిమధ్యముం
బిరబిరఁ బోయి యిట్టు లనె భీతిలఁబోక గభీరవాక్కులన్.

ఇదియా యజ్ఞము- దీని మెచ్చులయునా! యీ మెప్పునం దర్థ ము
న్నదియా! మీ రనుచున్న దంతి నిజమేనా! యీక్రియం బుణ్యసం
పద లభ్య మ్మగునా! ముఖస్తుతుల లాభం బుండునా! పాపపుం
గుదురౌ యీక్రతు వెంత సాధు వగు సక్తుప్రస్థధర్మంబునన్.

బంగరునాచ్చు శీర్షమున భాసిల నట్టులఁ బల్కుచున్న యా
ముంగిసఁ జూచి పాండవులు మోముల వాల్చిరి రాజశేఖరుల్
బెంగపడం దొడంగిరి తపించిరి బంధుగులెల్ల వేదవే
దాంగవిదుల్ భ్రమించి యిటులాడిరి తన్నకులమ్ముఁ బిల్చుచున్.

ఓ నకులంబ! నీ వెచటనుండెద వెచ్చట నేర్చికొంటి వీ
మానవభాష? యింత పెడమాట వచించితి వేల సత్క్రతు
స్థానమునందు- విజ్ఞుల కసహ్యము కల్గదె? యిందు లోప మే
మైనను గానుపించెనె? కటా! వివరించెదవా! సమస్తమున్.

చేసిన రాజు ధర్మగుణశీలుఁడు ఋత్విజులా! మహాకళా
రాసులు శాస్త్రవిజ్ఞులు నిరంతరకార్యనిమగ్నులా! జయో
ల్లాసులు ధీమతుల్ క్రతుకలాపములా! నిగమప్రదీపముల్
దోసము లందు గన్పడ వెదో వచియించెద వీవు ముంగిసా!

దాపకుము యాగమున నే
లోపము కన్పించె నీ విలోకనములకుం
జూపుము! సక్తుప్రస్థుం
డేపుణ్యముఁ జేసె దీని నెట్లది మించెన్.

అని పల్కువారలం గ
న్గొని నకులము నవ్వి మీరు కోరినదానిన్
వినిచెద నాచరితమునకు
మునుముందుగఁ గొన్ని ధర్మముల వినవలతున్.

హింసావిధానమ్ము నిసుమంత జొరనీక పక్షపాతంబులం బట్టువడక
దురభిమానములతో దోగాడఁబోవక యాశాలతలఁ జిక్కులాడఁబోక
వ్యసనానలజ్వాల కసువు లర్పింపక యరివర్గమునకు దాసోఽహ మనక
కీర్తిదాహముఁ బొంది గిజగిజలాడక మదమత్సరాదుల కదరిపడక

రాజసము వీడి సంకల్పరహితుఁ డగుచు
నంటి యంటక లోకమం దలసు తపసి
చే- జగద్ధితముం గోరి చేయఁబడిన
యజ్ఞము పవిత్రమండ్రు సర్వజ్ఞు లెపుడు.

యాగముఁ జేసెనో ? సర్వ
మ్మాగము చేసెనో ? వసుంధరాధీశుఁడు మీా
రే గుర్తింపందగు నా
వాగుడునకుఁ గోపమంద వల దెవరైనన్.

కోట్లకొలది ధనము కొల్లగొట్టఁగ నేల?
కాల మధికముగను గడుప నేల?
విజ్ఞుఁ డాచరించు యజ్ఞంబు నెరవేరఁ
దృణము చాలు నొక్క క్షణము చాలు.

పాడి దొలంగి భూపతులపైఁ బడి బందుగు లాలుబిడ్డ ల
ల్లాడిన జాలిఁ జూపక భయంకరరూపములన్ ధరించి పో
రాడి జయించి వారిధన మంతయుఁ గుప్పిట బట్టి నూర్చి రే
వేడుక పాండవేయులు- పవిత్రము లెట్లగు నిట్టి యజ్ఞముల్.

వారు తపించుచుండి రొకవంక పరాభవ మంది, మీారు మీా
వారు భుజించుచుంటి రొక వంక ముదమ్ము వహించి రెంటికిన్
గారణ మశ్వమేధ మగుఁ గావున నీ సవనమ్ము సర్వులక్
గౌరవమందఁ గల్గునది కాదు గదా యెవ రెంత మెచ్చినన్.

పిజ్జులఁ జూచి వేఁడరు పీటల మాయకు లొంగి దాసులై
బొజ్జలఁ జూచి కూర్చెదరు భోజనముల్ నిరుపేద లార్తులై
యజ్జులఁ జూచి యన్న మని యావురు లాడినఁ జూచి చూడ రీ
వెఱ్ఱిగలారిచేత నపవిత్రము లై చను యజ్ఞజాలముల్.

ధనముం గావలయు నె? నా
ధనముం గావలయు నే? సుధాహ్వాదయము సా
ఘనమై ధనమై యజ్ఞము
నొనరుప దే! యేల తెలియరో విబుధవరుల్.

సత్యధర్మప్రపూర్ణ మహా స్వార్జితమ్ము
కలి యగుం గాక గంజియా గాక వేళ
కాకలిం గొనివచ్చిన యతిథి కిడుట
యజ్ఞ మని పల్కుచుండ్రు సర్వజ్ఞు లెపుడు.

బూటకములకుఁ దెరచాటు నాటకముల
కాశ్రయము కాక, నిజవిజయమ్మునందు
నమ్మహాయజ్ఞమ్ము పవిత్రమై సతమ్ము
శాంతి నెలకొల్పఁగలదు విశ్వమ్మునందు.

ఇఁక యజ్ఞముఁ దెలుపం దగు
నొక చరితము మీకుఁ జెప్పుచుంటిని అది య
త్యకళంకం బకలుషితమున్
సుకరము సుఫలప్రదంబు సురుచిర మరయన్.

కలఁడు కురుక్షేత్రంబున
లలితాత్ముఁడు పావనుఁడు కళావిదుడు దయా
కలితాంతరంగుఁడు తపః
ఫలసిద్ధుఁడు దానధర్మపరుఁ డొకఁ డరయన్.

నివసించుచుండె నా నిగమాంతవేద్యుండు
పుచ్చిపోయిన చిన్ని పూరిగుడిసె
ననుభవించుచునుండె నా నిర్మలాత్ముండు
పెరిగిపింపిసలాడు పేదతనము
నాదరించుచునుండె నా దయాహృదయుండు
సతతంబు విడఁబోక యతిథిపూజ
నారగించుచునుండె నా తపశ్శీలుండు
చాలిచాలని యట్టి పేలపిండి
సుగుణుఁడై యుండు కొమరుండు సుమతి యైన
భార్య, నయశీలయై కీర్తి వడసినట్టి
కోడలుం గల్గి ధర్మముం గూడి యుండి
గడుపుకొనుచుండె నా యయ్య కాఁపురమ్ము.

లేమిఁ దలంచి సుంతయుఁ జలింపఁడు, కష్టము లెన్ని వచ్చినన్
నీమము నిష్టయున్ విడఁడు నీతిఁ దొలంగఁడు విశ్వసోదర
ప్రేమఁ బరిత్యజింపఁడు, చరింపఁ డధర్మపథమ్మునందు– ని
ష్కామతపస్వి యా సుగుణగణ్యుని వర్ణన చేయ శక్యమే.

అమ్మహనీయుఁ డట్లు విజయమ్ముగ కాలముఁ బుచ్చుచుండ దే
శమ్మున సంభవించె నొక క్షామము, వానలు లేక సర్వస
స్యమ్ములు మాడిపోయె జనసంఘము భీతిలఁ జొచ్చె నన్నవ
స్త్రమ్ములుఁ జిక్కకుండె జవసత్వవిహీనము లయ్యె లోకముల్.

వరుసగా నాల్గైదుసంవత్సరములు
పంట లడుగంటిపోయెఁ దద్రాష్ట్రాంతమందు
ఎలుక కొరుకుట కొకగింజ యేని లేని
కాపురము చేయుచున్నారు కాపులంత.

ప్రాహ్నపై ప్రపంచమును గారియపెట్టెడి కాలమందు నా
పరమపవిత్రవర్తనుఁడు 'పస్తు' లొనర్చుచుఁ జేయుచుండెఁ గాఁ
పుర. మొకనాఁడు నల్వురును బోయి శ్రమింపడి గడ్డిగింజలన్
బరువడి నేరి తెచ్చి రటుపై నొడగూర్చిరి పిష్టరూపమున్.

ఆరగింపఁ బూని రా పిండి నలువురు
నాల్గుభాగముల నొనర్చికొంచు
నపుడు వృద్ధవిప్రుఁ డరుదెంచె నొక్కండు
కూటికొరకు కడుపు కుమిలిపోవ.

ఆకలిఁ గొన్న యయ్యతిథి నారసి— జాలి వినమ్రచిత్తుఁడై
యాకరుణారసైకనిధి యర్ఘ్యముఁ బాద్య మొసంగి భక్తితోఁ
జేకొనివచ్చి తా మును భుజింపఁదలంచిన పిష్టభాగమున్
గైకొనుమంచు నిచ్చె నధిక మ్మగు ప్రేమ పురస్సరమ్ముగన్.

ఆరగించి యతిథి యాకలి తీరక
పరితపించుచుండ భక్తుఁ డరసి
తనమనమ్మునందుఁ దహతహలాడుట
గాంచి యతని భార్య కనికరించి.

తనపాలి పిష్టమును న
య్యనఘున కర్పింపు మని నయమ్మునఁ బలుకన్
విని సక్తుప్రస్థుం డి
ట్లన లవెలబోయి భార్య నరయుచుఁ గూర్మిన్.

వలసిన హేమహారములు వన్నెలవల్వలు గూర్చి మోదముం
గొలుపుచు భార్యలన్ మనుపు కోవిదు లుందురు కాని భోజ్యమున్
దొలఁగఁగ జేయఁ బాల్పడెడి దుష్టులఁ జూతుమె? చిత్త మెంతయో
కలవరమందు చుండె ననఁగా విని యాయమ పల్కె నిట్టులన్.

పతి నడచెడి మార్గంబున
సతి నడచుట ధర్మ మనుచుఁ జాటవె మనభా
రతశాస్త్రంబులు నాథా!
యతిథికి నాపాలి పిష్ట మర్పణ జేతున్.

అని తనపాలి పిష్టము సమర్పణ చేయ భుజించి తృప్తినిం
గనక తపించు నయ్యతిథి గాంచి కుమారుఁడు భక్తిమీర న
ర్పన మొనరించెఁ బెండిఁ దనభాగము నయ్యది చాలకుంట గ
న్గొని వెనువెంటనే యొసఁగె కోడలుఁ దాఁ దినఁబోవు సక్తువుల్.

అతిథిగ వచ్చి వారిహృదయమ్ముల నట్లు పరీక్ష చేసి- తా
నతిముద మంది మెచ్చుచు నిజాకృతిఁ జూపి వరంబు లిచ్చి వా
క్పతిసభ కాకుటుంబమును బంపి యదృశ్యము జెందె ధర్మదే
వత, సకలజ్ఞులార! యిది వాస్తవమేఁ గనులారఁ జూచితిన్.

మహాత్ముఁ డగు నయ్యతిథి పిష్టం బారగించి హస్తప్రక్షాళనం బొనర్చు సమయంబున జలసంయుక్తం బైన పిష్టంబు మదీయమస్తకంబున కంటి బంగరుమచ్చయై ప్రకాశింపఁ దొడంగె. నే నది చూచి కొని మురిసి శరీరమంతయు నట్లయైన బాగుండు నని తలంచి యందందు జరుగు యజ్ఞంబుల కరుగుచుఁ దలంపు నెరవేరమి నిస్పృహావహించుచు ధర్మజుం డొనరించునదికాన నియ్యశ్వమేధంబు పరమపవిత్ర మని యెంచి యింతద వ్వరుదెంచి యిందు ఫలితంబు గానక యట్లంటి నని పలికి శరవేగంబున నమ్ముంగిస వెడలిపోయెం గావున.

ఎయ్యది సత్యధర్మముల కిక్కగ నుండి ప్రజల్ భరించునో
యెయ్యది భేషజంబులకు హింసకు హేతువుగాగ నెల్లునో
యెయ్యది సర్వభూతముల కీప్సితముల్ సమకూర్పఁగల్గునో
యయ్యది యజ్ఞ మంచు హృదయంబుల నెంతురుగాక సజ్జనుల్.

# వారణాసి ధర్మసూరి

## శ్రీ కోన వేంకటరాయ శర్మ



ఆలంకారికసార్వభౌముఁడు, 'మహామహోపాధ్యాయ' ఘనబిరుదాభిరాముఁడు, విద్వత్కవికంఠీరవుఁడు, నగు వారణాసి ధర్మసూరి "నరకాసురవిజయవ్యాయోగము – కంసవధ నాటకము-శ్రీకృష్ణస్తుతి- రవిశతకము- ప్రాకృత హంస సందేశము బాల భాగవత కావ్యముల" విరచించి ఇకావ్యమందారదామమువలన సంస్కృతభాషాసతీకంఠమును సమధికాలంకరణ మొనర్చి విఖ్యాతిఁ జెందినాఁడు.

ఇతని తండ్రి పర్వతేనాథసూరి యనియుఁ, దల్లి యల్లమాంబ యనియు,-"సాహిత్యరత్నాకర" మందలి—

"తస్యానుజః పర్వతనాథసూరి
రాసీ దశేషాగమపారదృశ్వా;
మాహాత్మ్యలీలాయిత మాదిమానాం
షడ్దర్శనీజన్మకృతాం మునీనామ్.

ఏకం కోఽపి సుదర్శనం భ్రమకరం
పాణౌ లలాటే దధ
త్కశ్చి త్కామవిఘాతుకం పదతలే
కశ్చి చ్ఛిప త్కోభకమ్:
నిశ్శేషభ్రమభంజికాం శివకరం
కామప్రదాం పర్వతా
ధీశార్య స్సమదర్శయ ద్రసనయా
షడ్దర్శనీ మద్భుతమ్."

అను శ్లోకములలోఁ జెప్పఁబడి యున్నది. ఇతని పెదతండ్రి నారాయణసూరి పదక్రమజటలు- ఆరోహణ అవరోహణలు- అక్రమవిషమక్రమములు- మొదలగు విధానములలో వేదావధానమున నిరంకుశవిహార మొనర్చి "వేదావధాన చక్రవర్తి" - యను బిరుదమునే గాక "బ్రహ్మరథము" ను సత్కృష్టగౌరవమందెను. వేదచర్చాగోష్ఠియందు నారాయణసూరి రామావధాని యనువానిం బండితమండలి సమక్షమున నోడించి తన యవధానకౌశలమును బండిత పరిషత్తు శ్లాఘించుచుండఁగా, ధర్మభూపాలుఁ డను ప్రభువువలన నవధానీశ్వర 'శరభఘటాగండభేరుండ' బిరుదమే గాక ఛత్రచామరశిబికాదిసమ్మానముల నందెనని "సాహిత్యరత్నాకర" మందలి

"పదక్రమజటాక్షరక్రమపద క్రమారోహణా
వరోహవిషమక్రమా క్రమముఖావధానా ధని
పరిక్రమణ చక్రవర్త్యభిధ యాష్టది గ్గూఢయా
చచార బహుశః క్షితౌ
ద్విజరథేన నారాయణః."

"జిత్వా రామావధానిప్రవర మురు మరు
ద్వేగవ ద్వేదచర్చా,
గోష్ఠ్యా నారాయణార్య స్సదసి బుధశతైః
శ్లాఘ్యమా నావధానః,
సామన్తా ద్ధర్మభూపా దలభతశిబికాం
చామరచ్ఛత్రపూర్వాం,
గర్వాఖర్వావధానీశ్వరశరభఘటా
గండభేరుండ చిహ్నమ్."

(౧; ౨౦ - ౨౧.)

అను వాక్యములు సువిదిత మొనర్చుచున్నవి.

ఈయఁ పేరం శ్రీ రామసూరియుఁ బండితప్రవరుఁడే !
ఆటరి—

"మోహ స్సైశ్వర మఖానీ వాణీనిమతం
ప్రాణాదికాణాదవా
గ్గుంఫేన స్పష్టమఘట్టిభట్టగురువా
గ్ఘట్టీకతే కట్టిమే;
నిశ్శంకం నిరటంకిశంకరమతం
శిక్షోపచాఖ్యాంఘ్రిః
ధ్వాన్తధ్వాన్తవిదలాక్షప్రభంజిని ఖిలా
వామిండిమండాలకే"

"ఆలోపోద్భటనాట్యధూర్జటిజటా
కోటీరకోటీనట
ద్గంగా తుంగతరంగరింగణభరప్ర
స్ఫర్ధి వాగ్వైభవః;
సోఽయం స్వం ప్రతిభాదృషన్నికషణ
ప్రోద్దీప్తమద్దర్శనీ
రత్నస్రఙ్మయకంధరో య దనుజో
రామాహ్వయః పండితః."

అను సీతని పితృవ్యవర్ణనశ్లోకముల గమనించినఁ జాలును ఈయన తాత యైన ధర్మసూరి ఘోరతప మ్మొనర్చి తన వంశమునఁ దనయనంతర మేడుపురుషాంతరముల దాఁక నవిచ్ఛిన్నమైన శాస్త్రబోధను వరముగాఁ బడసె నని

"య స్సప్తవారవిహితై ర్వరదా త్రపహ్వాష్టా
త్త్వానాదమంత్రి స పునశ్చరణైః ప్రహృష్టాత్;
త్రిస ప్తమా ద్వర మగా న్నిజవంశజానాం
విచ్ఛేదశూన్యవిమాలాఖిలశాస్త్రబోధమ్"

అను «సాహిత్యరత్నాకర»శ్లోకము విదితమొనర్చుచున్నది. ఈయన రచించిన «నరకాసురవధ» (వ్యాయోగము) యందలి—

"తర్కే కర్కశతాం గతాఽపి నితరాం
వాగ్వైఖరీ సత్కవేః
మాధుర్యం ప్రకటీకరోతి కవితా
కాలేషు కిం వాద్భుతమ్;
పశ్యాత్యంతకఠోరతా ముపగతా
గ్రీష్మే మయూఖావలిః
కిం నావిష్కురుతే సవామృతభరం
భాసాం నిధేః ప్రావృషి."

అను సూత్రధారుని వాక్యముంబట్టి చతుర్దశశాస్త్రాభిజ్ఞుఁ డని ద్యోతమౌచున్నది. ఈయంశమును ధర్మసూరియే ప్రతి తరంగాంతగద్యమునందును జెప్పికొని యున్నాఁడు. చూడుడు. «ఇతి శ్రీ మత్త్రిభువనపవిత్రహరితగోత్రావతంస వారాణసీ వంశపద్మాకర ప్రభాతభానునా, పదవాక్యప్రమాణపారావారపారీణ శ్రీ మహోపాధ్యాయ పర్వతనాథసూరిపండితమండలేశ్వరసూనునా, శ్రీ యల్లమాంబాగర్భరత్నాకరపారిజాతేన నిర్మలాచారపూతేన, చతుర్దశవిద్యాస్థానసిద్ధాంతరహస్యవిజ్ఞానవతా శ్రీ ధర్మసంఖ్యావతా విరచితే శ్రీమద్రఘుపతిగుణమణిగణధామని సాహిత్యరత్నాకరనామ న్యలంకారశాస్త్రే రసనిరూపణం నామ దశమ స్తరంగః»—అని

చతుర్దశవిద్యా పరిగణనము

"అంగాని వేదా శ్చత్వారో
మీమాంసా న్యాయవి స్తరః;
పురాణం ధర్మశాస్త్రంచ
విద్యా హ్యేతా శ్చతుర్దశ."

అని చెప్పఁబడినది. ఇతఁడు మంచి వ్యాఖ్యాత యని-

"ధర్మాంతర్వాణివర్య స్త్రిభువనవిదితే
వారణాశ్యన్వయే య
స్సంజాతో యల్లమాంబాకృతసుకృతఫలం
పర్వతేశస్య భాగ్యం

"వ్యాఖ్యా విఖ్యాతకీర్తే ర్వివరణగురుతా
క్సాంఖ్యముఖ్యాగమానాం
తస్యాలంకారశాస్త్రే విలసతి దశమో
రామవర్ణ్యే తరంగః"—

అను శ్లోకము విదితము సేయుచున్నది.

ఈతఁడు రచించిన గ్రంథములలో "సాహిత్యరత్నాకరము" ముఖ్యమైన గ్రంథము. ఇది యలంకారశాస్త్ర గ్రంథము. ఇందు నాటకప్రకరణమువినా సాహిత్య విషయము లగు నన్నివిషయములును జర్చింపఁబడినవి. విద్యానాథ మహాకవి [కొండవీటి వాస్తవ్యుఁడు. పెసరవాయ నియోగి (బ్రాహ్మణుఁడు) నాటకప్రకరణమును విడిచిపెట్టి తనకుఁ బూర్వముగల యలంకారశాస్త్రముల నగ్గడించి, "చతుర్దశ విద్యావిభూషణవతా శ్రీధర్మసంఖ్యావతా విరచితా శ్రీమద్రఘుకులతిలకయశోఘనసారసురభితే" — అనియుఁ జెప్పియుండుట వలన ఈ "సాహిత్యరత్నాకరము" రఘుకులతిలకున కంకితమై యున్నదని గ్రహియింపనోపు.

ఈ "సాహిత్యరత్నాకరము" గ్రంథారంభసమర్థన తరంగము, అభిధాతరంగము, లక్షణాతరంగము, వ్యంజనాతరంగము, గుణతరంగము, శబ్దాలంకారతరంగము, అర్థాలంకారతరంగము, దోషతరంగము, ధ్వనితరంగము, రసతరంగము—నను పదితరంగములు గలది.

"కావ్యామృతాకలనయా మృదుశీతలాని
రామ దివ్య యశసా సురభీకృతాని
యేషాం మనాంసి ఘనసారసమాని తేషా
మేషా కృతి ర్వితనుతాం కమపి ప్రహర్షమ్."

అని తనగ్రంథము నెవ్వరు చదివి యానందింతురో తెలిపినాఁడు. ఇతనికవిత వీర, రౌద్రరస ములకు నుక్కుపట్టు. ఒక్కరస మన నేల? సర్వరసములకును, సర్వవృత్తముల సర్వగుణములకును, సర్వరీతివృత్తులకును—నెలవని చెప్పినఁ జాలును.

"ధర్మా తస్యాంశివర్యా స్త్రిభువనవిదితే
వారణాస్యన్వయే య
స్సంజాతః సర్వతేజా శ్శుభగుణగణభూ
ర్యల్లమాంబాసుగర్భే
కావ్యాలంకార కృష్ణస్తుతి రవిశతకో
న్నాటకాద్విప్రణేతు
స్తస్యాలంకారశాస్త్రే రఘుపతివిభుకే
పంచమోఽయం తరంగః."

ఇందలి "ఉన్నాటకాదులు" కంసవధ, నరకాసురవ్యాయోగాదులు. ఇతఁడు కృష్ణాతీరవాసి యౌటచేఁ గృష్ణాతరంగిణియెడఁ దనకుఁ గల భక్తివిశ్వాసములఁ బ్రకటించుచుఁ "కృష్ణాస్తుతి"ని విరచించిన ట్లగపించుచున్నది.

"కృష్ణా ముష్ణాతు సిష్ణా స్వభిజన వృజినా
న్యాశు దుర్వార వారా
వారాశే రాదిదారా రుచిరరుచిరహీ
ధేనభేనాచ్ఛ ఫేనా
శుభ్రాభ్రిశు భ్రామ్య దూర్మిభ్రమకర మకర
గ్రామణీ గ్రామనీడా
గాఢా గాఢారరోధో వివరభువివల
ద్ద్వీపరౌఘా వరౌఘా"—

కృష్ణాస్తుతి, సా. ర. (షష్ఠతరంగము)

ఇతఁడు బాలభాగవతమును రచించిన పిమ్మట నే నరకాసురధ్వంసన వ్యాయోగమును రచించినాఁడు. కావున నే నరకాసురధ్వంసన ప్రస్తావమున—

"అస్తి ఖల్వత్రాఽ ప్యమృత నిష్యందీ సకల తమ తమ స్తోమ పరిపంథీ నరహరే ర్నరకాసుర నిబర్హణో దాహరణరూపో గుణశిరోమణిః ఇత్థమేవై తత్కృవినా స్వకావ్యే బాలభాగవతే ఉప్యుదీరితమ్."

విసిందితాః కేనచ పంకజన్మనా
జడేన దోషాపహితా అపి స్వతః .
మయోక్తయో విష్ణుపదస్పృశో బుధైః
కళాఇవ గ్రాహ్యతమాః కళానిధేః''—

అని యున్నది. మఱియు

"నివిశ్య నీరంధ్రనికుంజమధ్యమా
నమీ సమీరా స్సహసా ససంభ్రమాః
నశక్నువంతీహ పునర్వినిర్గమే
లతాంగనాలింగనలాలనా ధ్రువమ్"
—సాహిత్యరత్నాకరమ్, సప్తమ తరంగమ్.

మయూరకవి తనశరీరపీడ తొలఁగుటకు సూర్యశతకమును రచించి సఫలమనోరథుఁ డయినయట్లే వారణాసి ధర్మసూరియు శరీరారోగ్యమునకయి రవిశతకమును రచించెనని తోఁచెడిని. రవిశతకమునకు సూర్యశతకమను నామాంతరము గలదు.

"నాగబంధ స్త్వసౌభి స్సూర్యశతకే
బింబవర్ణనప్రస్తావే కథితః
—నాగబంధమ్

"బింబం ధ్వాంతవ్యథాదం కనక
చ్ఛారిశోణద్యుదాత్తం,
పద్మారిప్రేమసోమక్షతద ముహుముదః
కర్తృకవ్యూహహారి,
శేముష్యా దాత్ర్యదైత్యాధిపతు దళులక
ర్మామయాధానకల్పం
క స్నేహ క్షీణతా ముక్షిపతు పటుతరం
దైవ మర్చిః కదంబమ్."

"అష్టదళ పద్మబంధ స్తత్రైవాశ్వోఽవర్ణనే కథితః"
పద్మబంధః—

"యా దానత్రాణరక్తాతతి రివ హరితాం
క్షాభినవ్యాస్తమాయా,
యామాస్తవ్యానభిజ్ఞానవతు మరకత
గ్రామసశ్రీ రజేయా,
యాజేరశ్రీ సమగ్రాయ దరితతి రస
క్తా సరచ్ఛా జరాయా,
యా రాజచ్ఛారసక్తా నిశమియ మహు
ముక్తారణ త్రాసదావ్యా
—సాహిత్యరత్నాకరమ్, షష్ఠతరంగమ్.

నరకాసురవధమునకు నరకధ్వంసన మనియు, నరకాసురవిజయ మనియుఁ, బేళ్లు గలవు. ఇది యొక వ్యాయోగము. కంసవధ మొక నాటకము. సప్తమతరంగమందలి—

వక్షోజాంగణచుంబితుంబిగుచిరా
మాబిభ్రతీ వల్లకీ,
మీష ద్దర్శితబాహుమూలసుషమా
తంత్రీస్స్పృశంతీ నఖైః,
మందస్పందితకుండలాలకభరా
మాధుర్యధుర్యస్వరా,
కించి త్కుట్మలితేక్షణా స్మితముఖీ
కేయం శనై ర్గాయతి"—

అను వాక్యమును గ్రహింపుఁడు. హంససందేశము ధర్మసూరికృతప్రాకృత కావ్యము.

మనము ఏపుణ్యభూమిలోఁ బుట్టి, యేతీయనిభాషను మాటాడుచుంటిమో ఆపుణ్యభూమిలో మనకు ముందు జన్మించి రససిద్ధులైన మహాపురుషుల సంస్మరణము మన జీవితమునకుఁ జైతన్యమీయఁగలదు.

"పవిత్ర మత్రా తనుతే జగద్యుగే
స్మృతా రసక్షాలనయేవ తత్కథా"—
ఓం తత్సత్

# శాంతి

శ్రీ భువనగిరి విజయరామయ్య



వేదాంతంబును విప్పిచెప్పఁ దరమే? విన్నంతఁ గన్నంత నే
దో దాదాపెగదా లభించు, వినలేదో "మౌనమే -వ్యాఖ్య" నాఁ
గా? దాని స్మృతి నిల్పుటే మనకుఁ గార్యం, బట్లు కాదంచు నే
దో దంచన్ ఫలమున్నె? సూటి మది నుద్యోతించునే తత్సుధల్?

ఏ నెవఁడ? నను విచారణ
మూనిన- వేదాంతసార మొయ్యా న్గననో"
నా నానతిచ్చె నొక గురుఁ
డానిగ్గును నగును భువి శుభాచారముగన్.

ఆప్రయత్నమె మెరికెలా నగ్రసరుల
దింపె నెన్నేనిమతముల తెన్నులందు
మెలఁకువగలాది కవి కడుమేలె కూర్చెఁ
దప్ప- మతమె తమమ్మగున్ దల్లక్రిందు.

నామాటలలో వేదాం
తామేయోక్తులును గలవె? అనుకుననుకుగా
నేమో సృష్టిక్రమ మొకఁ
డోమిటిఁ బద్యముల మించు నూహాసమితిన్.

ఒకసత్యాంశము సిద్ధమాట కెవియో యుండు న్విధు ల్కంపతో
డ్గుకలాపాలుగ, నేమహాఃహుఁడో తద్ఘోరంబు తీరెంచి యో
పిక మీఁజన్ బ్రచురింప దాని నవలంబింపన్ గుశంకన్ బున
ర్వికటాయాసము నొంద నేసరసుఁ డువ్విళ్ళూరువాఁ డయ్యెడిన్?

ఇం ద్రెందరో యెన్నికష్టములనో పాటూని సౌకర్యము
ల్నినుపన్ దీటికి హాయి నొందమె కుశా ల్నిక్కంగ! వేదాంత సుం
దు నటు ల్కాస్తిని లెక్కసేయక పసందున్నూస్తు లందించువా
రిన యోక్తుల్లతసంశయూనం గాని సంప్రీతిం గనం బోలదే?

అది యిది యెట్టులంచుం దుది నందంగం బోని విచారణన్ బడిం
బడి సమయంబు వ్యర్థపఱుపన్ భగవన్మననంబు లుత్తమాం
గడె! మది సంతసంబు నెడంగాంచని సంస్మరణంబుతోం గలి
గుదురును భ నా స్వినమె కోవిదవాక్యము నిత్యసత్యమై.

దైవ– మన, విన, నూహింపం దరముగాని
దెట్టి మొనగాండ్లు, కని, నూరు తెల్ల రనిరి,
దానికై మిట్టిమిట్టి యేదార్లు గనిన
నేమి యగుం? గాలయాపనమే మిగిలెను.

ఆస్తికుల మైన మనకు సంఘానుబద్ధ
సూత్రముల వేదవాక్కుల నేత్ర మునిచి
దుష్కృతుల మాని, ఫలకాంక్షం దోలి; వ్యాప్త
దైవమును సర్వభావాలం దనుపరెు గతి. –

కృష్ణుం డధ్యాయములు పదియేను లోన
నెన్నియో చెప్పి చెప్పి పదెన్మిది తుద
నర్వదొక్కటిరెండు నైదారు లందుం
దెలుపు ఫలితాంశ మన్నిట న్గాలికిపూస.

అన్నిభూతంబులన్ హృదయాంతరముల
నిలుచు నీశుండు నమ్ము కుంతీతనూజ!
అఖిలభావంబులన్ 'శర' ణనంగ దయ్యా!
అట్టి యాతనికే, భరతాగ్రగణ్యా!

నను భజింపుము యజియింపు నన్నె, నాకె
వందనం బిడి మనము నాయందె నిలుపు.
సకలధర్మాలఁ బూర్తిగా సన్యసించి
నన్ను నొక్కనినే శరణంబు పొందుము!

ఈ 'నన్ను' మనలోని యీశుండె మాటఁ
గానమే యెవరికింగా శరణనుటకొ,
నీకు నీవే శరణేయుండ వనుటె
గా కన్యమే? —నిన్నె కడు నమ్ము మనుటె
స్వబలవిశ్వాస మీశ్వర తుల్య మనుటె
'సబ' బనుసత్యముం జాటుటే గాదె!

ఈభావ మాభావ మేకం బొనర్చి
ధీభూతి నలుసునందే సర్వ- మందె
నలు సను సూక్ష్మంబు నాకలించుకొని
పలు గాకి కుట్రలపా ల్గానివాఁడు
నాస్తికుఁ డైన లే కాస్తికుం డైన
స్వస్తి మోక్షంబె నెసంగు నిత్యంబు.

తా బహునామధారిగను దైవము చెందు 'చలామణిన్' ధరన్
లేబర ముండనట్లు తగిలించిరి యస్నిటికిన్ గథల్ బుధుల్
ప్రాఁబడనీక భక్తతతి వానిని నిల్పుకొనన్ జెలంగు గా
రాబముతోడఁ గ్రొత్త లమరన్ బయిఁ బేరిచి నాఁడునాఁటికిన్.

ఆదిమ మానవావళుల నద్భుత మా —నది చెట్టు, గుట్ట- పు
ట్టేదియు- నగ్చ్య మై వెలసె- హెచ్చువివేక మెసంగసాగ ను
త్పాదిలెఁ గోట్ల దేవతల భక్తిని గొల్చుట, పాండితీ మహ
త్త్వోదయ మొంద ముఖ్యులయి తోఁచిరి మువ్వురె మెచ్చుముచ్చటన్.

ధ్యానబలంబు పెన్గలిమి యన్నవడన్ మువు రొక్కరైరి, య
ట్లైనది బ్రహ్మ, శౌరి, హరుఁ డంచు నుపద్రవ మొందు రేఁగ లో
కానఁ, గ్రమంబుగా నలువ గగ్గుకొనన్ హరియున్ హరుండుగా
జ్ఞానులుఁ గూడఁ గక్షపెనుగన్ బగ బెంతురు దండ దట్టుచున్.

హరియేగాని హరుండెగాని సకలవ్యాప్తుండెగా, అట్టిదే
వర వ్యాద్యాసిగ గీతఁ గృష్ణుఁడె దృఢత్వప్రౌఢితోఁ బల్కఁగా,
హరుఁడే యన్నను శ్రీశుఁడే యనిన నీ రన్యోన్యసువ్యాప్తి నుం
దురెగా యోగసమాధి 'సోం' కృతియె నాన్ దోషాపహారిప్రథన్.

లెక్కఁడరానిసంఖ్య: దొలి లేచియు, ముప్పదిమూఁడుకోట్లుగా
పొక్కఁడీ, మూవు రిప్పరయి పోల్చిన తత్త్వము తా నొకేవిధిన్
లెక్కఁడరాని జీవులు చలింపఁగ లో వెలి నిండి వారి యే
కక్కఁటితిన్ సహించు సుముఖత్వ మనిర్వచనీయమౌఁ గదా!

ఈపెనుమాఱుపాట్లు తొలియెత్తుగడన్ మలివాని కల్పనన్
సాపుగ మాయ కెప్పటి కెసంగుచు – నీవివిధంపుపోఁబడుల్
త్రోపులఁ బడ్డపేక చదురు ల్గాని యెల్లెడ నిక్క నే గదా!
యేపదియేల నొక్కఁడెగదే! సరినిగ్గును బోల్చి సాగెడిన్.

భగవంతుం డన నెట్టిఁడం చుపనిషద్వాక్యాళి నిర్ధారణో
రుగతి న్దెల్పిన వానిపైఁ దనమతీర్పున్ గృష్ణుఁ డండించె గీ
తగ – నాగీచిన యద్భుతామృతము పాత్రశ్రీగురుం గొల్చి త్రా
వఁగలారే కడు ధన్యు లీ కలియుగాపక్రాంతి దక్షుల్ భువిన్

అంతర్యామిఁగ నెల్లెడ న్వెలయు దేవాంశంబుతోపాటు నీ
యంతస్సున్ శరణందు టన్న నిది సాధ్యం బౌనె నా న్నుంత లోఁ
జింతింపం బనిలేదు రెండు నొకటిం జేయంగ నైనట్టివే
తంతుత్త్రెంచుట నీకె కార్య మవలన్ దాఁటింప దైవాని కౌ.

పట్టున్ దిట్టమొనర్చి ముందుగ నహంభావంబు నిశ్శేష మౌ
నట్టు ల్మట్టి, శమాదిసంపదల యభ్యాసంబుతో, నిట్టటుల్
మెట్ట న్మెట్టు మనంబు లోఁబఱచి, యోర్మిన్ గామముఖ్యారులన్.
జెట్టంబట్టెడి మైత్రిలో నిలుపనే నీ నీ శరణ్యాత్వముల్.

సంచితపాపపుణ్యఫలసంచయనాశకయత్నమం దొరుల్
నిండెడివిఘ్నముల్ నిను సునిష్ఠురతన్ జెనకంగ నేమికిన్
నొంచు నహేతుకాపదలనున్ ఘటియింపఁగనీమికే ప్రకృ
త్యంచితదైవమున్ శరణమందుట- రెండును జంట యోజ్యముల్.

శరణీయుండను నేనె నా కయిన స్వేచ్ఛావర్తనన్ మీఱక
ద్దిర! కాతర్యత నేరినో శరణుకై దేవంగనేలా యనన్
వరమాహాత్మ్యం బగుఁ; గొల్మి యుష్ణగతి రవ్వం దుండునే? యట్లె యీ
శ్వరసామర్థ్యము - నీది; పోల్చుకొనలేవా సంశయం బాఱఁగన్.

త్రాణను బట్టి జీవులకృతార్థత వర్తిలుఁ దారతమ్యముల్
మాణవకుండు యేవనునిమాదిరి శక్తియుతుండె? చీమ ని
ర్మాణము హస్తికే న్వశమె? ప్రాణికి దైవము దైవశక్తినిన్
బ్రాణియుఁ గల్పుకో ల్గలుగు బాటకెసూ బహుళోపదేశముల్.

ప్రకృతులచే, తదున్నమితవస్తు తరు వ్రజ బీజరాశిచే
సుకృతులచేఁ బ్రబోధ మిడుచున్ గనిపించును దైన; మట్టి దై
వకృషులఁ బోల్చి కూర్చెఁ గవి వాక్కృతిలో వరశాస్త్రసంహితా
ప్రకరము వాని నాచరణపాత్రతఁ జూపిరి శిష్టశేఖరుల్.

వీరల నెల్లవారు గురుపీఠపదార్హులె, అంతెగాక, దై
వీరససారకేంద్రతులె, విశ్వమహోమహిమానుపాలన
శ్రీఋషభేంద్రులే, నిజవశీకృతసిద్ధులె, యిద్ధబుద్ధులే
కారుణికాగ్రసారిపదగౌరవధారులె, ప్రీత్యుదారులే.

కొండలమీదఁ గొండలనఁ గూడిన మంచులకొండచాల్పు లే
న్గొండొకపాటినా న్నెరిగికొన్నది వేదము దత్త్వశాలి, త
త్ఖండనమండనోక్తులను దత్త్వదభావ్యకళాప్రపంచముల్,
పండితు లేగతిం దటుకుఁ, బాముని నండయె భక్తికాండమే.

ప్రారబ్ధం బది పుణ్యమో యఘమొ తప్పంబోమి శాస్త్రోక్తియేన్
దీక్ష న్గోస్కల యోగ్యతాసహీను సంధిల్లంగ, వ్యక్తుల్స్వకా
చారానేయఫలాల నొప్పుడు స్వేశప్రాప్తి నొందింప; నే
పాపాలంబు నశించి నిర్మలాత్మ ధన్యాత్మంబు సిద్ధింపదే.

నడవడి నిష్కళంకమయినన్ భగవత్స్మరణంబు తెంపులే
కడరిన, సర్వకార్యఫలకాండము దైవసమర్పణంబుగా
విడిచిన, గూర్కి లేచు నడివేళల స్వాప్నవ్యాన కాత్మదానమున్
దొడిగిన సర్వము మనదోయిటి దాయమె నిశ్చయమ్ముగన్.

# శాంతి

శ్రీ వేదాంతకవి



శాంతికిఁ దెల్లవార దని సర్వధరాతలచక్ర మెప్డు వి
శ్రాంతినిఁ జూడనొల్లక నిరంతర మిమ్మెయి తిర్గుచుండె వి
భ్రాంతిగఁ జావుపుట్టువులు పట్టెడి యింత జగచ్చరిత్ర రా
ద్ధాంతము లేని యొక్కపుట ఆఖరికేనియు జూపజొచ్చునా?

ఒకకంటినిండ కునుకు బట్ట కేమిటో
ఆకసమ్మున కెప్పు డావులింత
ఆజగద్బాంధవు లన్యోన్యములు చెడి
ఉదయాస్తమయములు రొదల నిడిరి
యుగధోరణులు నేఁడు దిగజారుటలు సూచి
కడలికి కడుపుచెక్కలయి పోయె
భూఖండము మిగుల ముగ్గినపం డయి
బెజ్జములు వడి కన్పించుచుండె
ఆదిశక్తీ! మఱిందులో ఏది నీకు
తెల్లవార్చి ఆనందేచ్ఛ తీర్చుచుండె?
మాకు గట్టినమ్మకమేని తాక నిమ్మ
నీవు కల వన్న భయముతో నీతి విడము.

ఇంతధనమ్ము మున్ను గడియించి సుఖం బెపుడేని చూచిరా?
చింతిలుచుండిరా? బ్రతుకిసీ! పరమాత్మపదాబ్జరేఖ బ
ల్వంత గ్రహించలేదె? అడు గన్నది పాత్రకు జూడకున్నచో
కొంతయు దక్కదేమి యదిగో! దిగుచున్నది ప్రొద్దు వార్ధిలో.

# వసుంధరా సాంత్వనము

శ్రీ కే. వేం. నృ. అప్పారావు

❋

అది నిశీథిని, రాకాశశాంకుఁ డెలమి
నాకసముమధ్యమున నిల్చి యమృతవృష్టి
గురియ లతలెల్ల నానందపరవశత్వ
మునను దలలూఁచె జలజలఁ బూలు రాల.

తఱపి వెన్నెలలోఁ దాను దడిసిపోయి
వడి వడిగఁ బూర్వమట్టులు నడువలేక
ప్రసవవేదికలందు విశ్రాంతిఁ గొనుచు
మెల్లఁగా నేఁగుచుండె సమీరణుండు.

ఫుల్లకుసుమభూషిత యగు భూసతి గని
యోర్వఁజాలక మనసులో ద్యోలతాంగి
తారకాభూషితాంగియై తనరె ననఁగఁ
గన్నులకు విందు చేసె నక్షత్రకాంతి.

ప్రకృతి తనశోభ యంతయుఁ బైకిఁ దెచ్చి
తనకుఁ దానె యానందింపఁ దలఁచె నేమొ
కానిచో నెల్లరును నిద్ర గాంచుతఱిని
యేల వెలయించు నీచిత్రలీల లెల్ల?

అట్టి సుషమామయం బగు నవసరమున
విశ్వపురుషమానససరోవీథి నొక్క
భావనాతరంగము లేచెఁ బరగనట్టి
దెప్పుడో గాని కలుగ దాపట్టునందు.

తనకుఁ బ్రియసతి యగు వసుంధరను దలఁచి
యెట్టు లున్నదో చూడఁగా నెడఁదఁ గోరె
భ్రాతృభావవిహీను లౌ పుత్రకులను
గని తపించుఁ దపస్విని కరుణమూర్తి!

అనుచు నాకాశదేహుఁ డా నవ్యయాత్ముఁ
డమలతారకానేత్రసహస్రములను
జంద్రికాహాసకాంతులు జాలువాఱ
భూమిదేవిపైఁ బఱపి యబ్బురము చెందె.

విశ్వమందలి జీవులు విశ్వమెల్ల
మఱచి సుఖనిద్ర గాంచుసమయమునందు
ద్రుమదళాంచలముల హిమాశ్రువుల రాల్చి
యింతి విలపించు, దీనికి హేతు వేమొ!

ధరణిదేవిదుఃఖము గాంచి పరమపురుషుఁ
డూహ యొనరించెఁ గారణ ముల్లమందు
ప్రేమమయశుభంకరహస్త మామెపైపు
పఱపి యశ్రులఁ దుడుచుచుఁ బలికె నిట్టులు:

రమణి! నీదుఃఖమునకుఁ గారణము నీవు
తెల్పకయమున్న నిను గాంచి తెలిసికొంటి;
పొలఁతి! నీదుష్టపుత్రులమూలమునను
లెక్కలేనన్ని యిక్కట్లఁ జిక్కితీవు.

సుజలవును, సుఫలవును నై యింపుమీఱి
మలయజసుశీతలవు, సస్యమరకతాభ
వనులచంద్రికాపులకితయామిని వయి
ఫుల్లకుసుమితద్రుమదళభూషిత వయి
వరసుహాసిని సుమధురభాషిణి వయి
సుఖదవును, వరదవు నయి శోభిలు నిను
మాతగా నెంచి పశుపక్షిజాతములును
నల్లడల నీయశంబు గానం బొనర్చు.

కాని మానవుఁ డొక్కఁడే కానఁడు నిను
బుద్ధిమంతుఁడై యాగాక, శుద్ధి యేది?
లోభమోహమదావేశలోలుఁ డగుచుఁ
దనజనంబులతోడనే తగవులాడు!

ఇట్టిదుష్టులగూర్చి దుఃఖించుట వృథ!
పుత్రులే కాదు వీరు నీశత్రు లరయ;
స్వీయపాపవశాన నశించి నరక
గాములై బర్వుతగ్గింత్రుగాదె నీకు?

కాంతుమాటలు విని ధరాకాంత యతని
పెడఁదయురమునఁ గన్నీటఁ దడిసియున్న
స్వీయముఖమును మెల్లనఁ జేర్చి రుద్ధ
గళమునం దెల్గు రాల్పడఁ బలికె నిట్లు:

నాథ! యీహంతకులఁగూర్చి నవయ నేను,
ఒండొకళ్ళను జంపఁగా నుద్యతు లయి
యెన్నడో చచ్చి రనుచు నే యెంతు వీరి;
నింక నాదుఃఖమునకును హేతువు విను.

జగతి నణ్వస్త్రములు పుట్టి సమరతంత్ర
మంతయును మాఱిపోయె నన్యాయముగను
గడన మొనరించువారికే కాదు నేఁటి
రణము ప్రాణులకెల్ల మరణము సుమ్మి!

నిరపరాధు లమాయకుల్ నిర్మలాత్ము
లైన నాముద్దుబిడ్డలపైన జరుగు
దారుణం బగు హింసను దలఁచుకొనఁగ
శోక మాఁగదు దయమానుమో కృపాబ్ధి!

ప్రేయసి వసుంధరాదేవి హృదయగతము
వినుటతోనె జగత్పతి విమలహాస
చంద్రికలను వెలార్చె నాస్యంబునుండి
భూహృదబ్జము లజ్జచే ముకుళితముగ.

"చెలియ! నీవెంత ముగ్ధవు! చింతతోడ
వ్యర్థముగఁ జిక్కిపోయెద వలమటించి
నాదు నిచ్ఛకు విపరీత మేదియైన
నెట్లు జరుగును? నీకేల యీభయంబు?

కలిసి ప్రథమపాదమె నేఁడు గడచుచుండఁ
బ్రళయ మేరీతి నిప్పుడే వచ్చు నరయ
నరుఁ డణుస్ఫోట మొనరింప జరుగ దేదియు,
నే గ్రహస్ఫోట మొనరింప నెఱయు లయము!

అణువు మొదలుగ బ్రహ్మాండ మావరించి
యున్న దే నొక్కఁడనె తిక్క సున్న యనుచుఁ
దెలిసికొనుటకె నరునకుఁ దెలివి నిడితి
నంతె! నాతోడఁ జెలగాట మాడఁరాదు!

స్వదురహంకృతిచే నాత్మశక్తి నెవరు
దురుపయోగ మొనర్తురో దుష్టు లగుచు
వారలే రాక్షసులుగఁ బేర్వడసి రిలను
దుదకు నాశక్తియే వారిఁ జదియఁ జేయు !

కనకకశిపు దశాస్యులకంటె గొప్ప
రాక్షసులు కారు నేఁటి యారితాకుశలులు !
వారలే తను దుష్కృత్యవశత క్షణము
లోన బూదిద కాలేదె ! లోలనేత్ర !

నిజసహోదరపుత్రులు నెయ్యమార
నడుపుహితమును బెడచెవి నిడిరికాదె !
తమ్మె విజ్ఞానఖనులుగాఁ దలఁచికొనుచు
వారి మూర్ఖులుగా నెంచి దూఱలేదె !

అన్న ! వైదేహి పరశక్తి యగును జుమ్మి!
త్వరగ వెడలింపు మామె నీపురమునుండి,
అట్లు కాకున్న జూడు మాయమ్మ నీదు
పట్టణము భస్మ మొనరించి బైటకేగు !

ఇది విభీషణు నుపదేశ మిడితంబు
కాని యాయన్న విపరీతకారి యయ్యె !
ఆపరాశక్తి నచటనే ఆపె యుంచి
హితముపల్కుతమ్ముని గెంటె నెడయఁబురము!

ఇట్టిరు విభీషణులు నేఁడు నిలను గలరు,
అఖిల జగదుపప్లవము లణ్వాయుధములు
వేగ సాగరకుక్షిలో వేయుఁ డనుచు
ముక్తకంఠులై ఘోషింత్రు మొనసివారు.

వారిమాటలు వినదురా ! చేసు సుఖము
వినని చో రావణునిఁ ద్రోవ వేగఁ జనెద
రింతమాత్రము స్వాతంత్ర్య మిడితిఁ బ్రీతి
నరుఁడు దాననె నశియింప, నాదె ! తప్పు ?

బాలుఁ డైదేండ్లప్రాయమువాఁడు జంకుఁ
గొంకులేని ప్రహ్లాదుఁడు కూర్మిమీఱఁ
ద్రిభువనవిజేత యైన తండ్రికిని జెప్పెఁ
దగదె బాలాదపి సుభాషితమ్మను నుడి !

జనక ! నీయందు నెగడెడి శక్తియ సుమి !
ఎల్లయెడలను నిండారి యెసఁగు నెపుడు
కేవలమ్మది నీయందె తావు గలిగి
యున్నదని యహంకృతిఁ బూను టొప్పుగాదు.

దాని సాత్త్విక రూపంబులోనఁ జూచి
సౌఖ్య మొందఁగ యత్నంబు సలుపుమయ్య !
రాజసిక తామసిక కార్యరాజిఁ బూన్ప
నాపదకు హేతు వగుఁ గాన నాపఁదగును.

పంచవర్షీయుఁ డౌ బాలు పల్కులు విని
దుష్టుఁడై మండిపడియె దుర్మోహుఁ డతఁడు;
వాని శిక్షింప నెన్నియో బాధలిడియె
నైన బాలుఁడు సత్యమే పూనియుండె.

క్రమముగా నెల్లవారు సత్యము గ్రహించి
వేగఁ బ్రహ్లాదపక్షమే స్వీకరింపఁ
గనకకశిపుఁడు ప్రహ్లాదకథన మెంత
నిక్కమో చూచుచున్ మరణించె నందె !

ఇట్టిస్థితిలోనే నీలోక సేనఁగు నిపుణ,
అందు నీప్రియసుత భరతాంబ నూత్న
రూపితస్వరాజ్యమైయున్న దీపకళిక
కరణి జగతికి నిడు శాంతికిరణపాళి.

పూసి నీయక్షునాభికిఁ బై నధోము
ఖముగఁ బద్మకోశప్రతీకాశ మగుచు
వెలయు భారతభూమిపవిత్రచరిత్ర
అదియే నీహృత్స్థలము. మత్ప్రియాలయంబు.

చాలకాలంబుగా దాని గోలుపోతి
వంత దురవస్థ ప్రారంభమయ్యె నీకు
నింక నెప్పుడుఁ గోల్పోక మెసఁగి దాన
ధైర్యమూనుము, నామాట దాల్చు మదిని.

నీవు మఱవనిచో నన్ను, నేను నిన్ను
మఱచువాఁడను గానని నాదని వలఁపు
మిదియె నీబిడ్డలకును బోధించు చెప్పుచు
జీవితము సౌఖ్యమయముగా జేసికొనుము.

ఇట్లు పలికి జగత్పతి యిలను వీడు
కొలిపి చనియెను వినువీథి నలువుతిరిగి
ధరణిదేవియు మనమున ధైర్యమూని
చూపు సారించె నల్దిక్కులఁ జోద్యమంది.

అప్పటికిఁ దారకావళిఁ గప్పివేసి
తూర్పుదిశ రక్తకాంతులు దోఁచుచుండె,
ఆవసుంధరహృదయగేహావరణము
మాధవుని వేణురవముచే మాఱుమ్రోఁగె!

# తెనుగు భాష

శ్రీ గంటి జోగిసోమయాజి



## ప్రాచీనస్థితి

సుమారు రెండువేల సంవత్సరములకు ముందు అరవ కన్నడములతో నభిన్నమయి యల్పభేదముతో నుండిన రూపమున మహేంద్రగిరినుండి మకరాసురకు నున్న భూభాగమున దైనికవ్యవహారమున నుండినది. అల్ప సంఖ్యాకము లయిన పదములు గలిగి జనసామాన్యమునకు మాత్ర ముపయోగపడుచున్నది. వైజ్ఞానిక మతి రాజకీయాద్యన్నతోపయోగములకు విశిష్టులు వాడుచుండిన సంస్కృతప్రాకృతమహావృక్షములఛాయను బడి యినా లోకయోగము లేకుండినది. కాలగతిని ప్రాకృతము నిరాకృతము కాగా, సంస్కృతము గ్రంథసత్కృతికి మాత్రమే పాత్రమై నప్పుడు చాళుక్యరాజదృష్టి పడి ప్రకాశింప దొడంగినది. కాని సంస్కృతకాంతియే దీనికి మూలము. అప్పటినుండియుఁ గొంచెముగా బెరిగి దేశీయులయు, జనసామాన్యము యొక్కయు నాదరణమునను, అవలంబనము నను నేటి రూపము నందినది. కాని యీభాష కెప్పుడును ప్రబలమయిన యన్యభాషాప్రాధాన్యమే యభివృద్ధి కాటంకమయినదను నభిప్రాయములో కొంతసత్యము లేకపోలేదు. మొదట ప్రాకృతమునకే ప్రాధాన్యము. తరువాత సంస్కృతమునకు సత్కృతి, ఆతరువాత తురుష్కులరాజ్యకాలమున అరబీపారశీకభాషలయౌన్నత్యమును వ్యాప్తియు దేశమున నుండినవి. రాజావలంబనము దాఁకే పఠనపాఠనములును ముఖ్యవ్యవహారమును ఉర్దూ పరిషియనుభాషలకే తురుష్కప్రభువులవలన జరుగుచుండినవి. తరువాత బ్రిటిషు పరిపాలనము. 1835 సంవత్సరమున ఆంగ్లమే దేశమున నధికారభాషయు విద్యావ్యాపకసాధనము నయినప్పటినుండియును గ్రషియు గౌరవమును నాంగ్లమునకే. నేటికిని అదే పరిస్థితి.

రాజావలంబనమును, ముఖ్యవ్యవహారమును, నాగరక జనుల వైజ్ఞానికవ్యవహారమును ఆంధ్రదేశమున నాటినుండి నేటివఱకును అన్యభాషలనే యాశ్రయించుటవలన తెనుగెప్పుడును అప్రధానముగానే యుండినది. అట్లనుటవలన తెనుగుపయిని దేశమున నభిమానము లేకపోలేదు. సామాన్య జనుల కది తల్లి. దేశీయులయిన చిన్నచిన్న ప్రభువులును రసికపండితు లయిన రాజులును దాని నాదరించుచునే యుండిరి. కావుననే ఆయాభాషలను జీర్ణించుకొని నేటి కీర్వరూపమున నున్నది. ప్రాచీనకాలమున సంస్కృత పండితులకును, అంతకుముందు ప్రాకృతాభిమానులకును, నేఁ డాంగ్లవిద్యానవద్యులకు పాశ్చాత్యవిజ్ఞానరసామోదులు నయిన పండితప్రభువులకును ఈభాష యుపసర్జన మాత్రమే యనుట గుండెపై చేతినిడి పరిశీలించుకొను తెనుఁగువారి కెల్లరకును దెల్లము కాకుండదు. ఇది ప్రాచీన చరిత్రను— నేటి కాస్థితి మాఱినది. ప్రజాభిప్రాయము స్థిరపడుటవలన ప్రజాస్వామ్యము గమ్య మయిన ప్రభుత్వ విధానమున నెలకొనుటవలన (దేశభాష) తెనుగు మొదటి భాష యగుచున్నది వైజ్ఞానికవ్యవహారమునకు గ్రమక్రమముగ వచ్చుచున్నది. తెలుఁగు బాలురందరును తెలుఁగులోనే విద్య నేర్చుచున్నారు. భావికాలమున కలుగగల దని తోచుచున్నది.

## నేటిభాషాస్థితి

ప్రస్తుతము పరిశీలింపవలసినవిషయములు రెండు. మొదటిది పాశ్చాత్యవిజ్ఞానమున గలిగిన శాస్త్రవాఙ్మయము నెట్లు తెనుగునకు దెచ్చుట. తెనుఁగునకు తీసికొనిరాక తప్పదను ప్రజాశాసనమును, పాలకులును, పండితులును ఇష్టమున్నను లేకున్నను అంగీకరింపక తప్పదు. అట్లు చేయుటలో ఆంగ్ల పదములను అట్లే గ్రహింపవలయునా లేక తెనిగింపవలయునా, సంస్కృతీకరించి సంస్కృతసమములుగా దెచ్చుకొనవలయునా యనుటయే సమస్య. ఆంగ్లసమముల నట్లే తెచ్చుకొన్నచో ఆంగ్లభాషాజ్ఞానము ఆంధ్రునకు అనివార్యమయిన యవసరము గలదియగును. సంస్కృతము నంతటిని తెనుగు తనలో జీర్ణించుకొనుటవలన తెనుగుపండితు డనగా, సంస్కృతపండితుడు తెనుగుచే సంస్కృతు డగుటయే

యనుట. అట్లుగాని వానికి తెలుగు మాత్రము వచ్చినవానికి సంస్కృతపదములలోని చిక్కులు, సంస్కృతశాస్త్రములోని భావజాలము, మిక్కిలి మారకము క్రమతప్పం లేదని మనము చూచుచునేయున్నాము. అట్లే ఆంగ్లపదములు వేనవేలు తెనుగునకు చెప్పుకొనుచో ప్రకృతిప్రత్యయవిభాగము తెలియక కేవల సజ్ఞామాత్రములుగ నట్టి పదములను వాడుకొనవలసివచ్చుచుండును. ఇట్లు తీసికొనరాకున్నచో తెలుగుపదములు గాని సంస్కృతపదములు గాని కల్పించినచో నవి కృత్రిమకములయి శక్తి వెంటనే యేర్పడక అంతర్జాతీయవిజ్ఞాన ప్రవాహమునకు ఈపదములు మార్గదర్శకములు గాక దేశీయులు ఇబ్బిబ్బుపడవచ్చును. "తెనుగు సంస్కృతమయ మయినది. అదియే దాని కఠినతకు హేతువు" అనునట్టి కొందఱనుండి "తెనుగు ఆంగ్లమయము గూడ నయినది. మఱింత కఠినతకు హేతువు అను" నుడిగా మాఱిపోవలసిన కాలము రానున్నది. ఈ సమస్యను పూరించుట విజ్ఞులపని. ఏయికి గనుపట్టునంతటి కష్టమైనది గాదిది. వ్యవహారవశమున గాలక్రమమున మార్గము సులభమయి పదములు పరిచితము లగును. పరిశ్రమవలన పాఠకులకు పరిపాటి యగును. అభ్యాసమే యవకాశములను గల్పించును.

ఏది యెట్లయినను దేశభాషలోనే ముఖ్యవ్యవహారము జరుగుట ప్రజల హక్కు. అది స్థాపనకాక తప్పదు. దానిలోనే యోచన జరుగును. రచన పెరుగును. అన్యభాషయు అన్యనాగరకతయు మార్గదర్శకములుగా నున్నంతకాలము, పరపరిపాలనమునందువలెనే, జనుల వైజ్ఞానిక తనువులు వగలనొగలక తప్పదు. కారణ మూహించుట సులభము. పరభాషకును అనాగరకతకును కేంద్రస్థానములును ప్రబోధకనాడీచలనమును మనకు దూరస్థములై యుండును. వ్యవహారమును ప్రచారమును ఇక్కడ జరుగును. దృష్టి యావైపుననే యుండుటచేత భావస్వాతంత్ర్యము లేదు. అన్యభాషాపరిచయమునకును అందలి వాక్యసౌష్ఠవసంపాదనమునకును, అందలిభావచమత్కృతిని బొందుటకును ఆవేశముతో ప్రయత్నము జరుగును. విషయగౌరవము తగును. ఏవైన దేశీయులు క్రొత్తవిషయములు గనిపెట్టినచో నవి యందే యుండును. నిరంతరముగ స్వపరభావము దుర్భర మగుచుండును. దేశభాషలో స్వతంత్రయోజన సులభము. ఫ్రెంచికి తము గాదు. భారతదేశమునకు ఖ్యాతి దెచ్చిన దని మనము గౌరవించు గీతాంజలి దేశభాషలోనే యామహాప్రభావునిచే వ్రాయంబడి వన్నెకెక్కినది. తెలుగు గావుననే వేమన యమృతమువంటి గ్రంథమును వ్రాయగలిగెను. అట్టి ఆంగ్లకావ్యములను గాని సంస్కృతవిమర్శలను గాని దేశీయులు వ్రాయజాలరను భావము గాదు. ఎవ్వరైన సమర్థులు వ్రాయవచ్చునేమో గాని శ్రేయ యధిక మని మాత్రము చెప్పక తప్పదు. మహాప్రతిభావంతుల పద్ధతి. కొంచెము తక్కువవారి విమర్శింప నవసరము లేదు. వారు దేశభాషలోనే గొప్పపని చేయగలుగుదురు. ఈసందర్భమున భాష యనగా పదములు మాత్రమే గావనియు, వాక్యరచనావిధానమును, వ్యాకరణమును, ప్రత్యయప్రయోగము మొదలయినవియు నని గుర్తింపవలెను. కొత్తపదభూయిష్ఠ మైనను తెలుగు తెలుగే. సంస్కృతము అసలే అర్థము కాదు. ఆంగ్లపదభూయిష్ఠమయిన తెలుగు ఆంగ్లభాషకంటె సులభమనుట నిర్వివాదము. కొంతకాలమునకు ఆపదములు తెలుగున ప్రాతపడి పరిపాటి యగును. మాది యను భావ మేర్పడును. ఆభావముతోనే చుట్టుకొనియున్నది యీజగత్తునందలి సర్వప్రయత్నము; కావున సర్వదా అదియే వాంఛనీయము. ఆంగ్లభాషలో నలవాటుపడిన పండితులు ఆభాషను విడిచినచో నెట్లు? అని దిక్కుతోచక దేశభాషాప్రాముఖ్యమునకు వైముఖ్యమును జూపుచున్నారు. సమర్థుడగు తండ్రి యున్నంత కాలము, నాతరువాత నాకొడుకు కేమగునో యని తలంచును; కాని తండ్రులు పోకతప్పదు; వారికంటె కొందఱైనను కొడుకులు గొప్పవారు కాకతప్పదు. తెలుగు భాషకు ప్రాధాన్యము రాకతప్పదు. ఆంగ్లభాషాప్రచారము వెనుకబడక తప్పదు.

ఈభాషయొక్క గొప్పతనము భావిని ఈభాష నాడువారి ప్రతిభకును, ప్రభావమునకును, నాగరికతకును ఫలితము కాగలదు. అవియున్నతమయినచో నదియును గొప్పది కాగలదు. మానవుని జీవితము, అనుగ్రహమునకు అతనిజాతియొక్క ప్రతిభ, ప్రభావమును మూలస్తంభములు. వానియొక్క కాంతి, సొబగు, ఆకారము, సౌష్ఠవము అనువానివంటిది

భాషోన్నతి కాబట్టి వానిని బట్టియే యిది యేర్పడును గావున భావిని తెలుఁగెట్లుండునో యెవ్వరును జెప్పఁజాలరు.

## కర్తవ్యము

నేను తెలుఁగులో నున్న యింకొకవిశేషమును వివరింపవలయును. గ్రాంథిక వ్యావహారిక భాషావిషయ మిది 25 లేక 30 సంవత్సరములకుముందు దేశమున గ్రాంథికభాషకు గల ప్రాముఖ్యము నేడు లేదు. వార్తాపత్రికలు గ్రాంథిక భాషలోనే ప్రచురణమందుచుండినవి. జనులు చాలామంది యందే వ్రాయుచుండిరి. నేడట్టిపద్ధతి పోయినది. వ్యవహారస్థమయిన పదములు మాండలికరూపములతో ననేకు లనేకవిధములుగా వాడుచున్నారు. వార్తాపత్రికలు, రేడియో ప్రచారము మొదలయిన వన్నియు నందే జరుగుచున్నవి. రామమూర్తిపంతులుగారు తమసిద్ధాంతమును బ్రచారము చేయకముందు పండితులు అపర్యాప్తలక్షణము ననుసరించి కవిప్రయోగములను దిద్దుచుండిరి. సామాన్యుల కెవ్వరికయినను ఇది తప్పా ఒప్పా అను ప్రశ్న ఒక్కొక్కపదప్రయోగమునను వ్రాతవ్రాయుటకుముందు ఉండినది. అది నేడు చాలమందిలో నశించినది. స్వేచ్ఛగా వ్రాయుట నిరాఘాటముగా ప్రచురించుట అనునవి మంచి విషయములే కాని తలకొకవిధమున వ్రాసి భాషకు మఱల మాండలికత్వావస్థ గల్పించుట సరికాదు. అనగా ప్రామాణికభాష అఖిలాంధ్రదేశమునకు నొక్కటియే యుండవలయును. అట్టిదానిలోనే యొక్కరీతినే యత్యల్పభేదములతో శిష్టులు వాగ్వ్యవహారమును రచనావ్యవహారమును జరిగించుచుండవలయును. ఉత్తరసర్కారులవారు తమ మాండలికభాషను రచించుచు, దత్తమండలవాసులు తమ భాషలో తాము వ్రాయుచున్నచో నీ రెండుదేశవిభాగములకు గలయైక్యము చెడును. ఒకపత్రిక తెలుఁగొకరీతిని, మరియొక్కపత్రిక తెలుఁగు మఱియొకరీతిని, రేడియోలో ఒక్కొక వ్యక్తియొకొక్కవిధమునను మాట్లాడుచు వ్రాయుచుండినచో భాషకు వైవిధ్యము తప్పదు. భేదమునుండి అభేదమును, వైషమ్యమును దొలగించి సామ్యమును, గల్పించి యేకరూపమున భాషకు ప్రమాణికవ్యవహారము నంగీకరింపవలయును. ఇట్లంగీకరింప వీలులేదు. ఎవరియిష్టము వారిది అను సిద్ధాంతము నామోదించి యూరకుండినచో భాష వివిధరూపములతో వివిధజనులు వ్రాయుచుందురు. ఇది ఐక్యము లేని ప్రాచీనావస్థతో సమానము. భాష నేడు మాఱిపోయి క్రొత్తరూపమును దాల్పవలసిన యవస్థ స్పష్టముగా గనుపట్టుచున్నది. ప్రామాణికమైన నవీనభాషారూపమును అంగీకరించి జనులెల్ల రద్దానిని వాడవలెను. ఇట్టి పద్ధతి శీఘ్రముగా రాకుండుటకు హేతువు అన్యభాషాప్రధాన్యమును, దేశభాషయొక్క అప్రధాన్యమును అనక తప్పదు. ఆంధ్రులకు ఆంధ్రరాష్ట్రము సిద్ధించి ఆంధ్రము ముఖ్యవ్యవహారమును బొందినప్పుడు, ప్రభుత్వము ఈవిషయము నాదరణ వహించినప్పుడు, దేశమందలి వేనవేలు పట్టభద్రులు, అసంఖ్యాకులయిన న్యాయవాదులు, చక్కని భాషను ఒకేరూపమున మాటాడుచు వ్రాయుచున్నచో భాషకు ఉన్నతస్థితి గలుగును. అట్టిస్థితి భావిని గలుగక తప్పదు. తెలుఁగునకు వైజ్ఞానికవ్యవహారమునఁ బ్రాముఖ్యము గలుగుచున్నది. ఈవిషయమున శ్రేష్ఠులే మార్గదర్శకులు గావలయు. సంస్కృతప్రాకృతములు మూలబడి తెలుఁగు నన్నయకాలమున నెట్లు వెలసినదో యట్లే మఱల ఆంగ్లము మూలబడి తెలుగునున్న రోజులు వచ్చుచున్నవి. ఏరూపమున భాష యుండవలయును 'చేయుచు' అని వ్రాయవలెనా 'చేస్తూ' అనియా యనునది యల్పవిషయము. ఏరూపమును వ్రాసినను అభ్యంతరము కలుగదు. భాషకు ఏకవిధమయిన ప్రామాణికత్వము వెలయవలయును. ఆప్రామాణికభాషకే ఒకతీరుననే వ్రాతయు, మాటయు శ్రేష్ఠులలోనైన నుండవలయును. అప్పుడు వారినే సామాన్యులనుకరించుటచే భాషకు ఉన్నతి కలుగును. మార్పు విషయమున భాషాచక్రము వెనుక తిరుగదనియు ముందునకే పోవు ననియును భాషావిదుల యనుభవము. నేటికిని ముందటికిని తెలుఁగెట్లుండవలయుననుటలో ప్రయోక్తల యిచ్చయే ప్రమాణము గావున జనులకు నాయకు లయినవారును, ప్రభుత్వసమ్మతిని పండితులును, పరిషత్తులును, దానిని నిర్ణయింపవలయును. ఇది భావికార్యము. ఇట్టి భావి యవశ్యప్రాప్య మనుట నిస్సంశయము. ఏదేనొక్కవిధమైన ప్రామాణికభాష వైవిధ్యమంతగా లేనిది నాగరికత యొక్క ముఖ్యలక్షణము, ఒకానొకరు చెప్పిన యీ క్రిందివాక్యములతో నీగ్రంథమును ముగించుచున్నాను.

"I cannot do better than, quote a writer in the New-York 'Round Table' in this connection. He says "The corruptor of a language stabs straight at the heart of his country. He commits a crime against every individual of the nation, for he throws poison into a stream from which all must drink. He wrongs himself first and afterwards every man and woman whose native speeeh he mars. It is the duty of every educated man to guard zealously the purity of his native tongue. He who hunts down and pillories a slang phrase, a vulgarism, a corruption of any kind, is a puble benefactor. In the fulfilment of the sacred trust resets on him as an educated man, he adds a stone to the bulwark of his nation's safety and greatness."

భాషాప్రాశస్త్యమును, సంరక్షించుట విద్యాధికుల కర్తవ్యము అనునది పయివాక్యముల యభిప్రాయము. తెనుగు ప్రథమభాష యయి, కోర్టులలో రాజకీయ రంగమున, బడులలో, ఉపన్యాసవేదికలపయి, ఒక్కతీరున ఏకరూపమున దేశమంతటను వ్రాయుట మాటాడుట అనునట్టి స్థితియే యది. దీనికి జనుల యాదరణమే హేతువు. అది తెనుగునకు లేక పోలేదు.

# ప్రబోధము

శ్రీ గంటి జోగిసోమయాజి

[తల్లికోటయుద్ధ మైపోయినది. తెలుగువారి తల్లికోటవై భోగము చెల్లిపోయినది. రామరాయలు నిహతుడైనాడు. విజయనగరప్రజలను శత్రువులబారికి వదలి తిరుమలరాయలు పెనుగొండకు పలాయితుడైనాడు. ఆసన్ని వేశమును దలచి కవిహృదయమునుండి జాలువారిన భావములే యీపద్యముల రూపుదాల్చినవి.]

పోయిన రామభూవిభుఁడు పోయెను పెద్దలఁ జేరెఁగాని యే
మాయెను మీకుఁ దిర్మలనృపా ! పరిశిష్టచమూపతుల్ మహా
ధీయుతరామరాయల వధించినవారికి మారుసేయగా
నాయము గాదె వైరులను నాశ మొనర్చుట ధర్మమే గదా !

ఆనయకోవిదుం డయిన యన్నయుఁ దమ్ముఁడు వేంకటాద్రియున్
బ్రాణముఁ గోలుపోయి రని మ్లానలు దాల్చిన తిర్మలేశుపై
బూనిక కార్యభారమును మోపి జయమ్మును గైకొనంగ నే
వేని ప్రయత్నముల్ సలుపరే సమరక్రమపాండితీధనుల్.

వెనుకకు నొక్కసారి నిజ వీక్షణముల్ పఱపించి పాఱు మీ
జనముల నేవిధిన్ రిపులు చంపుచు నుండిరొ చూచినారె మీ
పనులనె మీరు చూచుకొని పాఱెడునంతటి పందలే మహా
జిని నిజధర్మవర్తనకుజీవము వేటికి ధారవోయరో.

వేలకువేలు జీవములు పేరును లేక నశింప నాల్గుప్రా
ణాలకు వచ్చెనే భయము ? నాథుల మే మని ముందునిల్చి సై
న్యా లనిఁ ద్రిప్పి తీరనిజయమ్మునొ వీరుల స్వర్గసౌఖ్యమో
కేలను దాల్చి క్షత్రియులకీర్తిని నిల్పఁగ వీలుగల్గదే.

అరుల కజేయ మైన వరణాంతరము న్వడిఁ జొచ్చి దాని నే
వెరవున రక్షచేసికొని భీతి దొఱంగెదువార మంచు నె
త్తరుణము నైన యోచనల దారినిఁ బోతిరె ? పాఱిపోవఁగా
దెరువునుఁ జూచికొంటిరిగదే ? తమ రెల్లరు వాహినీపతుల్

ఏమి ఘటిల్లెనో యెఱుఁగు నిచ్చను వచ్చిన పూరుషాళి కీ
రేమి వచించినారు తమయింటిసుమాంగుల కేమి దెల్పి రా
రామవిశాలసౌధముల రాజిలుచున్ బహుమర్త్యవాస మై
భూమిని సాటిలేని పురమున్ విడ నెట్టులు మీకుఁ దోఁచెనో

వందలకొద్ది యేనుఁగులపై మణిరాసులు భర్మకుండికా
బృందము ముద్రయున్ నృపకిరీటము సన్మణినూపురమ్మునె
త్తం దగునంత పైఁడి నిడి తక్కినవారలఁ బల్కరింపకే
పొందగు దారి బట్టుకొని పోయితి రీరలు పోటుదొంగలో.

తాతలు మున్ను కష్టపడి దాఁచిన యాస్తి యటంచు రత్నవ
చేత గ్రహించి పాఱితిరొ చేనులఁ జెమ్మట నూర్చి మీప్రజ
ప్రాఁతిగ నిచ్చు నేఁటిబడిపన్నుల సొ మ్మది కష్టకాలమం
దాతలు భీతిమ్రగ్గెడు జనావళిఁ బ్రోవఁగ లేని మాకు నే
రీతిని వారిద్రవ్యము హరింపఁగ హక్కు వొసంగుఁ దెల్పు

పూర్వము రాజు లెవ్వరును పోరను నోడరె మిమ్ముఁ బోలి వ
రోర్వక పట్టణంబు విడునూహను బోయిరె ? వైరి కోరు నా
సర్వధనంబులు న్నొసగి సంధి యొనర్పరె మీరుఁగూడ యు
ద్ధోర్విని నోడినందులకుఁ ద్రొక్కఁగ రాదె తదీయమార్గమున్

అరులం జంప నపారసైన్యములు వీరానీకనీతమ్ములై
దురముం జొచ్చె జయమ్ము తథ్య మని భీతుల్ వీడి యజ్ఞాను
స్థిరదైనందినకార్యమగ్ను లగు విస్తీర్ణప్రజాపాళికిన్
వెర వేముండుఁ దురుష్కకర్కశగదాభీలాహతుల్ దక్కఁగా

నాలు గుపాయముల్ దెలియ నాథుఁడ నై తగు పంచతంత్రముల్
పాలనసేయగాఁ దగిన భాసురబుద్ధిని భామినీనృపా
లాళిని నేలపైఁ బఱపి యాడెడు పాచికలట్లు ద్రిప్పఁగా
జాలిన రామభూవరుని చాయ యొకింతయు మీకుఁ గల్గెనే.

ఒకనా డేనియు భామినీనృపులు మీ కున్నట్టి రాజ్యంపుఁ గ్రే
వకు నైనం దమదృష్టి నేనియును ద్రిప్పంజాలిరే రామ రా
జకృతు ల్వారికి వారిలోఁ గలహముల్ సంధిల్లగాఁ జేయవే
యకటా, వానికిఁ జెందు మీరు నగరత్యాగమ్ముఁ గావింతురే.

నీలాలోలతరంగసంఘములతో నీవైన యుప్పొంగి యాభీలో
త్తుంగజలాతినిస్స్రుతిరణోర్వి న్ముంచి పాషండులన్
లీలాకందుకక్రీడ నచ్ఛితపురీలీలావతీశీర్షకీ
లాలవ్యాప్తుల వైరులన్ దునుమ వేలా తల్లి కృష్ణానదీ!

ఆమూలన్ జరమాద్రిఁ బుట్టి పరమస్వచ్ఛంబ యా నీటిలో
భూమిం బూతమొనర్చి యాంధ్రులకు సమ్మోదంబు నైశ్వర్యమున్
క్షేమంబున్ గలిగించు నీజలములం గీలాలము న్నించి నా
రోమాతా! రిపునాథు లింకఁ బ్రతికారోద్యోగ మూహింపవే.

అదిగో! పోవుచునున్నదే రిపులసైన్యం బెల్ల పట్నంబులో
విదితం బైన సమస్తసౌధముల నుర్విం ద్రోయు సద్బుద్ధితో
సదనాధిరాతనారసింహావనిఁ దైన్యం బెల్లఁ జూపించి యా
పదఁ బోఁగొట్టఁగ రాదె నీవయిన నీ భక్తాళి రక్షింపవే.

# కాలస్వభావము



౧

తొలి యేమూలనో ? యంతమున్ గలదో లేదో ? నీకు నో కాలమా ?
యిలలో మర్త్యు లెఱుంగఁజాలని నిజం బెల్లన్ ద్వదీయోదర
స్థలి నేకోణములోనొ గన్గొనమె త్వత్సర్వాతిరిక్తప్రభా
వలయం బే నెఱుఁగంగఁజాలుదునె యల్పజ్ఞానహీనాత్ముఁడన్.

౨

ఒకనాఁ డొక్కప్రదేశమందు విభవ మ్మొప్పారు నచ్చోట నిం
కొకనాఁ డంతయు శూన్య మౌను ఘనగర్వోద్రిక్తుఁ డౌ పూరుషుం
డొకచో భగ్నత నొందు నన్నియును నీ వొక్కండ వీక్షించుచుం
బ్రకటింపంగఁ దలంప వేమి తగునా మౌనంబున న్నిల్వఁగా.

౩

అపరాధంబులు లేని సజ్జనుఁడు మాయజ్ఞానమూలమ్ముచే
నపవాదంబున కింధనం బగును మాయాజాలసంయుక్తుఁ డై
కపటాత్ముం డగు కుత్సితుం డొకట విఖ్యాతుండు గాకున్నె నీ
కృపఁ జూపించి యథార్థమున్ దెలిపి మా కీయల్పతన్ ద్రోయవే.

జలనిధియందు ముత్యములు సన్మణిరాసులు నత్తగుల్లలున్
గలసి యొకించు కేర్పడక క్రాలెడు రీతిని సజ్జనుల్ మహా
ఖలులును మంచిచెడ్డలును గాలమ! నీయుదరమ్ములోపలన్
గలసి వసించు నందు నిది గట్టిన సజ్జనుఁ డెవ్వడో గదా.

౫

ఏలోకా! యెన్ని పల్కినను నించుక మాఱడకుండ నుంటి వో
కాలమ! మాహితంబుకొఱకా! యిటు వల్కక యుండు టెల్ల! శ్లా
ఘాలయు లైన పూరుషుల యల్పత లన్నియు మే మెఱుంగ శాం
త్యాలయ మైన మాహృదయ మాకులిత మ్మగునంచు నెంచితో.

అది నిజమైన నయ్యెడు ననంతమనుష్యకుతూహలంబు ని
ల్వదు గతకాలమం దలరువారిచరిత్ర లెరుంగకుండినన్
మృదుల తనూవిలాసముల మిక్కిలి ఖాసిలు నాగుఁబాము మేన్
ప్రిదులక పట్టఁడే శిశువు పెద్దలు మొఱ్ఱలు వెట్టుచుండినన్.

౭

గతకాల మ్మను చీకటిన్ గవుల సత్కావ్యాళి దీపంబులై
సతతంబున్ వెలిగింపగా విషయముల్ స్వల్పంబు గన్పించు నా
వితతాయాసనిమగ్నమార్గమును సంవేద్యంబు గావింప నా
తతయత్నంబు నొనర్పరే భువి చరిత్రన్ గూర్చు సంశోధకుల్.

# చివరకు మిగిలేది?

## శ్రీ వేగుంట మోహనప్రసాద్

ఆస్తివిభాగాల చేసేసా.
నాలు కొమ్మలు నరికేసా.
నాల్గుదారుల పోయారు నల్గురు.
అయినవాళ్లం విడిపోయ్యాం
కానివాళ్ల మయ్యాం
జీవితమంత పొడవు ఏకాంతం
ప్రకృతికీ హృదికీ సావాసం
జలామరణాలంత వెడల్పు ఏకాకి బ్రతుకు.

ఒక చిన్నింట్లో నీతో నే నుంటోన్నా.
బయటంతా చీమలుదూరని చిట్టడవి.
నడిచే వాళ్ళు లేక నడివీధిలో
గడ్డి మొలిచింది.
ఈమూగ పాట పాడేందు కెవరు లేరు
ఈ మౌనవీణ గాలికే శ్రుతికలుపు.
ప్రహరీగోడల ఉపయోగం లేదు.
బిక్కు బిక్కు మంటూ గడియారం
టిక్కు టిక్కు మంటోంది.
ఎంత దీనంగ చూస్తోందో కాంపౌండ్ వాల్!
మనిద్దరం బయటకు పోనే పోం.
ఏ ఒక్కరూ లోపలికి రానే రారు.
ఈసరిహద్దులోపల ముద్దుల్తో హాయిగ
చచ్చిపోతాం.

భోజనానికి కూర్చుంటాం—
లేస్తాం.
నాపుస్తకంతో నేను
చూపుల్తో నన్ను కుట్తూ నీవు
విభాత సంధ్యకు కాని తెలీదు
మనం ఎంత సేపటినుండి
ముద్దులే పెట్టుకొంటున్నామొ!
ఆకులు కదుల్తయ్ గాలికి
నువ్వు కదుల్తావ్ విడిన కౌగిలికి
నిన్నటి తిక్తగీతికాకషాయంతో
నేటిబాధల తుషారం కలిపివ్వు
సరకుగొనక సంసేవిస్తా
భక్తి,
కోర్కె,
ఆనందం
సమ్మిళితం చేయి సముపాళ్లలో
ఆతర్వాత నువ్వెక్కడైనా దాక్కో
నిర్లిప్తవైనా సరే— ఉన్మాదినివైనా సరే
నీబట్టలు తీసుక వెళ్లు
లంగా బాడీ వగైరాలు
అదేపనిగ ఆకులుంటాయా చెట్టున?
నీ సిల్కు చొక్కా కాంతితో
నాకౌగిలిలోకి రా
స్వవినాశనానికి రాజమార్గానివి,
రాచకన్యవు నువ్వు
బ్రతుకురోగంకంటె ఘోరంగ జబ్బుపడ్డప్పుడు
సౌందర్యానికి సాహసం మూల మయినప్పుడు
మనిద్దరం సన్నిహితుల మైనాం.

# ఆశాతురంగం

శ్రీ "కొండ్రగుంట"



అబ్దపు తొలితెర యెత్తగనే
సరిత్తు గొంతుక ముడివిప్పి
వసంతాగమనానికి
నాంది ప్రస్తావన చేస్తోంది.

అనంతాకాశపునీలిమక్రింద
పుష్పించిన భూవైశాల్యంలో
మలయమారుతం
గంధకవాహకత్వాన్ని నిర్వహిస్తోంది.

గడచిన వసంతాల ఆల్బపు
పుటలు తిరగవేస్తుంటే
కాలపు ప్రవాహవేగంలో
వేసిన అబ్దపుతిన్నెలపై
జీవితమధురాశయాల పానీయపు
బుడ్లు దొర్లిపడివున్నాయి.
వయసుమళ్ళి పట్టుసడలిన
నాచేతులు నే డాగట్టికోర్కెలను
పట్టుకోనేస్థితిని కోల్పోయాయా!
లజ్జా వేదనాభరభారమ్మై
సద్దుమణగిన నాహృదయసంద్రంలో
దుర్నివారవాంఛాతరంగం తురంగలిస్తోంది.

పండుటాకులు దుల్చిన
నా మోడుబెడద చిగురించాలనే
ఆరాటంతో ఉడికిపోతోంది
మర్మఘాతుకబాధాగాథల
గాయాలమంటలుచల్లారి
నాహృదయ ముపశమిస్తోంది.

ఎలుగురాచిన నా గొంతుక
వెచ్చదనమున రవము పెగలీ
శ్రావ్యఫణితికి దారితీస్తోంది
దుష్టశిశిరపు కండ కరిగీ
గొంతుబిగిసిన దురదృష్టం
గుండె లలిసి కూలిపోతోంది.

ఒక్కక్షణం...
అప్రమత్తత తొలగిపోనీ
స్వప్నవీథిని సాగిపోనీ.

దుఃఖానికి ద్రోహం చేసీ
కన్నీటికి విడాకులిస్తా!
నిరాశాశుష్కాలను త్రెంచీ
ఆశాసుమాలు పూయిస్తా!
విరిగి పడిన రెక్కలపై
రెక్కలముత్యాల గూర్చి
అనంత మైన వసంతాన్ని ఆహ్వానించి
ఆనందించే ప్రయత్నం కొనసాగిస్తా!

ఆనందంతో అలసి
కన్నులు మూతలు పడుతున్నాయ్
నిశ్శబ్దం నాపెదవుల
నొక్కిపట్టి ముద్దెట్టుకుంటోంది
ప్రేమమధువుతో నిండి
పొర్లిపారిన నాయెడంద
వర్షామలినపుష్పంవలె
అందాలను చిందిస్తోంది.

# భక్తసందేశము

## శ్రీ అక్కిరాజు మృత్యుంజయరావు



పరీక్ష తప్పితే విద్యార్థి దుఃఖిస్తాడు. భార్య గతిస్తే భర్త తదితర బంధువులు దుఃఖిస్తారు. కాని అవే విజయవంతములయితే ఎనలేని ఆనందం అనుభవిస్తాడు. అట్లే ఒకానొక ప్రత్యేకవిషయముపై జరిగిన వాదప్రతివాదములలో ఒకడు విజయమొందుతాడు. మరియొకడు పరాజయమొందుతాడు. అదే వాదనలో విజయము పొందినవ్యక్తి ఆనందం పొందుతాడు. పరాజితవ్యక్తి దుఃఖిస్తాడు. విజయం పొందినవ్యక్తి సంతోషాతిశయముతో చిందులు త్రొక్కవచ్చు, పరాజితుడు దుఃఖసముద్రములో నోలలాడవచ్చు. అంతమాత్రమున వారిని శాశ్వతసుఖదుఃఖభాగులుగా నెంచలేము కదా! భార్య గతించినవాడు వేరొక వివాహము చేసికొని సుఖించగలడు. పరీక్ష తప్పిన విద్యార్థి మరియొక ప్రయత్నములో కృతార్థుడు కాగలడు. వాగ్వృద్ధ పోటీ ఫలితములు మరియొకపరి తారుమారు కావచ్చును అంతమాత్రముచేత అవ్వానిని నిజమయిన సుఖదుఃఖములం లేము కదా! అవి తాత్కాలికములు.

కాని సుఖదుఃఖసమ్మిళిత మైనదే జీవితము. అది క్షణభంగురము జీవితము క్షణభంగురము అన్నదాని కొకభక్తుని కథ జ్ఞాపకమొస్తుంది. పరమభక్తశిఖామణి యగు ఘోరా కుంభారు తన్మయత్వంలో భక్తిపారవశ్యముతో తనకన్న కుమారుని మట్టిలో త్రొక్కివేసాడు. బాలుడు మరణించాడు. క్షణము ముందున్న అరలు పటాపంచ లయినవి. అట్లే కలియుగంలో ఎంతోమంది తాము వచ్చిన కార్యములు ముగిసీముగియకముందే వయస్సుల తారతమ్యము లేక మరణించుట మన మనుదినము జూస్తున్నాము. దుఃఖిస్తున్నాము. జన్మ జరా, జాయసంసారము అన్నియు దుఃఖము లన్న వేదవిశ్రుతి నిజమేమొ!

మానవజన్మలోనివి అన్నియు తాత్కాలికములు. ఇవి అన్నియు శాశ్వతానందసంధాయకములు. శాశ్వతదుఃఖభాజనములు అంటే నే నొల్లను. జన్మజరాజాయసంసారము మొదలగున వన్నియు మానవజీవితపరుధులు. ఇవి అన్నియు దుఃఖములైన సృష్టికూడ దుఃఖభాజన మగును. సృష్టి దుఃఖభాజన మైనచో ఆసృష్టి నిరుపయోగ మగును. కాన మానవజీవితములోనిసుఖదుఃఖములు తాత్కాలికములే గాని శాశ్వతములు గావు. ఇవి అన్నియు భగవల్లీలలు.

ఇవి అన్నియు భగవల్లీల లైన నిజమైన సుఖదుఃఖము లేవి? పాపపంకిలమైన ఈకలియుగంలో దైవదర్శనాన్వేషణలో సుఖదుఃఖము లొందుటయే నిజమయిన సుఖదుఃఖము లని నా ధృఢవిశ్వాసము. పరమాత్మను పొందుటకై కష్టము లనుభవించువాడు ఎవడో వాడే నిజమయిన భక్తుడు. ముముక్షువు. తాత్కాలికమైన భగవంతునిలీలలు తెలిసికొనలేక పాపకూపములో పడి దుఃఖించువాడు దుఃఖభాగుడు కానేరడు.

అట్లే పరమాత్మని పూజించుటయందును, పరమాత్మని లీల లని తెలిసికొని, భగవదర్శనము పొందువాడు నిజమయిన భక్తుడు; శాశ్వతానందజీవి. శాశ్వతానందసంధాయకుడు. అతడే కాని పరీక్ష ప్యాసయిన విద్యార్థియూ కాడు. సుఖజీవనముచేయు దంపతులు కానేరరు. కష్టసుఖాలు కావడికుండలు. ఒకటి హెచ్చు. మరి యొకటి తగ్గు అనే భేదము లేక రెండునూ సమానములు.

ఐహికవాంఛలు విరసించి పరలోకగతులకు, పరమాత్మనియందు దృష్టి నిల్పి మనస్సు పరాఙ్ముఖము కాకుండ నిల్పి, ధ్యానముద్రలో పరిణతి చెంది భగవత్సాన్నిధ్యము జేరువాడు ఆనందజీవి యన్న భావా న్నిదివరకే వెలువర

చాను. అట్లు ప్రతిమానవుడు ఆనందజీవిగా మారుటకు మనకు మార్గదర్శకుడు ఎవరు? ప్రతియుగంలో యుగపురుషు లుద్భవించిరా! ఈకలియుగంలో అవతరించినవా రెవరు? అవతరింపబోవు యుగపురుషు లెవరన్న సందేహము మీకు రావచ్చు. చెప్పుతున్నాను.

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.

ఎప్పుడు ప్రాణులఅభ్యుదయకారణ మగు వర్ణఆశ్రమ ధర్మములు పతనము నంది అధర్మ మభివృద్ధి నొందునో అప్పుడు నేను నామాయచే శరీరమును గ్రహించుచున్నా డను. సాధురక్షణ, దుష్టశిక్షణ లందు నిమిత్తమును ధర్మ సంస్థాపనకొరకును, నేను ప్రతియుగమునను అవతరించు చుందు నని భగవానుడు గీతలో చెప్పినాడు.

అందుకే కాబోలు నాస్తికత ప్రబలి దేవతాద్వేషము, రాక్షసఘోరకృత్యములు, మొదలగు దుశ్చర్యలను నిర్మూ లించుటకు శ్రీమహావిష్ణువు మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, రామ, కృష్ణ, మొద లగు అవతారము లెత్తి దుష్టశిక్షణ చేసిన కార్యము లన్నియు భగవల్లీలలు.

కృష్ణావతారము తదుపరి, కలియుగప్రారంభములో, నాస్తికత ప్రబలి యజ్ఞయాగాదులు ఆధారముగా జేసికొని హింసాకాండ ప్రబలియున్న రోజులలో కారుణ్య మూర్తియై భూతదయాస్వరూపుడుగా భగవానుడు బుద్ధావ తారము ధరించి అహింస, భూతదయలను బోధించి తనకా లపు ప్రజలను ముముక్షువులుగా జేయుటయేగాక తర్వాత కాలమువారికి ఆదర్శపురుషుడై మార్గదర్శకుడైనాడు.

తర్వాత బౌద్ధమతము నలుమూలల వ్యాపించి వేదములు, ఉపనిషత్తులు నిరసించబడి యజ్ఞయాగాదులు నశించి వేదాధ్యయనపరులే కఱవైపోయి ఆస్తికత నశించిన రోజులలో శంకరుడు వెండికొండ డిగ్గి శంకరాచార్యుల రూపంలో అవతరించి ఆదిశంకరుడై అద్వైతమతస్థాపకు డైనా డని భక్తిప్రబోధక గ్రంథములు నుడువుచున్నవి.

శంకరాచార్యులవారు బౌద్ధమతమును ఖండిస్తూ యజ్ఞ యాగాదులు పవిత్రము లనియు, వేదములు, ఉపనిషత్తులు భగవంతునికాధారభూతములనియు నొక్కి వక్కాణించి "అహంబ్రహ్మాస్మి" యని అద్వితీయ మైన అద్వైత భావ ములను లోకాన వెదజల్లి వర్ణాశ్రమధర్మాలు నిలబెట్టి మోక్షమార్గము తెల్పినారు. ఈయన బుద్ధునిమార్గము ననుసరించక పోయినను ఇరువురిమార్గములు పరస్పర విరుద్ధములయినను గమ్యస్థానము మోక్షమే గావున మార్గ భేదముల వితర్కింపపనిలేదు. దీనిని బట్టిజూడ "సంభ వామి యుగే యుగే అన్న గీతాబోధ నిజమే నని పిస్తుంది.

ఆవిధముగా బౌద్ధమతము, అద్వైతమతములు, మార్గ ములు వేరయినను, దేశమంతా వ్యాపించి భగవంతుని ఉని కిని తెల్పి మోక్షమార్గదర్శకము లయినవి తదుపరి కొంత కాలమునకు పురాణభాషావ్యామోహజనితు లయిన ప్రజ లంతా దేవతారాధన మరచి, అస్పృశ్యత హెచ్చుపెరిగి పాతి వ్రత్య మన్నది మచ్చునకైన లేక దేశదౌర్భాగ్యమునకు దారితీసిన వనుట నిర్వివాదాంశము.

అట్లున్న రోజులలో మహామహు లుండుటచేతనే ప్రపంచ రథము నడచుచున్న సంగతి నిక్కము. రాజరామమోహన రాయలు, వీరేశలింగమువంటి సంఘసంస్కర్తలు బయలు దేరి సహగమనము, బాల్యవివాహములాంటి మూఢా చారముల పోగొట్టి లోకకల్యాణమునకు పాటుపడినారు. వారే గాక వారికి ముందు శంకరాచార్యాది మతస్థాపకులు రామతీర్థస్వామి, రమణమహర్షి, రామకృష్ణ పరమహంస, వివేకానందస్వామివంటి పరివ్రాజకులు, తులసీదాసు, రామదాసులవంటి భక్తశిఖామణులు బయలుదేరి వారి వారి బోధనలు లోకాని కందజేసి తత్కాలాను గుణ్యముగా లోకకల్యాణమునకు పాటుపడిన విషయము మీరంతా అంగీకరిస్తా రనుకుంటాను. వారిబోధన లింకా అణిగిపోక చెవులలో మారుమ్రోగుటచేతనే కలియుగము మూడు పాదములు అధర్మ మయినప్పటికిని, ఒక భాగము ధర్మ ముతో నడచుచున్నది.

అట్లే ప్రస్తుతకాలములోగూడ మానవుల దుఃఖములను బాపి శాశ్వతానందజీవులుగా జేయు మహాపురుషులు లేక పోలేదు. ఇచ్చట నాకు నచ్చినమహాపురుషుల కొందరిపేర్లు చెప్పుటకు సాహసిస్తున్నాను మీలో కొందరికిష్టము లేక పోవచ్చు. క్షమిస్తారని ఆశిస్తాను. ఒకరిఇష్టము ఇంకొకరికి అయిష్టము గల్గుట మానవసహజము. అదే మానవ ప్రకృతి.

ప్రస్తావనగా వచ్చిన ఈవిషయాన్ని యింతటితో ముగిస్తాను.

ప్రస్తుతకాలములో పూజ్యశ్రీ శృంగేరీస్వామివారు ఇతరపీఠాధిపతులు తమ భక్తిప్రబోధనలు లోకానికందజేయుచున్నారు.

వేరొకప్రక్క పూజ్యశ్రీ కేశవతీర్థస్వామివారు, రామతీర్థస్వామివారు, రామతీర్థశిష్యుడై లక్ష్మీనారసింహోపాసకులై "సర్వమతాభిమానియై వాంఛాదాసులుగాక వాసుదేవదాసు లయితే వాంఛలు ఫలిస్తాయి. వాసుదేవ కృప లభిస్తుంది" అని ప్రబోధిస్తూ ప్రజలయందు భక్తి ప్రపత్తులు నశించిపోకుండ ధర్మమును, న్యాయమును కాపాడుచున్నారు.

మరొకప్రక్క జిల్లెళ్ళమూడి అమ్మవారు, శ్రీశుద్ధ చైతన్యస్వామి మొదలగు పరివ్రాజకులు భక్తిప్రబోధలు చేయుచున్నారు. వేరొకప్రక్క రామకృష్ణమఠము, ఓంకార క్షేత్రము, రామనామ క్షేత్రము మొదలగు క్షేత్రములు ఎల్లప్పుడు భక్తిప్రబోధకయజ్ఞములు చేయుచున్నవి. నలుమూలలనుండి భక్తిప్రబోధనలు ప్రజలలో మారు మ్రోగుటచేతనే కలియుగములో ఒకపాలయినను ధర్మము నడచుచున్నది. లేనిచో లోకము నాలుగుపాళ్లు అధర్మములో నిండి ఎప్పుడో నాశనమయి యుండెడిది.

ఇటువంటి పరిస్థితులలో ప్రజలు చేయవలసిన కర్తవ్య మేమి? అన్న సందేహము రావచ్చును. మనము లోకకల్యాణమునకై పాటుపడు భక్తశిఖామణులకు, సంస్కర్తలకు, నాయకులకు తగినంత ప్రోత్సాహ మిచ్చి లోకకల్యాణ కార్యక్రమములలో పాల్గొని జయప్రదము గావించుట మన ప్రజల కర్తవ్యము.

ఒక మానవుడు వేరొక మానవుని సహాయములేనిదే జీవింపలేడు. కావున పరస్పర వైరములు, కులమతవిభేదాలు మాని లోకకల్యాణము, మోక్షము, (భగవత్సాన్నిధ్యము) ముఖ్యమయినవిగా నెంచి వానిని పొందుటకు ప్రజలంతా కృషిచేయవలసిన అవసరము ఎంతయినా కలదని మనవిచేస్తూ విరమిస్తాను.

# ఊహాగానము

శ్రీ అక్కిరాజు మృత్యుంజయరావు

భావాంబరవీథుల్లో
ఆకాశపువీథుల్లో
అత్యున్నతఊహల్లో
నేనూ ఒకకవినే, నేనూ ఒకకవినే.

నవ్యత్వం చాలికించిన
సరసత్వం సృష్టించిన
కావ్యత్వం కల్పించిన
నేనూ ఒకకవినే నేనూ ఒకకవినే.

ఉత్పలమాలా చంపకమాలలు
మత్తేభాలు శార్దూలాలు
ఆటవెలదులు తేటగీతులు
నా సొమ్మే నని నా కవలీలే నని
సగర్వమ్మున సవాలు చేసిన
నేనూ ఒకకవినే నేనూ ఒకకవినే.

కథలలోనను కథానికలలో
నాటకములలో నాటికలలో
బహుమతు లంది ప్రశంశ బడిసిన
నేనూ ఒకకవినే నేనూ ఒకకవినే.

సర్వమానవకల్యాణానికి
సర్వమానవసౌభాత్రానికి
సర్వమానవజీవనమార్గం
జూపే కవితను చెప్పజూచిన
నేనూ ఒకకవినే నేనూ ఒకకవినే.

ధనవంతుల పదపంజరములలో
శృంఖలాలతో బందీ యైన
కవితాకన్యకు స్వేచ్ఛ లభిస్తే
శృంఖలాలను తొలగిస్తూ
శౌర్యాన్ని సాటిస్తూ
సామర్థ్యం జూపిస్తూ
నవ్యత్వం చాలికిస్తూ
కావ్యాన్ని రాసేస్తూ
భావాంబరవీథుల్లో
ఆకాశపువీథుల్లో
అత్యున్నతఊహల్లో
నేనూ ఒకకవినే నని ఘంటాన్ని మ్రోగిస్తా
శంఖాన్ని పూరిస్తా.

# నేను

శ్రీ హెచ్. ఆర్. వడ్డెంపూడి



నేను లేని దేదీ లేదు
'నా' అనే లోకంలో
'నా' అనే లోకానికి
నేనే సర్వాంసహాధిపతిని !

రమోగుణ తజోగుణ
సత్వగుణ ధర్మగుణ
ప్రధానుండను నేనే
'నా' అనే లోకంలో !
నేనే నియంతను

నేనే ప్రజాస్వామ్యవేత్తను
నేనే పాలిటీషియన్ను
నేనే పరమార్థప్రతిభు
నేనే పరబ్రహ్మస్వరూపి

'నా' అనే లోకంలో
నేనే సమస్తం !
అధికుండను
అల్పుండను
అమరుడను
పామరుడను
తత్వజ్ఞుడ
సర్వజ్ఞుడ
'నా' అనే లోకంలో
నేనే సమస్త
వెలుపటిప్రపంచం
వెకలిది !
'నా' అనే లోకంలో
నాప్రపంచమే నాణ్యమైనది!

# ఎదురీత

శ్రీ మురారి



నడపలేవుర పడవ
నడియేటి కెదురు—
ఎదురేగ నీపడవ
ఎపుడు గమ్యము చేరు?

ప్రవాహవేగమే
పెద్ద దాతున్నాది
నడవదుర నీపడవ
నడియేటికెదురు——

పరవళ్ళు దొక్కేటి
బలమైన వాహినులు
ఎదురు నడిపావంటె
యేట మునుగుర పడవ.

ఒక్కొక్క అలదాకి
వొరుగుతుందిర పడవ
పడవలో నీవారు
భయ మొందుతున్నారు.

పట్టుబట్టి నీవు
పరుగెత్తజోయేవు
నడియేటి 'బతుకు'
నగుబాట్లపాలేర.

పదుగురిని దరిజేర్ప
పడవ నడపాలిరా
గబగబా పోవాలి
గమ్యంబు చేరాలి.

వాలులో నీపడవ
వొదిగిపోనీయరా
ఒడుదుడుకు లేకుండ
వొడ్డెక్కిపోదాము.

నడపలేవుర పడవ
నడియేటికెదురు
ఎదురేగ నీపడవ
ఎపుడు గమ్యం చేరు?

# బాలబ్రహ్మచారి

శ్రీ పశర్లపాటి వాసుదేవశాస్త్రి



విష్ణుపదమధ్యభాగాన వెలుఁగుచుండెఁ
గరసహస్రంబులను సాచి కర్మసాక్షి
పెరటి తులసమ్మపూజను పరిసమాప్తి
చేసినది అప్పుడే సువాసిని యొకర్తు.

గృహపతి యెచేగెనో గాని గృహిణిమాత్ర
మున్న దాయింట, వంటక మన్నమాట
కానుపింపదు, మడిఁగట్టి గౌరిపూజ
సలిపి, ఆమీఁదఁ బచరించెఁ దులసిపూజ.

ఏమి చెప్పుదు మఱచందమామఁబోలు
నామె మోమునఁ గల కుంకుమాంక మొకటె
ఆమెకుం గల సౌశీల్య సౌమనస్య
సంపదలపెంపులను బ్రకటింపుచుండు.

గళమునన్ మినుకుమినుకునఁ గళలఁ జిలుకు
తళుకుబంగారు తాళిమాత్రంబె గాని
సొమ్ము లేవియు లేవు నాయమ్మమేన
'అమ్మ' యనిపించుఁ జూపఱ కామె రూపు.

సమత నొప్పారు నిరుప్రకోష్ఠముల నమల
గండభాగంబులను మంచిగంద మలఁది
మిసిమి పసపును మీఁగాళ్ళ మీఁదఁ బూసి
మతినిఁ దలఁపించుఁ బ్రాక్పతివ్రతల నామె.

''భవతీ ! భిక్షాం దేహి'' యు
భవతీ ! యని పల్కి నిల్చె బాలవటు వొకం
డెవఁడో నట్టింటను నా
ధవళాయతనేత్రి చూచె దయ దైవారన్.

పంచశిఖ లొప్పుచున్న ఆబ్రహ్మచారి
మోమున విభూతిరేఖలు మురువు నెఱపు
చెవుల బంగారుపోగులు చిందులాడు
ధవళయజ్ఞోపవీతంబుఁ దాల్చినాడు,

వలపలికరాన జలపూర్ణకలశ మొండు
పట్టియున్నాడు, కటి శాటిఁ జుట్టినాడు
దాపలికరాన మధుకరాంధస్సు క్రాలు
జోలె వ్రేలాడుచున్న దాబాలకునకు.

బలి సభామండపమున వాక్ప్రౌఢి మెఱయ
ముచ్చటించిన వామనమూర్తి యేమొ ?
వటవిటపిక్రింద బ్రహ్మతత్త్వమును మౌన
ముద్రఁ దెల్పిన దక్షిణామూర్తి యేమొ ?

పేదరికమ్ముచేత నతిపీడితుఁడై గృహభర్త ద్రవ్యసం
పాదన కేగె నెక్కడికొ ? భర్తృసమాగమనమ్ముఁ గోరుచున్
బైదలి యింట నున్నయది పస్తు లొనర్చుచు; బ్రహ్మచారికిన్
లే దన లేక దాఁ గళవళింపుచునున్నది సాధ్వి దీనతన్.

అన్నము లేకపోయిన నదైన పదార్థముఁ బెట్ట కెట్టు లా
పొన్నరి బ్రహ్మచారిఁ గని పొమ్మని యందును దైవమా ? యటం
చ న్నలుమూలలన్ వెదకి ఆమలకమ్మను దెచ్చి యిచ్చె నా
యన్నువ చిన్నవోవుచు నయంబు ప్రియంబు భయంబుఁ దోపగన్.

ఏజన్మంబున నేమి చేసితిమొగానీ కష్టదారిద్ర్యమే
ఆజన్మాంతము నిండుకొన్నయది మా కబ్బాయి ! నిన్నోటులా
తేజోవంతుల కింత యన్న మిడఁగా దేవుండు మా కీయలే
దీజన్మమ్మున నేమి సేయుదును తండ్రీ ! యంచు ఖేదించుచున్,

అడుగుందమ్ములమీఁద ముంగురుల పాయల్ సోకఁగా మ్రొక్కినన్
వడు గాయమ్మను జూచి జాలిఁగొని భావంబందుఁ గీల్కొల్పెఁ బా
ల్కడలిం బుట్టువునొంది వెన్నునురమున్ గైసేసి త్రైలోక్యమున్
గుడువంబెట్టుచు నున్న కల్మిపొలఁతిన్ గోవిందు లీలావతిన్.

''కరుణాసింధువ వమ్మ సింధుతనయా ! కాత్యాయనీ వాణులున్
బరిచారించుదు రమ్మ నిన్ను, సిరిచే బ్రహ్మాండభాండంబులన్
బరిపూరించుదు వమ్మ నీవు, ప్రకృతిప్రాణంబ వీ వమ్మ, నీ
కరుణాలేశముఁ జూపి ఈసుచరితన్ గావంగదమ్మా ! రమా !

వర్ణింపం గలవమ్మ ని న్నుపనిషద్వాక్యాలు, వేదాలలో
నిర్ణీతం బగునమ్మ నీమహిమ, ని న్నేధ్యాననిష్ఠాసము
త్తీర్ణుల్ మౌనులు ''మోక్షలక్ష్మి'' యని నిర్దేశించినా రమ్మ, నీ
పూర్ణానుగ్రహదృష్టి నీయమపయిన్ బూరింపు మమ్మా, రమా !

ఆదిమ మూర్తియైన హరి కర్ధశరీరమ వైన పెద్దము
త్తైదువ వమ్మ, నీ హృదయతత్త్వ మనిర్వచనీయ మమ్మ బ్ర
హ్మాదుల కైన, సాధువులయందు సమాదరణమ్ముఁ జూపు నీ
పై దలిపై దయామధురభావముఁ జూపఁగదమ్మ, భార్గవీ !

అని నుతిసేయుచుండఁగనె హాటకపద్మసుఖాసనస్థయై
కనకమయోజ్జ్వలాభరణకాంతులు నల్గడలన్ గడల్కొనన్
గనుఁగొనలన్ దయారసము గ్రమ్మ, శుచిస్మితచంద్రికారుచుల్
మునుకొన లోకమాత మునిముంగల నిల్చెఁ గిశోరవర్ణికిన్.

మంగళదేవతామృదులమంజులపాదసరోజయుగ్మస
త్సంగతి నుత్తమాంగమును సార్థకముం బొనరించుచున్న వ
ర్ణిం గని కైటభారిగృహిణీమణి వత్సలతాతరంగ ము
ప్పొంగ నిజాంతరంగమున భూసురనందనుఁ జూచి యిట్లనున్.

అచ్చమగు భక్తిగల నీ సచ్చరితమ్మున మదినిఁ జాలగ మెచ్చుల్
వచ్చెను వత్సా! వర మీవచ్చితి నడుగు మిఁక బుడుతవడుగా! వడిగా-

మధుమధురమైన పల్కు నిమ్మాడ్కిఁ బల్కి మధుమథనురాణి కిట్లనె మనవటుండు
ఖేదపడుచున్న దీయింటి గేస్తురాలు పేదవడియున్న సంసార మీదలేక.

అతిథుల కాత్మబంధువుల కన్నముఁ గోరుచు వచ్చు భిక్షుసం
తతులకు భోజనంబు నిడి తన్పుటకుం దగినంత సంపదు
న్నతి నిడు మీపతివ్రతకు నాదుమనోరథ మిద్దియే, సమా
శ్రితజనతామనోరథకరీ! ప్రణతార్తిహరీ! నతామరీ!

అని, వినయమ్ముదోప నిటు లాడిన వర్ణికి లోకమాత యి
ట్లనుఁ, బిసినారులై పిడిచెఁ డన్నము నర్థికిఁ బెట్టరైరి గా
వునఁ దొలిజన్మమందున, దివుల్ పడుచుండిరి తిండి కిప్పు డీ
వనితయు నీమెభర్తయు నవారిత మైన దరిద్రతాస్థితిన్.

ప్రారబ్ధకర్మచేతను దారిద్ర్యము ననుభవింపఁ దగువారికి నే
నేరీతి నర్థమిత్తు విచారింపుము సుంత బ్రహ్మచారీ! సూరీ!

వే రొక్క వరముఁ గోరుము కారుణ్యనిధీ! యటన్నఁ గాదమ్మా, ఈ
నారీతిలకము చేసె నుదారత ధాత్రీఫలప్రదానము నాకున్.

ఫలదానమ్మనకుణ్ణ ఫలమ్ముగనా? నాపైఁ గూర్మినో? నీదృగం
చలచంచత్కరుణామృతై కరసవర్షప్లావితంజేసి, యీ
లలనారత్నము నూత్నసంపదలచే లాలించుచున్, బ్రాజ్ఞను:
కలిత మ్మొకలుష మ్మడంపుము, జగత్కల్యాణసంధాయినీ!

అని వటు విట్లు పల్కుటయు నాజగదంబ తథాఽస్తు, పొమ్ము నా
యన ! యని కండ్లు మూతవడు నంతటికాంతి వెలుంగఁ జేసి, వెం
టనె మటుమాయమయ్యె నచటన్, గనకామలకమ్ము లెందుఁ జూ
చినఁ గననయ్యె నింట, దయచేసె నెటో ? మన బ్రహ్మచారియున్.

*

భరతసవిత్రికిన్ విసుగుపా టొనరించుచు, వేదమాత చీ
దఱఁ గొన, ధర్మవిప్లవవిధాయకనాస్తికతాంధకారముల్
వఱలఁగ, వెండికొండ దిగి వచ్చిన శంకరుఁ డీవటుండు, మ
స్కరియును దుర్మతాంధతమసప్రశమంకరభాస్కరుం డగున్.

# శతావధాని శ్రీ చెళ్ళపిళ్ళ

శ్రీ ఏకా రామశేషగిరిరావు



ఆధునిక ఆంధ్రకవితామండలంలో ధృవతారగా రాణించారు శ్రీ చెళ్ళపిళ్ళ. నవ్యాంధ్రసాహితీలోకానికి పునరుజ్జీవనం కల్గించి శిష్టవ్యవహారానికి అమూల్యాలంకారాన్ని చేకూర్చారు. "తిరుపతి అతండు, వేంకటేశ్వరుడ నేను, వెరసి తిరుపతివేంకటేశ్వరుల మేము" అని చెప్పుకుంటూ ఆంధ్రదేశమంతటా పర్యటించారు.

వేంకటశాస్త్రిగారికి పూర్తి ఆత్మవిశ్వాస ముంది. కవిత్వమే జీవితసర్వస్వగా జీవించారు.

"కవనార్థం బుదయించితిన్ సుకవితా
కార్యంబె నావృత్తి, ఈభవ మద్దాన తరింతు
తద్భవము, మద్భాగ్యంబు, సర్వంబు మృత్యువు
నే దాన జయించితిన్ రుజ జయింతున్ దానిచే"

దేశాటనం చేస్తూ శతావధానసందర్భంలో "ఒకచరణం బతండు, మరియొక్కటి నేను మరొక్కడాతడున్ సకల కవీంద్రసంతతులు సమ్మతిమై దలలూచి మెచ్చగా". అని స్వశక్తిని చాటుకున్నారు. నానారాజసందర్శనం చేసి సభ్యుల ఆదరాభిమానములు పొంది అనేక సన్మానాలను పొందారు.

ఒకిసారి సభికులసంస్తుతిని విని "ఒకనూరే యని ఏమి లెక్క" వేయినుంది కైనా భవానీకరుణచే అవధానం చేయగలమని వ్రాక్రుచ్చిన దిట్ట. అన్ని బిరుదులూ త్యజించి ఒక్క "శతావధాని" అనే బిరుదుమాత్రం స్వార్జితం అనుకొని వదలలేదు. నానారాజసందర్శనసందర్భంలో "ఏను జూచిన రాజులందెల్ల నొక్క విజయనగరమహారాజు వేత్త" అన్నారు శాస్త్రిగారు. "కవితామాధురి తాగ్రహించి పవ్వారే కవిరాజా యని మెచ్చి యిచ్చు నృపు డొక్కడైన కర్వ్యానచో కవియై పుట్టుటకన్న పాప పరిపాకం బుండునే భూవరా! అని ఆనందగజపతికద్ద అన్నారు.

ప్రస్తుతప్రపంచపోకడలు వారికవిత్వంలో ప్రస్ఫుటమవుతాయి. నవ్యకవులు గా, సరసఆశుకవిత్వచక్రవర్తులుగా కానవస్తారు. బుద్ధచరిత్ర, శ్రవణానందము, పాణిగృహీత మున్నగు కావ్యాలు రచించారు. వారికవితాశ , ధారణాపటిమకు ఇది మచ్చుతునక

'జననమ్మున్ మరణమ్ము జంతువులకున్
స్వాభావిక, మ్మోరి
ల్లి నిజంబానె, సుఖంబు లెక్కడివి త
ల్లీ ఏటి కేడాది నై
నను గాలేదు ప్రయోజకుణ్, సుజనమున్
దారమ్ము చెట్టంతవా
నిని పుత్రుణ్ దిగమ్రింగి రాయికరణిన్
జీవించి యుండనే"

పూర్వకవుల పోకడలను పూర్తిగా విడనాడ (బుద్ధచరిత్ర) లేదు. శ్రీనివాసవిలాసమును ఆంధ్రీకరించటములో మూలగ్రంథానుసరణంగా రసవత్తరంగా మార్చారు.

శాస్త్రిగారికి కవిత్వమబ్బటం వంశపారంపర్యహక్కు. వెంకటశాస్త్రిగారి ముత్తాత నరసన్న గారు కవీశ్వరులు.

వేంకటేశ్వరవిలాసం "యామినీపూర్ణతిలకావిలాసం" అనే ఉద్గ్రంథాలను రచించారు. తిరుపతిశాస్త్రిగారు వేంకటశాస్త్రిగారిని ఈవిధంగా ప్రస్తుతించారు "గోచిపెట్టకమున్న కోమలకవితచెప్పినాడు సహపాటి వేంకటకవి" అనీ "గోణము గట్టుటాది బుధకోటి నుతింప కవిత్వ

వైదుషీ వేణిక యాచు పేర్పడిన వేంకటశాస్త్రి"

వేంకటశాస్త్రిగారు తిరుపతిశాస్త్రిగారిని గురుశిష్యులుగా భావించేవారు.

"తనకు నాల్గు నిఘంటుపదములు వచ్చు
ననుచు బదిమందికిని తెలియంగ మారు
మూలలపదములు గుప్పిన మెచ్చుటగునె
ప్రతిపదమునకు రస ముట్టిపడినగాక !

ఆంగ్లభాష అంటే శాస్త్రిగారికి గిట్టదు. "పనిలేదీయుదరంపుబోషణకునై భాషాంతరమ్ముల్". ఆంగ్లభాషావ్యామోహంలోపడి ఉక్కిరిబిక్కిరైపోతున్న ఈకాలంలో శాస్త్రిగారు కుమారులకు ఆంగ్లవిద్య చెప్పించలేదు. "పైగా మీవిద్దెల్ ధనమిచ్చి కొన్నయవి" అని ఇంగ్లీషు భాషను చమత్కరించారు.

తమస్వీయచరిత్రను శాస్త్రిగారు «స్వీయచరిత్ర» అనే పేరుతో వ్రాశారు. గ్రహబలాన్ననుసరించే జీవితం నడుస్తూవుంటుందని వారిగాఢవిశ్వాసం. "అనఘ కవిగ్రహమ్ములు, గ్రహమ్ములు గవ్వనుచేయు వజ్రమున్."

పాండవరాజసూయం అనే గ్రంథాన్ని శ్రవ్యకావ్యంగా ఆరంభించి మధ్యలో దృశ్యకావ్యంగా నడుపుతారు. వీరు తుమ్మెదపాటతో, బొబ్బిలికథ వ్రాశారు. పాండవోద్యోగవిజయాల్లో ధారాశుద్ధి సమన్వితమైన పద్యాలు ఎన్నో కానవస్తాయి.

"కాలము లొంగదు మనకున్
కాలమునకు మనము లొంగవలయు."

వారు కాలాన్ని జయించిన అమరులు. శాస్త్రిగారిని ఆస్థానకవిగా గౌరవించి ప్రస్తుతించినపుడు తాను పడుకున్న నుక్కమంచంవైపు చూపిస్తూ "ఇదిగో నాకవితాపీఠం" అని చమత్కారంగా అన్నారు. వృద్ధాప్యంలో నవయౌవనం తొణికిసలాడేది. వారికవిత్వానికి వృద్ధాప్యం కానరాదు.

# "ప్రణవ నినాదమ్"

శ్రీ ముదిగొండ శివప్రసాద్



బాలభానుని రాగపుంజములు కెంజాయ
కాంతు లీనగ వింతశాంతి తళుకొత్తంగ
నందనోద్యానమును క్రిం దొనర్చెడి శోభ
నొప్పారు వనములు నొకతటిల్లత మెరసె.
కదలికలలో నాదశాంతను తలంపించు
కంకణక్వాణముల గంధర్వవాద్యాలు
కనుదోయిలో నుమాకాంతు డాతనికాంత
కలిసి జేసెడి లాస్య కమనీయగరిమలును,
తాండవప్రక్రియ లజాండభీకరము లై
తోపించు, భయమధుర తూర్యములు విన్పించు.
ఆమె పూసెజ్జలో నమరంగ జేసినది
ఆవనంబున నున్న అందాలపువ్వులను
మల్లెలను మొల్లలను మకరందమందార
మాధుర్యములతోడి మృదుప్రసూనంబులను
ఆమెలాలిత్యంపు హస్తంబు తగులగా
తెల్లనౌమల్లియలదీప్తి అరుణిమయయ్యె
ఆమె రత్నాంగుళీయకము కాంతులతోడ
తెల్లనౌ తుమ్మిపువ్వులు ఎఱుపెక్కినవి
అందకను పైనున్న అందమౌ పూవులను
అందంగ, పొందంగ నామె తలయెత్తగా,
కేశకాంతులపుష్పచయము నలుపెక్కినది
కెంగేలుతో లతాకాంత ఎఱుపెక్కినది
ఆమెపువ్వములపై పట్టిచూడగ, వింత!
నీలపుష్పముల నైర్మల్యధావళ్యంబు
పొడచూపె ఇంద్రునిధన స్సచట తలజూపె.
పుష్పాపచయముతో పరుగిడెను ఆమెయెద
ప్రణవనాదమువైపు పరమశివువైపునకు
బాలభానునివైపు పరికించి చూచినది
'పరువెత్తు మింక వేగమె పూజకై సుంద
రీ' యంచు చెప్పినటు లాసహస్రకరుండు
చేతులతో తాకగా సుందరి మనస్సీమ
యం దందమౌ స్ఫటికలింగ మగుపించినది
'ఓం హరా శంకరా శంభో హరా శివా
వేగ నీవే గతిల నోడుమావల్లభా!
ఓంకారనాదస్వరూప శివశంకరా!
భక్తప్రియా దీనబాంధవ శివోహం!'
అను చామె ప్రణవనాదం బుచ్చరించుచును
సాగినది సాగినది సర్వజ్ఞుదెస కపుడు
మహాదేవు గాంచగను మందిరము జేరినది
పరమశివు పూజింప ప్రాంగణము జేరినది
నందికేశునకు మ్రొక్కియు లోని కేగినది
విజయఘంటానినాదంబు గాంచినది
'ఓంకార ముచ్చరించిన దంత వింతగా
తిరిగి ఓంకార మాలయములో మ్రోగినది.
ఓంకార మామె యుచ్చారణం బొనరించె
తిరిగి ప్రతిధ్వనివోలె తోచె ప్రణవం బచట

సగము మూసిన చానకండ్లు తెరపిడివడెను
సందేహముగ నామె యందందు వెదకినది—
ఒక్కసారిగ నామె యులికిపడి లేచినది
ముందున్న నిశ్చలితమూర్తిని కనుంగొనియు
ఎవ్వరో సుందరు డనంతలోకములలో
భావముతో పర్యాప్తి పరమేశు గనుచుండె
ఆలయాంతర్భాగమందు కూర్చొనియుండి
ఆద్యంతరహితు చూచుచునుండె లింగమున
అప్రయత్నముగ నాతనినోట వెంటనే
దోఛందముతో నొక్కరాగ మాలాపించె

విన్న దాతనిపాట కన్న దాతనిరూపు
కనురెప్ప లల్లార్చినది తలను వంచినది
కోటిస్వప్నా లామె కండ్లలో మెరిసినవి
కోటి కోణార్కు లాకండ్లలో వెలసినవి
కోటిచంద్రులచలువ కండ్లలో తోచినది
కోటియింద్రులకండ్ల కనిన దాతని ఆమె—
ఆమె కాంచుచు నుండె అతడు కాంచుచునుండె
'కాంచుటను క్రియమాత్రమే కానబడుచుండె
వింత లట ఒకక్షణము వసియించి పోయినవి

కొంత దవ్వేగినది కాల మాశాంతిలో
చేజారి పడెవ్వూలసెజ్జ యవనికపైన
చెదరె నాతని దీక్ష చూచె నామె నతండు
సుందరికి క్రమముగా చలనంబు కలిగినది
శివదేవు కనుగొనియు క్షమియింపు మనికోరి
చూచె నాకొత్తసుందరుని తీక్షణదృష్టి
"ఎటనుండి యిట కేగు దెంచినా రలుమీరు
ఏల యిట్లేకాంతముగ నిందు జొచ్చితిరి?
ఎరుగరే యిది సుందరీకన్య వనమంచు
ఎవరి యనుమతి గొనిరి? ఏమి టీవర్తనము?"
ప్రత్యుత్తరంబు శూన్యంబాయె నట నపుడు
సుందరుని పెదవు లల్లాడవాయె న దేమొ?
కనులతో మాత్ర మేదో సీనులం దుండి
అష్టావధానముల నాచగించుచునుండె
కనుల నల్లార్చి ఆకాంత గాంచె నతండు
కనులతోనే బదులుపల్కె నామె కతండు
కోపంబుతో నామె కండ్లతో ప్రశ్నించె
ప్రత్యుత్తరం బిచ్చె కండ్లతోనే యతండు
కం డ్లేకమైన వట కమనీయమాధుర్య
కాంతులే సోనలై కాలువలు కట్టినవి—'

[నా 'జ్యోతిర్మయి' నుండి]

# జీవనస్వరాలు

శ్రీ సానికొమ్ము కృష్ణారెడ్డి



నిన్న—

న్నవిభావరిలో తరుణతరిణిమ వెల్లివిరిసిన
సైకతమ్ముల నాడు సర్పము నాకంఠము జుట్టమంటిని

'పిచ్చివా' డని సాధు వొక్కడు పలవరించాడు
శ్రీకల దన పచ్చిగరళమె అర్థ మన్నాడు—

పల్లవమ్ముల నొత్తిగించుక మల్లెసుమనసమాల లూగగ
కొమ్మకై కెంగేలు నెత్తితి కోయవలదనె తోటమాలి

కోయిలొక్కతె గొంతువిప్పి తోడి పాడింది
కొమ్మయెదలో చిమ్మచీకటి జల్లులాడింది

సుందరమ్మగు నీరజాకర ఇందీవరముకుళయుగళము
నందుకొన నారాటపడితిని ఆందగించితి వలపు వించితి

కాని పద్మాకరము జేరగ దారి కనరాదు
మనసులో పెనవేసుకొన్న వలపు తెగలేదు—

నేడు—

ఎన్ని తీపులొ ఎడిగి నాపై కొరుగుతున్నాయి
ఏమి నుడువుదు నాదుగుండెలు మరుగుతున్నాయి

గోడ ప్రాకొక గులాబీలత మెడను బిగుతుగ జుట్టుకొనియెను
కోష్ణపల్లవరక్తిమమ్ములు రక్త మురలగ పెదవిదాకెను
పరిమళించెడి తిమిరములలో వదన మొకపరి పూడిపోయెను

మృణాళయుగళబంధనములో
నలిగి దేహము సుడిసిపడియెను,

శూన్యమును నే కోరి గుప్పిట
నూని కాలము బుచ్చుచుంటిని
గిరులు గుండెల లోకి చొచ్చిన
తీపులే కద ఎడద పంటలు.

ఎన్ని తీపులొ ఎదిగి నాపై కొదుగుతున్నాయి
ఏమి సుడువుదు నాదుగుండెలు మరుగుతున్నాయి.

రేపు——

కాని రే పీతీపు లుండగ బోవు కాబోలు
తెల్లబడి పోతాయి గావును నీలిమేఘాలు
నీరజాకరజలేజమ్ములు శుష్కమౌ నేమో
కొమ్మ కెంజిగురాకు లకటా! నల్లబడు నేమో
గుప్పిటి విడిన శూన్యమే రేపె దిగి స్థూల మ్మౌనుగావును
గుండెగాయము లన్ని పెల్లుగ గుబ్బటిలు నేమో

ఏమి మిగులును జ్ఞాపకాలా నాకు రేపటికి
శైశిరమ్ముల చుంబనమ్ములె తిరము గావాలు

తిరము గావాలు మనుగడే
నశ్వరము గావాలు,

# కపోత నిష్క్రమణము

ఏమున్నది విలోకింతు
వేమున్నది యేమున్నది
శీర్ణ మాన దేవళాన
శ్మశానసౌందర్య మంతా
నిశాతమస్సులపుంత

సుప్త సంస్కృతుల మూల్గు
ఘనీభవించిన గానం
తెగిపడి నవ్విన వీణ
తీగలు రువ్విన ధ్వానం
పాడుపడిన దేవళాన

పరిశీలన లెందుకు?
నానాసురభిళసూన
రామణీయక మంతా
హరించింది హరించింది
శైథిల్యము వరించింది
పూర్వంవలె యేరోజూ
పోహళించదు దీపం
విగ్రహం ఇరులలో
దిగబడిపోయింది పాపం
ఉప్పుధూళుల దుమారం
ఒవాంధాల కైవారం
కీటకాల సంసారం
పడుపుతీపుల బేరం

  పాడుపడిన కోవెల యిది
  పరిశీలించెద వెందుకు

కానరాదు ఎటుజూచిన
కడకు దాని గూడైనా
ఏమైనది కపోతమ్మ
అందాలవిహంగమ్మ
శాంతి కదియే ప్రతీక
ఇటనే మును దాని పడక
దానిగీతికలో గీత
ధునిలా ప్రవహించేది
ధునిలా ప్రవహించేది
మనాల నూగించేది
మంటినుండి
మన చూపును
మింటికి
మరలించు పులుగు
కంటినుండి
మన చూపును
ఎదకంట ని
మిడించు వెలుగు
ఏదీ ఆకపోతమ్మ
అందాల విహంగమ్మ

నిరాదరణ పన్నగమై
ఫూత్కారించింది మొన్న
పల్కరింపు పిల్పులేవు
చిల్కెం దశ్రువు నిన్న
లేదు లేదు కపోతమ్మ
ఉద్దోలించిన దెటకో
ఈకోవిలకుద్యాలిక
యెల్లవతో మెరిసిపోవు
పావురాయి చూపు లింక
ఈగూటి చాయలకె రావు
ఎడారిలో మల్లెతీవె
నిప్పులలో పూలవాన
చిగురించి సాగు విధం
అగుపిస్తుందా నేస్తం?
నాల్కలు ఊడినగంటలు
మ్రోగవు ఎంతకు ఎంతకు
విశీర్ణాలభారమొ యిక
గుడిలో పండే పంటలు
వెలగవు దివ్వెలు; గావే
ఎదలను గాల్చే మంటలు
తడబడి సుడిబడి పడుతూ
ఎగిరిపోయిన కపోతం
ఏగుహలో రెక్క ముడిచి
విచారపడి పోతుందో
గాలిపొలలోనే
సోలిసోలి పడుతుందో
ఏమో తెలియదు నేస్తం
ఎందుకిలా దుఃఖపోతా
గతజలసేతుబంధనం
మతిమాలిన చేత

  "కపోతనిష్క్రమణం
  ఆత్మశాంతుల మరణం
  అయ్యో! ఇం కేమున్నది
  అంతా తమోమయమై
  పోతున్నది

# భక్తిభావము

శ్రీ కొండముది లక్ష్మీ వేంకట హనుమంతరావు

❈

చేమీటు లేకయు శ్రీహరి గీర్తించు
మహతియనా వీణ నేమరనివాఁడు
భగవదాశాసనవ్యతిరేకముల పట్టు,
లరసి పరీక్షించు నట్టివాఁడు
గర్భస్థులకును జక్కఁగ భక్తి సూత్రముల్
తేట తెల్లముగ బోధించువాఁడు
ధర్మసంస్థాపనాస్థానమ్ములందు న
పెల్లుబ్బునను దాండవించువాఁడు.

నారదుఁడు యోగతత్త్వవిశారదుండు
వివిధఫలపుష్పతరులతా వేల్లితంబు
శ్రావ్యసుస్వరవిహగంబు జాహ్నవీత
టాంతరముఁ జేరి మజ్జనమాడి పేర్మి.

శ్రీహరిధ్యాన మొనరించి చేరియున్న
మానివర్యులు భక్తి నమస్కరింప
ఏల మీరంద ఱిట వసియించినారు
కారణముఁ జెప్పుఁడా యన ఘనులు వారు.

సర్వధర్మజ్ఞ! నారద సంయమీంద్ర!
ధన్యులము ధన్యులము భవద్దర్శనమున
నాశ్రమంబును నశ్రమ మయ్యె నయ్య!
పాదరజమున దపములు పండె నయ్య!!

భక్తిసూత్రరహస్యజ్ఞ! పరమపురుష!
లోకసంతరణాలోక లోకనాథ
సహజవాత్సల్య! చెప్పుము జానుగులకు
పండువుగ భక్తిభావసంపత్తిమహిమ.

కాపురం బనుకడలిని గాటముగను
మునిఁగి యుండియు భయమింత పొడను కెపుడు
స్థూలమును వీడునప్పుడు సూక్ష్మమూర్తి
శౌరి సాయుజ్య మెట్లందుఁ జక్కఁ జెపుమ.

అని భక్తిభావ మను నుడి
తన చెవిఁ బడునంత పొంగి తందనముల మూఁ
పున నున్న వీణెయును గీ
తిని మహతియవోఁ గట్లు తెలియం బలికెన్.

ఆలకింపుఁడు శ్రద్ధ మహర్షులార!
యంచితంబైన సర్వప్రపంచమందు
నెల్లరుఁ దరింపఁగను తరియింపఁ జేయ
నితరులను భక్తిభావంబె యెన్న నగును.

ఆస్తికత నాస్తికత బట్టి యగుచునుండు
భావమున భావమును దృఢప్రజ్ఞులార!
అగుట కాకుంట యీరెంట నగుచునుండు
నాగమరహస్య మిది తెలియంగవలయు.

గుడికి చనలేని కుంటును గ్రుడ్డి యేని
గుడిని నిర్మింపఁ జాలని కొలఁది యేని
నే నశక్తుండ రక్షింపు మెడఁద యందు
నిను సదా గొల్తు హరి! యన నెనయు ముక్తి.

భావపీఠంబున భక్తిదర్పణమున
సర్వాత్మనిత్యదర్శనము లేక
ఎన్నిమార్లిలఁ గల్గు నెల్లతీర్థంబుల,
సేవించినను దేవదేవగృహము
లెన్నికట్టించిన నెన్ని యజ్ఞావ,
భృథమ్ము లొనర్చినను మోక్షము గలుగదు
అగుటఁ జిత్తమ్ము నన్యాయత్తముం జే
యకంతట హరిభావ మందవలయు

శౌరిభావన లేనట్టి సర్వకర్మ
లగును వ్యర్థంబు లిల గజస్నానమట్లు
పావనాత్ములు ధీరులు భవ్యమతులు
భావనవిలక్షణత్వము బడయుచుంద్రు.

వినుఁడు ప్రపన్నలక్షణము
వీనుల విందుగ గేస్తైవం డిలక్
తనయిలు దేవళంబుగను
తానును బాయని యర్చకుండుగా
తనయులు దారయున్ సతముఁ
దత్పరిచారకవర్గ మట్లు భా
వన నొనరించునో యతఁడు
వారిజనాభుని యర్చకుం డపున్.

తాను నిత్యమ్మును స్నానమ్ముఁ బొనరించు
నపు డుదకంబు నారాయణుండు
గాఁ దలంచుచు మేనగంధపుష్పాద్యలం
కారముల్ లోనున్న శౌరికనుచు
భోజనపానీయముల నొనర్చుచును
దేహాలయాంతస్థితహరి కటంచు
భాగవతోత్తముం బరికించునప్పుడు
హరి సాక్షాత్కరించె ననుచు

సంధ్యల నుపాసనబొనర్చు సమయమందు
వేల్పులఁ బితాళ్ళఁ దనియించు వేళయందు
నాత్మ హరిభావన నొనర్చునట్టి నరుఁడు
తప్పక భజించు ముక్తిని తబిసులార!

బాట నేగెడుతఱిఁ బొరపాటువలన
నేనియును మీఁది దువ్వల్వ యిలను బడిన
ఐఃమెనని కించవడక సమ్మానమునను
వేత్త కృష్ణార్పితముగ భావింప నగును.

ఇంట నేనియు నూరికి నేగునప్పు
డేనియు ధనము, దొద్దవోయిన విచార
పడక నారాయణార్పణాభావ మైన
చోర, హృదయస్థ, నవనీత, చోరుఁ డలరు.

శ్రీహరి, కృపాకటాక్షమ్ముఁ జెందు నరుఁడు
జన్మజన్మాంతరంబుల సలిపినట్టి
యఘము లెల్లఁ బటాపంచలగుచు ప్రకృత
మంద సాయుజ్యకైవల్య మందు జగతి.

భోగములయందు ధనికులు బుద్ధినిలిపి
తన్ను సేవింపకుండు టెదం దలంచి
భక్తుఁ డని పిల్వఁబడునట్టివాని కెప్పుడు
కష్టముల కూర్చు హరి తన్నుఁ గాంచుననుచు

ఆర్జనమునందు పోషణమందు నాశ
మందు దుఃఖప్రదముగాన నరసి ధనము
కోరఁ డెన్నఁడు భక్తుండు కోరునెపుడు
హరిపదధ్యానధనము శ్రీహరియు మెచ్చ.

తృష్ణ నీరము సుడి భార్య యెంచిచూడ
మదనుఁ డసిలుండు మోహమ్ము కదలు తరగ
అన్నదమ్ములు పుత్రాదు లటు మొసళ్ళు
కాపురపు వార్థి మునిఁగితిఁ గావు వరద.

మువ్వేలుంగుల వెలుఁగ యామోద మొదవ
తావకపదాంబుజాతము న్నావ నొసఁగు

మనుచు శ్రీహరి ధ్యానించు నట్టివాని
హరిపరీక్షుకు నాగినా డనుచుఁ బ్రోఁచు.

భోగధనబలగర్వముల్ పొదలువాఁడు
పగలె రేయిగఁ దలపోయువాఁ డటంచు
తన్ను సతతంబు భక్తితత్పరతఁ గొలుచు
భక్తునకు లేమి నిడు భగవానుఁ డెపుడు.

పెద్దనిద్దుర యనునట్టి పెద్దపులి ర
యంబునను వచ్చి పడునను యంబు తెలియఁ
బడదు గావున నమ్మహాభయ మడంగ
నాత్మ హరి నిల్పి భజియింప నగు సతంబు

చిత్తపద్మమునందు శ్రీహరిస్మరణంబు
మానసికస్నానమహిమఁ దనరు
నోరునొవ్వగ భక్తి శౌరిఁ గీర్తించుట
వాచనికస్నానఫల మొసంగు
తన్మయత్వమున నృత్యంబును సల్పుట
కాయికస్నానసంగతిఁ దనర్చు
రామనామము గంగ రహి కృష్ణనామమ్ము
యమున గోవిందనామమ్ము వాణి

మూఁడు నదులును నిజగురుమూర్తి సత్కృ
పాపయోనిధిని గలియు నివ్విధముఁ దెలియ
సర్వతీర్థములందలి స్నానఫలము
నామభజనమ్మువలన నౌ స్వామికృపను.

స్నాన దాన ఫలాదుల సంభవించు
ఫలము హరిదర్శనంబునఁ గలుగు జగతి
మఱి మహాపాతకంబుల మలయఁజేయు
సర్వపాపంబుల హరించు శౌరిసేవ.

వినుఁడు ప్రపన్నులు విశ్రుతమ్ములను ది
వ్యక్షేత్రములఁ దీర్థయాత్ర సలిపి
అందందు మహిమ సమంచితను ప్రసి
ద్ధము లగు మూర్తుల దర్శనమున
మహిమసంపన్నులై మఱి తపస్సిద్ధులై
పరగుచుందురు లోకబాంధవులుగ
ఇక మహాక్షేత్రమహిమ వచించెద వినుం
డాచార్యుఁ డాప్రతిష్ఠాంతమందు
ప్రకటముగ స్వీయబ్రహ్మరంధ్రమునుండి
విగ్రహమునందు కిరము ప్రవేశపెట్టు
నిజతపశ్శక్తికళల దృగ్జ్ఞష్ఠ మెఱసి
భావనబలంబు ప్రత్యక్షదైవతంబు.

పచ్చికుండను నీరువంటిది దా నాయువు
సంపద లన్నియుఁ జంచలములు
బాల్యాద్యవస్థలు ప్రకృతిసిద్ధంబులు
విషయసుఖంబులు విషసమములు
భవబంధము ఋణానుబంధంబు తత్సేవ
మానవత్వమ్ము ప్రమాదకరము
చనిన కాలంబు రమ్మనినను రాఁజాల
దింద్రియవశ మాటయే యగు మృతి

యనుచు నంతర్ముఖమున నిత్యమ్ము నెడఁద
నెంచి సర్వేశ్వరుని భజియింపవలయు
హృదయపీఠిని నెలకొల్పి యెల్లవేళ
భావసుమములఁ బూజ సల్పంగవలయు.

# భక్తి

శ్రీ కొండపుడి లక్ష్మీ వేంకట హనుమంతరావు



భక్తి యనఁగా ఉపాస్యునకు ఉపాసకునకు నభిన్న మైనది. సర్వావస్థలయందు సర్వకాలములయందు తైల ధారవలె హృదయమం దవిచ్ఛిన్న మైనది. ఊడుగుచెట్టు విత్తనములు దాని మొదటినివలె ఇనుమయస్కాంతమురీతి పతివ్రత భర్తపగిది, తీవె వృక్షముమాద్రి, నది సముద్ర మట్లు, భక్తుని మనోవృత్తి భగవంతుని నెడబాయకుండుట, మరియు నమృతస్వరూప మైనది. ఒక త్రుటియేని వీడకుం డుటవలన అట్టిభక్తికలవాఁడే భక్తుఁ డనంబరగు.

అతఁడు పూజ్యుఁడు, నిత్యతృప్తుడు, అమృతుఁడు. దేనిని కోరఁడు. లేదని దుఃఖింపడు ఉన్నదని క్రీడింపఁడు. ఎవ నియందును ఉత్సహింపఁడు. మత్తునివలె నుండును. ఊర కుండును. తనలోనే తా నానందించును. ఇతరవిషయముల నడ్డగించును. కావున భక్తి కోరినమాత్రాన వచ్చునది కాదు. పుట్టుకతో రాదగినది (నిరోధ మనఁగా లోకా చారము) భగవంతునిసృష్టి శాసనము, భోజనాదివ్యాపా రము వీనిని భగవంతున కనుకూలముగ బ్రవర్తింపఁ జేయ వలయును. అన్యాశ్రయమువదలుటయే స్వరూపముగా గల యనన్యత్వమును, భగవంతునకు సన్మతిలేనివానియెడ, నుపేక్షను జెందవలయును. తప్పక నేను దీనివలనఁ దరింతు నను దృఢనిశ్చయము కలిగినపిమ్మట భక్తినిగూర్చి శాస్త్ర విచారణ సేయవలయును. అట్లు కానిచో నది పడిపో వచ్చును. కృష్ణావతారమందు భక్తపరీక్షాధికారి యగు కృష్ణభగవానుఁడు యమునాతీరమునందు ప్రణవమురళీ గానముచే పుట్టలలోని సర్పాంగనలు నిలబడి ఫణాగ్ర రత్నకాంతులతో నివ్వాళి పళ్లెరముబట్టి మహానందనృత్య మొనర్చునట్లు, బీళ్లయందు నెమరువేయుట మాని యాల మందలు అంబారవమ్ముల తల్లులపాదుగులఁ జేరి జుబుకు జుబుకున, మధురక్షీరరసంబులను గ్రోలుట మాని క్రేపులు మోరలెత్తు నట్లును, గృహకృత్యములను తమ పతిపుత్ర బాంధవగృహధనాదులను వదలి యాకలిదప్పికల విసర్జించి గోపికలు తనవద్దకు వచ్చునట్లును జేసి వారలను చూచి ప్రత్యక్షగుణాఘున నిట్లు పశులైరి. యప్రత్యక్షమున నా యందలి యనురాగ మెట్లుండునో యని పరీక్షింపవలె నని తా నదృశ్యుఁడై నప్పుడు వారు విరహార్తి భరింపలేక చేతనాచేతన విచారణ మాని మాకృష్ణభగవానుని మీరు చూచినారా! ఎటు చనినాడు తామరరేకులవంటి కన్నులు గలవాఁడు, తలయందు జగత్సృష్టికారణములగు నెఱుపు నలుపు తెలుపు రంగులు గల నెమలిపించియము దాల్చిన వాఁడు నని గుర్తులు చెప్పుచు పుట్లను, గుట్లను, చెట్లను, చేమలను, నడుగుచు, దేహభావములేక, తన్మయులై బాలో న్మత్త లక్షణములను కేకలువేయుచు, క్రేళ్లుఱుకుచు, కృశించి, కృశించి, డగ్గుత్తికవడి కొండఱాలు కరగ స్త్రీ రూపము ధరించిన కరుణరసము ట్లలపటించి తిరిగి తిరిగి మరల సాక్షాత్కారభాగ్యముల్ జెందుట భక్తిలక్షణ మునఁ బ్రబలనిదర్శనము. రూపముకన్పింపకున్నను మాహా త్మ్యమును ప్రత్యక్షమందు జ్ఞాననేత్రముం జూచుచున్న సత్యసాక్షాత్కారము చెందుచున్నట్లే యగును. అట్లు కానిది, జారప్రవర్తనమగు కర్మజ్ఞానయోగములకు తాను ఫలస్వరూప మగుట భక్తి, పైమూటికన్న గొప్పది.

విషయాదుల వదలుట, సత్సాంగత్య మొనర్చుట యితర సంకలనము లేని భజనగోష్ఠుల యందు భగవద్గుణములను వినుట చెప్పుట భక్తిసాధనములు. అందు ముఖ్యములు భగ వత్కృపావేశము, మహాత్ములసాంగత్యము.

మహాత్ముల మైత్రి సఫలమైనది. విషయాసక్తుల కశక్యమైనది. సుకృతివిశేషముచేఁ గాని లభింపనిది. అయ్యది భగవదనుగ్రహముచేతనే లభించునది. సజ్జనులయందు భేదబుద్ధి తలచూపదు. సాధకుఁడు మున్ముందు తప్పక ముమ్మాటికి సత్సాంగత్యమే సాధింపనగును. దుస్సాంగత్యము సుతరాం చేయదగనిది. దానివలన కామక్రోధములు చెలరేగును. మోహము ముసురుకొనును. బుద్ధిస్ఫురణ బుద్ధులను సర్వశ్రేయములను నశించును. దుస్సాంగత్యముచే కామక్రోధాదులు మొదట తరఁగలుగా సాగి క్రమక్రమముగా సముద్రప్రాయము లగుచు నహోరాత్రము ఘూర్ణిల్లుచుండును. సంగదోషము వదలి మహానుభావుల సేవించి మమకారశూన్యుఁ డగు నంతర్ముఖుఁడు మాయను దాఁటఁగలఁడు. లోకసంబంధమేమాత్రమును లేక, యేకాంత ప్రదేశముం జేరి సత్త్వరజస్తమోగుణముల పాలుగాక, తనయోగక్షేమవిచారణలేక కర్మఫలములను గర్మలను వదలి ద్వంద్వరహితుఁడై సర్వవేదములసారము గుర్తెఱింగి, యవిచ్ఛిన్నమైన యానంద మనుభవించు మహాత్ముఁడు తాను తరించి, సర్వమును తరింపఁజేయును.

ఆత్మానంద మనిర్వచనీయము. మూఁగవాఁడు తాను తిను పదార్థములోని రుచి యనుభవించుట తక్క నడిగిన వారికి చెప్పలేనియట్లాత్మానంద మనుభవైకవేద్యము. లోకోద్ధరణరూపమున నవతరించిన యొకానొక మహాత్ముముఖమునందు మాత్రము ప్రబోధరూప మందును. అనుభవరూపమున గుణములు స్ఫురింపవు. కోరిక లంతరించును. ప్రతిక్షణము పెంపొందుచు దీర్ఘఘంటానినాదమువలె నవిచ్ఛిన్నమై మిక్కిలిసూక్ష్మమై ప్రజాసామాన్యకు తెలియుట కశక్యముగా నుండును. అనుభవనిమగ్నుఁ డంతట నాత్మస్వరూపమునే తిలకించుచుండును. దానినే భావించుచుండును.

గౌణభక్తి సాత్త్వీక, రాజసి, తామసి, యని మూఁడు విధములు. తామసి కన్న, రాజసి కన్న, సాత్త్విక మంచిది. ఇతరయోగముల కన్న భక్తియోగముచేతనే భగవంతుఁడు సులభుఁడు. ఇతర ప్రమాణాపేక్ష తనకు లేకుండుటను తనకు తానే ప్రమాణమగుటను భక్తియే గొప్పది. సర్వకామోపశమనము, పరమానందము. కేవల భక్తిస్వరూపము. స్త్రీ, ధన, నాస్తికచరిత్రలు ప్రమాదముచే నేనియుఁ జెవిఁ జేర్పఁ దగదు. అభిమానదంభాదు లంతరింపఁజేయవలయు. భగవత్సమర్పితసర్వాచారుఁడై భగవత్పూజాదికమున కాటంకము దానికి భంగము కలుగుచోఁ గ్రోధము ఈపూజ నేఁ జేయించుచున్నా నను నభిమానము భగవద్విషయమునందే యుపయోగించినఁ గ్రమముగా భక్తియోగము సిద్ధించును. కాయిక, మానసిక, వాచనిక, భేదములను త్రివిధమైన నిత్యదాస్యాత్మికము, నిత్యకాంతాభజనాత్మకమును గల ప్రేమను ప్రయత్నించి కేవల భక్తిగా ననుభవింపవలెను. ముఖ్యులైన ఏకాంతభక్తులు భగవద్గుణకీర్తనము లొనర్చు నపుడు డగుత్తిక వడిన కంఠములతో గగుర్పొడిచిన శరీరములతో సాంద్రాశ్రుపూర్ణ లోచనములతో సాత్త్వికోదయమున కరఁగి పరస్పరము కులము పావన మొనర్తురు. భూమండలమును తరింపజేయుదురు. తీర్థములకు తీర్థములగుదురు. సుకర్మలకు సుకర్మ లగుదురు. శాస్త్రములకు సచ్ఛాస్త్రములను జేయుదురు. వారిపితృదేవతలును తన్మయులై సమ్మోద మొందుదురు. దేవత లానందతాండవము సల్పుదురు. భూమియు సనాథ యగును.

అట్టి ఏకాంతభక్తులు భగవదధీనులు. కావున వారి యెడను జాతిమతవిద్యారూపకుల ధనకర్మాదులవిచారణ భేదబుద్ధి కలిగియుండుట భాగవతాపచార మగు. పెంచిన కొలది పెరుగుటయు నీమము లేకుండుటయును కలుగుఁగాన భగవద్భక్తివిషయమున ననుభవమునకు ప్రధానవిఘ్నమైన శుష్కవాద మేమాత్రము మానవునకు మేలునకు సాయపడదు. భక్తుడు సంతతము భక్తిప్రభావమును తెలియజేయ శాస్త్రములనే మననము జేయుచుండును. భక్తినే జిజ్ఞాసువులకు బోధించుచుండును. సుఖదుఃఖములను ఇచ్ఛాలోభాదులను వదలి కాలవేగమును గమనించుచు సర్వదా భక్తినే అనుభవించుచుండును. అహింసా సత్య దయా శౌచము లను ఆస్తిక్యమును తెలియఁజేయు చరిత్రలను విమర్శించి యందలి గుణోత్కర్షను లోకమునకు ప్రబోధించుచుండును.

దృఢప్రమాణ్యముగల చింతారహితులే భగవంతుని భజింపఁదగినవారు. భగవంతుఁడు సంకీర్తనముచేత శీఘ్రముగాఁ బ్రత్యక్షమగు భక్తుల నాదరించు. భగవత్సాక్షాత్కారసాధనములలో భక్తియే గొప్పది.

# సమస్యాపూరణలు

## శ్రీ పోతరాజు లక్ష్మీనరసింహకవి



సొమ్ముల్ చీరలు పూలపేరులును రాసుల్ గూర్చి యవ్వానిలో
న మేల్మైనవి కోరి యేరికొనుచున్ గాలమ్ము వెచ్చింప యు
క్తమ్మా జాగునకాగ, నీ సహజ సౌందర్యమ్మె చాల్ మారుపూ
(టమ్మా రమ్మని పట్టె నాత్మరమణీ హస్తాబ్జమున్ గ్రక్కునన్)

తరుణీమణి సౌందర్యం । బరసితివే? వీక్షణావళిచేతన్
విరళమగు నడుముచేఁ దాఁ? (దఱిమె మృగవ్రజముసింహతతి నడవులకున్.)

సురశాత్రవః దశకంధరః । నరులు నరాశనుల వెలిచినారని నను ని
ద్దుర లేపితె, నీ దుష్కృతి । (దఱిమె మృగవ్రజముసింహతతి నడవులకున్.)

అంకాభావ మజప్రభాంచితము నీ యాస్యంబు దీనన్ మఱే
వంకన్ నల్పు ఘటిల్లునా యనుచు భావంబందుఁ గాంక్షించె నే
ణాంకుం డెంతయుఁ దన్నుఁ బోలఁగఁ దదీయాకాంక్ష గుర్తించి నీ
(వింకన్ గస్తురిబొట్టుఁ బెట్టకుము తన్వీ: ఫాలభాగంబునన్.)

కవివర్యుల భీమనముఖు । లవితథవాక్కులు తదీయమగు వాక్ఛక్తికిన్
శవములయి ప్రాణులుండుట । (శవములు జివించియుంట సంభవమయ్యెన్)

పంచాస్త్రోగ్రగజదత్తభూరివరగర్వస్ఫూర్తి శూరావళిన్
మించంగోరుటఁ గాలకేయుల నని న్నిర్జించుచోఁ బ్రేమ యే
ముంచంబోక మఱందియే యనక విద్యుజ్జిహ్వుపై దూఁకి వే
(త్రుంచెన్ రామ శిరంబు రావణుఁడు సంతోషించి రానిర్జరుల్.)

అంతశ్శుద్ధిగఁ దపము న।నంతముగాఁ జేయ స్నానమాడుటకున్ హే
మంతోషమ్మనకంచె వ । (సంతోషము బాడబులకు సంతసమరయన్.)

సంగరరంగమునం గురు।పుంగవ। ధృతరాష్ట్రి! నరకపుత్త్రిఁడు ప్రేరే
పం గొంతిపట్టి మొనరా । (సింగమ్ముల భంగపఱచె సింధుర మొకటన్.)

తలునీ। నీ సుత కెన్నవ । నెల యంటివి, వినుము నేఁడు నెలపొడుపే ని
క్కలికిం గంటిని గ్రిందటి । (నెలబాలుని జూచి బాల నెలబాలాయెన్)

మందమతి గానఁ బిల్లల।యం దొకటిగ నెంచి పెంచి యామని బలుకుం
బొందిక వేఱుగఁదోఁచిన । (విందునఁ బికశిశువు దాది వెడలగ నడఁచెన్.)

వనజాక్షి। మాటిమాటికి । దనుజోపముఁ జైద్యు నిందుఁ దడవకు మేఁ గృ
ష్ణుని బెండ్లాడెదను దదప।(ఘనము ఘనము మించు మించు గావలె నేనున్)

ముచికుందవరదదర్శన । మచలితమగు భక్తిసలుప నరిగెడు నాకున్
రుచిమద్రససంపూర్ణలి।కుచముల రెండింటిఁ గోసి కోమలి। యిమ్మా.)

ఇప్పుడు నీవిడు సరుకుల । కప్పన మొనరింతు మూల్య మది గొని విశ తాఁ
జొప్పడె నని యంగడివడిఁ । (గప్పకు సంపంగినూనె కావలె వింటే )

స్తుతగుణుఁడగు దుష్యంత । క్షితిపతి కణ్వుం గన నరిగియె గాంధర్వ
స్థితిఁ గైకొని తన్మోని వ । (సతి సతిఁ గవయంగఁ బుత్రసంతతి గలిగెన్)

హారిసుగంధ మీవలఁదు నప్పుడె నీ ప్రియుఁ డొయ్యని న్నెదం
జేరిచికొంట వాని గళసీమను వ్రేలెడు హార మచ్చున
న్దారిచినట్లు నీ యురమున న్వెలుఁగొందెను గాకయున్నచో
(దారములేని హారము నితంబిని। నీ కెవఁ డిచ్చెఁ జెప్పుమా.)

తండ్రి కొమారు లౌదురుగదా। రవియున్ శమనుండు నెల్ల యి
ల్లాండ్రను మిన్నయైన పృథ యత్యధిపాత్త సుమంత్రశక్తి న
వ్వాండ్రను నిష్ఠతోడఁ బిలువన్ వృథసేయఁగరామి వచ్చి యా
(తండ్రియుఁ బుత్రుఁడున్ సుతయుతం బొనరించిన సాధ్వియై తగెన్.)

రాహు వెదిరించి రవిని బూర్ణమ్ముగాఁగ మ్రింగివేయుఁడు జీకటుల్ మెండుకొనియెఁ
బక్షు లఱచుచు గూండ్లకుఁ బాఱఁజొచ్చెఁ (గానఁబడియెను నక్షత్రగణము పగలె.)

అతులితనియమ సమన్విత । పతివ్రతాగణమతల్లి బంధుప్రియ ఖా
నుతనూభవ సుగుణఖని త । (పతి పతి గవయంగ ముద్దుపట్టి జనించెన్.)

కంజాతోద్భవతుల్యా ధీబలసమగ్రాః యాత్మవిచ్ఛేఖరాః
పుంజీభూతములైన యేనసుల నిర్మూలమ్ము గావింప ము
క్తిం జేకూర్ప సమర్థమైనదని భక్తిన్ దేశికోత్తంసు మే
(లం జేకొన్నది నాదు మానసము వేదాంతమ్ము సాధింపనే.)

కంజేష్వంగ విభంగకాంశమున నాకాశప్రభూతానుకం
పం జంద్రానన కంజనాసతికి జన్మంబంది క్షుద్బాధచే
తం జిట్టాడెడు నాంజనేయునకుఁ జాతం బట్లు ప్రాగద్రిపై
(మంజూషంబునఁ దోచెఁ బద్మహితబింబం బెంతయు న్వింతగన్.)

అబ్ధిగభీరః విన్మ సుకృతాత్ముల మైత్రి నెసంగువాఁడు ప్రా
రబ్ధ వితీర్ణి యార్తజనరక్షణతత్పరుఁ డిద్ధబుద్ధిసం
లబ్ధ దయాగుణుండు మృదుమానసనీరరుహుండు సద్యశః
(లబ్ధుఁడు దీనమానవుల లోపముఁ బాపును జూచినంతనే)

దధ్యన్నం బెవ్వ డారగింపవలె, నిత్యంబై సదా దేవతా
రాధ్యంబౌ సుధ యెందు రాజిలు, దివారాత్రంబులం దెల్పఁగా
విధ్యుక్తంబుగ నెవ్వఁడుండెఁ గిటియై విశ్వాత్ముఁ డేమైతినో,
(మధ్యాహ్నంబునఁ జంద్రమండలములో మార్తాండుఁడుండెన్ భువిన్.)

కొంకక చూలాలిని నిఃష్పంక న్నాస్నుషను వనికిఁ బంపితె రామా!
లంక శిఖిముఖసురాళి క । (లంకచరిత కాదనుచుఁ దలంచెన్ రామున్.)

గుంద్రని చన్నుదోయి గల కుబ్జ హలాయుధ కృష్ణమూర్తులన్
వాంఛను నన్నదమ్ముల కవంగని యా కవయందుఁ గూళగా

తీంద్ర నడంచునం చలఘుదీప్తి నుషాహృదయాపహర్తకున్
(దండ్రిగదా యటం చతివ తమ్ముని గోరెను మారుకేశికిన్.)

గోపాలరూప శౌరికి । గోపిక యొక్కర్తు కురులు గోరుల దువ్వన్
గోపాలక గోపికలకు । (వీపునఁ జనులుండె గోళ్ల వెంట్రుకలుండెన్.)

మృత్స్నారాశిని గల్గు శబ్దతతి నెంతేఁ గాంచి ధీయుక్తిఁ బ్రో
ద్యత్స్నగ్ధాత్మకు లిచ్చుచుండిన సమస్యల్ చెప్పునాతం డుద
న్వత్స్నానం బొనరించినట్టిఁ డగుఁ గానన్ వాని కీర్తిన్ సభన్
(కృత్స్న జ్యోత్స్నల వీడి చెప్పఁగదవే హృత్స్నేహ మేపారఁగన్.)

అనుకంపానిధిః పాండురాజమహిషీ ప్రాణేశుఁడై యేలుకో
ఘను నీ రెండవసూను వేఁడిన ననున్ గాదంచు గారించెనం
చును బాదంబుల వ్రాల గొంతి నెనరుం జూడ్కిన్ హిడింబానుజా
(తను బెండ్లాడుమటంచుఁ గోరెను సుతున్ ధర్మప్రకారంబుగన్.)

వక్త్రిద్వ్యక్షః సమస్త భూతచయమున్ వాల్లభ్యసంపత్తితో
శుక్త్రిసంబులఁ బాపియే జగదధీశుల్ బ్రోతు రా శ్రీ శివా
వాక్త్రిణాఢ్యుల కంబికాహరులకుం బద్మప్రియస్వామికిన్
(వక్త్రింబుల్ పది కన్ను లైదు కరముల్ వర్ణింపఁగా వేయగున్.)

నీ పీటఁ బద్మరాగము । స్థాపింపంబడియె సంజతటి గానఁ దగెన్
దీప మటు లద్ది తన్మణి । (దీపముపై నొక్క యీఁగ దిరత వ్రాలెన్.)

ఖ్యాతిం బురుషున కిడునని । దాతృత లిపి విద్య సూనృతమ్మగుఁ గానీ
చేతికిఁ గట్టుయుఁ గడియము । (మూతికి మీసంబు చుట్టముక్కయె తలఁపన్)

ధూర్తతలోదరీమణుల తో్రివను బట్టక యెంతయేనియు
స్కీర్తినిఁ జెందఁగాఁ దలఁచు నిర్మలచిత్తకుఁ బువ్వఁ బెట్టుచో
నార్తిఘటిల్లకుండఁగ నయాన సపర్యలు సల్పుచో మనో
(భర్తను బుత్త్రిగాఁ దలఁప భావ్యము భామకు రెండువేళలన్.)

అంగవికాసహీను లకృతా స్త్రు లధీరులు మత్స్యయంత్రమున్
భంగ మొనర్పఁగాఁగలరె పద్మదళాక్షికి నీకు దీటుగా
నంగజమూర్తి యోగ్యుఁడు సమర్థుఁడు పార్థుఁడు నీదు చిత్తసం
(మంగలవాఁడె భర్తయగు మానుము దుఃఖము నీవు దౌ్రపదీ!)

కలఁగక గాధిభూసవముఁ గాచిన దెవ్వరు? రామచంద్రుఁ డే
కలికికిఁ బ్రాణనాయకుఁడు? కవ్వడికిం గవ లేమి కావలెన్?
జలిమలపట్టి జేఁ దెవఁడు? శంబరవైరికి ధాత యేమగున్?
(జెలువుగ రామలక్ష్మణులు సీతకుఁ దమ్ములు శంభుఁ డన్నయా.)

అల్ల మహిషదైత్యుఁ దునుమ నెల్ల మగ ల్జాలమిన్ ద్రుహిణుఁ డద్రిజఁ ద
ద్వల్లభుఁ గని యాకవ గుహు (తల్లీ దండం బటంచు దారకు మ్రొక్కెన్.)

ఇనకులజుండు రాముడు మహీజఁబరీక్షకు దీప్తకీలిలో
జొనుపఁగఁజేయ నగ్గి కడుసొంపఱఁ జూచిన రామునానతిన్
దనుజులు తెచ్చిపోసిరి ఘృతమ్మును సీత సతీత్వశక్తి నా
(యనలునియందు నేయి గననయ్యె మహాశతినంబుగా నిలన్.)

అరుణుఁడు గ్రుంకె నిద్రపె వెలయాలనె నే నయినన్ గృహమ్ములోఁ
బఱఁగుచు నున్న సందడి లవంబును తగ్గదు మారుసేత గా
తరత వహించు నిగ్గన నెదన్ దిగులయ్యెడి నౌట లోని నా
(యలవిరిపాన్పుఁ జేరఁజనరా! విటరాయడ! నేను వచ్చెదన్.)

మం దనఁగా సామాన్యమె యందుం గల గుణము దోష మరయగఁ బోకే
తొందరపడి బడిబడి పలు (మందులు సేవించి వెజ్జు మంచము పట్టెన్.)

ఆర్యగ్రామణీ! శాంతిదాంతిసముపేతా! సర్వసిద్ధాంతవి
ద్వర్యా! వి న్మది కాలచక్రగతిచేతన్ దర్శకల్యంబునన్
గ్రౌర్యోపేతతమోగ్రహగ్రసితుడై కాంతిక్షయుండై యటన్
(సూర్యుం డింద్రదిశాద్రి నెక్కెఁ బొడిచెం జుక్కల్ నభోమణ్డలిన్.)

వ_క్త్రేశాస్యః సుమేచ్ఛ బుష్పవనిలోనం దిర్గగానొ జలా
స_క్తిం బల్లవపాణి యొక్కరిత కాసారాంబువుల్ దోయిటన్
ర_క్తిం బట్టి పదేపదే కనుచు శీర్ణస్థైర్యయై ముగ్ధతన్
(ర_క్తం బంచును నిర్మలోదకములం ద్రావంగ శంకంగనెన్.)

ప్రణుతయశస్వి పం_క్తిరథువాక్యము సల్పఁగ మౌనియై సుధీ
గణము గణింప ఘోరమగు కానకు నేగిన ధీరుఁ డవ్విభీ
షణహితకారి రామనృపచంద్రుఁడు సంగరరంగకృ_త్త (రా
వణు౦డు మహీజతోఁ దిరిగివచ్చె నయోధ్యకు నెల్ల రెన్నఁగన్.)

ఆరాస్యంబులవాఁడు జాహ్నవి లలాటాక్షుండుఁ గాత్యాయని
న్జేరం బోయిన యప్డు తద్గళమున న్వ్రేలాడుచుండెన్ గడన్
సౌరా వారణహీరహార మది స్వచ్ఛం బౌట నద్దానిచే
(నూఱు న్మప్పదియాఱు కన్ను లమరె న్రుద్రాణివక్షంబునన్.)

త్వద్రవియైన సులక్షణ రాద్రమణీశతము గొడ్డురాండ్రైనను మా
సీద్రమ్యఫలాశతఁ గడ (గొడ్రాలికి బిడ్డపుట్టెఁ గోరిక తీరన్.)

సంహృతకామముఖ్యరిపుషట్కకవిప్రవరాః మహాధనా
రంహము మీఱఁగా రణధరన్ గురుకర్ణముఖేద్ధవిద్విష
త్సంహతిఁ బాఱఁద్రోలి సురసన్నుతి గన్న కిరీటిసూతిరాట్
(సింహము చిక్కె శ్వానతతిచేఁతలకు న్విధి నే మన న్వలెన్.)

హాలాపానమ్మున మతి కోలుపడిన వెజ్జు కీడుగూర్చెడు మందున్
బాల నిడి రోగికిడ నా (పాలన్వాబెట్ట దంతభంగం బయ్యెన్.)

స్థితు లెన్ని యున్న నొప్పరొ కుతుక నెది తొలంగ నెదుర గుటకలతాలిన్
శ్రుతి సమ్మతి మెడఁ గట్టిన (పతి చచ్చుట మంగళంబు భామామణికిన్.)

పుటుకమొదల్ గలదశలను చిటిపోకలు పూలచెండ్లు శ్రీకుంభంబుల్
స్ఫుటముగ నగుగావే దశ (వటబీజము లంతలేసి వనితకుచంబుల్ )

# తమ్ముడా!

శ్రీ రాయప్రోలు సుబ్బారావు



శ్రీలు పొంగిన జీవగడ్డయి
పాలు పారిన భాగ్యసీమయి
వ్రాలినది యీ భరతఖండము
భక్తి పాడర తమ్ముడా!

వేదశాఖలు పెరిగె నిచ్చట
ఆదికావ్యం బలరె నిచ్చట
బాదరాయణపరమఋషులకు
పాదు సుమ్మిది చెల్లెలా!

విపినబంధుర వృక్షవాటిక
ఉపనిషన్మధు వొలికె నిచ్చట
విపులతత్వము విస్తరించిన
విమలతల మిది తమ్ముడా!

సూత్రయుగముల శుద్ధవాసన
క్షాత్రయుగముల శౌర్యచండిమ
చిత్రదాస్యముచే చరిత్రల
చెరిగిపోయెను చెల్లెలా!

మేలికిన్నెర మేళవించీ
రాలుకరుగగ రాగమెత్తీ
పాలతీయని బాలభారత
పదము పాడర తమ్ముడా!

నవరసమ్ములు నాట్యమాడగ
చివురుపలుకులు చెవులవిందుగ
కవిత లల్లిన కాంతహృదయుల
గారవింపవె చెల్లెలా!

దేశగర్వము దీప్తిచెందగ
దేశచరితము తేజరిల్లగ
దేశ మరసిన ధీరపురుషుల
తెలిసిపాడర తమ్ముడా!

పాండవేయుల పదునుకత్తులు
మండి మెరసిన మహితరణకథ
కండగల చిక్కని తెలుంగుల
కలిసి పాడవె చెల్లెలా!

లోకమంతకు కాకపెట్టిన
కాకతీయుల కదనపాండితి
చీకిపోవని చేవపదముల
చేర్చిపాడర తమ్ముడా!

తుంగభద్రాభంగములతో
పొంగి నింగిని పొడిచి త్రుళ్ళీ
భంగపడని తెనుంగునాథుల
పాట పాడవె చెల్లెలా!

# గంగాతీరము

శ్రీభరతమాతకంఠాన సిరులు దొరయు
నాణిముత్యాల కళ్యాణహార మనగ
తేజరిల్లు నార్యావర్తదివ్యజీవ
నామలామృతవేల్లి గంగామతల్లి !

హారజటారణ్యపుణ్యకుల్యాంతరాళ
ముల నెసంగు దివ్యక్షీరములను సతము
స్నానమాడి కాంబోలు దోషాకరుండు
కువలయానందు డయి నుతిం గొనియెనక్క !

పవనచాలనమున నలల్ గవిసి కవిసి
తుంపురులు గుంపులెత్తం ద్రోత్రోపులాడు
చిందునవగాహనము నాడియుందు రెలమి
వైదికయుగంపునాటి దివ్యర్షివరులు

కులపతులవాటికల సరస్సులకు మించి
నీరువోవు సరిత్కూలతీరములను
పట్టి మేసెడి హరిణశాబములు రెండు
మనవలెనె యిందు రాంబోలు నని స్ఫురించు

సుప్రశాంతము లగు మనస్సులను లేచి
చలి నెరుగక మాఘస్నానములను సలిపి
తపసికన్నెలు వల్కలధారణములం
బసుపుముగ్గులు తీర్చి రీభవ్యతటిని

ఋక్కులను బాడి రీనదీప్రియతటమున
యజ్ఞములు సల్పి రీయేటియంతికమున
ఉపనిషత్సూక్తిసౌరభ మొదవె నిచట
పూజ్యులా తొంట యరుదె ! యీపుణ్యగంగ

తల్లి భాగీరథీదేవి చల్లనయిన
కడుపునం దాగి ధన్యయై కలిసిపోయె
పూతయమునాతరంగిణీపూర్వజన్మ
సుకృతబీజము లిట్లు పండకయె యున్నె

కడిమిచెట్టుల దట్టమౌ గట్ల కెలన
మృదులసైకతశయ్యల రేలుపవలు
నాడుకొన్న రాధాకృష్ణు లస్తమింప
నెట్టు లోర్చెనో కాళిందిహృదయ మకట!

ఆర్ద్రితులసీదళీమాల నందగిల్లు
కృష్ణకంఠము నిండు కౌగిటను పెనచి
వావివిడుపుల ద్రవియింప వచ్చియెడద
సాంత్వనం బందనోపు నిచ్చటనె, రాధ

సరసతర వేణుచారణచతురు డయిన
చిన్నగోపాలుం గాంక్షించి స్నిగ్ధహృదయ
పరవశోన్మాదమున రాధ పాడినట్టి
భక్తిగీతము లిమె గర్భమున గలవు

ఈతరంగిణియొడ్డుల నిసుకమీద
సంజచాయపూతలు వడ్డ సమయములను
అరంబరచిన నీర్కావిచీర లనుచు
మోసపోయి యుండరె మునిముగ్ధలక్క !

రేకుల్ రేకులుగా నుషస్సు జనయిత్రీ
ప్రేమరాగమ్ము ప్రా
చీకళ్యాణకుటీరభాగముల పుష్పింపన్
ప్రబోధోత్సవ

శ్లోకమ్ముల్ రచియించుచున్ గడప
బోలున్ నెచ్చెలీ! యిందుక
న్యాకాలీనపవిత్రజీవితము
లార్యావర్తబాలామణుల్.

ప్రకృతిమంగళక్షేత్రమార్దవము దెలిపి
పురుషుని విభూతి గుణయోగమును వెలార్చి
పరమపుశుచి నొప్పు ప్రేమప్రపంచమునకు
నడుచుమార్గము మరల నేర్పదునె సకియ!

జ్వలితపద మగు నిగమానువాకములను
తెలియజాలని పరమతాత్త్వికరహస్య
బోధ లెన్నో సూత్రించిన పుణ్యకన్య
కావికాసమే మయ్యె జగాన నేడు

వాక్కు నర్థంబునకుఁ బరస్పరమనోజ్ఞ
మయిన ప్రణయమున్ గుర్తించినట్టి ఋషుల
రసవదుపదిష్టగీతానురక్తి సొగయు
వారిచట లోకమెల్ల స్వప్నముగ నెంత్రు.

# వినుతి

మృదుహృదయుఁడైన వాల్మీకి మొదలుగాగ
నెందరెందరు సుతులనో యెత్తి పెంచి
మమతతీరని యేకకుమారసరణి
నను గటాక్షించు తల్లి వాణిని నుతింతు.

బొంది నశియించియును వహ్నిపూత మయిన
బూదిలోన ఛాయావాసనాదికముగ
రాగరసములు నిల్చునన్ ప్రణయవిదుల
స్నేహమీమాంసలను స్మరించెదను మదిని.

# గర్భకవిత్వము


## శ్రీ రావిపాటి లక్ష్మీనారాయణ




చిత్రకవిత్వము, బంధకవిత్వము, గర్భకవిత్వము, ఆశు కవిత్వ మని కవిత్వమును మన పూర్వులు నాలుగు విధము లుగ విభజించిరి. 'చతుర్విధాంధ్రకవితామతల్లి కాల్లసాని పెద్దన' యని మనుచరిత్రలో నున్నది. ఏకాక్షరి, ద్వ్యక్షరి, త్ర్యక్షరి, నిరోష్ఠ్యములు, సర్వలఘువులు, తలకట్లు, గుడులు కొమ్ములు అనులోమవిలోమములు మొదలగునవి చిత్ర కవిత్వము. పుష్పమాలికా, రథ, నాగ, ఖడ్గ, చక్ర బంధములు మొదలగు బంధములు బంధకవిత్వము. వేగ ముగా చెప్పునది ఆశుకవిత్వము. పద్యమందు పద్యమిమిడి ఛందోర్థదోషములు లేకుండునది గర్భకవిత్వము. ఒకపాదము నకు తక్కువ లేకుండ నొకతూరి యిముడ్చుట శ్రేష్ఠము. పూర్వప్రబంధములలో నాశ్వాసాంతపద్యములలో నచ్చ టచ్చట గర్భకవిత్వమున్నది. చంపకోత్పలమాలలలో తేట గీతియు, ౦సములో ౦మును, చంపకమాలలో కందమును, తేటగీతిలో నాటవెలదియు, తేటగీతిలో కందము నిముడును. సీసపద్యములో శార్దూలము చంపక మాలయు, నుత్పలమాలయు నిముడవు. కాని యొకపద్యమున గురువుగ నుండు నక్షరమును రెండవ పద్యములో లఘు వుగ నుండునట్లు వ్రాసిన యెడల నిముడును. అట్లు చేసిన యెడలనే పెద్దపద్యములోనసై నే చిన్నపద్యమునైన నిముడ్చవచ్చును. మూలపద్యములు రామాయణార్థము గర్భస్థపద్యములు భారతార్థము నిచ్చుచు గ్రంథమంతయు గర్భకవిత్వముతో నిర్వచనముగా నేను వ్రాసిన భారత గర్భరామాయణములోని నాలుగుపద్యములను గర్భ కవిత్వమున కుదాహరణ లిచ్చుచున్నాను.

*చంపకమాలలో గీతపద్యమిముడుట:*

ముదమున నేలు నానగరి
భూపతి చీకు జనాల కాపు హె
చ్చు దశరథుం డనన్ వెలయు
చుఀ ధృతరాష్ట్రుడు బిట్టు భీష్మమహా
కదనమునందు సచ్చరని
కాయు సహాయుత జక్కడంచె ను
గ్రదనుజ కోటులన్ రిపుల
రాజకులేంద్రు లరే యనంగనుఀ.

ఆనగరి ను, చీకుజనాల = గ్రుడ్డి జనుల (కుంటి గ్రుడ్డి మొదలగు దీనుల) రక్షించువాడు దశరథుం డనుపేరుగల రా జేలుచుండెను. ధృతరా డు ధరింపబడిన రాష్ట్రముకలవాడు (రాజు) భీష్మమైన = ఘోరమైన యుద్ధములో తనతోడిరాజులు మెచ్చ శత్రువులను, రాక్షసులను చంపెనని యర్థము.

*గర్భస్థ తేటగీతి-భారతార్థము*

"నగరి భూపతి చీకు జనాల కాపు
వెలయుచుఀ ధృతరాష్ట్రుడు బిట్టు భీష్మ
శరనికాయసహాయుత జక్కడంచె
రిపుల రాజకులేంద్రు లరే యనంగ"

నగరి = పురి (పైన చెప్పబడిన హస్తిపురి)
భూపతి = రాజు; చీకు = గుడ్డివాడు, ధృతరాష్ట్రుడను

**వాడు; భీష్మునిసహాయముతో** శత్రువులను గెలిచెనని యర్థము.

(2) *సీసములో మత్తేభము*

విబుధసందోహము వేడ్కఁ జెందెను గనెన్
మోదంబు గోబృందముఁ నయముగ
వసుధ నాశించెడువారు సంతసమునన్
శోభిల్లుచుండంగ శోకరహిత
శుభధరాచక్రము చొక్కఁ మెల్లన జగ
త్ప్రాణుండునున్ వీచె, దా, జలచయ
ము నధమశ్రేణియు బొందు చుమ్మలికమున్
ఖ్యాతిన్ విడెన్ బెల్లుగన్ సుపర్వ
దుందుభులుమ్రోసె, దశదిశలొందె దెలివి
నలుపల జడి గురిసె నాడి రప్సరసలు
పాడె గంధర్వతతి, కూర్మితోడ నుంట
గరుడ పన్నగ కిన్నరుల్ గంతులిడిరి.

*గర్భస్థ మత్తేభము*

బుధసందోహము వేడ్కఁజెందెనుగనెన్
మోదంబు గోబృందమున్
సుధ నాశించెడు వారు సంతసమునన్
శోభిల్లుచుండంగ శో
భధరాచక్రము చొక్కఁ మెల్లన జగ
త్ప్రాణుండునున్ వీచె దా
నధమశ్రేణియు బొందు చుమ్మలికమున్
ఖ్యాతిన్ విడెంబెల్లుగన్.

(3) *చంపకమాలలో కందము*

అనవిని యుత్తరం బొసగె
నాచెన కెట్లని వెఱ్ఱియేను జే
సినపని చేసితిన్ విడువ సీతను
సున్నము వాని జేతు వీ
కను, వనటొందె వాడియును గానను
హీనత జిక్కియుఁ రణం
బొనరుచుటా, బలే యుడుతయూపుల
కెందును మ్రాకు లూగునే

*గర్భస్థ కందము*

విని యుత్తరం బొసగె నా
చెన కెట్లని వెఱ్ఱి యేను జేసిన పనిచే
వనటొందె వాడియును గా
నను హీనత జిక్కియున్ రణం బొనరుచుటా

*తేటగీతిలో కందము*

అలుక గనె భీము డనియెదు తెలియు మెదను
భయపడను దదీయములగు పల్కులకును
బేదకినుక యీయిలలోన బెదవులకును
రహిని జెఱుపె హారీ నొంతు రాము గీము

*గర్భస్థ కందము*

అలుకగనె భీము డనియెదు
తెలియు మెదను భయపడను దదీయములగు ప
ల్కులకును బేదకినుక యీ
యిలలోన బెదవులకును రహిని జెఱుపె హారీ

ఒకయక్షర మొకపద్యములో లఘువుగను మఱియొక పద్యములో గురువుగను నుండుట

*సీసపద్యపాదము*

పాయక మించగా స్వపురివారు కడున్ రు
చి స్ఫూర్తి యుక్తుడై దలంచె

ఇందు రుచిస్ఫూర్తి యను సమాసములో 'చి' గురు వగును. ఇందులోని **యుత్పలమాల**

'పాయక మించగా స్వపురి వారు కడున్ రుచి, స్ఫూర్తియుక్తుడై'

ఇందు 'రుచి' చేత మించగా స్ఫూర్తితో గూడినవాడై యని యర్థము వచ్చుటచే రుచియొద్ద విగ్రహము కలుగుచున్నది. ఇచ్చట 'చి' యను యక్షరము లఘు వగుచున్నది. అట్లు చేసిన గాని సీసములో నుత్పలమాల యిముడదు.

"ఇల ఖ్యాతి, స్ఫూర్తియుతైణలోచనల సత్
క్ష్మాపాత్మజుల్ గొప్పగా గాని ప్రియ"

ఈసీసపద్యపాదములో ఖ్యాతిన్ = కీర్తిచేత, స్ఫూర్తి యుతైణలోచన యని విగ్రహముండుటచే 'తి' యను నక్షరము లఘువగుచున్నది.

గర్భస్థ శార్దూల పద్యపాదము
'ఖ్యాతి స్ఫూర్తియుతైణలోచన లసత్ క్ష్మాపా
త్మజుల్ గొప్పగా,

యనుదానిలో 'ఖ్యాతిస్ఫూర్తి' యని సమాసముండుటచే 'తి' యను నక్షరము గురు వగుచున్నది. ఇట్లు చేసినగాని సీసములో శార్దూల మిముడదు.

గర్భకవిత్వములో యతులలో కొన్నిచిక్కులు
నిక్కంబు నామాట నక్క యెక్కడ మతి
నాక మెక్కడ జలజాక్షు డవని

యను సీసములో 'నక్కయెక్కడ మతి నాక మెక్కడ జల' యను తేటగీతి యిమిడినది. మూలపద్యమున 'జలజ+అక్షుడు' అనుచో అకారమునకు స్వరయతియు గర్భస్థపద్యములో 'నక్క' యనుచో నకారమునకు వ్యంజన యతియు రావలసివచ్చుటచే రెంటికి పనికివచ్చు 'నాక' మను నుభయవడి వాడవలసివచ్చినది.

(2) [యల]జడి రావణు జననాశకుని పోక కని ద
మకమున వీడి ద్వైమాతుర పిన్న యను

సీసములో 'శకుని పోకకని దమకమున వీడిద్వై' యని యాటవెలదిపాద మిమిడినది. ఇందు మూలపద్యమున వ్యంజనయతియు, గర్భస్థపద్యమునకు ప్రాసయతియు సరిపోవునట్లు (దమకము)ను ప్రయోగింపవలసివచ్చినది.

3. భువి జములేసె గపులు దాశరథి[సంగరమహి]
మాతులబలు నండచేత గృష్ణ

యను సీసపద్యపాదములో 'మాతులబలునండచేత గృష్ణ' యను నాటవెలదియొక్క రెండవపాద మిమిడినది. మూల పద్యములో మహిమ + అతుల = మహిమాతుల యని యర్థము వచ్చుటచే 'అ' కారమునకు స్వరయతియు గర్భస్థ పద్యమున మాతుల = మేనమామ యని యర్థము వచ్చుటచే 'మ' కారమునకు వ్యంజనయతియు రావలసియుండుటచే యీ రెంటిని వదలి 'చేత' యను ప్రాసయతిని వాడవలసివచ్చినది.

ఇక చతుర్విధాష్టవిధ కందములున్నవి. ఇవి నిజముగ చిత్రకవిత్వమే యయినను అప్పకవి గర్భకవిత్వములో జేర్చినాడు.

అష్టవిధ కందము

ద్రుమములు గరులను వెలికుసు
మములను ఘనత గుశలతను మఱిమఱి గనుచున్
సమరహితరమను బలముల
గుములయి తనిసి రతులితులు గురుమతివినుతుల్

ఈపద్యమును నెనిమిది సమభాగములు చేసి యెచ్చట నుండి చదివినను ఛందోర్థదోషములు లేక యాపద్యమే వచ్చును.

వెలికుసుమములను ఘనతగు
శలతను మఱిమఱి గనుచును సమరహిత రమన్
జలముల గుములయి తనిసి ర
తులితులు గురుమతి వినుతులు ద్రుమముల
గరులన్.

ఇట్లే 'ఘనతగుశలతను' నుండి, 'మఱిమఱిగనుచు' నుండి 'సమరహితరమను' నుండి 'జలముల గుములయి' నుండి 'తనిసిరతులితులు' నుండి 'గురుమతి వినుతులు' నుండి చదువవచ్చును.

గర్భకవిత్వములో కనుచున్ = కనుచునుగాను గుములై = గుములయిగాను వచ్చుటను నప్పకవి సమ్మతించినాడు.

# శాంతి

శ్రీ తంగిరాల కేశవశర్మ



శాంతిః శాంతిః శాంతిః
శాంతిక్రాంతులకలయిక సర్వభువన వి
భ్రాంతిచ్ఛేదం బిదియే
సంతత మాచరణలోన సాధింపనగున్.

ధర్మప్రాభవహీన మై దిశలు యుద్ధధ్వానసంకీర్ణ మై
మర్మంబుల్ వసియించు నీభువిని ప్రేమాప్యాయతాలేశముల్
నర్మాక్షిపరిసరాల కందవుగదా! నాకప్రభారాజి స
త్కర్మభ్రష్టులు పొంద శక్యమగునే తచ్ఛాంతి పోఁద్రోలితే?

ద్వేషము గూడుకట్టుకొని వీడదు దుష్టులలోని భావనన్,
వేషము చూడబోవ కనుపించును మేల్మి మెఱుంగువస్త్రముల్,
భాషణమా నయోక్తు లట లాస్యము సేయును, అంతరంగమం
దీషణమాత్రముం గనము నెయ్యము, వీరల శాంతికాముకుల్!

ఆపరమాత్మవక్త్రభవహాసము లానిన గాని శబ్దశా
స్త్రపరవేదియైనపుడు రాగములో నటియించు నాదమున్
ఈ పృథివిన్ శ్రుతిస్వరసమీక్షణసాధన సేతగాని స్వా
మీ పరిపక్వమంది ఫలియింపదు శాంతిఫలంబు శంకరా!

కలుగును శాంతి భూస్థలిని కర్మమహీస్థలి భారతాంబ లో
దలఁపులు విన్న "ప్రేమసమతత్త్వము విశ్వసనీయభావముల్
బలిసిన గాని ధర్మము విభాసితమయ్యెడు నప్డుగాని రాఁ
గలుగదు శాంతిభాగవతగాథలయం దనురక్తి సంపదై"

# నివేదన



శ్రీ వాగ్దేవిపదాంబుజోద్భవసుధా శ్రీబిందుసందోహముల్
భావావేశరసార్ద్రచిత్తమధుపం బై గ్రోలెదన్ నిండుగా
దేవీ! యచ్చటనే లభించునట నీ దివ్యాంగసౌరభ్యముల్
నీ వాక్చాతురి, నీ వచఃపటిమయు న్నీ పాదసేవాదులున్.

సతతంబున్ భవదీయపాదకుసుమాసాదృశ్యసేవారతిన్
బ్రతుకుం బుచ్చగ నిచ్చగించెద దయారాజ్ఞీ! సువాగీశ్వరీ!
ప్రతినం బూన్పగజేయు ముందటిభవం బందైన మందానిలుం
డత డౌనంచు, త్వదీయసౌఖ్యమున కే నర్పింతు నా జన్మమున్.

ఎన్నిభవంబు లయ్యె జలజేక్షణ! నిర్మలకాలవాహినిన్
నిన్ను మదీయనేత్రముల నిండుగ చూడదలంచుకోర్కెతో
చిన్నవరాలబిడ్డవు సుశీలవు వత్సలతాబ్ధి చంద్రమా!
మన్నన సేసి కావగదె మాదృశదీనజనావళిన్ కృపన్.

సవ్వడి గల్గినన్ యెడద జల్లున స్పందనమందు భారతీ!
జవ్వని యోర్తు వచ్చినటు చల్లనిచేతిని జాపినట్లుగా
న వ్వనజాతసుందరసుమార్ద్రసువాసన లుప్పతిల్ల, న
న్నెవ్వరో బుజ్జగించినటు లెంచెద, తుంచెద నాదు దుష్కృతిన్.

ఏలాకా హాసరేఖ లివి? యెందుల కీ పరిహాసదృశ్యముల్
"ఆ లలనామణీ మధురసాభర మానన మాలకించినన్
కాలమహా ప్రభావమునఁ గన్గొనలే కెవరో యటంచు నా
లీల నెఱుంగ లే వయితి లె" మ్మనుచుంటివ వాగధీశ్వరీ!

స్వచ్ఛం బౌటను నీదురూపు కుసుమం బందంగ శుభ్రత్వమున్
స్వచ్ఛందే యగు నీదు మాలికయు శుభ్రంబౌట నీగ్రంథ మీ
స్వచ్ఛం దేకత మయ్యె లెమ్మ ధరణీ సంచర్య మాలిన్యమే
విచ్ఛిన్నత్వముఁ బొంద విద్యలఖనీ ! పీయూష నిష్యందినీ !

నీ పాదాస్థిర లాస్య సంజనిత మంజీర ద్వయీ నాదమే
పాపాచారుల మేలు కొల్పుటలు సంభావ్యంబు కాలే దదే
నాపూర్వంబున పాపమో యెఱుగ, జ్యోత్స్నా శ్వేత పుష్పంబు నై
యీపృథ్వీస్థలి గాక నాకమున జన్మేలేదు ప్రారబ్ధమే !

భారతీ ప్రణతులు, స్వర్లోక వాసినీ !
కమ్రభాషిణీ ! సుఖప్రదాత్రి
కమలజాతసఖియ ! విమల వాగీశ్వరీ !
వినుతి సేయలేను, విద్య లిమ్మ !

# తత్త్వ చింత

## శ్రీ కొప్పరపు వేంకట రత్నకవి



ఖడ్గమునఁ జీల్పవచ్చిన కనలబోక
మరఫిరంగులు ప్రేల్చిన మరలబోక
దాగుణాపు హత్యలకునేని దారబోని
శాంతిసముపేతు డగు ప్రజాశాంతికరుడు.

ఉత్తరపుత్రు డుత్తముడు ఊహాలకందని తత్త్వవేత్త అ
త్యుత్తమమూర్తి విప్రుని భయోదితశాపభరంబు నాపగా
తత్తరమంది యాశుకుని తాత్త్వికబోధవిధానువర్తియై
చిత్తము స్వాస్థ్యమున్ గనియు చెందడె మోక్షము సూక్ష్మబుద్ధియై.

అరిషడ్వర్గముచేత కట్టుపడకే ఆయింద్రియభ్రాంతితో
దిరుగాడంగను బోక యీషణత్రయిన్ దెంపించి సర్వాత్మునే
నిరతానందునిగా మదిం గొలిచి యుండే భావనాతీతుడై
నిరవద్యుం డయి సంచరించు మనుజుండే తత్త్వసంపన్నుడౌ.

త్యాగ మొనర్చి ధీరగుణతత్పరతన్ గడుధైర్యమూని నీ
వాగు మటంచు నా యముని నడ్డి పతింగొనిపోవ ధర్మమా
సాగగనీన్ ప్రయాణమని శాంతివచోరచనావిశాలతన్
తా గొనె భర్తృప్రాణముల తాత్త్వికభావన నొక్క కాంతయే.

తిన్నని చిత్తశుద్ధియు నుదీర్ణసుభావము శాంతి- దాంతి- య
భ్యున్నతమై యెసంగ హరునోర్పుఘటిల్లగ జేసి శక్తిసం
పన్నతఁ జూపి ముక్తిగొని పాలితుడై తగు భావభావనా
భ్యున్నతి నాత్మతత్త్వసుమహోజ్జ్వలవృత్తి నొకండు చూడగన్.

అంతము లేదు శాంతికి ననంతనితాంతహృదంతరాళకా
ర్యాంతరు లైన వారలకు నయ్యది మానసికంబుగాన దు
ర్దాంతదురంతచింతన నెడన్ దలపోయని నిశ్చలాత్ములే
శాంతికి మార్గదర్శకులు స్వానుభవంబు నిజంబు చూడగన్.

మానవు లందరొక్కటిగ మానసమందు దలంచునట్లు వి
జ్ఞానము గల్గియుండవలె సత్యముతోడ ప్రజానురాగసం
ధానుడు గాగ నుండవలె ధ్యానపరిష్కృత చూపగా వలెన్
దానగరిష్ఠు డై సకలధర్మపరంపరసత్ప్రవర్తనా
ధీనుడు గాగ నుండవలె దివ్యతరప్రతిభాప్రభావు డై.

తత్త్వ మనంగ నేమొ పరతత్త్వ మనంగను నేమొ సర్వభూ
తత్త్వ మనంగ నేమొ విభుతత్త్వ మనంగను నేమొ దేనిలో
తత్త్వము గల్గునో యది యథార్థపదార్థ మటంచుగాదె వే
త్తృత్వ విశిష్టనిష్ఠుడు వరించును తాత్త్వికధర్మమార్గమున్.

చిత్తశుద్ధిచేత జీవహింసను మాన్పఁ
జాలినాడు బుద్ధిశాలి యొకడు
మతము లన్ని చెడెడు గతి పట్టినప్పుడు
నిలిపినాడు తత్త్వకలితుఁ డొకఁడు.

సుఖము కష్టంబు నొకటిగాఁ జూచువాడు
మంచిచెడ్డల నటులె భావించువాడు
సతము నాధ్యాత్మికోన్నతస్థితి నెసంగు
వాడెపో! చూడ చూడ ప్రాప్తానుకూలి.

గాధినందను బాణసంఘాతమునకు
తనదు ఆధ్యాత్మికోన్నతి దండమందు
నిలిపి విజయమందడె మున్ను నిగమవేది
ఆవసిష్ఠమహర్షి మహాతపస్వి.

నియతనియమంబు ఇంద్రియనిగ్రహంబు
శుచివిశుద్ధత గల మానసులను నేని
భయము జేయగలే వెప్డు భవ్యదివ్య
తరగ్రహంబులు ఏయవస్థలను నైన.

భావరహితుండు దివ్యప్రభావశాలి
తత్త్వవిజ్ఞానభావనాతత్పరుండు
తాత్త్వికప్రకృతి నెరిగిన ధన్యమూర్తి
కానివాడు ప్రకృతిదూర మైనవాడె:

ఆంజనేయ స్తుతి

అతిబాహాబలశాలివాలి తను నత్యంతంబు వేధింప సూ
ర్యతనూజాతుడు భీతుడై పరవ నీ వప్పట్ల మిత్రుండ వై
గతవిద్విడ్భయ మైన తావున రమాకాంతున్ తగన్ నిల్పవే
సతతాప్తప్రియకారి! చందవరవాసా! అంజనానందనా!

అడు గొక్కించుక కాలమైన నిడగా ఆధారమా లేదు పె
న్వడిగా నేగగ మధ్యమధ్య బహువిఘ్నాలా పొసంగెన్ లవం
బెడమున్ సేయక యన్నిటిన్ గడచి యెంతే విస్తృతాయామమౌ
జడధిన్ దాటితివౌర! చందవరవాసా! అంజనానందనా!

దశకంఠాలయ మేడ? ద్రోణధరణీధ్రం బేడ? గంధర్వయ
క్షశతాలన్ నురుమాడు టేడ? గిరి వీకం గొంచు రేపోకము
న్న శుభస్ఫూరత వచ్చి లక్ష్మణునిప్రాణం బిచ్చుటిం కేడ? యీ
యశమందన్ దగితీవ చందవరవాసా! అంజనానందనా!

# మహా హరిహరదేవుఁడు

శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి



హరి :

చిటికల్ వేయుచు నావులించుచును లక్ష్మీప్రాణనాథుం డవి
స్ఫుట లీలన్ మునివిన్నపమ్ములకు నస్తుంకారము ల్వల్కి, ధూ
ర్జటి నాత్మం బరికించి కన్మొగిచి యాషాఢాదిమైకాదశిన్
పటునిద్రావశవర్తి యయ్యెను పయోవారాశి శేషాహిపై.

హరుఁడు :

నిబిడద్రుమచ్ఛాయ నిద్రాణపాషాణ
మధ్యవైయాఘ్రచర్మంబుపైని
పద్మాసనము వైచి బాలకాలఫణీశ
పాశాపినద్ధకపర్దుఁ డగుచు
నవినతోర్ధ్వశరీరయష్టియై నమితోభ
యాంసుఁడై యుత్తానహస్తుఁ డగుచు
నచలితార్ధనిమీలితాక్షిత్రయీ నిస్స
రద్దృష్టి నాసికాగ్రమున నిలిపి
నిర్వికల్పసమాధిలో నిర్విశేష
పరిహృతాజాండుఁ డగుచు నొక్కరుఁడె మిగిలి
యాత్మ నాత్మావలోకన మాచరించె
నచలతనయా మణీమనోహరుఁడు హరుఁడు.

హరి

తన కేల్గాళులు సాగ, మే న్విఱిచి, కందమ్ముల్ విడన్ సౌఖశా
యనికుం డై కయిదండ శంభుఁ డిడ, సర్పాధీశతల్పంబు డి
గ్గెను వైకుంఠుఁడు; పాయగిల్లి తలపై గేల్దోయిఁ గీలించుచున్
వనజాతాసనవాసవాదివిబుధుల్ వందించి జేపెట్టగన్.

హాయఁడు :

ప్రాలేయాచలభూమిపాలతనయాభాస్వన్మహాస్థానిలో
నాళీకాసనతాడ్యమానమురజానల్పధ్వనుల్ — భూతభే
తాళీపాదవిఘట్టనాట్టహాసముల్ — దైత్యద్విషచ్చర్చరుల్
కైలాసోదరకందరావళులఁ దీగల్సాగి మ్రోగగన్

నిటలాక్షుండు జటాచ్ఛటాతటహిమానీరోచిరంతస్సుధో
త్కటధారల్ డిగఁజాఱఁ, దాళగతులన్ గ్రైవేయమాలాస్థికల్
ఘటియింపన్, మకుటారటద్దివిజగంగాభంగముల్ రేఁగ, ను
ద్భటధాటిన్ నటియించెఁ గార్తికిక శుంభత్పౌర్ణమాసీనిశిన్.

హరి హాయలు :

అచలజామాత యధినాథుఁ డైనచోట
క్షేత్రపాలకుఁ డగును లక్ష్మీధవుండు
కమలనయనుఁ డధీశుఁడై క్రాలుచోట
బాలశశిమౌళియే క్షేత్రపాలకుండు.

నవనీతమ్మనుఁ గాలకూటవిషముం బ్రాసించి ప్రద్యుమ్ను సం
భవమున్ నాశ మొనర్చి, చేలఁ గటి సంభావించి వర్జించి ఘో
రవిషాహిన్ విశసించి తాల్చి, యిటు లేరా! మాధవోమాధవై
క్యవిలాసస్థితి డాగురించెదవు దేవా? భిన్నభిన్నక్రియన్.

హాయఁడు :

హాలహాలసంజ్వరోపరమార్థ మునిచి
రమరులు కపర్దసీమ నీహారకిరణు
గంగచే గాని స్వాస్థ్యంబుఁ గనఁడు శివుఁడు
మాయ నెఱుఁగదు మాసర్వమంగళమ్మ.

హరి :

మును మామం దెగటార్చినట్టి చరితంబున్, గోపికాకామినీ
జనతాత్పర్యము, రాధికాదృఢపరిష్వంగాంతరార్థంబుఁ, గు
బ్జను లాలించిన పల్కు-రానివిధ మూర్వాదల్ గడున్ మ్రోగఁగా
వినియే యున్నది: మారమారమణి సాధ్వీలోకరత్నంబురా!

హరుఁడు :

మును మాపం దెగటార్చి నట్టి కథనంబున్ శాంతిమద్దారుకా
వనికామౌనికులాంగనాభిగమనవ్యాపారపాండిత్యమున్
వినియే యున్నది- నీ కపర్దకుటిలోనే డాఁచు గంగాంగనం
గనియే యున్నది- కాని, సాధ్వి సుమి మాకాత్యాయనీదేవి తాన్.

హరి :

సకలంకం బగు నీ హృదంతరము నాశంకించియే మారమా
వికచాంభోజదళాక్షి నీ హృదయమున్ వీడంగ బోకుంట దై
త్యకసంహారమిషంబుఁ బూని ధర నీవావిర్భవింపంగ, జా
నకియై నీ వెనువెంట రాఁ గినిసి కానం ద్రోసితే యామెతన్.

హరుఁడు :

కామున్ గెల్చితి నంచు నట్టహాసముం గావించుచున్ మాటికో
స్వామీ! చేసె దకాండతాండవము; నీవా? కాముఁడా? జేత; నీ
సామే నెన్నఁడు గూడ వీడని మహాశైలేంద్రసంజాతయే
నీ మాటల్ పెనుబూటకంబు లనుచున్ తెల్లంబుఁ గావింపదే!

హరి :

ఖరమో ధేనువొ గాలియో యమళవృక్షమ్మో శిలావర్షమో
యురగమ్మో పిశితాశనీవిషవిలిప్తోరోజమో లి ప్తలో
హరియింపం గలదే యొకం డయిన ని న్నబ్జాక్ష! మారుక్మిణీ
కరపీడోత్సవభావిభాగ్యవిధి నిన్ గాపాడె ముమ్మాటికిన్.

హరుఁడు :

మ్రింగిన హాలాహలము, భు
జంగమఫూత్కృతిపతద్విషం బెబ్బంగిన్
భంగించు? సర్వమంగళ
మంగళసూత్రైకమహిమ మనుపఁగ నిన్నున్.

హరి

"ఏరును లేని యొక్కరుఁ డొకించుకయుం గదలంగలే, డనా
కారు, డనామకుం డఖిలకర్మవి దూరుఁ" డటంచు సత్కవుల్

సారె కనుత్తమోక్తితతులన్ నినుఁ గూర్చి వచించుటే వృథా
కారణ మేమొ ! నీ సుదతి గాంచదు మమ్ము రమామనోహరా !

హరిహరుఁడు :

సరహస్యం బగు నాత్మతత్త్వసుధ నాస్వాదించితిన్ కావ్యముల్
పరికల్పించితిఁ బ్రౌఢిమన్ రసికవిద్వాంసుల్ ప్రశంసింప- మేల్
బిరుదుల్ గొంటిని- ఘంటికాకటకముద్వేలప్రభం గొంటి, నీ
కరుణాలోకనసాంద్రచంద్రికల సోకన్ మాధవో మాధవా!

గ్రామము 'రామేశ్వరమె' బ
శీ ! మాదేవుండు "రామలింగేశ్వరుఁడే"
మా మది హరిహరభేదం
బేమాత్రం బేని సోకునే యెన్నటికిన్.

కరివదనుండు మా హరుని గాదిలిపట్టియె, యా విరించి మా
హరికిఁ గుమారుఁడే. మఱియు నర్మిలి కోడలె పల్కుచాన. యిం
దఱకు నమస్కరింపవలెనా ? కరుణావరుణాలయుండు మా
హరిహరుఁ డొక్కఁడే యొసఁగడా? కడు వేడకయే యభీష్టముల్.

అతనువీరకుమారుఁ డబ్జాంబకుండు
సితమనోహరదేహుండు శ్రీధరుండు
పరిధృతాహీనమణిహారభాసురుండు
మమ్ముఁ గరుణించు సతతంబు మాధవుండు.

# ఎరికన్నో వేడికోలు

శ్రీ కె. ఎ ఆర్. నరసింహము

దేవ! తావకపాదరాజీవయుగము
నతిమనోజ్ఞసుమావళి నర్చసేయ
నస్మదీయగృహారామమందు నిల్చి
కలయఁజూచితిఁ దన్మధువిలసనమ్ము.

బాలభానుమరీచిసంపాతవేగ
దరవికస్వరకుసుమసుందరవిముగ్ధ
మధురసుస్మేరవదనసంపదలఁ గాంచి
యవ్యయానందమున నోలలాడినాఁడ.

కలికిలేనవ్వు వెన్నెలల్ గాయుచున్న
యీ సుమమ్ముల ద్రుంపఁ జే యెట్టులాడు
పాలబుగ్గల ముద్దులు జాలువారు
చిన్నిపాపల గొంతుకల్ చిదుమఁ గలమె?

అనుకంపామతి నిట్టుల
ననుకొని యచ్చోటు వాసి యరిగెదు నాతో
ననియెం బూవులు మృదుల
స్వనమున సుస్పష్టవాక్యసంగతి వెలయన్.

"ఇంతటి మార్దవమ్ము గల యీ సుమ
జాలము నెట్లు త్రుంచి య
ర్పింతును భక్తియం చోరుల నిట్టుల
హింస యొనర్పఁ బాడియా!
చెంతకుఁ జేరి నా కటికచేతుల
ముద్దులు గుల్కు నీ సుమ
స్వాంతము నొవ్వఁజేయ దగవా!" యని
యెంచకు మోదయామయా!

గాలికిఁ దూలి చండకరకాండము
మేనులు సోకినంతనే
సోలి, విశీర్ణమై, పుడమి శోచ్యముగాఁ బడి
యంతరించు నీ
తేలికజీవనమ్ములను దివ్యపద
మ్మెటు లబ్బునయ్య! మా
పాలిటిభాగ్యదేవత వుపాసక!
నీవును మమ్ము వీడినన్.

ఒరులకు గాని జీవనము లొల్లము;
నిత్యము భూతధాత్రికిన్
భరమయి తోచు దేహముల బాయుట
లెస్స; మనోజ్ఞవర్ణసం
భరితవపుర్విలాసమును భాసుర
కేసరసౌరభంబు నీ
మరుగునఁ దాచి యేమి మడిమాన్యములన్
గడియింతుమో సఖా!

సర్వజనములు మము శిరసావహించు
గౌరవముకంటె మా కేమి గావలయును?
సర్వలోకేశ్వరుని పదసరసిజముల
వ్రాలుకంటె శుభం బేమి వలయు మాకు?

రేపు వచ్చితేని రేకులు విడివడ
మాయమగుదు మేము మట్టిలోన
క్షణిక జీవితమ్ము గల మాదు నమరత్వ
మబ్బునట్లు చేయు మయ్య! నీవు.

నీవు దయార్ద్రభావ మహనీయత
మ మ్మిటు వీడిపోయినన్
బోవునె మత్తబంభర మపూర్వ
కృపాపరిపూర్ణ చిత్త మై?
యీ విమలప్రసూనదమ నేచ్ఛఁ
జరించెడు పుర్వు లన్నియున్
బోవునె? కాల మొక్కటియె పోయెడు
నస్మద కాలమృత్యు వై.

కావున మాయెడన్ గరుణ గల్గిన
వాఁడవ యేనిఁ దేనియల్
పీవరమత్తభృంగములు పీల్చక
మున్న ప్రభంజనోద్ధతిఁ

దావులు పోయి రేకులు యథాయథ లై
పడిపోకమున్న త
త్పావన దేవతావిమలపాదతలమ్మును
జేర్పు మ మ్మికన్.

అని పల్కిన మన్ననమున
ననితరసామాన్యసంభ్రమాశ్చర్యంబుల్
పెనఁగొన నేమి యొనర్పన్
మన సొప్పక నిల్చినంత మగుడన్ బూవుల్.

"కలత వడి నిల్చె దేలా?
తలఁపుల విపరీతధర్మతత్త్వము బలియున్
గల కారణ మెరిగింపుము
కలిమాహాత్మ్య మ్మొ కాక కాపురుషతయో?"

ఇట్లు పలికిన సంకోచ మెల్ల వీడి
సంతరించితిఁ బూవుల సజ్జనిండ
దేవ! తావకపాదాబ్జసేవకతన
మాళి ఘటియింత్రు వీని నమ్మాట్లు లైన.

# రామాయణము - సుందరకాండము

### శ్రీ కల్లూరి చంద్రమౌళి

'సుందరే సుందరో రామః సుందరే సుందరీకథా
సుందరే సుందరీ సీతా సుందరే సుందరం వనమ్
సుందరే సుందరం కావ్యం సుందరే సుందరః కపిః
సుందరే సుందరం మంత్రం సుందరే కిం న
సుందరమ్'

"సుందరకాండమునం దభివర్ణితు డగు శ్రీరాముడు సుందరుడు. కథ సుందరము. సీత సుందరి. వనము సుందరము. కావ్యము సుందరము. హనుమంతుడు సుందరుడు. మంత్రము సుందరము. ఈ సుందరకాండమున సుందరము గాని దే మున్నది?

అని సౌందర్యారాధకులగు నభియుక్తులు వచియింతురు.

#### నామ విచారము

రామాయణకావ్యకల్పమునందు సుందరకాండ మొక పవిత్రకాండ మని ప్రశస్తి గాంచి పారాయణయోగ్యతను బడసినది.

పంచమ వేదమనబడు భారతమున భగవద్గీత యుపనిషత్ స్థానము నాక్రమించుకొని యుజ్జ్వలతారమై ప్రకాశించు చున్నట్లే ఆర్ష సంహిత యనబడు రామాయణమున సుందర కాండ మొక పవిత్ర పారాయణఘట్టమై ప్రకాశించు చున్నది.

సంపూర్ణరామాయణ పారాయణమునకు ఫలశ్రుతి జెప్ప బడినది. అయిన నాఫలశ్రుతి యీ కాండాంతమున విశేషించి వర్ణింపబడినది. అంతియ గాదు; ఈ కాండాంత ర్భాగము లగు నాయా ఘట్టముల కంతమునగూడ ఫలశ్రుతి వచియింపబడినది. కాని ఈరీతి తక్కిన కాండాంత ర్భాగఘట్టములకు వచియింపబడలేదు.

ఈకాండఫలశ్రుతి యీగ్రంథముననే గాదు; బ్రహ్మాండ పురాణము, స్కాందపురాణము, పరాశరసంహిత మున్నగు ప్రసిద్ధగ్రంథములయందుగూడ బహుళముగ ప్రశంసింపఁబడి నది. కావున దీనికి కారణ మేమో యాలోచింపవలసి యున్నది. అంతలకు ముందుగ నీకాండమున కీ పే రేల వచ్చినదోగూడ మనము విమర్శింపవలసియున్నది.

నూత్నభావకల్పనములకు బ్రాకులాడు భావుకులు కొంద ఱూహింతురు గదా! 'సుందరకాండము' నందలి 'సుందర' పద మేదేని ప్రదేశవాచకమై యుండవచ్చు నేమో! అని వారి యూహకు కారణ మిది. 'బాలకాండము మూల రామాయణమున కొందరు లేదనుచున్నారు గదా! పోగా యుద్ధకాండమునకు లంకాకాండ మని పేరున్నది. కాగా నాపక్షమున 'అయోధ్య, అరణ్య, కిష్కింధా, లంకా'శబ్ద ములు ప్రాదేశికవాచకములు గాన 'సుందర' కాండముగూడ నొకానొకచోటును సూచింపవచ్చును'.

సుందరపదము ప్రదేశవాచక మనుట కాధారము లేనందున నీయూహ యపోహయే కావచ్చును.

ఈ కాండము సుందరనామక మగుట కనేకు లనేకవిధముల కారణములు వచియించుచుందురు. చూడుడు (రాజ! సర్వాంగసుందరి యగు సీత యెచ్చటనేని గానబడినదా?)
(కచ్చిత్ క్షితిభృతాం నాథ! దృష్టా సర్వాంగ
సుందరీ)

యన్నప్రశ్నమునకు 'రామ! అభిరామయు, పతివ్రతయు నగు సీతను నేను రావణాంతఃపురమున గాంచితిని. ఆమె తన సర్వమనోరథములను నీయంద నిలుపుకొని ప్రాణములు

బిగ్గపట్టుకొని యున్నది'.

'తత్ర దృష్టామయా సీతా రావణాంతఃపురే సతీ
సన్న్యస్య త్వయిజీవంతీ రామా రామ!మనోరథమ్!

వియోగాగ్నిలో దపించి, తపించి కృశించియున్న సీతా రాములకు ప్రాణాధారములును, పరితోషజనకములును నగు రామముద్రికను సీతాచూడామణిని సీతారాముల కర్పించి వారికిని, పాఠకజనసమూహములకును బరిశ్రాంతి గల్పించిన దీకాండమే. కాన నిది సుందరమైనది.

లంకావాసులు, లోకకంటకులు నగు రావణాదిదుష్ట రాక్షసుల సంహారకాండమున కీకాండమునందే ప్రారంభ మహోత్సవమైనది. కావున నిది సుందరము.

'అలౌకికమగు శ్రీరామసౌందర్య మీకాండమునందు సీతతో నభివర్ణించి వచియింపబడ్డది' గాన నీపేరు వచ్చినది.

అట్లే 'జానకి సౌందర్యము శ్రీరామునితో సరసముగ వర్ణింపబడినది గావున' నీనామము సార్థకము.

(సుష్ఠు ఆద్రియతే ఇతి సుందరః).

లెస్సగా నాదరింపబడినది గావున నిది సుందరము. 'సీతాయా శ్చరితం మహత్' అని వాల్మీకిచే నెత్తిచాటిన పవిత్రవాక్యతత్త్వమును, వాల్మీకిమహర్షి యొక్క మహాసంకల్పమును, వాల్మీకిమహర్షి యొక్క మహాసంకల్పమును, దానిపరిపూర్ణపరిణతియు నిందే ప్రస్ఫుటమగును. అగుటచే దీని కీపేరువచ్చినది.

రాముడు రామాయణమునందలి యితరకాండములలో ప్రత్యక్షముగాని ప్రధానఘట్టములలోం బాల్గొనియుండెను. కాని ఈ కాండముననో! చివరభాగమునమాత్రము శ్రీరాముని మనము చూడగల్గుదుము. అయ్యును నాతనిగూర్చిన ముచ్చటలు సర్వదా మనకర్ణపుటముల శబ్దించుచునే యుండును.

బాలకాండము రాముని బాల్యమును బ్రశంసించెను. సీతాకల్యాణమును జిత్రించెను. కల్యాణమయి యగు నా సీతయే యిచ్చట పతివియోగమున విప్రలంభావస్థలో విపరీతబాధల ననుభవించుచున్నది. ఈవియోగావస్థలో నీ కాండమునందలి సుందరత్వమున కేమేని సంబంధ ముండునా? యని చూతము.

విశ్వాతీతమైన సౌభాగ్యముచే సుందరత గల్గునుగాదా!

(విశ్వాతిశాయి సుభగత్వాత్ సుందరః)

అని శంకరుని నిర్వచనము. ప్రియులయందలి సౌభాగ్యము ఫలముగాగలది సౌందర్యము.

(ప్రియేషు సౌభాగ్యఫలాహి చారుతా)

అని తద్జ్ఞుల తలంపు. అనగా సాంఘికజీవితమున దన పురుషుని పవిత్రప్రేమను, నిర్మలహృదయమును బడయుటయే స్త్రీవిషయమున సౌందర్యము, తనసతీహృదయమున పవిత్రప్రేమను బడయుటయే పురుషవిషయమున సౌందర్యము. సతీతరత్నమగు సీతను భార్యగాబడయుట రాముని సౌభాగ్యము. పురుషోత్తము డగు శ్రీరాముని బొందగల్గుట సీతాసౌభాగ్యము.

అయినచో నీసౌభాగ్య మెప్పుడు సుందర మగును? సంయోగమునందా? లేక వియోగమునందా? దీనికి కవిపతి యగు కాళిదాసు చక్కగా సమాధానము జెప్పినాడు. 'నీవిరహావస్థచే విలపించు నీప్రియవిలాపమునంద నీసౌభాగ్యము' ప్రకటమగుచుండును.

(సౌభాగ్యం తే సుభగ విరహావస్థయా
వ్యంజయంతీ)

రాముడు సౌందర్యమూర్తి యని పేర్కొనబడుట కిదియు గారణ మందురు.

'హృదయమును ద్రవింపజేయునదిగాన సుందరము.'

సుతరాం ఉనత్తి సుందరః

ఈహృదయద్రావణము ముఖ్యముగ విప్రలంభశృంగారమునంద గల్గునని రసజ్ఞు లందురు. అట్టిదిగావున నిది సుందరకాండమైనది.

'దూరమయిన వస్తువు తిరిగి లభించుట సుందరము' (నష్టలాభస్తు సుందరః) అపహృత యగు సీతాప్రాప్తివిషయ మిందభివర్ణిత మగుటచే నిది సుందరమైనది.

లేక 'ప్రణష్టస్య యథాలాభః' అన్నట్లు కోల్పోయిన యమూల్యరత్నమును గాంచుట సుందరము. కటికచీకటి

నుండి కమనీయప్రకాశము గాంచుట సుందరము గాదా !

భావవిశేషమును అసామాన్యకార్యములను అనుభూతిని మాటలతో వర్ణింపజాలము.

ఈకాండమున హనుమంతు డొనరించిన కార్యములు వర్ణనాతీతములు. వాల్మీకి యంతటి మహాకవీశ్వరునికిని వర్ణింపనలవిగానివి. ఆంజనేయుని కృత్యముల కింక హద్దుపద్దులు గానరావు. తత్తత్సమయానుకూలముగ తన కుచితమని తోచిన దానిని దనకు దాను నిర్ణయించుకొని స్వతంత్రముగ సంచరించెను. కావుననే కవి యట్టికార్యములకు 'సుందరమ్, సుందర'మ్మని మాత్రము పేర్కొనెను. కాన నీకాండము సుందరాకాండ మయినది.

సీతాన్వేషణప్రయత్నములయందు హనుమత్కార్యములలో నౌచిత్యము వివేకమును కళాసంపదయు, రసనిధానమును నెచ్చట బట్టిన నచ్చట హృదయాహ్లాదకరమై యొప్పారుచుండును. కాన నిది సుందరమైనది.

'మదించి యుదగ్రము లైన దశేంద్రియము లనబడు దశముఖములు గల మనోరూపరాక్షసాధిపతి యాక్రమింపగా భవసముద్రముచే బరివృత మగు నీదేహమున దీనదశ నొంది యున్న పురుషుడు హనుమత్తుల్యుడగు నాచార్యునిచే నవగతార్థుడై లంకాబద్ధ యగు సీతాదేవివోలె నోదార్పబడుచున్నాడు'.

> "దర్పోదగ్ర దశేంద్రియానన
> మనోనక్తంచ రాధిష్ఠితే
> దేహేఽస్మిన్ భవసింధునా
> పరివృతే దీనాం దశాం ప్రాపితః
> అద్యత్వే హనుమత్సమేన గురుణా
> విజ్ఞాపితార్థః పుమాన్
> లంకారుద్ధవిదేహరాజతనయా
> న్యాయేన లాలప్యతే"

సంకల్పసూర్యోదయమున వేదాంత దేశికాచార్యుల అన్నట్లు సంసారసముద్రమును దాటుటకును, (దశేంద్రియము లనబడు దశముఖములుగల) మనోరూపరావణుని మర్దించుటకును నాదర్శవంత మైనవాడు హనుమంతుడు.

అట్టి యాదర్శమును జూపుచున్న సుందరకాండము మన కేల యారాధ్యము గాకపోవును ? ఇట్టి యాదర్శములు భారతీయులకు సంప్రదాయసిద్ధములు. వాల్మీకి యిట్టి కావ్యసాంప్రదాయముల కొజ్జబంతి. వాల్మీకియుద్దేశ్యమును తత్సాఫల్యమును నిందే మనము కాంచగలము.

అంతియ గాదు; అసలు వాల్మీకి మహర్షికవిత్వమే ఈ కాండమున పదునెక్కి, చావదేఱి, నునుపుబాఱి, జిగిమీఱి, రసకందమై రసికహృదయానందసంధాయకమై యున్నది. కాన నిది సుందరమైనది.

ఈసామాన్యకారణము లెట్లయిన నుండనిండు. అందుల కొకవిశేషకారణ మున్నట్లు తోచుచున్నది.

ఈకాండమున ప్రధానకథానాయకుడు హనుమంతుడు గదా ! హనుమంతునివంటి ప్రభుభక్తిపరాయణుడును, బలవీర్యతేజశ్శాలియు, రామసేవాప్రవీణుడును, స్వార్థత్యాగియు, భక్తిమదగ్రగణ్యుడును రామాయణకథాప్రపంచమున నన్య డొక్కడు కానరాడనుట యతిశయోక్తి గాదు.

దేహసౌందర్యమున వాయుపుత్రుడు కొంత తీసిపోయినను, నాంతరంగికసౌందర్యమునమాత్రమసమానుడు. యథార్థముగ నాలోచించినచో నాత్మసౌందర్యమే సౌందర్యము గాని మేనిసౌందర్య మొక సౌందర్యమే కాదుగదా ! అట్టి యథార్థమగు నాత్మసౌందర్యమున హనుమాను దసమాను డనుటలో ననుమానము లేదు. ఆవంతయేని మాలిన్యము లేక యార్జవభావసంపదతో, పరిపూర్ణవికాసముతో పరిఢవిల్లుచున్న యాత్మానందముతో నలరారుచున్న వాని కాత్మసౌందర్య ముండుటలో నబ్బుర మేమి యుండును ?

'అచ్చట సూర్యుడు ప్రకాశింపడు. చంద్రుడును నక్షత్రములును బ్రకాశింపవు. ఈవిద్యుత్తులును వెలగజాలవు. ఇక నీయగ్నిమాట జెప్ప నేల ?'

> "నతత్ర సూర్యో భాతి నచంద్రతారకమ్
> నేమావిద్యుతో భాంతి కుతోఽయమగ్నిః..."

అని కంఠము కంఠమెత్తి ప్రశంసించినట్టియు, 'వేవురు సూర్యు లాకాశము నుదయించి నట్టి'

దివి సూర్యసహస్రస్య భవే ద్యుగపదుత్థితా
యది భాస్సదృశీ సాస్యా ద్భాస స్తస్య మహాత్మనః

అని భగవద్గీత వర్ణించినట్టియు పరమాత్మరూపమును భావించుచుండ వాయుపుత్రుడు సౌందర్యవంతు డనుట ప్రమాదము కాదు. కాననే హనుమద్ధ్యానమునకు 'సుందర హనుమ' న్మంత్రమనియు 'సువర్చలాహనుమ' న్మంత్రమనియు నిఱుదెఱగులమంత్రములు పరాశరసంహితాదుల యందుపచియింపబడియున్నవి. అగస్త్యసంహితయం దతడు సుందరహనుమంతు డని ప్రశంసింపబడుట కిదియే కారణము.

సువర్చల హనుమంతునిభార్య. అతడు తనపెద్దతనమున నీమెను బెండ్లాడె నని పురాణములు పలుకుచున్నవి. ఆ నామముతో జేర్చి యాతని ధ్యానించినచో నత డిష్టసిద్ధుల నొసగునట. కాన నిరువురను గలిపి కొందరు ధ్యానింతురు.

సుందరహనుమన్మంత్రమూల మగు నీకాండము సుందరాకాండ మనుట చోద్యము కాదు.

ఈమంత్రముల కధిదేవత యాంజనేయుడు.

ఇతడు ప్రకాశించుచున్న భాస్కరతుల్యుడు, నుదారభుజవిక్రముడును, కందర్పకోటిలావణ్యుడును?

"ఉద్యదాదిత్యసంకాశ ముదారభుజవిక్రమమ్
కందర్పకోటిలావణ్యం................".

ఇత్యాది ధ్యానశ్లోకములచే ధ్యానింపదగినవాడందురు.

మఱియు నాంజనేయుడు శంకరాంశమున జన్మించియు, విష్ణుభక్తిప్రపత్తులచే వృద్ధినొందియు, నట్లే యగ్నివాయ్వాదియంశములచేన నేకమహాకార్యము లాచరించియు నున్నవాడగు నితనియందు సర్వదేవతాశక్తిరూపసుందరత్వము మూర్తీభవించియున్నది. కావున హనుమంతుడు సుందరు డనుటకు సందియ మంద నక్కఱలేదుగదా!

సుందరకాండప్రశస్తి

కానిండు నామవిచారమును వీడి యాకాండ ప్రాశస్త్యమునకు కారణముల నాలోచింతము.

సుందరకాండమును బీజకాండ మని పేర్కొని దీనిని పారాయణము చేయవలననియు పెక్కు పురాణములు వక్కాణించియున్నవి. భక్తు లట్లే పాటించుచుందురు.

ఈకాండమున రామాయణకథ యెల్ల సంగ్రహరూపమున సంగ్రథింపబడియున్న దనియు, నందువలననే దీని కీప్రాశస్త్యము వచ్చినదనియు గొందఱందురు. వారిభావమిది. రాముడు సుగ్రీవునిచాటున నజ్ఞాతరూపమున నుండుట రామునిబాల్యమును సూచించును. అట్లే రాముడు లంకనున్న సీతకు దనయంగుళీయమును బంపుట సీతాకల్యాణమును, ఋశ్యమూకనివాసము చిత్రకూటపర్వతము నాశ్రయించిన యరణ్యవాసమును, సుగ్రీవుని స్నేహపూర్వకసహాయము కిష్కింధకాండవిషయమును, హనుమత్సముద్రలంఘనము సుందరకాండవిషయమును, లంకాదహనము యుద్ధకాండకథను, సీతాకుశలవార్తశ్రవణము కావ్యాంతఫలశ్రుతిని దెల్పుచు నీకాండము సంగృహీత రామచరిత్రముగా నుండుటచే నిది పారాయణయోగ్యమైనది.

విష్ణు నవతారమగు రామచంద్రుడు మోక్షదాయకు డగుటచే నట్టి యాతని నైహికకార్యములందు యోజింపరాదనియు, నిట్టి కార్యములకు హనుమంతుడే సమర్థుడనియు, గాన హనుమాను నారాధనను నిట్టి ఐహికముల కర్హమనియు ననుచుందురు.

"ఐహికేషుచ కార్యేషు మహాపత్సుచ సర్వదా
నైవ యోజ్యో రామచంద్రః కేవలం
మోక్షదాయకః"

ఈవిషయమునే యాంజనేయుడు తాను స్వయముగ జెప్పియున్నాడట!

'ఐహికవిషయములందు రామసేవకు డగు నన్ను స్మరింపుడు. మీవాంఛితార్థములను నే నొసర్తును.'

"ఐహికే సమనుప్రాప్తే మాం స్మరే ద్రామసేవకం
వాంఛితార్థప్రదం స్వామిభక్తానాం. "

'ఆంజనేయు బూజించిన నెల్లదేవతలను బూజించినట్లే'
(ఆంజనేయః పూజితశ్చే త్పూజితా స్సర్వదేవతాః).

ఇత్యాదిగా పరాశరసంహితాదు లీతని మహత్త్వమును బ్రశంసించుచున్నవి.

కనుక హనుమద్యథార్థరూపవిశేషాదులను స్మరించుటకు సుందరకాండమునకంటె నన్యమగు నాధారము లేదు కావున నిది పారాయణయోగ్యమైనది.

భారతమునందలి విరాటపర్వమువోలె రామాయణము నందలి సుందరకాండ మొకప్రత్యేకకావ్యరత్నమై నవరసోత్పాదకమై విరాజిల్లుచుండును.

సీతారాములవియోగమున శృంగారమును, లంకానగరమున హనుమచ్చేష్టలయందు హాస్యమును, సీతాబాధానుభావమున కరుణమును, సముద్రోల్లంఘన లంకాదహన రాక్షససంహారాదులయందు వీరాద్భుతాదులను హనుమంతుడు లంకాద్వీపమునుండి మరలివచ్చి సీతాచూడారత్నమును శ్రీరామునికిచ్చిన సందర్భమున శాంతమును నిత్యాదిగ వివిధరసములును కుత్తుకబంటిగా విలసిల్లుచుండుటచే నీకాండము నొకకావ్యరత్నమనుట సముచితమే యగును. కనుకనే యిది రసికజనుల కారాధ్యము పారాయణయోగ్యమును అయినది.

హనుమంతుడు జితేంద్రియుడై రాక్షసమాయాజాలచ్ఛేదన మొనర్చి, పరిపూర్ణమగు నిజస్వరూపమున బ్రకాశించుచుండు నీసుందరకాండము జ్ఞానులకు ఆనందదాయకమగుట సమంజసమే యగును.

మఱియు భగవద్భక్తిబలమున నపారఘోరసాగరము నుల్లంఘించి, భగవత్కార్యమును సమగ్రముగ నిర్వహించి, భగవదనుగ్రహమునకు పాత్రుడైన హనుమంతునిగూర్చి విశేషముగా వర్ణింపబడిన ఈకాండకథ సంసారసాగరము నుల్లంఘించి, పరమేశ్వరానుగ్రహమును బడయుభక్తకోటి కనుగ్రహపాత్ర మగుట యత్యంతయోగ్యమే కదా!

చిరకాలవియోగబాధానుభావానంతరము రాముడు సంతృప్తిని బొంది యానందింపగల్గినవాడు. అట్టి సంతుష్టిని నభినందించినచో నతని యనుగ్రహము బడయవచ్చును. కావున నిది పారాయణయోగ్యమైనది.

## దౌత్యప్రశస్తి

హనుమంతుడు కిష్కింధలో బ్రదర్శించిన విజ్ఞానపారంగతత్వమును స్నేహసంధానచాతుర్యము గాంచి రాముడు వానిని మిగుల బ్రశంసించియుండెను.

ఆంజనేయుడు రామలక్ష్మణులను దన భుజస్కంధముపై నిడుకొని, సుగ్రీవునికడకు గొనిపోయి వారికి సఖ్యబంధమును గల్పించెను.

తన సుచితదూతగా నుండి తనకార్యమును సఫలతాపూర్వకముగ సాధింపగలవాడు హనుమంతుడే యని శ్రీరాము డప్పుడే నిర్ణయించుకొనెను.

మఱియు వానరు లెల్లరు సమావేశమై సీతాన్వేషణార్థము హనుమానుడే యర్హు డని నిర్ణయించిరిగదా!

నిజముగా నిట్టికార్యములందు దూతయే సంధాయకుడుగా నుండును. సంధి గావించుటయు, యుద్ధమును గొనితెచ్చుటయు దూత చేతిలోనిపనియే.

ఈకాండమున హనుమంతుని దౌత్యమే హృదయము.

మహాకావ్యమున మంత్రదౌత్యప్రయాణాజినాయకాభ్యుదయము లనెడు పంచసంధులు పనుపడియుండుట దెలిసిన విషయమే గదా!

రామాయణము నందలి యున్నతపదము నధిష్ఠించెను. కథాగమనమును బ్రోత్సహించి సరలమార్గమున బ్రవహింపజేసెను. ఇందు మంత్రసంధి దేవతలు బ్రహ్మసాన్నిధ్యమున నున్నపుడు దేజరిల్లుచుండును. దౌత్యసంధి కిచట నాంజనేయుడే యధిష్ఠానదేవత.

కౌరవపాండవసంధి నుద్దేశించి మహాభారతమున పార్థసారథియే పయనింపవలసివచ్చెను. కాని రామాయణము ననో! దౌత్యము హనుమంతునిది. భగవద్దౌత్య మొకచోట. భక్తదౌత్య మొకతావున అన్నదమ్ములకా స్త్రీవిషయమున నైకమత్యము గల్పించుట యొకరిపని. అనురక్తులగు నాలుమగలకు సాన్నిధ్యము గల్పించుట మఱియొకరిపని. తనకార్యనిర్వహణమునకు కృష్ణునకు భూతలముననే బోవలసివచ్చెను. పోయి వీరిమాటలు వారికిజెప్పుటయే కర్తవ్యము. కాని భక్తునికో! తన ధర్మనిర్వహణార్థము మహాసముద్రము నుల్లంఘింపవలసివచ్చెను. మఱియు జానకి యెచటనున్నదో గనిపెట్టవలయును. ఆమెను సమీపించి యామె నోదార్పవలెను. మాయాదక్షు లగు రాక్షసుల

నడుము నామె విశ్వాసమునకు బాత్రమై తాను కాంచినం దులకు గుఱుతుగ నామెచెంతనుండి యేదేని గుఱుతుబడయ వలెను. వీనినన్నింటిని సాధించుటకు దూతయందు విశిష్ట లక్షణములు వెలయవలయును.

> "సాకారో నిస్పృహో వాగ్మి
> నానాశాస్త్రవిచక్షణః
> పరచిత్తావగంతా చ
> రాజ్ఞాం దూత సఇష్యతే"
>
> — పంచతంత్రము.

(రూపసి, ఆశలేనివాడు; వాక్పటుత్వము గలవాడు, సర్వ శాస్త్రవివేకసంపన్నుడు, పరేంగితజ్ఞాని, రాజులకు దూతగా నుండ అర్హుడు'

ఆంజనేయుడు నిర్మలబ్రహ్మచారి. అట్టి యాతడు దానవమాయాజాలముతో తబ్బిబ్బులగుచున్న యొక మహా పతివ్రతారత్నమును విశ్వసింపఁజేయుట సామాన్యకార్యము గాదు. అవిశ్వాససంపాదనమును రాక్షసరాజ్యరాజధాని యగు లంకాపట్టణమునందు. ఆరాక్షసులో! మాయా దక్షులేకాక క్రూరతాదక్షులు.

శ్రీకృష్ణుడు తనసంధికార్యమున సఫలతనొందజాలక పోయినాడు; కాని యాంజనేయుడో! తనపూనిన కార్య మున ధన్యుడైనాడు. తనవీర్యశక్తి ప్రభావము నసురా నీకముపై బ్రసరింపజేసి వారినెల్లర దలలెత్తనీయక యడగ గొట్టినాడు. రావణుసోదరు డగు విభీషణు డంతటివాడు తనసోదరుని గాదని రామునిచెంత శరణాగతి నయ్యెది సఫలీకృత మొనర్చినాడు.

కృష్ణుడు తనవిశ్వరూపమును బ్రదర్శించియు దుర్యో ధనాదులవిశ్వాసము బడయలేక, 'యింద్రజాలికుడని వారి హేళనకు బాత్రుడయ్యెను. కాని హనుమంతుడో తన యమోఘవీర్యప్రభావము చే 'నితడొక యసామాన్య వ్యక్తి' యను నభిప్రాయము రాక్షసులకు గల్గించెను.

కృష్ణుడు ధృతరాష్ట్రుని జేరి 'నేను దీనిని యాచింపవచ్చి తిని' (ఏత ద్యాచితు మాగతః) అని తనదైన్యమును జూపి కర్తవ్యమెల్లనతని నెత్తిన పెట్టెను. కాని యాంజనేయుడో! తానొక సేవకు డయ్యు శత్రురాజుసమక్షమున శ్రీరాముని దివ్యతేజశ్శాలిగ బ్రకటించి రావణ! నీవు బ్రతికిబట్టగట్ట దలచుచో నీసీతాసతిని శ్రీరామున కొప్పగించి యాతని శరణు గోరుము'అని ధైర్యముతో చేయెత్తి స్పష్టముగ హితోపదేశము చేసెను. ఈవిషయముల జూచినచో ప్రభువునకంటె భటుడే-భగవంతునికంటె భక్తుడే మిన్నగ బ్రవర్తించినట్లు స్పష్టమగుచున్నది. భగవద్వాంఛయు నిట్టి దియే. తనకుమారుని దనకంటె మిక్కిలిగా నుండవలయు ననిగదా తండ్రి కోరుకొనుచుండును.

హనుమంతుడు తనదౌత్యనిర్వహణార్థము దానవుల యెడ సామదానభేదదండోపాయములను యథావకాశ ముగ, యథాయోగ్యముగ బ్రకటింపజేసి తన రాజకీయ విజ్ఞానప్రావీణ్యమును బ్రదర్శించి తాను పూనిన ధర్మమును దక్షతతో నిర్వహించెను.

హనుమంతుడు తా దెచ్చిన రామాంగుళీయకమును సీత కొసగినపు డామె దాని నొకవరముగ భావించెను. లంకిణి యెడ నాతడు ప్రయోగించిన భేదోపాయమే లంకారహ స్యములనెల్ల నామెచే వెలువరింపజేసెను.

భారతమున దేవతలొకమాఱు నలుని దమదూతగనెన్ను కొని తమవాంఛితార్థమును దమకు దామ వ్యర్థములొనర్చి కొనిరి. కాని రామాయణము నందలి వానరులో! తమ కర్తవ్యమును దత్సాధనోపాయములను, తదుచిత సామర్థ్య మును లెస్సగా విచారించి అందులకు యోగ్యుడగువాని నెన్నుకొని తాము కృతకృత్యులుగా గల్గిరి. కార్యమును సఫలమొనర్చిరి.

నలుడు దమయంతిచెంతకరిగి దేవతలు నాసమీపమున కరుదెంచి తమసందేశాక్షరములను నాయందుంచి తమ నడగమ్మగ నన్నొనర్చుకొనిరి అని పల్కెనుగదా!

> "అలంకృతాసన్నమహీవిభాగై
> రయం జన స్తైరమరై ర్భవత్యాః
> అవాపితో జంగమలేఖ్యలక్ష్మీం
> నిక్షిప్య సందేశమయాక్షరాణి॥

ఈనలుని దౌత్యము విపరీతఫలితము నొసగెను. నలుడు తానే దమయంతిని వలచి యామెను గ్రహించెను.

ఇట్లు దేవతలు తమరాయబారిగను నెన్నుకొని దమయంతీ వరణమునకు నలుని కొకచక్కని యవకాశము గల్పింపఁజాలిరే గాని స్వీయమనోరథమును జేకూర్చుకొనఁజాలకపోయిరి.

హనుమద్దౌత్యము సర్వవిధముల జరితార్థమైనది. అనిల పుత్రునిచే సందేశప్రాప్తియే కలుగనిచో జనకపుత్రికి ప్రాణత్యాగమే సంఘటిల్లి యుండెడిది. జానకీదేవి తాను దనప్రాణముల వీడనెంచి, యందుల కుంకించుసమయమున హనుమంతు డామెకు విశ్వాసము గల్పించి నూత్నజీవితము నొసగెను. అతడు తనవాక్ప్రభావముచే నామెకు విశ్వాసము బురికొల్పి యామెప్రాణములు దక్కించిధన్యుడయ్యెను.

# కవి

## శ్రీ జాస్తి వేంకట నరసయ్య



తెలుగుభూమిని నీవల్కు దివ్యకవిత
సంఘుసంస్కారలాభముల్ చాటిచెప్ప
జాతిగరిమంబె లక్ష్యమై యాతతముగఁ
జేయుచున్నావు సాహితీసేవ సతము.

తేనెలు చిందెడు వాక్కుల
మానితజాతీయవస్తుమహనీయకృతుల్
గానము సేయగ నందరు
ధీనుత విరచించి తీవు తేజమ్మెసఁగన్.

నవమంజులాలాపనైపుణ్య మొప్పార
గురుహితకృతులను గూర్చినావు
కరుణరసాన్వితకమనీయరచనల
నస్పృశ్యతాభావ మణచినావు
మాధుర్యసంపూర్ణమాన్యశైలి నటింప
స్త్రీజాతిదశలఁ జిత్రించినావు
వర్గవర్ణద్వేషవాసనాదూర మా
గుణమె భూషణ మంచుఁ గొలిచినావు

నవ్యకావ్యసుమామోద మవ్యయముగ
నేల నాలుగుచెరగుల నింపినావు
అమలజీవన! సుకవీశ! ఆంధ్రపుత్ర!
అందుకొనుమయ్య! నాదు జోహారు లివిగో!

తెలుగుల తొంటిపౌరుషము తేకువ
జారగ వ్యర్థరోషముల్
బలసె సమాజమంతయును బాధలు
జెందుచు నుండె నిచ్చలున్
గలుగదు విద్య తిండియును గష్టము
నోర్చెడి పేదవానికిన్
కలమున నీని దిద్ది కృపఁ గాచెడు
వారు కవీశులే గదా!

జాతికి శుభమున్ గూర్చుచు
ఖ్యాతిని గలిగించునట్టి ఘనులచరిత్రల్
చేతము లలరగ ఛందో
రీతుల లిఖియింపవలయు రేపున్ మాపున్.

కవితాశక్తిని జూపుచు
నవభారతసృష్టిఁ జేయు నైకార్థ్వములన్
జవము సుజీవము నింపుచు
నవనవరచనమ్ము లిచ్చి నతులను గొనుమా!

సత్య శివ సుందరమ్మై
యత్యమలంబైన రచన మది యొక్కటియే
నిత్యము యశమును గూర్చును
స్తుత్యం బగు మోదమిచ్చు సుజనులు మెచ్చన్.

# సూర్యాష్టకమ్

శ్రీ దాసరి హనుమంతరావు



మహాదేవదేవం హ్యుషఃకామినీశం
గ్రహేశం స్వభక్తాంధ్యనాశం హృదబ్జే
భజేహం తయీరూప మర్కం ప్రదాతుం
మనోభీష్టవిజ్ఞానరత్నం వినూత్నం ॥

తమోభంజనం విశ్వరూపం ప్రభానుం
మహాదేవనేత్రం మహోరాశి మర్కం
జగద్రక్షకం నిత్య మానందమూర్తిం
ప్రదాతుం భజే ప్రాతరుత్థాయ మేధాం ॥

మహాంతం ప్రజాయుక్తబింబం సువృత్తం
మహేశం మహేంద్రప్రసాదోర్ధ్వరత్నం
నభఃకల్పవృక్షప్రసూనం ఖరాంశుం
భజేహం దినేశం ప్రదాతుం సుభక్తిం ॥

ప్రభాతే విరించిం దివార్ధే రమేశం
దినాంతే మహేశం భజే దానవారిం
సమామ్నాయ రథ్యం ప్రభారూప మార్యం
కవిత్వామృతామోఘధారాం ప్రదాతుం ॥

మహాకాలనిర్ణాయకం పద్మి
మహామేరురూపం వివేకామృతాబ్ధిం
మహానందసంసిద్ధయే నిత్య మీశం
ప్రతాపాత్మకం సప్తసప్తిం భజేహం ॥

సహస్రాంశు మాదిత్య మార్యం ఘృణీశం
జగన్నేత్ర మీశం పతంగం పవిత్రం
ఖగం చిత్రభానుం భజేహం ప్రభాతే
మహాభక్తలోకేష్టభూతిం ప్రదాతుం ॥

పితా భాస్కరః భాంధవో నీరజాప్తః
గురు శ్చాదితేయః సఖా లోకబంధుః
హిత శ్చండతేజాః ప్రభు శ్చాంశుమాలీ
కవిత్వాంబుధి శ్చార్యమా సర్వ మేవ ॥

దినాదౌ మదుక్తాం స్తుతిం యే పరేయుః
సదా తే నిజాభీష్టసిద్ధిం భజంతే
సహస్రాంశుపాదాంబుజాభ్యాం దదామి
ప్రసూనం నవోద్భిన్నశోభం సుభక్త్యా ॥

# జాగృతి

శ్రీ పి. యస్. ఆర్. ఆంజనేయప్రసాద్



భారతదేశసంస్కృతిప్రభావము నేటిది గాదు దానికిన్
తీరిచి దిద్దినారు మును దివ్యమహర్షులు ప్రాచ్యదేశముల్
పేరుకునైన రాక కనువిప్పనినాడిది కర్మభూమియై
ధీరతతో విరాజిలెను దీనికి గ్రంథమె మూలకందమా.

వెలుగు తూర్పుననుండియె చిలుకు దిశల
పశ్చిమమునుండి మాత్రము బరుపబోదు
అంతరార్థంబు గ్రహియింప నందులోన
కల నిజమునాడు దెలియు సాకల్యముగను.

భారతీయులసంస్కృతిప్రభల మీరు పరులసంస్కృతి నిర్మింపబరగె ననగ
ప్రాచ్యులే దాని కాదన బరగలేదు తప్పుమాటలుపలుకుట ధర్మమగునె?

గొప్పదనంపు సభ్యతలకున్ మరిసంస్కృతి వైభవంబుకున్
త్రుప్పులు పట్టె వీరి మది- దుస్సహదుర్మతిధుర్య తోటచే
చెప్పగలేరు చెప్పినది చేయగలే రటువంటివారలా
ఇప్పటి భారతీయులకు- ఇంపగు ప్రాచ్యమహాత్వతత్వముల్.

తేపకుతేపకున్ ప్రజల తీపగు మాటల ముంచి వోట్లకై
పాపరువోలె దిర్గు పరిపాలకు లుండిరి గెల్చినంతనే
తాపము దీర్చుకొందురు విధాయక మానె? ప్రజాభియోగసం
తాపములన్ గ్రహింపరు కుతంత్రులు నేటిప్రజాప్రదీపకుల్.

భారతజాతి పేరుకయి బాధలకున్ తలయొగ్గి క్రుగ్గి దీ
ప్తారతి జూపు వీరులకు కాలముగా దిది ప్రాంతభేదభా
వారతి పాదుకొల్పి జనవార్ధిని నాశము సల్పువారి కో
భారతరత్నధీరు డగు వక్తయటంచు నుతింతు రెంతయున్.

తూలుడుతో కుతన్ మగతతో అరమోడ్పుల కండ్లమూలతో
మూలుగు ఆవలింతలను ముందుకుదూకెను భారతీయజీ
వాలపయిన్ దరిద్రపరిభాసుర తాండవకేళికాస్ఫుర
జ్జ్వాలధనంధనధ్వనులు సాగెను ఏద్దురకాలిసవ్వడిన్.

దేశమునందు జూచిన విదేశముల౯ పరికించినన్ జయా
వేశము వీరశాత్రవనివేశముగా జరియించుచుండె నీ
దేశచరిత్రవైభవపుదీప్తి హుళక్కియె— భారతీయసం
వాసులు నిద్రమేల్కొనెడిపల్కు లబద్ధము లయ్యె నయ్యయో!

మండుచునుండె గుండె లవి మానవకోటికి -క్రుమ్మరించెపో
కుండలతోడ నిప్పుల నకుంఠితవీరప్రచండచండమా
ర్తాండుడు— శాత్రవప్రథితతాండవితాక్రమణాగ్ని బద్ధలై
నిండెను— భారతావనికి నేటికి గ్రీష్మము దాపురించెనే.

పనిమాని వేసియు పస్తు లుంటి మటంచు కూలిచేసెడివాడు గోలపెట్టు
ఒక జతగుడ్డలు ఉతికి తొడ్గుగుమాస్త బురదచిందులుపడ ఫూత్కరించు
పంట లన్నియు చెడి పాడైనవని శిస్తుపరిహరించగ రైతు పట్టుబట్టు
పొంగి పొర్లగ నదుల్ పుడమిగానక జనుల్ పిల్ల తల్లులవీడి గొల్లుమనిరి
ఇట్టి అతివృష్టి ప్రజల నిక్కట్టు పెట్టె ఘోరదారిద్ర్యభీభత్సకోటితోడ
దేశమును ముంచి తేల్చె నీతీరు చూడ భరతమాతృకదుఃఖబాష్పాలె ఇవ్వి.

ఎండి బీటలువారి యుండెను భూదేవి తిండికి కరువది తీంద్రమయ్యె
మండుచుండెను ధరల్ మలమలమాడిరి మనుజులు సుఖ మనుమాట మరచి

వేదమంత్రాల: విశ్వాస మది చచ్చె విహితకర్మలు యజ్ఞవిధులు చెడెను
వరుణకోపానలవహ్నియే చెలరేగి భారతప్రజలను బాధపెట్ట
ఇనుపగజ్జెలతల్లి యీ యెల్లప్రజల తనదు కౌగిలికై లాగ దయనుజూపె
తపనను ముసలివగ్గులు తప్పుకొనిరి నేటిలోకమునుండి ఇంకేటి కనుచు.

చైనీయులొకవంక జైత్రయాత్రలు చేసి ఆక్రమించగ దేశ మక్రమముగ
పంజాబులో శిఖ్ఖుబాబులు చెలరేగి ప్రత్యేకరాష్ట్రవిభాగ మడుగ
అస్సాములో నాగు లడ్డదిడ్డము చేసి కేంద్రప్రభుత్వమున్ క్రిందుపరుప
దక్షిణాదిన రేగి ద్రావిడు లొకవంక ప్రత్యేకద్రవిడస్వారాజ్య మడుగ

దేశవిచ్ఛిత్తిశక్తులు తేజమంద
నిదుర గనుచుండి రెల్లరు నేత లిచట
లేచి యికనైన దేశము కాచికొనుడు
క్షాత్రతను నిల్పి స్వాతంత్ర్యపాత్రు లగుడు.

నీటుదలిర్ప మీహృదయనీరజమందు పవిత్రభారతిన్
దీటు నొనర్చి హైందవతదివ్యసమైక్యత గూర్చి పేర్చియున్
పాటవ మొప్ప మీమధురవాగ్ఝరులన్ జనభావనానదిన్
దాటెడి మేటివీరు లయి ధన్యులరై యశమున్ గడింపుడీ.

లే లెమ్మోయి— పవిత్రభారతసవిత్రీమాతృగర్భంబునన్
జ్వాలల్ రేగెను ఆర్పరమ్ము దనుజుల్ చైనీయు లావంకను
ద్వేల ప్రాభవశాత్రవప్రథిత మా స్వీయప్రజావాహినిన్
గోలల్ వేరొకవంక లేచె నవె మేల్కోవోయి హిందూసఖా!

దేశసమైక్యసద్విభవదీప్తికి కంకణబద్ధు డౌచు వి
శ్వాసవివేకధైర్యములు భారతభాగ్యవిధాతలందునన్
రాసులు రాసులై తగవిరాజిల జేసి చరిత్రనుండి శో
భాసముదాయమైన గుణపాఠములన్ గ్రహియింపజేయుమా!

శాం

ఆరనిజ్వాలతో జనుల నందర గూర్చుము వారిలోన దు
ర్వారదురంతదుస్సహవిరాజిత మైన అహమ్ము కాల్చి శో
భారతభారతీయపరిభాసుర భావపరంపరాళిచే
పీరనిశాంతదీప్తపదపీపదసుప్రతిభల్ వెలార్చుమా!

మానము వీడి మానవుల మానసవీథి జరించి నిద్రలో
తానము సల్పు సంతతికి తంద్రను తారిచి భారతత్వమే
పానముగా నొనర్చి తమబాధ్యతలన్ గ్రహియించి శక్తులై
సానలుదీరునట్టిడుల సల్పు మనల్పత భారతాంబికా!

అతులితమైన ప్రాచ్యనవహార్దపుజీవన మెల్ల వారలన్
ప్రతికణమందున న్నిలిపి భవ్యతరస్థిరసత్యభాషణ
ప్రతతిని నెట్టివేళల దొరంగ కొసంగెడు నట్లు చేసి సం
తతమును మేలుకొల్పుత మదంబిక భారతమాతప్రీతితో.

ధ్యానయుతమ్ము నా మహితదైవికశక్తియె భ్రాంతిగ్రస్తమా
మానవతన్ రగుల్కొలిపి మానసమందున దాగు మూఢమా
దీనపశుత్వశక్తి నతిధీరత పారగద్రోలి దుష్టమా
దానవశక్తి అంతమును దాల్చగ సల్పుత ధైర్యధుర్యతన్.

భౌతికతాంధకార ఘనుపాపము ఛేదనసల్పి నిత్యముల్
నూతనమైనజ్యోతిని అనూనతతో జ్వలియింపజేసి వి
ద్యోతితమా మహాకిరణతోరణమై జనమందు దూరి వే
జ్యోతిని గూర్చి మేల్కొలుపుచుండుత ప్రత్యణువందు నిండుచున్.

నిస్తులమై యఖండము వినిర్మలదివ్యవిరాట్స్వరూప వి
న్యస్తవిశిష్టసత్యశివతాంచితసుందరతన్ ధరించియున్
ప్రస్తుతరాష్ట్రపూరుషుడు ప్రక్రమనిర్భయనిర్నిరోధు డై
విస్తృతమా ప్రపంచమున వేగము శోభను గూర్చుగావుతన్.

శ్రీ పి. యస్. ఆర్. ఆంజనేయప్రసాద్

వేగోద్వేగముతోడ పర్విడి మహావీరప్రతాపమ్ముతో
ఆగంబోవక దూకు ఢార్యజనసేవ్యం బైన యీయుర్విపై
ఏగర్వాంధులు వచ్చి నిల్చినను మీయీధాటి ఆగుండెలన్
మ్రోగుంగావుత రుద్రతాండవము వీరోత్సాహవేధోండ మై.

ఒక్కెడ నైన భీతిగొన కుజ్జ్వలమాతృగురుప్రబోధముల్
చక్కనిత్రోవ చూపుచును శౌర్యపటిష్ఠుని జేయుచుండ పెం
పెక్కగ ధీరతన్ భరవీరులుత ముందుకి దూకి వేగ క్రొ
వ్వెక్కెడి దుష్టశత్రువులనెల్లర చీల్చెదరంచు నెంచెదన్.

క్షాత్రతను మ్రింగి బౌద్ధము కదలివచ్చి
ప్రజలనిర్జీవులుగ జేసి ప్రబలియుండె
మరలభరతోర్విప్రజలను తిరిగి లేప
శంకరస్వాము లోక వేయి సాగిరండు.

ఉర్విజనులార ! మీయందు పూర్వఋషుల
శోణితం బది ప్రవహించుచుండబోదా !
త్యాగమయమైన ఘనులబోధస్రవంతి
అడ్డుపడెనొక్కొ జనుల కీగడ్డమీద?

రాగము మేళవించి అనురాగరసమ్ములు పొంగు లెత్తగా
సాగిన దీజనావళి- ప్రసన్నమధూదయదృష్టిలోపలన్
రేగిన యీశ్వరప్రణయనిర్భరఘంటలు ఘల్లుఘల్లునన్
మ్రోగిన మ్రోతలై జనతమోహరిహారితమాత జాగృతిన్.

ఈజాగృతి యే ! హైందవ
బాజాలవలెన్; మెలంగి ప్రజలందరినిన్
ధీజన్యులకావించుత
రాజిల్ల స్వాతంత్రదీప్తి ప్రాచుర్యముతోన్.

# విశ్వకవి



అది గదిగో అది గదిగో
సుధలను ప్రిదిలే ఎదలో
మెదలే మంజుల గేహం
కదలే కాంతిసమూహం.

సత్య శివ సుందర రూపం
అత్యద్భుతవిద్యాదీపం
కాంతుల జిమ్మె రతనం
శాంతినికేతనం—

దివ్వెల పువ్వుల మధ్యన
ఎవ్వ రాసుధాకరుడు
భారతీయజ్ఞానామృత
భాండారం — విండుదనం.

ఆశలలో కవితావాసం
వసియించిన కేశవికాశం
విశాలఫాలభాగంపై
విశ్వోన్నతదృష్టరేఖలు.

విద్యుద్ద్యుతు లేగజిమ్మె
విమలకమలనేత్రద్వయి
శిశుమనోనైర్మల్యము
రసమయరాజితబాల్యము.

వశియించిన లేచిరునవ్వుల
స్పృశియించిన మధురాధరములు
రోజా అరచేతులు గల
ఆజానువు లగుబాహులు.

సుకుమారం సున్నితభావం
మృదుమధురంమంజులరావం.

గంభీరపు హృదయపు చిహ్నం
గలిగిన విస్తృతవక్షస్థలం
పుంభావసరస్వతిమయస్ఫూర్తి
పూజ్యశ్రీగురుదేవులమూర్తి.

ఎవ రావెన్నెలమూర్తి
ఎవ రాచిన్నెలమూర్తి
లలితకళాసాక్షాత్కారం
ఇలలో విశ్వకవిత్వం—

ప్రకృతిదేవి అరుణారుణ
చరణాలకు ప్రణమిల్లిన
పరిచారకు డాతడు
పరమత మోహారకుడు—

విశ్వవీణ విరజిమ్మిన
శాశ్వతమధురావేశం.

గీతాంజలి నినదాలై
ఏతామెత్తెను జగతికి.

లలితకళోపాసనుడై
కళ లన్నిటి కాకారము.

మలచగల్గు మహిమోన్నత
మహామహోపాధ్యాయుడు-

దేశదాస్యబంధాలను
తెగద్రెంచగ తహతహపడె
దివ్యోన్నతతపోమయుడు
దేశభక్తియుతు డాతడు.

స్వార్థరహితప్రజా సేవ
సాధించిన జీవనుడై
సకలజనులహృదయములలొ
సముద్దీపప్రేమజ్యోతి.

ప్రకృతిమాతచరణాలకు
ప్రణమిల్లయ ప్రార్థింతువు
ప్రేమవనము పాలించే
ప్రథమతోటమాలిగా జేయ-

ప్రేమోద్యానములోపల
పుంస్కోకిలకంఠమెత్తి
పూరింతువు గానలహరి
పులకలతో మైమరవగ-

సంధ్యాన్వితనర్తనముల
సల్లాపము సాగించే
సరసకేకిదంపతులతొ
సారసచర్చలు జేతువు-

జిలిబిలిలేవెన్నెలలో
శిశువులనే ముద్దిడుకొని
చిద్విలాససన్నిగ్ధతలను
చిత్రింతు ఒకప్పు డీవు.

మహితసత్యసాగరమును
మథియించిన తత్వవేత్త
త్యాగభోగరాగాలకు

తరతమభేదం ఎరుగని
స్థితప్రజ్ఞవిజ్ఞాని
నుతపునీతసుజ్ఞాని.

వేదవేదాంగములలో
వాదమ్ములు చేయగల్గి
పనసలు పఠియించునట్టి
పరమోత్తమఋషితుల్యుడు-

ఆపోశనయోగదృష్టి
తపోనిష్ఠాయుతు డై
ఆత్మానందము గాంచిన
అత్యద్భుతజ్ఞానయోగి.

అదర్శపుటాచరణములో

కరతలామలకము
కావించిన కర్మయోగి-

ఆశ్రమోపవనమందున
ఆమహామహునిజీవితకథ
భవ్యయశోవిలసితమౌ
దివ్యగాంధర్వగాథ.

సారససమ్యక్కవితా
వారసు డై వెలుగొందిన
శ్రీరవీంద్రకవీంద్రుడు
భారతభాగ్యవిధాతయె-

ప్రజాకవీ ! యని పిలువగ
ఋజు వదిగో నిలుచున్నది
సర్వప్రపంచం ప్రేమనియతి
గర్వార్పణ నోబుల్ బహుమతి.

జనగణమన గీతముతో
జనతను మేల్కొల్పినావు.

జయనాదం నీవు చేయ
జేగంటలు మ్రోగినాయి.
ఓవిశ్వకవీ ! యశస్వీ
ఓకళాతపస్వీ మహస్వీ
ఓదివ్యమహర్షీ !
పూజ్యశ్రీ గురుదేవా !
నీయవతారం భారతీయ
వైజ్ఞానికభాండారం—
భారతదేశచరిత్రలో
పలికిన నూత్నాధ్యాయం.
మానవత్వచరిత్ర కాక
మంజులసింజితగానం
నీ పలికిన దెల్ల కవిత్వం
నీ తలచిన దెల్ల మహత్త్వం
నీ లోపలిప్రతిభావం
విశ్వతాపహరరావం

నీవు గీచిన గీటులు
సాహిత్యజగత్తుకుబాటలు
నీ సలిపిన ప్రతిచర్య
సర్వజగతిపరిచర్య
నీ మోవిని వెలసినహాసం
నిర్మలజోత్స్నానంతవిలాసం
నీ వాకకవివి
నీ వాకమహాకవివి
నీ వేకైకవిశ్వకవివి—
నవయుగధర్మప్రవక్తా !
అమరవైతాళికా !
జోహారులు ! జోహారులు !
జోహారులు విశ్వకవీ !
జోహారులు ! మహారవీ !
జోహారులు ప్రభారవీ !

# శి వ రా

★ ★

ఓంకారపు ఘంటారావం ఇంటింటా మార్మ్రోగింది.
కారునల్లనికాళరాత్రి
కాలకంఠుని కృష్ణసర్పము
కన్నుభున్పని పడగవిప్పింది
కమనీయనాట్యము
కన్నులారా కాంచమంటోంది—
తాండవన్నటరాజజూటా
న్నుండి వెలువడు గాంగలహరీ
నిండుజవమున బయలుదేరిందీ
బ్రహ్మాండమందున
పండువెన్నెల కురియబోతోంది—

జేగురించిన జీవితేశుని
సోగకన్నున బయల్వెడలిన
భగభగలు— భుగభుగలు— గాంచింది
పరమశివానీ—
ప్రళయకాలపు ప్రణవలీ లంది
వీరభద్రుని ఉగ్రరూపపు
తీరుతెన్నులు గాంచినంతనె
ఘోరుఘోరున బావురంటోంది
దేవలోకము
భావిసృష్టికి భావుకత యంది—

★ ★

# నాచనసోముని నవీనగుణము

శ్రీ అద్దేపల్లి రామమోహనరావు



నాచనసోమనాథుఁడు నవీనగుణసనాథుఁడు. తనకు పూర్వులైన కవు లెవ్వరును పోని యనేకవినూత్నశిల్ప మార్గముల నీతఁడు స్వతంత్రుఁడై నిర్మించినాఁడు. ఏతన్మార్గావలంబులై తర్వాతిమహాకవు లనేకు లీతని ననుగమించినారు. పోతన యీతని నెంతగా ననుకరించెనో సుప్రసిద్ధమే. శ్రీనాథుఁ డీతని సీసములనడకలను కొన్ని యనుసరించె నని చెప్పవచ్చును. అసలు సీసపద్యము ననేకము లగు పోకడలతో రచించిన ప్రథమకవి నాచన సోమనాథుఁడే. అర్థగాంభీర్యముతోఁబాటు శబ్దసౌందర్యమును గూడ నారాధించుట నాచనసోముని యొక వినూత్నగుణము. ఆశబ్దసౌందర్యము మీఁది యతిశితదృష్టివలన నాతఁడు అర్థసారస్యమును చెడఁగొట్టు కొన్నపట్టులును లేకపోలేదు.

ఈతని నవీనగుణములనుగూర్చిన పరిశోధన మింకను ఆంధ్రసాహిత్యచరిత్రలో కొఱవడియే యున్నది. ఉన్నంతలో రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారివ్యాస ముత్కృష్టమైనది. ఆలోచింపగా నింకను తాను నవీనములని భావించిన గుణము లనేకము లీతనికవితలో నుండవచ్చు ననిపించుచున్నది. శబ్దార్థరసభావసంబంధిగుణములే కాక, శిల్పగతములైన కొన్ని నవీనగుణములును కాన్పించుచున్నవి. అట్టి గుణములలో నొకదానిని, ఒక అపూర్వశిల్పమును, ఆతఁడు హంసడిభకోపాఖ్యానమున నెట్లు ప్రదర్శించెనో పరిశీలించుట యీవ్యాసపు ముఖ్యోద్దేశము.

లోకములో ననేకసంఘటనలు సంభవించుచుండును. వివిధమానవులవిభిన్నమనస్తత్త్వములవలన, విభిన్నదేశకాల పరిస్థితులవలన, అనేకవిధములగు సన్నివేశములు కల్గుచున్నవి ఇట్టి సన్నివేశములు కొన్ని సాధారణముగనే యుండును. మఱికొన్ని యసాధారణములై యుండును. అట్టి యసాధారణసన్నివేశములు మనము విన్నపుడు సర్వవిధములను నమ్మరా నట్లుండును. కాని యాసన్నివేశకారణము లైన మానవులయొక్కయు, పరిస్థితులయొక్కయు, నత్యంతవైలక్షణ్యమును తెలిసికొన్నచో నట్టి సన్నివేశములు జరుగుటలోని సామంజస్యము మన యూహకందును. ఆవిధముగా, పరముగా నవిశ్వాస్య మైన యొకసంఘటనను వర్ణించునప్పుడు, ఆసంఘటనకు కారణములైన మానవులమనస్తత్త్వములను, దేశకాలపరిస్థితులను ధ్వనిమార్గమున సూచించుట విశిష్టమైనశిల్పము. ఈశిల్పము సోమన్నలో కాన్పించుచున్నది. ఎఱ్ఱన సావిత్ర్యుపాఖ్యానమున సావిత్రీపాత్రచిత్రణమందును నిట్టి శిల్ప మున్నది. కాని సోమన దానిని ప్రకటముగా ప్రదర్శించినాఁడు. దానిని నిరూపింతును.

హంసడిభకోపాఖ్యానమునందలి ముఖ్యఘట్టము, హంసుఁడు దుర్వాసునికౌపీనమును చించుట. హంసుఁడనెడి యొకానొక దుర్మార్గుఁడు దుర్వాసోముని యంతటివాని కౌపీనమును చించుట సర్వవిధముల నమ్మరాని సంగతి. ఏలన, హంసడిభకులు సహజముగా ఋషులన్న గౌరవ ప్రపత్తులు గలవారే. వారు మునుల వేదఘోష విన్నపుడు సోమన యిట్లు చెప్పెను.

> "మాఁధ్యందినసవనధ్వని
> విధ్యుక్తస్వరముతోడ వినవచ్చుటయున్
> స్వాధ్యాయపరులు గావున
> నధ్యాహారమ్ము వృత్తై నయ్యిరువురకున్."

మఱియు, దుర్వాసుఁడు సామాన్యుఁ డగు ఋషియా! ఏమాత్ర మవమానముకల్గినను ఎదుటివానిని తత్క్షణము సర్వ

నాశనము చేయఁగల అమేయతపఃప్రభావసంపన్నుఁడు. ఇట్టిపరిస్థితులలో హంసుఁడు, దుర్వాసుని కౌపీనము చించుట ఎంత యసహజ మగు విషయము! అందువలన సోమన యిట్టి సంఘటన జరుగుటకై కావలసిన సామగ్రిని విచిత్రముగా వర్ణించినాఁడు. ఈ దృశ్యశిల్పము స్వారస్యతో దర్శనీయముగా నున్నది.

హంసడిభకులు ఐదేళ్లు, గాలియు నీరును నాహారముగా ఘోరతపస్సు చేసి, శివుఁడు ప్రత్యక్షము కాఁగా, అమరాసురాదిసైన్యాధిపతుల కోడకుండ నొకవరమును, ఈశానరౌద్రమహేశ్వర బ్రహ్మశిరములను నస్త్రములు, అభేద్యకవచములు, దివ్యచాపములును, పరశ్వధవిశేషము, కయ్యములకు పోవుచో కాపుగా ప్రమథద్వయము పార్శ్వములందు వచ్చుటయు- రెండవవరముగాఁ గోరిరి. శివుఁడు తద్వరము లిచ్చి, భృంగిరిటిని, కుండోదరుని వారికి కాపుగా నిచ్చి వెళ్ళెను. ఇఁక, వరములు గన్న మోదమున హంసడిభకులు «సంగరమున లేరు హంసడిభకప్రతివీరు లసంగ« పొంగుచునుండిరి. వా రిట్టి పొంగుపై నుండఁగానే, పొలతులను, రూపవతులైనవారిని, వారి తండ్రివారి కిచ్చి పెండ్లిచేసెను. దానితో వారి యహంకార మింకను పెరిగిపోయెను. వారి యహంకృతి పెరిగిన ట్లేల యూహింపవలె నన్న, అందుకు కానిచో వారి పెండ్లిప్రసక్తి యీ కథకనావశ్యకము. అదియుఁగాక దుర్వాసుని వా రవమానించినపుడు అతనిని గృహస్థాశ్రమము స్వీకరింపు దని బలవంతము సేయుదురు. గృహస్థుగాఁ బంచయజ్ఞేచ్ఛఁగలిగి నాకసుఖ» మొందుమందురు. వారి యీమాటలవలన గార్హస్థ్యాశ్రమము నొందుటచే వా రెంత గర్వపడుచున్న దియుఁ దెలియును. ఆగర్వము సూచించుటకే రూపవతులైన స్త్రీలను వారు పెండ్లాడి రని సోమన చెప్పినాఁడు.

అసలీఘట్టము నందు క్రమక్రమముగా హంసడిభకుల యహంకార మెట్లు పెరిగి పెరిగి దుర్వాసుని నవమానించుటకు సిద్ధమైనదో వర్ణింపఁబడినది. మొదట వరములొందుట. తర్వాత రూపవతులగు పొలతులఁ బెండ్లాడుట.

ఇట్లు “వీరాభిమానవిజృంభితులై” వా రొకనాఁడు వినోదార్థము వేటకు బయలుదేరిరి. అది యెట్లు! «ధరణి యల్లలనాడఁగ» బయలుదేరిరి. ఈఘట్టమున వారి దురహంకారసూచకములగుమాట లనేకములు వ్రాయుటలోని సోమన యుద్దేశము గ్రహింపఁదగినది. మఱియు వారి వేటను విపులముగా వర్ణించినాఁడు శబ్దానువృత్తులతోఁ గూడిన పెద్దవచనమును గూడ వ్రాసినాఁడు. వరాహకులమును, ఒకసీసపద్యమున జటిలసమాసమయముగా వర్ణించినాఁడు. ఇంతగా వర్ణించుట వారియతిశయితాహంకృతిని వ్యంజితము చేయుటకే.

తర్వాత వారు ఒక సేలయేటిలోని నీరు త్రాగి. విశ్రమించి, మాధ్యందినసవనధ్వని విని కాశ్యపమహాముని యజ్ఞసమీపభూమికి «ఏసందేహము లేక» వెళ్ళిరి. అక్కడ సభాచార్యులను «పరిపాటి»గా, ఏదో నమస్కరింపవలెను కాఁబట్టి నమస్కరించిరి. వెంటనే హంసుఁడు:

«మాతండ్రి రాజసూయము ప్రీతిం జేయంగఁ దలచినాఁడని చెప్పి «మీరు నరుగ వలయు నచటికిన్» అనును. ఈమాటలలో వారి యౌద్ధత్యము ఎంతయో వ్యక్తమగును. ఏలన, అసలింతకు ముందు వారితండ్రి రాజసూయము చేయఁదలపలేదు. ఆవిషయ మెట్లు తెలియునని, వీరు వేటనుండి తిరిగి వెళ్ళినతర్వాత తండ్రిని రాజసూయము చేయుమందురు. మునులను రమ్మని పిల్చి వెంటనే ఒక మత్తేభపద్యమున, తమ సర్వపరాక్రమవ్యంజకముగా మాటాడిన ట్లొకపద్యము వ్రాయఁబడినది. వారసులు తమ తండ్రి రాజసూయము చేయునని చెప్పుట ఈపద్యమందు తమపరాక్రమమును ప్రకటించుకొనుటకే. వారు ఊరకనే గూడ ఎల్లప్పుడు తమప్రతాపమునుగూర్చియే స్తుతించుకొనవలె నన్నంత పొంగుపై నుండి రన్నది స్పష్టమగుచున్నది.

వా రట్లనఁగా ఆఋషులందరు «తప్పక వత్తు» మని, మీతండ్రి చేయు టేమి, మేము రాకపోవు టేమి, యని వారిని పొగడుదురు. అది చాలును వారికి, సంతోషమొంది నిజేచ్ఛం జనిరి.

అంత అహంకారపూరితులై గాలితరఁగలపై నడచుచున్న వారికి దుర్వాసుఁడు కానిపించెను. అతఁడు వీరిని చూడలేదు. లేవ లేదు. అది వారికి కోపహేతువయ్యెను. క్రిందటిక్షణముననే తక్కిన ఋషులెల్లరును వందనములు చేసిరి. ఈఋషి యట్లు చేయఁడయ్యెను. వారికోపమునకది ప్రబలమైన కారణ మగుచున్నది. మిగిలిన ఋషు లాత

నిని సమ్మానించు ఘట్టము కథదృష్ట్యా అనవసరము. ఐనను, వారియహంకారప్రదర్శనకు, దుర్వాసుని చూడగనే పొంగిన క్రోధమునకు కారణకల్పన మద్భుతముగాఁ జేయుచున్నది.

దుర్వాసుఁడు తమనుచూచి లేవకపోఁగానే హంసుఁడు తిట్ట నారంభించినాఁడు ఆఋషిని తిట్టుట కేదో కారణ కల్పన చేయవలెను. తమనుచూచి లేవలేదనుటే నేరమని వా రనలేరు. ఏలన, ఆఋషికి వీరిని చూడవలసిన విధి యే మున్నది? తమ యన్యాయ్యము తమకును తెలియును. అందుచే ఏదో యొక యవ్యదోషము వక్రరీతిగా రుద్ద వలెను. ఈప్రవృత్తి మానవసహజము. తనది తప్పని తెలిసికొన్న మానవుఁడు, అన్యులపై కోపగించుకొన్నప్పుడు, వారిదే తప్పని చూపుట కేదో కల్లబొల్లికారణము వెదకును. అట్లే హంసుఁడును వెదకెను. అదే మఱఁగా దుర్వాసుఁడు తపస్వియై శిష్యులనుకూడ చెడఁగొట్టుచున్నాఁడట! ఏమైన సరే, అతఁడు గృహి కావలసినదేఁట! దీనికి దుర్వాసుఁ డేమియుఁ బలుకలేదు. హంసడిభకులస్నేహితుఁ డగు జనార్దనుఁడు, దుర్వాసుని దూషించుటతప్పని చాలసేపు చెప్పినాఁడు. ఏడుపద్యము లీసందర్భమున వ్రాసినాఁడు సోమన. దీనివలన నిఁక హంసునికోప మెంత పెరుగునో యూహించుకొనవచ్చును.

జనార్దనుఁ డట్లు మాటాడినమీఁదట దుర్వాసుఁడు కన్నులు తెఱచి చూచినాఁడు. జనార్దనునివంక పాలుకురియునట్లును, హంసడిభకులవైపు నెత్తురుకురియునట్లును, ప్రేమతో, కోపముతో చూచినాఁడు. చూచి యిట్లని నాఁడు.

"నన్ను కనలించి బ్రతుకఁగన్నారు లేరు
పొలిసితిరి, పొలిసితిరి, వే పొండు తొలఁగి
మిమ్ము దగికొను కోపము మ్రింగికొంటి."

ఈ మూఁడుపాదములలో నద్భుతకవితాశక్తి యిమిడి యున్నది. దుర్వాసుఁ డిందాకటినుండి తన యుత్తాలక్రోధ తరంగములను ప్రయత్నముచేత నణచుకొనుచున్నాడు. జనార్దనునిమాటలవలన నతనికి హృదయమున నొకఆర్ద్రత కలిగినది. అందుకనియే యతఁ డసలు మాటాడినాఁడు. లేనిచో మాటాడెడువాఁడే కాదు. ఇందాకటినుండి యతనిలో మథ్యమాన మగుచున్న క్రోధసముద్రము - ఈ మూడుపాదములై వెలికివచ్చినది. వానిలోని కవితాశక్తి వివరణ మప్రస్తుతముగాన, ప్రకృతవిషయమును వివరింతును.

దుర్వాసుని మనఃప్రవృత్తి విశిష్టముగా సృజింపఁబడినది. అతఁడు సహజముగా విపరీతకోపి. హంసుఁడు మొదట నతనిని దూషించినప్పుడే దగ్ధము కావింపవలసినది. అట్లైనచో కథయేమున్నది? అందుకై యీఘట్టమున దుర్వాసుడు విశిష్టముగా సృష్టింపఁబడినాఁడు. అతఁ డప్పటికప్పుడు తనకోపమును మ్రింగికొను యోగము నభ్యసించుచున్నట్లు ధ్వనించుచున్నది. ఎంతో కోపము రేఁగుచున్నది. ఎంతో ప్రయత్నముపై నణఁచుకొనుచున్నాఁడు. అతఁడే అన్నాఁడు :

"చేయఁదగని కీ డెల్లఁ జేసితిరి మీరు
చెఱుపనోపుదు శాపంబుచేత మిమ్ము
నయిన యతినైన నా కేల యాగ్రహంబు."

కనుక నతఁడు తన యతిత్వసంపాదనార్థము కోపము నణఁచుకొను నభ్యాసము చేయుచున్నట్లు స్పష్ట మగుచున్నది. ఇట్టిపరిస్థితిలో హంసుఁ డేమిచేసినను అతఁడు ప్రతిక్రియ చేయు స్థితిలో లేఁడనుట స్పష్టము.

హంసుఁడు పరమాహంకార మవధులను చేరిన స్థితిలో నున్నాఁడు. దుర్వాసునిప్రవృత్తి ప్రతిక్రియానభిముఖముగా నున్నది. ఇం కేమి?

"ఎంతసేపైన ని
చ్చో నుండన్ సమకూడునే మనకు
నంచున్ చించె నవమాని కౌ
పీనంబున్ నృపుఁ డాజనార్దనుఁడు త
ప్పింపంగ క్రౌర్యంబునన్."

ఇట్టి జరుగరానికార్యము జరిగించుటకు పూర్వరంగమును నిర్మించుకొనుటలో, సోమన విశిష్టప్రతిభ ప్రదర్శించినాఁడు. ఇట్టి రచన అతనిపూర్వమున లేనిది. అతఁడే వినూత్నముగాఁ జేసినది. నిశ్చయముగా నిట్టిశిల్ప మతని నవీనగుణములలో నొకటి.

# శివస్తుతి

శ్రీ మారుటూరి పాండురంగారావు



నీరమణీయతత్త్వమును నిక్కమెరింగినవారు లేరు నిన్
చేరగవచ్చి నీ నెలవు చెప్పగ వచ్చినవారు లేరు నీ
కారణకార్యనైజముల గాథల వ్రాసినవారు లేరు ఏ
పేరులు లేని నిన్ను నొకపేరున నేగతి పిల్తురా? శివా!

కలవని శాస్త్రసంచయము గట్టిగ పట్టును బట్టు నాస్తికుల్
కలయని నిన్ను శూన్యునిగ కల్పనచేసి వచింతు రందులో
వల గల సత్యమున్ దెలిపి ప్రాణము సంకటమందకుండ నీ
విలయమునుండి మమ్ము వడవేయుము శాశ్వతదీప్తిలో శివా!

ఏపరమార్థ మాశపడి యీాయసమర్థవికారజీవికన్
ఓపరమేశ! చేసితి వహా! అనయంబును భక్తిభావనన్
నీపదపద్మముల్ కొలువ నిచ్చలు నిన్ భజియింపనోప నీ
పాపపుజన్మ మేమిటికి? బాపురె వ్యర్థముగాక భూమిపై.

నీ నిజరూపమున్ తెలియనేరరు పూజ్యులు పెద్దలైన కా
నీ నిను కొల్వకే క్షణము నిల్చిరె వారలు వెఱ్ఱివారె నే
నానియమమ్ము తప్పక చనన్ మదిలో గమకించినాడ నీ
పూనిక నీదెరా పరమపూజ్యుడ! పూజల నందరా శివా!

నీ వొకదివ్యమూర్తి వని నిన్ జపియించిన వాంఛితమ్ములన్
జీవుల కిత్తువంచు దరిజేర తలంపు రవంత లేదు నీ
పావనసత్యతత్త్వమును భక్తుడనై తెలియంగ గోరి యీ
జీవితయాత్ర సల్పెదను జీర్ణకఠోరవిషాదగీతితో.

ఎన్ని ఫురాణముల్ వినిన ఎన్ని మహాస్మృతు లభ్యసించినన్
ఎన్నివిచారణల్ సలిపి యెన్నివిధమ్ముల చర్చ జేసినన్
ఎన్నివిధాల భాష్యముల నెన్నికమీరగ త్రిప్పిచూచినన్
నిన్ను నెరుంగు శక్తిగల నేర్పరు లెందరు చెప్పరా శివా!

మతముల పేరు చెప్పికొను మాన్యులు మార్గము తప్పిపోయి నీ
యతులితదివ్యసుందర మహాద్భుతమాయకు వశ్యులైరి నీ
మతమె మతమ్ముగాని యిక మాయురే! అన్యమతమ్ములీజగ
త్ప్రతతిని గల్గెనే నిజము పల్కిన సాక్ష్యము నీవెరా శివా!

నీవు రచించుకొన్న కమనీయవిలాసజగమ్ములోని సం
భావితభావనామధుకృపన్ గల వెల్గులు జిల్గుబాటలున్
నీ పని చెప్పగా వలయునే మరి నీయది నీది కాక యిం
కేవిధి అన్యమౌను పరమేశ్వర! యెట్టులు లెక్కవైచినన్.

ఒకడవె భిన్నరూపముల నొక్కొకచోట నొకొక్కరీతిగా
సకలమహాప్రపంచమున సర్వము నిండుచు వెల్గుచుండు నీ
ప్రకటమనోజ్ఞలీలలను బాపురే! మూర్ఖులు జ్ఞానశూన్యులై
అకట! మహాంధకారమున నర్థము చక్కగ జేసికోరురా!

వేషము లేని నీకు నొకవేషము కల్పన జేసి దానికై
రోషము పూని యజ్ఞతను రోజుచు కాదనువారి నాల్కలన్
దోషము జూపి కోయుదురు ధూర్తులు భక్తులు వీరశైవు లీ
భూషణదూషణావళుల పొందుట నీ పనియౌనె తెల్పుమా!

నీకు హితుండు గాకయ జనించిన మానవు డొండు గల్గెనే
నీకమనీయమాయ రమణీయముగా వెలుగొంది యీజగం
బోకరుణాస్వరూప! మహిమోజ్జ్వలమై యలరారుగాదె యిం
కేకరణిన్ సహింతువు మహేశ్వర! నిన్నును నీవు కొట్టుటల్.

జ్ఞానములేనివాడ వని జ్ఞానులు నన్ను హసించుచుందు రా
జ్ఞానము జ్ఞానహీనతయు జ్ఞానివి నౌ భవదీయదివ్యస
న్మానకృపారసామృతసమాదరదృక్కుల గల్గునంచు నీ
దీనులు నిన్ను చూడరుగదే! యొకనాటికినైన నోశివా!

ఎవ్వడ నంచు నేను చరియించెద నా కొక నామ మున్నదే
ఎవ్వడ నంచు నేను తపియించెద నా కొక శక్తియున్నదే
ఎవ్వడ నంచు నేను వసియించెద నా కొక స్థాన మున్నదే
ఎవ్వఁడ నేను స్వేచ్ఛ యన నెయ్యది సర్వము నీవెరా శివా!

నీ మహనీయతత్త్వమును నిక్కముగా గ్రహియింప నెంచు నే
నేమని చింతచెందెదను నీవు తలంచు తలంపు నీకుగా
ఓమహితాత్మ! యన్యులకు నొప్పునె దాని నెఱుంగ జూడగా
నీమధువృష్టి నిండిన జనింపదె సర్వము దివ్యమై శివా!

కొందరు స్వార్థతత్పరులు కోరికలన్ గ్రహియింపఁగోరి నీ
సుందరదివ్యరూపమును చూపి జగత్తును మోసగింపుచున్
అందలమెక్కి యాడి సుమహాత్ముల మంచు చరింత్రు వారి కే
వందన మంచు పల్కెదరు బాపురె వార అదృష్ట మేమియో.

నీ యనురాగరాగముల నింద నొనర్చెడి క్షుద్రు డెవ్వడో
నీ యతిలోకశక్తులు ధ్వనించిన దివ్యమహాత్ము డెవ్వడో
ఏయది రాయియో రతన మెయ్యదియో తెలియఁగ రాని యీ
హేయపులోకమందున మహేశ్వర! యెట్టులు నిన్ను చేరుటల్.

తల్లిని మాతృభావమునఁ దా సుతు డెంచడు తండ్రిమీద నే
కల్లలు చెప్పి మోసములు కల్పన జేయును పెద్దలన్న రం
జిల్లదు గౌరవమ్ము నిక చిత్తము నిత్యము పాపపూర్ణమై
చెల్లును నేటిమానవు డిసీ! నిను చేరుట కల్లరా శివా!

మనసున నొక్కమాట పదిమందిని పల్కు మరొక్కమాట తా
జనులకు చెప్పు నొక్కటి విచారణచేయు మరొక్కదాని చూ
పిన ఘనదృష్టి యొక్కటి లభింపగ జేసిన వస్తువొండు ఈ
మనుజుని నూత్నజీవితవిమాన మ దెచ్చట కేగునో శివా!

కళ్ళెము లేని గుఱ్ఱముల గట్టిన విశ్వరథమ్ము స్వేచ్ఛసం
ధిల్లగ తప్పుత్రోవలగతిన్ పరువెత్తుచునుండె నాపగా
చెల్లునె యెట్టివారికిని చిత్రము లైన భవత్కటాక్షపుం
జల్లులు గాక యన్యములు చాలునె జీవుల నుద్ధరింపగా.

పెరిగెను వర్గభేదములు పెంపువహించెను ద్వేషముల్ ప్రభల్
తరిగెను శాంతిసౌఖ్యములు ధార్మికశక్తి నశించె న్యాయముల్
విరిగెను నీతిమార్గములు వీథులబట్టె కృశించె సత్కళల్
హరహర! యిట్టిలోకమున హాయిగ నెట్లు వసించుటో శివా!

నాలుగుముక్కలన్ చదివి నాలుగుమాటలు చెప్పి సత్సభన్
చాలిన పండితుండ నని చంకలుగొట్టును పెద్దలన్నచో
తూలగనాడు వానికిని దోసిలిపట్టి ప్రపంచమంతయున్
చాలగ గారవమ్మును నొసంగు విచారణసేయకే శివా!

నాగరకప్రపంచ మని నవ్యకళామయవిశ్వ మంచు నీ
భోగులు తృప్తిచెందెదరు మూర్ఖత నింతకు దానిలోన నే
దాగె మహాగ్నియంచు కన దక్కట! మాటకు నొక్క డేనియున్
యోగమహాస్వరూపుడ వయోమయమాస్థితి నుద్ధరింపుమా.

అనుకొనినట్టి సత్ఫలము నందనిరోజున దానికై సదా
పనివడి చింతనొంది యమబాధను పొందును గాని సుంత నె
మ్మనమున నూహసేయడు సుమా! తను జేసిన పూర్వకర్మయే
తనకు ఫలమ్ము లీయ బహుధా గల కారణమంచు నోశివా!

ఊరక గాలిమేడలను నూహాల గట్టగ నేల వానికిన్
చేరువ కానినాడు మది చింత వహింపుచు జీవయాత్రయే
భారమటంచు నిత్యము నభాగ్యునిగా విలపింప నేల యీ
ఘోరము లేల స్వామి! నినుగూర్చి తపించిన చాలదే శివా!

కాలము చంచలం బనుచు కాయము బుద్బుదప్రాయ మంచు నా
కాలుని చేరబోవ నొకకాలమునాటికి తప్పదంచు నే
బాలిశు డైన లోకపరిపాటి తలంచి గ్రహించు కాని రా
జాలడు నీదుమాయ ఘనజాలము దాటి నరుండు నోశివా!

ఎన్ని యుగాలు దాటినవి యెన్నియుగాలు మరెన్నిగాను రా
నున్నవో నిశ్చితమ్ముగను నూహయొనర్చినవా డెవండు ఈ
చిన్నియుగాన నేడు వికసించిన వన్నెగులాబిపూవు సం
పన్నతశాశ్వతం బనుచు భావనచేయుట భ్రాంతిరా శివా!

నిన్నను నేను లేను మరి నేటికి రేపు మరెక్క డుందునో
ఉన్నది నేడె దాని నిటు నూరక వ్యర్థము చేయ నేల యీ
చిన్నిమహావకాశమును చేకొని చీకటి నిర్గమింపగా
నిన్ను తలంపునన్ నిలిపి నిచ్చలు కొల్చెద నిన్ను చేరెదన్.

బ్రతికిన నాల్గురోజులు విరామములేక ధనార్జనమ్ములో
సతమత మౌను శాంతియును సౌఖ్య మెరుంగడు వాని కేవిధిన్
అతుకును ముక్తిమార్గములు అబ్బను నీపదపద్మసేవ యే
గతి తరియించువాడు కలకాలము పాపపుకూపమే శివా!

ఎందరు యోగసిద్ధులు మరెందరు జ్ఞానవికాసమూర్తులున్
ఎందరు సన్మునీశ్వరులు నెందరు భక్తమహానుభావులున్
అందరు కాలగర్భమున హాయిగ నిద్దురవోయినారు ప
వందకు నొక్క డైన కనుపట్టునె శాశ్వతమూర్తియై శివా!

ఒకప్రళయమ్ము తప్పిన మరొక్క-మహాప్రళయంబు నైన నే
ప్రకటమహాత్ముడున్ విధికి బానిసమై చరియించి మృత్యు గీ
తిక రచియింప తప్పదుగదే! నశియింపని శాశ్వతుండ వీ
వొకడవె మృత్యువున్ గెలువ నొప్పినవాడవు నీవెరా శివా!

ఎక్కడి తల్లితండ్రులు మ రెక్కడి మిత్రులు బంధువర్గమున్
ఎక్కడి యాలుబిడ్డలును ఎక్కడి సోదరసోదరీమణుల్
ఎక్కడి వస్తువాహనము లెక్కడి యీధనధాన్యసంపదల్
నిక్క మెరుంగువానికి ననిత్యముగాక మ రేమిరా శివా!

కలిగిన దేదియో సుఖముగా తిని తృప్తివహింపకే సదా
తలచును డబ్బువచ్చు పలుదారులు త్రొక్కును దుష్టమార్గముల్
ఖలుడయి మంచిచెడ్డలను గాంచడు సుంత ధనార్జమ్ములో
అలసట పొంద డెప్పుడును నాశకు నంతములేదురా శివా!

తుచ్ఛపు భావనాబలముతోడ పిశాచపు రూపుదాల్చి యీ
కచ్చలు జాతిద్వేషములు కమ్మనిమానవజీవితమ్ము కే
మచ్చయొనర్ప బూనినవి మానవు డొక్కడు తోడిమానవున్
పచ్చడి చేయిబూను ప్రతిభల్ గని యూరక చూతువా? శివా!

(శివపంచశతి నుండి)

## అనుభూతి

నాకావ్యవీథిని వినంబడు మాట లెల్లన్
శోకాతిరేకవిరసోదయగీతు లౌగా
ఈకాలవాహినికి నే నెటు కట్ట వైతున్
ఈకారుమేఘముల నే నెటు లడ్డుకొందున్,

నాలోన పుట్టి నను నాశము చేయు బాధల్
ఆలోకమాత్రభయ మందు అగాధగాథల్
ఏలీల నైన కర మెత్తి ననున్ వరించున్
ఆలింగనమ్ముమిష ఆయువులే హరించున్.

శాం

దూరాన తోచెడి ప్రదోషవినూత్నకాంతుల్
కారాడుచుండినను గాంచి తొలంగిపోవున్

పారాడు నే నెటు ప్రభాతము చేరబోదున్.

పానీయమం చని యపారవిషమ్ము త్రాగన్
నానీడయే నను ఘనంబుగ మోసపుచ్చెన్
నానేర మంచు మది నన్ను శపించుకొన్నన్
నానిర్మలత్వరుచి నాకు మరెట్లు వచ్చున్.

ఏచోట గన్న నివియే బడబాగ్నికీలల్
ప్రాచుర్య మేర్పడ కరమ్మను భీకరంబై
నాచుట్టు క్రమ్ముకొని నన్ను దహింపకుండున్
ఈచిత్రహింస హృది నెట్లు సహించువాడన్.

ఏవంక గన్న నివి యేమి పయోదమాలల్
నావైపు దూకి నను నాశము చేసి మ్రింగన్
ప్రోవౌచు మిన్నున నపూర్వవికారభంగిన్
ప్రావీణ్య మొప్పగను భైరవనాద మెచ్చున్.

పాలించి ప్రేమను సెబాసని పల్కు మిత్రుల్
ఆలింప వెన్క పరిహాస మొనర్చువారే
లాలించి మంచిని తలంచి వరించువారే
వేలుంచి చాటునను వెఱ్ఱిగ వెక్కిరింతుర్.

అర్థమ్మునై పడు ప్రయత్నప్రయోజనమ్ముల్
వ్యర్థమ్ము లైనవి లయమ్ములునౌ పథమ్ముల్
స్పర్ధాదురర్థపు ప్రచారములోని కోవల్
దుర్ధర్షదుర్భరితదుష్టములైన త్రోవల్

పూర్వోక్తజన్మపు టపూర్వవిలాసభ్రాంతుల్
సర్వమ్ముతోచు పలుసారులు స్వప్నవేళన్
ఖర్వమ్ము గాని యొక క్రమవినూత్నభంగిన్
స్వర్వాహినీమధురశాంతియె వేచియుండున్.

నా రమ్యరూపము కనంబడు మార్గమందున్
ద్వారమ్ము లన్నియు విధాతయె మూసియుంచెన్
నేరానికైన కననే కనబోని రీతిన్
ప్రారబ్ధమాత్రమున ప్రాణము నిల్చియుండెన్,

నానమ్రవర్తనమె నన్ గని మోసగించెన్
నా నవ్యభావములె నన్ కడుహీను చేసెన్
ఈనాటి మంచి గని యే నిదె పొంగిపోదున్
ఏనాటికైన నిది యిచ్చెడి ముప్పుగానన్.

మాయాస్వరూపపు ప్రమాద మెరింగి కూడన్
నాయాత్మ వానికి ప్రణామము నాచరించున్
ధ్యేయమ్ము నైనను వధించి మథింప జూచున్
న్యాయమ్ము నైనను వినాశమునల్ప గోరున్.

నావేషభాషలు కనంబడ తావులెల్లన్
ఆవేశకేళికిని నద్భుతజీవనమ్ముల్
దావాగ్నికీలికలధాటికి నిల్వలేకే
ఆవేదనాన యమయాతన పొందుచుంటిన్,

ఊహింపరాని యొక ఊహ తపించువేళన్
దేహస్వభావపు ప్రదీప్తి నశించిపోవున్
ఏహేమకాంతియొ ఆహీనపుదీప్తి నిచ్చున్
ఈహీనజీవిహృది నింపుగ తుష్టి నింపున్,

ఈవెల్గు నాదని సహాయకబుద్ధితోడన్
ఆవీథిసందుల ప్రయాణము చేయబోవన్
ఈవింతచీకటు ల వేవియొ నన్ను క్రమ్మెన్
నావెఱ్ఱిచేతనె వినాశము తెచ్చుకొంటిన్.

ఆశించు సత్ఫలము నందగ లేకకూడన్
లేశమ్ము గూడును చలించి నశింప వాశల్
నాశమ్ము చెంది ఒకనాటికి పీడిపోకే
పాశమ్ము లై పెనగి బాధలు పెట్టుచుండన్.

# నేను

అంతు లేని ప్రశాంతవిశ్రాంతికొఱకు
కీర్తినీయమ్ము లౌ శాంతిగీతములను
కవితమాధుర్యకోకిలకంఠ మెత్తి
గానమొనరించుకొను విశ్వకవిని నేను

ప్రథితసంపూజ్యభావనాబలము కలిమి
దివ్యమౌ నవ్యకావ్యసందీప్తి వెలయ
సత్యమయిన సూత్నప్రపంచమ్ము లెన్నొ
సృష్టియొనరించు నవకళాస్రష్ట నేను

భ్రాజితం బగు విశ్వవిశ్వమ్ములోన
దాగియున్నట్టి ముగ్ధసౌందర్య మెల్ల
రమ్యముగ నొక్క అందాలరాశి చేసి
శిల్పముగ జెక్కి మురిపించు శిల్పి నేను.

ప్రణయసుకుమార మోహవిపంచిలోన
లలితకోమలహృదయతంత్రులను మీటి
కరుణ చిలికించు కమనీయగాన మొలికి
ధ్యానమొనరించు గాయకోత్తముడ నేను.

సురుచిరానందనిర్మలశోభ దనర
కమ్రసహృదయహృదయరంగస్థలాన
అమలసుందరప్రకృతిరహస్య మెరిగి
నర్తనము చేయు మహానీయ నటుడ నేను.

# కైత సొగసు

## శ్రీ జనస్వామి సీతారామరావు



విశ్వ సాహిత్య కళా సౌందర్య
విలీన విలాసో త్తేజ కందర్పా!
ఘన శృంగ స్థిత భావము లెల్ల
త్వద్రచిత సుమమాలిక లయ్యె

సొంపిల్లు నట నొక పుష్పం
అడు గడుగున సౌరభ్యం
వర్ణవ్యత్యయాల గ్రుమ్మరించు
సుందర పుష్పాపచయ వ్యాజం

హృదయనదీతీర సైకత మందు
వాయువేగధ్వనితమౌ
వాసితపుష్పపరాగమే కైతయై
రూపొందు నింపు లొలుక

కమ్మతెమ్మెరలో సొబగైన సంపెఁగ
విద్వన్మనోరంజకమై వెలయు
సాహితీపరుల హృదయములందు
భావుకత రేకె త్తించు ముకురము

హృదయం హృదయం కలిసి
అంతస్థులు మీరిన హర్షం కోసం
స్వార్థరహితదేశత్యాగం కోసం
కవిత లెన్నో వృద్ధి చెందును

అంచు లొరిసి పర్వు లెత్తు సెలయేరు
నాట్యసరణి మ్రోగు ఘలంఘలలు
జగతి కంతా నీరాజనమై
హృదయాకాశమున తటిల్లతలై

సర్వదా సరససాహిత్యము
పరిమళించి, భాసించును
స్వదేశభ క్తిచే వెలువడిన
భావములే "ముత్యాల సరాలు"

జీవికతో మినుకు మినుకని
విరాజిల్లు ప్రతీకయై
అంధకార హృదయ కుహరాన
వైడూర్యకాంతు లొలికించును

# దిఙ్నాగానాం - అధిక్షేపాః

శ్రీ పల్లె పూర్ణప్రజ్ఞాచార్యః



విద్వత్కవీశాన! భవజ్జయంత్యాం
విద్యాలయేఽస్మి న్నభినీతపూర్వామ్
స్వీకృత్య వేషం నిచుళస్య, తావత్
దిఙ్నాగపాత్రాభినినీషు రస్మి.

జానే జయంత్యాం మాధురం ప్రభాష్యం
క్వచిత్ వివాహేఽంచతి నిష్ఠురోక్తిః
దోషా నహం కాంశ్చన సూరిభి స్తే
ప్రదర్శితాన్ కీరవ దీరయామి.

సర్వాణి కావ్యాని మనోహరాణి
శ్రవ్యాణి దృశ్యా న్యపి సత్కవే! తే
దోషాన్ క్వచిత్ తత్ర చ తత్ర లగ్నాన్
కోఽంగీకరోతి క్రమభంగముఖ్యాన్.

సకారణా తే పునరుక్తి రస్తు
క్వచిత్ ప్రమోదాయ రసోపకర్త్రీ
అహైతుకీం తా మరుచే ర్నిదానం
మహాకవే! క స్సహతే విపశ్చిత్.

పదేపదేఽన్వైహి పదం ప్రయుఙ్క్షే
కిమర్థ మవ్యాకరణజ్ఞవత్ త్వమ్
కథం బహూక్త్వా భవతైవ పాండ్యా
ఇతి ప్రయుక్తం న చ వేత్సి శబ్దాన్.

న వేత్సి వేకోయణచీతి సూత్రం
త్రియంబకం సాధుపదం కథం స్యాత్
ఛందోనిరోధో యది తేఽపి విద్వ
త్కవే! కవిత్వాయ నమో నమోఽస్తు.

‘దివాకరాత్ రక్షతి’ నామ్ని పద్యే
సమర్థితో త్రేప్షితవస్తుసత్తా
సమర్థ్యతాం సాధు కవే! ఽశ్మతైలం
నభఃప్రసూనం శశశాబశృంగమ్.

‘తస్యాః ప్రవిష్టే’తి గిరీంద్రపుత్ర్యా
రోమావళీవర్ణన మానిబద్ధమ్
వ్రీడాకరాశ్లీల మిహ ప్రసక్తం
కో వారయేత్ భోజసభాజితాంఘ్రే.

ఏకో హి దోషో గుణసన్నిపాతే
నిమజ్జతీ త్యాది సమర్థ్య కావ్యే
కేనాపి దారిద్ర్యవతాఽభిశప్తః
క్షుధాంధ ఇ త్యుక్తియుతోఽపి విద్వాన్.

తాం తాటకాం రామశరేణ విద్ధాం
కాంతాభిసారాయ గతా మవాదీః
సంగం సహేతే కిము సత్కవే! ఽమూ
శృంగారబీభత్సరసౌ కదా వా?

ఆద్యే రసే తే ప్రతిభాఽద్వితీయా
బాభాతు విద్వత్కవిసార్వభౌమ!
శృంగారభంగీ శివయో స్త్వదుక్తా
పిత్రోరి వోద్వేగకరీతి మన్యే.

ఠ తే క్ర్విలాపే కరుణస్య కస్మాత్
పునఃప్రసక్తి ర్ద్విప్తి రకారి విద్వన్!
తదస్తు జాతీకుసుమం మనోజ్ఞం
విమర్దితం మ్లానదశా ముపేయాత్.

దేహార్పణే నాపి మహర్షి ధేనుం
సింహా న్మముక్షో ర్నృపతే ర్ముఖాబ్జాత్
వాణీ మనౌచిత్యవతీం కిమర్థ
మాయాపయః కర్ణకఠోరభూతామ్.

కైకేయి! కామా స్సఫలా స్తవేతి
క్రందత్వయం భోః సుకవే! సుమంత్రః
నోద్ఘాట్య మేతత్ కిల మధ్యమాంబా
భక్తేన రామేణ తథాఽకరోః కిమ్?

ఆస్తాం భవానాదిరసే ప్రగల్భః
శక్రో ఽప్యహల్యారసికో ఽస్తు. కామమ్
నార్హం త్రిలోకాధిపతే స్సభాయాం
అసభ్యసంభాషణ మాత్మయోనేః.

వాల్మీకినా వర్ణితపూర్వకాణి
వ్యాసేన భాసేన చ సూచితాని
వర్ణ్యాని తే వాచి మధుస్రవంతి
మహాకవే! త్వం నహి నూత్నసంస్పృట్.

ఉత్ప్రేక్షికైషా హి 'నఖక్షతా'నీ
వేత్యంచతి స్థానగతా కవేఽలమ్

'ప్రాయేణ సామగ్ర్యవి'ధా వితీయ
మలంక్రియా ఽస్థానగతేతి దూయే.

కవి ర్భవా నక్షరలక్షదాతుః
గుణజ్ఞమౌళే ర్నృపతే స్సభాయామ్
భాగ్యం తవైతత్ విదితో ఽపి లోకే
లభేత పుణ్యేన యశో మనుష్యః.

దోషైకదృగ్భిః కవివర్య! దోషా
యే దర్శితా స్త్వత్కృతి షూక్తరీత్యా
జంఝానిలాగ్రే జలదా ఇవైతే
నైవ స్థిరా స్స్యు ర్విదుషాం పురస్తాత్.

ప్రమాదమూలాః పతితా హి కేచిత్
విలేఖకానాం, కతిచిత్ సమర్థ్యాః
రసేన సర్వేఽపి సువర్ణభూతా
అశక్తికార్యం బుధ! దూషణం తే.

యదీదృశ స్త్వం ధ్వనికారముఖ్యా
మహాకవేః పట్టమదుః కుతస్తే
వల్మీకభూద్వైపభువోః పరస్తాత్
కవిత్వసామ్రాజ్యధురంధర స్త్వమ్.

నమో నమస్తే ప్రతిభాగ్రజాయై
నమో నమస్తే కవితాత్మజాయై
నమోఽస్తు తే రీతివిదర్భజాయై
పునఃపునస్తే సుకవే! నమోఽస్తు.

# పతంజలి మహాభాష్యము

శ్రీ కప్పగంతు నరసింహశాస్త్రి



## వ్యాకరణశాస్త్ర ప్రాధాన్యము

ధర్మార్థకామమోక్షములను పురుషార్థములను సాధించుటకై ద్విజాతులైనవారు సాంగవేదాధ్యయనము తప్పక యాచరింపవలయు నని తెలిసిన యంశమే! "బ్రాహ్మణేన నిష్కారణో ధర్మః షడఙ్గో వేదోఽధ్యేయో జ్ఞేయశ్చ" అని శ్రుతిగలదు. ఈవిషయమును స్మృతులుగూడ ఘోషింపుచున్నవి.

"యో నధీత్య ద్విజో వేద మన్యత్ర కురుతే శ్రమమ్।
సజీవన్నేవ శూద్రత్వ మాశుగచ్ఛతి సాన్వయః"

అని. వేదాఙ్గములు (1) శిక్ష (2) వ్యాకరణము (3) ఛన్దము (4) జ్యోతిషము (5) నిరుక్తము (6) కల్పము అని ఆరు గలవు. వీనిలో వ్యాకరణము వేదమునకు ముఖ మని చెప్పబడినది. కనుక శరీరావయవములలో ముఖ మెటుల ప్రధానాఙ్గమో అటులనే వేదమునకుగూడ వ్యాకరణము ప్రధానాఙ్గమై యున్నది. ప్రధానమైనదానియందు చేసిన శ్రమ గూడ ఫలవంత మగును.

## వ్యాకరణ ప్రయోజనములు

వ్యాకరణమువలన పదునెనిమిది ప్రయోజనములు మహాభాష్యమున వివరింపఁబడినవి. అవియు (1) వేదరక్ష (2) ప్రకృతిప్రత్యయముల ఊహ (3) ఆగమము (4) లాఘవము (5) అసన్దేహము (6) అమ్లేచ్ఛతాసమ్ప్రాప్తి (7) స్వరవర్ణదోషరాహిత్యము (8) సార్థకవేదజ్ఞానము (9) సుశబ్దాపశబ్దములవలనధర్మాధర్మజ్ఞానము (10) ప్రత్యభివాదమున నామమందుప్లుతజ్ఞానము (11) పదాక్షరాదివిభాగజ్ఞానము (12) చతుర్విధపదజాతభేదజ్ఞానము (13) విధ్యాదిపదార్థజ్ఞానము (14) వాగ్విస్తారసమ్ప్రాప్తి (15) సుశబ్దజ్ఞానము (16) నామకరణమున తగిన నామస్వరూపజ్ఞానము అని. ఈప్రయోజనములను సాధించుటకై పూర్వులు నవవ్యాకరణములను రచించిరి. అని 'ఐన్ద్రం, చాంద్రం, కాశకృత్స్నం, కౌమారం, శాకటాయనం, సారస్వతం, చాపిశలం, శాకలం, పాణినీయకమ్- అని. వీనిలో—

పాణినీయవ్యాకరణము సర్వోపకారక మని వచనము గూడ గలదు. 'కాణాదం పాణినీయంచ సర్వశాస్త్రోపకారకం' అని.

## పాణినిజన్మాది విచారము

సలాతురగ్రామమందు విక్ర. శ. 1197 సం॥ గడచిన పిమ్మట శలఙ్కునకు దాక్షియందు జన్మించి వర్షుని శిష్యవర్గమున పాణిని యనుపేరు గల శిష్యుడై మిగుల మందబుద్ధియై యుండి వర్షునిభార్యయొక్క ప్రోత్సాహమున విద్యాకాముడై హిమాలయపర్వతమున పరమేశ్వరునిగూర్చి తపస్సుచేసి మెప్పించి వానివలన సర్వవిద్యోపకారకమైన నూతనమైన వ్యాకరణశాస్త్రమును గ్రహించి పిమ్మట నాపాణిని (1) ఏకాదశగణాష్టాధ్యాయి (2) ధాతుపాఠము (3) శిక్ష (4) జామ్బవతీపరిణయకావ్యమును రచించి తన గురువైన ఉపవర్షునకు వ్యాకరణశాస్త్రమును వినిపించెను. అంతట నాసమీపముననే యుండిన కౌశామ్బీనగరనివాసియగు కాత్యాయనుడు పాణినీయమునంతయు విని విస్మయమంది యసూయాగ్రస్తుడై తానుగూడ విచిత్రగ్రంథరచనాభిలాషియై పవిత్రమైన స్థానమునకు వెడలి పరమేశ్వరునారాధించెను. అంత పరమేశ్వరుని యనుగ్రహమున పాణిన్యుక్తార్థపూరకమును, దురుక్తపునరుక్తాద్యర్థనిరాస

కము నైన "వార్తిక" గ్రంథమును విరచింపగా పాణిని విని విష్ణువు నారాధించి స్వగ్రంథమున కపకర్ష లేకుండ వరము నొందగా నావిష్ణువు పరమదయాళు వగుటచే నాదిశేషు నాజ్ఞాపించెను. అంతట నాదిశేషువు పాణిని యర్ఘ్యమిచ్చు సమయమున దోసిలియందు సర్పాకారుడై యగపడి 'పతంజలి' యను నామమున పిలువబడి యవతరించినవాడై సూత్రవార్తికకారుల గ్రంథములలోని యదృష్టార్థమును పూరించి మహాభాష్యమను గ్రంథమును సూత్రానుసారముగ రచించెను.

మఱియు పతంజలి యోగశాస్త్రమున "పాతంజలి యోగమును" వైద్యశాస్త్రమున "చరకము"ను రచించె నని యభియుక్తోక్తి గలదు.

'యోగేన చిత్తస్య పదేన వాచాం మలం శరీరస్యచ వైద్యే యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం పతంజలిం ప్రాంజలిరానతోఽస్మి' (యోగశాస్త్రమును రచించి చిత్తమాలిన్యమును, వ్యాకరణశాస్త్రమును విరచించి వాక్కులమాలిన్యమును, చరకమను వైద్యగ్రంథమును వ్రాసి శరీరమలమును పోగొట్టిన పతంజలిని దోసిలొగ్గి నమస్కరించుచున్నాను) అని పైశ్లోకమునకు అర్థము.

పూర్వము ఐన్ద్రచాన్ద్రాదివ్యాకరణము లనేకము లున్నను పాణినీయవ్యాకరణమునకే ప్రాధాన్యము గలదు.

'పాణినీయం మహాశాస్త్రం పదసాధుత్వలక్షణం। సర్వోపకారకం గ్రాహ్యం కృత్స్నం త్యాజ్యం నకించన' అనుశ్లోకము పైయంశమును స్పష్టము జేయుచున్నది. పాణిని మహర్షి తనవ్యాకరణశాస్త్రమంతయు "అష్టాధ్యాయి" అనుగ్రంథముగా రచించెను. అందు నెనిమిదియధ్యాయములు, అధ్యాయమునకు నాలుగుపాదములు. పాదమునకు షుమారు వందసూత్రములు గలవు. పిమ్మట కాత్యాయనుడను నామాంతరముగల వరరుచి యను మహర్షి ఉక్తానుక్త దురుక్తచింతనాత్మకములగు వార్తికములను వ్రాసెను. అనంతరము ఆదిశేషుని యపరావతార మగు పతంజలి మహర్షి పాణిని కాత్యాయనుల సూత్రవార్తికములకు సమగ్రమైన భాష్యమును విరచించెను. భాష్య మనగా "సూత్రముల ననుకరించు వాక్యములచే సూత్రార్థమును వర్ణించుటయే గాక స్వపదములనుగూడ వర్ణించుట". అట్లు వివరించిన పతంజలి భాష్యమునకు మహాభాష్య మని పేరువచ్చెను.

## మహాభాష్యశబ్ద విచారము

లోకమున గల న్యాయమీమాంసాదుల టీకాగ్రంథములకు కేవలభాష్య మనియే వ్యవహారము గలదు. (1) సూత్రభాష్యము (2) ఉపనిషద్భాష్యము (3 గీతాభాష్యము అని. కాని పతంజలిభాష్యమునకు మహాభాష్య మని వ్యవహారముగలదు అందుకు కారణ మేమన - పతంజలిభాష్యమున భాషాసౌష్ఠవము గలిగియుండుట, కఠినమైన విషయము గూడ సులభముగా విచారించబడుట, గ్రంథమంతయు సామాన్యముగా ప్రశ్న ప్రతివచనరూపముగా వ్యాఖ్యానింపబడుట. ఇట్టి గుణగణములుండుటచే లోకమున మహాభాష్య మను పేరున పిలువబడుచున్నది. మఱియు వ్యాకరణ మహాభాష్యము కేవలవ్యాకరణనిబంధనమే గాక సమస్త శాస్త్రములకు యుక్తములైన న్యాయబీజములకు నిదానముగా నున్నది. కనుక మహాభాష్య మను పేరు సార్థకము.

## మహాభాష్య విషయములు

మహాభాష్యమందలి విషయములను విమర్శించినచో, కేవలవ్యాకరణశాస్త్రసంబంధమైన విషయములే గాక లౌకికమైన యనేకవిషయము లున్నటుల తెలియుచున్నవి. మహాభాష్యకారుని సమయమున భారతదేశముయొక్క దశ యెట్లున్నది? భారత దేశీయు లెట్లు కాలయాపన గావించుచుండెడివారు? ఆకాలమున కృష్యాదు లెట్లుండెడివి? జాతివిభాగము లక్కాలమున గలవా? లేవా? అను మొదలగు నంశములు చక్కగా విచారింపబడినవి.

ఆకాలమున గల మనుష్యులస్వభావ మెట్టిది? అప్పటి ప్రమాణాదివ్యవహారము లోకవ్యవహారమును నెట్లుండెడివి? అను విచారణములు మహాభాష్యమున స్పష్టముగా గలవు. అందు వస్త్రనిర్మాణప్రకారమును విచారించిన సూక్ష్మసూక్ష్మతరవస్త్రములను నిర్మించెడివా రుండి రని తెలియుచున్నది. కృషికర్మవిషయమున నాకాలమున నైపుణ్యముగలవా రుండిరని అదేవమాతృకములైన భూములధికము నుండెడివనియు మహాభాష్యమువలన తెలియుచున్నది.

నగరనిర్మాణము, నగరసంజ్ఞలు, మార్గములు మొదలగునవి గలవు. మఱియు జన్మచేతనే జాతి యనియు సంస్కారాదులవలన జాతిపుట్టదని, జాతిభేదములు గలవనియు విద్యార్థులు వారివిధులు, విహారములు సమాజసేవ ఋణదానాది వ్యవహారములు, రాజకీయవ్యవహారములు, స్త్రీ విద్య, ప్రమాణాదులు మహాభాష్యమున విచారింపబడినవి.

## స్ఫోటవిచారము

వైయాకరణులు "స్ఫోటము" అనువానిని బ్రహ్మపదార్థముగా నంగీకరించిరి. "స్ఫుటత్యర్థోస్మాదితి స్ఫోటః". అనగా దీనివలన నర్థ మభివ్యక్త మగునని యర్థము. అది శబ్దము. అదియే బ్రహ్మపదార్థ మని వైయాకరణుల యాశయము. స్ఫోటము - వర్ణ, పద, వాక్యాది భేదములతో నెనిమిదివిధములుగా చెప్పబడుచున్నది. మఱియు నది సూక్ష్మవాగ్రూపమగు నాన్తరజ్ఞానమే శబ్దముగా వ్యక్తమగును. కాన శబ్దజ్ఞానముల కభేదము గోచరించును. అనగా సూక్ష్మమగు ధ్వని సర్వప్రాణులయన్తర్బహిర్దేశములనుండి స్వనిమిత్తములైన యభివ్యంజక తాల్వాదిస్థానములద్వారముగా శ్రోత్రదేశమును పొంది శబ్ద మనిపిలువబడుచున్నది. అట్టిశబ్దము వర్ణాత్మక మనియు నిత్య మనియు వైయాకరణసిద్ధాన్తము. శబ్దవిషయ మేమనగా మహాభాష్యమున పతంజలి వివరించెను. అది "చత్వారో వేదాః సాఙ్గాః సరహస్యాః బహుధాభిన్నాః ఏకశత మధ్వర్యుశాఖాః, సహస్రవర్త్మా సామవేదః. ఏకవిశంతిధా బాహ్వృచ్యమ్, నవధా అథర్వణో వేదః, వాకో వాక్య మితిహాసః పురాణం వైద్యకం" ఇత్యాదిః. కనుక సమస్తశాస్త్రములకు మూలము శబ్దమై యున్నది. అట్టి శబ్ద సంరక్షణము వ్యాకరణశాస్త్రమువలననే యగునని యభియుక్తోక్తి గలదు." యద్యపి బహునాధీషే తదాపి పఠ పుత్రవ్యాకరణమ్। స్వజనః శ్వజనో మాభూత్ సకలం శకలం సకృత్ శకృత్॥" ఇతి. మహాభాష్యమునగూడ "శశః షష ఇతి మాభూత్, పలాశః పలాష ఇతి మాభూత్, మఞ్చకో మంజక ఇతి మాభూత్" అని చెప్పి శబ్దరక్షణకై వ్యాకరణ మావశ్యకమని వివరించెను.

మఱియు శబ్దసంరక్షణము వ్యాకరణమువలననేగాని, కోశమువలనగాదని నిరూపించు సందర్భమున మహాభాష్యమున నిట్లుపపాదింపబడినది. "గౌరశ్వః పురుషో హస్తీ శకుని ర్మృగో బ్రాహ్మణ ఇత్యేవ మాదయ శ్శబ్దాః పఠితవ్యాః। నేత్యాహ। అనభ్యుపాయ ఏష శ్శబ్దానాం ప్రతిపత్తౌ ప్రతిపదపాఠః। ఏవంహి శ్రూయతే। బృహస్పతిరింద్రాయ దివ్యం వర్షసహస్రం ప్రతిపదోక్తానాం శబ్దానాం శబ్దపారాయణం ప్రోవాచ। నాన్తం జగామ। బృహస్పతిశ్చ ప్రవక్తా। ఇంద్రశ్చాధ్యేతా। దివ్యం వర్షసహస్ర మధ్యయనకాలః। నాన్తం జగామ। కిం పునరద్యత్వే యః సర్వథా చిరంజీవతి వర్షశతం జీవతి। చతుర్భిశ్చ ప్రకారైః విద్యా ఉపయుక్తా భవతి। ఆగమకాలేన, స్వాధ్యాయకాలేన, ప్రవచనకాలేన, వ్యవహారకాలేనేతి। తత్రచాపి ఆగమకాలే నైవాయుః కృత్స్నం పర్యుపయుక్తం స్యాత్। తస్మా దనభ్యుపాయః శబ్దానాం ప్రతిపత్తౌ ప్రతిపదపాఠః। ఇతి. కనుక శబ్దరక్షణకు కోశాదులకంటె వ్యాకరణమే యంగీకరింపవలయు నని పతంజలి ఘోషించెను. కనుక శబ్ద విషయములైన వేదాదులను వ్యాకరణద్వారమున సంరక్షించుటయే గాక వర్ణాత్మకమైన శబ్దము నిత్యమనియు దీని వలన నర్థము స్ఫుటనమగును గాన స్ఫోటమనియు అనాది నిధన మనియు, బ్రహ్మస్వరూప మనియు, "ధాతా యథా పూర్వ మకల్పయత్" అను శ్రుతిచే సృష్ట్యారంభమున బ్రహ్మయు అనాదియై వర్ణాత్మకమై శబ్దాత్మకమైన వేదాదులను స్మరించి సృష్టిని చేసె ననియు స్పష్టము.

ఇతి శివమ్.

# కుసుమశర విలాసము

శ్రీ కొలకుల నారాయణరావు



వేలకొలంది గుబ్బెతలఁ బ్రేముడిఁ గూడి రమించు నందగో
పాలు విచిత్రవృత్తమును బావనమునన్ భువనప్రసిద్ధమున్
హాళి గ్రహించి సర్వసుమనస్స్పృహణీయశుచిప్రధాన మా
లిన్ రచించు మము మించు కృపామతి వాణి ప్రోచుతన్.

పొగరుంగుబ్బలి ముద్దుగొల్ల వెలఁదుల్ పొంగారు వియ్యంబునన్
బిగికౌఁగిళ్ళఁ గదింప గందవొడి రాపిళ్ళం బడిన్ రాలియున్
జిగిమేనన్ వలపుల్ బుగుల్కొనఁగ రే నిద్రింపమిన్ గెంపుఁ గ
న్నుఁగవన్ సొంపులు గుల్క మామురళికృష్ణుం డోము లోకంబులన్.

కాంతుఁడు గోచరింపఁగ వికాసము గ్గైను గన్నుదోయి, కే
కాంతగృహస్థితుం డగుట సంగమునన్ బులకల్ జనించె, నా
ద్యంతము మే న్వడంకెఁ జను లంటఁగఁ బో బిగు వైనదయ్యెఁ దా
నంతనె వీడెఁ బోఁకముడి యాతఁడు కౌఁగిటఁ గూర్ప నింతికిన్.

చిఱునగ వంకురింప సరసీరుహమంజులమైన మోముపైఁ;
బరువపు గుబ్బలం దొలఁగి పయ్యెద జాఱఁగఁ; దాను గాంచుటె
వ్వరుఁ గనకుండఁ గంటికొనఁ బాణినిఁ జాఁపి, కురంగనేత్ర తాఁ
జిర మదె భావగర్భితపుఁ జేష్టల దూరమునుండి నన్గనున్.

పువుఁబోణీ! కనుమీ నికుంజసదనమ్మున్ సాంద్రమున్, మాధవీ
నవవల్లీపరివేష్టితమ్ము, చ్యుతసూనచ్ఛన్నమున్; గామినుల్
సవిలాసంబుగ నిచ్చటన్ మణితము ల్గావింతు రేన్ లీనమౌ
నవి యొల్లన్ బికనిస్వనంబుల; నశక్యం బౌను గుర్తింపఁగన్.

పరువెత్తఁ జెదరెఁ గురుల్; పెదవి బింబభ్రాంతి గాటొందె; మే
నరయఁ గంటకవిద్ధమయ్యెఁ; దిలకం బయ్యారె! ఘర్మోద్ధతిం
గరఁగెన్; వన్యశుకమ్ముకై తిరుగుచున్నా వేమి గాజుల్ రొదల్
నెఱపఁ; బూవుల కాడుబిడ్డ యిదె రానే వచ్చెఁ, గోసెన్ బువుల్.

తనుమధ్యామణి పీడుకొప్పు నొకచేతం బట్టి, వేఱొంట ని
క్కిన చన్గుత్తులఁ బాయు పైఁటచెఱఁగుం గీలించుచుం, శీర్ణచం
దనలేశాంకితగాత్రి చూడు మిదిగో, తాంబూలరక్తోష్ఠ, వ
చ్చెను దా వల్లభునుండి కామవిజయశ్రీదేవతాతుల్య యై.

హశాయ లొప్పఁ దములంపుమోవిజిగితో నొయ్యారి పర్యాకులం
బయి యున్నట్టి కచంబు లొక్కకరమం దండంబుగాఁ బట్టుచుం,
బయఁటన్ వేఱొకచేతఁ బట్టి— చ్యుతలేపస్తోకచిహ్నాంగి యై
ప్రియుసాన్నిధ్యమునుండి మన్మథజయశ్రీయో యనం వచ్చెడిం.

కాంతుం డేఁగును దూరదేశ మని యుద్గాఢంబుగాఁ జింత నా
స్వాంతంబం దుదయించెఁ; జంద్రముఁడు లోకానందదుం డయ్యెఁ దా
సంతాపం బొదవించె నాకుఁ బికనిస్వానావళుల్ గూర్చె న
త్యంతక్లేశము; ప్రాణమే కొని రిసీ! యారామవాతార్భకుల్.

కామకృశానుదారుణశిఖాపరితప్తసువర్ణవర్ణ యీ
కోమలి తాపశాంతికయి కూర్చిన నవ్యకిసాలతల్పమున్
దామరవంటి హస్తమునఁ దాఁకినమాత్రన వాడఁజేయు; నీ
భామిని తాపమున్ శివశివా! వివరింపఁగ నెవ్వఁ డోపెడున్?

శీతమయూఖుఁ డౌర! సరసీజమునన్ శయనించె; రాల్పె ము
క్తాతతి నుత్పలద్వయము; కాంచనవల్లిక తెల్లబాఱె; న
జ్ఞాతపుమొగ్గజంటఁ బడివాడెను గ్రొంబువుదండ; లిట్టియు
త్పాతపరంపరల్ తునిమివైచెను నా పయనంపుఁగోరికన్.

అకటా! వ్యర్థపురాకపోకలను నాకై యెంతయున్ డస్సినా
వుకదే! నీనయనోత్పలద్వయము సొంపుం దూలె; నెమ్మోమునన్
బ్రకటంబైన శ్రమాంబుసంచయము సంపాదించె ముక్తాఠమున్,
సకియా! యూర్పులు సందడించెఁ గదవే చంద్రాతపవ్యాప్రతిన్.

భీతహరిణీవిలోచన విరహ మోర్వ
లేక, యా యామని భరింప లేక, విసివి
జిక్కువటు-పుంజితాంగారసన్నిభంబు
లలితపల్లవనవ్యతల్పంబు నెక్కె.

కలకంఠంబులగీతికల్ పరుషము ల్గాఁ దోఁచె; నిండారు వె
న్నెల వేండ్రంబయి యేర్చెఁ; దెమ్మెరలు హానిం గూర్చె నెన్నండొ మా
చెలి తాఁ బ్రాణము వాసియుండెడిదె; యిస్సీ! గడ్డిపోఁచేనియున్
జలసంబొందిన, నీవు వచ్చి తను నాసల్ జూచుచున్ వేచెడున్.

కనులన్ నీరిడఁబోకు, జాఱును శలాకాన్యస్తకాలాంజనం
బు; నివారింపుము వేఁడియూర్పు, లఱుపన్ బొల్పేదుఁ గ్రొంబూసరుల్
తనురాగంబు తొలంగుఁ; బొర్లకుము తల్పంబందు; దైతుండు వ
చ్చును ముమ్మాటికి; దాఁటలేదు తఱి వచ్చున్, మాను దుశ్శంకలన్.

లీలావిభ్రమలోకమోహిని నిజాళీమధ్యమం దున్న దై
లోలాక్షీభ్రుసంజ్ఞచే నెదిరియె పల్కున్ దూతితో; హాళినే
త్రాలం గాటుక దిద్దు చంద్రముఖ; యుద్యత్తుంగవక్షోరుహా
వ్యాలోలన్మణిహారకాంతులను గప్పన్ బైఁటకొం గడ్డెడున్.

మోమున్ మూర్కొను నిందుకాంతి; యధరంబున్ ముద్దిడున్ బిక్వబిం
బామేయద్యుతి; చన్గవన్ నిమురు నుద్యత్పద్మకోశాళి; స
ప్రేమన్ హల్లకలక్ష్మి కే ల్గమిచి తాఁ గ్రీడించెడిన్; బల్లవ
మేలెంచి పదద్వయమ్ము నొగి సంసేవించు నమ్ముద్దియన్.

చెలి గానం బొనరించునేనిఁ జెవికిం జేదౌను వీణాస్వనం
బులు; చిర్నవ్వు వెలార్చునేని మలినంబుల్గాఁగఁ గన్పట్టు వె
న్నెల; లక్కన్నియకన్నుదోయి యెదుటన్ నెక్కొన్నచోఁ గ్రొత్తక
ల్వాలె యైనన్ సొగటున్; దదీయతనుశోభన్ డిందు విద్యుత్ప్రభల్.

పొలఁతుకపల్కు ముందుఁ జెవి పోటగుసూ పికకూజితంబు; పై
దలిముఖదీప్తిఁ గన్గొనెడు దాఁకనె చంద్రకళాభిలాష; తొ
య్యలి కనుదోయిముంగల మృగాంగన లక్షులు మూసికొంట మేల్;
తలఁపఁ బసిండితీవపస తన్వితనూరుచిఁ గాంచు దాఁక నే.

చెలియరో! నేను జెప్పినది చేసితి వౌర సమస్త మప్పుడే!
యిలపయి నిన్నుఁ బోలిన పరేప్సితధూర్వహ యొండు లేదు, కో
మలి! యిటు రాకపోకల శ్రమంపడి తెంతయు నన్నుఁగూర్చి; యా,
నలయక కార్యసిద్ధి యగునా తలపోయఁగ నెట్టివారికిన్.

మునుపటియట్లు పూసరులు ముద్దియ కూర్పదు మాటిమాటికిన్
దనకబరీభరాన; మృగనాభినిఁ జక్కఁగ దిద్దఁబోదు; నన్
గనియును దొంటికైవడినిఁ గట్టెదుటన్ విహరింపరాదు; నే
నొనరిఁచినట్టి నేర మెదియో వివరింపదు కాంత యింతకున్.

కలిగించున్ శశికిం గళంకికి నవజ్ఞన్ విస్మితాస్యంబుచే;
లలి వాక్ప్రౌఢి హసించు మందిరశుకాలాపంబులన్; దమ్మిపూ
వలపుల్ చిమ్ము మరుత్తతిన్ నిజవినిశ్వాసాళిచే గెల్చు నే
చెలి, యాచేడియ నీవియోగమున హింసింపంబడున్ వారిచేన్.

అనిదంపూర్వము దీర్ఘమున్ మఱి వయస్యాదోషజం బైన కి
న్కను బోనాడుము, మామకాక్షియుగమాంద్యం బేద నీమోము చం
ద్రునిఁ జూపింపుము, నాదుతాపము వినిర్మూలంబుగా నీదుదృ
ష్టిని నాపై వెలయింపుమీ, యమృతవృష్టిన్ నాచెవుల్ నింపుమీ!

అకటా! దుర్జనసంఘభీతినిఁ బరిత్యక్తంబు లైనట్టి గు
ప్తకృతాలింగనగండచుంబనకుచస్పర్శాదులం గూర్చి సుం
తకుమారిల్లను; విస్మృతంబు లివి; కాంతా! నీదు సంలాప మిం
చుక లేదంచుఁ దపింపఁ గుండెదను నీచూపే యభావంబుగాన్.

'నీరాగంబునకన్న నాయదియె యెంతే గొప్పయా' నంచు నో
రారన్ నీ వనినట్టి వాక్య మిది కృష్ణా; సత్యమా, నీవు లా
క్షారాగంబు మొగాన, జాగరజరాగం బక్షులన్, గుంగుమ
శ్రీరాగం బెద నిండ, వచ్చితివి కూర్మిన్ వేకువన్ నన్గనన్.

నీ వీయామనిలో విదేశమునకున్ వే పోవయత్నించుచు
న్నా వైనన్ - వెఱవన్ వియోగమునకున్; గల్హారగంధగ్రహ
ప్రావీణ్యాఢ్యసరస్సమీరయుతముల్ స్వచ్ఛేందుబింబద్యుతుల్
ద్యావాభూముల నిండియుండ, వెఱపేలా నాకుఁ? బ్రాణేశ్వరా!

నతుఁడౌ వల్లభుఁ గాంచ దించుకయు మానమ్లానచిత్తాబ్జ; తా
పెతనొందున్ దయితుండు పోవఁగఁ; జెలుల్ వేసారి కాంతున్ బలా
త్కృతి రావింపఁగ మానమూను; బ్రియుఁ డీతీరుగన్ విలోకించిపో
మతి నెంచన్ గళమందు కాంత నిలుపున్ బ్రాణమ్ము లైదింటినిన్.

# భా వ ం

## శ్రీ నూతి శేషగిరిరావు



సతతం .... .... సుందరం
మందారము,—మనహారాయలు
పండించిన తేనియలు
మంజీరరవం.........మనమానసం
సుధాధాముని పాలనం
భారనతలాలనం—
హృదయవిదారకం... ....లేపనం
సుమనోవ్యాపితం—
జీవనమా తరంగితం
భావం జ్ఞానమయం........
రాగం........జీవమయం
సతతం........సుందరం
మంజులం, భావనము
సంస్కారవిభవోజ్వలం
చంచలితం....భావనం
రసమయగోళవిరాజితం
మరందమాధురీగవేషణం
ఈప్సితం మంజరీకం
సుధామధురం—మంజులము

కోమలి,హృదయ
పరితాపము —పాపవినాశం
భావం, జ్ఞానమయం....
రాగం....జీవమయం
భావం....... రాగరాగిణి
రసమయదీనదయామయి !
చందన మమర—సుందర మరయ
జనతా, వినుతా—ప్రేమనుతా—
రావేరాగిణి—చేరరావే
అమరపురిని, శోభామయి !
వెలయార్చినమందిరము
బంధమనెడి రససిద్ధిని
విడనాడని ప్రేమమయి !
భావం........దీపితం,
తమోపధాన, జీవమనుకతన
తరింపజేయ నరుదెంచినది
మధుకరముల చిలికింప
మేనులు పులకింప
మాతరములు సుఖియింప.

# కైలాసము

శ్రీ బొడ్డు బాపిరాజు



[ఎల్లోరా ఒక మహాశిల్పకావ్య మన్నచో సర్వప్రపంచదృష్టి నాహరించుకొన్న కళానిక్షేపము కైలాసనాథ మందిరము. అం దొక రసపద్ఘట్టము. అందునా శతాబ్దాలుగా సనిచెడిన అందాలతో కళాతైర్థికుల కనువిందులు సేయు శిల్పవిన్యాసము కైలాసము. (రావణగర్వభంగము) అది ప్రసాదమధురశ్లోకమువలె సహృదయ హృదయశాయి. తద్రమణీయసందర్శనస్మృతిస్పందనమే ఈ రచన.]

ప్రాలేయశైలకన్యక
బాలేందుకళావతంసు వైలాసము ను
ద్లోలాందోళిత మగు న
కైలాసము తెరగు జూచి కనులెత్తినగా.

"స్వామీ! స్వామిదయానువిద్ధవరగర్వాంధుండు పౌలస్త్యడుక్
సామంతంబున వెండికొండ పెకలించన్ సిద్ధమైనాడు తా
మేమో సుంతయు చిత్తగించినటు లేనే లేదు క్రీగంట కే
ళీమందస్మితరేఖదక్క ఒక పల్కే పల్క రేలా ప్రభూ?

సాలప్రాంశుపటిష్ఠవింశతిభుజస్తంభంబులన్ హుంకృతిన్
కైలాసమ్మును దాకి యెుద్ధొరపుచున్నన్ మిమ్ము గాదన్న య
ట్లేలా చూచెద రంత వేడుక యటే? మృత్యుంజయా! ఊగు ప్రా
ణాలన్ గుప్పెటలోన బట్టుకొని యున్నా రెల్ల తత్రత్యులున్.

ప్రాతర్భానుకరావలగ్నము సితాభ్రం బట్టు, లై రావతో
త్ఖాతక్రీడల కల్పవల్లికవలెం గైలాస ముఱ్ఱూగి త
ద్దైతేయాధిపుబాహుబంధనమునం దల్లాడ మీ యాయుపే
క్షాతాత్పర్యము లంతుపట్టవు మహేశా! లెమ్ము మాకోసమై.

ముమ్మొనవాలు వంగినదో, మూడవకంటను మంట లారెనో,
బమ్మెర వోయెనో అజగవంబు, పరశ్వథ ముక్కుచెడ్డదో,
కి మ్మన రేల? మాప్రభుల కింకను కింకరపాలనాభిమా
నమ్మది చావకున్న దవునా తపఃకొంపకె నీళ్ళుతోడినన్.

తపముల్ సేయగ వారు ఘోరముగ ప్రత్యక్షమ్ములై స్వాములుం
గృపనందించిరి కోరుకొన్న వరముల్ కీడైన మేలైననున్
చపలాత్మల్ సరిపుచ్చ రంతట ఎదో సాగున్ జగత్ క్షోభ, మా
యుపచారం బది మీకె వచ్చె నిపు డోహో! స్వామి సౌభాగ్యముల్!

శిరముల్ తొమ్మిది రెండుదక్క కరముల్ చెండాడి హోమాగ్నిలో
హరుప్రీత్యర్థము వ్రేల్చె నీ పరమభక్తాగ్రేసరుం, డిప్పుడో
వరగర్వోద్ధతుడై తెగించె- భళిరా! వాల్లభ్య, మీహాంగులన్
త్వరలో తేలిచి పాదుకొల్పు మిక మాధైర్యం బహార్యంబుగన్.

పలికె నపశ్రుతిన్ నులికిపడ్డ మృదంగము, భావితాంగసం
చలనము భంగమై యడుగుజారెను నర్తనకేళి, వీజనో
జ్వలకరకంకణోదితరవం బడగెన్ పరిచారికాజనం
బులు నట నిల్వలేరు ఎటుపోవను బోవగ లేరు శంకరా!

పావులు గళ్ళు తప్పినవి పచ్చివి పంటకు వచ్చె, పంటలో
వీవల కెక్క పందె మిక వేయుట యెట్లు మహానుభావ! ఈ
కావలు డింత చేసియును కాచెను మీమరియాద-కానిచో
దేవర యోడి రెప్పుడో; అదే యభిమానమొ మానముద్రకున్?

తమచిత్తం బిది ఎంత మెత్తనిది! ప్రాతఃకోటిలింగార్చనా
క్రమనిష్ఠామతి యంచు వానియెడ పుత్రప్రేమ మీకున్న న్యా
యమె; కానీ కొడుకైననున్ గౌరవి నిల్లంటింపగా జూచు నో
రిమి ఏతండ్రికి గల్గు స్థాణు వగు గౌరీజానికిన్ దక్కనన్.

చెదరి కపర్దమ్ము చిందిన మినువాక వెల్లి నూగాడె జాబిల్లి మొలక
ఒరగి బాలశశాంకు డొరసిన నెన్నొసల్ కలచె ఫీబూది ముక్కంటికోన,
ఊగి పున్కలపేరు లొత్తిన ఫణిరాజు తలదాగె కటిబంధగళితకృత్తి,
బెడసి త్రిశూలమ్ము వడి పదాంగదముతో దుసికిలిపోయె పాదూవహమ్ము

పటు భుజాక్రమక్రమపరివర్ధమాన
ధూతకైలాసగిరిసమాందోళనములు
ప్రభుల కుయ్యాల జంపాల లౌనుగాక,
నిమిష నిమిషమ్ము ప్రాణగొడ్డములు మాకు.

నెత్తిన చెయ్యివెట్టుటకె నెంచెనొకం, డొక డేమొ వాకిటన్
బత్తెపుకూటికిన్ నిలిపినా, డిక వీ డిపుడున్నయిల్లె పై
కెత్తెగ జూచె, నెల్లి యొక డేమి యొనర్చిన జెల్ల దింత మీ
మెత్తదనమ్మొ! భక్తియను మేల్ముసుగుల్ గొనియున్న దుర్భరా
పత్తులు వీరు పెట్టెదరు స్వామికి చక్కగ పంగనామముల్.

ధరణీధ్రధం బటులుండ, పట్టి ప్రభుపాదాంగుష్ఠముం ద్రోయగా
దరమే లోకము లెల్ల వచ్చినను? ఈతం డొక్క తెక్క మహే
శ్వర! విశ్రాంతిమనోవినోదసరణిన్ సర్వజ్ఞులౌ మీర లీ
వర కీయాటలు సాగనిచ్చుటలె దేవా! కండ్లు పై కెక్కవే?

ఎల్ల జగమ్ము కుక్షి సవరించిన యాద్యు డనంతమూర్తి గా
సిల్లునటే పదింబదియు చేతుల మొల్చిన వంచు నాకునుం
డెల్లమె కాని, గోటికొన తీరెడిదానికి నేల గొడ్డలిం
దెల్లగ జేయ నో త్రిజగదీశ్వర! ఓహుతభుగ్విలోచనా!

అని యుత్క్రోశముతోడ హైమవతి వ్యాఖ్యానించు చున్నంత, త
ద్దనుజాధీశవిధూతశైలచలనోత్కంపంబునన్ దూరె శం
భుని వక్షస్థలి, అయ్యయాచితసమాభుక్తస్వయంగ్రాహసం
జనితోత్సాహి శివుండు హత్తుకొనియెన్ శర్వాణి హస్తావృతిన్.

తొణికిన మిన్నేటి నణచి, కపర్దమ్ము ప్రిదులక నెలవంక కుదురు చేసి
కలగిన ఫణిహారములు తీర్చి, గజచేలమున వ్రేలు కటిసూత్రమును బిగించి
ఎడయు పినాకమ్ము నొడిసి చేతుంబుడక్క మొరయ చిచ్చరకంటి మెరపులార్చి
తలకిన పరిజనంబుల జీరి యభయమ్ము మోవిని నవ్వుటలలు విరుగ

అంకమున శైలబాల నిశ్శంక నిలిపి
పలుకొనుచును నిండు పేరోగలమ్ము
విశ్వవిభు డంత నలవోక వెండికొండ
కొసల నొత్తె నల్లన పదాంగుష్ఠరేఖ

అప్పాటున బడు కొండం
దెప్పున దెమలింపగాక తెగి పెడమొగమై
కుప్పనకూరగ దనుజుని
యప్పదియుం బదికరమ్ము లకుఁగున జిక్కెన్.

అదిరిపడి లేచి యాదల
గదిరిచి హుమ్మంచు కొండ గదలించు పదే
చెదరిన బలమ్ము ప్రోవిడి
ఎదిరిని త న్నెరుగలేని హీను డసురుడుఁన్.

జలరుహమాలికకై మదగజమ్ము పదమ్మున త్రొక్కిపట్టిన
ట్టుల తనచేతు లిర్వది కఠోరగిరీశ్వరభారసంభృతిన్
నలుగగ చొక్క మేదియు, తనంతన బోనున బడ్డ సింగము
ట్లలుగును బొబ్బరించు నసమర్థభుజాబలకోపదగ్ధుడై.

గరువము నీరుగారి పదికన్గవలం బొగరెల్ల జారి, దు
ర్భరమగు బాధ నోర్చుకొనరాక యొకే మొరపెట్టు దిగ్దిగం
తరములు నుచ్చి పోవగ—వ్యథాపరిఖిన్నత కన్నువిచ్చు న
త్తరికిని గాని గుర్తునకు దట్ట డహో గిరిశుండు వానికిన్.

"నాతండ్రీ ఫణిరాజభూషణ! అపర్ణాదృక్సరఃకేళిసం
ప్రీతప్రౌఢమరాళ! బాలశశిహారీ! భక్తరాజన్యస
చ్చేతోమందిర! సాంధ్యతాండవకళాస్నిగ్ధస్ఫురత్పాదకం
జాతశ్రీశివమూర్తి! ఆర్తుడ క్షమాసంపన్ను గావింపుమా!

దానవజాతి సాజమగు దర్పము, రాజ్యమదమ్ము పెంపు, వి
జ్ఞాన మడంచు బాహుబలసంపద యిన్నియు గూడి నన్ను స్వా
మీ! నయదూరునిన్ సలిపె నిట్లు ఎరుంగరతే యధార్థ మీ
లోని వెలుంగులో ప్రభువు; లో కరుణామయ చంద్రశేఖరా!

హాయిగ వెండికొండ కొసలందు మనోహరపుష్పవల్లి కా
చ్ఛాయ విలాసహాససరసాదృతి దేలెడి మీకు నిట్లు వి
ఘ్నాయతవృత్తి నై కినుక నాటిన నన్నెటు సైచు తల్లి కా
త్యాయని, కాలకంఠ! కరుణావధి నమ్మితి నిన్నె శంకరా!

'శంభో!' యంచు దశాస్యముల్ యుగపదుచ్చస్స్వానముం జేయ త
ద్గంభీరోజ్జ్వలదీర్ఘనాదము దిశాంతవ్యాప్తమైతోన నా
రంభించున్ బ్రతిశబ్దరూపమున శైలాంతర్గుహోద్గీర్ణసం
రంభశ్రీల, సమస్తవాయుపథముల్ పల్కుం దదోంకారమున్.

శివపదాబ్జాతములు మనస్సీమ నిలిపి
అమలయోగీంద్రదుర్లభ మైన నిష్ఠ
నెనసె రావణు డంత; ఇం కెంతలోన
కరగు కైలాసమును తదీశ్వరుడుకూడ.

# తాంబూలసేవన ప్రశంస

## శ్రీ గూడూరి నమశ్శివాయ



పలుకుందొయ్యాలి వ్రాలికాంతి కెనయౌ
బాగాలునయ్యెంతి చె
క్కులబోలుం దెలనాకులయ్యెవిద ప
ల్కుల్వంటి కప్పంపు బ
ల్కులతో గూడిన వీడియం బొసగెనా
కున్ బద్మనాభార్చనా
కలనా పావన హస్త కంకణ ఝణ
త్కారంబు తోరంబుగన్.

అని తెనాలి రామకృష్ణ కవి పాండురంగ మాహాత్మ్యములో తాంబూలాన్ని శారదాదేవితో పోల్చి ఇట్లు హృదయంగమంగా వర్ణించారు.

కాళిదాస మహాకవి శ్యామలాదేవి స్తోత్రం చేస్తూ, ముగ్ధమందస్మితోదార వక్త్ర స్ఫురత్పూగతాంబూల కర్పూర ఖండోత్కరే. అని తాంబూల రాగంతో పోల్చి వర్ణించారు.

తాంబూలము కవితా సామగ్రి, కవికీ కవితకు ఎట్టి అవినాభావసంబంధమున్నదో, ఆర్ష సంప్రదాయంలో తాంబూలానికి అట్టి సమవాయి సంబంధ మున్నది. తాంబూల శోభలో కవిత వికసిస్తుంది. కవితా శోభలో తాంబూలము గుబాళిస్తుంది. అందుచేతనే రసపిపాసులగు సాహిత్య స్రష్టలు తాంబూలంతో గంటం పుచ్చుకొని తాంబూలసేవనతో కవితను నడిపించి తాంబూలస్వీకరణతో గ్రంథం సమాప్తి చేశారు. కళకు వెలుగునీడవోలె వెలారిన తాంబూలం తళ్కొత్తని ఉద్గ్రంథం లేదు. సాహితీవనంలో తాంబూల వల్లిపోయిన పోకడలు యిన్నన్ని కావు. అసలు మనదేశాన్నే తాంబూలంతో వర్ణించారు.

తమలపాకు తీగెలతో పెనవేసుకొనిన పోకవృక్షములు కల్గినటువంటి ఏలక తీగెలతో సమాలింగితములైన, చందన తరువులతో కూడినటువంటి మలయప్రదేశము అని రఘువంశంలో ఇందుమతితో చెప్పారు. ఇట్లే తాంబూలప్రశస్తి పుంఖానుపుంఖముగ లభిస్తుంది.

సంస్కృత సాహిత్యము తరువాత ఆంధ్రసాహిత్యంలో తాంబూలవర్ణనలేని ప్రబంధమే కన్పట్టదు. చేమకూర వేంకటకవి విజయవిలాసంలో పురవర్ణన తాంబూలంతో మిళితంచేసి వర్ణించాడు.

పోక మ్రాకుల మహిమ కప్పురపుటనటి
యాకుతోటల సౌభాగ్య మందు కలదు
ప్రబలు మౌక్తిక సౌధ సంపదల మహిమ
వీటి రహి మెచ్చవలయుం బో వేయునోళ్ళ.

అన్నారు. అనంతామాత్యుడు భోజరాజీయంలో ఒడలికి హితమగు తాంబూలమనుభవింపుడు మేలు కనుడు ప్రీతి అని ఉపదేశించారు.

కళాపూర్ణోదయంలో పింగళి సూరన్నగారు తాంబూలాన్ని ప్రేమవిజయ సాధన ప్రక్రియగా ప్రయోగించారు సుగాత్రికి విముఖుడుగానున్న భర్తను వశపరచు కొనుటకు ఉపాయము బోధిస్తూ తల్లి .

గా రామునతోడ్తోడన
రా రమ్మను డనుచు మగిడి రానేటికి గ

ర్పూరంబుతోడి బాగా
లేరాదో ఆకుమడిచి యీరాదో చెలి.

అని కూతునకు ఉపదేశం చేస్తుంది. తాంబూలం ప్రేమ సాధన ప్రక్రియ అనే విషయం రంభానలకూబర విలాసంలో

విని మోదమొసగంగ వనజాక్షి తములంబు
గొని చెంత నిలుచుండి కోమరు మిగుల
తనగళంబున కిది దగునె సాటి యటంచు
ఖండము ల్గావించి క్రముకములను
తన కక్షములకిది యనయంబు తుల్యమై
వందు కొను తమలపాకుల నొగి
దలల ద్రుంచుచు నీనియలు దీసి తుదవుచ్చి
ముక్తామణీ చూర్ణము వెలయనిడి
చంద్రశకలల వంగముల్ చాల బెట్టి
దిట్టతనమున గట్టిగా బుట్టి వట్టు
లేని ప్రేమ నొసంగెను మేన బులక
లొదవ నత్తరి నతనికి నొప్పు మీర

అను విధంగా నలకూబరుణ్ణి వశపరచుకొంటుంది.

ఇక శ్రీనాథుని చేతిలో తాంబూల వర్ణన కొత్తజల్లులా చిగిర్చింది. భీష్మపురాణంలో శ్రీకృష్ణుని స్తోత్రం చేయుచు

''బాలిక మోము మ తవనబర్హి కిశోరకలాస్య
లీల బైవాలిచి చ్చ కప్పురపువాసనతోడి
ముఖారవింద తాంబూలపు మోవి మోవి
పయిమోపుచు రాధకునిచ్చు ధూర్తగోపా
లుకు ప్రోచుగావుత.

అన్నారు. తాంబూలానికి బజారువెళ్ళి

''తొలకరిమించు తీవగతితో పదుకాణము
మీద నున్న యయ్యలికులవేణితో దముల
పాకుల బేరములాడబోయి నే వలచుట
కేమి ?''

అన్నారు. ఆనాడుకూడ కిల్లీకొట్టుపై జవరాండ్రు కూర్చొని తమలపాకుల బేరం చేయటం ఉండేదని గాబోలు.

క్రీడాభిరామములో శ్రీనాథుని తాంబూలం ఇంకా రసవత్తరంగా నడిచింది. అభిసారానికి విటులు బయలు దేరారు. పూటకూళ్ల యింటిముందు కరణదేశపు జాణకు ఎదురుగాగ....వీడిదె తెల్లనాకులను వీడెము సేయుచు వీధి వచ్చుచున్నాడు....అన్నారు. అంటూ నాయకులు యింకో సెరజాణ ఇంట్లో ప్రవేశించారు.

వీడెము తెత్తునో పసిడి వీణియ మీటుదు ప్రొద్దుపు చ్చునో అంటూ కరపద్మంబున పెడిపళెరమునం గంధాక్ష తల్ పచ్చికప్పురపున్ వీడెము గొందు గ్రొత్త మడుగం బొన్పట్టు నీరంగితో మురిపెంబొప్పగ వచ్చె అని ఆవధూటిని వర్ణించారు.

ఇట్లు ప్రాచీన ఆంధ్రసాహిత్యంలో తాంబూలం తల మానికమైనది. వర్ణనాధిక్యమును ప్రశంసాప్రాముఖ్యమును పొందియున్న ఘట్టాలు పరశ్శతాలుగా వున్నాయి.

తాంబూలం అనేది ఏకవచన ప్రయోగం అయినా అది బహురసరచనాసమ్మిళితమైన ఏకపదార్థం. ఆకువక్క సున్నము కాచు మొదలైనవి ప్రధానంగా తదితరద్రవ్యాలు రుచికి సువాసనకు క్రిమిహరమునకు ఏర్పడి ఉన్నాయి. ఈ సుగంధద్రవ్యాలు తాంబూలానికి మాత్రమే నేస్తాలుగా రసపిపాసులు చెప్పనప్పటికి యివి దేశాలను జాతులను సంస్కృతిని కూడా మైత్రీబద్ధం చేసినటువంటి గాథలు చరిత్రలో అనేకము లున్నాయి. నేడు ఇండోనేషియా అని పిలువబడే ద్వీపసంచయం భారతేతిహాసంలో సుగంధ ద్వీపాలుగా పేర్కొనబడ్డాయి. లవంగాలు యాలకులు మొదలైనవి భారతదేశపు తమలపాకులకు జోడై భారతీయ సంస్కృతిని ఆకళింపు చేసుకొనిన ఆ ద్వీపాల చరిత్ర విన ముచ్చట కల్గుతుంది.

ఇంక మనచరిత్రలో కూడా తాంబూలం సాధించిన విజయగాథలు కొన్ని ఉన్నాయి. 13వ శతాబ్దమధ్యమందు శ్రీ ప్రతాపరుద్రసార్వభౌముని ఆస్థానంలో ఇన్నూరు గురు ప్రబంధ కవులుండేడివారట. అందు మంగళపల్లి భాస్కరుడు అను మహాకవి ముఖ్యుడు. ఒక దినమున ప్రతా

పరుగ్రముడు నవరత్నఖచితమైన బంగారు పళ్లెరమున అమూల్యాభరణములను కర్పూర తాంబూలమునుంచి కవులందరిలో ఎక్కువ రసవంతంగా కవిత్వంచెప్పి ఆ తాంబూలపు పళ్లెరమును స్వీకరించినట్లు ఒక యితిహాస మున్నది. నాటి నుండి ఆ అగ్రతాంబూలము నందిన భాస్కరుడు హళక్కి భాస్కరుడు అని పిలువబడ్డాడు. హళక్కి అనగా కన్నడమున తాంబూలమని అర్థము. ఆనాటి అతని కవితా విజయానికి తాంబూలము బిరుదు నామమైనది.

ఇక విజయనగర సామ్రాజ్య శ్రీకృష్ణదేవ రాయలవారి పరిపాలనలో తాంబూలము ఒక పరిపాలనా శాఖ గౌరవాన్ని సంపాదించుకొన్నది. రాయలవారి పరిపాలనాశాఖలలో తాంబూల సుగంధవస్తు శాఖ ఒకటి కలదట. ఆ శాఖ అడపంతిమ్మనాయణ్ణి చేతిలో నుండెడిదని ఆముక్తమాల్యద చెప్తుతోంది. అడపం అనగా వక్కలు ఆకులు మొదలైన తాంబూలద్రవ్యా లుంచుకొనే సంచి. అడపపుగత్తె అను పేరుతో రాయలువద్ద తాంబూలమిచ్చుటకు ఒక ఉద్యోగిని ఎప్పుడూ వెంట ఉండెడిదట. తాంబూల మివ్వటానికి స్త్రీ యే ఉండాలని వాత్స్యాయనం చెపుతోంది. యీ తాంబూల సుగంధ శాఖనుగూర్చి.

కొమరగిరి నృప వసంతా
గమకేళీ గంధసార కస్తూరీ కుం
కుమ కర్పూర హిమాంభ
స్సముదంచిత బహుసుగంధశాలాధ్యక్షా.

అను పద్యం ధ్రువపరుస్తోంది. రాయలవారు యుద్ధములకు వెళ్ళ సైన్యాధ్యక్షులకు వీరతాంబూలం యిచ్చి పంపెడివారట. ఈ విశేషమును వర్ణించుచు రాయవాచకమున యిట్లు కలదు. పెమ్మసాని రామలింగం నాయడు అమర నాయకంవారు, తమతెగ కమ్మదొరతనాలవారిని పిలిపించి వారలకు చెయ్యెత్తిమొక్కి, రాయలవారు ఆకువక్క యిచ్చి పంపగా వస్తిమి, ఈ బహుమానం మీది. అని చెప్పి దండును చేర్చుకొని యుద్ధమునకు వెళ్ళి తురుష్కులను తరిమివేసినట్లుగా అందుకలదు.

రాయలవారు కళింగదేశ విజయయాత్రకు బయలుదేరి వెళ్ళబోతూండగా, శ్రీ తిరుమలదేవి మహారాణివారు,

వరనుతి సద్గుణప్రకట
వైభవ నిర్జిత శారదాంబ యా
తిరుమలదేవి కప్పురపు
దీవెన వీడె మొసంగి పంపగా
నరవరమౌళి దివ్య శకు
నమ్ములు గన్పడ భద్రదంతిపై
సరగున నెక్కి ఛత్రమును
చామరముల్ మెరయంగ నెంతయున్.

అని దీవెన వీడెము యిచ్చి పంపినదట రాయలవారి కాలంలో తాంబూలం రుచి చూచిన అబ్దుల్ రజాక్ అనే పారశీకపు రాయబారి, పెయాస్ అను తెల్లదొర దానిని వేనోళ్ల పొగిడి యున్నారు.

ఇట్లు చారిత్రకమైన విశేషాలు మాత్రమేకాదు. చరిత్రలోను ప్రముఖుల ప్రముఖ సన్నివేశాలకు సంబంధించిన తాంబూల చాటువులు అనేకమున్నాయి. విజయనగరమున శ్రీకృష్ణదేవరాయలకాలము తంజాపురిలో రఘునాథరాయల కాలము మధుర నాయకుల కాలమున శ్రీ విజయరంగ చొక్కనాథుని కాలము శారదాదేవికి ప్రముఖ రంగస్థలములైనవి. శ్రీ విజయరంగ చొక్కనాథుని కొలువులో శ్రీ సమ్ముఖం వేంకటకృష్ణప్పనాయకుడను మధుర కవి విజయరంగ చొక్కనాథు వర్ణించుచూ :

ఇమ్మగ గమ్మని వీడెము
కొమ్మని, కొమ్మ నిపుడేలు కొమ్మనిశము, కో
పమ్మేరా యా చెలి నీ
సొమ్మేరా విజయరంగ చొక్క వజీరా.

అని చెప్పారు. శ్రీ రావు సర్వజ్ఞ సింగభూపాలుని ప్రతాపమును గూర్చి ఒక కవి యిలా చెప్పాడు.

తమ్మ తమకెంత ప్రియమో
తమ్ముకు చెయిసాచి రిపులు తలక్రిందై నీ

తమ్మపడిగాన నుందురు
బొమ్మలక్రియ రావురాచ భూవరుసింగా.

శ్రీ బుక్కపట్నం తిరుమల తాతాచార్యులవారని వైద్యుడు పండితుడు కవి ఒక రుండేవారు. వారొకరికి వైద్యము చేయగా ఇచ్చెదనన్న ప్రతిఫలము యివ్వక పోయినందున :

పచ్చడము దుప్పటాయెను
విచ్చలవిడి తులసి పత్రి విడియంబాయెన్
రచ్చల నగుబాటాయెను
అచ్చన్నా! నీదు ·రి యట్టిట్టాయెన్.

అని చెప్పినట్లు ఒకచాటువు ప్రచారంలోనుండి పిల్లలు పొడుపు కథలు చెప్పుకుంటూరు. ఒకడు కథ పొడవగానే వేరొకరు అర్థం చెప్పాలి.

వండగ నెండిన దొక్కటి
వండక మరి పచ్చి దొకటి పడిగాలినదిన్
దిండికి రుచియై యుండును
మండలమున జనులకెల మహిలో వేమా.

ఇట్టిదే మరియొకటి :

శిలవృక్షలతల బుట్టిన
చెలువలు ముగ్వురును గూడి శుభలగ్నమునన్
తలవాకిట రమియింతురు
చెలువలరగ దీని తెలియు సుగుణులు గలరే.

పిల్లలకు సాహిత్య పరిచయం చేయుటకు గాను యిలాంటి పద్యము లెన్నిటినో చెప్పి మన ప్రాచీనులు పిల్లలకు తెనుగు భాషమీద మక్కువ కలిగించారు. తాంబూలాన్ని అన్యాపదేశంగా పెట్టుకొని జరిగిన శృంగారరస సంభాషణ ఒక పల్లెటూరిరసికురాలు నీలాటిరేవుకు వెళుతూంది. త్రోవలో రచ్చ చెట్టుక్రింద తమలపాకులు నములుతూ సడ్డిగము వేసుకొని ఒక రసికుడు కూర్చున్నాడు. రసికు డంటాడు :

నీలాటి రేవుకు పోయేటి నెరజాణ కన్యా
నీకురులు కోసి ముడిచారా? కోయకముడిచారా?

అనగా ఆ నెరజాణ సమాధానం చెపుతుంది....

ఎండు మానుమీద కూచోని
పండుటాకులు నమిలేరాజా
నిన్ను మేస్తే కట్టారా ?
మేయకపోతే కట్టారా ?

అన్నదిట. యీ సామెత యిప్పటికీ పల్లెపట్టులో చెప్పుకుంటూంటూరు.

పూర్వము ధగ్గులు, పిండారీలు అనే దోపిడి దండ్లు గ్రామాలపైబడి యెన్నో ఘోరాలు చేస్తూండేవారు. వీరు వంచనగా ప్రజలలో తిరుగుతూ దూరప్రయాణాలు చేస్తూ వుండేవారు. అట్టి ప్రయాణాలలో మార్గమందు కొన్ని సాంకేతిక స్థలాలలో.

భాయీ తమ్మాలావో...పాన్ లావో.

అని కేక వేసేవారట, తాంబూలం యిస్తారా అని ప్రయాణికులు ఆశపడుతున్నంతలో నల్గురూ చుట్టుముట్టి కట్టి చిత్రవధచేసి దోపిడి చేసెడి వారనిన్నీ పాన్‌లావో, తమ్మాలావో అనుమాట వారికి సాంకేతిక పదంగా ఉపయోగ పడిందనిన్నీ మెడోస్ టెయిలర్ గారు వ్రాశారు.

ఏనుగులవీరాస్వామయ్యగారుకూడా తమ కాశీయాత్ర చరిత్ర వ్రాస్తూ మనదేశమందు తాంబూలచర్వణాన్ని గురించి ఎదట ఎవరు ఎలా వేసుకొనేదీ వర్ణించారు. కన్యాశుల్కంలో అగ్నిహోత్రావధాన్లు అన్నారుగా తాంబూలం యిచ్చేళ్ళాను యిహ తప్పనుచావండీ అని. వివాహాదులలో యితర ఒప్పందాలలో తాంబూలం యిచ్చితే ప్రమాణంగా భావించేవారు.

యీ విధంగా సారస్వతంలో కవుల శృంగారాలనందుకొని రాజాధిరాజులచే మన్ననలను బొంది అనేక యితిహాసాలకు మూలకందమై తాంబూలం భారతీయ జీవన చరిత్రలో అనివార్యమైన స్థానాన్ని పొందియున్నది.

అసలు తాంబూలం భారతీయుని దినచర్యలో ప్రముఖమైంది. సంఘంలో దాని స్థానము అత్యంతగౌరవ పాత్రమైనది. ఇంటికి వచ్చిన వారికి తాంబూలం యిచ్చి పంపటం మన గృహసంప్రదాయం. అభానికి శుభానికి పుణ్యపురుషార్థములలో అనివార్యమైన స్థానము నలంకరించిది.

వదనవికాససౌరభవి
వర్ధనకారి లసన్మదాపహం
బుదరవిశేషసౌఖ్యకర
ముద్ధతదోషబః ప్రహారస
మ్మదజనకంబు తమ్ములము
మానవతీపరిభోగ వేళలన్
మదనపునర్భవీకరణ
మంత్రము తుల్యమె దాని కెద్దియున్"

అని చారుచర్యలో మంత్రి అప్పనగారన్నారు.

# తులసీ మహత్యము

'పీయూషజా హి తులసీ దేవదేవ నమస్కృతా' అని చెప్పింది పద్మపురాణం. తులసి అమృతము నుండి పుట్టింది. దేవదేవునిచే నమస్కరింపబడింది. అమృతోద్భవములైన వృక్ష విశేషాలను కల్పవృక్షాలని పేర్కొన్నారు సిద్ధులు. కల్పవృక్షాలు మహిమ గలవి. ప్రభావము గలవి. అందు మారేడు తులసి ముఖ్యమైనవి. కాక చండీశ్వరుడనే సిద్ధుడు కల్ప తంత్ర మనే గ్రంథాన్ని వ్రాశాడు. అందు ఇట్టివి ప్రభావము కల కల్పములను పేర్కొన్నాడు. మారేడు శివప్రీతికరమైనట్లే తులసి విష్ణుప్రీతికరమైనది. తులసి యాంటిసెప్టిక్. సంసర్గదోషం వల్లగాని, గాలి నుండి వచ్చే క్రిమికీటకాలవల్లగాని ఏర్పడే అంటువ్యాధులను అరికట్టుటలో తులసి ప్రముఖమైంది. అందువల్లనే మారేడు, తులసి దేవస్థానములలో పూజార్హమైనవి. ఓషధిగా కూడా తులసికి ముఖ్యమైన స్థానముంది. పెద్దలు తులసీవృక్ష ప్రాదుర్భావమును గూర్చి ఒక కథ చెపుతారు.

"పూర్వం మధుసూదనుని అధ్వర్యమున దేవతలు రాక్షసులు కలసి పాలసముద్రాన్ని మథించారు. వాసుకిని తాడుగా, మంధరపర్వతమును కవ్వంగా చేసి చిలికారు. అప్పుడు అమృతం పుట్టింది. దయామయుడైన మధుసూదనుడు ఆ అమృతకలశాన్ని చూచి చాలా సంతోషపడ్డాడు. ఆనందబాష్పాలు విడిచాడు. ఆ బాష్ప బిందువులు అమృతకలశంలో పడి తులసి మొక్క పుట్టింది. విష్ణుమూర్తి అపుడు పుట్టిన కల్పవృక్షము మొదలైన వాటిని దేవతల కిచ్చి తులసీ కౌస్తుభ లక్ష్ములను తాను తీసుకొన్నాడు. లక్ష్మి కౌస్తుభాలను వక్షమునందు తులసిని ఆపాద మస్తకము ధరించాడు. ఇది తులసీ జన్మ వృత్తాంతం."

తులసి ఆయువును వృద్ధిచేస్తుం దని బలమును పెంపుజేస్తుం దని, సంపత్తును వృద్ధిచేస్తుందని శతానందుడు తులసీ మాహాత్మ్యమున పేర్కొన్నాడు. తులసీ మహాత్మ్యమును గూర్చి చెపుతూ అది సంతాన ప్రదాత్రి అని ప్రతిపాదించే ఒకకథ పురాణంలో చెప్పబడి వుంది. మహిమాన్వితంగా పుట్టువు నొందిన తులసి గుణాలు కూడా మహిమాన్వితమైనవి. పూర్వము ఉజ్జయినీనాథుడైన ఉదయన మహారాజుకు సంతానము లేకపోయింది. ఆ విచారములో చాలా కాలం గడిపాడు ఆ రాజు. చివరకు వార్ధక్యము కూడ వెంటాడింది. ఆ దశలో తన రాణితో తీర్థయాత్రలకు బయలుదేరాడు.

త్రోవలో యమునానదీతీరమున పండితులు సమావేశమై ఉండటం చూచాడు. పండితుల మధ్యలో ప్రకాశిస్తున్న వశిష్ఠమహర్షిని చూచి రథము దిగి నమస్కరింపగా వశిష్ఠుడు....ఎందుకొరకుయిచటకు వచ్చావని రాజును ప్రశ్నిం

చాడు. రాజు....మహాత్మా, నాకు సంతానము లేదు. అనేక దినములు సంతానంకొరకు ప్రతీక్షించాను. చివరకు వార్ధక్యము కూడా వచ్చింది. విషయములందు వాంఛ నశించింది. తీర్థయాత్రలు చేయ సంకల్పించాను' అని చెప్పాడు. వశిష్ఠుడు....రాజా నీ కీ విధంగా జరక్కూడదు. నీకు సంతానం కలుగుతుంది. అన్నాడు. వశిష్ఠుని మాటలు ఉదయనునకు విరుద్ధముగా కన్పించాయి.

అయ్యా వృద్ధులైన మాకు తిరిగి యౌవనం ఎలాకలుగుతుంది అని ప్రశ్నించాడు. వశిష్ఠుడు అదే ఆశ్చర్యం, తులసీ సంసేవనం వల్ల మీకు తిరిగి యౌవనం, సంతానప్రాప్తి కూడా కలుగుతుంది....పీయూషజాహి తులసీ....తులసీ తులసి అమృతంనుండి పుట్టింది. అందుచే మీరు తులసిని సేవించండి. తులసీ ప్రసాదమువల్ల మీకు యౌవనం కలిగి భరతు డను పుత్రుడు జన్మించుతాడు. మీరు ప్రతిదినమూ షోడశోపచారములచే తులసీ పూజ చేయండి. అపత్రాలతో అమృత స్వరూపుడైన విష్ణుమూర్తిని పూజించి. తులసీ పత్ర మిశ్రిత మైన తీర్థమును త్రాగండి. ఆజలంతో శరీరాన్ని కడుగుకొనండి. తులసీ మిశ్రితం తీర్థం పిబ, సించ స్వకాంతేనుం. అని ఉపదేశించాడు.

ఉదయన మహారాజు ఆయన పత్ని ఒక సంవత్సర కాలం గడిచిన తర్వాత ఆదంపతులు నవయౌవనులైనారు. వారికి భరతు డనే పుత్రుడు జన్మించాడు. ఇది ఒక పురాణ గాథ. వైద్యుల అనుభవంలో కూడా తులసీ సేవనం సంతానప్రదమైనదిగా ఋజువైంది. స్వస్థురాలైన స్త్రీ రేపు ఋతుస్నాత అవుతుందనగా ఒక చంద్రకేళీ అరటిపండు చీల్చి అందులో వెదురుపప్పుచూర్ణం నింపి, మూసి దారంతో కట్టి ఉంచాలి. దానిని తులసీవనంలో తులసీవృక్షం క్రింద ఆ రాత్రిఅంతా ఉంచాలి. ఉదయం ఋతుస్నాత అయిన వెంటనే యీ పండు తిని పాలు త్రాగాలి. ఇలా రెండు సార్లు ఋతుస్నాత సేవించినచో తప్పక సంతానార్హత కల్గుతుంది. తులసీవనంలో ప్లావిత మైన కదళీ ఫలము సంతానకారి యగుట పురాణగాథను ఋజువు చేస్తున్నటి. అలాగే తులసీ ప్లావితమైన శవం కుళ్ళిపోకుండా కొంతకాలం నిలువ వుంటుందని యీమధ్య అమెరికన్ శాస్త్రజ్ఞులు పరిశోధనవల్ల తెలిసికొన్నారు. ప్రాణాపాయస్థితిలోకూడా తులసీ సేవనంచేయటం వల్ల ప్రమాదం నుండి బయటపడటం లోక విదితం.

జపానులో ప్రతి ఇంటా చిన్న తులసితోట ఉంటుంది. తులసి లేని ఇల్లు జపానులో కన్పించదు. కలకత్తాలో ఒక యూరోపియను తన ఇంట తులసీవనం ఏర్పరచుకొన్నాడు. ఒక హిందువు వెళ్ళి ఇది ఏమిటి అని ప్రశ్నింపగా అతడు, ఓషధీ లోకంలో తులసి మొక్కలో నున్నంత విద్యుచ్ఛక్తి మరి ఏ ఇతర వృక్షములోనూ లేదు. ఈ తులసి మొక్క ఉన్న ప్రాంతమున రెండువందలగజాల వరకూ వాయువు పరిశుద్ధంగా వుంటుంది. మలేరియా, ప్లేగు మొదలైన అంటువ్యాధులు, క్షయరోగము పుట్టించే క్రిములు, ఆప్రాంతానికి చేరవు. తులసి మొక్క పక్క వద్దనుంటే దోమలు రావు. వచ్చినా కాటువేయవు. అందుకని నామెడలో తులసివేరును ఎప్పుడూ ధరిస్తాను దాని ప్రభావం వల్ల అంటువ్యాధులు నాదగ్గరకు రావడంలేదు. ఉదయం, సాయంకాలం తులసీవనంలో షికారు తిరుగుతుంటాను. అని చెప్పెనట. కొందరు హిందువులు తులసి పూసలు మెడలో ధరించడం ఆచారమే గదా, తులసి హిందూ గృహముల గృహదేవతగా పవిత్రమైన వృక్షంగా పూజింపబడుతున్నది. వేపచెట్టును లక్ష్మీదేవి అని పూజించినట్లే తులసి బృంద యని పూజిస్తున్నాము. వేప తులసి ఒకే గుణాలు కలిగివుండటం ఆశ్చర్యం.

తులసీ దళాలను శిరస్సున ధరించినవారు, నోటవేసుకొని తినినవారు మనఃకాయకర్మముల పవిత్రులగుదురని, ఇలా పవిత్రులైన వారికి కామితార్థములు సులభంగా చేకూరుతవనీ పురాణాలు చెపుతున్నై. ఇప్పటికి తులసి పూజచేయకుండా చాలామంది స్త్రీలు భోజనం చెయ్యరు.

కల్పవృక్షాలలో ఒకడైన తులసి మన భారతీయ సంప్రదాయంలో జీవనవిధానంలో అత్యంత ప్రాధాన్యమైన స్థానము పొందివున్నది. ముముక్షువులకు అది ఆధ్యాత్మిక జ్యోతిని ప్రసాదిస్తుంది. యోగులకు అది కర్మక్షేత్రం. వైద్యులకు చింతామణివంటిది. కనుకనే తులసి త్రివిధమైన శక్తులను ప్రసాదిస్తూ మనజీవిత విధానంలో పెనవేసుకపోయింది. గోవు కామధేను వైనట్లు తులసి కల్పవృక్షమైంది. ఈరెండు సాగరమథనంలో జన్మించిన కవలలు

వంటివి.

యోగులకు తులసీవనంలో కూర్చొని తపస్సు చేయటం నైర్మల్యానికి, నిశ్చలత్వానికి ఏకాగ్రతకూ మూలమని ఆధారమనీ చెప్పటం అతిశయోక్తి కాజాలదు.

ఈ ఓషధికి వైద్యపరంగా అపారమై ప్రాధాన్యం వుంది.

వ్యాధ్యపస్మారభీతౌచ దుర్గమే ప్రాణసంకటే
అంత్యకాలే జపే చేతత్తదవశ్యంమానవోత్తమ.

సర్వ వ్యాధులందూ....హిస్టీరియా యందూ, దుర్గమ ప్రదేశాలలో కలిగే భయమునకూ, అంత్యదశయందూ ప్రాణభయము కలిగినప్పుడూ, మానవుడు ఈ తులసిని సేవించిన అవశ్యం రక్షణ పొందును.

తులసి ఎక్కిళ్లను, దగ్గూ ఆయాసమునూ, జ్వరమును, విషదోషాలనూ పార్శ్వశూలనూ, విషమ శీతజ్వరాలనూ హరిస్తుంది. దగ్గును పోగొట్టడంలో దాని కదే సాటి. చర్మ వ్యాధులు, రక్తదోషము, క్రిమి దోషము, వాంతి, భూత బాధలు నివారించడంలో తులసికి మించినమందు మరోటి లేదు....అని చరకుడు చెప్పాడు.

రసబంధనకు నియామక ఓషధులలో తులసి ముఖ్యమైన దని భదంత నాగార్జునుడు చెప్పాడు. రసపట్లలో తులసి తింటే పల్లు వెంటనే విడిపోతాయి. బంగారానికి రసం తగిలితే తెల్లబడిపోతుంది. అప్పుడు తులసి పసరు రుద్దితే బంగారం మళ్లా మామూలు వన్నెకు వస్తుంది. తులసివేరు, గురువారంనాడూ ... ఆదివారంనాడూ తీసింది ధరిస్తే పిల్లల కాకదోషం, పక్షిదోషం, ముట్టుదోషం హరిస్తుంది. వరుసజ్వరాలలో పైనచెప్పిన వారాలలో చెట్టు తిరగ వేస్తారు. మకరసంక్రమణంనాడు తీసిన తులసి బదనిక దగ్గ రుంటే అధికారవశ్యం, గృహమునఉంటే ధనధాన్యవృద్ధి కలుగుతుంది.

సర్వకామములనూ ఇచ్చేది తులసి ఒక్కటే.

యాదృష్టా నిఖిలాఘసంఘశమనీ
స్పృష్టా వపుఃపావనీ
రోగాణా మభివందితాని రసనీ సి
క్తాంతకత్రాసినీ
ప్రత్యాసక్తివిధాయినీ భగవతః
క సంరోపితా
న్యస్తా తత్పదయో ర్విముక్తిఫలదా
త తులస్యై నమః.

# ఆరాధన – హరిద్వారము

శ్రీ పెన్మత్స సత్యనారాయణరాజు



మోక్షద్వార మటంచు సంతసముతో
మ్రొక్కంగ గంగానదీ
సాక్షాద్ద్వార మటంచు సంతసముతో
స్థానంబు గావింపఁగా
పక్షాంతాబ్జరుచిప్రకాశము హరి
ద్వారంబు నోయుగ్మలీ!
సాక్షాత్కారము చేసె నంది ధరణీ
సంచార మేపారఁగా.

పాపంబు తోంటిపుట్టుల
లోపల నొనరించినట్టి లోలాత్ములకున్
తాపంబు లణఁచికొన దు
ష్ప్రాపం బాపురవరంబు రాజీవాక్షీ!

ఆయూరిచెలువమున కెద
మాయాయన మెచ్చుకొనుచు మంజులవాణీ!
స్త్రీయాంశ మొకటి భక్త
ధ్యేయంబుగ నిల్పె నచట నే సేవింపన్.

సప్తాశ్వరుచిరమణిగణ
దీప్తిప్రాకారమధ్యదేశస్థితఖ
వ్యాప్తోరుశిఖరసిలయ
ప్రాప్తాద్వైతానుభావభావితమూర్తిన్.

రంగత్పన్నగరాజరాజితమణి
గ్రైవేయహారాళితో
లింగాకారమునన్ వసించు నెడ ని
ర్లిప్తాంతరంగుల్ రజో
లింగుల్ సంగవిభంగచంగులు సమా
శ్లిష్టాపవర్గాంగనా
సంగుల్ శైవవిధానుషంగులు ముముక్షు
సంప్రీతి సేవింపఁగన్.

గిరిశుఁడు నేను వారల
పరిచర్యల కలరి సదయభావుల మగుచున్
పరిణతనైర్వాణశ్రీ
వరదానక్రీడ నెఱపువారము సతమున్.

పల్లవితంబులై కుసుమ
భారవినమ్రము లైన తోఁటలన్
వేల్లితవల్లరీప్రణయ
నిర్మలడోలల నూఁగి యూఁగి సం
ఫుల్లలతాంతగుచ్ఛపరి
పూర్ణమధూళిక లానియాని యో
పల్లవపాణి! ఆపురము
పక్షులు పాడును శైవగీతముల్.

వ్యాపితచంద్రకాంతమణి
హారిహిరణ్మయకుట్టిమస్థల
స్థాపితభర్మహర్మ్యసువి
తర్దులపై సుఖముండి దంపతుల్

రేపును మాపు మాకును ని
రీహాపరీక్షి యొనర్చుచుంట చే
ఆపురిఁ బాసిపోవ మన
సాడక యుండె నరాళకుంతలా.

అంభోజాక్షి! నిరంతరం బిటకు యా
త్రార్థంబుగా నెందఱో
రంభోరుల్ చనుదెంచి భర్తల కర
గ్రాహంబు గావించి భో
శంభో! శంకర! యంచుఁ గ్రుంకులిడి యా
సాయంబు గంగానదిన్
గుంభింపం దగఁ జేసి రీశ్వరునకుం
గుంభాభిషేకంబులన్.

నాత్యుష్ణంబును నాతిశీతలము నై
యాహ్లాదముం గూర్చు నా
శ్రుత్యంత స్తుతిపాత్రరమ్యనగరీ
శుద్ధాంతశుద్ధాంత మై
నిత్యం బేను సుఖింతు నెచ్చెలులతో
నిస్తంద్రభావంబుతో
సత్యానందముతో హృదీశ్వరపదా
బ్జధ్యానపారీణ నై.

తనిసి యి ట్లిశ్వరము హరిద్వారమందు
నుండఁ బూజారి యొకఁడు మాయండఁ జేరె
వాఁడు వాడక కైన సేవకుఁడు గాని
పట్టిచూడంగ మాపాలి బందెకాఁడు.

ఆవగింజలు వోని యక్షియుగ్మము వాఁడు
మొఱకుఁ దేఱిన పాడుమోము వాఁడు
సాఁచి కంపును గొట్టు పలుచాలు గలవాఁడు
వ్రేలాడు పెనుతొట్ట పెదవివాఁడు
కఱకైన జుంజుఱుఁ జిఱువెంట్రుకలవాఁడు
చీముగాఱెడు దొప్ప చెవులవాఁడు
గడ్డిమోపునుబోలు మడ్డిదేహమువాఁడు
మండూకరుతి మించు మాటవాఁడు
గఱపగుమ్మడికాయంత కడుపువాఁడు
తాటిపట్టెలవంటి పాదములవాఁడు
పళ్ళపాఱ లనఁగఁజాలు గోళ్ళవాఁడు
బ్రహ్మబంధుండు మాపూజఁ బరగినాఁడు.

చినిగిన రాంకవంబు కుడి
చేతిశిరంబున వ్రేలవైచి పై
తునిఁగిన యంగవస్త్రము వి
నూతనరీతిని జుట్టఁబెట్టి తా
మునిఁగిన దెల్ల గంగ యని
మోఱకులం దగ నమ్మఁ బల్కుచున్
మనిఁగిన యింటికూటికయి
మక్కువచేయు సతం డజస్రమున్.

ఏగిన వీథి కేఁగకయ
యీగతి నాతఁడు ప్రత్యహంబునున్
రోగులయిండ్ల రొక్కములు
ప్రోగొనరించుచు నీశ్వరేశ్వరుల్
భోగము లిచ్చి తిన్నకయు
బొజ్జ కదల్చుచు సంచరించుచో
మాగుడియొద్ద కొక్క పెను
మానిసి బత్తుఁడు వచ్చెఁ జెచ్చెరన్.

పూజారి :

వచ్చి రాఁగానె పంచమభక్తుఁ గాంచి
కటకటంబడి కనులెఱ్ఱగా నొనర్చి

కారములును మిరియములు నూఱి యఱచేఁ
జుట్టుమూఁగిన ఛాందసుల్ బిట్టువొగడ.

పంచముఁడ వగు నీమోము గాంచుకతనఁ
బంచగవ్యఁబు పుచ్చుకోవలయు నింకఁ
గాశికిం బోయి విశ్వేశుఁ గానవలయుఁ
బాచితంబునఁ బాపంబు పాయవలయు.

పూజారితో పంచమభక్తుడు :

జననము పెంపు విద్యలప
సందును మేనిబెడంగు నాఢ్యతా
ఘనతయుఁ గాంచి గర్వమునఁ
గల్పనచేయుదు రెచ్చులొచ్చులన్
తనువు లశాశ్వతంబు లవి
తప్పక రూపఱు నేఁడో రేపో యీ
మనుజులు భేదభావములు
మానరుగా సకలం బెఱింగియున్.

అగమాగమాగమాంతార్థామృతాంభోధు
లాపోశనము పట్టినట్టివాఁడు
దిక్చతుష్టయమధ్యదేశగద్వీపవ
త్యంతరంబుల మున్గినట్టివాఁడు
చంద్రమశ్చూడాంఘ్రిజలజరేణుప్రపు
ణ్యస్థలంబులు మెట్టినట్టివాఁడు
సకలమారణగణాశాపూరణప్రీతి
నఖిలస్వ మర్పించినట్టివాఁడు
పడయఁజాలఁడు నిర్వాణభవ్యపదము
నాబ్జసూతి పిపీలికానంతదేహి
బహుళదేహాంతరాళదీపాయమానుఁ
డైన నాత్మేశతత్త్వంబు నరయఁ డేని.

# జాగృతి

శ్రీ మారేమండ శ్రీనివాసరావు



తిమిరాంధకారము
తరమివైచి నాదు
హృదయకుహరములోన
వెలిగింపవా? జ్ఞానజ్యోతి
ఓ దేవ.......
వినలేవ నా చిన్నివినుతి.

ఇడుములా జలధిలో
సుడులు తిరిగెడు నన్ను
కడలిగట్టుకు చేర్చరావ
నాలో నీవు నవ్యజ్యోతిని
నింపిపోవా.... ఓ దేవా........

ఆలుబిడ్డలు అనెడు
పాశబంధము నన్ను
పెనవేసికొని యెదను
వ్యధపరచు చున్నాది
కాంతి నాకును నొసగ లేవా?
ఓ దేవ......
శాంతిమార్గము చూపరావా?

కాంతయును కనకమ్ము
కనుపించినంతనే
కమనీయ మగు నీదు
కాయంబు మరువని

దివ్యజ్యోతిని నింపిపోవా?
ఓ దేవ........
నవ్యతలో నను నిల్పరావా?

పాపక్షాళన చేయు
పాదయుగ్మము పైన
వెక్కివెక్కి రొదతో
పిక్కటిల్లెడు నన్ను
ఒక్కమా రిటు చూడరావా....?
ఓ దేవ........
చక్కగను సరిదిద్దిపోవా....?

సతతమును నీయందు
మతి నిల్పి నేనుండి
మననంబు చేసినా
కానుపింపగ వేమి దేవా?
కరుణ సుంతయు రాద రావా?

హృదయాన విడివడిన
తంత్రులన్నిటి కూర్చి
విశ్వమోహనరాగ
మాలపించీ నీవు, నా
వీనులకు వినిపింప రావా....
ఓ........ దేవా........

శాం

కరడు గట్టిన జడము
విడి చెదరి పోవంగ
జ్ఞానజ్యోతిని నిలిపి
కను విప్పు చేయుమా.
దేవా.... ఓ దేవ..

నీరూప మెట్టిదో
నీగాన మెట్టిదో
వివర మెరుగనినాకు
దరిచూపవా నీవు
దేవా.... ఓ దేవా.

అది గదిగో స్వామి నీ అందాల ఆకృతి
కాంచుటకుకూడ నా కనులు విప్పారవే

ప్రకృతి కృతిలోన ఆకృతిని మలచితివి
జాగృతుడ నయి నేను చక్కగను గాంచితిని

అరుణారుణం బైన కిరణావళిలోన
అవి గవిగో నీ మృదులచరణావళి....

కిలకిల మ్మని యెడు కూజితములలోన
కమ్మనైనా నీదు గానంబదే........

నిగ్గులొల్కుచు చిరు, నవ్వుదొంతరలతో
ఉగ్గుపాలను త్రాగి, ఊగొట్టుపాపనిలొ

కనినాను నీ భవ్యకారుణ్యవదనంబు
సుకృతుడ నయితి నీ ఆకృతిని చూచుటతొ.

# పణవిపణి

శ్రీ నళినీకుమార్



ఈ యనంతవిశ్వము రమ
ణీయమ్మగు పణవిపణి
అహోరాత్రముల్ మెరసెడి
ఆశాజ్యోతుల బరణి.

## ప్ర

మేరల నన్నింటి దాటి
మించిన విడ్డూర మేది?
అస్తి నాస్తి వాదమ్ముల
కందని సందేహ మేది?

కారణకార్యముల కొకటి
గతులు దిద్దఁ గల దెయ్యది

పూజాఫలరూప మేది?
పూజారుల లోప మేది?

ఆ శక్తికి నుడుగర లిడు
టలవాటే లోకమునకు
కైమోడ్చితినో నే నీ
కావ్యము రచియించితినో.

## చైతన్యము

జుట్టులోని శక్తులఁ దుద
ముట్టింపంగా శత్రులు
మఱి కొన్నాళ్ళకుఁ బూర్వపు
మానిసి కాడా 'శాంసను?' ♦

నాకా 'శాంసను' పోలిక
నశియించెడి తీరికలా?

శత్రుల నేలాగైనను
సాధించెడి కోరికలా?

కారణజన్ముఁడ నంచును
గర్వించెడివాఁడఁ గాను—
ఫలసిద్ధికి మార్గముతోఁ
బనిలేదనువాఁడఁ గాను.

♦ ఆంగ్లకవి మిల్టను రచించిన «శాంసను ఎగనిస్టస్» అను పద్యకావ్యములోని నాయకుడు «శాంసను» కారణజన్ముఁడు. ఈతని శక్తియంతయుఁ గేశములయం దుండుట కపటోపాయమున గ్రహించి శత్రువు లీతని ముండనము జేసిరి. జుట్టు పెరిగిన కొలది పోయిన బలము తిరిగి పొందుచుండిన «శాంసను» కొన్నాళ్ళకు శత్రుల నిర్మూలించు సఫల ప్రయత్నములో నసువులఁ బాసెను.

తత్త్వహృదయవీథులలోఁ
దృష్టి విరిసె నీ రోజున—
పచనమైన పాకముగను
శుచికంటెను రుచి కలదా?

ఎవ రెవరో నా స్నేహితు
లీనాటికిఁ దెలియ వచ్చె—
తప్పైనను నొప్పైనను
నొప్పెడివారే వారు.

అల లన్నియు గలఁచి చులఁచి
సలిలమ్ముల ముంపఁబోవు—
కొన్ని దయారసమయమై
కూలమ్మునఁ జేర్పఁగలవు.

'విరటు' రాణివాసమ్మున
సురటి వీచు పెన్నాళ్ళో?
అజ్ఞాతావస్థఁ దాటి
ప్రజ్ఞానిధి కాఁడె 'క్రీడి'?

సర్పదష్టుఁడై తొల్లిటి
దర్ప మెల్లఁ గోల్పోయిన
'బాహుకుడే' తిరిగి పట్ట
భద్రుండై వెలుఁగొందఁడె?

సంపూర్ణముగా బ్రదుకును
జవులు గొన్నవా రెవ్వరు?
ఏయొకరో కలరేమో—
ఎందుకు నే లేరనుట!

పరిపూర్ణతఁ జేకూర్చెడి
పరికరముల నేరుటలో
వల్లకాటి దిబ్బలపైఁ
తెల్లవారునే బ్రతుకులు.

నుడి నడిలో మునిఁగితిని—
చుక్కాలఁ జేపట్టితిని—
శీతోష్ణమ్ముల మేరలు
స్థితిగతులకుఁ దార్కాణులు!

పారమ్ములుఁ జూచినచో
బేరమ్ములు పలుకలేరు—
తీరములే కావలెను
బేరములకు జోటులేదు.

ప్రకృతి కొకబల మున్నది:
పడయరాని వన్నియు మన
కనవసరము లనిపించును—
అవసరమ్ములను గూడ.

వేదాంతము లెన్నైనను
వాదమ్ములకే— నాకీ
వాదప్రతివాదములకు
వ్యవధిలేదు—జీవిత మిది.

ఆకే కదలదు సంద్ర
మ్మాలోచనలో మునిఁగెను—
ఊపిరి సలుపక ప్రకృతి
యుసురుల బిగఁబట్టినది.

నిస్త్రాణము నా ప్రాణము,
నిద్రాణము నా భావము—
క్షణ మొక యుగ మనిపించెడి
స్తబ్ధత కేయర్థమ్మో?

శాస్త్రజ్ఞులు వాకొనినది
సత్యేతర మెల్లాను
కుంభవృష్టిగా జోరున
కురియుట కిది ప్రస్తావన.

గాలులు వీచును, మొయిళ్ళు
గర్జించును, తళుకు తళు
క్కని మెఱయును విద్యుల్లత
లంబుధులే పొంగెత్తును.

తాప మ్మారును, ప్రాణ
మ్మోపికఁ గొను, జవసత్వము
లెన్నో రెట్లుగఁ దోఁచును,
ఎద లోలోఁ బులకించును.

అంతేనా? యిం స్తబ్ధత
కర్థ మ్మిం కేమైనను
చెప్పవచ్చునా యని నా
చిత్తము కలవరమందును.

సందియ మావంత లేదు
జయభేరులు మ్రోగినవి!
చతురంగబలమ్ము లెల్ల
సమకూరును దమయంతట.

కాలమ్మే సిగ్గిలి నా
కనుసన్నల నర్తించును;
కాఁగల కార్యము లెల్లను
గంధర్వులు కావింతురు.

నా పిరికియు నా ముఱికియు
నన్ను నిరాడంబరు డను—
నా మాటలు వేదమ్ములు
నాతు మ్మొకశుభశకునము!

వలచిన వస్తువు లన్నియుఁ
దలఁచుకొన్న రూపంబున
బిలిచినంతనే పలుకును
గలిసివచ్చు కాలమ్మున.

ఎవ రోహో! పిలిచెడివా
రిందున్నా రని తెలిసిరె?
ఎక్కడిదీ? పిలుపుల గొం
తేనాడో విన్నాఁడను.

హా! తెలిసెను! ఆపిలిచెడి
దవకాశము ఆగొంతే—
ఎన్నాళ్ళకు ఎన్నాళ్ళకు
ఈ దర్శనసౌభాగ్యము.

అది గదిగో! మనోనేత్ర
మారయఁ గల్గెను-ఓహో!
ఎంతటి చల్లని చూపులు—
ఏమీ! ఈ చైతన్యము!

అందించెను రారమ్మని
హస్త మ్మవలంబమ్ముగ—
విజయయాత్ర కీనాఁడా
విధి యెంచిన సుముహూర్తము?

శతసహస్రతురగమ్ముల
శ[illegible] వచ్చె-న న్నెవ్వా
రడ్డెడివా రాపెడివా
రొడ్డెద నిదె పందెమ్ము.

సౌజన్యవసంతమ్మున
సహకారము పల్లవించె;
పంచమస్వరమ్మున నేఁ
బాడెదఁ గెలుపాడెదను.

నిన్నటి రేపటుల మధ్య
నేఁడొక కట్టని వంతెన
దాఁటుదాఁక తహతహలే!
దాఁటుట మాత్రము తథ్యము!

# కళాభివ్యక్తి

## శ్రీ అన్నపురెడ్డి శ్రీరామరెడ్డి



కళ జీవితముకొరకే యని కొందరు, కళ కళకొరకే యని కొందరు ప్రవచించుచుందురు. కళ స్వార్థముకొరకే యను వాద మొండు కలదు. కళ పరమార్థమునకు సంబంధించినదే యను మరియొక వాదము గలదు. కళ యైహిక ప్రపంచమునకు జెందదనియు, పరలోకవస్తు వనియును వాదించుట వినుచున్నాము. పైవాదములన్నింటిలోనూ సత్యాంశమున్నదేగాని పూర్తిగా సమర్థనీయములు గావు.

వస్త్రము నేయుట యందిమిడియున్న సూత్రమే సామాజికజీవితమునం దిమిడియున్నది. ప్రత్యేకముగా నూలుపోగున కున్నవిలువ తక్కువ కాని నూలుపోగుల సమష్టిరూపమగు వస్త్రమున కున్న విలువ యందరకు దెలిసినదే. సామాజికజీవితమునందునూ విడివిడిగా నివసించు వ్యక్తులకు తగువసతు లమరవు. కావుననే ప్రాణులన్నియు, ప్రత్యేకముగా మనుష్యులందరును సమష్టిగా నివసించి జీవితమును సుఖప్రదేశముగా జేసికొనుచుందురు.

విశాలప్రపంచమునం దనేకవిధములగు ప్రవృత్తులు గల వ్యక్తులు, ప్రాణులు నివసింతురు. విభిన్నమన స్తత్వములు గల మనుష్యులసంసర్గమునం దనేకవిధములగు యనుభవముల పొందుచుందురు. మానవుడు తనప్రారంభసామాజికజీవితమునందు బొందిన యనుభవముకంటె, దినదినప్రవర్ధమానముగా వృద్ధిజెందిన సామాజికుడు తన యనుభవరంగములను విస్తరింపజేసికొనినాడు. మనుష్యుని యవసరముల కనుగుణముగా తనక్రియాకలాపములను విస్తరింపజేసికొనుచు తదనుగుణమగు ననుభవములను బొందుచుండును.

అనుభవము కాచినపాల వంటిది. వ్యక్తిత్వముతోగూడి యనుభవము ఘనీభవించును. ఘనీభవించిన యనుభవము స్మృతిపటలమునం దత్యంతవేగముతో దిరిగి, చిలుకబడి, పలుచనగుచు వెన్నవంటి సుకుమారస్వభావముగల యనుభూతిని బైకిదేల్చును. సామాజికునిజీవితమున కాధార మీ యనుభూతియే! వేడితో సంఘర్షించి వెన్న కరిగిపోవును. కరిగినవెన్న యగు ఘృతము మండెడు మంటను మరీ మండించును. అనుభూతియు నిదేవిధముగా బాహ్యపరిస్థితుల ప్రభావమునకు లోనై, ద్రవీభవించి, సమాజమునం దుజ్వల జ్యోతిని వెలిగించును.

మనుష్యుడు సామాజికజీవి యని, సమాజముయొక్క సంసర్గమునందే తన యనుభవసార మగు యనుభూతిని బొందునని వివరించినాము. ద్రవీభవించిన ఘృతము విశాలముగా బ్రవహింప బ్రయత్నించును. అదేవిధముగా ద్రవీభవించిన యనుభూతి విశాలప్రపంచమునందు వ్యాపింప నుద్యమించును. దీని పర్యవసానమే కళాభివ్యక్తికి ప్రాతిపదిక.

కళాభివ్యక్తి యనేకవిధములుగా నుండును. కాని శబ్దార్థమాధ్యమమునుండి వెలువడు కళయే శ్రేష్ఠమైనదని యంగీకరింపబడినది. దీనినే సాహిత్యమనిరి.

సామాజికజీవి యగువ్యక్తి పొందిన యనుభవసారమగు యనుభూతియే యభివ్యక్తిని బొంది కళగా నావిర్భవించినదని యిప్పటివరకు చర్చించినాము. కళ ముఖ్యముగా రెండువిధములు. ఉపయోగమైన కళలు, లలితకళలు. వడ్రంగము బట్టలనేత బంగారుపుపని మొదలగునవి యుపయోగమైన కళలు. వస్తుకళ, మూర్తికళ, చిత్రకళ, సంగీతకళ, సాహిత్యకళ, లలితకళలకు జెందినవి. మొదటి విధమగు కళలం దుపయోగ మధికముగాను, లలితకళలందు రసాస్వాదన మధికముగా నుండును.

కళాసృష్టి భావప్రపంచమునకు సంబంధించిన దగుటచే,

భావాభివ్యక్తికి మాధ్యమమవసరము. కళయందీమాధ్యమమెంత సున్నితమో, లఘుత్వము గల్గియుండునో కళాసృష్టియు నంతే సుందరముగా నుండును. ఉపయోగమైన కళల యభివ్యక్తికెక్కువ యాధార మవసరము. కాని లలితకళలయభివ్యక్తి కంత యాధార మవసరము లేదు. కావుననే లలితకళలు శ్రేష్ఠమైనవిగా బరిగణింపబడుచున్నవి. వస్తుకళ (భవననిర్మాణము) యందిసుక, సున్నము, ఇటుకరాయి, మొదలగునవి, మూర్తికళయందు రాతిచెక్కడము, చిత్రకళయందు రేఖలు, సంగీతకళయందు స్వరలహరులు, సాహిత్యకళయందు శబ్దార్థములు మాధ్యమములుగా బరిగణింపబడినవి. వీని యాధారమువలననే కళాభివ్యక్తి సాధ్యమగుచున్నది. పైకళలన్నింటిలోనూ కావ్యకళాభివ్యక్తి కాధారమగు శబ్దార్థమాధ్యమ మత్యంతసున్నితమగుటచేత కావ్యకళ శ్రేష్ఠమైనదిగా గుర్తించబడినది.

ఇప్పటివరకు మనుష్యుడు సామాజకజీవి యని, తాను పొందిన యనుభవసారమగు యనుభూతి సామాజిక వాతావరణమునకు సంబంధించినదని, కావుననే కళాకారుడు తన యనుభూతిని బాహ్యప్రపంచమునం దభివ్యక్తపరచి సంతృప్తుడగునని, కళాకారుని పరమలక్ష్య మిదియేయని సంక్షిప్తముగా చర్చించినాము. కావున సామాజిక వాతావరణమునం దావిర్భవించి వికసించిన కళకు జీవితమునకు సంబంధమున్నదా యను ప్రశ్నయే లేదు గాని కళ జీవితమున కెంతవర కుపయోగపడవలయునో దీర్ఘముగా నాలోచించవలసిన విషయము. సామాజిక వాతావరణమునుండి పూర్తిగా వేరై కళాకారుడు జేయున దేమియు లేదు. కళాసృష్టియే జరుగనేరదు. కళాకారుని కళాసృష్టికి సమాజమే కారణమైనందున, సమాజోద్ధరణకును కళాకారుడు కారకుడై యుండవలయును. ఇది కళాకారుని బాధ్యత. కాని కొందరు కళాకారులు, వారిసమర్థకులు పైవాదము నంగీకరింపక, కళ యలౌకికవస్తు వనియు, ప్రపంచముతో దానికి సంబంధము లేదనియు వాదించుట వినుచున్నాము. పైవిషయమునందలి యదార్థమును గ్రహించుటకు యదార్థాదర్శవాదములగూర్చి నేర్చుకొనుట యత్యంతావశ్యకము.

కళాకారుడు వాదోపవాదముల కతీతుడై యుండవలయు ననునది నిర్వివాదాంశము. కాని కళాసృష్టిపై వాదముల ప్రభావము తప్పనిసరిగా నుండును. కళాకారుడు బాహ్యవాతావరణముయొక్క ప్రభావమును గ్రహించినను వాదోపవాదముల ప్రచారకుడు మాత్రము కారాదు. వాదోపవాదముల ప్రచారమున కుద్యమించు కళాకారుడు ఫొటోగ్రాఫరుగా, రాజకీయవేత్తగా మారి కళాసృష్టికి దూరమగును.

యదార్థాదర్శవాదముల మధ్య సమన్వయపద్ధతి యవసరము. రెండునూ పరస్పరము పూరకములు మాత్రమే కావుననే యొక్కటియునూ సంపూర్ణము గాదు. సమాజమునం దున్న విషయముల నున్నటే గ్రహించుట యదార్థవాదమునకు సంబంధించినపని కాని యాదర్శవాదము ననుసరించి యదార్థముగా నున్న విషయమునం దవసరమైన మార్పులు జేసి యుదాత్తజీవితమున కనుగుణముగా కళాసృష్టి జేయవలయును. యదార్థవాదము కాళ్లవంటిది. మరియు నాదర్శవాదము కండ్ల వంటిది. రెండిండిలో నేది లేకున్ననూ మనుష్యునిజీవిత మసంపూర్ణమే యగును. కావున డిపించునది యాదర్శవాదము, నడుచునది యదార్థవాదము. రెండునూ సమానమే యని గ్రహింపవలయును.

కొందరు యదార్థమునే కళాసత్యముగా బరిగణింతురు. కాని యిది నిజము గాదు. ఆదర్శజీవితమున కనుగుణముగా సవరించబడిన యదార్థము కావ్యసత్యము. కళాకారుడీకావ్యసత్యమును తనకళయం దభివ్యక్తపరచి రసాస్వాదనద్వారా పరమానందమును బొందును. కావుననే, కళాకారుడు సత్యమును చిత్తమం దనుభవించి తదనుగుణమగు యనుభూతిద్వారా పొందు పరమానందమును 'సచ్చిదానంద' మందురు. సచ్చిదానందము కళాసృష్టికి మూలాధారము. సత్యము, సుందరము, శివము సచ్చిదానందమునకు సంబంధించినవే. కొందరు కళాకారులు, విమర్శకులు కళయందు సత్యము, సుందరముల యభివ్యక్తి యుండవగును గాని 'శివమును' కళతో ముడిబెట్టరా దందురు. అది యొక ప్రత్యేకసామాజికప్రక్రియ యని వీరియభిప్రాయము. సత్యమే నిజమైన సౌందర్యమని, దానియభివ్యక్తియే లోకకళ్యాణమునకు (శివమునకు) దారితీయు నని వీరు మరచినట్లున్నారు. శివమును పొందుటకు సత్యము, సుందరము సాధనములు. కావు కళాసృష్టియందు శివమునకు స్థాన

ముండరాదనుట వితండవాదము మాత్రమే యని గ్రహింపవలయును. సుందర, సుకుమార పుష్పము ఫలముగా మారినట్లు సుందరము, సత్యము వికాసము బొంది, తుదకు శివ ఫలముగా మారునని దెలిసికొనవలయును. వాస్తవమున కీమూడు (సత్యము, సుందరము, శివము)నూ కళాసృష్టి కుపకరించు సర్వప్రముఖసాధనసంపత్తియే. తద్విధముగానే యదార్థాదర్శవాదముల సమన్వయము సమంజస మని దెలిసికొనుట శ్రేష్ఠకళాకారుల కర్తవ్యము. సమాజ మెట్లున్నదో పరిశీలించి, మంచిచెడులను విభజించి, లోపములను సవరించి, గమనమున కుపకరించుమార్గమును సూచించుచు కళాకారు డెల్లప్పుడు సమాజ మను పడవను భవసాగర మందు నడుపుట కుపయోగపడు చుక్కానివలె నుండవలయును.

కళ కళకోసమే యను వాదమును బరిశీలింతము. ఒక కళాకారునిహృదయమునుండి తిన్నగా నావిర్భవించినకళ సామాజికులహృదయములను గాయపరచి, వశపరచుకొనును. కళాకారునిసార్థకత కిదే నిరూపణము. కళాసృష్టిని బరిశీలించుటకు కళాత్మకహృదయ మవసరము, వైజ్ఞానికునిమస్తిష్క మసంపూర్ణము. శ్రేష్ఠకళాకారులు సృష్టించిన కళ నభివ్యక్తపరచుటకు నితరుల శబ్దార్థములు చాలవు. దీనినే కళ కళకోస మందురు. కళ నర్థము జేసికొనుటకు కళాత్మకహృదయము గావలయు ననియు, కళాకారుని కితరులశబ్దార్థము లసంపూర్ణము లనియు దీనియర్థము. కాని కళ జీవితమునకు గాదని దీని యభిప్రాయము గానేరదు.

కళకు జీవితముతో సంబంధము లేదనుకొందరు మహానుభావులు, కళ నైతికవిలువలకు దూరముగా నుండవలయు నని వాదింతురు. వీరివాదముప్రకారము కళ రసాస్వాదన నిచ్చు సాధనము మాత్రమే. ఇ దెలా సాధ్యము? రసాస్వాదనవిషయమే చర్చింతము. సామాజికునిహృదయము విభావానుభావవ్యభిచారిభావముల సంయోగముచే స్థాయీభావభూమికలను జేరి మధుమతిభూమికయందు సచ్చిదానంద సహోదర మగు కళానందమును బొందును. అట్టి రసాస్వాదఃస్థితియందు సామాజికుడు తనయిహలోకమును మరచి పరలోకసంబంధ మగు పరమానందమును బొందుచు, సర్వమానవసౌభ్రాతృత్వపుస్థితికి జేరును. కాన సామాజికుని యాత్మ పరమాత్మకు దగ్గరగా జేరును. ఆత్మ, పరమాత్మల నొకదరిజేర్చు 'రసాస్వాదనప్రకరణ' మెట్లు నైతికవిలువలకు దూరముగా నుండగలదు? కావున కళలో నీతికి స్థానముండవలయును. ఇందు గమనింపదగిన విశేష మొకటు గలదు. కేవలము నీత్యుపదేశార్థమే కళాసృష్టి నుపయోగించరాదు. కళాకారుడు తనకళాసృష్టి ద్వారా సామాజికున కిచ్చు మహత్తరసందేశము ప్రకారమే తనజీవితమును గూడ సవరించుకొనవలయును. నిజమైన కళాకారునిజీవితమునకు, కళాసృష్టికి వ్యత్యాస ముండరాదు. అట్టికళాకారుడు ధన్యజీవి. కావుననే రామాయణ, భారత, భాగవతాది మహాకావ్యముల సృష్టికర్తలు ప్రముఖకళాకారులుగా బేరెన్నికగనిరి. వాస్తవమున కాదర్శజీవితవిధానముయొక్క పర్యవసానపు టభివ్యక్తియే 'కళాభివ్యక్తి' యని గ్రహింపవలయును. ఈదృష్టితో బరిశీలించినచో మహాత్మాగాంధి, అబ్రహామ్‌లింకన్, కబీరు, వేమన లాంటి శ్రేష్ఠకళాకారులు ప్రపంచమునందురుదు. వారిజీవితవిధానమునందు లేని కళాత్మకప్రవృత్తులు మరెక్కడను లేవని వేరే చెప్పనక్కరలేదు. ఇందువలననే రామకృష్ణులను గొప్పకళాకారు లని భక్తులసామాజికత పదేపదే యుద్ఘాటించినది.

సామాజికవాతావరణమునందు పుట్టి, పెరిగిన కళ జీవితము నభివ్యక్తపరచు ప్రముఖసాధనము. కావుననే 'Art is fundamentally an expression of life through mediums like sculpture, painting music and languags.' అని యనబడుచున్నది.

# యుగకవులు

## శ్రీ కంచర్ల పాండురంగశర్మ



'తిరుపతివేంకటేశు' లని తెన్గుజగాన కవిత్వసస్యముల్
పరచి, యుగోదయోదయప్రభాభవదుజ్జ్వలకావ్యదామముల్
విరియఁగఁ జేయఁ జాలిన వివేకధనుల్ తమపాదపద్మముల్
దరిజనలేని పండితుఁ డుదాహరణింపగ లేఁడు తెన్గునన్.

కొందఱు మీకు శిష్యులరు, కొందఱు శిష్యప్రశిష్యసత్తముల్,
కొందఱు మీయాశ్రయుల్, మరియుఁ, గొందఱు దాసులు, ఏకలవ్యులున్
గొందఱు, మార్గగాములరు కొందఱు, వశ్యులు కొంద, ఱాంధ్రమం
దందఱు నెందఱో గలరు యందఱు తావకశిష్యతుల్యులే!

చూడనికొల్వు లేదు, చవిచూడని కావ్యము లేదు, లేదు మీ
వాడని శబ్దమంజులత, వాఙ్మయవీథుల స్వేచ్ఛమీఱ మీ
రాడని వాగ్వివాదములు, నాశ్రయులై తమశిష్యకోటిలో
గూడనివారు లేరుఁగద! గుర్వులు సర్వతెలుంగుజాతికిన్.

కమ్మదనమ్ము మీమధురకావ్యస్రవంతులగా దఖండవా
క్యమ్ముల ద్యోతమయ్యెడి, నొకానొకసౌరభదివ్యభూతి- చి
త్తమ్ముల హత్త సుందరసితారనినాదమనోజ్ఞరాగముల్
చిమ్మె జగాన- సుకృతవిశేషము మీయవధానభంగిమల్.

ప్రాతపురాణముల్ గని యబద్ధ మసంభవ మంచుఁ బల్కుచున్
బూతులుఁ గూయు కాలమునఁ బ్రోవొనరించి, మథించి, మెట్టు
పూత లలంది సభ్యతను బొందగఁ జేసిన సత్కవీంద్రులా
రా! తగునయ్య! నవ్యకవిబ్రహ్మ లనన్ దశనాటకంబులన్.

శా౦

తుష్టిం బుష్టిని గూర్చు కావ్యముల సందోహంబు రేకెత్తె నా
శిష్టం బౌ యవధానపాండితిని ముంచెన్ దెన్గుమాగాణముల్
ముష్టాముష్టిని వాదముల్ సలిపి సంపూర్ణప్రతాపాఢ్యులై
యష్టైశ్వర్యవిభూతి నందితిరి యాంధ్రం బెల్ల జేజే లనన్.

అందాలు మధురతాస్పందాలు విందు లౌ నవరస శాక్యభూనాథుచరిత
యోగాలు యనుభూతభోగాలు రాగాలు పరిశిష్ట లక్షణాపరిణయమున
భావాలు సంధిప్రభావాలు శ్రావ్యాలు పాండవోద్యోగసంభావనమున
సత్తాలు తావకవిత్తాలు మొత్తాలు రాజసందర్శనరక్తిమమున
భారతంబున కీడగు గీరతంబు
భాగవత మనదగు దేవిభాగవతము
శబ్దవైచిత్రి సుకుమారశయ్యలందు
గణన కీడేరి తెనుఁగుమాగాణమందు?

శతఘంటకవనమ్ము సల్పుటఁ గల్లైనా? అది మంచినీళ్ళప్రాయంబు మీకు!
అష్టావధానమ్ము నాచరించుట యన నల్లేరుపై బండి నడచు మీకు!
ప్రాబంధకల్పన పరిఢవిల్లెన యది కోనగోటిమీటులఁ గూర్చు మీకు!
శాస్త్రచర్చల పోటి సాగించుటా యన అయ్యది పుట్టచెండ్లాట మీకు!
ఎదుట నిల్చియ తీవిగా కదియువాఁడు
మిమ్ముఁ గాదని మెప్పుల మెలఁగువాఁడు
ఆశుకవితాసుధారల నాంధ్రభూమి
నోలలాడించు మొనగాడు నుండు నెచట?

తిరుపతి వేంకటనాథుఁడు ధర నుద్భవమందె ననఁగ త్వాదృశు లగుచున్
తిరుపతి వేంకట కవివరు లిరువురు జన్మించె నౌర! యిల ధన్యముగన్.

తిరుపతి వేంకటనాథుఁడు వరము లవారిగ నిడు నన- ప్రాకృతమూర్తుల్
తిరుపతివేంకటకవితాసరములు వరములు కరములు సరసుల కగుతన్.

# మందాకిని

నీలంపు నికరంపు నీలిమబ్బులనుండి నెలఁదాల్పు నౌదలఁ గులికినావు
పులితోలు వెలిబూదిఁ గలదేవు తలనుండి శీతాద్రిశిఖరాలఁ జేరినావు
తెలికాంతి కులికించు నలహిమగిరినుండి మహికంఠహారమై మసలినావు
కౌమరంపు సౌరుంపు కొండళ్ళు భువినుండి జలరాశిఁగర్భాన తలగినావు

సాగరమునుండి పాతాళలోకమునకు
సురవడిఁ నేగు మిన్నేటియువిద మిన్న!
మంద బృందారు వందారు సుందరాంగి!
కలుషహారిణి! దివ్యగంగాభవాని!

హృదయాహ్లాదకరీ! నమజ్జనమనోభీష్టార్థసంధాయినీ!
మదనారాతిసతీ! జటాతలనటన్మల్లీగుళుచ్ఛాకృతీ!
త్రిదిశాధీశపురీవిహారిణి! మహాదేవీ! జగత్పావనీ!
మధురామోదమరందవాహిని! వధూమందార! మందాకినీ!

# స్వస్తి

## శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి

❈

చిననాటి భావవల్లిని పూచినది, వాడ
నిది, వాసనలు వీడనిది యొకండు
కోరిక నాల్గుదిక్కుల భూభువనమంత
లవలేశమును వదలకయె తిరిగి
ప్రతిగేహదేహళి పద మాగి, ప్రతిహృద
యద్వారతోరణ మ్మట్టె త్రోసి
లోనికిఁజొచ్చి నాలోని స్నేహక్షీర
మొక్కింత యొక్కింత యొలకబోసి
'అనుగుసోదర! మరలిరానా?' యటంచు
సెలవడిగి సాగిపోయెడు చిరపథికుడ
గావలయు నంచు నాశ యాకాశమంత
పటిమ క్షుద్రవిహంగ మిప్పటికి నంతె.

ఘర్మగంగాఝురీ ధర్మగోదావరీ
సిక్తసహజీవనాసక్త భరతభూమి
నొక్కపరి హిమశిఖరి నెక్కి సేతువుదాక
దృక్కు సారించి పూరించి గళకాహళిక.

విధురప్రియశ్రవోవీథుల మంగళ
స్వాదువాక్యమ్ముల నూదగలను
నిలుపగా గలను నిర్ణిద్రదీపావళి
నంధమనోమందిరాంతమున
కర్కశహృదయజాంగలముల శీతల
స్నేహదుగ్ధమ్ము వర్షింపగలను
విరచింపగలను విద్వేష వైతరణికి
నడ్డుగా గాఢ సౌహార్ద సేతు
విటనె నిలిచి, సమస్తదిక్తటుల బిలిచి
సారెసారె జీవత్స్వరస్వతిని మలచి
కవిని నేనై, పురాణవైణవికునటుల
నూహ లున్న, జగమ్మంత స్నేహ మున్న.

ఈనా డీభువి బానిసీడు మరి లే
నేలేదు, ఒక్కొక్క ఫా
లానన్ పావకనేత్ర మున్నది పగ
ల్గాల్పంగ ఒక్కొక్కడెం
దానన్ క్షీరసముద్ర మున్న దవధుల్
దాటంగ ఈమానవుం
డే నిర్మాత విధాత, నేత యిక తా
నే భోక్తలోకమ్మునన్,

నిన్న మొన్నదాక మన్నులో మన్నయి
యున్న ప్రాణశంఖ మొత్తినాడు
మానవుండు, గర్వమాణిక్యకోటీర
ధారి నేడు విజయహారి నేడు.

స్వస్తి జగత్తునకు శ్రీ
రస్తు సదాశాంతిర స్తటంచు వెలయు వి
శ్వస్తుతభారతవాణిసు
మ స్తబకమువోలె లోకమ స్తకముపయిన్.

# భక్తి గేయములు

అవని అంతా పెద్ద అక్షయపాత్ర
అఖిలేశుహస్తమే అన్నపూర్ణమ్మ
ఆరిపోవనిది నాఆకలే యైతే
అంతుదొరకనిది ఆయమృతాబ్ధి కాదా
అన్నమో అమృతమో ఆకొన్న పేదకో
కన్నతల్లీ! బ్రతుకునిండ భిక్షాం దేహి!

గుడిసెలో, గుడులలో, గునుకు బిచ్చగాడు
వాడవాడల దిరుగు వాడె యిచ్చువాడు!
పిలువవచ్చినవేళ తలుపు తీయని నాకు
అంతరాంతరములో నవతువా యేమొ!
అమ్మవో అతిథివో ఆకొన్న పేదకో
కన్నతల్లీ! బ్రతుకు నిండ భిక్షాం దేహి!

ఆవాడ నీవాడ నాయింట నీయింట
నఖిలేశుహృదయయే అన్నపూర్ణమ్మ
ప్రతినవ్వు పులకించు పండుపున్నమి యైతె
ప్రతిగుండె పులకించు పాల్కడలి కాలేద!
కరుణకో వలపుకో ఆకొన్న పేదకో
కన్నతల్లీ! కన్నతల్లి! భిక్షాం దేహి!

* * *

నాకేల నౌకజోలె
నాలో నమృతవీణ
ఉంచి నను లెమ్మందువా?
దేవ!
ఊరికే పొమ్మందువా?
నాలుగూ దిక్కులా
నడిమి స్వర్గమ్ములో
ప్రతియింటిమోసాల నాగనా!
దేవ!
ప్రతిగుండెమోసాల మ్రోగనా!!

పాడిపాడీ నృత్య
మాడియాడీ నిన్ను
వేడివేడీ పొరలనా!
ప్రతిగుండె
తోడఁగూడీ తరలనా!
నాలుగూ దిక్కులా
నడిమి స్వర్గ మ్మంత
గంధర్వసీమగాఁ జేయనా!
దేవ!
గానసౌధమ్ముగాఁ జేయనా!!

విరిసివిరిసీ తేనె
కురిసికురిసీ, దెసల
దరిసిదరిసీ పొరలనా!
ప్రతిగుండె
నొరసి యొరసీ తరలనా!!
నాలుగూ దిక్కులా
నడిమిస్వర్గ మ్మంత
పూలపందిరిఁ జేయనా!
దేవ
బృందావనముఁ జేయనా!

తేలితేలీ అలల
తూలితూలీ, చదల
సోలిసోలీ పొరలనా
ప్రతిగుండె

శాంతి

మాలలల్లీ తరలనా!!
నాలుగూ దిక్కులా
నడిమి స్వర్గ మ్మంత
పాలకడలిగఁ జేయనా!!
దేవ!
పండుపున్నమి జేయనా!!

తలపు తలపూ జ్యోతి
పలుకుపలుకూ గీతి
పనులన్ని ప్రణయముగఁ జేయనా!!
దేవ!
ప్రతిగుండె నీగాథ బోయనా!!
నాలుగూ దిక్కులా
నడిమిస్వర్గ మ్మంత
మూలమూలల నడతునా!!
నాదేవ!
వేలవేలల విడుతునా?

న న్నొక్క జోలెగా
న న్నమృతవీణగా
తడయ కిక రమ్మందువా?
ప్రతిగుండె
విడియగా తెమ్మందువా?
నాలుగూ దిక్కులా
నడిమిస్వర్గమ్ముతో
గంగలా కడలిలో దూకనా
దేవ!
పొంగుతూ అడుగులా తాకనా!.

* * *

నానోట నీమాట గాన మయ్యేవేళ
నాగుండె నీవుండి మ్రోగింపవా వీణ
రాగమెరుగని వీణ రక్తి నెరుగని వీణ
తీగప్తై నీచేయి తీయకే గడెయేని.

అంతరాంతము నీఅమృతవీణే యైన
మాట కీర్తన మౌను మనికి నర్తన మౌను
ఈయనంతపథాన నేచోటి కాచోటు
నీయాలయ మ్మౌను నీ యోలగ మ్మౌను.

అడుగడుగునకు స్వామి అడుగుసవ్వడి వినిన
ఎడద లోలోన ఎల్లెడల విశ్వములోన
ఈయాత్ర ముగియునో ఏవేల దిగుదునో
హాయిగా చల్లగా సాగిపోవుదు నంతె.

దేవదేవా! మహాదేవ! లోకేశ్వరా!
దీనబంధూ! దయాసింధు! ప్రాణేశ్వరా!
గడెయేని నీవియోగము సహింపగలేను
విడిపోని నీ చెల్మి విధ మేమొ సెలవిమ్ము.

# పద్యావళి

నిఖిలరాజేంద్రమకుటమాణిక్యఘృణుల
పరమయోగీంద్రవీక్షణోజ్జ్వలనమణుల
నీపదము రంజిత మ్మేమొ! నీగళమ్ము
దీనతృణపుష్పమాలికాధీన మోయి.

విగతభూషుడవో! దీనవేషివో! అ
నంతతారాసుధాంశుమార్తాండకిరణ
కటకచరణుడవో నను గన్నతండ్రి
వో! ఇ కెవ్వరవో అందవోయి! నాకు.

ఈయహంకార మెంతటిదోయి దేవ!
నీపదనఖమ్ములకు దిగనేర నేను;
ఈయశక్తి నా దెంతటి దోయి దేవ!
నీ దయాంకమ్మునకు లేవనేర నేను.

దూరదూరాల ప్రాంగణతోరణాల
గాఢలజ్జాభరాల సంక్రాంతి వచ్చి
నిలిచి యున్నాను నా నీడ నేనె యొదిగి
ప్రాణనాయకు మంగళాహ్వానమునకు,

కడుగవా? దేవ! అక్షయకరుణధార
ఖిన్నజీవమ్ము; కర్దమాంకితము దీని;
ప్రత్యుషస్స్నిషమాహిమప్లావితమ్ము
పారిజాతమ్ము కాదు నీపాదపీఠి.

ఆరని గాంగ జీవఝరు
లై త్వదుదారదయాపయస్వినుల్
పారు నెడారిజీవితము
లన్ ఫలియించును దేవ! స్వర్ణకే
దారసజీవభాగ్యము; ని
తాంతానిశీథమునన్ జలించువా
రారయనేర కోరిచి స
మగ్రము యుష్మదనుగ్రహప్రభన్,

*  *  *

నావలెనె యాత డున్మత్తభావశాలి
ఆగికోలేడు రేగు నూహల నొకింత
ఎట్టి నిశినే నదరిపోవు నెగసిపడును
ఎన్నిచుక్కలపాటు లెన్నెన్ని మెరపులు!

ఇంత చిరుగీతి యెద వేగిరించు నేని
పాడుకొనును తాండవనృత్య మాడుకొనును
మస్తక మ్మొరగా వంచి మన్ను మిన్ను
వేయికేలాడగా వ్రాసివేసికొనును.

ఏ నెరుంగుదు నావలెనే యతండు
పాటపదషములకై నిత్యపథికు డయ్యె
ఏ నెరుంగుదు నావలెనే యతండు
ప్రతిపదమ్మున శీతలస్వాదుమధుతు
షారముల పార్శ్వముల విరజల్లు చేగు

*

అవధరింతువు ప్రతిదిసాంతమంచు
నిత్యనూతనతాండవనృత్యకేళి
ఓయి నటరాజ! తలలైన నూపలేక
భువనములు దుర్భరానందమున నడంగ!

అప్పు డూహాంచలమ్ముల నతిశయించి
పొరలు నమృతరసంపుమాధురులలోనఁ
గొట్టుకొనిపోవు స్వామి నాక్షుద్రజీవి
తమ్ముగూడ దారియెలేక తనివిపోక.

అంత నే వెఱ్ఱి నైపోదునయ్య నిన్ను
బోలి పాడఁబోవుదు నిన్నుబోలి నాట్య
మాడఁబోవుదు లజ్జఁబోనాడి; కాక
యింతదాహమ్ము దహియింప నెట్లు మనుదు,
ఏవిధాన సౌందర్యరసైకజీవి
నిలువనేరుతు నిట నొక్క నిముస మేని
మామకీనజీవితశూన్యమార్గముల త్వ
దీయపాదమంజీరముల్ మ్రోయకుండ.

ఆటతో పాటతో నేర్చినట్లు దేవ!
ఏనుగూడ నీవలె నటియింపనిమ్ము
ఎడతెగని యాత్ర నెట్లొ సాగించివరకు
ఎట్లొ నీదర్శనమ్ము సాధించువరకు

# సారంగు తమ్మయ - గీర్వాణభాషా సేవ

శ్రీ బి. రామరాజు



వైజయంతీవిలాసమను వైష్ణవప్రబంధమును రచించిన సారంగుతమ్మయకాలమునుగూర్చి భిన్నాభిప్రాయములు గలవు. ఆతని కాలమునుగూర్చి యూహించుటకు తోడ్పడు రెండుపద్యములు వైజయంతీవిలాసమున నున్నవి. వానిలో మొదటిది గురుస్తుతిసందర్భమున గల పద్యము.

"వందారుదాసజనతా
మందారున్ వేదశాస్త్రమహితప్రజ్ఞా
బృందారకగురు మద్గురు
కందాళప్పలగురున్ జగద్ధితు గొలుతున్"
(I—11)

రెండవది ప్రభుస్తుతిసందర్భమున గల పద్యము.

"ఇనసమతేజులౌ నృపుల
నెల్ల మహమ్మదుషాహి యేలు నీ
యెనుబదినాల్గుదుర్గముల
నేలిన యేలిక గోలకొండ త
ద్ఘననగరస్థలిన్ గరణి
కం బొనరించెడు తమ్మమంత్రి యా
జనపతి రమ్ము పొమ్మన ప్ర
జల్ జయవెట్ట గృహస్థులౌననన్" (I–30 ప)

ఈపద్యము లాధారముగా కీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమ్మయమంత్రి గోల్కొండరాజ్యము నేలిన కుతుబ్‌షాహీవంశమునం దైదవవా డగు మహమ్మద్‌ఖులీ ఖుతుబ్‌షా కాలమువా డనిరి.[1]

పైవానిలో మొదటిపద్యమున పేర్కొనబడిన తమ్మమంత్రిగురు వగు కందాళఅప్పళాచార్యులును తెనాలి రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యమునకు కృతిభర్త యగు విరూరివేదాద్రిమంత్రికి గురువగు కందాళఅప్పళాచార్యులును నభిన్నులనియు గాన తమ్మయమంత్రి తెనాలిరామకృష్ణునకు సమకాలీను డనియు వీరేశలింగంపంతులుగారి యభిప్రాయము. ఈయభిప్రాయమునకు భిన్నముగా క్రీ. శే. చాగంటి శేషయ్యగారు విరూరివేదాద్రిమంత్రికి గురువైన కందాళ అప్పళాచార్యుల తాత మరొక కందాళ అప్పళాచార్యులు సారంగుతమ్మయకు గురువనియు, రెండవపద్యమున గల మహమ్మదుషాహి కుతుబ్‌షాహివంశమునందలి ఖులీకుతుబ్‌షా కాదనియు అతడు బహుమనీసుల్తానులందు చివరివా డగు మహమ్మదుషా (1481-1518ఎ. డి.) యనియు సోపపత్తికముగా వాదించి వైజయంతీవిలాసప్రబంధరచనము క్రీ. శ. 1510 ప్రాంతమునందు జరిగినట్లు సిద్ధాంతీకరించిరి.[2]

చాగంటివారు చూపిన యుపపత్తు లన్నియు సమంజసముగానే యున్నవి కాని సుల్తాను సారంగతమ్మయను "రమ్ము పొమ్మని" యాదరించెడివాడట! రమ్ము పొమ్మను నంతటి యాదరమును జూపుట దూరస్థు డగు, బహ్మనీ సుల్తానున కన్వయించుటకన్న సమీపస్థుడగు 'కుతుబ్‌షాహి' సుల్తానున కన్వయించుట మేలుతరముగా నుండును. మీదుమిక్కిలి చాగంటివారు చెప్పెడి బహమనీసుల్తాను ఆవంశములో చివరివాడు. ఆతని కాలముననే బహమనీరాజ్య మంతరించెను. కనుక నాతడు "ఎనుబదినాల్గుదుర్గముల

1. ఆంధ్రకవులచరిత్రము - 2వ భాగము. పు. 204 (1949)

2. ఆంధ్రకవితరంగిణి. 8వ సంపుటము. పు 53-56, (1951)

"నేలిన యేలిక" యగుట పొసగదు. కాని కందాళె అప్పలా చార్యులగూర్చి చాగంటివారు చూపిన యుపపత్తులే సమంజసముగా నున్నవి. చిత్రభారతమున పేర్కొనబడిన కందాళప్పగురువే వైజయంతీవిలాసమున పేర్కొనబడిన కందాళప్పగురువని యూహించుటకు ఓరుగల్లు, గోల్కొండ పట్టణముల సామీప్యముగూడ కొంత తోడ్పడుచున్నది. ఐనను ఈవిషయ మింకను పరిశీలింపవలసియున్నది.

సారంగు తమ్మయ గోల్కొండనగరమునకు కరణ మను మాట సత్యము. కరణ మనగా సామాన్యగ్రామకరణము కాదు. నగరమునకు కరణ మనగా మంత్రిత్వమంతటి పని. నేటి 'మేయరు'పదవి వంటి దానాటి నగరకరణీకము. కనుక సుల్తాన్ 'రమ్మ పొమ్మ'ని యాదరించెడువాడు. ప్రజ లాతని వైభవమునకు 'జయ' వెట్టుచుండిరి. గృహస్థు లాతని మెచ్చుచుండిరి. ఇట్టి సారంగుతమ్మయ తెలుగుకవిగా మాత్రము మన కింతవఱకు పరిచితుడు. కాని యాతడు గీర్వాణవాణికిగూడ కైసేతలు చేసినవాడని తెలుపుటయే నాయుద్దేశము.

సారంగు తమ్మయ విశిష్టాద్వైతమతానుయాయియనియు "పరిచిత భగవద్భాగవత కైంకర్య విధానుః" డనియు వైజయంతీవిలాస సాశ్వాసాంతగద్యములు చాటుచున్నవి.[3] ఏవంవిధగుణవిశిష్టుడు గనుకనే సారంగుతమ్మయి నారదీయపురాణాంతర్గతమగు హరిభక్తిసుధోదయమునకు సంస్కృతమున వ్యాఖ్యానము రచించెను. ఈవ్యాఖ్యానమునకు భక్తిసంజీవని యని పేరు. ఇది యిరువది యధ్యాయముల గ్రంథము. అధ్యాయాంతమున గల గద్య ఈక్రిందివిధమున నున్నది.

"ఇతి సారంగతమ్మప్రభుణా విరచితాయాం హరిభక్తిసుధోదయటీకాయాం భక్తిసంజీవన్యాఖ్యాయాం ప్రథమోధ్యాయః." పైగద్యమున సారంగు తమ్మయ తన్ను ప్రభువుగా జెప్పికొనినాడు. మంత్రికులమున బుట్టిన పెద్ద కరణము సుల్తానులు 'రమ్మపొమ్మ'ని యొసర్చిన యాదరమున దానుగూడ స్వయముగా ప్రభువైన పిమ్మట నీవ్యాఖ్యానమును వ్రాసియుండును. అనగా వైజయంతీవిలాస ప్రబంధరచనము తరువాతనే 'భక్తిసంజీవని' రచన జరిగియుండును. వైజయింతీవిలాసము శ్రీరామచంద్రున కంకితము. శ్రీరామచంద్రుడు సారంగతమ్మయ కిలువేల్పు. ఆ శ్రీరామచంద్రప్రభువును తమ్మయ తనవ్యాఖ్యారంభమున నిట్లు స్తుతించినాడు.

"శ్రీరామచంద్ర స్స తనోతు లక్ష్మీం
శ్రీలక్ష్మణాలంకృతదివ్యమూర్తిః
యద్దర్శనా ద్దుఃఖ మపాస్య సర్వం
సద్యఃపరానంద ముపైతి లోకః"

దీనితరువాత మఱిరెండు శ్లోకము లున్నవి. వానిలో తమ్మయ తననుగూర్చియు, తనప్రయత్నమును గూర్చియు, తెలిపినాడు.

"యస్యౌదార్యమివా కలయ్య సతతం
కుర్వ న్నివాసం దివి
స్వర్ధేనుప్రముఖావదాన్యమణయో
ప్యద్యాపి నేహాగతాః,
శ్లాఘ్యస్సాధుగుణా బుధజనై
ర్భాగీరథీపట్టణే
సోఽయం మంత్రిధురంధరో విజయతే
సారంగుతమ్మప్రభుః."

"తేనేయం క్రియతే
హరిభక్తిసుధోదయే,
భక్తిసంజీవనీనామ్నా,
విద్వత్సంతోషకారిణీ"

పైశ్లోకములవలన సారంగుతమ్మయ 'మంత్రిధురంధరుం' డనియు, 'ప్రభు' వనియు తెలియుటేగాక గోల్కొండ పట్టణమునకు 'భాగీరథీపట్టణ' మని మఱియొక పేరుగూడ యున్నట్లు తెలియుచున్నది.

హైదరాబాదునగరమునకు 'భాగ్యనగర'మని పేరుండి

3. కీ. శే. వీరేశలింగంపంతులుగారు సారంగుతమ్మ యను 'మాధ్వమతానుయాయి' యనిరి.

పట్టణము అది సుల్తాన్ మహమ్మద్ ఖులీకుతుబ్‌షా ప్రియురాలికొరకు నిర్మింపబడినదని యొకయైతిహ్యమున్నది. కొందరిది సత్యమనియు మరికొందరిది కట్టుకథ యనియు వాకొనుచున్నారు.

సారంగు తమ్మయ మహమ్మద్ ఖులీ కుతుబ్‌షాకన్న పూర్వుడని భావించినచో నిజమునకీకథకు కాళ్ళు లేవని పైశ్లోకము ఋజువుచేయుచున్నది. 'భాగీరథీపట్టణమే' భాగ్యనగరముగా మారెనని భావింపవలయును. ఒకవేళ సారంగుతమ్మయ ఖులీకుతుబ్‌షాకాలము (1580–1612) వాడే యని నిశ్చయమైనను నాతని ప్రియురాలు భాగామతి పేరుతో నేర్పడిన పట్టణము భాగీరథీపట్టణము కాజాలదుగదా! ఒకవేళ పూర్వము భాగీరథీనామముతో నుండిన పట్టణమే సుల్తాను భాగామతి పేరుతో భాగ్యనగరముగా మార్చెనో తెలియరాదు. భాగీరథినిగూర్చి మరియొక విశేషము. సుల్తాన్ మహమ్మద్ ఖులీకుతుబ్‌షా భాగీరథి యను హైందవస్త్రీవలన (1565) జన్మించినట్లొకఐతిహ్యమున్నది.[4]

ఒకవేళ ఈభాగీరథి యనుపేరుతోడనే భాగరథీపట్టణమనుపేరు ~~కలిగినచో~~ సారంగుతమ్మయకాలము మరికొంత ముందునకు పోవును. హరిభక్తిసుధోదయ వ్యాఖ్యానకారుడగు సారంగుతమ్మయ తనతండ్రితాతలనుగూర్చి యేమియు చెప్పుకొనలేదు. వైజయంతీవిలాసప్రబంధకర్త తాత మరియొక సారంగుతమ్మయ ఈ వ్యాఖ్యానరచయిత కాగూడదా యన్నచో భాగరథీపట్టణవృత్తాంతము మరికొంత ప్రాచీన మగును. తాతగారిట్టి గొప్పపురాణమునకు అందులో తనమతమునకు సంబంధించినదానికి వ్యాఖ్య వ్రాసియుండగా వైజయంతీవిలాసకర్త దానిని స్మరింపకుండునా! కనుక నీయిరువురు తమ్మయ లభిన్నులనియే భావింపవలయును. మీదుమిక్కిలి వైజయంతీవిలాసకర్త తాను 'పరిచితభగవద్భాగవతకైంకర్య విధాను'డనని కంఠోక్తిగా చెప్పుకొనుటచే హరిభక్తిసుధోదయమునకు [ప్రహ్లాదాదిభాగవతులచరిత్రమునకు] భక్తిసంజీవనీటీకను గూర్చినవాడతడే యని మన మనుకొనవలెను. ఈయముద్రితకృతికి తాళపత్రప్రతి యుస్మానియావిశ్వవిద్యాలయము సంస్కృతఅకాడమిలో నున్నది. దీనివైశిష్ట్యమునుగూర్చి కాలాంతరమున నివేదింతును.[5]

4. 'History of Golconda' by Abdul Majeed Siddiqui – Page 88 (1956)

~~5. సంస్కృతఅకాడమి అధికారులకు ప్రత్యేకముగా 'డాక్టరు' శ్రీ ఆర్యేంద్రశర్మగారికి కృతజ్ఞుడను.~~

5. "నేను సంపాదించిన "ఖుతుబ్‌షాహీ సుల్తానులు – ఆంధ్ర సంస్కృతి" లో "భాగీరథీ పట్టణము – భాగ్యనగరము" చూడదగు (196

# అనుకూల దాంపత్యము

శ్రీ బుద్ధవరపు మహాదేవుఁడు



## తరుణి

ఉదితమహావినిర్మలగుణోన్నతులం బరిపూర్ణతాప్తులన్
సదవనదీక్షుల న్వెలయ శార్ఙ్గిపదుం డను దివ్యమూర్తికిన్
త్రిదశజనాధినాథకరదీప్రధనుర్గతచారువర్ణభా
స్వదమలమంజుకుంజవనసస్యముల న్వెలిపెంపుతో, నదీ
నదము లటన్న క్రొన్నెరుల నాణెపుసొంపులతో. శుకీఝరీ
మృదునినదమ్ముల న్పలుకుమేలిబెడంగులతో, ననర్ఘర
త్నదళనులన్విభూషణకదంబముతో, సుహృదాత్తసుస్మితో,
ద్యదఖిలచారుతానివహతాండవ మన్ దగులేతనవ్వుతో,
నదనగు వేళకై యరసి యల్ల లతాంగి కనుంగొనంగ లో
న, దిఫురు ముద్దరాండ్రవలె నవ్యవినోదము గూర్చు మొగ్గలన్
రదనపుజాలుతో, సతతరమ్యరమానిలయంబు నైన యా
పదియునునాఱువర్షముల ప్రన్నని క్రొన్నగ వొప్పు కన్నె దా
వదనముబోలె నెప్డు జనపాలురఁ డెందము లూటలూర స
మ్మద మొనఁగూర్పఁజాలు ముఖమోహనసంపదతో విలాసముల్
గదురగ నొప్పు నిప్పుడమికన్నెకు నున్నునువన్నె మీఱఁగా
నెదఁ బలుగోర్కె లూరఁ బ్రభవించిన రాగలతావితానమ
భ్యుదయము సెంది నద్దెసల ముప్పిరిగా నెగఁబ్రాకి పూచి యొ
ప్పిదముగ సౌరభంబులను వేమఱు గూర్చి పరస్పరంబు తత్
హృదయము లత్తియుండ సవరించి కరంచి విరించికన్న మేల్
పదనగు బుద్ధివైభవములం గుదియించి యశేషలోకమే

సదనమునందు నున్న మరి జంపతు లుండని తావు లేనటుల్
ముదలనొసంగి జంటలకు ముచ్చటకైన దొసంగు లొందకుం
డ దగు నుపాయసంపద లనంతముగా ఘటియించి ప్రేమలో
మది నలరించి ప్రోచును నమో నమ యంచును బ్రస్తుతింతు స్వ
ర్గద మని సర్వదా వినుతికై యమరించెద నంజలిన్ శుభ
ప్రద మని కేలుమోడ్తు ననురాగము భోగము దక్కువైన యా
మదవతు లెట్టిరైన నొకమాదిరి నాకు సమాన మౌదు రే?
చదువులసాని యెప్డు మొగసాలనె యుండు నటంచు బ్రేమలే
కుదురవు దానిపైఁ బతికి గోవిదుడైనను నేమి ఛాందసుం
డదిర యటంచు వానిపయి నాదరణం బొనరింప దామె; క
ట్టుదొరకు బుట్టెనంచు నొకటొం కచలాత్మజపై మహేశ్వరుం
డదుకును; దానికిం గనలి యాదిమభిక్షువు కంటె కొంతమే
ల్గద తనతండ్రియంచనును గౌరియు దానికి నట్టె యుగ్రుడై
పదపద యెందునైనను దపంబున కేగెద వేగలేను నీ
యెదుట నటంచు ముక్కు బిగియించును నాతఁడు నంత దీనుడై
సదయ యి దేటికోప మని చాగిలిమ్రొక్కి శమింపఁజేయు ని
ట్టిదికద దంపతీసుఖము నిర్వురు వీరికి నింక లచ్చిమా
ట దలపనేల చంచల కటా! యని మూల్గును భర్తకొంత, నే
నిది యది చెప్ప నేల నిలువెల్లను మాయలు నమ్మువారినే
మొదలికి మోసగించి భవముల్ హరియించు నటంచు వెన్నుపై
యొదవ నమానబుద్ధులు పయోనిధికన్నెకు; దక్కువారలఁ
బెదవికి తెచ్చుటేల నిరుపేదయ కాని ధనాఢ్య కాని తా
జదువుల నేర్చికాని యవి సాగకయుండిన కాని లోకసం
విదితకులంబునందు బ్రభవించిన కాని యవిశ్రుతాన్వయా
స్పదయయి కాని తాను తనభర్తయు శీలమునందు రూపునన్
హృదయవిలాససంపదల నేయెడ భేదములేక యొక్కటై
పొదలుచు నర్థముం బలుకుపోలిక ద్రవ్యగుణాలపోలికన్

వదలక యొండు నొక్కఁగును వర్థిలఁగావలె సార్వకాలమున్
బదిలముతాఁచు దంపతులభావము లెల్లెడ వర్థిలన్వలెన్
చదలును భూలతాంగివలె జాయయు భర్త సుఖింపఁగావలెన్
ముదమున మమ్ముఁబోలుచు నమోఽస్తనురాగమటంచు నేను గో
ల్చెద నవదంపతీహృదయసీమ వెలింగెడి నవ్యతేజు, దు
ర్హృదయతమోపహారి సుకవీశ్వరవాక్పటు తేజు నిచ్చలున్
చదరుల కేగి యందు మన శాసనకర్తలు భర్తపీడగా
సుదతికి స్వత్వముండుటకు జొప్పడ నెంచెను శాసనాలకుఁ
బద మొకయింత గల్గక శుభవ్రతము ల్పచరించి మించు నా
ముదితలచిత్తవృత్తులను ముత్తెసరి న్ననుపట్టుదారమ
ట్లొదిగి చరించునట్టి పురుషోత్తము సచ్చరితంబు నెన్నెదన్.

## తరుణుడు

సకలాజాండప్రవృత్తికర్తయు నవస్థాభేదప్రత్యక్షసా
క్షికళాసోముఁడు, దీప్తిధాముఁడు లసద్గీస్తోత్రపాత్రుండు, నీ
ముకురాంతఃప్రతిబింబితైకసుషమాప్రోజ్జ్వల్యకల్యుండు, గే
హాకృతానంతశరీరధీరుఁడు, సదాహారివ్రతాచారసా
రకనిశ్రేష్ఠుఁడు, భోగ్యభాగ్యచయసామ్రాజ్యాభిషిక్తుండు, హ్రా
స్నికపాంభోదసువర్ణమానితతటిన్నిష్ణాతరోచిష్ణుఁడుఁ
బ్రకటాహంపదవాచ్యుఁడై యెపుడు నే రంజిల్లుదున్ వ్యావహా
రికకాలంబున; కూఁకటు ల్గొలిచి నారీరత్న మిచ్ఛాభిధన్.
సుకులోత్పన్నసమానరూపగుణసంశుద్ధాత్మభర్తృవ్రతన్
చికిలిం బట్టిన భావజాస్త్ర మనగా జెల్వొందు మేల్కన్నె స
న్నికటంబందున నిల్చి దాని నను బాణిం బట్టఁగాఁ జేసి నే
ర్పుకొలంది న్మదదృష్టరేఖ యను నాముత్తైదు చిన్నప్పుడే
యకలంకంబయి యొప్పు నామిథునమన్యోన్యప్రియం బాచు; పా
యక నాకైయఖిలంబు గూర్చికొని మోదాబ్ధి న్సుధావీచికా

నికరంబందున నూగు నుయ్యెలల నెందేన్ దా విలాసంబుకై
సుకమున్ గోర విహారము ల్సలుపు నాచొప్పెల్ల యుల్లంబు మ
చ్చికతో నాపయి నుంచి నన్ను కడు రంజింపంగ నే కాని వే
రొక కార్యంపుభరమ్ము దీర్పుటకు కా దొక్కప్డు డెవ్వారిని
చ్చకము ల్మీర నుతించి గొల్చిన మదాజ్ఞ న్మౌళిపై దాల్చి నన్
సుకృతిం జేయగ బూనియే సుగుణు ద్వేష్యుంగా గ్రహింపంగ బల్
వికృతిం జేసిన దాన నాకు పరితృప్తిం జేసి మెప్పొందు కో
రిక డెందం బలరించి మించుట నె చెల్మి న్నెచ్చెలుల్ పుత్రపు
త్రికులంబుల్ ప్రియ మొప్ప గూర్చుటది నుచ్చేతోధికప్రీతికై
యిక జన్మించిన డాదిగా నెపుడు దా నెన్నెన్ని కృత్యంబు లో
పికమై జేయగ జాలియుంట నది యావిన్నాణపుం దొయ్యలిం
చుక సాయం బొనరింపకున్న నగునే చొక్కంపు మేల్తావిగం
ధకలాపంబుల నాలతాంగి నను చెంతం జేర సేవింపకుం
డక యేలాగు భుజింప నౌను? నొకమాటం బల్కగా నౌనె? యా
శుకవాణీదయ దప్పియుండు నెడలన్ శూన్యం బమాన్యంబు గా
దొకొ లోకం బిదియెల్ల నల్ల మును నీయొయ్యారిచేయంటిము
ట్టక యున్నట్టితరిన్ వనిన్ నగరివాడ న్మేడ నెందైన నా
చకితాంచన్మృగశాబకాక్షి సుకటాక్షం బింత సాధించి కాం
చక యున్నన్ నిలువంగ శక్యమె నిమేషంబైన నాకు న్వినో
దకరంబే దివిజేంద్రనందనవనీ తారుణ్యకల్పావనీ
జకదంబాంతవిహారలీలలు మదిచ్ఛాభామినీవామహ
స్తకరాంగుళ్యభిరామసీమలను మచ్చంచత్కరాగ్రంబులన్
సుకుమారంబుగ బట్ట గ్రుమ్మరనిచో సొం పౌనొకో వీనుదో
యికి మాకందనవీనకందళరసాహీనప్రభావోల్లస
త్పికగానం బసమానమాధురధురావిన్యాససంపత్తిం గా
తుక మొప్పం జెలిచెంత జేరి బలుమంతుల్ చెప్పకున్నప్డు డె
న్నిక గన్నట్టి భవంబు లందితినయేనిన్ హీనపుంజాతిపు

ట్టుకలం బొందిన యేని న న్విఁడువ కెప్డున్ సాహచర్యంబుఁబొం
ది కడున్ సేవలొనర్చి మించు వరసాధ్వీలోకరత్నంబు నా
మకుటాంతర్మణిమాల శీలయుతదాంపత్యానుకూలాలలా
మ కుసుంభారుణరాగసర్వజనసంభావ్యాశిరోరత్న మో
పికరం బెట్టినపేరు ప్రేమలతకున్ వేతావులం బ్రాక తీ
ర్చి కరంబొప్పు సుమాంగి మేల్కరము నర్వెం బెక్కు లేం డ్లున్న వా
ర్థకమున్ బాపెడు సాధుసౌధగుళికారాజంబు కష్టంబు లెం
తకు గావించిన నిష్టవృత్తి గను ధన్యాదేవి భూదేవి యి
చ్చకు సా పెన్వరు లేరు నారు లిల నిచ్చాకాంత కేశూర్మి నో
యిక రా ధన్యతముండనై తి నిదిపాటింపన్ గదా దంపతీ
ప్రకరంబు ల్నముబోలి సౌఖ్యయుతులై బాలేందుడుం దత్కళా
వికచత్కైరవపత్రనేత్రయు బలెన్ వేనోళ్ళ శ్లాఘించు కీ
ర్తికి దానం బయి వేయివత్సరములున్ దీపించి వర్థిల్లుతన్.

## తరుణి

ఎన్నో భంగుల సృష్టి సల్పుటకునై యెట్టెట్టొ బీజంబులన్
మున్నే యెప్పటికప్డె భద్రపరిచెంబో యాపయోజోద్భవుం
డున్నే యొక్కనిబోలి యొక్కరుఁడు భావోద్వృత్తి మున్నాదిగా
నన్నింటిన్ సరిపోయి యావనము భోగాశాతవిస్ఫూర్తి సం
పన్నంబౌఁ గద; మేము నిర్భరము కామా! కామసంతృప్తిగా
జెన్నౌ ముచ్చటలం జెలంగగ వయశ్శ్రీమంతులౌవారు ము
న్నన్నా! ఈతఁడు దాపరించె నిఁక నేమందున్ విధిన్? హాయిచూ
విన్నాణంబుగ కేలువట్టి యిటు రావే యంచు పైలాగుటో
సన్నంపున్ విరిజాజిపూసరము భాస్వత్కైశ్యమం దుంచుటో,
చిన్నెల్ వన్నెలునుం జెలంగ నునుపౌ జెక్కిళ్ళ గోర్మీటుటో,
కన్నుంగ్రేవల వింతకాంతు లలరంగన్ జూచి ప్రేరేపుటో,
సన్నన్ రమ్మని పిల్చి కౌఁగిలిడి స్వేచ్ఛన్ భల్మి ముద్దాడుటో.

స్నన్ బోలి కరుంగు డెందమును నువ్విళ్ళూరగా జేయుటో,
ఖిన్నన్ జక్కిలిగింత పెట్టు మది కోర్కెల్ మీర నవ్వించుటో,
స్విన్నన్ జేతిరుమాలుచే విసరుచున్ చెమ్మంట పోనార్చుటో,
విన్నన్ మారునిమంత్రమో యన చెవిన్ వే ముచ్చటల్ బల్కుటో,
మన్నింపన్ దగు కావ్యకల్పనల ప్రేమల్ చెప్పి విన్పించుటో,
హృన్నీరేజవికాసమున్ గని వినోదేచ్ఛన్ ప్రవర్తిల్లుటో,
సున్నల్ పీని యెడన్ దలంపఁగఁ ద్రపాక్షుబ్ధాత్ముఁ డౌనేమొ? కా,
కున్నం జేష్టలు గల్గు నాకొక్క యివి? కాఁడో విద్యలన్ బెద్ద రా
గౌన్నత్యంబు కొరంత లేదు; మృదువే యా నంతరంగంబు స
త్సాన్నిధ్యంబున సంతతంబు మెలఁగున్; సంతోషవిఘ్నంబు లౌ.
బన్నంబుల్ బడియుండఁ డెన్నఁడు: మదిన్ భావింపఁ డన్యాంగనన్,
గన్నన్ సద్గుణపుంజమంజులలసత్కళ్యాణుఁడే యైన నా
హృన్నాళీక మదేమొ యీశుచిరుచిన్ ప్రేమింపలే కుండెడున్,
నన్నుం జుల్కనజూచి క్రించువెలచానన్ బోలె బాహుద్వయిన్,
చిన్నంబుచ్చక గ్రుచ్చి కౌఁగిలిడరా జిత్తేశయం చంచునో,
పన్నీ రత్తరు గంధముల్ విడెము నే బల్మార పల్బల్మిమై
మన్నాథా! గొనుమంచు నిల్చి యటపైప మానంబు పోఁజూతునో,
చిన్నల్ పెద్దలు నన్ను జూచి నగ నీచిత్తంబు నాభాగ్యమా,
పన్నత్రాణపరాయణా! యనుచు సంభాషించి విజ్ఞాపనం
బు న్నే జేతునొ? బల్మి కౌఁగిటను నే ముద్దాడి మున్పంట గం
టు న్నొవ్వం బెదవిం బొనర్చి యిక నొడున్ పీడనా యిచ్చ నీ
వెన్నంటున్ జరియింప బొసిడుదువో? యీకున్న ని న్నాచువా
రున్నారే? యని భీతి కొల్పి గురిగా నొట్టొండు పెట్టింతునో,
చిన్నాళీకమునందు తృప్తి నెటులో చేకూర్పవే దైవమా
చిన్నప్డే యొనరించినావు సుభగ(శ్రీ)మీద మా పెండ్లి, ది,
ద్దన్నీ వొక్కడవే సమర్థుడవుగాదా యేరి తప్పైననున్,
కన్నంగా నను వీడియుండిన వృథాకష్టంబు నీ కేల? ద

ప్పెన్నఁ డిఁక బనియేమి నాకును సదా? యెంతైన నీతప్పు నీ,
కన్నన్ దిద్దెడివారలున్ గలరె విజ్ఞానైకసంపత్తిచేఁ?
మున్నీటన్ గమలాభుజాంతరలసద్భోగాత్తచిత్తుండ వై,
నిన్నుఁ నీవ యెఱుంగకుండు ఏక విందే దీనదీనోక్తులన్
విన్నానుంగదవయ్యు ద్రోవదికథల్ వేనోళ్ళ పూబోండ్లకున్,
కన్నాకాయము నీకు చెల్లెలగుటన్ గాపించితో మానర
క్షున్ న్నీ వట్టుల కాక జోకగ నసంఖ్యాకవ్రజస్త్రీలకున్
బున్నెంబో మరి బాపమో యనక మేల్పుట్టంబులన్ దోచి యా
పన్నార్తిన్ గలిగించి మానహరణప్రావీణ్యముల్ గూర్చి కొం
ట న్నే విందును నీ వశంవదను కట్టా! పాహి మాం పాహి మాం.

# శాంతం, శివ, మద్వైతమ్

శ్రీ శివశంకరస్వామి

శాంతి యన్నది యెంత చల్లనైన పదంబు!
శాంతి యన్నది యెంత సత్యమైన పదమ్ము!

ఆదిలో సర్వత్ర అలమి యుండెను శాంతి;
అవల కోరిక కల్గ నయ్యె నీ సృజనంబు;
అంతకంతకు వృద్ధి యయ్యె బ్రహ్మాండంబు
కాలమున్ దిక్కు వికారము పెంచినవి
సంక్షోభ మెంతైన శాంతింపవలె తుదకు.

ఈపృథ్వి నెల్లెడల నెన్ని కల్లోలాలు!
ఆకసంబున, నీటియందు, భూగర్భాన
ఎంత కోలాహలం బెంత కల్లోలంబు
మానవావళియందు మహితసంక్షోభంబు
నిదురలేచిన దాది నిదురపోయెడివరకు
ఏదేశమందైన ఏసంఘమందైన
సంక్షోభమేకాని శాంతి లేనేలేదు
స్వాపమ్ము నందైన శాంతియుండునో లేదో
స్వప్నప్రపంచంబు సంక్షోభపూర్ణంబు

కర్మమ్మె దీనికిం గారణం బన్నారు
పెనుతృష్ణయే దీని బీజ మన్నా రొకరు
మారుతము చెలరేగి మరల శాంతము నొందు
ఘూర్ణిల్లి ఘూర్ణిల్లి కొంత తడవున కైన
సప్తసాగరములున్ శాంతిగాంచుచు నుండు.

పక్షులున్ పశువులున్ ప్రకృతిలో నన్యంబు
సామాన్యముగ రాత్రిసమయాన శాంతించు
ఒక్కమానవకోటి కుండదే విశ్రాంతి
రేయైన పవలైన రెండుసంధ్యల నైన
ఉండబోదు ప్రశాంతి ఖండప్రళయ మందు
దీని కేదో మంచి తెరవున్నదా లేద?

చిత్తమందు అశాంతి చెలరేగు ప్రముఖముగ
శమము స్థాయిగ నున్న శాంతమ్ము రసియించు
ప్రథమమ్మునందే ప్రపంచోపశమనమ్ము
అవల శాంతము, శివం, బద్వైతసంసిద్ధి!

# శ్రీ బసవరాజు అప్పారావు గేయకవితా పరిశీలన

శ్రీ శంకర శ్రీరామారావు

బసవరాజు అప్పారావుగారు ఆధునికగేయసాహిత్యానికి రూపురేఖలు దిద్దిన సుప్రసిద్ధగేయకవితాచిత్రకారులలో ఒకరు. గేయకవిత్వంలో ఆయన సిద్ధహస్తుడు. ఆయన కవిత్వం తెచ్చిపెట్టుకున్నది కాదు. సహజంగా, సరళంగా, సూటిగా, భావగర్భితంగా, నిత్యజీవితానికి అతిసన్నిహితంగా నడుస్తుంది. శబ్దాడంబరంగాని, కృతిమవాతావరణంగాని, డొంకతిరుగుడు మార్గాలుగాని లేకుండా సాఫీగా సాగిపోతుంది. తెనుగునేలలోని ఘుమఘుమలూ, తెనుగుభాషలోని తీయదనాలూ, అడుగడుక్కీ హారతు లిస్తూ ఆహ్వానిస్తూ, తెనుగుగుండెలోని తెనుగుదనానికి కితకితలు పెడుతూ ఉంటాయి. ప్రతిసన్నివేశంలోనూ ప్రేమరసం తొణికిసలాడుతూ ఉంటుంది. అతిసుకుమారమైన కవిప్రకృతి యక్షరాల సందుల్లోనుంచి తొంగి చూస్తూనే ఉంటుంది. జాలిగొలుపు జీవితఘట్టాల్లో కరుణరసం పొంగి పొరలి కవితావాహినిగా ప్రవహిస్తుంది. అక్కడక్కడ జీవితదుఃఖనిదాఘతాడితమైన యెడదలోనుండి నిస్పృహ రక్తధారగా ప్రవహించడంకూడా కద్దు. నవనీతకోమలమైన ఆమనస్సు జీవితంలోని నిష్ఠురత్వాన్ని సహించలేక సనుసిపోయిందా అనిపిస్తుంది. అందాన్నీ, ఆనందాన్నీ, అందుకో గల హంగులన్నీ ఉండికూడ జీవితపుబరువులతో క్రుంగిపోయే ఒకానొక కోమలహృదయుని ఆవేదన, ఆక్రోశం, ఆగ్రహం రసార్ణవమై ఆయనపాటల్లో పరవళ్ళుతొక్కుతూ మనకు దర్శనమిస్తుంది. భావానికి పెనవేసుకుని భాష తనంతట తానే అల్లుకుపోయినట్టూ, భావవేగంతో తొడచరిచి పందెంకట్టి బరాబరిగా పరుగులు తీసినట్టూ కనపడుతుంది. కఠినమైనమాట ఒక్కటికూడా ఆయనకవిత్వం అంతా గాలించినా కనపడదు.

«ఆనందో బ్రహ్మ యటన్న ప్రాబలుకు లంతశ్శుద్ధి నూహింపుమా» అన్న శంఖారావంతో జాగృతి చెందినదట అప్పారావుగారి కవితాకన్య; వారే చెప్పుకున్నారు. ఇంకా ఇలా అన్నారు: «మాకవితాకన్య చిన్నతనము నుండియు రాగిణి, భావనోద్దీపిత, గానలోల, రసజీవిని వెన్నవలె మెత్తనౌ కన్నెవలపులు కరగి కాలువల జాలువారకమున్నె, చుక్కలలోని చందురుకన్న నెక్కుడు బెట్టుసరియు, అపురూపుండును, లోకాతీతుండును అగు నాదేవదేవునిపై వెర్రిప్రేమ నించి ప్రణయసిద్ధి గాంచమి వేదన స్రుక్కుచు, ఆశల నల్లాడుచు చింతాగానము జేయుచున్నది.»

ఆయన జీవితనౌకకు ప్రేమయే తెరచాప, చుక్కాని, సర్వస్వమూను. «ఎద మెత్తనౌటకై సొద గుందరా", "వలపెరుంగక బ్రతికి కుమిలి మురిసేకంటె వలచి విఫలమ్మొంది విలపింప మేలురా» అంటాడు. అవును మరి. ప్రేమ యెరుగని మొండిబ్రతుకుకంటె ప్రేమపూర్ణమైన హృదయంతో ఏడ్వటమే మేలు ... «చెలివలపులేని నీకలిమి కాల్పనె» అని ఏవగించుకుంటాడు. చక్కని చుక్క యగు జవరాలికి హృదయమిచ్చి పుచ్చుకునే అదృష్టానికి పెట్టిపుట్టని నిర్భాగ్యులు ఆయనదృష్టిలో కేవలం యంత్రాలు. ప్రాణవాయువు లేని కమ్మరితిత్తులు వారిజీవితాలు— వాళ్ళంటే ఎంత అసహ్యం ప్రేమమూర్తియగు ఈ కవికి! «ప్రేమకంటే ఎక్కువేముందిరా, ఎల్ల కామ్యపదవులకన్న ప్రేమ యెక్కువరా!» అంటాడు అప్పారావుగారు. ఒక్క ధనమే కాదు. ఉన్నతపదవులుకూడా తీసికట్టే ప్రేమముందు. అన్నీ త్యాగం చేసి ప్రేమను దక్కించుకో మంటాడు. «ప్రేమించు సుఖముకై, ప్రేమించు

ముక్తికై, ప్రేమించు ప్రేమకై!" ఇహపరసౌఖ్యదాయకమైంది సుమా ప్రేమ! అసలు ఫలాపేక్ష దేనికి? "ప్రేమించు ప్రేమకై" Love for love's sake. ఇహంలో రసవంతంగా జీవించాలంటే ప్రేమించాలి. ముక్తి కావాలంటే ప్రేమించాలి. అవన్నీ ఎందుకు నీకు? ప్రేమించు. అంతే. భగవద్విషయమైన నిష్కామప్రేమను సూచిస్తూ "ప్రేమతత్త్వం" అనే ఈగేయం ఈవిధంగా ముగించారు అప్పారావుగారు.

ఇక "తాజ్ మహల్" అనేగేయం చూడండి. ఎంత గంభీరంగా, ఎంత ధ్వనిప్రధానంగా, ఎంత అవ్యక్తమధురంగా నడిచిందో—

"మామిడిచెట్టును అల్లుకొన్నదీ మాధవీలత ఒకటి
ఏమా రెండిటి ప్రేమసంపదా ఇంతిం తనలేమూ!
చూడలేని పాపిష్ఠితుపాను ఊడబీకె లతనూ,
మోడైపోయీ మామిడిచెట్టు మొగము వేలవేసె!
ముచ్చటైన ఆకులు కాయలనే వెచ్చని కన్నీళ్లోడ్చీ,
పచ్చనాకులా బొమ్మరింటిలో పండొక్కటి రాల్చీ,
మామిడిచెట్టూ మాధవిలతతో మాయలా గలిసింది
కామిత మిచ్చే మామిడిపండు కవులకు మిగిలింది."

కాదా మరి? ప్రేమతో పండిన ఈపండులోని రసాన్ని మనసా గ్రోలి ఎందరుకవులు కవితాధారలతో లోకాన్ని రసతరంగితం చేస్తూవచ్చేరు! ఇట్టే రాధాకృష్ణుల ప్రేమగాథను "నల్లవాడే గొల్లపిల్లవాడే" అనీ, "ఏమని పాడితివో గోపాలకృష్ణ" అనీ "నామోహపున్ తునక నా నోముల ఫలమ్ము నానాథు డేల రాడే" అనీ మధురాతి మధురముగ పాడుకున్నా డీకవి. రాధాదేవితో తాదాత్మ్యమును పొంది మధురభక్తిలో ఒడలు మరచిన ధన్యుడు అప్పారావుగారు ఏవిషయాన్నిగురించి ప్రస్తావించినా ఆకవితాగర్భంలో భక్తి అంతర్వాహినిగా ప్రవహిస్తూనే ఉంటుంది వీరి గేయాల్లో........

"నిరాలంబస్థితి" అన్న గేయం చూడండి. ఆస్థితిని అంతసహజంగా ఎవరైనా చిత్రించగలరా అనిపిస్తుంది. జీవుడు సంసారసాగరంలో చిక్కుకొని దారి తెన్నూ కానక ఆర్తితో దేవునికై ఒకకేక పెడతాడు. "నీవే తప్ప నితఃపరం బెరుగ మన్నింపందగున్ దీనునిన్" అన్నట్టు

నట్టనడిసంద్రాన నావలో వున్నాను
నడినీటిలో ముంచుతావా?
నా సామి
నావ నొడ్డంట్టించుతావా?
చీకులూ దూరనీ చిట్టడవి లోపలా
చిక్కుకున్నానోయి దేవా!
యేదైన
దిక్కొకటి చూపించుతావా?
ఆది అంతూ లేని ఆకాశమధ్యాన
అల్లాడుతున్నాను దేవా!
దయవుంచి
చల్లగా యిల్లు జేర్చేవా!

"సర్వధర్మాన్ పరిత్యజ్య" అన్న గీతావాక్యాన్ని వ్యాఖ్యానించినట్టుంది ఈగేయం.

ఇక "గుత్తొంకాయ్ కూరోయ్ బావా" అన్న గేయం చూడండి. "వెఱ్ఱిపిల్ల" అని పేరుపెట్టారు అప్పారావుగారీగేయానికి. ఆ అమాయకపు గార్హస్థ్యప్రేమ పాటపాడుగునా గోచరిస్తూనే ఉంటుంది. నూటికి నూరుపాళ్లూ తెనుగుదనం క్రిక్కిరిసి ఉన్న దీగేయంలో. పాటవరసలో, మాటవరసలో, ప్రత్యక్షరంలో, తెనుగుజాతీయం తొంగిచూస్తూన్నది. ఈకాయకూరంటే తెలుగువారికి మహాయిష్టం. అందులోనూ గుత్తివంకాయకూరంటే చెవికోసుకుంటారు. తెనుగుపడుచు వలపుకూరిన వంకాయకూరైతే ఇక చెప్పాలా! దానిరుచి ఆబావకే తెలుసు — "తియ్యని పాయస మోయ్ బావా, తీరుగ వండానోయ్ బావా, పాయసమ్ములో నా ప్రేమనియేటి పాలుపోసి నానోయ్ బావా!" అంటూ తినమని బుజ్జగిస్తుం దావెఱ్ఱిపిల్ల వెఱ్ఱిప్రేమతో - ఇక పూరీలో? "కరకర వేచానోయ్ బావా" అంటుంది.... తెనుగుపూరీలే కరకరలాడేవి. ఉత్తరాది పూరీలు తెగిసాగుతాయి.... తెనుగుభోజనప్రసాగసులు ఎంతచక్కగాపాదిగారు ఈతెనుగుశ్యంగారపుతొడవులో! అలంకారమూ తెనుగుపలుకుబడి క్షీరనీరన్యాయంగా కలుసుకపోయాయి ఈగేయంలో. వలపుతీపులు ఒయారాలుపోతూ పెనవేసుకున్నాయి శబ్దజాలాన్ని.

«నాముక్తి» అన్నపాటలో ఎంతో నిస్పృహ గోచరిస్తుంది.

«బతుకుబరువు మోయలేక
చితికి చివికి డస్సి వాడి
పికరు పుట్టి పారిపోయి
ఒకడనె యేతోటలోనొ
పాటపాడుతుండగ నాప్రాణి దాటి యేగేనా?
ప్రాణి దాటి యేగుతుండ పాట నోట మోగేనా?»

అంటూంటే కవి నిట్టూర్పు వినబడుతుంది పాటలో.

అంతలో మళ్ళీ ప్రకృతిసౌందర్యంలో ఆనందంకోసం తడుముకుంటూ బయలుదేరుతాడు—

«ఆనందమే లేదా? లోకమున ఆనందమే లేదా?
ప్రకృతిసుందనుల పరికించుటలో
ఇంపగు నీ సెలయేటి గానమున
కూకూ యను నీకోయిలపాటల
వీనుల విందౌ పిట్టలబాసల
పూవులు దాల్చు నపూర్వపు శోభల
చిగురుటాకుల నగువసంతమున
అరుణములౌ సాంధ్యారాగంబుల
మైమరపించెడు మలయవాయువుల
పారెడు మబ్బుల పందెపుపరుగుల
మింగిలుకన్నియల ముద్దుమోములను
చక్కదనమ్ముల చందమామ గన
మిన్నున చుక్కల మినుకు మినుకులను»

అని మైమరచి పాడుకుంటాడు.

«నాగులచవితి» అన్న గేయం తెనుగునాట పుట్టలో పాలుపోసే ఆచారాన్ని చక్కని తెనుగునుడికారంలో వర్ణించడమే కాకుండా, అందులోని అంతరార్థాన్ని తీసి అందరితరఫునా వకాలతీ తీసుకొని అతివినయంగా నాగేంద్రునితో విన్నవించినట్లున్నది....

నీపుట్టదరికి నాపాప లొచ్చేరు
పాపపుణ్యమ్ముల వాసనే లేని
బ్రహ్మస్వరూపు లా పసికూనలోయి
కోపించి బుస్సలు కొట్టబోకోయి

నాగులచవితికీ నాగేంద్ర నీకు
పొట్టనిండా పాలు పోసేము తండ్రి!

అని చిన్నపిల్లల పక్షాన........

చీకటిలోన నీశిరసు తొక్కేము
............................ .. ........
..........................................
పగలు సాధించి మాప్రాణాలు తీకు

అని పెద్దల తరఫున.... ...

అర్ధరాత్రీవేళ అపరాత్రివేళ
పాపమే యెరుగని పసులు తిరిగేను
ధరణికి జీవనాధారమైనట్టి
వాటిని రోషాన కాటేయబోకు

అని పశుసంతతిపక్షాన........

పగలనక రేయనక పనిపాటలందు
మునిగి తేలేటి నామోహాలబరిణె
కంచెలు కంపలు గడచేటివేళ
కంపచాటున వుండి కొంపదీకోయి!

అని అర్ధాంగి తరఫున ఎంతో ఆర్తితో వాదించిన ప్లీడరు అప్పారావుగారు.

«చలిపిడుగు» అనే గేయంలో

«ప్రళయాంతాభీలనభో
దళనఘోళఘోరారవముల
జలిపిడుగా! గర్జింపకు
నిలిచి నాదు మనవి వినుము.
బంగారపుబొమ్మ నాదు
మంగళప్రదమ్మ యొంటి
రుద్రభూమి గటిక నేల
నిద్రించెడు నోడలు మరచి
చూపబోకు మచట నీ ప్ర
తాపమెల్ల పిడుగా! నా
కన్నతల్లి యడలి లేచి
కక్కటిల్లి యేడ్వగలదు»

అని కన్నకడుపు జాలిగా ఏడుస్తూంటే ఎంత కరకుగుండైనా కరగక మానదు.

"కుతుబ్ మీనార్" అన్న గేయం ఎంత సముద్రగంభీరమో? ఆలోతుపాతులు అంతుచిక్కవు గదా!

"ఇది మొగల్ దివాణమా?
ప్రళయశివమహాశ్మశానమా?
ఇది విజయ స్తంభమా?
చలవిద్యుచ్చంద్రచూడదంభమా?
ఇవి జీర్ణసమాధులా?
ప్రమథగణనివాసవీథులా?
ఇది యవనవికాసమా?
నటేశతాండవవిలాసమా?"

ఇట్లెన్నో తీరులు, పోకడలు, రసాలు, భావాలు కుప్పతెప్పలుగా వీరికవిత్వంలో కనిపిస్తాయి. అనన్యసామాన్యమగు ప్రతిభా, వేగము, ఆవేదన, అశాంతి ప్రేమానందములతో మిళితమై వీరికవితారథాన్ని నడిపిస్తూవుంటాయి.

"నాకవిత్వధాటి" అన్న గేయం పరికిస్తే వారుదారి తీసిన ఆనాటి కవితా విప్లవంలో వారికున్న ఆత్మవిశ్వాసం స్పష్టమౌతుంది.

"నన్నెవ్వ రాపలే దీవేళా
నాధాటి కోపలే రీవేళా
నోటుపలికే దంత
పాటగా మోగేను
కోటివరహా యెత్తు
కెత్తుగా తూగేను- "నన్నెవ్వ"
గుండు తాతామంటు కొట్టినట్టుగ నేటి
పండితులు తారెత్తి పసుగుచ్చుకోవాలి "నన్నెవ్వ"
పట్టుపట్టితినంటె వాగీశుడే వచ్చి
దాసోహ మని పాట వ్రాసి వల్లించాలి!- "నన్నెవ్వ"

అంతశ్శక్తిసంపన్నుడూ, ప్రతిభాశాలిగనుకనే ఆదుర్బల శరీరం ఆవేగానికి తట్టుకోలేక 39 దేండ్లవయస్సులోనే రాలిపోయింది. అజ్ఞానాగ్ని ఆదేహంలోని చమురంతా పీల్చిపారేసింది. ఐతే నేమి? వారికి అమరత్వం ప్రాప్తించింది. వారిగేయాలు ఇంటింటా, ప్రతినోటా రాగతాళసమన్వితంగా, ఆంధ్రదేశమంతటా ఈనాటికీ వినిపిస్తూనే ఉన్నాయి. ఆంధ్రసారస్వతప్రపంచంలో గేయకవిసామ్రాట్టు శ్రీబసవరాజు అప్పారావుగారు—చిరంజీవి. ఆధునికగేయసాహిత్యగగనవీథులలో వారిపాటలు దివ్యతారలై వెలుగుతూ వుంటాయి.

# "పుష్పాంజలి"

శ్రీ "సత్యం"



 

ఓ యశస్వి రవీంద్ర!
ఓ విశ్వకవిచంద్ర!

నీ జననం మాభాగ్యం
నీ కవనం మాప్రాణం
అమరం నీసాహిత్యం
హే! భారతభువిరత్నం!

సాహిత్యంలో ప్రగతి
సంఘంలో నవజాగృతి
సాధించిన నీమూర్తి
ఎదనింపును నవజ్యోతి!

జనగణమన నీగేయం
జనులందరకును ధ్యేయం
అందించును సందేశం
చిందించును జాతీయం!

గీతాంజలి ప్రాముఖ్యం
గోరాలో ప్రాశస్త్యం
నీపలుకుల నుడికారం
వివరింపగ నెవరితరం?

చంద్రున కాక నూలుపోగు
చందమున రవీంద్ర నీకు
పదసుమముల నేర్చి కూర్చి
'పుష్పాంజలి' నొసగుచుంటి.

## ఆవేదన

('గీతాంజలి' అనుసరణ)

ప్రభూ! నిన్ను చేరకోరి
పూలగుత్తి నయ్యాను
నీవద్దకు రాకమునుపె
నేల కూలిపోయాను.

కాననముల నిన్ను వెదుకు
కాంక్షతోడ తరలినాను
క్రూరమృగావళిని చూచి
భీరువునై మరలినాను.

ఆవేదనతో నీకై
దేవాలయప్రాంగణమున
ఎన్నో రాత్రింబవళ్ళు
ఎదురుచూచి గడిపాను.

కానీ– నీదర్శనమే
కరువైపోయింది నాకు
అలమటిల్లిపోతున్నది
ఆవేదనతో మనస్సు.

మనసుతీర ఒక్కసారి
కనరావా ఓప్రభూ!
నీకొరకై వేచియున్న
నామొర వినవా ప్రభూ?

## "మా దేశం"

గంగ ప్రవహించెడు
బంగారు దేశం—
పాడిపంటలు పొంగి
పొరలు మాదేశం.

వేదములు మాకు, పెను
వెనుకాపులై నిలచు
సత్యశాంతులు మమ్ము
సౌఖ్యముల తేలించు.

బుద్ధదేవుని బోధ
బోసు, గాంధీగాథ
ఆదర్శమై మాకు
అభ్యుదయమును జూపు–

ప్రకృతియె మాకు యిట
పాఠశాలగు నంట
చెదరిపోవని స్మృతులు
మదినిలుపుతుం దంట!

విశ్వమంతకు జ్ఞాన
భిక్ష నొసగినతల్లి!
విశ్వశాంతిని కోరు
ఆశ్రితకల్పవల్లి!

సోదరత్వము విరిసి
సౌఖ్యశాంతులు వెలసి
వరలు మా–'బంగారు
భారతావని' దివి,

గంగ ప్రవహించెడు
బంగారుదేశం—
పాడిపంటలు పొంగి
పొరలు మాదేశం!

# వర్షామేఘము

## శ్రీ పల్లా దుర్గయ్య

అలఘుజ్వాలల మించు కంచుదివిటీలై మండు వేసంగి యెం
డలయం దెండుట నేమొ! బెండులయి కొండల్ గాలిలో దేలి, మొ
క్కలు పోనట్టి పవిన్ దళింపబడి మున్ కానంగ రానట్టి తె
క్కలు రా, నాకస మెక్కి నిక్కె ననగా గన్పట్టె కాదంబినుల్.

ఆకాశాన తమాలమాలికల ఛాయాచిత్రముల్ చిత్రమై
ప్రాకెన్, తాండవకేళిలోలశివగుల్ఫప్రస్ఫుటధ్వానముల్
సోకెన్ రోదసి; కాననమ్ముల కనుల్ సొంపై ప్రకాశించె, ల
క్ష్మీకాంతప్రభుకౌస్తుభప్రభలు క్రమ్మెన్ వర్షకాగలాతిన్.

తెప్పలు తెప్పలై గగనతీరములన్ దిగుగాడుచున్ రవిన్
గప్పుచు నార్చి బొబ్బలిడు కారుమొగిళ్ళివి యెందుబోయెనో
చప్పుడుసేయ కిన్నిదివసంబులు నంబుధులందు నక్కెనో
యిప్పుడు గొప్పలై గిరుల నెక్కి భ్రమించెడి కాలశక్తిచే.

ముందరుణుండు యౌవనపుమోజున చిందులు త్రొక్కినాడు నీ
వెందు పలాయనం బయితి వేమయిపోయె పరాక్రమంబు; నీ
చందముచూడ నాకు నొకసామెత జ్ఞప్తికివచ్చె మేఘమా!
అందకయున్నచో నడుగు లంటెద వందల మెక్కె దందినన్.

అంబరవేదిమీద ప్రళయధూర్జటి చేసి ఘనుండు నిల్వ, పిం
ఛంబును విప్పి నృత్యమును సల్పె మయూరము గ్రీష్మతాపత
ప్తం బగు నగ్నదేహమున ధారుణి పచ్చనికోక దాల్చె, భూ
తంబులు నెమ్మనమ్ముల ముదమ్మును జెందె ని దేమి చిత్రమో!

నల్లని మేను, నామమె ఘనమ్ము, నివాసము శూన్య మౌను, స
త్వెల్ల విష్ణుప్రారితమె యే మనవచ్చును నిన్ను; కాని నీ
యుల్లములోని యార్ద్రిత యదొక్కటె యన్నిటి మించి, కీర్తి సం
ధిల్లగ జేసె, జీవనమునే ధర కోరక ధారపోయుటన్.

నిన్నటిదాక లేవుకద నింగిని, పుట్టియు పుట్టకుండనే
మి న్నెగబ్రాకినా ననుచు మీసలుదువ్వుచు నవ్వుచుంటి వే
మన్న! యి దేమి నీతి, నడుమంతరపున్ సిరి కుబ్బువారి గ
ర్వోన్నతి నిల్వునీరయి మహోదధిపాలయిపోదె మేఘమా?

చిటపట చినుకులు రాలెను
పటపట వడగండ్లు పుడమిపై బడె, ధారల్
పుటపుటనై కుండలతో
నటునిటు దొరలించినట్లులై కనుపట్టెన్.

నేలపై మోపిన కాలు చుఱుక్కని
బొబ్బలెక్కెడి దినమ్ములు గతించె;
నించుక యశ్రద్ధ నుంచిన పాదమ్ము
జఱుకుజఱుక్కని జాఱనోడగె;
పగలు రాత్రి యనక ప్రభు పాలితులుదాక
ప్రజలందఱును ఛత్రపతులె య్యైరి;
నెఱియలువాఱిన నేల నంతట నద్ద
ములు దాపినట్లు నీడలు కనబడె;

పులకరించి భూసతి రామచిలుక యయ్యె,
హుంకరించి యాబోతులు ఱంకెవేసె,
నాగలిని బట్టి కృషికుడు నడుముగట్టె,
నాళ లుప్పొంగి పాడె వర్షాగమమున.

# సెలయేరు

౧

కనుమేరదూరాన కనుపించు నాకోన
నల్లనౌ తల కొంత నరసి పండినదేమొ,
నరపుగా నది నల్లనల్లనౌ తలమీద
తెల్ల మల్లుసుమాలు తీరేమొ కనిపించు.

మల్లుపాగాలోని మడక లవి యొకకొన్ని
చెదరి గాలికి చాల చెలరేగె ననిపించు
కాదు నల్లని రాతికంబళంబున దూది
యేకి పోసిన రాశి యేకమైనటు లుండె.

పైనున్న యారాశి పాలసంద్ర మటంచు
నాగుబాములు కొన్ని నడయాడునటు లుండె;
నెత్తిగా నది కొండనెత్తమ్మె యగుసుమ్మ
నరపుగా నది మంచు టొరపు పరుపగుగాని!

మల్లుపాగా గాదు నటి దూదియును గాదు
నడయాడు నిడుపాటి నాగుబాములు కావు
కొండనెత్తమునుండి రెండుమూడుగ జీలి
జలజలం బ్రవహించు సెలయేరు లగుగాని.
తళతళ త్తళతళ త్తళ తళత్కాంతితో
జలజలన్ జలజలన్ సెలయేరు ప్రవహించు.

ఉత్తుంగశిఖరమ్మునుండి యటు పయనమై
ఆడాడ పల్లమ్ములం దెగిరిపడి దూకి,
మలకలై మెలివడుచు మఱల విడివడి సుడులు
తిరుగుచును పొరలుచును నురుగులయి పరుగిడుచు
దండిగుండులు కొన్ని పిండిగొట్టుచు నంత
చెలరేగి గుండ్రాళ్ళ చెండ్లాట లాడుచును.
పచ్చిముత్తెపుసేసబ్రాల జల్లులతోడ
తను తొంగిచూచు భానుని పూజలను సలిపి;
సూర్యుడును చంద్రుడును చుక్కలన్నియు గూడి
మోసులెత్తిన క్రొత్త మోహంపు మైకాన
పవలు రాత్రియు వెంట పరువులెత్తుచు నుంట
అందరిని తనయందు ఐక్యమొనరించుకొని
జలజలా జలజలా జలజలధ్వనులతో
తలపోలమ్ములలోకి తా దూరె సెలయేరు.

౨

కొండపై వా రువరొ వెండి కరిగిన నీరు
కుండలో గుప్పు మని క్రుమ్మరించినభాతి;
స్వర్ధునీవీచికల జల్లులాడెడు కరుల్
తొండాలతో ముంచి తూకుపెత్తినరీతి;
పచ్చిమంచు ద్రవించి వచ్చునెడ దానితో
కలిసిపారె ననంగుగాత్రంపుబూది యన;
మంచుకొలకుల తానమాడి లేచిన దివ్య
వారకామిని యార్ద్రవసనాంచల మనంగ,
వేయికన్నుల ఱెప్పవేయకే సురరాజు
పదిలపరచెడి సుధాభాండంబు దొరలెనన;
సానువుల శిఖరాళితో నేకమొనరించి
ఆసు బోసినరీతి నటునిటుం దిరుగాడి
పాదరసపుంగుండ పగిలి పారె ననంగ
మరకతపు పచ్చికలమళ్ళలోపల దూరి,
సికతస్థలములెల్ల నిగనిగ న్నిగలాడి
చూచువారలకనుల దోచుకొనునటు జేసి,
పంటచేడియ ఆకుపచ్చకోకపయంట
ముత్తెంపుజలతారుమురువు పోతలుపోసి,
దొరపూవులు కొన్ని దోసిళ్ళ గోసికొని
పరిమళము మైనిండ పట్టించుకొని లేచి,

దారి కడ్డుగనున్న తరులమూలము లొరసి
పక్వఫలముల పుడమి పడ రాలగా గొట్టి,
ఫలరసాస్వాదనన్ బల మెసక మెసకగా
పూలసొమ్ముల నొడల్ భూషించుకొని మురిసి
కలనాదముల నెడద పులకితం బగుచుండ
నలుదెసలు వెలుగ చిగునగవు చూపులు విసరి,

ఎందుజూచిన గాని యెవ రెవ్వరును లేక
యిచ్ఛావిహారమ్ము నిటు కొంతతరి సలిపి,
చిటిపొటినడల హంసికవోలె నప్పు డేగి
చంద్రికాకాంతి వాసకసజ్జికోలికను
చెలిమితో ప్రకృతి సజ్జితము చేసిన మిసిమి
యిసుకపాన్పున బవ్వళించె నా సెలయేరు.

# దాగుడుమూతలు

మాగుడువడ్డ యీభువనమంటపకేళివిహారలోలురై
ఆగక వచ్చి మూగెడి యనంతజగజ్జనముల్ క్రమంబునన్
దాగుడుమూత లాడ, కనుదమ్ములు మూసెడి తల్లి యెవ్వరో?
ఏగెడివారిలోన దొర లెందరొ? చెల్లనిదొంగ లెందరో?

ఏగెడివార లాడుకొని యేగ తదీయపదాంకముద్రితా
ధ్వాగమనేప్సులై యెదురుతాకుచు వచ్చు నవీనఖేలకుల్
మూగుచు రప్పు డప్పుడె సముద్రతరంగములట్లు. క్రమ్మరన్
వేగమె విచ్చిపోవుదురు ఫేనసముద్గతబుద్బుదక్రియన్.

ప్రోగులు ప్రోగులై యిసుకపోసిన రాలని వాలకంబునన్
మూగిన మూకలో, నొకట ముందుకు వెన్కకు బాఱు వీరిలో
నాగతు లెందరో యిట ననాగతు లెందరొ, యిందులో నన
భ్యాగతు లెందరో యతిథులై చనుదెంచినవార లెందరో?

అక్కట నేల యీనినటు లంతట వింతగనిండి యుండి, యే
దిక్కునచూడ తామె యయి క్రిమ్మరునట్టి యుసిళ్ళపుట్టలై
ఎక్కడనుండి యెక్కడకు నేగుచు నిక్కడి కేగుదెంచిరో
నిక్క మెఱింగి తెల్పు మహానీయులు లోకములోన నెవ్వరో?

ఇక్కడ కూడినట్టి జను లెందరో ముందర యిందు లేరు, ముం
దిక్కడ నున్నవార లిపు డెందరో కానగరారు, చిన్నదై
చిక్కులదుక్కియా కనువిచిత్రపు దాగుడుమూతలాటలో
నుక్కిరిబిక్కిరై నిలువనోడుచు నూడనిబాడి యుండిరో?

ఆటకు రాకముందు దొర లందరు, మీదట దొంగలైన వా
రోటమి జెందె. కన్నగవ లొక్కట మూయగబడ్డ పిమ్మటన్
నోటుగ బన్నుచుంద్రు, తమ నేరము లన్యులనెత్తి రుద్దగా
చాటున నక్కియుండు దొరసంఘము భీతిని నిక్కిచూడగన్.

అందరుగూడ తాము దొరలన్న యథార్థము విస్మరించి యీ
వందలవేలమంది తమవారినె దొంగలటంచు బల్కుచున్
నిందలుమోపుచున్ తనకు నోటుకు వచ్చెడు దమ్ము లేక,
బ్బందులగొందిలో నణగి బాధలపాలగుచుందు రక్కటా!

రాత్రులయందు ప్రొద్దుల విరామము లేక నిరంతరమ్ము నీ
సత్రములోపలన్ దిగి వెసన్ జనులే పరిపాటియయ్యు, నీ
ధాత్రియు దాగురింతలె, యథార్థమటంచు భ్రమించుచుంటయే
చిత్రములోని చిత్రము విచిత్రపు దాగుడుమూతలాటలో!

క్రీడావేశము ముమ్మరమ్ముగొన స్వర్గీయస్థితిన్ వీడి, ని
ర్వ్రీడామానసులై పరస్పరజయశ్రీకాములై పోరు నీ
చూడాబద్ధకిరీటఖేలకుల కిచ్చో వచ్చుచుం బోవుచో
జూడన్ కన్నులు మూయు 'తల్లి' యొకతేనా! సాక్షియై నిల్చుచో!

# సాంస్కృతిక ప్రాతిపదిక - సాహిత్యకారుడు

## శ్రీ యస్. వి. మాధవరావు



విషమతలోగూడ సమత్వాన్ని ప్రకృతి ప్రతిపాదించును. చరాచరజగత్తులో గతానుగతంలో ఎన్నియో మార్పులు కలుగుట సహజం. మార్పులోని మూలంలో మరవరాని మార్పు మనకు గోచరించదు. బాహ్యంగా ఎంతో మార్పు కలిగినట్లు మన భౌతికనేత్రాలకు స్ఫురిస్తుంది. భౌతికంగా వికసించినదంతా సత్యం - చిరసత్యం - అని భావించటం కూడా భావనకే అపరాధాన్ని చేసినట్లవుతుంది. చిరసత్యాల నన్వేషించటానికి బూనుకొన్న జిజ్ఞాసువుకు ప్రథమంగా భౌతికసంస్కారాలనుంచి, విచ్ఛేదించుతూ, సత్యాన్ని సమకూర్చుకుంటూ వెళ్లాలిసిన బాధ్యత కూడా వుంటుంది. ప్రకృతిలో దేశాంతర్గతఏకత, విశిష్టతలూ వుంటాయ్. ప్రాకృతికజగత్తులోని వికాసంతో పాటు అవి వికసిస్తువుంటవి. కాని భౌతికజీవనంలోని, వికసించిన విశాలవైవిధ్యం ఆచిరసత్యంలో యిమిడివుండవు. స్థూలంలోవున్న ఆకృతిసూక్ష్మస్వరూపం - ప్రాయికంగా - ఆచిరనవీనసంస్కృతివిశేషతయే, సంస్కృతిధాత్వర్థంలోని «సమ్యక్ స్వరూపంను» అందరు ఆచార్యులూ ఒప్పుకోనకపోయినా కొందరయినా ఒప్పుకొన్నారు. ధాత్వర్థాన్ని కాదనేవారి ఆక్షేపణకుమూలం - 'ధాత్వర్థం వ్యవహారిక జగత్తులో సత్యం కాదని'- కాని ఆంగ్లశబ్దమైన 'కల్చర్' సంస్కృతికి సమమైన అర్థంలో వాడుతుంటాము. అటువంటి ఆశబ్దములో కూడ «కల్టివేషన్» యొక్క సాదృశ్యమే. ఈరెండుశబ్దాలకు మూలమైన లాటిన్ శబ్దం - «కల్తురా»- కృషి, వ్యవసాయాలలోని 'అభివృద్ధి, అభ్యున్నతి' విశేషణాలకు సాంకేతికచిహ్నంగా ప్రయోగించబడుతుంది. భావం - వ్యావహారికజగత్తుకు మూలం. అదే సంస్కృతికిప్రాతిపదిక.

భావగమ్యమైన సంస్కృతిస్థానంలో «సభ్యత» నాగరికత అనే అర్థాన్నికూడా తెలియనివారు ప్రయోగిస్తారు. మొదటిది స్థిర, చిరసంపత్తి అయితే రెండవది మానవుని చరాస్థి; ఒకటి జీవన్నది రెండవది పిల్లఏరు. వికాసంతో పాటు తనశక్తి, స్ఫూర్తులను నవీనత కూర్చేశక్తి అమృతప్రాయము, సహజవికాసానికి కావలసిన స్థిరత్వంలో మేముకూడ మాశక్తితో, 'ఉడుతాభక్తితో' - సహాయం చేయాలనే స్ఫూర్తినికలిగిన దివ్యత 'సభ్యత'లోవుంది. కాని యిది బుద్బుదప్రాయము. ఒకటి నిర్వైయక్తికము. రెండవది వైయక్తికము. ఒకదానిలో చిరనవీనత, రెండవదానిలో యుగనవీనత; యుగనవీనతలోని అస్థిరత్వాన్ని పరిగ్రహించి చిరత్వానికి వన్నెకూర్చుకుండేశక్తి మొదటిదానిలో వుంది. వికాససోపానాలకు వన్నెలుచిన్నెలు దిద్దేచున్నార 'సభ్యత'. ఇదే వీటిరెంటి యొక్క సంబంధాన్ని గాఢంగా ధృవపరచిన ధీయత.

జీవితంలో వచ్చే - పోయే అధిభౌతిక, భౌతిక శక్తులకు మూలం మానవశ్రేయస్సు. విశ్వకల్యాణము శాంతికామన జీవితంలోని స్థిరసూత్రం. ప్రాగ్వైదికకాలమునుంచి నేటి యుగమువరకు తనమస్తిష్కాన్ని వికసింపచేసుకొనటానికి మానవునికి లభించిన మూల వేదపాఠం యిదే; ధర్మ, అర్థ, కామ, మోక్ష పురుషార్థాల మూలంలోని సంస్కారభావనకూడా యిదే. సహనం, సమభావం, సౌభ్రాతృత్వం, సౌమనస్యం భారతీయసంస్కృతికి పట్టుకొమ్మలు; భావలోపమైన పశుత్వంవల్ల వికసించిన సంస్కృతులు క్షీణగతి నందుచున్నవి. చరిత్ర దీనికి సాక్ష్యం. రోమ్‌సంస్కృతిలోని వికాసం ఎంతోకాలం వుండగలిగిందా? వారి సమాజసంస్థ, సంఘంలోని వ్యక్తి - వ్యక్తిని విడదీసే ధార్మి

కనీతియే వారిపతనానికి దారితీసింది; భారతీయధార్మిక దృక్పథంలో విశాలత - తర్కవితర్కసమన్విత న్యాయము - కలిసిమెలిసి వున్నాయ్. జీవితంలో సర్వదాసాన్నిధ్యాన్ని ప్రతిపాదించే సంస్కృతియే చిరనవీనత్వంతో విలసిల్లుతూయుంటుంది.

జీవితంలోని భావత్వం సంస్కృతికి మూలం. భావం సాహిత్యకారుని సమరాంగణంలోని ఆయువు - జీవం. యుగయుగాలనుండి సంస్కరింపబడుతూ వచ్చిన భావరాశులే సాహిత్యకారుని ఉద్వేగాలు. అవి రాగ - విద్వేషాలను అందజాలనంతదూరంలో ప్రసరించే జీవనస్పందనాలు. అవి మధురానుభావసంయోగాలు. జగత్తులోని విస్తృతస్పందనలలోని ఏరికోరిన సుందరనందనములు. సాహిత్యకారుడు తాను అనుభవించిన అవికృత సత్యాన్ని - వాస్తవిక సత్యాన్ని; తన మధుర, సుందర రాగవిపంచికలతో జగత్తంతా ఉర్రూతలూగించటానికి ప్రయత్నం చేస్తాడు. సత్యాన్వేషణ లోని సాహిత్యకారుని నిష్ఠ; ఆపొందిన సత్యాన్నే అవికృతం కాకుండా విశ్వంలోని నలుమూలకు వ్యాపింపజేసే పరిష్కత; మానవ జీవితంలో జీవాన్ని స్పందింప జేసే రసాత్మకత, అవికృత సత్యాన్ని సౌందర్య వంతంచేసే సౌందర్య తీవ్రత, ఇవి సాహిత్యకారుని కళాకుశలానికి నికషాలు.

క్రియాత్మక జగత్తులో ఎన్నో భేదాలు గోచరిస్తాయి. అస్థిరత్వం దాని జన్మజాతగుణం. అస్థిరత్వంలోకూడా స్థిరత్వాన్నే- చిరత్వాన్నే అన్వేషించేశక్తి ఏకొందరిలోనో వుంటుంది. సాహిత్యకారుని క్షేత్రం ఎంతో అనంతం. 'రవి గాంచనిచో కూడా కవి కాంచును'. తన కల్పనాపటిమచే అస్థిరత్వంలోని స్థిరత్వం, అగమ్యంలోని గమ్యత్వాన్ని, విస్మృత భూతంలోని శక్తులు వర్తమానపు ఆధారంతో, భవిష్యన్నిర్మాణానికి దోవచూపే శక్తి సాహిత్యకారుని అభిధాగరిమలో వుంటుంది. మానవుని రుచులను సంస్కరించి సత్యములలోని నవీనతలను వ్యక్తపరచుచు, సంస్కృతి వికాసపు అవధులను తెలియపరచుచు, భవిష్యత్ కొరకు మార్గము జూపించే విశిష్టత సాహిత్యకారునిది.

భారతీయ సాహిత్యకారుని వాస్తవికభావంలో సంస్కృతికి ఆదర్శం మేళవించి యుంటుంది. కుత్స, కలుషం భారతీయుల భావజగత్తును ఆక్రమించటానికే ప్రయత్నించబోవు. కారణం- మనవారి ఆదర్శ సంస్కృతి. పాశ్చాత్య సంస్కృతికి మూలమైన గ్రీకుసంస్కృతిలో కఠోర కలుషిత నిష్ఠురనిర్మమ స్వభావం అడుగడుగునా చరిత్రలో వ్యాపించింది. సోక్రటీసు, క్రీస్తుప్రభువు పైజరపిన అమానుష హత్యాంకాండ వారి జీవితపుసత్యం. వారి జీవితపు సత్యాలే వారిసాహిత్యపు ఆదర్శాలు. షేక్స్పియర్ యొక్క కోమలతమ కరుణభావాలను అభివ్యక్తపరచే «ఒథెల్లో ముగ్ధప్రణయము»లోని భర్త ఒక్కరాత్రిలో విచక్షణాజ్ఞాన శూన్యుడై, సందేహంతో అందాలదేవి, భావాల జ్యోతి యైన భార్యను హతమార్చాడు. ఇటువంటి నిర్మమ కఠోర హత్యలు చూస్తు సహిస్తూ వుండగలిగింది అక్కడి ప్రజ.

భావం సాహిత్యకారునిసొమ్ము. అయినను సాంస్కృతిక విభిన్నత సాహిత్యంలో తప్పక గోచరిస్తుంది. శౌర్య, పరాక్రమాది భావాలు ఏజాతి సాహిత్యంలో నైనా మేళవించియుంటాయి. పాశ్చాత్య సాహిత్యంలోని వ్యక్తి వైచిత్ర్యం, అవికసితపాత్రోన్మీలనను, నిర్మమ భావ గుంఫనము ముఖ్యంగా గమనించ తగిన గుణాలు. రసాత్మకత మనవారి సాహిత్యానికి జీవం, సంపూర్ణవికసిత శీలం, గుణ చిత్రణ మనపాత్రలకు ఆదర్శాలు. శీలం, శక్తి సౌందర్యం, లేదా సత్యం, శివం, సుందరం మన జీవితపు మాణిక్యాలు, భయంకర బీభత్స క్షేత్రాలలో విహరించుచూ కూడ, వ్యాస, వాల్మీకి పాత్రలు క్రోధ, మద, మాత్సర్యాలకు ఆలవాలాలు కావు., శ్రద్ధ, భక్తి, ప్రేమలకు నిలయాలు. ఈపాత్రలు తమ సహజత్వంలోనే దేవతాత్వాన్ని ప్రతిపాదస్తవి. వేదవ్యాసునిపాత్రలలో నిష్ఠ ముఖ్యం. వాల్మీకి పాత్రల్లో కర్మ, ధర్మ, నీతుల- త్రిపుటి సంగమమైనవి. ధర్మరక్షణే మనపాత్రల అక్షయత్వం. అది పాశ్చాత్యజీవిత విధానంలో తీరని లోటు.

వ్యాస వాల్మీకుల ఆదర్శాలే భారతీయసంస్కృతి కేంద్రాలుగా వర్ధిల్లాయి. వారిపరంపరలోనే తిక్కన, తులసిదాసుల దివ్యవాక్కులు ప్రతిధ్వనించాయ్. కవులు అమరులైనారు. వారికావ్యాలలోని జీవితం యుగయుగాలలోని భారతీయుల కందరికి అమృతప్రాయం. తిక్కన పాత్రా

వైవిధ్యంతో కూడా జీవనాటకానికి కావలసినసంధియాత్రా లను నెలకొల్పాడు. వేదాంతంలో ధర్మానికి, ధర్మంలో సాహిత్యానికి జీవంపోయగలిగిన తెలుగు ఉద్యానములోని మొదటి విత్తనశాలి. అనుభూతి ఉద్వేగానికి మధ్య యుండే కెంపుకాలలో భక్తి ప్రసంతులతో నింపివేశాడు. మానవహృదయాలు ఆలోచనా, ఆవేశాలతో సమన్వితమై హరిహరాద్వైతముల ఏకత్వముకోసం చక్కని గులాబీలు జొంపాలుగా మారాయి. జ్ఞాన, యోగ సమాధిస్థితిలోనే జీవితముక్తి గలదనే కర్మసన్యాసము కాదని, భక్తి, కర్మ, ధర్మ- సమన్వయం లోనే జీవితపు పరమార్థము నిహిత మైనది తెలియజెప్పాడు.

భారతజాతికిమూలం ధర్మం. ధర్మక్షయమే జాతినాశ నానికి మూలం - అని గుర్తించిన భారతీయ సాహిత్య కారుని స్వాతంత్ర్యంలో, సారస్వతంలో ధార్మికసంస్కా రాలు తప్పకరాణిస్తాయి. వింధ్యన్నగాలనుంచి విజృం భించాలని అణగుపెట్టిన మహమ్మదీయశక్తులను తరిమి వేయటానికి, దక్షిణాత్యులలోని వీరశైవులు «హర హర మహాదేవ్» «అశ్శరభ శరభ;» అనే హ్రీంకారాలు ప్రారంభించారు. వారి ఆవేశాలే తద్యుగీనసాహిత్య కారుని కృతులలో కన్పిస్తాయి. కాన సాహిత్యకారుడు కేవలం కాలప్రవాహిమేరలో ప్రవహించే చేతనారహితుడు గాడు. కాలాన్ని ఒక ఆదర్శ మార్గానికి మార్చగల ఒకనిర్మాత. తిక్కన తనయుగమును ముస్లిం ప్రభావంనుంచి రక్షిస్తూ, ఆదర్శయుతమైన భార తీయసంస్కృతిని నిర్మించే భారముకూడ తనపైని మోపు కొన్నాడు. అప్పటికే హిందూధర్మంలో యెన్నోవిభే దాలు బయలుదేరాయి. శైవ, వైష్ణవుల అంతఃకలహాలతో జాతీయశక్తి తీరని మారని మారణహోమంగా మారిపో యింది. «విష్ణురూపాయ నమశ్శివాయ» యనెడి పలుకు లతో హరిహరాద్వైతముల నరసి చూచి శివకేశవాభేదా త్మకమైన ధర్మాద్వైతమును ప్రతిపాదించి మానవాళికి ముక్తిదూత కాగలిగినాడు. తాకేర్చిన భంగిమచేతనే భక్త కోటికెల్లను వరణీయుడు కాగలైను.

ధర్మంలో సమత్వం కలుగజేశాడు. జీవితంలోగూడ సామరస్యపు ఆదర్శాన్నే నెలకొల్పాడు. విశ్వశ్రేయస్సే కవితకు కామ్యము. అదే రమ్యముగూడా. కర్మసన్యాసాన్ని తిక్కన బోధించలేదు. కర్మవీరునివిధముగా నిరహంకార, పవిత్రభావనారాధ్యుడై, జీవితరణక్షేత్రమున విజయుడు కావలెనని యాతని యుపదేశము. జ్ఞాన, విజ్ఞాన తత్వ ములలో తనప్రజ్ఞ, ప్రతిభ, వ్యుత్పత్తులలో ఐహికజీవిత ములోనే తరించుమార్గమును తెలుసుకొనవలయును. జీవిత మునుంచి తరించుటకు మార్గము జీవితమే ఇదే విశ్వమానవ వేదాంతం. ఈవేదాంతపు అనుష్ఠానమే యోగసాధన.

«ఫలములయెడ బ్రహ్మార్పణ
కలనపరుం డగుచు కార్యకర్మము నడపన్
వలయుం దత్త్వజ్ఞానము
దలకొనినం గర్మశమము దానై కలుగున్.»

శుద్ధసాత్వికసమాధిసంపన్నమైన తిక్కనకవీంద్రుని అంతః కరణమందు భారతీయఐక్యత, సాంస్కృతిక శివేతరక్షిత అలముకొని యున్నవి. ఉత్తరకుమారునిపాత్రపోషణలో తిక్కన వ్యక్తిత్వము మూర్తీభవించింది. ధర్మం, జీవిత వేదాంతం, పాత్రలపోషణ, శయ్యాసౌలభ్యాలలో పద పదమునందు, నవీనత నెలకొల్పతగిన ధర్మమూర్తి తిక్కన. క్రియాశూరతనే చైతన్యపూరితమైన ధర్మముగా బ్రబో ధించెను. «యతో ధర్మస్తతో జయ» యనెడి పవిత్ర ఆశాసందేశం తిక్కన ఆత్మజ్యోతి. సాహిత్యపురూపా లను, జీవితపు ప్రామాణ్యులను, నాటకీయలౌకికాలను, వేదాంతపు గంభీరతలను, భక్తిలోని ఆవేశం, ఆచరణలను సమన్వయంజేసి పతనోన్ముఖమైన జాతిని ఉద్ధరించటానికి పూనుకున్నాడు.

ఉత్తరాపథంలో భారతీయసంస్కృతికి «గొడ్డలి పెట్టులు ఆవహిల్లుచున్న రోజులవి. వ్యాసుని ధార్మిక నిష్ఠ, వాల్మీకిశక్తి, స్ఫురణాలకు మానవాళి మోరెత్తుకొని యెదురుచూస్తున్నది; ముస్లిముల మంజులమనోజ్ఞశబ్దా లతో జాతికి, మతసామరస్యాని కల్గచేయాలని మహత్తర ఉద్దేశ్యంతో 'కబీరు' పసిడిఘంటాన్ని కదలించాడు. బీటలుపడిన భూమిలో సంస్కృతికి బీజాలను చల్లటానికి కృషిజేశాడు. వర్ణభేదరహితసమాజసృష్టిని ఆకాంక్షిం చాడు. రూపరహితబ్రహ్మంలో యోగసమాధిసాధనద్వార

తనసిద్ధాంతాలను సాధించవలసిందిగా ఉద్బోధించాడు.

«సాంధ్యసుందర రాగములలో
భక్తకి న్నెరి యోగములలో
చూడబోయిన- నేనూ -కలసిపోయేనే.»

అనెడి అద్వైతపు ఆవేశాలతో, కావ్యాత్మకమైన ద్వంద్వాలతో, హఠయోగుల సాధనాప్రక్రియలతో భారతీయసంస్కృతిని రక్షించాలని పూనికొనినాడు. సిద్ధాంతాలు, ఆదర్శాలు ఎంతఉశాజనకములైనా, ఆచరణలో సాధ్యంగాని వానిపైని ప్రజల ఆకర్షణ తక్కువగా వుంటుంది.

భారతీయుల జీవితంలో గుణం- «ప్రగతి». ఇదియే జీవితానికి సుగతి. భారతీయ ఆర్ష సంస్థలో వ్యక్తిగతభేదాలు లేవు. వర్ణనిరపేక్షధార్మికసంస్థ అనాటిమానవసంఘం. క్రమంగా యుగపరిణామాలతో సంస్థల కెన్నో సంస్కారాలు జరుగుతున్నాయి. అక్బరులాంటి ధర్మనిరపేక్ష సామ్రాట్టులని పేరుమడసిన యుగంలోనే ఏమూలజూచినా అరాజకతే, అవినీతియే గోచరిస్తుంది. ముస్లిముసామ్రాజ్య కాలములో అక్బరు సామ్రాజ్యవిధానానికి విశిష్టత గలదని చరిత్రకారులు ఒప్పుకొంటారు. అక్బరు సాంఘికనీతిలో సామరస్యం, సౌమనస్యం, కత్తిపై పూసిన తేనెలాగె, బయటికి అందరనీ ఒక్కత్రాటిక్రింద చేర్చాలని ఆకాంక్షిస్తవి. కాని వాని నీతి వానివంశగతలోపం- వివశత్వంతో గూడిన అంధానుకరణగానే నిలచిపోయింది. హిందువులకు తమమతమ్ములోని ఏరాకుమార్తెలను వివాహముచేయగలిగినాడు. చరిత్ర దీనికి నకారాలతో సాక్ష్యాలను సరితీరుస్తుంది. ఈ అరాజకాలకు మూలమైన పరిస్థితులను తొలగించి సమగ్రభారతీయజాతిని నెలకొల్పాలనే ధర్మదీక్షతో భారతీయుల ఆదర్శమూర్తులైన సీత, రామ, లక్ష్మణుల విపులగుణయశోరాచిస్సులను వారిముందు నిల్వచేసిన ధీమూర్తి తులసీదాస్. ఇది భారతీయజీవితంలో ఒక మహత్తరసాంస్కృతికఘటన. భారతీయజీవితంలో క్రమంగా వస్తూయున్న గృహసంస్థ, ఆశ్రమవిధానం, మొదలైన ప్రాచీనపరపాటులను పాలిస్తూ వానిలో ఎన్నో క్రొత్తవైన ప్రేరకతంతులను సమాగపరచాను. వర్ణహితవైదిక సంస్థను ప్రతిపాదించాడు.

«ధూత కహా అవధూత కహా
రజపూత కహా జులహా కహా కోవు
కాహు కి బేటీ సో బేటా
న బ్యాహ వ కాహుకి జాతి జిగార న సోవు»
«తులసీ సరనామ గులామ్ హా
రామ కో జాకో రుచై సో కహా కరో కోవు,
మాంగి కె ఖైవో మసీత్ కో
సోయిబో లేబే కో ఏక్ న దేబే కొ దోవు.»

తన ఆదర్శాలను సాధించటానికి మూలం- తన భక్తిప్రపత్తి:

«భరోసో జాహి దూసరో సో కరో
మోకో తో రామ కో నామ కల్పతరు కవి కల్యాన ఫరో»
కరు ఉపాసన జ్ఞాన వేద మత సో సబ్ భాంతి ఖరో.
మోహితో సావనకే అంధహి జ్యోం సూఝత రంగహారో
యీఅచంచలమైన భక్తివిశ్వాసాలతో తన పాత్రలలో కర్మ, జ్ఞాన, భక్తిని సంభరితము జేయగల్గెను. కాని శ్రీరాముడు మర్యాదాపురుషోత్తముడు. దైవస్వరూపుడు. ఆతనిసహజమగు గుణాలలో ఔచితీనిర్వహణ సల్పుతు తులసీదాసు శ్రీరామునితో దైవత్వాన్ని ఆదర్శరూపంగా మానవకోటికి వేనోళ్ళ చాటేట్లు వర్తింప జేయగలిగినాడు. వాల్మీకి కొన్నిప్రదేశములలో భావావేశంతో తన పాత్రలస్థితి ఔచిత్యాన్నిగూడ మరచివర్తించును. పరశురాముని ఉగ్రస్వభావచిత్రణతో హాస్యం కూడా కలుగుతుంది. కాని యిందులకు కారణము జీవితములోని ఆతని యాచితీకల్పనయో క్రోధాధిక్యత జీవితంలో సుఖవంతం గాజాల దని వానినమ్మకము. సముద్రాన్ని లంఘించటానికి శ్రీరాముడు చూపే మంత్రోపదేశము తమ్మునికి తర్కానికి తావు గానందున ప్రస్తుత కర్తవ్యంగూర్చి తమ్ముని ఆదర్శంతోనే ఏకీభవిస్తూ «ఆత్మసంయమము»ను భోధిస్తాడు.

«మంత్రన యహో లచిమన్ మన భావా
రానువచన సున్ అతిదుఖ పావా.
నాథ దైవ కర కవన భరోసా
సోఖిఅ సింధు కరిఅ మన రోసా»
కాదర మన కహుం ఏక్ అధారా

దైవ-దైవ ఆలసీ పుకారా
సంత విహంసి బోలే రఘువీరా
ఐసేయి కరఒ ధరహు మన ధీరా»

ఇంకా నానాపరమాత్మ, రూపగుణములలోగూడ సమకాలీనభేదాలను రూపుమాపి ఒక ఆదర్శప్రాయమైన బ్రహ్మయే, తిక్కన నమ్మిన ధ్యేయమే అతని బ్రహ్మస్వరూపం. సమకాలీనదేశవ్యాప్త్యమైన శంకరుని అద్వైతవేదాంతమును, రామానుజుని విశిష్టాద్వైతమతమును సమన్వయపరిచి తనప్రభు వగు శ్రీరాముని రూపవర్ణనలో శంకరునిమాయావాదాన్ని, గుణవర్ణనలో రామానుజుని విశిష్టన్యాయాన్ని చిత్రించి, చితికిపోయిన భారతజాతీయసంస్కృతికి జడివాన కురిపించాడు. «సర్వదేవో నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి» అనెడి విశ్వాసం అతనిహృదయంలో నెలకొన్నది.

«ఈశ్వర అంశ జీవ అవినాశి».
«కేశవ కహన జాయి కా కహియే
దేఖత్ తవ రచనావిచిత్ర అతిసముఝు మనహిమనరహియో
అనెడి అద్వైతరూపపరబ్రహ్మను తన మానసికహితుల సమాధానంతో— భక్తిసాయుజ్యంతో
«సగుణహి అగుణహి నహి కఛు భేదా»
అని విశిష్టుడినిగా మార్చివేస్తాడు. ఈవిధంగా తులసీదాసు తనపాత్రలలోనే తనసాంస్కృతికఆదర్శాలను నెలకొల్పాడు. వ్యాసుని శకుంతలవలె వాల్మీకి, తులసీదాసుల «సీత»లు కేవలం నిష్ణాతులే గాదు. ఆదర్శగృహిణులు.
"ఖగ మృగ పరిజన నగర వను, వలకల విమల దుకూల్
నాథ సాథ్ సురసదనసమ, పరణసాల సుఖమూల్."
వ్యక్తిగతసుఖాలకోసం కాంక్షించే సమాజం ఆనాటిది గాదు. సమదుఃఖం, సహచర్యం, యివే ఆయుగపు నారీమణుల ఆదర్శాలు. తెలుగుపూదోటలో ప్రబంధపుష్పాలను పెంచటానికి కావలసిన నందనవల్లికలను పాలవెల్లి కలుగా, తీరుగా తీర్చిన తిక్కయజ్వకు సమానముగ హిందీ వాఙ్మయములో తులసిదాస్ ఒక్కడే. కాంతాసమ్మితముగా వేదసారాలను తమకావ్యాలతో తీర్చారు. «విశ్వశ్రేయః కావ్యం» అనెడిది యిద్దరికావ్యాలలోని కామ్యం. హరిహరులసాయుజ్యం మానవాళికి నవ్యసందేశం. తిక్కనలోని ఆదర్శం- కర్మవీరవిధానము; ధర్మధీరపథము; తులసిదాస్‌లోని ఆదర్శం: భావపాతం: యిద్దరి యుగపురుషులకలాలలో కాలాలు కదిలాయి. అది వారిలోని ప్రతిభా - వ్యుత్పత్తుల మేల్బంతుల సహవాసం. ఈయిద్దరికవుల ధ్యేయాలు ఒకటే; సాధనామార్గము వేరు. ఒకనిది కర్మమార్గము. రెండవనిది భక్తిమార్గము: అంటే వారివారిమార్గసాధనలలో మిగిలిన తత్వాలు ఔపచారిక

ఆంధ్రవాఙ్మయచరిత్రలో 'పోతన' ఒకమహత్తరకార్యసాధకుడు. అతని వైయక్తికదీక్షలో సమకాలీన అంధకారాన్ని పటాపంచలు చేసి జ్యోతిని వెలిగించిన పటిమ గలదు. జైనులు, శైవులు, మహమ్మదీయుల త్రొక్కుడులచే చెల్లాచెదరైపోవుచున్న భాగతీయసంస్కృతికి మూలసూత్రాలు గట్టగలిగిన మానీశ్వరుడు. ఔత్తరాహికులకు, దక్షిణాది వారికి మధ్యరాకపోకలు, రాజకీయసంబంధాలు అనుబంధమైపోయినవి. «దక్షిణ ఉపజీ భక్తి» అని ఔత్తరాహికులలో ప్రబలియున్న గాఢతరవిశ్వాసాన్ని, తన కర్మపటిమతో సహజరూపాన్ని పొందించగలిగాడు. ఔత్తరాహులను ఆవేగ, అనురాగాలను, దాక్షిణాత్యుల ఆలోచన, ఆచరణ, కర్మపథాలను ఐక్యపరిచి «సూరదాస్» కావ్యంలో లేని చమత్కృతిని తనిభక్తకోటికి అందజేసాడు.

«నిసిదిన్ బరసత్ నైన హమారే,
సదా రహతి పావస ఋతు హమపై జబ్ తే శ్యామ సిధారే»
అని రాగాలాపనులతో తనువును మరచిన గోపికల జీవితమాధుర్యానికి తావలమైన ఆశృంగారపురుషుడు, కృష్ణుడు 'సూరదాస్' కావ్యానికి ఆధారం వాత్సల్యం, వియోగశృంగారం, భ్రమరగీతాలు సూరదాస్ కావ్యానికి మాణిక్యాలు. భావంలో సహజత్వం విశ్వవ్యాపకత్వం, మనస్తత్వం పదపదాన వ్యాపించింది. ప్రేమయే- అతని భక్తికి మూలం:
«ప్రేమ ప్రేమతే హోయ్ ప్రేమతే పారహి పాయియే,
ప్రేమ బంధ్యో సంసారప్రేమ పరమారథ లహియే
ఏకై నిశ్చయ ప్రేమకో జీవన్ముక్తి రసాల్
సాంచో నిశ్చయప్రేమకో జహిరై మితే గోపాల్.»

ఇటువంటిసూరదాసుని గీతాత్మకభావగుంఫనలలో భారత స్త్రీయొక్క మాతృహృదయము, ఆదర్శమానవముక్తిదాత యైన కృష్ణుని ఆరాధించటానికి భారతీయ జనులలో కలగే భావోద్వేగము కన్పిస్తాయి. కాని యీ ఆవేదనలో గూడా గోపికలజీవితధ్యేయంలో కర్తవ్యసన్యసత కన్పించదు; విచక్షణాశూన్యత్వం ఆవహిల్లదు. ఉద్ధవుని దౌత్యసమయంలో వారిప్రేమసిద్ధాంతాన్ని ప్రతిపాదించటానికే నిర్గుణపరమాత్మనుగూడ తీవ్రంగా ఖండిస్తారు. నెహ్రూ పండితుడు తన భారతదేశ-ప్రదర్శనము»-గ్రంథంలోనుడివినట్లు 'భారతీయసంస్కృతి ఎప్పటికిని జీవితసన్యాసాన్ని ప్రతిపాదించలేదు. జీవితంలోనే వారు పరమావధిని పొందటానికి ప్రయత్నిస్తారు». గోపికల విరహజీవితంలోగూడ భారతీయస్త్రీకి కావలసిన ధర్మదీక్ష ప్రతిఫలించింది. పోతనకావ్యంలోని వ్యాపకవిషయఅధ్యయనము వ్యాపక కల్పనాసౌందర్యము ప్రబంధసౌరభ్యము, శయ్యాసౌఖ్యాను వ్యాపకజ్ఞాన, కర్మ, భక్తిసూత్రాల సమగ్రత— సూరదాస్ కావ్యంలో లభించును. గేయసౌందర్యము, భావంలోని మార్దవము గానములోని మనోజ్ఞతా— ఈగుణాలలో పోతనకవిత సూరదాసున కేమాత్రము తీసిపోదు. తెలుగువారియింట- యింటా, నోటనోటా వేనువజామున నే విన

> కమలాక్షు నర్చించు కరములు కరములు
> శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
> కమలాక్షునకు గాని కాయంబు కాయమే
> పవనగుంఫితచర్మభస్త్రి గాక»

యీతన్మయపురాగాలలోన మనోజ్ఞత 'గజేంద్రుని ఆలాపములలోని ఆఆర్తనాదము పోతనసాహిత్యములోని నాదబ్రహ్మ మనవీనులకు విందుకూరుస్తూ- యుంటుంది. ధర్మ, విజ్ఞాన, వేదాంత, సంగీత, సాహిత్యసౌరభాలను ఆంధ్రతోటలోఒక్కసమ్మడని వెదజల్లినవి. ఆదివ్యసాంస్కృతికరత్నకుని అమలకుసుమములను ఆంధ్రేతరసాహిత్యవీథుల్లో చక్కగా పోషించగల ఆంధ్రులు ఒక్కరేని జన్మించలేదా! అస్తు.

ఇక విస్మృతసంస్కృతివికాసరేఖలను పరికిస్తాం. బౌద్ధమతము వికాసమునాటికి భారతీయజీవితవికాసము సర్వాంగసుందరంగా వుంది. బౌద్ధయుగములో అప్పటికే హైందవజాతిలో వికృతులు బయలుదేరినవి. వర్ణసంకరసమస్య, శోషక, శోషితప్రజలు ఆశలు, అకాంక్షలు తీవ్రరూపం గావించినవి. భారతీయజీవితమునకు పొలిమేరయైన బౌద్ధయుగము అవసానదశలోగుప్తులరాజ్యాధిరోహణ, చాణుక్యుడు, వర్షకారులవంటి రాజకీయదురంధరులు రాజకీయవిజ్ఞానాన్ని పోషించటం, వజ్రయానబౌద్ధుల శీలరాహిత్యం యివిఅన్నీ కలసి భారతీయఐక్యతకు, సాంస్కృతికఐక్యతకు ముప్పు కలుగజేసినవి. పతనోన్ముఖమైన సంస్కృతిని తదాదిగా రక్షించటానికి పూనుకొనిన సాహిత్యకారులు— కాళిదాసు, బాణుడు, శ్రీహర్షుడు, తులసీదాస్, తిక్కన, సూరదాస్, పోతన, కబీరు, వేమన, మొదలైనవారు పదహేడవశతాబ్దమువరకు నిర్విరామంగా కృషిచేయుచునే యున్నారు. భారతజాతీయ సంస్కృతి ఏడశశతాబ్దినుండి ముగల్ సామ్రాజ్యపతనమువరకు నిరంతరము రుజములతోనే బాధపడుతూ వుంది. యీసమయములోనే సామ్రాజ్యాలు క్షీణించినవి. వ్యక్తిమానసికస్థితి కృశించిపోయినది. భావదాంపత్యం, ధర్మదాసత్వం చేయించటానికి వీలుగా మనసంస్కృతిపైన తీరని గొడ్డలిపెట్లు పడ్డాయి. సాహిత్యకారునిలోకూడ యీభావాలు ప్రతిబింబించాయి. యిన్ని శతాబ్దాలచరమాంకంగా సాహిత్యకారుని ప్రతిభావ్యుత్పత్తులు క్షీణించి సాధారణభోగవిలాసాలలో తులతూనే మహారాజుల ప్రాపకంతో పెరుగసాగేడు. రాజుల ఆనందానికి సాహిత్యకారుడు బొమ్మ అయినాడు. హిందీవాఙ్మయచరిత్రలోని యీపతనయుగంలో లక్ష్యగ్రంథాలకు బదులుగా కొన్నిశతాబ్దాలపూర్వం సంస్కృతభాషాపండితులు నిర్మించిన లక్షణగ్రంథాలకు కేవలం మాతృకలు బయలుదేరినవి. అర్థగౌరవాన్ని మరిచిపోయి, శబ్దసౌందర్యంలోనే తమకావ్యాలను ముంచితేసారు సంస్కృతిని నిర్మించేశ యీకావ్యాలలో ఎక్కడా కానరాదు.

ముస్లింసామ్రాజ్య మంతరించింది. చల్లనిగాలిని విశ్రాంతిగా సేవించుదామని అనుకుంటే భారతమాతకు రెండుశతాబ్దాలకు తీరని దాసత్వ మావహించింది. హిందీసాహిత్యంలోని భారతేంద్రుహరిశ్చంద్రులు, తెలుగునాటి వీరేశ

లింగం, తనుకలాలలో నిర్వీర్యమైన జాతికి తమసంఘ సంస్కరణలద్వారా క్రొంగొత్తపథాలను నిర్మించారు. మహాదేవప్రసాద్, చిలకమర్తి, రవీంద్రుని బంకించంద్, శరత్ చంద్ర లాంటి వచన రచనాధురంధరులు తమవిజ్ఞాన పటిమచే జీర్ణమైన హిందూసంస్కృతికి, మానవసంస్కృతికి నవీనసంస్కారాలతో వన్నెలు తీర్చిదిద్దారు. కొందరి విచారవీథుల్లో నవయుగపు ఆశావకాశాలనుకూలంగా క్రాంతిమాలికమైన కాంతులు వ్యాపించాయి. రవీంద్రుని లాంటి వ్యక్తులు భారతీయసాహిత్యంలోని ఉపేక్షితపాత్రలను ఉద్ధరించి మానవలోకానికి నవ్యసందేశాలను వినిపింపజేశారు. మైకేల్ మధుసూదన్ దాస్ రామాయణములోని రావణునికి ప్రాధాన్యమిస్తూ 'మేఘనాధవధ' లాంటి కావ్యాన్ని సృష్టించి యింతవరకు క్షీణించిన సంస్కృతి చరిత్రను అక్షరాలా వివరించాడు. ఇది భారతీయఆర్వాచీనయుగపు సాహిత్యపుప్రథమదశకము.

తెలుగుతోట «సౌందరనందన» మయింది. 'గుడి గంటలు', 'ముసలమ్మమరణము' 'కృష్ణపక్షము' మొదలైన నవ్యత్వాన్ని వెలిగించే కావ్యాలు బయలుదేరాయి, 'రామాయణ కల్పవృక్షము,' 'గురుభాగవతము' 'రమణ మహర్షి గేయాలు,' 'శివసహస్రి,' 'అమ్మ,' 'ఇంద్రీ సహస్రి' లాంటి జాతీయరత్నాలు యిదేయుగంలో వెలువడినాయి. ఉత్తరాదిన 'కామాయని', 'గ్రామ', 'కురుక్షేత్ర', 'సాకేత్', 'యశోధర' 'మధుకలశ్' లాంటి మాణిక్యాలు వ్యాపించాయి. అర్వాచీన పద్య 'శ్రీ' లతోపాటు 'గోనబుద్దారెడ్డి', 'వేయిపడగలు', 'తంజావూరుపతనము', 'చివరకుమిగిలేది' ఆటువంటి బహుచర్చిత గద్యకావ్యాలు సాహిత్యసీమల్లో విహరిస్తూ వున్నవి. 'గోదాన్', 'సునీతా', 'నదీకేద్వీప్', 'జయసోమనాథ్', 'ఆనందమఠ్', 'పలచనామా', 'మైలాఅంచల్', 'ప్రేతజార్ ఛాయా', 'విషాధమఠ్', 'సింహసేనాపతి', 'దివ్యా' 'అందపాలీ', 'వయం రక్షామః', 'పదర్ యుగ్ కే దో బూత్' లాంటి యెన్నోగద్యకావ్యాలు ఉత్తరాది వారి సాహిత్యంలో శీర్షస్థానాన్ని ఆక్రమించియున్నాయి.

ప్రపంచమంతా యిరువదివయ శతాబ్దపుప్రాంగణములో వెన్నువిరచి నిలపడింది. జాతులు తమజాతిస్వాతంత్ర్యాన్ని నిలదొక్కుకున్నాయి. అమెరికన్లు అర్థనీతితో, రష్యన్లు తమ సమాజనీతితో తమకాళ్ళపై తాను నిలబడి ప్రపంచాన్నంతా ఏదో తీరని ఆవేదనతో చూస్తున్నారు. ఆతీరని ఆవేదనలో మానవజాతికి 'శాంతిని' చేకూర్చాలనే ఆశనే సాహిత్యకారుడు తనకావ్యాలలో రూపొందిస్తాడు. భారతీయసాంస్కృతికనిర్మాణ భావనారాధ్యునిహృదయంలో విశ్వజనీనవేదాంతం, విశ్వశ్రేయ కామన అడుగడుగునా ప్రచ్ఛన్నంగానో, ప్రకటంగానో బయటపడుతూవచ్చింది.

హిందీసాహిత్యంలోని 'జయశంకరుడు' తన శాంకర అద్వైత వేదాంతములో యుగకూలంకషాలలోయుండే నవీనతను నెమరిచ్చగల్గాడు. వేదాంతానికి విజ్ఞానపు చేయూతనిచ్చాడు. కాలంతో కలం కదిల్చాడు. శృంగారాన్ని సింగారించాడు. 'మనుచరిత్రకు' మనోజ్ఞమైనవ్యాఖ్యను నిర్మించాడు. మన తత్వశాస్త్రజ్ఞుల మానసికతత్వాలతో వేదాంతపుతత్వాలను సమాగపరచాడు. జ్ఞాన, కర్మ, భక్తి యోగాలను నవీనన్యాయాలయంలో నిర్వచనాలు కల్పించాడు. రాజ్యాంగానికి, వేదాంతానికి, విజ్ఞానానికి నవీన శాంతిదూతగా వర్ధిల్లాడు.

«తుమ్ దోనోం దేఖో రాష్ట్ర
....ఫైలాఓ మత్ భీతి» రాగాలపతో -
«సంస్కృతికే విక్షతపగరే
చలతా హై డగమగరే
అనులేపసదృశ తూ లగరే»

అంటూ మానవుని అనులేపసదృశముగా నడవవలసినతీరును బోధించాడు. కన్నీటికావ్యాలతో . కాలాన్ని కదలించే «అసూర్యం పశ్య»ను నీతిని ప్రతిపాదించాడు.

అంచల్ మే అం సూ ఖర్ ఖర్ పీనా హోగా
జీవనమే యహ సంధిపత్ర లిఖనా హోగా,

ఇటువంటి 'సమరససిద్ధాంతాలతో' జీవితాన్ని ఆనందపు అర్ణవంగా మార్చవలయు నని ఆశివదీక్షాకంకణుడు ఆకాంక్షించాడు. కావ్యంలో ఛాయాఅనుభూతులతో పాటు పాశ్చాత్యులవ్యక్తివైచిత్ర్యాలను మేళవించి తన కల్పనా సౌలభ్యంతో 'రసోదయం' కలుగజేశాడు. నిష్క్రియాత్మకమైన కర్మసన్యాసమునుదూటే జీవితంవైపు మానవుడ్ని అభిముఖుడిని చేశాడు.

«మైథిలీశరణుడు» గాంధిదేవుని అడుగుజాడల్లో నడచాడు. రామాయణకర్తలచే ఉపేక్షిం గౌణస్థానములో యున్న ఊర్మిల, లక్ష్మణులను ప్రధానపాత్రల పోషిస్తూ హిందువులజీవితపు ఆదర్శాలను రక్షించగలిగినాడు. ప్రోషితపతియైన భర్తవియోగంలో సమాధస్థితియైన యోగులనే మరిపించగల గృహిణి ఊర్మిలపాత్రవికాసంలో భారతస్త్రీలఆదర్శాలను నెలకొల్పాడు.

రాజసుఖ హై బలిపురుష కా భోగ్

మూల్య జిసీకా ప్రాణకా వినియోగ్»

అర్ధాంగియొక్కసహాయోగంలో గార్హస్థ్యం రాణిస్తుంది:- «మాతృసిద్ధ, పితృసత్య సఖీ, మఝు అర్ధాంగి బినా అభీ హై అర్ధాంగ్ అధూరేహీ, సిద్ధ కరో తో పూరేహీ»

ఈవిధంగా జీవితవిధానాన్ని పూర్ణంగా అర్థంజేసుకొనగలిగి రాష్ట్రీయకవిగా వన్నెకెక్కి జాతీయసంస్కృతిని నిల్పుటకు తోడ్పడుతూయున్న సాహిత్యకారులలో గొప్పవాడు. కవిత్వంసరళం. భావం మృదులం.

'ప్రేమచంద్' సాహిత్యము అన్నిప్రాంతాలవారు కొద్దోగొప్పో చవిచూచేయుంటారు. 'సేవాసదనము' లోని సుమనుబాయి జీవితము, 'రంగభూమి' లోని 'సూరదాస్' ఆదర్శము, 'గబన్' లోని మధ్యవర్గపుజీవితములో బాధపడే యౌవనపుపొలమేరలలో సంచరించే రామకాంతుని పాత్రాచిత్రణ, 'నిర్మల'లోని యీడూజోడుకాని వివాహపు జీవితంలోని నగ్నసత్యాలు, 'కాయాకల్ప'లోని పవిత్రఆత్మసంబంధము, 'గోదాన్'లోని పల్లెపట్టణపు ఆవాసములలోని అంతర్యాలు ప్రేమచంద్ హృదయంలోని అంతర్వాణులు హిందీనవలాశకనిర్మాణంలో విస్తృతభానభూమితో నిశ్శంసయముగా తోడ్పడిన శక్తి ప్రేమంచంద్ ది. తనకావ్యపు ఆదర్శాలకోసం పాత్రల జీవితాన్ని, వికాసాన్ని ఎన్నోవిధాలుగా త్రుంచి - విరచి పారవేశాడు. మానవుడే సంస్కృతికి మూలస్తంబము. ఆ మానవుని స్వతంత్రవికాసము మనకెక్కడికక్కడ బంధనాలతో బంధస్తే అతనిజీవితము కృతిమయాంత్రికనియంత్రలాగా మారిపోతుంది. ప్రేమచంద్ ముఖ్యపాత్రల సాంస్కృతిక ఆదర్శం భిన్నాభిన్నమయిపోయింది. సాహిత్యకారుడు సాంస్కృతికరక్షకుడు. వ్యక్తిగతరాగద్వేషాలతో సంబంధంలేదు. మూలగత సత్యము దానికి మూలం, భూతంలోనైనా వర్తమానంలోనైనా, భవిష్యత్తులోనైనా సాహిత్యకారుడు తననిష్ఠతో కల్పనతో ఆసత్యాన్ని పాఠకుల కందించగలమనిరి. సాహిత్యకారుడు తన బాధ్యతను మరచి 'మానవచరిత్రనో పాత్రచరిత్రనో' వ్రాయ మొదలిడితే అతనికావ్యం సాంస్కృతిక నిర్మాణానికి దోహదం కాజాలదు. ప్రేమచంద్ సాహిత్యంలో ఇరువదవశతాబ్దంలోని మొదటి మూడుదశకాల భారతీయులచరిత్ర చక్కగా కథలద్వారా తెలియని వారు తెలుసుకొనవచ్చు. చరిత్ర మనోవృత్తి అతనికావ్యపు యితివృత్తం. సాంస్కృతిక ఆదర్శాలు అతనికావ్యంలో లేకపోలేదు. కాని ఆఆదర్శాలు పాత్రలసహజవికాసంతో వికసించకపోవడం అతని కావ్యానికి తీరనిలోటు. 'నిర్మల'లోని నిర్మమహత్యలు మనజాతికి తగని 'సూరదాస్' లాంటి పాత్రలు మానజాతికి మాణిక్యాలు.

'జైనేంద్రకుమార్' నేటిమేటికథకుడు. కథలలో నవలలో గాంధిగారి అహింస, కర్మసిద్ధాంతాలను గెస్టాల్టు పండితుని వేదాంత, మనస్తత్వశాస్త్రసిద్ధాంతాలతో భారతీయ అద్వైతసిద్ధాంతాన్ని పోషించి సాహిత్యం సత్యం, శివం, సుందరము లను పోషించాలని వాని ఆశయము. ఆశ దొడ్డదే. సిద్ధాంతాలకోసం యీనాడు సాహిత్యము రూపొందుతున్నది. లక్ష్యగ్రంథాల సృష్టి యీనాటి సాహిత్యకారుల కృషికి దృష్టికి ఎంతో దూరమయిపోతూ యున్నది. నవీన శిల్పశయ్యలతో తమసాహిత్యరూపులను సృష్టించటమే వారి ఆదర్శంగా మారింది. నవలలో కథ శూన్యం. ఒక రోజు ఒకగంటలోని ఒకవిచిత్రమానవుని మానసికద్వంద్వాలను, ఉద్వేగాలను చిత్రించటమే వారి లక్ష్యంగా రూపొందింది. ఫ్రాయిడ్, ఎడ్లరు, యుంగ్—యీమనస్తత్వవిజ్ఞుల విజ్ఞానంలోని సూత్రాలే మనవారి సాహిత్యానికి ప్రాణంగా మారిపోయింది. వారిసాహిత్యపురూపాలు పిచ్చివాళ్ళహాస్పత్రులుగా మారాయి. యీకోవలో హిందీనవలారచయితలలో జైనేంద్ర్, వాత్స్యాయన, అజ్ఞాయ, ఇలాచంద్రజోషి ప్రభృతులు ముఖ్యులు. జైనేంద్రకుమార్ ని ప్రసిద్ధిచెందిన «సునీత» నవలయందు భారతనారీమణులకు గాంధీగారి వేదాంతాన్ని బోధించాలనే మిషతో, సునీతను ఆమె

శ్రీకాంత భర్త యైనను శ్రీకాంతునియనుజ్ఞతో భర్త స్నేహితుడు «హరిప్రసన్న» యైన రాజకీయయోధుని మనస్సు మార్చటానికి నియోగించుతాడు. వానిమనస్సు మార్చేనిమిత్తము ఆత్మపరివర్తన గలుగజేయవలయుననే సూత్రమును పోషించాలని, అహింసాసిద్ధాంతపు అనుచరిణి అయిన «సునీత« ఒకనాటి అర్ధరాత్రివ ఒకనిర్జనవనంలో, హరిప్రసన్నని భోగకామవాంఛలను మొదలంట నాశనము జేసి ఆధ్యాత్మికజ్యోతిని వెలిగించాలనే యుద్దేశ్యంతో విగతవస్త్రయై «తనివితీర యిక అనుభవించు" అనే యీనగ్నదృశ్యాన్ని చూడలేక హరిప్రసన్నుడు పారిపోతాడు. ఇక విచారిద్దాం. ఏభారతస్త్రీ యీవిధంగా విగతవస్త్రయై, పరపురుషునిముందు అవినీతికరమైనశబ్దము లుచ్చరించింది?- పతికోసం, పతిప్రతిజ్ఞను రక్షించటంకోసం అని అంటారేమో; భారతనారీమణులచరిత్రలో యిటువంటి విచిత్రం ఎక్కడా లేదు; పతిప్రతిజ్ఞను రక్షించటానికి అమ్ముడుబోయింది చంద్రమతి; ద్యూతంలో అమ్ముడుబోయిన భర్తలకోసం మానభంగం సల్పబోతుంటే సహించలేని ద్రౌపదీదేవి ఆర్తనాదం, మానాన్ని, శీలాన్ని భంగపరచుకొనటానికి సహించలేని వేదనాదాలే. భారతిజాతి గౌరవప్రపత్తులను రూపుమాపే యీసాహిత్యకారుల కల్పనలు హాస్యాస్పదములు.

లక్ష్యం పవిత్రమైనప్పుడు మార్గపథానాలు ఎట్లాఉంటేనే మని కొందరి ఊహ. మనదేశపు వాతావరణానికి అది తీరనిహానికరం, లక్ష్యం, విధానం— రెండింటి సమసహయోగంలోనే దివ్యత్వం ప్రాప్తించగలదు. యీరెండింటి సహయోగం మనసంస్కృతిలోని విశిష్టత. ఇదే మనవారి ఆధ్యాత్మికధ్యేయానికి మూలం. భౌతికజీవితం ముఖ్యంగా వుండే దేశాలవారికి జీవితవిధానం లోని పవిత్రతతో పనిలేదు. ధ్యేయసాఫల్యం వారిదృష్టికి కేంద్రం. వర్గరహితసమాజాన్ని కాంక్షించే మనవారికి యితరులకు అదే ముఖ్యభేదం. ఇదే భారతీయసాంస్కృతికనిర్మాత యైన సాహిత్యకారుని కావ్యధర్మంగా రూపొంది తీరాలి.

'గర్జించురష్యా, గాండించురష్యా' అని పాడుకుంటూ రథచక్రాలను కదలించే మహాకవులకావ్యాలలో భావానికి లోటులేదు. శబ్దంలో స్ఫూర్తి, వాక్కులో హృదయాల నుఱ్ఱూగించే శక్తి ఉంది. కాని భౌతికదృష్టితో గూడి, ధ్యేయంపై ఆధారపడి యున్న ఏంజిల్సు, మార్క్సుల అర్థసూత్రాలను, ధర్మనిరపేక్షసమాజ వేదాంతాన్ని తమ వేదవాక్కుగా అనుసరించారు. కాని మానవరక్తపిపాసతో కూడుకొనియున్నవారి శాంతికామన మనసాహిత్యకారుల ఆదర్శమైంది. వారి రాజకీయసిద్ధాంతాలు మనవారిసాహిత్యంలో ప్రచారాన్నందుతున్నవి. సాహిత్యం వ్యక్తిగతవాదవివాదాలప్రచారాలకు సన్నిహితమయింది. సాహిత్యకారుని ధర్మాన్నే వారు మరచిపోయారు.

హిందీసాహిత్యంలో నాగార్జున్, యశపాల్, రాంగేయరాఘవ్, పంత్ మొ॥లైన సాహిత్యకారులు యీకోవకు జెందినవారే 'దాదాకామ్రేడ్' 'దేశద్రోహి' 'దివ్యా' మొ॥న నవలలో యశపాల్ తన కమ్యూనిస్టు సిద్ధాంతాలనుప్రచారము జేయసంకల్పించినట్లుంది. కాని వీరుకూడ స్త్రీజాతికి తీరని అపరాధం జేశారనే చెప్పక తప్పదు. జీవితములో ఒకపురుషునకు దత్తయైన స్త్రీ ఒక కమ్యూనిస్టువీరునికోసం తనభర్తతో గార్హస్థ్యమును నడుపుచు, ప్రేమించిన ఆవీరునితో అవైదికసంబంధం స్థాపించుకొంటుంది. ఇది మన కామ్రేడ్‌సాహిత్యకారులు చేస్తున్న సాంస్కృతిక సేవ. మార్క్సుసమాజసూత్రాలను మనవారు దుర్వినియోగము చేస్తున్నారన్నను కూడా సబబే.

యుగం మారిపోయింది. అజేయశక్తు లనబడేవాటిని కూడా జయించటానికి మానవుడు సన్నద్ధుడయినాడు. అణుయుగవికాసంతో మానవునిశాంతికామాన కనువైన మార్గ మేర్పడింది. కారణం -అది వివశత్వంవల్ల యేర్పడినదే. యుద్ధమనేనామానికి యిక స్వస్తిపాడవలసినసమయంకూడా యేర్పడింది. హృదయశక్తులను విజృంభించజేసి హృదయసామ్రాజ్యాలను వికసింపజేసి విశ్వప్రేమ సముదయాన్ని నెలకొల్పే బాధ్యత ప్రతిమానవునిపై నిలచిపోయింది. అటువంటి యీయుగంలో సాహిత్యకారుని పైడిప్రేమధారలకు పుటలే నిండిపోవాలి. చిరచమత్కారాలతో కూడిన ప్రేమవర్షంతో సాహిత్యకారుని సాంస్కృతికనందనాలు చిగురించాలి. ప్రగతియే ప్రేమ సుస్థిరానికి మైలురాయిగా మారాలి. అమ్మపాదాలను అమృతంతో అభిషేకించి, సంస్కృతీగానాలతో ప్రాంగణమంతా మారుమ్రోగించి, దివ్యచలదిపందిర్లలో అందరకు ఆనందమును కల్గుజేయుటయే సాహిత్యకారుని సౌందర్యంగా ప్రతిపాదించాలి. ఐక్యత్వం, సమభారం, సద్భావం, సౌమనస్యం మాసౌందర్యకుమారుని వైజయంతీముత్యాలుగా వర్ధిల్లాలి; శాంతికామనయే మన ఆధ్యాత్మికకామనగా మారాలి. «ఓం శాంతి శాంతి శాంతిః.»

# శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి ప్రశంస

శ్రీ నిడుదవోలు వేంకటరావు



## ఉపశ్రుతి

శ్రీపాద నాంధ్రకవనది
శాపూరితు కృష్ణమూర్తిశాస్త్రి నవీన
శ్రీపారాశర్యుని నుతి
నాపాదించెదను సతము నాంధ్రనలందా."

(ఆంధ్రనలందాశతకము-మదీయము)

౧

రంధ్రాన్వేషణతత్పరత్వ మగు నాంధ్రం బందు సత్కావ్యతా
సంధృత్వంబున సర్వలోకజనతాసంభావ్యమై యొప్పు నీ
రంధ్రం బైన యశంబు నించుచు సుధర్మాస్థానముం జేరితే
ఆంధ్రాస్థానకవీంద్ర! తెల్గుకవిగా నాయింద్రలోకంబునన్.

౨

అమరాస్థానకవీంద్రుఁగుండె దిగులై యారాటముం జెందఁ ద
త్సమపీఠిన్ గసేయిసె మున్ను కవిరాజన్మూర్తి శ్రీనాథుఁ డ
గ్రిముఁడై యాతనిప్రక్క నేఁ డభినవశ్రీనాథదివ్యాభిధన్
నమరు న్నీవునుఁ గృష్ణనామమున విఖ్యాతంబుగా వెల్గుమా!.

## చరిత్ర

శ్రీపద్మోద్భవ సర్వదిశాపాలసమర్చ్యమహితసంవేద్యము లౌ
శ్రీపాదంబులఁ గొల్చుట శ్రీపాదాన్వయులు నాగఁ జెలఁగిరి యాంధ్రిన్

వెలనాఁటివారికై తకు వెల నాఁటిన కృష్ణమూర్తి విబుధుఁడు తానై
తొలినాఁటి కతల నెలను తెలినాఁటను నాఁటె తేట తెలముఁ గాఁగన్

భారతమును భాగవతము నారామాయణము తానె యసహాయుండై
ధిరత రచించు కవితాశూరుఁడు సూరుం డటంచు జోతల నందెన్

పదునై దేండ్లు పరిశ్రమించి రచియింపం బూర్తియా భారతం
బది యుష్మద్యశమందిరంబున† కగుఁ బంగారపుంబూఁతగా
నొదవెన్ దుఃఖములందు సూనుమృతి; ధీరోదాత్తత నిల్చునీ
హృదయస్థైర్యము నాంధ్రవాఙ్మయతపస్వీ! నిత్య మారాధ్యమే.

శతవధానమ్ము నొనరించె సంస్కృతమున
అచ్చ తెనుఁగునఁ జిత్రకావ్యములు వ్రాసె
ఆకళావతి గౌతమి యనెడు పేరఁ
బత్రికలఁ బెట్టి:                ము వహించె
పెట్టుబడియైన వాని గిట్టలేదు.

వ్యావహారిక భాషావివాద మడఁపఁ
గొండయైనట్టి యాగిరాంపండితుపయి
వేయ పత్రిక పేరి వజ్రాయుధంబు
వ్యర్థమైనను నది భవదనుపమాన
గ్రాంథికాంధ్రాభిమాన మగ్గలిక నించు.

శతశతాధికమైన నీకృతులలోన
కావ్యముల భారతము నాటకములయందు
బొబ్బిలియు నందు కీర్తి సంపూర్తి నించె
నన్నికడలనఁ బొల్చు నాంధ్రాభ్యుదయము.

భారతావనిలో శాస్త్రపండితులకె
యర్థమై సార్థకంబయి యలరునట్టి

†సంస్కృతమున యశశ్శబ్దము సాంతపదమైనను తెల్గున, సమాసములలో యశోమందిరము అనియే గాక, యశమందిరము అని యగును. 'సమ్యగ్యశశాలి'—అని ఎఱ్ఱన ప్రయోగము. భార. అర. ౭·౫౧.

శ్రీమహామహోపాధ్యాయ నామబిరుద
మద్దియును నిన్నె వరియించు టరిదిగాదె.

ఈరీతిఁ జెప్పుచుండఁగ
భారతమంత యగు నీదుభవ్యచరిత్రం
బారూఢి భారతావని
భారమ్యం బగుచు వెలయు వాగ్దేవి కృపన్.

అద్భుతనాంధ్రవాఙ్మయమునందున దీటును సాటిలేని యు
ద్యద్యజనీయుఁ డై, కవిపితామహుఁ డై యొనరించె నేఁడు సం
వేద్యముగాఁగ సత్కవనవిశ్రుతసృష్టిని యిట్టిసేఁతలోఁ
జోద్యములేదుగా కుశికసూను సగోత్రజుఁడైన వానికిన్.

## స్తుతి

కవిరాజున్, కవిసార్వభౌమ బిరుద ఖ్యాతుండు, విద్వజ్జన
స్తవనీయైకకళాప్రపూర్ణుఁ డగుచున్ స్వర్ణాభిషేకుండు నై
కవిలోకాంచితగండరపెండెరపరిష్కారాదిసత్కారకీ†
ర్తివిశిష్టున్ నుతియింతుఁ గృష్ణకవి నే శ్రీపాదవంశోద్భవున్.

విశదాత్మీయకవిత్వతత్త్వరచనావిక్రాంతిఁ బెంపారఁగా
ద్విశతాధిక్యకృతుల్ రచించు కవితాదివ్యుండ వీ వింక నా
వశమా ప్రస్తుతిసేయ మిమ్ములను శ్రీపాదాన్వయోద్ద్యోతితా
శశివైఁ బొల్చిన వాఙ్మయాంబుధిమహాసాంయాత్రికాగ్రేసరా!

ప్రాచీనాదరణీయభవ్యకవితాప్రావీణ్యసంపత్కళా
రోచిస్స్ఫూర్తుల సించు తావకయశోరూపంబు వెల్గొందెడిన్
ప్రాచీపశ్చిమదక్షిణోత్తరదిశాభాగప్రదీప్తింబు నై
యాచంద్రార్కముఁ గాఁగ నాంధ్రకవనవ్యాపారపారంగతా!

† గండపెండేరము తెల్గున సాంకేతికపదము, బిరుదవాచకము కావున సంస్కృతసమాసముతో సమసించినది.

# పగటివేసాల భక్తుడై బ్రదుకజాల

శ్రీ శిష్టా సత్యనారాయణ రాజశేఖరం

తగినచో నిత్యసత్యము నిష్ఠ నాకు ని
మ్మొకనాటి నిర్వాక మొల్ల నేను
కలుగుచో నిత్యనిష్కామిత నిమ్మశ్మ
శానవైరాగ్య మాసపడ నేను
చాలుచో నిత్యశీలుడై మననిమ్ము
మిధ్యాధికార మేమిటికి నాకు
వలయుచో నిత్యార్తిభరితకీర్తన మిమ్ము
వట్టి పాండిత్యంబు వలదు వలదు
శివ కోరితివేని సాన్నిధ్యమందు
నిత్యసాధన లిచ్చి మన్నించు దేవ!
క్షణము చిత్తము విత్తము క్షణము నైన
పగటివేసాలభక్తుడై బ్రదుకజాల.

నోటితో లేదని మాటమాత్రనలేదు
చేతతో లేదని చెప్పినావు
నీసేవలో నుండ నెలవులే దనలేదు
వేయిబాధ్యతలు కల్పించినావు
నిలదీసి యడుగ 'నానిర్దయా? నీఅపా
త్రతయ కారణ?' మని తఱచినావు
ఇన్నాళ్ళు నిను గొల్చుకొన్నందు కింతైన
తలపించుచె బహూకృత మనినావు
పాము సావదు విరుగదు బడితె యన్న
సామెతైనది నాజన్మ నీమహిమయు
నన్ను రక్షించుటకు నీవొ నిన్ను వదలు
కొనుటకై నేనొ తెగియించు కొనుమి, దేవ!

మంచిరోజుకు పొంచి పొంచి నే నుండ నే
యమవసో నీ కెన్నికైన దినము
ఏ మహాయోగమో యే నెంచ నీకు భం
గీవృత్తి యేదొ అంగీకృతమ్ము
దివ్యగానము సమర్థించి నే రచియింప
నార్తనాదమ్మె నీ వాలకింతు
వాచారధర్మమే నగ్గింప నే నిరా
డంబరుడో నీమనంబు నించు
నాకు నీకును నింత అంతరమె దేవ!
ఉండిపోదుమె కటకటా యొక్కచోట?
నేను విడుదాక నీకు, నాహృదయమందు
నీవు విడియంగ నాకును తావు కలదె?

కలవారు తెలవారు కడలేవ సాధన!
అదియె పేదకు సాజమైన నడత
యువనారి నెద గోరకుంట పెద్దకు బోధ!
శిశువున కది నైజసిద్ధగుణము
తపసికి నిశ్చలత్వమ్ము యోగమ్ము ని
ర్జీవశైలమునకు సృష్టిభవము
ఆత్మదర్శికి మౌన మన్న చిద్భావన
పశువున కదియే స్వభావజనిత

మెంతదనుకను వెనువెన్క కేగి తక్క
నిన్ను గాంచుట యలవిగాకున్న దేని
ఈవృథాపరిణామ మీ జీవి కేల?
తొంటి నీ యందె యనుపరాదో హృదీశ!

కరకర పచ్చికాకరకాయ కొఱకుట
కాదులే జిహ్వానిరోధ మన్న
బడబడ బ్రహ్మతత్త్వములు వల్లించుట
కాదులే వేదాంతబోధ మన్న
దుడదుడ గనుపడ్డ నడయెల్ల నడచుట
కాదులే సంఘసంస్కార మన్న
గడగడ పగతురకడ నెల్ల వడకుట
కాదులే హింసానిగర్హణ మన
శైలఖండ మట్లు చాగని బిగయని
కటుత సంయమమ్ము కాదు లెమ్ము
సలుపదగిన దెల్ల సలుపంగ దగుపట్ల
సలిపికొనుటె బ్రహ్మచర్య మీశ!

కాసంత నిజమున కాసచేసినవారి
కడదాక నిజమున కట్టుపఱచి
ఆవంత పాడికినై తపించినవారి
నాజన్మమును పాడి కంటకట్టి
ఇసుమంత నీతికి కసిమసంగెడివారి
నసిధార నడిపించి వ్యసనపఱచి
గోరంత సాధన కోరి చేరినవారి
ముప్పమున్నీటిలో ముంచియెత్తి
తలచి కొలిచిన మనసుల గలచి యలచి
నిఱవబడ నిల్పి నిలకున్న నెట్టివైచి
పలుచ పఱచుటె దేవ! నీ పరమకృపయొ
వలచి వలపించుకొనుట నీ వంతు కాదొ!

# అమరజీవి బాపిరాజు

## శ్రీ వాడరేవు సుబ్బారావు

"అడివోరి చిన్నాడ, అమృతధారలవాడ,
అభినందనము లివే అందుకో చెలికాడ!"

అని రాయప్రోలు సుబ్బారావుగారు బాపిరాజుగారిని అభినందించారు. అఖిలాంధ్రదేశానికి లలితకళారంగములో అఖండకీర్తి నార్జించిపెట్టిన 'కులపతి' అడివి బాపిరాజు గారు మన్మథనామసంవత్సర ఆశ్వీయుజ బహుళ పంచమి (8-10-1895) నాడు జన్మించినారు. బాపిరాజుగారితండ్రి కృష్ణయ్యగారు ఉద్యోగరీత్యా కొవ్వూరులో వుండుట వలన బాపిరాజుగారి బాల్యమంతా కొవ్వూరులోనే గడిచినది. వీరు ఎప్పుడూ గోదావరి ఒడ్డునే కాలం గడిపేవారట. అందుకే ఆయనను గోదావరీ, పాపికొండలు అంతగా ఆకర్షించి వుండవచ్చు. వీరు రాజమండ్రి కలాశాలలో చదువుకొనే రోజుల్లో ఆకళాశాలప్రిన్సిపాల్, చిత్రకారుడు అయిన ఓస్వాల్డు కూల్డ్రేగారు వీరిలో నిద్రాణమైయున్న కవితనూ, చిత్రకళను గుర్తించి మేల్కొల్పిరి.

రాజమండ్రికళాశాలలో చదువు పూర్తికాగానే అమరశిల్పి శ్రీ ప్రమోదకుమారచటర్జీని చేరి బందరు ఆంధ్ర జాతీయకళాశాలలో చిత్రకలాశిక్షణ పొందారు. తదుపరి మద్రాసు 'లా' కాలేజిలో 'లా' డిగ్రీ పొంది కొన్నాళ్లు భీమవరంలో న్యాయవాదిగా ప్రాక్టీసు చేసిరి. తరువాత ఆపదవిత్యజించి బందరుజాతీయకళాశాల ప్రిన్సిపాల్ గా చేరారు. మచిలీపట్నంనుండి వెలువడే 'త్రివేణి' ఇంగ్లీషు పత్రికకు ఉపసంపాదకునిగానూ, హైద్రాబాద్‌నుండి వెలువడే 'మీజాన్' పత్రికకు సంపాదకుడిగానూ పనిచేసిరి- విజయవాడ రేడియోస్టేషనువారికి అడ్వయిజరుగా కొన్నాళ్ళు పనిచేసిరి. అన్నిరంగాలలోనూ ప్రవీణు లనిపించుకున్న వారు బహుతక్కువ. బాపిరాజుగారు కవి, చిత్రకారుడు, నవలారచయిత, కలాదర్శకులు, నాటికారచయిత, అన్నిరంగాలలోనూ ఆరితేరినవాడు.

కవిత్వము :

వీరికవితలో ప్రేమ, కరుణ, వీరత్వము ఏదైనా హృదయంతో మాట్లాడుతుంది.

ఉప్పొంగిపోయింది గోదావరీ!
తాను తెప్పున్న ఎగసింది గోదావరీ
కొండల్లు ఉరికింది కోనల్లు నిండింది
అడివిచెట్లన్నిని జడలతో తురిమింది ॥ఉప్పొంగి॥
సుడులలో వడులలో గర్వాన నడలలో
శంఖాలు పూరించి కిన్నెర్లు మీటించి
నరమానవునిపనులు శిరమొగ్గివణికాయి
ఆకాశగంగతో హస్తాలు కలిపింది ॥ఉప్పొంగి॥
ఊళ్ళు దండలుగుచ్చి మెళ్లోన తాల్చింది
పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహిస్తు వచ్చింది
శంఖరాభరణరాగాలాపకంఠియై
కరమెత్తి దీవించి కడలికే నడచింది ॥ఉప్పొంగి॥

అనేపాటలోని భావవిశిష్టతను, పటుత్వాన్ని గోదావరి వరదలు చాటుతున్నవి. తాను, తనమిత్రులు వారిగురువుగారైన కూల్డ్రేగారితో పాపికొండలను దర్శించినపుడు అక్కడ-

'ఎల్లావుకు గడ్డిలేదు, నల్లావూ చిక్కినాది, ద్రో
రావూ, బట్లావు, తూలిపోయిన గొడ్డయ్యో, మన్నేనికి
పోయివస్తువా, ఓ నావన్నెల వీరన్నబావా ॥మన్నేనికి॥
సీతకట్టు తిరిగేదాకా - చేమంతులు పూసేదాకా
దూళ్లన్నీ తోలుకుంటూ కళ్ళకికనబడరావా ॥మన్నేనికి॥

అని ఒకపడుచు జాలిగాచూస్తూ తనభర్తనుసాగనంపుతున్నదట. తొలకరిజల్లు పడగానే అచట రైతులు తమదూడల్ని కూనవరం అడవిప్రాంతాలకు తోలుకొనిపోయే ఆచారం ఎంతోహృదయంగమంగా చిత్రించారు.

అంతేకాదు బాపిరాజుగారు దేశభక్తిగేయాలెన్నో వ్రాశారు.

మచ్చుకు: 'హిమాలయోత్తుంగశృంగం నీబ్రతుకు ఉమాపతినృత్యరంగం' దేశాలవాంఛలు ఆశాహృదయములు నేలాదివిపోలేనిశీతల తలాలలో జీమూత పంక్తిపై వ్యోమవర్త్మముచూచు. ||హిమాలయోత్తుంగ||
అనేగేయాలు శిరోమాణిక్యాలవంటివి.

'తెలుగుతనమూ జారిపోయిన తెలివిమాలిన తెలుగువాడా
పేరుమార్చుకు దారినడువుమురా నీఊరిలోనే.........'
"ఆంధ్రత్వమంటేను సిగ్గూ నామనసూ
అరవత్వమంటేను మొగ్గూ'
ఇలాంటి తిట్టుకవిత్వంకూడా చవిచూపించాడు.

బాపిరాజు జానపదసాహిత్యంలో అవిరళకృషి సల్పినాడు.

'నన్నుసూసీ నవ్వింది దేసోళ్ళ చిన్నది, నన్నుసూసీ నవ్వింది'. 'కొండొండోర సెరువులక్రిందా నేనిరి ముగ్గురు ఎగసాయం; ఒకరికి కాడీలేదు రెంటికి దూళ్లూ లేవూ' యిలాంటివి ఎన్నో కలవు.

బాపిరాజుగారి కావ్యజగత్తులో ప్రత్యేకంగా పేర్కొనదగినవి ఆయన ప్రణయగీతాలు. వీరు 'శశికళ' అనే ఒకఆరాధ్యదేవతను కల్పించుకొని, ఎన్నో రసవంతమైన ప్రణయగీతాలు రచించాడు.

ఓ చెలీ నీ వెవరు? ఓచెలీ నీ వెవరు?
కలలోని పాపవా? కతలోని బాలవా?

మధురమందానిలపరీమళమవో, మధుమత్తశారదాత్మిక సుషమవో! సుందరాప్సరసాంగనాకంఠతుందిలము మందారమాలవో! ఓ చెలీ!

"బ్రతుకంతా నిరీక్షణము మతిఅంతయు వీక్షణమై
ఈనిశిలో గాటపు తమి నేను లేచియుంటి నొంట
ఈనిశిలో రొదలులేవు ఈనిశిలో సొదలురావు
వేచియుంటి ఎవరికోరకో? కాచియుంటి ఏఘటనకో?"

అని అంటూ డోకగీతంలో.

"ద్వేషమే నా బ్రతుకుమార్గం, వేషమే నా సత్యరూపం
మోసమే నానిత్యకర్మం మూర్తిమంతులకున్?
ఇరుగువారల కేది కూడూ, పొరుగువారల కేది గుడ్డ!
ఇరుగుపొరుగులు లేనిమనం దొరలు దొంగలకు"

అని పాడుతున్న బుద్ధుడు బాపిరాజు. వారు సృష్టించిన అమ్మను చూడండి -

'రావమ్మా నాపాప రావమ్మ తల్లీ వచ్చి నాఅడ్డాల
వాలిపోవమ్మా, చేపొచ్చి నాపాలు చెదరిపోయేనూ,
చిరిగిపోయే రవికె జేబులూ రెండూ ||రావమ్మ||

బాపిరాజుగారికి ఆంధ్రాభిమానము విశాలాంధ్రావతరణాన్ని ఊహించి- "గజపతిదేశం రాయలసీమా కళింగ రాజ్యం కాకతిభూమి ఆంధ్రులందరూ ఒకటౌతారని ఏక కంఠమున పాటనిండునని మోగింపమ్మా జయజయ ఢంకా" అని పాడుతున్నారు. ఇట్లాంటి రచనలు కోకొల్లలు.

కథాసాహిత్యం:

బాపిరాజుగారికథాసాహిత్యం వచ్చేసరికి మనము యీ ప్రపంచాన్ని వదలి మరోప్రపంచంలో ప్రవేశిస్తాము. దానిలో ప్రళయఘోషలూ, వెళ వెళారావములు యేమీ కనిపించవు. యీప్రపంచంలోని సెలయేళ్ళు మంజుల మర్మరాగములతో నడక సాగించును. మలయమారుతము వీచును. మయూరములు నృత్యము చేయును. కోయిలలు కూయును. భావాన్ని కథారూపములో పెట్టుటకు మంచికల్పన, ఆకల్పనను సాహిత్యరూపేణా తీర్చిదిద్దుటకు విపులపదజాలమూ, విన్యాసశక్తి ఆయనలో కలదు. ఆయనకథనములో కవితాగుణ మున్నది. "కాదంబరీరసజ్ఞానా మాహారోపి నరోచతే" అన్నమాట నిజమని మనము తెలుసుకుంటాము. ఆయన విహరించేది ఆకాశమార్గముననే. ఆయనకథలన్నీ ప్రణయాత్మకములే అనవచ్చును. ఆయన సఫలత చారిత్రకమైనప్రేమకథ అల్లుటలోనే యిమిడియున్నది. వర్ణనలలో ఆయన అసమానుడు. దృశ్యాలను కళ్లకు కట్టునట్లు వర్ణించగలడు. లలితకలా ప్రాశస్త్యాన్ని ప్రకటించుటే ఆయన పరమావధి. బాపిరాజుగారు తనవస్తువుకు తగినభాషను స్వీకరించారు. ఆయన కల్పనలు పాఠకులను మరొకజగత్తులోనికి తీసికొని పోయి

ఆనందపరచునట్లే, ఆయనహృదయంగమైనభావనుకూడా వాడియున్నాడు. ఆశబ్దలాలిత్యమే మనల పరవశులను జేసేది. భోగీరలోయ, శైలబాల, సోమసుత, సూర్యసుత, రాగమాలిక అనే కథా సంపుటి మొదలైనవి వీరి కథలు ఇంగ్లీషు, హిందీలలోనికి అనువదింపబడినవి.

నవలలు :

వీరు పెక్కు చారిత్రక, సాంఘిక నవలలు రచించిరి. వీనిలో - నారాయణరావు, తుఫాను అగ్రశ్రేణికి చెందినది. అంశుమతి, హిమబిందు, గోనగన్నారెడ్డి, అడివి శాంతిశ్రీ, కోనంగి, జాజిమల్లి, నరుడు అనే వీరినవలల్లో ఆంధ్రుల గుణశీలసంపత్తులు, అభిరుచులు, సాంఘికవ్యవస్థ కండ్లకు కట్టినట్లు అగుపిస్తవి. వీరు అనేకరేడియో నాటికలు రచించిరి. ఉషాసుందరి, కృతిసమర్పణ, నారాయణరావు, శైలబాల, భోగీరలోయ, మొదలయినవన్నీ రేడియోలో ప్రసారితమైనవి.

చిత్రకళ :

బాపిరాజుగారు సమర్థుడైన చిత్రకారుడు. చిత్రకారుడూ, కవీ అయినవాడు వర్ణిస్తే, ఆవర్ణనలో ఒకవిశిష్టత ఉంటుంది. వర్ణింపబడిన దృశ్యం స్పష్టంగా మనకళ్ళ ముందు ప్రత్యక్ష మవుతుంది.

„నీలిమను పవళింపు నిదురించు నీసొంపు
తేలిపోతూ దిగెను వేలతే వెలిగేను
తొంగలించే వయసు నింగి నంతా బలసె
బంగారు మంచాన పవళించె నీసొగసు„

ఇలా ప్రేయసిని ఎంతో స్పష్టంగా, సరసంగా, చిత్రించాడు. వీరిచిత్రములు బహుళజనాదరణ పొందినవి. విశ్వనాధసత్యనారాయణగారి 'కిన్నెరసాని పాటలు'కూ, నండూరివారి 'ఎంకిపాటల'కూ, ఇంకా 'సుభద్రాప్రణయం' అనే కావ్యానికి చిత్రాలు గీచి యిచ్చారు. వీరు ఎవరికైనా ఆటోగ్రాఫు లిస్తే తప్పకుండా ఏదో ఒకచిత్రం గీయక మానరు. బాపిరాజుగారు కలాదర్శకులు, సతీఅనసూయ, ధృవవిజయం అనే చిత్రములకు కలాదర్శకత్వం వహించారు. వీరు ఏగీతగీసినా అది ఒక చిత్రమే. ఆధునికకాలంలో తిరిగి మనచిత్రకళకు ప్రతిష్ట నార్జించి, యువచిత్రకారులకు దారిచూపిన మార్గదర్శి బాపిరాజుగారు విశ్వనాథవా రన్నట్లు - „అతడు గీసిన గీత బొమ్మై, అతడు పలికిన పలుకు పాటై, అతని హృదయములోని మెత్తన అర్థవత్కృతియై„ ఈప్రకారంగ బహుముఖాల అధునాతనఆంధ్రసాహిత్యవైభవాన్ని దిగంతాలకు వెలార్చిన పవిత్రమూర్తి బాపిరాజు. ఆయన ఆంధ్రసాహిత్య తారాపథంలో ఒక ఉజ్వలతార, అమరజీవి.

# హరిహర స్తుతి

శ్రీ కూచిభొట్ల ప్రభాకర శాస్త్రి, శ్రీ గట్టి లక్ష్మీనరసింహ శాస్త్రి

పరమము, భూతహృత్కుహర
వాసము, సోమకలావిలాసము౯,
వరకరుణారసాకరము,
భవ్యము, గోకలనాప్రవీణము౯,
సరసిరుహోద్భవాద్యమర
సంస్తుతపాద, మనాదిసిద్ధ మా
హరిహరసంజ్ఞకమ్ము సుమ
హత్తరతేజము నాశ్రయించెద౯.

త్వర నవిషాదియ యై మం
దరాగధరణ ప్రవృత్తిఁ దనరి నిలింపో
త్కరముల కమృతము నొసఁగిన
ధరలీలోచితమనోజ్ఞ తనుఁ డోముత న౯.

మహిమోల్లాసకలావిధానమునసా
మాన్యమ్ము మాన్యత్వ మొ
ప్ప హితాత్మీయమహార్తిహర్త యవుచు౯
భాసిల్లు నుద్యద్యశో
వహు దుర్వారపరాక్రమక్రమునిఁ గ్ర
వ్యాద్వారముం గ్రోధవ
హ్ని హుత మ్మాచరియించి మించిన వరా
హాంశాంగునిం గొల్చెద౯.

మెఱసి కేసరిత్వస్ఫూర్తి మివుల, ననిమి
షద్విషత్కుంజరు నసుశ్వసనము లూడ్వ
లావరి యయి ప్రహ్లాదవిలాసకార
ణుండు పంచాననుం గొల్తు నిందుభ

వామనయను పేరొప్పార బల్యుపాహ
రణముకొని కుదితుఁడయి చర్మమ్ము దాల్చి
పాల్చి కాంతారహితవృత్తి భూరితప మొ
నర్చి నప్రథమాశ్రమివరు నర్చసేతు.

ప్రథితబలుఁడు, ప్రోద్యత్తరవారి, శీత
కరకలాస్ఫురితుఁ డెవ్వాఁడు కనలుకొని భ
యంకరాయోధనమ్మున నర్జును బ
రాజితుం జేసె నతఁ డవుఁ బ్రాపు మాకు.

ఒగి నలీకభవమున నిజోరు తేజ
మునన కామద్విషు దశాస్యుఁ గినుక పేరి
చిచ్చునన్ భస్మసాత్కృతుఁ జేసినగడు
సరి ధరాత్మజారోజోష్మసాక్షి నెంతు.

తలఁతు నుత్తాలకేతుని, ధర్మమూర్తి,
శుద్ధు, రోహిణీశాంశచుంబ్యమాన
మస్తకాన్వితు, ధూతసమస్తకలుషు,
దివ్యు, హాలాహలస్వీకృతిప్రవీణు-

శాం

వంద్యు, నాకలితాహితాపమ్ముగాఁగ
నంతికస్థవినాయకు, నభికలాప
భూషుఁ బూతనామోహికపుణ్యచిత్త
వృత్తి, నుద్వృత్తదమను, సర్వేశుఁ గొలుతు.

క్రతువిద్వేషకృతాదరు
జితలతికాంతాస్త్రు బోధశేవధిఁ గరుణా
ప్పుతి సంప్రతీతసర్వ
జ్ఞతాభిరాము నతసోము సన్నుతి సేతున్.

పాసి మనోవిషయత్వము
భాసిల్లు తమోనిహంత, వరవాహు, సదా
వాసకృతాశయు, ధర్మా
భ్యాసు, నభవుఁ జేరు నాదువందన శతముల్.

# మన సంగీత సాహిత్యాలు

శ్రీమతి పిల్లలమర్రి సుశీల



«సంగీత మపి సాహిత్యం సరస్వత్యా స్తనద్వయమ్
ఏక మాపాతమధురం అన్యదాలోచనామృతమ్»

అన్నారు. సంగీతములో సాహిత్యమున్నది. సాహిత్యములో కూడా సంగీతమున్నది. సంగీతసాహిత్యాలు రెండూ అతి సన్నిహితాలు అయినట్లు తెలుస్తున్నది. ఛందస్సు వీటిని పదిలపరుస్తున్నది. కాని దేనికదే! సంగీతములోని స్వర కల్పన, శైలి రీతులు వేరుగానే వుంటాయి. సాహిత్యము లోని ఛందస్సు కల్పనలూ అసామాన్యాలు, అద్భుతాలూను.

నాదము ప్రధానమై, జంత్ర గాత్రములయందు స్వర విన్యాసంచేత అవ్యక్త మధురమై, పిల్లలకూ, పెద్దలకూ, పండితులకూ అఖరికి పశుపక్ష్యాదులకుకూడా పారవశ్యము, ఆనందము, తన్మయత్వము కలిగించి ఐహిక, ఆముష్మిక సుఖదాయకమై ఒప్పేది సంగీతము. అంచేతే «శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణిః» అన్నారు. ఒకటి నాద బ్రహ్మము, మరొకటి శబ్దబ్రహ్మము. భావరాగతాళములు సమ్మిళితాలై లయ ముఖ్యముగా పరిగణింపబడుతుంది.

ఇంక సాహిత్యము అంటే కవిమనస్సులో పుట్టేదీ, రస భావాల కనుకూలమైందీ, ఛందములలో కూర్పబడిందీ పద ములచేతా, యతిప్రాసలచేత వర్ధిల్లేదీ, సందేశా న్నిచ్చేదీ, గద్యపద్యరూపములలో అవతరించేదీ సర్వ జనాకర్షమైన శిల్పముతో ఉండి పండిత పామరులకు ఉల్లాసమూ, ఆనం దమూ కల్గించేదీ. ఈ ఆనందము 'నీటికొలది తామరసుమ్మీ' లాగా పాఠకుల సహృదయాన్నిబట్టి ఉంటుంది. లలిత కళలలో హృదయ ద్రవీకరణశక్తి, రాగ రంజితగుణమూ సంగీత సాహిత్యాలకే అధికంగా అమరివున్నవి. ఈ రెండిటి ఆశయమూ, పర్యవసానమూ ఒకటే అనవచ్చు. సంగీతో పాసనమువలన ఐహిక ఆముష్మికాలు సాధింపదగినట్లే— సాహిత్యోపాసనవలనకూడా ప్రవృ నివృత్తులను రెం టినీ సాధింపవచ్చునని మనద్రష్టల విశ్వాసము. వాల్మీకి రామాయణం 'పాఠ్యే గేయేచ మధురం' అన్నారు. అంటే అది సంగీతసాహిత్యాలను రెంటినీ అధికంగాకలిగి ప్రమోద పరచునదని తాత్పర్యము. సంగీతసాధనమువలన పరమభాగ వతులైన త్యాగయ్య క్షేత్రయ్యలు ఎటువంటి పదమునూ ఖ్యాతినీ పొందారో, భారతభాగవత రామాయణాలు రచించి అంతటి స్థానాన్నీ, కీర్తినీ పొందారు నన్నయ తిక్కన పోతనాది మహాకవులు.

రాజరాజ నరేంద్రుని ఆస్థానము నిరంతరము సంగీత సాహిత్యములచేత ప్రతిధ్వనించుతూ యుండేదని తెలుసు కుంటాము. భారతావతారికలో వైణికగాయకులు విద్యా విలాస గోష్ఠిలో ఉండడం కన్పిస్తుంది.

కాకతీయుల కాలంలో లలిత కళలు వర్ధిల్లాయి. ఆ కాలాన కొందరు కవులు సాహిత్యాన్ని మతప్రచారానికి ఉపయోగించుకొన్నారు; గీత ప్రబంధాలకు హెచ్చు ప్రాధాన్యమిచ్చారు. అందుకనే పాడుకోవడానికి వీలైనట్లు ద్విపదలలో అవతరిల్లాయి ఆనాటివారి కొన్నికృతులు. బసవపురాణ మైతేనేమి, పండితారాధ్యచరిత్ర అయితే నేమి, రంగనాథరామాయణ మైతేనేమి, ఇలాంటివే! రెడ్డిరాజులకాలములో అందులోనూ «కొమరగిరి» పోష ణలో సంగీత సాహిత్యనృత్యా లుచ్చదశ నందుకొన్నట్లు చరిత్ర బోధిస్తుంది. శ్రీనాథ పోతనలవలన మన సాహి త్యములో శారదాదేవి ఎన్నెన్ని అలంకారాలు అందు కొన్నదో, అంతగానూ నాద సౌందర్య విభూషలనూ గ్రహించి మురిసింది!

ఇంక కృష్ణదేవరాయల ఆస్థానము కళా నిలయమే

అనాలి. హంపీలోని, సప్తస్వరాలను పలికే స్తంభాలూ, తాళ్ళపాకవారి పదాలూ, పెద్దనాడి కవుల ప్రబంధాలూ ఈ విషయాన్ని వేనోళ్ళ చాటుతున్నవి. ప్రతి ప్రబంధ నాయికకూ సంగీత సాహిత్యాలలో మంచి ప్రావీణ్యమూ, చాతుకీ ఉన్నట్లు చిత్రించారు మన ప్రబంధకారులు. పెద్దన్నగారుకూడా తమనాయికచేత వీణె మీటింపించారు. పరమ వైదికుడైన ప్రవరాఖ్యుడుకూడా ఆమె పాడుతూ వుంటే ఈ ప్రపంచాన్నీ, తాను వచ్చిన పనినీకూడా మరచి గుడ్లుఅప్పగించి చూచాడట. పాట అయిపోయిన తరు వాతగాని నోటివెంబడి మాటరాలేదుట అతగాడికి! నువ్వు ఎవరుఅని అతడు వివరాలు అడిగితే అక్కడకూడా «సహిబుట్ట జంత్ర గాత్రంబులు రాల్గరగించు విమల గాంధర్వంబు విద్య మాకు» అని చెప్పించారు పెద్దన్న గారు. ఇదివరకు నృత్యగీతాలు వెలయాంద్రకు నేర్పడము రాజసభలలో వారు నాట్య, సంగీ చాతుర్యాలుచూపి మెప్పించటము ఎక్కువగా ఉండేవి. కాని ప్రాచీనకాల ములో సంగీత సాహిత్యాలు పామరులకు అందుబాటులో ఉండేవి కావని తెలుస్తుంది.

వసుచరిత్రకారుడు, భట్టుమూర్తి తననుగురించి

«నను శ్రీరామ పదార విందభజనానందున్ జగత్ప్రాణనం దన కారుణ్య కటాక్ష లబ్ధ కవితా ధారా సుధారాశి సం జని తైకైక దిన ప్రబంధ ఘటికా సద్య శ్శతగ్రంథ కల్పను సంగీతకళారహస్యనిధి............ ............»

అని చెప్పుకున్నాడు. నిజంగానే ఆయన వివిధ కళాపారీ ణుడే. సుప్రసిద్ధ వైణిక గాయకోత్తముడు ఆయన. సంగీత సాహిత్యసముద్రాలను రెంటినీ మథించినవాడు. ఏయేవా ద్యాలను పలికిస్తే, ఏయే రీతుల హృదయంగమంగా వుం టుందో సంగీత శాస్త్రవేత్తగాని చెప్పలేడు. భట్టుమూర్తి అన్ని జంత్రముల పరిచయమున్నవాడుగా కన్పిస్తాడు. ముఖ్యంగా గొప్ప వైణికుడు అనాలి.

«కాంభోజీమేళ విపంచికారవ సుధా పూరంబు» అన్న ప్పుడు కాంభోజీ రాగ మిళితమైన 'విపంచికారవము' లోని నాదము నాయికా శోకఘట్టానికి అనువుపడిందని గ్రహించి అది ఎంత మధురంగా ఉంటుందో మూర్తికవి తెలియజేశాడు. ఆయన వసుచరిత్ర సంగీత సాహిత్య రస ప్రవాహములకు రెండింటికీ సంగమస్థానమైన పుణ్యతీర్థము వంటిదై ప్రశస్తి వహిస్తున్నది.

ఇంక పింగళి సూరన్నగారి కలభాషిణి సంగీత సాహిత్య ములలో మేటి. కళా పూర్ణోదయములోని కథ ముఖ్యంగా సంగీతముపైన ఆధారపడిందే! కలభాషిణీ మణికంధరులు అత్యద్భుతమైన గాయకులు. వారికి గురువు కేవలము మూర్తీభవించిన సంగీతమే అనదగిన నారదుడు!

మణి నాయకరాజుల కాలంలో సంగీత సాహిత్యాలు పరాకోటిని అందుకున్నవని చెప్పాలి. అందుకు ముఖ్యంగా రఘునాథనాయకుని సంగీత సాహిత్య కళాప్రతిభే కారణం. ఆయన స్వయంగా కవే కాక సంగీత కళాభిజ్ఞుడుకూడ. ప్రత్యేకంగా "వీణె"ను నిర్మించి "రఘునాథమేళను" స్థాపించిన మహనీయుడు. ఆకాలం సాహిత్యంలో సంగీ తానికి ఎక్కువస్థానం ఉన్నట్లు కన్పిస్తుంది. యక్షగానం, కీర్తన లెక్కువగా కవులు వ్రాస్తూవచ్చారు. త్యాగరాజు- క్షేత్రయ లుద్భవించి పెట్టిన భిక్ష నిరుపమాన మైనది గదా!

త్యాగయ్య, క్షేత్రయ్య, శ్యామశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితులు, మొదలైన సుప్రసిద్ధ కవి గాయకులు సవ్య ............ సర్వతో ముఖ ప్రజ్ఞతో కృషిచేశారు. క్షేత్రయ్య పదములలో భక్తి శృంగారము లెక్కువగా కన్పిస్తాయి. కవి తాను గోపికయై శ్రీకృష్ణునికొరకు తహతహలాడినాడు. జయదేవ పండితులు రాధాకృష్ణలీలను తన అష్టపదులలో పొందుపరచి ధన్యుడై నాడు. నారాయణతీర్థులు శ్రీకృష్ణలీలలను తనతరంగములలో వర్ణించినారు. రాజుల ఆస్థానాల కెక్కక పోయినా ఊర్మిళాదేవి నిద్రా, లక్ష్మణదేవరనవ్వూ, బాలనాగమ్మ కథా, బొబ్బిలి యుద్ధము వంటి జంగంకథలూ, స్త్రీల పాటలలోని సరస సాహిత్యము కూడా జానపదుల జీవిత ములో పెనవేసుకొని వారికి ఉల్లాసము కలిగిస్తూనే వచ్చింది. పదకవిత ప్రాకృతుల్ని అత్యంతంగా అలరిస్తూనే వచ్చింది!

(ఆకాశవాణి సౌజన్యముతో)

# కర్ణుఁడు

శ్రీ ఎ. యల్. నరసింహారావు



ఎక్కడి సూతజాతి? యరెరే! నవఖండము లేలు రాజరా
జెక్కడ? యింతప్రేమ నెనయింపఁగ నీపయి హేతు వేమగున్?
ధిక్కృతబాలచండకర తేజము; నీవదనాబ్జ మొక్కటే
దక్క మరొండు చెప్పఁగలదా? వలదా యుచితజ్ఞు లెంచఁగాన్.

లోపము లెంచఁగా నెవరిలోఁ గనరావు ధరిత్రి? బాహ్లికున్
దాపునలేనివాని వసుధన్ బడనేయుట ధర్మమౌనె? య
ధ్యాపకుఁ డైనవాని ననృతంబులు పల్కి వధింప నొప్పునే?
పాపములన్ని యొక్కతలపైఁ బడవేయుదు రేమి కర్మమో!

తల్లి వచించె; వ్యాసకథితం బని భీష్ముఁడు సెప్పె; రుక్మిణీ
వల్లభుఁ డంతయున్ దెలిపి ప్రార్థనసేసె, నినుండు తథ్యమం
చల్లనఁ బల్కెఁ బాండవుఁడ వౌటకు సాక్ష్య మదింత యున్న నీ
యుల్లము సుంతమారదుగదోయి! స్వధర్మపరాయణోత్తరా!

కనకము, కాంతయున్ భ్రమలఁ గల్గఁగఁజేయు నటంచు శత్రుసా
ధనములుగాగ వాడుదురు ధాత్రిని వానిని, గాని సుంతయై
నను బనిచేసెనే యవి మనశ్చలనం బిసుమంతఁ గూర్చెనే!
నిను నొకమేరుధీరుఁ డన నేరరు సంకుచితజ్ఞు లిద్ధరన్.

ఆడినమాటఁ దప్ప వమరాధిపుఁ డర్థిగ వచ్చి వేడినన్
బోడిమిఁ దప్పఁబోవు పలుపోకలఁ బోవుచు యుద్ధభూమిలో
వాడిమగంటిమిన్ నెఱపి వైరులఁ జిక్కులపాలుసేయు దీ
రేడుజగంబులందుఁ గలరే! నినుఁ బోలిన పోటుమానుసుల్.

మించిన ధైర్యశౌర్యముల మేకొని వ్రేల్మిడి మత్స్యయంత్రముం
ద్రెంచిన నైన నద్విజు వరింపనటన్న వధూటిమాటఁ బా
టించి కడంగవైతివి, కడిందియె నీ కది, నీప్రతాపమున్
గొంచెముసేయు గాథలకుఁ గోపము సెందకుమయ్య మాయెడన్.

మందులు చట్టుఁగూడి యభిమన్యుని దామరమొగ్గరంబులో
గ్రుందఁగఁజేసి రందు రొకమానవజాతియెకాక దేవతా
బృందముగూడ నీవధకుఁ బ్రేరకులైరని యెన్నజాల రే
మందము, పక్షపాతవిహితాత్ములు సత్య మెఱుంగనేర్తురే ?

ధరణిభరంబు మాన్ప నవతారము దాల్చిన శౌరి విఘ్నముల్
బొరయని రాజసూయకృతపుణ్యుఁడు ధర్మతనూభవుండు దా
మఱచియు నైన సుంత యభిమానము వీడని రాజరాజు నిం
దఱు గలుగంగఁ బాడికలదా ? రణహేతువు నీకుఁ జుట్టఁగాన్.

నరునకుఁ దా స్వధర్మనిధనం బది శ్రేయ మటంచుఁ జెప్ప శ్రీ
హరి నినుఁ జేరి పాండవుఁడ వౌదువు రమ్మని చీరు, కారణం
బరసినచో నతండు విషయార్థియె యింకను నీవు దానిలో
బరిణతి నొందినావు హరిపల్కు పరీక్షయెసుమ్ము నీ కటన్.

శాంతనవుండు గొంతియును శౌరియుఁ గీడొనరించినారు నీ
కెంతయు, వా రెరింగినదియేకద ! సర్వము నీదుజన్మవృ
త్తాంతము సుంతయేని యది ధర్మజుపీనుల సోకియున్న శో
కాంతముగాక భారతకథాకృతి సద్గతి నొందియుండదే ?

శూరత్వంబున శాత్రవాటవులఁ జిచ్చుల్ పెట్టి యేలించి తా
రారాజుం రమణీయభారతమహీరాజ్యంబు బూజ్యంబుఁగా
నేరే నీసరి దానశీలు రిలయం దీ విందు ధన్యుండవై
వీరస్వర్గ మలంకరించితివి ధన్వీ ! శాశ్వతామోదివై.

# ఆదర్శ రామరాజ్యము

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ

నాగరకితకు పేరుపొందిన ఈయిరవయ్యో శతాబ్దంలో, అన్నివిధాలా వైజ్ఞానికంగా అభ్యున్నతి సాధించిన ఈ యుగంలో, భౌతికంగా ఘనవిజయాలు సాధించి గ్రహాంతరయానాదులద్వారా అఖండశక్తి సమన్వితమైన ప్రకృతిపై పెత్తనం చెలాయిస్తూన్నా మనకొనే ఈఅత్యాధునిక శాస్త్రవిజ్ఞానయుగంలో, అత్యంతసౌఖ్యతరజీవనానికి కావలసినసమస్తసౌకర్యాలనూ అతిసులభంగా సంపాదించుకొని స్వర్గప్రాయమైన జీవితానందాన్ని అనుభవించగల్గే ఈకాలంలో, పారిశ్రామిక, యాంత్రిక, కర్షక, ఆర్థిక, రాజకీయాదిసమస్తవిద్యాశాఖలలో, సకలరంగాలలో, ఆరితేరినవిద్యానిపుణులు కోకొల్లలుగా లభిస్తూన్న ఈతరంలో, అన్నింటికంటె విశేషించి ప్రజాసత్తాకరాజ్యాంగవిధానంలో వాక్స్వాతంత్ర్యము, రచనాస్వాతంత్ర్యము కలిగి స్వేచ్ఛాపౌరుడుగా జీవించే భాగ్యం కల్గిన ఈస్వర్ణయుగంలో జీవిస్తూకూడా ప్రతిమానవుడూ ఏదో ఒక అవ్యక్తమైన మహాభయాన్ని పొందుతూఉన్నాడు!

మనిషికీ మనిషికీ మధ్య ఎంతో అభేద్యమైన ఉక్కుగోడలు, హృదయానికీ హృదయానికీ నడుమ అనిర్వాచనీయమైన అవిశ్వాసం! నలుగురు కలిస్తే భావాలలో అన్నీ సందేహాలే. అల్పుడిమొదలు అధికారివరకూ లంచాలే. అందితే జుట్టు! లేకపోతే కాళ్ళు! వీలైతే పరస్పర విద్వేషాగ్నిని వెళ్ళగక్కడం, వీలుకాకపోతే కృత్రిమ స్నేహాలింగనాలతో సతమత మైపోవడమూను! ఎవ్వరికీ విధినిర్వహణంపైన లక్ష్యం లేకపోవడము. విద్య అంటే భక్తి లేకపోవడము! ప్రతికార్యాలయాల్లో సిబ్బంది పెరిగిపోవడం! పనులు కాకపోవడం! విద్యార్థులకు డిగ్రీలపై తప్పితే చదువుపై శ్రద్ధ లేకపోవడం! ఏమిటీ తారుమారు? ఎందు కీకృత్రిమదాంభికప్రదర్శనం! ఎందువలన సంభవించిందీ పైశాచికభయంకరనృత్యం?

అంటే దానికంతా ఒకటే ప్రత్యుత్తరం! అది; అధర్మాభ్యుదయవిలాసఫలితం - అంటే మానవుడు మానవధర్మతిరస్కృతి చేయడంద్వారా బ్రహ్మనిరాకరణం చెయ్యడమన్నమాట -

కాబట్టే ప్రస్తుతకాలంలో ప్రతివాళ్ళనోటా రామరాజ్యస్థాపన జరగాలనేమాట వినిబడుతూంది -

అయితే ఇంత అధర్మసంక్షోభంలో ప్రతివారిహృదయాలల్లో ఆదర్శరాజ్యంగా పీఠంవేసుకొన్న ఆరామరాజ్యం ఎటువంటిది? అంత ఆదర్శరాజ్యంగా రామరాజ్యం ప్రస్తుతింపబడటానికి కల కారణా లేమిటి? మానవాళయస్ఫూర్తికీ, మానవధర్మాదర్శపరమార్థానికీ ప్రభువైన శ్రీరామచంద్రుణ్ణి అవతరింపచేసుకోవడాని కనువైనవాతావరణాన్ని రూపొందించుకొన్న సూర్యవంశం ఎట్టి ఉత్తమాదర్శాలతో ప్రవర్తించింది? అనే విషయాలు మనం కొంచెం పరిశీలిద్దాం.

ప్రభుధర్మావతార మైన శ్రీరామచంద్రుని అవతారం చేత క్షీరసాగరం చేయబడిన సూర్యవంశంలో మనువు, ఇక్ష్వాకు, కాకుత్స్థుడు మొదలైన మహానుభావులతర్వాత అంతప్రసిద్ధిచెందినవాడు మాంధాతచక్రవర్తి. మాంధాత కేవల మహాప్రభువే కాదు. మంత్రదర్శన మొనర్పగల్గిన ఆత్మశక్తి కల రాజర్షి పుంగవుడు. ఆమహారాజర్షి ఋగ్వేదమున కొన్ని సూక్తములకు కర్త. ఇట్టి అప్రతిమానప్రభావము కల ఈమహాతపశ్శాలి ఋగ్వేదమున తనవంశమువారి పవిత్రశీలప్రమాణముల నుటంకించుచు «మంత్రశ్రుత్యంచరామసి» అను నొక చిన్నమంత్రమును తనవంశమువారి

కాదర్శనీతిగా పేర్కొనెను. మంత్రవిశ్రుతమైన మార్గమునసే చరింతును. అనికదా దీని కర్థము.

మాంధాత ఆదిమధర్మశాసకుడు ఆదిమధర్మప్రవర్తకుడునైన మనువున కిరువదవ వారసుడు. జగన్మాన్యులైన ఇక్ష్వాకు, కాకుత్థ్సులవంశీయుడు. జగద్విశ్రుతచరిత్రులైన సగర, దిలీపాది మహామహు లాతనివంశమున జన్మించి సూర్యవంశకీర్తిప్రతిష్ఠలను ద్విగుణీకృత మొనర్చిరి. తన పవిత్రనామమే యావద్వంశనామముగ తన బలవీర్య ధర్మవీర్యాదులచే పరిణమింపజేసిన రఘుమహారాజు మాంధాతకు మనుమలసంతతిలోనివాడు. ప్రజారంజనమే పరమావధిగా భావించి ప్రజలశ్రేయస్సుకొఱకు సతీసుత త్యాగమునే కాదు- యావత్కుటుంబత్యాగ మొనర్చి యుగయుగములకు మలగని వెలుగుదారులలో రామరాజ్యమను నాదర్శమును అతిలోకసంభావనీయముగ నిలిపిన శ్రీరామచంద్రుడు నిజముగ తన్మాననీయవంశకలశోదధి పూర్ణచంద్రుడు.

భగవద్గీతయందు షోడశాధ్యాయమున చెప్పబడిన "ఈశ్వరోఽహ మహంభోగీ, సిద్ధోహం బలవా న్సుఖీ" "ఆఢ్యోభిజనవా నస్మి కోఽన్యోఽస్తి సదృశోమయా"

అను శ్లోకవాక్యములలోవలె లోకమునందు వాంఛింపదగిన మహాసన్నత్వము. మహైశ్వర్యము. మహాప్రభుత్వము మహానుభవము, మహాపదవి సంపూర్ణముగా గల్గిన రాజపరంపరలోనివాడు మాంధాత. పైజెప్పబడిన లక్షణములలో ఏఒక్కలక్షణ మబ్బినను సామాన్యమానవుడు స్వాతిశయ, దుర్గర్వాంధకారములచే అంధుడై ధర్మతిరస్కార మొనర్చి భ్రష్టుడగును. అట్టియెడ సంపూర్ణముగా ఉన్నతలక్షణములచే లక్షితుడైనమాంధాత మేము (మావంశీయులెల్లరు) మంత్రవిశ్రుతమార్గముననే చరించుచున్నాము" అని చెప్పుట యెంత మహిమాన్వితమైనది?

వారి కేమి? విభవము తక్కువా? బుద్ధిబలము తక్కువా? ప్రభు, మంత్రార్థికశక్తులు తక్కువా? సామర్థ్యము తక్కువా? ఏదియు తక్కువ లేదే. అన్నింట తక్కువైన సామాన్యమానవుడుకూడ పలుకుట కభిజాత్యపడుమాటను పల్కెనే? అన్నింట ఉత్కృష్టులైన ఆసూర్యవంశమహనీయులు! మంత్రవిధేయులైరి!!

ఈమహాదర్శమే రఘుకులస్వాములను విశాలవసుంధరయందు విశిష్టులుగ నొనర్చినది! ఈపవిత్రాశయమే సకలగుణాభిరాముని, శ్రీరాముని యుగయుగములకును ఆదర్శ రామరాజ్యాభిషిక్తు నొనర్చినది. ఈమంత్రవిధేయతాలక్షణమే ఇక్ష్వాకువంశమును ప్రపంచమున నవోషోరేఖగా ఉద్దీప్త మొనర్చినది.

ఈమహాపురుషులపవిత్రచరిత్ర మెట్లు మంత్రశ్రుత్యమార్గమున చరించెనో స్థాలీపులాకముగ పరామర్శితము - రఘువులే కాదు రఘువంశ్యులచే పాలితులగు ప్రజలుకూడ మంత్రావిధేయు లెన్నడును కాలేదు. మంత్రమున కవిధేయులగుట యనిన 'బ్రహ్మనిరాకరణము' గానే వారు భావించిరి. శ్రుతిమంత్రము "మా బ్రహ్మనిరాకరణోస్తు" అని హెచ్చరించినది. అంతతో ఊరకొనక "సత్యం వద, ధర్మంచర" అని శాసించుచు "బ్రహ్మణో నామ సత్యం" బ్రహ్మను సత్యరూపిగా నిర్వచించినది. ఇక మంత్రవిధేయులగు రఘువులచే పాలితులగు ప్రజలు అసత్యభాషణ మొనర్చ బ్రహ్మనిరాకృతిని సల్పుటకు సాహసింతురా? "యథా రాజా తథా ప్రజా" కదా! దిలీపుని పాలనయందలి ప్రజలను వర్ణించుచు కవికులచక్రవర్తి యగు కాళిదాసు "రేఖామాత్ర మపి క్షుణ్ణా దామనోర్వర్త్మనః పరమ్ నవ్యతీయుః ప్రజా స్తస్య నియన్తు ర్నేమివృత్తయః" అని వ్రాయుటలో నతిశయమే మున్నది?

ప్రజల నావిధముగ సత్యధర్మానురక్తులను చేయగల్గిన ప్రభువులు కావుననే ఆవంశమును వర్ణించుటకు ముందు కాళిదాసంతటిమహాకవి "క్వ సూర్యప్రభవో వంశః క్వ చాల్పవిషయామతిః," అని యును, "మన్దః కవియశః ప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతామ్" అనియును భయపడినాడు. సారస్వతేయులకు కాళిదాసమహాకవియొక్క ఈవాక్యము లతిశయోక్తులుగ భాసింపవచ్చును. కాని నిజమట్టిదికాదు. మంత్రవిధేయులగు మనువంశ్యుల మహాప్రాభవ మంతదుర్నిరీక్షమగుటలో సందియ మావంతయు లేదు.

ఆజన్మశుద్ధు లనియు "త్యాగాయ సంభృతార్థు"లనియు,

«ఆఫలోదయకర్మ» లనియు రఘువంశమును వర్ణించుట కేవల మలంకారార్థము కాదు. రఘువంశమునందలి మహా ప్రభువులచరిత్రములను పరిశీలించినచో నీవిశేషణము లన్నియు సార్థకములే. వరతంతు, కౌత్సులగాథను వినిపించుఘట్టమున, కౌత్సుడు విశ్వజిద్యాగ మొనర్చి సర్వస్వదక్షిణలచే రిక్తుడైన రఘుమహారాజును గురుదక్షిణార్థము ద్రవ్యమడుగుటకై సమీపించెను. సర్వస్వదానములచే రిక్తుడయ్యు రఘువు అర్థికామసంపూరణార్థము కుబేరునిపై యుద్ధమును ప్రకటించుటయు కుబేరుడు రఘువునకు భయపడి అత్యధికధనములను కురియుటయు నొక్కమారుగ జరిగెను. అంతే కాదు అచ్చట కాళిదాసు «గురుప్రదేయాధికనిస్పృహుని'గా కౌత్సుని, అర్థికామాధికప్రదాతగా రఘుమహారాజును వర్ణించి«త్యాగాయ సంభృతార్థానాం» అను విశేషణమును సార్థకమొనర్చెను

అంతేకాదు, "ఆఫలోదయకర్మణాం. ప్రజాయై గృహమేధినామ్" అనువిశేషణములకు సీతాపరిత్యాగమును నిదర్శనముగ సంభావించె ననియు మన మెఱుంగగలము. ప్రజానురంజనమే ప్రధానాశయముగ ఆదర్శములను చిత్రించుకొనిన మహారాజు కావుననే శ్రీరామచంద్రుడు జన్మింపగనే వేదము రామాయణముగా రచియింపబడెనను భావము వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే వేదః ప్రాచేత సాదాసీ త్సాక్షాద్రామాయణాత్మనా" ఈశ్లోకరూపమున వాల్మీకిచే వెలువరింపబడియెను.

వేదమనగా జ్ఞానము. భగవదంశసంభూతులై సృష్టియందలి సకలజీవరాసులలో జ్ఞానముచేత మాత్రమే మాన్యత నొందుచున్న మానవులకు జ్ఞానముతో కూడిన ప్రవర్తనాభిక్ష పెట్టునది వేదముమాత్రమే. ధర్మాధర్మ విచక్షణారూపమైన వివేకమును కల్గించి జ్ఞాననేత్రమును తెఱచునదియు వేదమే! అసత్తునుండి, సత్తునకు తమస్సునుండి జ్యోతిస్సునకు, మృత్యువునుండి అమృతత్వమునకు వెలుగుబాటల నేర్పఱచి నడిపించు ఊతకఱ్ఱయును వేదమే. అట్టివేదమే శ్రీరామచంద్రులజననముతో రామాయణాకృతిని వహించినదట! ఎంత పరమసత్యమును జగతి కందించినాడు మహాకవి? అనగా రామాయణము మానవజనతకాదర్శములు దిద్దు మానవధర్మపరాయణతను బోధించు పవిత్రచరిత్ర మనియేకదా?

రమణార్థమును స్వకీయనామముగ పరిగ్రహించి శ్రీరామచంద్రు డవతరించుటయందలి యాంతర్యమును వాల్మీకి బాలకాండమందలి పంచదశసర్గమున «త్వాం నియో ..., లోకానాం హితకామ్యయా, రాజ్ఞో దశరథస్య త్వ మయోధ్యాధిపతేః ప్రభోః.... 'విష్ణో పుత్రత్వమాగచ్ఛ కృత్వాత్మానం చతుర్విధమ్. తత్రత్వం మానుషో భూత్వా, ప్రవృద్ధం లోకకంటకమ్, అవధ్యం దైవతైర్విష్ణో సమరే జహి రావణమ్» అను శ్లోకములయందు మహావిష్ణువునంతవానిని మహేంద్రుడు రావణవధార్థము దశరథపుత్రత్వము నంగీకరింపుమని నియోగించెనని తెల్పుటలో విశదీకరించెను. సాక్షా ద్విష్ణువే ప్రజారంజక మగు స్వీయప్రవర్తనముచే లోకమునకు స్వార్థత్యాగబోధను చేయదలంచి యింద్రుని నియోగమును స్వీకరించెనట.

«ప్రజాయై గృహమేధు»లును, త్యాగాయ సంభృతార్థులును నైన రఘుకులమున శ్రీరామచంద్రు డొక్కడే కాదు రామచంద్రుని జనకపాదుడగు దశరథుడును, ఆ మహాపురుషుని మాతృమూర్తులును, సోదరులును, అత్యాగశీలురే. ఆపూజ్యసోదరుల కాంతామతల్లులును ఒకరననేల శ్రీరామచంద్రునితో సంబంధము కల సర్వులును «ప్రజానాం హితే రతులే అగుటలో ధర్మప్రతిష్ఠాపనము సక్రమముగను. సంపూర్ణముగను జరిగిన దనవచ్చును. ఇట్టివీరల చరిత్రచే «మంత్రశ్రుత్యం చరామసి» అను మనువంశ్యుల ప్రమాణమునకు గల విలువ అతిశయించుచున్నదనుటలో సందియమేమి? ఆపితృవాక్పరిపాలనావతారుని కుటుంబమువారల త్యాగము నొకింత వివరించిచూతము లోకకంటకుడగు రావణవధార్థము దశరథుడు ముదిమిముప్పున తన కబ్బురముగా పుట్టిన ఆత్మసుతులను త్యాగ మొనర్చినాడు. లక్ష్మణాదులు అతిలోభనీయ మగు రాజ్యత్యాగ మొనర్చినారు. కౌసల్యాదులును విధినియుక్తలై పతిత్యాగమునకు, సుతత్యాగమునకును సంసిద్ధమైనారు. శ్రీరామచంద్రుడు పితృత్యాగదుఃఖమునే కాక ఇహాముత్రధర్మసాధనాశ్రయస్థానమైన పత్నిని త్యాగదుఃఖమునుకూడ 'చిచ్చోడిగట్టిన యట్లు' భరించినాడు. ఇవి యన్నియు సరే అన్నింటికంటెను చిత్రమైనది సమస్తజీవరాశియు వాంఛించు సుచరిత్రి

ఖ్యాతిని త్యాగ మొనర్చినది; అంబ కై కేయి! ఇంత స్వార్థ
రహితబుద్ధితో చరిత్రత్యాగ మొనర్చిన వ్యక్తు లికే సారస్వ
తమునను కానరారు. ఇంకొక సారస్వతమునసే కాదు.
త్యాగధనుల కాలవాలమైన, భారతీయపవిత్రసంస్కృతి
నిక్షేపమైన మనసారస్వతమునసే మహామాతకై కేయి తప్ప
ఇట్లు చరిత్రత్యాగ మొనర్చిన అన్యవ్యక్తి కానరాది ఆమె
నిజముగ "ఋతస్య గోపా" అనదగిన మహనీయవ్యక్తి
రఘువులవంశమునందలి మహిళలు కూడ ఇట్టి విశుద్ధసత్త్వ
స్వభావములు, రాగరహితశీలమును, అహంకారమమకార
విహీనబుద్ధియు, రాజకీయధౌరంధర్యమును కల్గిన మహా
తల్లులు కావుననే "ఫలానుమేయప్రారంభకత్వము"ను
ఆవంశము వారి సహజలక్షణములలో నొకటిగా పేర్కొని
రఘువంశమునకు నాందిని సవదరించినాడు మహాకవి కాళి
దాసు! ఆదికవి వాల్మీకి "జానక్యాశ్చరితం మహత్,
పౌలస్త్యవధాకథనంచ" అని రామాయణగద్యయందు
రచియించిన మహావాక్యముల వివరణమే ప్రజలకొఱకు
సర్వస్వమును సంతోషముగ త్యాగమొనర్పగల్గిన శ్రీరామ
చంద్రుని వంశమహిళల పవిత్ర చరిత్రము!

ఇట్టి మహోదారుడు భువి కవతరింపవలసియుండుట
చేతనే వాల్మీకిమహాఋషి శ్రీరామజననమునకుముం దుండ
వలసినపవిత్రవాతావరణమును సృష్టించుటలోకూడా ఏమా
త్రమజాగ్రత్త వహింపక అప్రమత్తుడై వ్యవహరించెను.
ఆయప్రమత్తతయొక్క ఫలితమే బాలకాండయందలి షష్ఠ
సర్గమందలి "ద్రష్టుం శక్య మయోధ్యాయాం నా విద్వా
న్నచ నాస్తికః, సర్వేనరాశ్చ, నార్యశ్చ, ధర్మశీలా స్సుసం
యతాః, . "దృశ్యతే నాప్యనాత్మవాన్" .... "దీర్ఘా
యుషో నరా స్సర్వే ధర్మం సత్యంచ సంశ్రితాః" ఆదిగా
గల పౌరజనవర్ణనము. పౌరజనవర్ణనము సామాన్యసారస్వత
మునందలి అతిశయోక్త్యాద్యలంకారపూర్ణ మగు కావ్య
గుణప్రయోజనపూరకము కాదు. మానవులకు, విశేషించి
తనప్రజలకు ప్రీతిపాత్ర మగు స్వభావప్రవృత్తితో ఆత్మ
త్యాగ మొనర్చుటద్వారా త్యాగగుణమాహాత్మ్యము నుద్బో
ధింపవలచి "ప్రకృతిఃకర్త్రీ పురుషస్తుపుష్కరపలాశవ
న్నిర్లేపః" అని ప్రస్తుతింపబడిన మహాశక్తితో నవతరిం
చిన మహోదారగృహస్థగు శ్రీరామచంద్రుని జననమునకు
కావలసిన ఉదాత్తవాతావరణసృష్టియే; నిజముగదశర
థుని రాజ్యమునందలి పౌరసంఘము అట్టి మహాగుణశ్రీరా
ద్ధియే, కానున్నచో మహావిష్ణువగు శ్రీరామచంద్రు
డాజనమధ్యమున నవతరించుట కవకాశ మెద్ది? వాల్మీకి
అతీంద్రియద్రష్ట యగు మహాఋషి యైన కవిసత్తముడు
కావుననే దశరథుని పౌరసంఘమునట్లు యథాతథముగ
దర్శింపగల్గినాడు. తాను దర్శింపగల్గుటతో తనివొందక
లోకసంతరణార్థ మట్టి ఆదర్శప్రజామండలిని తన అమృత
కావ్యచక్షువుద్వారమున మనచేతను దర్శింపజేసినాడు.

ధర్మసంరక్షణార్థ మింద్రునియోగమున నవతరించి
"మంత్రశ్రుత్యం చరామసి" అను తనపూర్వులప్రమాణ
వచనమును శిరసావహించి మసలుకొనిన మనువంశీయు డగు
మహాప్రభువు కావుననే తన కులపతి యగు వసిష్ఠునిచే
చతుర్వర్ణ్యవ్యవస్థారక్షణకై ఆదేశింపబడి తపస్వి యగు
శంబూకుని వధింపగల్గినాడు; శ్రీరామచంద్రుడు! శ్రీరామ
చంద్రున కేమి హృదయము లేదా? కాని శ్రీరామచంద్రుని
హృదయచేష్టలు వ్యక్తిగా శ్రీరామచంద్రునకు సంబంధించి
నవి కావు. అవి ఏనాడు ప్రభుధర్మమునకు వశవర్తులై
పోయినవి. ప్రభువుగా శ్రీరామచంద్రుడు మంత్రవిశ్రుత
మైనదాని ననుష్ఠింపవలసినదే. ఆధర్మనిర్వహణమున రఘు
వులకు స్వాతంత్ర్య మెక్కడిది? సీతాపరిత్యాగసందర్భము
నందుకూడా శ్రీరామచంద్రుని ప్రజాహృదయరంజకధర్మ
వశంగతత్వమే ఆదర్శరామరాజ్యాధినేతగా ఉన్నతపీఠ
మున నిల్పి యుగయుగములకు శ్రీరామచంద్రుని ప్రస్తుతి
పాత్రునిగా నొనర్చినది.

ఇంతమహోత్కృష్టముగ ధార్మికప్రమాణములు నిలుప
గల్గిన మహోన్నతవంశ మగుటచేతనే అతికష్టముపై బ్రహ్మ
ర్షిత్వమును సాధించుకొనికూడా తృప్తిచెందక విశ్వామి
త్రుడు సూర్యవంశగురుత్వపదవి కాశపడి బాలురగు
శ్రీరామలక్ష్మణులను యజ్ఞసంరక్షణార్థము బలాత్కార
ముగ కొనిపోయి 'బల, అతిబల' విద్యలను శ్రీరామచం
ద్రున కుపదేశించి సూర్యవంశగురుత్వమును సాధించితిని
కదా యని సంతృప్తినొందెను! కావున్న యుగయుగములు
కష్టించి, ఘోరముగ తపించి బ్రహ్మర్షిత్వప్రాపణము
నొందిన తేజోఘనునకు రాక్షసబాధానివారణ మొక

అసాధ్యకార్యమా? ఎంతమాత్రము కానేకాదు; మంత్ర విశ్రుతమార్గవర్తను లగు సూర్యప్రభువుల ధార్మికప్రవృత్తి యందలి అభిమానము! ప్రణయానురాగములే ఆమహాతేజశ్శాలికి ఆవంశగురుత్వమునను ప్రోత్సహించినవి!

ఆహా! మంత్రవిశ్రుతమార్గప్రవర్తనము ఎంత మహిమోన్నతమైనది? «స్వధర్మే నిధనం శ్రేయః»మ్మని భావించి స్వకీయవ్యక్తిగతప్రయోజనములకు, హృదయభావములకును తిలాంజలి నర్పించి, "ఆత్మవత్సర్వభూతాని" అను మహామంత్రార్థమును మననముచేసి చేసి పరుల కష్టసుఖములు ఆత్మీయములుగా భావించి కేవలత్యాగమయ జీవితమునే పరాయణముగా నెంచు ఒకానొకమహాధార్మిక వంశపరంపరకు జీవముపోసినదికదా? ఈమహామంత్రము! ప్రభుసత్తా కల్గియు ప్రజలశ్రేయస్సునకై సతీసుతులను త్యాగముచేయగల ఆదర్శజీవికి శ్రీరామచంద్రున కాకృతి నిచ్చిన దీమహామంత్రమేకదా!

"కిం త్వా మమన్యత మమ పితా.... వైదేహః
స్త్రియం పురుషవిగ్రహం ప్రాప్య రామ జామాతరమ్"

అని లోకశ్రేయోపాదనార్థము సీతాసాధ్విచే స్వప్రేరకముగా పల్కించి రాము ననుగమింపజేసి, రావణవధను నిర్వర్తింపజేసి సీతను ఆదర్శసాధ్విగా ప్రతిష్ఠించిన దీమహామంత్రమేకదా!

ఇట్టి త్యాగశీలమును ఏమాత్రమును అలవరించుకొనక, మహాస్వార్థదూషితులమైన మనము దంభమునకుమాత్రము 'రామరాజ్యము మాఆదర్శభూమిక' యని పలవరించినచో మాత్రమే మనకు రామరాజ్యము సంప్రాప్తమగునా? అల్పుని మొదలు అధికారివఱకు లంచగొండులు, అవినీతి పరులైన ఈనేటిరాజ్యము పురాతనపవిత్రభారతీయ సంస్కృతికి ప్రతిబింబ మనదగునా?

ఆత్మసాక్షిగా పాఠములను జెప్పి విద్యార్థులను శిక్షించు ఉపాధ్యాయులకు చెంపదెబ్బలను ప్రతిఫలముగ నిచ్చు మనవిద్యార్థులకుఆత్మవికాసమబ్బునంతవఱకు రామరాజ్యము మాటయెత్తుటకు మన కర్హత కలదా?

«ఆత్మవత్సర్వభూతాని» యను భావము లేక అధికారమునకు, పదవులకు పలువిధముల ప్రాకులాడి, అధికారమబ్బినదే తడవుగ స్వకుక్షింభరులై ప్రజాశ్రేయస్సును కావలెనని తిరస్కరించు ఆత్మదర్శనము లేని అధికారుల చేతిలో ప్రభుత్వ ముండునంతవఱకు రామరాజ్యము స్వప్నప్రాయము కాక మరేమగును?

చీటికి మాటికి ప్రక్కవారి శ్రేయస్సున కడ్డుదగులుచు స్వలాభముకొఱకై చెప్పరాని ఘోరకిరాతకకృత్యముల నలవోకగా నొనర్చు ప్రజారూపరాక్షసులకు రామరాజ్య మహాదర్శాలోకము దుర్నిరీక్ష్యమేకదా!

ఇక రామరాజ్యప్రాపణము మనబోటి అదృష్టహీనుల కెట్లు లభ్యమగును.

ఆరామరాజ్యము నిక్కువముగా «గగనకుసుమ»సదృశమేనా?

కాదు 'మంత్రశ్రుత్యం చరామసి" అను ప్రమాణమును స్వీకరించి వేదమంత్రములకు భాష్య మనదగు నిష్కళంక ధర్మజీవనము పరాయణమొనర్చుకొనిననాడు రామరాజ్యము మనకును సుసాధమే. «మంత్రశ్రుత్యం చరామసి»

ఓం శాన్తిశ్శాన్తిశ్శాన్తిః.

# నట పితామహుడు

శ్రీ వాసిరెడ్డి వేంకటసుబ్బయ్య



ఆంధ్రనటపితామహా! గర్తపూరంగ
సదనదీపికా! ప్రసాదరాయ
అస్తమించినావె! అఖిలాంధ్రనటదీప్తి
యస్తమించి నట్టులయ్యె నేడు.

సత్యమాడిన హరిశ్చంద్రభూమీజాని
నీయందు మాకు గన్పించినాడు
మా కంటబడియె నీయాకారరేఖలో
నలచక్రవర్తి కాంతారవర్తి
ధార్తరాష్ట్రుని సుయోధను సార్వభౌమునిఁ
జూపించినావు నీరూపమందు
భవదీయమూర్తిలో బందీకృతుండు మా
కుం గానుపించె సారంగధరుడు

ఆంధ్రనాట్యరంగమున నాయాయి భూమి
కలు ధరించి నటించు ని స్గన్నయప్పు
డాంధ్రనటమండలికి -నెవ్వ డాదరు విక
నీవు వోయినయపుడె నిర్జీవమయ్యె.

అభినయపుబడి హస్తవిన్యాస మాది
నేరుపులఁ జూపఁగలరేమో నేటినటులు
తావకీనాంగభంగిఁ దత్తద్రసమ్ము
లభినయము లాజ్ఞవెట్టిన ట్లనుసరించు.

అస్తంగమించె సర్వాంధ్రనాటకరంగ
మంచాభ్రతలభానుమండలమ్ము
ఆంధ్రనాట్యాభినయాంభశ్చలద్వీచి
మండితస్రోతస్సు లెండిపోయె
నవనీస్థలిం ద్రెళ్ళె నఖిలాంధ్రనాట్యక
లాపరిషల్లతాలంబతరువు
ప్రాచాంమహీభుజాంప్రతిబింబమైన నీ
మూర్తిఁ జూతుమె యెన్నిపుట్టువులను.

వేషభాషల నౌచితీవిధులఁ గలుగు
నెఱతనంబెల్ల నీతోడనే గతించె
మరతుమన్నను నిన్నెట్లు మరువఁగలము?
ప్రథమనటమూర్తి దశదిశీప్రథితకీర్తి.

ఆవిశాలఫాల మాముక్కుతీరును
ఆకపోలగరిమ మంధ్రభూమి
నెచటఁ జూడఁగలము యిక్కాలపున్నటుల్
నిన్నుఁబోలు టన్న నిందుసున్న.

గండపెండారముం బొందెఁ గవితలోన
ఆంధ్రకవితాపితామహుం డల్లసాని
నాట్యకలయందు గండపెండార మందె
నంధ్రనటపితామహుఁడు మాహరిప్రసాదు.

# గంగావతరణము

శ్రీమతి కొలకుల సావిత్రి



తొల్లి అయోధ్య నేలిన సగరచక్రవర్తి భృగుమహర్షి వరప్రభావమున తన యిరువురిభార్యలవలన పుత్రసంతతినిఁ బడసెను. ప్రథమపత్ని కేసినికి అసమంజుఁడును ద్వితీయ కళత్రము సుమతికి అరువదివేల పుత్రులు కలిగిరి. అసమంజుఁడు వెఱ్ఱివాఁ డగుటచే దేశభ్రష్టుఁ డయ్యెను. అతని పుత్రుఁడు అంశుమతుఁడు సద్గుణగరిష్ఠుడు.

కొంతకాలమునకు సగరచక్రవర్తి గొప్ప అశ్వమేధయాగమును తలపెట్టి యజ్ఞాశ్వమునకు సంరక్షకునిఁగా మనుమఁ డగు అంశుమంతుని నియమించెను. మానవులవలన దేవతలకు హాని వాటిల్లు నని ఇంద్రుడు రాక్షసరూపము దాల్చి యజ్ఞపశువును దొంగిలించెను. యజ్ఞాశ్వము మాయమగుటవలన యజ్ఞము విఫలమై సంతతికంతయు పాపము కలుగునని సగరచక్రవర్తి చింతాక్రాంతుడై యజ్ఞపశువును వెదకుటకు తన అరువదివేలపుత్రులను నియమించెను. అంత వారు భూలోకము నంతయు వెదికి, నిష్ఫలులై భూమినంతయుఁ ద్రవ్వి సమస్తమును కల్లోలపఱచిరి. అట్లు సగరులచేఁ ద్రవ్వఁబడిన భూభాగమే సాగర మయ్యెను.

తదుపరి వారు పాతాళమును ప్రవేశించి యచ్చట నొక్కచోట మేయుచున్న యజ్ఞాశ్వమును గాంచిరి. దాని దాపుననే కపిలమహర్షి రూపములో నున్న విష్ణువు ధ్యానపరుఁడై యుండెను. సగరపుత్రులు మునివేసముదాల్చిన దొంగయని కపిలుని గోలసేసిరి. ధ్యానభంగమైన కపిలుఁడు కండ్లు తెఱచి చూడఁగా ఆ అరువదివేలరాజపుత్రులు తగులఁబడి భస్మమైరి. ఎంతకాలమునకు తిరిగిరాని పుత్రులగురించి తలఁచి సగరుఁడు దుఃఖిల్లి మనుమఁడగు అంశుమంతుని యజ్ఞపశువును, వానిపినతండ్రుల నన్వేషించుటకు నియుక్తునిఁ గావించెను.

అంశుమంతు డంత పాతాళమును జొచ్చి అచ్చట నలుదిక్కుల సంరక్షించుచున్న దిగ్గజములకు మ్రొక్కి వాని ఆశీర్వాదము వడసి యందు వెదకుచు నొక్కచో బూడిదరాశిని దానిదాపుననే పారాడుచుండిన యజ్ఞపశువును గాంచి తనపినతండ్రులదుస్థితిని గ్రహించి వగచి వారికి పితృతర్పణముగావింప జలాశయమునకై వెదకుచుండెను. విధివశమున అంశుమంతునికి తన మేనమామ యగు గరుత్మంతుఁడు తారసిల్లి వానితో "కుమారా! ముందు యజ్ఞాశ్వమును గొనిపోయి మీతాతగారియజ్ఞము సఫలముచేయుము. మీపినతండ్రులు కపిలమహామునిశాపమున భస్మమైరి. వారికి మోక్షమార్గము ప్రాప్తింపవలె ననిన లోకపావనియైన గంగాదేవిని భూలోకమునకుఁ గొనివచ్చి యటనుండి అధోలోకమునకు రావించి ఈబూడిదకుప్పలపై ప్రవహింపఁజేసి వారికి జలతర్పణము గావింపవలెను. ప్రస్తుతము గంగాదేవి స్వర్గలోకసంచారిణియై యున్నది" యని నుడివెను.

పర్వతరాజైన హిమవంతునికి ఇరువురు కుమార్తెలుండిరి. జ్యేష్ఠపుత్రిక గంగాదేవి, రెండవకొమారిత ఉమాదేవి. ఉమాదేవి శివునియర్ధాంగి. దేవతలకోరికమేరకు హిమవంతుఁడు గంగను స్వర్గలోకమునఁ కంపెను. పాపసంహారి యగు గంగాదేవి దేవలోకమున వసించుచుండెను.

అంత యంశుమంతుఁడు గరుత్మంతుఁడు వాక్రుచ్చినట్లు అశ్వమును గొనిపోయి పితామహునియజ్ఞము సఫలీకృతము గావించెను. కాని గంగను పాతాళమునకుఁ గొనిపోవు నుపాయము తెలియక సగరుఁడు కొన్నియేండ్లకు కాలధర్మము నొందెను. అట్లే యంశుమంతుఁడు అతనిపుత్రుడు దిలీపుఁడు గంగను గొనిరాకయే కాలగర్భమున కలసిపోయిరి.

దిలీపునిపుత్రుఁడు భగీరథుఁడు కడుపరాక్రమశాలి;

అధికారిభినివేశము కలవాఁడు. అతఁడు ఎట్లైన తనపూర్వులకు మోక్షమార్గము కలుగఁజేయవలెనను తలంపుతో, తనకు సంతానప్రాప్తి కలుగుటకై గోకర్ణక్షేత్రమున మండుచున్న మంటలమధ్య నిలువఁబడి వేసంగిలో జితేంద్రియుఁడై ఘోరతప మాచరించెను. ఆతనికఠోరతపమునకు బ్రహ్మ మెచ్చి "ఏమికావలయునో కోరుకొమ్ము" అని సెలవిచ్చెను. అంత భగీరథుఁడు "స్వామీ! నాకు రెండువరములు దయసేయుము. మొదటిది- నాయుత్తాతలు ముక్తిమార్గమును పొందుటకు పాతాళములో నున్న యస్థికలపై పాపహారిణియైన గంగాదేవి ప్రవహించుటకుఁగా ఆమెను భూలోకమున కంపుము. రెండవది- నాకు పుత్త్రప్రాప్తి కలుగఁజేయుము" అని యర్థించి ప్రార్థించెను. అంత సృష్టికర్త, "ఓరాజా! నీకు పుత్త్రప్రాప్తి తప్పక సిద్ధించును. కాని నీమొదటికోరిక దుర్లభము. గంగాదేవి పడుధాటికి భూదేవి తాళజాలదు. భూదేవిని సంరక్షింపవలసినభారము భూమీశుఁడవైన నీకు కలుగదు. గంగాపాతధాటిని భరింపఁగలవాఁడు ఆఈశ్వరుఁడొక్కఁడే. నీవు ఉత్సాహవంతుడవై శివునిఁగూర్చి తపంబుచేయుము" అని నిక్కంబు వచించి ఆశీర్వదించెను.

మఱల భగీరథుఁడు ద్విగుణీకృతమైన నిష్ఠతో శివునిఁగూర్చి తపంబు సేయఁగా శివుఁడు మెచ్చి ప్రత్యక్షమై, భగీరథా! నీమనోరథమును నెఱవేర్చెదను. గంగను నాశిరంబున తాల్తును" అని నుడివెను. వెంటనే గంగాదేవి భూలోకమున దిగుట కారంభించెను. సహజముగా గంగ గర్వ, మదాంధురాలు. ఆఅహంభావముతో తనతోకూడ శివుని పాతాళమునకుఁ గొనిపోవలె నని తలఁచి మిక్కిలి యదురుపాటుతో శివుని శిరస్సుపై దూఁకెను. త్రినేత్రుఁడది గ్రహించి గంగాగర్వభంగము సేయవలె నని నిశ్చయించి గంగాప్రవాహమును స్వీయజటాజూటములో బంధించెను. అప్పు డాశివునిజడలలో హిమాలయపర్వతగుహలంత గహ్వరము లేర్పడెను. గంగ బయటకు తప్పించుకొని రావలయు నని సర్వశక్తుల ప్రయత్నించెను గాని వ్యర్థురాలయ్యెను.

భగీరథుఁడు గంగాదేవి యదృశ్య మగుట కని తత్తరపడి మఱల తపస్సున కుపక్రమించెను. అంత శివుఁడు భగీరథుని కరుణింప నిజజటాజూటములనుండి గంగాదేవి ఏడుపాయలై భూలోకమునకు ప్రవహించెను. అందు మూడుపాయలు హ్రాదిని, నళిని, పావని అనునవి. తూర్పుదిశకు మూడు పాయలు సుచక్షు, సీత, సింధు అనునవి పడమటిదిక్కునకు ప్రవహించెను. ఏడవపాయ భగీరథునిరథము ననుసరించి పాఱుచుండెను.

భగీరథునిరథము ఎటుపోయిన ఆటు గంగ సుమహత్తరమైన తేజస్సుతో మెఱపుఁదీఁగెవలె ధగధగ మెఱయుచు నాట్యభంగిమతో ప్రవహించుచుండెను. మహాద్భుత మైన ఆ సుందరదృశ్యమును గాంచి దేవతలు గగనమార్గమున గుమిగూడి యాహ్లాదపడుచుండిరి. ఆగంగానది ఒకచో అతివేగముగాను, మఱొకచోట నిర్మలముగాను, కొండొకచో విశాలముగాను, మఱియొకచో క్రుంచుకొని, ఒక్కొక్కపరి క్రిందికి దుముకుచు, మరియొకసారి పైకెగిరి తాండవించుచు తెలతెలలుగా ఏర్పడిన యలలసొంపుతో ప్రవహించుచుండెను.

ఆవిధముగా నాట్యభంగిమలతో పరవళ్ళుత్రొక్కుచు నడకలు సాగించుచుండిన గంగ తనప్రభావముతో జహ్నుమహర్షి యజ్ఞపీఠమును ధ్వంసముచేసెను. మహర్షి కోపాగ్నిచే ప్రజ్వరిల్లి తనయరచేతిలోనికి గంగను గొని త్రాగివేసెను. భగీరథుడు ఆకస్మికముగా గంగ అదృశ్య మగుటను గాంచి క్షోభిల్లెను. దీని నంతయు కన్నులారఁ గాంచుచుండిన దేవతలు జహ్నుమహర్షిని, "స్వామీ! గంగదేవిని స్వీయపుత్రికగా భావించి క్షమించి విడిచిపుచ్చి భగీరథుని గాఢమనోరథమును సఫలము సేయుఁడు" అని విన్నవించిరి. జహ్నుమహర్షి వారిమన్ననలను నాలించి తనచెవినుండి గంగను విడిచిపుచ్చెను. గంగ జహ్నుమహర్షికర్ణమునుండి వెలువడుటచే పుత్రికయై 'జాహ్నవి' నామమున పిలువఁబడుచున్నది.

గంగ మఱల భగీరథునిరథము ననుసరించి తిరిగి ఎట్టిఆటంకములు లేక సాగరములోనికి దూఁకి పాతాళమును ప్రవేశించి భగీరథునిముత్తాతల బూడిదకుప్పలపై ప్రవహించి గతించినవారిని పవిత్రులఁ జేసెను. విశ్వప్రయత్నములు చేసిన భగీరథుని కష్టార్జితమైన పరమపావనిగంగ 'భాగీరథి' యనికూడ పిలువఁబడుచున్నది. అదియే కాక స్వర్గభూపాతాళములలో ప్రవించుటచే 'త్రిపథ' యని వ్యవహరింపఁబడుచున్నది. అట్టి ఈపవిత్రగంగాదేవి నేఁటికిని మన భారతదేశమున చిరస్థాయిగా నున్న జీవనదిసుమా!

# కవి

శ్రీ బి. హనుమారెడ్డి



కవిహృదయం మృదుమధురం
కవికవనం ప్రస్థానపురూపం
వెలుగుచీకటుల సమ్మేళనం
కవికవనం కవిహృదయం!

భావమహతిని మ్రోయించి
మధురగానాలు వినిపించి
మనల నింగికి నడిపించి
చిరస్మృతులు సృష్టిస్తాడు.

వెలుగుకిరణాల దూరి
మొయిలుకౌగిళ్ళ మెఱసి
మంజులగానం నింగిఁ జేసి
తారలహృదితో శ్రుతులు కలుపుతాడు.

రంగరంగాలలో సారంగతుడై
ప్రియయెదయే తావరమై
గుబాళింపు బాళీలతో
నైరాశ్యం చిలికిస్తాడు.

చీకటికోణాల చిక్కువడి
దప్పిక తెన్నులు వెదుకాడి
అఱ్ఱులు చాచి అంతులుగానని
జగప్రజప్రబోధనుదియై.

పదపథాల కథనా లల్లి
భావస్వర్గముల పాలనజేసి
ప్రజ్ఞానపుసంకెళ లన్నిటి
కవనపుబాకుతో త్రెంచేసి,

నవవిశ్వానికి నివాళు లిచ్చి
పైపై త్రోవకు దీధితి జూపి
సౌహార్ద్రం సౌభ్రాతృత్వం
సంఘుం దృష్టిన తిష్టవేయిస్తాడు.

తమస్సు నిండిన సంఘుంబందున
ఉషస్సు గీతలు సరళఁ గీచి
సంఘుభేదముల తత్వాలందున
ప్రక్కలో బల్లెపు సామెత దోచి

ప్రజామేధకు వెలుగులు గుప్పి
శాంతభావములు స్థిరతం జేసి
విశ్వశాంతికి శాస్త్రము తానై
శాంతివ్యవస్థ సంకలనం చేస్తాడు.

కైత కన్నియకు గజ్జియకట్టి
సాహిత్యము పరవళు లెత్తించి
దేశఖ్యాతికి మూలవిరాట్టయి
భువినన్ కవియే ఆరనిదివ్వె
యని మనసుల మెదులుతాడు.

# రవీంద్రుని సౌందర్యాదర్శము†

శ్రీ బెజవాడ గోపాలరెడ్డి

రవీంద్రుని పుట్టినదినము నేకు తొంబదిమూడు ఏండ్లకు పూర్వము ఇట్టిమండువేసంగిలో జన్మించెను, రవీంద్రుడు. ఆబిడ్డ పెరిగి పెద్దవాడై తనసహస్రసాధికము లగు రచనలచే ప్రపంచసాహిత్యసింహాసనమున ఆసీనుడు కాగలడని ఎవరు ఊహించిరి? అతని కావ్యములు కీర్తిపతాకములై సాహిత్యాంబర వీథుల ఎగురుచుండగలవని జోస్యము ఎవరును చెప్పరైరి. ఉన్నతభావశిఖరములు ఆపతాకముల శిరముల వహించి గౌరవాతిశయమున వెలయుచున్నవి. అట్టి విపుల కీర్తి నార్జించిన జయంతిదినము నేడే.

రవీంద్రుడు మధురరసమూర్తి. సౌందర్యములచే పరివేష్టితుడై, శోభలమధ్య పాలింపబడి, రసవాహినుల క్రుంకులిడి ప్రకృతిపాత్రలో రూపసుధల గ్రోలిన భూలోకసురుడు స్వార్థరహితుడై తద్దివ్యానుభూతిని కావ్యప్రపంచమున వెదజల్లి వెడలెను. సౌందర్యాన్వేషణయే వాని ఆజన్మదీక్ష. ప్రకృతిసాగరమున ఎగసి సమయు సౌందర్యవీచికల వెంటాడెను. జీవితపథమున రూపమృగతృష్ణికల ఆహ్వానమున పరుగులిడిన చిరపిపాసువు. సౌందర్యతీర్థముల సేవింపకోరిన నిత్యయాత్రికుడు. చిరపరిచితదృశ్యములలో అభినవములగు శోభావైభవములు తిలకించిన మేధావి. ఉపేక్షితసన్నివేశములలో నూతనరసోత్కృష్టతను అనుభోగించిన రసజ్ఞుడు.

సౌందర్యమన నయనగోచరమగునదే కాదు. పంచేంద్రియములద్వారా ఉపలబ్ధమగు భావావేశము, రసోన్మత్తతయు సౌందర్యమే. మధురసంగీతము, ఉల్లాసోద్దీపకములగు సౌరభములు, విభిన్నరసవత్తరములగు రుచులు, మృదులలితశిరీషపేశలస్పర్శానందములును సౌందర్యమంజరిలోని రసప్రసూనములే. ఊహాలోకమున కలితలావణ్యములచే కవిరసహృదయము సంతుష్టి పొందనేర్చును. స్వప్నసీమల అలౌకిక సౌందర్యమూర్తులలాస్యముచే తన్మయత్వమును పొందనోపును. పూర్వానందముల స్మృతిసాగరమున తేల్చి తరంగాగ్రముల ఇంద్రధనుఃప్రభలరీతి చూడనోపును.

సౌందర్యభోగము సూత్రబద్ధమైన సిద్ధాంతము కానేరదు. కాలస్థితివ్యత్యాసములచే రుచి, అరుచి యగుటయు శ్రావ్యమగునది కఠోరమగుటయు మనకు విదితమే. విరహవేదనోపలంభములే యిందులకు తార్కాణములు. సంయోగయామినీసుధలే విరహనిశీథినీవిషయములై భాసించుచున్నవి.

సౌందర్యానుభోగము విశిష్టమైన మనోవైఖరిపైనను చిత్తసంస్కారముపైనను, రసగ్రహణ కౌశలముపైనను ఆధారపడును. కవితాహృదయతీరముల ఆనందతరంగములు చుంబనమొనర్చుచుండును. ఆఆనంద మేకళానైపుణ్యమున వాక్కులలో కవిత్వముగను స్వరములలో సంగీతముగను రేఖావర్ణములలో చిత్రలేఖనముగను హావభావవిలాసభంగిమవిన్యాసములలో నృత్యముగను పరిఢవిల్లుచున్నది. అది యొక అలౌకికానుభూతి. స్వర్గవిపులసుఖరాశిని సూక్ష్మముగా ఉపలబ్ధినొందుటే సౌందర్యసిద్ధి. బాహ్యవస్తువులకన్న ఆంతరంగికాత్మవిలసనమే సౌందర్యానుభూతి. బాహ్యరామణీయకత నిమిత్తమాత్రమే. అట్టి అపారసౌందర్యానందగోళముల స [illegible] నిత్యవిహారియై అక్షరరమ్యతను అనుగమించు భావతబలతను, శబ్దాతీతమగు ఊహలను మధురస్వరాంచలస్పర్శచే పులకితమొనర్చు గీతోన్మత్తతను ప్రకటించి, దీర్ఘకాలము శారదారాధనగావించిన సౌందర్యోపాసకుడు రవీంద్రుడు.

మనప్రాచీనకావ్యవాహినులు ఆరణ్యకసౌందర్యసంప

† ఈవ్యాసము ఏడుసంవత్సరములక్రింద ఆకాశవాణిచే ప్రసారితమైనది.

దలకు ప్రణమిల్లియే ప్రవహించెను. మనపురాణనాయకులు శ్రీరాముడు, పాండవులు, నలుడు, హరిశ్చంద్రుడు, దుష్యంతుడు, వనవిహారులే కావచ్చును. కాననప్రవాళ పర్యంకముమీదనే సౌందర్యము జన్మించెను కాబోలు! సౌందర్యోపలబ్ధికై అరణ్యావాసము ఆవశ్యకమాయెను. ఏబదిసంవత్సరములు దాటినవారు వానప్రస్థాశ్రమమును స్వీకరించుట శ్రేయమని ఆర్యసాంప్రదాయము. కాని రవీంద్రుడు యువజనులే అడవులకు వెళ్ళి, అచ్చటి అందచందముల అనుభవించుట యుక్తమని చమత్కరించెను.

నిజరసానుభూతిని కేవలము వ్యక్తిపరము చేసికొని అనుభవింపక, విశ్వవ్యాప్తమొనర్చి విశ్వజనానందముగనో, దుఃఖముగనో రవీంద్రుడు వర్ణించును. అందుకలననే అది సర్వజనతార్ద్రతావహముగను ఆనందహేతువుగను వెలయుచుండును. స్వానుభవములలో విశ్వసౌందర్యమూర్తిని కాంచును. తనహృదయతంత్రులను విశ్వవిపంచికాతంత్రులలో శ్రుతిచేసికొని గానముచేయును. అందువలననే అది దేశకాలముల నతిక్రమించి రసజగత్సామగ్రియై యొప్పుచుండును.

సౌందర్యమునకు అల్పాయువను అభిశాపమును ఏభగ్నహృదయ, పిశ్రావణ విరహిణి యొసగెనో. ప్రకృతి సౌందర్యములు దీర్ఘకాలముండునవి కావు. సూర్యాస్తమయవర్ణవైచిత్ర్యములు ఉషాదేవిరాగకపోలరమ్యత, విద్యుత్ చకితకటాక్షతీవ్రత, తమశోభల వికసింపజేసి తోడనే అంతర్ధానమగుచున్నవి. దైవాశీర్వాదమున పుష్పమునకు స్వల్పాయుర్దాయముమాత్రమే యనియు, లావణ్యదశలు మాయలను వెంటాడుచు మాయము కాగలవనియు, సౌందర్యమును బంధించి యుంచజాలమనియు అది కేవలము ఇంద్రధనుఃకాంతిప్రసూనపరిమళము, తరంగములకు ఈడు జోడై చంచలమైన దనియు, వారి భావన. ఒక్కప్రభాతమున అనంతజీవితము ప్రస్ఫుటింపగల దనియు, సంగీతమున క్షణకాలమున అనంతభావములు జన్మించి చిత్తమును రసవంతముగ చేయుననియు వారిహృదయము నిత్యోపలాయనాసక్తము సౌందర్యము.

క్షణభంగురమగు సౌందర్యవిరహమునే ప్రకృతిలో కాంచుచున్నాడు రవీంద్రుడు. సౌందర్యపరిపూర్ణతను పొందిన ఊర్వశిని ఉషోదయసమయమున అనవకుంఠితవు, అకుంఠితవు అనియు, అపూర్వశోభన భువనమోహిని అనంతవిలాసిని అనియు సంబోధించి, క్షీరసాగర మథనకాలమున దేవదానవులకు కాన్పించి నీమనోహర సుందరరూపము యిప్పుడు మానవులకు కాన్పించుచుండుట లేదని-

"మరలి రాదు, మరలి రాదు
అస్తమించెను అగౌరవశశి
అస్తాచలవాసిని ఊర్వశి."

అని వాపోవుచున్నాడు.

అయినను జాగృతమైయుండును
ఆశ ప్రాణాక్రందనముల

అని ఓదార్పును పొందుచున్నాడు.

మాయమైనసౌందర్యరీతుల మరువని చిరవిరహి రవీంద్రుడు

"అయ్యో పోయిరి వానితోడి
ఆదినముల ఆపౌరాంగనలు
నిపుణిక చతురిక
మాళవికల బృందము."

అనియు,

ఎవరిని కలియలేదో
ఆసకలవరాంగనలు
విచ్ఛేదదుఃఖమున నన్ను
అన్యమనస్కునిగ చేసిరి...

అనియు కాళిదాసు కాలపు నాయికలగూర్చి చెప్పుచున్నాడు. కాని వెంటనే ఓదార్చుకొని....

చావరు బాబూ నిపుణికా
చతురికలు శోకమున
వారందరు మారుపేరులతో
ఉన్నారు మర్త్యలోకమున

అని సంతసిల్లుచున్నాడు.

సౌందర్యము భ్రమింపజేయు శక్తిగలది. ఆసౌందర్య

మృగతృష్ణల దాటినగాని నిరలంకారసత్యము స్పష్టము కానేరదు. ప్రభాతారుణవర్ణదీప్తి సౌందర్యమై కన్పట్టును. రక్తిమావరణను ఛేధించి ధవళశుభ్రతయందు సముజ్జ్వలమగును సూర్యరశ్మి. మోహావేశమున ప్రేమారంభము. మోహవిముక్తతయే ప్రేమసిద్ధి. సాధనయొనర్చు యోగికి ప్రథమమున భ్రాంతిమనోహరమాయారూపములో కాన్పించిన తదుపరిభావణవిహీనదేహమున, లోపలను బయటను దివ్యదీప్తిని ప్రసరింపజేయుచు సత్యదర్శన మొసగును.... అని స్వీయచరిత్రను ప్రకటింపని చిత్రాంగదవిషయమై అర్జునుడు తలపోసికొనెను.

రమ్యమైనది కొన్నివేళల హానిని కొనితెచ్చును. సౌందర్యము, సంగీతము, నృత్యము అభినయము, చిత్తవికారమును జన్మింపజేయవచ్చును. దైవాంశసంభూత మగునవి అమృతపానము చేయించుటకుమారు విషపాత్రను అధరములకు అందించును. సౌందర్యానలము దగ్ధమొనర్చి ధగ్ధమగుచుండును. సుఖదుఃఖములకు ఆస్పదమైనవి సౌందర్యములో అనుభోగ్యములగు ఫలములు, నిషిద్ధములగునవి అందే జన్మించెను. అందునదే సౌందర్యము. భగవంతుని మరపింపజేయునని సౌందర్యపరాఙ్ముఖులైరి కొందరు దైవభక్తులు. సౌందర్యమునుండి దృష్టిని మరల్పుడని హెచ్చరించిరి. కాని రవీంద్రుడు నిర్భయముగ....వైరాగ్యసాధనచే కలుగు మోక్షము నాకు వలదు అని చాటెను.

నాప్రపంచము నీసౌందర్యశిఖనుండి శతప్రదీపికల వెలిగించుకొని

“నీమందిరము చుట్టు నుంచగలదు
పంచేంద్రియద్వారముల నేను బంధింపను
దృశ్యశ్రవ్యకృత్యానందములు నీ
ఆనందమునే వహింప గలవు.”

అని వైరాగ్యవేదాంతము నెడల విముఖత్వము చూపెను. సౌందర్యానుభూతిద్వారా రసమయజీవితమును గడిపెను. కళాకారుడగు రవీంద్రుడు, సౌందర్యకమలములతో శోభిల్లు రసకాసారము వారిజీవితము. అమృతమానససరోవరకలస్వనములలో స్వర్ణనళినీకోరకముల మెసవు కవిరాజహంస రవీంద్రుడు.

దశదిశలనుండి జలములు సేకరించుకొన్న నది సముద్రవిలీన మగుమాడ్కి సౌందర్యనిర్ఝరములన్నియు రూపాతీత మగు ప్రశాంతసత్యసింధువువైపునకే వెడలుచున్నవని రవీంద్రుని మతము.

అరూపరత్నాశచే
రూపసాగరమున
ఈదుచున్నాను..

అని గీతాంజలిలో నివేదించెను. సకలజీవకోటులప్రాణములు మహామరణపారణమున సంగమించురీతి....

నానాస్వరముల ఆకులధారలు
తన్మయత్వమున మిళితము కాగా
సమస్తగానము సమాప్తమగును
నీరవపారావారమున.

అని వారివిశ్వాసము. సౌందర్యయవనికాభ్యంతరమున భాసించుచున్నది సత్యసంహాసనము. రసవీచికాఘాతములు వాని రమ్యపాదములు.

సౌందర్యము యౌవనముతో బాంధవ్య మేర్పరుచుకొన్నది. తారుణ్య మనుపింఛమును విప్పి సౌందర్యనాట్యమును చేయుచున్నది. పంచమస్వరమున రాగోద్దీపనాకూజితముల చేయుచున్నది. బాల్యమున వార్ధక్యమున సౌందర్యము కుంటుపడును. యౌవనఘటిత కనుకనే అకుంఠిత. అనిందిత, పూర్ణప్రస్ఫుటిత యగు సుందరి రూపసి యాయెను ఊర్వశి. ఆమెరూపలావణ్యములలోనే సంతుష్టి చెందుచుండిరి కామరహితులగు స్వర్గవాసులు. మానవశరీరమునందే ముఖ్యముగ యౌవనదేహవల్లరియందే సౌందర్యము పరాకాష్టను పొందునని వారిఅభిమతము. కవితావస్తు వగు జవ్వనినిగూర్చి....

“సగము మాత్రమే మానవివి నీవు
సగము కల్పనవు”

అని అర్ధదైవత్వము వారికి నొసగి దేవిని చేసెను.

రవీంద్రునికావ్యములలో అంగవర్ణన లుండవు. స్త్రీస్వభావమును నిశితముగ వర్ణించును. నారీకటాక్షమృగ

యావినోదముల హృదయరంజకముగ వర్ణించును. శృంగారము ధ్వనితమగుచుండునే కాని, నూపురశింజితనర్తకియై విలోల కల్లోలమురీతి గంతులిడదు.

ధ్వనిప్రధానములు వారి కావ్యములు. ఋతుప్రశస్తి వారి కావ్యములలో విస్తారముగ కాన్పించుచుండును. వర్షర్తువుపై వారికి అభిమానము మెండు. రెండవది వసంతము. ఋతువులకు ఉచితమగు ప్రత్యేక రచనల చేసెను. మధురమైన గీతికలపాడెను.

"ఆరుగురు సేవాదాసులు ఆరుఋతువులు
ఏతెంచి చుట్టుముట్టి నృత్యమొనర్తురు"

అని విలాసనర్తకులుగా ఋతువుల పోల్చెను.

"అదో వచ్చె అదో అతిభైరవహర్షమున
జలసేచితక్షితిసౌరభఆహ్లాదమున
దిగ్వధూచిత్తహర్షము
ఘనగౌరవమున వచ్చివేసెను మత్తవర్షము"

అనియు,

"గురుగురు మేఘములు తిరుగుచు తిరుగుచు
గర్జించుచున్నవి గగనగగనమున
నాహృదయము నృత్యముచేయుచున్నది నేడు
మయూరముమాడ్కి నృత్యముచేయుచున్నది"

అనియు వర్షసమాగమోల్లాసమును ప్రకటించెను.

అనంతప్రవీణమగు వసంతవనపుష్పరాజముల ప్రియసఖీజనముగ ఊహించుచున్నాడు.

"ఆవిరజాజి, ఆవకుళము
ఆచంచలచకితచంపకము
స్మితశుభ్రముఖులు
తరుణిపరిమళమాధవి
ఉల్లాస ఉత్సుక ఉన్నమిత
అత్యంతకుతూహలిని."

పువ్వులపలికించి తుమ్మెదలపిలిపించి వెన్నెలల ఒలకించి తీవకన్నియల కులికించి చిగుర్చుతోటలలో వసంతుని సన్మానించెను. తాండవగతిరీతులే ఋతువులు.

శోకమునందును మరణమునందును రవీంద్రుడు సౌందర్యమును కావించెను.

గతించిన భార్యనుగూర్చి........

"మృత్యునేపథ్యమునుంచి
మరల ఏతెంచితివి
నూతనవధూవేషమున
హృదయవివాహమంటపమునకు."

"నీవు నాజీవితమున
కలిపితివి మృత్యుమాధుర్యమును
నాజీవితదిక్చక్రసీమలు
పొందినవి అపూర్వమహిమల
అశ్రుధౌతహృదయాకాశమున
కాన్పించుచున్నది దూరస్వర్గపురము
నీవు కళ్యాణరూపిణివి
మరణమునే మంగళమొనర్చితివి
మృత్యురహస్యమనోహరగృహమున
వాతాయనమున గూర్చుండియున్నావు."

అనియు చిత్రించెను.

వేదన సుధారస మనియు వర్ణించెను. శ్మశానసింహాసనమున తిమిరమకుటముతో మృత్యుదేవతను రాణివలెచూచి సల్లాపించిన కవిరాజు రవీంద్రుడు. రాణివెంట రాజు చనెను. వాని కావ్యశాసనములచే రక్షింపబడి పోషింపబడు అనురక్తప్రజలమగు మనము మిగిలియున్నాము.

# విన్నపము

శ్రీ వావిలాల సోమయాజులు



[పరమేశ్వరనివారితుఁడైనను స్వీయమనఃప్రవృత్తి నెఱుఁగక లౌకికమర్యాదాదుల నాసించి వివిధరాజాస్థానములఁ జేరి యందలిస్థితిగతుల గ్రహించి గర్హించి తుదకు శ్రీకాళహస్తికిఁ దిరిగివచ్చి మహాకవి ధూర్జటి సర్వేశ్వరసన్నిధానమున నొకనాఁటి ఏకాంతమందు— ]

కన్నుల మూడిఁటి నార్పుచు
నెన్నఁడు నన్నెరుఁగనట్టు లేల నటింపన్
కన్నీ రొలుకకు తండ్రీ!
కన్నప్పను గాను నేను కన్నుల నొసఁగన్.

చనినాఁడన్ విజిగీషతో సుకవితాసామ్రాజ్యమున్ గోరి— నా
ఘననిష్ఠాజపహోమసత్క్రియలకున్ గల్పించితిన్ స్వస్తి! మా
యని కాలుష్యము క్లేశము న్మిగిలె; రాజాస్థానమర్యాద లీ
పనినట్లే జరిగెన్— సభన్ గలుగవయ్యా, అర్హసత్కారముల్!

ఏనాఁడైన భువిన్ అసూయ కలుషం బీర్ష్యావ్యథాశాంతులే—
కానన్ రావు సమత్వ మభ్యుదయ మగ్రామ్యంబు సౌఖ్యంబు దే
వా! నాకేశగురూత్తముండు కవియై ఆస్థానముల్ చేరిన
న్నే నమ్మన్ కనకాభిషేక మగునేనిన్ శిరం బిచ్చెదన్.

'పటుగంగాలహరీపరీతశమశుంభత్ప్రౌఢతాంచత్కళా
ఘటనున్' న న్నని కృష్ణరాయధరణీకాంతుండు సామాన్యవా
క్పటిమన్ దర్పునిగా మదిన్ దలఁచి సంభావింపడున్ — కావ్యది
క్కటిగండస్థలగంధవాహమధు వాఘ్రాణింపఁగా నేర్వడున్.

అలఘుప్రౌఢిని క్రీడమై బహురణోద్యద్భూముల న్నిల్చి రా
ట్కులగండేభుఁడు కృష్ణరాయవసుధాగోపాలు డైంద్రద్విపో
ద్గళఘంటారవపాటవోజ్జ్వలలసత్కావ్యంబు కల్పించెనే?
అల పెద్దన్నకు రాజుకున్ మధురసఖ్యం బన్న నిద్దాననే.

అంకిలిలేక గైకొనిన యాశఠకోపయతీంద్రదత్తచ
క్రాంకితదేహమున్ మధురకైటభవైరిపదాబ్జసేవ ప్రే
మాంకితభక్తకీగణరహఃప్రణయార్ద్రహృదంతరంబు లే
కంకురితమ్ము కాదు మనుజాధిపగౌరవ మెంతవానికిన్.

అళికనేత్రాగ్నిహాసానంతరోచిస్సు
    ఖరమైన పద్మాక్షుపాలి కేగి
దారుణశితికంఠదవదాహవర్చస్సు
    భయపెట్ట వనమాలిపజ్జ నిల్చి
హారవాతాశనమారుతౌద్ధత్యమ్ము
    లడలింప కౌస్తుభహారు జేరి
నందీశహుంకారనాదసంభిన్నోర్వి
    మనలేక మధువేణునినదు గొల్చి

పెద్దిరాజయ్యె నంతటి పెద్దవాఁడు
ఎఱ్ఱతిమ్మన సంస్తుతి కెక్కినాఁడు
అబ్బినది రామలింగన్న కంత చొరవ
అయ్యె కవిపితామహుఁడు పెద్దన్న మొన్న.

గణికాలోలుఁ డటన్న యొక్క ప్రథ లోకంబెల్ల వ్యాపించె నం
దణుమాత్రమ్మును లేదు సత్య మెట; నీశా! కట్టినాఁ డెవ్వఁడో
ప్రణయాందోళనవిత్యజీవనకథాలాపుండు — కల్పించె తీ
రనిదుష్కీర్తిని — తృప్తినొందెదను గల్గన్ భుక్తి యెవ్వానికిన్?

జననం బన్నది దుఃఖహేతు వని నే శర్వా! మహాదేవ !! ష
న్నిను బ్రార్థించితి నార్తితో — తమిని తండ్రీ! జన్మమేలేని నీ
గణమం దొక్కనిగా నొనర్చు మట నాకైలాససంధ్యానట
ద్గణమం దొక్కడ నై రచించెదనుగాదా నృత్యగీతంబులన్.

నా కొకజన్మ మున్న భువి నన్ జనియింపగనిమ్ము స్వామి! నీ
వాకిట బిల్వవృక్ష మటు వత్సలతన్ — దినముందినమ్ము ప
త్రాకృతితో త్వదీయపదహల్లకవీథి నలంకరింతు, ఛా
యాకమనీయరూపమున హ్లాదముగూర్చెద నేత్రపంక్తికిన్.

ఏ శివలెంక నీభువి న వెన్ని భవంబులు గల్గు నన్నిటన్
నే శివ! కొల్వ నేరిచెదనే భవదీయభుజంగదివ్యభూ
షాశితికంఠసుందరహసన్నవరూపము దక్క నన్య: మీ
యాశయ మొక్కడే బ్రతుకు నార్ద్రము మంజులము నొనర్చెడిన్.

నా కీస్వర్ణముఖీజలౌఘములలోనన్ నాకకూలంషా
రాకాచంద్రవిశుద్ధసద్గుణము స్వర్గప్రీతియున్ దోచు నిం
దేకాలమ్మును దీర్థమాడుటలు స్వామీ! ఏపురాజన్మలో
నో కావించిన పూజ కాక యెటులై యుండున్ శివా! యన్యమై.

రాజద్వారములందు దర్శనసముల్లాసంబున న్నిల్చుటన్
నాజన్మం బిటు వ్యర్థమైనయది విన్నాణంబు కోల్పోయి పం
కేజశ్రీపరిణద్ధ మత్కవిత విక్రీడింపఁగా మానె — నీ
రాజన్యత్వమె నమ్మి చేరితిని శర్వా! రాజ రాజేశ్వరా!

శిరమున నుండె గంగ — శశిశేఖర! నారసనాంచలంబునన్
దిరముగ నిల్పుమయ్య మధుదిగ్ధమనోజ్ఞమహత్త్వవాణి నీ
కరుణకథానకంబుల యుగంబులు తెల్గుధరిత్రి పాడగా
చరణములాన చెప్పెద ప్రశస్తికిఁ బాత్రునిగా నొనర్పవే!

'వాగర్థంబులు శ్రోతృవక్తలు జగద్వంద్యు(డ వద్వైతవి
ద్యాగోష్ఠిన్' వివరింప నీవె కద చిత్తావాసము న్జేరి మ
త్ప్రాగల్భ్యంబు సమస్తము న్మెరయ కుంభత్ర్యాబ్ధి పల్కింపవే
నీగాథన్ గిరిశా! ప్రజాపతిపురంధ్రీకంఠహారమ్ముగన్.

తెలతెలవారెడి తూరుపు
తెలిగన్నుల విచ్చి దేవ! దీవన లిమ్మా!
తలపున నేయెడ నాపై
వలపే జనియింపనిమ్ము! వరద! దయాళూ!

'శ్రీకంఠ! కంఠభూషిత
కాకోదరవరవరాకఖండమతవ్యా
ఖ్యాకోలాహలదూర!! చి
దాకృతి!! జితకాల!! కాలహస్తీశ!! శివా!!'

# వేదకాలమందును వ్రాత గలదు

## శ్రీ తెన్నేటి విశ్వనాథం



వేదములు పుట్టినకాలమందు మనదేశములో మాటయే గాని వ్రాత లేదని ఒక ప్రబలమైన నమ్మకము ప్రచారములో ఉన్నది. ఈవాదమును బలపరచుటకు కారణములు

1. అంతపాతకాలమందు వ్రాత ఉండగలిగియుండునా?
2. వేదమందు లిపి అనేమాట లేదు.
3. వేదములకు శ్రుతి యనిపేరు. అనగా కర్ణశ్రుతమైనవే గాని చక్షువునకు కనిపించేవ్రాతలో లేనివి; అందుచేతనే వేదము గురువుదగ్గర చెప్పించుకోవటమేగాని చదివి నేర్చుకొను ఆచారము మనదేశమందు లేదు.

ఈవాదములలో బలము లేదనిన్నీ వేదములలో ఉపనిషత్తులలో ఉన్నమాటనుబట్టి అంతస్సాక్షికి, అంతశ్చక్షువునకు కనిపించి వినిపించినమాటనే వేదకవులు వ్రాసేరనిన్నీ అట్టివ్రాతలకే శ్రుతులని పేరనిన్నీ, అవియే, ఇప్పుడు మనకు లభ్యమైన గ్రంథములు అనిన్నీ నావిశ్వాసము.

క్రీస్తు పుట్టిననాటికి, మొహమ్మదు పుట్టిననాటికి వారి జన్మదేశములలో వ్రాతభాష లేదని ఎవరు అనలేదు. కాని వారుకూడ 'రెవలేషను' అంటె శ్రుతివాక్యములోనే వచించేరు. 'వచించేరు' అని చెప్పుటచేత ఆకాలమందు వ్రాత లేదని వాదించుటలో సందర్భము లేదు. నిజము కాదు కూడాను. భాష ఇప్పటివలెనే వ్యుత్పత్తిఅర్థమే గాక వాడుకవల్ల కలియవచ్చి రూఢిఅయినఅర్థమూ భావములలో అనాదినుండి వాడుకలో ఉండియేతీరవలయును. బమ్మెర పోతన భాగవతంబు.... చేసెను అని వ్రాసినప్పుడు పోతన కాలమందు వ్రాతలేదని అనుకొనుటకు ఎలా వీలులేదో, మొహమ్మదు సురాలను నిర్వచనము చేసినకాలములో వ్రాత యెరుగరు అని అనుకొనుటకు ఎలావీలులేదో, బైబిలులో రెవలేషను అని చెప్పినప్పుడు అప్పటికి వ్రాతలేదని ఎలాగు అనుకొనజాలమో, అలాగుననే వేదములు శ్రుతులు అనిచెప్పినప్పుడుకూడ వ్రాతజ్ఞానము ఆరోజులలో లేదని వాదించలేము.

గురుముఖముగా వేదము నేర్చుకోవటమే వ్రాత లేదన్నడానికి తార్కాణము అని చెప్పేవాదములో అసలే బలము లేదు. నాడు నేడుకూడ వేదము నేర్చుకోదలచినవారు గురుముఖముగా చిన్నతనంలోనే, కంఠము స్వరము స్వాధీనము కాని వయసునుండిన్నీ నేర్చుకొంటున్నారు. పుస్తకాలు చదివి అధ్యయనము ఎవరూ నేర్చుకొనరు కారణము సులభగ్రాహ్యము, మాత్రబలము, స్వరము ఉచ్చారణసరిగా అలవడుననిన్నీ, అక్షరమునకు ఎంతవిలువ ఉన్నదో శబ్దమునకు కూడ అంతవిలువ, అర్థముఉండుట చేతనున్ను గురుముఖముగనే నేర్చుకొంటున్నారు. అచ్చు ఉన్న ఈరోజులలోనేఇలాగయినప్పుడు, అచ్చులేని ఆరోజులలో తప్పకుండ ఆవిధముగనే అయిఉండాలి. బడిలోనికి పంపకపూర్వమే, అక్షరాభ్యాసను చేయకముందే, మనము పిల్లలకు కొన్ని పద్యములు శ్లోకములు నేర్పుటలేదా? దానివల్ల వ్రాత లేదని వాదింతుమా?

సరి, శ్రుతికర్ణశ్రుతెంగా అనుపూర్వేణ మనకు దఖలు పడినదని చెప్పినప్పుడు స్మృతులు జ్ఞానేంద్రియము ద్వారా మనకు దఖలుపడినవని వాదించాలి. స్మృతుల కాలమందుకూడ వ్రాతలేదని వాదించాలి. కాని అట్టి వాదము ప్రచారమున లేదు.

'ఋగ్వేదంలో గవార్థకంలో 'అష్టకర్ణీ' శబ్దము ప్రయుక్తమయింది. (సహస్రం మే దదతో ,అష్టకర్ణ్యః శ్రవో దేవేష్వక్రత 10. 62. 7). అవుకు అష్టకర్ణి అనుశబ్దము పర్యాయవాచకంగా వచ్చుటకు కారణం అవుచెవి ఎనిమిది

అనుసంఖ్య ఆకారంలో ఉండటం. ఎనిమిదిఅనే సంఖ్యకు ఒకలేఖనచిహ్నం లేకపోయిన ఈఊహ కవకాశంలేదు. అనగా ఋగ్వేదంలోకూడ లేఖనచిహ్నములప్రసక్తి వచ్చినదన్నమాట. అదేవిధంగా పాచికలమీదకూడ కృత, త్రేత, ద్వాపర, కలి అనునవి ఒకటి రెండు మూడు నాలుగు అనేసంఖ్యలకో ప్రత్యామ్నాయంగా ఉపయోగించేవారు. వీనిని పాచికలమీద ఏవిధంగా గుర్తించేవారు అని విచారిస్తే దానికి ఏదో లేఖనచిహ్నం మవసరమని తోపకపోదు కదా! ఒకవేళ ఒకొక్కసంఖ్యకు అన్నేసి చుక్కలు గుర్తుగా ఉపయోగించినారని మాటవరుసకొప్పుకొన్నను అదికూడ సంజ్ఞామాత్రపర్యవసాయియే కదా? ఏతత్సంజ్ఞలే క్రమపరిణామం చెంది తదనంతరలిపిగా మారినదేమో. ఈవిధంగా ఈనాలుగు సంఖ్యలేకాక శత, సహస్ర వంటి సంఖ్యాప్రయోగాలు చాలాఉన్నవి. అథవా, వానిని అనేకార్థబోధకాలుగా స్వీకరించినప్పటికి 'త్రిపంచాశత్' శబ్దము స్పష్టసంఖ్యాప్రతిపాదకమే అవుతుంది. ఆదిమమానవుడు కేవలము లిపిరహితంగా అంతవరకు సంఖ్యలను గుర్తించటం సాధ్యంకాదు. ఆకారణంచేత ఋగ్వేదకాలంనాటికి సమాజం చాలవరకు ఉన్నతస్థాయిని సముపార్జించిన దనియు, నాటికే భావయు సంఖ్యాగణనము, తత్సంజ్ఞలు ఏర్పడిన వనియు ఊహించుట కవకాశమున్నది.

"అగ్ని రేకాక్షరేణ ఉదజయత్. అశ్వినౌ ద్వ్యక్షరేణ అన్నఋక్కులు "అస్తు శ్రౌషట్ ఇతి చతురక్షరం (అను ౧౧ ప్రపాఠ ౧) అన్నవియు నాడు లిపిచిహ్నములున్నదనుటకే గుర్తులు కాగలవు.

ఋగ్వేదంలో ఈసూక్తము చూద్దాము :

"గాయత్రేణ ప్రతిమిమీతే
అర్కమర్కేణ, సామత్రైష్టుభేన వాకం
వాకేన వాకం, ద్విపదా
చతుష్పదాక్షరేణ మిమతే సప్తవాణీః"

అంటే గాయత్రిలో మంత్రమున్నూ, మంత్రములో సామమున్నూ, రెండునాలుగుపదములు (గలవాక్యములో) అనువాకమున్నూ కొలుచుచున్నాడు; (అనగా నిర్మించుచున్నాడు) ఇట్లు ఏడువిధములయిన ఛందములు అక్షరములతోనే నిర్మాణమగుచున్నవి" అని తాత్పర్యము. యజుర్వేదములో ఈఅనువాకము చూద్దాము.

"అగ్ని రేకాక్షరేణ వాచ ముదజయత్. అశ్వినౌ ద్వ్యక్షరేణ ప్రాణాపానౌ వుదజయతాం.... సప్తదశాక్షరేణ సప్తదశగ్ం స్తోమ ముదజయత్"
అని ఉన్నది. 'ఆశ్రావయ' ఇత్యాది సప్తదశఅక్షరములుగల మంత్రసముదాయమందు ఏకాక్షర, ద్వ్యక్షర ఇత్యాది భావనచే ఆయామంత్రములను పఠించి తత్సామర్థ్యమును వలన అగ్న్యాదిదేవతలు వాక్కు మొదలగువాటిని జయించిరని తాత్పర్యము.

మరి మాండూక్యఉపనిషత్తులో మంత్రాలు చూద్దాము.

"ఓ మి త్యేతదక్షర మిదగ్ం సర్వం తస్యోపవ్యాఖ్యానం. భూతం భవ ద్భవిష్య దితి సర్వం ఓంకార ఏవ; యచ్చాన్య త్రికాలాతీతం తదపి ఓంకార ఏవ."

అంటే, "సర్వమును ఓం అను అక్షరమే. దానివ్యాఖ్యానం (చేయబడును); భూతము, వర్తమానము, భవిష్యత్తు అంతా ఓంకారమే. ఇక ఈమూడుకాలములకు అతీతమై ఏదికలదో అదిన్నీ ఓంకారమే" అని అర్థము.

"సోఽయ మాత్మా, అధ్యక్షర మోంకారోఽధిమాత్రం పాదామాత్రా మాత్రాశ్చ పాద అకార ఉకారో మకార ఇతి" అర్థము. అక్షరములలో ఉత్తమమై మాత్రాయుక్తమైన ఈఓంకారము ఆత్మయే. ఓంకారముయొక్క మాత్రాభూతములగు ఆకారాదిమాత్రలు (ఆత్మకు) పాదభూతములగుచున్నవి". తైత్తిరీయోపనిషత్తులో మరిఒకటిచూద్దాము.

"శీక్షాం వ్యాఖ్యాస్యామః వర్ణః స్వరః, మాత్రాబలమ్, సామ సన్తానః, ఇత్యుక్తః శీక్షాధ్యాయః"

శిక్ష అనగా వ్యాఖ్యాసిద్ధాము. (ఆకారాది) వర్ణము, (ఉదాత్తఅనుదాత్త) స్వరము (హ్రస్వ దీర్ఘ ప్లుత) మాత్ర, (ఉచ్చరింపవలసిన) బలము, సమోచ్చారణ; విలంబనలేక ఒకఅక్షరముతరువాత మరియొకటి వరసగ చేర్చిపలుకుట- వీటివివరణమే శిక్షాశాస్త్రము. వర్ణము అక్షరము రెండును పర్యాయపదములు. నేను ఓనామాలు నేర్చుకొన్నకాలములో 'అక్షరాభ్యాసము' అయినప్పుడు మాఅయ్యవారు

'వర్ణములే' నాచేత యిసుకలో వ్రాసి దిద్దించేవారు.

అక్షరము, శబ్దము విలక్షణపదములు కాబట్టి అక్షర మునకు పైచెప్పిన శ్రుతిపాఠమునందు పూర్ణమైన విలువ ఇవ్వవలెను.

శిక్షాశాస్త్రముగాక, ఛందశ్శాస్త్రము వివరముగా వేదములో ఉదహరించారు. వేదసూక్తములలో 'పూర్వైః కవిభ్యో' అనివేదములకుపూర్వము కవులును ఉన్నట్టుకూడ చెప్పారు. శిక్ష, ఛందస్సు, స్వరం, వర్ణం, బలం, మాత్ర మొదలుగాగలవి ఉన్నకాలములో వ్రాత లేదనిన్నీ అచ్చువేసినట్లయిన వేయి రెండువేలపుటలకు వచ్చే వేద వాఙ్మయమంతా నోటిమాటగానే వేలకొద్ది సంవత్సరాలు గాలిలో శబ్దముగా ఉండేది అన్నవాదము ఊహాతీతమైన విపరీతము. నాదబ్రహ్మ, అక్షరబ్రహ్మ అను పదసముదా యముకూడ శ్రుతులందే కనబడుచున్నదిగదా!

అకార ఉకార మకారములు అనేమాటలు అక్షరముల పరముగాక, ఇతరముగా వాడుటకు అవకాశము లేదు. ఇప్పుడు బడులలో గుణింతము చెప్పునప్పుడు అకారము కకారము మొదలయిన మాటలతోనే చెప్పుచున్నారు. భగవద్గీతాకాలమందు "అక్షరాణాం అకారోస్మి" అన్న దాన్నిబట్టి అరోజులలోను 'కారము' అక్షరపదముగానే వాడేవారని నిశ్చయము. అందుచేత మాండూక్యోపనిషత్తు కాలములోకూడ 'అకార ఉకార మకార ఇతి' అని వాడినప్పుడే అవిధముగానే వాడేరని ఒప్పుకోవాలి.

మాండూక్యోపనిషత్తు దశోపనిషత్తులలోనిది. వేదము లలోఒకఅంశమై వేదవ్యాసునికాలమందు, సంహిత జ్ఞాన కాండ వేరేజేసి సంస్కరింపబడినప్పుడు (అనగా అధునిక భాషలో ఎడిటుచేసినప్పుడు) ఈఉపనిషత్తుకూడ ప్రత్యే కింపబడినది. వేదములు కర్ణశ్రుతములయినకాలమందు చక్షుర్దృశ్యములైకూడ ఉండెను. అని తెలుచున్నది.

లిపి అనేమాట వేదమందు లేదు. అందుచేత అక్షర ములు ఆకాలములో లేవు అన్నమాటలోకూడ బలము లేదు. లిపి అనగా అక్షరామ్నాయము అని సహజముగా ధాతువు అర్థ మున్నదా? ముద్రణాలయములు వచ్చినతరు వాత లిపి అన, అక్షరములు వాటిదృశ్యరూపము అనే అర్థము ఆమాటకు క్రమేణ చేరినది. లిపియొక్క ధాతువు వేదకాలమందుకూడ ఉండెనుకదా. 'నకర్మ లిప్యతే నరే' అని కఠోపనిషత్తులో కనిపిస్తున్నది మొదటిలోనే.

అక్షరము, అక్షరములు, అకారము ఇత్యాది పదములే ప్రత్యక్షముగా శ్రుతులలో కనిపిస్తుంటే అవి లేవు, ఇవి లేవు, అందుచేత ఆరోజుల్లో వ్రాతయే లేదు అని వాదిం చుట అర్థరహితమైనది.

ఇంగ్లీషుభాషలో 'అల్ఫబెట్టు' అనుమాట ఉన్నది. ఆమాట గ్రీకుభాషనుండి ఇంగ్లీషువారు రెనైసాన్సుకాల ములో తీసుకొని వాడుకొంటున్నారు. ఓనామాలు అన్నట్టి 'ఆల్ఫా- బీటా' కలిసి 'అల్ఫబెట్టు' అన్నారు. అయితే ఇంగ్లీషులో ఈమాట వాడకపూర్వము వ్రాత లేదని ఎవరు అనగలరు?

ఇంతవరకు ఈవిపరీతార్థములకు, విపరీతమైనఊహలకు కారణము లేదు.

గతశతాబ్దములో పాశ్చాత్యులప్రాబల్యము ప్రపంచ మందు హెచ్చయినది. వారు చెప్పినది, వ్రాసినది నిజమయి తీరాలి అని ఒకవిశ్వాసము బయలుదేరి వారిప్రాబల్యము హెచ్చయినకొద్ది ఆతప్పునమ్మకము దృఢపడినది.

వారి సాంప్రదాయములు వారి విశిష్టతను మించి వేరే గొప్పవిషయములు పురాతనమందు ఉండి ఉండవని వారి ఊహ. ముఖ్యముగా ప్రాచ్యదేశములందు అసలే ఉండ వని వారి అహంకారము. ఆఅహంకారమును ఆధారము చేసికొని భాషవిషయమయి, చరిత్రవిషయమయి అనేకులు వారికోవిదులు వ్రాశారు. కష్టపడే వారు చాలాసంగతులు మనకి విశదీకరించారు. కృతజ్ఞులము. కాని భాషాజ్ఞానము చాలమిచేతనున్నూ, స్వవిశిష్టతాహంకారమువల్ల పుట్టిన సంకుచితదృష్టిచేతనున్నూ పాశ్చాత్యవిశిష్టతకు భంగము అని తలచినపుడు అపార్థము తెలియకుండానే వారు చేసేవారు "త్వం సుమేఘం మహాయాస్వర్విదం" అని ఋగ్వే దంలో ఎదురుగుండా కనిపిస్తూంటే గ్రీకులు ఇండియా దేశం వచ్చేవరకు వారిభాషాప్రసాదము మనకు ఇచ్చేవరకూ మనకు రాసులపేర్లు లేవని వ్రాశారు. శ్రీగొబ్బూరి రాఘవ రావుగారివ్యాసములను భారతిలో చదివినట్లయితే ఇటు

వంటి విషయములు చాలా మనకు అవగాహనకాగలవు.

భాషావిషయమయికూడ ఇట్లే వారు వ్రాసిన వ్రాతలు ఆధారంచేసికొని మనవారుకూడ "వేదకాలంలో వ్రాత ఏమిటండీ" అని అపనమ్మకం పడ్డారు. దీనికితోడు వేదం "అపౌరుషేయ"మనే గొప్ప చెప్పుకోవడం ఆఅపనమ్మకమునుబలపరిచింది. కాని శ్రుతులలోఉన్నమాటలను సరిగా చూచి, ఆమాటలకు సహజమైన అర్థము ఇచ్చినట్లయితే వేదకాలములో వ్రాతలేదనుటకు అవకాశము లేదు. వ్రాత అనేమాటకు మాత్రం వ్యుత్పత్తి అర్థము చూస్తే ఇప్పుడు మనమిచ్చే అర్థము ఎక్కడ ఉన్నది? వ్రాతవరుస (గల) సమూహము ఇంతేగదా! 'సన్తానః' అని దీనినే తైత్తిరీయంలో పూర్వులు వాడేవారు. మనము వాడే మాటలకు మన మిచ్చే అర్థము ఇతరులుకూడ యివ్వవలెను అని మన అభిలాషగదా. అలాగుననే ఆనాటి భాషకు కూడ ఆనాటి కవులు ఇచ్చినఅర్థమును మనము గ్రహించవలెను.

అంతేకాక వానివిషయంలో సానుభూతితో పరిశీలించటంకూడా అవసరము. సమకాలికమగు వ్రాతలులేని వేదకాలంలోని విషయజాలం పరిశీలించేటప్పుడు బాహ్యాధారాలు లేనికారణంగా అంతస్సాక్ష్యం మాత్రమే లభ్యమవటంచేత ఎవరికి తోచినవిధంగా వారు అర్థనిర్ణయంచేస్తున్నారు. అది విచారించవలసినసంగతి. ఆదృష్టిలో జాగరూకతతో పరిశోధన కొనసాగించినయెడల వేదకాలమందు నిస్సందేహముగ వ్రాతనేర్పు కలదని గ్రహింపఁగలము.

# జీవబ్రహ్మైక్యము

## శ్రీ తాడేపల్లి యజ్ఞమహాలక్ష్మి



అన్నిరూపములను నీవ ఆత్మ నీవ,
సచ్చిదానందరూపి వౌ స్వామి నీవ,
దేహములయందు నివసించు దేవు డీవ
పరగ నాయందు గల పరాత్పరుడ వీవ.

ఇంత పంతము నాపైన నేల నీకు
కరుణగల్గదు నాపాపకర్మ మేమొ!
మోముజూపవు స్వామి నే మోహముననుు
నిలిచి ప్రార్థించినను నిన్ను నీరజాక్ష!

ఈధరాస్థలి జనులను సృష్టిచేసి
సాక్షిగానుండుటయె నీకు సరసమగునె;
ఆదియందున సృష్టింపుమనుచు నిన్ను
స్మరణజేసిరె తెల్పవే సారసాక్ష!

సృష్టిగన్నట్టివారు ని న్జూడలేక
జననమరణంబులం బడి చాలభ్రమసి
పోవుచున్నారు వారల బ్రోవ నీకు
భారమున్నది—తప్పను పంకజాక్ష!

సీతారామా యనుచును
ప్రీతిని నే బిల్వగానె ప్రేమను నీవున్
శాతిలచితివో లేదో
చేతోమోదంబు గల్గ చెప్పుము రామా!

ఇతరాపేక్షలు లేకను
సుతరాం విషసంగ మడచి సుజ్ఞానుడవై
హతకామాదులు గోరక
సతతము నీలోన నీవె సర్వము గనుమా!

దేహత్రయములు నే నను
మోహము తెగటార్చి ముందు పొలుపుగ నీ వా
సోహలయామృతతత్త్వవి
దేహాలయంబగుస్థితి గని తెలియుము జీవా!

లోకము లన్నియు నీ వన
నేకాగ్రధ్యానలక్ష్య మిచ్చు జనింపన్
ప్రాకటసద్వస్తువులో
నేకమ్మై ముదమునందు మిలలో జీవా!

సృష్టిలో కనబడు వస్తువు
నష్టమ్మగునని యెరింగి నయమున నీ వే
కష్టములేనియు నోర్చుచు
వ్యష్టిసమష్టియు తెలియని బ్రహ్మము కమ్మా!

సర్వము మంగళ మనుచును
నిర్వాణాత్మస్వరూపనియతుడ వగుచున్
గర్వంబుల దిగనాడియు
సర్వము నీ వగుచొ మేలు జ్ఞానార్జనచేన్.

# నవోదయం

శ్రీ నార్ల వేంకటేశ్వరరావు



చీకటి తెర తొలగునులే!
ఇక నీ
వాకిట సిరి వెలుగునులే!!

రేపన్నది వచ్చునులే
ఆపన్నుల మెచ్చునులే
కన్నులతడి నొత్తునులే
చిన్నగనోడి కెత్తునులే.

చీకటి తెర తొలగునులే!
ఇక నీ
వాకిట సిరి వెలుగునులే!!

చిత్తము చిగురొత్తునులే
ఎత్తుగ ధ్వజ మెత్తునులే
సత్యము పురి విప్పునులే
నృత్యము ధర నొప్పునులే.

చీకటి తెర తొలగునులే!
ఇక నీ
వాకిట సిరి వెలుగునులే!!

కత్తికి చెదపట్టునులే
క్రౌర్యము తుదముట్టునులే
ఆశలు తలలెత్తునులే
ఆర్తులు పరువెత్తునులే.

చీకటి తెర తొలగునులే
ఇక నీ
వాకిట సిరి వెలుగునులే!!

నవశకమే విరియునులే
నవ్యాభ్రము కురియునులే
న్యాయంబిల నిలుచునులే
నవజీవము పిలుచునులే.

చీకటి తెర తొలగునులే!
ఇక నీ
వాకిట సిరి వెలుగునులే!!

# గోపిక

శ్రీ కుమారీ వసంతకుమారీదేవి



౧

చెక్కిటం జేయి చేర్చుచు చిన్నబోయి
యమున సైకతసీమల కుములువేళ
వెనుకగా వచ్చి మెల్లగా కనులు మూసి
గ్రుచ్చి కౌగిట జేర్చు నీ కూర్మి యెంతొ!

వింతగా మారిపోయెనే యింతలోనె!
నిన్ను మనసార నమ్మిన కన్నెవలపు
క్రూరవిధి కర్పణము చేసి దూరదూర
ముగను బోవుట యిసుమంత తగునె సామి!

అన్నెము పున్నెము న్నెరుగ నట్టి
యమాయకురాలికిన్ మరుం
జిన్నెలు వన్నెలుం దెలిపి, చింతలకున్
నిలయం బొనర్చి, నీ
కన్నను ప్రీతిపాత్ర లిల కానగ
రారని నచ్చ బల్కుచున్
క్రొన్నన మోవి నాని, యెద కోరికలన్
పులకింప జేయుచున్.

మురిపెముల నింపు బాహువల్లరులయందు
జీవితలతాంతమాధురుల్ త్రావి త్రావి
గణన సేయక పత్రభంగంబునైన
ఏగినా వేల యెటకొ విరాగివోలె.

౨

నీ సమాగమకాంక్షతో నెమ్మనమ్ము
వింత యుద్వేగముననుు త్రుళ్ళింతలిడును
సరసముల్, మధురమ్ములు, సరళము లగు
ప్రణయభావాల బంధింప పరుగులిడును.

ఎదుటను లేతనవ్వు లొలికించుచు
నిల్చిన యంతనే ప్రభూ,
హృదయము కంప మొందు తనువెల్ల
కదంబమనోజ్ఞశోభతో
కుదురుకొనంగ కోరికలకోరకముల్
కుసుమించిపోవ నే
నొదుగుదు నీ పదాబ్జములయొద్దనె
రాగరసాంతరంగనై.

ఘనతరభావసుందరవికాస
విలాసవివృద్ధమూర్తినై
నే ననురాగరంజితమనమ్మున
నీదరి జేర్చినంతనే
అణు వణువున్ చలింప మధు
రాశయముల్ ఫలియించి పోవగా
అనుభవమందు లేని సుఖమందు
లయించి, తరించి పోయెదన్.

# కళ - కళారాధకుడు

శ్రీ జి. విద్యాసాగర్



మనపూర్వులు చతుష్షష్టికళలని పేర్కొనుచూ వానిలో నుంచి చిత్రలేఖనం, సంగీతం, కవిత్వం మొదలైన లలితకళలను ప్రత్యేకించారు. ఈలలితకళల కున్నంత ప్రచారం, గౌరవం, మరేయితరకళలకూ లేదనటంలో అతిశయోక్తి అణుమాత్రంగూడా ఉండనేరదు.

విశ్వశ్రేయస్సును అభిలషించిన ఏకవియైననూ తాను కళాశీలి కావలయునని కోరుకొనే తనకావ్యాలను ప్రచురిస్తుంటాడు. కవి కానిదే కళకు (ఇక్కడ ఈకళాశబ్దం సాహిత్యా పర్యాయపదంగా ప్రయోగించబడింది) స్థానం రాదు. కళ లేనిదే కవికి స్థానం లేదు.

అయితే 'కళ' అంటే ఏమిటి ? ఈప్రశ్నకు సమాధానం చెబుతూ శ్రీకొడవటిగంటి కృష్ణమూర్తిగారు ఏమన్నారంటే - కళఅంటే ఏమీ కాదు. చుక్కలకలయిక గీత అయినట్లుగా, శబ్దాలకలయిక సంగీత మైనట్లుగా, రంగుల కలయిక చిత్రలేఖన మయినట్లుగా, మాటలకలయిక సాహిత్య మైంది. మాటలు కలిసినంతమాత్రాన సాహిత్యం కాదు; రంగులు కలిసినంతమాత్రాన చిత్రలేఖనం కాదు; శబ్దాలు కలిసినంతమాత్రాన సంగీతం కాదు. శబ్దాలకు సంబంధించినకళ సంగీతం; రంగులకు సంబంధించిన కళ చిత్రలేఖనం; మాటలకు సంబంధించినకళ సాహిత్యం. అయితే కందిపచ్చడి చేయడందేనికి సంబంధించిన కళ ? ఎంతబాగున్నా అది యిచ్చే ఆనందం క్షణికమే. మహా అయితే ఒకరోజే అది చేసినమనిషిగాని, నడ్డించిన మనిషిగాని (అదైనా స్త్రీఅయితేనే) బాగుంటేనే తప్ప మనకు జ్ఞాపకం వుండదు. వారి లలితకళలకూ, కళలకూ వున్న భేదం యిదే».

శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు ముందు పూర్తిగా తాను అనుభవించి లీనమైపోయి తనచిత్తవృత్తుల్ని బుద్ధిపూర్వకంగా కొన్నికొన్ని బాహ్యచిహ్నాలద్వారా [చలనముతోనో - అది నాట్యం; గీతలతోనో - అది చిత్రలేఖనం; రాళ్లతోనో - అది శిల్పం; రంగులతోనో - అది చిత్రరచన; స్వరముతోనో - అది సంగీతం; పదములతోనో - అది కవిత్వం] ప్రకటించి, ఆచిత్తవృత్తుల్ని ఇతరమానవహృదయాలకు పాకించి వాళ్లచేత తనచిత్తవృత్తులవంటివి అనుభవింపచెయ్యడానికి ఒకమానవుడు చూపెట్టిన పనివాడితనం, సృజించిన కృతి - కళ» అని నిర్వచించారు.

పైనిర్వచనాలు రెండూ కళనుగురించి బాహ్యంగానూ స్థూలంగానూ ఉన్నవే కాని ంగా లేవు. కళయొక్క ఆంతర్యం సూక్ష్మంగా చెప్పాలంటే ఇది కేవలం జీవనంయొక్కస్వరూప' మని రెండుముక్కల్లో చెప్పవచ్చు. కాని ఈసిద్ధాంతాన్ని వ్యతిరేకిస్తూ కొంతమంది 'Art for art sake' కళ కళకోసమే ననీ, 'The end of art is art just as an end of Nature is Nature' ప్రకృతి స్వభావనిరూపణమే ప్రకతి పరమావధియైనట్లు కళాసిద్ధి కలగటంతప్ప కళవల్ల ప్రయోజనాలు శూన్యమని ప్రవచించారు. అంతే కాదు. 'ఆస్కార్వైల్డ్' 'All art is normal. No artist has ethical sympathies. An ethical sympathy in an artist is an unpardonable mannerism of style' అని నిర్వచించి కళ కళే ననీ, జీవనం జీవనమేననీ ఈ రెంటికీ ఈషణ్మాత్రమైనా సంబంధంలేదనీ ప్రకటించాడు.

ఇక పైవాదములను పరిశీలిద్దాం. 'Art for art's sake' అని అనటంలోగల అర్థాన్ని, అందులోగల నగ్న

సత్యాన్ని గ్రహించలేక ఆవిమర్శకుడు పొరబడ్డాడనే చెప్పవలసివుంటుంది. కళ కళకోసమే నంటే జీవితవిశేషమే కళ అనీ, ఆకళ జీవితంకోసమే ననా అర్థం. 'జీవిత విశేషమే కళ అయినప్పుడు కళ ప్రకృతికి అనుకృతిగాని ప్రతిబింబంగాని కాదు' (జేగంటలు- శ్రీ జి. వి. కృష్ణారావుగారు)

కళవల్ల కళాసిద్ధితప్ప తదితరప్రయోజనాలు లేవనటం కేవలం తెలివితక్కువ. అలా తదితరప్రయోజనాలు సంభవించనినాడు ఆకళవల్ల యితరులకు కలిగే లాభంగూడా శూన్యమౌతుంది; తప్పదు.

కళవల్ల తదితరప్రయోజనాలు లేకపోలేదు. కళజీవితంలో ఆచార్య 'కాకా కలేల్కర్' ఏమంటున్నాడో చూడండి-

1. Art for Art's Sake – కళ కళకోసమే
2. Art for life's Sake – కళ జీవితంకొఱకు
3. Art as an escape from life – జీవితంలోని వాస్తవికపరిస్థితినుండి తప్పుకోడానికి
4. Art as an escape into life – నీరసవ్యవహారమునుండి తప్పించుకొని జీవితానందములోనికి ప్రవేశించడానికి
5. Art for Service Sake – సేవకొఱకు
6. Art for Self-realisation – ఆత్మానుభూతికొఱకు
7. Art as the recreation – వినోదానికి
8. Art as a creative Necessity– సృజనప్రవృత్తిని తృప్తిపరచుకోవడానికి.

ఇలా నిర్వచించుకొంటూపోతే ఎన్నైనా నిర్వచింపవచ్చు. ఏవ్యక్తిఅయినా 'నేను కళాకారుణ్ణి, నారచనలు కేవలం నాఆనందంకోసమే కాని యితరులతోనూ, నీతి అవినీతులతోనూ నాకు నిమిత్తంలేదు' అని అంటే స్వామీ! మీరు కళాస్రష్టలు కారు. ఇంతలోనైనా దయయుంచి మీకలాన్ని ఏపెంటదిబ్బమీదనో లేక ఏమురికికాలువలోనో పారవెయ్యండి' అని మనం వందనసహస్రాలు అర్పించవలసి ఉంటుంది.

'ఆనందోబ్రహ్మ యటన్న ప్రాజదువు' నిజమే గాని ఆఆనందంకోసం అవినీతికి పాల్పడి అసభ్యరచనలు చేస్తే సమాజం ఎన్నటికీ వాటిని ఆదరించదు. తాత్కాలికోద్రేకానికి లోనయి వాటిని ఆక్షణం మన్నించినా తరువాత వాటిగతి అధోగతే. సందేహం లేదు. కేవలం అవినీతిపూరితంగా వుంటేనే గాని రచనలు ఆనందదాయకాలై వుండటం- నీతియుక్తంగా వుంటే లేకపోవడం ఎక్కడా లేదు. అవినీతివిసర్జన- ఒకవిధంగా నీతిదాయకమే- వేరే మరోనీతిని ప్రబోధింపవలసినపని లేదుకూడా.

'Art is nearest thing to life. It is mode of amplifying experience and extending our contact with our fellowmen beyond the bounds of our personal lot' అని 'జార్జి యిలియట్' నిర్వచించినట్లు కళకు జీవనానికి గల దూరం ఏగణితశాస్త్రజ్ఞుడూ లెక్కవేయలేనంతటి సామీప్యంలో వుంటుంది. జీవనంకాని కళ, కళకాని జీవనమూ వ్యర్థమూ నిస్సారమూ అవుతోంది. కాబట్టి మనం కళను, జీవనాన్ని వేరుచేయ్యలేము. అలా వేరుచెయ్యాలనుకోవటం కేవలం 'పిచ్చితుగ్లక్' సిద్ధాంత మౌతుంది.

'ఈకళ స్వయం సంపూర్ణం, అనన్యం, అఖండం, ఏకం, వ్యంజనావృత్తిప్రధానం. ఇంద్రియగోచరమయిన జీవితమైఉన్నది' [జేగంటలు- శ్రీ జి. వి. కృష్ణారావుగారు]

కళోపాసకునిహృదయం ప్రకృతి ప్రేమాతిశయాలవల్ల ప్రతిఫలితంకాకపోతే అతనికృషి నిష్ప్రయోజనమౌతుంది. దానికి కారణం అతనికళ డాంబిక మగుటయే. 'వింకెల్మన్' "Art begins with the nessary, culminates in the beautiful and closes with the superfluous" కళ అవశ్యప్రేరణచే పుట్టి రససౌందర్యముచే ఉన్నతి వహించి వృథాడాంబికరూపమున అంతరించు నని ప్రకటించినాడు.

మనము కొంచెం ఓపికతో పర్యాలోచించినట్లయితే ప్రతిమానవుడూ కళాతపస్వియై ఉంటాడేమో ననీ, అతని హృదయం కళాశ్రీ చరణాంకితమూ, ఆనందప్లావితమూ కావటంవల్లనే భగవంతుడు సత్యం, శివం, సుందరమైన ఈ ప్రకృతిని అతనికి అనుభవించడానికి ఇచ్చి వుంటాడేమో ననీ అనిపించకమానదు.

గాంధీజీ 'Man is an artist and a creator, he must have love and beauty' 'మానవుడు సృష్టికర్తమాత్రమే కాదు గొప్ప కళాభిజ్ఞుడుకూడా; అతనికి అందచందాలు కావాలి. రంగులూ రాగాలూ కావాలి?' అని వివరించాడు,

ఈవాదనప్రకారం మానవులంతా కళాశీలురై వుండాలన్నమాట. కాని ఆవిధంగా వున్నట్లు గోచరించదు. పూలల్లో వాసనలేనిపూలు ఉన్నట్లుగానే మానవుల్లో కూడా కళాశీలురు కానివా రున్నారు. వారు సామాన్యజీవులు. వీరిజీవితం ఉచ్చంగా 'తేనెటీగ'జీవితాన్ని పోలివుంటుంది. అనుభవయోగ్యమయినది దూరంలో ప్రకృతి వున్నప్పటికీ ఆఅనుభవంలో కలిగే ఆనందంలో తన్మయత్వం వహించి రసవాహినులై ప్రవహించడానికి బదులుగా వీరు శిలాహృదయులై స్తభించిపోతారు.

కళాజీవి సౌందర్యోపాసి, స్వేచ్ఛాపిపాసి. ఇతనిహృదయం కళంకరహితమైన ధవళమరీచీసందోహం. పూత నవనీతపూరితము. శ్రీ శ్రీ తనవ్యత్యాసంలో అన్నట్లు ఇతని వేదాంతం తిరుగుబాటు తనబాటలో ముళ్ళురాళ్ళు అవాంతరా లెన్నివున్నా ఇతనిది పురోగమనమే. ఈకళాజీవి ఎటుపోతున్నాసరే అంతకుముందు ఇతన్ని ఎరుగని ప్రపంచమే తుదకు వెన్నంటి నీరాజనా లిస్తుంది. కలకాలం అతన్నిహృదయంలో దాచుకుంటుంది.

ఇక సామాన్యజీవి కేవలం యితరులను ద్వేషించటమే తనకర్తవ్యమనీ ఆలాద్వేషించటం చేతనవటం తనఅదృష్టమనీ భావిస్తుంటాడు. అడుగడుక్కీ ఇతనికి అవాంతరమే. ఏప్రపంచం కళాశాలి వెన్నంటి వస్తుందో ఆప్రపంచమే సామాన్యజీవిని అతడుపోయిన మరుక్షణం మరచిపోతుంది.

మానవుల్లో నవశ్రీచైతన్యప్రభలను రేకెత్తింపగల సామర్థ్యం కళాశాలిసాధనలో వున్నది. అతడు దైనందినజీవితంలో సలిపేతపస్సు యావత్తూ విశ్వకళ్యాణానికే నవీనభావాలతో, నూత్నసందేశాలతో కుళ్లి, పురుగులుబడ్డ సామాజికవ్యవస్థను పునరుద్ధరించి వీర్యవంతం జేయటమే అతని కర్తవ్యం. కళాశాలి ఏఅవరోధాలనూ లక్ష్యపెట్టడు. సరిగదా!- తనవైఖరికి వ్యతిరిక్తమయితే- చివరకు ఆ సమాజాన్ని వదలుకొనుటకైనా అతడు సంసిద్ధుడే.

# పారవశ్యము

## శ్రీ జి. విద్యాసాగర్

'చిరుచెమ్మటల్ పట్టె కారణ మ్మేమే?'
'శ్యామసుందరుమురళి వినిపించె నమ్మా!'

'వానమబ్బులు చూచి పొంగుతా వేల?'
'నెమిలిపింఛపుకాంతి కనిపించు చెల్లీ!'

'నీలాల సీకండ్ల ఆవెలుగు లేలా?'
'స్వామిచేతులస్పర్శ అవి పొందె నమ్మా!'

'నీతనువుపై రేగు పరిమళ మ్మేమే?'
'వలపు గుండియ నిండి పైకుబికె నమ్మా!'

# అభిసారిక

వెడలెనమ్మా నీల, విభుని కూడగ రేయి
బృందావనమ్మున కేకాకి యై—

కలువరేకులుబోలు
కనుల కాటుక దిద్ది
గళమునందున నల్ల
కలువమాలలు దాల్చి ॥వెడలె॥

వక్షోజములపైన
పచ్చికస్తురి దిద్ది
మొలనూలు విడనాడి
కాలియందెలు దీసి ॥వెడలె॥

చెవిలోన కానుగ
పూవు సొబగుల జిమ్మ
నెరవేణి పిరు దంటి
ఉరగభ్రాంతిని గొలుప ॥వెడలె॥

నింగినీలపురుచులు
చెంగలింపగ చీర
మేలిముసుగున నొదిగి
మెల్ల మెల్లగ కదలి ॥వెడలె॥

నిండుగర్భిణివోలు
నీరదమ్మును పోలి
వలపుత్రోవలు జూప
ప్రాణాలు బిగపట్టి ॥వెడలె॥

# మనయము

వెడలిపోవబోకే!
రాధా!
వెడలిపోవకే!

నీవు నలుపు నేను నలుపు
నింగి నలుపు యమున నలుపు
వలపువినా కలత లేని
హృదయములో నలుపు పులిమి ॥వెడలి॥

ముద్దుమోము కందిపోయె
చిరుచెమ్మట లావరించె
బొమలు ముడిచి పెదవి బిగిచి
చురుకు చూపుతూపు విసరి ॥వెడలి॥

నీవు లేక నేను లేను
మనములేక వలపులేదు
జడమయమై పోవు జగతి
మధురమురళి మూగవోవు ॥వెడలి॥

తిరుగలేను పిలువలేను
వెదుకలేను విపినములో
ఎడదసుడుల ఘోషలలో
కన్నుల జడివానలలో ॥వెడలి॥

# దర్శనము

మందారములపొంత మాధవుం డడుగో!
పులకింపగా మేను మురళి వూదేను!

తలపైన పింఛెమ్ము కులుకుచుండంగ
ఉరముపై రత్నాలహారములు వ్రేల
పూపకస్తురిబొట్టు మోముపై వెలయ
చందనమ్ముల మేను జాజువారంగ

మందారములపొంత మాధవుం డడుగో!
పులకింపగా మేను మురళి పూదేను!

మోవిపై చిరునవ్వు మోసులెత్తంగ
పసిడి చేలపుకాంతి దిశలెల్ల గప్ప
కంకణమ్ములు చేత ఘలుఘల్లు రనగ
నీలినిగ్గులతళుకు నింగి కంటంగ

మందారములపొంత మాధవుం డడుగో!
పులకింపగా మేను మురళి వూదేను!

రావమ్మ! మధువాణి! రావె! కళ్యాణి!
రావె! శ్యామలవేణి! రావె! పూబోణి!
జాగుచేసిన పాట ఆగిపోయేనే!
ఎదలెల్ల వలపులై కదలిపోదామే!

మందారములపొంత మాధవుం డడుగో!
పులకింపగా మేను మురళి వూదేను!

# అనార్కలి

పదియునారేండ్ల మిసిమి జవ్వనపుతీవి
ప్రేమకోసము బలిపెట్టు పిచ్చితల్లి!
నీమహాత్యాగదీక్షాప్రణీతమధుర
హాసముల కివె మాదుజోహారు లమ్మ!

ధర్మము మూర్తిగైకొనిన
దా! అనిపించెడి పాదుషాహియే
ధర్మము వీడి చంపుమనె
తల్లి! సజీవసమాధి జేసి నీ
నిర్మలతన్ గ్రహింప దవి
నీతుల గుప్పిట చిక్కినాడులే!
దుర్మదచిత్తుడై -ప్రణయ
దూరుడునై -అధికారగర్వియై.

భరతదేశపు బంగారుపంట గాగ
అవతరించినఘనుడటే! అగ్బరుండు
వంశగౌరవార్థము నిండుప్రాణములను
తీయయత్నించుకటికకసాయి నేడు.

నమ్మికలు వేయి చూపించినాడు నాడు—
ప్రేమమయమూర్తి, నీదు సలీముప్రభుడు;
కాళ్ళపై బడ్డవానిని గారవించి
తెచ్చుకొన్నావు మెడపైకి తేనెకత్తి.

నిక్కముగ ప్రేమ నీపైన నిలిచియున్న
సాగనిచ్చునే తనతండ్రిశాసనమ్ము?
నీటిపై వ్రాలు యువరాజుమాట నమ్మి
దేనికే యింత మోసపోతివి కుమారి!

రేపు ఏమెహరున్నిసా తేత [illegible]డద
కొల్లగొట్టగ నుండెనో కూర్మిమగడు
తెలియలేమమ్మ! తుమ్మెదవలపు లవ్వి
ఎఱుకపడుచుండె లోగుట్టు లిప్పు డిపుడె.

అదిగో! రాళ్ళుపేర్చిరి లేచినది సమాధి
గోడవచ్చెను నిను మ్రింగ గొంతువఱకు;
వదలిపెట్టవే ప్రణయమ్ము పాదుగాను!
అడుగుచున్నాడు పాదుషా అంత్యప్రశ్న.

'వదిలెదవేని నాసుతుని
పైగల మోహము నిప్పు డిప్పుడే
వదలెద నిన్ను- లేద -అని
వార్యము దుర్మరణమ్ము- శీఘ్రమే
యెదొ ఒకనిశ్చయమ్ము
వినిపించుము -మూర్ఛముజేసి ప్రాణముల్
వదలెడి యత్న మీవు సలు
పన్ దలపెట్టకుమా అనార్కలీ!"

"ఇన్ని దినములు మాకొల్వు నున్నకతన
చంప చేరాక యింత ప్రశ్నింపవలసె;
చెప్పుటకుముందు సుంత యోజించుకొనుము;
ప్రణయమో? ప్రాణమో? దేని వదలుకొనెదొ?"

ప్రాణమేగాని ప్రణయమ్ము వదల ననుచు
చించుకొని గొంతు నీవు గర్జించినావు;
అదరిపడినాడు మొగలుహర్యక్షవిభుడు
తూలిపడిపోవుభవనాలతోడగూడి.

చెల్లినది మాకె చెప్పిన సిగ్గుగాని
మానవతులమ్మ! మాకన్న మగువ లెపుడు;
చాటుకొన్నావు తల్లి! నీశక్తి దిశల
వాల్చుకొన్నాము చెల్లి! మాబరువుతలలు.

పాణికదలించెనో లేదొ పాదుషాహి
మరగుపడిపోయె నీముగ్ధమధురమూర్తి;
నీవు నడచిన బాటలు నేడుగూడ
పచ్చికస్తురితావుల పరిమళించు.

పూవులపండుగై గడచి
పోయెడి నీమధుజీవితమ్మునం
దీవిషకీలికల్ శిరసు
లెత్తినగాథ- సలీముప్రేమకై
ఈ వొనరించు త్యాగము
లిఖింతురుగాత! చరిత్రకారు లీ
భూవలయంబునన్ చెరగి
పోవని బంగరుటక్కరాలతో.

# వానమబ్బులు

ఈవానమబ్బునై ఎన్నాళ్ళనుండియో
గూండ్లుకట్టిన నాదు కోర్కెదీర
సైకతమ్ములపైని సాగిపోనో నింగి
నీలికొండలపైని నిలిచిపోనా!
నాగుండెలో నిండి రేగు రాగమ్ములన్
వానగా కురిసి- శంపాలతాంగి
నవ్వులో- మెరపులో- నవనాట్యగతులలో
పులకించి నిలువెల్ల పొంగిపోనా

ఎన్నిమారులు ఈమబ్బుకన్నెహొయలు
కన్నులారగ మును నేను గాంచలేదు!
ఏలకో నేడు వింతయై హృదయమందు
తోరణలుగట్టె భావచకోరచయము.

ఒకమబ్బు నొకమబ్బు ఒడిలోన లాలించి
ప్రణయానురాగసంపదలు గురియు
ఒకమబ్బు హృదయాన ఒకమబ్బు శయనించి
ప్రేమగీతిక లాలపించి మురియు

ఒకమబ్బు విహరించుచుండగా నొకమబ్బు
వెనుకమాటున వచ్చి కనులు మూయు
ఒకమబ్బుపిల్లతో నొకమబ్బుచెలికాడు
మోదాన దాగుడుమూత లాడు

మనుజులకు లేని వలపుల మధురిమలను
చిలుకరించెను నేడు మబ్బులకొలమ్ము;
గగనమంతయు ఒకమహాకావ్య మగుచు
వెలుగులను నింపె నామనోవీథియందు.

సాగెనా నింగిపై శ్రావణజలదమ్ము
విరహిణిహృదయమ్ము వ్రీలిపోవు
ఉరిమెనా జలధరుం డులికిపడిన ముగ్ధ
కలతతో నాధుని కౌగలించు
మెరిసెనా జీమూతు డురుకరుణార్ద్రుడై
అభిసారికాశ్రమ మంతరించు
స్పర్శించెనా వారివాహుండు తమకాన
భువివెలందికి మేన పులకలౌదవు

క్రమ్మెనా నింగి నీలమేఘాలగములు
కానిపించును ప్రియురాలి సౌదమకనుల సొగసు;
పదము సాగక నిలచిన పథికమనము
ఆర్తిజెందును నవ్యవర్షాభ్రవేళ.

తనతాతసొత్తేమొ దాచిపెట్టినయట్లు
నింగిపై ఒకమబ్బు నిలచిపోవు
నిండుగర్భిణివోలె నింపాదిగా వ్యోమ
మార్గాన సాగును మబ్బుఒకటి

పరువెత్తిపోవును పడిపోయిన ట్లేమొ
గగనాన ఒకమబ్బు కాలికొలది
ఎటనుండి వచ్చెనో ఈ దివి చరియించు
నొకమబ్బు క్రొంగ్రొత్తహొయలు గులికి

ఉన్న దున్నట్లై మటుమాయమొందు నొకటి
కృష్ణపింఛచ్ఛవిన్ చిలికించు నొకటి
ఎంత నెఱజాణయో మబ్బు! వింతవింత
పోకడలు పోవు– ఒక్క మహాకవివలె.

ఈమబ్బునకు నాకు ఏమి సంబంధమో
నింగి దోచిన చాలు పొంగిపోదు
వెనుకజన్మములోన వనమయూరమ నౌచు
నాట్యమాడితినొ పింఛమ్ము విప్పి
ప్రావృడంబరమంత ప్రణయేశ్వరీముగ్ధ
దివ్యస్వరూపమై తేల్చు నన్ను
చినుకుకరాలతో చిబుకమంటును దాహ
శాంతికై ఆశ్లేషసౌఖ్య మొసగు

ఎంత ప్రణయమ్మొ! ఆకాంక్ష లెన్నిగలవొ!
నింగిపై నిల్చి చిలుకు పన్నీరు పైని;
నీలిజలతారుమెరపుల మేలిముసుగు
ఎంత అందమ్ము ఘటియించెనే!—

ప్రణయదారిద్ర్య మీసీమ వదలి వత్తు
నోసి చిన్నారిమబ్బులహొయలుగత్తె!
నేనె నీవయి పోదమా నింగిపైకి
స్వేచ్ఛగా– హాయిగా– ఉండవచ్చు నచట.

# స్త్రీలకు సౌభాగ్య సందేశము

## శ్రీ శ్రీనివాసానంద సరస్వతీ స్వామి



సృష్టికర్త యగు ప్రియతమ శ్రీనివాసపరబ్రహ్మమునకు ప్రియతమదేవి యను రాజేశ్వరికి, సమస్తదేవీ, దేవతా స్వరూపు లగు గురుసామ్రాట్ శివానందభగవానులకు నాసాష్టాంగప్రణామములు.

స్త్రీ యను సంయుక్తాక్షరసంస్కృతపదము స, త, ర యను మూటికూడికచే నేర్పడినది. అవి వరుసగ సత్త్వ, తమో, రజో గుణములకై ప్రాతినిధ్యము వహించును. సత్త్వ, రజ, స్తమోగుణత్రయము ప్రకృతికి సంబంధించినది. కాన స్త్రీప్రకృతియొక్క ప్రతినిధి నంతకంటె నుచితముగ ప్రకృతిచైతన్య మనబరగును. ఇటులనుటలో పురుషుడు పై నుడువబడిన త్రిగుణరహితు డని గాదు. ఏలన సమస్త చరాచర స్థావరజంగమాత్మక, దృశ్యాదృశ్యప్రపంచము త్రిగుణమయ మైనదియే. త్రితత్త్వము లేదా ప్రకృతిచైతన్యమే స్త్రీలు, పురుషులు మానవేతర స్త్రీలింగజాతి పుల్లింగజాతి, సజీవ, నిర్జీవప్రపంచము సర్వత్రవ్యాప్తియై యున్నది. జగన్నాటకమునకు మూలకారణ మగు ప్రకృతికి ప్రకృతిచే నుత్పాదనమంది దానిని సదా యాలింగన మొన ర్చుకొను త్రిగుణములకు, త్రిగుణములకు పెన్నిధాన మగు స్త్రీమూర్తికి నాశిరస్సాష్టాంగప్రణతులు.

### అంతర్యసౌందర్యము నభివృద్ధిపరచుకొమ్ము

అధునాతనమున స్త్రీలు బాహ్యసౌందర్యమునకు ప్రాధాన్యత నిచ్చుచుండిరి. స్త్రీయే సహజసౌందర్యము. ఏలన నామె ప్రతిబింబించునది నామె వెనుక దాగియుండు పరబ్రహ్మమునకు ప్రతిబింబ మైన ప్రకృతియే ప్రకృతి శోభయే, ప్రకృతివైభవమే లోనేత్రము. అంతర్యచక్షువు లేదా ప్రజ్ఞానయనము (Intuitive eye) తో గాంచిన మనఃకల్పిత మగునట్టి, వనుకొనబడు సమస్త స్వరూప, కురూపములలో ప్రకృతివిభవమే ప్రకృతిశోభయే యేకరస ముగ (Homogeneous) ఒకేమాదిరి యగపడితీరును. లౌకికశ్రేయస్సునకు, నాధ్యాత్మికసఫలతకు వలయునది బాహ్యసౌందర్యము కాదు. ఆత్మసౌందర్యము మాత్రమే.

### అంతర్యసౌందర్య మన నేమి ?

«అంతర్యసౌందర్య» మన పాతివ్రత్యము, భగవద్భక్తి, పాపభీతి, పెద్దల గురులయెడ పూజ్యభావము, మిడిసిపాటుతనము లేకుండుట (నిరహంకారత) నమ్రత, అణకువ, భయభక్తులు కల్గియుండుట, స్వధర్మనిర్వహణ, త్రికరణ (కాయిక, వాచిక, మానసిక) పారిశుద్ధత, ఆత్మనిగ్రహము, క్షమ, ప్రసన్నహృదయము, ప్రశాంతచిత్తము, పవిత్రపరోపకారశీలముల గల్గియుండుట, ప్రాపంచిక కలిమి లేమి, కష్టసుఖాదిద్వంద్వములలో సహనము, ప్రేమ, కనికరము, దయ మున్నగువాటి సమ్మిశ్రితమైన దైవికలక్షణముల యొక్క యతిశయించినసొబగే. ఇదియే యాంతర్యమూర్తిత్వ (Inner Personality) మనబరగును. బాహ్యసౌందర్యము కృత్రిమము (artificial) లేదా స్వాభావికమై (natural) యుండనోపును. స్వాభావిక సహజబాహ్య సౌందర్యమా పరమాత్ముని పదేపదే జ్ఞప్తిచేయుచుండును. కృత్రిమ మగుచో వదల్చుకొనుటయే యుత్తమము. స్వాభావికమైన దెంతయు హర్షింపదగినది. అంతర్యసౌందర్యము గలవారు బాహ్యసౌందర్యము గలిగియుండవలెనని గాని, బాహ్యసౌందర్యముగలవా రాంతర్యసౌందర్యమును విధిగ గల్గియుండవలె ననిగాని యెట్టినిర్బంధము లేదు. వవములో కృత్రిమసౌందర్యపిపాస యొకయంశమై యొప్పారిన ఒక్కొ

కష్టప్పు దధఃపతనమునకు దారితీయును కాన జాగ్రత.

ఆంతర్య లేదా హృదయసౌందర్య మాధ్యాత్మికమైన నాత్మసాక్షాత్కృతికి తప్పనిసరి, యనివార్య మైనది. ప్రతి యొక్క స్త్రీలోను నాంతర్యసౌందర్యము స్వతస్సిద్ధముగ గలదు. కాని దానిని సక్రమవిధానమున పెంపొందించి పుష్పింపచేయవలసిన బాధ్యత బాల్యమున లేదా వివాహాత్పూర్వము తల్లిదండ్రుల దగుచో ననంతరము తమది మాత్రమే. పరిమళసుమము తనపరిమళము నెల్లెడల వెద చల్లునటుల బాహ్యసౌందర్యవిహీన యైనప్పటికిని నాంతర్య సౌందర్యముగల స్త్రీ గృహమున, సంఘమున, గ్రామమున, రాష్ట్రమున, దేశమున, ప్రపంచమున విరాజిల్లసామర్థ్య మైనది యేలన నాంతర్యసౌందర్యము సంపూర్తిగ నాధ్యాత్మిక మైనది. ఆంతర్యసౌందర్యము గల్గి భగవద్దర్శన మందినట్టి భక్తురాండ్ర జీవితములే యిందుకు సాక్షి. అనివార్యమైన యాంతర్యసౌందర్యమునకు బాహ్యసౌందర్యము జతపడుచు నట్టివారలు దివినుండి దిగిన దేవవనితలుగ పూజ్యత నొందకమానరుకదా! ఆంతర్యసౌందర్యమును వేదానాధ్యాత్మికసొబగును ప్రఫుల్లింపచేయుటకు దేశము, కాలము, విద్య, జాతి, మతము, కులము, వయస్సు, త్వగ్విభూతి (శరీరశోభ) మున్నగువానితో నిమిత్తములేదు. క....!అనగా నవి యడ్డురావు. ఆంతర్యసౌందర్యమే స్త్రీలకు వెలలేని నగ లేక భూషణము. కాన నీవంతస్సౌందర్యము పైననే నీదృష్టిని నిలిపి నీవుభగవానున కాంతరంగికభక్తవు కమ్ము.

## ఆదర్శస్త్రీ

స్త్రీలు దేశసేవలో కానిండు వేరితర క్షేత్రములలో కానిండు తప్పక పాల్గొనవచ్చును. కాని యటులొనర్చుటలో తమసౌమ్యతను, మార్దవమును, సౌశీల్యమును స్త్రీత్వమును కోల్పోవరాదు. సాధ్యమా? అగుచో బొరబడును. చూపరుల, యోచింపుతలలలో స్త్రీ జగన్మాతయే కాని విలాస (భోగ)వస్తువు కాదనెడు పవిత్రభావమును స్వతస్సిద్ధముగ తమయాదర్శాచరణద్వారా నెవ రుత్పన్న మొనర్పజాలుదురో వారే యాదర్శమహిళలు, త్రిలోకవంద్యులు. తాము విద్యావంతులు, భగవద్భక్తిపరాయణులు పవిత్రసేవారతు లగుటయేగాక తమబిడ్డలకూడ నట్టివారలుగ ననగా విద్యావంతులు, భగవద్భక్తిపరాయణులు సేవారతులుగ నొనర్చు నాపె విశ్వవంద్య, సమస్తదేవీదేవతారాధ్య యగును.

ఇప్పుడు, ఎప్పుడునుకూడ స్త్రీలు సీత, సావిత్రి, అనసూయ, అరుంధతి, రాధ, రుక్మిణ్యాదుల నాదర్శముగగొని తమజీవితరథముల నడుపుకొనవలయును. ఉన్నతాశయముల పవిత్రాదర్శముల, నైతికస్థాయిల (ప్రమాణముల) నుత్తేజింపచేయు గ్రంథపఠన నొనర్చి తమ్ము తాము క్రియాత్మకమైన యాచరణద్వారా విరాజమాన మొనర్చుకొనవలయును. ఉపనిషత్తులు రామాయణ, భారత, భాగవత, భగవద్గీతాది యాధ్యాత్మికగ్రంథములు, పురాతన, అధునాతనమహాత్ముల గ్రంథరచనలు లేదా బోధలు, జీవితములు నీవిషయమున పెంతేనియు తోడ్పడును.

## పవిత్రకర్తవ్యములు

కాలముయొక్క విలువను గుర్తించి తమ్ము తా మెప్పటికిని నిష్పాక్షికమగు, సునిశిత మగు స్వవిమర్శ (Self-analysis) చేసికొనుచు సరిదిద్దుకొనుచుండవలెను. వారి వారితల్లుల ప్రభావము, బాల్యప్రశిక్షణ ద్వారనే శివాజీ నెపోలియన్, గాంధి, ఆసుతోష్ ముఖర్జీ మున్నగువారు నైతిక, సాంఘిక సేవాయోద్ధులుగ జగద్విఖ్యాత పురుషులైరి. మీరును నాయామాతృశీలవలెనే మీమీ బాధ్యతలను గుర్తించి, మీబిడ్డల తర్ఫీదొనర్చి మీబిడ్డలద్వారా ప్రపంచమునకు గర్వకారణము కండు. మీరాధ్యాత్మికజను లగుచో (పురుషులమాట మినహాయించుట కాదు) మీరింటిబైటికి దుముకకయే మీయాధ్యాత్మికశక్తిచే ప్రపంచమందలి యావత్కల్లోలముల, నలజడుల, యుద్ధముల నొక్క త్రుటిలో రూపుమాపగలరు. కాని మీకు కొరవడిన దాయాత్మవిశ్వాసమే. కాన దాని నీక్షణమునుండియే మీలో రగుల్కొల్పుకొనుడు. వింటివా! క..........! నీస్వధర్మము నేమరకుము.

మీబిడ్డలు మహాపురుషు లగుచో నాగౌరవ మెవరిది? మీదికాదా? గృహయజమానులు, మీబిడ్డలు దేశసేవ నొనర్చిన మీరొనర్చినటుల గాదా? మీరు మీగృహపరి

వారముకంటె నన్యమా? మీరు మీస్త్రీధర్మముల నితర దేశస్థుల ననుకరించి పాటించనిచో మీరు భారతనారీత్వమును, నీతినియమములను, గృహస్థధర్మములను కోల్పోయినటులే యగును సరళజీవనము, ఉన్నతాశయము (Plain living and high thinking) మీనిత్యజీవితలక్ష్యమై యుండవలయును. ఆత్మనిగ్రహ (Self-rastraint) జీవనమును గడపుటయే తపస్సు.

జీవితలక్ష్య మగు నాత్మసాక్షాత్కారము లేక భగవద్దర్శనమునకు పురుషు లెంత అర్హులో స్త్రీలును నంతఅర్హులే. సక్కూబాయి, మీరాబాయి, అవ్వయార్, ఆండాళ్, తరిగొండ వేంకమాంబ, అక్కమదేవి మున్నగు మహిళాభక్తుల జీవితగాథల స్మరించి పులకితగాత్రలు కండు. మైత్రేయి, సులభ, గార్గిలవంటి బ్రహ్మవాదినుల పావనామముల మగువక మీరును వారియడుగుజాడల నడువ నుద్యమింపుడు.

ఏగృహ మైనను ధన, ధాన్య, దాస, దాసీ, పశు సంతానాది సంపదతో నొప్పారుచున్నను నం దాధ్యాత్మికవాతావరణము లేనిచో నది శ్మశానతుల్యమే. ఇం దెట్టిసంశయము లేదు. ఆధ్యాత్మికవాతావరణము సదా నెలకొనుట నిత్య, జప, ధ్యాన, సంకీర్తన, పారాయణలు, మహాత్ముల సేవ, వారిప్రవచనగోష్ఠి, ఋషిపంచమి, వరలక్ష్మి, ప్రదోష, సత్యనారాయణ చాతుర్మాస్యాదివ్రతములు, శ్రీకృష్ణాష్టమి, శ్రీరామనవమి, గణేశచతుర్థి, శివరాత్రి, గురుపూర్ణిమ, స్కంధషష్ఠి, దేవీనవరాత్రులు వగైరా పూజాది యుత్సవవిశేషములు వారివారి దేశ, కాల, సాంప్రదాయికాచారములరీత్యా తప్పనిసరిగ నొనర్పనగును. ఇవన్నియు భగవద్భక్తిని, చిత్తశుద్ధిని తద్ద్వారా యాత్మజ్ఞానము, భగవద్దర్శనమును కల్గించుటకు తోడ్పడి తీరును. చాదస్తములని, దండుగలని, బుద్ధిమాలినపనులని యూహింపజనదు. వీటిపట్ల మనస్సు పోజాలనిచో ప్రతిదినము కనీస మొకగంట, హరే రామ హరే గామ రామ రామ హరే హరే హరే! కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే॥ లేదా "ఓం శ్రీరామ జయ రామ జయ జయ రామ" లేదా వేరితరసంకీర్తనల బలవంతముపైనైనను మరే తప్పనిసరిగ, నొకదినము సహితము భోజనము మానిన రీతిని, తమబిడ్డలతోసహా యెప్పుడో యొకప్పు డొనర్చుట శ్రేయస్కర మగును.

ఇంటిలో తమభర్త యేదియో సంధ్యావందనము, విష్ణుసహస్ర నామావళి, భగవద్గీతాదులవంటి పారాయణ మొనర్చుచుండ చాలదా తా మేల తిరిగి యొనర్పవలె నను నుపేక్షాభావ ముండరాదు. (అదేమాదిరి స్త్రీలొనర్చుచో తమ కవసరము లేనటుల పురుషులును నూరకొనగాదు. స్త్రీ, పురుషులలో నెవ రెట్టియాధ్యాత్మికానుష్ఠాన మొనర్చినను నాఫల మాయొనర్చువారికే. (పురుషుని యనుష్ఠానఫలము లేదా పుణ్యములో సగముభాగము స్త్రీకి శ్రమించకనే వచ్చునను దురభిప్రాయ ముండరాదు). వారియొక్కరి యాధ్యాత్మిక పురోభివృద్ధికే ప్రారబ్ధరీత్యా యొకచోట భార్యాభర్తలుగ జతపడినప్పటికిని) నని మరువకుడు స్త్రీలనుష్ఠానము (సాధన)పట్ల నాసక్తిచూపుచో పురుషు లెట్లడ్డుపడరాదో యటులనే పురుషు లనుష్ఠానమందు ప్రీతి చూపుచో స్త్రీలును వారి కడ్డంకు గారాదు. సమస్తజీవరాసులలో సదాయొకేయొక భగవానుని గాంచుచు నహింస, సత్యము, బ్రహ్మచర్య (గృహస్థ)ముల పాటించవలయును. భగవానునికి నివేదన (నైవేద్యము) యొనర్పబడిన యనంతరము నాహారమును భోజనాత్పూర్వము నెవరేని మనుష్యులకు "నతిథియజ్ఞము"గ భోజనమిడుట మానె, జంతు పశు, పక్ష్యాదులకు దేనికైన "భూతయజ్ఞము"గ నొసగుట పరమచిత్తశుద్ధికారకము. ప్రతినిత్యము, ప్రతియొక్కగృహిణి తప్పక చేయదగిన సునాయాసమగు నిష్కామ్యసేవ. చేయుక్రియ అల్పమైనప్పటికిని నాధ్యాత్మికముగ ఫల మధికమయినది. కాబట్టి నిర్మలవై నీవు నైష్ఠికముగ, నియమబద్ధముగ నుండుము. పురుషులవలెనే స్త్రీలును సమన్వయయోగమైన కర్మ, భక్తి, రాజ, జ్ఞానయోగముల ననుక్షణదైనందినజీవితములో నభ్యసింపవగును. సహజముగ స్త్రీలు భక్తియోగముపట్ల సుముఖులగుదురు. కాన దానిని త్రికరణ (మనోవాక్కాయపు) శ్రద్ధతో గైకొననగును.

శరీరారోగ్యపరిశుభ్రతాసంశోధన, మాతాశిశుసంరక్షణజ్ఞానము, శిశుమనస్తత్త్వశాస్త్ర (Child Psychology)

పరిచయములతోడ నొప్పారుచో జీవితము సుఖదాయక మగును. సోమరితనము, అతినిద్ర, వాచాలత్వము (వాగుడు తనము), దుస్సంగము, ఆత్మసంయమ (Self-Control) రాహిత్యతల దరిచేరనీయరాదు. ఆత్మపరిశోధన (Self-introspection) సరిపెట్టుకొనుట, సరిపుచ్చుకొనుట, సమన్వయపరచుకొనుటల నభ్యసించుచో నాదర్శగురూప దేశమును భర్తతోపాటొంది యనష్ఠించుచో స్త్రీలిహ పరసుఖములబడయుదు రనుటలో నెట్టిసంశయము లేదు.

తమసౌభాగ్యమునకు తామే కర్తలుగ భావించి, సక్రమ రీత్యా నేటినుండియే జీవితమును సరిదిద్దుకొని జీవితమాధు ర్యము ననుభవించుచు నైహిక, పారమార్థికసుఖముల చూఱ గొందురుగాక! భగవత్ప్రసాదసిద్ధిరస్తు!

# పూర్వ జన్మ సంస్మృతి

## శ్రీ భార్గవ విద్యాదేవ కులపతి



ఆదౌ శివో రుద్ర ఇతి ప్రసిద్ధః
పశ్చా త్తదస్త్రం పరశుః ప్రచండం
తతో ఽభవ ద్భార్గవరామరూప
స్త్వాంబ! భక్తో ఽద్య కులాధినాథః

శరీరచక్రీభవదగ్నిమండలః
సరస్వతీమూర్తి రయం పురాతనః
వృషాకపిప్రాణమహాయుధాకృతిః
కులేశ్వరో దేవి! తవాంఘ్రికింకరః

హిమాలయే నిర్మలశృంగభాగే
ఋష్యాశ్రమే శీతలశాంతదేశే
అభూ ద్వృషిః కశ్చన తీవ్రకోప
స్స ఏవ ధీరో ఽద్య కులాధినాథః

రాజా మహావైభవసంవిధానః
సువిక్రమోగ్రః కిల భానుదేవః
సిద్ధో ఽభవ జ్జీవితమధ్యకాలే
స ఏవ ధీరో ఽద్య కులాధినాథః

య ఉజ్జ్వలో భైరవనాథసిద్ధో
మహాద్భుత స్తాంత్రికసార్వభౌమః
పురా వస ద్భారతదేశశీర్షే
స ఏవ ధీరో ఽద్య కులాధినాథః

జనస్తుతో జా నితి విశ్రుతాఖ్యః
శిష్యః ప్రియాత్మా బత యహ్వాసూనోః
ప్రబోధకః క్రైస్తవసంప్రదాయే
స ఏవ ధీరో ఽద్య కులాధినాథః

అరేబియా గ్రీసు ముఖేషు దేశే
ష్వనేకభూభాగతలేషు జాతః
విచిత్రకార్యక్రమవిక్రమాంకః
స ఏవ ధీరో ఽద్య కులాధినాథః

య మావిశ త్తావకదివ్యశక్తిః
ప్రచండవిద్యుత్స్వరశుప్రసారా
ప్రపంచకళ్యాణమహాఫలార్థం
స ఏవ ధీరో ఽద్య కులాధినాథః

ఇత్యాదిషు ప్రస్ఫురితప్రభాసు
పరాంబికే! జన్మపరంపరాసు
జాత శ్శివామోఘపరశ్వథాంశః
కులాధినాథ స్తవ నిత్యభక్తః

మనుష్యదేహో దయదుఃఖితస్య
తృప్తిశ్చ కాచి న్మమ జీవితస్య
త వాంబ! వంశే ఖలు రేణుకాయాః
జన్మైవ ఋష్యాశ్రయకర్మభూమౌ.

మహాద్భుతం కర్మ కరిష్యమాణం
కులేశ్వరం మాం కిము మన్యసే త్వం
మహాభరం దైవతకార్య మేతత్
దృగేవ తే కారయితుం సమర్థా.

దేహేన దుర్వారతపఃకృశేన
భావేన నిర్యత్నసమాధిగేన
సదా సమీక్షే తవ మూర్తి మగ్రే
కృపాం నిరీక్షే తవ వజ్రనాథే!

మనుష్యరూపస్య వచశ్శరర్షేః
కులేశ్వర స్యాంతరవైద్యుతాగ్నిః
ప్రజ్ఞప్తి రుజ్జృంభిత దివ్యశక్తిః
త్వం రేణుకా భార్గవకామధేనుః

కురుష్వ మే దేహ మనంతవీర్యం
కురుష్వ మే భావ మతీవ శాంతం
కురుష్వ మే నేత్రయుగం ప్రదీప్తం
కురుష్వ మే మార్గ మనన్యరోధం.

# శాంతిదేవి

ప్రత్యణు వీ తనూభాగమ్ములందున
    అమరత్వమున సిద్ధమగునుగాక
ప్రళయాగ్నికీలికల్ ప్రజ్వరిల్లుచు నున్న
    సృష్టిలో శాంతి వర్ధిల్లుగాక
ఋషులవాక్కులలోని ఉషఉదీరితశక్తి
    ఒకనూతనజ్యోతి నొసగుగాక
పరమపవిత్ర మీభరతఖండములోన
    ప్రాచీనతేజము వరలుగాక

నీకరుణచేత అమృతావలోకనములు
నిఖిలదిగ్వీథులందున నిండుగాక
ప్రజల మర్థింతు మిదియె నీపదపరాగ
కణములము తల్లి! శ్రితజనకల్పవల్లి!

ఒక విలాసములోన ఊహ లూహింపగా
    లేని సీమలలోని మౌనమహము
ఒక విభావములోన ఉదయాస్తశైలముల్
    కదలింపజేయు ప్రజ్ఞాపథమ్ము
ఒక విహారములోన సకలలోకమ్ములు
    శాసింపజాలు ఆజ్ఞాపదమ్ము
ఒక విలోకములోన ఉగ్రప్రసన్నమౌ
    అంశుమాలాప్రసాదానుభవము

నీవు కలిగించెదవు తల్లి! నిఖిలభువన
భవనములు భావనానందపారవశ్య
సంభ్రమభ్రమవిభ్రమచక్రచంక్ర
మణమహోదధులై లయమందువిధము.

ఉదయించినది ఊహ ఒకటి ఉద్వేత్తుగ
దీప్తగంభీర మైసుప్తినుండి
ప్రసరించినది ఒక్క భావనాలేశము
నవమనోన్మని నున్న నాదతనువు
ఉల్లసిల్లిన దొక్క చల్లనితలపు దు
గ్ధాంభోధిలోని ముగ్ధాంశులహరి
రేకెత్తినది ఒక్క దృష్టిచైతన్యమ్ము
సాలోచనము తపఃకాలజయము

నిన్ను తలచినవేళ ఈ నన్నదేమొ
నింపుచున్నవి చిరహిమానీనిగూఢ
విజయవిద్యుల్లతాచిత్రవిభ్రమములు
ఆదరింపవె ఈలోక మట్లు తల్లి!.

ప్రబలవైద్యుతమహఃపథి ఒక్కమాటుగా
శీర్షాగ్రమును పరీక్షించుగాక
వికృతలౌకికకాలవిభుత ఒక్కుమ్మడి
దర్పసర్పమ్ముల దాకుగాక
నిర్భిన్నవిషయోపనిషదర్థ మొక్కటై
సాగనీయక అడ్డు సలుపుగాక
ఘనటత్పటాటోపధుని ఒక్కసారిగా
దుర్వారభరముతో దూకుగాక

ఆ భచక్రము సర్వ మత్యధికశుక్ర
వైరనిర్వక్ర మగుగాక! భయముగనని
కాలవిజిగీషు వీ ఊహగగనచారి
కోరికలు తీర్పు మంబ! భూగోళమందె.

గడచిపోయిన వెన్ని కల్పముల్ జనయిత్రి!
మరచిపోలేని తమస్సులోన
ఆరిపోయిన వెన్ని ఆనందదీపికల్
ప్రకటకాలానిలప్రహతిలోన
మాసిపోయిన వెన్ని మార్మికజ్యోత్స్నలు
ప్రజల అవిశ్వాసఫలములోన
కరగిపోయిన వెన్ని కావ్యసుస్వప్నముల్
భూభుగ్వికుంచితభ్రుకుటిలోన

ఈజనుశ్శ్రేణి నిశ్రేణి యెక్కలేక
ఎన్ని యుగముల పర్యంత మిట్లు పడునొ.
అఖిలమాతవు నీకరుణార్ద్రదృష్టి
వెలయనీవమ్మ! యీజనావళులపైన.

గ్రీష్మభీష్మజ్వాల కేళీవనమ్ముగా
ఊర్ధ్వబాహుండనై యుందునొక్క
వర్షర్తుశీతలవారిమధ్యమ్మున
గళదఘ్న మగునట్లు నిలుతునొక్క
అర్ధరాత్రముల నిత్యము నిష్ఠ పాటించి
నిర్నిద్రరీతి సంధింతునొక్క
జ్వలియించు జఠరాగ్ని శాసన మ్మొనరించి
నిరశనగతిని ధ్యానింతునొక్క

నీవు నీవయి నీచెంత నిలిచియుండి
నేను నే నని గుర్తించునేర్పు నొసగి
నన్ను నీవానిగాఁ జేసికొన్నదాక
నీపదమ్ముల వీడ నోనిఖిలజనని!

ప్రళయదేవత తాండవారంభరభసమ్మ
మనుజశీర్షమ్ముల మలయుచుండె
రుద్రవీణాసమున్నిద్రసంగీతమ్మ
కర్ణరంధ్రమ్ముల కలచుచుండె
అట్టాట్టహాసఘోరారవమ్ములతోడ
భేతాళతతి విజృంభించుచుండె
శవమాంసభక్షణాసక్తసృగాలముల్
వికృతరూపముల కాచుకొనియుండె

నీవు కరుణింపకున్న ఈనిఖిలజగము
ఏ మగునొ యేమొ నేను ఊహింపలేను
భయవినాశిని వైన నీపరమశక్తి
నొక్క చిరుకాంతిరేఖ నా కొసగవమ్మ!

నామానసమ్ము ధ్యానమ్మున నిల్చునో
లక్ష్యమ్ము గలదొ నిర్లక్ష్య మగునొ
నాకుతూహలము నానాచిత్రమార్గాల
ప్రసరించునో ఆగు పథము గలదొ
నాతపమ్ము చిరంతనమ్మైనదే గదా!
క్షణము క్షణము మార్పుగనుట కలదొ
నావాక్కు సిద్ధశక్త్యావేశ మనుమాట
స్థిరముగా నిశ్చలశ్రీని గనునొ

ఇన్నిసందేహములు నాదు హృదయమందు
కలవు కలవని నిజముగా తలపలేను
ఉండియును లేని నేను మృత్యుంజయత్వ
మూహ యొనరింతు నిది యొక మోహ మంబ!

నీలమేఘాలలో నిండియున్నది నేడు
ఉజ్జ్వలేరమ్మదవ్యూహపథము
జలధిమధ్యమ్ములో సాగుచున్నది నేడు
బడబాగ్నిదుర్భరప్రజ్వలనము
పాతాళసీమలో పరగుచున్నది నేడు
భుజగాగ్నిఫూత్కారభూరివిషము
అంతరాళమునందు అలరుచున్నది నేడు
అణ్వస్త్రముల ప్రయోగానుభవము

అగ్నిపరశువు వెల్గు లీ అంబరమున
కొట్టవచ్చినయట్లు కన్పట్టుచుండె
బ్రాహ్మ్యదీధితి క్షాత్రవైభవముతోడ
వెలయుగావుత నీకృపావిలసనమున.

ఉత్తరధ్రువ మేమి ఉవ్వెత్తుగా వచ్చి
ఆక్రమించునొ మహీచక్రమెల్ల
ప్రాక్తనాహినివాసరక్తహిందూభూమి
నియమించునో వియన్నీలపథము
పూర్వపశ్చిమకటప్రువు జహానకమహా
నకఘోష నింపునో ప్రకృతియెల్ల
గోళాంతరితచిరక్రోధముల్ పంపునో
భిన్నాణుభూతాస్త్రభేదనములు

ఎక్కడకు పోవుచున్నదో యీజగమ్ము
ఏమి కానున్నదో తల్లి! ఎరుగలేము
ఎదలు భయమంది విలయ మౌనేమొ యనుచు
వచ్చిపడినాము నీపదాబ్జములముంచు.

శాంతి

అగ్నివల్లిక విశుద్ధానందవర్ధిని
　　ఇది అనంతాకాశమృదురవమ్ము
ఇది విధూమవిసృష్టి పదపద వైద్యుతా
　　ఘాతమ్ము చక్రచంక్రమణఫలము
కాలదండ మఖండకల్లోలకారణ
　　మ్మతి చండభైరవహాసతనువు
తెలిసికోలేని ఉజ్జ్వలతాప్రరోహమ్ము
　　తల్లి! నీతాత్వికాధారరేఖ

ఈధాళధళ్యమ్ము హిమసమూహము గాదు
　　నీమందహాస మందించు వెలుగు
ఈతమఃపుంజ మజ్ఞాతబోధము గాదు
　　నీకేశపాశపు నిండుదనము
మృదురాగసౌందర్య మీది సాంధ్యరుచి గాదు
　　నీపాదహస్తాబ్జరూపణమ్ము
మహితత్వ మియ్యది మంచియు చెడు గాదు
　　నీచిత్రసంకల్పలోచనమ్ము

నాథపులకము నాదు సన్న్యాసహృదయ
నవశివానందలహరి ఉన్నమితమతము
జగతికెల్లను సంస్కృతి ప్రగతి నొసగి
ఆదరించునా విశ్వధర్మాభిమతము.

ఇది వినూతనశాక్తేయపదము కుదురు
కపటగగనాగ్ని కళకాదు కవిసవిత్రి!
అపరవిపరీతభక్తగాణపతమతము
విశ్వశాంతికి గావింపవే ధరిత్రి!

క్రోధరేఖిక కటప్రువు చూపు త్రపుగోళ
　　మొకనిండుగుండె దూసికొనిపోయె
అట్టహాసము భైరవారావము శతఘ్ని
　　ఒకగర్భశిశువు జీల్చుకొనిపోయె
వైహాయస మ్మసువ్యాహృతి అణ్వస్త్ర
　　మొకకోటి యెదలు తీసికొనిపోయె
నూత్నశాస్త్రజము దుర్యత్నోద్దజనిశస్త్ర
　　మొకవిశ్వధైర్య మెంచికొనిపోయె

అఖిలదేశమ్ములున్ ప్రళయాభిముఖము
లైనయట్టులు తోచునో యంబ! నేడు
స్థైర్యధైర్యమ్ము లాత్మవిశ్వాసములును
జీర్ణమగునొక్కొ ఘోరకాలార్ణవమున.

ఒకమబ్బుతునక యెందుకు వచ్చెనోగాని
　　చిన్నారివాన వర్షించిపోయె
ఒకమబ్బురేక యెందుకు విచ్చెనోగాని
　　వేయివెల్గులవేల్పు విస్తుపోయె
ఒకమబ్బుకన్నె యెందుకు తొంగిచూచెనో
　　మెరపేదొ మెరసిన తెరగుదోచె
ఒకమబ్బుకుట్టి యెందుకు గంతువేసెనో
　　కృష్ణుడే క్రీడించురీతి దోచె.

ప్రకృతిసర్వము శాంతిపారమ్యరమ్య
సుకృతివరమయ్యె మాతపస్సులకు ఫలము
ఇది అనేకకాలావధు లేలు నీకు
క్షణ మయిన మాకు కోటియుగాలు తల్లి!

ఈమొయిళ్ళ కిదేమి ? యింత ఆనందమ్ము
మధువర్షవమధువుల్ మణులు కురిసె
ఈపూల కిదియేమి ? యింత ఆమోదమ్ము
నెరపరాగములు తేనెలు వెలార్చె
ఈసూర్యున కి దేమి? యింత రాగస్ఫూర్తి
విసరబో దొకచిన్ని వేడివెలుగు
ఈమరుత్పతి కేమి ? యింత సంతోషమ్ము
మలయాచలమ్ముపై మలసివచ్చు

ఈఋతుస్వామి కేమీ అపారభక్తి
నిర్మలవసంతకాంతులు నెగడఁజేసె
భువన మిది యేమి సర్వము పులకితమ్ము
తెలిసినది తల్లి! నీకృపావిలసనమ్ము.

సౌందర్యలహరీవిషణ్ణమానస మేమొ
పలుకరింపదు తనప్రక్కచూపు
ఆనందవల్లి విద్యానాథతను వేమొ
పులకరింపదు హిమాంబువులస్పర్శ
ఐరమ్మదజ్యోతి హరుని ధ్యాన మ్మేమొ
తొణకదు కామమోహనవిసృష్టి
అప్సరఃప్రణయినీహాసలాస్య మ్మేమొ
ధైర్యమొందదు ఋషిత్వంపుస్ఫురణ.

అట్టి యీవేళ నరుల చూ పందలేని
తెరల కావలి దివ్యదీధితిని గోరి
పావనమ్మైన నీపదాబ్జములమీద
వ్రాలుచున్నా డిదే ! కులప్రభుడు తల్లి !

నీఊహ ఊహలో నిలిపినంతనె తల్లి !
దూరమయ్యెను యుద్ధఘోరభయము
నీభక్తి మనసులో శోభిల్లినంతనే
జనయిత్రి ! కలిగె ప్రశాంతిజయము
నీతలం పీగుండె నిండినంతనె మాత !
జారిపోయెను దుర్విషాదభరము
నీదీప్తి యెదలోన పాదుకొన్నంతనే
అమ్మ ! కల్గెను పరిసాదానుభవము.

నీయమృతశీతలస్పర్శ నాయనంత
భావపరిధుల చేతనప్రభుత నింపె
పరిశయ మది రాదు శాంతి వర్ధిలునటంచు
నమ్మకముకల్గె నాకు ఈనాడు జనని !

ఇది చిద్గగనమందు ఉదయించె ఒకనూత్న
తార గొంతుక సితారారవమ్ము
ఇదిహృత్కుహరమందు మొదలయ్యె ఒకచిత్ర
నాద మ్మనాహతానందతనువు
ఇది దృక్చలనమందు కదలెను నవసృష్టి
ఒకవ్యష్టిభావనాప్రకృతిరేఖ
ఇది వాక్స్ఫురణమందు పొదలెను రసదీక్ష
ఒకదృష్టి విభ్రాంతయోగముద్ర

ఇన్నినాళ్ళుగ గుప్త మీహృదయవిద్య
బయటి కేతెంచె శ్రితజనావనముకొరకు
జగదధీశ్వరి ! ఈమహాశక్తిపథము
సూచితము సేయవో విశ్వశుభవిధమ్ము

# మంగ గేయములు

## శ్రీమతి ఏకా ఆదిలక్ష్మమ్మగారు నిత్యమును పాడుకొనినవి



మంగళము సీతమ్మతల్లీ! మంగళం॥
కోతులతోడుత కోమరొప్పవెడలిన
మదిరాక్షి! త్రైలోక్యమాత! ఎక్కడికే?
పాతకుడగు పంక్తికంఠ సుతువైరి యైన
ఖ్యాతిగ సౌమిత్రి భ్రాతసన్నిధికే ॥మం॥

పొంకముగా నుదుట కుంకుమ ధరియించి
పంకజనాభుని భామ ఎక్కడికే?
శంఖ చక్రాధార చారుసుందరమూర్తి
పంకజనాభు నాభర్తసన్నిధికే ॥మం॥

పట్టుచీరెమీద పైడిఘంటలు మ్రోయ
పట్టభద్రుని రాణి పడతి ఎక్కడికే?
దుష్టులనెల్లను త్రుక్కడగించి యీ
సృష్టి ఏలిన శ్రీవిష్ణుసన్నిధికే ॥మం॥

పసిడిపూలరవిక బాగుగ ధరియించి
ముసిముసి నగవుల ముదిత ఎక్కడికే?
అసురుల మర్దించి అమరుల నెల్లను
రక్షించిన మహారాజ సన్నిధికే ॥మం॥

వక్షమందున పుష్పమాలిక ధరియించి
సాక్షాత్కరించిన తల్లి! యెక్కడికే?
అక్షయముగ వలువ లతివ ద్రౌపదికొసగి
రక్షించిన మహానుభావు సన్నిధికే ॥మం॥

కనకాంగిరో! కాళ్ళ గజ్జెలందెలు మ్రోయ
జనకపుత్రిక! జగజ్జనని! యెక్కడికే?
సనకాదిమును లెల్ల సన్నుతి సేయగను
ఇనవంశకులదీప రాము సన్నిధికే ॥మం॥

పసుపు కుంకుమ పండ్లు పడతులచే నంది
సిరు లొసంగెడి శ్రీమహాలక్ష్మి! ఎక్కడికే?
కరిరాజు మకరిచే కడు బాధనొందుచు
శరణన్న బ్రోచేటి శౌరి సన్నిధికే ॥మం॥

కలికి మెడను కంఠసరులు గునిసియాడ
సలలితముగ మహాసాధ్వి! ఎక్కడికే?
అలరంగ పరివార జనముతో వెలసిన
వర భద్రాచల రాష్ట్రవరుని సన్నిధికే ॥మం॥

భాసురాంగి! మంజుభాషిణి! కోసల
దేశాధిపతి లక్ష్మిదేవి! ఎక్కడికే?
వాసి గల్గిన గుప్తివంశమందున రామ
దాసురాలిని బ్రోచు ధన్యు సన్నిధికే ॥మం॥

 

మంగళము రామయ్యతండ్రీ! మంగళం
మంగళ మని పరమలింగాంగులెల్లను
పొంగుచు నిన్నెపుడు పూజసేసి
రంగుగ జన్మాది సంగములను బాసి
భంగము లేనట్టి పదముగై కొనిరయ్యా ॥మం॥

నాసికవీథుల నాడుచు నే వేళ
దేశికేంద్రుడవు నై తేజరిల్లుచు
వాసిగనటు సర్వభూత సముదాయముల
భాసిల్ల జేసిన పరమాత్మ! నీ కిపుడు ॥మం॥

పంచరంగుల మేడ నెంచ శక్యము గాదు
అంచితముగ హరిహరుల కైన
మించి దీప్తులతోటి మిన్నుగున్న నక
వేంచేసి యుంటివి విశ్వమయోద్ధార! ॥మం॥

ధరయందు నీరములు తరచుగా నగ్ని
మారుతవ్యోమాది మార్గములను
సురలందు నరులందు కరులందు హరులందు
తరులందు గిరులందు కలిగున్న యో దేవ ॥మం॥

చాటుచేసుక మాయకోటగ నిర్మించి
మాయలోపల నీవు మాటుపడక
నీటుగ జడులకు తేటపడనివ్వక
కూటమిడై భక్తకోటి నేలిన తండ్రీ ॥మం॥

సారమై యీ రేడు జగముల కాధారమై
రామ నామసారమై రాజిల్లుచు
అందు ఇందన రాక ఎందు జూచిన సర్వ
మందు నీ వుందువు నీయందు సర్వంబుండ ॥మం॥

# రచయితల పరిచయము

## 1. శ్రీ కాశీ కృష్ణాచార్య (పుటలు 1—4)

జననము శ్రీముఖసంవత్సరాషాఢ బహుళ నవమీ శుక్రవారము నడిరేయి అభిజిల్లగ్నము, భరణీచతుర్థపాదము (హూ.శ. 1872) బందరులో. మధ్వసంప్రదాయానుయాయులు. అవధాని శిరోమణి, మహామహోపాధ్యాయ, విద్యావారిధి, శతావధానీత్యాదిబిరుదాంచితులు. న్యాయ, వ్యాకరణ, వేదాంత, సాహిత్య శాస్త్రవేత్తలు. సంస్కృతాంధ్ర కవితానిర్మాణధురీణులు. సంగీతములోను, వీణాదివాద్యాలలోను, ఉపన్యాసవైఖరిలోను విశిష్టత గల వ్యక్తులు. రాష్ట్రపతిచేత సంస్కృతపండితులుగా బహూకరింపబడిన మహామనీషులు వీరు. సంస్కృతిసామ్రాజ్యపట్టాభిషేకభూషితులు. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థానకవులు.

వీరి రచనలు :- 1. గోష్ఠీవనమహాత్మ్యము 2. బాలబోధిని (ప్రథమ, ద్వితీయ, తృతీయభాగములు) 3. క్రియాదర్శము 4. ఉత్తరరామచరితమ్ (ప్రతిపదాంధ్రార్థతాత్పర్యసహితమ్) 5. ఆంధ్రసంస్కృతనిఘంటుః 6. బందరుశతావధానము 6 శ్రీరామాష్టకాదికము 7. శ్రీలక్ష్మీనృసింహకరావలంబనస్తోత్రము (ఆంధ్రీకృతము) 8. దశమీవేధానిర్ణయము 9. రంగనాయకశతకమ్ (సంస్కృతము) 10. వీరమతి (పద్యాత్మకనవల) 11. కావ్యవిపణి 12. అవధానయాత్ర మొదలైనవి.

## 2. శ్రీ పింగళి లక్ష్మీకాంతము (పుటలు 5-8)

జననం 10-1-1894. మదరాసు విశ్వవిద్యాలయంలో 1926లో M. A. డిగ్రీ పొందారు. ఆంధ్రవిశ్వవిద్యాలయం తెలుగుభాషాధ్యక్షులుగా 1949 వరకును, 1953 నుండి 1961 వరకు విజయవాడ రేడియోసాహిత్యప్రవచనశాఖాధిపతులుగాను పనిజేశారు. ప్రస్తుతం శ్రీ వేంకటేశ్వరవిశ్వవిద్యాలయంలో తెలుగు ప్రొఫెసరుగా ఉన్నారు. నేషనల్ అకాడమీ ఆఫ్ లెటర్సు కార్యవర్గ సభ్యులు. నవ్యసాహిత్యం ప్రచారంలోకి తెచ్చిన ప్రముఖ కవులు. శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి ముఖ్యశిష్యులలో ఒకరు. ఆంధ్రసాహిత్యంలో విమర్శనమార్గానికి ఒకవిశిష్టతను చేకూర్చిన సాహిత్యస్వరూపులు. శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారితో కలసి తొలకరి, సౌందరనందము మొదలైనకావ్యాలు వ్రాసి ఆంధ్రావనిలో ఒకవినూత్నచైతన్యాన్ని రేకెత్తించారు. విడిగా గౌతమవ్యాసాలు, మధురపండితరాజము, తెలుగువాఙ్మయచరిత్ర మొదలైన అనేకరచనలు చేశారు. మాటలోనూ వ్రాతలోనూ ఒక ప్రత్యేకమైన తీరుగల విశిష్టపురుషులు. హృదయాన్ని స్పందింపజేసే శక్తి వీరికవిత కున్నది. కవిగా, పండితునిగా, విమర్శకునిగా, విద్యాచార్యునిగా, వక్తగా వీరికి అపార గౌరవం ఉన్నది.

## 3. శ్రీకాటూరి వేంకటేశ్వరరావు(పుటలు 9-16)

జననము 1895. శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి ముఖ్యశిష్యులలో వీరూ ఒకరు. శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారితో కలిసి సౌందరనందం, తొలకరి మొదలగు కావ్యాలు వ్రాసి నవ్యకవులకు ఆదర్శప్రాయంగా కీర్తిగడించినవారు. పౌలస్త్యహృదయం, గుడిగంటలు, మొదలైన కావ్యాలు వీరు విడిగా వ్రాశారు. సంస్కృతరచనలు అనేకం అనువదించారు. కృష్ణాపత్రికాసంపాదకులుగా ఆంధ్ర సాహిత్యానికి అపారమైన సేవజేశారు ఉపన్యాసకులుగా వీరికి విశిష్టమైన యశస్సు ఉన్నది. ఆంధ్రకవిలోకంలో ఒక ప్రత్యేకమైన స్థానం వీరికి ఎల్లప్పుడూ వుంది. మృదుమధుర మైన శైలి, సరళమైనరీతి కలిగి వీరికవిత సహృదయలోకాన్ని అలరిస్తూ ఉంటుంది.

## 4. శ్రీవిశ్వనాథ సత్యనారాయణ(పుటలు 17-24)

జననము : 10-9-1895. కృష్ణాజిల్లా, గన్నవరం తాలూకా నందమూరులో. తల్లి పార్వతమ్మ, తండ్రి శోభ

సాద్రిగారలు. శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి ప్రధాన శిష్యులలో ఒకరు. శ్రీయుతులు కంభంపాటి రామమూర్తి శాస్త్రి, విమలానందభారతీస్వామి, పరిమి నరసింహశాస్త్రి కళ్యానందభారతీస్వామిగారలు వీరి గురువులు. బందరు హిందూకళాశాలలోనూ, గుంటూరు ఆంధ్రక్రైస్తవకళాశాలలోనూ, విజయవాడ S. R. R. & C. V. R. కళాశాలలోనూ ఆంధ్రోపన్యాసకులుగా పనిజేసి కరీంనగరు ప్రభుత్వకళాశాల ప్రిన్సిపాల్ పదవి నిర్వహించి ప్రస్తుతం విశ్రాంతి తీసుకొంటున్నారు. కవిసామ్రాట్ బిరుదభాసితులు, సంస్కృత, ఆంధ్ర, ఆంగ్లభాషాకోవిదులు. అమృతశర్మిష్ఠమ్, దేవీత్రిశతి మొదలైన గీర్వాణకృతులు వ్రాశారు. ఆంధ్రప్రశస్తి, శృంగారవీథి, వరలక్ష్మీత్రిశతి, ఋతుసంహారం, శశిదూతం, గిరికుమారుని ప్రణయగీతాలు మొదలైన అనేకపద్యకృతులు, కిన్నెరసానిపాటలు మొదలైన గేయాలను రచించారు. రామాయణకల్పవృక్షం అనే పేరుతో రామాయణాన్ని మహాకావ్యంగా నిర్మించారు. వేయిపడగలు, ఏకవీర, చెలియలికట్ట, స్వర్గానికి నిచ్చెనలు, తెరచిరాజు మొదలైనవి ఎన్నో నవలలు, వేనరాజు, త్రిశూలం, నర్తనశాల మొదలైన నాటికలు ఉదాహరణకావ్యాలు, ఏకాంకికలు, విమర్శన వ్యాసాలు ఇట్లు ఎన్నో శతాధికకృతులు రచించిన బహుముఖ్యగాములు. ఆంధ్రప్రదేశసాహిత్య అకాడమీ ఉపాధ్యక్షులు. తీవ్రభావన, విచిత్రమైనపలుకుబడి, వినూత్నశిల్పం, కల వీరిరచనామార్గం ఆంధ్రదేశాన్ని ఉఱ్ఱూతలూపింది. ప్రతిభావ్యుత్పత్తులు పరిణతరీతిలో కలిగిన విఖ్యాతవిద్వత్కవిశేఖరులు వీరు. బహువిధాల సమ్మానింపబడిన వ్యక్తులు. బహుశిష్యగణం కలిగిన ఆచార్యవర్యులు.

## 5. శ్రీ కరుణశ్రీ (పుటలు 25-30)

జననము 4-8-1912. జన్మస్థానము - గుంటూరు జిల్లా కొప్పర్రు. వీరి అసలు పేరు జంధ్యాల పాపయ్యశాస్త్రి. పెదచెఱుకూరు సంస్కృతపాఠశాలలో శ్రీ కప్పా శ్రీఆంజనేయశాస్త్రిగారి సమక్షంలో కావ్యనాటకాలంకారాలు, వ్యాకరణం పఠించారు. ఉభయభాషాప్రవీణ, హిందీభాషాప్రవీణపట్టములను పొందారు. గుంటూరు స్టాల్ గరల్స్ హైస్కూలులోనూ అమరావతీ హైస్కూలులోను పనిచేసి ప్రస్తుతం పదిసంవత్సరాలనుండి గుంటూరు ఆంధ్రక్రైస్తవకళాశాలలో తెలుగుపండితులుగా పనిచేస్తున్నారు. మెత్తనిపదాలతో హృదయంచొచ్చుకొనిపోయే వీరి కవిత్వం ఆంధ్రదేశంలో బహుజనాదరపాత్రమైంది. కమ్మని తేటతెల్గు నుడికారములతోనూ, లలితసంస్కృతపదాలతోనూ వీరిరచన ఒక ఆదర్శప్రాయమైంది. నవకవులలో విశిష్టస్థానంగల కవిశేఖరులు.

వీరిరచనలు:- పద్యకృతులు, ఉదయశ్రీ (ప్రథమ, ద్వితీయ భాగములు) విజయశ్రీ, కరుణశ్రీ, అరుణకిరణాలు, ఆనందలహరి.

నాటకములు :- 1. కరుణామయి, 2. స్వప్నవాసవదత్తము.

గద్యకృతులు :- 1. కళ్యాణకాదంబరి, 2. భారత ప్రతిభ, 3. తెనుగుసీమ, 4. వీరభారతి.

బాలసాహిత్యము :- 1. బాలభారతి, 2. మహతి, 3. తెలుగుబాల, 4, చందమామలో కుందేలు, 5. ఇంద్రధనుస్సు, 6. ప్రేమమూర్తి, 7. మందారము, 8. గురుదక్షిణ, 9. బంగారుపద్మము, 10. పూజాపుష్పాలు.

రేడియోనాటికలు :- 1. మిథిల, 2. అమరావతి, 3. మువ్వ, హెచ్. యమ్. వి. రికార్డులలో కుంతీకుమారి, పుష్పవిలాసం, అద్వైతమూర్తి, సాంధ్యశ్రీ, పోతన, అంజలి, తెలుగుతల్లి, స్వతంత్రభారతి యిత్యాది రచనలు ఆంధ్రదేశాన్ని ఉఱ్ఱూగించినవి. వీరు కొంతకాలం 'సుభాషిణి' సాహిత్య మాసపత్రికకు సంపాదకులుగా పనిచేశారు.

## 6. శ్రీ జి. జాషువా (పుటలు 31-34)

పూర్తిపేరు గుఱ్ఱం జాషువా. జననం : 1895 సెప్టెంబరు 28. స్వగ్రామం వినుకొండ. జననీజనకులు లింగమాంబా వీరయ్యలు. వీరు ఆంధ్రదేశమున సుప్రఖ్యాతులు. బహుజనుల అభిమానమునకు పాత్రులైన కవిశేఖరులు. చిరకాలం వినుకొండలో తెలుగుపండితులుగా పనిచేశారు. కొంతకాలం మదరాసులో తెలుగుస్పోకెన్ వర్డుప్రొడ్యూసరుగా ఉన్నారు. తెలుగునుడికారం చక్కగా కలిగిన వీరికవిత అనేకులను ఆకర్షించింది.

ప్రాసినకావ్యాలు :- శివాజి - కావ్యం. (అముద్రితము)

ముద్రితములు : పిరదౌసి, గబ్బిలం, (1-2 భాగాలు) ముంటాజిమహాలు, కాందిశీకుడు, నేతాజి, బాపూజి, స్వయంవరం, నాకథ, కొత్తలోకము, ఖండకావ్యాలు-5 భాగాలు, రాష్ట్రపూజ.

నాటకాలు : రుక్మిణీకల్యాణం, తెరచాటు, వీరాబాయి, ధ్రువవిజయం, చిదానందప్రభాతం.

నవలలు : చిన్నానాయకుడు, చంద్రిక.

బిరుదములు : నవయుగకవిచక్రవర్తి, కవికోకిల, కవితా విశారద, కవిదిగ్గజ, మధురశ్రీనాథ.

సన్మానాలు : కనకాభిషేకం, గండపెండారగజారోహణాలు, పగటిదివిటీలపల్లకీమహోత్సవం.

## 7. శ్రీ అమరేంద్ర (పుటలు 35-41)

అసలు పేరు చతుర్వేదుల నరసింహశాస్త్రి జననం-1924 ఆంగ్లంలో, M. A. పట్టంపొంది గుంటూరు హిందూకళాశాలలో ఉపన్యాసకులుగా ఉన్నారు. లలితలలితంగా రమణీయమైన భావనలను చక్కని పొందికగలిగిన కూర్పుతో మధురవచోభంగితో ప్రజలకు అందించగలిగిన స్నిగ్ధ వక్త. నిత్యప్రసన్నమైన దరహాసము, హృదయాకర్షకమైన వాక్కుగలవ్యక్తి.

కథానికా, రేడియోనాటికా, గేయం, వ్యాసం అభిమానక్రియలు. రచనలు - కలకాదు సుమా (అనువదించిన కథలు) చక్రవర్తి (రేడియోనాటికలు) మేక్‌బెత్ (అనువాదం. కేంద్రసాహిత్య అకాడమీ ప్రచురణ.) విశ్వకవి (జీవితసాహిత్య పరిశీలన.)

## 8. శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు (పుటలు 42-44

జననం : 28-3-1914. చిన్ననాడే అవధానాలు ఆశుకవిత్వాలు ప్రదర్శించారు. వీరి తల్లి సంస్కృతంలో వీరికి శ్రీకారంచుట్టినట్లు తెలుస్తున్నది. ఆమె ఉభయభాషలలో చక్కనికవయిత్రి. వీరితండ్రిగారు గొప్పపండితులు. చిన్ననాడే వీరుసంగీతనాట్యములు బాగా నేర్చుకొన్నారు. 7000 కృతులు వ్రాశారు. అందులో 400పాటలకు స్వరము కూర్చారు; చిన్ననాడు నాట్యములుచేస్తుండేవారు. సాహితీపరిశ్రమ వానినుపసర్జనీభూతం చేసింది. వ్యాకరణాలంకారాలలో చక్కని పాండిత్యం ఉన్నది. ప్రాకృతభాషలు పాలీభాషలో గణనీయంగా కృషిచేశారు. బౌద్ధజైనములలోపరిశోధనము. హిందీ, వాని అవాంతరభాషలు (వ్రజ, అవధి మొదలైనవి) బాగా వచ్చును. తులసీరామాయణము, జిహ్వాగ్రమున నున్నది. తమిళ్, మళయాళ కన్నడము లలో మంచిపాండితి, ఇంగ్లీషు మొ॥ భాషలలో రచన లున్నవి. నేడు రష్యన్‌కూడా నేర్చుకొంటున్నారు. తెలుగులో విజయనగరసాహిత్యంమీద ప్రత్యేకాభిమానం. ఆచరిత్రలో కొంత కృషిచేశారు ప్రాకృతభాషలపై ఎన్నో వ్యాసాలు వ్రాశారు. గద్యరచనలో వీరిని కట్టమంచి, రాళ్ళపల్లి వారికి వారసు డంటారు. వారి గద్య రచనలు నూటికిపైగా ఉన్నవి. పద్యకావ్యాలు అరవై ఉన్నవి.

పెనుగొండలక్ష్మి (13వయేటి రచన) షాజీ, శివతాండవము, మేఘదూతము (స్వతంత్రరచన), సాక్షాత్కారము, పాద్యము మొదలైనవి. పండరీభాగవతము, జనప్రియ రామాయణము లేక రామసుధాలహరి. వీరి తెలుగురచనలు

సంస్కృతము : శివసహస్రము, ఆంగ్లము : Leaves in the wind, మళయాళం : ఏకవీర (పరివర్తనము) మరాఠీ : భక్తాంచే గాథే, ఇతరభాషలనుండి తెలుగులోనికి పరివర్తనము లెన్నో ఉన్నవి. వీరు శ్రీ నారాయణాష్టాక్షరీమంత్రోపాసకులు, కొన్నికోట్లు ఆమంత్రాన్ని జపించారు. వారికృషికి అదేమూలకందమని విశ్వాసముగల వ్యక్తి. ప్రస్తుతం కడపలో ఉన్నతపాఠశాలాపండితులుగా ఉంటున్నారు.

## 9. శ్రీ గిడుగు వేంకట సీతాపతి (పుటలు 45-46)

జననం 28 జనవరి 1885 - తారణ - మాఘ శు. 03 చదువు డిగ్రీలు : బి. ఏ. 1905 (చెన్నపట్టణము), ఎల్.టి. 1908 (రాజమహేంద్రవరము) డి. లిట్. (1940-ఇంటర్

నేషనల్ అకాడెమీ - వాష్టింగ్టన్ - అమెరికా)

నేర్చినభాషలు :- తెలుగు, సంస్కృతము, ఇంగ్లీషు, పవరభాషలు పరిచయము గల భాషలు- ఒరియా, తమిళ్, కన్నడము.

ఉద్యోగము : ఉపాధ్యాయవృత్తి- పర్లాకిమిడి మహా రాజవారి కాలేజీలో చరిత్రాచార్యుడు (1911-193?)

అనుభవమును : పర్లాకిమిడి మ్యునిసిపాలిటీ కౌన్సిలర్ (1915-1929); తాలూకాబోర్డు అధ్యక్షుడు (1933-4); జిల్లాబోర్డు మెంబరు (1933-36); మద్రాసు విశ్వవిద్యాలయము సెనేట్ మెంబరు. 1955-58; తెలుగుబోర్డు అధ్యక్షుడు 1955-59); మెంబరు 1955-60). ఆంధ్ర సాహిత్య అకాడమీసభ్యులు (1957-60) ఢిల్లీసాహిత్య అకాడమీ తెలుగుసలహా ఉపసంఘ సభ్యులు (1954 నుండి

రచనలు : తెలుగు - భారతశతకము, కువలయావళీ నాటకాంధ్రానువాదము, బాలానందము, బాలవినోదము వ్యాసములు మొ॥

సంస్కృతము : ప్రసిద్ధాంధ్రపద్యములకు సంస్కృత శ్లోకములు, క్షేత్రయ్య మువ్వగోపాలపదములకు సంస్కృత గేయములు, కాళిదాసప్రశంస, భారతదేశప్రశంస మొ॥

ఇంగ్లీషు : రవీంద్రుని సందేశములు, ఆంధ్రసాహిత్య చరిత్ర, వ్యాసములు మొ॥, సవరపాటలు - ఆంగ్లానువాదము (గేయరచన).

## 10. శ్రీ చెలమచెర్ల రంగాచార్యులు (పుటలు 47-48)

పుట్టిన తేది : 8-1-1912. సాహిత్యకృషి: ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము (అలంకారశాస్త్రము ప్రథమ ముద్రణము 1944 ద్వితీయముద్రణము 1961), హాలికుడు (నాటకము) ప్రథమ ము॥ 1940. ద్వితీయ ము॥ 1946. తృతీయ ము॥ 1961, అలంకారవసంతము 1944, ఆంధ్రముకుందమాల 1944.

అముద్రితములు : ఔచిత్యవిచార చర్చ, కాళిదాసకావ్యోద్యానము, భక్తభూషణచంపువు (సంస్కృతము) మొ॥

ఉద్యోగము : ఆంధ్రోపన్యాసకుడు - ఉస్మానియా విశ్వవిద్యాలయము

గౌ॥పదవులు : 1. Principal Andhra Oriental College, 2. President Vijnanavardhini Parishat. 3. Secretary Samskruta Bhasha Prachara Sabha – Hyderabad. 4. Member Sahitya Academy Andhra Pradesh.

## 11. శ్రీ స్ఫూర్తిశ్రీ (పుటలు 49-51)

జననం: జనవరి1928. పేరు తోకా భాస్కరరావు. జన్మస్థలము : కాకినాడ, తూర్పుగోదావరి జిల్లా. విద్య : బి. ఏ. (ఆనర్సు) తెలుగు. కవితానామము : స్ఫూర్తిశ్రీ. ఉద్యోగము ; ఆంధ్రోపన్యాసకులు, ఏ. సి. కాలేజి - గుంటూరు. సాహిత్యపరిచయము : ఆంధ్ర, సంస్కృతాంగ్లహిందీ భాషలు. ఇష్టవిషయములు : భాషాశాస్త్రము; వ్యాకరణము. ముద్రితరచనలు : దేవయాని, కన్నీటిజాలు, అహల్య, మహాశ్వేత పద్యకావ్యములు. పరిణతి - స్వతంత్ర నవల: ఆనందమఠం, శేషకవిత, శకుంతల - అనువాద నవలలు. మాటలతో మంతనాలు, మాటలంటే మాటలా - భాషా వ్యాసములు.

అముద్రిత రచనలు : ఉమరుఖయాము- పద్యకావ్యము భారతభారతి- విమర్శనము, లోకాలోకం - గేయసంపుటి, వ్యాసపూర్ణిమ - వ్యాససంపుటి, ఊర్వశి, మాళవిక - అనువాదములు, వివిధపత్రికా రచనలు; ఆకాశవాణి ప్రసంగములు.

## 12. శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ (పుటలు 52-63)

స్వగ్రామము : కోడితాడిపఱ్ఱు అగ్రహారము. తెనాలి తాలూకా. పితరులు : హనుమాయమ - సుబ్రహ్మణ్యశాస్త్రి. (శ్రీ వైరాగ్యానంద భారతీస్వామి) సోదరుడు : లక్ష్మీనరసింహము- కవి- పండితుడు. విద్య : గురువులు 1. జమ్ములమడక రామయ్య-తాత, 2. జమ్ములమడక సుబ్రహ్మణ్యశాస్త్రి, తండ్రి. 3. తాతారాయడు శాస్త్రి-విజయనగరము. భార్య : హైమవతి - పండిత - పురాణగోష్ఠీనిరత. సంతానము : కుమార మాధవరామశాస్త్రి-పట్టాభి

పురం హైస్కూలు, 2. భవభూతి శర్మ, 3. భామతి 4. శ్రీమతి. మంత్రదీక్ష : శ్రీ జగద్గురు కళ్యాణానంద భారతీ మాంతాచార్యమహాస్వామి. ఉద్యోగము : తెనాలి సంస్కృతకలాశాల ప్రిన్సిపాలు, నెల్లూరు వేదసంస్కృత కలాశాల, గుంటూరు ఏ. సి. కలాశాల. అభిమానశాస్త్రము: అద్వైత వేదాంతము, ప్రత్యభిజ్ఞాదర్శనము, సాహిత్య తంత్రము. రచనలు : పీఠికలు - వ్యాసములు - రేడియో భాషణములు - గ్రంథాల పైభావములు శతాధికములు వ్యాసంగము : సంస్కృత-ఆంధ్ర-ఆంగ్ల-హిందీ-మరాట-కర్ణాట గ్రంథములు నిత్యకార్యము : అనుష్ఠానము, దేవీ పూజ, అధ్యాపనము, గ్రంథరచన, సభోపన్యాసము- పిల్లల లాలనము. గ్రంథములు- ముద్రితములు : గీతాసూత్రనవతి, శ్రీ(మంత్రవిద్య), భక్తితంత్రము, దేవీకథ, కృష్ణజయంతి, కళ్యాణభారతి, నవరసగంగాధరము, ధ్వనిసారము, కావ్య ప్రకాశము, అలంకారసూత్రము, ఆంధ్ర ప్రతాపరుద్రీయము, రసగంగాధరమణి, నాట్యవేదము, రసభారతి - నాటకమీమాంస. అముద్రితములు : నాట్యవేదము - ద్వితీయభాగము, భావప్రకాశనము, వక్రోక్తిజీవితము, నవరసగంగాధరము - 2 భాగము, వ్యక్తివాదము, ఏకావళి, నాట్యసారము, కావ్యదర్పణము, మాధవగీత, తత్త్వసంగ్రహము, ఉపనిషత్కథ, వేదాంతసప్తశతి, దీక్షాప్రకాశము, దర్శనాచార్యత. విశేషము :- అజాతశత్రుత, అజాతమిత్రత, నిర్దైన్యేనజీవనం, సంస్కృతాంధ్రములలో దేశమంతట ఉపన్యసించుట, (దాదాపు 16 వందల సభలలో), గ్రంథకోశసంపాదనము, ప్రాచీననవీనకావ్యాస్వాదము, - పరీక్షా బిరుదములు : సాహిత్యవిద్యాప్రవీణ, భాషాప్రవీణ. - సభలు - సభ్యు లిచ్చిన బిరుదములు :- సాహిత్యాచార్య, లాక్షణికశిరోమణి, మహోపాధ్యాయ, శాస్త్రవిశారద, నవవిద్యానాథ, దర్శనాచార్య.

## 13. శ్రీ పోతరాజు పురుషోత్తమరావు

(పుటలు 64-68)

జననం 27-4-1915 రచనలు: శ్రీరామచంద్రశతకము ఆంధ్ర మణిరత్నమాల, ఉపనిషత్సారము, పురుషోత్తమ చరిత్ర. తండ్రి శ్రీ పోతరాజు లక్ష్మీనరసింహకవి, తల్లి మహాలక్ష్మమ్మ.

వీరు సంస్కృతాంధ్రములయందు సంప్రదాయ బద్ధమైన పాండితిగలవారు. అవధానాశుకవితా సభలు గావించి ప్రఖ్యాతిపొందిరి. గురుముఖమున శాంకరభాష్యాదులు చదివిరి. విశిష్టమైన మేధస్సు, పరిణతసాహిత్యప్రజ్ఞ గల విఖ్యాతమైన విద్వత్కవికుటుంబమునకు చెందిన వారు. వీరు ప్రస్తుతము గుంటూరులోని హిందూ కాలేజి హైస్కూలులో సీనియర్ తెలుగుపండితులుగా పనిచేయుచున్నారు.

## 14 నండూరి రామకృష్ణమాచార్య

(పుటలు 69-71)

జననము 29-4-1921 పశ్చిమగోదావరి అగ్రహారం గోపవరం. రచనలు : తారాతోరణము, ఖండకావ్యసంపుటి కవిత్రయము, [తెలుగుభాషాసమితివారి బహుమతిగ్రంథము] ధర్మచక్రము, ఛత్రపతి శివాజి, శ్రీకృష్ణదేవరాయలు, దక్షిణభారతదేశచరిత్ర [అచ్చులో].

వీరు విక్రమోర్వశీయాన్ని ఆంధ్రీకరించారు. అనేక ఏకాంకికలు వ్రాశారు. మైసూరు యూనివర్సిటీలో తెలుగు డాక్టరేటుపట్టం పొందారు. సువిఖ్యాతులైన విద్వత్కవులు.

## 15. శ్రీ అక్కిరాజు వేంకటేశ్వరశర్మ

(పుటలు 72-75)

జన్మస్థలము పల్నాడుతాలూకాలోని గుత్తికొండ గ్రామము. జన్మదినము: 7-9-1925 చిట్టిగూడూరులోని సంస్కృతకళాశాల, తిరుపతి శ్రీ వేంకటేశ్వరప్రాచ్య భాషాకళాశాల వీరివిద్యాభ్యాసమునకు కేంద్రములు. సంస్కృతమున సాహిత్యశిరోమణి, ఆంధ్రమున విద్వాన్ పట్టములను, జేపట్టిరి. ప్రస్తుతము గుంటూరు ఆంధ్రక్రైస్తవ కళాశాలలో నధ్యాపకవృత్తి నున్నారు.

వీరికృతులు : శృంగారతరంగిణి (అమరుకకావ్యమున కాంధ్రమున పద్యానువాదము) రఘువంశము (కాళిదాస

మహాకవికావ్యమునకు వచనానువాదము) మధ్యమవ్యాయోగము (భాసమహాకవికృతి కనుకృతి) (అముద్రితము) భావవిపంచి (ఖండకావ్యసంపుటి) (అముద్రితము).

## 16. శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి (పుటలు 76-81)

జననం: 17-10-1927 స్వగ్రామం: కొర్లపాటివారి పాలెం-తూర్పుగోదావరి జిల్లా విద్య: M. A. పట్టభద్రులు. వృత్తి: అధ్యాపకులు, ఆంధ్రశాఖ ఆంధ్రవిశ్వవిద్యాలయము-వాల్తేరు.

రచనలు: ముద్రితములు: 'చిత్రశాల'-చారిత్రకనవల ఆంధ్రవిశ్వకళాపరిషత్ నవలాపోటీలో బహుమతినందినది 'గుడిగోపురము'- కథలసంపుటి 'వీణ' కథలసంపుటి. అముద్రితములు: కావ్యసంపుటి, సమత - రచనకు ప్రదర్శనకు బహుమతినందిన నాటకం, నటన - రచనకు బహుమతినందిన నాటకం, తెనుగుపచనము, వ్యాససంపుటి.

## 17. శ్రీ మానం శ్రీనివాస హనుమంతరావు (పుటలు 82-83)

కవివివరములు: జననము గర్తపురీనగరమున బహుధాన్యఆషాఢబహుళ అష్టమి (బుధవారం 20 జులై 1938) విద్యావ్యాసంగము: ఆంధ్రవిశ్వకళాపరిషత్తునుండి ఆంధ్రమునందును, అర్థికశాస్త్రమునందు రెండుపర్యాయములు పట్టభద్రత గాంచుట.

వృత్తి: ప్రస్తుతము S. S. N. కళాశాలలో ఆంధ్రాధ్యాపకత. వ్యాసంగము: ప్రజామత, తెలుగువిద్యార్థి, నవ్యభారతి, శశి, నర్సరావుపేట కళాశాల పత్రిక మొ॥ వానిలో వివిధవ్యాసములు, కవితలు- కథలు- రూపకముల ప్రచురించుట; కొన్ని గ్రంథరూపమున రానున్నవి అచిరకాలములో; నర్సరావుపేటపట్టణ రచయితల సంఘమునకు గతమూడువత్సరములనుండి కార్యదర్శిత్వమును నెరపుచున్నారు.

## 18. శ్రీ కె. సుబ్బరామప్ప (పుటలు 84-87)

జననం: 23-9-1913. రాయలసీమకు సంబంధించినవారు. పరిశోధనచేయటం కృషి. తెలుగుసాహిత్యంలోని గొప్పదనాన్ని కన్నడభాషలో కన్నడిగులకు పరిచయంచేయటం, కన్నడసాహిత్యంలోని మంచివాటిని తెలుగువారికి అందివ్వడం. ఈపనిచేయటం వారికి చాలాయిష్టమైనది. తెలుగు కన్నడలిపులనుఐక్యంచేసి రెండుభాషలకు ఏకలిపిని రూపొందించాలనే కుతూహలం. ఈ కృషికి చాలవరకు ఆంధ్ర మైసూరుప్రభుత్వాలు చేయూతనిస్తున్నాయి. ప్రస్తుతం మైసూరుయూనివర్సిటీలో తెలుగుప్రొఫెసర్ గాఉన్నారు.

## 19. శ్రీ మౌళి (పుటలు 88-89)

పూర్తిపేరు వి. సి. మౌళి. కావలికాలేజి ఆంధ్రశాఖలో పనిచేస్తున్నారు. ఛిన్నయవనిక అను అముద్రిత ఖండకావ్యసంపుటి, అణిముత్యాలు [హిందీమహాకవుల ముక్తకాలకు స్వేచ్ఛానువాదము అనేకపత్రికాముఖముల ప్రకటితమైన ఖండికలు కథానికలు, విమర్శనలు, వ్యాసములు వీరి రచనలు.

## 20. శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి (పుటలు 90-91)

జననం: మార్చి 1900. గౌతమీకోకిల, మధురకవి బిరుదాంచితులు. ప్రస్తుతం కావలికాలేజీలో ఆంధ్రోపన్యాసకులుగా ఉన్నారు. ధర్మపాలుడు, అపరాధిని, రంగమహల్ అనే నవలలు రాణాప్రతాప్, ఆయేషా మొదలైన నాటకాలను రచించారు. వీరిసుప్రసిద్ధఖండకావ్య సంపుటి దీపావళి అనేకనవకవులకు మార్గదర్శకమైంది మాతల్లి, ముక్తావళి అనే అముద్రిత పద్యకావ్యముగూడ ఉన్నవి. వీరి సునిశితమైన వాక్కు రసికులహృదయాల లోకి చొచ్చుకొనిపోయి మరువరాని అనుభూతిని కలిగిస్తుంది. నవ్యకవులలో వీరికి చాల ఉన్నతస్థాన మున్నది.

## 21. శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి (పుటలు 92-96)

పుట్టినతేది 1-7-1909. అలంకారశాస్త్ర, వేదాంత, యోగ, ఛందోవ్యాకరణములయందును, సంగీతమునందును, సంగీతవాద్యమునను, కృషిజరుపబడెను.

ఆంధ్రధ్వన్యాలోకము, అభినవగుప్తలోచనముతో - గద్యపద్యరూపమున నాంధ్రీకృతము- ప్రభావతీవ్యాఖ్యా-

స్వతంత్రముగా రచితము, 1, 2, 3 భాగములు. కఠోప పనిషత్తు, శాంకరభాష్యార్థము పద్యరూపమున నాంధ్ర కృతము, ఈశావాస్యోపనిషత్తు, ఆంధ్ర ద్యానువాద సహితము త్రిమతభాష్య, శాక్తాద్వైత,భాష్యస్వాభిప్రాయ సమన్వితము, ఉపనిషత్ సముచ్చయము, ఉపనిషత్తులు, ఈశ, నిరాలంబ, పైంగల అధ్యాత్మ, స్వతంత్ర వ్యాఖ్యా (ప్రభా) సహితములు. భామతి- స్వతంత్రఖండకావ్యము. ఉమాసహస్రము, 1, 2, 3 భా. శ్రీకావ్యకంఠ గణపతి ముని కృతికి అనువాదము ప్రభాసహితము. అంజలి, స్తోత్ర సాహిత్యము. మాతృపూజావిశేషాంజలి. మొ॥

బిరుదములు : సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషా ప్రవీణ, కవిశేఖర, వేదాంతవిమర్శనవిశారద, సాహిత్యా చార్య. ఉద్యోగము : విజయనగరం గవర్నమెంటు యం. ఆర్. సంస్కృతకళాశాలలో సీనియర్ తెలుగుపండితులు.

## 22. శ్రీ పి. వి. ఎల్. నరసింహారావు

(పుటలు 97-

25-12-1931. సాహిత్యకృషి: రచనలు. వరుడు కావలెను, (కథలు) తెలుపులు తెరచినకిటికీ(కథలు) హైదరాబాదు నగరమార్గదర్శిని- 1956, చివరకు తేలింది? (నవల), పిచ్చిపుల్లయ్య (పిల్లల కథలు), విజయశ్రీ (నవల-అముద్రితము), భావస్వరాలు (నాటిక). ఇవిగాక అనేక కథలు, వ్యాసాలు ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక మొదలగు పత్రికల్లో ప్రకటించబడినవి. ఆంధ్రప్రభవారు 1960 వ సంవత్సరం ఉగాదిసంచికలో వెలువరించిన 'భారతీయ సంస్కృతి - సంతాననిరోధం' అనే శీర్షికపోటీలో ప్రథమ బహుమతి లభించినది. ప్రస్తుతం అనంతపురంలో జిల్లా పౌరసంబంధశాఖాధికారి ఉద్యోగం.

## 23. శ్రీ చివుకుల సీతారామశర్మ

(పుటలు 100-101)

జననం: 15-1-1926. తెనాలితాలూకా వేమూరులో. 'కవితావనం' అనే సాహిత్యసంస్థను నాలుగుసంవత్సరాలు నడిపారు. నాటక, సంగీతకళలలో ప్రత్యేకశ్రద్ధ. అనేక కవితాగోష్ఠీకార్యక్రమాలలో పాల్గొన్నారు. వేంకటేశ్వర స్తుతి మొ॥ గ్రంథాలు వ్రాశారు.

## 25. శ్రీ చిట్టా రామకృష్ణారావు

(పుటలు (102-105)

జన్మదినం: 1-7-1912. విద్య: విద్వాన్, బి. ఏ., బి. ఇడి. సాహిత్యకృషి: రచించిన గ్రంథములు: నాటకములు: శ్రీకృష్ణదేవరాయలు, పురమందిరము, నిర్దోషి, నాటికాగుచ్ఛము. పద్యకావ్యములు: ప్రేమజ్యోతి, అశ్రుమాల, పుష్పాంజలి, ఇష్టాగోష్ఠి. గోరుముద్దలు. గద్యకావ్యములు: విశ్వకథ, జ్యోతిర్మాల, కథానిధి, భాగవతవిమర్శనము, ప్రబంధపాత్రలు. మణిమాల, ఆంధ్రసాహిత్యచరిత్ర, గద్యపద్యాత్మకములు: సంఘము, గీతాసుధ, బాపూజీ. గేయకథ : రుద్రమదేవి. ప్రాచీనార్వాచీనసాహిత్యములలు రెంటియందును సమానగౌరవాభిమానములుకలవు. 1947లో హిందూపురమునందు రాయలసీమకళాపరిషత్తువారు 'కవిభూషణ' బిరుదునొసంగి ప్రోత్సహించిరి. స్థానిక జైహింద్ సెకండరీపాఠశాలలో ఆంధ్రాంగ్లబోధకుడుగా పనిచేయుచున్నారు. ఆంధ్రపాఠ్యగ్రంథములు వ్రాసిరి. అవి ప్రచారమునందున్నవి. నవ్యాంధ్రప్రక్రియలన్నిటిలోను కృషి చేయుచున్నారు.

## 25. శ్రీ షడ్దర్శనం సోమసుందరశర్మ

(పుటలు 106-111)

జననము: 5-9-1920 (కోనసీమ) ద్రావిడబ్రాహ్మణ తెగ. భారద్వాజసగోత్రము. మాతాపితలు: షడ్దర్శనం సుబ్రహ్మణ్యశర్మగారు, అమ్మణమ్మగారు. నివాసస్థలము: ప్రొద్దుటూరు తాలూకా, యఱ్ఱగుంటపలి అగ్రహారము. విద్యావిషయములు: యజుర్వేదము, క్రమాంతము అధ్యయనమైనది. వేదాంగములైన శిక్ష-వ్యాకరణ- ఛందోజ్యోతిష నిరుక్త- కల్పములను- నేర్వడమైనది. మద్రాసుయూనివర్సిటీ విద్వాన్. సాహిత్యము- మీమాంసశాస్త్రములలో ప్రత్యేకపరిశ్రమయు.

రచించిన గ్రంథములు : (అన్నియు, అముద్రితములే) సాయనవేదభాష్య పరిశీలనము (ఋగ్యజుర్వేదములు) గాయత్రీమంత్రార్థరహస్యము, జ్యోతిర్విద్యావివేకము

(జ్యోతిషము), మంత్రశాస్త్రవివరణము, ఝాన్సీరాణీ (పద్యకావ్యము), ఉపన్యాసతరంగిణి (పలుచోట్ల యిచ్చిన ఉపన్యాసముల కూర్పు) వ్యాసతరంగిణి (పత్రికలలో ప్రకటనములైన వ్యాసముల సంపుటి), వివిధవ్యాసములు (పలు విధములైన వ్యాసములు), ధర్మశాస్త్రపరిశీలనము, గీతా తాత్పర్యబోధిని. వీరు ప్రస్తుతం ప్రొద్దుటూరు ఉన్నతపాఠశాలలో పండితులు.

## 26. శ్రీ శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

(పుటలు 112-114)

జననం: 20-10-1913. విద్యాభ్యాసం: బి. ఏ.,(1933) తెలుగులో ఆంధ్రవిశ్వవిద్యాలయమున ప్రథమశ్రేణి ప్రథమస్థానము; లెక్కలలో ప్రథమశ్రేణి. బి. ఇడి. (1939) ద్వితీయశ్రేణి. సాహిత్యకృషి: 1932నుండి భారతి, గృహలక్ష్మి పత్రికలలో పద్యరచనలు ప్రకటింపబడినవి. రామిరెడ్డిగారి కృషీవలుడు ఖండకావ్యముపై సమీక్ష 1932 నవంబరు భారతిలో ప్రచురితము. ఇటీవలి రచనలు భారతి, నవభారతి, గృహలక్ష్మి, కృష్ణాపత్రిక, ఆంధ్రప్రదేశ్ గోల్కొండపత్రిక, ఆంధ్రపత్రిక వారసంచిక మొదలగు వానిలో పడినవి.

సాహిత్యాచార్యులు: శ్రీవిశ్వనాథ కవిరాజు, ఆడిదము రామారావు, భోగరాజు నారాయణమూర్తి. 1929 నుండి సాహిత్యవ్యాసంగారంభం. 1929నుండి అప్పుడప్పుడు ఆశుకవిత. ప్రస్తుతం శ్రీకాకుళంజిల్లా, సీతానగరంలో ఉన్నతపాఠశాలకు ప్రధానోపాధ్యాయులుగా పనిచేయుచున్నారు.

## 27. శ్రీ లంకా సీతారామశాస్త్రి

(పుటలు 115-121)

17-8-1912. బిరుదులు ఉభయభాషాప్రవీణ; వేదాంతశిరోమణి, సాహిత్యవిద్యాప్రవీణ, విద్వత్కవిభూషణ, విద్వత్కవితాకలానిధి, శ్రీరామభక్తవిద్వత్కవిశేఖర.

కృతులు: ముద్రితములు: ఆంధ్రము : హనుమన్నామమాల, నీతిసీతారామశతకము, దుర్వాసోగర్వనిర్వాపణము, సుకన్య, బ్రహ్మాన్నవిజయము, కొండవీటిరెడ్డిరాజులు, బృహత్కథాసంగ్రహము, (ప్రబోధము) ఆంధ్రలక్షణచంద్రిక, గీర్వాణవ్యాకరణము. సంస్కృతము : త్యాగరాజచరితామృతము, శ్రీసీతారామాయణము, (సవ్యాఖ్యానము) హనుమత్పూజావిధానము. అముద్రితములు: (సంస్కృతము)భారతీ విలాసము, పాండురంగసుప్రభాతము, హంహరతారతమ్యము. (పరిష్కృత గ్రంథము) ఇవి తెలుగులోని-పద్య, గద్య, వ్యాకరణాత్మకములు. ఇందు- సుకన్య: రేడియోవారిచే మన్ననపొందినది. బ్రహ్మాన్నవిజయము, కొండవీటిరెడ్డిరాజులు: గవర్నమెంటువారిచే ఉపవాచకములుగ నంగీకరింపబడినవి. ఆంధ్రలక్షణచంద్రిక: తెలుగువ్యాకరణము. (సంస్కృతము) త్యాగరాజచరితామృతము: ఇది పంచసర్గాత్మకకావ్యము. అన్నివృత్తము లిందు గలవు; త్యాగరాజకీర్తనలు శ్లోకరూపముగ ననువదింపబడినవి. శ్రీత్యాగరాజున కంకితము. శ్రీకాశీకృష్ణాచార్యులచే స్వర్ణఘంటాకంకణమును శ్రీకవికొండలపురుషోత్తమపంతులవారిప్పించిరి.

శ్రీసీతారామాయణము: ఇది షట్కాండములు. అశ్వధాటీవృత్తము, గాయత్రీమంత్రాక్షరములతో నిబద్ధము. సవ్యాఖ్యానము. ఇది భద్రాచల శ్రీసీతారాములవారి కంకితము నీయబడినది. శ్రీరామచంద్రమూర్తి దేవస్థానము వారు స్వర్ణపతకము. దుశ్శాలువలు, శ్రీరామభక్తవిద్వత్కవిశేఖర బిరుదమును పండితులచేనిప్పించిరి. భారతీవిలాసము : ఇది కళాపూర్ణోదయ సంస్కృతీకరణము. శ్రీబూర్గుల రామకృష్ణారావుగారి కంకితము.

## 28. శ్రీ దివాకర్ల వేంకటావధాని

(పుటలు 122-124)

జననం: 29-6-1913. బి. ఏ. ఆనర్సు మొదటితరగతి (ఆంధ్రవిశ్వవిద్యాలయము) 1937 ఆంధ్రనాటకపితామహునిగూర్చిన వ్యాసమునకు ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు ప్రాజ్ఞన్నయయుగము, నన్నయభారతము అను రచనలకు P. Hd పట్టమిచ్చినారు. వీరు విద్వత్కవులు. నిరర్గళమాధురీపరిపాకముగల వారికవితగంగాప్రవాహమువంటిది.

ఇతరరచనలు : రాజసందర్శనము; పరివర్తనము (కావ్య

ములు) నాగానందము, కౌముదీమహోత్సవము (నాటకానువాదములు) ఆంధ్రవాఙ్మయచరిత్రము, కాదంబరివచనము; ప్రకృతివిజయము, గురుశిష్యులు (గద్యము) మార్గదర్శకులు, సాహిత్యఅకాడమీపక్షమున నన్నెచోడపదకోశము, తెలుగుభాషాసమితిపక్షమున విజ్ఞానకోశము, భాషాసారస్వతసంపుటము. ఈరీతిగా నిరంతర సాహిత్యసేవ చేస్తున్నారు.

## 29. శ్రీ కేశవభొట్ల సుదర్శన వేణుగోపాలమూర్తి (పుటలు 125-128)

జననము 1908. జన్మస్థలము: క్షేత్రయ్య జన్మస్థలమగు మొవ్వగ్రామోపగ్రామమగు మూలపాలెము. కవితాసంక్రమణము: పితృమాతృవంశములనుండి తండ్రి, పెదతండ్రి తత్త్వజ్ఞులు గేయకవులు. మేనమామ వేదాంతవంశ్యుఁడు రామకవి. ఆదివిద్యాభ్యాసము తండ్రి వేంకటప్పయ్య. పెదతండ్రి రాజగోపాల, కవులయొద్ద. ఆనంతరము: చల్లపల్లి మాధ్యమికపాఠశాల, తెనాలి సంస్కృతపాఠశాల బందరు నోబిల్ కళాశాల. కవితా, సాహిత్యగురువరేణ్యులు : కవితాకళానిధి ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు. బిరుదు: సరసకవి.

రచనలు: పద్యకావ్యములు: కృష్ణాభ్యుదయము, పరమశివానందలీలలు, ఉత్తరలీలలు, స్మృతికావ్యము, ప్రతిష్ఠాసౌష్ఠవము, ఆంధ్రవిష్ణువు, పేదమొఱ, పద్యమాల, రాసరామాయణము (ప్రస్తుతరచన). రూపకములు : శివాజీ, పరశురామ, రామరాజ్యము, జీవితభారము, జరాసంధ, ఊర్వశీధనంజయము, చిరంజీవి, తెరమఱుఁగు. నవలలు: అశోకధర్మచక్రము, సహధర్మచారిణి, భూతసారథి, తథాగతుఁడు, విజయరాఘవము. వ్యాసములు: పూర్వాంధ్రకవులు, విజ్ఞానవ్యాసములు. వ్యాకరణములు: సుదర్శనవ్యాకరణములు, 3 భాగములు. ప్రస్తుతం గుంటూరు హిందూకళాశాలలో ఆంధ్రపండితులు.

## 30. శ్రీ వావిలాల వేంకటేశ్వరశాస్త్రి (పుటలు 129-132)

**1912** సంవత్సరమున జూలై **1** వ తేదిన వావిలాల జాలరామయ్య, తులశమ్మ యను దంపతులకు జన్మించిరి. పదియవసంవత్సరమున నుపయనము జరిగినది. తరువాత వేదాధ్యయనమునకు శ్రీ పిసుపాటి త్ర్యంబకావధానులుగారియొద్ద ప్రవేశించిరి. షుమారు యజుర్వేదములో 40 పన్నములు స్మార్తము మొదలగునవి చదివి తరువాత కావ్యములు ప్రారంభించి నండూరులో భాగవతుల శ్రీరామశాస్త్రిగారివద్ద కాళిదాసత్రయమును జదివి, వేమూరిలో కురుగంటి శ్రీ పిచ్చయ్యశాస్త్రిులగారియొద్ద నైషధాంతము నాటకాలంకారములను జదివి తరువాత కృష్ణాజిల్లా ఆగిరి బ్ర॥ శ్రీ వేమూరి రామబ్రహ్మశాస్త్రిరగారియొద్ద షుమారు 8 సంవత్సరములు ప్రాచీననవీనతర్కశాస్త్రమంతయుఁ జదివి ఆతర్కశాస్త్రములో ఆంధ్రయూనివర్సిటీలో “విద్యాప్రవీణ” పరీక్షయందు త్తీర్ణులైరి. తర్కశాస్త్రము బోధించుటకు శ్రీశ్రీశ్రీ జగద్గురు శంకరాచార్య శివగంగాపీఠాధిపతులయొద్ద ఉపాధ్యాయునిగ 3 సంవత్సరము లుండిరి. గద్వాల మొదలగు సంస్థానములలో వాగ్వాదాదులుజేసి బహుమానముఁ బడసిరి కాశీగీర్వాణవాగ్వర్ధనీసభవారిచే సంస్కృతసాహిత్యవ్యాసరచనలో ప్రథమబహుమానము 1934లో బొందిరి. బ్ర॥శ్రీ॥ దెందుకూరు నరసింహశాస్త్రిులవారియొద్ద గుంటూరులో పీఠములోనుండి సూత్రభాష్యము (శంకరము) గీతాభాష్యము మొదలగునవి చదివిరి తరువాత ఆంధ్రయూనివర్సిటిలో “భాషాప్రవీణ” ప్యాసయిరి. ఒంగోలులో పురపాలకసంఘోన్నతపాఠశాలలోనుపాధ్యాయులై ఉన్నారు. విద్యారణ్యస్వామికృత సర్వదర్శనసంగ్రహమున కనువాద మొనర్చిరి.

## 31. శ్రీ చిరువోలు శేషగిరిరావు (పుటలు 133-137)

జననం: 1-7-1897.

ఆంబికాశతకాదిరచనలు చేశారు.

## 32. శ్రీ మన్నవ గిరిధరరావు (పుటలు 138-140)

జననము: **13-7-1930** బాపట్లలో. స్వగ్రామం. గుంటూరుజిల్లా మన్నవగ్రామం. విద్యాభ్యాసం: స్కూలు

హైస్కూలు వరకు: బోర్డుహైస్కూలు నిడుబ్రోలు. ఇంటర్మీడియేట్; గుంటూరు హిందూకళాశాల. బి. ఏ., ఆంధ్రా క్రిస్టియన్ కాలేజి గుంటూరు. ఎం. ఏ. : కాశీహిందూవిశ్వవిద్యాలయం. ఉద్యోగం : గుంటూరుహిందూకళాశాలలో చరిత్రఅధ్యాపకత్వం.

సారస్వతవ్యాసంగం: హాస్య, వ్యంగ్యరచనలు చేస్తూవుంటారు. “ఎం. ఎల్. ఏ. ఆత్మకథ” అను వ్యంగ్యపూరితమైననవల రచించారు. 1956లో రచయితలలో భారతీయదృక్పథాన్ని వ్యాప్తిచేసే ఆశయంతో ఆంధ్రప్రదేశ్ భారతీయ రచయితలసమితిస్థాపించడానికి కారకులలో వీ రొకరు. అప్పటినుంచీ భారతీయరచయితలసమితికి, ప్రాంతీయకార్యదర్శిగా వుంటున్నారు. సునిశితమైన రాజకీయవిమర్శ, చమత్కారసహితమైన రచనామార్గం వీరి వాణికి అలంకారాలు. నిశ్చలమైనదీక్ష నిశ్చితమైన ఆశయాలు గలవ్యక్తి. భారతీయరచయితలసమితి ఆధ్వర్యమున గుంటూరునుండి వెలువడుచున్న “సాధన” మాసపత్రికకు సంపాదకులు. వీరితీవ్రమైనవాక్కు చాలసంచలనాన్ని కలిగించే శక్తిగలది.

## 33. శ్రీ బబ్బెళ్ళపాటి కామేశ్వరరావు (పుటలు 141-144)

నివాసము: సత్తెనపల్లితాలూకా ఉయ్యందన తాళ్లూరు. జననము : (ది 3-3-1910) నియోగి బ్రాహ్మణులు. విష్ణుపురాణగ్రంథకర్త “వెన్నెలకంటిసూరన” వంశములోనివారు. కాలాంతరమున ఇంటిపేరు కరణీకంవల్ల మారింది.

రచనలు : భక్త సుధన్వ, ఆంధ్రవీర, నాటకములు- వేదనగేశశతకము, సోమసుందరశతకము, శతకములు, లక్ష్మీసుందరి, హైమావతీపరిణయము, యక్షగానములు బాలల హాలాస్యమహాత్మ్యము, ముగ్గురువీరులు వచనములు చాటువు లనేకము వ్రాసిరి.

## 34. శ్రీ భమిడిపాటి వేంకటలక్ష్మీనరసింహశాస్త్రి (పుటలు 145-149)

జననం : క్రోధన కార్తీక బహుళ నవమి, మఖ ప్రథమ పాదము.

రచనలు : నవోదయ, విధిఘటన, దుర్గాంబికాశతకం, ప్రణయానుబంధము, మారుతిప్రభ.

## 35. శ్రీ కుంటిమద్ది శేషశర్మ (పుటలు 150-154)

పరీధావి మాఘబహుళ అష్టమి జన్మము. చిన్నతనమున పితామహులు శ్రీ కుంటిమద్ది శ్రీనివాసాచార్యులవారి దగ్గర 5, 6 సంవత్సరములు కావ్యపఠనము. 1928 నుంచి 1936 వరకు తిరుపతి శ్రీ వేంకటేశ్వరసంస్కృతకలాశాలలో చదువు. సాహిత్యశిరోమణి అనంతరము 38లో విద్వత్పరీక్ష. 1943 నుండి అనంతపురమండలమున తెనుగు పండితపదవి. ఈమధ్యలోనే S.S.L.C. పండితట్రైనింగు రాజమండ్రిలో 1950లో. 1957లో సర్టిఫికెట్ కోర్సు. ఇవి అధ్యయనవిషయములు. తెనుగున: “సుధాబిందువులు, తెనుగుతల్లి” ముద్రిత గ్రంథములు. “అలంకారవిచారము” అని ఒకగ్రంథము. పరిశోధన: (“రామచంద్ర”చే ప్రకటితము) యందు కొంతవరకు ప్రకటితము. ‘సుమతిశతకం’ (తెనుగుసుమతీశతకమునకు సంస్కృతీకరణం). ‘బాష్పబిందవః’ సంస్కృతకావ్యములు. అముద్రితములు.

## 36. శ్రీ మోచర్ల రామకృష్ణయ్య (పుటలు 155-159)

జననము : 27-5-1904. సాహిత్యగురువులు కీర్తిశేషులు బ్ర॥ శ్రీ॥ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు.

రచనలు : మారుతి (కవిత్వము), రమణానందలహరి (కవిత్వము), గంగాలహరి (కవిత్వము), ఆత్మబోధము (కవిత్వము), గిరిజాకళ్యాణము (వచనము), హంససందేశము (కవిత్వము), అమృతకలశము (కవిత్వము), ప్రచండభార్గవము (నాటకము), అనర్ఘభార్గవము (నాటకము), కామశుద్ధి (నాటకము) అభిజ్ఞానశాకుంతలము (నాటకము), ప్రేమచిహ్నము (గేయనాటిక), గురుదేవచరిత్రము (వచనము) శారదాప్రసాదః (సంస్కృతకవిత్వము), అమరగౌరవము (ఆంధ్రకవిత్వము), ధ్రువరూపకము (నాటకము), ఛత్రపతి శివాజి (నాటకము), త్యాగమహిమ (వచనము), ప్రేమలీల (సాంఘికనాటకము), గురుశిష్యులు (కవిత్వము), స్వాత్మ

ర్పణము (కవిత్వము). నెల్లూరివిద్వత్సభలో 'సరస కవి' యనియు అయోధ్యసంస్కృతకార్యాలయమువారు 'సాహిత్యరత్న' యనియు, శారదాప్రసాదమను వీరి సంస్కృతరచన నెల్లూరులో ఒకప్రత్యేకపరిషత్సభాసమావేశములో సంస్కృతాస్థానకవి శ్రీ కె. యన్. కృష్ణమూర్తి శాస్త్రిగారు 'ప్రసన్నమధురకవి' యనియు, ఆంధ్రసాహిత్యపరిషత్తువారు 'కవిశేఖర' యనియు బిరుదము లిచ్చియున్నారు. స్నిగ్ధగంభీరమైన కంఠస్వరము, లలితకవితారీతికల విద్వత్కవులు వీరు.

## 37. శ్రీ పి. వేంకటేశ్వరరావు

(పుటలు 143-144)

జననం : 8-2-1934 ఇంటిపేరు పొత్తూరివారు. పత్రికారంగంలో వీరికి ప్రతిభా, ప్రశస్తి ఉన్నవి. వాటిని నిర్వహించటంలో అనుపమానమైన సామర్థ్యం, నిరంతరదీక్ష, గల వీరు ప్రజాసేవాసమర్థమైన శక్తిసంపదలతో సముల్లాసభరితులై ఉంటారు. ఉత్సాహం, దానికి తగిన పట్టుదల వీరి కున్నవి. సునిశితమైన మేధ, సుమహితమైన వాక్కు, నిత్యనూతనంగా తమజీవితమంతా ఒక తీవ్రమైన కృషివిశేషంగా వీరు పురోగమిస్తుంటారు. పత్రికలలో రాజకీయ, సాహిత్యాదులకుసంబంధించిన అనేకవ్యాసాలు వ్రాశారు. ప్రస్తుతం హైదరాబాదునుండి వెలువడుతున్న తెలుగు దినపత్రిక ఆంధ్రజనతకు అసిస్టెంట్ ఎడిటరుగా పనిచేస్తున్నారు.

## 38. శ్రీ టి. బి. యమ్. అయ్యవారు

(పుటలు 60-162)

పూర్తిపేరు - తాడికొండ భోగమల్లికార్జున అయ్యవారు జననము : 19-9-1935. జన్మస్థలము : వీరంకిలాకు, కృష్ణా జిల్లా - జననీజనకులు : శ్రీ తాడికొండ లింగమూర్తి, అచ్చమాంబ. కులము : ఆరాధ్యబ్రాహ్మణులు. గోత్రము : భరద్వాజగోత్రము. విద్యాభ్యాసము : ఇంటర్మిడియేట్ - 1950 - 52. S. R. R. & C. V. R. College. Vijayawada, B. A. (Hons) - ఆంధ్రవిశ్వవిద్యాలయము - వాల్తేరు. 1956.

ఇతరరచనలు : పల్నాటివీరచరిత్రము - పద్యకావ్యము, ఋతుసంహారము (కాళిదాసునికృతికిఁ దెనుఁగుసేత) ఉన్మత్తరాఘవప్రేక్షణకము (భట్టభాస్కరునికృతి కనువాదము), ధనంజయవిజయము, కాంచనాచార్యకృతనాటకము. (అనువాదము)

ప్రస్తుతరచనలు : హరచరిత చింతామణి : పరమమహేశ్వరుడు శ్రీ జయద్రథునికృతి కనుసరణము, కాశ్మీరశైవమును ప్రతిపాదించు పద్యకావ్యము. సంస్కృతవాఙ్మయము - దాక్షిణాత్యులు కావించిన దోహదము.

## 39. శ్రీ ఆకుండి రామశర్మ

(పుటలు 163-166)

జననం : 6-7-1935. సాహిత్యకృషి : విమర్శనాత్మక వచనరచనావ్యాసంగము. సుమారు ఇరువది వ్యాసములు వ్రాయడం జరిగింది. ఆంగ్లంలోకూడా వ్యాసాలు వ్రాసే అలవాటు అభిరుచి వుంది. 'వ్యాసమంజూష' (అముద్రిత గ్రంథం). ప్రస్తుతం విజయనగరరచయితలసంఘంలో కార్యవర్గ సభ్యత్వం కలదు.

## 40. శ్రీ కోట వీరాంజనేయశర్మ

(పుటలు 167-170)

జననం : 18-10-1913. నాటకములు : శకుంతల, చిరంజీవి, ఆర్యచారుదత్త, కిష్కింధ, అశోకవనము, సీతాకల్యాణము. ప్రబంధములు : చిత్రాశ్వీయము (ముద్రితము) మాధురీసుధాకరము, త్యాగమూర్తి, సువర్ణయుగము. ఖండకృతులు : ప్రణతి, మంజీరము.

అవధానాశుకవిత్వములలో మంచి నేర్పుగలదు. నివాసము - గుడివాడ. ఎట్టికష్టపరిస్థితినైనా ఎదుర్కొనగల మానసిక ధైర్యం, మనీష వీరికి ఉన్నవి. వీరి కవిత్వంలో లాలిత్యము మాధుర్యము గాంభీర్యముమిశ్రితములై రసహృదయులకు ఆనందాన్ని కలిగిస్తుంటవి. తీవ్రశక్తిగల వీరి వాక్కు ఎట్టిహృదయములోనికైనా చొచ్చుకొనిపోయి ఒకప్రసన్నమైన అనుభూతివిశేషాన్ని అందింపగలదు.

## 41. శ్రీ దిగుమర్తి సీతారామస్వామి (పుటలు 171-173)

జననము : బొబ్బిలిలో 1915 మేలో - తండ్రి రఘునాథరావుగారు. ఆంధ్రవిశ్వకళాపరిషత్తున M. A. పట్టభద్రత. 30 యేండ్లుగా వివిధపత్రికలలో బహువిధరచనలు వెలువరింపబడినవి. ఆంధ్రాయూనివర్శిటీ వీరి భావదీపిక తెలుగునీడలు ప్రచురించినది. వీరిఋతుసంహారమును ప్రకటితమైనది. ముద్రింపబడవలసిన కృతులు చాలనున్నవి. అందు పద్యకృతులు స్నేహయోగి, సుహృల్లేఖ, హేమంతకావ్యము, హేమంతప్రస్థానము, పూర్ణిమ, నాదాశంసి ఆమనిచినుకులు, తాంబూలద్వయము.

ఇంకను అన్నిశాఖలతో ముద్రింపవలసినవి కొల్లలుగానున్నవి. ఢిల్లీసాహిత్యఅకాడమి వీరి రెండురచనలు హిందీ సేతత్ 2సార్లు ప్రకటించినది. సార్వపథీనుడైన కవిగా ఉపన్యాసకుడుగా విమర్శకాగ్రణిగా లబ్ధప్రతిష్ఠులు. ప్రస్తుతము పశ్చిమగోదావరి భీమవరం కళాశాలలో ప్రాచ్యభాషాపీఠాధిపతిగా నున్నారు.

## 42. శ్రీ అగస్త్యరాజు లక్ష్మీవేంకటాచలపతిరావు (పుటలు 174-175)

జననము: 27-4-1912. కపిలేశ్వరపురము, కృష్ణాజిల్లా. విద్యాభ్యాసము: యస్. కే. పి. వి. వి. హిందూహైస్కూలు, బెజవాడ. ఏ. సి. కాలేజి, గుంటూరు. విద్యార్హతలు: బి. ఏ (తెలుగు) - ఆంధ్రవిశ్వవిద్యాలయము. విద్వాన్: (తెలుగు,) - సంస్కృతము విశ్వవిద్యాలయము. వృత్తి: గుంటూరు హిందూకళాశాల, ఆంధ్రశాఖీయులు.

గ్రంథరచన: సతీసులోచన- పద్యకావ్యము, సప్తపది- ఖండకావ్యము, గౌతమబుద్ధవిజయము- నాటకము, కథాకౌముది- కథలసంపుటి, విధివిలాసము- నవల, శ్రీశివస్తోత్రమాల- సంస్కృతశ్లోకములు.

## 43. శ్రీ కందుకూరి రామభద్రరావు (పుటలు 176-177)

పుట్టినతేది 31-1-1905. ఉద్యోగము: 1960 వరకు తూర్పుగోదావరిజిల్లా అమలాపురంలో పరిషత్తుహైస్కూలు ప్రధానోపాధ్యాయుడు. 1961నుండి విజయవాడ ఆలిండియా రేడియోలో Assistant Producer, Education Broadcasts. రచనలు: తరంగిణి, జయపతాక; గేయమంజరి, వేదన, నివేదనము. 'Searching Strains' (English).

## 44. శ్రీ నేలటూరి భక్తవత్సలము (పుటలు 178-182)

జననం : 8-8-1914. స్వగ్రామం నెల్లూరు. విద్య : M. A. (Telugu languge & literature), మద్రాసువిశ్వవిద్యాలయం 1948 B.L. (Alamkara & Early South Indian History), మద్రాసు విశ్వవిద్యాలయం 1946. విద్వాన్ (Telugu & Sanskrit) మద్రాసు విశ్వవిద్యాలయం, 1941. B. A. (History & Ecnomics) మద్రాసువిశ్వవిద్యాలయం 1935.

ఉద్యోగం : భారతప్రభుత్వం Epigraphy Superintendent Office లో సుమారు 6 నెలలు, 1937 - 39 మధ్య సెలవ. తెలుగు పండితుడు : వి. ఆర్. హైస్కూల్ - నెల్లూరు 1941 జూలైనుండి 43జూలై వరకు ముత్తియాల్‌పేట హైస్కూలు - మద్రాసు 1946 అగస్టు నుండి 47 జూన్ వరకు. తెలుగుట్యూటర్ : నెల్లూరు వి. ఆర్. కాలేజి – 1943 జూలైనుండి 1946 అగస్టు వరకు. తెలుగు జూనియర్ లెక్చరర్: వివేకానంద కాలేజి మద్రాసు – 1947 జూలైనుండి 52 డిసెంబరువరకు. సీనియర్ లెక్చరర్ తెలుగుశాఖా ప్రధానాచార్యత్వము మద్రాసు 1953 జనవరినుండి ఇప్పటివరకు.

రచనలు : I. హిందూదేశచరిత్ర సంగ్రహము :— Moreland to ·Chatterji లు వ్రాసిన 'A Short History India' అను గ్రంథమునకనువాదము- శ్రీ వి. వేంకటేశ్వరశాస్త్రిగారితో కలిసి వ్రాసినది. మద్రాసు విశ్వవిద్యాలయమువారు దీనిని ఉత్తమముగా నిర్ణయించి ప్రచురించి, 1952లో ఒకవేయి రూప్యములు బహూకరించిరి.

2. ఆంగ్లములో దండిదశకుమారచరిత్రకు అనువాదము,

ఉపోద్ఘాతము, వివరణము - వావిళ్ళవారి ప్రచురణ

3. శ్రీరామకృష్ణసూక్తిసుధ - ప్రజలు, పత్రికలు బాగుగా ఆదరించిన Gospel of Sri Ramakrishna అనుదానికి ఆంధ్రానువాదము - శ్రీరామకృష్ణమఠ ప్రచురణము. భారతీయ మహిళ- భారతీయమహిళలపై శ్రీవివేకానందస్వామివారి ఉపన్యాసమునకు అనువాదము. శ్రీరామకృష్ణమఠ ప్రచురణము. ప్రస్తుతము శ్రీరామకృష్ణమఠమువారు ప్రకటించు శ్రీరామకృష్ణప్రభ అను తెలుగుమాసపత్రికకు సంపాదకులుగా ఉన్నారు.

## 45. శ్రీ మురళీధర్ (పుటలు 183-184)

ఇంటిపేరు: ఆడవికొలను. వయస్సు: 30 సంవత్సరాలు. కథలు, కావ్యాలూ, నాటికలూ, వివిధపత్రికల్లో ప్రచురితాలు. పోటీల్లో బహుమతులు. ఆకాశవాణిలో నాటికలూ కవితాప్రసారం. ఇంగ్లీషునుండి తెలుగులోకీ, తెలుగునుండి యింగ్లీషులోకీ అనువాదం. ఫ్రీవెర్స్ (వచనకవిత) రచయితల (నెలవారీ) సమావేశములకు కన్వీనరు. ఇంగ్లీషులో Chain of Tean, Lyre and the Lyric Song on the lips అనే కావ్యాలు న్యూయార్కులో ప్రచురణకు సిద్ధంగా ఉన్నాయి.

ఉస్మానియా విశ్వవిద్యాలయం, లాకళాశాలలో ఉద్యోగం. జీవితానికి ఒకలక్ష్యం ఉందనీ, దాన్ని సాధించడమే జీవితమనీ నమ్మకం.

## 46. శ్రీ గాడేపల్లి కుక్కుటేశ్వరరావు (పుటలు 185-186)

జననం: 22 సెప్టెంబరు 1937. స్వగ్రామం: పెదనందిపాడు గుంటూరుజిల్లా. అష్టావధాన, ఆశుకవిత్వసభలు చాలాచేశారు. జీర్ణశిల అనే ఖండకావ్యం ప్రచురించారు. పత్రికల్లో రచనలు ప్రచురితమైనవి చాలాఉన్నవి. ఉత్సాహము, పట్టుదల గల సాహిత్యసేవకులు. M. A. పట్టభద్రులు. ప్రస్తుతం హైదరాబాదు Gov. Training College లో పనిచేస్తున్నారు.

## 47. శ్రీ అంబటిపూడి నరసింహశర్మ (పుటలు 187-189)

వీరు గుంటూరు మండలమందలి బాపట్లతాలూకాలోని యేదుబాడు అగ్రహారమున క్రి॥ శ॥ 1910 వెలనాటి బ్రాహ్మణకుటుంబమున జన్మించిరి. విజయనగర తిరుపతి సంస్కృతకళాశాలలో విద్య నభ్యసించి న్యాయవిద్యాప్రవీణ ఉభయభాషాప్రవీణ పట్టము లందిరి. కొంతకాలము పుష్పగిరిసంస్థానమున ఆస్థానపండితులుగా నుండి కావ్యనాటకములను, తర్కశాస్త్రమును విద్యార్థులకు బోధించిరి. ఇప్పుడు గుంటూరునందలి శ్రీ మాజేటిగురవయ్యహైస్కూలులో సంస్కృతాంధ్రపండితులుగా పనిచేయుచున్నారు.

వీరిరచనలు: 'సాకేతము', 'గిరికుమారి' [ముద్రితములు] 'కల్యాణరాఘవము', 'వనవాసి', 'దీనమందారశతకము' [అముద్రితములు].

## 48. శ్రీ జ్ఞానానందకవి (పుటలు 190-192)

పూర్తిపేరు: సురగాల తిమోతీ జ్ఞానానందము. జననము: 16-7-1922. జన్మస్థలము: శ్రీకాకుళముజిల్లా బొబ్బిలి తాలూకా పెద్దపెంకి గ్రామము. తలిదండ్రులు: శ్రీసురగాల పాపమాంబ ఎల్లయ్యగార్లు. విద్య: భీమునిపట్టణము, కాకినాడలలో. వృత్తి: ఆంధ్రపండితులు, మెక్లారిన్ హైస్కూలు కాకినాడ. కవిసామ్రాట్ శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారి చే. పండితసభామధ్యమున కవికోకిల, కవితావిశారద బిరుదములు గాంచిన సుకవి. తరంగమాల, గాంధీ (అమరగీత) పాంచజన్యము, దేశబంధు, ప్రభంజనము, పర్జన్యము, మొ॥ కృతుల నాధునికమహాంధ్ర నాయకుల కంకితము గావించినారు. గోల్కొండ, ఆమ్రపాలి, ప్రభాతము మున్నగునవి అచ్చునకు సిద్ధముగానున్నవి.

## 49. శ్రీ పాతూరి రాధాకృష్ణమూర్తి (పుటలు 193-194)

జననము: (1911) విరోధికృత్ సంవత్సరము అభినవ జయదేవ కీ॥ శే॥ చల్లా పిచ్చయ్యశాస్త్రిగారి శిష్యుడు, మేనల్లుడును. రచనలు: శివానుభూతి, శివమహిమానుభూతి, మృత్యుంజయము, ప్రబోధము మొ॥. సహజకవి యను బిరుదము గలదు.

## 50. శ్రీ వఝ్ఝుల కాళిదాసు (పుటలు 195-196)

జననము : 13-5-1913. సాహిత్యకృషి : ముద్రితములు: భిక్షావతి (పద్యకావ్యము) ఆంధ్ర, ఉత్కళ, ఉస్మానియా విశ్వవిద్యాలయముల వారిచే పఠనీయముగా నియమితమైనది. ఆంధ్రమహావిష్ణువు (ద్విపదకావ్యము) ఆంధ్రజాతిమూలపురుషుని గాథ. ఆంధ్రపత్రిక స్వర్ణోత్సవ సందర్భమున బహూకృతి వడసినది. పంటవలతి (యక్షగాననాటకము) భారతప్రభుత్వసమాచార- ప్రసారామాత్యశాఖ గేయ-నాటకవిభాగము దేశభాషలన్నిటిలోను నడిపిన పోటీలో తెలుగులో అగ్రబహుమతి గణించుకొన్నది. అముద్రితములు: ఖండకావ్యములు: మహతి, వైజయంతి, మధువీధి. ప్రబంధములు: శాలివాహనసంభవము, శాంతిజ్యోతి. నాటకములు: వెలి, ఆమెకోసం, శాంతిశ్రీ, అపశ్రుతులు. నవలలు: శివధనువు, జలపాతము.

## 51. శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి (పుటలు 197-202)

జననం : 1898 విలంబి వైశాఖము- మసకపల్లి - దాక్షారామము దగ్గర. విద్వాన్ బిరుదము. ఉద్యోగం: ఆంధ్ర విశ్వవిద్యాలయ కళాశాల తెలుగు పండితులు. వ్యాకరణాచార్యులుగా సాహిత్యోపాధ్యాయులుగా చాలాగొప్ప కీర్తిప్రతిష్ఠలు కలవారు. ఆంధ్రదేశంలో అనేకులు వీరికి శిష్యులమని చెప్పుకొనడానికి గర్విస్తుంటారు. చక్కని చమత్కార సహితమైన వాక్కు. అపారప్రతిభకలమహా విద్వాంసులు వీరు.

రచనలు: న్యాయదర్శనము, (అనువాదము) కలభాషిణి, (Prose) సారస్వతవ్యాసములు, సుమారు 20 ప్రసిద్ధ మాసపత్రికలలో.

## 52. శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి (పుటలు 203)

జననం : 4 ఫిబ్రవరి 1910. ప్రచురించిన కావ్యములు : తపోవనము, కావ్యగంగ, అమృతాభిషేకము, కొన్ని గద్య పద్యరచనలు భారతి మొ॥ పత్రికలలో. మధురకవి బిరుదము. గీతావాణిసహాయసంపాదకులు. అనంతపురంజిల్లా పరిషత్తు క్రింది ఉన్నతపాఠశాలలో తెలుగు పండితులు.

## 53. శ్రీ రంగబాబు (పుట 204)

జననం: 6-4-1937. పేరు: చంద్ర రంగయ్య. ఊరు: కమ్మవారివాలెం (P. O.) నర్సరావుపేట తా॥ గుంటూరు జిల్లా. రచనలు : 'ఆంధ్రప్రభ', 'కృష్ణపత్రిక', 'ప్రజావాణి', 'నవ్యప్రభ', 'జనహిత', 'యువజన', 'మనోప్రపంచం', 'శ్రీసరస్వతి'. మొ॥ పత్రికల్లో కథానికలు, పాటలు, గేయాలు ప్రచురితం 'జ్వాలాతోరణం' అముద్రిత గేయసంపుటి. అభిరుచులు- నటన, పుస్తకపఠన, కవిత్వం, సంగీతం.

## 54. శ్రీ నాయని సుబ్బారావు (పుటలు 205-213)

జననం: 1899 కృతులు: సౌభద్రుని ప్రణయయాత్ర, ఫలశ్రుతి, మాతృగీతములు. ఉద్యోగం : ఆలిండియా రేడియో, హైదరాబాదు. ఉన్నతభావన, హృదయాన్ని సూటిగా తాకే శబ్దనిర్మాణము, గల ఉజ్జ్వలకవిత ఈయన సొమ్ము. జీవితాన్ని కవిత్వంగా మలుచుకొన్న ఒక విశిష్ట వ్యక్తి.

## 55. శ్రీ జి. వి. కృష్ణారావు (పుటలు 214-224)

జననం: 15 నవంబరు 1914. డిగ్రీలు. B. A. Phd. రచనలు: చైత్రరథం, (కథలసంపుటి) ఆదర్శశిఖరాలు, (ఏకాంకికలసంపుటి) కావ్యజగత్తు, (సాహిత్యతత్త్వ సమీక్ష) కీలుబొమ్మలు, (నవల) జఘనసుందరి, (కథలు) స్టడీస్ ఇన్ కళాపూర్ణోదయం, విగ్రహవ్యావర్తిని, దార్శనిక(గ్రంథము) జేగంటలు ప్రథమ, ద్వితీయ భాగాలు (దార్శనికం) ఆదర్శరాజ్యము (అనువాదము) ఇటీవలి వరకు తెనాలికళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పని చేశారు.

## 56. శ్రీమాన్ నారాయణం రామానుజాచార్యులు (పుటలు 225)

జననము: 23-6-1897. బిరుదము: విద్వత్కవిశేఖర.

తల్లి: లక్ష్మీనరసమ్మగారు, తండ్రి: శ్రీరామ దేశికులవారు, అభిజనము: ఉల్లిపాలెము. విద్యాభ్యాసము: వేదము బ్రహ్మశ్రీ రాయప్రోలు పున్నావధానులుగారివద్ద; సంస్కృతము: బ్రహ్మశ్రీ కోలాచల నరసింహశాస్త్రి గారివద్ద; ఆయుర్వేదము: శ్రీమాన్ నారాయణ శేషాచార్యులుగారివద్ద; శ్రీవైఖానసాగమము: శ్రీమాన్ దేవయజనం వేంకటరామాచార్యులవారివద్ద. సంస్కృత రచనలు: శ్రీసూత్రకారప్రపత్తిః శ్రీ విఖనసమతాచార్య ప్రభావప్రశంసనము; మునిరాజస్తుతిః: సాంప్రదాయికాచార్యస్తోత్రకావ్యము; శరణాగతిః: లక్ష్మీనారాయణ విశిష్టగుణవర్ణనాత్మకమగు స్తుతికావ్యము; రామానందలహరీ: శ్రీరామచంద్ర వైభవవర్ణనాత్మక మగు స్తుతి కావ్యము; ధన్వంతరిసుప్రభాతమ్. తెలుగు రచనలు: రాఘవాభ్యుదయము; రామకథాత్మక మగు చంపూప్రబంధము; శ్రీనివాసశతకము: క్షీరాబ్ధి కుమారీశతకము: (లక్ష్మీస్తుతి); చన్నకేశవశతకము: శ్రీకృష్ణశతకము; సుచంద్రీయము: చంద్రికాపరిణయాత్మకమగు 7 అంకముల నాటకము; విజయ బభ్రువాహనము: బభ్రువాహనచరితము నాటకము; మాయావతి: నాటకము.

## 57. శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులు (పుటలు 226-228)

శ్రీవైష్ణవులు శ్రీవత్స సగోత్రులు అభిజనము ముక్తిపల్లి అగ్రహారము జననము : ప్రభవ మార్గశీర్ష బహుళతృతీయ; తల్లి రామానుజమ్మగారు; తండ్రి వేంకటప్పలాచార్యులు గారు. విద్యాభ్యాసము: 'సాహిత్యరత్నాకర' సాహిత్యము శ్రీ ఉ.వే. శ్రీమాన్ సముద్రాల లక్ష్మణాచార్యులవారివద్ద (పెద్దవరం అగ్రహారం); న్యాయము, సాహిత్యము, దివ్య ప్రబంధము, పిఠాపురాస్థాన విద్వాంసులు శ్రీ ఉ. వే. శ్రీమత్తిరుమల గుదిమెళ్ళ వేంకటరంగాచార్యస్వామి, అంతర్వేది నరసింహాచార్యస్వామి వారలయొద్ద, (పిఠాపురము) సాహిత్యశాస్త్రము : శ్రీ ఉ. వే.ప్ర. శ్రీమాన్ వేదాల తిరువెంగళాచార్యులవారివద్ద, బ్రహ్మశ్రీ ముళ్ళపూడి నారాయణశాస్త్రిగారివద్ద; 'శాస్త్రసాహిత్యమహోదధి', భాషాప్రవీణ: శ్రీనారసింహసంస్కృతకళాశాల, చిట్టిగూడూరు. నిత్యాభ్యాసము: సంస్కృతాంధ్రకవిత్వము-సంస్కృతాంధ్ర పాఠప్రవచనము. సభ్యత్వము : సాహితీసమితి సహాయ కార్యదర్శిత్వము. సాహితీ రచనలు, సంస్కృతము : చన్నకేశవస్తుతిమాలా : శ్రీ చన్నకేశవ సుప్రభాతాదికము; ఏకలవ్యమ్: సంస్కృతనాటిక (ఆకాశవాణీ ప్రసారితము) విజయవాడ; అనూరవమ్: సంస్కృతనాటిక; సౌపర్ణమ్ : సంస్కృతనాటిక; సర్పసత్రమ్ : సంస్కృతానువాదము ('కవిసమ్రాట్' నోరివారి సర్పసత్రమునకు); చాటూక్తి మంజరీ: వివిధగాథాసందోహము. తెలుగు : కవితోద్యానము : ఖండకావ్యసంపుటి; కావ్యవీథి : ఖండకృతి త్రితయము; రామానందలహరి : ఆంధ్రానువాదము '(విద్వత్కవిశేఖర' నారాయణం రామానుజాచార్యకృత) ఋతుసంహారము : కాళిదాసకృతి కనుకృతి; సాహిత్యవ్యాసములు : సంస్కృతాంధ్రకవితాసంసేవనాత్మకములు; త్రిపుటి: కథానికలు; ఉషోరేఖలు: శ్రీవేంకటేశ్వర సుప్రభాతస్తుతికావ్యము.

## 58. శ్రీ కె. జోగయ్యశర్మ (పుటలు 229-234)

జననం: **15-1-1915**; విద్యాభ్యాసము: విజయనగరం మహారాజావారి సంస్కృతకళాశాలలో; వృత్తి: ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో పబ్లికేషన్సు అసిస్టెంటు. అభిరుచి: ఎవరిమనసులు నొప్పి పడనిరీతిలో సాహిత్యసేవ; రచనలు: ముద్రితములు: (1) కుమారవిజయము (2) శ్రీనాథకథావళి (3) ప్రియదర్శిక (4) బాలచంద్రుడు (5) నలవిలాసము (6) ఇందిరామందిరసందర్శనము. స్వభావము: ఎవ్వరితో నెప్పట్టున చిక్కుకు చేసాపకుండుట. భారతి మున్నగు పత్రికలలోను ఆంధ్రవిజ్ఞానసర్వస్వాది సంపుటములకును వ్రాసియిచ్చిన వ్యాసములు చాలగలవు. అముద్రితములు: (1) రఘునాథుడు (2) విజయరాఘవుడు (3) మణిమేఖల.

## 59. శ్రీ నారాయణం శ్రీరామాచార్యులు (పుట 235)

జననం: **1911**; విరోధికృత్ వైశాఖ శుద్ధ తృతీయా గురువారము. సంస్కృతాంధ్రవిద్వాంసులు; శ్రీహయగ్రీవ పీఠాధ్యక్షులు; రచన: (సంస్కృతము) చాటూక్తిమంజరీ.

## 60. శ్రీ షేక్ దావూద్ (పుటలు 236-240)

జననం: కడపజిల్లా చిట్వేలి గ్రామము. ప్రాయము 40 ఏండ్లు. విద్యాభ్యాసము: నెల్లూరునందు. నెల్లూరు ట్రంక్ రోడ్డునందొక కిల్లీబంకు పెట్టుకొని దానితో నుదరపోషణ గావించుకొనుచు హిందీ, తెలుఁగు, సంస్కృతాధ్యయనము సాగించిరి. మదరాసువిశ్వవిద్యాలయ విద్వాన్బిరుదము తెలుఁగునందు 1939లో సాధించిరి. నంద్యాల మ్యునిసిపల్ హైస్కూలునందు 1940 మొదలు 1949వఱకు తెలుఁగు పండితులై గడిపిరి. 1947వ సంవత్సరము హిందీపట్ట పరీక్షయందు కృతార్థులై 1919 మొదలు 60వఱకు కర్నూలు ఉస్మానియాకళాశాలయందు హిందీబోధించుచుండి 1960 మొదలచటనే తెనుఁగును బోధించుచున్నారు.

కావ్యసంతానము, సంతానము దండి. హిందీ తెనుఁగు భాషలయందు గద్యపద్యరచనల నొనర్చు నభలాటము కలదు. గ్రాంథికవాది. భాషించినను వ్రాసినను గ్రాంథికమే. వేదము వేంకటరాయశాస్త్రులవారి ప్రశిష్యులు. గుడివాడ నలందా వారిచేతను, నెల్లూరు తిక్కవరపు రామిరెడ్డిగారిచేతను, శ్రీ బెజవాడ రామరెడ్డిగారిచేతను, కర్నూలునందు కవిమిత్రులచేతను, నిధులతో సమ్మానింపఁబడిరి. ముద్రణమును పొందిన గ్రంథములు: (1) దాసీపన్నా (2) సంస్కారప్రణయము (3) సూఫీ సూక్తులు. (4) క్రీడాపర్థీశ్వరము (5) సాయీశతకము. అముద్రిత కావ్యములు: (1) సాయీచరిత్ర (పద్యకావ్యము) (2) అశ్రుమాల (జయశంకరప్రసాద్ కృతికి తెనుఁగు) (3) చంద్రవదన - మొహియూన్ (కదిరి నారసింహుని మందిరముకడ ప్రత్యక్షముగ జరిగిన ప్రణయులబలిగాథ - చరిత్ర) వచనమున అభినవతిక్కనగారి కవితాసమీక్ష, దస్తగీర్ స్వామి దివ్యచరిత్ర, ఆదర్శము (నవల) చరిత్ర ఇంక ననేకము.

## 61. శ్రీ రాజనాల రామసుబ్బయ్యశాస్త్రి (పుటలు 241-242)

జననం: 22-10-1912, గుంటూరు హిందూకాలేజి హైస్కూలులో తెలుగుపండితులు. దృఢమైన కార్యదీక్ష, వాఙ్మయవీక్షగల సరస్వతీసేవకులు.

## 62. శ్రీ బి. యేలియా (పుటలు 243-246)

జననము: 18-5-1921. వ్రాసినగ్రంథములు: 1 హనుమచ్చరిత్రము, 2. బుద్ధ జాతకకథలు. 'స్రవంతి' పత్రికలో 'సుజాత' యను పద్యరచనము ప్రచురింపబడినది. వీరిపుడు నర్సరావుపేట మునిసిపల్ హైయ్యర్ సెకండరీస్కూలులో సీనియర్ తెలుగుపండిట్‌గా పనిచేయుచున్నారు.

## 63. శ్రీ వసంతరావు వేంకటరావు (పుటలు 247-251)

జననం: 1909. ఉద్యోగం: ప్రిన్సిపాల్, మహారాజా కాలేజి, విజయనగరం. ఆంధ్రవిశ్వవిద్యాలయం ఫిజిక్సు బి. యస్‌సి. కాశీహిందూవిశ్వవిద్యాలయం ఫిజిక్సు యమ్. యస్‌సి. (Special Subject Positive Rays) సంపాదించారు. ఆంధ్రవిశ్వవిద్యాలయంలో 1935లో రిసెర్చివిద్యార్థిగా 6 నెలలు ఉన్నారు. మద్రాసు తెలుగు భాషాసమితిలో తెలుగువిజ్ఞానసర్వస్వము ద్వితీయ సంపుటము. ఫిజిక్స్, కెమిస్ట్రీలతో డి దానికి సంధాతగా ఉండి మరిద్దరితో కలసి ఆసంపుటానికి సంపాదకులైనారు. 1933 నుండి సైన్సును ఆంగ్లంలోనూ, ప్రధానంగా తెలుగులోనూ ప్రజాబాహుళ్యానికి అందించటంలో తీవ్రకృషి చేస్తున్నారు. సుమారు 80 ఆంగ్ల తెనుగుపత్రికలలో 280కి పైగా వివిధరచనలు చేశారు. ఎస్ట్రానమీ, ఎస్ట్రోఫిజిక్సు, ఫిజిక్సు, కెమిస్ట్రీ, మెటాఫిజిక్సు మొ|| వానిని గూర్చిన శాస్త్రీయాభిప్రాయాలను వ్యాస, సంభాషణా, గేయ, పద్య, నాటికారూపాలలో అందించారు.

ముద్రితరచనలు: ఆధునికవిజ్ఞానము, విజ్ఞానచర్య, జగత్తు-జీవము, ద్రవ్యము-శక్తి, మారేలోకము, విశ్వరహస్యము, (సచిత్రము) చంద్రునికథ, సూర్యుడు (సచిత్రము) మానవమానవి, ఎలక్ట్రాను (సచిత్రము) గాలిగ్రహాలు (సచిత్రము) విజ్ఞానస్రవంతి, విజ్ఞానవికాసం, విజ్ఞానసీమలు, విజ్ఞానస్ఫులింగాలు, అనంతప్రకృతి విజ్ఞానం, భౌతికాధ్యాత్మికవిజ్ఞానాలు ఇంకా పదికి పైగా గ్రంథాలు ముద్రణకు సిద్ధంగా ఉన్నవి. అందులో ప్రధానమైనవి: పరమాణుచరిత్ర (100 చిత్రములతో), విశ్వము (70 చిత్రములతో), విద్యుద్విలాసము, భౌతికాధ్యాత్మిక విజ్ఞానాలు, ఆకాశవక్ర

త్వము - గురుత్వాకర్షణము. ఇంకా విశ్వవిద్యాలయకళాశాలావిద్యార్థులకు చాలాపాఠ్యగ్రంథాలు ప్రకటించారు. సైన్సును తెలుగుప్రజలకు చక్కగా అందించినందుకుగాను దువ్వూరిరామిరెడ్డి సైన్సు బహుమతి 1953లో పొందారు. కలకత్తా ఇండియన్ ఫిజికల్‌సొసైటీ సభ్యులు. తెలుగు విజ్ఞానసర్వస్వం ప్లానింగ్ కమిటీ సభ్యులు. సాహిత్యసమితి సభ్యులు, విజయనగరంరోటరీక్లబ్ పూర్వాధ్యక్షులు. ఆంధ్రవిశ్వవిద్యాలయంసెనేట్ సభ్యులు. ఆంధ్రవిశ్వవిద్యాలయం ఎకడమిక్ కౌన్సిల్ సభ్యులు.

## 64. శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య

(పుటలు 252-253)

జననం : 1928, ఉస్మానియావిశ్వవిద్యాలయ పట్టభద్రులు. మద్రాసు 'మాతృభూమి' వారపత్రిక సహాయ సంపాదకులుగాను, తెనాలి 'జైహింద్' వారపత్రికకు ప్రధానసంపాదకులుగాను ఇదివరలో పనిచేశారు. రవీంద్రునిరచనలు కొన్నింటిని అనువదించారు. 'కచునివీడ్కోలు' 'గాంధారి' 'తపతి' 'శరణాగతి' మున్నగునవి వీరి పద్యకావ్యాలు. బాలసాహిత్యంలో కావ్యనిర్మాణానికి మార్గదర్శకు డైనాడని డా|| గిడుగు సీతాపతిగారి ప్రశంస లందుకొన్నారు. గంగావతరణము, క్షీరసాగరమథనము, శమంతకమణి, మున్నగునవి వీరి బాలకావ్యాలు. ఆలిండియా రేడియో హైదరాబాదులోను, ఆంధ్రపత్రిక, ప్రభ, భారతులలోను వీరిరచనలు చూడవచ్చును. ప్రస్తుతం వీరు ప్రభుత్వ ఉన్నతపాఠశాలలో (సికింద్రాబాదులో) ప్రధానాంధ్రోపాధ్యాయులుగా నున్నారు.

## 65. శ్రీ దివాకర్ల రామమూర్తి

(పుటలు 254-257)

జననం: ఆనందనామసంవత్సర భాద్రపద శుద్ధ త్రయోదశీ బుధవారము 2-9-1914 పశ్చిమగోదావరీమండలములోని జల్లిసీమలోని 'యండగండి'లో జన్మము; విద్యావ్యాసంగము: ఆంధ్రపరిషత్ కళాశాలలో వాల్తేరులో బి. ఏ. (గణితము) బి. ఏ. (తెనుగుసంస్కృతములు) 1938 మదరాసు యూనివర్శిటీ విద్వాన్ 1941 నాగపురము యూనివర్శిటీ ఎం. ఏ. సంస్కృతము 1945; ఉద్యోగము: 1939నుండి నేటివఱకు విశాఖపట్టణమునందలి మిసెస్ ఏ. వి. యన్. కళాశాలాప్రాచ్యభాషాశాఖలో నుద్యోగము. 1950నుండి శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు ఎం. ఏ. ఆనర్సు పి. హెచ్. డి. హైదరాబాదు ఉస్మానియావిశ్వవిద్యాలయమున కరిగినప్పటినుండి ప్రాచ్యభాషాశాఖాధ్యక్షులు. ఆంధ్రసంస్కృతోపన్యాసకులు; సంస్కృతము: గీతివాద్యము (విమర్శవ్యాసము); రచనలు: పద్యములు ఖండకావ్యములనేకములు శ్రీ విశ్వనాథకంఠాభరణము శ్రీ తెన్నేటి విశ్వనాథముగారికి కృతియొసగబడినది అజ్ఞాతకర్మ, పద్యకావ్యము, కథలు గాథలు; వచనము: మనశాస్త్రజ్ఞులు ఆంధ్రశౌర్యము (నవల) వైజ్ఞానికులు (నవల) రాయలసీమ (నవల) విమర్శవ్యాసములు; నాటకము: అమృతోదయము (ఆంధ్రరాష్ట్రావతరణము) స్వాతంత్ర్యరథము; తెలుగులోకము; ఒండు రెండు తక్క మిగిలిన వన్నియు అముద్రితములు; జననీజనకులు: వేంకటలక్ష్మీ సుందరరామయ్యలు; సోదరులు: డాక్టర్ శ్రీ దివాకర్ల వేంకటావధాని; పినతండ్రి: శ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రి (తిరుపతి వేంకటకవులలో నొకరు).

## 66. శ్రీ అన్నాప్రగడ శ్రీరామమూర్తి

(పుటలు 258-260)

జననము: 27-5-1932. రచనలు: నవోదయము, ఆమె, సంధ్యాసుందరి. లా డిగ్రీపొంది అడ్వకేటుగా హైదరాబాదులో ఉన్నారు. ఉజ్జ్వలభవిష్యత్తుగల యువకవులు.

## 67. శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు

(పుటలు 261-262)

జననము: 25-12-1896; గ్రామము: పెద్దవరము; తండ్రి నరసింహాచార్యులు, తల్లి రంగనాయకమ్మ. విద్యాభ్యాసము: విజయనగరములో, న్యాయశిరోమణి (మద్రాసు యూనివర్సిటీ); రచనలు: సంస్కృతము: చండీవిలాసఖండనము, అపూర్వార్థభాష్యము, శ్రీభాష్యపరివస్య. తెలుగు : ముద్రితములు : ఆంధ్రధ్వన్యాలోకము, కావ్యాలంకార

సూత్రవృత్తి, శైష్యోపాధ్యాయిక. అముద్రితములు : చోడనిజము, చతుర్మతతత్త్వము, రామకృష్ణగోష్టి, తాపస వత్సరాజము, తెలుగుపలుకు మొలక, తెలుగులతీరు, గోపికా వల్లభశతకము, వివిధవ్యాసములు. అష్టావధానములు చేసి యుండిరి. హైదరాబాద్ ఆల్వాల్ C.T.S. కాలేజిలో పండితులుగా నున్నారు. ఆంధ్రదేశములో సువిఖ్యాతులైన విద్వద్వర్యులు. శాస్త్రీయవిషయాలలో వీరిమాట చాలా ప్రామాణికం.

## 68. శ్రీ శనగన నరసింహస్వామి

(పుటలు 263-265)

జననం: **24-12-1932.** అభినం: పాములపఱ్ఱు భీమవరం తాలూకా పశ్చిమగోదావరిజిల్లా: విద్యాభ్యాసం: ఎం. ఏ. సుప్రసిద్ధసాహిత్యాచార్యులు శ్రీదిగుమర్తి సీతారామస్వామి, నండూరి రామకృష్ణమాచార్య, దర్భా సర్వేశ్వరశాస్త్రుల వారిపాదసాన్నిధ్యంలోసాహిత్యవ్యాసంగం. బాల్యంనుండీ కవితావ్యవసాయం. ఆంధ్రాంగ్లసంస్కృతసాహిత్యాలతో సమీచీనపరిచయం. గద్యపద్యరచనలలో సిద్ధహస్తత్వం. రచనంలో ఆంధ్రగీర్వాణపదసమ్యక్ సమ్మేళనం దర్శనీయం. రామాయణపారాయణంవలన కలిగిన ఆనందానుభూతిని వీరు "రామకోకిలము" అను కావ్యంలో ప్రదర్శించినారు. "పాంథగీత", "భ్రమరగీత" వీరి ఇతరఖండకావ్యాలు. "ఋతుసంహారము", "ఆశ్చర్యచూడామణి" వీరి అనువాదగ్రంథాలు. ప్రస్తుతం గుణదల, ఆంధ్రలయోలాకళాశాల, ఆంధ్రశాఖలో అధ్యాపకవ్యాపృతి.

## 69. శ్రీ పిల్లలమఱ్ఱి మార్కండేయశాస్త్రి

(పుటలు 266-271)

జననం: రాక్షసనామసంవత్సర ఫాల్గుణ శుద్ధ ప్రతిపత్తు (**4-3-1916**) అభిజనము: కృష్ణాజిలా గురివిందగుంట అగ్రహారము తల్లిదండ్రులు: మహాల వేంకటసుబ్బయ్య గారలు; సభ్యాభివర్ధకనిలయమునందు "తర్క వేదాంత సార్వభౌమ బిరుదాంచితు లగు బ్రహ్మశ్రీ మండలీక వేంకటశాస్త్రులుగారియొద్ద తర్కశాస్త్రము చదివి పిఠాపురసంస్థానమున తర్కశాస్త్రపరీక్షలో నుత్తీర్ణులయిరి. బ్రహ్మశ్రీ వేమూరి రామబ్రహ్మశాస్త్రులుగారి శుశ్రూషచేసి వేదాన్తభాష్యములు శాన్తిచేసిరి. తిరుపతిలో శ్రీ వేంకటేశ్వరకళాశాలయందు పూర్వోత్తరమీమాంసాపారంగతులయిన బ్రహ్మశ్రీ టి. ఏ. వేంకటేశ్వర దీక్షితులు (సంస్కృతవిశ్వపరిషత్సహాయ కార్యదర్శకులు) వారి పాదారవిందములు సేవించి పూర్వోత్తరమీమాంసా ...ము 1937 న మదరాసువిశ్వవిద్యాలయమునందు "అద్వైతవేదాంత" శిరోమణిపరీక్షయందు త్తీర్ణులయిరి. సంస్కృత భాషాభివర్ధకనిలయమును స్థాపించి పెక్కండ్రుశిష్యులకు న్యాయవేదాంతమీమాంసాశాస్త్రములు బోధించిరి. 1939సం. నుండి పశ్చిమగోదావరి మండలమున స్థానికోన్నతపాఠశాలలయందు సంస్కృత భాషాధ్యాపకులుగా నుండి సంస్కృతభాషాప్రచారము చేయుచుండిరి.

అపరశంకరావతారమయిన బ్రహ్మశ్రీ బెల్లంకొండ రామారావుగారిచే రచింపబడిన దశశ్లోకవ్యాఖ్యాన మగు "సిద్ధాన్తసింధువునకు 'కల్లోల' మను ననువాద మొనర్చి వారి యాధ్యాత్మికానుభవమును తేటతెల్లము చేసిరి. **1951** సంవత్సరము మద్రాసువిశ్వవిద్యాలయమున 'విద్వాన్' బిరుదము సంపాదించిరి. ఇపుడు తణుకునగరమున స్థానికోన్నతపాఠశాలలో సంస్కృతభాషాధ్యాపకులుగానున్నారు.

## 70. శ్రీ మంచికంటి వేంకటేశ్వరరావు

(పుటలు 272-275)

పుట్టిన తేది : 1908. రచనలు: రుక్మిణీసందేశము, వివాహవిచ్ఛేదము, శ్రీకృష్ణ మనశ్శాంతము, సావిత్రి, ప్రేమలీల. మొదలగునాటకము లన్నియు నాటకరంగస్థలముల ప్రదర్శింపబడినవి. ముద్రితములైనవి. వేంకటేశ్వరమహాత్మ్యము, జీవసమాధి, సతీసుగుణ, మీరాబాయి నాటకములు పలువురచే ప్రదర్శింపబడినవేగాని అముద్రితములు. నేతాజీ భారతము, పృథ్వీరాజు, రుద్రమదేవి, పురూరవ, ద్వ్యర్థి, నటీనటులోకములనెడి పద్యకావ్యములు. ముద్రితములు.

## 71. శ్రీ అన్నంరాజు సత్యనారాయణరావు

(పుటలు 276-277)

వీరు నారాయణస్తవం (శతకం) వ్రాసి, అటు

సరస్వతీ, ఇటు స్వామిని అర్చించారు. ఈశతకాన్ని చవిచూచి 'కవిశేఖర' శ్రీ పల్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులుగారు వీరిని దీవించారు. వీరి యితరరచనలు ఆంధ్రశౌర్యం, రైతు విజయం, విరాళం- ఇవి నాటకాలు. విరహం, కిరణాలు ఖండకావ్యాలు. భాషావిపంచి, పూలపాలకి బాలవాఙ్మయరచనలు, కన్యాకుమారి సాంఘికనవల, ఇవి గాక చాలా గద్య, పద్య, గేయరచనలు చేశారు. గ్రంథాలయోద్యమంలో పాల్గొని సేవజేశారు. 'స్వశక్తి' అనే వ్రాతమాసపత్రికను నడిపారు కొంతకాలం, రంగస్థలానుభవం కూడా ఉంది. రేడియోనాటికల్లో పాల్గొన్నారు. జన్మస్థానం గుంటూరుజిల్లా నండూరు. జననం 1916 అక్టోబరు 26వ తేదీ. గుంటూరు హిందూకాలేజిహైస్కూలులో

యులు.

## 72. శ్రీ తుమ్మల సీతారామమూర్తి

(పుటలు 278-281)

జననము : **25-12-1901.** స్వగ్రామం రేపల్లెతాలూకా కావూరు; వీరు అభినవతిక్కన బిరుదాంచితులు. వీరిది మిక్కిలి సంప్రదాయసిద్ధమైన భావ. అహింసాప్రబోధాత్మక మైన ప్రసన్నలలితభావములను, గాంధేయసిద్ధాంతాలను ప్రజలకందించారు. వీరి రాష్ట్రగానం ఆంధ్రావనిలో చైతన్యస్ఫూర్తి కలిగించింది. బాపూజీ ఆత్మకథను వీరు తెలుగుకవితలో అందించారు వినయసౌజన్యసంపన్నులైన సహృదయ శ్రీవిజ్ఞానిశేఖరులు. రచనలు : పఱిగపంట, శబరి, ఆత్మార్పణము, ఉదయగానము, ధర్మజ్యోతి మొదలైనవి.

## 73. శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

(పుటలు 282-286)

జననము : **1894** సం. జన్మస్థానము : గుంటూరుమండలములోని బొమ్మరాజుపల్లె; చదువు : సంస్కృతాంధ్రములలో చక్కని పాండితి; టైటిల్ : 'విద్వాన్', బిరుదు : 'విమర్శకాగ్రేసర' (ఆంధ్రసారస్వతపరిషత్తు); రచించిన గ్రంథములు : 21. అందులోకొన్ని- ప్రణయకుసుమము (ఖండకావ్యము), మేఘదూత (స్వతంత్రానువాదము), సారంగధరచరిత్ర వ్యాఖ్య (జితకాశి), సాహిత్యసమీక్ష (నిఘంటుశబ్దార్థపరిశీలనము), చాటుపద్యరత్నాకరము (ప్రాచీనచాటుసంకలనము). వీరు ఆంధ్రదేశంలో పరిశోధనాత్మకమైన కృషిచేసి అనేక ప్రాచీనకవుల రచనలను అందించారు. సుప్రసిద్ధులైన విమర్శకులు; విద్వత్కవులు, నివాసం నెల్లూరు.

## 74. శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి

(పుటలు 287-289)

జన 1897 ఫిబ్రవరి 10. చాలా ప్రామాణికత వహించిన సుప్రసిద్ధవిద్వాంసులు కావ్యాలంకారసంగ్రహంద్వారా అలంకారశాస్త్రస్వరూపాన్ని సులభరీతిలో అందించారు. సంస్కృతవ్యాకరణాన్ని తత్సమచంద్రికారూపంలో రచించి తెలుగుభాషకు ఎనలేని సేవజేశారు. రచనలు: జాతకకథా గుచ్ఛము (1, 2 భాగములు) ద్వంద్వయుద్ధము, కీరసందేశము, ఖడ్గతిక్కన. వివేకానందము వాసవదత్త, పువ్వులతోట, కావ్యమంజరి, నడుమంత్రపుసిరి, గోవర్ధనాచార్య సప్తశతీసారము, అమృతకణములు, రేణుకవిజయము, ఆంధ్రకళావిలాసము, ఆంధ్యకావ్యకథలు, వ్యాసపారిజాతము, కావ్యమాల, కథాకదంబము, మొదలైన తెలుగుగ్రంథాలు. పూర్ణపాత్రం, త్రికం, రామదాసం, మొదలైనవి సంస్కృతగ్రంథాలు. అముద్రితములు: జాతకథాగుచ్ఛము (3వ భాగము) స్మరగీత, కాదంబరీకల్యాణము, వ్యాకోశము, వివేకానందము. (సంస్కృతము).

## 75. శ్రీ కొలకలూరి (పుటలు 290-292)

పూర్తిపేరు కొలకలూరి ఇనాక్. ఆంధ్రాయూనివర్శిటీ తెనుగు ఆనర్సు పట్టభద్రులు. కథారచనలో సిద్ధహస్తులు. కథానికపోటీలలో నవలలపోటీలలో బహుమతిపొందినవారు. అనేకగేయాలు, ఇతరరచనలు పత్రికాముఖమున వీరు వెలువరించారు. ప్రస్తుతం చిత్తూరు ప్రభుత్వకళాశాలలో ఆంధ్రోపన్యాసకులు.

## 76. శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి

(పుటలు 293-301)

గుంటూరుజిల్లా సత్తెనపల్లితాలూకా 'మాదల' గ్రామ

ములో ఆరాధ్యబ్రాహ్మణవంశమున ది 8-8-1908 న జన్మించిరి. వీరితండ్రి మల్లికార్జునశాస్త్రిగారు. విద్వత్కవులు వీరి చిన్నతనమునందేపోయిరి. వారు సాగరేశ్వర మహాత్మ్యము' అను పద్యకావ్యమును 'శాకుంతలము' సాంబ లక్ష్మీ జాపరిణయము' మొదలగు యక్షగానములను రచించిరి' వీరి అభిమానవిద్య: ఆనందవర్ధనుని ధ్వనికారులధ్వనిసిద్ధాంతము మహాకావ్యరచనము, సంస్కృత కావ్యానువాదము. సంస్కృతాంధ్రాంగ్లభాషల చక్కగచదివిరి. కాని డిగ్రీ యొందులోను లేదు. వీరు రచించిన పద్యకావ్యములు: మల్లికార్జునపండితవిజయము స్వతంత్రము, వాసవదత్త (సుబంధరచన కనువాదము) కామాక్షీపంచశతి(మూకపంచశతి'కి అనుకరణము, వేణుగోపాలశతకము (స్వతంత్రము) ఆంధ్రకేసరి (స్వతంత్రము - ప్రథమభాగము), ముద్రితములు; శ్రీ గిరి మల్లికార్జునశతకము (స్వతంత్రము) శివపంచస్తవి (బిల్హణాదికృతుల ననుకరణము) స్వర్ణధార ఖండకావ్యము, మార్కండేయము ప్రస్తుతమున్నవి అముద్రితములు.

## 77. శ్రీ జంధ్యాల మహతీశంకర్

(పుటలు 302-305)

వీరు యువకులు సారస్వతాసక్తిగలవారు. రెండుసంవత్సరాలనుంచీ గుంటూరు ఆంధ్రక్రైస్తవకళాశాలలో అధ్యాపకులు. 'సాహిత్య సమాలోచనము'- ఆంధ్రమహాభారతావతరణము, విశ్వకవి రవీంద్రుడు, నవ్యకావ్యములు, మొదలైనవి అనేక సాహిత్యవ్యాసాలూ, ప్రపంచమంతా నాటకరంగం, మహాకవి జాన్ కీట్సు, మున్నగు గేయాలూ ప్రణయరాత్రి, అభాగ్యురాలు. వంటి కథానికలూ, ఇవి కొన్ని ప్రచురణపొందిన రచనలు. 'ఆంగ్లసాహిత్యప్రభావంవల్ల ఆంధ్రసారస్వతరంగాన్ని అభివృద్ధిచేయటానికి ఎంతైనా అవకాశం ఉన్నదనే' దృఢవిశ్వాసం కలవారు వయస్సు 21 సంవత్సరములు.

## 78. శ్రీ కొండవీటి వేంకటకవి

(పుటలు 306-307)

జననం: 1918 జనవరి 25. తండ్రి కొండవీటి నారాయణయ్యగారు తల్లి శేషమ్మగారు. జన్మస్థానం పత్తెపల్లి తా॥ వినుకొండ. ఉద్యోగం: శ్రీ భావనారాయణస్వామి వారి సంస్కృతకళాశాల ఆంధ్రోపన్యాసకత్వము. చాలా తీవ్రమయిన అభిప్రాయాలు, విప్లవాత్మకమైన భావన, నిర్దుష్టమైన ఆశయాలు గల వ్యక్తులు వీరు. హృదయంగమమైన కవితారచన, పటుతరమైన వచోరీతి వీరి కత్యంతసహజములు. రచనలు: నెహ్రూచరిత్ర, దివ్యస్మృతులు, త్రిశతి, మొదలైనవి.

## 79. శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి

(పుటలు 308-317)

అభిజనము: గుడివాడ అగ్రహారము శ్రీకాకుళం జిల్లా పాలకొండతాలూకా; జననముతిథి: కీలకవత్సర మార్గశిర్ష బహుళ ద్వితీయ; విద్యాభ్యాసస్థలము: సాలూరు విజయనగరము; ప్యాసయినపరీక్షలు; సాహిత్యవిద్యాప్రవీణ II Class; ఉభయభాషాప్రవీణ II Class; రాష్ట్రభాషావిశారద; పండితుల ట్రయినింగు II Class; P. O. L. II Class; M. A. (in Sanskrit) II Class. సాహిత్యకృషి గ్రంథరచన: శంకరవిజయము (వచనము) అహోబలపండితీయవ్యాఖ్య (అముద్రితము) వ్యాసములు; ప్రస్తుతావస్థ: Pandit in Telugu Mrs. A. V. N. College Visakhapatnam. విశిష్ట సారస్వతకృషిగల విద్వత్కవిశేఖరులు.

## 80. శ్రీ శ్రీనివాస సోదరులు

(పుటలు 318-320)

నల్లాన్ చక్రవర్తి శ్రీనివాస పార్థసారథి, నల్లాన్ చక్రవర్తి శ్రీనివాస వెంకటాచార్యులు వీరిరువురు తిరుపతి వేంకటకవుల శిష్యులు. జగ్గయ్యపేట, కృష్ణాజిల్లాలో 24-12 1914, 23-10-1916 వరుసగా జననము. విద్యార్థిదశనుండియే శతావధానములు చేసి విశేషప్రాచుర్యమును సంపాదించిరి. వీరి రచనలు ముద్రితములు: విచిత్రరాఘవము, ఓరుగల్లుకోట, ఉపహారము, శబరి, శబ్దసిద్ధి. అముద్రితములు: భర్తృహరి నిర్వేదము, భామినీవిలాసము. ప్రస్తుతము వీరు కాతంత్రవ్యాకరణమును సులభశైలిలో అనువదించి నవభారతిపత్రికాముఖమున వెలయించుచున్నారు.

పిష్టగర్భము అయోముఖమని యప్రథ పొందిన వ్యాకరణ శాస్త్రమును అందరికి సులభముగా అవగాహనము చేయవలెనని ప్రయత్నము. వీరి ఓరుగల్లుకోట హంపీ క్షేత్రమును దళలూపుచుండును. మరి వీరి శబరి శరణాగతవేద మే. వీరి శైలి సరళమైనది. వీరు శ్రావ్యముగా కావ్యగానము చేయగలరు. సంస్కృతాంధ్రాంగ్లములందు తలస్పర్శిపాండిత్యము, కన్నడ హిందీ, ఉర్దూభాషలతో పరిచయముకూడ కలదు. సరసులు, రసజ్ఞులు.

## 81. శ్రీ భట్టారం మల్లికార్జునకవి

(పుటలు 321-324)

పుట్టిన తేది: 30-11-1932; నివాసము: నెల్లూరు; నందినీ కావ్యము అను పేరుతో రఘువంశములోని తొలి రెండుసర్గలను తెనిగించి ప్రకటించిరి; పుష్పబాణవిలాసము నాంధ్రీకరించి యున్నారు; సుధర్మ యను చిన్న కావ్యము నిటీవలనే ప్రకటించిరి; ఇప్పుడు రచించుచుండు లవంగీ జగన్నాథములోని రెండుఖండములు భారతిలో ప్రకటితములు. అముద్రితములు చాల గలవు

## 82. శ్రీ సుప్రసన్న (పుట 325)

పూర్తిపేరు కోవెల సుప్రసన్నాచార్యులు; జననం: 17-3-1936 యువ ఫాల్గుణ బహుళ నవమి తెలుగులో యం. ఏ. పట్టం పొంది ఉస్మానియావిశ్వవిద్యాలయంలో పి. హెచ్. డి. లో రామరాజభూషణుని కృతులపై పరిశోధన చేస్తున్నారు; రచనలు: హృద్గీత, ఆనందలహరి, తేజశ్చక్రము, అవధులు. వీరు అనేక వ్యాసాలు, పద్యరచనలు వివిధపత్రికలలో ప్రకటించారు.

## 83. శ్రీ వారణాసి వేంకటేశ్వర్లు

(పుటలు 326-327)

పుట్టిన తేది: 1909 జూలై; ఇప్పటివృత్తి: ఆంధ్రభాషాధ్యాపకుడు యస్. యస్. అండ్ యన్. కాలేజి నర్సారావుపేట; సాహిత్యకృషివిశేషములు: ఇరువదిసంవత్సరముల కాలమునుండియు సాహిత్యసేవ చేయుచు గ్రంథరచన గావించుచున్నారు "సాహిత్యకుటీర" మను పేర పదిపుస్తకములు (నాటికా గీతికా కథానికా సంపుటీకరణములు ప్రచురించిరి. షష్ఠఫారమునుండి యస్.యస్.ఎల్.సి. వరకు పాఠ్యగ్రంథములు రచించినారు. మొత్తముమీద గద్యపద్యకృతు లింతవఱకు ఇరువదియైదున్నవి. మొన్నమొన్న ప్రకటించిన పుస్తకము "గీతాకథాంజలి" అయ్యది భగవద్గీతకు సంబంధించిన ఉపన్యాసములసంపుటి.

## 84. శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి

(పుటలు 328-331)

జననం: 1912 నవంబరు 21. శ్రీ కళాప్రపూర్ణేత్యాది బిరుదాంకితులైన శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి జ్యేష్ఠపౌత్రులు. తండ్రి 19 2లో గతించిరి. తాతగారే విద్యాబుద్ధులు నేర్పిరి. (వారును 1929లో స్వర్గస్థులైరి.) 1940లో హిస్టరీలో B. A. మొదటితరగతిపట్టను పొందిరి మదరాసువిశ్వవిద్యాలయములో ఆచార్య శ్రీ నీలకంఠశాస్త్రిగారికడ 3ఏండ్లు పశ్చిమచాళుక్యులచరిత్రమీద పరిశోధన చేసిరి. ఈసందర్భమున తమిళము, కన్నడము, ప్రాకృతము మొదలగుభాషలతో పరిచయము సంపాదించుకొని శాసనాదులు పఠించిరి. తరువాత రెండుకళాశాలలలో చరిత్రాధ్యాపకులుగా నుండి 1945లో వానిని మానుకొని వారితాతగారి గ్రంథముద్రణప్రకాశనకార్యమునకు పూనుకొనిరి. పెక్కుగ్రంథములు ప్రకటించిరి. మదరాసు తెలుగు భాషాసమితివారు 1950లో అక్కన్న మాదన్నల చరిత్రకు బహుమతినిచ్చిరి. ఇటీవల 1959లో హైదరాబాదు సాహిత్యఅకాడమివారు వీరి నన్నెచోడుని కవిత్వము అను విమర్శగ్రంథమునకు రెండువేల రూప్యములు ఇచ్చిరి. చారిత్రకపరిశోధన వీరి అభిమాన విద్యాపరిశ్రమ. నాటకరచనలు, నాటకరంగభూమికాధారణాదులు వినోదవిషయములు ప్రస్తుతము ఇంకను అనేక గ్రంథములు ముద్రించుచున్నారు.

## 85. శ్రీ అరిపిరాల విశ్వం (పుటలు 332-333)

జన్మించినది: 1936. కృష్ణా గామమైన నడకుదురులో. తండ్రి: లక్ష్మీనారాయణశాస్త్రిగారు. వేదవాస్తు జ్యోతిషాల్లో పండితులు. గురువులు: కవిసమ్రాట్ విశ్వ

సాధసత్యనారాయణగారు. చదువు: B. A. కలశాల విజయవాడలో ఉస్మానియావిశ్వవిద్యాలయంలో, M. A. పరీక్షలో ప్రథమశ్రేణిలో ప్రథములుగా సత్తీర్ణత. పరిశోధన: నవ్యకవిత్వంలో ప్రకృతి : మానవప్రకృతి అన్నవిషయంపై పరిశోధనావ్యాసాన్ని త్వరంలో అందిస్తారు. అభినివేశం : వేదాంతం, అలంకారం, మనస్తత్త్వశాస్త్రం. బహుమతులు 1953లో విశాలాంధ్రకథలపోటీలో 'పరిధానం' అనే కథకు ప్రథమబహుమతి. 1956లో అంతర్విశ్వవిద్యాలయకథానికల పోటీలో 'మంజూషకు' ప్రథమబహుమతి, ఉద్యోగం : హైదరాబాదు, నారాయణగూడలోని న్యూసైన్సుకళాశాలలో ఆంధ్రాధ్యాపకులు. రచనలు: వక్రరేఖలు (నవల) భిక్షాపాత్ర నవ్వింది, (నవల) అశ్వఘోషుడు, (నాటకం) మైథిలీవల్లభశతకం, నిదురకన్నెలు, (కావ్యం) వాసంతి, (మూడుభాగాల కథలసంపుటి), అభ్యుదయకవిత్వం తర్వాత (వ్యాససంపుటి).

## 86. శ్రీ అన్నపరెడ్డి విజయభాస్కరరెడ్డి

(పుట 334)

వీరు అంతఃకళాశాలవక్తృత్వపుపోటీలలో పాల్గొని, అనేక బహుమతులు పొందారు. గుంటూరు «యువరచయితల» సమితి కార్యవర్గసభ్యులు «జ్వాల» పత్రికకు సహాయసంపాదకులు. మంచిఉత్సాహము, కార్యదీక్ష గల యువకులు. జననం: 1940. కృతులు: చైతన్యవిపంచి, తెలుగుశిల్పి, తెలుగువెలుగు.

## 87. శ్రీ అక్కిరాజు చంద్రమౌళిశర్మ

(పుటలు 335-338)

జపయోగనిష్ఠాపరులు. వేదాంతగ్రంథాలు, స్వయంప్రకాశప్రబోధము మొదలైనవి వీరు వ్రాశారు. నిరంతర తత్త్వచింతకుల ప్రాచీనసంప్రదాయ విద్వత్కవులు. కవితాకళానిధి, కవిరాజహంస బిరుదాంచితులు. జననం 2-11-1889. వాసుదేవశతకం, లక్ష్మీవిలాసాదిగ్రంథాలు ఇంక ఉన్నవి. పల్నాడుతాలూకా, గు గ్రామం.

## 88. శ్రీ జూలూరి హనుమంతరావు

(పుటలు 339-340)

పుట్టిన తేది 1-7-1930 మూల్పూరు గ్రామం. తెనాలి తాలుకా, గుంటూరుజిల్లా. గుంటూరులో విద్యాభ్యాసము. సంస్కృతాంధ్రములందు దిట్టమగు పాండిత్యము. ఇప్పటికి ఉన్మత్తరాఘవము, పార్వతీపరిణయ నాటకముల ననువదించి ప్రకటించినారు. కళాజ్యోత్స్నయను మరొక కావ్యమునుకూడ రచించినారు. ఆంధ్రవిష్ణుపుగాథను ద్విపదలో వ్రాసి ప్రచురించినారు. గేయాలు, పాటలుకూడ వ్రాస్తారు. చక్కని కవితాధార. బాలసాహిత్యమంటే వీరికి ప్రత్యేకాభిమానము. Penలో సభ్యులు. ఆంధ్రప్రభుత్వవిద్యాశాఖలో ఉద్యోగి 518 సంతోష్‌నగర్ హైదరాబాద్-18.

## 89. శ్రీ ముదిగొండ వేంకటరామశాస్త్రి

(పుటలు 341-350)

గుంటూరుజిలా సత్తెనపల్లి తాలూకా చౌటపాపాయపాలెం స్వాగ్రహారమున కీ. శే. బ్ర. రామశాస్త్రులు-శేషమాంబల గర్భమున శార్వరి శ్రావణ బహుళ విదియరోజున జన్మించిరి.

బాల్యమున పితృవియోగము సంభవించినను గర్భాష్టమోపనయనప్రభృతి యత్కించిద్వేదస్మార్తవిద్యల గడించి, భావుకులగు బ్ర. సన్నిధానం విశ్వనాథశాస్త్రులు గారివద్ద స్వగృహముననే సంస్కృతాంధ్రసాహిత్యవిజ్ఞానము సంపాదించి, కృష్ణాజిల్లా ఆకిరిపల్లి సంస్కృతకళాశాలలో బ్ర. వేమూరి రామబ్రహ్మశాస్త్రులుగారివద్ద తర్కవేదాంతశాస్త్రాధ్యయనమును గావించి వచ్చి, యదృష్టవశమున సాధనచతుష్టయసంపన్నులై యంతర్ముఖులగు తమ భావుకమహోదయుల యనుగ్రహమున బ్రహ్మవిద్యారహస్యము నధిగమించి, కృతకృత్యులైరి.

తదాది స్వాగ్రహారమున స్వయముగ నిర్మించుకొనిన శ్రీమదోంకారమందిరములో శ్రీముదాంగీరసవత్సరప్రభృతి బ్రహ్మవిద్యాప్రచారము, యోగ, మంత్ర, ధర్మశాస్త్రాది పరిశీలనము, ఆసేతుశీతాచలమున ధర్మప్రచారము. పల్నాడుసత్తెనపల్లితాలూకాల బ్రాహ్మణగురుకులస్థాపనము, అఖిలాంధ్రదేశీయబ్రాహ్మణగురుకులప్రచాలనము. అఖిలభారతవర్షీయ ఓంకార భాగతీనిలయస్థాపనము, స్వాగ్రహారమున శివాలయనిర్మాణము మున్నగు లోకసంగ్రాహకకృత్యముల నిర్వహించుచుండిరి.

మరియు వివిధదేశీయప్రభుస్థానములలోను, వివిధవిద్యా

సంస్థలలోను వివిధజగద్గురుపీఠాధిపతులవద్దను, అనేకబిరుదములను దివ్యరాంకవములను, స్వర్ణపతకములను, గౌరవపత్రములను, సన్మానములను పొందుచుండిరి.

అందు శ్రీ జగద్గురుపుష్పగిరిపీఠాధిపతులొనర్చినట్టి అమరావతిసభలో "తర్క వేదాంతవిశారద", ఆంధ్రసారస్వతపరిషత్తులో "ధర్మసన్న్యాసకేసరి" "మహోపాధ్యాయ", శ్రీజగద్గురుపూరీగోవర్ధనపీఠాధిపతులవద్ద 'వేదాంతవిద్యారత్న', శ్రీత్రిలింగమహావిద్యాపీఠమున "ధర్మస్థాపక", శ్రీశాంకరబ్రహ్మసత్రావబృథమహాసభలో "బ్రహ్మవిద్యాచార్య", అయోధ్యాసంస్కృతపరిషత్తులో "విద్యాభాస్కర", శ్రీజగద్గురుశృంగేరీపీఠాధిపతులవద్ద "బ్రహ్మవిద్యాలంకార" మున్నగు బిరుదములు చాల పొందిరి.

ఇట్టి శాస్త్రిమహోదయులు వివిధదర్శనములలోను, సంస్కృతాంధ్రభాషలలో ననేకాధ్యాత్మికగ్రంథసారసంగ్రహములను, స్వతంత్రరచనలను గావించుచు వారిషష్టిపూర్తినాటికి దాదాపుషష్టిప్రబంధములను పూర్తిచేసిరి.

## 90. శ్రీ వెల్దండ ప్రభాకరామాత్య

(పుటలు 351-352)

పుట్టినతేది : 4-7-1924 మహబూబునగరం జిల్లా. సాహిత్యగురువులు : కురుగంటి సీతారామయ్యా, సరిపల్లి విశ్వనాథశాస్త్రీ, బుక్కపట్టం అణ్ణయాచార్యులు, 1942 నుండి సాహిత్యవ్యాసంగమారంభము. 1949 నుండి అఖిలభారత ప్రాచ్యవిద్యావిపశ్చిత్సమ్మేళనకాన్సిలు సభ్యులు. 1954నుండి అఖిలభారతరచయితలసంస్థ Penలో సభ్యులు భవభూతి, మురారి, వేంకటాధ్వరులు అభిమానకవులు. కృతులు ముద్రితములు: 1951 ప్రేమసీమ 144 పద్యముల కావ్యము కీట్సుఈవ్ ఆఫ్ సెంట్ ఏగ్నెస్ అనువాదము ఆముక్తమాల్యదపర్యాలోకనము, కృష్ణరాయల ప్రబంధముపై చక్కనిసమగ్రాధికారవిమర్శ, సంస్కృతాంధ్రఆంగ్లములయందు చక్కని పాండితి కలదు. జర్నలిజంపై ఆసక్తి. గురుకులక్లిష్టుడగు మురారిపై ఆంగ్లమున విమర్శ వీరు వ్రాస్తున్నారు.

## 91. శ్రీ కొప్పర్ల (పుట 353)

పూర్తిపేరు: కొప్పర్ల మద్దయ్యా. పుట్టినతేది 1-7-1937 తల్లిదండ్రులు: తండ్రి; సుబ్బయ్యా, తల్లి: బాలమ్మ. చిరునామా: కె. మద్దయ్యా, రచయిత : నూనెపల్లె నంద్యాల R. S. కర్నూల్ జిల్లా. విద్యాయోగ్యతలు : విశారద (తెలుగు), రాష్ట్రభాషా (హిందీ) బి. ఏ. అభిరుచి: అభ్యుదయసాహిత్యము, ప్రాతక్రొత్తలకలయికతో కవనము - కృషి: 1953 నుండి నవ్యాంధ్రసాహిత్యరంగమున కృషి చేయుచున్నాను. ఆయాపత్రికలలో రచనలు ప్రచురింపబడుచునే యున్నవి. అముద్రితగ్రంథములు : బంగారుతీగలు (గేయాలు) ఖండకావ్యము, సాహిత్యవ్యాసాలు. ఇతరసంస్థలతో సంబంధము: నవ్యసాహితీసమితి, హైద్రాబాదులో సభ్యులు. యువరచయితలసమితి గుంటూరులో నొక కార్యకర్త. నవ్యకళామండలి నంద్యాల సహాయకార్యదర్శి.

## 92. శ్రీ పాటీలు తిమ్మారెడ్డి

(పుటలు 354-355)

జననం: 1937. స్వస్థలం, ఆంకంపల్లి, అనంతపురమండలం. కృతులు : ప్రసూనమాలిక, ప్రేమదర్శనము. అముద్రితములు: మదిరావతి, తపతీసంవరణము, మాయూరు, మాస్వామి, కిశోరగాథాసప్తశతి, గీతాదర్శనం, పద్యకావ్యాలు. రత్నావళి, కలబరిగీపతనం, నాటకాలు, ఆశ్రమత్యాగము, గేయనాటిక. విద్య: బి. ఏ. పట్టము. ప్రజ్ఞాసమన్వితమైన సునిశితపరిశీలనాదృష్టి, వాఙ్మయకృషికల యువకులు. వేదాంతవాఙ్మయముపై అనేకవ్యాసాలు, పద్యాలు ప్రచురించారు.

## 93. శ్రీ పిల్లలమర్రి వేంకటహనుమంతరావు

(పుటలు 356-367)

గుంటూరు మండలము: బ్రాహ్మణకోడూరులో జననము 31-12-1918; తల్లి పుణ్యవతి; తండ్రి సుబ్రహ్మణ్యం. సికిందరాబాదు మహబూబు కాలేజి, హైదరాబాదు నిజాం కాలేజి, ఆంధ్ర విశ్వవిద్యాలయములలో విద్యాభ్యాసము. తెలుగు భాషా సాహిత్యములందు ఆనర్సు ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణత. ఎం. ఏ. పట్టస్వీకారము. హైదరాబాదుప్రభుత్వ సమాచారశాఖలో ద్విభాషిగా కొలదికాలము; గుంటూరు హిందూ కళాశాలలో అం

పన్యాసకులుగా 1943 నుంచి. విద్వత్సభాముఖాన 'సాహిత్యాచార్య', 'ఆంధ్ర ఆర్నాల్డు' బిరుద స్వీకారము. కవిగా, కథకుడుగా, నాటికాకారుడుగా, విమర్శకుడుగా, సహృదయుడుగా, పాత్రికేయుడుగా, చారిత్రకుడుగా, వక్తగా, దేశికుడుగా, దర్శకుడుగా, నటుడుగా, సంపాదకుడుగా, బహుగ్రంథకర్తగా, అధ్యాపకుడుగా, కవి జీవితచరిత్రకారులుగా బహుముఖ ప్రతిభా ప్రశస్తి. సికిందరాబాదు సాధన సమితీ వ్యవస్థాపకత్వము; వార్తేరుశాఖానిర్వహణము; గుంటూరు సరస సారస్వత సమితి, కవితావనము, ఆంధ్ర సాహిత్య మండలి, జోత్స్న సమితుల సంస్థాపకత్వము; సాహితీ సమితి, హైదరాబాదాంధ్ర సాహిత్యపరిషత్తు, నవ్య సాహిత్యపరిషత్తు, ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్సు, నవ్యసాహితీ సమితుల సభ్యత్వము. జోత్స్న సమితి సభాపతులు; శారదా పీఠ కులపతులు. రచనలు: మధుకణములు, రాగరేఖలు, గేయములు. వెలుగునీడలు, ధూపదీపాలు, కథలు. సాహిత్య విమర్శ వ్యాసముల ఉపన్యాసములు: సాహిత్య సమాలోచనము, సాహిత్య సంపద, సాహిత్య సమీక్ష, మాధురీ మహిమ, శారదావిలాసము, కురుగంటివారితో కలసి నవ్యాంధ్ర సాహిత్య వీధినిర్మాణము. వత్సల, అంబరీష, దీపకళిక, పద్యబాణం, నాటికలు: రేడియో, రంగస్థలములందు ప్రయుక్తములు. ఇష్టాగోష్ఠి - ప్రసంగాలు (ఆంధ్ర రిపబ్లిక్, సంపాదకత్వం) సంస్కృత సంచిక. చిత్ర, మాలిని, బల, గీతాలు, రవీంద్ర అనువాదములు. రేడియో నాటికలు, రేడియో ప్రసంగాలు, రేడియో సమీక్షలు. బహుసభావేదికలు. అధ్యక్షతానిర్వహణం, ఉపన్యాస దక్షత. ఆంధ్ర చరిత్ర సంస్కృత సాహిత్యం ఆంగ్ల గ్రంథానువాదము.

## 94. శ్రీ కాకాని నరసింహారావు

(పుటలు 368-371)

జననం: గుడివాడతాలూకా శేరీదింటకుర్రు గ్రామంలో ది 24–12–1903. విద్యాభ్యాసం: బందరు నోబుల్ పాఠశాలలో. విద్యాగురువు: శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు యం.ఏ.; వృత్తి: ప్రభుత్వోద్యోగము (రివెన్యూశాఖలో) చేసి 1958లో పింఛన్ తీసుకొని ప్రస్తుతం ఉపకారవేతన మందుకొనుచున్నారు. బిరుదులు: మధురకవి, కవికేసరి, కవిశేఖర, సరళకవి, కవికోకిల. పదవులు: అధ్యక్షులు సారస్వతమండలి బందరు; కార్యదర్శి ఆంధ్రసారస్వతమండలి గుడివాడ. త్రివేణి ఆస్థానకవి, ఆంధ్రనలంద ఆస్థానకవి, సరస్వతిసామ్రాజ్యాచార్యులు గుడివాడ. రచనలు: శ్రీహరి బాలప్రబోధము, భక్తసంరక్షణ. కవితోన్మాదము, హాస్యేశ్వరీ తిరుపతివేంకటేశ్వరసరస్వతీసామ్రాజ్యం etc

## 95. శ్రీ చిట్టా దామోదరశాస్త్రి (పుట 372)

పుట్టినతేది: 5–1–'28. విద్యాభ్యాసము: బందరు హిందూకళాశాల, ఉస్మానియావిశ్వవిద్యాలయాల్లో. సాహిత్యకృషి: కథానికలు, నాటికలు, విమర్శకవ్యాసములు, ఒకశతకము, గీతాంజలి, రఘువంశముల అనువాదములు గుంటూరు యు. యల్. సి. యమ్. మల్టీపర్పస్ స్కూలు ఉపాధ్యాయులు.

## 96. శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

(పుటలు 373-377)

తూర్పుగోదావరీమండలము పల్లిపాలెము: అభిజనము, జననము 1920 సంవత్సరము. వింజరము సంస్కృతపాఠశాలలో వ్యాకరణాచార్య మహేంద్రవాడ సుబ్బరాయశాస్త్రిులవారిసన్నిధిని కావ్యపాఠము వ్యాకరణశాస్త్రాధ్యయనము. సంస్కృతసాహిత్యములయందు స్వయంకృషి. 1939, 40, 41 సంవత్సరములలో 'ఆంధ్రి' సారస్వత మాసపత్రికాసంపాదకత్వము. 1940 నుండి నాల్గేండ్లు శ్రీ సూర్యారాయాంధ్ర నిఘంటుకార్యాలయ పండితస్థానము. 1946నుండి రాజమహేంద్రవర వీరేశలింగోన్నత పాఠశాలా ప్రధానాంధ్రాధ్యాపకత్వము. రచనలు: ఆంధ్ర పురాణము (నవపర్వసంభృతమైనకావ్యము), ఆంధ్రరచయితలు (19వ శతాబ్దరచయితల కవితాసమీక్షాత్మకమైన గ్రంథము), స్వప్నవాసవదత్తము, రత్నావళీ, రత్నపాంచాలిక సంస్కృతమునకు అనువాదములు. షడ్దర్శనసంగ్రహము ఇత్యాదికములు.

## 97. శ్రీ నోరి నరసింహశాస్త్రి

(పుట 378)

జననము: 6-2-1900. తల్లి మహాలక్ష్మి, తండ్రి హనుమచ్ఛాస్త్రి. దీక్షాగురువులు: జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీస్వామిపాదులు. 1919: బి. ఏ. 1925 బి. యల్. 1947: కవిసమ్రాట్ బిరుదము. సంస్కృతాంధ్ర కర్ణాటక భాషలు అభ్యసించిరి. ప్రచురణలు: 1921: గీతమాలిక (19 ఏండ్లలో వ్రాసిన కావ్యములసంపుటి), 1924: సోమనాథవిజయము, (వచననాటిక) 1933: భాగవతావతరణము (పృధునాటిక ,1949: నారాయణభట్టు(నన్నయనాటినవల), తెలుగుభాషాసమితి బహుమతినొందినది. 1950; శ్రీ దేవీ భాగవతము (1, 2, 3, స్కంధములు), 1950 : తేనెతెట్టె (నాలుగునాటికలసంపుటి), 1951: రుద్రమదేవి (తిక్కన నాటినవల), ఢిల్లీసాహిత్యఅకాడమీవారు భారతీయభాషలోకి అనువదించుచున్నారు. 1954: కర్పూరద్వీపయాత్ర: (పిల్లలనవల), 1955: వాఘిరా (అజంతా నవల), 1958 : మల్లారెడ్డి (ఎఱ్ఱననాటినవల), 1960: సర్పసత్రము (నాటిక), 1960: జేమూభిక్కుని (బుద్ధునినాటినాటిక), 1960: శబ్దవేధి (నాటిక), రాబోవునది: కవిద్వయము (శ్రీనాథ, పోతనల నవల). గుంటూరుజిల్లా రేపల్లెనివాసం. నవలాకారులుగా కథకులుగా, కవులుగా, విద్వాంసులుగా వీరుసుప్రసిద్ధులు.

## 98. శ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రి

(పుటలు 379-385)

జననము: 10-8-1910. విశాఖపట్నంజిల్లా చోడవరం తాలూకా పెదనందిపల్లి అగ్రహారములో తల్లిదండ్రులు పేరిసోమిదేవమ్మ సర్వేశంగార్లు. భాష్యాంతవ్యాకరణం, అలంకారశాస్త్రములను శ్రీయుతులు పేరి వేంకటేశ్వరశాస్త్రి, మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రి గారలవద్ద చదువుకొన్నారు. శ్రీ కొల్లూరు లక్ష్మణమూర్తి శాస్త్రిగారివద్ద న్యాయము, మహామహోపాధ్యాయ శ్రీ పేరి లక్ష్మీనారాయణశాస్త్రిగారివద్దను శ్రీ కొల్లూరు సోమశేఖరశాస్త్రి గారివద్దను వేదాంతమును వీరు అధ్యయనం చేశారు. కావ్యనాటకాదులలో శ్రీ పేరి అప్పల నరసింహశాస్త్రిగారు వీరికి గురువులు. ప్రస్తుతం వీరు గవర్నమెంటు మహారాజసంస్కృతకళాశాల వ్యాకరణపండితులుగా పనిచేయుచున్నారు. రచనలు: స్ఫోటవాదము, ఆఖ్యాతార్ధనిర్ణయము, వైయాకరణసిద్ధాంతలఘుమంజూషకర వ్యాఖ్యానము. బిరుదములు: వ్యాకరణవిద్యాప్రవీణ, సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ, పి. ఒ. ఎల్. షడ్దర్శనములలోను ప్రత్యేకకృషి.

## 99 శ్రీ భమిడిపాటి వేంకటసుబ్రహ్మణ్యశర్మ

(పుటలు 386-392)

జననం: వికారి శ్రావణబహుళపంచమి అశ్వని ప్రథమపాదము. రచనలు : శంకరవిజయము, కూర్మపురాణము, ప్రసన్నరాఘవము, కామాక్షీస్తుతి, శివానందలహరి, సౌందర్యలహరీత్యాదులు.

## 100. శ్రీ గోపాలచక్రవర్తి

(పుటలు 393-394)

అసలుపేరు: వేణుగోపాలశాస్త్రి. ఇంటిపేరు : నడిమింటి. అభినవకాళిదాస బిరుదాంకితులు శ్రీ సర్వమంగళేశ్వరశాస్త్రి రసగంగాధరకర్త జగన్నాథపండితరాయుల కుటుంబం. జననం 1931 రాజమహేంద్రవరంలో. విద్యాభ్యాసం విజయవాడ, మదరాసు నగరాల్లో, బి. ఏ. ఆనర్సు పట్టభద్రులు. తొలికథ ప్రచురణ 1947. కథలూ, వచనపద్యాలూ, వ్యాసాలూ, రేడియోనాటికలూ వ్రాశారు. 1958లో పదివచనపద్యాలు 'కలంకలలు' అనే సంపుటంగా వెలువరించారు. 'ఆనందం జీవనది' అనే కావ్యం ప్రచురణకు సిద్ధంగావుంది. మరోమూడు కలంపేర్లతోకూడా రచనలు ప్రచురిస్తూవుంటారు. ఆంగ్లంలో కూడా కలంపేరుతో సాహిత్యవ్యాసాలు వ్రాస్తూవుంటారు. 1954 నుంచీ సమాచారశాఖలో 'పబ్లిసిటీ అసిస్టెంటుగా వుంటున్నారు.

## 101. శ్రీ మిన్నికంటి గురునాథశర్మ

(పుటలు 395-4 6)

వీరు గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకా ఏల్చూరు గ్రామమున జనించిరి. జననము: 1897 ఏప్రిల్

10వ తేది. వీరితండ్రి మిన్నికంటి వేంకటలక్ష్మయ్యగారు, తల్లి వేంకటసుబ్బమ్మగారు. ఆఱువేల నియోగి బ్రాహ్మణులు, శ్రీవత్ససగోత్రులు. వీరు బాల్యమందే అష్టావధాన, ఆశుకవితాసభలు జరిపి మెడల్సులు పొందిరి. శ్రీకల్యాణానందభారతీమాంతాచార్యస్వాములవారికడ వేదాంతశాస్త్రి మభ్యసించిరి. 15-2-1920 మొదలు 19-6-1958 వఱకు గుంటూరు టౌన్ హైస్కూలు సీనియర్ పండితులుగా నుండిరి. 14-5-1914 కొత్తపాటి సంస్థానాధీశ్వరుడు సువర్ణపదక మిచ్చెను. 15-11-1928 ఉభయభాషాప్రవీణపట్టము బడసిరి. 25 1-1934 శ్రీశృంగేరీవిరూపాక్షపీఠాధీశులు జగద్గురు శ్రీ కల్యాణానందభారతీ మాంతాచార్య స్వాములవారు "వేదాంతపారీణ" బిరుద మిచ్చిరి. 15-2-1952 ఆంధ్ర సారస్వతపరిషత్తు 'కవిశేఖర' బిరుదమిచ్చెను. 11-10-1959 విద్యాపరిషత్తు "విద్యానాథ, కవితామహేశ్వర" బిరుదము లిచ్చెను. రచనలు : శ్రీమద్గురుభాగవతము, శ్రీమద్భాగవతమహిమ, అడవిపువ్వులు, రామదాసు, దత్తమహిమ, సూక్తినిధి, దత్తాత్రేయశతకము, అమ్మ, గౌరీకల్యాణము, గురుశిష్యవ్యాకరణము ఇవి అచ్చైనవి. అచ్చుకానివెన్నియో కలవు. గుంటూరు విద్యాపరిషత్తు వీరిజీవిత సంగ్రహము నచ్చొత్తించెను.

## 102. శ్రీ మల్లంపల్లి వీరేశ్వరశర్మ

(పుటలు 407-408)

జననము 1916-10-5 నలసంవత్సరాశ్వయుజ శుద్ధ నవమీ గురువాసరమున బందరున : తల్లి దుర్గాంబ, తండ్రి మల్లికార్జునారాధ్యులు భోగేశ్వరమాహాత్మ్య సత్యవత్యుపాఖ్యానాది ప్రబంధకర్తలు తార్కికులు, సోదరులార్వురు ప్రబంధకవులు. విద్యాభ్యాసము : పితృపాదులసన్నిధిని. ఎలకుర్రు శ్రీ శ్యామలాధర్మపాఠశాలయందును చిట్టిగూడూరు శ్రీనారసింహసంస్కృతకలాశాలయందును, ఒజ్జవమై తొలుత శ్రీశ్యామలాధర్మపాఠశాలయందును 1943 నుండి నేటివరకు శ్రీనారసింహ సంస్కృత కళాశాలయందును. రచనలు: రఘువంశము, కౌత్సుడు, నందిని, ఇందుమతి, రఘు జైత్రయాత్ర, కాళిదాసరామాయణము, కుముద్వతి, అనువిభాగము, తెనుగున గురుపాదులకు గురుతుల్యులకు సమర్పితము. తొలికావ్యమగు, కాంచీఖండము, శ్రీపితృపాదులకును, ఉత్తరనైషధము, హృదయగురులగు శ్రీ దువ్వూరి వెంకటరమణశాస్త్రి గారికిని సమర్పితములు, ఉత్తమమనుసంభవము, పంపావిరూపాక్షవ మను అభినవశాకుంతలము. కణ్వాశ్వపనము, శంకరారాధ్యచరిత్ర దుర్గాశతకము, మృత్యుంజయశతకము, వీరభద్రోదాహరణము, అను నితరకృతులు. సంస్కృతమున: దుర్గాత్రిశతి, మల్లికార్జున సుప్రభాతము, శివమణిదర్పణము, మున్నగునవి. బందరు హిందూకళాశాలారజతోత్సవమునాటి భువనవిజయమున - పెద్దనపాత్ర, నాటిరాజులగు శ్రీకాశీకృష్ణాచార్యులవారి మనసునందినది ఆంధ్రవిశ్వవిద్యాలయం సెనేట్ ఎకడమిక్ కౌన్సిలు సభ్యులు.

## 103. శ్రీ పొన్నెకంటి హనుమంతరావు

(పుటలు 409-413)

జననము : 31-1-1931. ఎం. ఏ. (మద్రాసువిశ్వవిద్యాలయము) పట్టభద్రులు. పూర్వము విజయవాడ ఆంధ్ర లయొలా కళాశాలలోను, నేడు గుంటూరు హిందూకళాశాలలోను ఆంధ్రభాషోపన్యాసకులు. 'శ్రీ వేంకటేశ్వర శతకము' 'గీత' వీరి పద్యకృతులు. 'రవీంద్రకథలు' (మహాకవి రవీంద్రనాథటాగూరు కథలలో కొన్నింటికి అనువాదములు) 'ఓహిందీ' వీరి గద్యకృతులు, వీరు గేయరచనలో కడు నేర్పుగలవారు. ఆంధ్రభాషా సాహిత్యములకును నితర సాంఘికాది విషయములకును సంబంధించిన వ్యాసములు బహుముఖప్రజ్ఞతకు, నిరంతరసాహిత్యకృషికి నిదర్శనములు. మున్ముందు ఆంధ్రసాహితీరంగమున వీ రొకవిశిష్ట స్థానమును గడించుకొనగలరనుట నిస్సంశయము.

## 104. శ్రీ కల్లూరు నాగభూషణరావు

(పుటలు 412-414)

జననం : 20-1-1930 వేంకటేశ్వర యూనివర్సిటీలో తెలుగు M. A. మొదటి Batch సర్వప్రథములుగా ఉత్తీర్ణులైనారు. సునిశితపరిశీలనాశక్తి చక్కని సాహిత్య కృషి కల వీరు అనేకరచనలు చేశారు. ధ్రువుడు, తొలికోడి, వీడ్కోలు, రాజర్షి, అగ్నిప్రవేశము, స్వప్నసీమ,

ఆకాంక్ష, నాకల, యామిని మొదలైన పద్యరచనలు చాలా వ్రాశారు. "హృదయవీణ"- వీరిఖండకావ్యము. తీయని గొంతు సంగీతపరిశ్రమకూడా కల విశిష్టులు.

## 105. శ్రీ ఆండ్ర శేషగిరిరావు (పుటలు 415-417)

జననం 1903లో. పట్టభద్రులు. పత్రికావ్యాసంగం, గ్రంథరచన వృత్తి. పదేళ్ళు 'ఆంధ్రభూమి'ని, మూడేళ్ళు 'ఆరోగ్యసుధ'ను మదరాసునుండి నడిపారు. గృహలక్ష్మి, ప్రజామిత్ర, ఆనందవాణి, ఆంధ్రవాణిపత్రికా కార్యాలయాల్లో పనిచేశారు. ఆంధ్రరమణీమణులు, ఆంధ్రరాజభక్తులు, ఆంధ్రవీరయువకులు, ఆంధ్రవిదుషీమణులు, ఆంధ్రసారస్వతవ్యాసావళి, ఆంధ్రునిపండుగలు: పబ్బములు, ఆంధ్రకవుల అద్భుతమహిమల కథలు మున్నగు పలుగ్రంథాలు రచించారు. ప్రస్తుతనివాసం తణుకు తాలూకా ముక్కామల.

## 106. శ్రీ రామచంద్రకౌండిన్య (పుటలు 4 8-419)

పూర్తిపేరు - శ్రీ ఓరుగంటి రామచంద్రయ్య. పుట్టిన తేది : 16-6-1912. కావలి (నెల్లూరుజిల్లా). డిగ్రీలు : B. A. (Hons)., M. A. (Hons)., Ph. D., B. Ed. ఇప్పటిపదవి : (i) Head of the Dept. of History and Politics. Andhra University, Waltair. (ii) Member, Andhra Sahitya Academy. సాహిత్యకృషి : ముద్రితములు : ఆంధ్రశ్రీ (వచనము), రమణస్మరణ (పద్యములు), రమణలహరి (పద్యములు, సంస్కృతమునకు తెలుగు సేత) "తెలుగుమీరా" (హిందీనుండి తెనుగునకు 28 గేయములు) Studies of Krishnadevaraya of Vijayanagara (ఆంగ్లము), "అజంతా" "విజయనగరసామ్రాజ్యము రాక్షసతగడీ పిదప" (వ్యాసములు). Telugu Encyclopaedia Vol III.) అముద్రితములు : గంగాలహరి (పద్యములు. సంస్కృతమునుండి అనువాదము "హరిహర" (శ్రవ్యనాటకము), రాగరోచి (ముక్తకములు), శ్రీవివేకానంద పద్యమంజరి (ఆంగ్లమునకు తెనుగు సేత), "ఆంధ్రాది" (చారిత్రకవ్యాసములు). సంగీతసాహిత్యములలో అద్భుతప్రజ్ఞగలవారు. అపార మేధాసంపన్నులు.

## 107. శ్రీవింజమూరి శివరామరావు (పుట 421)

ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో రచయిత. జననం 15 మే 1908 బుద్ధజయంతినాడు- వీరి స్వగ్రామం సామర్లకోటకు సమీపంలోని చంద్రంపాలెం. విద్యాభ్యాసం : అమరం, రఘువంశం వీరి పితామహులైన శ్రీవింజమూరి రఘుపతిరామన్నగారితో. ఆంగ్లవిద్యపిఠాపురం హైస్కూల్లో నాలుగుఫారాలు, ఆతరువాత బి.ఏ. అయేవరకూ కాకినాడ కాలేజీలో. గురుదేవులు : వీరితల్లి లక్ష్మీనరసమ్మగారు భారత భాగవత రామాయణాలు ఉగ్గుపాలతో నూరిపోశారు. వీరితండ్రి రామనమూర్తిగారు ఆంధ్రప్రబంధాలు ఛందస్సూ, పద్యరచనా నేర్పారు. వీరి పెద్దతండ్రి జోగయ్యగారు- దక్షిణాదినికూడా ప్రశంసలూ బహుమాన పతకాలూ స్వీకరించిన గొప్పపౌరాణికులు. ఆసాహిత్య వాతావరణం వీరిని సారస్వతసేవకు ప్రోత్సహించింది. నవ్యకవితారీతుల్లో వీరిని తీర్చిదిద్దినవారు. వీరి మేనమామ- దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు. అష్టావధానాలూ శతావధానాలూ చేసి, అనేకాంధ్ర సంస్కృతకావ్యాలు వ్రాసి మహారాజపూజితులైన వీరి మాతామహులు దేవులపల్లి సుబ్బరాయశాస్త్రిగారూ, వేంకటకృష్ణశాస్త్రిగారూ వీరి కవితాజీవితాన్నుజ్జీవింపజేసే జ్యోతిర్మూర్తులు. రచనలు : అమరుకం, రసమంజరి (పద్యము) కళోపాసన (మూడునాటికలు), మపాసా, గోర్కీ కథలు (అనువాదం), కల్పవల్లి గేయాలు), ఇదివరలో ప్రచురితమైనాయి. విశ్వామిత్ర, శ్రీకృష్ణదేవరాయలు మొ॥ రంగస్థలనాటికలు. నగారా నవ నాయికలు మొ॥ ఖండకావ్యాలు, చాలాకథలూ, ఎన్నెన్నో గేయాలూ, అనేకమైన వ్యాసాలూ, ఆరువందలదాకా రేడియోరూపకాలూ, అముద్రితాలు. వీరు రచించిన విద్యుల్లేఖ అనే యక్షగానం భారతప్రభుత్వము వారి బహూకృతికి పాత్రమైంది.

## 108. శ్రీ కామఋషి సత్యనారాయణవర్మ (పుటలు 422-424)

జననం : 1914. కళలు, చరిత్ర, అభిమానవిషయాలు

కుటీర పరిశ్రమలు, విజ్ఞానయాత్ర అను గ్రంథమునకు భారత ప్రభుత్వవిద్యాశాఖ బహుమానము లభించినది. ఆంధ్రదేశ మండలి కుటీరపరిశ్రమలు అను గ్రంథమునకు తెలుగుభాషా సమితివారి ఆధ్వర్యవమున ఆంధ్రప్రభుత్వ బహుమతి లభించినది. ఆయుర్వేదవైద్యవిషయిక వ్యాసములు వ్రాయు చుందురు. ఆంధ్రదేశచరిత్ర (అముద్రితము) వ్రాసిరి.

## 109. శ్రీ కృష్ణభిక్షు (పుటలు 425-428)

అసలు పేరు ఓరుగంటి వేంకట కృష్ణయ్య నెల్లూరివాసి. జననం ఆజిల్లా కావలి గ్రామములో 1904 సెప్టెంబరు 19వ తేదీ. శ్రీమహాలక్ష్మమ్మ వేంకటసుబ్బయ్యగారలు తల్లి దండ్రులు. తెనుగున రుచి కల్పించినవారు శ్రీచివుకుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారును, శ్రీ కళాప్రపూర్ణ వేదం వేంకటరాయశాస్త్రిగారును. ఆధ్యాత్మికపథమున త్రోవ జూపిన పెద్దలు- శ్రీసదానందస్వామి, శ్రీభారతుల నరసింహశాస్త్రి, శ్రీగణపతిశాస్త్రి(కావ్యకంఠ), శ్రీభగవాన్ రమణమహర్షి, శ్రీఅరవిందులు, శ్రీ మేడవరపు సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ మోతడక సత్యనారాయణగురువర్యులు. రాజయోగదీక్షాదాత- శ్రీప్రభుజీ రామలాల్ జీగారు. రచనలు: ముద్రితములు: నందనారు చరితము (నాటకము), శ్రీరమణ లీల (జీవితకథనము), ప్రియవిలాపము(పద్యములు), ఈశ్వర శతకము (పద్యములు). అముద్రితములు : పద్యములు దేవ సన్నిధి, మానసబోధ, గీతగోవిందము, చాటువులు, అమృత బిందువులు. నాటకములు : భగ్నప్రేమ, పునఃప్రాప్తి, బిల్వగుంగళము, లీలాశుకము. వచనరచన : గురుమంత్ర భాష్యము. అనువాదములు : త్రిపురారహస్యము, అనసూయారామాయణము, కింకరి,- మహర్షి, అరుణాచల పంచకవ్యాఖ్య. సంగీతసాహిత్య విద్వత్కవితపస్వివర్యులు.

## 110. శ్రీ జంధ్యాల లక్ష్మీనారాయణశాస్త్రి "సుధాంశు" (పుట 429)

పుట్టినతేది : 4-2-1934. రచనలు : "వైజయంతి" (ఖండకావ్యసంపుటి) «ప్రతిమ» (భాసనాటకమున కనుకృతి), శ్రీ వేంకటేశ్వరవిశ్వవిద్యాలయంలో పట్టపరీక్షకు పాఠ్యగ్రంథము. కొన్ని నాటికలూ — గేయాలూ. ప్రస్తుతం అనంతపురం ప్రభుత్వకళాశాలలో ఆంధ్రాధ్యాపకులు. లలితపదప్రయోగంతో వీరికవిత చాలా హృదయంగమంగా ఉండి రసికులను ఆకర్షిస్తుంది.

## 111. శ్రీ మండలపర్తి ఉపేంద్రశర్మ (పుటలు 430-433)

జననం : 1-7-1912. రచనలు : తిక్కన, రవీంద్రుడు, కైమోడ్పు, మనవిషయము, సరోజిని, వ్యాసముల ఉపన్యాసము, ఆదర్శజీవితములు, అనువాదములు, Paper Submitted to the All India Oriental Conference, Short History of Telugu Prose literature, భారతీయ భాండాగారోద్యమము, ఆంధ్రోద్యమచరిత్ర. ప్రస్తుతం గుంటూరు హిందూకళాశాలలో ప్రాచ్యభాషాశాఖాధ్యక్షులు. సాహిత్యవిమర్శనారంగం లోనూ, వచనవాఙ్మయ పరిశోధనలోనూ; గ్రంథాలయోద్యమంలోనూ వీరు చాలా కృషిచేశారు. అనేక సంస్థలు నిర్వహించి ఉన్నతికి తెచ్చారు.

## 112. శ్రీ నందివెలుగు వేంకటేశ్వరశర్మ (పుటలు 434-435)

గ్రామము: మైలవరం. కృష్ణామండలం. జననం: 1916, వృత్తి: ఉపాధ్యాయుఁడు; S.P.S స్కూలు మైలవరం. కృతులు: శివమతి బుఖమాల, పార్వతీశస్తవము. గణపతి తారావళి. ఉపాధ్యాయుఁడు, దుర్గాదేవిస్తవము, శ్రీకంఠ విజయము, బోధానందవిజయము, నీతిమాలిక, వేమనస్తుతి, (అముద్రితములు) భక్తలీల, గాంధీరత్నమాల, తెలుఁగు వాఁడా! గణపతికళ్యాణము, వేదాంతడిండిమము, శ్రీతిరుపతివేంకటేశ్వరతారావళి, బాలకోటీశతారావళి, ఆదిశైవప్రభావము, (వచనము) శివాద్వైతము, ఇత్యాదయః. బిరుదములు: కవికోకిల (నందిగామ) కవితిలక (విజయవాడ) కవిభూషణ (పుంగనూరు) ఆగమికప్రతిష్ఠాచార్య. సమ్మానములు: సింహతలాటకంకణాదులు, (చుండూరు, విజయవాడ).

## 113. శ్రీ యస్వీ జోగారావు(పుటలు436-437)

భార్గవులు జననం: 2-10-1928 పార్వతీపురంలో తల్లి సరస్వతి వాగ్గేయకారిణి. తండ్రి: సాంబశివరాయకవి. చిన్ననాట పెదతండ్రి శ్రీ కలియుగంగారికడ కవితా వ్యాసంగం. 1949-52సం. లలో ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో ఆంధ్రశాఖలో విద్యాభ్యాసం. 1952లో ఆనర్సులో ప్రథమశ్రేణిలో ప్రథముడుగా ఉత్తీర్ణత. తదుపరి ఆం. వి పరిషత్తులో భారతకేంద్రప్రభుత్వపరిశోధన పండితభృతితో వాఙ్మయపరిశోధన. 1957లో డాక్టరు పట్టభద్రత. 1959లో ఆం. వి. ప. వారినుండి ఉత్తమపరిశోధనగ్రంథనిర్మాతగా సర్. రఘుపతి వేంకటరత్నం సువర్ణపదకస్వీకారం. ప్రకృతం ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో ఆంధ్రశాఖలో ఉపాధ్యాయవృత్తిలో ప్రవృత్తి. రచనలు: పంచకళ్యాణి (ఖండకావ్యసంపుటి) సప్తతంతువు (సాహిత్యవిమర్శనవ్యాససంపుటి) ఆంధ్రయక్షగానవాఙ్మయ చరిత్ర ఆంధ్రవిశ్వకళాపరిషత్ప్రకాశితము) ఉపనిషత్తు (కావ్యము) అప్సరస (గేయనాటికసంపుటి) పాచికలు (నాటికలసంపుటి) సువర్ణశృంఖల (కథానికలసంపుటి) మధురమాధవం (నాటిక) లోకాభిరామాయణం (గల్పికలు ప్రవల్హికలు మొ.) చోమోలుంగ్మా (నవల) తెలుగులో 'ఊహాప్రహేళిక' అనే నూత్నప్రక్రియ ఈయన చేతి అపూర్వసృష్టి (అవతారం మన్వంతరం మొ.) ఇంకా వివిధసాహిత్యవిషయాలపై అముద్రితవాఙ్మయంపై విమర్శలు, పరిశోధనాత్మకవ్యాసాలు పలుపత్రికలలో ప్రకటితములు. నూతనభావములు కలిగినవ్యక్తి. ఉత్తేజపూరితము ఉల్లాసకరమునునైన కవితా వ్యాసంగమును చేసిన మధురకవులు నటనాసంప్రదాయముల నెఱిగి అనేకమంది యువనటులను నూతనోత్సాహమును కల్పించిన నాటకకళోపాసకులు. తనతీయని కవితలతో విద్యార్థులందు కవితాభిమానమును రేకెత్తింపగలిగిన సుందరభావుకులు.

## 114. శ్రీ సి. నారాయణరెడ్డి(పుటలు438-439)

జననం : ప్రజోత్పత్తి, ఆషాఢపూర్ణిమ. విద్య : ఎం. ఏ. (తెలుగు) ఉస్మానియా విశ్వవిద్యాలయంలో. ఉద్యోగం: తెలుగు లెక్చరర్, నిజాంకాలేజీ, ఉస్మానియావిశ్వవిద్యాలయం. ఇతరభాషా పరిచయం : ఉర్దూ, హిందీ, ఇంగ్లీషు సాహిత్యకృషి : విద్యార్థిదశలో ఆర్ట్సుకాలేజీ సాహిత్య సంచిక 'శోభ' సంపాదకత్వం; వివిధవిద్యార్థుల సాహిత్య సంస్థల కార్యదర్శిత్వం. తర్వాత 'తెలంగాణా రచయితల సంఘం' ప్రధానకార్యదర్శిగా 4, 5 ఏండ్లపాటు సాహిత్య సేవ. తెలంగాణాలో వివిధమండలాలలో కవిసమ్మేళనాలద్వారా జాగృతి కలిగించడం. 'స్రవంతి, సంపాదకవర్గంలో ఉండడం. ఆంధ్రప్రాంతంలో నేకాక ఢిల్లీ, జంషెడ్‌పూర్, బరంపురం మున్నగు ఆంధ్రేతరప్రాంతాలలో సన్మానాలు పొందడం, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యవర్గసభ్యత్వం (రెండుసార్లు) ప్రస్తుతం "ఆధునికాంధ్రకవిత్వములో సంప్రదాయములు, నూత్నప్రయోగములు" అన్నవిషయంలో డాక్టరేట్ పట్టంకోసం రిసెర్చిచేస్తుండటం. ప్రచురణలు : నవ్వనిపువ్వు. అజంతాసుందరి, వెన్నెలవాడ అనే గేయనాటికా సంపుటాలు నాగార్జునసాగరం, కర్పూరవసంతరాయలు, విశ్వనాథరాయుడు, ఋతుచిత్రం మున్నగుకావ్యాలు, స్వప్నభంగం, విశ్వగీతి, దివ్వెలమువ్వలు, జలపాతం మొదలగు ఖండకావ్యాలు, రామప్ప అనే సంగీతరూపకం. (ఇది 12 భాషలలో తర్జుమా చేయబడి అఖిలభారత కార్యక్రమంలో ఆకాశవాణినుండి రిలేచేయబడింది. అనేకపద్యాలు, గేయాలూ, సంగీతరూపకాలూ, వ్యాసాలు - పత్రికల్లో రేడియోల్లో .... .. అఖండకీర్తిగల మధురకవిశేఖరులు.

## 115. శ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రి (పుటలు 440-449)

జననం : శ్రీసాధారణ ఆషాఢశుక్ల తృతీయాస్థిరవాసరం (జులై 1910) సకలవిద్యాలయమైన విజయనగరంలో వీరిది కౌండిన్యగోత్రము. విజయనగరమహారాజ సంస్కృత కళాశాలలో విద్యాభ్యాసం చేశారు. శ్రీమాన్ పరవస్తు గోవిందాచార్యులవారివద్ద అలంకారశాస్త్రాన్ని, బ్రహ్మశ్రీ గంటి సూర్యనారాయణశాస్త్రిగారివద్ద పూర్వమీమాంస, తర్కములు, బ్రహ్మశ్రీ అప్పల జోగన్నశాస్త్రి, కాదూరి వేంకటశాస్త్రి, మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయ శాస్త్రిగార్లవద్ద వ్యాకరణాన్ని, భారతీయసంప్రదాయసార్వభౌమ జగద్గురు శ్రీ కళ్యాణానంద భారతీమాంతాచార్య మహాస్వాములవారిదగ్గర ఉత్తరమీమాంసను అధ్యయనం

చేశారు. అక్షరసమామ్నాయము, లోచనము (అక్షరదర్శన వ్యాఖ్య) కళ్యాణలీల అనే గ్రంథాలు వ్రాశారు, వేదాంతపారీణ, వ్యాకరణవిద్యాప్రవీణ అనే బిరుదాలు వీరికున్నవి. అనేకశిష్యులకు శంకరభాష్యపాఠప్రవచనము సల్పుచు వేదధర్మోద్ధరణకై నిరంతరము పాటుబడుచున్న విద్వద్వర్యులు. ప్రస్తుతం గుంటూరు హిందూకళాశాలలో సంస్కృతాంధ్రాధ్యాపకులుగా నున్నారు.

## 116. శ్రీ దాశరథి (పుటలు 450-451)

జననం: 1927 ఓరుగల్లు జిల్లా గూడూరులో ఉస్మానియావిశ్వవిద్యాలయంనుండి ఇంగ్లీషుసాహిత్యం ముఖ్య విషయంగా బి. ఏ. పట్టం పొందారు. 1943నుండి 47దాకా గార్లజాగీరుప్రాంతంలో జాగీర్దారీవిధానానికి వ్యతిరేకంగా పోరాటం జరిపారు. 1947లో హైదరాబాదు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని ఓరుగల్లు నిజామాబాదు హైదరాబాదు జైళ్ళలో నిర్బంధించబడ్డారు. 1952లో తెలంగాణా రచయితలసంఘం స్థాపించి రెండుపర్యాయము లధ్యక్షులుగా నున్నారు. ప్రస్తుతం హైదరాబాదు ఆకాశవాణిలో ప్రవచనశాఖాసహాయప్రయుక్తులుగా ఉంటున్నారు. అగ్నిధార, రుద్రవీణ, మహాంధ్రోదయం, మహాబోధి, పునర్నవం, అమృతాభిషేకం, మొదలైన అనేక కావ్యాలువ్రాశారు. ప్రతిభావంతులైన కవివరులై అశేష ప్రజల ఆదరాభిమానాలు చూరగొన్నారు. ఉత్తేజాన్ని కల్గించేశక్తి వీరికవిత కున్నది.

## 117. శ్రీ రాయసం వీరభద్రశర్మ (పుటలు 452-454)

ప్రతిభాసమున్నతులైన వీరు తీవ్రమైన పట్టుదల నిరంతర విద్యాకృషి గల పరిణత మనస్కులు, వీరిగేయకవితారచన ఒక ప్రత్యేకమార్గాన్ని అనుసరించి పాఠకునికి ఉత్సాహాన్ని కల్గిస్తుంది. విజ్ఞానము ప్రజ్ఞ సమ్మిళితమైన వీరివచన గేయాలు అత్యంతాకర్షకాలు ఉస్మానియా యూనివర్సిటీలో బి. ఏ. డిగ్రీ పొంది కొంతకాలం ఉన్నతపాఠశాలలో ఉపాధ్యాయులుగా పనిచేసి ప్రస్తుతం హైదరాబాదులోని ఆంధ్రజనతాపత్రికకు ఉపసంపాదకులుగా నున్నారు.

## 118. శ్రీ ధారా రామనాథశాస్త్రి (పుటలు 455-457)

జననం: 11-6-1932 ఒంగోలులో. విద్యాభ్యాసం: గుంటూరు, మదరాసుకళాశాలల్లో M. A. తెలుగు. వృత్తి: 1953నుండి ఆంధ్రోపన్యాసకుడు, C.S.R. శర్మ కళాశాల, ఒంగోలు. కృషి: అస్పృశ్యులు (ఆంధ్రప్రభుత్వ బహూకృతము) రత్నగర్భ, విశ్వవీణ, కోటిదీపాలు, తపోభంగం. మొ. నృత్యనాటికలు. కంచుగోడలు. పృథ్వీపతి, నారాయణం, మొ. నాటికలు రసలోకంలో తూర్పు పడమరలు, నాట్యప్రగతి, విమర్శనాగ్రంథములు, అనేక వ్యాసాలు, కథలు. నాటకసాహిత్యరంగాల్లో నూతనాధ్యాయం ప్రారంభించి సద్యఃస్ఫురణతో చతుర్విధాభినయ నిర్వహణపూర్వకమైన నాట్యావధానము వీరిసృష్టి. పండిత పామరులచేత ప్రశంసలందుకొన్న యీప్రక్రియ రెండు విభిన్నరంగాలసమన్వయం.

## 119. శ్రీ విశ్వం (పుటలు 458-459)

జననం : 21-10-1915. తరిమెల, అనంతపురంజిల్లా కర్నూలు, తిరుపతి వగైరాలలో చదువు. మదరాసు విశ్వవిద్యాలయంసంస్కృతాంధ్రాలలో విద్వాన్. కాశీహిందూ విశ్వవిద్యాలయంలో సంస్కృతఖండకావ్యాలు పరిశోధన. 1937 – '41 దాకా రాజకీయాలు. అనంతపురంజిల్లా కాంగ్రెసు ప్రధానకార్యదర్శిగా యోజనసంఘం, క్షామ నివారణసంఘ కార్యదర్శిగా ప్రజాసేవ ఆసందర్భంలోనే కారాగారవాసం. రచనలు : దాదాపు 500 దాకా— విరికన్నె మొదలు పెన్నేటిపాటదాకా కావ్యాలు; నాటకాలు, నాటికలు, నవలలు, రాజకీయ గ్రంథాలు. అనువాదాలు: కాదంబరి, దశకుమారచరిత్ర వంటివి. సంస్కృతంనుంచీ. ఇబ్సెన్, ఓస్లోహారం, గోర్కీ, చెకోవ్, రోమారోలా వంటి ప్రపంచప్రసిద్ధరచనలు ఇతర రచనల నుంచి అనువాదాలు అనేకం.

ఉద్యోగాలు : నవ్యసాహిత్యము, నవ్యసాహితీ ఎడిటరుగా 1944 దాకా అతర్వాత మీజాన్‌ప్రజావాణి పత్రికలలో 1952 – 1959 ఏప్రియల్ దాకా ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక సంపాదకుడుగా 1959–60లో ఆంధ్ర

పత్రిక అసిస్టెంట్ ఎడిటర్ - 1960 జూన్ నుండి ఆంధ్ర జ్యోతి అసిస్టెంటు ఎడిటరు. సంస్కృతం పాళీ ప్రాకృత హిందీ, బెంగాలీ, వివిధభాషలలో తెలుగులోకలిపి, పత్రికలలో రచనలనేకం. భాషాపరిశోధకులు "పదబంధ పారిజాతం" సంపాదకులుగా ఉండటం, రచనే బ్రతుకు, బ్రతుకే రచన.

## 120. శ్రీ యన్. సి. హెచ్. కృష్ణమాచార్య (పుటలు 460-466)

జననం: 15-9-1923. తండ్రిగారయిన తి. న. చ. సం. జగన్నాథ తిరువేంకటాచార్యులుగారివద్ద నాటకాలంకార సాహితి. సిద్ధాంతకౌముది, తర్కసంగ్రహం. పఠనం. 17వ సంవత్సరంలో సంగీతాభ్యాసం 1948నుంచి విజయవాడ ఆలిండియారేడియోలో వాయులీన విద్వాంసులుగా ఉద్యోగం. రచనలు: (తెలుగు) త్యాగరాజచరిత్రము, శరశ్లోపచరిత్రము, నారాయణశతకము, బిడాలమోక్షము. సంస్కృతము: భూప్రశంసా, శరశ్లోపచరితం.

## 121. శ్రీ దామరాజు పుండరీకాక్షుడు (పుటలు 467-469)

జననం: 1898లో. గుంటూరుజిల్లా సత్తెనపల్లితాలూకా పాటిబండ్లలో కవితాభ్యాసం వీరికి చిన్నతనాన్నించి వచ్చింది. స్వాతంత్ర్యోద్యమసందర్భంగా అనేకనాటకాలు వ్రాసి ప్రజలలో ఉద్రేకం కలిగించారు. లాప్యాసై కొంతకాలం వకీలుగా పనిచేశారు. ఆంధ్రాభిమానము, భగవద్భక్తి గలిగిన వీరు నిస్వార్థముగా జాతికొరకు మానవోద్ధరణముకొరకు తమయావచ్ఛక్తినీ ధారపోశారు. ఒకప్పుడు వీరినాటకాలను కొన్నింటిని బ్రిటిషుప్రభుత్వం నిషేధించింది. గాంధీమహోదయం, గాంధీవిజయము, పంజాబుదురంతములు, గుంటూరుగొప్ప, కలియుగప్రహ్లాద, స్వరాజ్యమహాసభ, సంస్కారిణి, ఓట్లప్రహసనము కెమాల్ పాషా జీవితము, భగవాన్నారద, కుంభరాణా, తారాశశాంకములు, శ్రీనాథపోతన, రణభేరి, స్వరాజ్యసౌధము, రష్యారాజ్యం, జర్మనుయుద్ధం, కలియుగకురుక్షేత్రం, ఇదా స్వరాజ్యం, నిలువీత, విజయాంధ్ర మొదలైన అనేక గ్రంథాలు రచించారు.

## 122. శ్రీ భాగవతుల వేంకటసుబ్బారావు (పుటలు 470-473)

జననం: 1-7-1914. 1930వరకు ఆంగ్లవిద్యాభ్యాసము అప్పటినుండి 1940వరకు సంస్కృతము కావ్యనాటకాదులు. 1940లో విద్వాన్ప్యాసగుట. 1945నుండి నరసరావుపేట మునిసిపల్ హైస్కూలులో తెలుగుప్రధా

కరణ. బ్రహ్మశ్రీ, లంకా సీతారామశాస్త్రిగారితో కలిసి రెడ్డిరాజులు, బ్రహ్మన్నవిజయము ప్రబోధము అను వచనకావ్యములు వ్రాసిరి. ఇటీవల సుమారు 110 సంవత్సరాలనాడు కొప్పరాజు నరసింగ కవిచే రచింపబడి బహుశిధిలావస్థలో దొరకిన శ్రీ మత్త్రికూటాచాలమాహాత్మ్యము అను కోటీశ్వరస్వామిచరిత్ర పరిష్కరించి ముద్రింపించిరి. త్రికూటేశ్వర శతకము శ్రీరఘురామశతకము ఇత్యాది రచించిరి.

## 123. శ్రీ కోటభట్టరు వేంకట రంగాచార్యులు (పుటలు 474-475)

సంప్రదాయబద్ధమైన సాహిత్యకృషి విశిష్టమైన పాండిత్యం గల వ్యక్తులు. జటాయువు, వేంకటాద్రీశ్వరశతకము, మేనక, సుధామంజరి మొదలైన అనేక కావ్యాలు రచించారు. ప్రస్తుతం హైదరాబాదులోని చిక్కడపల్లినివాసం (H. No. 1-8-238) మృదుమధురమైన శైలి. భావస్ఫోరకమైన పదప్రయోగం గల వీరి రచనారీతివాఙ్మయానికి చాల అలంకారప్రాయమైనది.

## 124. శ్రీ కుందుర్తి (పుటలు 476-480)

పూర్తిపేరు: కుందుర్తి ఆంజనేయులు.

జననం: 1922 డిశెంబరు 16. నరసరావుపేటతాలూకా కోటావారిపాలెం గ్రామంలో. విద్యాభ్యాసం వినుకొండ విజయవాడ, గుంటూరు, ఆంధ్రక్రైస్తవకళాశాలలో పట్టభద్రులు. నవ్యకళాపరిషత్, నవ్యసాహిత్యపరిషత్, ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘాలతో పరిచయం. రచనలు : తెలంగాణా ఆధునికవచనగేయకావ్యం, ఆశ వచనగేయ

నాటకం, యుగేయుగే గేయసంపుటి. ఆధునికవచన గేయానికి (Free verse) ఆంధ్రసాహిత్యంలో సుస్థిరత కల్పించాలని కృషిచేసే ప్రముఖయువకవుల్లో అగ్రగణ్యులు. కవిత్వంలో ప్రయోగశీలి. వందపేజీలవరకు వచనగేయాన్ని విసుగులేకుండా పాఠకునిచేత చదివించగల కవితాశక్తితో సూటిగా, ఘాటుగా చెప్పే నేర్పరి. వచనగేయపద్ధతిలో సంపూర్ణకావ్యనిర్మాణం సంకల్పం. ప్రస్తుతం హైదరాబాద్‌లో జిల్లాపబ్లిక్‌రిలేషన్స్ ఆఫీసరుగా ఉన్నారు.

## 125. శ్రీ ధనకుధరం (పుటలు 481-483)

పూర్తిపేరు: ధనకుధరం వేంకటాచార్యులు

జననం : 1923. రచనలు - ఉక్కుపాదం, మంజూష (బాలసాహిత్యం) అముద్రితాలు: జాగృతి (ఖండకావ్యం), భల్లటశతకం, రామాయణం, గడుగ్గాయి. వీరు సంస్కృతాంధ్రాంగ్లసాహిత్యములలో ప్రత్యేకమైన పరిశ్రమ చేసినవారు. విప్లవాత్మకమైన భావచాలనస్నిగ్ధగంభీరమైనరచనారీతి ప్రజ్ఞాపరిణతమైన కౌశల్యము వీరిసాహితికి ఎంతో వన్నె తెచ్చినవి. నిత్యనూతనమార్గగాములైన సరస్వతీసముపాసకులు వీరు.

## 126. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం (పుటలు 484-496)

జననం: 1908 తూర్పుగోదావరిజిల్లాలో. అధికారికమైన సాహిత్యకృషి, ప్రసన్నమైన వచోవైఖరి, రమణీయ రచనాపాటవము గల విబుధవరులు. ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆంధ్రశాఖాధిపతులుగా ప్రొఫెసరుగానున్నారు. తెనుగుదుక్కి, (సాహిత్యవ్యాసపంకలనము), ఆంధ్రసాహిత్యచరిత్రసంగ్రహము. ఇంకా అనేకగ్రంథాలు వ్రాశారు. శ్రీ బాలేందుశేఖరంగారితో కలసి ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి అనే గ్రంథాన్నిరచించారు. కాకతీయ చరిత్రకు సంబంధించిన సిద్దేశ్వరచరిత్ర (కాశసర్వప్పరచించినది) సంపాదకులుగా విపుల పీఠికతో ప్రచురించారు. సంగ్రహాంధ్రవిజ్ఞానకోశాన్ని ప్రకటించటంలో నిమగ్నులైయున్నారు. ఆంధ్రరచయితలసంఘానికి వీ రధ్యక్షులు హైదరాబాదులోని ఆంధ్ర ఓరియంటల్ కాలేజి సంస్థాపకులు.

## 127. శ్రీ మహావాది వేంకటరత్నం (పుటలు 497-503)

జననము: 1909 ఫిబ్రవరి. సంస్కృతాంధ్రాంగ్లాలలో చక్కని ప్రజ్ఞ గలవారు. బహుగ్రంథరచన బహుసాహిత్య కార్యకలాపనిర్వహణ గల వ్యక్తులు. 1930 నుంచి 1935 వరకు ఏ. సి. కాలేజి తెలుగుఅధ్యాపకులు. 1937 నుంచి 1944 వరకు సత్తెనపల్లి శ్రీ శరభయ్యగుప్తహిందూ హైస్కూలు 1946 నుంచి నేటివరకు అమరావతి హైస్కూలు. రచనలు: హరిదాసు, నాగరాజ, బాటసారి విజయధ్వజము, శబరి, విశ్వభారతి, ముక్తావళి, ఆంధ్ర వచనభారతము, విక్రమాదిత్యము, జయభారతి (ఆదిసభాపర్వములు) మున్నగునవి.

## 128. శ్రీ వావిలికొలను లక్ష్మీనరసింహారావు (పుటలు 504-510)

జననము : 15-5-1920. ఏర్చూరు మాతామహ గృహంలో. నివాసము, వినుకొండ. ప్రవాసము శుకనగరము, రచనలు : రామరాజ్యము, 1958. సింహాచల క్షేత్రములో 1961 దీనిలోనిభాగమునకు Cup బహుమతి. విశిష్టాద్వైత మతప్రచారకసంఘముచే బహుకరణ. నేతాజి గుడివాడ ఆంధ్రనలందా శ్రమదానానికి 100రూపాయలు. రాజసింహ (హిస్టారికల్ ప్రబంధము). ఖండికలు: విపంచి వివిధరచనలు. లీలామృత్యుంజయము (శైవము) నాటికలు కన్యకాపరమేశ్వరి, (పెనుగొండలో వైశ్యప్రముఖులఎదుట ప్రదర్శింపబడినది), భూకైలాస్ (పౌరాణికము), జలంధర (పౌరాణికము) గ్రామరాజ్యము (డెవలప్‌మెంటునాటకము) పాతాళభైరవి (నాటకము), రాణాప్రతాప్, ప్రేమజ్యోతి బుర్రకథలు : రాణాప్రతాప్, విజయదశమి. శతకములు: బాల, కోదండరామ, జ్యోతిర్మయి. మధురమధురాలు అనేపేరుతో రచనలు చేస్తుంటారు. మెత్తనిపదాలకూర్పుతో అత్యంతమధురమైన వీరి పలుకు సహృదయహృదయంగమంగా భాసిస్తుంది.

లలితలలితములైన పదములను ప్రయోగించడంద్వారా అత్యంతప్రసన్నమైన శైలీవిశేషాన్ని సృష్టించుకొన్న మధుర

కవితానిర్మాత. నటన నాటకరచనలలో అందెవేసిన చేయి సంప్రదాయబద్ధమైన పండితకుటుంబానికి చెందినవ్యక్తి. ప్రస్తుతం గుంటూరు జిల్లాపరిషత్తుక్రింద చిలకలూరిపేటలో ప్రాథమిక ఉపాధ్యాయులుగా నున్నారు.

## 129. శ్రీ నాదెళ్ళ మేధాదక్షిణామూర్తి (పుటలు 511-515)

జననము: ది. 26-1-1894కి సరియయిన శ్రీ విజయ సం. పుష్య బ॥శుక్రవారము. వీరికి ప్రాచీనసాంప్రదాయానుసారముగా నిఘంటువులై బాలరామాయణము రఘువంశము బోధపఱచగా నెనిమిదవయేటనుండియే సంస్కృతకవిత్వమును దొమ్మిదవయేటనుండి తెలుగురచనమును నిసర్గధారగా నేర్పడెను. పరిశ్రమము వ్యాకరణమందు నలంకారశాస్త్రమునను బరంపరాగత జ్యోతిశ్శాస్త్ర ధర్మశాస్త్ర మంత్రశాస్త్రములందు నందినదే కాక హూణవిద్యయందు ఎఫ్. ఏ. వరకు నుత్తీర్ణతగనుట 'నశ్వావృత్తిక దాచన' న్యాయవర్తియై నైష్ఠికమైన కాలక్షేపమొనర్చుచుండురు. వీరు ప్రఖ్యాతులైన పురుషోత్తమకవిగారి కుమారులు. వ్రాసినగ్రంథములు. సంస్కృతము: అష్టకమాల, ప్రార్థనాశ్లోకావళి, ఆత్రేయస్తోత్రానందము. తెలుగు: (మాతృస్తుతిరూపమైన) ముక్తికాంతామణీశతకము, ఉత్తమనీతిభాస్కరము, పితృచరిత్రము, ఉత్తమజీవయాత్ర, పరమహంసప్రబోధము, (శ్రీరామకృష్ణపరమహంసలచరిత్రము, సుదోధ్బోధమునుగలది) శ్రీవేమయోగీయము శ్రీ దత్తాత్రేయ భక్తిదీపకముగా శ్రీసద్దత్తపురాణము, శ్రీగురుదత్తసరస్వతీయము (జ్ఞాన, కర్మ, భక్తికాండాత్మకము) శ్రీ దత్తభావసుధారసము, ఉత్తమయోగివృత్తము, ఆంధ్రకవిప్రశంస, హాలికప్రశంస, యశోవిహారము, దశమగ్రహతారావళి, ఆంధ్రీకృతవేదాంతడిండిమము, శ్రీకృష్ణసందేశము (నాటకము) సీతారామతారావళి, శ్రీ సీతారామసుప్రభాతము మున్నగాగలవి. ఇంకను వీరిచే పరిష్కరణమందిన గ్రంథములు నానావిద్వత్కవికృతము శతాధికము. అందుకొన్నిటికి పీఠికలును గలవు. శ్రీకామాక్షీస్తుతిని శంకరవిజయాదికర్తయా నిజశిష్యునివలన గృతినందిన విద్వత్కవితాతపస్వులు.

## 130. శ్రీ ఉప్పల వేంకటశాస్త్రి (పుటలు 516-517)

వీరు ప్రాచీనసంప్రదాయబద్ధమైన విద్వత్తు కలవారు. శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి శిష్యులు. అవధాననిపుణులు. శతవధానములు చేసినవారు. ఎన్నో కావ్యాలు నాటకాలు వ్రాశారు. విశ్వజ్యోతి, కుమారవిజయము మొదలైనవి వీరి రచనలు. కర్నూలుజిల్లా మార్కాపురం తాలూకా అన్నసముద్రందగ్గర ముడివేముల వీరి నివాసం.

## 131. శ్రీ జి. జోసఫు (పుటలు 518-518)

జననం: 1908 సం. మే నెల 14వ తేదీ సూర్యోదయ కాలం. గుంటూరుజిల్లా వినుకొండతాలూకా గోకనకొండలో ప్రస్తుతం అక్కడే ఉపాధ్యాయులుగానున్నారు. రచనలు: భక్తవిజయం, చంద్రహాస, భారవి, కన్నీటి కబురు, వసంతకుమారి, కట్టమంచి వివేకానందసింహగర్జనము, కథాగుచ్ఛము. ఆచార్యరంగా, మద్యపాననిషేధము జానకి, భారతీయుడు, ముద్రితగ్రంథాలు. కవిచక్రవర్తి, వేమన, తిమ్మరుసు, జగ్‌జీవన్‌రామ్ అముద్రితాలు. పద్యరచనలోను గద్యరచనలోనూ నాటకనిర్మాణంలోనూ అందెవేసినచేయి. కవిరాజ, కవిశేఖరబిరుదాంచితులు.

## 132. శ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులు (పుటలు 520-526)

పరీధావిసంవత్సర చైత్ర శుద్ధ యేకాదశి శుక్రవారము పండిత ఉమాకాంతవిద్యాశేఖరులు, 'అభినవతిక్కన్న' తుమ్మల సీతారామమూర్తి విద్యాగురువులు. అవధానములు కావ్యరచనములు. జాతీయోద్యమములలో పాల్గొనుట (గాంధేయము) నవభారతములు 4000 పద్యములు. జాతీయోద్యమచరిత్ర.) పేదరాలు, (భావము, భారతమాత, జాతీయం, (పార్వతి) పద్యకావ్యము. (అపన్న) తెలంగాణా రజాకారులకథలు జాతీయము (బాటసారి) హరిజనోద్యమము జాతీయము (లోకబాంధవులు) కష్టజీవులవర్ణన జాతీయం (భువనజ్యోతి) గాంధిమహాత్ముని జాతీయము (అటుకులమూట) (కుచేల) (పురాణం) నువ

ర్ణాంజలి) ఖండకావ్యము (అన్న) నివాసం గుంటూరుజిల్లా పల్నాటితాలూకా మోర్జంపాడు. వీరు పల్నాటిసోదరకవులలో ఒకరుగా ఆంధ్రదేశమున సుప్రసిద్ధులు- తెలుగుపలుకుబడిలోనూ రచనాశిల్పంలోనూ విశిష్టత గల వ్యక్తి.

## 133. శ్రీ కోన వేంకటరాయశర్మ (పుటలు 527-530)

జననం : 1897వ సం॥ అగష్టు 6 పండితశేఖరులై భాషాసేవకులై విమర్శకాగ్రగణ్యులై ఆంధ్రభారతికి చాలసేవ చేశారు వీరు. ఎక్కడో మూలబడివున్న ఆంధ్రమహాపురుషులలో వివిధరంగాలలో మహనీయులను వెలికితెచ్చి వారి జీవితచరిత్ర లందించారు. సచివోత్తములు, దుర్గాధిపతులు దండనాయకులు, చరిత్రపరిశోధకులు, మున్నగునవి వీరి రచనలు. ఆంధ్రసారస్వతపరిషత్తుకు కార్యదర్శిగా చిరకాలం నుంచీ భాషాసేవ చేస్తున్నారు. బాపట్ల వీరి నివాసం.

## 134. శ్రీ భువనగిరి విజయరామయ్య బి. ఏ. (పుటలు 531-536)

జననము : తారణమాఘశుద్ధ పూర్ణిమ (30-1-1885) గుంటూరులో. బిరుదములు : ప్రతిభారవి, కవితాకళానిధి. ఉద్యోగము : 1906నుంచి 1940 వరకు రివిన్యూ ఆడిటు డిపార్టుమెంటులో. కృతులు : స్వతంత్రములు : శ్రీగణేశ్వరీయము, భారవిజీవితము I, II భాగములు, శతకకదంబము, శతకములు: మల్లికార్జునసహస్రము, సోదరోపదేశము, లోకకళ్యాణము I, II, III భాగములు, శ్రీవేంకటేశ్వరశతకము. అనువాదములు : కిరాతార్జునీయము, మేఘసందేశము, శ్రీమద్భగవద్గీత, అభిజ్ఞానశాకుంతల (నాటకము), అనర్ఘరాఘవము (నాటకము) శివానంద సౌందర్యలహరులు, శ్రీలక్ష్మీసహస్రము. మిశ్రములు : తేనెనుడిసోనలు (ఖండకావ్యసంపుటి). అచ్చుకానున్నవి : లోకకళ్యాణము, IV, V భాగములు, విజయజీవయాత్ర భీమసేనవిజయ నాటకము. 30-1-1940 నుండి ఉపకారవేతనము తీసుకొనుచు బ్రాడీపేటలో స్వగృహవాసులై యున్నారు.

## 135. శ్రీ వేదాంతకవి (పుట 537)

జననం : కీలకనామ సం॥లో. తండ్రి వేదవేదాంగ పండితుడు. దేశసేవాధురంధరుడు వేదాంతం శంభుశాస్త్రి తల్లి అన్నపూర్ణమ్మ. శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారూ, వీరు మేనత్త మేనమామబిడ్డలు. తిరుపతి వేంకటేశ్వరులు వీరి గురుదేవులు. అవధానములు, ఆశుకవితాసభలు అనేకస్థలముల చేసిరి. జాతీయోద్యమములో జైలుకు వెళ్ళిరి. నాటకసమాజములు స్థాపించి అనేకులను ద్రా చాలకాలము ఏకాంతముగా జగజ్జననినిగూర్చి తపస్సు చేసిరి. కనకాభిషేక, గజారోహణాద్యనేక సత్కారము లందుకొనిరి. బహుసభలలో పాల్గొనిరి, సుప్రసిద్ధులగు వీరు కవులలో ప్రత్యేకస్థానము కలవారు.

వీరిరచనలు : నాటకాలు : తెనుగుతల్లి, యుద్ధభూమి, కష్టకాలం, ఆకలిమంట, విశ్వస్వరాజ్యవిజయాలు, మహారధికర్ణ, ఛలోహైదరాబాదు, సోషలిజమ్, సర్వోదయం, తంతులు, గండపెండేరము. కావ్యాలు : అభిజ్ఞానశాకుంతల, కల్పతరువు, మహాగీత, మహావాక్యాలు, భగవన్మత భాష్యము, కవితాసంస్థానము, రసమురళి, ప్రభుత్వము, పట్టాభిషేకము, జగజ్జనని, మాయిలవేల్పు, పావురాలు, కిలార్నెట్. ఖండకావ్యాలు : వేదాంతకవికాంతులు, దండయాత్ర, నాయకులు, గడుగ్గాయి, కెరటాలు, కిరణాలు, పంజాదెబ్బ, ప్రపంచవిషయాలు, క్విట్ నుహా తెలంగాన్, కవితారాజధాని, తెనుగుమామిళ్ళు. పాటలు : వేదాంతకవికృతులు, క్రొత్తపాటలు, భావమేఘాలు. నవలలు : వచ్చేపోయ్యేరైళ్లు, వరదలు, చిగురాకులు. కథలు : చిరసాలు, అవ్వాయిచువ్వలు. “కవితాసంస్థాన్” మాస పత్రికాధిపతులుగా 4 సంవత్సరములనుండి నడుపుచుండిరి. ఆంధ్రప్రదేశ్ పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరులో గృహవసతులు నిర్మించుకొనిరి. భాగ్యనగర్ హైదరాబాదులో వుంటూ పత్రికానిర్వహణ గావించుచున్నారు.

## 136. శ్రీ కే. వెం. న్ృ. అప్పారావు (పుటలు 538-541)

పూర్తిపేరు: కేశిరాజు వేంకటనృసింహఅప్పారావు జననం: 14-3-1913. విద్య: ఉభయభాషాప్రవీణ. ఎం.ఎ.

(సంస్కృతము) విశారద (హిందీ) P.O.L. వృత్తి: ప్రిన్సిపాలు S.V.J.V. సంస్కృతకళాశాల కొవ్వూరు, పశ్చిమగోదావరిజిల్లా, రచనలు: ముద్రితములు గంగాలహరీ (సంస్కృతఖండకావ్యము) పంచవటీ. శిక్షణవిచారధార, (శ్రీ వినోబాహిందీగ్రంథమునకు ఆంధ్రానువాదము). అముద్రితములు: ఆంధ్రాభిజ్ఞానశాకుంతలము, పంచవటి, ఆంధ్రానువాదము, గాంధీగీత, (సంస్కృతశ్లోకములు) సంస్కృతాంధ్ర ఆంగ్లభాషలలో ఉజ్జ్వలమైనపాండిత్యం పరిశోధనాదీక్ష గల బహుకావ్యనిర్మాతలు వీరు.

## 137. శ్రీ గంటి జోగి సోమయాజి (పుటలు 542-550)

జననము: 7-10-1900. ఆంధ్రవిశ్వవిద్యాలయంలో తెలుగు ప్రొఫెసరుగా నున్నారు. ఆంధ్రభాషాచరిత్రచతురానన బిరుదాంచితులు. M.A. (సంస్కృతము) B. A. (Chy ) L.T. (Sci.) P.O.L. (సారస్వతవిమర్శ) విద్వా (తెలుగు) డిగ్రీలు వీరి కున్నవి. ఆంగ్లాంధ్ర సంస్కృత కర్ణాట, తమిళ, హిందీభాషలలో పండితులు. వీరి రచనలు: మతోద్ధారకుడు (బసవచరిత్ర) పద్యకావ్యము 1927. ధర్మసామ్రాజ్యము (చారిత్రకనవల) 1928. రామచంద్రుని హంపీయాత్ర (పద్యకావ్యము) 1929. ద్రావిడ భాషలు (భాషాశాస్త్రము) 1930. కాళిదాసు (విమర్శనము) 1933. మేఘసందేశము (ఆంగ్లవ్యాఖ్యానము—సంస్కృతము) 1930. ఆంధ్రభాషావికాసము (భాషాశాస్త్రము) 1947. ప్రాచీనకావ్యమంజరి (సంకలనము) 1957.

వీరు గొప్పపండితులు కవులు, భాషాశాస్త్రములో వీరు చేసిన కృషి నిరుపమానము. వీరి శిష్యులుగా తెలుగుదేశములో ప్రఖ్యాతిపొందినవారు చాలమంది కలరు. శాస్త్ర పరిచయము, పాండితీప్రకర్ష గల విద్వత్కవులు వీరు.

## 138. శ్రీ వేగుంట మోహనప్రసాద్ (పుట 551)

జన్మస్థలం: పావులూరు-ఒంగోలుతాలూకా. యువరచయితల సమితిసభ్యులు. కాశీ హిందూవిశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం. అధునాతనదృక్పథం గల్గిన రచయిత.

## 139. శ్రీ కోండ్రగుంట (పుట 552)

పూర్తిపేరు కోండ్రగుంట కృష్ణయ్య. గుంటూరు తాలూకా ఉంగుటూరు. యువరచయితలసమితి సభ్యులు.

## 140. శ్రీ అక్కిరాజు మృత్యుంజయరావు (పుటలు 553-556)

జన్మతేది: ఈశ్వరనామసంవత్సర పుష్య బహుళ త్రయోదశి. (29-1-38). జన్మస్థలం: గుత్తికొండ. ఇతర రచనలు: (అచ్చుఅయినవి) శ్రీనాథుని దేశము (విమర్శన) పదహారణాల ఆంధ్రులం (గేయము) పద్యరత్నములు, కల్పలత, నాజ్, (విమర్శ), వేదాంతి (వ్యాసావళి). (అచ్చు కావలసినవి) కథానికాగుచ్ఛము, గేయసంపుటి, ఖండకావ్యము (పద్యసంపుటి) విమర్శనలు, కాలేజివిద్యార్థి అను సాంఘికనాటిక. కల్పవల్లిక అను నవల.

## 141. శ్రీ హెచ్. ఆర్. వడ్డెంపూడి (పుట 557)

జననం: 26 12-1932 గుంటూరుజిల్లా గణపవరం గ్రామం. విద్యార్హతలు : బి. ఏ. వరకు చదువు - పత్రికా రచనలో గౌరవ డిప్లొమా. యోగ్యతలు : 1953 ఆంధ్ర దేశ విద్యార్థిసమాఖ్యవారిచే నిర్వహించబడిన పోటీలలో కథానికరచనలో మొదటి బహుమతి- నాటికారచనలో ద్వితీయబహుమతి. 1957 "వరల్డ్ యూత్" పత్రిక నిర్వహించిన వ్యాసరచనపోటీలలో అంతర్జాతీయగౌరవపట్టము. వృత్తి : పత్రికారచన- సంపాదకత్వం. ప్రస్తుత చిరునామా ప్రస్తుతం గుంటూరునుంచి వచ్చే గుంటూరున్యూస్ పత్రికకు సంపాదకులుగా నున్నారు.

## 142. శ్రీ "మురారి" (పుట 558)

పూర్తిపేరు మువ్వాళ్ళ రాధాకృష్ణమూర్తి. యువరచయితలసమితి సభ్యులు, జననం : 1-7-1931. గుంటూరులోని అరండల్ పేట నివాసం. విద్యాబోధన, సారస్వత వ్యాసంగం వీరి మార్గాలు.

## 143. శ్రీ పశర్లపాటి వాసుదేవశాస్త్రి

(పుటలు 559-563)

జననం: 9-2-1909. స్థలము: గుత్తికొండ గుంటూరు జిల్లా. రచనలు: అభయదానము, ప్రార్థనాంజలి, (శ్రీరామ స్తుతి) గోవిందగీతములు. అముద్రితములు: ద్విపదభగవద్గీత, గుత్తికొండ బిలమాహాత్మ్యము, (రగడకావ్యము) హనుమ న్నుతి (కందశతకము). సంస్కృతాంధ్రములలో చక్కని ప్రజ్ఞగలవారు.

## 144. శ్రీ ఏకా రామశేషగిరిరావు

(పుటలు 564-565)

జననం: 5-7-1929 విద్య: యం. ఏ., బి. ఇడి. వృత్తి: గుంటూరుజిల్లా పేరేచెర్ల గురుకులవిద్యావనం హైస్కూలు అధ్యాపకులు. 1950లో విజయకేసరి అనుమాసపత్రికను స్థాపించారు. 1947 మొదలు ఈనాటివరకు పత్రికలకు గేయాలు, కథలూ, వ్యాసాలూ వ్రాస్తున్నారు.

## 145. శ్రీ ముదిగొండ శివప్రసాద్

(పుటలు 566-567)

జననం: 23-12-1940. ఆరాధ్యబ్రాహ్మణకుటుంబంలో. స్వగ్రామం: గుంటూరుజిల్లా తాడికొండ. ఆంధ్రవిశ్వవిద్యాలయంలో యం. ఏ. విద్యాభ్యాసం. సనాతనధర్మప్రచారకులు, బహుగ్రంథకర్తలు. కీ. శే. మల్లికార్జనరావుగారి కుమారులు.వీరు కవులేకాదు సుప్రసిద్ధనటులు, విమర్శకులు. ప్రస్తుతం పూర్తిగా హిందూమతానికి కలం అంకితంచేసి హిందూమతమహార్ణవము, వీరశైవవిజ్ఞానసర్వస్వం అనే బృహద్గ్రంథరచన చేస్తున్నారు. పూర్ణిమ, జ్యోతిర్మయి, వీరశ్రీ, మహామల్లీయం, ప్రాక్పశ్చిమాలు, ఇత్యాదులు వీరి రచనలు.

## 146. శ్రీ సానికొమ్ము కృష్ణారెడ్డి

(పుటలు 568-569)

గుంటూరుజిల్లా సత్తెనపల్లితాలూకా పెదమక్కెన వీరి స్వగ్రామం. యువరచయితలసమితి కార్య గుంటూరులోని సంస్కృతకళాశాలలో విద్యాభ్యాసం.

## 147. శ్రీ కొండముది లక్ష్మీవేంకట హనుమంతరావు (పుటలు 571-575)

జననం: 22-3-1894 గుంటూరుజిల్లా తెనాలితాలూకా కొండముది వీరిస్వగ్రామం. వ్యవసాయం వృత్తి: ఆగమ శాస్త్రం వీరిరచన. సంస్కృతాంధ్రముల్లో చక్కని పాండిత్యం ఉంది.

## 148. శ్రీ పోతరాజు లక్ష్మీనరసింహకవి

(పుటలు 576-581)

జననం : సర్వధారి జ్యేష్ఠ బహుళ అమావాస్య. వయస్సు : 75 సంవత్సరాలు. రచనలు : మాఘపురాణం, సుమతిచరిత్ర, ఋతుధ్వజవిలాసము ండ్రి : రామకవి, తల్లి : సంజీవమాంబ. శ్రీవత్సగోత్రము. వీరితండ్రియైన శ్రీరామకవిగారు ఆంధ్రదేశమున సుప్రఖ్యాతులైన కొప్పరపు సోదరకవులకు గురువులు. వీరిది చాల ప్రఖ్యాతమైన విద్వత్కవికుటుంబము. వీరు చిన్నతనమునుండి అవధానాశుకవిత్వములలో విశ్రుతివహించి బహుసభలలో కీర్తిగడించిరి. మాఘపురాణము మొదలగు అనేకగ్రంథములు వ్రాసిరి. సంస్కృతాంధ్రములలో అపారమైన పాండిత్యము గల కవిశేఖరులు. అవధానిభూషణేత్యాది బహుబిరుద విభూషితులు.

## 149. శ్రీ రాయప్రోలు సుబ్బారావు

(పుటలు 582-584)

విశ్వకవిరవీంద్రుని సన్నిధిలో శాంతినికేతన్‌లో విద్యాభ్యాసం చేస్తూ ఇంగ్లీషు జర్మన్ భాషలలో కవితారీతులను గురించి పరిశోధన, అలంకారశాస్త్రాధ్యయనం చేశారు. ఉస్మానియా వేంకటేశ్వరవిద్యాలయాంధ్రశాఖాధ్యక్షులుగా పనిచేసి ప్రస్తుతం హైదరాబాదులో విశ్రాంతి కొంటున్నారు. జననం 1892. రచనలు: లలిత, కష్టకమల, స్వప్నకుమారము, జడకుచ్చులు, తెనుగుతోట, ఆంధ్రావళి, కన్నెపాటలు, తృణకంకణము ఇత్యాదులు.

## 150. శ్రీ రావిపాటి లక్ష్మీనారాయణ

(పుటలు 585-587)

జననం : 3-8-1909. గుంటూరుజిల్లా నర్సరావుపేట తాలూకా రావిపాడు స్వగ్రామం. ఆర్వేలనియోగిబ్రాహ్మణులు. ప్రస్తుతం నర్సరావుపేట సబ్ కోర్టులో శిరస్తాదారుగా నున్నారు. రచనలు : భారతగర్భరామాయణం, సర్వేశ్వరశతకం, మాచెర్ల చెన్నకేశవశతకం, గురజాల ఇష్టకామేశ్వరశతకం, పల్నాటివీరగాథ(వచనము), నాగార్జునకొండచరిత్రము, పల్నాటిచరిత్ర (వచనములు) వీరిభారతగర్భరామాయణము, నిర్వచనమై మూలపద్యములు రామాయణార్థము గర్భస్థపద్యములు భారతార్థము నిచ్చును. బహుపండితప్రశంసిత మైనది. విద్యా, భాషాప్రవీణ పరీక్షలకు పఠనీయగ్రంథముగా నుండినది. వీరు కవితాకోవిద, చిత్రకవిశేఖర బిరుదాంచితులు.

## 151. శ్రీ తంగిరాల కేశవశర్మ

(పుటలు 588-590)

జననం: 1935 సెప్టెంబరు. ఆంధ్రవిశ్వవిద్యాలయ పట్టభద్రులు. 'ఆరాధనే కళ కళే ఆరాధన' ఆరెండింటి సమన్వయమే తనజీవితంగా మలచుకొన్న సహృదయుడు. కృతులు: గంగాస్రవంతి, (గేయసంపుటి) కథాగుచ్ఛం, గుప్తనామం: భాగీరథి. ప్రత్యేకలక్షణం: సంఘసేవాసక్తి. ఉద్యోగం: జీవితభీమాకంపెనీ, భాగ్యనగరం.

## 152. శ్రీ కొప్పరపు వేంకటరత్నకవి

(పుటలు 591-593)

జననం: నందననామ సం. జ్యేష్ఠ శు ౬లు. వయస్సు 70 ఏండ్లు. తల్లి: తిరుమలమ్మగారు, తండ్రి: నరసింహంగారు, కొప్పరం స్వగ్రామం, వీరు ప్రఖ్యాతులైన కొప్పరపు కవి కుటుంబమునకు చెందినవారు. చిన్నతనమునుండి అవధానాలు కవితాసభలు గావించిరి. అనేకకావ్యములు వ్రాసిరి.

## 153. శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి

(పుటలు 594-597)

కవికంఠీరవ. విద్వత్కవివర, బ్రాహ్మీభూషణ, కవిమూర్ధన్య ప్రౌఢకవిచంద్ర బిరుదాంచితులు. అనేకగ్రంథములు వ్రా రాజవైద్యులు. చిరునామా: హరిహర ఆయుర్వేదనిలయం గంజాం వారిస్ట్రీటు, కాకినాడ, తూర్పుగోదావరిజిల్లా.

## 154. శ్రీ కె. వి. ఆర్. నరసింహం

(పుటలు 598-599)

పూర్తిపేరు: కాకర్ల రామనరసింహం.

జననం : 25-10-1914 ఆనందనామ సంవత్సర కార్తీక శుద్ధ సప్తమి ఆదివారము సీతానగరము శ్రీకాకుళంజిల్లా. వీరి యితర రచనలు : కనకాభిషేకం (చారిత్రకనవల), రఘునాథరాయలు (చారిత్రకనవల), సుజాత (కావ్యము), ఉషారాగము (ఖండకావ్యము), దక్షిణాంధ్రవాఙ్మయ చరిత్ర, ప్రమాణపద్ధతిపై ప్రసంగము, (డేకార్టు వ్రాసిన "Discourse on method" అను గ్రంథమున కాంధ్రీకరణము). పండితశేఖరులు : విమర్శకాగ్రగణ్యులు, కవివర్యులు ఐన వీరిరచనలు ఆంధ్రభాషాపోషకమూల్యం. ఆంధ్రగీర్వాణములయందు చక్కని పాండిత్యము కలిగినవారు. వీరి కవిత్వములో భావసంపద మిక్కుటము. సాహిత్యస్వరూపస్వభావములను సమగ్రముగా జీర్ణించుకొనిన సారస్వతమూర్తులు వీరు. సాహితీసేవకులుగా వీరి శిష్యులలో చాలమంది ప్రసిద్ధినందియుండిరి.

## 155. శ్రీ కల్లూరి చంద్రమౌళి

(పుటలు 600-606)

భగవద్భక్తులు, అతిథిసేవాపరులు, ఆదర్శగృహస్థులు, ఐన కీ. శే. వేంకమాంబ, సుదర్శనార్యులు తలిదండ్రులు. వీరు కర్షకోద్ధరణకు కంకణముదాల్చి 1924లో స్కాట్లండులో వ్యవసాయపట్టముపొందిరి. దేశసేవకై దీక్షబూని 1926లో కాంగ్రెసులోచేరి పెక్కుసారులు కారాగారములకడగండ్లుపడిరి; గుంటూరుజిల్లాబోర్డు అధ్యక్షులుగా ప్రజలకు వీరు చేసినసేవ నిరుపమానము. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అసెంబ్లీకి అధ్యక్షులై భయాందోళనలతో బాట కానరాక పరిభ్రమించు ఆంధ్రప్రజానీకమునకు ధైర్యోత్సాహముల పురికొల్పి ప్రదీప్తినొసగి కీర్తిగాంచినారు. శాసనసభ్యునిగా, స్థానికపరిపాలనాశాఖామంత్రిగా

(1947-52) గ్రామాభ్యుదయసాధకములగు అనేకచట్టములు ప్రవేశపెట్టినారు. ఎన్నో విప్లవాత్మకసంస్కరణలకు కారకులై ప్రజల మన్ననగాంచిరి. 1954లో కాంగ్రెసు ప్రధానకార్యదర్శిగా సంస్థకు నూత్నజవసత్వములు కూర్చిరి. ఇట్లు అనేకమంత్రివర్గములలోనుండి ప్రజాసేవ నేమరని దీక్షాసమన్వితులైన వీరు ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వదేవాదాయధర్మాదాయశాఖామాత్యులై జీర్ణదేవాలయోద్ధరణ దీక్షధరించి మహాద్భుతకార్యములు సాధించుచున్నారు. భద్రాచలరామాలయమునకు వీరు చేసినకృషి అనన్యసామాన్యము. విశ్వసంస్కృతపరిషత్తును తిరుపతికి ఆహ్వానించి అఖండోత్సాహముతో మహోత్సవములు చేయించినారు. అనేకస్థలముల కవిపండితులకు సత్కారములుచేయించి సారస్వతపోషకులై భాషారంగమున వెలుగుబాటలు తీర్చినారు. భారతీయప్రతిభ అను వీరి గ్రంథము మనదేశౌన్నత్యమును చాటిచెప్పు మహాకృతి. రామాయణ సుధాలహరి అను వీరి మహాగ్రంథము విద్వత్కవి సంభావితము. ఆంధ్రసాహిత్యవీథిలో ఈ గ్రంథము వచనరచనకు విమర్శారీతికి ఆదర్శప్రాయమైనది. రామతత్త్వవేత్తలు, రామభక్తులు, రామాలయోద్ధారకులైన వీరు ఆంధ్రావనిలో శాశ్వతయశశ్శ్రీవిలసితులైన మహాపురుషులు.

## 156. శ్రీజాస్తి వేంకటనరసయ్య (పుట 607)

“జాతీయ మధుర కవి” బిరుదాంకితులు, పండితులు, భాషాసేవకులు అయిన శ్రీ నరసయ్యగారు పాఠకలోకానికి చిరపరిచితులు. భాషాసౌలభ్యం భావ శబలత, వీరి కవితలో ద్యోతక మవుతుంటాయి. వీరు కవులేకాక దేశభక్తులు. గాంధీదేవుని సిద్ధాంతాలనందుకొని వాటిని గేయాలుగా, కథలుగా, అలి ప్రజానీకాని కందించటంలో నరసయ్యగా రెంతో కృషిచేశారు. వీరు శ్రీ డి. వి. సుబ్రహ్మణ్యంగారితో కలసివ్రాసిన కాంగ్రెసువిజయం, ప్రజారాజ్యం, ఉపాధ్యాయుడు మొ॥ గ్రంథాలు పైన చెప్పిన దాని కుదాహరణలు. ఇవిగాక చలోఢిల్లీ, వైతాళిక కథలు జాతీయకథలు. ఆచార్యరంగా మొ॥ జీవితచిత్రాలు రచించి వీరు ప్రశంస లందుకొ గలిగారు. పిల్లల కుపయుక్తమగు రీతిగా నవ్య భావనలతో దివ్య సందేశాలతో వీరు వ్రాసిన దసరాగీతాలు, పెద్దల కుపయోగపడేలాగా వ్రాసిన “నవగీతాలు” చెప్పుకో తగ్గవి. ఖండకృతి, జయభేరి, అనుపద్య కావ్యాలు సాంఘిక కార్మిక రంగాలలో సమతను, మమతను, ఉద్బోధించే మధుర కృతులు, ఆంధ్రసేవకులు, ఉత్తమ కథలు, ఆంధ్రపురుషుల జీవితములను బాల బాలికల కందుబాటులోనికి తెచ్చిన పొత్తములు. “వ్యాసవాణి” అను పేరుతో సాహిత్యవ్యాసములు రెండు సంపుటములుగా వెలువడ్డాయి. వీటిలో నరసయ్యగారి పాండితి ప్రస్ఫుట మవుతూంది.

వీరికి కవితాపోషణ, కవి సన్మానము లంటే ఎంతో ఆసక్తి. భారతీసమితిఅధ్యక్షులుగా వీరు చేస్తున్న సాహిత్య సేవ ఎన్నతగినది. ఇటీవల శిష్యులు వీరికి స్వర్ణోత్సవం జరిపి, తమ గురుభక్తిని తెలియపరచుకున్నారు. ఆసందర్భములో నరసయ్యగారిపైన వ్రాసిన ఆశీస్సులు, ప్రశంసలు, “గురుదక్షిణ” అనే గ్రంథంగా వెలువడ్డాయి. జననం : 2-8-1910. తెలుగు పండితులు. హయ్యరు సెకండరీ స్కూలు, చిలుకలూరిపేట. గుంటూరుజిల్లా.”

## 157. శ్రీ దాసరి హనుమంతరావు (పుట 608)

జననము: 1939. బిరుదము: భాషాప్రవీణ. కృతులు: మృత్యుంజయశతకము, పాండురంగశతకము, శివానందలహరి (సంస్కృతానువాదం) దేవీస్తోత్రమాలిక (సంస్కృతాంధ్రమిశ్రము) గిరిజాకల్యాణము (ప్రబంధము). అడ్రసు: గుంటూరు, లాలాపేట.

## 158. శ్రీ పి. యస్. ఆర్. ఆంజనేయప్రసాద్ (పుటలు 609-616)

పేరు: పోతరాజు సీతారామాంజనేయ ప్రసాద్. జననం: 30-4-1939 నర్సరావుపేటతాలూకా ఏల్చూరు గ్రామం. విద్యాభ్యసనం: గుంటూరు హిందూకళాశాల. కృతులు: విజయవిపంచి (పద్య-గేయ-ఖండికలు) ఆంధ్రమహావిష్ణువు ద్విపదకావ్యము). ఆదర్శము: ప్రకృతిలోని సౌందర్యం ఆనందమని ఆ ఆనందమయస్వరూపుడే భగవంతుడని అలాంటి రాష్ట్రపూరుషుని పదకమలాలపై

జీవితం సమర్పింపబడితే అదే జీవన పరమావధని భావించే వ్యక్తి. సంఘసేవాసక్తి వీరిలోని ప్రత్యేకత-ప్రజలను నిద్రలోనుండి మేల్కొల్పి జాగృతపరచటం వీరి ప్రతి పద్యంలోనూ ప్రతిగేయంలోనూ సర్వదా ద్యోతకమవుతుంది. వీరి కవితాగురువులు-నిజజనకుడు-అన్నగారు-జననీ జనకులే పార్వతీ పరమేశ్వరులని భావించేవారు. వృత్తి: లైబ్రేరియన్. హిందూ కాలేజి హైస్కూలు గుంటూరు.

## 159. శ్రీ అద్దేపల్లి రామమోహనరావు

(పుటలు 617-619)

జననం: **6-9-1936.** రచన: సిద్ధేంద్రయోగి, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం. వీరు సాహిత్యంలో నిరంతరకృషి చేస్తున్న భావుకులు.

## 160. శ్రీ మారుటూరి పాండురంగారావు

(పుటలు 620-627)

జననం: **10-9-1934** జన్మస్థలం: వట్టిచెరుకూరు. గుంటూరుతాలూకా. నివాసం: గుంటూరు, బ్రాడీపేట. రచనలు: ఉషాదేవి, శివపంచశతి, ఊర్వశి. వీరు కవులు విమర్శకులు రచయితలు. వీరిది అభ్యుదయభావనలు కలిగిన సంప్రదాయసిద్ధమైనకవిత. వీరికవిత్వమునందు భావోద్వేగము, ఏదో తెలియని హృదయావేదన కన్పిస్తవి. వ్యంగ్యంగా సమకాలీనజీవితాన్ని విమర్శనాత్మకదృష్టితో పరిశీలించే దృక్పథం. వీరి పద్యాలలో స్పష్టంగా గోచరిస్తుంది. వీరిని పరిశీలిస్తే గొప్ప భావుకులుగా కన్పిస్తారు. ఒక ఆధ్యాత్మిక ప్రవృత్తి వీరి రచనల్లో అడుగడుగున వ్యక్తమవుతుంది. చిరునామా: మారుటూరి పాండురంగారావు, బ్రాడీపేట 5/15 అరండలుపేట పోస్టు గుంటూరు—2.

## 161. శ్రీ జనస్వామి శీతారామారావు

(పుట 628)

జననం: **27-8-1943.** స్వగ్రామం తెనాలి తాలూకా కొల్లూరు. శ్రీ కోదండరామశాస్త్రి గారి కుమారులు. అభివృద్ధికి రాదగిన యువరచయితలు.

## 162. శ్రీ పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులు

(పుటలు 629-630)

జననం: **15-6-1897.** హేవిళంబి జ్యేష్ఠ బహుళ ప్రతిపత్తు. నెల్లూరిదగ్గరి సంగం స్వగ్రామం. శ్రీయుతులు కాశీకృష్ణాచార్యులవారికడ నాటకాలంకారాలు, పేరి వేరయ్యశాస్త్రి గారికడ కౌముది, నోరి సుబ్రహ్మణ్యశాస్త్రి గారి దగ్గర దాని వ్యాఖ్యలు, ఇట్లా ఎంతమందినో శుశ్రూష చేసి భాష్యాంతవ్యాకరణం, ఇతర శాస్త్రప్రజ్ఞ సంపాదించి, సార్థకనామధేయులైనారు. శ్రీరామకల్యాణము, కైకేయీసౌశీల్యము, ఆంధ్రకాదంబరి, శతలక్షణి, కావ్యాలోకము మొ. అనేకగ్రంథాలు వ్రాశారు. ప్రామాణికులైన విద్వత్కవివరులు. అవధానాశుకవితాధురీణులు, మహోపాధ్యాయ, కవిశేఖరేత్యాది బిరుదాంచితులు. బహుశిష్యసమన్వితులు. సంప్రదాయబద్ధమైన వీరి వాక్కు పండితలోకములో గౌరవపాత్రమైనది.

## 163. శ్రీ కవుతా నరసింహశాస్త్రి

(పుటలు 631-633)

జననం : **1-7-1914.** విద్వాన్, వ్యాకరణవిద్యాప్రవీణ బిరుదములు పొందిరి. తర్కమునందు చక్కనిపాండితి గలవారు. సంస్కృతాంధ్రములలో విశిష్టకృషి జరిపిన విద్వాంసులు. ఆంధ్రనైషధము గద్యప్రబంధముగా వ్రాసిరి.

## 164. శ్రీ కొలకుల నారాయణరావు

(పుటలు 634-638)

జననం : **1-3-1912** నెల్లూరు. రచనలు - ముద్రితములు ఋతుసంహారము, మేఘసందేశము, వేంకటేశసుప్రభాతము, వేంకటేశప్రపత్తి, వేంకటేశమంగళాశాసనము, భజగోవిందము. కనకధారా స్తవము, శ్రీరామునిచరిత్రము, సుమతిశతకము, బాలసుమతిశతకము, కథావళి, శ్రీస్తుతి, ఆదిత్యహృదయము, లక్ష్మీనరసింహస్తోత్రము. ముద్రితములు : భాగవతకథలు. శ్రీనారాయణస్తోత్రము, ముకుందమాల, శ్రీరంగనాథసుప్రభాతము. వీరు చిరకాలము నెల్లూరులో రివెన్యూశాఖఉన్నతాధికారులుగా ఉన్నారు. ప్రస్తుతము అనంతపురంజిల్లా Revenue Divisional Officerగా

పనిచేయుచున్నారు. B.A.B.L. FRES (London) బిరుదములు గలవారు. సంస్కృతాంధ్రాంగ్లభాషలలో అపారప్రజ్ఞ గలిగిన వీరి లేఖిని కవిపండితలోకమునకు హర్షము కల్గించినది. ప్రదీప్తగంభీరమైన వాక్కు, ప్రసన్న లలితమైన హృదయము గల వీరు బహుముఖశక్తిసమన్వితులు. వీరి జీవితములోనేగాక సారస్వతములోను ఒక అధికారికమైన ప్రామాణికమైన ప్రభావము అడుగడుగున తోచుచుండును. భార్య- సావిత్రీరామాయణాది మహాగ్రంథరచనాధురీణ, సాహితీప్రవీణ, సాహితీపారణ - సావిత్రీదేవి. ఏకైకపుత్రిక కుమారి పద్మావతి.

## 165. శ్రీ నూతి శేషగిరిరావు (పుట 639)

గుంటూరు హిందూకళాశాలలో విద్యాభ్యాసం. జననం, 1940 సంవత్సరములో. పెదనందిపాడు, గుంటూరుజిల్లా. వీరు అభివృద్ధికి రాదగిన యువకులు.

## 166. శ్రీ బొడ్డు బాపిరాజు

(పుటలు 640-644)

జననం: జనవరి 1912. సంస్కృతాంధ్రహిందీబెంగాలీలలో క్షుణ్ణమైన పాండిత్యము, ఆంగ్లముతో పరిచయము కలవారు. సహృదయులు. సంప్రదాయసిద్ధమై ప్రాతక్రొత్తలమేలుకలయికతో ఉత్తమకవిత జెప్పిన విద్వత్కవులు. వీరు ఖండకావ్యరచనమును బహుముఖీనముగా సాగించి అసంఖ్యాకములైన కృతులను భారతి, ప్రతిభ, సాహిత్యాది పత్రికలందు ప్రకటించిరి 'విపంచి', 'కాత్యాయని' మొదలైనవి వీరి ముద్రితకావ్యసముచ్చయములు. ఆంధ్రసాహిత్యమున అగ్రశ్రేష్ఠులుగా పేర్కొనదగిన అనేక కథలను చెప్పి అందు కొన్నిటిని గ్రంథరూపముననుకొన్నింటిని పత్రికాముఖమునను ప్రకటించిరి. ఏలూరు 'సాహిత్యమండలి'లో తొలినాటినుండి ప్రముఖసభ్యులలో నొకరై వీరు కార్యనిర్వాహకవర్గసభ్యత్వమును, ఉపాధ్యక్ష, అధ్యక్షపదవులను నిర్వహించినారు. సంభాషణాచతురులు. సంపన్నులు. ఉత్తమశ్రేణివస్త్రవ్యాపారము వృత్తి. నిరంతరసాహితీసేవయందు వీరికి చిత్తవృత్తి.

## 167. శ్రీ గూడూరి నమశ్శివాయ

(పుటలు 645-651)

జననం: 5-5-1917. కృష్ణాజిల్లా బందరుతాలూకా వద్దమన్నాడులో. తండ్రి: మల్లయ్యగారు, తల్లి: బాపమ్మగారు.

వంగడము పారంపర్యముగా సాహిత్యాభిమానులు. కవిమిత్రులు. నమశ్శివాయగారికి తెలియని ఆంధ్రకవులు లేరు. కవులపరిచయం స్నేహం కలవారు. చాలా రేడియో ప్రసంగాలు చేశారు. అనేకవిషయాలగూర్చి వ్యాసాలు వ్రాశారు. వీరికి సాహిత్యము, చరిత్ర అంటే ఎక్కువ మక్కువ. పారంపర్యంగా ఆయుర్వేద వైద్యులు. విద్వద్వైద్యకుటుంబము వీరిది. వీరిది ప్రత్యేకమైన శైవసంప్రదాయమైన ఆయుర్వేదకుటుంబము.

## 168. శ్రీ పెనుమత్స సత్యనారాయణరాజు

(పుటలు 652-654)

సుప్రసిద్ధులైన కవిశేఖరులు వీరు. జననం 20-12-1899. వికారిసం॥ మార్గశీర్ష బహుళచవితి బుధవారము పుష్యమి నక్షత్రము. రచనలు: పద్యకృతులు రామకృష్ణము(ద్విపద) ఆరాధన, కవిత్రయావేదన, విజయశ్రీ, చంపకమాలినీ పరిణయము (అచ్చతెనుగు), పండితరాజచాటువులు, రసాలము, భీమేశ్వరశతకము, విక్రమదేవశతకము, కల్నలు రాజు, పతిభక్తి, రాజానందము (అలంకారశాస్త్రము), హరికారికావళి (పద్యవ్యాకరణము). పద్యకథలు, కీచకవధ (ఆశువు). కరుణకము మొ॥ వచనగ్రంథాలు : ఉత్తర రామాయణము, గోరువంక, మొగిలిరేకు, గాంధశీలము, నవకథావళి, మనస్విని, గత్నసుందరి, ప్రతిజ్ఞ విజ్ఞానసాగరులు, రతిరహస్యము, తపోభూమి, నవజీవనము, ఆంధ్రస్నత్యము. వ్యాసావళి, రామకృష్ణజాతక కథ మొ॥

## 169. శ్రీ మారేమండ శ్రీనివాసరావు

(పుటలు 655-656)

వీరు సాహిత్యమార్గములోనేకాక చిత్రకళారంగములో అద్భుత ప్రతిభ కలవారు. వివిధవర్ణోద్భాసితమైన రేఖా, తైలాది రీతిచిత్రనిర్మాణములో సిద్ధహస్తులు, మహోన్నత

భవిష్యత్తుగల యువరచయితలు. విద్యాభ్యాసం గుంటూరు హిందూకళాశాలలో.

## 170. శ్రీ నళినీకుమార్ (పుటలు 657-659)

జననము: 8-5-1917. 1943లో ఉత్పల అనే పద్య కావ్యము (Story Poem) ప్రచురించారు. ప్రస్తుతం రచనలో ఉన్న గేయకావ్యమునకు వస్తువు మానవ నాగరకతాచరిత్రము. ఆధారము- కాశ్మీరదేశములోని 16వ శతాబ్దములోని ఒకజానపదుని మహోజ్వల జీవితచరిత్రము. వీరు వ్రాసిన పణవిపణిగేయకావ్యము సర్వవిధముల అత్యుత్తమ శ్రేణికి చెందినరచన. హృదయంలోకి చొచ్చుకొనిపోయే టట్లు పలికేశక్తి వీరికవితకు సహజగుణంగా కన్పిస్తుంది.

## 171. శ్రీ అన్నపురెడ్డి శ్రీరామరెడ్డి (పుటలు 660-662)

జననం : 1938 సం॥ కుబాదుపురం, గుంటూరుజిల్లా. కేంద్రప్రభుత్వము వారి 'మెరిట్ స్కాలర్‌షిప్'తో ఉస్మానియా విశ్వవిద్యాలయంనుండి ఎమ్. ఏ; డిగ్రీ పుచ్చుకొన్నారు. అదేసంవత్సరంలో 'ఆకాశవాణి'చే నిర్వహించబడిన అంతర్విశ్వవిద్యాలయ హిందీపరిసంవాదపు పోటీలో 'ఓపెనింగ్ స్పీకర్'గా పాల్గొని దక్షిణభారతదేశంలో ప్రథముడుగా నెగ్గి, ఢిల్లీ - ఆకాశవాణివారి అంతిమపోటీలో పాల్గొన్నారు. ప్రస్తుతం చిత్తూరు గవర్నమెంటు ఆర్ట్సుకాలేజీ- హిందీవిభాగంలో పనిచేస్తున్నారు.

## 172. శ్రీ కంచర్ల పాండురంగశర్మ (పుటలు 663-665)

'మధురకవి', 'కవిరత్న' బిరుదాంకితులైన పాండురంగ శర్మగారు చక్కని కవితాశక్తిగల ప్రఖ్యాత యువకవులు. "మధురస్వరాలసరాలు" అనే కలంపేరుతో కూడ వీరు రచనలు సాగిస్తూవుంటారు. వినుకొండలోని కవితాసంస్థాన స్థాపకులు, అధ్యక్షులు. దయామయి, మధుమాసం, రసానందం మొదలైన పద్యకావ్యాలు, గాయకబ్రహ్మ, తెనుగుతనయులు, మొదలైనగద్యకావ్యాలు ముద్రితాలు. కవిబ్రహ్మ, బడిపంతులు, పరివర్తన వగైరారచనలు ముద్రణకు సిద్ధంగావున్నాయి. శ్రీ శర్మగారు "భక్త రామదాసు" గారి తొమ్మిదవతరంవారు. వీరి "రామదాసు" అనే గ్రంథము ముద్రణకు తయారైంది. తల్లిదండ్రులు: నాగరత్నమాంబా, సూర్యనారాయణరావు గార్లు. జననం: 24 మార్చి 1935. ఉనికి: తెనుగుపండిట్. లూథరన్ మిషన్‌స్కూలు తర్లుపాడు (నెల్లూరుజిల్లా).

## 173. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి (పుటలు 666-669)

జననం : 1897 బి. ఏ. ప్యాసైనారు. కొంతకాలం పెద్దాపురం, పిఠాపురం హైస్కూళ్ళలో ఉపాధ్యాయులుగా ఉన్నారు. రఘుపతి వెంకటరత్నంనాయుడుగారి ఆప్తశిష్యులై సంఘసంస్కర్తలై అస్పృశ్యతానివారణ, కళావంతుల ఉద్ధరణవంటి ఉద్యమాలలో పాల్గొన్నారు. నవ్యకవితాప్రపంచంలో మహోన్నతస్థానంగలవారు. కృష్ణపక్షం,- ఊర్వశి, ప్రవాసం, మహతి, ఋగ్వీథి- కన్నీరు. మొదలైనకావ్యాలు, ఎన్నో రేడియోనాటికలూ వ్రాశారు. మల్లీశ్వరీ మొ॥ సినిమాలకు పాటలు మాటలూ వ్రాశారు. ప్రస్తుతం హైదరాబాదు ఆలిండియారేడియోలో స్పోకెన్ వర్డు ప్రొడ్యూసరు. ఆంధ్రకవితలో ఆధునికమైన భావకవితారీతికి మార్గదర్శకులై మహోన్నతమైన యశస్సు పొందారు. హృదయాన్ని చొచ్చుకొనిపోయే వీరికరుణ గానం రసహృదయాలలో మహాసంచలనాన్ని రేపింది. విప్లవాత్మకమైన వీరి రచనారీతి తెలుగుసారస్వతంలో ఒక ప్రత్యేకమైనస్థానాన్ని సంపాదించుకొన్నది.

## 174. శ్రీ బి. రామరాజు (పుటలు 670-672)

జననం, 15-4-1925. నివాసము: హైదరాబాదు. రచనలు: తెలుగుజానపదగేయసాహిత్యము, తెలుగువీరుడు, తెలంగాణాజానపదగేయాలు, మరుగుపడినమాణిక్యాలు, ముద్రితములు. తెలంగాణాజానపదగేయాలు (2భా) మరుగుపడినమాణిక్యాలు (2భా) ఆంధ్రదేశపుసంస్కృతకవులు అముద్రితములు. ఇంకను ఉస్మానియా యూనివర్సిటీలో ఆంధ్రశాఖలో రీడరుగా ఉన్నారు.

## 175. శ్రీ బుద్ధవరపు మహాదేవుడు
(పుటలు 673-679)

జననం: 1890లో. తండ్రి సోమసుందరంగారు, అన్న సాంబశివరావుగారు కవివర్యులు. వీరు సంప్రదాయబద్ధమైన కవితారీతిగల వీరి సాహితి విశిష్టమైనది. రచనలు: మాఘకావ్యము, సూతసంహిత, రామాయణచంపువు, కువలయానందము (అనువాదములు) ఇంకా ఆంగ్లగ్రంథానువాదాలు, కావ్యఖండికలు, ఎన్నో వ్రాశారు. తూర్పు గోదావరిజిల్లా రామచంద్రపురంలో ప్లీడరుగా ఉన్నారు.

## 176. శ్రీ శివశంకరస్వామి (పుట 680)

జననం : 1892. సంస్కృతము, ప్రాకృతము, పాళీ, లాటిన్. పారసీకము, హిందీ, బెంగాలీ, కన్నడభాషలలో పాండిత్యం గలవారు: సాహితీసమితిని స్థాపించి సాహితీ పత్రికను ప్రకటించారు. నవ్యసాహిత్యపరిషత్తు చాలా కాలం నడిపారు. ఆసహాయోద్యమంలో జైలుకు వెళ్ళారు. సర్వగ్రంథమండలికి, ఆంధ్రప్రచారిణికి గౌరవసంపాదకులుగా ఉండేవారు. తెలుగు భాషాసమితి సంపాదకవర్గంలోను, ఢిల్లీ సాహిత్యఅకాడమీ తెలుగు సలహాసంఘంలోను, ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీలోను సభ్యులు. కవిసార్వభౌమ,మహోపాధ్యాయ, సాహిత్యాచార్య,సాహిత్యసామ్రాట్, కవీంద్ర ఇత్యాది బిరుదాంచితులు. అనేక రూపకాలూ, పద్యకృతులు, గేయకృతులు కలిపి శివశంకర కృతులు అని రెండు సంపుటాలుగా ప్రకటించారు. అపార యశస్సు, మహత్తరప్రతిభావిశేషాలు, విశిష్టపాండితిగల వీరివాక్కు ఆంధ్రావళి మన్నన లందుకొన్నది. అసామాన్యమైన వ్యక్తిత్వం గల వీరిప్రజ్ఞ బహుముఖమై కవిపండిత సంభావితమై శాశ్వత కీర్తిప్రతిష్ఠల నార్జించుకొన్నది.

## 177. శ్రీ శంకర శ్రీరామారావు
(పుటలు 681-?94)

జననం : 19 జూన్ 1908. తల్లి: సుబ్బమ్మ, తండ్రి : సుబ్బారావుగారు. నియోగిబ్రాహ్మణులు. మౌద్గల్యస గోత్రము. వీరు సంస్కృతాంధ్రాంగ్ల హిందీభాషలలో ప్రవీణులు. యల్. యం. పి. పరీక్షలో ఉత్తీర్ణులై ఏలూరులో నేత్రవైద్యము, దంతవైద్యము, ప్రసూతివైద్యము చేయుచున్నారు. రేడియోప్రసంగములు, పత్రికారచనలు చాల గలవు. ముద్రితగ్రంథములు: గీతాహృదయము,పూలమాల, కృతులు, గేయములు, కోకిల, కళాయోగి, కబీరు, సూక్తిముక్తావళి, కుటుంబసమస్య, బాబాప్రబోధరత్నావళి, దైవసాన్నధ్యం మహాత్ముడు.

## 178. శ్రీ సత్యం (పుటలు 785-686)

పూర్తిపేరు: కె. వి. సత్యనారాయణాచార్యులు. జననము: 1943 ఆగష్టు 25వ తేది. అల్లూరుగ్రామం (బాపట్లతాలూకా గుంటూరు జిల్లా) తండ్రి: శ్రీమాన్ నరశింహాచార్యులు, తల్లి: శ్రీమతి ల నరసమ్మ. హిందీ 'విశారద' తెలుగు వారం, పక్ష పత్రికలలో గేయరచన. బాలకోపయోగమగు కథారచన. గుంటూరు హిందూకళాశాలలో విద్యాభ్యాసము. వీరు చక్కని ఉపన్యాసవైఖరిగల యువరచయితలు.

## 179. శ్రీ పల్లా దుర్గయ్య (పుటలు 687-691)

జననం : 1916. జన్మస్థలం: మడికొండ (వరంగల్లుజిల్లా ఉస్మానియా విశ్వవిద్యాలయంనుండి 1942లో ప్రప్రథమముగా తెలుగులో M. A. పట్టమండి డాక్టరేటు పుచ్చుకొని ప్రస్తుతం ఉస్మానియా యూనివర్సిటీలో ఆంధ్రశాఖయందు రీడరుగా వుంటున్నారు. సంస్కృతాంగ్లాంధ్రభాషావేత్తలు. జ్యోతిశ్శాస్త్రవిశారదులు. సంప్రదాయ స్థితమైన పాండిత్యము, దానికితోడు చక్కని ప్రతిభ. వీరికవితావ్యాసంగానికి దోహదములైనవి. భావనాగాంభీర్యము, అనర్గళ ధార, నర్మహాస్యము, తెలుగునుడికారము వీరికవితలో అంతటా కన్పిస్తుంటాయి. వీరి విమర్శనాశక్తికి 'మనుచరిత్ర'పై వీరు వ్రాసిన పరిశోధనాత్మక వ్యాసాలు తార్కాణము. వీరు తెలుగులో అక్షరసంఖ్యాక్రమనిబద్ధమైన నిఘంటువు గ్రథనం జేస్తున్నారు, ఇది యొక అపూర్వవిషయం. పాలవెల్లి, గంగిరెద్దు వీరి ముద్రిత కావ్యాలు.

## 180. శ్రీ యస్. వి. మాధవరావు

(పుటలు 692-700)

జననం: 23-7-1937. గుంటూరుజిల్లా సంకురాత్రిపాడు స్వగ్రామం నాగపూర్ విశ్వవిద్యాలయంలో హిందీ ఎం.ఏ. డిగ్రీపొందారు. ప్రస్తుతం అక్కడే రిసర్చి చేస్తున్నారు. హిందీ తెలుగు, సాహిత్యాలకు సంబంధించిన తులనాత్మక దృష్టితో చాలా పరిశ్రమచేస్తున్నారు.

## 181. శ్రీ నిడదవోలు వేంకటరావు

(పుటలు 701-703)

పరిశోధన పరమేశ్వరేత్యాది బిరుదాంచితులు. ప్రస్తుతం మదరాసు విశ్వవిద్యాలయం ఆంధ్రభాషాశాఖాధ్యక్షులుగా ఉన్నారు. విమర్శకాగ్రేసరులైన వీరు అనేక గ్రంథాలు రచించారు. మారుమూలపడియున్న అనేక గ్రంథాలు, శాసనాలు వెలుగునకు తెచ్చారు. ఎన్నో గ్రంథాలకు పీఠికలు వ్రాసి తెలుగుభాషకు ఎనలేని సేవ చేశారు. లు గల మహామనీషి శేఖరులు.

## 182. శ్రీ శిష్ట్లా సత్యనారాయణరాజశేఖరం

(పుటలు 704-705)

చక్కని ప్రతిభా వ్యుత్పత్తులు గల రచయితలు. పలుకులో ఒకతీయదనమూ, ఆకర్షణ ఉన్నవి. చమత్కార సహితమైన వాక్కు సహృదయ సంభావితమైన వీరిలేఖిని బహురచనా సంభాసితము.

## 183. శ్రీ వాడరేవు సుబ్బారావు

(పుటలు 706=708)

జననం: 21-10-1933 వృత్తి: న్యాయశాఖలో. గుంటూరులో విద్యాపరిషత్ కార్యకర్తలలోని ప్రముఖులలో ఒకరు. సాహిత్య విభాగనిర్వహణలో దక్షులు. కన్నడంలోనుండి తెలుగులోనికి నవల ఒకటి అనువదించారు. విమర్శనవ్యాసములు వ్రాశారు. మాతృశ్రీ అన సూయాదేవి అను గ్రంథమునకు సంపాదకులు.

## 184. శ్రీ కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి.
## 185. శ్రీ ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

(పుటలు 709-710)

జననం : కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి పరీధావి (1908) ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి కీలక (1911) జన్మస్థానం గుంటూరుమండలాగ్గతమైన కొల్లూరు. ఇరువురు జనకస్థానమున సోదరులు. సాహిత్యచక్రవర్తి బిరుదాంచితులు, ప్రసిద్ధ కవులు, బహుశాస్త్రనిధులు నైన నాగభూషణశాస్త్రిగారు వీరి పితరులు. తల్లి : త్రిపురాంబ. వీరిలో నరసింహశాస్త్రి దత్తుడు. శ్రీ ఘట్టి పాలకపితలైన నాగభూషణశాస్త్రిగారి మార్గాన్ని అనుసరించి ఆశ్రమస్వీకార మొనర్చినారు. నేటి వారి పుణ్యనామము నృసింహానందభారతి. ఘట్టి కొల్లూరు సంస్కృతపాఠశాల, ఈమని విజయనగరపాఠశాలలందు విద్యార్జనచేసినారు. వీరి సాహిత్యగురువులు శ్రీజొన్నలగడ్డ విశ్వనాథశాస్త్రిగారు. కూచిభొట్లకు విద్యాగురువులు తండ్రిగారు, పిడపర్తివారు, చివుకుల వేంకటరమణశాస్త్రి గారు. (జ్యోతిషవిద్యకు) కవితాగురువులు తిరుపతివేంకట కవులు. ఇరువురు విద్వత్కవులు. భాషావేత్తలు. అష్టాదశపురాణపరిశీలనము, కావ్యరచనము, అష్టావధానములు, ఆశుకవిత్వము భాషాతత్వవివేచనము ఇరువురకు అభిమానాంశములు. భారతరామాయణపరిశీలనమున ఇరువురకూ ప్రత్యేకాభిమానము 'కవితావతంస', 'కావ్యతీర్థ'— శ్రీనరసింహశాస్త్రి బిరుదములు. 'జ్యోతిషవిద్యావిశారద' 'దైవజ్ఞశిరోమణి', 'విద్వత్కవి' ఇత్యాదులు శ్రీప్రభాకరశాస్త్రి బిరుదములు. శ్రీప్రభాకరశాస్త్రి, ఢిల్లీ, హైదరాబాదు మొదలైన ప్రముఖనగరాలలో కవితాగానం చేసి బహువిధసన్మానాలు పొందినారు. వీరి గ్రంథములు ముద్రితములు— విద్యాశంకరవిజయము (అనువాదపద్యకావ్యము), కృష్ణమహత్తు (గీతగోవిందకృతికి పద్యానువాదము) వైశాఖపురాణము, ఆశ్వినమహాత్మ్యము (పద్యకావ్యములు), గాథాసప్తశతి, గాథాసప్తశతీసారము, ఆంధ్రప్రతిభ ఇత్యాదులు ఖండకావ్యసంపుటులు. కుందమాల, రత్నావళి, ప్రియదర్శిక— సంస్కృతనాటకానువాదములు. తెలుగుజాతీయములు, సంస్కృతన్యాయములు వ్యాఖ్యాన

గ్రంథములు. 'ఝూన్సీరాణి', 'భారతవిమర్శ' ఇత్యాది అముద్రితగ్రంథములు వీరివి అనేకము లున్నవి.

## 186. శ్రీమతి పిల్లలమఱ్ఱి సుశీల

(పుటలు 711-712)

జననం : 26-10-1926. సుప్రసిద్ధపండితులూ, పరిశోధకులూ అయిన శ్రీ కిరుగంటి సీతారామభట్టాచార్య ఎం. ఏ. గారి తనయ; ప్రఖ్యాతాంధ్రోపన్యాసకులూ, కవి పండితులూ, అయిన శ్రీపిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు ఎం. ఏ., గారి ధర్మపత్ని. సంగీతశాస్త్రాభ్యాసంచేసి, ఫిడేలు, ఫ్లూటు కచ్చేరీలలో - బహూకృతులగొన్న విదుషీమణి. బహుగ్రంథపారాయణంవల్ల సాహితీ సౌరభాలను నించుకొన్న సహృదయ. హిందీ, ఆంగ్లభాషాప్రవేశమున్న కలిగిన మహిళ, ఆకాశవాణిద్వారా, పత్రికా ముఖాన స్వీయ ప్రసంగాలను, రచనలను ప్రకటిస్తూ శ్రోతల, పాఠకుల మన్నన లందుకొంటున్న మహిళ. గుంటూరు, పట్టాభిపురం మహిళాసమాజానికి కార్యదర్శిని. కృతులు: 'పూజా పుష్పాలు'. కథలు : ప్రసంగాలు.

## 187. శ్రీ ఏ. ఎల్. నరసింహారావు

(పుటలు 713-714)

**12-2-1912.** కృతులు: చిత్తబోధశతకము, పాండవ రాజసూయము (నాటకము) ఇందుమతీ వివాహము (పద్య కావ్యము) వీరు సంప్రదాయబద్ధులైన రచయితలు. విద్వత్కవులు.

## 188. శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ

(పుటలు 715-719)

జన్మము: 1917 డిసెంబరు 18వ తేది. తలిదండ్రులు: శ్రీమతి నాళము సుశీలమ్మ కీ. శే. నాళము కృష్ణరావు గార్లు నాళము సుశీలమ్మగారు సుప్రసిద్ధ కాంగ్రెసు భక్తురాలు, ఆంధ్రదేశానికి ఏకైక మహిళాగానసంస్థయైన ఆంధ్రమహిళాగానసభకు వ్యవస్థాపకురాలు, అధ్యక్షురాలు. కీ, శే. నాళము కృష్ణరావుగారు సుప్రసిద్ధకవులు. మధురకవిబిరుదాంచితులు. ప్రముఖసంఘసంస్కర్త. భాషాసేవకులు, గౌతమీగ్రంథాలయ ప్రతిష్ఠాపకులు. విద్యాభ్యాసం: నాళము రామలింగయ్యగారిచే స్థాపింపబడిన రాజమహేంద్రవరమండలి వైశ్యసేవాసదనం, ఆంధ్ర సంస్కృత కళాశాలల్లో విద్యాభ్యాసం: సుప్రసిద్ధ కాంగ్రెసు సేవకులు,వివాహం ఊటుకూరి వేంకటేశ్వరశ్రేష్ఠిగారిద్వితీయపుత్రుని శ్రీ ఊ. హయగ్రీవగుప్త ఎమ్వే కేటుగారితో 1934 ఉభయభాషాప్రవీణపట్ట స్వీకారం. ఆంధ్ర విశ్వవిద్యాలయ సర్వ ప్రథమురాలుగా. రచనలు: అనేక పత్రికల్లో సాహిత్య, సాంఘిక వ్యాసాలు. (1953)లో తెలుగు భాషాసమితి పక్షమున మద్రాసు ప్రభుత్వము వారిచే 'ఆంధ్రకవయిత్రులు' గ్రంథమునకు బహుమాన ప్రదానం. ఇంకా అముద్రితములు: ఆంధ్రకర్ణాటక సంగీత చరిత్ర అఖిలభారత రమణీరమణీయసాహిత్యచరిత్ర వ్రాతలోఉన్నది: పరమహంస. (కావ్యము) సాహిత్య వ్యాససంపుటి. ఇంకా ఇతర వ్యాసంగాలు: రేడియోప్రసంగములు. పదవులు: Member: Telugu Bhasha Samithi. Andhra Sahitya Acadamy, ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్: All India Radio Advisary Board, Andhra Yuvathi Samskrita Kalasala Working Committee, Guntur L.L.A, Committee. President: Hindi Premi Mandali Bapatla. Women's Co-oparative Cottage Industries Ltd., Bapatla. Arya Vysya Mahila Sabha. ఆంధ్రదేశములో ప్రఖ్యాతిగాంచిన విద్వత్కవయిత్రి. కవితారచనలోను, ఉపన్యాసవైఖరిలోనూ, లాలిత్యమూ, గాం ము భాసించే విశిష్టమూర్తి.

## 189. శ్రీ వాసిరెడ్డి వేంకటసుబ్బయ్య

(పుట 720)

విశిష్టమైన ప్రతిభా, వినూత్నమైన సాహిత్యదృష్టిగల వీరు అనేక రచనలు చేశారు. సారస్వతరంగంలో నిరంతరం కృషిచేస్తూ ప్రజ్ఞాసమన్వితమైన రచనలు అందిస్తుంటారు. భావాకర్షకమైన వీరికలం సహృదయుల మెప్పుగాంచింది.

## 190. శ్రీమతి కొలకుల సావిత్రి

(పుటలు 721-722)

జననము : 11-4-1930. తండ్రి : శ్రీ వ్యాసము సత్యనారాయణనాయుడు (రిటైర్డు డిప్యూటీకలెక్టరు, మచిలీపట్టణం) తల్లి - శ్రీమతి వ్యాసము నాన్నమ్మ. భర్త - ఋతుసంహార మేఘసందేశాద్యనేక గ్రంథకర్త. శ్రీ కొలకుల నారాయణరావుగారు, బి. ఏ., బి. ఎల్., FRES (London) Revenue Dvl. Officer. అనంతపురము, సంతతి - ఏకైకపుత్రిక కుమారి పద్మావతి. వీరు మృదుమధురశైలిలో వాల్మీకిమహర్షి సంస్కృతభారతికి కానుకపెట్టిన విషయములు వదలక ఇతర రామాయణము లందలి రసవత్తరాంశముల చేర్చి పాఠకులకు ప్రమోదము కలుగునట్లు రామాయణమును వచనములో సులభశైలిలో వ్రాసి ప్రజలకు అందించుచున్నారు. తరిగొండ వెంకమాంబ మొదలగు మహావిదుషీమణుల సరసన కూర్చుండగల సాహిత్యౌన్నత్యము, ప్రతిభావ్యుత్పత్తులుగల రచయిత్రీశిరోమణి. సరళమైనశైలి, కళోద్దీపకధార, స్వాభావికసజీవపాత్ర చిత్రణ, స్నిగ్ధగంభీరగమనము గల వీరి రచన సర్వజనాకర్షకము.

## 191. శ్రీ బి. హనుమారెడ్డి (పుట 723)

నిరంతర సారస్వతోపాసకులైన యువరచయితలు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం. అభ్యుదయ దృష్టిగల రచనలో కృషిచేస్తూంటారు.

## 192. శ్రీ బెజవాడ గోపాలరెడ్డి

(పుటలు 724-727)

జననం: 1907 ఆగష్టు 5. శాంతినికేతనంలో శిక్షాభవన పట్టాన్ని పొందారు. 1930 నుండి 42 లోగా 4 సారులు జైలు. 37లో ఎం. ఎల్. ఏ. మద్రాసు ఎన్నిక; స్థానిక స్వపరిపాలనాశాఖామంత్రి 37-39: ఆంధ్ర Uni. Syndicate సభ్యులు 44 నుండి 46లో శాసనసభకుమళ్ళీ ఆర్థికమంత్రి 47-52 A.U. Pro. ఛాన్సెలర్ 51–57, ఎ. పి. సి. సి. అధ్యక్షులు, 54 జనవరి 55 మార్చి, ఆంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రి, 55 మార్చి 28 to 56 నవంబరు 1, ఆంధ్రప్రదేశ్ హోం మంత్రి, 56 నవంబరు- 57 మార్చి ఆర్థికమంత్రి,57–58 కేంద్రరివెన్యూ వ్యవసాయశాఖమంత్రి 58 మే నుండి ప్రస్తుతం కేంద్రంలో హౌసింగు మరియు సప్లైకి మంత్రిగా ఉన్నారు. సాహిత్యరంగంలో విశిష్ట కీర్తిగలిగినవారు. ఆంధ్రావనిలోవిశ్వకవిప్రతినిధిగా గౌరవంగలవారు. అనేకవ్యాసాలు, నాటికలూ, ఇతరవిధ రచనలూ చేశారు.

## 193. శ్రీ వావిలాల సోమయాజులు

(పుటలు 728-731)

గుంటూరుమండలాంతర్గతమైన విప్రులపల్లె అగ్రహారంలో మాతామహులు శ్రీ చతుర్వేదుల నరసింహయ్యగారిఇంట పింగళ నామసంవత్సర పుష్య శు ౭ శనివారం (19-1-1918) నాడు జననం. తల్లిదండ్రులు: మాణిక్యాంబ, సింగరాయావధాని. పితామహులు ముప్పైరు యజ్ఞకర్తలు. విద్య: బి. ఏ., ఆంధ్రవిశ్వవిద్యాలయం (1938). ఉద్యోగాలు: బహుకాలము గుంటూరు శారదానికేతనము ప్రధానాచార్యులు, పదునాలుగుసంవత్సరములనుండి గుంటూరు హిందూకళాశాలలో ఆంధ్రపండితులు. కొంతకాలం నవ్యసాహిత్యపరిషత్పత్రిక ఐన 'ప్రతిభ'కు సహాయసంపాదకత్వము, సాహితీసమితికి సహాయకార్యదర్శిత్వము వహించినారు. బిరుదులు: కుమారధూర్జటి, కవిభూషణ, మధురకవి సాహిత్యాచార్య. కవిత్వరచన: నాటకరచన, వ్యాసరచన, గేయనాటికారచన, సాంఘికశాస్త్ర, శిల్పవాస్తువిషయ సంబంధిరచనలు, బహుసంఖ్యాకములు. ముద్రితగ్రంథములు: నాయకురాలు, వసంతసేన, డా. చైతన్యం ఇత్యాదులు నాటకములు. జూలియస్ సీజరు, ఆంటోనీక్లియోపాట్రా, మేక్బెత్‌లు షేక్స్పియర్ నాటకములకు యథామాతృకానువాదములు. వధూసర, ధర్మఘంటిక, సంక్రాంతి పద్యగేయనాటికలు. మణిప్రవాళము వ్యాససంపుటి. వాత్స్యాయన కామసూత్రములు, సంవత్సరము, ఆంధ్రులనాట్యము—సంగీతము మొదలైన బృహద్వ్యాసములు ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక, సాతవాహన సంచిక, అయ్యంకి వేంకటరమణయ్యషష్టిపూర్తిసంచిక

మొదలైనవానియందు ప్రకటితములు. దక్షిణదేశాంధ్ర వాఙ్మయవ్యాసములు ప్రజామిత్రలోను, 'వివాహము—దానిసమస్యలు ఆంధ్రవారపత్రికలోను ప్రకటితములు. మాచల్దేవి, పరివర్తన, ఆత్మార్పణము, ప్రియోత్కంఠ, ఆకాంక్ష ఇత్యాది కావ్యఖండికలు భారతీత్యాదిపత్రికలందు ప్రకటితములు. అముద్రితములు: సంగ్రహఆంధ్ర భాషాసాహిత్యచరిత్ర, దేవతలు Comparative Religion) భారతీయశిల్పిచరిత్ర, శబ్దము—ఇత్యాది వచనగ్రంథములు. 'కామదహనము' 'ఏకశిల'—ఖండ కావ్యసముచ్చయములు. తానాజీ, రాజ్యరక్ష, సుకన్య, చివరిరోజులు, ఇత్యాదులతోగూడిన రేడియోనాటికల సంపుటి. 'మనపండుగలు'—ఇందలి వ్యాసములు కొన్ని ఆంధ్రవారపత్రికలో ప్రత్యేకసంచికలందు ప్రకటితములు. నిరంతర సాహిత్యసేవ, గ్రంథముద్రణము అభిమానాంశములు.

## 194. శ్రీ తెన్నేటి విశ్వనాథం

(పుటలు 732-735)

జననం : 1896. బి. ఎల్. త్రివేంద్రం. విశాఖపట్టణం జిల్లా కాంగ్రెసుకమిటీకి చిరకాలం అధ్యక్షులు: 1937 లో మద్రాసు అసెంబ్లీకి ఎన్నుకోబడ్డారు. ప్రభుత్వపార్లమెంటరీ సెక్రెటరీ 1937–39; 1946 ఎసెంబ్లీకి ఎన్నిక. ఛీఫ్‌పార్టీ సెక్రటరీ 46-47; మునిసిపల్ చైర్మన్ విశాఖపట్టణం 47–51; మదరాసు M. L. A. 46-52; 52–53; అసెంబ్లీ ప్రతికూలపక్షనాయకులు - 52; ఆంధ్రప్రభుత్వ ఆర్థిక శాఖామంత్రి 1953 అక్టోబరు - 54 నవంబరు, కంపెనీల సలహాసంఘాధ్యక్షులు - 56 జనవరినుండి కాఫీబోర్డులో కొంతకాలంపనిచేశారు. ప్రస్తుతం ప్రజాపార్టీ అధ్యక్షులు. సాహిత్యప్రియులు. వీరిగృహం నిరంతర సాహిత్యకేంద్రం సంస్కృతాంధ్రాంగ్ల సారస్వతాలలో చాలా కృషి చేశారు. వీరు తీయనివాక్కు, నిశితమేధగల అపారప్రతిభా సమన్వితులు. అనేక పద్య గద్య రచనలు చేశారు. విఖ్యాతిగాంచిన సాహిత్య రాజకీయ నాయకులు.

## 195. శ్రీమతి తాడేపల్లి యజ్ఞమహాలక్ష్మమ్మ

(పుట 736)

ఈమె భక్తిమార్గగామిని నిరంతర వేదాంతచింతలో మునిగియుండు బ్రహ్మనిష్ఠురాలు. శ్రీమతి ఏకా ఆదిలక్ష్మమ్మగారితో ఆత్మీయమైన సంబంధముగల్గిన తాత్త్విక భావనాతత్పర. రేపల్లెతాలూకా నల్లూరునివాసం. శ్రీకృష్ణ ధ్యానసుధాపూరితకీర్తనలు, శ్రీపాండురంగ ప్రసన్నభజన కీర్తనలు, శ్రీలక్ష్మీనరసింహ ధ్యానామృతకీర్తనలు, శ్రీరామాష్టకము, శ్రీలక్ష్మీనరసింహాష్టకము, శ్రీమల్లికార్జునాష్టకము, శ్రీఉమామహేశ్వరాష్టకము, శ్రీసరస్వతీ అష్టకము, సీతాకళ్యాణ సామ్రాజ్యపట్టాభిషేకకీర్తనలు, శ్రీసీతారామాంజనేయ ధ్యానామృత, శ్రీగోపీహృదయాంతర్గతబాలకృష్ణక్రీడలు మొదలైన ఎన్నో గ్రంథాలు యీమె రచించారు.

## 196. శ్రీ నార్ల వేంకటేశ్వరరావు (పుట 737)

జననం: 1908-12-1 బి.ఏ. 1934. విద్యార్థిగా కృష్ణాపత్రికలో స్వరాజ్య 1935; జనవాణి36-37; ప్రజామిత్ర37-38, ఆంధ్రప్రభ న్యూస్ ఎడిటర్ 38–42, ఆంధ్రప్రభ ఎడిటర్ 42 నుండి. ప్రస్తుతం ఆంధ్రజ్యోతి దినపత్రికకు సంపాదకులు. రచనలు; స్వదేశసంస్థానాలు, నేటిరష్యా, రష్యన్ కథలు, ఆస్ట్రియా ఆక్రమణ. చెక్ రాజ్యవిచ్ఛేదం, పాలస్త్రీన మాటామంతి, పిచ్చాపాటీ, జగన్నాటకం, నార్లవారిమాట, కొత్తగడ్డం పేరుతో కొన్ని ఏకాంకికలు. ఆంధ్రరాష్ట్ర పత్రికారచయితలసంఘ అధ్యక్షులు 45 58 మదరాసు ఫిలిం సెన్సారుబోర్డు సభ్యులు, 48–51; ఆంధ్రప్రదేశ్ సాహిత్యఎకాడమీ Executive సభ్యులు 57 ఏప్రిల్ నుండి రాజ్యసభసభ్యులు. 58 ఏప్రిల్ నుండి. గేయ, కథా, వ్యాస, పద్య, రచనామార్గాలలో ఒకవినూత్నత, విశిష్టత అందించిన ప్రతిభాసంపన్నులు వీరు. వీరి లేఖిని ఇలా శక్తి సమన్వితమైనది.

## 197. కుమారి వసంతకుమారీదేవి (పుట 738)

పిండిప్రోలు లక్ష్మణ కవి వంశములోనిది. జననం: 1932 Sanskrit Honours. హిందీ, బాంగ్లా, జర్మన్

భావ లభ్యసించినది. సమాగమము, తొలిపూలు, ఆరాధన, అశ్రుగీతి, హృదయాంజలి అను పద్యకావ్యములు, నిర్మల అను నవల రచించినది. కవయిత్రీతిలక బిరుదాంచితలు.

## 198. శ్రీ జి. విద్యాసాగర్ (పుటలు 739-745)

జననం: 1932. ఇంటిపేరు: గుఱ్ఱప్పడియ పూర్తిపేరు: వేంకటలక్ష్మీనరసింహవిద్యాసాగరశర్మ, జననీజనకులు: వరలక్ష్మమ్మ, ఆంజనేయశాస్త్రిగారలు. జన్మస్థలం: గుంటూరు, విద్యాభ్యాసం: గుంటూరు హిందూకాలేజి హైదరాబాదు ఉస్మానియా యూనివర్సిటీ, మంత్రదాతలు: శ్రీ భార్గవ విద్యాదేవకులపతులు. సభ్యత్వం: వాణీకళామండలి కార్యదర్శి, జ్యోత్స్నసమితి సహాయ కార్యదర్శి, కల్చరల్ అసోసియేషన్ సహాయకార్యదర్శి, విద్యాపరిషత్ ప్రధాన కార్యదర్శి, వీరు భార్గవులు కవి పండితవంశంలో ప్రభవించటంచేత కవితారచన ఉగ్గుపాలతోనే వీరికి అలవడింది. మృదుమధురమైన వీరికవిత్వం పండితపామరరంజకమై అలరారుతున్నది. సరససాహితీ సమారాధకులైన వీరికి ప్రత్యేకించి నాటకకళపై అభిమానం. రంగస్థలంపై అనేక ప్రశంసలు బహుమతులు పొందారు. కథకులుగా విమర్శకులుగా వీరు ఖ్యాతివహించారు. పూలబాట, కల్యాణి, గోపికాగీతాలు, రాగిణి, కలువబాల: ఆత్మార్పణ గౌతమబుద్ధ, పెద్దమనిషి, దాగుడుమూతలు, మొదలైనవి రచనలు.

## 199. శ్రీ శ్రీనివాసానంద సరస్వతీస్వామి (పుటలు 746-749)

విశ్వవిఖ్యాతులైన స్వామిశివానందపాదసేవకులు. పరిణతతత్త్వభావనాభావుకమైన వీరి వచోరీతి ఎంతమంది విద్వాంసులనో ఆకర్షించింది. అత్యంత ప్రసన్నము, నిరాడంబరము, నిర్మలము అయిన వీరి ప్రవర్తన ఆదర్శప్రాయము. సన్యాససంప్రదాయమునకు చెందిన యోగివర్యులు. హృషీకేశ్ వీరి నివాసం.

## 200. శ్రీ భార్గవ విద్యాదేవ కులపతి (పుటలు 750-755)

ఈసంకలన సంపాదకులు. ప్రస్తుతం గుంటూరు హిందూ కళాశాలలో ఆంధ్రాధ్యాపకులు. రసవాహిని, శివసాహస్రి, అంబికాసాహస్రి, ఐంద్రీసాహస్రి, మొదలగు గ్రంథాలు రచించారు. అవధానాశుకవితావిహారణ, వివిధమార్గ సాహిత్యరచన, తపోదీక్ష వర్తనమార్గములు. ఒకపేరు పి.వి.యల్.వి. ప్రసాదరావు.

# కవిరచనాపరిచయానుక్రమ